# పదబంధ పారిజాతము

[నుడికారముల బృహన్నిఘంటువు]

## ద్వితీయ సంపుటము

సంపాదకవర్గం :

నార్ల వెంకటేశ్వరరావు

విద్వాన్ విశ్వం

తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

తిలక్ రోడ్డు, హైద్రాబాదు,

ఈ నిఘంటునిర్మాణంలో మాకు విశేషంగా తోడ్పడిన గ్రంథములలో కొన్ని—కాలక్రమంగా.

ఆంధ్రమహాభారతము.
కుమారసంభవము.
బసవపురాణము.
పండితారాధ్యచరిత్రము.
భాస్కరరామాయణము.
రంగనాథరామాయణము.
నిర్వచనోత్తరరామాయణము.
దశకుమారచరిత్ర.
మార్కండేయపురాణము.
హరివంశము.
నృసింహపురాణము.
ఉత్తరహరివంశము.
కేయూరబాహుచరిత్ర.
కాశీఖండము.
భీమఖండము.
హరవిలాసము.
శృంగారనైషధము.
పలనాటివీరచరిత్ర.
శివరాత్రిమాహాత్మ్యము.
క్రీడాభిరామము.
భాగవతము.
ద్విపదభాగవతము.
శృంగారశాకుంతలము.
జైమినిభారతము.
మనుచరిత్రము.
ఆముక్తమాల్యద.
పారిజాతాపహరణము.
కాళహస్తిమాహాత్మ్యము.
పాండురంగమాహాత్మ్యము.
రామాభ్యుదయము.
శ్రీరాధామాధవము.
వసుచరిత్ర.
సుగ్రీవవిజయము.
నిరంకుశోపాఖ్యానము.
ప్రభావతీప్రద్యుమ్నము.
కళాపూర్ణోదయము.
తాళ్లపాక సంకీర్తనలు.
గౌరన హరిశ్చంద్ర ద్విపద.
నవనాథచరిత్రము.
రుక్మాంగదచరిత్ర.
విజయవిలాసము.
సారంగధరచరిత్రము.
క్షేత్రయ్యపదములు.
రాజగోపాలవిలాసము.
హేమాబ్జనాయికాస్వయంవరము.
కట్టా వరదరాజు రామాయణము.
రాధికాసాంత్వనము.
ఉత్తరరామాయణము.
శతకసంపుటములు.
కన్యాశుల్కము.

సాక్షిసంపుటములు.
తిరుపతి వెంకటకవుల గ్రంథ
ములు.
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి
గ్రంథములు.
కవిరాజ త్రిపురనేని రామస్వామి
చౌదరిగారి గ్రంథములు.
వేటుకూరి వెంకటనరసయ్యగారి
గ్రంథములు.
నార్ల వారి గ్రంథములు.
పెన్నేటిపాట.
విశ్వనాథ సత్యనారాయణగారి
గ్రంథములు.
సురవరం ప్రతాపరెడ్డిగారం
గ్రంథములు.
సాహిత్యసమీక్ష.
బ్రౌను నిఘంటువు.
శబ్దరత్నాకరము.
సూర్యరాయాంధ్ర నిఘంటువు
వావిళ్ల నిఘంటువు.
తెలుగు జాతీయములు...
ఇత్యాదులు.

ఇవి, మిగతవి ప్రక్క జాబితాలో వివరంగా చేరి వున్నవి.

# ఉదాహృత గ్రంథ సంకేతసూచిక

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| అంబరీష చరిత్ర | | నారాయణదాసు |
| అచ్చ.<br>అచ్చ. రామా | అచ్చతెనుగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి |
| అనర్ఘనారద | (తె. జా.) | |
| అనిరు<br>అని | అనిరుద్ధచరిత్రము | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| అప్ప | అప్పకవీయము | కాకనూరి అప్పకవి |
| అ. మ. క<br>అష్టమ. క | అష్టమహిషీకల్యాణము | తాళ్లపాక చిన్నన్న |
| అలుగు | అలుగురాజు | ఏటుకూరి వెంకటనరసయ్య |
| అహ<br>అహల్యా | అహల్యాసంక్రందనము | సముఖము వెంకటకృష్ణప్ప నాయకుడు |
| ఆంధ్ర నాయక | ఆంధ్రనాయకశతకము | కాసుల పురుషోత్తమకవి. |
| ఆం. నా | ఆంధ్రనామసంగ్రహము | పైడిపాటి లక్ష్మణకవి |
| ఆం. భా<br>ఆంధ్ర. భా | ఆంధ్రభాషార్ణవము | నుదురుపాటి వెంకన |
| ఆం. వా | ఆంధ్రవాచస్పత్యము | కొట్ర శ్యామలకామశాస్త్రి |
| ఆనంద | ఆనందరంగరాట్ఛందము | కస్తూరి రంగకవి |
| ఆము | ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు |
| ఆశ్వీన. మా | ఆశ్వీనమాహాత్మ్యము (తె. జా.) | |
| ఇందు | ఇందుమతీపరిణయము | కుమారధూర్జటి |
| ఇళాదేవీయము | | |
| ఉ. రా<br>ఉత్తర. రామా | ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజకవి |
| ఉద్భ | ఉద్భటారాధ్యచరిత్రము | తెనాలి రామలింగకవి |
| ఉషా | ఉషాపరిణయము | పసుపులేటి రంగాజమ్మ |
| ఉ. హరి | ఉత్తరహరివంశము | నాచన సోమన |
| ఎడ్వ. నాట. | ఎడ్వర్డు నాటకము (తె. జా.) | |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| ఏలా. మా. | ఏలా మాహాత్మ్యము (తె. జా.) | |
| ఒంటి. శత | ఒంటిమిట్ట రఘువీర శతకము | రాయకవి తిప్పయ్య |
| కకు. (కకుత్స్థ) | కకుత్స్థవిజయము | మట్ల అనంతభూపాలుడు |
| కన్యా. శు | కన్యాశుల్కము | గురజాడ అప్పారాయకవి |
| కఱి. శత. | కఱివేల్పు శతకము | |
| కల | కలగూరగంప | |
| కలిమాయ | (తె. జా.) | |
| కలు. శ. | కలువాయి శతకము | |
| కవిక | కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి |
| కవిచకోర | (తె. జా.) | |
| కవిజ | కవిజనాశ్రయము | రేచన |
| కవిజన | కవిజనరంజనము | అడిదము సూరకవి |
| కవిరా | కవిరాజమనోరంజనము | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| కవిస | కవిసర్పగారుడము | బసవన |
| కళా | కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| కా. మా. (కాళ) | కాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటికవి |
| కామేశ్వరి. శత | కామేశ్వరిశతకము | |
| కావ్యా | కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన |
| కాశీ | కాశీఖండము | శ్రీనాథుడు |
| కాశీయా | కాశీయాత్రాచరిత్ర | ఏనుగుల వీరాస్వామయ్య |
| కాళ. శత | కాళహస్తీశ్వర శతకము | ధూర్జటికవి |
| కాళింది | కాళిందీకన్యాపరిణయము | అహోబలపతి |
| కుక్కు | కుక్కుటేశ్వరశతకము | కూచిమంచి తిమ్మకవి |
| కుచే | కుచేలోపాఖ్యానము | గట్టుప్రభువు |
| కుమా. / కు. సం. / కు. | కుమారసంభవము | నన్నిచోడకవి |
| కుమార. శత | కుమారశతకము | పక్కి వెంకటనరసయ్య |
| కుమారీ. శత | కుమారీశతకము | |
| కువల | కువలయాశ్వచరిత్రము | సవరము చిననారాయణకవి |
| కృష్ణ | కృష్ణరాయవిజయము | కుమారధూర్జటి |
| కృష్ణక | కృష్ణకర్ణామృతము | వెలగపూడి వెంగన |
| కృష్ణనీ | (తె. జా.) | |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| కృష్ణ. శకుం | శకుంతలాపరిణయము | కృష్ణకవి |
| కృష్ణా | కృష్ణాభ్యుదయము | గోంతేటి నూరన |
| కేయూ / కేయూర | కేయూరబాహుచరిత్రము | మంచనకవి |
| కొత్త | కొత్తగడ్డ | నార్ల వెంకటేశ్వరరావు |
| క్రీడా | క్రీడాభిరామము | వినుకొండ వల్లభరాయడు |
| క్షేత్రయ్య | క్షేత్రయ్యపదములు | క్షేత్రయ్య |
| క్షేత్రలక్ష్మి | క్షేత్రలక్ష్మి | ఏటుకూరి వెంకటనరసయ్య |
| గంధ | గంధవహము | మంచెర్ల వాసుదేవకవి |
| గీర | గీరతము | తిరుపతి వెంకటకవులు |
| గుంటూ | గుంటూరు సీమ | తిరుపతి వెంకటకవులు |
| గువ్వలచెన్న | గువ్వలచెన్నశతకము | పట్టాభిరామకవి |
| గౌ. హరి / గౌర. హరి | హరిశ్చంద్ర ద్విపద | గౌరన |
| ఘటికా | ఘటికాచలమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి. |
| చంద్ర | చంద్రభానుచరిత్రము | తరిగొప్పుల మల్లన |
| చంద్ర. వి. (చంద్రరేఖా) | చంద్రరేఖావిలాపము | కూచిమంచి జగ్గకవి |
| చంద్రా | చంద్రాంగదచరిత్రము | పైడిమర్రి వెంకటపతి |
| చంద్రి | చంద్రికాపరిణయము | సురభి మాధవభూపాలుడు |
| చం. రా / చంపూ | చంపూరామాయణము | ఋగ్వేదము వేంకటాచలపతి |
| చమ | చమత్కారమంజరి | సింహాద్రి వెంకటాచార్యులు |
| చిత్తబోధ | చిత్తబోధ శతకము | తాడేపల్లి పానకాలరాయడు |
| చింతా | చింతామణి నాటకము. (తె. జా.) | |
| చిత్ర. భా. | చిత్రభారతము | చరిగొండ ధర్మన్న |
| చి. ని. | చిన్నయసూరి నిఘంటువు | పరవస్తు చిన్నయసూరి |
| చెన్న | చెన్నబసవపురాణము | ఆత్మకూరి పాపకవి |
| జగ | జగన్నాటకము | నార్ల వెంకటేశ్వరరావు |
| జాహ్నవీ | జాహ్నవీమాహాత్మ్యము | ఏనుగు లక్ష్మణకవి |
| జైమి | జైమినిభారతము | పిల్లలమర్రి పినవీరభద్రకవి |
| జ్ఞానప్రసూనాంబికా | జ్ఞానప్రసూనాంబికా శతకము | |
| తపతీ | తపతీసంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| తారా | తారాశశాంకవిజయము | శేషము వెంకటపతి |
| తాళ్ల. సం. | తాళ్లపాక సంకీర్తనలు | తాళ్లపాకము కవులు |
| తిరుపతి. ప్రభా. నాట | ప్రభావతీ ప్రద్యుమ్న నాటకము | తిరుపతి వెంకటకవులు |
| తె. జా | తెలుగు జాతీయములు | నాళము కృష్ణారావు |
| తెలుగునాడు | తెలుగునాడు | దాసరి లక్ష్మణకవి |
| త్యాగరాజు | త్యాగరాజకీర్తనలు | త్యాగయ్య |
| త్రివేణి | త్రివేణి | ఏటుకూరి వెంకటనరసయ్య |
| త్రిశంకుస్వర్గం | (తె. జా.) | |
| దశ (దశకు) | దశకుమారచరిత్ర | కేతన |
| దశా | దశావతారచరిత్ర | ధరణిదేవుల రామయమంత్రి |
| ద. శా. | దక్షిణదేశ శాసన సంచయము | |
| దాశ. శత. | దాశరథి శతకము | కంచెర్ల గోపన్న |
| దేవీ | దేవీభాగవతము | తిరుపతి వెంకటకవులు |
| ద్వా | ద్వాత్రింశత్సాలభంజికలు | కొఱవి గోపరాజు |
| ద్వాద | ద్వాదశరాజచరిత్రము | |
| ద్వి } ద్విప. భాగ } | ద్విపద భాగవతము–దశమ స్కంధము | మడికి సింగన |
| ద్వి. నల. | ద్విపద నలచరిత్ర | చక్రపురి రాఘవాచార్యులు |
| ద్విప. భల్లా. | ద్విపద భల్లాణచరిత్రము | |
| ద్వి. సారంగ | ద్విపద సారంగధర చరిత్ర | కూచిమంచి తిమ్మకవి |
| ద్వి. శ. సా. | ద్విపదసారంగధర చరిత్రము | బాణాల శంభుదాసుడు |
| ధర్మజ | ధర్మజరాజసూయము (తె. జా.) | |
| ధనా } ధనాభి } | ధనాభిరామము | సూరన |
| ధర్మా. భా. | (శ.ర) | |
| నందక | నందకసామ్రాజ్యము (తె. జా.) | |
| నమశ్శి | నమశ్శివాయ శతకము | |
| నరస | నరసభూపాలీయము | మూర్తికవి |
| నలచ | నలచరిత్ర | చక్రపురి రాఘవాచార్యులు |
| నవ | నవనాథచరిత్రము | గౌరన |
| నాదెళ్ల | (తె. జా.) | |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
| --- | --- | --- |
| నానా | నానారాజసందర్శనము | తిరుపతి వెంకటకవులు |
| నా. మా | నార్లవారి మాట | నార్ల వెంకటేశ్వరరావు |
| నాయకు | నాయకురాలు | ఏటుకూరి వెంకటనరసయ్య |
| నారా. పంచ | పంచతంత్రము | నారాయణకవి |
| నారా. రుక్మి | రుక్మిణీకల్యాణము | అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు |
| నారా. శత | నారాయణశతకము | బమ్మెర పోతన |
| నిరం, నిరంకు | నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి |
| నిర్వ, నిర్వ. ఉత్త, నిర్వ. రామా | నిర్వచనోత్తరరామాయణము | తిక్కన |
| నీతిచం | నీతిచంద్రిక | పరవస్తు చిన్నయసూరి. |
| నీతిసీస | నీతిసీసపద్యశతకము | తాళ్లపాక పెదతిరుమలయ్య |
| నీలా | నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి |
| నృకేసరి. శత | నృకేసరి శతకము | పుల్లంరాజు నరసింగరావు |
| నృసిం | నృసింహపురాణము | ఎఱ్ఱన |
| నె. శా | నెల్లూరి శాసనములు | బటరువర్తు, వేణుగోపాల చెట్టిగారలచే సంపాదితము |
| నై, నైష | నైషధము | శ్రీనాథుడు |
| పంచ. వేంక | పంచతంత్రము | వేంకటనాథుడు |
| పండిత | పండితరాయ విజయము | తిరుపతి వెంకటకవులు |
| పండితా | పండితారాధ్యచరిత్రము | పాలకురికి సోమనాథుడు |
| పతివ్రతా | పతివ్రతామాహాత్మ్యము (తె. జా.) | |
| పద్మ | పద్మపురాణము | మడికి సింగన |
| పద్య. బసవ | పద్య బసవపురాణము | పిడుపర్తి సోమనాథుడు |
| పరమ | పరమయోగివిలాసము | తాళ్లపాక చిన్నన్న |
| పల. (పల్నాటి) | పలనాటి వీరచరిత్ర | శ్రీనాథుడు |
| పాంచా | పాంచాలీపరిణయము | కాకమాని మూర్తికవి |
| పాండ. జన | పాండవజననాటకము | తిరుపతి వెంకటకవులు |
| పాండ. ప్రవా | పాండవప్రవాసనాటకము (తె. జా.) | ,, |
| పాండవాశ్వ | పాండవాశ్వమేధ నాటకము | ,, |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| పాండ. విజ / పాం. విజ | పాండవవిజయ నాటకము | తిరుపతి వెంకటకవులు |
| పాండవో | పాండవోద్యోగ నాటకము | ,, |
| పాం / పాండు | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి |
| పాణి | పాణిగృహీత | తిరుపతి వెంకటకవులు |
| పారి | పారిజాతాపహరణము | ముక్కు తిమ్మన |
| పార్వ | పార్వతీపరిణయము | రాయ రఘునాథభూపాలుడు |
| పె. పా. (పెన్నే) | పెన్నేటిపాట | విద్వాన్ విశ్వం |
| ప్రద్యుమ్న | ప్రద్యుమ్న చరిత్ర | ముప్పిరాల సుబ్బారాయకవి |
| ప్రబంధ | ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము | గణపవరపు వెంకటకవి |
| ప్రబోధ | ప్రబోధచంద్రోదయము | నందిమల్లయ, ఘంటసింగయ |
| ప్రభా | ప్రభావతీప్రద్యుమ్నము | పింగళి సూరన |
| ప్రభా. నాట | ప్రభావతీ ప్రద్యుమ్న నాటకము | తిరుపతి వెంకటకవులు |
| ప్రభు (ప్రభులిం) | ప్రభులింగలీల | పిడుపర్తి సోమనాథుడు |
| బసవ | బసవపురాణము | పాలకురికి సోమనాథుడు |
| బహులా (బహు) | బహులాశ్వచరిత్రము | దామెర్ల వెంగళభూపాలుడు |
| బాణాల. కాళ | కాళహస్తిమాహాత్మ్యము | బాణాల శరభకవి |
| బాల | బాలరామాయణము | తిరుపతి వెంకటకవులు |
| బాలనీతి | బాలనీతిశతకము | |
| బిల్హ | బిల్హణీయము | చిత్రకవి సింగన |
| బుద్ధ | బుద్ధచరిత్రము | తిరుపతి వెంకటకవులు |
| బొబ్బిలి | బొబ్బిలియుద్ధనాటకము | ,, |
| బ్రహ్మో | బ్రహ్మోత్తరఖండము | శ్రీధరమల్లె వేంకటరామకవి. |
| భద్రగిరి | భద్రగిరిశతకము (తె.జా.) | |
| భద్రాపరిణయము | | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి |
| భద్రావత్య | భద్రావత్యభ్యుదయము (తె. జా.) | |
| భర్తృ. సు | భర్తృహరి సుభాషితములు | ఏనుగు లక్ష్మణకవి |
| భల్లా / భల్లాణ | భల్లాణచరిత్రము | చిదారు గంగాధరకవి |
| భాగ | భాగవతము | పోతనాదులు |
| భాను | భానుమతీపరిణయము | రెంటూరి గంగరాజు |

| సంకేతము | కవి నామము | గ్రంథ నామము |
|---|---|---|
| భాత | భారతము | కవిత్రయము |
| భా. రా<br>భాస్క రా } | భాస్కర రామాయణము | భాస్కరాదులు |
| భాస్క. శత | భాస్కరశతకము | మారద వెంకయ్య |
| భీమ | భీమఖండము | శ్రీనాథుడు |
| భీష్మచరిత్రము | | నారాయణదాసు |
| భోజ | భోజరాజీయము | అనంతామాత్యుడు |
| భోజసుతా | భోజసుతాపరిణయము | కోనేశ్వరుడు |
| మగువ | మగువ మాంచాల | ఏటుకూరి వెంకటనరసయ్య |
| మదన. శత. | మదనగోపాల శతకము | వంకాయలపాటి వెంకటకవి |
| మను | మనుచరిత్రము | అల్లసాని పెద్దన |
| మన్నారు | మన్నారుదాసవిలాస నాటకము | పసుపులేటి రంగాజమ్మ |
| మల్లభూ (మల్ల) | మల్లభూపాలీయము | ఎలకూచి బాలసరస్వతి |
| మల్హా | శృంగార మల్హణ చరిత్ర | ఎడపాటి ఎఱ్ఱన |
| మహా. ప్ర. | మహాప్రస్థానం | శ్రీ. శ్రీ |
| మాటా | మాటా మంతీ | నార్ల వెంకటేశ్వరరావు |
| మానినీ | మానినీశతకము | |
| మార్క | మార్కండేయపురాణము | మారన |
| ముకుంద | ముకుందవిలాసము | కాణాద పెద్దన |
| ముద్రా | ముద్రారాక్షసము | తిరుపతి వెంకటకవులు |
| మృచ్ఛ | మృచ్ఛకటిక | ,, |
| మృ. వి. | మృత్యుంజయవిలాసము | గోగులపాటి కూర్మనాథకవి |
| మైరా | మైరావణ చరిత్రము | |
| మొల్ల. రామా<br>మొల్ల } | మొల్ల రామాయణము | ఆతుకూరి మొల్ల |
| య<br>యయాతి } | యయాతిచరిత్ర | పొన్నిగంటి తెలగనార్యుడు |
| యామున | యామునవిజయము (తె. జా.) | |
| రంగ. గా | రంగనాథ రామాయణము | గోన బుద్ధారెడ్డి |
| రంగా | రంగారాయచరిత్రము | దిట్టకవి నారాయణకవి |
| రఘు. రా. | రఘునాథ రామాయణము | తంజావూరు రఘునాథ నాయకుడు |
| రసిక | రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మకవి |
| రాఘవ | రాఘవపాండవీయము | పింగళి సూరన్న |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| రాజగో | రాజగోపాలవిలాసము | చెంగల్వ కాళయకవి |
| రాజ చ. (రాజశే) | రాజశేఖరచరిత్రము | మాదయగారి మల్లన |
| రాజవా | రాజవాహనవిజయము | కాకమాని మూర్తికవి |
| రాధా | రాధామాధవసంవాదము | వెలిదిండ్ల వెంకటపతి |
| రాధి, రాధికా | రాధికాసాంత్వనము | ముద్దుపళని |
| రామకథా | (తె. జా.) | |
| రామచం | రామచంద్రవిజయము | చిలకమర్తి లక్ష్మీనరసింహకవి |
| రామతారక | రామతారకశతకము | |
| రామరామ శత. | రామరామ శతకము | |
| రామలిం | రామలింగేశ్వరశతకము | |
| రామా, రామాభ్యు | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు |
| రామే, రామే.మా, రా. మా | రామేశ్వరమాహాత్మ్యము | ఏనుగు లక్ష్మణకవి |
| రా. వి | రాజవాహనవిజయము | కాకమాని మూర్తికవి |
| రుక్మాం | రుక్మాంగదచరిత్ర | ప్రౌఢకవి మల్లన |
| రుక్మి | రుక్మిణీపరిణయము | సత్యవోలు భగవత్కవి |
| రుద్రమ | రుద్రమదేవి | ఏటుకూరి వెంకటనరసయ్య |
| లక్షు | లక్షణసారసంగ్రహము | చిత్రకవి పెద్దన |
| లక్ష్మీ వి | (తె. జా.) | |
| లక్ష్మీ. శత | లక్ష్మీదేవి శతకము | తాడేపల్లి పానకాలరాయుడు |
| వర. రా | రామాయణము | కట్టా వరదరాజు |
| వరా, వరాహ | వరాహపురాణము | నందిమల్లయ, ఘంటసింగయ |
| వసు | వసుచరిత్రము | రామరాజభూషణుడు |
| వాల్మీ | వాల్మీకిచరిత్ర | రఘునాథ నాయకుడు |
| వా. రా, వాసి | వాసిష్ఠరామాయణము | మడికి సింగన |
| విక్ర | విక్రమార్క చరిత్రము | జక్కన |
| విక్రమ | (తె. జా) | |
| విజ, విజయ | విజయవిలాసము | చేమకూర వెంకటకవి |
| విజ్ఞా (విజ్ఞానే) | విజ్ఞానేశ్వరీయము | కేతన |
| వి. పు. (విష్ణు. పు) | విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరన |
| విప్ర | విప్రనారాయణ చరిత్ర | చదలువాడ మల్లయ |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| విశ్వనాథ. శత | విశ్వనాథశతకము | |
| విష్ణు. నా | విష్ణుమాయానాటకము | చింతలపూడి ఎల్లన |
| వీర | వీరభద్రవిజయము | పోతన |
| వీరనారాయణ శత. | వీరనారాయణ శతకము | |
| వెంక } వెంకటే } | వెంకటేశాంధ్రము | గణపవరపు వేంకటకవి. |
| వెంకటేశ | వెంకటేశ శతకము | |
| వేణు. | వేణుగోపాల శతకము | సారంగపాణి |
| వేం. మా | వేంకటాచలమాహాత్మ్యము | తరిగొండ వెంకమ్మ |
| వేమన | వేమన శతకము | వేమనయోగి |
| వై. } వైజ(వైజ. విలా) } | వైజయంతీ విలాసము | సారంగు తమ్మయ |
| వ్యస. నాట | (తె. జా) | |
| వ్యాఖ్యా. చాటు | (తె. జా) | |
| శకుంతలా | శకుంతలాపరిణయము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి |
| శతా | శతాధావనసారము | తిరుపతి వెంకటకవులు |
| శరభాంక | శరభాంకలింగ శతకము | శరభాంకకవి |
| శశాం | శాంకవిజయము | శేషము వేంకటపతి |
| శశి (అప్ప) | శశిరేఖాపరిణయము | అప్పకవి |
| శా. ప. మ | శాసనపద్యమంజరి | జయంతి రామయ్యపంతులు గారిచే సంపాదితము. |
| శివ. (శివరాత్రి) | శివరాత్రిమాహాత్మ్యము | శ్రీనాథుడు |
| శివధ. | శివధనుర్భంగము | |
| శివధర్మో | శివధర్మోత్తరము | మల్లారెడ్డి కవి |
| శివముకుంద | శివముకుంద (పరమానంద) శతకము | పరమానందయతి |
| శివవిలాసము | | తరిగొండ వెంగమాంబ |
| శివ. సా (శివతత్త్వ) | శివతత్త్వసారము | మల్లికార్జునపండితుడు |
| శుక | శుకసప్తతి | పాలవేకరి కదిరీపతినాయకుడు |
| శృం. నై | శృంగారనైషధము | శ్రీనాథుడు |
| శృం. శా | శృంగారశాకుంతలము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి |
| శృం. సా | శృంగారసావిత్రి | రఘునాథనాయకుడు |
| శేష | శేషధర్మము | తామరపల్లి తిమ్మయ |
| శ్రవ | శ్రవణానందము | తిరుపతి వేంకటకవులు |

| సంకేతము | గ్రంథనామము | కవినామము |
|---|---|---|
| శ్రీనివా | శ్రీనివాసకల్యాణము | |
| శ్రీరం. మా. | శ్రీరంగమాహాత్మ్యము | భైరవకవి |
| శ్రీరంగే. శ. | శ్రీరంగేశ శతకము | |
| శ్రీరాధా | శ్రీ రాధామాధవము | చింతలపూడి ఎల్లయ |
| శ్రీవిద్యా | (తె. జా.) | |
| షట్చ | షట్చక్రవర్తి చరిత్ర | మల్లారెడ్డి |
| షో<br>షోడ | షోడశకుమారచరిత్రము | వెన్నెలకంటి అన్నయ్య |
| సంపంగిమన్న | సంపంగిమన్నశతకము | పరమానందయతి |
| సక. నీతి | సకలనీతిసమ్మతము | మడికి సింగన |
| సదానంద. శత | సదానందశతకము | |
| సమీర. | సమీరకుమారవిజయము | పుష్పగిరి తిమ్మన |
| సర్వేశ | సర్వేశశతకము | యథావాక్కుల అన్నమయ్య |
| సాంబ | సాంబనిఘంటువు | కస్తూరి రంగకవి |
| సాంబో | సాంబోపాఖ్యానము | రామరాజు రంగప్పరాజు |
| సా. వి<br>సావి | సావిత్రీ చరిత్రము | ముప్పిరాల సుబ్బరాయకవి |
| సా<br>సారం | సారంగధరచరిత్రము | చేమకూర వెంకటకవి |
| సాక్షి | సాక్షిసంపుటములు | శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావు |
| సానం | సానందోపాఖ్యానము | శివరామకవి |
| సిం. భాగ | భాగవతము | ఏర్చూరి సింగన |
| సింహా | సింహాసనద్వాత్రింశిక | కొఱవి గోపరాజు |
| సింహా. నార<br>సిం. నార | సింహాద్రి నారసింహ శతకము | గోగులపాటి కూర్మనాథకవి |
| సీతా. వి | సీతావిజయము (శతకంఠ రామాయణము) | మర్దనకవి |
| సీమం | సీమంతినీ కల్యాణము | పెనుమల్ల సోమమంత్రి |
| సుకన్యా | (తె. జా.) | |
| స్వా | స్వారోచిషమనుసంభవము | అల్లసాని పెద్దన |
| సుగ్రీ | సుగ్రీవవిజయము | కందుకూరి రుద్రకవి |
| సుదక్షి | సుదక్షిణాపరిణయము | తెనాలి అన్నయ్య |
| సుమతి | సుమతిశతకము | బద్దెనకవి |
| సురా | సురాభాండేశ్వరము | గట్టుప్రభువు |
| సూరన | | ఆడిదము సూరకవి |

| సంకేతము | గ్రంథ నామము | కవి నామము |
|---|---|---|
| సౌందర్య. స | సౌందర్యసమీక్ష (తె. జా.) | |
| హంస | హంసవింశతి | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| హ. న | హరిశ్చంద్రనలోపాఖ్యానము | రామరాజభూషణుడు |
| హర (హరవి) | హరవిలాసము | శ్రీనాథుడు |
| హరి | హరివంశము | ఎఱ్ఱన |
| హరిశ్చ హరిశ్చంద్ర | హరిశ్చంద్రోపాఖ్యానము (తె. జా.) | శంకరకవి |
| హ. వరాహ | వరాహపురాణము | హరిభట్టు |
| హేమా | హేమాబ్జనాయికా స్వయంవరము | మన్నారుదేవుడు |

గమనిక: తె. జా. గుర్తున్న గ్రంథాలు 'తెలుగు జాతీయముల' నుండి ఉద్ధృతములు.

# ఇతరసంకేతములు



| సంకేతము | వివరము |
|---|---|
| కన్న | కన్నడము |
| కాంబెల్ | కాంబెల్ నిఘంటువు |
| చా | చాటువు |
| చి. సి | చిన్నయసూరి నిఘంటువు |
| చూ | చూడుడు |
| జం | జంటపదము |
| తమి | తమిళము |
| తె. జా | తెలుగు జాతీయములు |
| పా. పా | పాత పాట |
| పా. వా | పాత వాడుక |
| బ్రౌన్ | బ్రౌణ్యము. |
| వా | వాడుక |
| వావిళ్ల. ని. | వావిళ్ల నిఘంటువు |
| శ. ర. | శబ్దరత్నాకరము |
| సా | సామెత |
| సా. స. | సాహిత్యసమీక్ష |
| సూ. ని | సూర్యారాయాంధ్ర నిఘంటువు |

మిగతవి స్పష్టములు.

## తంగేటిజున్ను

అందుబాటులోని అమూల్య వస్తువు.

"కెలఁకుల నున్న తంగేటిజున్ను గృహమేధి." మను. 1.66.

చూ. తంగేటిజున్ను.

## తంగేటిజున్ను

తంగెడుచెట్టు ఎత్తు తక్కువ. అందులోని తేనెతెట్టు చాలా అందుబాటులో ఉంటుంది. అందుపై వచ్చినపలుకుబడి.

"శూలి! నాపాలి తంగేటిజున్ను వీవ."

కా. మా. 4.78.

బస. 7.207.

తాళ్ల. సం. 12.75.

చూ. ముంగిటపెన్నిధి, తంగేటిజున్ను.

## తంజావూరు సత్రము

పని లేని సోమరు లంతా తిండికి చేరేసత్రం.

తంజావూరులో పూర్వం సోమరులకోసం సత్రాలు కట్టి ఉంచారు. అందుపై యేర్పడి పనిలేనివా రందరికీ యేదోవిధ మయిన సదుపాయం చేసే చోటు అన్న అర్థంలో నిలిచి నది.

"ఆ ఆఫీసు కేవలం తంజావూరు సత్రం లాగా తయారయింది." వా.

## తంటలమారి

ఒకరికొకరికి తగాదాలు పెట్టు వాడు — పెట్టునది.

నేటి వాడుకలో: తంటాల మారి.

## తంటాలమారి

చూ. తంటలమారి.

## తండతండము లై యుండు

గుంపులు గుంపులుగా నుండు, అనేకముగా ఉండు.

"విరించోదయ స్థాన నాభీ సరో జాతజాతాండము లండతండంబు లై యుండ నొండొండ నీ రోమకూపంబు లేపారఁగా..." కళా. 1.186.

చూ. తండోపతండములు.

## తండారు

చల్లారు.

"తరమఁజేసియు నేల తండార వైతి." రంగ. రా. అయో.

## తండుగోల

చేపలను పొడిచే చిల్లకోల; తెడ్డు.

బ్రౌన్.

## తండు ముండు పడు

తొట్రుపడు.

"తండు ముండుపడువారు దాఁట లే రెవ్వరును." తాళ్ల. సం. 6.56.

**తండోపతండ మగు**

గుంపులు గుంపు లగు.

"తండోపతండ మై గండోపలము లుండు, పథములందుఁ గొలారుబండ్ల నాఁగి." శుక. 1.271.

**తంతరగొట్టు**

కుచ్ఛితుడు.

మదన. శత. 37.

రూ. తంత్రగొట్టు.

**తంతికుఱుపు**

నారికురుపు.

బ్రౌన్.

**తంతిపాలుడు**

గోపాలుడు.

రూ. తంత్రీపాలుడు.

**తంతు నడపు**

వ్యవహారము నడపు.

మాటా. 77.

**తంత్రులు మీటు**

వీణాదివాద్యముల తంత్రులను పలికించు.

"నఖాంకురంబుల నయమ్మునఁ దంత్రులు మీటి గానమిం, పొనరఁగఁ జేయువాణి." పారి. 1.5.

**తందనతానలు**

తందానపాటలు.

"ఏలల్ తందనతాన లేమయిన లేవే యంచు." వేం. పంచ. 2.133.

**తందనపదములు**

చూ. తందనతానలు.

**తందనాలు తొక్కు**

చిందులు తొక్కు.

'త్రాగి'తో కలిసే యిది యెక్కువగా వాడుక.

చూ. త్రాగి తందనాలు తొక్కు.

**తంబళ అనుమానము, తల తిక్క**

అనవసర మైన అనుమానం కలిగి దాని నివర్తికై చిక్కులలో తగుల్కొనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

ఒక తంబళి కుండకొమ్ముల ఎద్దును చూచి దానికొమ్ముల మధ్య తల పెట్టితే ఎట్లుండునా అని పెట్టి చూచాడట. అదేమో ఎగిరి పరువు లంకించుకుంది. వాడు గిలగిలా తన్నుకున్నాడు. అందుపై వచ్చిన పలుకుబడి.

**తంబళజోస్యము**

అసంబద్ధము.

జ్యోతిషం చెప్పడం ఒక్క బ్రాహ్మలకే తగు నన్న పాత నమ్మకంపై ఏర్పడినది.

"నంబికవిత్వంబు తంబళజోస్యంబు." వేణు. శ.

**తకతక లాడించు**

లక్ష్మి. శత. 47.

**తకతకలాడు**

తొందరపడు.

"బాబు బొంగరం కావా లని తకతక లాడుతున్నాడు." వా.

**తకపిక లగు**

కిందుమీదు లగు.

ధ్వన్యనుకరణము.

"తకపిక లై మరియుఁ దన కేల ?"

తాళ్ల. సం. 8.132.

**తకపిక లాడించు**

కలత పెట్టు.

"ఒక పేద తపసిగా నూహించి నన్నుఁ, దకపిక లాడింపఁ దలఁచితివేని."

గౌర. హరి.

మోసపుచ్చు అని బ్రౌన్. సరి అనిపించదు.

**తకపికలాడు**

కదలు, కలత చెందు.

"నవరత్నపుఁ బాపటబొట్టు మోమునం, దకపికలాడ." తారా. 4.

"తకపిక లాడు నంచు మదిఁ దాలిమి వీడును వేఁడు దైవముౘ."

రాధా. 2.11.

**తకపికలు చేయు**

కలతలు కలిగించు.

"......మకరాంకుని మేనమామకు సీకుౘ, దకపికలు సేయ వల దను."

విజ.

**తకపికలు పెట్టు**

ఎగిరిపడు.

"దాసిజనులఁ గన్నఁ దకపికల్ వెట్టుచు." మల్హాణ. 3.10.

**తక్కల పడు**

కలత చెందు.

బ్రౌన్.

**తక్కలిగొను**

దొంగలించు.

"వేలుపుల చూడ్కి తక్కలి గొనియె." కవిక. 6.158.

**తక్కిడికాడు**

మోసగాడు.

అచ్చ. రా. సుం. 47.

**తక్కిడితనము**

మోసము.

"తగిలి యిలువిద్య తక్కిడితనము నాది." విప్ర. 4.28.

**తక్కుగల**

తక్కిన, మిగిలిన.

కాశీ. 2.105.

**తక్కుల బడు**

చిక్కులలో పడు.

"తక్కులఁ బడఁడ నా దబ్బులఁ బడఁడ." పండితా. పర్వ. 518. పు.

**తక్కుల బెట్టు**

చిక్కుల బెట్టు.

"ఎక్కడ గడచేరీ నరులు తక్కులఁ బెట్టేరు తరుణులు భువిని."

తాళ్ల. సం. 9.6.

**తక్కులాడి**

టక్కులమారి, వంచకురాలు.

**తక్కులాడు**

వంచకుడు.

**తక్కువ చేయు**

కించపఱచు.

"తావకబంధువర్గముల్, తక్కువ చేతు రమ్మ చరితవ్రతముల్ చెడు నమ్మ..."

హంస. 1.124

తక్కువ పడు
చౌక యగు, న్యూనపడు.
పండితా. పురా. 124. పు.

తక్కువ పఱచు
కించపఱచు.
భీమ. 1.117.

తక్కువపాటు
న్యూనత.
భార. అర. 6.17.

తక్కువ యగునా ?
తగ్గిపోవునా ?
ఎవ్వరైనా కించపరచినప్పుడు అనుమాట.
"మీ రిటు సల్పినంతనే, తక్కువ యయ్యెనో కలితనంబున నా దొక మాటవాసియున్." విప్ర. 5.29.
"నువ్వు రాకపోతే నాకేం తక్కువ య్యిందా ?" వా.
"ఇదొక్కటీ లేకపోతే నాకేం తక్కువై పోయిందా ?" వా.

తక్కువెట్టు
తక్కువగా తలచు, తిరస్కరించు.
పండితా. ద్వితీ. మహి. పుట. 214.

తక్కొను
పూనుకొను.
భార. ఆది. 4.80.

తక్కొరులు
ఇతరులు.
తక్క - తప్ప. తదన్యులు అనుట.
పాండు. 2.81.

తక్సీరు మాపు చేయు
తప్పు క్షమించు.
హిందూస్థానీ మాట.
"మాయెడల నిట్టి తక్సీరు మాపు చేసి." రంగా. 2.153.

తగటు చేయు
బంగరు మొదలైనవాని పూత పూయు.

తగడెత్తు
పొర లెత్తు.

తగరము వాడి చేయు
కానిపనికి పూనుకొను.
తగర మెన్నడైనా పదునెక్కుతుందా ? అతి మెత్తని లోహమది - అల్లే అనుట.
"తగరము వాడి చేసి వెడతావసి నా కడ బీరగాఁడుగాఁ, బొఁగడెదు నీవు..." కుమా. 7.33.

తగరుల విడుపులు
ఒక బాలక్రీడ.
ఇందు. 2.18.

తగవరి పలుకులు
ముదిమి వచ్చినట్లు, సర్వజ్ఞుడైనట్లు మాట్లాడు మాటలు.
"వలదు తగవరిపలుకుల్." కాశీ. 4.49.

తగవు గావించు
తీర్పు చెప్పు, పంచాయతీ చేయు.
గౌర. హరి. ఉత్త. 773. పం.

తగవుగోరి

సంధి చేయువాడు.

కవిక. 4.113.

తగవు చెడు

పాడి తప్పు.

"నిన్, దగవు చెడి పిలువఁ బనుచుట, మగతనమే." ఉ. హరి. 1.70.

తగవుతగములు

న్యాయాన్యాయములు.

"బుద్ధి సొనిపి, తడవి కనికొనంగ వలయుఁ దగవుఁ దగమియున్." భార. శాంతి. 2.187.

తగవులాడు

న్యాయస్థుడు.

వరాహ. 10.48.

క్రియ అయితే కొట్లాడు అని అర్థం.

తగవు లిచ్చు

ఆడపడుచులకు కానుక లిచ్చు.

"తగవు లిచ్చిరి పుట్టింటి తల్లి ప్రజలు." శివ. 2.62.

తగ వెఱుగు

నీతి తెలియు.

"తల్లిదండ్రులఁ బూజించి తగ వెఱింగి, మన్నపాడ వైననే యత్తమామ లనియు..." కుమా. 2.14.

తగిలించి తగులక

వలపింపజేసి తాను వలపు నొందక.

"దీనిఁ దగిలించి తగులక తాన ధైర్య, వంతుఁడై యున్నసొబగుఁ డెవ్వండొ జగతి." కుమా. 7.15.

తగిలించుకొన్నపిమ్మట ఇగిలించుటె కాని....

ఒక దానిలో తల దూర్చిన తర్వాత దాని ఫలితాలకు బాధ్యు డగుట తప్ప దనుట. రోటిలో తల దూర్చి రోకటి పోటుకు వెఱవవచ్చునా అన్నది యిలాంటిదే. తగిలించుకొన్న తర్వాత ఇగిలించక తప్పుతుందా అన్నది నేటి వాడుక.

"తగిలించుకొన్న పిమ్మట, నిగిలించుటె కాని కార్య మే మున్నదిశీ" శుక. 2.291.

తగుకత్తి

సాధన కుపయుక్త మగు ఆయుధము.

శ. ర.

తగుతగములు

యుక్తాయుక్తములు.

తగుదు నమ్మా అని....

తగనివాడు దేనికైనా తలపడి నప్పుడు ఎత్తిపొడుపుగా అను మాట.

"ఇన్నాళ్లూ ఇటు మొహం చూపించ లేదు. ఇప్పు డేమో ముసలాయన పోగానే పంచుకోడానికి తగుదు నమ్మా అని తయారయ్యారు." వా.

తగునెడ మొఱ యిడు

దిక్కున్న చోట పోయి చెప్పుకొను.

"తగు నెడ, మొఱ యిడు మది యెట్టి దైవములు వినియెడినో."
కళా. 3.230.
చూ. దిక్కున్నచోట పోయి చెప్పుకో.

**తగునే కఱకుట్లును చంక బొత్తములా**

పరస్పరవిరుద్ధము లయిన లక్షణములు కూడ వనుట.

మాంస ఖండములను ఒక చేతిలోను, పుస్తకాలను ఒక చేతిలోను పెట్టుకొనుట పరస్పర విరుద్ధము కదా! కేవల మాంసము కాక త్రాగుడు అలవాటు కలవారు త్రాగుతూ మధ్యలో కఱకుట్లు నంచుకొంటూ ఉంటారు. కాబట్టి కఱకుట్లు ఇక్కడ దుర్జన లక్షణములు గానూ, పుస్తకములు సజ్జన లక్షణములుగానూ ఉట్టంకితము లయినవి.

"అహో! నిలువుఁడు వేయు నేల తగునే కఱకుట్లునుఁ జంకఁ బొత్తముల్."
ఉ. హరి. 2.137.

**తగులగట్టు**

బలవంతముగా అంటగట్టు.

"ఈ యిద్దఱం, దగులంగట్టిన బ్రహ్మ నేర్పరి గదా."
భాగ. 10. పూ. 1738.

"నే నేదో కాస్త ఆదివారంనా డైనా విశ్రాంతి తీసుకుందా మనుకుంటే ఆ మేనేజరు పిలిచి ఇదేదో తగలగట్టి నాడు." వా.

**తగులబడు**

1. చిక్కుకొను.

"జగతీనాయక! యింత యేమిటికి నీ సౌందర్య జాలంబునన్, దగులం బడ్డది. కేయూర. 4.44.

2. మండిపోవు.

"ఆ యిల్లు తగులబడి పోతూ ఉంది."
వా.

3. పాడగు, చెడిపోవు.

"ఈ కూర ఇలా తగులబడిందేం? నోట్లో పెట్టలేక పోతున్నాను." వా.

**తగులబెట్టు**

కాల్చు; పాడు చేయు.

**తగులవేయు**

పాడు చేయు.

"వా డేదో చదువుకొన్నవాడు గదా అని ఆ పుస్తకం అచ్చు సంగతి అప్పగిస్తే దాన్నిలా తగలేశాడు." వా.

**తగులాట**

1. సంబంధము.

"తనకు దైవమునకుఁ దగులాట యే శాంతి." వేమన.

2. కామసంబంధము.

చూ. తగులాటము.

**తగులాటకత్తె**

జారిణి.

**తగులాటకాడు**

విటుడు.

**తగులాటము**

కామసంబంధము.

ఉత్త. రా. 7.471.

తగులాయము
తగులాటము.
"తనువు గలిగిన మేలు తగులాయమే కాని." తాళ్ల. సం. 11.3 భా. 133.

తగులుకొను
కామసంబంధము కల్పించుకొను.
"దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు, దురముపనిలోకి..." హంస. 4.48.
"మగఁడేల రాఁడో యే దొక, మగువం దగులుకొని నన్ను మఱచె నొకో." శుక. 2. 328.
"వాడు వదినెనే తగులుకొన్నాడట గా." వా.

తగులుకొలుపు
తగులుకొనునట్లు చేయు.

తగులుకోలు
తగులుకొనుట.

తగులు దాక మేళము, అగపడ్డ తాళము
అవసరముకొద్దీ మారుచుండు ననుపట్ల ఉపయోగించే పలుకుబడి.
"తగులుదాఁక మేళ మగపడ్డ తాళముల్, గాఁగఁ జేసినట్టి కాంత లింత." రాధి. 3.

తగులుపడు
ఆసక్తి చెందు; దొరకు.

తగులుపఱచు
తగులుపడునట్లు చేయు.

తగులుపాటు
తగులుపడుట.

తగులుబడి
పెట్టుబడి; ఖర్చు.
బ్రౌన్.

తగులువడు
తగులము కలుగు; చిక్కుకొను; దొరకు.

తగులువాటు
చూ. తగులుపాటు.

తగులు విడి బేరము
దేని కదిగా ఎప్పటి కప్పుడు అడిగి తెచ్చుకోవలసిన బేరము.
"కామగవీసురతరువులు, వేమాఱును నిచ్చుఁ దగులువిడిబేరముగా." పాండు. 1.65.

తగు లూడు
బంధము తొలగు, అనుబంధము తొలగు.
"అంతలోనఁ దల్లి తగు లూడఁ, దీర్ఘయాత్రగ ధరిత్రిఁ గ్రుమ్మరుచు..." కళా. 4.150.

తగు లై యుండు
సంబంధించి యుండు.
"తానును ఆ పరిణామంబులకు తగు లై యుండును." తాళ్ల. సం. 9.17.

తగు లొనర్చు
సంబంధించు.
"తగు లొనర్పక నిల్చిన ధరణి యెల్ల." రుక్మాం. 3.77.

**తగుల్పడు**
పట్టువడు.
"అతఁడు పట్టఁ జేరినఁ దగుల్పడ కేడించి దూరంబుగాఁ బోయి."
వర. రా. అర. పు. 141. పం. 7.

**తగువారు**
యోగ్యులు.
"ఏ, మని తగువార మంచు నది యాత నితో..." పాణి. 5.113.

**తగ్గుదల**
తక్కువ.

**తగ్గుపడు**
నశించు; కృశించు.
"తెల్వి తగ్గుపడియె." హంస. 1.190.
"సుధాకరానన నెమ్మేను తగ్గుపడియె."
చంద్రా. 2.123.

**తచ్చనగొండి**
మోసకత్తె.
చెన్న. 2.24.

**తచ్చన లాడు**
1. కదలాడు.
2. హాస్య మాడు.
కాళిందీ. 1.7.

**తచ్చనవాటు లాడు**
విలాసంగా బంతు లాడు.
నైష. 3.95.

**తచ్చనవినయములు**
దొంగవినయము.
వసు. 4.23.

**తచ్చన సేయు**
హాస్య మాడు.
పాండు. 1.199.

**తచ్చ లాడబడు**
మోస పడు.
"పచ్చవిల్తుచేత ప్రచ్చర జను లెల్లఁ, దచ్చలాడఁ బడిరి ధరణిలోన." వేమన.

**తచ్చ సేయు**
మాయ చేయు, మిషపెట్టు.
"తాలాంక గెలిచి రందఱుఁ దచ్చ చేసి." ద్విప. కల్యా. పు. 129.

**తచ్చ లాడు**
చూ. తచ్చన సేయు.

**తచ్చాడు**
ఊరకే అటూ ఇటూ తిరుగు.
"ఏమిటి రా ముంగిట్లో తచ్చాడు తున్నావు ?" వా.

**తటకాపడు**
తటపటాయించు; కలత పడు.
"...పల్కఁ బోవుఁ దటకాపడు."
రాధి. 1.128.

**తటతట (కొట్టుకొను)**
ధ్వన్యనుకరణము.

**తటతట పడు**
బాధపడు.
వైజ. 2.146.

**తటపటాయించు**
వెనుక ముందు చూచు; కాస్త వెనుకంజ వేయు.

**తటపెట**
ధ్వన్యనుకరణము.

**తటమటించు**
1. మోసగించు.
"తచ్చలు పచరించి తటమటించెదవు."
గౌర. హరి. ఉ.

2. కలచు.

భాగ. 4.746.

**తటవట చేయు**

బాధపెట్టు; మోసగించు.

ధర్మా. భా.
శ. ర.

**తటస్థపడు**

చూ. తటస్థ మగు.

**తటస్థ మగు**

తటస్థపడు.

"అదను తటస్థ మైనయపు డమ్మధు సూదనుతోడ." శ్రవ. 3.12.

**తటాలున**

వెంటనే.

"సవ్యాపసవ్య క్రమ, భ్రమణం బొప్పఁ దటాలునం దలపడున్." కళా. 8.84.

**తటుకున**

తటాలున.

ధ్వన్యనుకరణము.
కాశీ. 3.130.

**తట్టకొమ్ము**

వేటసాధనాలలో ఒకటి.

**తట్టగిల్లు**

తట్ట యగు.

శ. ర.

**తట్ట తగుల వేయు**

సంబంధమును పూర్తిగా తెంచుకొను.

చేతులు కడుగుకొనువంటిది.

కొత్త. 427.

**తట్టపాగ**

వెదురుటోపీపై చుట్టినపాగ.

తట్టవలె నెత్తుగ జుట్టిన పాగ అని వావిళ్ళ ని.

బుట్టను తట్ట అనుట ఉన్నది గనుకా, అలా బుట్టపై పాగా చుట్టుట ఉన్నది గనుకా పై రీతిని చెప్పవచ్చును.

**తట్టాడు చిట్టాడు**

గబగబా అడుగులు వేయు.

జం.

"...నాయంపచా లేసె నా,తనిపై సారథిపై హయంబులపయిం దట్టాడు చిట్టాడుచున్." ఉ. హరి. 1.150.

**తట్టి వేయు**

తట్టు.

**తట్టు గట్టు**

కొట్టగా చర్మం పొంగు; ఎట్టి వడు.

**తట్టుచేయి**

కోట కొమ్మమీది నిర్మాణ విశేషం.

రంగ. రా. యు.

**తట్టుపునుగు**

పునుగు.

"జట్టలై తొట్టిన తట్టుపునుఁగు." రాధా. 5.219.

**తట్టుపులుగు**

గరుత్మంతుడు.

తట్టు – వాహనము.

తాళ్ల. సం. 12.197.

తట్టు పోయు
మశూచికములో ఒక భేదము వచ్చు.
"ఊరంతా పిల్లలకు తట్టు పోస్తున్న దట. పిల్లలను కాస్త జాగ్రత్తగా చూడండి." వా.

తట్టు ముట్టాడు
ఎక్కువగు.
"తనుకాంతిరూపంబుఁ దప్పక చూచి, తలఁపులోపలి కూర్మి తట్టు ముట్టాడ." ద్విప. భా. కల్యా. పు. 138.

తట్టు ముట్టు పడు
తొట్రుపడు.
"దక్కనివి గోర నేల తట్టు ముట్టు పడ నేల." తాళ్ల. సం. 11.131.

తట్టువడు
1. తొట్రుపడు; సక్తమగు.
"ఇట్టె సంసారి కేదియుఁ లే దాయె, తట్టువడుటే కాని దరి చేర లేదు." తాళ్ల. సం. 11.2 భా. 26.
2. వెనుకబడు, ఆగు.
"తనిసి యే విధులందుఁ దట్టువడ నైతి." తాళ్ల. సం. 6.27.

తట్టు వాఱు
వెనుదిరుగు.

తట్టు విఱుగు
ఎక్కువగు.

తట్టూర్చి పోవు
కుమా. 9.48.
చూ. తట్టు విఱుగు.

తట్టూర్చు
ఎక్కువగు.

తట్టోఱగు
ఒక వేపునకు వంగు.
చం. రా. 5.29.

తడక కట్టు
అధిక్షేపించు; హేళన చేయు.

తడకట్టు
అధిక్షేపించు; గేలి చేయు.
"ఓయి! సురాసురులార! యీ పామున మేము తడకట్టినారము మీరు వెఱవక రారోయి!" హేమా. పు. 18.

తడకద్రోపరి
తడకలు తోసి ఇంట్లో దూరే దొంగ.
పూర్వం పాకలూ, వానికి తడక తలుపులూ ప్రచురం.

తడకద్రోపు
చూ. తడకద్రోపరి.

తడకలు త్రోయు
వ్యభిచరించు, కట్టు తప్పి ప్రవర్తించు.
పూర్వం గుడిసెలూ, వాటికి తడక వాకిండ్లూ ఉండేవి. వ్యభిచరించేవారు తడకలు తోసి లోపలికి వెళ్లవలసి రావడంపై వచ్చిన పలుకుబడి.
తడక త్రోసినవాడు ఎవడంటే ఆలి చచ్చినవాడు అని ఒక సామెత.

**తడక విప్పుకొని**

చాటు మాటు లేకుండా,

ఎవరు వచ్చినా రావచ్చు నని.

"దాని కేం ? తడక విప్పుకొని కూర్చుం టుంది. దానికి సిగ్గు లేకపోతే మనకు ఉండొద్దా ?" వా.

**తడక పెట్టు**

పో ద్రోలు.

తలుపు వేసి పొమ్మను అనుట.

**తడకాళ్లు పడు**

కాళ్ళు వణకు.

**తడ పెట్టు**

చూ. తడబఱచు.

**తడబడు**

1. తొట్రుపడు.

2. తప్పిపోవు.

భార. భీష్మ. 3.

3. తారుమారగు.

కళా. 5.92.

ఇందుకు దగ్గఱి అనేక భావచ్ఛాయలలో ఇది ప్రయుక్తం.

**తడబఱచు**

బాధ పఱచు; తాఱుమాఱు చేయు.

**తడబాటు**

తడబడు ధాతువునకు నామ వాచకం.

**తడవాటు పన్ను**

మాటలతో వల పన్ను.

"వంది చందమునఁ గైవారంబు సేసి, దంట మాటలు గొన్ని తడవాటు వన్ని." 

గౌ. హరి. ప్రథ. పంక్తి. 204-05.

**తడవాడు**

తడవులాడు.

చేతితో తాకుచు వెదకు.

"వివిధోపకరణ వితతిఁ దడవాడు."

పాండు. 2.20.

**తడవి యాడు**

1. పారాడు, ప్రాకు.

"తడవి యాడక మున్న తట్టాడు మని పట్టి, వడఁకంగ సెజ్జపై వ్రాల్ప నైతి."

ఉ. హరి. 2.16.

2. తట్టాడు.

సంకోచిస్తూ నడుచు, తప్ప టడుగులు వేయు.

ఇదే తచ్చాడు అయిన దేమో !

**తడవుకొను**

తడవు.

**తడవు పట్టు**

ఆలస్య మగు.

"నడచి యిచ్చటి కతఁడు రాఁ దడవు పట్టు." శుక. 4.18.

**తడవులనుండి**

చాలకాలమునుండి.

"తడవులనుండియుఁ దపము సేయఁగఁ బూని, మణికంధరుఁడు పాట మాని..." కళా. 2.55.

**తడవుల బట్టి**

చాలాకాలంనుండి.

"తడవులఁబట్టి యేము సతతంబును
బోదుము వాని వీటికిన్."

ప్రభా. 1.118.

**తడవులాడు**

తడవాడు.

**తడ వోర్చు**

నిదానించు.

సుమతి. 49.

**తడికదాసరి**

దొంగదాసరి.

దాసరివలె భిక్షకోసర మని వచ్చినా ఎవరూ లేనిది చూచి తడిక తోసేవాడు అనుట.

"వా డమ్మా తడికదాసరి! కనిపిస్తే భిక్షం. కనిపించక పోతే దొరికింది స్వాహా." వా.

**తడికన్ను**

ఎప్పుడూ నీళ్ళు కారుతుండే కన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

**తడిగుండె**

ఆర్ద్రహృదయము.

జగ. 94.

**తడిగుడ్డతో గొంతు కోయు**

నయవంచన చేయు.

"వాడు మెత్తని మాటలతోనే కొంప తీస్తాడు. తడిగుడ్డతో గొంతు కోసే రకం." వా.

రూ. తడిబట్టతో గొంతు కోయు.

**తడిపాత కుత్తుక కోయు**

నయవంచన చేయు.

"ఇదియ కాదె, కుటిల! తడిపాతఁ
గుత్తుక గోయు టనఁగ."

ప్రభా. 5.124.

చూ. తడిపాత గొంతు కోయు.

**తడిపాత గొంతు కోయు**

మెత్తగా నే ద్రోహము చేయు.

నేడు తడిగుడ్డతో గొంతులు కోయు అనే రూపంలోనే కనబడుతుంది.

"ఉడుపతి హిమఘృణిచే బలెఁ, దడి
ప్రాతన్ గొంతు గోయుతగ వెతిఁగి
తివో, కడు మెత్తని తలిరాకులఁ, బడఁ
తుల మెడఁ గోసె దీవు బాపురె
మదనా!" పాంచా. 3.

"వనజకృపాణ! చల్లనయి వత్తిలఁగాఁ
దడిపాత గొంతు గోసినగతిఁ దమ్మి
వాలు గాని..." కువల. 4.30.

రూ. తడిపాత కుత్తుక కోయు.

**తడిపాత మెడ కోయు**

తాళ్ల. సం. 3.583.

చూ. తడిగుడ్డతో కుత్తుక కోయు.

**తడిపొడిగా**

కొంచెకొంచెం తడిగా.

"బాగా ఆర లేదు. పంచ యింకా తడి పొడిగా ఉంది." వా.

**తడి యార్చు**

వెంద్రుకల తడి ఆరజేయు.

"నెఱులఁ దడి యార్చి..."

పారి. 4.40.

చూ. తడి యొత్తు.

**తడియాఱు**

ఎండిపోవు.

మార్క. 2.34.

తడి యొత్తు

తడి తుడిచి వేయు.

“తడి యొత్తు మెత్తని ధవళ వస్త్రి మున.” కా. మా. 4.11.

తడివెండి

పాదరసము.

తడిసి కాని గుడిసె కట్టడు

అనుభవానికి వస్తే గానీ తెలియదు.

తడిసినకుక్క అగు

కుంచించుకొని పోవు.

కుక్క మంచం తడిస్తే కుంచించుక పోతుంది.

“పాపం! ఆ పెళ్ళాందగ్గర వీడు తడిసిన కుక్క అయిపోయి కూర్చున్నాడు.” వా.

తడిసి మొప్పందు మగు

కష్టనష్టాలు ఎక్కువగు.

బట్టలూ ధాన్యాదులూ అవి తొలుత తక్కువ తూకం ఉన్నా, తడిసేసరికి అవే విపరీత మైన బరువు కావడంపై వచ్చిన పలుకుబడి.

“ఆ ఖర్చులూ, ఈ ఖర్చులూ పిల్ల వచ్చి వెళ్ళేసరికి తడిసి మొప్పందు మయింది.” వా.

తడిసి మోపెడగు

నా. మా. 89.

చూ. తడిసి మొప్పందు మగు.

తడి యొత్తు

తుడుచు.

“ఛడిమంపుఁ జేలలఁ దడి యొత్తి...” కళా. 7.65.

తడుకు పెండము

తెట్టుకొఅకు ముండ్లతో నల్లిన తడక.

“తాఁ దడుకుబెండె మలుక పొడమ వెడలి.” ఆము. 3.27.

తడుకు పొడుచు

1. కంచె వేయు.

“...పరు లా, పొల మట్టుచొరకుండఁ దడుకు పొడిచినభంగిన్.” కవి. 5.155.

“తడుకు పొడిపించి యాకుల, గుడిసెల వసియించె మంత్రి గురుభటయుతుఁ డై.” ఆము. 3.17.

2. తడకలు పఱచు.

“...విఱిగి పడిన విటపివిటపంబులం దడుకు వొడిచిన గతి నొందు నెడలును...” మను. 4.37.

రూ. తడుకు వొడుచు.

తతి గొను

1. మంద వేయు.

“మమ్ముఁ గొండలను గొబలఁ దతి గొని త్రిప్పు ఫలము.” తాళ్ల. 1.42.

2. సమయము చూచు.

“తనయుఁ డని వొడువఁ దలఁచును, దనయుండు గాకున్న మిగులఁ దలిగొని సవతుల్, దను నగియెద రని తలఁచును.” భాగ. 10. ఉ. 12.

తత్తకతక

తాళములో ధ్వన్యనుకరణము.

తత్తర బిత్తర యగు

సంభ్రాంతి చెందు.

"తలలు వడఁకు ముదితాపసోత్తముల, తలఁపు లెంతయును దత్తరబిత్తరయ్యె." ప్రభులిం. 3.24.

తత్తఱపడు

తొట్రుపడు, భయపడు.

తత్త్వాదృక్కు

దాని కదే గొప్ప, సాటి లేనిది.

"తత్త్వాదృక్తుండరుచిన్." పాండు. 1.8.

తద్దినము కొని తెచ్చుకొను

అనవసరంగా, బుద్ధిపూర్వకంగా నష్టాన్ని తెచ్చి పెట్టుకొను.

తద్దినం అశుభం. శుభాన్ని కోరి తెచ్చుకోవడం సరి కానీ అశుభాన్ని తెచ్చుకోవడం ఏమిటి అను సూచన కూడా యిందులో ఉంది.

"వీణ్ణి యింటికి రమ్మని అనవసరంగా తద్దినం కొని తెచ్చుకున్నాను." వా.

తనంతటి వాడు

1. తనతో సమానుడు.

"కంటకుఁ డైనశాత్రవుఁ డొకండు తనంతటివాఁడు కల్గినన్." కాశీ. 1.108.

2. అంత పెద్ద హోదాలో ఉన్నవాడు.

"తనంతటివాఁడు ఇంత నీచమైన పనికి పాల్పడ వచ్చునా?" వా.

తనంతనే యగు

ఒకరి ప్రయత్నము లేకనే అగు.

"విను మా యేర్పాటు దనం,తన యగుచున్నయది!" కళా. 3.193.

తన కాళ్లపై నిలబడు

ఒకరి ఆధారం లేకుండా జీవింప గలుగు.

"ఏదో వాణ్ణి తన కాళ్లమీద నిలబడు కొనేటట్లు చూస్తే యిక నేను ఎక్కడ ఉన్నా పరవా లేదు." వా.

తన కెందు మాఱు లేదు

తిరుగు లేదు, ఎదురు లేదు.

నేటికీ వాడుకలో 'వాని మాటకు మాఱు లేదు - ఎదురు లేదు' అంటారు.

"తన కెందు, మాఱు లే దను కేతుమాలి యితఁడు." కుమా. 11.101.

తన గొందియే లోకమని యెంచు

తా నున్న తావే లోకమంతా అని తలంచు.

"వాఁడు కూపస్థమండూకంబుం బోలెఁ దన ముక్కునకుం జక్కటిమీఁదిదె యాకాశంబు తన గొందియ లోకం బని యెంచి..."

నీతిచంద్రిక. 55 పు. 13 పం.

తనదాకా వస్తే గానీ....

ఏదయినా తనకు చెందినదయినప్పుడే తెలుస్తుంది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"అందరినీ అనాచారపరు లని ఆడిపోశా రాయన. ఇప్పుడు కొడుకే మో కిరస్తానీదాన్ని కట్టుకుంటే నోరు మూసు

కాని కూర్చున్నాడు. తనదాకా వస్తే కానీ తెలియదు." వా.

**తన నీడ కడవంగ బాలు నేర్చు**

అసాధ్యకార్యములను చేయగలవా రనుటలో నిరసన తెలిపేమాట. తన నీడను దాటడం అసాధ్యం కదా – అదే చేయగల జాణ అనుట.

పండితా. ప్రథ. పురా. పు. 359.

**తన పనేమో తా నేమో**

ఇతరుల విషయంలో జోక్యం కల్పించుకోడు అనుపట్ల ఉపయోగిస్తారు.

"అతడు పాపం! తన పనేమో తానేమో! ఎందులోనూ కల్పించుకోడు." వా.

**తన మట్టెంత తా నెంత**

వా డెంత? వాడి యోగ్యతెంత? అనుట వంటిది.

"తనదు మట్టెంత తానెంత తానెయింత, చేయఁ జూచిన నే నెంత సేయ రాదు, వేలు వాచిన రోలంత మేలె యైన, రోలు వాచిన నది యెంత మేలు గనునొ?" రాధి. 3.

**తనవారు, కానివారు**

హితులు, అహితులు. జం.

"అనుచుఁ బొరుగిరుగువారుం, దనవారుం గానివారు తక్కినవారున్." హంస. 5.114.

**తన సొమ్మని తలచు**

తనదే అని భావించు.

."ఆ జయకే,తనుఁ డలతలోదరమణి, తన సొమ్మని తలఁచి యతులితత్వరమతి యై." శుక. 1.420.

**తనివి చను**

తృప్తి చెందు.

"తనివి సనక మానికులవతంసుఁడు వేడ్కన్." పాండు. 2.196.

"అంత దనివి సనక." హర. 5.52.

'తనివి తీర' అనే రూపంలో ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

"వారింటి విందులో చుట్టా లందరికీ తనివి తీర భోజనం పెట్టారు." వా.

**తనివి తీరా**

సంతృప్తికరంగా.

"తనివితీరా ఆ పళ్లు తిన్నాను." వా.

**తనివి సను**

తృప్తి చెందు.

"ముని పంచినకృత్యను దహించి తనివి సనక." భాగ. స్క. 9.106.

చూ. తనివి చను.

**తనివుపడు**

తృప్తి చెందు.

"ప్రతిదినంబును జంగమార్చనము లేక, తనివుపడ నొల్ల." కాళ. 1.35.

**తనివెచ్చని**

గోరువెచ్చని.

**తని వోవు**

తృప్తి చెందు.

"తనివోక తోరణ స్తంభముల్ విఱిచి." వర. రా. బా. పు. 19. పం. 14.

**తనుకాడు**

తృప్తి సేయువాడు.

తనుగాలి

చల్లగాలి, తనుపైన గాలి.
నిర్వ. 4.78.

తనుపాఱు

తృప్తి నొందు, చల్ల నగు.

తనుపు సేయు

చల్లదనము చేకూర్చు.

"సతివియోగాగ్ని మనములో సంత తంబు, దగిలికొని కాల దానికిఁ దనుపు సేయఁ,దలఁచి..." కుమా. 3.87.

నేటి వాడుకలో — "నీళ్లలో రుద్రజడ విత్తులు నానవేసి త్రాగితే తంపు చేస్తుంది."

తను పెక్కు

చల్లబడు – తనుపు, తంపుగా వాడుక.

"నీటిలో నిమ్మరసం వేసుకొని పంచదార కలిపి తాగితే తంపు (చలువ) అవుతుంది" ఉష్ణం తగ్గుతుంది అనుట.

"వల రుచుఁ దను పెక్కి వాచిన మేను."

పండితా. ప్రథ. పురా. పు. 443.

తను ముంచినది సముద్రము

తనకు నచ్చినది గొప్ప. తాను మునిగింది గంగ, తాను వలచింది రంభ అన్న సామెతకు దగ్గరగా ఉన్న పలుకుబడి.

"తను ముంచినది సముద్రం, బన వినవే రూపవంతుఁ డైనం గాకం,డిన నా మది గరఁచె న్నే,ర్చిన....."
శుక. 3.176.

తనుయాత్ర

1. భోజనము.

"సారెఁ దనుయాత్ర తంతుల జరుపు చుండె." శృంగా. నైష. 5.19.

2. జీవయాత్ర.

తనుయాత్ర చాలించు

మరణించు.

తను వెల్ల కన్నులై

ఏకాగ్రతతో, సంపూర్ణ భావైక్యంతో.

చూచుటలో కన్నులు వలెనే, వినుటలో వీనులూ ఇలా 'తను వెల్ల'తో చేర్చిన పలుకు బడులు చాల కలవు.

నేటికీ వాడుకలో 'వళ్ళంతా కన్నులు గలిగి మెలగవల సిందే. తప్పితే ఆపద మూడు తుంది' ఇత్యాదిగా అంటారు.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 264.
చూ. తను వెల్ల వీనులై.

తను వెల్ల చేతులై

ఏకాగ్రతతో, సంపూర్ణ భావైక్యంతో.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 264.
చూ. తను వెల్ల మన సై.

**తను వెల్ల జిహ్వ లై**

ఏకాగ్రతతో, సంపూర్ణ భావైక్యంతో.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 264.
చూ. తను వెల్ల చేతు లై.

**తను వెల్ల మన సై**

ఏకాగ్రతతో, సంపూర్ణ భావైక్యంతో.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 264.

**తను వెల్ల వీను లై**

ఏకాగ్రతతో, సంపూర్ణ భావైక్యంతో.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 264.

**తను వెల్ల శిర మై**

ఏకాగ్రతతో, సంపూర్ణ భావైక్యంతో.

"పర్వతాకార మయ్యుఁ, దను వెల్ల శిరమ యై నిను ధరియింప."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 264.

**తన్నందినవారు తనంతలు**

గొప్పవారిని ఆశ్రయిస్తే గొప్పవారే అవుతారు అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

అనగా సమాను లనుట.

"మిముఁ గొలుచు పుణ్యంబున......, తన్నందినవారు తనంత లనన్, వినరే లోకోక్తి మీరు విశ్వంభరలోన్."
కళా. 2.104.

**తన్ని తగుల వేయు**

తరిమి వేయు.

"వాడు పనీ పాటా మానేసి జూదాలు మరిగేసరికి వాళ్లన్నయ్య వాణ్ణి తన్ని తగిలేశాడు." వా.

**తన్ని తలకు పోయు**

అవమానించు, దండించు.

"ఈ ఊళ్లో చేసినట్టే ఆ ఊళ్లోనూ చేశావంటే తన్ని తలకు పోసి పంపిస్తారు." వా.

**తన్నిన పఱపుపై పడిన తెఱగు**

చెడుపు చేయగా వానికి మంచి యైన దనుట. వాడు కలో – 'తంతే పరుపుమీద పడ్డా డట.'

"అల్లి తన్నినఁ బఱపుపైఁ బడిన తెఱగు నా కయ్యె."
పండితా. ప్రథ. పురా. పుట. 387.

**తన్ని పట్టు**

కాలితో బిగదన్ని పట్టుకొను.

సామాన్యంగా మనిషి నిలుచుని వెనుకకు వ్రాలి కాలితో బిగదన్నుకొనుట అలవాటు.

"అని చెప్పఁగా నిటలాక్షునిఁ గన్గొనఁ దన్ని పట్టి." కా. మా. 3.118.

**తన్ని వేయు**

తొలగించు.

నా. మా. 19.

**తన్నీరుతిత్తులు**

నీళ్లుంచు తిత్తులు.

"తన్నీరుతిత్తులఁ దావిపన్నీరు, తిన్నని పిఘులఁ దెరలఁగాఁ జల్ల."
వర. రా. అయో. పు. 254' పంక్తి. 17.

**తన్ను ఏలినవాడు**

తన ఏలిక, తన స్వామి, తన దేవర.

"అక్కుమారుండు దన్నేలినవాఁ డని యెఱుంగక." కుమా. 10.86.

**తన్నుకాడు**

తన్నుకొను.

చిత్తబోధ. 80.

**తన్నుకు చచ్చు**

బాధపడు, గింజుకొను.

"ఈసునఁ గ్రిందు మీఁదఁ బడి యెంతయుఁ దన్నుక చచ్చెనేని యున్." నానా. 24.

**తన్నుకొను**

గిజగిజలాడు, కొట్టుకొను.

**తన్ను గట్ట త్రాళ్లు తానే తెచ్చుకొను**

తనకు తానుగా కష్టాలు తెచ్చుకొను.

తనకు తానే ఆపద తెచ్చుకొను.

"మిమ్ముఁ గట్టఁగఁ ద్రాళ్లు మీరె చేకొంటిరి, యిఁక మీరు వగవంగ నేమి కలదు?" శివధర్మో. 4.97

"తనుఁ గట్టఁ ద్రాళ్లు తానై, కొని వచ్చినజాడ యనుచు గుదియించి కరం, బునఁ బాశము గొని దాసన, వనధీశునిఁ గట్టె నసురవర్యుం డాజిన్."

కవికర్ణ.

**తన్నుబల్ల**

ద్వారం అరిగాళ్ళమీద వేసే బల్ల.

శ. ర.

**తన్నుబిళ్ళ**

ఒక ఆట.

**తన్ను ముంచినదే సముద్రము**

తనకు నచ్చినదే గొప్పది.

తాను మునిగినది గంగ అనుట వంటిది.

"తను ముంచినది సముద్రం, బన వినమే రూపవంతుఁ డైనం గాకుం,డిన నామది గరఁచెఁ జేర్చిన యప్పుడె యితఁడు నాకుఁ జిత్తజుఁ డరయన్."

శుక. 3.129.

**తన్నులాడు**

కొట్లాడు.

"మరిపో యటంచును ఖళీపెళి పుంజులు దన్నులాడఁగన్." హంస. 3.216.

**తన్నులు తిను**

దెబ్బలు తిను.

"ఇలా చేశావంటే తన్నులు తింటావు. జాగ్రత్త." వా.

**తన్నువడు**

దెబ్బ తిను, ఆక్రాంత మగు.

**తన్మాత్రుడు**

సామాన్యుడు.

కాశీ. 7.74.

**తపతప టెక్కలు కొట్టుకొను**

ధ్వన్యనుకరణము.

"కోడి తపతప టెక్కలు గొట్టు

కొనుచుఁ, గూయుక్రమ మొప్ప మీఁదె వేఁకువ యనియెడు.'' కళా. 8.25.

**తపనము చెందు**

తపించు, దేనికైనా ఆశించి వేదనపడు.

జగ. 118.

**తపము పండు**

కోరికలు ఫలించు, కోరిక తీరు.

''ఇంత తెం పొందకుం,డినవాఁ డేమగ వాఁడు నీతపము పండెన్నిండె సౌఖ్యసిద్ధుల్.'' శుక. 4.13.

**తపము పన్నికొను**

తపస్సు చేసుకొను.

కుమా. 6.160.

**తపమువడ బోవు**

తపస్సు చేయబోవు.

''అడవిలోనఁ దపమువడఁ బోదు నను నంత, జలిభీతనము లెందుఁ గలచి తీవు.'' కుమా. 6.16.

**తపము వడు**

తపస్సు చేయు.

''ఇడ్డబొట్టువోలె నింటిలో నుండక, యాఁడుదాన వంత యడలి బాస, నడవిలోనఁ దపము వడఁ బోదు నను నింత, జలిభీతనము లెందుఁ గలచి తీవు.'' కుమా. 6.16.

**తప మెత్తికొను**

తపమునకు సిద్ధమగు, తపస్సు చేయు.

''అభవు దేహార్థ మురవడి నాక్రమించి, కొనఁగ నన మున్నె తప మెత్తికొనియె నగజ.'' కుమా. 7.51.

**తప్పక చూచు**

నిశ్చలముగా చూచు.

''ఎన్ని విధంబులందు నీ, తనయు నిఁగాతు నన్న హరిఁ దప్పక చూచి యతండు దీనుఁడై.'' ఉ. హరి. 2.18.

''కడుఁ జిత్రము నొందుచు నాథువక్త్రముం, దప్పక చూచి...''

కళా. 4.51.

**తప్పకుండా**

తప్పక.

''ఉత్సవం బుత్సవము తప్పకుండ సురలు, వత్తురౌత్సుక్యమున దక్షువాటమునకు.'' భీమ. 3.90.

''తప్పకుండా సాయంత్రం వస్తాను.'' వా.

**తప్ప చరించు**

అన్యథా ప్రవర్తించు.

''రవిచంద్రులు దప్పఁ జరించి రయ్యెడన్.'' భాస్క. అర. 2.337.

**తప్ప జూచు**

1. సరిగా చూడక పోవు.

''నన్నొరసి చూచుడొ గాకిది తప్పఁ జూచుడో.'' కుమా. 5.77.

2. అన్యథా భావించు.

''తప్పఁజూడక విను తగు మనముంచి.'' పల. పు. 13.

3. వ్యతిరేకంగా చూచు.

''కడుకొనక తప్పఁ జూచినఁ, జెడు లోకములు.'' కుమా. 9.44.

**తప్పటగొట్టి యార్చు**

దండోరా వేయు.

''వేఁకువ యనియెడు, కనుమ గట్టి వధూ

మానధనము దోఁచు, నసమశరుఁడు తప్పటఁ గొట్టి యార్చె ననఁగ.''
కళా. 8.25.

## తప్పటడుగులు పెట్టు

చిన్నపిల్లలు తడబడుతూ అడుగులు వేయు.

''అల్లనల్లన తప్పటడుగులు వెట్టుచో, నిద్దంపుఁబస లూరుముద్దుఁ జెలువు...''
కళా. 6.197.

చూ. తప్పటడుగులు వేయు.

## తప్పడుగులు

తప్పటడుగులు.

పిల్లలు వచ్చీరాని నడకలతో వేయు అడుగులు.

బస. 1.16.

## తప్పు దలచు

అన్యథా భావించు.

''అక్కటా! తప్పుఁ దలంచితి.''
భార. ద్రోణ. 2.248.

## తప్పు దార్చు

ఎదుటివాడు యథార్థమును గ్రహింపకుండునట్లు చేసి తప్పుదారి పట్టించు.

''ఎవ్వరిదునిక్షేపం, బేమరి వారే కనవలె, నే మనుచుం దప్పుఁ దార్చె నెఱుఁగింపు మనన్.'' హంస. 2.121.

## తప్పు నాడు

అసత్య మాడు.

''క్రింద గెలిచిన ప్రాలు లెక్కింపు మనక, తప్పునాడక తొల్లింటి దారి చెడక.'' ఉ. హరి. 3.124.

## తప్పనిసరి

అనివార్యము.

కృష్ణని. 51.

## తప్పనిసరిగా

విధిగా.

''వా డున్న చోటల్లా తప్పనిసరిగా వీ డుంటాడు.'' వా.

## తప్పు నూకొను

అశ్రద్ధగా విను.

''ఎదురైన తమవాని గృహకృత్య మడిగి వాఁ, డనునవి తప్పు నూఁకొనెడివారు.'' ఆము. 4.7.

## తప్పి జాఱి యైనా

పొరబాటుగా నయినా.

''మును పెపుడున్ వినంబడని ముచ్చట పుట్టెను గాక కోఁతులెం, దును బొల దిండి పోటరులఁ దున్మట గంటిమె తప్పి జాఱియున్.'' అచ్చ. రా. సుంద.

## తప్పిదారి

పొరబాటుగా.

''అక్కటా! తప్పిదారి యటు లైనను.''
సారం. 2.19.

## తప్పిదారి అయినా

పొరబాటున నయినా.

''ఈ పరమగోప్య మోపుత్ర యోపు రంధ్రి, తప్పిదారియు నెఱిఁగింపఁ దరము గాదు.'' పాండు. 1.211.

''తప్పిదారి అయినా వాడి నోట్లో సత్యం రాదు.'' వా.

## తప్పినకన్ను

సరిగా లేని కన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

తప్పు కల్గు
పొరబాటు జరుగు.
"అకట! నా యెడ నిక్కము దప్పు గల్గెనో." పారి. 1.116.

తప్పు కాచు
మన్నించు.
"నీతప్పు కాచాను. ఇక మీదైనా బుద్ధి గలిగి ఉండు." వా.

తప్పుకోలు మ్రొక్కు
తప్పించుకొనుటకై చేయు మ్రొక్కు.
"చే యప్పు లడిగి తెచ్చెద నంచుఁ జని కాంచుఁ, గోడెమిండనిఁ దప్పుకోలు మ్రొక్కు." శుక. 2.368.

తప్పు చేయు
తప్పుగా తలచు.
విష్ణు. 6.40.

తప్పుటడుగు వెట్టు
చిన్నపిల్లలు అడుగులు తడబడుచుండగా నడచు.
తప్పుదారి అడుగు పెట్టు.
"దర్పకారి జగత్పూర్ణుఁ డౌఁట భీతి, నడుగు వెట్టెడుగతిఁ దప్పు టడుగు వెట్టె." కా. మా. 3.30.

తప్పు తంట
జంటపదం.
"తప్పుతంట కొరగాని దానవారి." రాధి. 3.27.

తప్పు తీయు
తప్పు పట్టు.
"పండితులు తప్పుల్ తీతు రేమో కదా!" పాణి. 1.20.

తప్పుతెరువు
అపమార్గము.
కాశీ. 5.64.

తప్పుత్రోవ
చూ. తప్పుతెరువు.

తప్పుదండుగలు
జరిమానాలు.
కుక్కు. 19.

తప్పుదారి
చూ. తప్పుత్రోవ.

తప్పునీళ్లు
కల్లు.
శుక. 3.23.

తప్పు పట్టు
లోప మెన్ను.
"పరిత్యజించితిని బట్టఁగరా దిది తప్పుగా మదిన్." కళా. 8.256.

తప్పు మీద బెట్టు
తప్పు మోపు.
"అరయక తప్పు మీఁదఁ బెట్టిన." భార. శాంతి. 2.366

తప్పులతడక
తప్పులు కుప్పలుగా గలది.
సుగ్రీ. పు. 47.
"ఆ పుస్తకం ఒట్టి తప్పులతడక. దానిలో తప్పులు గుర్తు పెట్టడం ఎలా సాధ్యం?" వా.

తప్పులు పట్టు
తప్పు పట్టు, న్యూనపఱచు.
చంద్రా. 4.189.

తప్పు లెంచు
తప్పులు పట్టు.

"భర్తకుఁ బోరుగూరు పయనంబుఁ జెప్పని, ధరణీధవుని మీఁదఁ దప్పు లెంచు." శుక. 2.505.

## తప్పు లోగొను

తప్పు క్షమించు.

"తామసించిరి ననుఁ దప్పు లోఁగొనుము."
వర. రా. కిష్కిం. పు. 448. పం. 23.

## తప్పు పట్టు

తప్పు లెన్ను.

"కొంకకుమీ సారెకును దప్పు పట్టు."
పండితా. ద్వితీ. మహి. పుట. 186.

"కటకట! నన్నతిక్రూరుం, డఁట కవితయుఁ దప్పు పట్టె నఁట." కా. మా. 3.166.

## తప్పు పడు

తప్పు చేయు.

"దనుజతనయఁ బొంది తప్పుపడితి." భాగ. 9.543.

## తప్పు వేయు

జరిమానా విధించు.

ముఖ్యంగా కులపెద్దలు వేసే జరిమానా.

"వాడు కులం లేనిదాన్ని పెళ్లి చేసుకున్నాడని, కులపెద్దలు పదివరహాలు తప్పు వేశారు." వా.

## తప్పు సేయు

చూ. తప్పు చేయు.

## తబ్బిబ్బగు

తలక్రిందు లగు, తన్మయ మగు.

"ఏమిట్రా అంత తబ్బిబ్బయి పోతున్నావు?" వా.

## తబ్బిబ్బుగా

వ్యత్యస్తంగా.

ప్రభా. 2.108.

## తమకపడు

త్వరపడు; తహతహ పడు.

## తమ మొగంబు జూడు తము జూడుము

తా మెంత తమ యోగ్య తెంత?

నేటి రూపం 'ఆ మొగం చూడు?' అన్నట్లు వినవస్తుంది.

'నే నేదో మహాగొప్పవాణ్ణి' అన్నట్లు మాట్లాడేవాని విషయంలో 'ఈ మొగానికి ఇంత యిదా' అనురీతిగా ఉపయోగించే పలుకుబడి.

"తమ మొగంబుఁ జూడు తముఁ జూడు మేనుంగు, మీఁద నున్నవాని మేర మీఱి, సున్న మడుగఁ జూచుచున్నారు హరిభక్తి, గమ్యధామకాంక్షఁ గర్మపరులు." పాండు. 4.278.

## తమ సొమ్ము చేసికొను

తమ స్వాధీనము చేసుకొను.

పాండు. 4.208.

వాడుకలో—

"ఊళ్లోవాళ్ల సొమ్మంతా మోసం చేసి వాడు తన సొమ్ము చేసుకున్నాడు."

**తమికొను**

త్వరపడు, కాంక్షించు; కుతూహలపడు; మోహించు.

**తమికొల్పు**

తమికొనునట్లు చేయు.

**తముకు వేయు**

దండోరా వేయు.

ఏదైనా అధికారుల ఆజ్ఞలను గ్రామాదులలో తముకు వాయిస్తూ ప్రకటించుట అలవాటు.

శుక. 4.111.

**తములము సేయు**

తాంబూలం వేసుకొను.

సుమతి.

**తమ్మడిసాని**

తమ్మళ్ల సాని.

క్రీడా. పు. 91.

**తమ్మతసుకు**

చూ. తమ్మపడిగ.

**తమ్మతొట్టి**

చూ. తమ్మపడిగ.

**తమ్మపడిగ**

తాంబూలం వేసుకొని ఉమ్మి ఉమిసే పాత్ర.

రసిక. 4.

**తమ్మగుజ్జు**

తమ్ముడు.

**తమ్మదోయి**

కవల తమ్ములు.

భార. అశ్వ. 4.143.

**తమ్మలము సేయు**

చూ. తములము సేయు.

**తమ్మల వైచి దాటు**

ప్రమాణము చేయు.

సారం. 2.205.

**తమ్మవాడు**

తమ్ముడు.

శ. ర.

**తరకట (బ) బురకట**

ఇంద్రజాలం, మాయ, మోసం. జం.

"కానఁ దరకట బురకట గాదు మేలు"

ప్రబంధరా. 626.

"...కల్ల గాదు కైలాటకము గాదు తరకట బరకట గాదు తబ్బిబ్బు గాదు, తసుకు గాదు."

వేంకటా. 5.129.

**తరగతిగుండ్లు**

సైజువారీగా ఉన్న బంగారు గుండ్ల సరము.

**తరతర పుట్టు**

విపరీతమైన భయం కలుగు.

"రెడ్డిగారు కనిపించేసరికి వీడికి తరతర పుట్టి ఒకటి అనబోయి యింకొకటన్నాడు." వా.

**తరతరము**

అంతకంతకు, క్రమక్రమంగా.

"నిటలాక్షువహ్ని గడు నుత్కటమై, తరతరమ మీఁదఁ గప్పిన..."
కుమా. 5.50.

"తరతరమ సుపర్వసురభిదరికిం జేరెన్." హర. 6.89.

తరతరముగా

క్రమాభివృద్ధి చెందుతూ, రాను రానూ ఎక్కువవుతూ.

"నుదుటి కంటి మంట సద లంటి పర్వుచుఁ, గవిసి తరతరంబ కప్పికొనఁగ." కుమా. 10.5.

తరతరముల నైన

ఎన్నటికైనా.

తరము – ఒక పురుషాంతరము.

హర. 3.76.

తరతరాలనుండీ వచ్చు

చాలనాళ్లనుండీ ప్రవర్తిల్లు.

"మా కీ ఊరి పౌరోహిత్యం తరతరాలనుండీ వస్తున్నది." వా.

"ఆ ఊరి రెడ్డెటికం తరతరాలనుండీ వాళ్లదే." వా.

తరబడి

రకము, పరిమాణము, తెగ, వెంబడి – ఇత్యాది భావచ్ఛాయలలో.

తర మగునా ?

అసాధ్య మనుట.

"దేవకీనందనుఁ డితని దాసులఁ దెలియఁగ జడులకుఁ దర మయ్యీనా."
తాళ్ల. సం. 7.79.

తరమా ?

తర మగునా ?

"ఆయనతో వాదించడం నా తరమా ?"
వా.

తర మిడి

1. వరుస బెట్టి.

"కర మనురక్తి షట్పదము గ్రమ్ము సుగంధమరందవాంఛచే, దర మిడి." భాగ. స్క. 3.550.

"...సహస్రబాహుఁ, బరిమార్చి నృపతులఁ దరమిడి దునుమాడె, నిఖువది యొక్క మా తెల్లచోట."
భార. ద్రో. 2.212.
భార. ఉద్యో. 4.150.

"వనజభవుఁడు మెచ్చి వర మిచ్చువేళ, నరుల నెన్నక యున్న నాఁటితప్పెల్లఁ, దరమిడి నేఁ డిదే తలకూడె నీకు."
రం. రామా. యు. 421.

2. తారతమ్యా మెంచి.

"వరుస నార్వురు చక్రవర్తులలోనఁ, దరమిడి మున్నెన్నఁదగు చక్రవర్తి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 145-146.

తరము అనునది వన్నె వాసి వలెనే అంతస్తును తెలుపును.

తరము గాదు

1. సాధ్యము కాదు.

"పడఁతి నితంబబింబము సెంచఁ బుడమి మెహో, పరి యైన వానికిఁ దరము గాదు." శుక. 2.7.

వాడుకలో—

'ఆ పని చేయడం బ్రహ్మతరం కూడా కాదు.'

చూ. తలము కాదు.

2. పనికి రాదు.

నేటికీ ఇది రాయలసీమలో వాడుకలో నుండు మాట.

"వాడు దమ్మిడీకి తరం కాడు." వా.
"అది మన పనికి తరం కాదు." వా.

ఇక్కడ తరము అనుట రకము – అందుకు తగిన సత్వము కలది అను నర్థములో ప్రయుక్తము.

తర మెఱుగు

వాని యోగ్యతను పరిశీలించు, విలువ కట్టు.

"...కురువీరుల గెలిచి తదం,బరములలోఁ జిత్రవర్ణ భాసురములు గాఁ, దర మెఱఁగి లోచనోత్సవ, కరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ!"
భార. విరా. 4.47.

తరవాయి గొను

వెన్నంటు.

"తరవాయి గొని వెంటఁ దగులుఁగాని." తాళ్ల. సం. 10.134.

తరవాయి చెప్పు

సంత చెప్పు, వల్లించు.

"చెలఁగి తొలునాఁడు తరవాయి చెప్పినట్టి, యెల్ల పన్నంబు నేకరు విడి."
రా. వి. 2.8.

తరాతర ప్రకారం

హెచ్చుతగ్గుల మేరకు.
కాశీయా. 352.

తరిగంబము

కవ్వం కట్టే స్తంభం.
భాగ. 8.205.

తరిగడవ

పెరుగు చిలికే కుండ.

తరిగోల

కవ్వము.

తరిచల్ల

చూ. తరిమజ్జిగ.

తరి చుట్టు

పెరుగు దేవతాదులకు నివేదించు.
శ. ర.

తరిణబట్టు

చూ. తఱిమెన బట్టు.

తరితీపు చేయు

సంతసింప జేయు.

"మగనిం దరితీపు చేసి."
విజయ. 3.34.

తరితీపుల బెట్టు

బాధించు.
విక్ర. 4.204.

తరితీపు సేయు

సంతోష పెట్టు; బాధ పెట్టు.

తరిపాలు

అప్పుడే పిండిన పాలు.

"చి, క్కని తరిపాలు దా నపుడు కంఠము మోవఁగఁ ద్రావఁ జేయు."
సారం. 3.194.

తరిమజ్జిగ

అప్పుడే చిలికిన మజ్జిగ.

తరివట్టు

దేవతలకోసం పెరుగు ఇత్యాదులు మీాదుకట్టు.

తరివెన్న
అప్పుడే తీసిన వెన్న.

....తరువాత
ఇతరు లంతా రెండవ రకమే అనుట.
"అందఱు మా తరువాత గాదె."
శ్రవ. 2.80.
"ఎందరు పండితు లున్నా వాడి తర వాతే." వా.

తరువిడు
ప్రేరేచు; తొందరపెట్టు.

తరు వుండు
1. బాకీడబ్బు యిచ్చువరకు వసూలు చేయుటకై వారి తోనే యుండు.
"దినములు ముప్పది దీఱు నంతకును, గనలుచుఁ దరువుండి కడమ గాకుండ."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1515-16.
2. కావలి యుండు.
"కా,మాతురతాతిరేకమున నా అడి పోకలఁ బోవఁ జూచినన్, వేతరువుండి పట్టుకొన నీరజగర్భున కైన శక్యమే."
వేంక. పంచ. 4.436.

తరువుకాడు
బాకీ నిమ్మని నిర్బంధించు మనిషి – ఆ మనిషి స్త్రీ అయితే తరువుకత్తె.

తరువు పనుచు
బాకీ వసూలు చేయుటకై మనుషులను పంపు.
"తరువు పనిచెను దనదు కింకరుల వారు, నేఁగి ధనము వచ్చుటకునై యిట్టునట్టు, పరుసఁదనములు సూపి..."

తరువు సేయు
ప్రేరేపించు.
"చెలువుని వెంటఁ బోఁ దరువు సేయు మనోజుని మాట..." కువల. 4.54.

తర్కము పెట్టు
కలహము పెట్టు, వాదము పెట్టు.
"కల్వచెల్వముఁ జూచి వానితోఁ, దర్కము పెట్టఁ బూనిన విధంబున నెక్కువ నిక్కెఁ జుక్కలున్."
సింహా. 8.91.

వాడుకలో—
'తర్కం పెట్టుకొని కూర్చుంటే ఎట్లాగయ్యా! అక్కడ లగ్నం మించిపోతా ఉంది.'

తర్జనభర్జన చేయు
బహు భంగుల తర్కించుకొను.
"ఎంతో తర్జనభర్జన చేసి వానిదే తప్పని పెద్దమనుష్యులు తీర్మానించారు." వా.

తర్జనభర్జన పడు
ముందువెనుక ఆలోచనలు చేయు, చర్చించుకొను.
మాటా. 104.

తర్జని జూపు
ఎవరినో నిర్దేశించు.
"ఈ యర్జునుం బనుచుట కర్జం బని తర్జనిం జూపిన." జైమి. 1.124.

**తఱటు గొను**
కొరడాతో కొట్టు.
బ్రౌన్.

**తఱటు చేయు**
కొరడాతో కొట్టు.
కకు. 5.170.

**తఱటున బ్రేయు**
కొరడాతో కొట్టు.
"హుంకారములతోడ నుచ్చాటన పు బదనిక తీఁగ తఱటునన్ బ్రేసి బ్రేసి..." కళా. 3.86.
ఇది బదనిక తీగ తఱటు.

**తఱతఱకలువాఱు**
గఱకలు గఱకలుగా—హెచ్చు తగ్గులుగా అగు.

**తఱతఱలాడు**
భయపడు, తత్తఱపడు.
"నాన్న పేరు చెప్తే వాడు తఱతఱలాడి పోతాడు." వా.

**తఱపివెన్నెల**
కొదమవెన్నెల.
కాశీ. 1.123.

**తఱమి యడుగు**
తొందర పెట్టుతూ పైపైనే చెప్పు చెప్పు మని అడుగు, క్రుచ్చి క్రుచ్చి అడుగు.
"అని తఱమి యడుగుచున్న రతి ముఖ వికారంబుఁ గని మనసిజుండు."
కుమా. 4.58.

**తఱిగినకదళి చందమున**
కొట్టివేసిన అరటిచెట్టువలె.
హఠాత్తుగా మూర్ఛిల్లుపట్ల తరచుగా ఉపయోగించే పలుకుబడి.
"తఱిగినకదళిచందంబున నేల, యొఱఁగి..."
గౌర. హరి. ద్వి. 1843-44.

**తఱిగి వచ్చు**
తగ్గిపోవు.
తఱుగువచ్చుగా నేటి వాడు కలో ఉన్నది.
"అత్యంతదుర్భిక్షు పై దేశము లు నొచ్చె, ధారణ లెంతయుఁ దఱిగి వచ్చె." విష్ణుపు. 6.315.

**తఱిగొను**
పూనుకొను.
భార. అర. 7.36.

**తఱిగొల్పు**
పూనుకొన జేయు.

**తఱితీపు పుట్టించు**
ఇష్టపడ జేయు.
"తఱితీపు పుట్టించు తక్కు చేకా సెల్ల, వడిపెట్టి రాఁ దీయువారిఁ జూచి."
విప్ర. 4.16.

**తఱి దక్కి యుండు**
అవసానదశలో నుండు.
"తఱి దక్కియున్న యీ తల్లిదండ్రులఁ జాల, పఱచ వై సంతోష పఱచ వైతి." పాండు. 3.36.
పాఠాంతరం.
చూ. తఱి ద్రొక్కి యుండు.

**తఱి ద్రొక్కి యుండు**

కాటికి కాళ్లు చాచుకొని యుండు.

"తఱి ద్రొక్కి యున్న యీ తల్లి దండ్రులఁ జాలఁ, బఱచ వై సంతోష పఱచ వైతి." పాండు. 3.36.

చూ. తఱి దక్కి యుండు.

**తఱిమి పలుకు**

పైపై అడుగు.

"సంధ్యావళీదేవి యధిపుఁ దఱిమి పలుకచో." రుక్మాం. 5.129.

**తఱిమెనదొడ్డి**

తఱిణ పట్టుచోటు.

చూ. తఱిమెనబట్టు.

**తఱిమెన బట్టు**

తరిణబట్టు.

వడ్రంగులు కర్రపై పనితనం చేయుటకు, నునుపు చేయుటకు మంచంకోళ్ళు మొదలగు వానిని, ఒక సాధనంలో బిగించి ఒకరు ఆ కర్రను త్రాడుతో తిప్పుతుండగా ఉలిని దాని కానించి తీరుస్తారు. దానిని తరిణ బట్టుట – తఱిమెన బట్టుట అంటారు.

చూ. తరిణబట్టు.

**తఱిమెన బెట్టు**

తఱిమెనలో బిగించు.

చూ. తఱిమెన బట్టు.

**తఱియ జొచ్చు**

ప్రవేశించు; దాటు; తిరుగబడు.

**తఱియబడు**

చూ. తఱియ జొచ్చు.

**తఱివడు**

ఒరసికొను.

"తఱివడ్డ కంకాళతండములును." కాశీ. 3.138.

**తఱుగరి**

కమిషన్ వ్యాపారం చేసేవాడు – దలారివ్యాపారం.

**తఱుగాకు**

కొయ్యాగూర.

శ. ర.

**తఱుగుబేరము**

ఒకరి సరుకును తనవద్ద నుంచుకొని మఱొకరికి అమ్మిపెట్టి వచ్చినదానిలో కొంత వంతు తీసుకొను వ్యాపారము.

"వేళ్లమందు లమర్చి విషవైద్యత వహించి, తఱుగుబేరముల నెంతయును మించి." శుక. 3.372.

**తఱుచంటి**

శిశువు, చిన్నవాడు.

ఇది వావిళ్ళాదులలో లేదు. తఱుసంటి ఉన్నది. అది కూడా రూపాంతరం కావచ్చును.

"దండిరోగం బైన తఱుచంటిక్రియను, చన్నును గుడవక." బస. 3.59.

"తఱుచంటి తన్ను నెదిరిని, నెఱు
గఁడు." - కుమా. 7.49.

వావిళ్లలో ఇక్కడ మూర్ఖుడు
అని ఉన్నది గాని బాలకుడు,
శిశువు అన్న చాలును.

ఇక్కడ కూడా పిల్లమాటలు
అంటే సరిపోతుంది.

"ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మవు,
బేల నీకుఁ జెప్ప నేల వలసెఁ, జెఱుత
వాని కింత తఱుసంటి పలుకులు, సన్నె
వృద్ధజనము లున్నచోట."

భార. సభా. 2.228.

ఇక్కడ ఉద్ధత మని వావిళ్లా
దులు. ఇంత విరుద్ధ మైన
అర్థాలు రెండూనా? అను
మానం.

రూ. తఱుసంటి.

## తఱుసంటి

చిన్నవాడు.

చంటివాడు వంటివాడు.

"తఱుసంటి దన్ను నెదిరిని, నెఱు
గఁడు." కుమా. 7.49.

## తలంటు

తలపై నూనె రాచు – అభ్యం
గన స్నానం.

## తలంటుకొను

అభ్యంగనస్నానము చేయు.

"నేను తలంటుకొని రెండు వారా
లయింది. కళ్లన్నీ మండుతున్నాయి."

వా.

## తలంటు పోసుకొను

అభ్యంగనస్నానం చేయు.

## తలంపునకు వచ్చు

జ్ఞప్తికి వచ్చు.

"నీతో మిగులం జేయుట నొండన
నేర న,నూయ తలంపునకు రాదు నూ
నినుఁ గనిన౯." ఉ. హరి. 4.135.

రూ. తలపునకు వచ్చు.

## తలంపున బాఱు

తోచు.

"మునుమున్న మనంబునం బొడమి
యుండ, నడ లప్పుడు తలంపునం
బాఱిన సమరుం, డగు నతనిచే నది
తీర్చించుకొనంగల యది మై."

మను. 6.9.

రూ. తలపున బాఱు.

## తలంపెత్తు

తలచు.

"కోపంబునఁ జంపఁ దలంపెత్తి."

భార. ద్రోణ. 5.174.

రూ. తల పెత్తు.

## తలంబ్రాలు

పెండ్లిలో వధూవరులు ఒక
రిపై నొకరు తలపై పోసు
కొను బియ్యము.

ఇదే వివాహంలో ప్రధా
నాంగం గనుక, వివాహానికి
కూడా ఈ మాట ప్రత్యా
మ్నాయ మైనది.

హర. 4.95.

చూ. అక్షతారోపణము.

వాడుకలో —'తలంబ్రాలు
చూచి రావాలి,' 'తలం

ప్రాలు పడ్డాయి.' (వివాహం అయినది అనుట.)

**తల అడుమానం పెట్టి అయినా**

చూ. తల తనఖా పెట్టి అయినా.

**తల అమ్ముకొను**

పరాధీన మగు.

"తల అమ్ముకొన్న తర్వాత ఏ మైనా చేయాలిసిందే. ఏమన్నా పడాలిసిందే." వా.

**తల ఆర్చుకొను**

వెండ్రుకల తడి ఆర్చుకొను.

"ఆవిడ తల ఆర్చుకొంటూ మిద్దెమీద నిల్చున్నది." వా.

**తల ఎగకట్టు**

వయసు వచ్చు.

"ఆ పిల్లవాడు కొంచెం తల ఎగకట్ట గానే, పెద్దా చిన్నా లేకుండా వ్యవహ రించడం మొదలెట్టాడు." వా.

**తల కంటగించు**

ఇష్టము లేకపోవు.

"తరలాక్షు లన్న మాతల కంటగించు, నొరులు సన్నిధి నున్న నొదవు నాగ్ర హము, వదలక మీ రిందు వసియింప వలదు, బెదరుఁ జిత్తము నాకుఁ బిట్ట బు ట్టనిన." హరి. ద్వి. భా. 1.1721.

**తలకట్టు**

1. కేశబంధము, కబరీ భరము.

"తల్లి చనుదోయి సరిఁగా, దలకట్టు మించఁగా ముద్దులు నూపుచున్." సింహా. 1.5.

"నగుమొగం బవురా తలకట్టు తమ్మి పూ..." విజయ. 2.104.

2. శిరోజసౌభాగ్యము.

"ఆవిడది చాలా అందమైన తల కట్టు." వా.

**తలకట్టుగా**

శిఖరప్రాయముగా.

శిరోవేష్టనమువలె అని వాచ్యార్థము.

"ధైర్యశౌర్యవివర్ధతకుఁ దలకట్టుగా, సాహసక్రియావృత్తి యతిశయిల్ల." విప్ర. 1.45.

చూ. శిఖరప్రతిష్ఠగా.

**తల కడచు**

అతిశయించు; ఉప్పొంగు; దాటు.

"వనచరులు తమతమ యూథంబులం దల కడచి."

భాస్క. యుద్ధ. 460.

"ఇవ్విధంబున వృకోదరునకుం దల కడచి తాఁక." భార. భీష్మ. 1.239.

"భుజములు దల కడవ..." భాగ. 1.370.

**తలకడుగు**

తలంటుస్నానము.

**తల కదల్చు**

తల ఊచు.

వింతను, అచ్చెరుపాటును సూచించు ఆంగికచేష్టపై వచ్చిన పలుకుబడి.

"కరాంగుళి నాసన్, హత్తించి తల గదల్చుచు, నుత్తలపాటొగ్గడంగ..." కళా. 3.189.

తలకప్పు
ఒకవిధమైన చిన్నకప్ప — తోక ఉండి ముందు తల ఉంటుంది.

తల కాచు
రక్షించు.
"వాడు ఆనాడు చేసినమేలే వాణ్ణి యీనాడు తల కాచింది." వా.

....తలకాయ !
తిరస్కారసూచకంగా ఉదాసీనంగా ఎదుటివానిని అనే మాట.
"నీ తలకాయ. నీ కేం తెలుసురా?"
"వాడి తలకాయ. వా డేం చేస్తాడూ?"

తలకాయనొప్పి
విసుగు.
"వెధవపద్యాలు చదవడం అంటే నాకు తలకాయనొప్పి." వా.

తలకిందుగ పడు
తలకిందు లగు.
"బలువునఁ బారఁగ మోహపు పాశము తనమెడఁ, దగిలిన తలకిందుగఁ బడు కొల్లను తన కిది ప్రియ మౌనో."
తాళ్ల. సం. 5.209.

తలక్రిం దగు
క్రిందుమీదగు.
"తలక్రిందు లైనరథవ్రజములు."
జైమి. 2.78.

తలక్రిందుగా నడుచు
సంప్రదాయవిరుద్ధంగా ప్రవర్తించు. తల పైన, కాళ్ళు క్రిందుగా నడచుట అలవాటు. తద్విరుద్ధమైన పని చేయుట అనుట.
"కానక తలక్రిందుగా నడచెదవు."
పండితా. ప్రథ. పురా. పుట. 362.

తలక్రిందుబ్రతుకు
అస్తవ్యస్తజీవితము.
నా. మా. 39.

తలకీలు వుచ్చు
ప్రధానమైన కీలును తెలుచు.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 484.

తల కుంటే ఏనుగును పొయ్యేవాడు
చాలా పొగరుబోతనుట.
కొంత బూతయినా తెలుచు అనే మాట.

తలకు చెప్పు లడుగు
క్రొవ్వెక్కి మాటలాడు.
"వాడు తలకు చెప్పు లడుగుతాడు. చెబితే వాడు వింటాడా?" వా.

తల కుదవపెట్టి అయినా
ఏం చేసి అయినా, ఎన్ని అవస్థలు పడి అయినా.
"నీ బాకీ నెలలోపల తల కుదువపెట్టి అయినా తెచ్చి ఫైసల్ చేస్తాను." వా.
చూ. తల తనఖా పెట్టి అయినా.

తలకు పోసుకొను
అభ్యంగనస్నానము చేయు.

"నేను తలకు పోసుకొని నెలరోజు లయింది."
చూ. తలంటి పోసుకొను.

## తలకు మించిన పని

తన కసాధ్య మయిన దనుట.
"వాణ్ణి లొంగదీయడం నీకు తలకు మించినపని." వా.

## తలకు మించిన బరువు

అతిభారము.
"ఇంతమందిని కట్టుకొని సంసారాన్ని ఈదడం తలకు మించిన బరు వై పోయింది." వా.

## తలకు మించిపోవు

అసాధ్య మగు.
"నీ తలకు మించిపోయిన రీతిఁ జేయ."
బుద్ధ. 3.176.

## తలకు మిగులు

"పెక్కు హాయనములు బెనుపొందు పొందిక, సంపదలకు నటు నిలింపు లలర, నెఱపె మానివరుఁడు నెఱి మించి గృహిధర్మ, తపము నిష్ఠ మునుల తలకు మిగుల."
రామకథామృతం. బాల. 7.28.
చూ. తల మీఱు.

## తలకు మీఱు

నృసిం. 2.116.
చూ. తల మీఱు.

## తలకు వేస్తే మొలకు - మొలకు వేస్తే తలకు

ఏదో విధంగా వాగ్వాదం పెంచేవారి విషయంలో ఉప యోగించే పలుకుబడి.

"వాడితో ఎవరు వేగుతారు ? తలకు వేస్తే మొలకు, మొలకు వేస్తే తలకు వేస్తూ ప్రాణం తీస్తాడు." వా.

## తలకూడు

1. కలుగు.
"గుణము లెల్ల నిరుణము గాక, తలకూడదు శాంతంబు."
తాళ్ల. సం. 5.276.

2. సమకూడు. కలిసి వచ్చు.
బస. 1.12.
"తలకూడు నశ్వమేధఫలంబు పంచామృ,తాభిషేకవిధాన మాచరింప."
కాశీ. 7.123.

## తల కెక్కిన విషము

శరీర మంతా వ్యాపించిన విషం.
ఏదైనా తేలో పామో కుడితే, కరిస్తే ఆ తావు నుండి విషం – బాధ క్రమంగా పై కెక్కడం అలవాటు.
"మంత్రాభిషేక మే మర్యాదఁ జేసెనో, తల కెక్కినవిషంబు దొలఁగ లేదు." సారం. 1.22.

## తల కెక్కు

అధిక మగు.
"సంగమాపేక్ష తల కెక్కె చాలఁ దివురు." హంస. 4.198.

వాడుకలో—
'వాడికి మదం తల కెక్కింది.
'వాడికి పొగరు తల కెక్కింది.'

తల కెడ వగు

తల్లక్రిందు లగు.

"తప్పి పడిన నూపురంబులం, దల్లకెడ వైనగోపురంబులును."

ఉ. హరి. 1.53.

తల కెడవు వడు

తలక్రిం దగు.

తల కెత్తుకొను

నెత్తిన వేసుకొను, భారము వహించు.

"చక్క జ్ఞాని యైనవాఁడు సారార్థము వేదమందు, తక్కక చేకొనుఁ గాని తల కెత్తుకొనునా?"

తాళ్ల. సం. 6.186.

"వసము గానిపని వడిఁ దల కెత్తుక, అసురుసురు గాని దది సుఖము!"

తాళ్ల. సం. 9.256.

తల కొకమాటగా

నోటి కొకమాటగా.

"మఱియుఁ దల కొకమాటగా మాని నాథ!, తాను మన సడ్డ సేయక తపని..."

చంద్ర. 3.19.

తల కొట్టించుకొను

తల తిరుగుడు కలిగి ఉండు.

"వాడు మనమాట వింటాడా? నిలువునా తల కొట్టించుకొనేరకం." వా.

తల కొట్టి మొలవేయు

చూ. తల గిల్లి మొలవేయు.

తల కొట్టివేసిన ట్లగు

అవమానకర మగు.

"నీకాడు కిట్లా చేశా డని వాడు పది మందిలో అనేసరికి నాకు తల కొట్టి వేసిన ట్లయింది." వా.

తల కొట్టుకొన్నట్టు

విసుగును సూచించే పలుకుబడి. పని అంతా పాడుగా ఉన్న దనుట.

"వీడితో యీ వ్యవహారం తలకొట్టుకొన్నట్టుగా ఉంది." వా.

తలకొట్లమారి

పెడసరపుమనిషి.

"ఔర! తల వ్రాఁత తలకొట్ల మారి ధాత." రాధికా. 2.66.

"బట్టగూడ్చుతనాన పుట్టచెం డ్లెగరీని, మఱచెనో తలకొట్లమారితనము."

తారా. 3.37.

"వాడు వట్టి తలకొట్లమారి. వాడితో యెవడు వేగుతాడు." వా.

తలకొత్తు

అనుమానించు.

"తలకొత్తక యది సేయు మనుడు."

మార్క. 5.207.

తలకొఱ విడు

శవానికి తలవేపు దహనానికై అగ్గి పెట్టు.

గౌర. హరి. ఉ. 2058. పం.

తలకొఱివి పెట్టే దిక్కు

దహనక్రియలు చేసే ఆత్మీయుడు.

చనిపోయినప్పుడు కొడుకో, అలాంటిదగ్గరివాడో కాష్ఠానికి తలవైపు కొఱివి పెట్టడంపై వచ్చిన పలుకుబడి.

"ఆ ముసలాయనకు తలకొఱివి పెట్టే దిక్కు లేకపోయింది గదా అని ఒకటే

దిగులు. తే మెంత నచ్చచెప్పినా విని పించుకోడు." వా.

తలకొలుపు

1. లగ్నము చేయు.

"తలఁచేటి తలఁపులు ధరణిధరుపై, తలకొలుపుదురా తదీయులు.

తాళ్ల. సం. 5.227.

2. కలిగించు.

ప్రభా. 1.56.

3. నెఱవేర్చు.

భార. విరా. 3.72.

4. బోధించు.

నారా. పంచ. 3.290.

5. ప్రేరేచు.

భార. ద్రో. 5.42.

తలకోల

పొడిచే, తన్నే ఆవులకు పిదికేప్పుడు కొమ్ములకు కట్టే కట్ట.

తలక్రొవ్వు

తలపొగరు.

"చులకనిమాట యిచ్చో నన్ను నాడి, తల క్రొవ్వినందుకుఁ దల ద్రవ్వ నేడు."

వర. రా. యు. పు. 125. పం. 10.

తల ఖాళీ అగు

శూన్య మగు.

"పొద్దున్నుంచీ తల ఖాళీగా ఉంది. ఒక్క పంక్తి తోచడం లేదు." వా.

తలగంప

తలమీద పెట్టుకొని అమ్మే కూరగాయలు వగైరాల గంప.

"తలగంప లమ్ముకొని బ్రతుకుతూంది ఆమె యీ ఊళ్లో." వా.

తలగడుగు

తలంటు, అభ్యంగన స్నానము.

పాండు. 3.9.

చూ. తలకడుగు.

తలగబడు

తొలగు, మరలు.

తలగబెట్టు

తొలగించు.

తల గాచు

కాపాడు.

చూ. తల కాచు.

తల గిల్లి మొలవేయు

"నన్నే మో మీరు తలగిల్లి మొలవ వేయుదు రని భీతిల్లఁ బోను."

ధర్మజ. 62.18.

చూ. తల దీసి మొలవేయు.

తలగుంజ

నిట్రాడు.

తలగుండు

తలమీది గుండువంటి వాడు. భయంకరుడు, ప్రాణాంతకుడు – అని భావం.

ఇలాంటి పలుకుబడులు మన కనేకం ఉన్నవి.

"పాంచరాత్రవ్రతుల తలగుండు."

పండితా. ప్రథ. పురా. పుట. 511.

చూ. ఎక్కుగొఱ్ఱు.

తలగుండు గండ

శత్రువు.

"సోదించు మారీచుని తలగుండు గండ." తాళ్ల. సం. 11.3.

తలగుడ్డ

పాగా, రుమాలు.

"సన్నంపుఁ దలగుడ్డఁ జాటుగాఁ బట్టి." ద్వి. శ. సా. 1.12 పు.

తల గూడు

నెత్తిన పడు.

"రూఢిగా రాకుమారునిఁ జంపె ననెడి, యాడిక తలఁ గూడె నభిమాన మెడలె."

గా. హరి. ద్వి. 2480-2481.

తలగొను

తాల్చు, ధరించు.

సాంబో. 1.100.

తల గొఱిగించి పంపు

అవమానించి పంపు

"వాడు ఈ ఊరికి వస్తే తల గొఱిగించి పంపిస్తాను." వా.

తల గోకికొను

1. ఆలోచనలో పడు — పశ్చాత్తాపముతో.

"గోకి కొంచు శిరమ్ములన్." గుంటూ. ఉత్త. 116.

2. ఆలోచించు, జవాబివ్వ లేక పోవు.

"నువ్వు తీసుకొనిపోయిన డబ్బు ఏమయింది రా అంటే తల గోక్కుంటూ నిలబడతాడు." వా.

తల గోయు

1. శిరఃఖండనము చేయు.

"ఇట జరాసంధుని నెఱుఁగవే తొల్లి ? తల గోసి వేసెదఁ దరలక నిలువు."

ద్విప. భాగ. మధు. 53.

2. చంపు.

"అట్లు సని తల గోయుట కప్పళించి." భార. ద్రోణ. 4.101.

తలచమురు

తలకు రాచుకొను నూనె.

శ. ర.

తలచాటు

రక్షణ.

"ఏదో ఆ ముసలాయన అయినా తల చాటుగా ఉన్నాడు ఆ యింటికి ?" వా.

తలచావడి

ఇంటిముందరి చావడి

శ. ర.

తలచిన తలపులు తలకూడినట్లు

కోరిక లన్నీ ఈడేఱినట్లు.

పండితా. ప్రథ. పురా. పుట. 387.

చూ. ఆడ బోయిన తీర్థ మెదురైనట్లు.

తలచినపుడే తాత పెండ్లి

లేడికి లేచిందే ప్రయాణం అన్నట్టు ఉపయోగించే పలుకుబడి.

"అన్నిటికీ సమయం రావాలి. తలచినపుడే తాతపెండ్లి అంటే యెట్లా ?" వా.

తలచీర

1. తలపాగా.

భార. ద్రో. 5.325.

2. మేలిముసుగు.

"పద్మనయన కోరి తలచీర వాటింప నేర దయ్యె." భాగ. 10. ఉ. 331.

తలచీర యెఱుగని దశ

మైమఱచిన, స్పృహ తప్పిన స్థితి.

పూర్వులు ఎలాంటి పరిస్థితి లోనూ శిరోవేష్టనాన్ని తొలగిపోకుండా చూచుకొనే వారు. దానిపై వచ్చిన పలుకుబడి.

"తలచీర యెఱుఁగనిదశ ఘటిల్ల."

కాశీ. 1.139.

తలచీర వాటించు

శిరస్త్రాణము పెట్టుకొను.

"తక్కిన యలంతి మానుసు లెల్లను దలచీర వాటించు తలంపు లేక యొం డొరుల నిలునిలు మని పలుకుచుం గాలు నిలువక."

భార. ద్రోణ. 5.325.

తలచీర వీడినవాడు

శిరస్త్రాణము లేనివాడు.

"సిడంబు డించినవానిని......దలచీర వీడినవానిని......"

భార. భీష్మ. 3.303.

తలచీల

నిట్రాడును, ఏతపు కదురును చేర్చి బిగించెడి చీల.

శ. ర.

తలచుట్ట

తలపాగా.

"బలుసాఁప తలచుట్ట లలవరించినవారు లేఁత చందురులఁ దాలిచినవారు."

పాండు. 1.165.

తలచుట్టు

తలపాగ.

భార. విరా. 5.210.

తలచుట్టూ తిరిగినా నోటిలోదే కబళం

ఏం చేసినా యిది తప్పదు గదా అనేపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఎక్కడికి పోయినా ఎప్పటి కయినా నీ దగ్గరికి రావలసినవాళ్లమే. తలచుట్టూ తిరిగినా......" వా.

చూ. తల ముచ్చుట్టులు దిరిగిన...

తలచునంతటిలో

త్వరలో.

"తలఁచునంతటిలో జాణతనము లాడి లోఁబఱచి..."

హంస. 4.48.

తల చూప నోడు

మొగము చూపలేక పోవు.

"తజ్జనపదంబుల సుహృజ్జనులకుఁ దల చూప నోడి దూర దేశాంతరంబుల యాయావరవృత్తి నర్థార్జనం బొనర్చుచు." కళా. 6.172.

తల చూపు

1. కలుగు.

"తల చూపెఁ గోర్కులు."

రంగ. రా. బాల. పు. 21. పం. 10.

2. కనబడు.
"జలచరములు తల చూపక." విప్ర. 2.44.

**తల చెడు**

1. భయపడు.
"తల చెడి పాఱక బాహా, బల మొప్పఁగ..." భాగ. 10. ఉ. 895.

2. వితంతు వగు, ముండ మోయు.
వితంతు వయితే కొన్ని వర్గాలలో తల వెంట్రుకలు తీసివేసే అలవాటుపై వచ్చిన పలుకుబడి.
"ఒడ లెఱుంగవో చచ్చితో యుర్వి లేవో, చేరఁజాలక తల చెడి జీర్ణ మైతో." పెద్దనచాటువు. వావిళ్ల.
"ఆ పిల్ల పాపం చిన్నతనంలోనే తల చెడి యింటికి వచ్చింది." వా.

**తల డించు**

తల వంచు, లొంగు, జంకు.
"జరాసుతుని బలము ... హలికిఁ దల డించెన్." భాగ. 10. పూ. 1560.

**తలడిల్లు**

భయపడు.
"విరక్తులు తలడిల్లువేళలు." భాగ. 10. పూ. 962. (శ. ర.)

**తలతంత్రము**

ముందు నడచు సైన్యము.
సైన్యం బయలుదేరేముందు కొందఱిని పంపుట ఆచారం.
"ధారలు వట్టఁ బంపుఁ దలతంత్రముఁ దా వడి నంపు." కుమా. 11.5.

**తల తగులు**

అనుభవమునకు వచ్చు.
"ఎవరికైనా తల తగిలితేనే కానీ తెలియదు." వా.

**తల తడివి చూచుకొను**

ఎక్కువ దెబ్బ తగుల లేదు కదా అన్నట్లు ఊరటపడు. అనగా బాగా శాస్తి అయినది అన్న సూచన యిందులో ఉన్నది.
"వాడేం తల తడివి చూచుకొంటూ వెళ్లిపోతున్నాడు. నాలుగు పడ్డాయేమిట్రా ?" వా.

**తల తనఖా పెట్టి అయినా**

ఏదో విధంగా, ఎన్ని కష్టాలు పడి అయినా అనుట.
ఈ తనఖాకు బదులుగా ఒక్కొక్క ప్రాంతాన్ని బట్టీ కుదువ, అడుమానం వగైరా పదాలను ఉపయోగిస్తారు.
"తల తనఖా పెట్టి అయినా సరే నీ అప్పు దమ్మిడీలతో సహా తీర్చేస్తాను."

**తలతల**

తలకు; ఒక్కొక్కరికి.
"వెలఁదులు పదియాఱువేలు నూఱ్వురును, దలతలఁ బదియేసి తనయులఁ గనిరి." ద్విప. కల్యా. పు. 127.

**తలతల కొట్టుకొను**

చూ. నెత్తి నెత్తి కొట్టుకొను.

**తలతల మను**

తళతళ మను, మెఱయు.

"తలతల మను వజ్రంబుల తలతల..."
సారం. 2.223.

తలతల వెలుగు
తళతళ మెఱయు.
నేడు తళతళ అని వాడుక.

"గారికి...తల, తల వెలుఁగుచు శిశిర రుచిరదశనము లొప్పెన్."
కుమా. 3.63.

తల తాకట్టు పెట్టి
ఏ అవస్థ అయినా పడి.

"తల తాకట్టు పెట్టయినా తెచ్చి వాడి బాకీ ఈ నెలలో తీర్చెయ్యాలి. వాడు మరీ నానా మాటలూ అంటున్నాడు."
వా.

చూ. తల తనఖా పెట్టి...

తల తిప్పు
మైకముచేత తల తిరుగు.

"పొద్దున్నుంచీ తల తిప్పుతూ ఉంది. ఏమీ చేయ లేక పోతున్నాను." వా.

తల తిరిగి నోటికి కబళము వచ్చు
ఎన్ని తిప్పలు పడినా కడకు ఫలితము దక్కు.

తలతిరుగుడు
తలపొగరు.

"ఈ తలతిరుగుడు మాట లన్నీ వదిలి పెట్టి సవ్యంగా మాట్లాడితే ఏమయినా చెప్పవచ్చు."
వా.

తల తీసి మొల వేస్తాడా ?
వా డేం చేయగలడు అన్న సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"వా డంటే నా కేం భయం రా. తల తీసి మొల వేస్తాడా ?
వా.

తల తీస్తాడా ?
వా డేం చేయగలడు? అని నిరసనగా ఉపయోగించే పలుకుబడి.

"వాడి ఎదురుగానే చెబుతాను. వా డేం తల తీస్తాడా ?"
వా.

తల తెగగొట్టు
శిరస్సు ఖండించు.

"మగఁ డా పట్టెంబునఁ దల దెగఁ గొట్టినఁ గొట్టుఁ గాక." కళా. 3.202.

తల తొలిచి వేయు
దిగులు అనవరతంగా వేధించు.

"ఆ అమ్మాయిని ఏం చెయ్యాలి అన్నదే నా తల తొలిచి వేస్తూ ఉంది." వా.

తలత్రాడు
పశువుల కొమ్ములకు కట్టే త్రాడు.
పాండు. 5.245.

తలత్రాణము
చేజోడు.

"తనుత్రాణ తలత్రాణంబులు ధరించి." భార. విరా. 4.168.

తలదండ
సీమారతుకము.

"ఇల కెల్లఁ దలదండ చెలియలికట్టరయే, రాజాజ్ఞ నభిపై రాలుఁ గాక."
భాస్క. రా. అయో. 265.

తల దన్ను
మించు, అతిశయించు.

"పుట్టినప్పుడె జవ్వనంబును సమస్త, భామినీకోటిఁ దల దన్ను పాటి చెలువు, కలిగె దీనికి..." కువల. 3.67.
"చెలియ పెన్నెఱిగుంపు చీఁకటిఁ దల దన్నె, వదనము కళఁ బట్టి చదిపె విధుని." బిల్హ. 2.120.

## తల దాకు

అనుభవమునకు వచ్చు.
"కామిను లందఱుఁ గతినాత్మ లనుట, యీ మేర తల దాఁకి యిట సరి వచ్చె." వర. రా. అయో. పు. 302. పం. 23.
"మనం ఎన్ని మాటలు చెప్పినా వాడికి తల దాకితే గానీ తెలియదు." వా.

## తల దాచికొను

రక్షణ కల్పించుకొను.
"వెడలియుఁ దల దాఁచ వెర వేమి గానక, యడవుల నిడుమల నందువారు." సింహాద్రినా. శ. 11.

## తల దాచుకునే చోటు

ఆశ్రయము.
"వాడికి ఊళ్లో తల దాచుకొనే చోటు లేకుండా పోయింది." వా.

## తల దాటు

మించు.
"ననుఁ దల దాటు నింక నొక నాయకునిన్ వరియించి యుండునా?" పాణి. 2.28.
"అందఱుకం దల దాఁటి భూపుఁ డై." దేవీ. 6.525.

## తల దించుకొను

తల వంచుకొను – అవమానముతో—
"పాపం! వీధిలోనికి వెడితే వాడు తల దించుకొని వెడతాడు." వా.

## తలదుడ్డు

తలగల చేతికఱ్ఱ.
వేం. పంచ. 1.598.

## తలదువారము

ముఖద్వారము, తలవాకిలి.
అచ్చ. రా. అయో. 10.

## తల దూర్చు(కొను)

తల దాచుకొని ఏదో ఒక మూలలో పడి ఉండు – దీనత ఇందులో సూచితం.
"సురేంద్రుండు జీర్ణ పర్ణాశనమున, నొడలు కడుఁ జిక్కి నొగులుచు నున్న తపసి, పడఁతి తల దూర్చుకొను చుట్టు గుడిసెపంచఁ, జేరె..." జాహ్నవీ. 4.81.

## తల దెగిపడి యప్పు దీర్చు

తల యిచ్చి అయినా సరే అప్పు తీర్చు–ప్రాణ మిచ్చైనా మీ అప్పు తీర్చుకొంటాను అనురీతిగా ఉపయోగం.
"దీనతమైఁ దల దెగిపడి యప్పు పూని తీర్చెద." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 659-60.

## తల ద్రొక్కు

ఎక్కు, అధిరోహించు, మించు.

## తల ధరించు

శిరసావహించు.
"తమ్ము లిద్దఱుఁ దన యాజ్ఞఁ దల ధరించి." హర. పీఠిక. 27.
చూ. తల దాల్చు.

**తలనట్టు**

వేరుపురుగు కొట్టి ఎండిన మోసులు.

**తల నడ్చికొనుడు**

మీతలమీదనే వేసి కొట్టుకొనండి.

విసుగుగా ఇదంతా మీరే అనుభవించండి. నే పోతాను అనునప్పు డంటూరు.

"ఖులులార యిండ్లు వృత్తులు నూరు మీరు, తల నడ్చికొనుఁడు."
బస. 7.192.

నేటికీ వాడుకలో——'మీతల మీద నే కొట్టుకోండి రా. వెధవా_స్తి ఎవడి క్కా—వాలి?'

**తల నిండగ నర్థము పోసినను**

నిలువెత్తు ధనం పోసినా.

"విడిచితి నింక నీవు తల నిండఁగ నర్థము పోసితేని నేఁ, నడు గటు పెట్టఁగా వెఱతు నచ్యుత! నిన్ను నె కొల్చి యుండెదన్." ప్రభా. 1.93.

**తలనిక్కు**

గర్వము.

"వాడికి యేం చూసుకొనో యేమో గానీ మహా తలనిక్కు." వా.

**తలను గట్టికొను**

నెత్తిన వేసుకొను.

నీ తలమీదనే వేసుకో అను పట్ల అనుమాట.

"నీవ యుర్వి యేలు, గుజ్జములును సేనుఁ గులు లేని బయలు నీ, తలనె కట్టి కొనుము ధర్మతనయ."
భార. శల్య. 2.72.

చూ. తల నడ్చికొనుడు.

**తలను నరములతో పెఱుకు**

నరములతోపాటు తలను పెఱుకు, దారుణముగా శిక్షించు.

"...ఎందుఁ జొచ్చినఁ గూడం, దఱి మెదఁ దల నరములతోఁ, బెఱికెద నను చున్." కళా. 3.161.

**తలనొప్పి**

సరిపడనిది, విసుగు కల్గించునది.

"వాడిమాట లంటే నాకు తలనొప్పి."
వా.

చూ. తలకాయనొప్పి, తలయేరు.

**తల నోరు మొత్తుకొను**

నెత్తి నోరు కొట్టుకొను.

"వృద్ధ వెసన్ దల నోరు మొత్తుకో."
పాణి. 6.86.

చూ. నెత్తి నోరు కొట్టుకొను.

**తలపండు**

తల.

"పలుకుఁదేనియ గలదలపండు వేల్వఁ, దలఁచి." ద్వా. 2.89.

**తల పండు పగలా!**

ఒక తిట్టు.

"ఓరి! నీతలపండు పగలా." వా.

తలను కాయతోనూ, పండుతోనూ పోల్చడం మనవాళ్ల కలవాటు.

## తలపంపు ఉడుపు

పైనున్న నరాలను సడల్చు, మెడపంపులు తోము.

"తను దమ్మి దొంతులఁ దలపంపు ఉడిపి." పండితా. ద్వితీ. పర్వ. పుట. 333.

## తల పగిలిపోవు

తలనొప్పిగా ఉండు.

"పొద్దుటినుంచీ ఈ పిల్లల గొడవతో తల పగిలిపోతూ ఉంది." వా.

## తల పగుల గొడతాను

ఒక తిట్టు.

"మళ్లీ ఆమాట అన్నా వంటే తల పగలగొడతాను. జాగ్రత్త." వా.

## తలపట్టక పోరు

దిగులుపడక పోరాడు.

"పలుకులఁ బని లేదీకే, తల పట్టక పోరువారు." భార. ద్రోణ. 5.37.

## తల పట్టి చూచుకొను

ఏదో చావలేదు గదా అని శాస్త్రి ఏదో అయినతర్వాత చూచుకొను.

దెబ్బ తగిలిన దేమో అని తల తడవి చూచుకొను.

దుమ్ము దులుపుకొని పోవు వంటిది.

"బ్రదుకు జీవము కల్గెఁ గాఁ దలపట్టి చూచుకొనంగ." రామాభ్యు. 6.70.

"...తప్పిపోకకుం దప్పి నిలిచిన తరుచరులు తలలు వట్టి చూచికొనిరి." రామాభ్యు. 8.159.

"ఏమి చెప్పం బులి నోరికండ విడిపడ్డ గతిం దలపట్టి చూచుకొం,చున్." ప్రభా. 1.91.

"రాముఁడు చంపక రానిచ్చె నిన్ను ..., తలవట్టి చూచుక తప్పి వచ్చితివి." వర. రా. యు.

చూ. తల తడివి చూచుకొను.

## తల పట్టుకొను

1. సిగ పట్టుకొను.

"తల వట్టుకొను నొక్క తరుణీ లలామంబు." కా. మా. 2.18.

2. తలనొప్పిని సూచిస్తూ చేయు చేష్ట. దిగులును కూడా ఇది సూచిస్తుంది.

"వాడు తల పట్టుకొని కూర్చున్నాడు." వా.

## తలపట్టు వేసుకొను

తలకు ఏ శొంఠో, ఆవాలో నూరి లేపనము చేసుకొను.

"జ్వరంగా ఉందని నిన్న తలపట్టు వేసుకున్నాను. ఈ రోజు కాస్త నెమ్మదిగా ఉంది." వా.

## తల పట్టేవాడు

ఒక తిట్టు.

నీచు డనుట.

## తలపట్లకు దిగు

దెబ్బలాటకు దిగు.

'దిగు' కు బదులు పూను, తొడగు ఇత్యాదులు వచ్చుట కలదు.

"...వాక్యోపవాక్యంబులం, గా కెముం దలపట్లకుం దొడఁగి రాకల్యాణ వేదిస్థలిక్." పాంచాలీ.

"ముందు దేదో కేవలం వాదంగానే ఆరంభించినా, కడకు వా రిద్దరూ తలపట్లకు దిగినారు." వా.

తలపట్లకు సిగపట్లకు దిగు

దెబ్బలాటకు దిగు.

"మామూలుగానే మాట్లాడుకొంటున్నా రనుకొన్నాను. ఇంతలో తలపట్లకు సిగపట్లకు దిగుతా రనుకోలేదు." వా.

తలపట్లు పట్టుకొను

తగవులాడు.

కొత్త. 190.

తలపట్లు - సిగపట్లు

కలహాము.

"......వీని, తరుణికి నొకమతి తలపట్లు వేసి, నగుచుఁ జూచెదఁ గాక." గౌర. హరి. ద్వి. 1025-1027.

"వాళ్లింట్లో ఎప్పుడూ తలపట్లూ సిగపట్లూ." వా.

కొట్లాడునప్పుడు వెండ్రుకలను పట్టి లాగుటపై ఏర్పడిన పలుకుబడి.

చూ. సిగపట్లు.

తలపట్లు సిగపట్లు అగు

కలహ మగు.

"వాడికీ వీడికీ తలపట్లూ సిగపట్లూ అయింది." వా.

తలపడు

1. డీకొను; సిద్ధపడు.

"రాక్షసుఁడు శక్తితోడఁ దలపడ." కాశీ. 6.238.

"దొమ్మికిఁ దలపడితివి నీవు వీర ధర్మ మెఱి?" జైమి. 7.178.

"వాఁ డింతదానికి తలపడతా డని నేననుకోలేదు." వా.

2. సమీపించు.

ఆము. 4.130.

తల పని

క్షవరం.

"చీదరగా ఉంది. తలపని చేసుకు రావాలి." వా.

ఇది దక్షిణాంధ్రంలో ఎక్కువగా వాడుకలో ఉన్న పలుకుబడి.

తలపని చేయించుకొను

క్షౌరము చేయించుకొను.

"తల బాగా పెరిగింది. తలపని చేయించుకోవాలి." వా.

తలపని తలపు

అకస్మాత్తుగా కలిగిన ఆలోచన.

పాండు. 4.257.

చూ. తలవని తలంపు.

తల పరిగె (తలిపెర)

ఊటకాల్వకు ఆరంభస్థానము.

రాయలసీమలో 'తలిపెర' ఎక్కువ. తలపరిగె అనుటకు తలపెర అనుటే నేటి వాడుక.

"ఈ కాలవను మూడు మైళ్లలో ఉంది తలిపెర." వా.

**తలపరువు**

యోగ్యత, ప్రతిష్ఠ.
గువ్వలచెన్న. 66.

**తలపాగ**

రుమాలు, పాగా.

**తలపాటు**

1. ఆశ్రయము.
"నిస్సీమవృత్తి, దొరయ వలసెను దల పాటు దొరకనకతన."
భాస్క. యుద్ధ. 2094.

2. కవియుట.
రామా. 8.98.

**తలపాలు**

ఒక శిరోభూషణము, తల పుత్తె.

**తలపుండ్లు కడుగు**

బాధానివర్తి చేయు.
"తలపుండ్లు గడిగించి తను బ్రదికించెఁ గా, యడవిఁ జోరాహతుం డైనఁ దెచ్చి."
పాండు. 3.68.

**తలపుండ్లు గడిగి (రక్షించు)**

ఇబ్బందులు తీర్చి (కాపాడు.)
"నడుమఁ జావఁగ నీవు నా తలపుండ్లు, గడిగి రక్షించెదో కరవుకాలమున."
గౌర. హరి. ద్వి. 1253-1254.

**తలపు గీడు చేయు**

తలపు చెఱచు.
"తలఁపు గీడు చేసి యెలప్రాయమున నొందు, తలఁపునందుఁ బట్టుకొలుపుఁ బ్రీతి."
భార. సౌప్తి. 1.45.

**తలపుచ్చె**

తలపుత్తె.
గౌర. హరి. 1016. పం.

**తలపు నిలుపు**

మనసు నిలుపు.
"అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ, దలఁపు నీదెస నిలిపెద దానఁజేసి."
భార. కర్ణ. 1.301.

**తలపుబడి నడుచు**

ఇష్టప్రకారము నడుచు.
"ఏను నీ తలఁపుబడిన నడచెద నని."
కళా. 6.64.

**తలపువ్వు వాడక**

ఏ విధమైన కష్టనష్టాలపాలు కాక, చెక్కు చెదరక.
"అరగయ్యంబున దివిజులు, దిరుగుడువడి రింకమీఁద ధృతి చెడి తిరుగుం, బురుహూతుఁ డనుచుఁ దమవా, రరసినఁ దలపువ్వు వాడ దని సంతసిలన్."
ఉ. హరి. 1.21.
"తలపువ్వు వాడక తరుణీలలామ, యెలనవ్వు సిగురొత్త నెప్పటియట్లు."
హరి. ద్వి. 1. భా. 287.

**తలపు సేయు**

1. కోరు.
"...ఆతని తలఁపుఁ దెలిసి తగులఁ దలఁపు చేసి." వి. పు. .6.18.

2. జ్ఞప్తికి తెచ్చు.
"బో, ర్తలు పుఁ దలంపు సేయుచు నురంబు గరంబు పరిస్ఫురింపఁగన్."
పాండు. 2.36.
"...గంగా యమునా, సంగమముం దలఁపు చేసె సజలాకృతి యై."
కవిక. 4.128.

**తలపూవు వాడకుండా**

చెక్కు చెదరకుండా.

"తలపూ వాడక యుండుము, తలపూ వాడంగ వికచతామరసాక్షీ!"

పారి. 1 ఆ.

చూ. తలపువ్వు వాడక.

**తలపెట్టు**

మొదలు పెట్టు, తలపోయు; తలపడునట్లు చేయు.

"కొలవిం దల గోకికొనుటకుం దల పెట్టన్." రాజ. చ. 2.43.

"తలపెట్టకుఁ డీఁక సెన్నఁడు."

కళా. 5.57.

"ఔఁదల ధరణీపాలక, యాఁ దలవం పాయె నిప్పు డందఱలోనె, చోఁ దల పెట్టక సెనరి, చోఁ దల పెట్ట కటు విడువు చూతువు నన్నున్."

సా. 2.234.

**తల పెత్తు**

తలపు పుట్టు.

"...మహాగ్నిలో మిడుత వై కాలం దలం పెత్తెనే?"

భాస్క. అర. 2.101.

**తలపై తల వచ్చినను**

ఏ మయినా; ఎంత గొప్పవాడ వైనా.

"కలుషంబున కింతేనియు, నులుకవు నేఁ జెల్ల నిప్పు లాడి గట్టికొనం, దలఁ తురె కటకట! తలపైఁ, దల వచ్చిన ధరఁ బతివ్రతలఁ జెనఁకుదురే."

నలచ. 6.30.

**తలపై నాలు గక్షింతలు పడు**

పెండ్లి తగులు.

"వాళ్ల నాన్నకు తెలిసి తలపైన నాలుగు అక్షింతలు పడేదాకా వాడు అలాగే తిరుగుతూంటాడు." వా.

**తలపొగరు**

మదము.

"వాడికి తలపొగ రెక్కువ. వాడితో ఎవడు మాట్లాడుతాడు?" వా.

**తలపొడుగు ధనము పోయు**

కనకాభిషేకము చేయు వంటిది.

సుమతి. 84.

చూ. నిలువెత్తు....

**తలపొలము**

పొలిమేర; ఎత్తైన భూమి.

"ఈతఁడు దొంగ కూటి కేలాగునఁ జొచ్చెఁ దాఁ దల పొలంబుల నిల్చునె సాదు లేఁగినన్." విప్ర. 5.41.

**తలపోత**

ఆలోచన, కోరిక, విచారము, ఊహ.

**తలపోయు**

ఆలోచించు.

ఇందుకు దగ్గఱి భావచ్ఛాయలు.

"తన బుద్ధి నెంతయుఁ దలపోసి చూచి."

రంగ. రా. బాల. పు. 5. పం. 13.

**తలపోసుకొను**

చెప్పుకొను.

"తన మాటయె తలపోసికొను చుండ." రామా. 7.6.

**తల ప్రాణము తోకకు వచ్చు**

చచ్చిన చావగు.

"......సితమయూఖ! నినుం జెలియఁగఁ గోరి యూరక యటు చేరినంతఁ దల ప్రాణము దోఁకకు వచ్చె లెక్క సేయక..." సారం. 2.173.

"........మారుఁడు కోపమునం గనుఁగొన్న సంగముం, బతిపతి యయ్యెనట్టె తలప్రాణము తోఁకకు వచ్చె నెవ్వరిం, గఱచు..." దశకు. 3.29.

**తల బట్టకట్టు**

విసుగు పుట్టు.

"వాడికి చెప్పి చెప్పి నాకు తల బట్ట కట్టి పోయింది." వా.

**తలబిరుసు (తనం)**

తలపొగరు.

"అంత తలబిరుసు తనం మంచిది కాదు. పెద్దవాళ్ల మాటలకు తగిన గౌరవం యివ్వాలి." వా.

"అంత తలబిరుసయితే ఎట్లరా?" వా.

**తలబిళ్ల**

తలగడ.

**తల బీకనకాయ లగు**

ఛిన్నాభిన్న మగు, కళవళ పడు.

"చిలువ దళవాయు లప్పుడు, తల బీకన కాయ లై యథాయథ లై కూ, కలువతులు నై మొనతల, నిలువక శేషాహి కడకు నెఱి చెడి పాఱన్." జైమి. 2.102.

**తల బొప్పి కట్టు**

1. విసుగెత్తు.

"వీడికి చదువు చెప్ప లేక నాతల బొప్పి కట్టింది." వా.

2. కష్టనష్టములు పడు.

"...శీర్ష మిప్పటికి తద్దయు బొప్పెలు కట్టెఁ జూచితే." గీర. లోకా. 35.

**తలభారము**

పడిసెము పట్టి తల బరువుగా నుండు.

"విక్రాంతాలాపము లాడువాం డ్ర తలభరం బూడ్ప కేనాఁటికిన్." గీర. లోకా. 34.

**తలమాటు**

చేటు.

"రఘువంశమునకున్, దలమాటించు కయు లేమి." నిర్వ. 9 ఆ.

**తలమానికము**

1. శ్రేష్ఠుడు, శ్రేష్ఠురాలు.

"కన్నియ తలమానిక మగు, నన్నాగటి చాలిపేరి యతివన్." రామా. 5.189.

2. శిరోభూషణము.

చెన్న. 1.117.

**తలమానిసి**

ప్రధానపురుషుడు.

వాల్మీకి. 2.122.

**తల మాయు**

1. దుమ్ము పట్టు.

వెంట్రుక లెక్కువగా పెరుగు.

"తల మాసిన నోలు మాసిన, వలువలు మాసినను బ్రాణవల్లభు నైనన్, గుల కాంత యైన నొల్లదు." సుమతి.

2. అభ్యంగనస్నానము చేయక పోయినప్పుడు తల మాసిన దనీ అంటారు.

చూ. తల మాసినవాడు.

**తలమావి పీడని**

బొత్తిగా చిన్నవా డనుట.

బిడ్డ పుట్టిన కాసేపటికే మాయను కోసి వేస్తారు. అది కూడా పీడని వయ సంటే అతి చిన్నతన మనుట.

"నీవు తలమావి పీడని నిసువువయసు, నాఁడె జేజేల దళవాయి నాయకరపుఁ, బట్టమున నిల్చి తారకుఁ గిట్టి ప్రౌఢ, తరరణక్రీడ యొనరించుతఱి మహాత్మ!"

పాండు. 1.145.

**తల మాసినవాడు**

ఒక తిట్టు – దర్బేసి వెధవ వంటిది.

నిరసనగా అనుమాట.

"ఏ తల మాసినవాడో దొరక్కపోతాడా ? వాణ్ణి బోర్లించక పోతామా అని వాడు చూస్తుంటాడు."

వా.

**తలమాసు వోని**

తలమీది మావి – మాయ – పీడని, పసిపాప అయిన...

"తా నెత్తికొంటి రక్కుల, నేనియుఁ దలమాసు వోనినెత్తురుకుదుముక్, సే నానిఁ జేసి..."

కుమా. 10.166.

**తలమాళిగ**

ఏనుగ కుంభస్థలంపై ఉంచే వస్త్రాలంకారము.

వాల్మీకి. 3.30.

**తల మించు**

తల మీఱు.

**తల మిగిలి తాడి పొడవగు**

తలమునుకలగు, మితి మీఱు.

"చల మేటికి రమ్మికఁ గో, మలరూప ! పిశంగనేత్ర ! మన్మథబాధల్, తల మిగిలి తాడిపొడ వై, బలిసెను దమి మీఱ నాదుపజ్జకు వేగన్."

చంద్రశేఖా. 2.48.

**తల మిగులు**

1. విజృంభించు.

"తత్సమయంబునఁ దల మిగిలి జయద్రథుండు రౌద్రం బెసంగ."

భార. భీష్మ. 3.55.

2. మించు.

"కని యశ్వత్థామయుఁ గృపుఁ, డును గృతవర్మయుఁను నొక్కడు బరవసము నన్, మన సేనకుఁ దల మిగిలిన, మను జేశ్వర ! కవిసెఁ గ్రీడి మద మెలరారన్."

భార. శల్య. 1.242.

**తలమిన్న**

తలమానికము.

"అక్కన్నె తలమిన్న యంది మి న్నంది."

వర. రా. బా. పు. 19. పం. 12.

**తలమీద కండ్లు**

పొగరును సూచించుమాట.

చూ. నెత్తిమీద కన్నులు.

**తలమీద చెయి పెట్టు**

మోసము చేయు, నాశనము చేయు.

"వా డెందరి తలలమీద చెయి పెట్టాడో? ఇప్పుడు ఈ ఊళ్లోకి వచ్చాడు." వా.

భస్మాసురుడికి తన చేతిని ఎవరి తలమీద పెడితే వాళ్లు భస్మం అయేటట్టుగా కలిగిన వరంపై వచ్చిన దేమో!

## తలమీద తల పడినను

ఏ మయినా.

మిన్ను విఱిగి మీద పడినా అనుట.

"మేము తలమీఁదఁ దలపడ్డ మిన్ను విఱిగి, పైనఁ బడినను రాత్రులుఁ బగటి పూట, శిష్టుచేతను గాని భోంచేయ మయ్యా." నందక. 82.

## తలమీద తల మొలచినా

వా డెంత గొప్పవా డైనా అని నిరసనార్థంలో అనే మాట.

"వానికి తలమీద తల మొలిచినా సరే నేను నమస్కరించను. వాడు ఒట్టి నీచుడు." వా.

## తలమీద నుంచు

శిరసావహించు.

"గురుప్రియవచనములు, తలమీఁద నుంచి సంతస మంది."

వర. రా. బా. పు. 83. పం. 15.

## తలమీద వచ్చు

ప్రాణముమీదికి వచ్చు.

"కులసతిఁ బాసినఁ గొడుకు వోయినను, దలమీఁద వచ్చినఁ దాలిమి దూలి."

గౌ. హరి. ప్రథ. పం. 259-60.

"నువ్వు వద్దురా అంటే వినకుండా తల మీదికి తెచ్చుకొన్నావు." వా.

## తలమీఱి చను

హద్దు మీఱి ప్రవర్తించు.

పాండు. 4.282.

"వాడు ఈ మధ్య మరీ తలమీరి పోయి నాడు. ఎవడి మాటా వినడం లేదు." వా.

## తల మీఱు

1. మించు.

"నలినాక్షు ! యేరీతి నాఁడు నామిత్రుఁ, దల మీఱి నరకు నుద్దండతఁ జంపి."

ద్విప. జగ. పు. 177.

2. మించి పోవు, మీఱి పోవు.

"నావుడు వాయునందనుఁడు నందన! పొమ్ము చమూవధూటి నీ, కైవస మైన లెస్స యటు గాక నినుం దల మీఱె నేని దా, డొవుల నిల్చి..."

జైమి. 2.57.

వాడుకలో—

ద్వితీయ కాక పక్షిగానే 'నీకూ తల మీఱి పోతే – నీకూ సాధ్యము కాకపోతే' అనే రీతిగానే వినబడుతుంది.

## తలము గాదు

సాధ్యము కాదు.

"మగువ సోయగపు సెమ్మొగ మెంచఁ గొలు వున్న, వెలిదమ్మివానికిఁ దలము గాదు." శుక. 2.7.

చూ. తరము కాదు.

తల ముచ్చుట్లులు దిరిగిన దల
పోయగ నోరిలోనిదయ
కడి యన్నట్లు

తల చుట్టూ చెయ్యి తిప్పినా కడకు కడి పెట్టవలసింది నోటి లోనే కదా! సూటిగా వెళ్ళక అనవసర మైన యీ తిరుగుడు ఎందుకు అనేపట్ల ఉపయోగించేపలుకు బడి.

"తల ముచ్చుట్టులు దిరిగినఁ, దల పోయఁగ నోరిలోనిదయ కడి యన్న, ట్లిల నేతెఱఁగులఁ దిరిగినఁ, గలుగదు గతి విష్ణుసేవ గావింపకయున్." పాండు. 4.276.

తలము తప్పిన

అలవి మాలిన, అత్యధిక మయిన అనుట.

"తలము దప్పిన యట్టి ధనరాశి వేఁడి." గౌ. హరి. ప్రథ. పం. 347.

తల మునిగిన

అధిక మైన, తలకు మించిన. భాస్క. రా. యు. 1397.

తలమునుక లగు

తలకు మించిపోవు, దుర్భర మగు, అధిక మగు.

"......అట్లు దాఁకు టయు వారల నతఁడు గన్నెరాకమ్ములం జీకాకు పఱిచె నట్లు గురుండు మొదలైనకుంద ఱకు సాధనంజయుపోరు దలమునుక లయ్యె." భార. భీష్మ. 3.218. భార. శల్య. 2.408.

"ఊహలు కుతుకబం బై, మోహము తలమునుక లగుచు ముద్దియ మదిలో, బాహాబాహి కచాకచి, కూహకమతి పట్టి పెనఁగి కో యనుచు వడిన్." హంస. 2.32.

తలమున్క లగు

తలమునుక లగు.

"మద్బాహువీర్యంబు మహితధైర్యం బును, దలమున్క లైనసధర్మవృత్తి." శల్య. 2.408.

"...అత్తరళాయతేక్షణ కటాక్ష విలాసరసప్రవాహముల్, కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గందు మీలకున్." విజ. 3.15.

తలముడులు

దొంగలు, వేటకాండ్రు ఉప యోగించే సాధనము.

రూ. తలముళ్లు.

తలమూటలు మోయు

కూలికి బరువులు మోయు.

"వీడు ఈ ఊళ్లో తలమూటలు మోస్తూ బతుకుతున్నాడు." వా.

తల మొత్తి బాస యిచ్చు

ప్రమాణం చేసేటప్పుడు తల తాకడం ఆచారం. అంటే నీ మీద ఆన అన్నమాట. ఇట్లే పుస్తకం తాకి కాని, దేవుణ్ణి తాకి కాని, దీప మార్పి కాని ప్రమాణం చేస్తారు.

దీనికి తల తడివి, తల తాకి రూపాంతరములు.

"దునిమి బలి యొసఁగెద సాహస, మెన యం దల మొత్తి బాస యిచ్చెద నను చున్." శుక. 2.77.

**తల మొత్తుకొని**

ఎంత గట్టిగానో.

"ఎంత తల మొత్తుకొని చెప్పినా వాడు విన లేదు." వా.

**తల మొల యెఱుగక**

మొదలూ కొనా తెలియక.

"అని తల మొల యెఱుంగక పల వించుచు భృత్యామాత్య బంధుజనం బులం గూడి యడలుచు." భాగ. 6.452.

**తల మొలెఱుగ నిచ్చు**

తలా తోకా తెలియ నిచ్చు.

"దైవమా నీ మాయ తలమొ లెఱుఁగ నీదు." తాళ్ల. సం. 6.4.

**తల మోచి**

1. శిరసావహించి.

"శంబరసూదనాహితుని శాసనముం దల మోచి వచ్చి లో,కాంబ తదీయ సన్నిధిఁ బ్రియంబున నిల్చె." కా. మా. 1.91.

చూ. తల దాల్చు.

2. నెత్తిన పెట్టుకొని.

గౌరవాదర ప్రేమలను తెలుపు పలుకుబడి.

"మున్నొక రాఘవుండు తల మోచి భజించు విభీషణాదులన్." పాండు. 1.54.

వాడుకలో—నెత్తిన పెట్టుకొని అన్నదే నిలిచింది. 'ఆయన్ను నెత్తిన పెట్టుకొని పూజిస్తూ వచ్చాను. కాని ఆయనకు నామీద దయ లేక పోయింది.'

3. భక్తిశ్రద్ధలతో.

"దేవర యాజ్ఞ దల మోచి చేయు దాన." భార. ద్రోణ. 2.175.

**తల మోచు**

ఒప్పుకొను.

"తల మోచి యేను ధర్మంబె చేపట్ట." వర. రా. అర. పు. 230. పం. 13.

**తలమోపులు**

ఎక్కువ; మోపెడు.

"తండోపతండము లై తలమోపులు పనులు, చండె వెట్టి పనిగొను సంసా రము." తాళ్ల. సం. 8.111.

**తలమోసల యుండు**

ముందు నిలబడి బాధ్యత వహించు.

"ముజ్జగ మేలువేల్పు తలమోసల నుండి వివాహయత్నముల్, సజ్జ మొనర్ప." వసు. 5.78.

**తల యంటు**

అభ్యంగనస్నానము చేయించు.

"పలుమఱుఁ దల యంటి తగ న్నలు గిడి..." కళా. 6.194.

**తలయంపి**

1. తలవైపు.

"కౌరవాధినాథుఁ డరిగి తలయంపి నున్నతాసనమున నుండె." భార. ఉద్యో. 1.65.

"కాలడ దలయంపిగా నిదుర గైకొన." హరి. పూ. 1.87.

2. తలగడ.

"తలయంపి ధవళనిద్రాపంభ మిడు వారు." శివ. 2.70.

"చే దలయంపిగా నవ్విభుండు దర్భ శయనుఁ డై వాసరత్రయము నియతి నుండ." భాస్క. రామా. యు. 213.

## తల యగు

కలియు.

వేంక. పంచ. 4.779.

## తలయారి

తలవరి.

సార. 3.170.

## తల యున్న కుళ్ళాయి తగిలింప వచ్చు

ఊపిరి ఉంటే ఉప్పమ్ముకొని తినవచ్చు అన్నట్లే ఉపయోగించే పలుకుబడి.

"పోవల దట్టి పావురములు లేవె, తల యున్నఁ గుళ్లాయి తగిలింపవచ్చుఁ, గలర వంబులు నీవు గలిగినఁ గలవు." సారం. ద్వి. 1.383.

## తల యూచి మెచ్చు

ఎక్కువగా మెచ్చుకొను.

"మాటి మాటికిన్, రణనము సేయ వించుఁ జతురత్వమునం దల యూఁచి మెచ్చు నా, గణపతి..." రాజగో. 1.7.

## తల యెత్తి తిరుగు

అభిమానముతో తిరుగ గలుగు.

"వనజముఖులార! నా సరివారిలోన, సిరుల మెఱయుచుఁ దల యెత్తి తిరుగ వచ్చు." కా. మా. 4.35.

"వాడు ఈ మధ్యనే నాలుగు రాళ్లు సంపాదించుకొని నలుగురిలో తల యెత్తు కొని తిరుగుతున్నాడు." వా.

"వాడు ఆ సంగతి జరిగినప్పటినుండీ తల యెత్తుకొని తిరగ లేక పోతు న్నాడు." వా.

## తల యెత్తి మెలగు

గౌరవముతో బ్రతుకు.

"ఎట్లు తల యెత్తి మెలఁగుదు నేను జెపుఁడ." భార. సౌప్తి. 1.49.

"మేటివిల్లును దివ్యాస్త్రకోటియును ధరించి మెఱయంగ నాజి వధించెఁ దండ్రి,నొకఁడు వాఁడును రూపుతో నుండ నట్టె, యెట్లు తల యెత్తి మెలఁగుదు నేను జెపుమ." భార. సౌప్తి. 1.49.

చూ. తల యెత్తి తిరుగు.

## తల యెత్తు

1. పొడసూపు.

"కఱవును, దల యెత్తఁగ నీక." సింహా. 9.99.

2. గౌరవముతో జీవించు.

"నాసరి మేదినీనాథులలోన నే, నే చందమునఁ దల యెత్తువాఁడ." వరాహ. 2.52.

"తల యెత్తుటకుఁ గల్గెఁ దనజాతి వారిలో." ప్రబంధరా. 146.

"తలిదండ్రు లెఱిఁగినఁ దల లెత్త కుందురు, రేరా లెఱింగిన నెత్తి పొడుచు." భాగ. స్కం. 10. పూ. 978.

**తలయేరు**

1. తలనొప్పి.

"తడయక విప్రుని తలయేరు దిగదు."
గా. హరి. ద్వితీ. పం. 1730.
చూ. తలనొప్పి.

2. పశువుల ఒక రోగము.

3. ముందు నడిచే నాగలి.

నేటి రూపం తలేరు.

చూ. తలయేరు పెట్టు.

**తలయేరు పెట్టు**

ఒక కాడితో ఏదైనా పని చేయిస్తున్నప్పుడు అది లాగ లేకపోతే దానికి ముందు మరొక కాడి కడతారు. దాన్ని తలయేరు అంటారు.

వాడుకలో—తలేరు.

"రాయి కదలడం లేదు. తలేరు పెట్టండి రా." వా.

**తల యేర్చు**

తలనొప్పి పెట్టు.

అనగా సరిపడ దనుట.

"తపముఁ గావించు వారిఁ, గనినఁ దల యేర్చుఁ గాదె యాఖండలునకు."
పాండు. 5.231.

ఇది వాడుకలో తలనొప్పి అనే రూపంలోనే కనబడుతుంది.

"వాడికి చదు వంటే తలనొప్పి." వా.

"వాడికి ఎవ డైనా పైకి వస్తున్నాడంటే తలనొప్పి." వా.

"నాకు పుస్తకం పట్టి చదవడ మంటే నే తలనొప్పి." వా.

చూ. తలనొప్పి.

**తలరాత**

దురదృష్టము, విధి.

"నా తలరాత యిలా ఉంది. అందుకే యిట్లా బాధ పడుతున్నాను." వా.

"వాడి తలరాతకు మన మేం చేస్తాం?" వా.

బ్రహ్మ తలమీద వాడి భవిష్యత్తును వ్రాసి పెడతా డన్న నమ్మకంపై వచ్చిన పలుకుబడి.

**తలరాయి యగు**

బాధాకర మగు.

తాళ్ల. సం. 11.3. భా. 72.

**తలరారు**

ఒప్పు.

**తల బాయి చేసికొను**

నిర్వికారముగా నుండు.

"ఈ రీతిన్ దల బాయి చేసికొని వారే మన్న మార్మాటకున్, నో రొక్కింతయు నెత్తకున్నఁ గని మందుం డీతఁ డీకష్టునిన్." హరి. 4.122.

**తలలు గట్టికొను**

విచారించు.

"తలఁకి యున్నవా రున్నచోఁ దలలు గట్టి, కొనిరి మఱి ప్రాణములు గుత్తుగుత్తనంగ." హరి. పూ. 8.219.

**తలలు మార్చు**

మోసగించు.

"వాడు ఆ ఊళ్లో తలలు మార్చి బతుకుతూ ఉంటాడు." వా.

**తలలు ముదురు**

ముదించు.

"తలలు ముడిరిన దురితదంతావళి ముల." పాండు. 3.133.

తల లూడ బాఱు

చెల్లాచెదరై పాఱు.

చెదరి పాఱినప్పుడే తల లూడి పోతాయి.

అతి సంభ్రమముతో తల వెంద్రుక లూడునట్లు పరుగెత్తు.

"నిశాచరులు...పాఱిరి...తల లూడ లంకకున్." భాస్క. యుద్ధ. 966.

"వచ్చిన తద్దిశాధిపతివర్గములుం దల లూడఁ బాఱియున్." పారి. 5.20.

"తలలు వీడంగ విద్యాధరుల్ పఱచిరి." పారి. 5.37.

తల లెత్తి చూడగా

ఏదో వింతవలె ఇతరు లందరూ తల లెత్తి చూడగా. అనగా అపహాస్యభాజనం కాగా అనుట.

"కన్నెయు వానియుం దఱిఁగి వారనునుం దల లెత్తి చూడఁగా." పారి. 1.88.

తల లేని నీడ గన్గొను

తన మరణ సూచనను చూచుకొను.

ఛాయాపురుష లక్షణ ప్రకారం తన నీడలో తల కనిపించక పోతే చావు సిద్ధమంటారు.

"తల లేని నీడ గన్గొనియొ." పండితా. ద్వితీ. మహి. పు. 59.

తల లేఁచు

శిరఃఖండనము చేయు.

"తల లేఁచి యుర్వికి బలి యొనర్తు." భార. మౌస. 1.185.

తలలో ఏం లేదు

బుద్ధిహీను డనుట.

"వాడితలలో ఏం లేదు. వా డేం చేస్తాడు ఈ లెక్కలను?" వా.

తలలో నాలుకవలె మెలగు

కలసి మెలసి ప్రవర్తించు.

"గానముల ప్రోవ వై యనుఁగుసోదరులలోఁ, దలలోని నాల్కగా మెలఁగి తీవు." ఆంధ్రప్రతిభ. 1 భా. 52 పు.

"ఆ అమ్మాయి ఆ యింట్లో తలలో నాలుకలాగా మెలగుతూ అందరిచేతా మంచి అనిపించుకొన్నది." వా.

చూ. తలలోపల నాలుక.

తలలోపల నాలుక

కలుపుగోలు మనిషి.

"తలలోపల నాలుక పూ,సలలో దారంబు పాలఁ జల్లినసీరుం, బలె రెండు యొఱుఁగక మనసులు, గలసి యభేదమునఁ గాపుకడ నతఁ డుండెన్." పాండు. 3.59.

చూ. తలలో నాలుకవలె మెలగు.

తలలో మొట్టు

తలపై కొట్టు.

శాఘి. 3.63.

తల వంచు

1. లొంగు.

"వాడు ఇతరులకు తల వంచి బతికే రకం కాదు." వా.

**తల వంచుకొని పని చేసికొని పోవు**

ఇతరుల ప్రసక్తి లేకుండా తన పని తాను చేసికొని పోవు.

"వాడు ఒకరిజోలికి రాడు. తన పనేమో! తానేమో! తల వంచుకొని పని చేసుకుంటూ పోతుంటాడు." వా.

**తలవంపులు**

అవమానము.

"అప్పాండవజ్యేష్ఠునకుఁ దలవంపు గాఁగ వచ్చుచో."

భార. ద్రోణ. 4.258.

"ఆవిడ ఆమాట అనేసరికి నాకు తల వంపు లయి పోయింది." వా.

**తలవంపులు తెచ్చు**

అవమానము తెచ్చు.

తల వంచుట అవమానసూచకముగను, తల యెత్తుకొని తిరుగుట గౌరవ ప్రాభవ సూచకముగను భావించుట పరిపాటి. దానిపై వచ్చిన పలుకుబడి.

"ఘనుఁడు నిందఁ జెంది తలవంపులు దెత్తురఁటమ్మ మానినీ!"

హంస. 1.124.

**తలవని తలంపుగా**

ముందు అనుకోకుండా.

యాదృచ్ఛికంగా.

"కలిగె మధుమక్షికమునకుఁ, దలఁపని తలఁ పన్మదాదిధార్యము గంగా, జల వతి మానను యమునల, తిలకాంఘ్రి సరోజదివ్యతీర్థము గ్రోలన్."

పాండు. 4.257.

"నేను తలవని తలంపుగా ఈ ఊరు వచ్చాను. లేకుంటే రెండు కాయగూరలు పట్టుకొని వచ్చి ఉండేవాడిని."

వా.

**తలవాకిట కాపుర ముండు**

ఎప్పుడూ ఎవరికోసమో ఎదురు చూస్తూ వాకిట నిలిచి యుండు.

తలవాకిటికి రాక పోవడం పతివ్రతా లక్షణంగానూ, తల వాకిట నిల్చుకోవడం జారస్త్రీ లక్షణంగానూ మనవారు భావించేవారు. అందు పై వచ్చిన పలుకుబడి.

"అవ్వల నిఁక మాట లేల తలవాకిటఁ గాఁపుర మయ్యె దానికిన్."

శుక. 2.103.

**తలవాకిటికి తెచ్చు**

ప్రకటము చేయు.

తాళ్ల. సం. 4.133.

**తలవాకిటి యిండ్లు**

పొరుగిండ్లు.

"వాని మద్గృహ, ద్వారము దూఱి నీక తలవాకిటి యిండ్లకుఁ బోదు నెప్పుడున్."

కేయూర. 2.67.

**తలవాకిలి**

ముఖద్వారము, ప్రధాన ద్వారము.

**తలవాకిలి యిల్లుగా నిలుచు**

ఎప్పుడూ ఇంటి గుమ్మము వద్దనే ఉండు, ఎదురు చూచు.

"ఎడ లేని నీ ప్రేమ నెపుడు వత్తువో యుంచుచుఁ, దలవాకి లిల్లుగా నిలిచి యుంటి." రాధి. 4 ఆ.

### తల వాచేటట్టు తిట్టు

చావ దిట్టు; విపరీతంగా తిట్టు.

"గాఢముగాఁ దల వాయఁ దిట్టి." పాణి. 5.62.

### తల వాలిపోవు

తూగు వచ్చు.

"తెల్లవార్లూ నిద్ర లేక తల వాలి పోతూ ఉంది." వా.

### తల విప్పుకొను

వెంట్రుకలు విప్పుకొను.

"జడ వేయ మని పొద్దున్నుంచీ తల విప్పుకొని కూర్చున్నాను." వా.

### తల విఱుచు

చంపు.

"గాండీవం బిచ్చె నరునకు ఖాండవ మునఁ, దల విఱిచెఁ గాలయవను." ఉ. హరి. 2.64.

### తలవీడు

తలవాకిలి.

"ఫలకన్యలకును వేడుకఁ, దలవీడులఁ బరులతోడి తగుమాటలకుం, దలకొనఁ దగునే..." భార. అను. 1.51.

### తలవెంట్రుక లెగగట్టు

వయసు వచ్చు.

"తలవెంట్రుక లెగఁ గట్టెడు, కాలఁ దిని నా నృపకుమారకుఁడు కడిమి మెయిన్, నలుదెసల కరులగండ,స్థల ఫలకములన్ లిఖించె జయశాసన ముల్." నైష. 1.62.

రూ. తల యొగగట్టు.

### తలవెంట్రుక వాసిలో

చాల కొద్దిలో.

"పీడు వెళ్లడం ఆ రాయి పడడం ఒకే క్షణంలో జరిగింది. తల వెంట్రుక వాసిలో తప్పిపోయింది గానీ లేకపోతే యింకే మైనా ఉందా?" వా.

### తలవెఱ్ఱి

ఉన్మాదము.

"తలవెఱ్ఱి పచరింప నేటికి సమిద్దా నంబు దానంబు." పాండు. 4.98.

### తలవ్రాతకు దప్పులు గల్గ నేర్చునే

విధిలిఖితం తప్పుతుందా?

"అ,వ్వనరుహాపత్రనేత్ర తలవ్రాఁతకుఁ దప్పులు గల్గ నేర్చునే?" శుక. 2.507.

### తల శబ్ద మిచ్చు

చప్పట్లు కొట్టు; గొంతిచ్చు. హరి. పూ. 8.46.

### తల సచ్చియును తోక సావక

ఓడిపోయిన్నీ ఒప్పుకొనక. క్రింద పడినా పై చేయి అంటూ అన్నట్టు.

"జినమును తల సచ్చియును తోక సావ కనిరి." బస. 6.154.

### తల సహస్రవక్కలగు

తల పగిలి చచ్చు.

జానపదకథలద్వారా వచ్చిన పలుకుబడి.

"నేనే పతివ్రత నైతే పీడితల సహస్ర వక్కలగు గాక." వా.

తలసాల

తలవాకిలి.

వేం. పంచ. 3.51.

తల సూపు

1. గోచర మగు.

"అగుచుఁ దేఁటికదుపు లామనిఁ దల సూపె." పారి. 3.51.

2. పొడమ.

"దానఁ దల సూపు శోకములకు."

భార. శాంతి. 1.188.

తలా ఒకటి

తల కొకటి, మనిషి కొకటి.

"అందఱకుం దలా యొకటి స్వార్థము గల్గుట." ప్రభా. 5.90.

తలా తోకా తెలీని

మంచీ చెడ్డా తెలియని.

"వాడు ఒట్టి తలా తోకా తెలీనివాడు. వాడితో ఏం పని ?" వా.

తలా తోకా లేదు

మొదలేదో తుద యేదో తెలియనంత కలగాపులగంగా ఉన్న దనుట.

"ఈ వ్యవహారం అంతా తలా తోకా లేనట్టుగా ఉంది." వా.

తలాపి

తలగడ.

రూ. తలయంపి.

తలారివాని యెదుర దాగు

ఎవరినుంచి రక్షించుకొనవలెనో వారి యెదుటే పడు. పూర్వం రక్షకభటులు తలారి వాళ్లు. నేరస్థులు వారి కనుల పడకుండా నే తప్పించుకోవాలి.

"దాఁగం బోయి తలారివాని యెదురన్ దాఁగంగ నీ కేటికిన్." ఉ. హరి. 4.92.

తలార్చుకొను

తడిసిన తల వెండ్రుకలను గాలిలో తడి యార్చుకొను.

"మేడమీద ఆవిడ తలార్చుకొంటూ నిల్చుంటే బజారులో బారులు తీరారు." వా.

తలిదండ్రుల చాటున నుండు....

పెద్దలచాటు పిల్లవా డనుట.

"తలిదండ్రుల చాటున నుండు వాఁడు..." శ్రవ. 3.82.

తలి రొత్తు

చిగురొత్తు, తలిర్చు.

"విరిమోసులఁ గందలి రొత్తి యొత్తి..." కుమా. 4.87.

తలుపు కాయు

తలవాకిట నిలుచు.

"ఆవిడ కెప్పుడూ తలుపు కాస్తుండడమే పని." వా.

తలుపు కిఱు కనకుండన్

చప్పుడు కాకుండ (దాటిపోవు.)

"ఆనాఁటిరేయి శయ్యపయి నా్న,థుని ప్రక్కనుండి తమి రేఁ,గినఁ జితిని చనియెఁ దలుపు గిఱు కనకుండన్." శుక. 2. 124.

తలుపుచాటు నిలుకడలు

దొంగ చూపులు చూచుటలు.

దారిన పోయేవాళ్లను చూడ్డానికై తలుపుచాటున నక్కి–యుండుటపై వచ్చిన పలుకుబడి.

"మొలక సిగ్గులు వట్టి కొంకులును దలుపు, చాటు నిలుకడ లలతి వేసటలు చూపు..." శుక. 3.349.

**తలుపూ ద్వారబంధం లేదు**

ఏ విధ మయిన అడ్డీ ఆగీ, చాటూ మాటూ లే దనుట.

"ఆ యింటి కేం తలుపా ద్వారబంధమా ? ఎవ డంటే వాడు వస్తూ ఉంటాడు. ఎవ డంటే వాడు పోతూ ఉంటాడు." వా.

ద్వారబంధం వాడుకలో దాలబంద్రంగా వినబడుతుంది.

**తల్లకొట్లమారి**

తలతిరుగుడు మనిషి.

"బట్ట గూర్చుతనాన పుట్టెచెం డ్లెగరీని, మఱచెనో తలకొట్లమారితనము."

తారా. 3.37.

రూ. తలకొట్లమారి.

**తల్లడ కుడుచు**

తల్లడ పడు.

**తల్లడపడు**

చలించు; ఆందోళన చెందు, బాధపడు.

**తల్లడపఱుచు**

బాధ పెట్టు; ఆందోళన పెట్టు.

**తల్లడపాటు**

ఆందోళన.

**తల్లడపెట్టు**

బాధ పెట్టు.

**తల్లడిలు**

ఆందోళన పడు.

రూ. తల్లడిల్లు.

**తల్లికి దూరమా ?**

అనురాగానికీ, వాత్సల్యానికీ దూరం అంటూ ఉంటుందా ? అనురాగ వాత్సల్యాలకు పరమావధి తల్లి కదా !

"నువ్వు ఎన్నని ఏం చేసినా, ఎంత దూరం వెళ్లినా నేను రానే వస్తాను. తల్లికి దూరమా ?" వా.

**తల్లికి నే మరలం జనియించితి**

ఒక గండం గడిచి బయట పడినప్పుడు అనుమాట.

వాడుకలో 'మా అమ్మ కడుపులో తిరిగీ పుట్టాను' అంటారు.

"విను తల్లికి నే మరలం, జనియించితి నేఁడు నీదు సల్లాపకథా, వనధిం దేలంగ..." శుక. 2.277.

**తల్లికి బిడ్డ బరువా ?**

ఎంత దరిద్రురా లయినా తల్లి బిడ్డలను బరువుగా భావించ దనుట.

"నీ విలా రాచి రంపాన పెట్టడం కంటే, ఇష్టం లేకపోతే మా యింటికి పంపించెయ్యి. తల్లికి బిడ్డ బరువా ?" వా.

**తల్లికి మొగుడు**

వాక్యోపస్కారకం.

అసాధ్యుడు, మించినవాడు అనుపట్ల ఉపయోగించే మాట. అమ్మ మొగుడని పశ్చిమాంధ్రంలో ఉపయుక్త మవుతుంది.

**తల్లికొండ్ర**

మొదటి కొండ్ర.

శ. ర.

**తల్లి చెవులు తెంచు**

మాతృద్రోహము చేయు.

మదన. శత. 10.

**తల్లితోడుగా**

తల్లితో సమానముగా.

ఆమె తల్లి తోడిది అని వాడుక.

సాక్షి అన్న అర్థంలో – తల్లి తోడు, నా తోడు.

'తల్లి తోడుగా నే నీ పని చేయ లేదు' – తల్లి సాక్షిగా అని యిక్కడ అర్థం. ఇది కాక దగ్గఱివారు అనే అర్థంలో – 'అతడే నాకు తల్లీ తోడు' 'వాడికి తల్లీ తోడూ లేదు' అంటారు.

"ఎంత యుఁ గేశవాఖ్య సంవిదిత తదీయమూర్తు లయి వేడుకకాం డ్రదితల్లితోడుగా, మది గణియించిరో..."

శుక. 2.196.

**తల్లి తోడు లేదా ?**

చూ. ఆడుతోడునను బుట్టవె.

**తల్లి పుట్టిల్లు మేనమామకు తెలియదా ?**

ఈసంగతి నాకు తెలియదా అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

తల్లి పుట్టినిల్లు మేనమామ పుట్టినిల్లు ఒకటే కనుక వానికే తెలియదా ?

"తరితీపు లిఁక నేల తల్లిపుట్టిలు మేన, మామకు దాఁగునే మచ్చెకంటి !"

చంద్రా. 6.135.

**తల్లిపై వసంతము చల్లు**

కూడనిపని చేయు.

"తల్లి, పై వసంతముఁ జల్ల వచ్చుఁ గాక."

గీర. 107.

**తల్లిబడి - కొల్లిచెట్టు**

అసలు చెట్టు ఎలాంటిదో అంటుచెట్టూ అలాంటిదే అవుతుంది. అనగా తల్లివంటిదే సంతాన మనుట.

"తల్లిబడి కొల్లిచెట్టను చుల్లసంబులు."

కాశీ. 4.96.

ఇదే అర్థాన్ని సూచిస్తూ నేటికీ ఒక సామెత ఉంది. 'తల్లి చాలు రా బొల్లిపిల్ల.'

చూ. తల్లిబడి కోల్చె ట్టగు.

**తల్లిబడికోల్చెట్టు అగు**

తల్లి చాలు రా బొల్లిపిల్ల అనుటవంటిది.

తల్లిగుణాలే పిల్లకు వస్తాయి అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"పోఁ దోలె నొ,చ్చెల చేఁ దై తఱచెందుఁ దల్లి బడికో ల్చెట్టొటయే కామహిన్." ఆము. 5.132.

**తల్లి బిడ్డ వట్టక పాఱు**

ఎవరికి వారుగా పరుగెత్తు. తల్లీ, బిడ్డా అన్నది కూడా లెక్కించకుండా అనుట.

"బరుసమూఁక తెల్ల, బిట్టు కలఁగి తల్లి బిడ్డ వట్టక పాఱె, నతని మది మహోద్భ్రాంతాకులముగ." కళా. 6.4.

**తల్లియిల్లు**

పుట్టిల్లు.

**తల్లియొఱ**

నూతికి పైన వేయు పెద్ద యొఱ.

ఆము. 2.66.

**తల్లివేరు**

కూకటివేరు; పెద్ద వేరు.

**తవన తప్పు**

హద్దు మీఱు, ఎక్కువగు.

వరాహ. 4.65.

**తవరాజము**

తఱుగని నిధి – అక్షయనిధి.

"తవరాజ మమరి ముందఱ బ్రోక యుండ, తవుడు బొక్కెడు నని తలఁచిన యట్లు." బసవ. 7.ఆ.

**తవుగోల**

ప్రత్యేకోల.

**తవుటిపాము**

ములుగుచేప. శ. ర.

**తవుడు దిని చచ్చువానికి విషము పెట్టువాడు వెఱ్ఱివాడు**

తనకు తానే చేటు తెచ్చుకొనువానికి మరొకరు కీడు తలపెట్టుట యెందుకు?

"తెలుఁగు మాలి తవుడు దిని చచ్చువానికి, విషము పెట్టువాఁడు వెఱ్ఱివాఁడు." ఉ. హరి. 4.62.

తవుడు తినేవాడు ఎలాగూ అజీర్ణంతో చస్తాడు. వాణ్ణి చంపడానికి వేరే విషం కూడా పెట్టడం ఎందుకు? అనుట.

**తవులబడు**

తగులుకొను; తాకు; అడ్డగింపబడు.

**తవులుకొను**

వలచు.

సీలా. 2.13.

**తవులుకొలుపు**

రగుల్చు.

"పావకుఁ దవులు కొలిపి." జైమి. 8.114.

**తవులుపడు**

తగులుకొను, ఇష్టపడు.

పాండు. 5.307.

**తవ్వి కట్టుకొను**

దాచుకొను, తనకై మిగుల్చుకొను; నెత్తిన వేసుకొను.

"జవ్వనము మోఁచేదియు సరి ముదుసేదే కాని, తవ్వి కట్టుకొనే దేది దాఁచే దేది." తాళ్ల. సం. 7.37.

చూ. తవ్వి తల కెత్తుకొను.

తవ్వి తల కెత్తుకొను

అనుభవించు.

"నే నిందులో తవ్వి తల కెత్తుకొనే దే ముంది? మీ మంచికే చెప్పాను. వింటే వినండి. లేదా? లేదు." వా.

చూ. త్రవ్వి తల కెత్తు.

తవ్వుకోవడం పూడ్చుకోవడంగా ఉండు

అప్పులు చేయడం తీర్చుకోవడంగా ఉన్న దనుపట్ల వాడేమాట.

క్రొత్త. 33.

తస్స గొయ్యా

ఊతపదం.

చూ. తస్స దియ్యా.

తస్స దియ్యా!

ఊతపదం.

"తస్స దియ్యా! వాడు పాడుతుంటే మూడుమైళ్లు వినబడుతుంది." వా.

చూ. తస్సగొయ్యా.

తస్సి తట్టువారు

డస్సిపోవు.

"తాకి తాకి తస్సి తట్టువారె."

క్రీడా. పు. 74.

తహతహ

ఆదుర్దా.

కాశీ. 1.112.

తహతహ పడు

ఆదుర్దా చెందు.

తహతహ పెట్టు

తొందర పెట్టు.

తహతహ పొడము

ఉత్కంఠ కలుగు.

"కనుఁగొని యిది ముని యాశ్రమ, మను తహతహ వొడమి యిచట కరిగిన నాకున్." మను. 2.20.

తహపడు

దుఃఖపడు.

"వీడు మ మ్మేమ్మె, మనునో యనుశంకచేత మది తహపడుచున్." హంస. 3.109.

తళు కెక్కు

మెఱుగెక్కు.

నరస. 5.113.

తళుకొత్తు

శోభిల్లు, తళతళ లాడు ఇత్యాద్యర్థాలలో...

"నగవు దళుకొత్తు మోమును, మగువా యాబిడకె కాక మఱి కల దటవే." హంస. 2.16.

రూ. తళ్కొత్తు.

తళుక్కు బెళుక్కులు

తళతళలు.

"...తళుక్కు బెళుక్కు లమర." రాధి. 1.64.

తళ్ళుకొను

అతిశయించు.

తళ్ళుగొట్టు

చల్లదనము కల్గించు.

తాంబూలము దయసేయు

ఒక పనిని అప్పగించు.

పూర్వం - నేటికీ కూడా - ఏదైనా పని అప్పగిస్తే తాంబూల మివ్వడం, అది పుచ్చుకుంటే అంగీకరించి నట్లని భావించడం ఉంది. పెండ్లిండ్లలో తాంబూలం పంచడం, పుచ్చుకోవడం ఇదే.

"నాకం దగినకెలసంబుఁ గంటి దీని కింతక మై కొంటిఁ దాంబూలంబు దయ సేయు మని...వలరాజు..."

కమా. 4.54.

తాంబూలముపై ఆస గొలుపు

శృంగారమునకు సుముఖునిగా జేయు.

"నాగవల్లీకాదళములకై యాస గొలుప నేని." విప్ర. 2.84.

తాంబూలము రాగవర్ధకము.

తాంబూలము వెట్టు

"మార్కండేయ పురాణోక్త ప్రకారంబునం జెప్పు మని కర్పూరతాంబూలంబు వెట్టినన్ బట్టి..."

మను. పీఠిక. 17.

చూ. తాంబూలము దయచేయు.

తాకట్టువడు

కుదువ ఉంచబడు.

తాకట్టు వెట్టు

కుదువ పెట్టు.

తాక నాడు

మనసు నొచ్చునట్లు మాట్లాడు, ఎత్తి పొడుచు.

"దంటమాటలనె నన్ను తాఁకనాడేవు వోరి." తాళ్ల. సం. 12.3.

తాకియుం దలచెడువారు లేరు

మన జోలికి వచ్చేవారు ఉండరు.

"క్రోవనె పోయితి మేని తాఁకియుం, దలఁచెడువార లే రని."

పారి. 2.52.

తాకుడువేకి

విడుస్తూ వచ్చేజ్వరం; మన్యపు జ్వరం.

బ్రౌన్.

తాకు తగులు

అడ్డంకి. జం.

"చన నిమ్ము రథం బని నను, బనుచుట యును గొంకు దేటి పఱపితిఁ దేశం, దును దాఁకు దగులు లేకయ, యనుపమ హరు లద్భుతంబు లై లీలఁ జనన్."

హరి. ఉత్త. 5.116.

తాకుదల

మార్కొనుట.

తాకుదెంచు

మార్కొను.

తాకులాడు

కొట్టుకొను.

తా కోర్చు

ప్రతిఘటింప గలుగు.

"ఓరి! మీ వంశమందుఁ దాఁ గోర్వఁ జాలు, వారిఁ జూపుము."

ఉ. హరి. 3.48.

తాగి తందనా లాడు

చిందులు తొక్కు.

"వాడు సాయంత్రం అయితే తాగి తందనా లాడుతూ ఉంటాడు. ఆ సమయంలో మనం ఎంత దూరంలో ఉంటే అంత మంచిది." వా.

చూ. తాగి తందనాలు తొక్కు.

**తాగి తందనాలు తొక్కు**

చిందులు తొక్కు.

చూ. తాగి తందనా లాడు.

**తాగిన రొమ్మును గ్రుద్దు**

ఉపకారికే అపకారము చేయు.

తిన్న యింటి వాసాలు లెక్కించువంటిది.

కొత్త. 151.

**తాచుపాము పగ**

తీరని పగ.

కొత్త. 31.

**తాజా....**

సరికొత్త.

అప్పుడప్పుడే వచ్చిన అనే అర్థంలో తాజావార్త లనీ, అంతా వ్రాసి ముగిశాక యిప్పుడే తోచి వ్రాస్తున్నది అనేఅర్థంలో తాజాకలమనీ యిటీవల అలవాటులోనికి వచ్చిన మాటలు యిందుపై యేర్పడినవే.

తాజా సరుకు అన్నప్పుడు కొత్తసరుకు అన్నమాట.

**తాజెడ్డవాడు వెనకయ్యకు చేతికి వెస లిచ్చె ననుమాట**

తాను మునిగిపోతున్నవాడు తన వెనుకవానికి చేయి అందించి సాయపడగలడా? పడలే డనుట.

"వెనకయ్య చేతికి వెస లిచ్చె ననుమాట, నిజముగా నిచ్చోట నిన్ను వంప." ఉ. హరి. 4.50.

**తాటకత్తె**

మోసకత్తె.

**తాటకావధూటి తల్లి**

దుష్టస్త్రీ విషయంలో ఉపయోగించే మాట.

"దాని నుతియింపఁ దర మానె తాటకావధూటి తల్లియొ?" శుక. 3.19.

**తాటదమ్మడు**

సన్యాసవేషధారి.

**తాటనపుచ్చు**

శబ్దింప జేయు.

బస. 3.74.

**తాట లొలిచి యారెదండలు వేయించు**

దండించు.

చర్మం ఒలిచి డోలు కడ తాను వగ్గె రాలవంటిది.

"తాట లొలిచి యారెదండలు వేయించి." నాయక. 136.

**తాటాకుచక్రాలు**

ఒక బాలక్రీడ.

తాటాకుల చప్పుళ్లకు కుందేళ్లు భయపడునా ?

చూ.........దయ్యములు వెఱచునా ?

తాటాకుల చప్పుళ్లకు దయ్యములు వెఱచునా ?

వట్టి డంబాలతో, బెదిరింపులతో ఏ మవుతుంది అనుట.

"బలువిడి నది ఘీంకారం, బులు సేయుచు వచ్చి కవియ భూపతి తాటా, కుల చప్పుళ్లకు దయ్యం,బులు వెఱచునె వత్తుఁ గాక పొలియఁగ ననుచున్." వరా. 3.55.

చూ. తాటాకుల చప్పుళ్లకు కుందేళ్లు భయపడునా ?

తాటాకులు కట్టు

1. ముగించు, కట్టిపెట్టు.

"అప్పుడే తాటాకులు కట్టక కొంచెం నిదానించు." చింతా. 5.56.

2. ఎగతాళి చేయు.

అపహాస్యము పట్టించు.

"వా డేదో వెఱ్ఱిబాగులవా డని వీళ్లంతా తాటాకులు కడుతున్నారు." వా.

తాటి కట్టెడ

తాటిగిఱి పాము.

శ. ర.

తాటిగిఱి పాము

తాటి చెట్టు మీద ఉండే పాము.

తాటిచెట్టుక్రింద పాలు త్రాగినా ఉన్నతావు చెడ్డ దైనప్పుడు మంచిగా ఉన్నా చెడ్డపేరు వచ్చు ననుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నీ వెంత మంచివాడ వయితే నేం ? వాళ్లతో చేరుతున్నంత కాలం చెడ్డ పేరు తప్పదు. తాటిచెట్టుకింద ఉండి పాలు తాగినా కల్లే అని అంటారు." వా.

తాటిచెట్లాట

ఒక పిల్లల ఆట.

తాటిదండము

మల్లసాధనములలో ఒకటి.

తాటిపోతగా

అధికంగా.

"రెండు రోజులమట్టీ మా ఊళ్లో తాటి పోతగా వర్షం కురుస్తూ ఉంది. ఇంకా వెలియ లేదు." వా.

చూ. కుండపోతగా.

తాటిబెల్లము

తాటి పాలు వండి చేసే బెల్లము.

తాటిమాని నీడ

లేనిది; అతి స్వల్ప మైనది.

తాళ్ల. సం. 7.34.

తాటియాకుల చిలకలు

ఒక పిల్లల ఆట.

తాటిరిక్క

జ్యేష్ఠానక్షత్రము.

బ్రౌన్.

తాటిరిక్క నెల
జ్యేష్ఠమాసం.
బ్రౌన్.

తాటిల్లు
తాటిఆకు కప్పిన యిల్లు.
వాల్మీకి. 2.103.

తాటోటులు
మోసము; టక్కుటమార
ములు.

తా డిడి ఫలము గొనుట
చేసినపనికి ఎన్నడో ఫలిత
మనుభవించుట.
అనగా సద్యఃఫలదము కా
దనుట.

"అన్యదైవవితతి నర్చించుకోలుపు తా, డిడి ఫలంబు గొనుట పడయఁ గనెడి, సద్య మిష్టఫలదు జంగమమల్లికార్జుని కొలుపు మొసరు మునుఁగఁ గొనుట." కుమార. 1.12.

తాడి తన్నువాని తల తన్నువా
డుండును
ఎంత అధికున కైనా తన
కంటే అధికుడు తప్పకుండా
మరొకడు ఉంటాడు.
తానే పరమావధి అను
కొనుటకు వీలు లేదనుపట్ల
ఉపయోగించే పలుకుబడి.

"కడుఁ బ్రావీణ్యధురీణుఁ డీతఁ డయి నన్ గాంధర్వసంపూర్తి నె, ల్లెడఁ బ్రఖ్యాతి వహించు నాకు నకటా! యీ తుంబురుం డంత యొక్కడు గాఁ గానము నేటిదాఁక నని సంక్షోభించు చున్ దాడిఁ ద,న్నెడువానిం దల దన్ను వాఁడు గలఁ డన్వేషింప నం చెంచితిన్." కళా. 2.87.

తాడు గట్టినవాడు
వివాహ మాడినవాడు.

"తాడు గట్టినవాడు సరిగా ఉంటే ఒకతిని అనుకోవలసిన పనే ముంది?" వా.

తాడు గట్టు
వివాహ మాడు.

తాడు తెగు
1. విధవ యగు.

"తాళ్లు తెగి రావణాది శాత్రవుల యాండ్ర, తాళ్లు తెగు నిట్ల యనెడు చందమున." రామా. 5.

2. బాధ కలుగు.

"వాడితో వేగ లేక నా తాడు తెగుతూ ఉంది." వా.

తాడు త్రెంచు
కష్టపెట్టు.

తాడు పడు
బంధిత మగు.

"తాడు పడ్డ మనసుకు దైవము విష్ణుఁడే యని, పాడి కొలిచిరి తొల్లి బ్రహ్మాదులు." తాళ్ల. సం. 9.280.

తాడూ పేడూ లేనివాడు
ఏమీ లేనివాడు.

"వాడి కేం? ఏమైనా చేస్తాడు. తాడూ పేడూ లేనివాడు." వా.

వాడికి తాడూ లేదు పేడూ
లేదు అని కూడా యీ
పలుకుబడిని ఉపయోగిస్తారు.

**తాడో పేడో తేల్చు**

అటో యిటో పరిష్కరించు.

"ఈ వ్యవహారం యీ రోజు తాడో పేడో తేల్చుకొని కానీ యిక్కడ నుండి నేను కదల దలచుకో లేదు." వా.

**తాణె ముండు**

రక్షకముగా ఉండు.

**తాణెము సేయు**

రక్షించు.

**తాతకు దగ్గులు నేర్పు**

అనుభవజ్ఞునిదగ్గర అనుభవం లేనివాడు తోక ఆడించు.

"భాష్యాంతం వ్యాకరణం చదువుకొన్నవాడిదగ్గరికి పోయి కావ్యాలైనా చదువుకోని నీవు ప్రత్యయాలూ, ధాతువులూ అంటా వేమిటి? తాతకు దగ్గులు నేర్పినట్లు?" వా.

**తాతల్ గట్టిన చెర్వులు**

తాము పర్యవేక్షణ చేయవలసినవి, వాని బాగోగులకు బాధ్యత వహింపవలసినవి.

"తాత ల్గట్టినచెర్వులే శ్రుతులు." శివ. 3.7.

వేదా లన్నీ మన పెద్దలు సంపాదించిన ఆస్తా? వాని సంగతిని నేనే యెందుకు చూచుకోవాలి అన్న అర్థం యిక్కడ ప్రస్తుతము.

**తాతల తరమునాటి ప్రాత పంచారము**

పాతకాలమునాటిది.

"లీలఁ గంగేలఁ గీలించి లే నగవుతో, ధరణీశ ! తాతల తరమునాఁటి, ప్రాఁత పంచారంబు పస లేదు పేడెత్తె, నిది వృధా స్థూల మిం దేది బలము." దశ. రామ. 233 పు.

**తాతలనాటినుండి**

తరతరాలుగా.

"తాతల నాఁటి నుండి కృతినాథులు మాదుకులీను లందఱున్." శ్రవ. 1.25.

**తాత్పర్యము**

తదాసక్తమనస్కత.

అనగా భక్తిశ్రద్ధలు.

"బాలసఖు గారవించి తాత్పర్య మొప్ప." పార. పీఠిక. 8.

2. భావము.

**తాన తానగు**

తనకు తా నయి యుండు.

స్వయంప్రేరితు డగు.

"అంత నిట తా న తా నగునబ్జభవుఁడు." శివ. 1.68.

**తా ననంగ వా డనంగా నెమ్మది వేఱు లేక**

అభేదభావముతో.

వాడుకలో తా నొకటి నే నొకటీనా అంటారు.

"అది మొదలుగ నాతనిచే, వదలక మఱి తా ననంగ వాఁ డనఁగా నె,మ్మది వేఱు లేక..." శుక. 2.483.

**తానా అంటే తందానా అను**

వంతపాట పాడు, తాళము వేయు.

బుర్రకథల్లో ప్రతీమాటకూ వంత పాడేవారు తందానా అంటారు. దానిపై వచ్చిన పలుకుబడి.

"మేనేజరుదగ్గర యీ గుమాస్తా చేసే పనేమిటి? తానా అంటే తందానా అనడం తప్పితే." వా.

**తాను కానట్లు**

తన్ను తాను మఱచిపోయి నట్లు, మైమఱచినట్లు.

"అధిపు చెయ్వుల మెయివడి, నడరఁ దాను గానియదియపోలెఁ, దరుణి నెమ్మ నమునఁ దమకంబు లజ్జయు, నలఁతి కగ్గ లింప నాఁక గొనక." కుమా. 9.147.

**తాను పెట్టినదే భిక్ష**

తనపైనే యిదంతా ఆధార పడి ఉంది అనుపట్లనూ, అదే అర్థంలో ఎత్తిపొడుపుగానూ కూడా ఉపయుక్త మయ్యే పలుకుబడి.

"పాణిని అంటే సామాన్యుడా? వ్యాకరణంలో తాను పెట్టిందే భిక్ష." వా.

"వీడీమధ్య యీ ఊళ్లో తాను పెట్టిందే భిక్ష అన్నట్లుగా వ్యవహరిస్తున్నాడు." వా.

**తా నెంత తన....**

తన కీ పెద్దపోకడ లెందుకు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

'తన' తర్వాత ఆయా సంద ర్భాలను బట్టి చదు వెంత, డబ్బెంత యిలా అనడం జరుగుతుంది.

"తా నెంత తన చదు వెంత? వీడు బ్రహ్మసూత్రానికి భాష్యం రాస్తాడా?" వా.

"తా నెంత? తనడబ్బెంత? వీడు నాతో పోటీకి వస్తాడా?" వా.

**తా నేమిటివాడు**

తా నెవడు?

అతనికి అలాంటి అధికారము లే దనుపట్ల తా నెవడు, వీ డెవడు, వా డెవడు అని ఉప యోగిస్తారు.

"తా నేమిటివాఁడు నీదు తనయునిఁ జంపన్." హర. 2.100.

"నా కూతుర్ని నా యిష్టం వచ్చినవాడికి యిచ్చుకుంటాను. వా డెవడు? వద్దని చెప్పడానికి." వా.

"నా ఆస్తి నా యిష్టం వచ్చినట్లు చేసుకుంటాను. తా నెవడు? అది చేయవద్దు, ఇది చేయవద్దు అనడానికి." వా.

**తాపిక త్తె**

తాఁర్పుడు చేయునది.

"ఇలు గల నైన వెల్వడని యీలువు టాంద్రకుఁ దాపికత్తె వై, యులు కడ లించి." ఆము. 5.70

రూ. తాపికత్తియ.

**తాపికాడు**

తాఁర్పుడుకాడు.

తాపి చేయు

తార్చు.

బ్రౌన్.

తాపిచోటు

సంకేతస్థలము.

"చీర చాకింటఁ జెచ్చెద నంచుఁ జని చేరఁ, దరుణపల్లవుఁ డున్న తాపి చోట." శుక. 2.368.

తాపియిల్లు

సంకేతగృహం.

తాబేదారు

క్రింది ఉద్యోగి.

తాబేలునడక

చూ. తాబేలుపరుగు.

తాబేలుపరుగు

నెమ్మదినడక.

వ్యంగ్యంగా అనుమాట.

తాబేలు అతి నెమ్మదిగా నడుస్తుంది. అది పరుగెత్తినా అంతంతే.

చూ. తాబేలునడక.

తామరతంపము

చూ. తామరతంపర.

తామరతంపర

పరంపరాభివృద్ధిగా నభివృద్ధి చెందునది.

"మధురాపురంబు నాకాణయాచి కాఁపురంబు, తామరతంపర మదీయ గృహంబు." శుక. 3.187.

తామరపాకు నీటివలె....

గిజగిజలాడు, చలించు.

"నీ, ప్రజ తామరపాకు నీటిభంగిఁ దలంకెన్." భార. ద్రోణ. 4.309.

చూ. తామరపాకు నీరువలె...

తామరపాకు నీరువలె తల్లడమందు

గిజగిజ లాడు.

"చప్పుడు మిన్ను ముట్టినఁ, దామర పాకు నీరువలెఁ దల్లడ మందిరి పౌరులందఱున్." ఉ. హరి. 3.35.

తామరా కగు

సుకుమార మగు.

"ఆకడఁ దామరాకైనందుకు నెగడ వెట్టి, వాకిటఁ దన్ను నాగినా వగపు పోదు." తాళ్ల. సం. 3.580.

తామసమహోత్సవం

జాతర.

కాశీయా. 123.

తాయము పెట్టు

పిల్లలకు ఏదయినా తిను బండము పెట్టు.

తారకమంత్రం

తరణోపాయం.

"మన కీనాడు సర్వసౌఖ్యసంపాదనే తారకమంత్రం." వా.

తారాజువ్వలాంటి

మిక్కిలి చురుకయిన.

రివ్వున ఎగిరిపోవు ననుట.

"వాడా తారాజువ్వలాంటి మనిషి. పైకి దూసుకొని పోతాడు." వా.

**తారాడు**

కనబడనివాటికై వెదకు.

"తప్పు లంచుఁ దారాడుచు నుంద్రు." రాధా. i.14.

**తారాతికిడీ చేయు**

టక్కుటమారము చేయు.

"ఎన్ని తారాతికిడీలు చేయక పోతే యింత ఆస్తి సంపాదిస్తాడు ?" వా.

**తార్కాణ చేయు**

దృష్టాంతము చూపు.

"...దార్కాణ సేసె రెండును నిజంబు." కళా. 3.220.

**తార్కొను**

తాకు, మార్కొను ఇత్యాది భావచ్ఛాయలలో.

**తాఱుమాఱుపడు**

వ్యత్యస్త మగు.

**తాలబోయు**

పొగచు, తాళింపు వేయు. హర. 2.121.

**తాలి మిడు**

క్షమించు. సా. 2.28.

**తాల్మిఁటి**

ఆయుధవిశేషం. వావిళ్ల. ని.

**తాల్మి తూలు**

స్థైర్యమును కోలుపోవు.

"తన సౌందర్యముఁ జూచి కామశర సంతాపంబునుం బొందకుం, డిన కాంతా మణిఁ దాల్మి దూలని వధూటిం... గానము." కా. మా. 1.32.

**తావకాళ్లు**

ఏత మెత్తువాడు కాళ్లుంచు కునే పట్టెలు. బ్రౌన్.

**తావ గొను**

స్థిరత్వము నొందు, తాలిమి గొను. కుమా. 5.44.

**తావి బుగులుకొను**

వాసన గుబాళించు.

"తావి బుగులుకొనంగఁ దొడఁగ ఘృతాచి తాఁచితె యీ యశోకము." పారి, 4.16.

**తావుకొన జేయు**

నెలకొన జేయు.

"తాల్యమున్, జెందక యుండఁ దావు కొనఁ జేసెను నన్నని లక్ష్మి సంపదల్, గ్రందుకొనంగ..." రాజగో. 1.6.

**తావుకొను**

నెలకొను.

**తాళ మంటినట్లు**

తాళం కొట్టినట్లు.

"తాళ మంటినట్లు శ్రీ వేంకటేశుఁడు దగ్గరి నన్నుం గూడెను." తాళ్ల. సం. 3.531.

**తాళము పట్టు**

అపహసించు.

తాళము పట్టించు అనే రూపంలో నేడు వినవస్తుంది.

"కాస్త సందు దొరికితే తాళం పట్టింతా మని పండితు లంతా కూర్చు న్నారు." వా

"పగవారు దానిఁ బట్టి తేని తాళము పట్ట వెరవు కనిపెట్టెదరు." తె. జా.

తాళముల్ వెట్టు
తాళాలు కొట్టు.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 305.

తాళము వేయు
చెప్పిన దంతా సరి అను.
"వా డేం వెధవపనులు చేసినా వీడు తాళం వేస్తూ ఉంటాడు." వా.

తాళవట్టియ
వీణెలో తాళము వేసేందుకు అమర్చిన తీగ.
బస. 3.972 పం.

తాళాధ్యాయము
అపహాస్యము; చప్పట్లు చఱచుట.
"వీడు గంటలకొలదీ ఉపన్యాసం లంకించుకొనేసరికి సభ్యులు తాళాధ్యాయం ప్రారంభించారు." వా.

తాళించు పాసికల పోలిక
ఒకరిమీద ఒకరు క్రిందు మీదుగా పడు.
"మసకంబునం బెనంగుపాముల పగిదిం దాళించుపాసికలపోలిక."
ఉ. హరి. 3.64.
వేయుటకు ముందు చేతిలో గిలకరించు పాచికలవలె అనుట.

తాళి గట్టిన
పెండ్లాడిన.
"ఎంతయినా తాళి గట్టినవాడు. ఇప్పుడు కాకపోతే రేపయినా నీ వతని దగ్గరికి పోవలసిందే." వా.

తాళిగోణము
పైని పతకము కట్టిన గోచి.

తాళిగోణాము
చూ. తాళిగోణము.

తాళిబొట్టు
మంగళసూత్రము.
విజయ. 3.93.

తాళుకొను
ఆగు; సహించు.

తాళువారము
వసారా, పంచాది.

తాళ్లపాములు
ఒక పిల్లలఆట.

తిండాడు
బలహీన మగు.
సుద. 2.127.

తిండికత్తె
తిండిపోతు.

తిండికాడు
తిండిపోతు.

తిండికీ బట్టకూ ఉంది
కాస్త ఉన్నవా డనుట.
"పెద్ద ఆస్తిపరుడు కాక పోయినా ఏదో యింత తిండికీ బట్టకూ ఉంది. పది మందిలో మంచి అనిపించుకున్నాడు." వా.

తిండికీ బట్టకూ లేదు
దరిద్రు డనుట.
"తిండికీ బట్టకూ లేనివాడికి పిల్ల నిచ్చి ఏం కట్టుకుంటారు?" వా.

"వాడికి తిండికీ బట్టకూ లేదు. ఇక పెండ్లి ఎందుకోయి?" వా.

తిండికై ఇల్లిల్లు తిరుగు
అందరినీ యాచించు.
"తిండికై యిల్లిల్లు దిరుగ నీయక." శ్రవ. 1.7.

తిండిరంధి
తిండిమీద లోకం.
నా. మా. 25.

తికమక గుడుచు
తికమకపడు.

తికమక గొను
తికమకపడు.

తికమకపడు
కలత చెందు.

తికమక లాడు
తికమక పడు.

తికమకలు సేయు
కలత పెట్టు.

తిక్కగొను
వెఱ్ఱెత్తు.

తిక్కటముక్కట
కలత.
శ. ర.

తిక్క పట్టు
వెఱ్ఱెత్తు.
"ప్రజలార ! మీ కేల తిక్క పట్టె." శుక. 3.64.

తిక్క పట్టెనా ?
ఇదేమి టీవెఱ్ఱిపని అనేపట్టుల ఉపయోగించే పలుకుబడి.
"నీ కేమి తిక్క పట్టిందా? అలాంటి పని చేస్తున్నావు?" వా.
"నీ కేమి వెఱ్ఱెత్తిం దేమిటీ?" వా.
"నీ కేమి పిచ్చి యెత్తిందా?" వా.
"గోపురముమీఁద ధూర్తచకోరకీర, మెక్కి ప్రజలార! మీ కేల తిక్క పట్టె." శుక. 3.64.

తిక్కమేళం
వెఱ్ఱిబాగులతనం.
మాటా. 59.

తిక్కశంకరయ్య
వెఱ్ఱిబాగులవాడు.
"వాడు ఒట్టి తిక్క శంకరయ్య. ఆవిడ చావు ఆవిడకే తెలుసు." వా.

తిట్టాట
కొట్లాట.
విజ్ఞా. వ్యవ. 103.

తిట్టిన మెట్టిన కైవడి
దూషిస్తున్నప్పటికీ భూషిస్తున్నట్టే భావించినట్లు.
"తిట్టిన మెట్టిన కైవడి, నెట్టిం గని పాడిచినట్లు చేకూడ మఱిన్." శుక. 1.528.

తిట్టిపోయు
తిట్టు.
"తల్లియును నన్న కుటుంబము దిట్టి పోయఁగ." పాణి. 2.22.
గుంటూ. ఉత్త. 116.

తిట్టిపోవు
తిట్టు.
"పోవఁ జూచినఁ దిట్టిపోదు రి దేల వా, దాడఁజాల మటంచు నాస గొలిపి." శుక. 4.7.
'ఏడ్చి పోవు' లోని పోవు వంటిదే ఇందులోని పోవు.

తిట్టుపడు
శాపము పొందు.
"కొట్టువడి యటకు మునుపే, తిట్టుంబడి యేడ్చు నాదుదెసఁ గని మదిలో." మను. 4.86.
రూ. తిట్టువడు.

తిట్టులుపడు
నిందింపబడు.
"జగము, చేతఁ దిట్టులు వడునట్లు చేసి పోయి, తేల?" భార. ఉద్యో. 1.131.

తిట్టువాటు
నింద.

తిట్లు
దూషణలు.
హంస. 5.113.

తిట్లు తిను
చీవాట్లు తిను.

తిత్తికాడు
శ్రుతికై తిత్తి ఊదువాడు.
శ. ర.

తిత్తి యొల్చు
చర్మము తీసివేయు.
ఒక తిట్టు.
"దిగ ద్రింగుదునో పట్టి తిత్తి యొల్చుదునో." వర. రా. సుం. పు. 82. పం. 18.
చూ. తిత్తోల్చు.

తిత్తోల్చు
చండా లూడగొట్టు.
చావ దన్ను.
"శరభరూపముఁ దాల్చి నరసింహుఁ ద్రుంచి, హరుడు దిత్తోల్చిన యది సదువండు." బస. 7.190.
చూ. తిత్తి యొల్చు.

తిద్దుకొను
తీర్చుకొను.
"కొమ్మ నిట మున్నె తాఁ దిద్దుకొనక యున్నె." రాధి. 1.117.

తినడాని కుందా?
వాని కేమయినా జరుగు బాటు ఉన్నదా అనుపట్ల ఉపయోగిస్తారు.
"రూపం, గుణం, చదువు అదంతా సరే. ఏమయినా తినడాని కుందా? అది చూడాలి." వా.

తిని ఉండబట్ట లేక
అనవసరముగా.
"తిని ఉండబట్ట లేక నీవు వాళ్ల వ్యవహారంలో వేలు పెట్టావా? అనుభవించు." వా.

తిని కుడిచి తిమ్మణ్ణి పాడు
అనవసరంగా ప్రమేయము లేనిదానిలో కల్పించుకొను.
"తిని కుడిచి తిమ్మణ్ణి పాడెనని కలిగింది తిని కదలకుండా ఉండకుండా

వారిసంగతి నీ నెత్తిని ఎందుకు వేసు కున్నావు?"	వా.

## తిని జా లరిగించుకొను

ఏమి తిన్నా హరాయించుకో గల శక్తి ఉన్నది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

రాళ్లు తిని రాళ్లరిగించుకొం టాడు అనే రూపంలో నేడు వినవస్తుంది.

"దరిద్రపు జనంబు లాఁకటం దిని జాలు నఱిగించుకొందురు."

భార. శాంతి. 1.216.

## తిను

తనది కానిదానిని అపహ రించు.

"కాన నొంటిగాఁడే యధికారి గావ లయు, నించుక తిన్నను వాఁడె రూపఱున్."

ఆము. 4.218.

"వాడు ఆ దేవాలయం సొత్తంతా తినేశాడు."	వా.

## తిన్నయింటి వాసాలు లెక్క పెట్టు

ఉపకారికి ద్రోహము చేయు.

రూ. ఇంట గుడిచి ఇంటి వాసాలు లెక్కించు.

## తిన్నవాడే వాచినవాడు

తిండికి లేనివా డలా ఉండగా ఉన్నవాడు మరింత ఆశపడు పట్ల ఉపయోగించే పలుకు బడి.

"బంజరు లన్నీ ఆక్రమించుకొన్నా వాడికి ఆశ తీరలేదు. తిన్నవాడే వాచిన వాడు."	వా.

## తిన్నాళ్ళ తిప్పలు పట్టు

దిక్కులు పట్టు.

"వాలి ముల్లోకముల నేలు వాసవుండు, నీ తురంగమధాటికి నిలువ లేక, పాఱి తిన్నాళ్ళ తిప్పలు పట్టినాఁడు, కూరుఁ డవు నీవ దుర్జయక్షోణిపాల."

వరా. 3.65.

## తిప్పకాయ

శుంఠ; ఆకతాయి.

ద్వి. పరమ. 3.247.

## తిప్పరలగాటము వేయు

పిల్లిమొగ్గలు వేయు.

## తిప్పలుగొను

ప్రోగుపడు.

హరి. పూ. 6.5.

## తిప్పలు పడు

కష్టపడు.

## తిప్పలు పెట్టు

కష్టపెట్టు.

## తిప్పలు వట్టు

కొండలు పట్టు.

"...ఎవ్వఁ, డేని సప్తాంగములు నీకు నిచ్చి చెట్టు, వట్టి పెన్రాల తిప్పలు వట్టి తిరుగు."	ఆము. 3.24.

## తిప్పుదీరు లాడు

తీర్చి దిద్దు.

"రెండు తునుకలు గూడినవాని తిప్పు దీరు లాడే దేవుడు."

తాళ్ల. సం. 11.3 భా. 45.

తిమితిమి యని
ధ్వన్యనుకరణము.
"తిమితిమి యని ముసురపట్టె."
ద్వాద. 3.97.

తిమిరిమీను
ఒకరకం చేప.

తిముదుకొను
పెనగులాడి పట్టు వదిలించు కొను.
బ్రౌన్.

తిమ్మదియ్యము
విపరీత కామం.

తిమ్మవడు
స్వాస్థపడు.
రామా. 8.44.

తిమ్మిని బమ్మి చేయు
తలలు మార్చు.
"వాడు తిమ్మిని బమ్మి చేస్తాడు. బమ్మిని తిమ్మి చేస్తాడు." వా.

తిమ్మి రెత్తు
రక్తప్రసార మాగిపోయి ఏ దైనా కాలునో చేతినో ఒకే భంగిమలో ఉంచినప్పుడు మ్రాన్పడి పోవు.
"తివిరి యంగమ్మునఁ దిమ్మి రెత్తక మున్న." కా. మా. 3.177.
దీనినే రాయలసీమలో జోము పట్టినది అంటారు.

తియ్య....
తియ్యదానిమ్మ, తియ్యనిమ్మ, తియ్యమామిడి ఇత్యాదులలో ఒక రకాన్ని సూచిస్తుంది.

తియ్యగూర
పులుసు వేయక వండినకూర.

తియ్యనినోటితో చేదు మేయు
ముందు మంచితనము కన బఱచి తరువాత చెడుగా మాఱు.
"...తొలుత మదీయవచనంబులు విని యిట్టి సైరణ వహించి తుదిముట్ట నడపక విడిచి పెట్టుట నీ యట్టి గట్టి దొరకు నుచితంబే తియ్యని నోరం జేదు మేయుట న్యాయంబు గాదు."
ప్రభా. 1.90.

తియ్యని మాటలాడు
మనసులో ఆదరం లేక పోయినా పైకి మంచిగా మాటలాడు సందర్భంలోనే దీనిని ఉపయోగిస్తారు.
"పూఁట కొప్పించి తీయనిమాట లాడి, రాయి గరఁగించుచును నప్పురమున వారలు..." శుక. 2.502.

తిరపడు
స్థిరపడు.

తిరముకొను
స్థిరపడు.

తిరముకొలుపు
స్థిరపఱుచు.

తిరము చేసికొను
దృఢము చేసుకొను.

"తన మది దిరంబు సేసికొని."

భాగ. స్క. 1.135.

తిరముపడు

స్థిరపడు.

తిరికట్టు

మెలికలు తిరుగు.

తిరికట్టుకొను

ఎండిపోవు.

"కలివె గంధపుబొట్టు, తిరికట్టుకొని మోము దిరిగి యుండ." క్రీడా. పు. 72.

"నాలుక తిరికట్టుకొని పోయింది. కాస్త మజ్జిగ యివ్వండి." వా.

తిరిగట్టు

జడవడు.

శృం. శకుం. 2.30.

తిరిగి తిరిగి చూచు

వెనుకకు మరలి మరలి చూచు.

మనసు వెనుకకు లాగు చుండగా అనుట.

"త్వరితగతిం దన యింటికిఁ, దిరిగి తిరిగి చూచుకొనుచుఁ దెలివయుఁ జనె."

హంస. 3.229.

తిరిగి వచ్చు

ప్రదక్షిణము చేయు.

తిరితీపు లాడు

వివాదపడు.

"ఇట్టి వారును దాను దిరితీపు లాడు."

గౌ. హరి. ద్వితీ. పం. 482.

తిరిపంబు మనువుగా

ఉచితంగా దొరకే భర్తలుగా, కేవలం ఎవరు పిల్చినా వెళ్ళే కాముకులుగా, ఆంబోతులుగా...

"తిరిపంబు మనువుగాఁ దిరియు బోడలను, వ్యక్తిగా విను..."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 115.

తిరిపగాడు

బిచ్చగాడు.

వేమన.

తిరిపగూడ

భిక్షాపాత్ర.

తిరిపగొట్టు

బిక్షుగాడు.

తిరిపజోగి

బిక్షుగాడు.

తిరిపతిండి

తిరిపెపుతిండి తినువాడు.

పండితా. ప్రథ. పురా. పుట. 383.

తిరిప మెత్తు

అడుక్కొను.

తిరిబెట్టు

పురిపెట్టు, అన్యాయకార్యములకు ప్రోత్సహించు.

"చేరి విలపనము దదయు నార్తిం జేయంగ, నునికి వనట తిరిఁ బెట్టన్."

భార. స్త్రీ. 2.50.

రూ. తిరివెట్టు.

తిరుకట్టె

పవిత్రస్థలా లూడ్చే పొరక, చీపురు.

తిరుకణీమధు
పాయసము.
వైజ. 2.115.

తిరుకాపు
దేవాలయం తలుపు.

తిరుకోళము
పుష్కరిణి.

తిరుకోళములోన పడిన క్రోతియును బోలె
కొలనులో పడ్డ కోతివలె.
తిరుకోళము = పుష్కరిణి.
(తమి) దేవాలయము ముందు ఉన్న కొలను.
"తిరుకోళములోనఁ బడిన క్రోఁతియును బోలె, వడఁకు కొంచును సెడుట సెవ్వారిఁ గన్న." శుక. 3.30.

తిరుక్షవర మగు
పూర్తిగా నష్టపడు.
"వస్తుం దని గుఱ్ఱపుపందాలలో చాలా డబ్బు పెట్టాడు. తిరుక్షవర మైంది." వా.

తిరుగండ్లకరణి తిరుగు
గిరగిర తిరుగు.
"తొండంబు లెత్తి తిరుగండ్లకరణి నాడువడిఁ దిరుగుచు." కళా. 8.112.

తిరుగడ
మరపెట్టిన గొట్టము.

తిరుగబడు
ఎదురు తిరుగు.
"తిరుగఁబడినను విడువఁ జా దేవసభకుఁ, బద మనుచుఁ దానిఁ గూడి పోఁ గదలుటయును. కళా. 3.288.

తిరుగ బాఱు
మఱలు.
"తిరుగం బాఱదు చిత్తవృత్తి." భాగ. స్క. 1.72.

తిరుగబోత
తాలింపు.
రా. వి. 2.101.

తిరుగబోయు
1. తాలించు.
శ. ర.
2. ఒక సంచిలోని ధాన్యమును మరొకదానిలో పోయు.

తిరుగలి
1. పిండి విసిరే రాయి.
2. భ్రాంతి, భ్రమ.
భో. 5.59.

తిరుగవేయు
తిప్పు; వ్యత్యస్తము చేయు.
వరాహ. 10.40.

తిరుగాడు
1. సంచరించు.
జై. 8.125.
2. గిరగిర తిరుగు.
హర. 7.46.

తిరుగు
1. దారికి వచ్చు, మాట విను.

"నీ వొక్క మాట చెప్తే ఆ మనిషి తిరుగుతా డని నాకు నమ్మకం ఉంది." వా.

2. తప్పు, ఉల్లంఘించు.

మాట తిరుగు అని ఒకటిగా ఉన్న తావుననే...

"మాటఁ దిరుగ లేరు మానధనులు." భాగ. స్కం. 8.599.

**తిరుగుడు**

1. దేశాటనము.

"తన తిరుగుడు సర్వజనహితం బై సెగ డెన్." సింహా. 10.160.

2. మెలిక; వ్యత్యాసము.

"అందులో ఒక తిరుగుడు ఉన్నది." వా.

3. ఒక రకమైన పనిముట్టు. బ్రౌణ్.

4. నడనడి.

"వాడీ మధ్య చెడుతిరుగుళ్ల కలవాటు పడి పూర్తిగా చెడిపోయినాడు." వా.

**తిరుగుడు కొను**

తిరుగు.

**తిరుగుడు కొలుపు**

తిరుగునట్లు చేయు.

బస. 3.485.

**తిరుగుడు చీల**

తిరుగుడు నొక్కులుగల చీల.

శ. ర.

**తిరుగుడు త్రాడు**

పక్షులను పట్టే ఒక సాధనం.

ద్వి. నల. 3.319.

**తిరుగుడు నొక్కు**

తిరుగుడు మర.

శ. ర.

**తిరుగుడుపడు**

1. కలత చెందు.

చిత్రభా. పీఠి. 1.62.

2. గిరగిర తిరుగు.

"మందరాచలంబు దిర్దిరఁ దిరుగుడు పడి." వీర. 3.211.

**తిరుగుడుపాటు**

కలత, క్షోభము.

నిర్వ. 3.2.

**తిరుగుడుపెట్టు**

బాధించు.

పరమ. 3.222 పం.

**తిరుగుడుబిల్ల**

స్త్రీలు ధరించే ఒక రకమైన నగ.

శ. ర.

**తిరుగుడు బిళ్లలు**

త్రిప్పుళ్లు.

ఒక రకమైన పిల్లలు ఆడే ఆట.

హంస. 3.146.

**తిరుగుడు రాయి**

గిర్రు మని తిరుగుతూ పోయి తగిలేరాయి.

కువల. 3.19.

**తిరుగుడువడు**

1. కలత పొందు.

2. గిరగిర తిరుగు.

హర. 6.95.

3. స్ఖలిత మగు, జారు.

"అరయఁగ సంస్పర్శము నన, తిరుగుడు వడు శుక్ల మనుట తెలఁగే."

భార. శాంతి. 4.306.

తిరుగుదల

నివర్తనము.

"ఆవిడ జబ్బు ఇక తిరుగుదలలోకి వచ్చినట్టే."

వా.

తిరుగుపడు

కలత చెందు.

విష్ణు. నా. 4.6.

తిరుగుబేరము

లావాదేవీలు.

"బీరము లెట్టివో తిరుగు బేరము లెట్టివో?"

గుంటూ. ఉత్త. 28.

తిరుగుబోతు

1. ఒకచోట కాలు నిలువక ఎప్పుడూ తిరుగుతుండేవాడు.

శ. ర.

2. వ్యభిచారిణి.

దాశ. 63.

తిరుగుమరుగు

మెలకువ.

"...వెడవిల్తు శాస్త్రంబు, లెఱుఁగఁ బూనిననాఁటి తిరుగుమరుగు."

రాధి. 3.7.

తిరుగుముఖము పట్టు

తగ్గు.

"మా అబ్బాయి జబ్బు నిన్ననుంచీ తిరుగుముఖం పట్టిం దనే చెప్పవచ్చు."

వా.

తిరుగుమొగ మగు

1. వెనుదిరుగు, మరలు.

"ఉచితనేపథ్యయుత లయ్యు సురగసతులు, నిష్ఫునిజమాళి మణిఘృణి విఘ్నలబ్ధి, నధికసంకేతములకు శే లరిగి యరిగి, తిరుగుమొగ మైనచిక్కుల తెరువు లివిర."

పాండు. 2.173.

2. తగ్గు.

"వ్యాధి కొంచెము తిరుగుమొగ మయినది."

శ. ర.

తిరుగువాఱు

చుట్టుకొను.

"దివిజకామిను లీరీతిఁ దిరుగువాఱి."

స్వా. 3.107.

తిరుచిన్నము

ఒక రకమైన వాద్యము.

దీనిని ఊదుతారు.

శ. ర.

తిరుచూర్ణము

వైష్ణవులు ఫాలభాగంలో పెట్టుకొనే ఒకరకమైన పొడి.

పసుపు, బియ్యము చేర్చి దీనిని తయారు చేస్తారు.

"నడువీధి గల నిల్వునామంబు పట్టెలు, శోభితం బగు తిరుచూర్ణరేఖ."

వైజ. 2.5.

తిరుదండె

భగవంతుని సన్నిధిలో దీపం ఉంచే కఱ్ఱప్రమిద.

ప్రబంధ. 74.

తిరునామము

వైష్ణవులు నుదుటిలో నిలువుగా పెట్టుకొనే బొట్టు.

వె. 1.69.

రూ. తిరునాము.

తిరునాము

చూ. తిరునామము.

తిరునాళ్లు

ఉత్సవం జరిగేరోజులు.

(తమి) తిరునాళ్.

రా. వి. 1.36.

తిరునీఱు

విభూతి.

శ. ర.

తిరుపందేరము

దేవుని ఆభరణాలూ, అవీ భద్రపరిచే కొట్టు.

వి.ప్ర. 5.8.

తిరుపట్టె కురుచ

ఒక రకమైన మల్లుల సాధనం.

ప్రబంధ. 82.

తిరుపణ్యారము

దేవునికి నైవేద్యము చేయునది.

తిరుపతికొప్పులు

కోరకొప్పులు.

"తిరుపతికొప్పు లందముగఁ దీర్చిన బూడిదబొట్లు..."

శుక. 3.9.

తిరుపతిక్షవరం

అరకొర పని.

"వా దేది చేసినా అంతా తిరుపతిక్షవరమే. ఒకటీ కడముట్ట నీడు." వా.

తిరుపతికొండమీద వెంట్రుకలివ్వడం ప్రధానమైన ఆచారం. అక్కడి మంగళ్లు తమ దగ్గరికి వచ్చినవారు మరొకరి దగ్గరికి వెళ్లిపోకుండా ఒక్కొక్కడి తలమీద కాస్త క్షవరం చేసి కూర్చోబెడతారు. ఇక వాడు చేసేదాకా వెళ్లిపోవడానికి వీలుండదు. చచ్చినట్టు పడుండవలసిందే. దీనినే కొండ మంగలిపని అంటారు.

తిరుపనిపిళ్ల

దేవాలయములోని సేవకుడు.

ప్రబంధ. 112.

తిరుపాటలు

దివ్యకీర్తనలు, భక్తుల కీర్తనలు.

తిరు = శ్రీ (తమి.)

పండితా. ద్వితీ. మహి. పు. 121.

బస. 4.122. పు.

తిరుపు గట్టు

1. తిరిగి అడ్డగించు.

"తిరిగినవెంటనే తిరుపు గట్టి."

నిరంకు. 4.69.

"మిట్టి మినువీధిఁ దిరుపులు గట్టి కట్టి, రణహారులు రాఁగ నొక మహానినద మెసఁగ."

కకు. 4.88.

2. నాట్యగతివిశేషము.

"కవిసి దిక్కుమరాళి గవిసెనలకుఁ దార్చె, దివి దన్ను కెందూళి తిరుపు గట్టె." సాంబో. 5.203.
"మెఱుఁగు మెయిదీఁగ వలగొనఁ దుఱుము బొదలఁ, దెఱవ యొక్క తె బిఱబిఱ తిరుపు గట్టె." చంద్ర. 2.141.

తిరుపు గొను
నాట్యములో చక్రభ్రమణము చేయు.
"ఇరువురు నేసిన బాణము, నిరుబరు లును దాఁకి తిరిగి నిరుడెసలకు న, క్కిఱి యిరుమొగముల నట్టువ, తిరుపు గొనెడుక్రమముతో నతిత్వరితగతిన్." కాశ. 4.184.

తిరుపుటెద్దు
గానుగ యెద్దు.
క్రీడా. 103.

తిరుపుట్టము
పూజ్యులూ, పెద్దలూ ధరించే వస్త్రము.
వై. 2.115.

తిరుపులు గట్టు
చూ. తిరుపుగట్టు.

తిరుప్పుల్లాణి
దర్భశయనము.
(తమి) తిరుప్పూల్.
చం. రా. 8.37.

తిరుబాస
ప్రమాణము.
దేవునిపై ఒట్టు పెట్టుకొని అన్నమాట.

తిరు – అరవంలో శ్రీ అను మాటకు పర్యాయం.
"పట్టిన వ్రతంబు చెల్లకుండినం దిరుబాసగా వర్తిల్లుచుండె." హర. 1.14.

తిరుమంజనము
అభిషేకము.
వేం. మా. 2.118.
శుక. 3.16.

తిరుమంత్రము
అష్టాక్షరి.
ఓం నమో నారాయణాయ అని నారాయణమంత్రము.
పరమ. 5.119.

తిరుమజ్జనము
దేవతావిగ్రహములకు చేసే అభిషేకము.
పరమ. 3.168.
చూ. తిరుమంజనము.

తిరుమణి
వైష్ణవులు నొసటిలో పెట్టుకొనే చూర్ణము.
పరమ. 3.204.

తిరుమణి వడము
తామరపూసల దండ.
పరమ. 3.13.

తిరుమన్ను
ఆము. 6.6.
చూ. తిరుమణి.

తిరుమాల
ఆకులూ, పువ్వులూ చేర్చి కట్టిన మాల.
ప్రబంధ. 581.

తిరుమాళిగ

పూజ్యులు నివసించే గృహం. వైష్ణవ పరిభాష – తమిళం: తిరుమాళిగై.

తిరుమాళిగె

చూ. తిరుమాళిగ.

తిరుమాళిహా

వైజ. 2.115.
చూ. తిరుమాళిగ.

తిరుమార్హా

వైజ. 2.126.
చూ. తిరుమాళిహా.

తిరుముట్టము

గర్భగుడి; విగ్రహం స్థాపించిన వేదిక.

తిరుమట్టమూ, తిరుముత్తమూ కావచ్చును.

"శ్రీరమణుండు మంచెన పండితయ్య, గారి యానతికిని గడగడ వడఁకె, మ్రొక్కుచు న త్తిరుముట్టంబు వెడలి."
బస. 6.172. పుట.

తిరుముడి

1. జడలు గట్టిన జుట్టు.
"ధర రాజ్య మొల్లక తిరుముడి దాల్చి."
బస. 4.101. పం.

2. వైష్ణవసమూహము.
"అనుదినము వేయు దిరుముడి, కిని మృష్టాన్నముల నారగింపు లిడక."
పరమ. 4.143.

తిరుముత్తము

దేవాలయము.

"మ్రొక్కుచు న త్తిరుము త్తంబు వెడలి, చక్క చెర్వునఁ బాదచారి యై నడవ."
బస. 6.761 పం.

తిరులుమరులు కొల్పు

అరులు మరులు కొల్పు, వెర్రెత్తించు.
"పుణ్యస్త్రీ లెవ్వరు గలరు చూపు చూతాం, కురశరహతిఁ దిరులు మరులు గొలిపెద వారిన్."
కుమా. 4.42.
"ఎట్టివారి నైన, నొరుల నొక వ్రేలిమిడి దిరుల్ మరులు గొలిపి, దివియమే దేవి నీయట్టి దీము గలుగు."
కుమా. 6.17.

నేటికీ రాయలసీమలో వాడుక.
"వాడికి అరులుమరులు పట్టింది. వయసు హెచ్చింది కదా."
వా.

తొలిరూపం 'తిరులుమరులు' నేటిరూపం 'అరులుమరులు' కావచ్చును.

'వాడికి అర్లుమర్లు పట్టింది. ఏదో అంటుంటాడు.' అని కూడా అంటారు.

తిరువంజనము

వైజ. 2.15.
చూ. తిరుమంజనము.

తిరువడి

1. దాసుడు.
సమీర. 3.159.

2. పుణ్యక్షేత్రము.
శ్రీరం. మా. 2.35.

తిరువడి కోల

దాసరివాని దీపస్తంభము.
ఆము. 4.35.

**తిరువరంగము**

1. శ్రీరంగము.

వైజ. 2.132.

2. ఒక రకమైన ధాన్యము.

శ. ర.

**తిరువాముడి**

ద్రవిడవేదము.

తమి. తిరువాయ్ మొళి.

విప్ర. 2.31.

**తిరువాయిముడి**

వైజ. 4.129.

రూ. తిరువాముడి.

**తిరువారాధనము చేయు**

దేవతార్చన చేయు, నైవేద్యము పెట్టు.

"తిరువారాధన మిట్లొనర్చి."

పాండు. 2.24.

**తిరువిళక**

దీపము.

విళక్కు = దీపం. (తమిళం.)

వేంక. దేవ. 25.

**తిరువీథులు**

మాడవీథులు.

అనగా దేవాలయం చుట్టూ ఉన్న వీధులు.

"మరుఁ డరుదేరఁగ ముందటఁ, దిరువీథులు దుడుచుకరణి."

సింహా. 3.129.

**తిరువీసము**

పలుచని పాయసము.

విప్ర. 5.12.

**తిరువు గట్టు**

దశా. 1.225.

రూ. తిరుపుగట్టు.

విరక్తి లేని బిచ్చగాడు.

ఆంధ్ర. భా. ద్వి. 176.

**తిలకము తీర్చు**

బొట్టు పెట్టుకొను.

"కమ్మకస్తురి తిలకంబు దీర్చి."

కళా. 7.65.

"మోమునఁ దిలకము దీర్చి క్రొవ్విరులు నించి కచాళిని..." హంస. 1.143.

**తిలతండులన్యాయము**

పాలూ నీళ్లూ కలిస్తే రెండూ కలగలిసి పోతాయి. బియ్యమూ నువ్వులూ ఎంత బాగా కలిపినా దేని కవి కని పిస్తూనే ఉంటాయి. అలాంటి అననురూప సాంగత్యాన్ని ప్రస్తావించేపట్ల ఈ న్యాయాన్ని ఉదహరిస్తారు.

**తిలలు పైనెత్తి చల్లిన దిగువ పడనట్లు**

ఇసుక వేస్తే రాల దనుట వంటిది. జనసమ్మర్దం ఎక్కువగా ఉన్న దనుట.

"తిలలు పైనెత్తి చల్లిన దిగువఁ బడని, యంతసందడి పెంద్రోవలందుఁ గలిగె, నఖిలదేశంబులం దుండి యవనిపతులు, వైభవాలోకమునకును వచ్చుచుండ."

నైష. 4.123.

తిలోదకములు విడుచు

తర్పణము చేయు, పూర్తిగా వదలుకొను.

"తల్లీ తండ్రికి తిలోదకం యివ్వడాని కయినా ఉండొద్దా?" వా.

"వాడిచేతి కేదయినా పోతే యిక తిలోదకాలు విడవవలసిందే." వా.

తిష్ఠపెట్టు

పీట వెట్టు.

"శేపును మాపును నీపయి, నేపపుతీపిని న వాఁడు నిటు పని విని తా, నోపికఁ జూచుక మగ్గ, మ్మో పట్టీ! తిష్ఠపెట్ట కూరక యున్నే?" భద్రావత్యు. 2.

చూ. తిష్ఠ వేయు.

తిష్ఠ వేయు

పీఠము వేయు.

"వా డెవరో వీళ్లయింట్లో వచ్చి తిష్ఠ వేశాడు. వదిలించుకోవడం వీడికి సాధ్యం కాలేదు." వా.

చూ. తిష్ఠపెట్టు.

తీగతెంపుగ

తామరతంపరగా.

తీగ సాగినట్లుగా, అవిచ్ఛిన్నముగా అనుట.

"విశ్వంబు నెవ్వని విపులక్రియాశక్తిఁ, దిరుగుచున్నది తీఁగతెంపు గాఁగ."

కాశీ. 5.94.

తీగనవ్వు

దీర్ఘహాసము.

క్రీడా. 68.

రాధా. 5.112.



తీగమల్లియ

ఒక జాతి మల్లె.

ఆము. 1.66.

తీగమల్లె

చూ. తీగమల్లియ.

ఒక రకమైన ధాన్యము.

శ. ర.

కవిక. 1 ఆ.

తీగమెఱుగు

1. ఉఱుము లేని మెరుగు.

2. పొద్దుతిరుగుడు చెట్టు.

శ. ర.

తీగమోడి

జిలుగుడ్రాత.

శ. ర.

తీగయెలుగు

హీనస్వరము.

ద్వి. నల. 4.393 పు.

తీగలువాఱు

వ్యాపించు.

కవిక. 6.91.

తీగవిలుకాడు

మన్మథుడు.

ఆం. భా. ప్ర. 45.

తీగవిలుతుడు

మన్మథుడు.

రూ. తీగవిల్తుడు.

తీగ సాగు

వృద్ధి చెందు.

"కడుఁ దీఁగ సాఁగుచు బడుగు నెన్నడుము మిక్కిలిఁ గృశం బనఁ దత్తఱిలుచు నిక్కె." కళా. 7.76.

తీగచుట్టుగా

తీగవలె గుండ్రముగా.

ఆము. 4.84.

తీగతెంపుగ

ఉద్భ. 1.131.

చూ. తీగతెంపుగ.

తీగమల్లె

చూ. తీగమల్లె.

తీగమెఱుగు

చూ. తీగమెఱుగు.

తీగెయిమ్ము

పొదరిల్లు.

ముకుంద. 2.132.

తీగెలువాఱు

వ్యాపించు.

నీతి. 90.

తీగెలు సాగు

అభివృద్ధి చెందు.

ఆము. 5.123.

తీగె సాగు

వి. పు. 6.19.

చూ. తీగ సాగు.

తీటకన్ను

కుఱుపులు చిన్నవి లేచిన కన్ను.

పండితా. ద్వితీ. మహి. పు. 108.

తీడుకొను

పదను పెట్టుకొను.

"తేఁటి తెక్కలగతి యమ్ముఁ దీడుకొనఁగ." నైష. 6.65.

తీతువుపిట్ట రాయబారము

దుర్వార్తను కొనివచ్చు పని. తీతువు లేక శీతవ, యింటి మీద తిరుగుతూ అరిస్తే ఆ యింట్లో యెవరో చచ్చిపోతా రని ఒక నమ్మకం.

"ఈ తీతువుపిట్ట రాయబారము పైఁ బెట్టుకొన నెవరు మీతో మొఱలు బెట్టిరో."

ధర్మజ. 47 పు. 10 పం.

తీదీపు

బాధాకరము.

"ముంచిన తీదీపే గాక మోద మున్నదా."

తాళ్ల. సం. 10.129.

తీదీపు చేయు

బాధ పెట్టు.

నవ. 2.69. పు.

తీన్ తేరా ఆఠ్ అఠారాగా ఉండు

చెడిపోవు.

"నా పని తీన్ తేరా ఆఠ్ అఠారాగా ఉన్నది." వా.

మూడు, పదమూడు, ఎనిమిది, పద్దెనిమిది అంకెలు చాలా చెడ్డ వని ఒక నమ్మకం – ముఖ్యంగా ముస్లిములలో, క్రైస్తవులలో. అందుపై ఏర్పడిన పలుకుబడి.

తీ పనుచు చేదు తిను

మంచి దని చెడును అనుభవించు.

"తీ పనుచుఁ జేదు తెగఁ దిని వెనుకఁ బడరాని యాపదలచేత."
తాళ్ల. 1 సం. 70. పు.

తీపాడు
ఇం పగు.
విజ. 2.102.

తీపారు
మనోజ్ఞ మగు.
హరి. పూ. 7.112.

తీపు దిగదీయు
(తీపైనా ఎక్కువ తింటే) మొగము మొత్తు.

తీపుద్రాడు
వేటలో ఉపయోగించే ఒక విధ మైన సాధనం.
కాశీ. 3.46.

తీపులు గొను
వేడుక పడు.
భా. రా. సుం. 131.

తీపులు పుట్టించు
చవు లూరించు.
"తీపులు పుట్టించు దినదినరుచు లై, పూపల సంసారభోగములు."
తాళ్ల. సం. 9.207.

తీయని మాటలాడు
ప్రియముగా పలుకు.
"మనసు గరఁగంగఁ దీయని మాట లాడు." శుక. 3.14.

తీరి కూర్చుండి
ఏమీ పని లేక, అనవసరంగా.
"తీరి కూర్చొని నాతో తగువుకు వస్తున్నాడు." వా.
చూ. కుడిచి కూర్చుండి.

తీరి కూర్చున్న మంగలి
పని లేని మంగలి.
"తీరి కూర్చున్న మంగలి పిల్లితల గొరిగా డట." వా.

తీరి తీరని
పూర్తిగా వదలని.
"తీరి తీరని సిగ్గునఁ దెఱవ యపుడు."
రాధి. 1.129.

తీరువడు
అంద మగు.
స్వా. 2.61.

తీర్చి దిద్దినట్లు
అందంగా.
"ఆవిడ ముక్కూ మొహం తీర్చి దిద్దినట్లుగా ఉంటుంది." వా.

తీర్తిపూదెలు
కుండలపై పెట్టే పూజలు,
హంస. 5.13.

తీర్థ మాడు
1. స్నానము చేయు.
"మున్నుఁ బాతకంబు లెన్ని చేసిన వెన్క, గంగఁ దీర్థమాడఁ గమల హితుఁడు, పొడువ..."
జాహ్నవి. 1.18.
2. ప్రసవించు.
"మీ కోడ లింకా తీర్థ మాడ లేదా?" వా.
ఇది ఈ అర్థంలో రాయల సీమలో నేటికీ విశేషంగా వాడుకలో ఉంది,

**తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదము**

దేని కదే.

"...అనావశ్యకము లవునకాలపు వెత్తి యాకాంక్షులక్రిందఁ బెట్టి నిరంతర సంబంధ మున్న భాషావ్యాకరణములలోఁ దీర్థమునకుఁ దీర్థము ప్రసాదమునకుఁ బ్రసాదము నను నట్లు భాషలో నెంతమాత్రము బాలురఁ బ్రవేశపెట్టకుండ..." సాక్షి. 19 పు. 6 సం.

"చెప్పడానికీ చేయడానికీ ఎక్కడా పొందిక లేక తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం అయిపోయి నేటిసంఘం అవ్యవస్థగా ఉంది." వా.

**తీర్థము లాడు**

స్నానము చేయు.

భీమ. 4.158.

**తీర్థము స్వార్థము కలిసి వచ్చు**

ఒకదానితో రెండు ప్రయోజనములు చేకూరు.

"ఎట్టకేలకుఁ దత్కార్య మియ్యకొనుచుఁ, గాంచనాంబరు నెలమి సేవించుటయును, బ్రజల రక్షించుటయు మంచిపని ఘటిల్లెఁ, దీర్థమును స్వార్థము నటంచుఁ దెలిసి యపుడు." కుచే. 1.102.

"......వాఁడది తీర్థము స్వార్థముం గదా, యరిగెద నంచుఁ గ్రక్కునఁ బ్రయాణము సైకొని భార్య కిట్లనున్." భోజ. 6.159.

"ఈ ఊళ్లో స్కూలు పెట్టించామంటే మనవాడికి ఉద్యోగమూ దొరుకుతుంది. ఊళ్లో పిల్లలకు చదువు సౌకర్యమూ యేర్పడుతుంది. తీర్థమూ స్వార్థమూ కూడా కలిసి వస్తుంది. వా.

చూ. స్వామికార్యం, స్వకార్యం.

**తీర్థవాసి**

పుణ్యక్షేత్రములో నివసించువాడు.

శ. ర.

**తీర్థవిధి**

పుణ్యతీర్థములలో చేయు శ్రాద్ధము.

**తీర్పరి**

1. న్యాయ నిర్ణేత.

శకుం. 4.176.

2. గూఢచారి.

శ. ర.

**తీఱు (తీరా)**

పూర్తిగా, ముగియ వచ్చుసరికి.

"పడఁదిరియె పాటునకుఁ దీఱు మునింగిపోయిరే." కళా. 6.77

"నాలుగు రోజులనుంచీ వాడు రారా అని పిలిచాడు గదా. తీరా నేను వెళ్లే సరికి వాడు కనిపిస్తే వొట్టు." వా.

"పెళ్లిచూపుల కని బ్రహ్మాండ మైన సన్నాహంతో వెళ్లామా! తీరా చూచే సరికి ఆ పిల్ల గుడ్డిది." వా.

**తీఱిపోవు**

చచ్చు.

మొ. రా. సుం. 159.

**తీఱుగడ**

ముగింపు.

చిత్రభా. 5.40.

తేఱుదల యగు
ముగియు.
"భీమసేనుండు నేఁడు సంగ్రామము నకుఁ, దేఱుదల యగుఁ గాకని."
భార. భీష్మ. 2.203.

తేఱుపడు
వీలు కలుగు.

తేఱుపాటు
తీరిక.
శ. ర.

తేఱుబడి
తీరిక.
శ. ర.
"నా కీమధ్య బొత్తిగా తీరుబడి లేక నీకు ఉత్తరం వ్రాయ లేదు." వా.

తే లగు
అడగిపోవు.
ఆము. 2.63.

తేలుపడు
1. తగ్గు.
పాండు. 4.13.
2. నశించు.
వేం. పంచ. 1.696.
3. దుర్బల మగు.
వేం. పంచ. 1.581.

తేలువడు
అడగు.
ఇందు. 2.165.
రూ. తేలుపడు.

తీవంచ
నాలుగు.
నీలా. 1.12.

తీవనవ్వు
లేతనవ్వు.
"తీయదేనియ లొలుకు తీవనవ్వుల తోడి." కవిక. 1.39.

తీవయిల్లు
పొదరిల్లు.
భార. విరా. 2.308.

తీవరకత్తె
తొందర పడునది.
ఇందు. 6.6.

తీవర పడు
తొందర పడు.
శ. ర.

తీవరపాటు
తొందరపాటు.
శ. ర.

తీవర పెట్టు
తొందర పెట్టు.
ముకుంద. 3.381.

తీవసరులు
ఒక రకమైన ధాన్యము.
హంస. 4.128.

తీసికట్టు
తక్కువది.
దేనితోనో పోల్చి యిది తక్కువది. అనుట.
"ఎందరెన్ని భారతాలు రాసినా నన్నయతిక్కనలకు తీసికట్టే." వా.

తీసిపోవు
1. చిక్కిపోవు.
"చలిజ్వరంతో బాగా తీసిపోయాడు."
వా.

2. తక్కువగు.

"మాటల్లో వాడేమీ వీడికి తీసి పోడు." వా.

**తీసివేత**

వ్యవకలనము.

**తీసివేయు**

1. ఖండించు.

"నీవేమి నా తల తీసివేస్తావా?" వా.

2. తొలగించు.

"వాణ్ణి ఆ ఉద్యోగంనుండి తీసివేశారని తెలిసింది." వా.

3. వ్యవకలనము చేయు.

"పదిలో ఆరు తీసివేస్తే నాలుగు. ఈ మాత్రం తెలియదా?" వా.

**తుంగలు దూలాలు మోయునా?**

అసంభవము. తుంగ దుర్బలము; దూలం బరువైనది.

**తుంగలో తొక్కి గంగలో కలుపు**

చూ. తుంగలో త్రొక్కు.

**తుంగలో త్రొక్కు**

లెక్కింపక పోవు, ధ్వంసము చేయు.

నీరు నిలిచి బురదగా ఉన్న ప్రాంతంలో తుంగ విపరీతంగా మొలుస్తుంది. దానిలో తొక్కుట అంతే కదా!

"నీతీ జాతీ తుంగల్లో తొక్కివేశాడు." వా.

"నేను చెప్పిన మాట తుంగల్లో తొక్కి వాడు తుర్రుమన్నాడు." వా.

**తుంగ ద్రవ్చిన గతిన్**

తుంగను చీల్చినట్లు.

అనగా ముక్కలు ముక్కలుగా.

"చక్రం బెత్తి తద్దేహముం, బవుల నైవ్చినఁ దుంగ ద్రవ్చినగతిం బాసెం బ్రకాశంబునన్." ఉ. హరి. 3.105.

**తుంచినట్లు**

సరిగ్గా.

ఎంత అవసరమో అంత.

ఒక్కొక్కప్పుడు కాస్త కరుకుగా అని కూడా అర్థం.

"వాడు ఏది మాట్లాడినా తుంచినట్లు మాట్లాడతాడు." వా.

"వాడంతా సరే కానీ మరీ తుంచినట్లు మాట్లాడతాడు. అందువల్ల కొందరికి కష్టంగా ఉంటుంది. ఎంత నిక్కచ్చిగా మాట్లాడినా కాస్త మృదువుగా కూడా ఉండాలి మరి." వా.

**తుంటకూర**

ఒక విధమైన కూరాకు.

వి. పు. 4.275.

**తుంటరి**

దుర్మార్గుడు.

శకుం. 2.227.

**తుండుపడు**

మోడువలె అగు.

దశ. 3.4.

**తుండూ తుపాకీ యెగుర గొట్టు**

శాస్తి చేయు.

నీ పప్పు లేమీ ఉడకవు, నీకు

తగినశాస్తి చేస్తారు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.
"ఇలాగే అక్కడా చేశావంటే నీ తుండూ తుపాకీ యెగరగొడతారు జాగ్రత్త." వా.

తుందుడు కొర్చు
దార్జన్యము నడచు.
"సీతను - సేవించి రామ, దూత నే నని పల్కి- తుందుడు కొర్చి."
వర. రా. సుం. పు. 169-పంక్తి. 17.

తుందుడు కొలు
పొగరు అడగు.
"తుందుడు కొలి శాత్రవుల దోర్బల సంపదం జక్కచేసి."
నిరంకు. 4.80.

తుందుడుకు
తొందరపాటు.
విజ.3.23.

తుందుడుగొను
తొందర పడు.
ద్వి. పరమ. 8.696. పు.

తుందునుకలు
చిన్న చిన్న తునకలు.
కవిక. 2.197.

తుంపెసలాడు
తిరుగాడు, కదలు.
"పదపడి తలిరుజొంపములం దుంపెస లాడి." శకుం. 1.71.

తుంపెసలు గునియు
చలించు.
భాగ. 10 స్కం. ఉ. 681.

తుకతుకలు
సంకోచములు.
"తుకతుకలు మాని క్రొత్తవేడుకలు వొదల." కవిక. 4.149.

తుకతుక లేక
సంకోచము లేక.
"తుకతుక లేక కీర్తులు మిన్ను ముట్ట."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1691.

తుటార మాడు
తిరస్కరించు.
"......ప్రభావతి వచ్చె మీనుడాల్, పొందిన రాచవాని యొఅలోని కటారిం దుటార మాడుచున్."
శుక. 2.96.

తుటుకు తుటుక్కన
గుండె అదరుటలోని ధ్వన్యను కరణము.
"గుండియల్, తుటుకు తుటుక్కనన్ దిగులు దొట్టిన భూభుజుం డయ్యె నయ్యెడన్."
పాంచా. 2.42.

తుటుములు గట్టు
గుంపు కూడు.
భాగ. 10 స్కం. పూ. 770.

తుట్టతుద
చిట్టచివర.
భా. రా. అర. 2.141.
చూ. తుట్టతుది.

తుట్టతుది
చిట్టచివర.
"గిరి తుట్టతుదినుండి క్రిందుం జూడంగ." పండితా. పర్వ. 349 పు.
చూ. తుట్టతుద.

తుట్టతుమర
బొత్తిగా.
శ. ర.
"మా పిల్లవాడు తుట్టతుమర చెప్పిన మాట వినడం లేదు." వా.

తుట్టుపెట్టు
బాధించు.
"రగడ తగిలి పట్టు మనుచుఁ, దిట్ట తన్వేఁ దుట్టుపెట్టె నొకతె."
రా. వి. 3.121.

తుట్టె గట్టు
1. పురుగులు పట్టి ఉండ గట్టు.
"గోధుమపిండి తుట్టెగట్టి పోయింది. ఇక అది దేనికీ పనికి రాదు." వా.
2. జడలు గట్టు.
చంద్రా. 2.84.

తుట్టెపురుగు
పిల్లపాము; చిన్నపురుగు.
రామా. 8.40.

తుడిచి పెట్టు
నాశము చేయు.
నా. మా. 124.

తుడిచిపెట్టుకొని పోవు
నిర్మూల మై పోవు.
"పోయినసారి కలరాలో ఆ ఊరంతా తుడిచిపెట్టుకొని పోయింది." వా.

తుడుపు దుమారము
మన్ను దుమ్ము. జం.
కుమారీ. శత. 97.

తుడుపు వెట్టు
తుడుచు.
"తనదాహ పచిమంబు వనదావహరణ మిషో, దురత మై నుడుపతిఁ దుడుపు వెట్టు." బహు. 1.60.

తుడుము మొదలుకొని దేవతా ర్చనవఱకు
సర్వము నకూ, అన్ని పను లకూ.
"తుడుము మొదలుకొని దేవతార్చనవఱకు కందఱు స్త్రీలే." సాక్షి. 42.

తుత్తునియలు సేయు
ముక్కలు ముక్కలు చేయు.
"వీఁకన్ రాజహంసాలిఁ దు,త్తునియల్ సేసియు." పారి. 3.34.

తుత్తుము రగు
పొడిపొడి యగు.
"తుది నదియును మేను వొంగి తుత్తుము రయ్యెన్." పారి. 3.18.

తుత్తుము రాడు
పొడిపొడి చేయు.
"తుత్తుము రాడి వచ్చు నలదుర్మదు నొండు దలంప కుండుమీ."
రాజ. చ. 2.39.

తుత్తుమురు చేయు
పిండి పిండి చేయు.
"తన కృపాణ విహరణ విచిత్ర వేగం బునఁ దుత్తుమురు సేయుచు."
కళా. 6.18.

తుత్తుఱుగొను
దురద కలుగు, కండూతి కలుగు.
"ఇమ్మఖభూమము గప్పికొన్నఁ దు,త్తుఱు గొని స్రేపెదో." కుమా. 2.36.

"నోటితుత్తఱతో వా దేదో వాగు
తున్నాడు." వా.

"నోరు తుఱతుఱ మంటుంది. ఏదైనా
తిందా మనిపిస్తూంది." వా.

నేటి వాడుకలో: తుత్తఱ.

**తుదకు వచ్చు**

అంచు గట్టుకొని వచ్చు.

"ఎంచి చూడం గించిదూనంబుగా
వాని రాజ్యసంపదయుఁ దుదకు వచ్చి
నది." ప్రభా. 1.117.

**తుద కెక్కు**

గట్టెక్కు.

"తుద కెక్కితిమి యింక తొలఁగఁగ
వలెనా." తాళ్ల. సం. 7.285.

**తుదచేరు**

నెరవేఱు.

"ఏ,లా తుదచేరుఁ దద్వ్రతము లావున
వాఁ డోరుచేల కైకొనున్." ఉ. హరి. 4.294.

**తుద మీఱు**

అధిక మగు.

రం. రా. బాల. 34. పు.

**తుదముట్టు**

1. ముగియు.

కళా. 5.39.

2. మోక్షమును పొందు.

భాగ. 3 స్కం. 35.

**తుదిచీటి**

సంబంధము వదలుకొని వ్రాసి యిచ్చు ఆఖరుపత్రము.

"చెక్కుఁ జెమ్మట చేల చెఱఁగునఁ
దుడుచుట, చెలిమికి నది తుదిచీటి
యేమొ." ఉ. రా. 6.302.

**తుది తాకు**

నెఱవేఱు.

"ధాత మది యెత్తికోల్ తుది దాఁక
కున్నె." నైష. 1.80.
భార. ఉద్యో. 3.65.

**తుదినాలుక ముల్లు**

నాలుక తుది చాలా మృదువుగా ఉంటుంది. దానిలో విఱిగిన ముల్లు చాలా బాధ కలిగిస్తుంది. అట్లే బాధాకరుడు, భయంకరుడు అని భావం.

"కాలవాదుల తుదినాలుక ముల్లు."
పండితా. ప్రథ. వాద. పుట. 511.
చూ. కంటికసవు.

**తుదిపక్షము**

ఏవో రెండు మార్గాలు చెప్పి అందులో ఆఖరుది అనునప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"ఈ తుదిపక్షమే మదిని నిప్పుడు నిశ్చిత
మె ట్లటన్న." ప్రభా. 3.103.

**తుది బొందు**

చనిపోవు.

"రో,గముచేతం దుదిఁ బొంది పుణ్య
వశతన్ గాంచెన్ మరుల్లోకముల్."
భాస్క. బాల. 453.

**తుదిముట్టు**

1. చచ్చు.

అధ్యా. కిష్కిం. 105. పు.

2. నెఱవేరు.

భార. విరా. 2.234.

**తుది మొదలు**

సంపూర్ణముగా.

మొదటినుంచీ తుదివరకు అనుట.

"తుదిమొదలే నెఱింగియు నెదురొక్కని పూజ యొనర్ప కన్కు యొప్పదు." శుక. 3.381.

**తుదిరేయి**

కల్పాంతము.

బ్రౌన్.

**తు ధూ యని క్రాయు**

ఉమ్మివేయుటలోని ధ్వన్యను కరణము.

"నెత్తురు చవి చూచుఁ గండలు తుధూ యని క్రాయు." ఉ. హరి. 2.124.

రూ. తూ ధూ అని మూయు.

**తునికోల**

తులాదండము.

రామా. 8.122.

**తునికోల దుడ్డు**

గవుండ్లవాడు కల్లుబుడ్డి తగిలించుకొని పోవుటకునూ, కత్తి నూఱుకొనుటకునూ ఉపయోగించు తునికోల.

శ. ర.

**తునితగవు**

దీనినే ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క గ్రామనామంతో వ్యవహరిస్తారు. అనంతపురం జిల్లాలో పామిడి పంచాయితీ అంటారు. అటో యిటో కాకుండా మధ్యే మార్గంగా చేసే తీర్పును యిలా వ్యవహరిస్తారు.

ఆ ఊళ్లో దారిని పోతున్న ఒక బాటసారి చీకటి పడి ఏదో ఒక పంచటరుగుమీద పడుకున్నాడు. వాడి దుప్పటిని తెల్లవారేసరికి మరొకడు లాక్కొన సాగాడు. వీళ్లిద్దరూ పంచాయతీదార్ల దగ్గరికి వెళ్లారు. వాళ్లెటూ తీర్చలేక చెటిసగం కత్తిరించి తీసుకోమన్నారట. అందుపై వచ్చిన పలుకుబడి.

**తునిమి తూటాడు**

నిర్మూలించు. జం.

"అతిభక్తిఁ దర్పణం బాచరించిన మర్త్యుఁ, డఘకోటిఁ దున్మి తూటాడఁజాలు." కాశీ. 6.39.

**తునిసి పడు**

చెడు.

హరి. పూ. 8.52.

**తునిసి పాఱు**

ముక్కలు ముక్క లగు.

భాగ. 3 స్కం. 638.

**తునుమాడు**

ధ్వంసము చేయు.

"ఘనశస్త్రమునం దునుమాడి." రుక్మాం. 5.31.

**తున్మాడు**
ఖండించు.
నిర్వ. 4.88.
రూ. తునుమాడు.

**తున్మి తూటాడు**
1. నాశనము చేయు.
"అఘకోటిఁ దున్మి తూటాడఁ జేయు." కాశీ. 6.39.
2. చీల్చి చెండాడు.
"అనుమానింపక తోడఁబుట్టువులు గారా తున్మి తూఁటాడె." భార. శాంతి. 1.287.

**తుపాకిగుండు**
తుపాకిలో పెట్టి కాల్చు గుండు.
కృష్ణ. 3.5.

**తుపాకిత్రాడు**
జానకిత్రాడు.
రాధా. 2.41.

**తుపాకిమంది**
తుపాకులతో యుద్ధము చేసే సైన్యము.
చంద్రా. 6.73.

**తుప్పటమెఱుగు పెట్టు**
వరిపొట్టులాంటివానితో రుద్ది మెఱుగుపెట్టు.

**తుప్పదూలు**
మిక్కిలి చలించు.
నవనాథ. 2.79 పు.

**తుప్పల దూలి యుండు**
నేల పడియుండు.
"వెఱచి చాల, దూరముగఁ బోయి తుప్పలఁ దూలి యుండె." భార. శాంతి. 5.470.

**తుప్పలు దూలగ దోలు**
దొంగల దోలు, పాఱద్రోలు.
"జముఁ దుప్పలు దూలఁగఁ దోలనైన." భాస్క. బాల. 39.

**తుప్పురలగ తిట్టు**
చెడ దిట్టు.
"మూల ముడుంగ నేల, తుప్పురలఁగఁ దిట్టు టంచుఁ దలపోసెనె." గిర. 19.

**తుప్పు వట్టు**
ఉపయోగింపక మూల పడి యుండు.
"మన యర్జును నమ్ములు దుప్పు వట్టెనే." భార. కర్ణ. 2.25.

**తుము రగు**
ముక్కలు ముక్క లగు.
పండితా. వాద. 228. పు.

**తుమురు సేయు**
ధ్వంసము చేయు.
"వక్షముల్ తుమురు సేయుచు నుండుదు." రుక్మాం. 1.166.
"శక్తి వైచెను దివిజుం, డది ముదిత దుమురు సేసెను." ఉ. హరి. 1.166.

**తుమ్మపూరాజనాలు**
ఒక రకమైన ధాన్యము.
హంస. 4.128.

**తుమ్మెదకంటు**
సంపెంగ.
రామా. 4.66.

తుమ్మెదపదములు
తుమ్మెదా తుమ్మెదా అని పల్లవిగా వచ్చే పాటలు. పల్లెపదాలలో ఒకరకమైనవి.
పండితా. ప్రథ. వాద. పుట. 513.

తుమ్మెదరేపుళ్లు
ఒక రకమైన పిల్లల ఆట.
హంస. 3.146.

తురంగనళ్లు
ఒక రకమైన వస్త్రము.
హంస. 5.355.

తురకపత్తి
ఒక జాతి పత్తి.
శ. ర. బ్రౌన్.
హంస. 4.10.

తురకరాయి
బొంతరాయి.
కాశీయా. 304.

తురగవళ్లు
ఒక రకమైన వస్త్రము.
ప్రబంధ. 2.72.

తుర్రున
తుర్రు మని.
ధ్వన్యనుకరణము.
రాధా. 4.103.
చూ. తుర్రు మని.

తుర్రు మని
వెంటనే.
ధ్వన్యనుకరణము.
"తుర్రు మని యొక్క యంగలో దూటి పోడు." మృచ్ఛ. 89.
చూ. తుర్రున.
"తుర్రు మని ఆ పిల్ల పారిపోయింది."
వా.
చూ. తుర్రున.

తుఱగలి గొను
1. ప్రకాశించు.
భార. మౌస. 169.
2. అధిక మగు.
భీమ. 2.155.

తుఱి గొను
గుంపు కూడు.
హ. సం. 12.147.

తుల దూగు
సమాన మగు.
"తొలుతఁ దుమ్మెదల తోఁ దులఁ దూఁగు నెఱికురుల్." నిరంకు. 2.10.

తులలు తూగు
సరిపోవు.
"తుహినగిరికూటములతోడఁ దులలు తూఁగు." శివ. 2.5.
చూ. తులదూగు.

తులసికోట
తులసిమొక్క చుట్టూ కట్టిన కట్టడము.

తులసిపోగులు
చెవులలో ధరించు ఒకరక మైన నగ.
నిరం. 2.116.

తులసివనమాలికలు
ఒక రకమైన ధాన్యము.
ప్రబంధ. 112.

తులాకోటి

కనకవలయము, అందె.

"పెరిఁగిన త్రివిక్రమేశ్వరు, చరణతులా కోటి...ఊడిన కరణిన్, బురికోట యొప్పు." పాండు. 1.105.

తులాదానము

తన యెత్తు తూకం కల బంగారో, రత్నములో అలాంటి వేవో దానము చేయుట.

తులుకాడు

చిందు.

పండితా. దీక్షా. 5 పు.

తుల్కాడు

తొల్కాడు, తొలుకాడు, అతిశయించు, ఒప్పు.

"ఉర్విఁ దత్పర్వతసార్వభౌమునకుఁ, బూర్వవక్త్రాంతవిస్ఫురణ దుల్కాడ... పెంపారు ద్రిపురాంతకంబు."

బస. 1. 2.

"సకలవైభవములు సమకూరుఁ దన యంతఁ, దుల్కాడు కోర్కులతోడఁ గూడి..."

భాగ. 6. స్కం. 504.
పండి. పురా.

తుస్సుపెంజెర

ఒక రకమైన పాము.

శ. ర.

తుస్సువోవు

భంగపడు.

మందు పేల్చగా బాగుంటే ఢాం అంటుంది. కానినాడు తుస్సు మని పోతుంది.

"...తుది నీవును దుస్సు వోదు త్రుళ్లుటుడుగుమీ."

భార. శాం. 4.399.

తూక మయిన మనిషి

సంపన్నుడు, పలుకుబడి కలవాడు, గభీరుడు ఇత్యాద్యర్థాలలో స్వేచ్ఛగా ఉపయోగించే పలుకుబడి.

"ఆ ఊళ్లో కల్లా రంగన్న చాలా తూక మయిన మనిషి. బాగా ఆస్తి ఉంది."

వా.

"ఆ ఊళ్లో కల్లా ఆయన తూక మైన మనిషి. ఆయనంటే ప్రతివారికీ గౌరవమే."

వా.

తూక మయిన మాట

విలువ గల, అర్థవంత మైన మాట.

"ఇంత మంది ఇన్ని చెప్పారు కానీ యిందులో నీదే తూక మయిన మాట."

వా.

తూగాడు

1. ఊగులాడు.

"కుచభారంబులు వ్రేఁగు లాఁగ లేక తూఁగాడుచు."

భాగ. స్క. 10. ఉ. 821.

2. బలహీనతతో ఊగిసలాడు.

"రథసహితంబుగా నగ్గలిక నుగ్గుసేసి డస్సి తూఁగాడుచు."

భార. ద్రోణ. 2.119.

తూగియాడు
ఊగులాడు.
గంధ. 143.

తూగు
సమర్థ మగు, సమాన మగు.
"వెయ్యి రూపాయలు చెప్తే అంతవ నేను తూగ లేను." వా.
"వాళ్ళది మరీ జమీందారీ కుటుంబం. వాళ్ళతో మనం తూగ గలమా?" వా.

తూగుటుయ్యల
ఉయ్యాలమంచము.
కళా. 2.17.

తూగుటుయ్యాల
కవిరా. 2.127.

తూగుదివియ
ఆకాశదీపము.
చంద్ర. 4.54.

తూగుపలక
తాపీపనివాడు గోడలమట్టము చూచుటకై వ్రేలాడ గట్టిన నిడుపాటి పలక.
శ. ర.

తూగుమంచము
తూగుటుయ్యెల.
య. 5.13.

తూ గొమ్మ
ఒక రకమైన వాద్యము.
ద్వా. 11.26.

తూ చా తప్పకుండ
పరిపూర్తిగ.
సంస్కృతంలో తు, చ అను నవి కొన్నిసార్లు విశిష్ట మైన అర్థం లేకనే ఉపయోగించడం అలవాటు. అలాంటి వాటిని కూడా వదిలిపెట్టకుండా అన్న అర్థంలో వచ్చింది.
"జనలోకోన్నత మైన త త్పు ర ము తూ చా తప్పకుండంగ వర్ణన సేయఁ జెల్ల మానె?" కా. మా. 1.20.

తూచినట్లు
హెచ్చుతక్కువలు లేకుండా, ఎంత అవసరమో అంత.
"వాడు చాలా తూచినట్లు మాట్లాడ తాడు." వా.

తూట కట్టు
ఖండిత మగు.
బ్రౌన్.

తూటాడు
శిథిలము చేయు.
మల్ల. శృం. 73.

తూటికూర
ఒక రకమైన కూరాకు.
హరిశ్చ. 2.166.

తూటు కట్టు
రంధ్రము చేయు.
"భూరి భేరీముఖతూర్యములు నభంబు దూఁటు కట్టి." భార. కర్ణ. 1.71.
"ఘనతరగర్జాధ్వనులును, ఘ న ప థ మఖిలంబుఁ దూఁటు కట్టెడు తూర్య, స్వనములునుం గబళించుచు." భార. భీష్మ. 1.236.

తూటు గట్టిన కన్ను
బెజ్జం పడిన కన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

తూటుపడు
రంధ్రము పడు.
బ్రౌణ్.

తూటు పోయేపాటి
చిల్లులు పడునట్టి.
అతిశీతల మైన అనుట.
"తూటు పోయేపాటి శీతలంగా."
కాశీయా. 285.

తూటులు పుచ్చు
రంధ్రములు పడునట్లు చేయు.
మార్కం. 2.94.

తూటులు సేయు
రంధ్రములు పడజేయు.
భార. భీష్మ. 2.232.

తూటులు వోవు
రంధ్రము పడు.
భార. శల్య. 1.157.

తూటు వోవు
భార. ద్రో. 5.28.
చూ. తూటులు వోవు.

తూడుతీగ
తామరతూడు.
భార. అను. 3.232.

తూడుదిండి
హంస.
అచ్చ. యు. 30.

తూతకొమ్మ
పిల్లనగ్రోవి.
"తూతకొమ్మ లొత్తి కూక లాకసంబు నిండ."
రాధా. 5.63.

తూనరతుక్రము
ఒక రకమైన పిల్లల ఆట.
బ్రౌణ్.
రూ. తూరనతుంకములు.

తూ నా బొడ్డం బాలు
చేసిన పొరపాటు ఇంతతో సరి.
చిన్న పిల్లల ఆటలో ఏదయినా క్రమవిరుద్ధం జరిగినప్పుడు 'తూ నా బొడ్డం బాలు' అని వేస్తే అది తీరి పోతుంది. అందుపై యేర్పడినది.
చూ. తూ నా బొడ్డు చేయు.

తూ నా బొడ్డు చేయు
తాను చేసిన తప్పిదాలను ఒక మాటతో తొలగించుకొన జూచు.
చూ. తూ నా బొడ్డం బాలు.

తూనికకోల
త్రాసుదండము.
ఆం. భా. ద్వి. 300.

తూనిక చెడు
తేలిక పడు, ఇతరుల దృష్టిలో లఘువుగా కానవచ్చు.
బరువైన మనిషి అన్నట్లే తద్వ్యతిరిక్తమైన మాట

ఇది. తూక మైన మాట అని రాయలసీమలో వాడుక.

"ఏనుంగు గోల్పడె మానంబు వొలిసె, దూనిక చెడి శివద్రోహంబు దగిలె."
బస. 4.91. పుట.

## తూనిక వేయు

తూచు.

శ. ర.

## తూనిగ తానిగ

ఒక రకమైన పిల్లల ఆట.
హంస. 3. 146.

## తూనిగిల బడు

ఊడిగిల బడు. బట్ట పట్టుకొని వ్రేలాడు.

ఈ పదం కోశములలో సూ. ని. వావిళ్ళ. వంటివానిలోని కెక్క లేదు.

"ఆయ్యొ, పచ్చడము చెఱంగుఁ బట్టి తూనిగిలంగఁ బడు."
పండితా. ప్రథ. పురా. పుట. 461.

## తూనీగ

ఒక రకమైన యీగ.

శ. ర.

## తూపురికర్ర

శ్రవణనక్షత్రము.

శ. ర.

## తూ పొడుచు

ఉమ్మి వేయు, తూ అని మూయు.

"పాపికా! బ్రమసితే ప్రాణవల్లభునిఁ, దూ పొడ్వఁ గూడు నే తుంపురు ల్నిండ."
బస. 3.57.

## తూముకాలువ

నీరు పోవుట కేర్పరచిన కాలువ.

క్రీడా. 29.

## తూమె డల్కిన తోంబది పుట్లు పండు

తూమెడు విత్తితే తొంభై పుట్లు పండు.

అనగా సమృద్ధిగా పండు అనుట.

"తూమెం డల్కినను బుట్లు తోంబది పండం,గా."
సింహా. 9.101.

## తూరదారు పోవు

చెడిపోవు.

"అతిముతిం బఱచినఁ దూరఁదారు పోయి, యతని కన్నుల శక్తి కడతేర."
కాశీ. 4.142.

## తూరనగోలలు

ఒక రక మైన పిల్లల ఆట.
వి. పు. 9.202.

## తూర నెత్తు

తూర్పార బట్టు.
కు. సం. 11.45.

## తూరుతుంకము లాడు

వ్రేలాడు.

"వక్షోజములు జాఱి వ్రాలిపో మీఁగాళ్ల, కడదాఁక దూరుదుంకంబు లాడ."
విప్రనా. 6.19.

## తూరుపాఱ బట్టు

పొల్లు పోవుటకై ధాన్యం

మొదలయినవానిని గాలికి ఎగురబోయు.

శ. ర.

**తూరుపాఱు**

వ్యాపించు.

"శిఖానివహంబులు తూరుపాఱినన్." హర. 6.64.

**తూరుపురేక లారు**

తెల్లవారు.

"తూరుపురేక లారుతుండగా లేచి బయలుదేరాను. ఎండ బడినా కయితే వచ్చి ఉండ లేను." వా.

**తూరు పెత్తు**

1. వెదజల్లు.

ధాన్యాదులను పొట్టు పోవునట్లుగా చేటలతో పైకెత్తి గాలికి పోయు అని వాచ్యార్థము. ఆ అర్థంలో కూడా ఈ పలుకుబడి అలవాటులో ఉన్నది. 'ఆ వడ్లు దంచి తూరుపెత్తాలి.'

"తుమురుగాఁ జేసి ధరణిపైఁ దూరుపెత్త." నిరంకు. 4.81.

2. నిందించు.

"రట్టుగా నన్ను మగనాలిఁ బట్టి డాసి, తౌర మొట్టో యనుచు దుమ్ము తూరుపెత్తు." శుక. 2.105.

3. జాడించు.

"గోరుముక్కుల దిగదువ్వి తూరుపెత్తి, నెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచె." పాండు. 3.30.

**తూర్పార బట్టు**

నిందించు.

"వాడు చేసిన వన్నీ పెద్దమనుష్యుల ముందు తూర్పార బట్టేసరికి మొగం మాడ్చుకొని కూర్చున్నాడు." వా.

**తూర్పుకు తిరిగి దణ్ణం పెట్టు**

ఇక ఆశ వదులుకో అని హేళనగా అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"వాడికి ఇచ్చింది ఇక జన్మలో తిరిగి రాదు. తూర్పుకు తిరిగి దణ్ణం పెట్టు." వా.

**తూర్పుకై తిరిగి దండము పెట్టు**

పూర్తిగా ఆశ వదులుకొను.

"వాడి చేతి కిచ్చావూ! సరే. తూర్పు తిరిగి ఓ దండం పెట్టి తిరిగి పో. ఈ జన్మలో ఇక అది తిరిగి రాదు." వా.

రూ. తూర్పుకు తిరిగి దణ్ణం పెట్టు.

**తూర్పూ పడమరా తెలియని**

ఏమీ తెలియని.

అమాయకు డనుట.

మాటా. 97.

**తూర్పెత్తు**

తూర్పార బట్టు.

పొల్లు నెల్లు వేరుపరుచుటకై తూరు పెత్తు.

"నెమ్మది నింటికిఁ జని తూర్పె, త్తెద నని యచ్చోటి నుసుముఁ దెచ్చితి గంపన్." శుక. 2.579.

ఒక మనిషిని బాగా తిట్టిన సందర్భంలో కూడా వానిని వీడు బాగా తూర్పారబట్టి

వదలి పెట్టాడు అని ఉపయో గిస్తారు.

చూ. తూఁశ్వార బట్టు.

తూఁగ గొను

చూఁగగొను, దూరిపోవు.

"పీత, రాగి యై యున్న నిర్మాణ యోగిఁ దూఁగ, గొనక క్రమ్మఁగు సతుల చూడ్కులును బోలె."

కుమా. 10.64.

తూఁగనాడు

దూఁటిపోవునట్లు వేయు.

"తీవ్రశరవేదనఁ జాఁపుచుఁ దూఁగ నాడ." జైమి. 5.31.

తూఁగ నెత్తు

వెడల నడచు, తటిమి తటిమి కొట్టు.

"కలనఁ దూఁగ నెత్తఁగాఁ బాఁగు నప్పుడ, కాని చూఁచి యెఱుఁగఁ గాదు మున్ను."

కుమా. 11.46.

తూఁగబడు

చొచ్చు.

నిర్వ. 4.76.

తూఁటిపోవు

తప్పించుకొని పోవు.

హరి. పూ. 9.48.

తూఁగుకొను

చొచ్చు.

పార్వ. 4.100.
వేం. పంచ. 3.244.

తూఁగుదండెము

ఒక రకమైన గరిడీ.

తూఁగుదండెము లాడు

1. సాము చేయు; గరిడీ చేయు.

2. కలిసిపోవు.

అని. 3.76.

తూలదోలు

పాఱ ద్రోలు.

విక్ర. 6.45.

తూలనాడు

పోద్రోచు, తిట్టు.

"అభిమానముఁ దూలనాడి."

రుక్మాం. 2.28.

"పెద్దవారి నలా తూలనాడడం తగదు." వా.

తూలపుచ్చు

1. తక్కువపఱచు, అవమానించు.

భార. శాంతి. 1.7.
ఉద్యో. 3.298.

2. పోగొట్టు.

రామా. 7.157.

3. సత్యము లేని దానినిగా చేయు.

అచ్చ. యు. 151.

తూలపోవు

1. ఓడిపోవు.

"నాలవనాఁడు ధార్తరాష్ట్రులు దూల పోవుట సెప్పిన."

భార. భీష్మ. 2.257.

2. స్థైర్యము కోలుపోవు.

"నెగులొందినప్పుడు నెఱిఁ దూల పోక." గౌ. హరి. ప్రథ. పం. 1171.

తూలబాఱు
పాఱిపోవు.
"తూలంబాఱియు బీరువోక."
కా. మా. 2.61.

తూలాడు
1. చలించు.
నవ. 4.119.
2. వణకు.
భార. విరా. 5.184.

తూలికాడు
చేపలనుపట్టి జీవించే జాతికి చెందినవాడు.
ఆం. భా. ప్ర. 159.

తూలికొను
పడు.
కళా. సం. 2.45.

తూలిపో బలుకు
తిట్టు.
ఉ. హరి. 3.17.

తూలిపోవు
అవమానము పొందు.

తూలియాడు
చలించు.
నైష. 7.92.

తూష్ణింభావము వహించు
మాటలాడక ఊరకుండు.
రూ. తూష్ణీభావము...

తృణప్రాయము
1. అతి సులు వైనది.
మదన. శత. 18.
"వాడికి ఈ పని తృణప్రాయం." వా.
2. అతి నీచ మయినది.
"వాడు ధనాన్ని తృణప్రాయంగా చూస్తాడు." వా.

తృణప్రాయము చేయు
చులకన చేయు, తృణీకరించు.
"పరులం దృణప్రాయంబు సేసి పట్టంబు గట్టుకొన్న గట్టితనంబు."
రాజగో. 1.13.

తృణముగా చూచు
చులకనగా చూచు.
గడ్డిపోచ మన దృష్టిలో చాల తక్కువది. దానిని వలె చూచు.
"పద్మరాగమణులఁ, దృణముగాఁ జూచుదంతపంక్తియును గలిగి."
కా. మా. 1.30.

తృణ మైన మేరు వగు
అల్ప మైనది కూడ మహత్తర మైన దగు.
"మీ రనుగ్రహించినఁ దృణ మైన మేరు వగు."
కా. మా. 1.155.
వాడుకలో కూడ 'మీరు తృణం ఇచ్చినా నేను మహామేరువుగా భావిస్తాను' – అని వినవస్తుంది.

తృణమో పణమో
ఏ కొంచెమో.
"వాడికి ఏ తృణమో పణమో యిస్తే చాలు, సంతోషిస్తాడు." వా.

**తృణీకరించు**
తిరస్కరించు.
మార్క. 8.254.
భార. విరా. 4.157.
"భూవరులఁ దృణీకరించి కొని వచ్చెద." జైమి. 3.21.

**తృతీయహస్తము చూపించు**
లేదను.
చూ. మొండిచెయ్యి చూపు.

**తృతీయాప్రకృతి**
నపుంసకుడు, పుంస్త్వము లేనివాడు.

**తృప్త్యాస్థగా**
సంతృప్తిగా.
భోజనసందర్భంలో ఉపయోగించే పలుకుబడి.
"తృప్త్యాస్థగా జుజ్జ త్రేన్పంగ లేదు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 520.

**తెంకగు**
భయపడు.
శ. ర.

**తెంకిపట్టు**
ఉనికిపట్టు.
రామా. 7.157.

**తెందెగ**
ఎక్కువగా.
ప్రబంధ. 530.

**తెందెప్పగా**
అపారముగా.
సా. 1.67.
శ. ర.

**తెందేపగ**
య. 1.16.
రూ. తెందప్ప.

**తెంపరి**
సాహసి.
భాగ. 7.

**తెంపాడు**
తెగించి పలుకు, దూషించు.
"శుద్ధ నా పెఱుఁగవే తెంపాడయుక్తంబె." భాస్క. యుద్ధ. 2358.

**తెంపి**
1. విధవ.
క్రీడా. 214.
తెగినది
పండితా. పర్వ. 335 పు.

**తెంపుంబడి**
మూర్ఖుడు.
దశ. 7. 29.

**తెంపు చేయు**
తెగించు.
"అని తెంపు చేసి కనకనఁ, గనుఁగొనల న్నిప్పు లురలఁగా వాలము..."
శుక. 2.252.

**తెంపు సేయు**
తెగించు.
"విక్రమోద్దండతఁ దెంపు సేసి పటు దర్పము నూపుచు."
భార. కర్ణ. 3.16.

**తెకతెక క్రాగు**
తెక తెక మని ఉడుకు.
ధ్వన్యనుకరణము.
"పయోరుహమిత్రుని వేడిమెండ చేఁ, దెకతెకఁ గ్రాఁగు." పారి. 4.22.

**తెకతెక మను**

కుతకుత మను.

ధ్వన్యనుకరణము.

"తెకతెక మనెఁ గొలఁకుల జల, మకలంకుని మౌనిఁ బెగడు నతని మతి గతిఁ, వికసించె మిగుల నిజప,త్రకళా ధ్రుల మోములట్లు గంజాతములన్."
త్రిశంకుస్వర్గం. అం. 4. పు. 42.

**తెకతెక మీఱు**

తొందర పడు.

"తెలియని వెల్లను ధీనిధుల్ దెలుపఁ, దెలిసికొందు గాని తెకతెక మీఱ, గ్రక్కునం దప్పన రాదు మాకు."
వర. రా. బాల. పు. 3. పం. 5.

**తెకతేర**

1. అతి సునాయాసముగా.

"తెకతేర యిది యేమి యొకరి సొమ్మొ?" పారి. 4.59.

"మగఁ డా పట్టెంబునఁ దలఁ దెగఁ గొట్టినఁ గొట్టుఁ గాక తెకతేరఁగ నీ కెగవిడిచి పోయెద నె?"
కళా. 3.191.

2. ఊరకే, నిష్కారణముగా.

"ఇతని కెక్కడి సామ్రాజ్య మేడ బ్రతుకు, చెడియెఁ దెకతేర యనుచు కేరడము లాడె."
వేంక. పంచ. 1.369.

"ప్రాణ మేటికిఁ దెకతేరఁ బాపి కొనఁగ." ద్వి. పరమ. 6.473. పా.

"సకలరాజ్యంబు నిశ్చలత నిన్నాళ్లు, తెకతేర బొక్కాడి దినియుండు నీవు."
పరమ. 6.473.

ఇక్కడ ముద్రితప్రతిలోని 'బుక్కాడి' అపపాఠ మగును.

**తెకతేరగ**

వట్టినే, ఊరక.

"తెకతేరగ నీ, కెగవిడిచి పోయెద నె ప్రావగ నా కాణాచి యైన వలపుఁ బంటన్." కళా. 3.202.

**తెక్కలికాడు**

దొంగ.

భార. స్త్రీ. 1.43.

**తెక్కలి కొను**

అపహరించు.

బలవంతముగా లోబరుచు కొను.

భార. ఆది. 2.105.

**తెక్కలి గొను**

1. అపహరించు.

దశ. 6.95.

2. చంపు.

ఉ. హరి. 2.130.

**తెక్కలిపాటు**

ఆపద.

భాగ. 6.349.

**తెక్కలీడు**

దొంగ.

వరాహ. 5.59.

**తెగం బలుకు**

ఖచ్చితంగా చెప్పు.

"అని తెగం బలికిన మాఱు వలుక నోడి." కుమా. 6.20.

నేటికీ రాయలసీమలో వాడుక 'తెగ జెప్పవయ్యా ఏదో ఒకటి.' 'ఆయన బలే

ఖచ్చితం మనిషి. ఏదో ఒకటి తెగ జెప్తాడు' అంటారు.

తెగ గొట్టు

నఱుకు.

"అధముల్ల తలఁ దెగ గొట్ట లేదు."
రుక్మాం. 2.14.

తెగ గొను

1. అల్లెత్రాటిని లాగు.
భా. రా. యు. 221.

2. బాణమును సంధించు.
భార. ఉద్యో. 4.246.

తెగగోయు

1. ఖండించు.
వరా. 3.20.

2. తొలగించు.
కళ. 4.23.

తెగ జిక్కు

బాగా చిక్కుపోవు.

"తెగ జిక్కితి." సింహా. 2.86.

తెగ జూచు

చంపు.
భార. విరా. 2.229.

తెగటారు

1. చచ్చు
భార. ఆశ్ర. 2.161.

2. నశించు.
భార. అర. 4.254.

3. పూర్తి యగు.
వరాహ. 10.45.

తెగటార్చు

ధ్వంసము చేయు, చంపు.

"ఉద్దఁగిన చంద్రనిప్పు నికటార్జునముం దెగటార్చి." జైమి. 6.177.

తెగతెంపు సేయు

పరిష్కారము చేయు.

ఏదో ఒక వ్యవహారం వివాదం మొదలయిన విషయాలలోనే ఈ అర్థంలో ఈ పలుకుబడిని ఉపయోగిస్తారు.

"యమసూనుం డనుఁ గృష్ణుఁ జూచి బక దాల్భ్య వ్యాస కణ్వాది సంయము లుండం దెగదెంపు సేయ కిటు లేలా వారిఁ బొమ్మంటి."
జైమి. 8.210.

తెగ దలచు

తెగువ వహించు, సాహసించు.

"తగునె వలరాజ నీ కింత తెగఁ దలంచి, పరము కోపాగ్నిలోఁ బడి యెరిసి పోవ." కుమా. 5.74.

తెగ దీయు

అల్లెత్రాటిని లాగు.
భా. రా. కిష్కిం. 228.

తెగ దీర్చు

తెగ తెంపులు చేయు.

"తెగఁ దీర్పక తగ నార్పక, తెగటార్పక కడమ కొంత ద్రిక్కుఁగ నున్నన్." భార. శాంతి. 3.276.

తెగదు

పరిష్కారము కాదు.

వ్యవహారం, వివాదం మొదలయిన విషయాలలోనే దీనిని ఉపయోగిస్తారు.

"తెగ డిప్పుడు మూర్ణొల్లకుఁ, దగ వడు గఁగ రండు..." జైమి. 8.209.
"ఈ వ్యవహారం ఇప్పుడు తెగేది కాదు." వా.

## తెగదెంపులు చేయు

1. తెగించు.
"అన్నిటికిం దెగదెంపు చేసి."
లక్షు. 3.98.

2. సంబంధము త్రెంచుకొను.
"వానితో ఎన్నడో తెగతెంపులు చేసు కున్నాను." వా.

## తెగదెంపు వహించు

తెగించు.

'తెగదెంపు చేసుకొను' అను మరొక పలుకుబడి కూడా ఈ 'తెగదెంపు' పదంమీద యేర్పడ్డది ఉన్నది. సంబంధము లేకుండ చేసికొను అని దాని అర్థం. తెగువ, తెంపు అన్నవి రెండూ సమానార్థక పదాలే. నొక్కి చెప్పే సందర్భంలో అవి రెండూ కలిసి 'తెగదెంపు' అని వ్యవహారం యేర్పడింది.

"చిత్తవీథిలో, ధీరతఁ బూని లేని తెగ దెంపు వహించుచుఁ బల్కె నల్కతో."
శుక. 2.130.

## తెగ నమ్ము

ఎంతకో ఒకంతకు అవసరం కొద్దీ అమ్మివేయు.

"కాశ్మీరఖండంపుఁ గే, దారంబుల్ దెగ నమ్మఁగాఁ జనునె?"
పాండు. 3.40.
"నాపొలం పదిరూపాయిల కైనా తెగ నమ్మి నీబాకీ నేను రేపు సాయంత్రం లోగా తీర్చి పారేస్తాను." వా.

## తెగనాడు

1. పరుషముగా మాటలాడు.
రసిక. 3.95.

2. నశింపజేయు.
చం. రా. 6.90.

## తెగ నిండ తిగుచు

పూర్తిగా లాగు, తెగ లాగు.
"జగదేకనాథుమీఁదను, దెగ నిండఁ గఁ దిగిచి యొక్క దివ్యశరంబున్."
ఉ. హరి. 1.152.
"ఉరగేంద్రనిభ మైన యొక దివ్య శరము, తిర మొప్ప సంధించి తెగ నిండఁ దిగిచి."
సుగ్రీ. పు. 28.

## తెగ నీల్గు

విఱ్ఱవీగు.
"స్త్రీలఁ జూడ మటంచుఁ దెగ నీల్గు పెద్ద పెద్దల గర్వముల గంగఁ గలుపు వాఁడు."
శ్రవ. 3.53.

## తెగ వేయు

తెగ గొట్టు.
"ధనువుఁ దెగ వేసి యొక్క పాత కుఁడు." జైమి. 6.132.

## తెగబడు

తెగించు.
ఆహ. 1.88.

**తెగబాటు**

సాహసము.

నిర్వ. 10.19.

**తెగబారు**

ముందుకు సాగు.

"పవమాను నడ తెగబారకుండ."

కవిక. 1.14.

**తెగబారెడు**

పొడవైన.

"కప్పుదేరు తెగబారెడు నిద్దపు సోగ వెండ్రుకల్."

విజయ. 3.89.

**తెగబాఱు**

1. సాహసించు.

భార. అను. 1.190.

2. విజృంభించు.

రాజ. చ. 3.76.

**తెగ బెట్టు**

తెగ నమ్ము.

"చేతికైదువును నాశింపక తెగ ,బెట్టి."

హంస. 5.120.

వాడుకలో 'ఈ సొమ్ము ఎంతకో ఒకంతకు తెగబెట్టిరా' అంటారు.

**తెగవాపు**

అల్లెత్రాటిని లాగు.

భార. కర్ణ. 3.419.

**తెగ విడుచు**

బొత్తిగా వదలివేయు.

తెగపై వచ్చున విలాంటివే : తెగ నాడు; తెగ జెప్పు; తెగ నమ్ము; తెగ లాగు; తెగ వాగు – వగైరాలు.

"...తరుని వీని నింత మఱపించినను, పారc బెనిచి...నేcటి కెడcద నింత, నిర్మోహియై తెగ విడిచె దమ్మ?".

కుమా. 6.30.

**తెగవేయు**

నఱకు.

ఉ. రా. 4.330.

**తెగవేసి చెప్పు**

ఖండితముగా చెప్పు.

"ఇది నీకుఁ దెగి చెప్పుచుంటి నిటుపై నేమైన నా కే మికన్."

గీర. లోకా. 13.

**తెగవ్రేటు**

నఱకుట.

అచ్చ. బాల. 39.

**తెగ సాగు**

వృద్ధి చెందు.

"ఇంత రొక్క మింతకుc దెగసాcగనా యనక."

విజయ. 1.24.

**తెగి తెగని చిఱుకత్తి కోతగా**

తెగిపోవునట్లు కోయుటకంటె కొద్ది కొద్దిగా కోయుట యెక్కువ బాధాకర మనుటపై వచ్చిన పలుకుబడి.

"తెగి తెగని చిఱుకత్తి కోcతగ వధించుటుచితము."

ప్రభా. 5.174.

**తెగిన గాలిపట మగు**

స్వేచ్ఛాసంచారి యగు.

తాళ్ల. సం. 3.587.

తెగిన తెగనీ

ఏమయితే అది కానీ.

"తెగినఁ దెగనీ నాకు మరుఁడు నిన్ను నిలు మనన్ రాకునికిన్."

కళా. 3.245.

తెగిపోవు

1. భిన్న మగు.

ఉ. రా. 4.93.

2. ముగియు.

దశ. 4.51.

3. విడివడు.

ఆము. 4.7.

4. చనిపోవు.

భార. శాం. 3.369.

తెగి వచ్చు

సాహసించు, తెగించు.

"ఇమ్మాడ్కిం దెగి వచ్చితిం దెరువు లే దీ పాటు దప్పింపఁగాన్."

కళా. 3.103.

తెగుదల

ముగింపు.

నిర్వ. 9.53.

తెగుదాక బిగించు

మంచిపని అయినా మితి మించి చేసి చెడుపుకొను.

గట్టిగా లాగితే ముడి బిగుసు కొనడం నిజమే అయినా మరీ గట్టిగా లాగితే అసలే తెగిపోతుంది కదా!

కృష్ణని. 56.

చూ. తెగేదాకా లాగు.

తెగుదారి

1. సాహసికుడు, సాహసికు రాలు.

ఉ. రా. 6.240.

2. దాత.

ప్రభా. 1.102.

తెగుదెంపు

1. తీర్పు.

జై. 8.210.

2. సాహసము.

శుక. 2.130.

3. ఫలితము.

వేం. పంచ. 4.428.

తెగుదెంపు లగు

సంబంధములు తెగిపోవు.

"మాకూ వారికీ తెగుదెంపు లయి చాలా కాల మయింది."

వా.

తెగుబడి

1. తెగుట.

2. దుక్కి.

3. అమ్మకము.

బ్రౌ.

తెగువడు

విడిపడు.

సా. పంచ. 2.213.

తెగువతనము

సాహసము.

రాజ. శ. 25.

తెగువరి

1. సాహసికుడు, సాహసికు రాలు.

చంద్ర. 1.142.

2. వాడి యైనది.
3. దాత.
నరస. 5.88.

తెగేదాకా లాగు
చూ. తెగుదాక బిగించు.

తెచ్చికోల్నెయ్యము
కృత్రిమస్నేహము.
"రాజవియోగభ్రమ మడంచి తెచ్చికోల్నెయ్యము తోడుత నైన విను మటంచుం బలికెన్." శుక. 3.47.
ఇలాంటివే: తెచ్చికోలు నవ్వు, తెచ్చికోలు కోపము, తెచ్చికోలు ధైర్యము.

తెచ్చుకొను
వహించు.
ద్వి. పరమ. 5.403.

తెచ్చుకోలు
తెచ్చుకొనినది.

తెచ్చుకో లేడ్పులు
దొంగ ఏడ్పులు.
"తెచ్చుకో లేడ్పులు నిచ్చకంబులు వట్టి, యాసలు." కా. మా. 4.30.

తెట్టగిలబడు
1. బయటికి కనబడు.
ప్రభా. 2.42.
2. తొలగు.
బిల్హ. 2.159.
3. తేరుకొను.
రాధికా. 4.102.

తెట్టగిలు
తేలు.
రాధి. 4.102.

తెట్టతెన్ను
నడివీధి.
శ. ర.

తెట్టతెరువు
చూ. తెట్టతెన్ను.

తెట్టువ గట్టు
1. నురుగులు గట్టు.
"గుట్టసియాడ గుబ్బ చనుగుట్టలపైం బులకాంకురావళుల్, తెట్టువ గట్టం గోరికలు దీటలు వెట్టంగ వేడుకల్ మదిన్." విజయ. 1.126.
2. దళ మెక్కు.
"కరంగిన విండ్ల యప్పరుస కైవడిం దెట్టువ గట్టుపచ్చికన్." ఆము. 4.100.

తెట్టువ గొను
నురుగులు కట్టు.
పాం. 2.52.

తెట్టువలు గట్టు
నురుగులు తేరు (ప్రవాహము మెక్కు వైనప్పుడు.)
వెల్లువలో అచ్చటచ్చటగా గడ్డిపరకలు మొదలగు వానితో, నురుగుతో ఏర్పడునది తెట్టువ.
"నెత్తురు ముడువులం దెట్టువలు గట్టిన యంపకట్టియల..."
కా. మా. 2.63.
"కెలంకులం దేలి తెట్టువలు గట్టి."
పారి. 2.88.
"తెఱలి పాఱురక్తంబులును దెట్టువలు గొన్నమాంసంబులును..."
కళా. 8.129.

తెట్టువలు గొను

నురుగులు గట్టు.

కళా. 8.123.

తెట్టెలు గట్టు

"తెట్టువలు గొన్న మాంసంబులును దట్టెలు గట్టిన యస్థి శకలంబులును..." కళా. 8.129.

చూ. తెట్టువలు గట్టు.

తెట్టెలు గొను

ప్రోగుపడు.

ఉ. హరి. 3.27.

తెట్టెలు పెట్టు

చిక్కన అగు.

ఆము. 4.100.

తెడ్డు నాకి యుపవాసము మాన్పికొను

చిన్నపనితో పెద్ద నియమమును భంగము చేసుకొను.

"ఒచ్చెల! శూద్రభామినికి నువ్విళులూరి పథంబుఁ దప్పఁగా, వచ్చునె! తెడ్డు నాకి యుపవాసము మాన్పికొనంగ నేటికిన్." విక్ర. 1.150.

తెడ్డు బోయె పొమ్మను

పోతే పోయిం దని నిర్లక్ష్యముగా నుండు.

"పురుషుఁ డల్గినఁ దెడ్డు బోయెఁ బొమ్మని యన్య, కాంతునిఁ జేరు నీ కర్మురాలు." సానందో. 5.97.

'వాడి తెడ్డేం పోయింది' అనగా వాడి కేమంత నష్టము కలిగినది అనుపట్ల కూడా యీ తెడ్డు కనబడుతుంది. తెడ్డు ఇంటిలోని చిన్న వస్తువు కనుక అందుపై యేర్పడిన పలుకుబడు లివి.

తెడ్డుమూతికొంగ

ఒక రకమైన నీటిపక్షి.

శ. ర.

తెనమఱు

పరుండు.

ఆము. 6.72.

శ. ర. పాఠము.

తెనాలి రామలింగని పిల్లి

ఇష్టం ఉన్నా మునుపటి అనుభవంవల్ల ఆ పనికి ముగబడక పోవు అన్న సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"ఒకసారి ఆ కాలేజి అమ్మాయి చెంపలు వాయించింది. అప్పటినుంచీ వీడు ఆడపిల్ల లంటే కన్నెత్తి చూడడు. వీడి దంతా తెనాలి రామలింగని పిల్లి వ్యవహారం." వా.

రాయలవా రిచ్చినపిల్లికి వేడి పాలు పెట్టి పాలంటేనే దానికి హడ లెత్తేటట్లు చేశా డట తెనాలి రామలింగడు. ఆ కథపై వచ్చిన పలుకుబడి.

తెనుగు చేయు

ఆంధ్రీకరించు.

"కాశికాఖండ మను మహాగ్రంథ మేను, తెనుఁగు చేసెద..."

కాశీ. 1.7.

తెనుగు పడు
ఆంధ్రీకృత మగు.

తెనుగు పఱచు
తెనుగు చేయు.
చూ. తెనుగు చేయు.

తెన్నుండు
పరుండు.
కు. సం. 8.135.

తెప్పగట్టు
ఎక్కు వగు.
చంద్రా. 1.75.

తెప్పదెరల కురియు
విపరీతంగా కురియు.
"అప్పాండవబలములపై, దెప్ప దెరలఁ గురిసె శరతతిం దీవ్రముగాన్."
భార. భీష్మ. 2.381.

తెప్పదెరలు
ఎక్కు వై పాఱు.
శకుం. 1.42.

తెప్ప బోర్ల పడు
తలక్రిం దగు.
"పొంది తప్పుడు భక్తులు పుణ్యమునను, భోగ మో యప్ప యీ తెప్ప బోర్ల పడిన, నేమి చేసెద వరుల యుద్వృత్తి నణఁచు." సింహాద్రి. నార. శ. 29.

తెప్పల దేలు
1. పరిపూర్తిగా అనుభవించు
ప్రవాహము ఎక్కువగా ఉన్నప్పుడే తెప్పలు తేలును కనుక సంతోషము అంత ఎక్కువగా చెందినా డనునప్పుడు ఈ పలుకుబడిని ఉపయోగిస్తారు.
"చవిగొని జారవీర రతి సౌఖ్యము దెప్పలఁ దేల నెప్పుడున్, దివురుచు."
హంస. 1.223.

2. మునిగి తేలు, పరిపూర్తిగా నిమగ్న మగు.
"చిల్కు పూఁ,దేనియ సోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలి పల్కులన్."
పాండు. 4.112.

3. సంతోషములో తేలు.
సంతోషం ఇలాంటివి ప్రవాహం లాగా ఊహించుట పరిపాటి. అందుపై వచ్చిన పలుకుబడి.
"భూపాలునిచే మహీసురు లపారసుదక్షిణ లంది తెప్పలం దేలి యథేచ్ఛఁ గ్రాం చరుగ." జైమి. 1.66.
చూ. ఓల లాడు.

తెప్పల దేల్చు
విపరీత మైన నీళ్ళలో మునుగు.
"కంచిఁ దెప్పలఁ దేల్చె నకాలవృష్టి."
హర. 2.23.

తెప్పలుగ
పుష్కలముగా.
సుమతి. 20.

తెప్పలుగా
రాజ. చ. 1.89.
చూ. తెప్పలుగ.

తెప్పలుగా నమర్చు
అధికముగా కూర్చు.

"శానుకల్ దెప్పలుగా నమర్చి."
విజయ. 2.89.

తెప్పతెప్పునన్

ఒకదాని వెనుక నొకటిగా.

"వే చలియింప హృత్పుటము బీటలు వాఱఁగఁ దెప్పతెప్పునన్, గో చున దాఁక నూఁది... హంస. 2.31.

తెప్పున

1. శీఘ్రముగా.
ధ్వన్యనుకరణము.
ద్వి. హరి. ఉ. 1959 పం.

2. తటాలున.
రుక్మాం. 4.118.

తెమ్మలుగా

అధికముగా.
వరాహ. 8.68.

తెర కట్టు

యవనిక వేయు.

"యశమునన్ దెర కట్టె దిగంత మంత టన్." శ్రవ. 1.45.

తెర గట్టిన యట్టులు

మసక మసకగా.

చూపు విషయంలోనే దీనిని ఉపయోగిస్తారు. కండ్లకు తెర గట్టినట్లుగా ఉన్న దనుట.

"తరుణీ! యేమో తెలియదు, తెర గట్టినయట్టు లున్న వే కన్నులకున్... శుక. 3.362.

తెరచాప

నావకు కట్టే వస్త్రం. నావలో ఒక భాగము. ఇది గాలిని పోసుకొని నావ త్వరగా నడుచుటలో సహాయపడుతుంది.

తెరచిన కన్ను మూయ లేదు

నిద్ర లేకుండా సేవ చేసినా ననే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"తెల్లవార్లూ తెరచిన కన్ను మూయ లేదు. రోగిదగ్గరే ఉండిపోయాను."
వా.

తెరచి రా జను

త్రోసిరా జను.

"రమణీమణి ముఖము తెఱచి రా జన వలయున్." విజయ. 3.113.

తెరచీర

యవనిక.
పద్మ. 3.76.

తెర దిగింది

ముగిసినది.

"ఆ వ్యవహారంలో యింక తెర దిగినట్టే." వా.

నాటకాల ద్వారా వచ్చిన పలుకుబడి.

చూ. తెర పడింది.

తెర దీయు

బయల్పరచు.

"పొరుగువా రెల్ల పొరచి చూచిరి తెర దీసె నిదె తెగ నానలు."
తాళ్ల. సం. 3.546.

తెర పడింది

చూ. తెర దిగింది.

తెరపిని పడు

నిర్మల మగు.

నా. మా. 92.

తెరబొమ్మ

దిష్టిబొమ్మ.

తెరమీది బొమ్మవంటివాడు.

"వీఁ డొక్క తెరబొమ్మ విప్రవృశ్చికము." గౌర. హరి. ద్వి. 930.

తెరమరుగు దినాలు

మాయలో పడిన రోజులు.

"తెరమరుగు దినాలు దేవుఁడ నీ కల్పితమే." తాళ్ల. సం. 8.8.

తెరమఱుగు మెకమువలె

కానరాని ప్రమాదమువలె.

"తెరమఱుఁగు మెకమువలెఁ దిరుగు నీ బ్రదుకు." తాళ్ల. సం. 5.311.

తెరయీగ

తేనెటీగ.

భార. ద్రో. 1.258.

'పెరయీఁగలగతి' అని కూడా పాఠాంతరము ఉన్నది.

తెరల నెత్తి వచ్చు

దండెత్తి వచ్చు.

కుమా. 12.50.

తెరల నెత్తు

దండెత్తు.

"సురచయము పయిం దెరల నెత్త సమకట్టుట యున్." కుమా 10.178.

తెరల నెత్తు దెంచు

దండు తీసుకొని వచ్చు.

"మహాసేనుండు సేనానియై సుర వరులం, గైకొని తెరల నెత్తుదెంచుచున్న వాఁ డనిన." కుమా. 10.177.

తెరలబడు

స్వాస్థ్యము చెందు.

వి. పు. 6.225.

తెరలబారు

తొలగు.

హరి. పూ. 6.133.

తెరల బెట్టు

కాగబెట్టు, క్రాగునట్లు చేయు.

"దృష్టిపాతంబు నొడిలి మైఁ దెరలఁ బెట్టు." పాండు. 3.64.

ఎసరు మొదలయినవి త్రెళ్లుటలోనిదే యీ తెరలు. బాగా కాగినప్పుడే నీళ్లు తెళ్లుతుంది.

"వాడిబళ్లు తెరిలి పోతూ ఉంది."

వా.

తెరలుగ

విస్తారముగా.

భార. సభా. 1.225.

'తెరలుగ' అనిదే శ. ర. పాఠము. తెరలగ అని ముద్రిత పాఠము అప్రశస్తము.

తెరలు వుచ్చు

ఆధిక్యము కలుగజేయు.

నిర్వ. 1.55.

తెరలెత్తు
1. పొంగు.
ఉ. హరి. 4.216.
2. అతిశయించు.
వసు. 6.9.

తెరవల
చేపలను పట్టుటలో ఉపయో గించు ఒకరక మైన వల.

తెరవాటు గొట్టు
దారిదోపిడి చేయు, దారులు కొట్టు.
శివ. 4.54.
"తెరవాట్లు గొట్టి సత్తరువుఁ బెట్టుట కంటె, న్యాయార్జితాన్న మిం తైనఁ జాలు."
రామలింగేశ్వర శతకము. 3.
శివరాత్రి. 4.54.
కళా. 7.232.

తెరవాఱు
పొంగు.
ఆము. 1.68.

తెరవెనుక భాగవతము
బయటికి కనబడకుండానే లోలోన జరగు వ్యవహారం.
"ఈ విషయంలో తెరవెనక భాగవతం చాలా జరిగిందట." వా.

తెరవేట
వేటగాళ్లు తెరను అమర్చి అందులోని జంతువులు వచ్చి పడేటట్లు చేస్తూ ఆడే ఆట.
ఆము. 4.117.
రామా. 2.29.

తెరవేయు
పొంగు.
సా. 3.78.

తెరువరి
బాటసారి.
భార. ఉద్యో. 2.280.

తెరువాటీడు
దారి దోపిడి చేసేవాడు.
శ. ర.

తెరువాటుకాడు
దారి దోపిడి చేయువాడు.
వరాహ. 7.73.

తెరువాటు గొట్టు
దారిదోపిడి చేయు.
"నిరంతర తాళీదళ సంపుట ప్రకర కాంతారంబునం దర్ధపున్, దెరువాటుల్ దెగి కొట్టి..."
మను. పీఠిక. 9.
"వరుని ప్రేమ నడుమఁ దెరువాటు గొట్టె ని,ట్లుండ వలదె జగతి నువిద యైన."
కళా. 7.239.
"ప్రతివాసరంబు లేర్పడఁగఁ జేరువ గట్టి, వాటంబుగాఁ దెరువాటు గొట్టి."
శుక. 3.372.

తెరువు గట్టు
దారి కాచు.
"హత్తుకొని యొక్క కొందఱు, నత్తెరువుం గట్టఁ బనిచి..."
ఆము. 7.8.

తెరువుపెసర
అశాశ్వతము

దారిలో పెసరచేను ఎవరో కోస్తూ వుండి త్వరలో పోతుంది.

కవిక. 4.122.

**తెరువులు జరుగు**

ప్రయాణము సాగు.

"అవిదితాయామంబు లగుచుం దెరువులు జరుగ నరుగుచున్న సకల జనులు నక్కడక్కడం గడలకుఁ దొలంగి."

కళా. 8.141.

"శాస్త్ర వీదో లోకాభిరామాయణం మాట్లాడుకొంటూ పోతే త్రోవ జరుగుతుంది."

వా.

"పొద్దున్నుంచీ నడిచాం. ఇక్కడే ఉన్నాము. దారేమీ సాగ లేదు."

వా.

**తెరువు విడుచు**

దారి యిచ్చు.

కళా. 4.93.

**తెరువు వెట్టు**

బయలుదేరు.

భాగ. 6 స్కం. 270.

**తెరువు సాగు**

పోవు.

వేం. పంచ. 4.231.

**తెర్వులు కట్టి యేగు**

దారిబట్టి పోవు.

బాటసారి అగు అనుట.

పాండు. 5.75.

**తెఱకొను**

బయలుదేరు.

శ. ర.

**తెఱకోలుపు**

బయలుదేరునట్లు చేయు.

శ. ర.

**తెఱగంటి త్రోవ**

ఆకాశము.

అచ్చ. కిష్కిం. 57.

**తెఱగుపడు**

నెఱవేరు.

భార. ఉద్యో. 1.21.

**తెఱగు పఱుచు**

క్రమబద్ధము చేయు.

"ఎఱిఁగించి రాజ్యతంత్రము, తెఱఁగు పఱిచి నడపు వెరవు తేటపడంగా."

భార. మహా. 8.

**తెఱగు మాలు**

న్యాయము తప్పు.

"ఇట్టి కష్టపు టిడుమలఁ బెట్టెడిని ధర్మమా తెఱంగు మాలితే."

భార. స్వర్గా. 24.

**తెఱచిరా జను**

కాదను.

చదరంగం ద్వారా వచ్చిన పలుకుబడి.

ఒక పావును జరిపి రాజు అని ఆట కట్టివేయు అన్నమాట.

"రమణీమణి మఖము తెఱచిరా జన వలయున్."

విజ. 3.

చూ. తెరచిరా జను.

**తెఱనోరిమెకము**

సింహాము.

రామా. 2.56.

తెఱపిగొను

అవకాశము కలిగించుకొను.

శ. సం. 5.518.

తెఱపు మఱపు

ఒకప్పుడు తెలివిగానూ, ఒకప్పుడు తెలివి తప్పీ ఉండు స్థితి, తబ్బిబ్బు.

శ. ర.

"మా అమ్మ సంధిదోషం తగిలి తెఱపు మఱపు మాటలాడుతున్నది." వా.

తెఱపులుగొను

వికసించు.

నిర్వ. 8.79.

తెఱపులు చేయు

చీల్చు.

భా. రా. యు. 1073.

తెఱలు చుట్టు

వలలు పన్ను.

"శాబర బలసమూహంబు పొంగు వాఱియు, నొండొరులం జీరియుఁ దెఱలు చుట్టియు విక్రమంబులు పేర్చియు." రుక్మాం. 3.84.

తెఱవా మెకము

సింహము.

అచ్చ. అర. 7.

తెఱువాటు గొట్టు

దోపిడీ చేయు.

"లెస్స తెఱువాటు గొట్టితి లెమ్మటంచు, గ్రుడ్లకొలఁదిగఁ గన్నీరుఁ గ్రుక్కుకొనుచు." శుక. 3. 197.

తెలతెల నగు

తెల్లవాఱు.

"తెలతెల నయ్యెను దిక్కులు, పలపల నుడుగణము మాయఁ బాసెను బత్తుల్." హంస. 1.138.

తెలతెలబోవు

ఉదయమగు.

శ. ర.

తెలతెల వాఱు

అప్పుడప్పుడే ఉదయమగు.

"తెలతెలవాఱ మాననియతి న్నదికిం జని తీర్థ మాడి." పారి. 5.56.

తెలతెల వేగు

తెల్లవాఱు.

"తెలతెల వేగు నంత నరుదెంచు నభోమణి వోలె నారదుం, డలరుమొగంబుతో సభ రయంబునఁ జొచ్చిన." ఉ. హరి. 6.3.

"తెలతెల వేగిన నగ్గిరి, జలజలఁ బ్రవహించుసెలలచప్పుళ్లు." మను. 3.12.

తెలనాకు

లేత తమలపాకు.

కళా. 2.17.

తెలవాఱు

ఉదయమగు.

దశా. 8 అవ. 2.244.

హంస. 2.68.

తెలాఱు

ఉదయమగు.

చెన్న. 2.42.

తెలికడలి

పాలసముద్రము.

అచ్చ. అర. 114.

తెలికపిండి

తిలపిష్టము.

పద్మ. 6.118.

తెలికవాడు

గాండ్లవాడు.

ఆం. భా. ద్వి. 285.

తెలిగాము

శుక్రుడు.

శ. ర.

తెలిగొను

ప్రమాణము తీసుకొను.

విజ్ఞా. ప్రా. కాం. 91.

తెలియ బలుకు

తెలుపు.

"పతివ్రతాధర్మంబు దెలియఁ బలుక."

రుక్మాం. 5.86.

తెలివిగొను

మూర్ఛనుండి తేరుకొను.

హంస. 1.74.

తెలివిపడు

తెలియు, స్పష్టమగు.

భార. శాం. 6.2.

తెలివిపఱుచు

బోధించు.

ఆము. 6.69.

తెలివి చెడి తెల్లనైరి

వారి తెలివి తెల్లవారింది,

వారు తెలివిమాలి చేలు

పోయిరి.

"తెలివి చెడి తెల్లనై రనుపలుకు జగతి,

నిలుపు గతి దీపకలికలు వెలరువాతె."

క్షమా. 8.186.

తెలివి తెల్లవారు

తెలివి మాలు.

"నీ తెలివి తెల్లవారినట్లే ఉంది. వాడున్నాడేమో చూచి రారా అంటే అక్కడే ఉండి పోయావు. పని అంతా పాడయి పోయింది." వా.

"వాడి తెలివి తెల్లవారింది." వా.

తెలివి నొందు

తెల్లబడు.

"దిక్కులు విశదమై తెలివి నొంచె."

రుక్మాం. 1.142.

తెలివి పడు

తెలియు.

"తెలివి పడి యుండు."

సైవ. 4.110.

తెలిసినపెద్దలు

విజ్ఞానవంతులు.

'తెలిసిన పెద్దల దగ్గఱ మా

వంటి వాళ్ళం ఏం మాట్లాడు

తాము?' అని వాడుక.

వేంకటేశ. 94.

తెలుగుబడి

తెలుగుసేత.

నిర్వ. 1.8.

తెలుగు మీఱు

టెక్కులు పోవు.

"వాడీమధ్య మతీ తెలుగుమీరి పోతున్నాడు." వా.

తెలుపారు

తెల్ల నగు.

భార. విరా. 5.320.

**తెలుపుడు చేయు**

తెలుపు.

కవిజ. 2.67.
రుక్మి. 1.103.

**తెలుపువాఱు**

తెల్ల నగు.

నృసిం. 3.131.

**తెలు పెక్కు**

తెల్లబడు.

"తెలు పెక్క దిశల వెన్నెల, బలు పెక్కఁ జకోరకులకు బంధువులయ్యెన్, బాలు పెక్కఁ దొగలు గలుఁగలు, నలు పెక్కం జక్కవలకు నలవిరహంబులకున్." రుక్మాం. 4.132.

"నలు పెక్కం జనుముక్కులు, తెలు పెక్కం జెక్కులు." నిరంకు. 1.83.

**తెలువు లొందు**

తెల్లబడు, వికాసము పొందు.

"మొగములను దెలువు లొందెను."

విప్ర. 2.57.

**తెల్పారు**

తెల్ల నగు.

భార. శాం. 6.365.
కు. సం. 3.24.

**తెల్ల కాకి**

అరుదు.

"తెల్లని కాకులును లేవు."

సుమతిశతకము.

"ఉన్నపాటున తెల్లకాకిని తెమ్మంటే ఎక్కడనుంచి తెస్తాం?" వా.

**తెల్లగడ్డ**

వెల్లుల్లి.

శ. ర.

**తెల్లగా**

వెలవెల పోగా.

"మొగములు తెల్లఁగా."

కాశీ. 7.76.

**తెల్లగుజ్జు మెక్కు**

కల్లు త్రాగు.

గుజ్జు మెక్కడం అంటే త్రాగడం.

సారాయి ఎర్రగానూ, కల్లు తెల్లగానూ ఉంటుంది. దానిపై వచ్చిన పలుకుబడి.

"ఏమిట్రా! ఆపాటలు. తెల్లగుజ్జు ఎక్కువా? యేమిటి!" వా.

**తెల్లగ్రుడ్లు తేలగిలు**

కండ్లు తేలవేయు.

"తెల్లగ్రుడ్డులు తేలగిల్లి."

కవిక. 5.111.

**తెల్లచెన్నగులు**

ఒకరకమైన ధాన్యము.

హంస. 4.128.

**తెల్లటి యగు**

తెలియు.

"ఇట మీఁ దెవ్వరికిం దెల్లటిగా నీ విట్టులునికి."

భాస్క. యుద్ధ. 384.

**తెల్లనాకు**

లేత తమలపాకు.

శుక. 2.434.

**తెల్లనార**

ఒకరకమైన చేప.

శ. ర.

**తెల్లని వెల్లను పాలను (కొనుట)**

అమాయకత, అమాయకురాలితనం అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"తెలివలమే మెఱుంగుదుమె తెల్లని వెల్లను బాలటందుము."
వైజ. 4.94.

"మానుసులోఁ దెల్లని వెల్లఁ బాలనుట యెందున్ భ్రాంతి గాదే నృపా!"
పరమ. 3.62.

**తెల్లపోవు**

నిర్విణ్ణుడగు.

"సరాసరి వాళ్ల యింట్లోకి వెళ్లాను. ఒకావిడ ఎవరికోస మండీ అనేసరికి తెల్లపోయాను. ఇంతకూ నేను వెళ్లవలసిన యిల్లు ఆయింటికి పక్కయిల్లు."
వా.

**తెల్లబడు**

వెలవెల పోవు.

"మొగంబు తెల్లంబడ."
సింహా. 2.103.

**తెల్లబారు**

1. తెల్ల నగు.
2. వెలవెల పోవు.

నైష. 8.167.

**తెల్లమి యగు**

బయట పడు.

"మరుతంత్రానఁ జెలితో మరిగి యూతదుండగా, తెర యేల తీసేవె తెల్లమి గాను."
తాళ్ల. సం. 3.119.

**తెల్లమొగము వేయు**

వెలవెల పోవు.

"ఈ ఊళ్లో వాడు చేసిన వన్నీ నాకు తెలుసు. ఆ ఊరెళ్లి వాడేవో మహా ఘనతగా బతకాలని చూస్తూ ఉన్నాడు. నా మొహం కనిపించేసరికి తెల్లమొహం వేశాడు."
వా.

**తెల్లవారు**

వ్యర్థమగు.

ఇక్కడ శ్లేష.

"కల్లబాసల చేతఁ దెల్లవారిన చేతులు."
నిరం. 2.119.

చూ. బ్రతుకు తెల్లవారు.

**తెల్లవాఱు**

ఉదయమగు.

"అంతటతను దెల్లవాఱిన."

**తెల్లసవరము**

వింజామరము.

అప్ప. 5.11.

**తెలికికి నువ్వు పండినట్లు**

నువ్వులు గానుగాడి జీవించు వానికి నువ్వుపంట వచ్చినట్లు. అనగా చక్కని సదుపాయమైన దనుట.

తెలిక — జాత్యర్థంలో శ్రీనాథుడు 'తెలికల మిండగీఁడొకఁడు తియ్యనినూనెకు' అన్నాడు.

పండితా. ప్రథ. పురా. పుట. 387.

**తెవులు గొను**

వ్యాధిగ్రస్తమగు.

"ఇంత యేమిటి కాజారుఁ డేలుటెంత, తెవులుగొన నమ్మరా దంచుఁ దెలిసికొనరె."
శుక. 2.558.

తెవులుపడు

జబ్బుపడు.

కాశీ. 2.79.

తెవులువడు

వ్యాధిగ్రస్తుడగు.

"విశ్వసించిన సిరు ద్రావినను నిద్ర, పోయినను జూలుకొన్నను బొర్లుచున్నఁ, దెవులు వడ్డను గుంటైన దిట్ట చెడినఁ, జంపఁ డనుకంప నెట్టి హింస్రంబు నైన." కాశీ. 4.60.

చూ. తెవులు పడు.

తేగాకత్తి

చురకత్తి.

శ. ర.

తేజుమాల్ సేయు

మెఱుగు పెట్టు.

"చికిలి బాకును దేజుమాల్ సేయు నటుల." రాధి. 1.77.

తేటగొను

స్పష్ట మగు.

"తేటగొనఁ జూడు మాశించు దిక్కునందు, బ్రాహ్మణోత్తమ రుద్రులు పారి పదులు." కాశీ. 4.165.

తేటచలములు

ఒక రకమైన ధాన్యము.

ప్రబంధ. 112.

తేటతెనుగు

సులువుగా తెలిసే తెలుగు.

"తేట తెలుంగున ద్విపద రచింతు."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 18.

తేట తెలివిగా

స్పష్టముగా.

"భవిష్యము తేట తెలివిగా నాస తిచ్చు." కాశీ. 6.60.

తేట తెల్లగా

స్పష్టముగా.

కాశీ. 5.103.

తేట తెల్లమిగా

స్పష్టముగా.

"తేట తెల్లమి గాఁగ నంతయుఁ దెల్పుమా." సారం. 3.182.

రూ. తేటతెల్లముగా.

తేట తెల్లముగా

స్పష్టముగా.

హర. 6.32.

తేటపడు

స్పష్ట మగు.

"గురుసమున్నతి మెయిం దేటపడక." నిరంకు. 1.43.

తేటపఱచు

స్పష్టము చేయు.

హర. 5.52.

తేటలు పుట్టు

తేరు.

"ఎంత తేటలు పుట్టి ... వాగులు వంత లన్నియు."

వర. రా. కిష్కి. పు. 411. పం. 8.

తేటలు వెట్టు

తేట తేరు; పైకి తేలు.

"గుట్టసియాడ గుబ్బచనుగుట్టల పైఁ బులకాంకురావళుల్, తెట్టువ గట్టఁ గోరికలు దేటలు వెట్టఁగ ..."

విజయ. 1.126.

తేట లూరగ

రసవంతముగా.

నీరు తేట తేరినప్పుడు ఆస్వాద్య మగును గనుక తద్ద్వారా వచ్చిన పలుకుబడి. 'మాట తేనె తేట మనసు విషము' అని వేమన.

"చేరి తంబురమీటి సారసుధాసూక్తిఁ, దేట లూరఁగ వింతపాటఁ బాడు."

శుక. 3.14.

తేట వుట్టగ

తేటతెల్లముగా.

"ఆదిమకావ్య మందమై తేట వుట్టంగ."

వర. రా. బాల. పు. 3. పం క్తి. 30.

తేనియ జిక్కినట్టి ఈగగతి

ఆసపడి తగులుకొన్నట్లు. తేనెమీద ఆశతో ఈగ వాలుతుంది. తరువాత బయటికి రాలేక చిక్కుకుంటుంది.

"తేనియఁ జిక్కినట్టి యీఁగగతి."

కా. మా. 4.29.

తేనియ లుట్టు

మధురిమ ఉట్టిపడు.

"ఆకూతగర్భంబు లగుచుఁ దేనియ లుట్టఁ, గలికిపల్కులు ప్రవర్తిలుచు నుండు."

కళా. 7.212.

తేనెగద్ద

ఒక రకమైన పక్షి.

శ. ర., బ్రౌన్.

తేనెగాజు

ఒక రకమైన గాజు.

శ. ర.

తేనెతల వడ బండు

సమృద్ధిగా పండు.

"తేనెతల వడఁ బండె ధాత్రీతలంబు."

జైమి. 6.9.

తేనెతొన

ఒక రకమైన భక్ష్యము.

ఆం. భా. ద్వి. 256.

రూ. తేనెతొల.

తేనెతొల

ప్రబంధ. 112.

చూ. తేనెతొన.

తేనెదానిమ్మ

తియ్యదానిమ్మ.

శ. ర.

తేనెనీరు

పలుచగా ఉన్న తేనె.

చమ. 1.86.

తేనెపట్టు

మధుకోశము.

చూ. తేనెపెర.

తేనెపనస

తియ్యని తొనలుగల పనస.

బ్రౌన్.

తేనె పూసిన కత్తి

పైకి సాధువుగా కన్పించినా దుష్టుడు.

"తేనియపూసినకత్తివి గాక మానిసివె యూహింపన్." భార. ద్రోణ. 3.108.

తేనెపెర
మధుకోశము.
ఉ. రా. 2.50.
దశా. 4. అ. 30.
చూ. తేనెపట్టు.

తేనె లుట్టిపడ పలుకు
మధురముగా పలుకు.
"పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కు వు నేఁ డిది యేమి ?"
పారి. 1.117.

తేనె లుట్టు
మధురిమ తొలకు.
"ఆ నెలఁత తేటమాటలఁ, దేనియ లుట్టుటలు తేటతెల్లము..."
కళా. 3.29.

తేపతేపకు
మాటిమాటికి.
"తేపతేపకు దిమ్మతిరుగుఁ జుమ్మని మీఁదఁ, బడి హాళాహాళి సేయు భ్రమ రములకు."
శ్రవ. 3.26.

తేమ యెక్కు
తడి యగు.
"నీటను దేమ యెక్కి నసి నిల్చి యొకించుక వాఁడుదేఱి."
విప్ర. 2.23.

తేరకత్తియ
పరాయిస్త్రీ.
శ. ర.

తేరకత్తె
రూ. తేరకత్తియ.

తేరకాడు
పరాయివాడు.
"వెరవిడి నై తేరకాని విధమున నకటా !" భాస్క. యుద్ధ. 1401.

తేరకు తేర
ఉట్టినే, ఉచితంగా.
ఇది నేటికీ దక్షిణాంధ్రంలో విపరీతంగా వాడుకలో ఉన్న మాట.
"బళిరా ! తేరకుఁ దేరఁ దక్కె."
పాండు. 3.67.
"ఇదేమి తేరకు వచ్చిం దనుకున్నావా ! పదిరూపాయలు పెట్టి కొన్నాను."
వా.
రూ. తెకతేరకు.

తేరకొను
రెప్పవేయక ఉండు.
"చెప్పఁగా నుఱక శ్రోత్రపుటంబులఁ జొన్పి తేరకొఁ, గనుఁగొని కుంభిగాఁ దలిసి."
భో. 5.177.
నిర్వ. 4.85.

తేరదిండి
ఏ మాత్రము కష్టపడకుండ కలిగే అనుభవము.
పరమ. 5.30.

తేరమగడు
అంకుమగడు, విటుడు.
కవి. రా. 2.37.

తేరుకాడు
రథికుడు.
శ. ర.

తేరుతీసిన నాటి తీర్థమువలె
బోసి పోయినట్లు.
రథోత్సవం తర్వాత అంత

దాకా కలకలలాడుతూ ఉండి తీర్థం నిర్జనమూ, నిష్ప్రభమూ అవుతుంది.

"పసిబిడ్డలాదిగా బంధువర్గంబు, మసలక చనుదెంచి మమత లుప్పొంగఁ, దేరదీసిననాఁటి తీర్థంబువలెను, సారంగధరుఁ డున్నచందంబుఁ జూచి."
సారం. ద్వి. 2.159.

**తేఱుమామిడి**

ఒక రకమైన మామిడిచెట్టు.
వ. సం 7.96.

**తేఱకారతనము**

ఏదో పట్టినట్లు ఉండుట.

పరాయివాళ్లవలె ఉండుట.

"మీరు ద్వారకానగరంబునంబోలె దేఱకాఱతనంబున నుండక పాండవాగ్రజు నధ్వరంబు సముద్ధరింప వలయు."
జైమి. 3.79.

**తేఱికొను**

కనబడు.
రామా. 2.99.

**తేఱి చూపు**

ఱెప్పవేయక చూచు చూపు.

"జంకెలు తేఱిచూపు లెకసక్కెములుం."
భాగ. 10. స్కం. ఉ. 265.

**తేఱి చూడగ రాకుండు**

దుర్నిరీక్ష్యుఁడగు; దుర్నిరీక్ష్యమగు.

"దిగ్గజంబులకును దేఱి చూడఁగ రాక, యేపారు గజదైత్యుఁ డేమి యయ్యె."
కళా. 6.20.

ఎక్కువ ప్రకాశవంతమైన వానిని మనము తేఱి చూడలేము కనుక వచ్చిన పలుకుబడి. ఆ ప్రకాశం వైభవం కావచ్చు, వీర్యం కావచ్చు, మరేదైనా కావచ్చు.

**తేఱుకొను**

జబ్బునుండి లేచి స్వస్థత పొందు.
శ. ర.

**తేఱుగడ**

1. నేర్పు.
విజయ. 3.211.

2. మూర్ఛ మొదలయిన వాటినుండి తేరుకొనుట.
బ్రౌ.

3. నిర్ణయము.

"వివేకము లెల్లను వెచ్చబెట్టి వీ, రిచ్చట దొమ్మి గూడి కలహించినఁ దేఱుగ డేల పుట్టు." అహ. 1.105.

**తేఱుగడ యగు**

అస్తమించు.

"......చక్రవాళంపుఁ గొం,డగడిఁ దేఱుగడైనపట్లఁ దమముల్ మందేహులఁ దోలి." విజ. పీ. 5.

**తేలకండ్లు వేయు**

చూ. కన్నులు తేలవేయు.

**తేలగిలబడు**

మైమఱచు.

"పరువంపుఁ జినుకుల పసఁ ద్రొవ్వఁగొని తేల,గిలఁబడు వానకోయిలలమొప్పు."
హరి. పూ. 9.68.

తేలగిలబాఱు

మైకముతో తూగు.

"మీఱిన మదమున మెయి దేలగిలంగఁ, బాఱంగ."

గా. హరి. పంక్తి. 1391.

తేల జూచు

1. విమర్శగా చూచు.

కువల. 2.30.

2. ఉపేక్షించు.

"చిన్నవయసున నుండియు నిన్నె కోరి, యున్న నను బోయమరునికి నొప్ప గించి."

శశాం. 3.87.

తేలనాడు

తప్పు లేదన్నట్లుగా మాట లాడు.

"తెలియఁడు సాదుబిడ్డఁ డని నేరుపు మాటలఁ దేలనాడి గా,దిలి సుతు చేత."

సా. 3.55.

తేల బలుకు

అంత పట్టించుకోనట్లుగా మాట్లాడు.

"అవి మైత్రిఁ దాఁ దేలఁ బలుక వలయు."

ఆము. 4.259.

తేలవేయు

పడినశ్రమను తెలుపుతూ కండ్లు మొదలయినవాటిని నిస్సత్త్వముగా నుంచు.

"వాడు కండ్లు తేలవేసినాడు." వా.

"నే నింక యీ వ్యవహారంలో కలుగ జేసుకో నని వాడు కాళ్లు తేలవేసి నాడు." వా.

తేలవైచు

శ్రమను సూచిస్తూ కండ్లు తేలవేయు.

ప్రభా. 5.6.

తేలాడు

తేలు.

చంద్రా. 1.23.

తేలిపో బలుకు

"అల మేలంబు సేసికొని తేలిపోఁ బలికి." ఆము. 5.56.

చూ. తేల బలుకు.

తేలిపోవు

డీలుపడు.

"తేలిపోవక వనదేవతలార, చాల వేగమె రామచంద్రు రమ్మనుడు."

వర. రా. అర. పు. 179. పంక్తి. 8.

తేలియాడు

తేలు.

నైష. 5.161.

....తేలు

నిర్ణయమగు.

వీరనారాయణ. 72.

"ఆ సంగతి యింకా తేల లేదు." వా.

"వాడు వట్టి వెధవ అని తేలింది." వా.

తేలు కుట్టిన దొంగవలె

చడీ చప్పుడు గాకుండ.

ఇది వాడుకలో—'దొంగకు తేలు కుట్టినట్లు' – 'కన్నంలో తేలు కుట్టినట్లు' అని విన వస్తుంది. దొంగతనానికి వచ్చినవాడు తేలు కుట్టినా బాధతో అఱచుటకు వీ

లుండదు. అఱచిన పట్టు
పడును. అఱవ కున్న బాధ.

"తమ్ము నన్వేషించు నత్తమామలం
గలసికొని తేలు గుట్టినదొంగలం బోలె
మెలంగుచుండ్రుగాంగనలును..."

శుక. 2.10.

తేలుబాణము

ఒక రకమైన బాణసంచా.

హంస. 3.29.

తేలుమణి

తేలుకొండి.

శ. ర.

తేలుమీను

ఒక రకమైన చేప.

ప్రబంధ. 195.

తేలుమొన

తేలుకొండి.

ఆం. భా. ద్వి. 66.

తేలువాఱు

తేలు, కలుఁగు.

"హృదయంబున సత్కృప తేలు
వాఱఁగా." రుక్మా. 1.33

తేల్చు

సంతోషింప జేయు.

"ఇట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చెనో,
తామరసాక్షి !"

పారి. 1.89.

తెళ్లూ జెళ్లులూ ప్రాకిన ట్లగు

అతి దుర్భర మగు.

"వా డామాట అనేసరికి నాకు
ఒళ్లంతా తెళ్లూ జెళ్లులూ ప్రాకిన
ట్లయింది." వా.

తైతక్క లాడు

కోపముతో గానీ, ఆనం
దంతో గానీ యెగిరి గంతులు
వేయు.

"తా నొచ్చేసరికి యింట్లో ఉండే
దంతా ఊడ్చివేశా రని వాళ్లమ్మ
తైతక్క లాడుతూ ఉంది." వా.
"వాళ్ల అత్త వెళ్లిం దనేసరికి ఈవిడ
తైతక్క లాడుతూ ఉంది." వా.

తైరు కొట్టు

తాళము వేయు, పొగడు.

ఇటీవల వాడుకలోనికి వచ్చిన
పలుకుబడి.

"ఆ మేనేజరును తైరు కొడుతూ వాడు
కాలక్షేపం చేస్తున్నాడు. ఇందులో
వాడి తెలివితేట లేముంది?" వా.

తైలం

డబ్బు.

"కాస్త తైలం పడితే గానీ వాడిదగ్గర
పని కాదు." వా.

ఏదైనా బిఱ్ఱుగా ఉన్నవస్తు
వులకు ఆముదం గానీ నూనె
గానీ వేస్తే అవి సాఫీగా తిరు
గుటపై యేర్పడిన పలుకుబడి.
పూర్వం కందెన ఇలాంటిదే.

చూ. కందెన వేయు.

తొంగలిగొను

ప్రకాశించు.

"తొంగలి ఱెప్పల మెఱుఁగులు,
తొంగలిగొను మేను వదనతోయరు
హంబున్."

ష. 2.47.

తొంగలిపట్టియ

నడుము నకు కట్టుకొను వ్రేలాడుపట్టీ.

కుమా. 9.25.

తొంగలిపాటు

నమస్కారము.

పాండు. 4.213.

తొంగలితెప్ప

నిండుగా వెంద్రుకలు గల కనుతెప్ప.

పా. 2.47.

తొంగి చూచి పోవు

ఆనుషంగికంగా ఒక సారి చూచిపోవు.

నేటికీ వాడుకలో 'ఊరికి పోతూ పోతూ అతడు ఉన్నాడేమో నని ఒకసారి వెళ్లి వాళ్లింట్లో తొంగి చూచాను.' 'వాడు ఇటీవల ఒక్కసారైనా ఇటు తొంగి చూడ లేదు.' 'పోయేటప్పుడు ఒకసారి యిటు వచ్చి తొంగి చూచి పో.'

"వే ఱొక్కకడ కేఁగు వేళల నటు తొంగి, చూచి పోఁ దలఁపనిసాగసు వాఁడు." హంస. 5.217.

తొంగి తొంగాడు

దోగాడు.

"అర్భకుఁడు లీలఁ దొంగి తొంగాడు వేళఁ, గరకమలపాదపంకజక్రమముఁ జూడ, ధర్మ మీరీతి నాల్గుపాదముల నడచు, నింక నని చూపఁజను వెల్ల నేర్పరించె." నలచ. 2.46.

తొంగి దోగు

వంగుతూ దోగాడు. జం.

"తొంగి దోఁగియుఁ గొన్ని జంగలరిగి." కా. మా. 3.193.

తొంగుండు

1. పొంచి యుండు.

"నిచ్చలుఁ దొంగుండెడు కన్న గాండ్రు విని." కా. మా. 4.52.

2. నిద్రించు.

కొన్ని ప్రాంతాలలో, కొన్ని వర్గాలలో తొంగున్నాడు అనగా నిదురించుచున్నాడు అన్న అర్థంలో ఉపయోగిస్తారు.

తొంటచెయ్యి చూపు

లే దను.

"ఇంతవఱకు నిదిగో యదిగో యని త్రిప్పి......యీపూట తొంటచేయి చూపెను."

చింతా. 3. అం. 28. పు.

చూ. మొండిచెయ్యి చూపు.

తొండపుత్రాడు

మోట గూనకొనలో కట్టు దారము.

దీనినే 'తొండాపుత్రాడు' అంటారు.

శ. ర.

తొండపుదోమ

ఒక రకమైన పెద్ద దోమ.

శ. ర.

**తొండముక్కు వడు**

బాగుగా పండు.

"పెస రుసురుకొనియె దవనిక పొదలె, తెక్కు ప్రాఁగు దొండముక్కు వడియె." కాశీ. 3.23.

**తొండము లేని ఏనుగు**

ఏనుగంత పెద్దదే కానీ తొండం మాత్రమే లేదు. దేనిలోని ప్రధానగుణంతో నైనా పోల్చవలసి వచ్చినప్పుడు ఇట్లా అనడం అలవాటు. ఉదా: తోక లేని కోతి.

"అప్పాలమువరాహపోతములు భూవర! తొండము లేనియేనుఁగుల్." మను. 4.18.

**తొండరూపురిక్క**

పుష్యమీనక్షత్రము.

**తొండాడు**

తొందర పెట్టు.

శ. ర.

**తొండొరు**

సోమరిపోతు.

ఆం. భా. తృ. 6.

**తొందర చేయు**

బాధ పెట్టు.

"వార్ధి నాథునిన్, దొలుత జయించితిన్ బవనుఁ దొందర చేసితి." అని. 5.6.

"బాకీ యివ్వమని వాడు రోజూ నన్ను తొందర చేస్తున్నాడు. ఆ బాధ పడలేకుండా ఉన్నాను." వా.

**తొందరపడు**

1. తొట్రుపడు.
2. వేగిరించు.

శ. ర.

**తొందరపాటు**

సంభ్రమము.

శ. ర.

**తొందళము**

రెండు మూడు రకములైన కూరలతో వండిన ధప్పళము.

శ. ర.

**తొంబగిలు**

గుంపు కూడు.

అప్ప. 4.252.

**తొంబదిపాళ్లు**

చాలావరకు.

"దానిచేఁ దగ్గుఁ దొంబదిపాళ్లు దురుపద్రవంబు..." పాణి. 4.127.

**తొంభై రెట్లు ఎక్కువ**

అధికుడనుట.

"వేఱొకఁ డంతకన్నఁ దొం, బదిరెట్లు లెక్కుడగు." శ్రవ. 4.31.

**తొంభై లక్షలు**

అనేకం.

"అది యేమి కర్మమో తొంబదిలక్షలాసంగె నేని..." పాణి. 2.44.

**తొంభై విఘ్నాలు వచ్చినా**

ఎన్ని ఆటంకాలు కలిగినా.

"విడకుండులే నిజము తొంబది విఘ్నములిందు వచ్చినన్." పాణి. 2.38.

తోకతోక
నీళ్లు ఉడుకునప్పటి ధ్వన్యను కరణము.
హార. 6.59.

తోకతోకమాటలు
అస్పష్టము లయినమాటలు.
"తోకతోకమాటల న్నొసలఁ దుంపెస లాడెడు నుంగరంపు వెం,డ్రుకలును గల్గి."
కవిరా. 2.47.

తోకతోక లగు
తడబడు.
"ఒకలాగున మాటలు తోక, తోక లై వెడలంగఁ జొచ్చె."
నిరం. 4.66.

తొక్క ఒలిపించు
చర్మం ఒలిపించు.
ఒక తిట్టు.

తొక్కటపడు
బాధపడు.
ఉ. రా. 6.205.

తొక్కటపాటు
బాధ.
ఉ. రా. 7.434.

తొక్క లెక్కగొట్టు
చమడా లెక్కగొట్టు.
ఒక తిట్టు.

తొక్కుపలుక్కులు
చిన్నపిల్ల లాడే ముద్దుమాటలు.
చిన్నతనంలో పిల్లలు అస్పష్టంగా బుజ్జిబుజ్జిగా మాట్లాడేమాటలు.
"గురుపదధ్యాన విస్ఫురణము లెన్న, వేదాంతసూక్తుల వెడ దొక్కుపలుక్కు, లాది శివాచార మదియ వర్తనము."
బసవ. 1.8.

తొక్కుల బడు
కష్టముల పాలగు.
"తొక్కులఁ బడె జీవుఁడు దుండగీల చేతను."
తాళ్ల. సం. 8.64.

తొక్కులాడు
1. ఎగురు లాడు, గంతులు వేయు.
ఎత్తిపొడుపుగా అనుమాట.
"తక్కుల మొన్న నామఱంద లితోడ నీవు వోరి, తొక్కులాడితివి చాలు గట్టకురా!"
తాళ్ల. సం. 4.134.
2. తొందరపడు.
'అంత తొక్కులాట అయితే నేను చేయలేను. ఇవన్నీ నెమ్మదిగా చేయవలసిన పనులు.'
ఈ అర్థంలో ఇది రాయల సీమలో ఎక్కువగా విన వస్తుంది.

తొగటవాడు
ఒక జాతి నేతగాడు.
హంస. 2.12.

తొగరించు
అనురాగము పొందు.
అచ్చ. భా. 3.43. పు.

**తొగరుకొను**

ఎఱ్ఱ నగు.

"వచనమ్ములు పల్కక యుండడ నిమ్మ కడ, దొగరుకొనంగ నిమ్మ." గంధ. 192.

**తొగరుకొల్పు**

ఎఱ్ఱని రంగు వచ్చునట్లు చేయు.

ఆము. 2.18.

**తొగలు పెట్టు**

బాధించు.

రం. రా. యు. 283 పు. 28 పంక్తి.

**తొచ్చెము చేయు**

తక్కువ పఱుచు.

పాండు. 2.153.

**తొటతొట**

నీరు మొదలయినవి పడుట లోని ధ్వన్యనుకరణము.

వైజ. 2.146.

**తొట్టగిలబడు**

రూ. తొట్టిగిలబడు.

**తొట్టగిల్లు**

అధిక మగు.

"తీపులు పుట్టి దోషముల్, పొందుగఁ దొట్టగిల్లి." కవిక. 5.111.

**తొట్టరి**

దుష్టుఁడు.

పండితా. దీక్షా. 43 పు.

**తొట్టికట్టు**

రాజ ప్రాసాదములోని అంతరువు.

యా. 4.774.

**తొట్టికొను**

1. వ్యాపించు.

రామా. 2.92.

2. ఎక్కు వగు.

ఉ. రా. 5.113.

3. తేరు; ఉబుకు.

"...వేడుకల్ మదిన్, దొట్టికొనంగ నచ్చెరువు..." విజయ. 1.126.

**తొట్టిగిల బడు**

కూలబడు.

"ఆఁక టఁ, దొట్టిగిలం బడుచుఁ బడుచు." పాండు. 4.165.

**తొట్టి తొంపరలాడు**

ఛిన్నాభిన్నము చేయు.

"దొరల వేవురఁ దొట్టి తొంపర లాడి."

వర. రా. బా. పు. 19. పంక్తి. 16.

**తొట్టినోరు**

తొట్టివంటి పెద్దనోరు.

"వారి, తొట్టినోరను ముద్దు పెట్టఁ దగునె." హంస. 1.61.

**తొట్టిమంచము**

ఉయ్యాలమంచము.

ఉద్భ. 3.54.

**తొట్టుతొట్టున**

ధ్వన్యనుకరణము.

బహు. 3.3.

**తొట్టున**

హఠాత్తుగా.

శుక. 2.261.

పాంచా. 2.71.

తొట్టుపడు
తడబడు.
"ప్రాజ్ఞుఁడు కలహమునఁ దొట్టుపడక తొలంగుట."
భార. శాం. 5.565.

తొట్రగిల్లు
తడబడు.
ఆం. భా. ప్ర. 143.

తొట్రిల వడు
తొట్రిల్లు, భయసంభ్రమా శ్చర్యాదులతో మాటలు తొందరపాటున తప్పిపోవు.
"పలుకులు దొట్రిల పడఁగ."
పండితా. ద్వితీ. మహి. పుట. 4.

తొట్రుకొను
1. తడబడు.
సాంకే. 1.164.
2. కవియు.
శకుం. 2.135.

తొట్రుపడు
తడబడు.
"అనియెన్ మది తొట్రుపడఁగ నభినవలీలన్."
రాజశే. 3.107.

తొట్రుపాటు
తడబాటు, సంభ్రమము.
భార. విరా. 2.106.

తొట్రులు పడు
తడబడు.
దశ. 4.99.

తొట్రువుగొను
తొట్రుపడు.
శితా. పర్వ. 522. పా. 13 పం.

తొడతొక్కిడి
జనసమ్మర్దం.
"ఇల్లేమో చిన్నది. జన మేమో ఎక్కువయ్యారు. మరీ తొడతొక్కిడిగా ఉంది."
వా.

తొడ దట్టు
కయ్యమునకు పిలుచు.
కుస్తీ పట్టునప్పుడు వస్తాదులు తొడలు చఱచుటపై వచ్చిన పలుకుబడి.

తొడపాయసము పెట్టు
తొడ నులుము.
వీధిబళ్లలో పిల్లవాళ్లకు తొడ పాయసం పెట్టడం అలవాటుగా ఉండేది. బుగ్గ నులమడంలాంటిది.

తొడబడు
తొట్రుపడు.
రాధి. 4.102.

తొడబలం
యౌవనం.
'తొడబలం ఉంటే తొంభై మందిని పోవచ్చు' అని ఒక సామెత.

తొడబెల్లము పెట్టు
చూ. తొడపాయసము పెట్టు.
శ. ర.

తొడరాడు
తిరస్కరించు.
కు. సం. 12.204.

తొడ లప్పళించు

తొడలు తట్టు.

"ఇంచుకంత వంచి యిరువురుఁ దొడ లప్పళించి వెలికి తెఱపి లేమిఁజేసి."

కా. మా. 4.190.

మల్లులు ఒకరి నొకరు దొర కొనునప్పుడు తొడలు తట్టు కోవడం అలవాటు. దానిపై వచ్చిన పలుకుబడి.

తొడలు వడిపెట్టు

తొడపాయసము పెట్టు.

"తొడలు వడిపెట్టి కోదండ మడరఁ గట్టి."

హంస. 3.141.

తొడసంబంధం

కామసంబంధం.

"తొడసంబంధం తొంభై యేళ్లయినా పోదు."

సా.

తొడ సోకు

సంభోగసౌఖ్య మెఱుఁగు.

"వానికై చంద్రరేఖ యను స్వారవనిత, మునుపు తొడ సోఁక కుండియు మోహ మందు."

శుక. 2.64.

తొడింబడు

తొట్రుపాటు చెందు.

"వేఁడియూర్పు దగఁ బుచ్చి తొడిం బడఁ గొంతసేపు."

భాస్క. అయో. 147.

తొడికాళ్లు పడు

తొట్రుపడు.

ద్వి. భార. విరా. 1.12.

తొడికించు

కలిపించు, పట్టుకొన జేయు.

"దుష్టోరగంబున దొడికింత మనుచు."

బస. 6.161.

తొడికి పట్టు

ఒడిసి పట్టు.

"బలభేది కరి దొడ్కి పట్ట."

కుమా. 10.66.

నైష. 2.15.

"వగలఁ గోపము పామువలె నాలుక చాచఁగ, పగటు తొడికి పట్టఁగ నేరు తువా!"

తాళ్ల. సం. 8.207.

తొడితెచ్చు

వెంట తీసుకొని వచ్చు.

ఉ. హరి. 1.55.

తొడితొడి (చూచు)

సారెసారెకు, గబగబా, వెంటవెంటనే.

"ఆనందభరితాత్ముఁడై కృపాదృష్టి, దోనమురాజయ్యఁ దొడిఁదొడిఁ జూచి."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 253.

"తొడితొడిఁ గంసుడు దేవకి, కొడుకుల నార్వుర వధింప." భాగ. 10 స్కం. పూ. 57.

తొడితొడి (మ్రొక్కు)

సారెసారెకు (మ్రొక్కు.)

"తొడిఁదొడిఁ జాఁగిలఁబడి మ్రొక్కి మ్రొక్కి, కడుభక్తి ముకుళిత కరపద్ముఁ డగుచు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 260.

తొడి పూసి కట్టు

వస్త్రభూషణ మాల్యాదుల ననుభవించు. తొడుగు, పూయు, కట్టు – అనుట.

"తొడి పూసి కట్టి సంతోషంబుతోడ,
......దెంచి కని రంత మ్రోల."
ద్విప. మఘు. పు. 2.

తొడిబడు
తొట్రుపడు.
కాళ్లు త్రొక్కుకొను వంటిది.
"తొడిబడ నొకమందు దొరకె మాకు."
తాళ్ల. సం. 5.2.
"వయసైపోయి ఆయనమాటలు తొడి బడుతున్నాయి."
వా.

తొడివి కట్టు
వస్త్రాభరణములు ధరించు.
క్రీడా. పు. 44.

తొడివెంద
ఒక రకమైన పండ్లచెట్టు.
కాళ. 6.69.

తొడుక పోవు
తోడుకొని పోవు.
పిలుచుకొని పోవు.
"బోధమయున్ సంసారాం, భోధి తరణిఁ గొలువఁ దొడుక పోయెద రనుచున్."
కా. మా. 4.51.

తొడుకొని పోవు
తోడ్కొని పోవు, పిలుచుకొని పోవు.
"గుడికడ కేము దొడుకొని పోయె దము."
బస. 6.163.

తొడుగఱ లగు
ముండ్లకంప లగు; చిక్కుపోవు.
"మంచపుఁ, దొడుగఱలై రట్టె రజ ఱతో నేమందున్."
స్వా. 3.131.

'కంప అయిపోయిం దాపిల్ల' అని వాడుక.

తొడుగఱ్ఱు
రూ. తొడుగఱ.

తొడుపుకత్తి
ఒక రకమైన కత్తి.
చేతికి తగిలించుకొను ఇనుప తొడుగు ఒకటి దీనికి ఉంటుంది.
శశాం. 5.21.

తొడుసు మాలు
ఆటంకము తొలఁగు.
"మదా, క్రాంతుని గెలిచెద నని నిజ, కాంతుఁడు చనఁ దొడుసు మాలెఁ గద యిపు డనుచున్."
శుక. 3.146.

తొత్తుకు బడితొత్తు కలదె ?
బానిసకు బానిస ఉంటుందా ?
"రాముఁ బట్టము గట్టఁగా రాజు పూనె,
భరతుఁ డిల కట రఘుపతిబంటువాఁడు,
నీవు కౌసల్యదాసివి నే నిఁ కేల, వెలఁది!
తొత్తుకు బడితొత్తు గలదె యెందు."
దశా. రామ. 250 పే.

తొత్తుకొడుకు
1. బానిస.
"తొత్తుకొడుకులు వోలెఁ దోడ్తో దిగంత, భూమిపతు లంపుచున్నారు కామితములు."
కళా. 7.24.
2. లంజకొడుకు.
ఒక తిట్టు.
"ఆ తొత్తుకొడుకు ఎంతపని చేశాడో చూచావా ?"
వా.

**తొన్నుండు**
పరుండు.
వేంక. మాన. 47.

**తొప్పదొరుగు**
ఎక్కువగా స్రవించు.
శకుం. 3.223.

**తొప్పదోగు**
పూర్తిగా మునుగు.
"తొరఁగు నస్రాంబుధిఁ దొప్పదోఁగు."
పాండు. 3.102.
"రక్తములఁ దొప్పదోఁగి మూర్ఛలను వ్రాలి."
జైమి. 2.85.
కాశీ. 6.178.

**తొప్పదోచు**
ముంచు.
హరి. ఉ. 2.46.

**తొప్పన దోగు**
తెప్పల దేలు.
"తెగనిరాజసము నై దినసాథకులుఁడ, వానఁ దొప్పనదోఁగి వఱలఁ జెన్నిట."
హరిశ్చం. 1. భా. 2052. పు. 132.

**తొప్పలు దొరలు**
కోటానకోట్లు.
"తొత్తులువోలెఁ దక్కుదురు తొప్పలు దొరలు ముక్తిభామినుల్."
కాశీ. 2.49.

**తొమ్మాడు చేయు**
పాడు చేయు.
శ. ర.
"దానిని తొక్కి తొమ్మాడు చేసి నాడు."
వా.

**తొమ్మిదవ అష్టకము**
బూతుల పంచాంగం; తిట్లకు దిగుట.
అష్టకాన్నే అర్థం అని కూడా అనుట తొలినుంచీ అలవాటు.

**తొరితొరి**
బాగుగా.
శ. ర.

**తొర్లుగట్టె**
గొల్లవాడు పశువులను తోలే పొడుగుపాటి కఱ్ఱ.
హంస. 2.75.

**తొర్లుగోవి**
చూ. తొర్లుగట్టె.

**తొర్లుబూట**
అర్థము విచార్యము.
పూటలలోనే ఒకవిధ మైనది.
తాళ్ల. సం. 10.142.

**తొఱగు చొచ్చు**
పశువులు తప్పించుకొని పోవు.
విజ్ఞా. ప్రా. 13.

**తొఱగు వోవు**
చూ. తొఱగు చొచ్చు.

**తొఱటలు వాఱు**
చిల్లులు పడు.
జై. 7.101.

**తొఱతేనె**
పుట్టతేనె.

తొఱద్రొక్కు
గట్టిత్రొక్కుడు.
ఉ. హరి. 4.20.

తొఱ్ఱతేనియ
చెట్టుతొఱ్ఱలో పట్టిన తేనె
పట్టులోని తేనె.
కాశీ. 3.68.

తొఱ్ఱపులుగు
గుడ్లగూబ.
నీతి. 65.

తొఱ్ఱియక్కరము
యాదృచ్ఛికము.
పురుగు తొల్చినపుడు అక్షర
వతుగా కనిపించినా అది
యింకాస్త తొలిస్తే ఆ
రూపం కాస్తా చెదిరి పోతుంది.
అంతే కాక అది ఆనుషంగికం
మాత్రమే.
ఘుణాక్షరన్యాయం కూడా
యిలా యేర్పడిందే.

తొఱ్ఱుపట్టు
గోశాల.
భార. ఆర. 8.210.

తొలంగుబావ
ఎదురుగా నిలుచుండ గూడని
వాడు.
బావ వరుస వారిని చూచి
మఱదండ్లు గౌరవసూచక
ముగా తొలగిపోవుట అల
వాటు. దానిపై వచ్చిన
పలుకుబడి.
"నవసారసలక్ష్మి తొలంగుబావ."
పారి. 2.41.

తొలకరివాన దొరతన
మెంచదు
తొలకరివాన ఎప్పుడు పట్టితే
అప్పుడు గబగబా వస్తుంది.
దొర అయితే మాత్రం
ఏమిటి? దానికి లెక్కా?
వేంకటేశ. 75.
చూ. చిచ్చు సింగార మెంచదు.

తొలకాడు
1. ఒలుకు.
విక్ర. 6.27.
2. ప్రకాశించు.
కు. సం. 8.9.
3. అతిశయించు.
నిర్వ. 7.132.
4. తొణికిసలాడు.
"అరదము డిగ్గి ప్రేమ దొలకాడ."
భాగ. స్క. 4.307.

తొలగ త్రోయు
తొలగించు.
"దుస్తర క్లేశ మంతయుఁ దొలఁగఁ
ద్రోచి."
పాండు. 2.50.

తొలగుడు పడు
ప్రక్కకు తొలగు.
భాగ. 8 స్కం. 38.

తొలగుబావతనము తొలగి
దూరముగా నుండవలసిన
వరుసను పాటింపక.

"తొలగుబావతనంబుఁ దొలఁగి యా వాలి, యొలమితో మఱఁదలి నేలుచున్నాఁడు."
శర. రా. కిష్కిం. పు. 313. పంక్తి. 3.

**తొలతేనె**

పుట్టతేనె.

హంస. 2.182.

**తొల తొల డను**

తొలగుడు, తొలగుడు అను.

"తొల తొలఁ డనుచు నా త్రోవఁ బొం డనుచు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 289.

**తొలిక్రొత్త**

సరిక్రొత్త.

"తొలిక్రొత్త వలిపంపుదోయి కట్టి."

హర. 4.95.

**తొలికోడికూత ప్రొద్దు**

ఉషఃకాలము.

తొలిసారి కోడి కూయుసమయము.

"చారణుని వెంట నంటి విచార ముడిగి, చనియెఁ దొలికోడికూఁత ప్రొద్దునఁనె లేచి." శుక. 3.138.

**తొలికోడి కూయగానే**

తెల్లవారుజామున నే.

"వాడు తొలికోడి కూయగానే పొలం వెడతాడు." వా.

**తొలిముద్ద**

మొదటి ఆహుతి; ప్రథమ కబళం.

"అని తొలిముద్ద గొందుము రయంబున నాతని ... వెండి ద్రోణులకా, దును ముదుము..." ఉద్యో. 4.208.

**తొలుగుడు కన్ను**

గుడ్డు తొలగిపోయిన కన్ను.

ప్రక్కకు పోయిన కన్ను.

పండితా. ద్వితీ. మహి. పు. 108.

**తొలుప్రాకు**

నిడుకొయ్య.

భార. శాం. 4.293.

**తొలుబాము**

పూర్వజన్మము.

భార. శాం. 1.185.

**తొలుమాపు**

సాయంకాలము.

"అభినవోన్మేషజం బైనట్టి తొలుమాపు." కాశీ. 3.22.

**తొలుముద్ద గొను**

మొదటనే బలి తీసుకొను.

తొలిముద్దగా పరిగ్రహించు అనుట.

"...ఈతని నొకభంగి నండగొని తప్పదు చావున కంచు నున్నవాఁ, డనిఁ దొలుముద్ద గొందుము రయంబున నాతని..."

భార. ఉద్యో. 4.208.

చూ. తొలిముద్ద.

**తొలుముద్ద యగు**

ప్రథమకబళ మగు.

"మును దుర్మర్షణుఁ డిదె యిం,దున నడు మరదంబు వీఁడు దొలుముద్ద యగున్."

భార. ద్రోణ. 3.39.

**తొలుమేను**

పూర్వజన్మము.

భార. అర. 2.113.

**తొల్చదువులు**

వేదములు.

పాండు. 2.32.

చూ. ప్రాఁజదువులు.

రూ. తొలిచదువులు.

**తోక ఆడించు**

తెలిసినవారి యెదుట తెలియనివాడు తెలివిని వెలగబెట్టు.

"ఆయన ఘనాంత స్వాధ్యాయి. ఆయన దగ్గరికి పోయి నీవు మంత్రం చెప్పావంటే అన్నీ అపస్వరాలే నని చెవులు మూసుకుంటాడు. తెలిసినవాడి దగ్గిర తోక ఆడిస్తే యేం లాభం?" వా.

**తోక కోసి సున్నము పెట్టు**

శాస్తి చేయు, ఉద్వాసన చెప్పు.

"అక్కడికి పోయి నువ్వు అదీ యిదీ అన్నావంటే తోక కోసి సున్నం పెట్టి పంపిస్తారు. జాగ్రత్త." వా.

"వాళ్లింట్లో మర్యాదగా ఉన్నావా సరే. అదీ యిదీ చేశావా? తోక కోసి సున్నం పెడతారు." వా.

**తోకగుంజ**

ఆదోకవలె యేర్పడిన స్తంభము.

బ్రౌన్.

**తోకచిచ్చు**

నిప్పంటించిన పిడకల వరుస.

"తోఁకచిచ్చున నార యుద్ధురతఁ గృష్ణ, రాయబాహు ప్రతాప జాగ్రన్మహాగ్ని." స్వా. 1.37.

**తోకచుక్క**

ధూమకేతువు.

దశా. 2.21.

**తోక జాడించు**

పాటిపోవు.

"నలుగురూ చేరేసరికి ఆ దొంగ తోక జాడించాడు." వా.

రూ. తోక ఝాడించు.

**తోక తెగగోయు**

అవమానించు, శాస్తి చేసి పంపించు.

"ఇట్లాగే చేస్తుంటే వాడికి తోక తెగ గోసి పంపిస్తాను." వా.

**తోక తెగిన నక్క**

అవమానపడి లేదా నష్టపడి దాని కేదో లాభమని వ్యాఖ్యానించే జిత్తులమారి. తన తోక తెగిపోగా ఒక నక్క తోక తెంచుకోవడం లాభకారి అని తన గుంపులో ప్రచారము చేసిన దని ఒక కథ. దానిపై వచ్చినపలుకుబడి.

**తోక త్రెంచుకొని పారిపోవు**

ముందు వెనుక చూడక పరువెత్తు.

అసలు ప్రాణం పోవడంకంటే

తోక తెగినా పరవా లేదని పారిపోవు అనుట.
ఇలాంటిదే ఉచ్చులు తెంచుకొని పారిపోవు.

తోకపీకుడుగాడు
వ్యవహారమును ఎటూ తెమలనీక నాన్చేవానిపట్ల ఉపయోగించే పలుకుబడి. బ్రౌన్.
వెనువెంట తిరిగేవాడు.

తోక మడచు
పాఱిపోవు.
"నలుగురూ చేరేసరికి ఆ దొంగ తోక మడిచినాడు." వా.

తోక ముడుచుకొని
నోరెత్తకుండా.
"వాడు నాలుగూ అనేసరికి తోక ముడుచుకొని కూర్చున్నాడు." వా.

తోకెత్తు
పాఱిపోవు.

తోకొని
వెంట తీసికొని, తోడుకొని. పాండు. 2.180.

తోకొను
తోడ్కొను.
"అమాత్యుని మదనుఁ దోకొనుచుఁ బురమునకుం జనుదెంచి." జైమి. 8.117.

తోగదోచు
ప్రత్యక్షమగు.
"నాలుగు ప్రదక్షిణంబు లీలీలఁ దోఁగఁ, దోఁచెనో చక్రి యని నారదుఁడు నటింప." కళా. 2.56.

తోచనిచేతలు
పనికి మాలిన పనులు. భాస్కర. 70.

తోచిగాడు
ఒక రకమైన డేగ.
"పాద దూఱు నొకమేటి పూరేటి వెలికిఁ బోఁ, దోలి కైకొనె నొక్క తోఁచిగాఁడు." స్వా. 4.58.

తోచినట్టు
మీకు నచ్చినరీతిగా.
"చెప్పవలసిన దంతా చెప్పాను. మీకు తోచినట్టు చేయండి." సింహా. నార. 71.

తోటకాపు
తోటమాలి. శ. ర.

తోటకూర
ఒక రకమైన కూరాకు.
ఎఱ్ఱ తోటకూర, పెరుగు తోటకూర, చిలుక తోట కూర, కొయ్యతోటకూర యిందులో రకాలు. ఫిన. శకుం. 3.3.

తోటపోక
ఒక రకమైన పోక. శ. ర.

తోటమాలి
తోటకు కావలి కాయువాడు.

**తోటమాలె**

రూ. తోటమాలి.

**తోటవాడు**

తోటమాలి.

"క్రోరి తోఁటవాఁడు కుసుమ ఫలం బులు, కోయునట్లు..."

భార. శాం. 2.300.

**తోటువోయిన కన్ను**

తొట్టువోయిన కన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

**తోడంటు**

చెమిరి, సహాయము.

"తొడికేటికర్మము తోడంటు."

తాళ్ల. సం. 8.50.

**తోడికోడలు**

భర్త సోదరుని భార్య.

నైష. 7.9.

**తోడిజో డగు**

సమాన మగు.

కాశీ. 2.70.

**తోడిజోడు**

సమాన మయినది.

"క్రీడావరాహంబు తోడిజోడు."

క్రీడా. పు. 70.

**తోడి తెచ్చు**

తోడ్కొని వచ్చు.

"ఉరుభక్తి నందఱ నొగిఁ దోడి తేర."

రంగ. రా. బాల. పు. 15. పంక్తి. 3.

**....తోడిదే లోకము**

అదే సర్వమూ అన్నట్లు.

"లోలలోచనతోడిదే లోక మాయె."

రాధి. 3 ఆ.

**తోడిదొంగ లగు**

తప్పుడుపనిలో భాగస్వాము లగు.

"ఇఁక నేమియు, ననకుఁడు నాతోడి దొంగ లైతిరి మీరుకా."

ప్రభా. 5.80.

**తోడినీడ**

1. విడువక వెన్నంటి యుండు నది.

"సెటి లేక నీతోడినీడ యై గడఁగూడి, పరఁగిన న న్నింత యెరవు సేసి."

కు. సం. 5.123.

2. సహాయ మైనది.

**తోడిపొత్తు**

స్నేహము.

భార. ఆది. 2.21.

**తోడిప్రుచ్చులు**

తోడుదొంగలు.

"ముల్లోకములకు డెందము, ము ల్లగు దశకంఠుతోడి ప్రుచ్చుల రగుటకా."

భాస్క. యుద్ధ. 313.

**తోడియల్లుడు**

షడ్డకుడు.

ఆం. శే. 47.

చూ. తోడికోడలు లాంటిది.

**తోడివాడు**

సమానుడు.

"తోడివారలు నవ్వ..."

పాండు. 3.36.

**తోడుకోను**

1. పిలుచుకొను.

"భంగవల్లభున్, బ్రమద మెలర్పఁ దోడుకొని." రుక్మాం. 3.188.

చూ. తోకొను.

2. ఎక్కువ బాధ నొందు.

"నా ప్రాణాలు తోడుకొని పోతున్నవి." వా.

3. తోడు పెట్టినపాలు గడ్డ కట్టి పెరుగగు.

శ. ర.

**తోడుచల్ల**

పాలు తోడుకొనుటకై పెట్టు చేమిరి.

శ. ర.

**తోడుజోడు**

సహచరము, మిత్రము.

భీమ. 1.31.

**తోడుదొంగలు**

వాళ్ళిద్దరూ కలిసి ఆ చెడుపని చేసినారు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

గ్రాంథికంలో తోడి అని వినవస్తుంది.

"ఇద్దఱును తోడిదొంగ లై యింక మఱుని, కేమి లంచంబు లిత్తురో యెఱుఁగ రాదు."

రాధా. 1.13.

"నను దతిమితి రిఁక నేమియు, నన ఘఁడు నాతోడిదొంగ లైతిరి మీరున్." ప్రభా. 5.80.

"మాయను మటంచు నిద్దఱు కూడి తోడి, దొంగ లై పోయి రా గోప ఘూర్తుకడను." దశావ. బల. 312. పే.

చూ. తోడిదొంగ లగు.

**తోడు దొన**

సహాయము. జం.

"చాల దుష్కర మైన యీజన్మము నకుఁ, దోడుదొన యైన చుట్టంబు దొరకు టెట్లు, దేవకీసూతి త్రిభువనాధిపుఁడు తాన, యెఱిఁగి సాధింపకున్న నీడేఱు టెట్లు?" జైమిని. 1.105.

"తోడుదొన లేని యప్పటి, క్రీడి కొలఁది యట్టి దధిప! కినియక విను మేఁ,దోడై దా నెదురుట గడుఁ, గీడు వలవ దుడుగ వయ్య గెలు పరిది సుమా!" భార. ఉ. 3.340.

**తోడు దొన యగు**

తోడునీడ యగు.

"చాల దుష్కర మైనయీ జన్మము నకుఁ, దోడు దొన యైనచుట్టంబు."

జైమి. 1.105.

చూ. తోడుదొన.

**తోడునీడ**

సహాయము, విడనితోడు.

"పని పూనెద నీ కృప తోడునీడగన్." రాధా. 2.39.

"నాతోడునీడ వై ననుఁ జిన్నపెద్దగా, సవరింపు మీ చూపు జాలువాఱె."

ఉ. హరి. 5.92.

"ఏడుగడయు నీవ యెచటికి నరిగిన, నీవు నేను దోడునీడఁ బోలి, తగిలి వచ్చుదాన దయతోడ ననుఁ గొని,పొమ్ము పోక చూడఁ బోలదేని."

దశకు. 11.15.

**తోడుపడు**

సహాయపడు.

"భర మానుతఱిఁ దోడుపడ వచ్చుగతిఁ గేలి,తోఁ గర మూల జద్యుతులు సాఁగ."

పాండు. 2.127.

తోడు పెట్టు

చేమిరి పెట్టు.

తోడుబాలు

పాలు పితకడానికి ముందు పాత్రలో ఉంచుకొనే నీరు. వట్టి పాత్రలో పాలు పితుకుట సంప్రదాయము కాదు.

తోడుబోతు

తోడుదొంగ వంటిది.

మాటా. 87.

తోడుబోతు చేయు

మంత్రాలద్వారా ఎదుటి వారికి కీడు కలిగించు. ఆభిచారికక్రియ చేయు. రాయలసీమలో వాడుకలో– 'వాడు మంత్రగాణ్ణి పెట్టి తోడుబోతు చేయించినాడు. అందువల్లనే వీడి కాళ్లూ చేతులూ పడిపోయినవి.'

చూ. చేతుబడి చేయు, చెఱుపు చేయు.

తోడు వచ్చు

సహాయ మగు.

విజయ. 3.63.

తోడువెట్టు

తోడుగా చేయు, వెంట పంపు.

"...ఇద్దఱు శిష్యులం దోడువెట్టి."

పిన. శకుం. 5.73.

తోడువోవు

1. వెడలుటలో సాయ మగు.

వేం. పంచ. 1.471.

2. సమాన మగు.

"రాతికిఁ దోడువోయినది రాసుతు డెందము." సా. 2.87.

తోడు సూపు

సహాయ మగు.

"పచ్చవిలుతుండు విచ్చలవిడిం దన కైదువులు ముప్పది రెంటం దోడు సూపె నన." పారి. 2.53.

"ధగధగాయమాన ప్రభా పటలంబులకుఁ దోడు సూపు విద్యుల్లతాని కాయంబులన..."

శుక. 1.277.

తోడ్తోన్

వెంటనే.

పాండు. 5.298.

"వాడు పంపిన మనిషి తోడనే వచ్చినాడు." వా.

రూ. తోడనే.

తోడ్పాటు మేకొను

సహాయము చేయు.

"మీరును తోడ్పాటు మేకొనవలయు."

రంగ. రా. బాల. పు. 20. పంక్తి. 7.

తో తెచ్చు

తోడి తెచ్చు.

"చామండఁ దో తెమ్ము."

వర. రా. అర. పు. 210. పంక్తి. 18.

....తో పడు

ఆ ఒకరు కారణంగా కష్టపడు.

"విరహిజను లింత పడుదురే వీనిచేత."
నైష. 2.128.
"ఆమెతో ఎవరు పడతారు పోదూ."
వా.
"వానితో పడ లేము అబ్బా!" వా.

తోదోపాడు

ఒకరి నొకరు తోసుకొను.
చూ. తోదోపులాడు.

తోదోపు లాడు

"తోదోపు లాడుచుఁ దొలఁగక యంత." ద్వి. పరమ. 3.166. పు.
చూ. తోదోపాడు.

తోనికాడు

మగడేగ.
ఆం. భా. ద్వి. 90.

తోప రేగగొట్టు

నలగ గొట్టు.
"వాళ్లతోటలో అడుగు పెట్టావంటే తోప రేగగొట్టుతారు. జాగ్రత్త." వా.

....తోపాటు

సహా.
"తనపుత్రు తోపాటు చనుబా లొసంగుచుఁ, గూరిమితోఁ బెంచెఁ గొన్ని నాళ్లు." బ్రహ్మ. 2.290.

తోపుటంగి

ఒక రకమైన రవిక.
ముడి వేసుకొనునది కాక దిగ వేసుకొనునది కావచ్చును.
"గుబ్బచన్గట్టునఁ దోఁపుటంగి తొడిగి."
క్రీడా. పు. 93.

తోబుట్టినవాడు

సోదరుడు.
భార. ఆది. 6.197.

తోబుట్టువు

సోదరి.
తోడ బుట్టినది.
పాండు. 1.2.
ఇది కొన్ని ప్రాంతాల్లో విరివిగా నేటికీ వాడుకలో ఉన్నది.
"పండుగకు మా తోబుట్టువులను కూడా పిలవాల్సి ఉంటుంది." వా.

తోమాలిక

తోమాల, పూలమాల.
వైజ. 2.141.

తోమాలియ

వనమాల.
పాండు. 2.20.
రూ. తోమాలె.

తోమాలె

చూ. తోమాలియ.
"బాహుమధ్యంబునఁ, బవడంపుఁ జివుళులఁ, బచ్చలతోమాలె యచ్చుపఱిచి." నైష. 8.112.

తోమి వదలిపెట్టు

విసుగెత్తించి వదలు.
"వాడు తగులుకుంటే వదలడు. తోమి వదిలి పెడతాడు." వా.

తోరణ కట్టు

1. తోరణము కట్టు.
"తమ చూడ్కులు, తొలుతగ నీలోత్పలములఁ దోరణకట్టన్."
కళా. 3.8.
ఏదైనా శుభకార్యాలు జరిగినప్పుడు పూలతో, ఆకులతో

తోరణాలు కట్టడం అలవాటు. అందుపై వచ్చినది.

2. వరుస కట్టు.

"దిశల మార్గాన్వేషిదీర్ఘలోచన దీప్తి, గణముచేఁ దోరణకట్టి కట్టి." మను. 3.88.

## తోరహత్తము

ఒక రకమైన మల్లబంధము.

"ఉపతాయిలోఁ దన కొదవిన తోరహత్తము నూపి వ్రేయక..." భార. విరా. 2.15.

## తోరహత్తించు

తృప్తి పొందించు.

"పాండురంగండు భక్తి కల్పద్రు లీల, నిష్టఫలసిద్ధిఁ దోరహత్తించు నింతి." పాండు. 2.28.

## తోరహత్తులుగా

సమృద్ధిగా.

"...ఉచితంబుల్ ద్రవ్యముల్ తోరహత్తులుగాఁ గూర్చి..." రామా. 3.15.

## తోలాడు

తఱుము.

"...తోలాడెఁ గొన్ని శార్దూలములను." పి. శకుం. 2.15.

## తోలి తొప్పఱ వెట్టు

తఱుము, తన్ని తగులవేయు. దొంగలదోలు అన్న వాడుక పదం దీనికి దగ్గఱగా ఉన్నది.

"మఱియు దానవసైన్యంబు మాఱులేక, యొప్పి తప్పిన నిర్జరయోధవరులఁ, దోలి తొప్పరవెట్ట నింద్రుండు నిలిచె, బవరమున నొక్కరుఁడు నేఁదుపల్లి వోలె." ఉ. హరి. 1.43.

"పిరిగొని తోలి తొప్పరలఁ బెట్టె ననంగుఁడు పాంథలోకముల్." నృసిం. 2.74.

"చిక్కజీరుగఁ గూల్చు సింహపోతకములఁ, దోలి తొప్పఱలాడుఁ గ్రోలుపులులు." శృం. శా. 2.22 పే.

## తోలు ఒలిచేస్తాను

ఒక తిట్టు.

"అదీ యిదీ అన్నావంటే తోలు ఒలిచేస్తాను. జాగ్రత్త." వా.

## తోలు తీయకనే తొనలు మింగేవాడు

సర్వభక్షకుడు. పనసపండు తోలు తీయకుండా తొనలు తినడమన్నది అసాధ్యం. అంత తిండిపోతనుట.

"వాడికి అప్పగిస్తే తిరిగి రావడం ఒకటా? తోలు తీయకనే తొనలు మింగేవాడు వాడు." వా.

## తోలు తప్పటములు

చర్మవాద్యములు, తప్పెటలు, డప్పులు.

"అజాఘునకపాలంబు, దోలుఁ దప్పటముల లీల విన్పింప." పండితా. ప్రథ. వాద. పుట. 703.

## తోసిరాజను

తిరస్కరించు. చదరంగంద్వారా వచ్చిన పలుకుబడి.

"కలికి ముఖారవింద మల కల్వలరా యనిఁ దోసిరా జనుణ్."
విజ. 1.37.

## త్రంపి పెట్టు

1. మంట వేయుటకు ముందు పుడకలు పెట్టు.

"ఆసలఁ ద్రంపిపెట్టి హృదయం బను కాఁగున యోగవాసనా,భ్యాసపు నీరు గాఁచుటకు."
ఉ. హరి. 4.85.

2. తగవు పెట్టు.

ఇదే అర్థంలోనే పుల్లలు పెట్టు అని రాయలసీమలో అంటారు.

"వాడికీ వీడికీ తంపులు పెట్టి తమాషా చూడడం వీడిపని." వా.

"వాడు పుల్లలు పెట్టడంవల్లనే యీ వ్యవహారం యిలా తయారైంది." వా.

## త్రవుకోల

నేలను తవ్వుట కుపయోగించే ఒక రకమైన పనిముట్టు.
శ. ర.

## త్రవ్వటములు పెట్టు

త్రవ్వి పాదులు చేయు.

"త్రవ్వటంబుల తతిఁ ద్రవ్వటంబులు పెట్టు." కళా. 4.79.
రూ. తవ్వకములు.

## త్రవ్వితండంబు లగు

ఎక్కు తొక్కు, లెక్కకు మిక్కిలి అగు.

"త్రవ్వి తండంబులై నివ్వటిల్లు."
కాశీ. 2.50.

## త్రవ్వితండ మగు

అధిక మగు.

సమృద్ధముగా ఉండు.

"వెండి పైఁడి త్రవ్వి తండంబుగా."
పాండు. 4.203.

## త్రవ్వితండముగా

విస్తారంగా, అసంఖ్యాకంగా.

"అర్థిఁ ద్రవ్వితండము గాని యమర విభుని, కరుణ ముందర విడిచి విక్రమము మెఱసి." నృసిం. 2.117.

"...తిలకావనీరుహం,బులదెసఁ ద్రవ్వి తండములు పుష్పము లున్నవి."
విక్ర. 5.35.

## త్రవ్వి తల కెత్తు

ఒఱగ బెట్టు.

"నాకు వాడు త్రవ్వి తల కెత్తిన దే ముంది?" వా.

## త్రవ్వుకోల

గుద్దలి.

చూ. త్రవుకోల.

## త్రస్తరులు సేయు

ఆ మాటా యీ మాటా చెప్పుతూ కాలక్షేపము చేయు.

"రుక్మిణీ సత్యభామ లిరువురుఁ గదిసి, తాళవృంతంబు లిడుచుఁ ద్రస్తరులు సేయ." జైమి. 3.51.

## త్యాగధ్వజ మెత్తించు

ఎవరైనా వచ్చి యేమడిగినా నే నిత్తు ననుటకు గురుతుగా పూర్వం ఒక జండా ఎత్తేవారు కావచ్చును. అందుపై

వచ్చిన పలుకుబడి. ఇలాంటిదే కోటికి పడగెత్తు.

"త్యాగధ్వజ మెత్తించి సమాగత యాచకుల కీశ్వరార్పణ మనుచున్." శుక. 3.88.

వాడుకలో నిరసనసూచకంగా—ఏమీ యివ్వనివానిని, 'వీడు మహాత్యాగధ్వజం రా' అంటారు.

కాకువును బట్టీ, సందర్భాన్ని బట్టీ ఇలాంటి నిరసన మిగత మంచి పదాలకు సాధించడం వాడుకలో ఉన్నది.

"అమ్మా! వాడు దానకర్ణుడు!" వా.

## త్రాగు తలపోసికొను

తనివి తీరా అనుభవించు.

"త్రాగు తలబోసికొమ్మని వేగ హరున, కిచ్చె." విజయ. 3.53.

## త్రాటికుక్కలు

నిందలో - జందెం వేసుకున్నారే కాని కుక్కలవంటి వారని అనుటలో - బ్రాహ్మణులు.

పండితా. ద్వితీ. మహి. పుట. 136.

చూ. త్రాటిమాలలు.

## త్రాటిగట్టు బోయ

ద్విజరూపధారి యగు కిరాతుడు. ఇక్కడ :

త్రాడు = యజ్ఞోపవీతము.

పాండు. 3.68.

చూ. త్రాటిమాలలు.

## త్రాటిమహిమ

మంగళసూత్రప్రభావము.

వాడుకలో - 'ఆమె మాంగల్య బలంవల్లనే ఆమె భర్త బాగున్నాడు' అనుపట్ల - 'వాడింకా బతికి ఉన్నాడంటే ఆమె త్రాటిమహిమ' అంటారు.

మాంగల్యానికి బదులు పసుపుత్రాడు కట్టుకొనుట కొన్ని వర్గాలలో నేటికీ ఆచారంగా ఉన్నది. ఇక్కడ :

త్రాడు = మాంగల్యం.

"నేఁటి కీపాటి నీవు నాత్రాటిమహిమ, నింటి కేతేరఁ జల్లఁగాఁ గంటి నింక." శుక. 2.84.

## త్రాటిమాలలు

నిందాపూర్వకంగా బ్రాహ్మణులను అనుమాట. యజ్ఞోపవీతం ఉన్నా మాలలవంటి వారనుట.

"మాలఁడే - ఈతని మాలఁడన త్రాటి, మాలలు భువిఁ బచ్చిమాలలు గాక." బస. 7.188 పుట.

## త్రాడు తెంచు

మిక్కిలి బాధించు.

"వాణ్ణి ఎరక్క వెంట తీసికెళ్లాను. నా త్రాడు తెంచేశా డనుకో." వా.

## త్రాడుబాఱు

గట్టిపడు, ఎక్కువ అగు.

"తావకాపరాధముల కంతంబు గలదె, త్రాడు బాటెడు దొడ్డంబు రవులు కతన." శ్రీనివా. 5.97.

త్రాడు లేదు బొంగరము లేదు

ఏమీ లే దనుట.

"వాడికి తాడూ లేదు. బొంగరం లేదు. వా డెక్క డుంటే నేం? ఏం చేస్తే నేం?" వా.

త్రాడువడు

బలహీన మగు; త్రాడువలె చిక్కి సన్న మగు.

"పాథోధివల్లభు పాశవల్లి మతల్లి, దర్పంబు దిగఁద్రావి త్రాడువడియె." భీమ. 4.107.

త్రాడువారు

నిర్వైరపడు.

"అని త్రాడువారి యవ్వారిజాక్షి." పాణి. 6.61.

త్రాడు వెట్టు

పశువులు మొదలయినవానికి త్రాడు మెడకు కట్టు.

"మిండండు బసవని మెడఁ ద్రాడు వెట్ట." బస. పు. 146.

త్రాడు వోయు

మెడకు త్రాడు కట్టు.

"నడిమివాని మెడ త్రాడు వోసి యమ్మెద." హరి. పూ. 2.40.

త్రాణకొద్ది

బలముకొద్ది.

వాని ఒంటిలో త్రాణ లేదు అన్న చోటులోని 'త్రాణ' వంటిదే యిక్కడి 'త్రాణ' కూడ.

"మొలత్రా డని గట్టినట్టివా, రె త్తిరి త్రాణకొద్ది పరు లెక్కడి వేడుక లంచు..." శుక. 2.14.

త్రాసున తూచినట్లు

చక్క సగముగా.

"వ్రక్క లొక్కంతగ నేలఁ గూలె దనుజాకృతి త్రాసునఁ దూఁప భూతముల్." ఉ. హరి. 1.176.

త్రాసున బెట్టు

తూచు, సమానము చేయు.

"మేదినీ,ధరములఁ బోల్పఁబ ట్టగునుద గ్రపుమూర్తుల కిద్ద అందు ని,ష్ఠురరభసంబు శౌర్యము పటుత్వము త్రాసునఁ బెట్టిన ట్లగున్. భార. శల్య. 1.176.

త్రికరణశుద్ధిగా

మనస్ఫూర్తిగా; మనసా, వాచా, కర్మణా అనుట.

"త్రికరణశుద్ధిగా చెప్తున్నాను. నీ కేం ఫరవా లేదు. వెళ్లు." వా.

త్రికోణము

ఆడుగుఱి.

ఈ పదమున కీ అర్థము ఒక్క తెలుగులోనే వ్యవహారంలో ఉన్నది.

చంద్ర. వి. 2.53.

త్వాష్ట్రిపు పని

వెధవపని.

చూ. త్వాష్ట్రిడు.

త్వాష్ట్రిడు

వైదికపరిభాష.

'విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్' అను మంత్రభాగం ద్వారా త్వాష్ట్రి డనగా పురోహితుడు అని అలవా టయినది.

గుడిమణియము లాగే పౌరోహిత్యం కూడా తరువాతి కాలంలో చాలా నీచంగా చూడబడినది. పనికి మాలిన వాడు అన్న అర్థంలో అలా అలవా టైనది.

"వాడు ఒట్టి త్వాష్ట్రిడు. వాణ్ణి పట్టుకుంటే ఏ మవుతుంది ?" వా.

## త్రిపాఠి

పదము, క్రమము, సంహిత లను చదువుకొన్నవాడు.

## త్రిప్పు కొలుపు

కలచు.

"ఇతెఱంగు నా హృదయము ద్రిప్పు కొల్పె..." దశ. 10.156.

## త్రిప్పుడుగొను

తిరుగు.

"...జటాటవిఁ, ద్రిప్పుడుగొన్న నిర్జర నదీమణి..." శేష. 4.209.

## త్రిప్పుత్రాడు

కవ్వముత్రాడు.

శ. ర.

## త్రిప్పుల బెట్టు

తిప్పలు పెట్టు, కష్ట పెట్టు, చిక్కులు పెట్టు.

ఇదే నేటి వాడుకలో తిప్పలు పెట్టు అయినది కావచ్చును.

"హరుఁ ద్రిప్పులఁ బెట్టి మనోజుఁ డుబ్బఁగాన్." కుమా. 5.34.

## త్రిప్పులాడు

1. ఇటునటు తిరుగు.

"... పల్మఱు మేషము త్రిప్పులాడెడిన్." హంస. 6.243.

2. వగల పోవు.

"ఆ పిల్ల మహా తిప్పులాడుతూ వుంది." వా.

## త్రిప్పులు వెట్టు

చిక్కులు పెట్టు.

"త్రిప్పులు వెట్టుచుఁ బాఱఁగ, నిప్పులు వెదఁజల్లుబాణనికరంబులచే."

రుక్మాం. 3.96.

## త్రిమ్మరీడు

తిరుగుబోతు.

పాండు. 4.171.

## త్రివటించు

మూడు భాగములుగా చేయు (కుమారసంభవం టిప్పణి)

"...పలక ఘట్టించి మెఱుంగిడి త్రివటించి తిట్టంబు కొలందికిం దెచ్చి..." కుమా. 5.116.

## త్రిశుద్ధిగ

త్రికరణశుద్ధిగా.

"...త్రిశుద్ధిగ నమ్మ భారతీ !" పోతన చాటువు.

చూ. త్రికరణశుద్ధిగా.

త్రుంగుడువడు

1. చల్లారు, శాంతించు.

"ధూమధ్వజు రాజ్యదృష్టి ద్రుంగుడు వడునే." భాగ. 9 స్కం. 581.

2. నశించు.

"తండ్రి సద్గుణ సముదయము ద్రుంగుడు వడ మెలఁగు పుత్త్రుఁడు హీనుఁడు..." మార్క. 2.340.

త్రుట్టెలు గట్టు

1. చుట్టలు చుట్టుకొను.

"త్రుట్టెలు గట్టి నిద్రలు మరుద్భుగధీశ కులంబు మేల్కనన్." పాండు. 5.249.

2. ఉండలు కట్టు.

"గోధుమపిండి విసిరించి చాలారోజులు కావడంవల్ల పిండంతా తుట్టె గట్టింది." వా.

చూ. ఉండలు గట్టు.

త్రుప్పుడు రాలదు

ఏమాత్రం దెబ్బ తగుల లేదు, చెక్కు చెదర లే దనుట.

"త,తురగరథధ్వజాలి నొక త్రుప్పుడు రాలదు మమ్ముఁ బిల్చి వే, పురి నెఱిఁగింపుఁ డన్న నృపపుంగవ! వచ్చితి మేము నావుడున్." భార. విరా. 5.239.

త్రుప్పు డుల్చు

ఉపయోగములోనికి తెచ్చు.

ఏదైనా ఉపయోగించనప్పుడు అది తుప్పు పడుతుంది. దానిని వాడుకొనవలసినప్పుడు ఆ తుప్పును తొలగించడం జరుగుతుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"సత్కవుల త్రుప్పు డుల్చు వసంత వేళ." జైమి. 1.45.

త్రుప్పు వట్టు

ఉపయోగములో లేకపోవు.

"కాలదండము త్రుప్పు వట్టెను." రుక్మాం. 2.47.

చూ. త్రుప్పు డుల్చు.

త్రుళ్లగింతలు వెట్టు

1. దుముకు.

భో. 5.19.

2. వ్యాపించు.

"త్రుళ్లగింతలు వెట్టు తొడలదీప్తుల తోన, చనుదోయి మించులు చౌకళింప." విక్ర. 8.38.

త్రుళ్లడచు

పొగరణచు.

"తురగములఁ జంపి యాతని త్రుళ్లడంచె." భార. భీష్మ. 3.231.

"మల్లయుద్ధంబున మారుతాత్మజుని, త్రుళ్లడంచెద! మీరు తొలఁగఁగఁ జూడుఁడు." ద్విప. జగ. 205.

త్రుళ్లిపడు

అదిరిపడు; మండిపడు.

"నీమాటకు దుర్యోధనుఁ, డామెయిఁ దాఁ ద్రుళ్లిపడక యవుఁ గా కని." భార. శల్య. 2.371.

త్రుళ్లు

గర్వించు, మిడిసి పడు.

"త్రుళ్లుచు న్నావు దుష్టచిత్తుండ." పల. పు. 48.

**త్రుళ్లుపిండి**
అమ్మవారు పోసినప్పుడు పోలేరమ్మకు కొట్టి పెట్టే పిండి.
శ. ర.

**త్రుళ్లుబోతు**
పొగరుబోతు.
"త్రుళ్లుఁబోత నీవు తూలిపోఁ బలికిన, సార మేమి తెలుగుఁ జక్రమునకు."
ఉ. హరి. 3.17.

**త్రెక్కోలుగొను**
చంపు.
వి. పు. 6.315.

**త్రెవ్వ నీదు**
ఆవలి గట్టునకు దాటు.
"మమకారనది త్రెవ్వ నీఁదుకరణి."
పాండు. 5.305.

**త్రెళ్ల నేయు**
పడగొట్టు, చావగొట్టు.
"త్రిపురంబు లొకకోలఁ ద్రెళ్ల నేసిన వాఁడు." నిరంకు. 1.20.

**త్రేతాగ్నులు**
ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అనునవి.

**త్రొక్కటపడు**
కష్టపడు.

**త్రొక్కటపాటు**
కష్టము.

**త్రొక్కటలాడు**
త్రొక్కిడి పడు.
ద్వి. శ. సా. 2. భా. 72 పు. 5 పం.

**త్రొక్కడ పడు**
కష్టపడు.

**త్రొక్కిన చోటులు త్రొక్కక**
అన్నిచోట్ల - ఒకచోటని లేకుండ - తిరిగి.
"తురగము లేఁగుదెంచె నవె త్రొక్కిన చోటులు త్రొక్క కద్ధలిన్."
జైమి. 2.15.
చూ. తొక్కిన గడప త్రొక్కక.

**త్రొక్కుడు కమ్మి**
కడప క్రింద నున్న పలక, రాయి.
శ. ర.

**త్రొక్కుడు పట్టె**
చూ. త్రొక్కుడు కమ్మి.

**త్రొక్కుడు పడు**
జనసమ్మర్దములో ఒకరి కాళ్లొకరు త్రొక్కుకొను.
"క్రిక్కిఱిసిన మక్కువల నిక్కువలఁ గమియం జొక్కుల చెయ్వులఁ ద్రొక్కుడు వడిరి." పారి. 2.53.

**త్రొక్కుడు పలక**
సాలెవాని కాలి క్రింది రాట్నపు పలక.
"వడి దారము చెవులుం ద్రొక్కుడు పలకయు." శుక. 2.420.

**త్రొక్కుడుపాటు**
తొందరపాటు.
విజయ. 3.7.

**త్రొక్కు త్రొక్కాడు**
త్రొక్కిడి పడు.

"తురగముల్ గజములు త్రొక్క త్రొక్కాడఁగ, నద నని పైఁబడి నట్టి వలన." రాజగో. 1.51.

**త్రొక్కు లాడు**
తొందరపడు.
"వాడు పెండ్లి కావా లని మహా తొక్కు లాడుతున్నాడు." వా.

**త్రొక్కుడుబిల్ల**
ఒక రకమైన పిల్లల ఆట.

**త్రొక్కుడుబొమ్మ**
రాట్నములోని ఒక పని ముట్టు.
"త్రొక్కుడు బొమ్మయును ద్రిప్పుడు, పుడకయును గలుగు రాట్నములు గైకొనుచుజ." శుక. 2.420.

**త్రొక్కుడువడు**
చూ. త్రొక్కుడుపడు.

**త్రొక్కువడు**
త్రొక్కుడువడు.
సాంబో. 5.64.

**త్రోచి పుచ్చు**
నిర్లక్ష్యము చేయు.
"పలుకకయె త్రోచిపుచ్చినఁ, బిలిచి పిలిచి నోరు నొచ్చి పెల్కుఁ రఁ గని..." జాహ్నవీ. 4.42.

**త్రోద్రోపులాడు**
ఒకరి నొకరు త్రోసికొను.
ద్వి. శ. సా. 1. భా. 22 పు. 7 పం.

**త్రోపడు**
తోపుడు బడు.
"త్రోపడి యిరులు పటాపంచ లై పాఱె..." స్వా. 3.23.

**త్రోపన గొలవి చేయు**
అటూ యిటూ కాకుండా చేయు; అటు నిటు త్రిప్పు.
కొలవిని అటు ఉన్నవాడు ఇటువానికి విసరి వేయడం, ఇటు వాడు తిరిగీ అటు విసరి వేయడం ఏ ప్రాచీనమైన క్రీడగానో, ఏ ఉత్సవాల లోనో ఉండుటపై వచ్చిన పలుకుబడి.
"...అతండు కులాభిమానఘనుఁడై యేయూరి కేత్రోవ యం, చనుమా నించినఁ ద్రోపనం గొలవిఁ జేయం జూచితే క్రమ్మఱన్." ఉ. హరి. 5 ఆ.

**త్రోపాడు**
1. త్రోసికొను.
"పాదివి యొండొరుఁ ద్రోపాడి పోరు కతన." కవిక. 2.167.
2. త్రొక్కులాడు.
ఏదైనా కావలె నని ఒకరి నొకరు తోసుకొని ముందు కేగుటపై వచ్చినది.
"వేడుక నీకె కాని మఱి వే ఱొక యింతికి లేద...త్రో, పాడెద వేల." పారి. 3.16.

**త్రోపుడు పెట్టు**
చిత్రికతో నునుపు చేయు.
బ్రౌన్.

**త్రోపు త్రొక్కిళ్ళువాఱు**
త్రోపిడివల్ల ఒకరికొ ళ్ళొకరు

తోసుకొనురీతిగా పరు
వెత్తుచు పోవు.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 362.

**త్రోపు త్రోపాడు**

1. ఒకరినొకరు త్రోసికొను.
"ప్రోడ లగునెచ్చెలులు జీరాడు సిగుల
నీడిగిలంబడ నెట్టకేలకుఁ ద్రోపు
త్రో పాడుచు." పారి. 2.53.

2. సమ్మర్దములో ఒకరి
నొకరు త్రోసికొను.
"దుర్గాధిపతు లేమేమ యని త్రోపు
త్రోపాడుచు వీచు వీచోపు లచ్ఛమ్మ
లగుకాముదీగుచ్ఛమ్మల సంతరింప."
మను. 5.71.

**త్రోపుద్రోక్కుళ్లు**

ఒకరినొకరు త్రోసికొను
టలు.

**త్రోపుద్రోక్కుళ్లువాఱు**

ఒకరి నొకరు త్రోసికొను.
పండితా. పర్వ. 762.
చూ. త్రోపు త్రొక్కుళ్లువాఱు.

**త్రోపులాడు**

త్రోసులాడు.
జన మెక్కువైనప్పుడు ఒకరి
నొకరు త్రోసుకొంటారు.
తొక్కిడి ఎక్కువైన దనుట.
పండితా. ద్వితీ. మహి. పుట. 34.

**త్రోపువడు**

నిర్లక్ష్యము చేయబడు.
"...పలికిన నప్పలుకు త్రోపువడ ముని
పలికెన్." భార. ఆను. 2.270.
మార్క. 5.41.

**త్రోపు సేయు**

నిరాకరించు.
భార. అశ్వ. 1.43.
భో. 2.86.

**త్రోవడు**

మిగులు.
మల్హ. 1.85.

**త్రోవ దప్పు**

అపమార్గమున నడచు.
"కనుఁ బ్రామి చొప్పడఁచి త్రోవల్
దప్పి పో నేల." కా. మా. 4.52.

**త్రోవ పెట్టు**

దారి చూపు.
సారం. 1.107.

**త్రోవ బట్టు**

వెళ్లిపోవు.
"క్రేవ దుర్వారుఁడై తలారికి 'బులావు,
ధగిడికే' యనుమాటకుఁ దలఁకి రెడ్డి,
తోడి వారలతోఁ జేని త్రోవఁ బట్టె."
శుక. 2.428.

**త్రోవ లాచు**

అడ్డగించు.
"అవలఁ ద్రోవ లాఁచి వెస యాతనపుం
దను వాగి రేఁగఁగఁణ."
పాండు. 3.104.

**త్రోవలు గాచు**

పొంచి యుండు.
"గండూష జీవనసేకం బొనరించి
పత్తిరిడి త్రోవల్ గాచి తా నేసి
కా,ల్చిన." కా. మా. 3.105.

**త్రోవలో ముండ్లు వేయ లేదు**

ఆదారిని మూసి వేయ లేదు.

"మీయన్నఁ బంపిన త్రోవలో ముండ్లు వేయ లే దనుము."
వర. రా. కిష్కి. పు. 414. పం క్తి. 12.

## త్రోసిన తొంబదిచోట్ల కూలునట్టి

దుర్బలుడు – దుర్బలురాలు.

"తోలును నెమ్ములున్ మిగిలి త్రోసినఁ దొంబదిచోట్లఁ గూలువాఁ, డాలిని బిడ్డలన్ విడిచి." కా. మా. 3.153.

## త్రోసిరాజు చేయు

కాదను.

"వాని రెండుగంటల ఉపన్యాసాన్నీ వీడు ఒక్క మాటలో త్రోసిరాజన్నాడు." వా.

చూ. తెలిచిరా జను.

## త్రోసివేయు

1. తిరస్కరించు.

"తుహినగిరికన్య యానతిఁ ద్రోచి తేని." కాశీ. 6.219.

"వాడు నేను చెప్పినమాటను ఎప్పుడూ తోసివేయడు. నువ్వు వెళ్లి రా." వా.

2. కేసు కొట్టివేయు.

"కోర్టులో ఆ కేసు త్రోసివేశారు." వా.

## దంచనపు రాయి

ఫిరంగిగుండు.

"మాయ నుగ్గులు సేయ మాధవుని దంచనపురాయి వో, వైరాగ్యరచన జీవులకు." తాళ్ల. సం. 5.74.

## దంచనమున వైచిన గతి

గుండు పేల్చినట్లు.

అతివేగముగా పై కెగిరిపోవుటను సూచించును.

"...అట్లురువడి దం,చనమున వైచిన గతి నభ,మునఁ జని మణికంధరుని తపోవనభూమిన్." కళా. 3.153.

## దంచ నున్న రోలిపిండి

సిద్ధముగా ఉండునది.

తాళ్ల. సం. 11.3. భా. 24.

## దంటగొను

కలియు.

"ఉదుటుఁదనమును వలపు నొండొంటి తోడ, దంటగొని క్రమ్మ నెమ్మదిఁ దాల్చె నతఁడు." ప్రభా. 4.89.

## దంటపడు

చూ. దంటగొను.

బ్రౌన్.

## దంటపోరు

ద్వంద్వయుద్ధము.

"దంటపోరనఁదగు ద్వంద్వయుద్ధము." ఆం. భా. ద్వి. 222.

## దంటమాటలు

ప్రౌఢవాక్యములు.

"ఇట్టి దంటమాటలు నేర్చి తెచట ననుచు..." కళా. 1.21.

## దంటుకొను

పూడి కలుచు.

"చే బల్మి చేఁ గ్రమ్మి చిమ్మి వైతుము గదా, నోరు దంటుకొనంగ నోఁపె మొసల." కృష్ణ. 3.15.

## దండకడియము

రెట్టకు వేసుకొను ఒక జోలు కడియము.

"పులితోల్ కాసెల నంట దోపిన సిడెంబుల్ నూలిపూఁదావళిం,బులు

బల్సింగ పుంజాంచు దండకడియం
బుల్...'' సా. 1.63.

చూ. దండకడెము.

**దండకడెము**

రూ. దండకడియము.

**దండకము పాడు**

చూ. దండకము విప్పు.

**దండకము విప్పు**

తిట్టు, ఏకరువు పెట్టు.

''ఏమిట్రా! దండకం విప్పినట్లున్నావు. ఏమిటి సంగతి?'' వా.

**దండకవిలియ**

పాత లెక్కల కట్ట.

శ. ర.

**దండకవిలె**

రూ. దండకవిలియ.

**దండకో లగు**

చేయూత యగు.

అనగా చేయూనుకొను కఱ్ఱ – అనురీతిగా వచ్చినపలుకుబడి.

''కూయి వచ్చినన్, నీ వటు దండకో లగుచు నిల్చినఁ జాలు.'' జైమి. 1.100.

రూ. దండగో లగు.

**దండగో లగు**

సహాయ మగు.

''నీ వటు దండగో లగుచు నిల్చినఁ జాలు నగస్త్యమూర్తి యై.'' జైమి. 1.100. (పాఠాంతరము.)

**దండచేరు**

ఏనుగులూ మొదలయిన వానిని వశము చేసికొనుటకై ఉపయోగించే తోరము.

''అలుగు నేనుంగుకై యలుఁగుఁ బూనఁగ నేల, యండ నీ దండచే రుండ దేని.'' చంద్రా. 2.43.

**దండ దాపు**

దరిదాపు, ఆధారము.

''ఉచిత సద్గుణ సంశీలుఁ డొక్కఁడైన, దండదాపుగ నిచ్చోట నుండ వలదె?''

నలచ. 5.75.

**దండనమస్కారములు**

సాష్టాంగదండప్రణామాలు.

కుమా. 7.80.

**దండ నిల్కడ**

మల్లయుద్ధములోని ఒకానొక మెలకువ.

''దండనిల్కడ కదలుదుటు కలయు మెలఁకువ ...... మొదలగు విత్తమ్ము లెఱింగి.''

ప్రబంధ. 78.

**దండపడు**

1. సమీపించు.

2. ఎద్దు ముడ్డిమీద ములుకోలతో పొడుచుటవలన బొప్పిగా ఏర్పడు.

శ. ర.

**దండపెట్టు**

1. కొట్టు.

''చూచినప్పుడె నిలుపాఱ వైచి సరస, తామరసభీమతరగదాదండ మెత్తి, దండహతి మనోజుండు దండపెట్టె, నమ్మహాదేవు నెమ్మది రిమ్మ వొడమ.'' శుక. 2.453.

2. నమస్కరించు.

దండము పెట్టు

దానిని పూర్తిగా వదలుకొను.

'ఒక' ముందు చేరుట కలదు.

"ఇక ఆ విషయానికి ఓ దండం పెట్టి ఊరుకున్నాను." వా.

"వాడేం ఇస్తాడా చేస్తాడా? దానికో దండం పెట్టి వెళ్లిపో రా బాబూ!" వా.

దండ యిచ్చు

చేయి యిచ్చు.

పండితా. ప్రథ. పురా. పుట. 299.

దండాకోరి

మొండి.

దండాగొండి

మొండి.

దండిగుండె

ఔదార్యం కలవాడు.

"వాడిది చాలా దండిగుండె. కాబట్టే నీవు అన్ని చేశావని తెలిసీ దగ్గిరికి వెళ్లగానే చేరదీశాడు." వా.

దండిచెయ్యి

భారీచెయ్యి.

ఉదారమైనది అనుట.

"ఆవిడది చాలా దండిచెయ్యి. అడగని వాడిది పాపం!" వా.

చూ. దండిచేయి.

దండిచేయి

బాగా ఒకరికి పెట్టే అలవాటున్న చేయి.

"ఆవిడ దండిచేయి అంతా కోడలు వచ్చినతరవాత తగ్గిపోయింది." వా.

చూ. దండిచెయ్యి.

దండు కదలు

దాడి వెడలు.

"సర్వసుపర్వ సామ్రాజ్యంబు, గైకొందు నని దండు కదలఁ దలఁచి."

వరాహ. 11.122.

రూ. దండు గదలు.

దండుగ (గొను) తెమ్మను

జరిమానా అడుగు, పరిహార మడుగు.

తప్పేదైనా చేసినప్పుడు రాజు దండుగ విధించడం అలవాటు. దీనిమీద వచ్చిన పలుకుబడే–'అది వట్టి దండుగ పని' – అంటే ఫలరహితంగా, ప్రయోజనరహితంగా, నష్టకరంగా చేయవలసిన పని అనుట.

"నగర మేలెడిదొర దా, నెమ్మదిఁ గన లుచు దండుగఁ, దెమ్మనినఁ బెట్టి యేడఁ దెచ్చు న్వెఱతున్."

శుక. 2.218.

దండు గదలు

దండు వెడలు.

"గానంబు లొనరించుగతిని జూపట్టె, కాయజుఁ డడఁ దండు గదలి యే తెంచె." ద్విప. జగ. 163.

రూ. దండు కదలు.

దండుగపని

నష్టకరము, ప్రయోజన రహితము.

"వట్టిదండుగపని కెందుకు దిగావురా." వా.

**దండుగ పెట్టుకొను**

వ్యర్థంగా నష్టపడు.

"వీడికోస మని పదిరూపాయలు దండగ పెట్టుకున్నాను. ఊ రంతా వెదికినా వాడిమొహ మైనా కనబడ లేదు." వా.

**దండుగ యీనాము**

అనవసరముగా బాధించిన దానికి ప్రతిఫలముగా యిచ్చు భూమి.

బ్రౌన్.

**దండు చేయు**

దండెత్తు.

"ఒక్కొక దినంబు తమ యింటియొద్ద వారిఁ, దలఁచికొన్నప్పు డొదవు సంతాపభరము, పూనకుండుట యెట్టు భవానిపతియు, వాసిఁ బూని ధరణి దండు చేసెనేని." రా. వి. 2.29.

**దండు డిగ్గు**

సేనలతో బాటు ఒక చోట బస చేయు.

"ఇల యెల్లను ముంచి రసాతలంబుపై, విడియఁగ దండు డిగ్గినసవిద్యుదురుస్తన యిత్నులో యనన్." ఆము. 4.128.

**దండుతాణెము సేయు**

పరిపాలించు.

"...సర్వకాల నిరాహారతనుండు వారలకు నేలా దండుతాణెంబు సే, యు నరస్వామికిఁ గాక తద్గ్రహణకృత్యోపాయముల్ సెప్పుమా." వరాహ. 5.6.

**దండుదారి**

సైన్యము నడుచు బాట.

బ్రౌన్.

**దండు దిగు**

చూ. దండు డిగ్గు.

**దండుదివియ**

దీపపు సెమ్మె.

శ. ర.

**దండు నడచు**

దండెత్తు.

"కైకొని యింక నిక్ష్వాకువల్లభుఁడు, నాకారిపై దండు నడచుచున్నాఁడు." రం. రా. కిష్కిం. 219 పు.

**దండు పోవు**

దండెత్తు.

"ఆ వీరబంధుఁ డంతట, భూవరు వెను వెంట దండు పోవుటయు..." శుక. 3.132.

చూ. దండు కదలు, ఎత్తిపోవు.

**దండుబాట**

ఘంటాపథము.

చూ. దండుదారి.

**దండులంజె**

దండుతో పోవు వ్యభిచార స్త్రీ.

"తగు బజారి యనంగ దండులంజె." ఆం. భా. ద్వి. 127.

**దండు వచ్చు**

యుద్ధమునకు వచ్చు.

"ఇంటికిఁ బొమ్మ క్రమ్మరఁ జెలీ నిలువు నిన్నిలు సేర్చి వత్తునో, వెంటనె దండు వచ్చెదవొ వేగమె రా మతి యేల యందువో." రా. వి. 2.58.

## దండు విడియు

1. సేనలతో పాటు ఒకచోట బస చేయు; విడియు.

"దండు విడిసె బలీంద్రుఁ డక్కొండ దండ." దశా. 2.56.

2. దండెత్తు.

"జానకీనాథ యిటు లద్దశాననుండు, విత్తవిభువీటిపై దండు విడిసె నపుడు." ఉ. రా. 3.2.

## దండువు గొను

అపరాధములు – (జుల్మానా) జరిమానా గ్రహించు.

వాడుకలో ఇది 'దండగ' అన్న రూపంలో నేటికీ నిలిచి ఉన్నది.

"కవలయేళుండు దండువు గొన్నఁ గడ పని."

కాశీ. 7.139.

"పిన్నపెద్దలు తప్పు వేసి వాడితో పది రూపాయలు దండగ తీశారు." వా.

## దండు పుచ్చు

దండు పంపు, యుద్ధమునకై పంపించు.

"అన్యభూపతులపై దండు పుచ్చుడు..." బస. 4.119.

## దండు పెట్టు

దండించు, దూషించు.

"దసగణ సింగయ్య దండు పెట్టితివో." పండితా. ద్వితీ. మహి. పుట. 214.

## దండు వెడలు

దండెత్తి పోవు.

"చండతరంబులైన దురితంబులపై దండు వెడలు చందంబునఁ గను పట్టుచు." కా. మా. 1.142.

"పలరాజు కినుక మీఱి, విరహిజనములపై దండు వెడలె నపుడు." పారి. 2.50.

## దండు వోవు

జైత్రయాత్ర వెడలు.

"చోడ మండలేశ్వరుఁడు ......, పర రాష్ట్రపతులపైఁ బడి దండు వోవ." పండితా. ప్రథ. పురా. పుట. 287.

రూ. దండు పోవు.

## దండు సాటించు

దండయాత్ర ప్రకటించు.

"వారలు ప్రియంబునం బని పూని వెడలి దండు సాటించి తగువారల కెల్ల నెఱింగించి పుచ్చిన..." భార. ఉద్యో. 4.136.

## దండెత్తి పోవు

దండయాత్ర వెడలు.

"ఇనకులాధిపుఁడు దండెత్తి పోవుటయు." రంగ. రా. బాల. పు. 8. పం. 12.

## దండెత్తి విడియు

ముట్టడించు.

"దండెత్తి విడిసె నుద్దండమహిమ." విజయ. 1.57.

## దండెపు పీటలు

గడచీల తగుల్చుటకై దండెకు నడుమ గ్రుచ్చిన రంధ్రము గల రెండు పీటలు.

శ. ర.

## దండోరా వేయు

1. చాటు.

"దాని కొక్క సంగతి తెలిస్తే చాలు. ఊరంతా దండోరా వేసి వస్తుంది."
వా.

2. చాటింపు వేయు.

"సాయంత్రం జన మంతా చావిట్లో చేరవలసిం దని రెడ్డిగారు దండోరా వేయించినారు." వా.

**దంతసిరితో పుట్టు**

పుట్టుకతోనే భాగ్యవంతు డగు.

ఆగర్భశ్రీమంతు డనుట.

**దందడి పడు**

కలత నొందు.

"అతనిఁ గనినంతనె నా, డెందము గబీలు మనియెన్, దందడిపడువాని దీన దశ యే మందున్."
అహ. 3.8.

**దందడి వెట్టు**

తొందర పెట్టు.

"ముందర రాజుఁ బుచ్చి బలముల్ గల యంబడి గోవ్రజంబులన్, దందడి వెట్ట కుండఁ బిఱుఁదన్ నడిపింపఁగఁ బంచి." భార. విరా. 4.184.

**దందనకత్తియ**

మోసము చేయునది.

శ. ర.

**దందనకాడు**

మోసగాడు.

శ. ర.

**దందన సేయు**

మోసగించు.

"కొండఱకుం గూర లొసఁగి కొండఱ కిడకే, దందన సేయుచు గెంటుచుఁ, గొందఱఁ దిట్టుచును వెళ్లఁగొట్టుచుఁ గడఁకన్." చంద్ర. వి. 1.60.

**దంధన్న**

తెలివి లేనివా డనుట.

దీనినే ఢంఢన్న, దద్దన్న, దద్దమ్మ అనుట కూడా కలదు.

"లేనిపోనిదం, ధన్నలు కొన్ని పన్నుక కతల్ వెదజెట్టిన నేమి యన్నెమా, పున్నెమ పూరుషార్థమ..."
తెలుగునాడు. పు. 2.

**దంపకఱ్ఱ**

దంపనాగలి.

శ. ర.

**దంపతి తాంబూలాలు**

పెండ్లిండ్లలో తొట్లగట్టి పాన్పుసమయంలో నూతన వధూవరుల చేత పెండ్లికి వచ్చిన దంపతులకు టెంకా యతోబాటు తాంబూలా లిప్పిస్తారు. వాటిని జంటగానే తీసుకొని నూతన వధూవరు లను సంతానప్రాప్తికై వారు ఆశీర్వదిస్తారు.

చూ. ఫలతాంబూలాలు.

**దంపనాగలి**

నేల దమ్ము చేయుటకై ఉప యోగించే నాగలి.

బ్రౌ.

**దంపనేల**

మెట్టనేల.

బ్రౌ.

దంపిల్లి యాడు

చెలగాట మాడు.

"పులిపాలఁ ద్రావించు బులిపాల మృగి పిల్ల, పిల్లితో నెలుక దంపిల్లి యాడు."

మల్హా. 1.58.

దంపుడుపాట

రోకటిపాట.

"ఎవ్వ రా దంపుడుపాట నమ్ముదురు?"

గిర. 23.

ద ఇంద యను

పిల్లలను రమ్మని పిలుచుట లోని ఉపస్కారక పదం. 'రా. ఇంద. ఇది తీసుకో' అనుట.

"కరముల్ సాచి 'ద యింద యింద' యని రాగం బొప్పగాఁ జేర."

సారం. 1.50.

దక్క గైకొను

దోచుకొను.

"ఘనకుచంబు లాల్చు ఘర్మాంబు వుల్, దక్కం గైకొనె మైత్రిచే."

విప్ర. 2.60.

దక్క గొను

లోగొను.

"చిత్త మెల్లా దక్కఁ గొనె సిగ్గులు ముంగిట వేసె."

తాళ్ల. సం. 12.28.

దక్కించుకొని చేయు

విధిగా – తప్పనిసరిగా.

"ఎవడికోసం చేస్తాడు? దక్కించుకొని చేయాలిసిందే. ఆమాత్రం ఇంట బుట్టిన ఆడపడుచుకు చేయక పోతే నలుగురూ మొహాన కొట్టరూ?"

వా.

దక్కోలు కొను

వశపఱుచుకొను, స్వాధీనము చేసుకొను.

"పచ్చకపురంబువంటి సుపర్వభోగి, నీ లలామంబు చనువు దక్కోలు కొని యెఁ, బంతమున నా నృపాలుఁడు..."

కవిరా. 4.267.

దక్కోలు చేయు

దక్కించుకొను.

"ధననాథునిధులను దక్కోలు గాఁ జేసి."

భాస్క. యుద్ధ. 1397.

దక్కోలు పడు

వశ మగు.

శ. ర.

దక్షత

చూచుకొనే దిక్కు.

"ఎవరూ దక్షత లేక ఆ కుటుంబం అలా చితికి పోయింది."

వా.

దక్షిణపు దిక్కు చూచి దండము పెట్టు

నీళ్లు వదలుకొను, ఏదైనా వస్తువు పోయిన దని తీర్మా నించుకొను.

"వాడికి చేబదు లిచ్చావం టే దక్షిణపు దిక్కు చూచి దండం పెట్టాలిసిందే! ఇంక తిరిగి రాదు."

వా.

దక్షిణాలు వెట్టు

దక్షిణ యిచ్చు.

గౌరవసూచకముగా తాంబూ లములో ఎంతో కొంత డబ్బు పెట్టి యిచ్చు.

"విపులదక్షిణలు వెట్టి."
భార. ఆశ్ర. 1.77.

## దగదగ

ప్రకాశించుట మొదలగు వానియందగు అనుకరణము.

"బిసరుహారజమునఁ బైకం, దుసిమిన దగదగ వెలుంగునుడురాజుక్రియన్."
పాండు. 3.196.

## దగదగ మను

ప్రకాశించు.

"దగదగ మనియెడి కెంపునఁ, దగి సంజ దనర్చె..."
యయా. 2.108.

## దగ దొట్టు

దాహము గొను.

"జగములో వారిఁ జూచి సారె సారె నాసలనే, దగదొట్టె నీకుఁ దొల్లి."
తాళ్ల. సం. 9.42.

"దగదొట్టి నాల్కలుఁ దడి లేక చాల, దిగులుతో."
వర. రా. కిష్కి. పు. 481. పంక్తి. 1.

"వడి చెడి దగదొట్టి వడఁద లై".
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1114.

## దగ యెత్తు

దాహ మెత్తు, దప్పి చెందు.

"దగ యెత్తి పో లేక దండంబు లటు వైచి, హా విధీ! యని చేతు లార్చు వారు."
ఉ. హరి. 1.102.

## దగలు కొట్టు

దప్పి యెత్తు.

"దగల్, కొట్టక యుండ మేపు పలు కోయపుమందులు గ్రాలు పుంజుఁ జే, పట్టి..."
కువల. 4.207.

## దగలుబాజి

మోసగాడు ; దొంగ.

"విసపాలవిత్తు చిల్విసముదగలు, బాజి హరాంకోరు."
హంస. 5.113.

నేటిరూపం దగుల్బాజీ.

## దగాకోరు

మోసగాడు.

"దరిజేసి చెడుగొట్టు జెరికి దగాకోరు, విసపాలవిత్తు."
హంస. 5.113.

## దగ్గర చేర్చు

ఆదరించు, ఆశ్రయ మిచ్చు.

"నేను వాణ్ణి దగ్గర చేర్చి యింతవాణ్ణి చేస్తే వాడు నాకే నామం పెట్టాడు."
వా.

## దగ్గర దగ్గర

సుమారు.

"దానికిఁ బ్రాయ మియ్యేడల దగ్గర దగ్గర నిర్వదేడులే."
పాణి. 2.78.

"వాడికి దగ్గర దగ్గర పది రూపాయ లిచ్చాను."
వా.

## దగ్గరవాడు

రక్తబంధువు.

"అతడు మాకు చాలా దగ్గరవాడు. సయానా మాకు పిన్నమ్మకొడుకు."
వా.

## దగ్గఱకు రానీయడు

చేరదీయడు.

ఇది యిలా వ్యతిరేకార్థంలోనే వాడుకలో కనబడుతుంది.

"వాడు తాలాతోలీకబుర్లు చెప్పే వాళ్లను దగ్గఱకు రానీయడు."
వా.

దగ్గఱిచుట్టాలు

సమీపబంధువులు.

"అతడు మాకు చాల దగ్గఱి చుట్టము." వా.

దగ్గఱుచుట్టము

సమాన మయినట్టిది.

"అంబుదములోనం దోఁచు దంభోళి దగ్గఱు చుట్టం బన విక్రమక్రమణ చక్రక్రీడ శోభిల్లఁగన్."

ఉ. హరి. 2.49.

దగ్గుత్తిక

గద్గదస్వరము.

"...ప్రమదాశ్రుతతుల్, దృగ్గోళం బులఁ దొరఁగఁగ, దగ్గుత్తికతోడఁ దనదు దయితయుఁ దానున్."

కాళ. 1.111.

దట్టి గట్టు

సిద్ధమగు, నడుము కట్టు.

"ఏమేమి సేయ దట్టి గట్టితివో పాతకు రాల వీవు"

వర. రా. అయో. పు. 397. పంక్తి. 18.

నడుమునకు పూర్వం దట్టీ కట్టుకొనుటపై వచ్చినది.

దట్టి బడిన పులుగుల గతి

పట్టుపడిన పక్షులవలె.

"ఘనుసపు పెట్టిన మనుజుల్, దట్టిఁ బడిన పులుఁగులగతి, నిట్టట్టు పడంగ."

కా. మా. 3.201.

దట్లైగ దీసికొను

పరుగెత్తునపుడు నడుమునకు కట్టుకొన్నదట్టీ జాఱిపోవడం, దానిని ఎగదీసుకోవడం సహజం. ఇది సంభ్రమమును సూచించును. 'వాడు పంచను ఎగదీసుకుంటూ పోయాడు.'

"తిరిగి చూచుచు దట్లైగఁ దీసికొనుచు."

మను. 4.103.

దడకట్టు

నెయ్యి, నూనె మొదలయిన వాటిని తీయునప్పుడు ఆ పాత్రలకు సరియెత్తు కల రాళ్లను దడతట్టలో ఉంచి తూచు.

బ్రౌన్.

దడాదడి

చాలీ చాలని, బొటాబొటి.

"ముడి వేయుటకు దడాదడి సిగల్ గల కుర్రలకు."

శ్రవ. 2.66.

దడి గట్టవబోవు వేపిచందమున

విచార్యము.

దడియగబడు

క్రిక్కిరిసి యుండు.

"దండియలుఁను మీఱు దడియంగఁ బడక యంతక యటు వొందు గంధర్వ ముఖ్యులు..."

నృసిం. 1.80.

దడియాత

ఎందులోనైనా పూర్తిగా దిగక పైపైనే సంబంధ ముంచుకొన్నప్పుడు అనే మాట.

దడిదగ్గఱే ఈదులాడుటలు — అనుట.

"ఈ దడియీ తలతో లాభం లే దబ్బాయి! నీవు గట్టిగా యీ వ్యవహారంలో కల్పించుకొంటా నంటేనే నే నిందులో దిగుతాను. లేదా వదిలేసి వెళ్లిపోతాను." వా.

**దణాపెద్ద**

సేనానాయకుడు.

"దణా పెదయాజ్ఞ సుధా భుగ్వి రోధ్య, గ్రణీసేనల నిర్మించె గంభీర భేరీ, ధణంధాణముల్." ఉ. రా. 2.27.

**దత్తపుత్రశోకము**

దొంగయేడుపు.

అసలు పుత్రుని కైతే దుఃఖ ముంటుంది. దత్తపుత్రునికి ఏమి ఉంటుంది? అనుట పై యేర్పడినది.

**దత్తుకొను**

పెంచుకొను.

"ఆడి బొంకనివాని ముత్యాలఘనుని, తంజనాయకి వారల దత్తుకొనియె." రాధికా. 1.18.

**దత్తు తీసుకొను**

దత్తస్వీకారము చేసుకొను.

"ఆయన మూడో అబ్బాయినే వీళ్లు దత్తు తీసుకొన్నది." వా.

**దత్తురకాడు**

ధూర్తుడు.

"దత్తురకాఁడ యంచనఁగఁ దత్క్రియ నీవొనరించు టెన్నఁడా." కాళిందీ. 2.182.

**దద్దుగంబళి**

ఒక రకమైన కంబళి.

"...రత్నకంబళములు దద్దుగంబళులు." ప్రబంధ. 605.

రూ. దుద్దుకంబడి.

**దప్పికి ఎండమావులు దాగ దగ్గర బోవు**

వ్యర్థప్రయాస పడు.

"తప్పఁ జదువులలోఁ దత్త్వము వెదకు, దప్పికి ఎండమావులు దాగ దగ్గర బోవు." తాళ్ల. సం. 6.50.

**దప్పి కిచ్చు**

దాహము తీరుటకై మంచి నీళ్లిచ్చు.

"గ్రుడ్డులు మిడికించుకొని దప్పికి మ్రనుఁ, దమవారి నొక్క జేతాళి మాళి." కువల. 2.150.

**దప్పికి దిక్కు లేదు**

మంచినీళ్లిచ్చే దిక్కు లేదు.

"దప్పికి దిక్కు లేకుండా ఎన్నాళ్లు ఈ యింట్లో ఉంటావు? ఒంటరిగా." వా.

**దప్పి గొను**

దాహము గొను.

"దప్పిగొన్నట్టివారి కా దప్పి దీఱ, సలిలపూరంబు హితవౌ." నైష. 4.52.

**దప్పి తీఱు**

తనివి తీరు.

ఇక్కడ దప్పికి లక్షణయా తనివి అని అర్థం. 'దాహం తీరు' అనే రూపంలో ఇది నేటికీ వాడుకలో ఉన్న పలుకుబడి.

పాండు. 3.72.

వాడుకలో - 'వాడికి ఎన్ని ముదనష్టపు ఆస్తులు వచ్చి పడినా యింకా వాడి దాహం తీర లేదు'.

ఇదే ధనదాహం, కీర్తి దాహం అనే రూపాలలో కూడా కానవస్తుంది.

దప్పి దీర్చుకొను

శ్రమ తీర్చుకొను.

దాహం తీసుకోవడం శ్రమాపనోదక మనుట మన అలవాటు.

"...ఉన్నవాఁడ వగుట నిన్నింక నే నేయ, దప్పి దీర్చుకొని కడంగుము."

భాస్క. యుద్ధ. 853.

దప్పి దేర నగు

దప్పి తీర్చుకొను, సంతృప్తి చెందు.

"వియ్యాలచే నిచ్చి వేడుక నను వారు, తిట్టింప విని దప్పి దేర నైతి."

ఉ. హరి. 2.16.

దబదబ

తలుపు తట్టుట మొదలయిన వానియందలి ధ్వన్యనుకరణము.

"ఎవరా తలుపులు దబదబా బాదుతున్నారు. కాస్త ఉండండి. వస్తున్నాను." వా.

"వాడు దబదబా పరుగెత్తుతున్నాడు." వా.

దబాయించు

బూకరించు, బెదరించు.

"ఊరికే దబాయిస్తున్నా డంతే. వాడు చేసే దేముంది యిందులో?" వా.

"ఒకసారి రెండుసార్లు దబాయిస్తే వాడే దారికి వస్తాడు." వా.

దబ్బర వచ్చు

చేటు మూడు.

"వాడు పాళెంబు దిగిరి దబ్బర వచ్చె, ముందఱ రాక మీరు వేగుల వారిఁ బనిచి."

వర. రా. యు. పు. 85. పం. 18.

దబ్బు దబ్బు

చెప్పు.

"ఎంత చేసినది నేఁ డిది విన్నఁ గన్నఁ జో,ద్యము గాదొ మఱి దబ్బు దబ్బిననిటు,వలె నుండవలె మెచ్చ వలదె యిందులకు ర,త్నాంగిని జూచిన యట్టి వారు." సారం. 3.208.

"ఉల్లములోన నే మనుచు నుందువొ నే నొక దబ్బు దబ్బెదన్."

సారం. 1.71.

దబ్బఱకత్తియ

అబద్ధములు చెప్పునది.

శ. ర.

దబ్బఱకాడు

1. అబద్ధ మాడువాడు.

2. మోసగాడు.

"అంత దబ్బఱకాఁడ వీ వౌదొ కాదొ." శుక. 3.37.

3. కులాసాపురుషుఁడు.

"కొబ్బెరయు మందపాలతోఁ గూర్చి

త్రావి, యుబ్బు దబ్బఱకాఁడు నీ కబ్బు టగునె." ప్రబంధ. 641.

దబ్బఱయాట

విలాసక్రీడ.

"ఉడుగక కంచె వీచుచును నుబ్బున దబ్బఱయాట లాడఁగన్."

హరి. ఉ. 7.197.

దబ్బు వెట్టు

మాయు.

"మగనిరాక యెఱిఁగి మగువ యొయ్యన అంత, మగనిఁ దెచ్చి యింటి మఱుగు నందుఁ, గల్లుగోలెమునను గదియించి యామీఁదఁ, గంప దబ్బువెట్టెఁ గదల కుండ."

భల్లా. 1 ఆ. శ. ర.

దమ్మడు చిక్కెను

ఇంక వీడు నాచేత చిక్కినట్లే, నాకు లొంగినట్లే అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"తొయ్యలి చిక్కె దమ్మఁ డని దుర్భర హర్షనిమగ్నచింత యై."

విప్రనా. 3.9.

"దమ్మఁ డిఁక నేఁడు నాచేతఁ దగులు వడియె."

హరిశ్చ. 4.101.

దమ్మిడీ పుట్టదు

ఏమాత్రమూ పరపతి లేదనుట.

"ఆ ఊళ్లో వాడికి దమ్మిడీ పుట్టదు."

వా.

దమ్ముకొను

బురద యగు.

దమ్ము చేయు

తడిగా ఉన్న పొలమును బాగుగా దున్ను.

బ్రౌన్.

దమ్ము పట్టు

1. ఊపిరి బిగబట్టు.

2. పొగ పీల్చు.

దమ్ము లాగు

పొగ పీల్చు.

మాటా. 70.

దమ్ములు లేవు

ధైర్యము లేదు.

"ఎదుటనే దమ్ములు లేవు. వెనక ఏమనుకుంటే యేమి?"

వా.

దయ కద్దా?

పలకరించుటలో ఒకమాట తీరు.

ఇదే రకరకాలుగా 'దయ లేదు, దయ పెట్టండీ, దయ తప్పినారు' – అన్నట్లు విన వస్తుంది.

"దయ కద్దా యని పల్కరించి తమిఁ జెందం జేసి వే నవ్వులం, బ్రియ మొందించి......"

హంస. 3.96.

దయ గలుగు

దయ గలిగియుండు.

"వర్ణంబులు నాలుగింటిమీఁదను మేదినీశ్వరుండు, దయ గలుగవలయు."

శాంతి. 2.177.

రూ. దయ గల్గు.

## దయ గల్గు

అనుగ్రహము కలుగు.

"నీదయ గల్గ కుండినన్."

రుక్మాం. 3.151.

రూ. దయ గలుగు.

## దయ చూచు

అనుగ్రహించు.

"బతిమాలి సేసె పెఁబడు టింతియే కాని, యాలిపై దయ చూడ వనియె నొకతె." శుక. 3.122.

## దయ చేయు

1. వచ్చు.

"దయచేసి రేపు దయ చేయండి. చూస్తాను." వా.

2. వెళ్లు.

"ఇంక మీరు దయ చేయవచ్చును. ఇక్కడ పని అంతా అయిపోయింది." వా.

3. దయ చూపు.

"చాల దయచేయుటకు ముద్దరాలు సుమ్మి, యే మెఱుంగదు గోల భూమిశ తిలక!" కృష్ణ. 4.132.

4. ఇచ్చు.

"తనుఁ జూచి శిథిలబంధ శిరోజ యగుట న,య్యతివకు ముక్తికేశాహ్వ యంబు, దయ చేసి......వరము లొసఁగి......" పాండు. 5.157.

## దయపడి

అనుగ్రహించి, దయ తలచి.

"ప్రియమున కర్థంబు వలయు నో శివుఁడు, దయపడి యిచ్చు సర్థమునకుఁ దోడు..." బస. 5.131. పు.

## దయపడు

జాలి నొందు.

"దయపడుటనో గురుజను లని, భయపడు టనో." కాళిందీ. 6.272.

## దయ పుట్టగ

జాలి కలుగునట్లుగా.

"అని చిత్తిని మగఁ డొల్లని, తను వేటికిఁ దన కటంచు దయ పుట్టఁగ బో, రున బాష్పంబులు..." శుక. 2.119.

## దయవాడు

దయ గలవాడు.

"నిక్కంబుగా రాధపై, దయవాఁడై యపు డున్నచిన్నెలు వృథా తత్త్వంబు లయ్యెం గదున్." రాధా. 3.126.

## దయ సేయవలయును

1. ఇప్పింపవలెను.

"ఇప్పని నాకు దయ సేయవలయు, నని......పలుకుచున్న గణాధీశ్వరు తెగువ."

కుమా. 2.61.

"నాకో రూపాయి దయ చేయించండి." వా.

2. రావలెను.

"మీరు మాయింటికి కోసారి దయ చేయాలి." వా.

## ....దయ సేయు

...అనుగ్రహించు.

"మీ పాద, సరసిజంబులుఁ గొల్చు సద్భక్తి నాకు, దయసేయు మనుడు నాతనిఁ దన్పు సేసి."

ద్విప. మధు. పు. 7.

దయ్యముతో కాపురము

అపాయకరము.

ఏ నిమిష మైనా ప్రమాదము రావచ్చు ననుట.

వేంకటేశ. 36.

దయ్యముతోడి జాగరము

అనుక్షణమూ ప్రమాదముతో కూడినపని.

"అయ్యయో! మాకు దండ మిడినంత ఫలంబు నరేంద్రచంద్ర! యీ, దయ్యముతోడి జాగరము దాటఁగఁ జేసి శుభమ్ము లిమ్ము." కువల. 2.78.

దయ్యమునెత్తికోలు తుది దాకు

దైవసంకల్పము నెఱవేరు.

"దయ్యన మంది పోయెద విచారము లిన్నియు నేల యంతతో, దయ్యము నెత్తికోలు తుదిఁ దాఁకెడు నంచు బహుప్రలాపుఁ డై." నిర్వ. రా. 10.57.

"డయ్యమి నీవు వెక్కసపడం గద పండువు సేయఁగోరు నా, దయ్యము నెత్తికోలు తుదిఁ దాఁకుటఁ గాదె భుజంగభంజనా!"

భార. ఉద్యో. 3.

దయ్యము పుణ్య మెంచదు

పుణ్యాపాప విచారము లేని వారిని ప్రస్తావిస్తూ అనే మాట.

వేంకటేశ. 75.

దరికాను

తాకు, వ్యాపించు.

"ధరణియు గగనము దిక్కులు, దరికొని మండెడు విషాగ్ని." భీమ. 4.76.

దరిజేరు

1. బయటపడు.

"చెప్పకు మింక నొక్కదరిఁ జేరద నంచు." నిరంకు. 2.105.

2. ఒడ్డు చేరు.

"మోహదు,ర్వారావర్తములఁ మునింగి దరిఁ జేరన్ రాక." పారి. 2.100.

దరి దాపు

సమీపము. జం.

"...మేరువు, దరి దాపునఁ గూడి మిగులఁ దహతహ పడుచున్." దశా. 4. అవ. 122.

"లంచం గించం అతడు దరిదాపుల్లోకి రానివ్వడు." వా.

దరిదాపు కానక

దిక్కూ మొక్కూ లేక.

"పద్మజేంద్రాది దేవతాప్రభువు లే మ, హామహు నమేయ మాయాబ్ధిలో మునింగి, దరియు దాపును గానక తల్లడింతు, రట్టి హరి వీవె కావె పట్టాభిరామ!" ఉ. రా. 5.71.

దరిదాపు లేని

అంతూ పొంతూ లేని.

"దరిదాపు లేని దుస్తరపాతకాంబుని, ధానంబు నే నెట్టు దాఁటువాఁడ." వరాహ. 2.52.

"విడిచి దరిదాపు లేమిఁ బెన్వెతల మునుఁగు." ప్రభా. 2.111.

దరిద్రగొట్టు

ఒక రకమైన తిట్టు.

"వాడు ఒట్టి దరిద్రగొట్టు వెధవ." వా.

"వాళ్లది ఓ దరిద్రగొట్టు సంసారం." వా.

దరిద్రనారాయణుడు

దరిద్రుడు.

గుంటూ. పూర్వ.

దరిద్రుడు తలగడిగితే వడగండ్లవాన వచ్చిందట

ఏది చేయబోయినా అడ్డంకులు కలుగుపట్ల ఉపయోగించే పలుకుబడి. చేయక చేయక, రాక రాక అనే అర్థం కూడా ఇందులో గర్భితమై ఉన్నది.

"నే నేదో యిన్నాళ్లకు చేలో విత్తనం వేస్తే ఇప్పుడే వరుపు వచ్చింది. దరిద్రుడు..." వా.

దరిబేసి

1. దీనుడు.

"భుజమునఁ గూబరంబు ధరించుకొని సోలు, దరిబేసి యగుచు బేతాళుఁ డొకఁడు."

జై. 5.196.

2. పిసినిగొట్టు.

"ధర్మకార్యములలో దరిబేసి నుంచిన, నిచ్చునా తన్నుక చచ్చుఁ గాక."

వేణు. శ. 34.

3. ఒక తిట్టు.

"ఆ దరిబేసి వెధవను నమ్మకంటే యింక అయినట్టే." వా.

దరిమిలా

తరువాత.

బ్రౌన్.

"దరిమిలా మీ తావునుంచి యే వర్తమానమూ తెలియ రాలేదు." వా.

దరి యొత్తు

కూలంకష మగు; నిండి పాఱు.

"దరి యొత్తెడు నేఱునుబోలె."

భార. శాంతి. 3.24.

దరువు చేయు

తాళము వేయు.

శ. ర.

దరువులు వెట్టు

పాటలు పాడు.

"దాకొన్న గతులతో దరువులు వెట్ట, వైకుంఠమునుండి వచ్చి శౌరి, యతనికిఁ బ్రత్యక్ష మయ్యె నావేళ."

ద్వి. పరమ. 8.566 పు.

దరువు వేయు

1. తాళము వేయు.

అన్నిటికీ ఒప్పుకొను అనుట.

"నీ పెండ్లాం ఏం చెప్తే దానికి దరువు వేసేదేనా నీపని. లేక సొంతంగా ఆలోచించే దేమైనా ఉందా?" వా.

చూ. తాళము వేయు.

2. తన్ను.

"ఆ మేస్త్రీ యేదో తలతిరుగుడుగా ప్రవర్తించాడని చీకట్లో వస్తుంటే కూలీలందరూ చేరి దరువు వేసి పంపించారు." వా.

దరేఖానాపద్దు

ఎందుకో తెలియనిది.

దరేఖానా సంసారం

దుబారా ఖర్చు చేసే సంసారం.

## దర్భపోటు తిను

బ్రాహ్మణార్థము చేయు.

క్షణం దత్వా అంటూ బ్రాహ్మణార్థము చెప్పే టప్పుడు దర్భకూర్చెతో చేతిలో పొడుచుటపై వచ్చిన పలుకుబడి.

"దర్భపోటులఁ దిని లేనితఱుల మైత్రి, నంటి..." ఆము. 7.5.

## దర్భముండ్లు

బాధాకరములు, కటువయి నవి.

"సంస్కృతశబ్ద మూఁదఁ జెప్పిన నవి దర్భముం డ్లనుచుఁ బెట్టరు వీనుల." సింహా. 1.32.

## దర్యాప్తు చేయు

విచారణ జరుపు.

బ్రౌన్.

"మీరు అర్జీ పెట్టుకున్న విషయం దర్యాప్తు చేసి కనుక్కుంటాను. తొందర పడితే ఎలాగు చెప్పండి?" వా.

## దర్శనం బిచ్చు

కానుక యిచ్చు.

పెద్దవారిని, రాజులనో దేవతలనో దర్శించుటకై వెళ్లినప్పుడు కానుక చేయుట అలవాటుగా కానవస్తుంది. ఈ 'దర్శనం' అందువల్లనే యిఁచటలో ఉన్న దేమో!

హర. 6.15.

చూ. దర్శన మిచ్చు.

## దర్శన మిచ్చు

కానుక యిచ్చు.

"దర్శనం బిచ్చె నెద్దానిఁ గోమటి క్రొత్త, పాడచూప నేతెంచి భూభుజునకు." కాశీ. 4.99.

"దర్శనం బిచ్చెఁ దాతలతరమునాఁటి, కట్టుబండి యొక త్రైకు నెట్టనముగ." రుక్మాం. 4.104.

చూ. దర్శనం బిచ్చు.

## దలము కొను

ఎక్కువగు.

"దెసలు సూడఁగ గుండె దిగ్గనుచక్ర సమూహములనకుఁ దలమునుక లగుచు, నీఁదు చకోరంబు లెగురఁ బ్రేఁగై యాడి,గిలఁ బడునట్లుగా దలము కొనుచు."

నిర్వ. 6.55.

## దవడలు నొక్కుకొను

నోరు నొక్కుకొను.

చూ. నోరు నొక్కుకొను.

## దవడశుద్ధి చేయు

దవడలు వాయించు.

"ఆ పిల్లతో ప్రేమ గీమ అన్నావంటే దవడశుద్ధి చేసి పంపిస్తుంది. జాగ్రత్త." వా.

## దవనపున్నమ

చైత్రమాస పూర్ణిమ. కన్నడంలో 'దవదహుణ్ణివె.' శ్రీశైల మల్లికార్జునునిపై ఈరోజు దవనం

రెమ్మలు వేసి పూజించే ఆచార మున్నది.
పండితా. ప్రథ. పురా. పుట. 360; క్రీడా. పుట. 65.
చూ. భాషా. పరి.

దవుడు తీయు
పరువెత్తు.
గుర్రమువలె వేగముగా పరుగెత్తు అనుట.
"అధికారి పట్టంలో కాంపు చేశా డనే సరికి ఊళ్లో పెద్ద మనుష్యు లంతా అక్కడికి దవుడు తీశారు." వా.

దవుదవ్వుల
దూరముగా.
"దవుదవ్వులనె నేఁడు ధరణికి దిగి వచ్చు,చున్నవాఁ డిది యేమి యొక్కొ యనియు..." కళా. 2.6.

దవుదవ్వులన
దూరమునుండియే.
"ఆలయోపవన సర స్తీరమంటపవర్తి యైనకృష్ణు దవుదవ్వులన విలోకించి." ప్రభా. 2.12.

ద వ్వగు
దూర మగు, సంబంధము లేని దగు.
"ఈ, చివ్వకు నీకు నల్కమెయిఁ జేసిన యాపని గూఢవృత్తికిన్, ద వ్వగు నేని యయ్యభిమతం బొడఁగూడియు నిష్ఫలం బగున్." భార. విరా. 2.286.
చం. రా. 1.92.

దవ్వగ
దూరముగా.
"ఘనదురితానుబంధ కలికాలజ దోష తుషారసంహతిం, దనయుదయప్రభావమున దవ్వగఁ జోపి."
భార. ఆది. 1.5.

దవ్వుపడు
దూరస్థ మగు.
చూ. దవ్వుపఱచు.

దవ్వుపఱచు
దూరమునం దుండువానిగా చేయు.
"చేయూఁక వాని మొనలకుఁ, బాయఁగ నెలయించి దవ్వుపఱచె నవధ్యో,పాయుఁడు హరి యడుగడుగుం, జే యందిన యట్ల యాస సేయుచు వీఁకన్."
హరి. ఉ. 2.134.

దశపాతకి
పంచ మహాపాతకములను, అయిదు ఉపపాతకములను చేసినవాడు.
"పశువధయుఁ జేసె వీఁడుం, దశపాతకి యల్లవాఁడు దాక్షిణ్యకళా, నిశదస్వహీనుఁ డీతఁడు, శిశుహత్య యొనర్చె వీఁడు సిద్ధప్రవరా!"
సానందో. 4.40.

దశబలుడు
పది రకము లైన బలములు కలవాడు – బుద్ధుడు.

దశమగ్రహము
అల్లుడు.
"జామాతా దశమో గ్రహః." వా.

దశరాత్రము
ఒక రకమైన యజ్ఞము.

ఇది పదిరోజులపాటు జరుగుతుంది.

దశావస్థలు

పది మన్మథావస్థలు: చూచుట, తలచుట, సంకల్పము, జాగరము, కృశించుట, ఇతరవస్తు విముఖత, సిగ్గు లేమి, ఉన్మాదము, మూర్ఛ, మరణము–ప్రేమపరిణతిలోని దశ లివి యని ఆలంకారికులు.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 226.

దశాహం

అంత్యక్రియలలోని కర్మ.

దసలు పడు

కలియు.

దసువంది

గుద్దులాటకై జెట్టులను కూర్చువాడు.

"గుద్దులాటకు జెట్లఁ గూర్చువానికిఁ బేరు, దసువంది యనఁగను దనరు చుండు." ఆం. భా. ద్వి. 208.

దస్తరం పస్తరం ఉందా?

ఏమయినా ఆస్తి ఉందా అనుటకు రాయలసీమలో ఉపయోగించే మాట. దస్తరమనగా ఇతరులకు డబ్బిచ్చి వ్రాయించుకొన్న పత్రాల కట్ట.

"వాడికే మన్నా దస్తరం పస్తరం ఉందా? వట్టి డాబేనా?" వా.

దస్తరము విప్పు

కట్ట విప్పు.

తన వ్యవహారాన్ని సాంగోపాంగంగా చెప్ప పూనుకొను.

"ఏం చేయను? ఏం చేస్తున్నావని అన్నానో లేదో అతను తన దస్తరం విప్పాడు. రెండుగంట లయినా తెగ లేదు. చచ్చినట్టు వింటూ కూర్చున్నాను." వా.

దస్తావేజు

ఒడంబడిక వ్రాసుకొన్న పత్రము.

"మా వకీలు దస్తావేజులు చూచి కానీ మాట యివ్వలే నన్నాడు." వా.

దళకొను

ఎక్కువగు.

"దళకొని యున్న తొంటి సుకృతంబు కతంబున వచ్చి మీఁదటం, గలిగెడు శోభనంబులకు..." విక్ర. 5.5.
శ. ర. పాఠము.

దళగ్రామము

శివారుగ్రామము.

"మురువారా అనే దళగ్రామము చేరినాను."

కాశీయా. 98.

దళ మిచ్చు

పలుచని సన్నని వస్తువులకు మఱింత బల మిచ్చుటకై మఱొక లేపనముతో దళసరి చేయు.

"తనుమధ్య లోపరీస్తనభార మని విధి,

దళ మిచ్చె నాఁ గృశోదరము లాసఁగ." కుమా. 10.38.

దళముకొను

1. అధిక మగు.

"దర్శనప్రీతి వారిపైఁ దగులుమీఱ, వలనియర్మిలి మనమున దళముకొనఁగ." భార. అను. 2.283.

2. దట్ట మగు.

"లలితకలకంఠ కోలాహలములు నెసఁగ, దళముకొని రెండుగెడలఁ గాదంబకోటి." ఉ. రా. 4.156.

దళ మెక్కు

చర్మము దళసరి యై మోటు వాఱు.

"దళ మెక్కి గాత్రంబు చెలువు దప్పక మున్న." కా. మా. 3.177.

దళవరి

ఒక రక మైన ధాన్యము.

శ. ర.

దళసరిగా

దట్టముగా.

"ఆ చీర నేత చాలా దళసరిగా ఉంది. తడిపి కట్టడానికి పనికి రాదు." వా.

దళారున

హఠాత్తుగా.

"వ్రాలంటి మెఱుంగుఁ జూపులు దళారున వచ్చె మహాద్భుతంబుగాన్." కువల. 2.91.

దాకొను

ప్రయత్నించు.

"దాకొని జగములు పుట్టించు బ్రహ్మకుఁ దండ్రివి నీవే." తాళ్ల. సం. 10.104.

దాగబోయిన తలారి యి ల్లగు

ఎక్కడికి పోకూడదో అక్కడికే పోయినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

దోషి తప్పించుకొన వలసినది తలారినుండే. వాని యింటి లోనికే పోతే...

"ఏ నే మందును డాఁగఁబోయినఁ దలారి ల్లయ్యె నేఁ డేడకుం,బో నాఁ జిక్కితి వంటయింటి శశ మా బోనంపుఁ బెన్నాటికిన్." దశావ. మత్స్య. పు. 41.

దాగరంత ముఖ మగు

ముఖ మింత వెడ ల్పగు.

అనగా యెంతో సంతోషము కలిగిన దనుట.

"అల్లుడు వచ్చా డనేసరికి అత్తకు దాగరంతముఖ మయింది." వా.

దాగరలో వెలగకాయవలె

కదలక మెదలక.

బెల్లం కొట్టినరాయి వంటిది.

దాగిలి ముచ్చిములు

దాగిలిమూతలు.

"చావులుఁ బుట్టుగు లా దేడి సరి దాఁగి ముచ్చిములు." తాళ్ల. సం. 5.270.

దాగిలి ముచ్చు లాడు

ఒకసారి కనిపిస్తూ, మరొక సారి కనిపించక ఉండు.

"కలుకుఁ జెక్కులలోన గురివెంద తాటంక, రోచులు దాఁగిలి ముచ్చు లాడ." నిరంకు. 4.89.

"వాడు నాతో దాగిలిముచ్చులాడుతున్నాడు. కూచుని ఇదేదో తేల్చి వేసుకోండా మంటే ఇదిగో అదిగో అంటాడు." వా.

**దాగుడుమూతలాట**

ఒక బాల్యక్రీడ.

ఒకరు కనులు మూసుకోనగా మిగతవారు దాచుకుంటూరు. వారిని కనులు మూసికొని ఉండిన దొంగ పట్టుకోనాలి. 'కండ్లామూసి' అని రాయల సీమలో దీనిపేరు.

పండితా. ప్రథ. పురా. పుట. 460.

**దాగుడుమూత లాడు**

1. చిక్కక తప్పించుకొనుచుండు.

"ఆ దొంగ ఆరునెలలు పోలీసులతో దాగుడుమూత లాడాడు." వా.

2. 'దాగుడుమూతలాట' అను ఆట ఆడు.

**దాటడుగు పరువడి**

ఒక రకమైన మల్లయుద్ధములోని బంధము.

"ఎడమడుగు పరువడి కుడియడుగు పరువడి కదలుపరువడి దాటడుగు పరువడి... మొదలైన పదునాలుగు విసరుల మర్మంబుఁ జూపి..."

హంస. 1.206.

**దాటడుగు మొన**

ఒక రకమైన మల్లయుద్ధములోని బంధము.

"దాటడుగు మొన...ఆదిగాఁ గల పదిరెండు మొనలు." ప్రబంధ.7 8.

హంస. 1.206.

**దాట నగు**

అతిక్రమించు.

"కులశీలము దాట వచ్చునే?"

భాస్క. బాల. 321.

**దాటరి**

కప్ప.

"దాఁటరి చలికాపు కప్ప యనఁగ భేక మొప్పు." సాం. ని. తిర్య. 83.

**దాటవేయు**

తప్పించుకొను.

గాణ.

**దాటు కట్టు**

గుంపు కూడు.

"చినుకుతోఁ గూడుకొని గాలి చెలఁగఁ జూచి, దాఁటు కట్టుచు మృగములు దాఁటుచుండ."

నా. పంచ. 2.194.

**దాటుకొను**

చనిపోవు.

"ఆ మహారా జెలాగో మంచికాలంలోనే దాటుకొన్నాడు. వీ ళ్లందరితో వేగలేక నేను ఛస్తున్నాను." వా.

**దాటు తీయు**

పీడానివారణార్థమై యేదైనా దిగతుడుచు.

నిమ్మకాయ, టెంకాయ, గుమ్మడికాయ వంటిది దిగతుడిచి పారవేస్తారు.

"వీడి కేదో కింకజ్వరంగా ఉంది. రాత్రికి దాటు తీసేస్తే పోతుంది." వా.

దాటువడు

1. దూర మగు.

"వేఁట మెయి వచ్చి నృప! మా, బోఁటికిఁ జిట్టంట్ల నంటి పోయిన పిదపన్, దాఁటువడుం గులమునకును, మాటయుఁ గన్యునకు వచ్చు మానుల చేతన్." పి. శకుం. 3.88.

2. గుంపు కూడు.

"పదియును బదియేనును నిరు, వదియును ముప్పదియు దాఁటువడి నిత్యంబున్." హరి. పూ. 6.8.

దాట్లమారి

జారిణి.

గోడలు దాటడం వ్యభిచారానికి ప్రత్యామ్నాయంగా మనభాషలో చాలమాటలు వచ్చినవి. అందుపై యేర్పడిన పలుకుబడి. దొంగచాటుగా వెళ్లేవారు సహజంగా తలవాకిట పోలేరు. అందుచేత పెరటిగోడలు దూకి వెళ్లవలసి వచ్చేది.

"ఇది దాట్లమారి యగు నని, పదపడి మఱు నాఁడె యింటిపాటున మేకో, లాదవింప..." శుక. 3.124.

దాడికాడు

1. వేగులవాడు.

"ఇది చనుదెంచెఁ జైత్రుఁ డని యెల్ల వనంబులకున్ బ్రమోదముల్, పొదలఁగ మేలివార్తఁ గొని బోరన వచ్చిన దాడికాఁ డనన్."

నృసిం. 2.60.

2. దండెత్తువాడు.

"తిమిరపు దాడికాఁడు చను దేరఁ దొడంగను నా కెదుర్పఁగా, సమయము కాదు." విప్ర. 3.23.

దాడిగొను

ఒకదాని వెంబడి ఒకటి వచ్చు.

"పాడి వినోదంబులు సలిపిన గోపాలుఁ డటంచును భతన సభాన్యల్, దాడి గొనన్ విశ్వ విరమణముతోఁ దన్విఁ జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్." అప్ప. 4.236.

దాడి చేయు

దండెత్తు.

"బదునెనిమిదవ మాఱు దాడి చేసి, శత్రులం దోలి విజయంబు చేకొంటి." భాగ. 10. స్కం. పూ. 1759.

దాడిపఱచు

పరుగెత్తు.

బ్రౌన్.

దాడిపోవు

దండెత్తు.

"...అతనిపై దైత్యులపోక, తలఁపుచు వారిపై దాడిపోఁ దగునె." రంగ. రా. యు. 289. పు. 20. పం.

దాడియాడు

ముట్టడించు; మార్కొను.

శ. ర.

"ఈడఁబోవక యింద్రుఁ డీ పనవీడు, దాడి యాడుచు వస్తుతతిఁ గొల్లవిడిచి." ద్వి. భాగ. 7 స్కం.

దాడి వచ్చు

దండెత్తి వచ్చు.

"మకరకేతన! నిను వేఁడ మచ్చరించి, చెలఁగి నా మీఁద దాడి వచ్చిన విధంబె." ఉదా. 2.50.

"దేవా! రక్కసుఁ డొక్కరుం డతి బలోద్రేకంబునన్ దాడి రా."
వరాహ. 11.12.

## దాడి వెట్టు

దండెత్తు.

"ఘోషయాత్రావిధి నెపమున దాడి వెట్టి." భార. కర్ణ. 3.356.

"ఒకనాఁడు దనుజనాయకు సేనతో దివ్యధామంబుపై కటు దాడివెట్టి."
ఉ. హరి. 1.18.

"భూలోకం బెల్లఁ గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవిముఖు లయిన బహిర్ముఖులం గనుంగొని."
భాగ. 3 స్కం. 613.

## దాడి వోవు

దండెత్తు.

"దాడివోయి దనుజుల దండించి తా వచ్చె."
తాళ్ల. సం. 9.223.

## దాదాపుగా

ఇంచుమించుగా.

"ఈ చీర దాదాపు ఇరవైరూపాయ లుంటుం దనుకొంటాను." వా.

## దానక్క ఇంకొక్కటి

అదే నేమిటి అనే అర్థంలో ఉపయోగించే పలుకుబడి.

"తనచేత కాకుంటే దానక్క యింకొక్కతె."
సారంగపాణి పదములు.

"ఆ యిల్లు కాకపోతే ఇంకోయి ల్లవుతుంది. దానక్క యింకొకటి. మునిగి పోయిం దే ముంది?" వా.

## దానక్క యిది

దానికి మించిన దిది అనుట.

చెడులోనే ఈ ఆధిక్యం.

"దానికంటే యిది మేలు గదా అను కుంటే దానక్క ఇది అయింది." వా.

## దానము పట్టు

దానము తీసికొను.

"గ్రహణసంక్రమణాది కాలంబులను రాచనగ రాశ్రయించి దానములు పట్టి." హంస. 2.152.

## దాని అక్క

అంతకు మించిన దనుట.

"ఆ పనిమనిషితో పడలేక దీన్ని పెట్టుకున్నామా? ఇది దాని అక్క." వా.

చూ. దానక్క యిది.

## దానికడ నిద్దుర చెందు

సంగమించు.

ఇక్కడ నిద్ర పడకకు, పడక సంగమమునకు ప్రతీకలు.

"......చంక వట్రమున్, నివ్వటిలంగ దానికడ నిద్దురఁ జెంద బిరాన వచ్చినన్."

హంస. 3.87.

## దాని కొనిపోయి కాల్చ(నా)

తిట్టు.

ఎందుకు వాడు కాల్చనా? అన్నట్లే దాన్నెత్తుకొని పోయి కాల్చా - నిన్ను కాల్చా - మొదలైనవి తిట్లలో ఉపయోగిస్తారు నేటికీ.

"భక్తివిహీనుల బ్రదుకు గొయ్యిఁ బొడ్వన, దానిఁ గొనిపోయి కాల్చ."
పండి. పర్వ. ద్వితీ. 418 పు.

**దాని తలనె వేగెనా ?**

దాని మొహాన్నే పొద్దు పొడిచిందా అనుట వంటిది.

"వల పెక్కడ లేదా? యీ, యలి కంతల తలనె వేగెనా? యేఁచ కిఁకన్, జలిగాలిఁ ద్రోచి విడువుము, చెలి మిక్కిలి మనసుపేద శీతలపాదా!"
విజ. 3.50.

**దాని వేలు తీసి దాని కన్నె పొడుచు**

వానికి చెడుపు చేయుటకు వానినే ఉపయోగించుకొను.

"దాని వ్రేలు దీసి దాని కన్నుఁ బొడిచి, నటుల సేయకున్న నగునె చిలుక."
రాధి. 3 ఆ.

**దాపకట్టు**

నిచ్చెన.
రామలిం. 55.

**దాపటి కాల బొమ్మ**

ఎడమకాలికి కట్టిన బొమ్మ.

"మీఁద జన్మంబు గలుగ నిర్మించెనేని, కమలజుని పేర దాపటి కాలబొమ్మ."
ఉ. హరి. 4.137.

**దాపరము చేయు**

మరుగుపరుచు.

"ఊరు లజ్జా భర గర్వారంబునను రాగోద్వృత్తికీ వేల దా, పరముం జేసెదు మర్మముం దెలియు సూ పజ్జక వృథా కాదె..."
కాళిందీ. 6.28.

**దాపుకొను**

ఆశ్రయించు.

"ఇట్లరుగుదెంచి ప్రాంత రత్నస్తంభంబు దాపుకొని సఖీజనంబుల మరువున."
కవిక. 3.205.

**దాపుడుచీరలు**

పండుగలకూ, పబ్బాలకూ కట్టుకొనుటకై దాచుకొని రోజూ కట్టుకొనే మంచిరకం చీరలు.

"ఆవిడకు దాపుడు-చీరలే ఇరవై దాకా ఉన్నా యట. ఆవిడ కేం తక్కువా?"
వా.

**దాపు దండగు**

తోడునీడ యగు.

"చదివించి బుద్ధులిచ్చి చైతన్యమైన వాడు, పొదిగి నాదాపు దండై బోధింపడా."
తాళ్ల. సం. 7.243.

**దాపుర మగు**

దాపురించు.

ఏదైనా అనిష్ట మయినది పొసగినప్పుడే ఉపయోగిస్తారు.

"ఇతనితోఁ గలసి పేరడిగి మాటాడు, తతి పాపి నాసిగ్గు దాఁపురం బయ్యె."
ద్విప. కల్యా. పు. 136.

"అ దెక్కడ దాపుర మాయె నాకు."
సారం. 2.146.

**దామాషా**

భాగము.

(హిం) దామాశాహి.

"నా దామాషాకు ఇందులో మున్నూరు మామిడికాయలు రావాలి."
వా.

దామెనకట్టు కట్టు

బందె వేయు.

"పామరపు టింద్రియాల బారిఁ బోనీ తివి నన్ను, దామెనకట్టుగాఁ గట్టి." తాళ్ల. సం. 6.59.

దామెనకొయ్య

దామెన కట్టు స్తంభము.

"ఉఱక దామెనకొయ్యలు పెఱికి పాఱు, వైచుఁ గావళ్లు నుట్లను వ్రచ్చి తెంచు." హరి. పూ. 5.206.

దామెనత్రాడు

చాలా పలుపులు కల నిడుపైన త్రాడు.

"చనుమా చూతము నీ తెఱం గనుచు నుత్సాహంబుతోఁ దల్లి దా, మెన త్రాటన్ బెనుతోటి తోన మును బల్మిన్ గట్టినన్." హరి. ఉ. 4.235.

దామెనవేట

అక్కడక్కడ దామెనలు అమర్చి చేయువేట.

"దీమంబువేటలు దామెన వేటలు, తెరవేటలును నేర్పు తెరలికలును." ద్వా. 8.22.

దాయ గట్టు

బందము వేయు.

శ. ర.

దా యను

రమ్మను.

రాను దా గా పలకడం కొన్ని మండలాల్లో కొన్ని వర్గాల్లో ప్రచురంగానూ, మిగతచోట్ల మిగత వర్గాల్లో ముద్దుగా పిల్లలను పలకరించడం లోనూ వినవస్తుంది.

'దా యే పాపా దా యే' అనడం వాడుక.

"తమి పరభామలందుఁ గలదా యని దా యని కౌఁగిలింపుచున్." హంస. 1.243.

"రాత్రికి మా యింటికి దారా." వా.

దాయపడు

కష్టపడు.

దాయభాగము

పిత్రార్జితంలో తనకు రావలసిన భాగం.

దాయ మాడు

దాయాలను ఆడు, పాచికలు ఆడు.

పండితా. ప్రథ. పురా. పుట. 368. చూ. నెత్త మాడు.

దాయవఱచు

కష్టపెట్టు, బాధించు.

"మా యరవి యేల క్రుంకఁడో, కో యను నిట్టేల తడసెనో యనుచుఁ గ్రుంకం, బోయెడుఁ జూ యిప్పుడ యను, దాయవఱిచె నను మనోజతాపము పేర్మిన్." భార. విరా. 2.312.

దాయాదిపోరు

తీరని పగ, సహజవైరం.

"వాళ్లకిద్దరికీ యెప్పుడూ దాయాది పోరు." వా.

జ్ఞాతులకు సహజంగా వైరముండుటపై యేర్పడినది.

దాయాదిమత్సరం
దాయాదుల పగ.
"వాళ్ల తగాదా అంత సులభంగా పరిష్కార మయ్యేది కాదు. వాళ్లది అంతా దాయాదిమత్సరం." వా.
చూ. జ్ఞాతివైరము.

దారము గట్టు
పెండ్లి చేసికొను; తాళిగట్టు.
"ఖోడల నే నంటివి నన, బోడీ! తత్క్రమము చెల్లఁ బో యూథలకున్, వాఁ డొక దారము గట్టిన, వాఁడే నీ మెడ నొకండు వల్లభుఁ డగుచున్."
రామకథా. ఉత్త. పూ. భా. 6.44.

దారవట్టు
దానము పట్టు.
"బలిఁ జేరి తా దారవట్టి వామనుఁడు, యిలఁ గొల్చినది చూచి యే నెఱుఁగుదును."
వర. రా. కిష్కిం. పు. 505. పం. 24.

దారవోయు
దానము చేయు.
"కన్యకాతిలకము దారవోయ వసుదేవునిఁ గట్టడ చేసి."
విజయ. 3.108.

దారికట్టు
1. త్రోవను అడ్డగించు.
2. మహిమ కల ఒక రకమైన మూలిక.
"ఇది దారికట్టు మొనక,ట్టిది కాంతా వశ్యకరణ మిది నీ మది కిం,పొదవించు నో నరేశ్వర!, పదిలం బని తెల్పి కొన్ని బదనిక లొసఁగెన్."
శుక. 1.54.

దారికాడు
దారిలో సహాయంగా వచ్చేవాడు.
"నలి దారికాండ్రు నై నడపించుఁ బథము." పండితా. పర్వ. 367 పు.

దారి కాచు
ఎదురు చూచు.
మాటా. 17.

దారికి వచ్చు
చెడు నడవళ్లు మాని సత్పథములో నడచు.
దారిలో పడు.
"వీ డింక దారికి వస్తా డనే ఆశ లేదు. పూర్తిగా చెడిపోయాడు." వా.

దారి కొట్టు
దారిదోపిడి చేయు.
బ్రౌన్.

దారిపట్టు
వెళ్లిపోవు.
"రాగానే నాలుగు మాట లనేసరికి వాడు వచ్చినదారిపట్టి వెళ్లిపోయాడు." వా.

దారిపడు
దారికి వచ్చు.
"బుద్ధి రాఁజేసి యిప్పుడు దారిపడఁ దిద్దుకొందు."
వర. రా. అర. పు. 207. పంక్తి. 24.

దారి మళ్లించు
మంచిదారికి త్రిప్పు.
"నీ స్నేహితుణ్ణి కాస్త దారి మళ్లించు నాయనా! నీకు పుణ్యం ఉంటుంది." వా.

దారిలో పడు

రీతికి వచ్చు.

"ఇప్పుడిప్పుడే కాస్త ఆఫీసు దారిలో పడుతూ ఉంది." వా.

దారుగపాలు

ఒక రకమైన మల్లబంధము.

"... ఝూటు ఘాముకపాలు దారుగపాలు దారుధాణు ... మొదలగు పగు నాలుగు విసరులు..." ప్రబంధ. 78.

దారుధాణు

ఒక రకమైన మల్లబంధము.

చూ. దారుగపాలు.

దారున

తటాలున.

"పాదిగొన్న ఘనావళిలోన నుండి దా, రున నెదు రైరి వైభవనిరూఢిఁ జెలం గడికొంద ఱంగనల్." రా. 3.73.

శశాం. 3.7.

దాలిగుంటలో కుక్క అగు

తాత్కాలికంగా సత్ప్రవర్తనకు ప్రతిజ్ఞ తీసుకుని వెంటవెంటనే మరిచిపోతూ ఉండు.

"వా డేమో దాలిగుంటలో కుక్క అయ్యాడు." వా.

దాలితోక

దాలి అనగా నుగ్గులతో గుండ్రముగా అమర్చిన కుంపటి. దానికి ప్రక్కగా ఆనించి యుంచిన కాగు. దీనినే పొంత అంటారు. 'పొయిలో పడితే పొంతలో దూరి వస్తాడు' అని సామెత కూడా దీనిమీద యేర్పడిందే.

"పెనిమిటి చేనిపాటు పడి పేర్చు శ్రమంబున నింటి కేఁగుదెం, చినతతి దాలి తోఁకపయిఁ జేర్చిన కాఁగులనీరు మజ్జనం,బున కమరించి..." శుక. 2.335.

దావకూళ్లు

తాళ్ల. సం. 11. 3. భా. 156.

దావతి బడు

అత్యాసక్తి చెందు.

ఈ దావతే నేటి ధావంతం కావచ్చును.

"ఏవే నుపాయాలు గావు ఎక్కువ భక్తే కాని, దావతిఁ బడక యిది దక్కితే సులభము." తాళ్ల. సం. 6.49.

"పిల్లలూ పెండ్లాము అని అంత ధావంతం పడితే రేపు వదలిపోవలసి వస్తే ఏం చేస్తావు?" వా.

దావా వేయు

వ్యాజ్యము వేయు.

"కోర్టులో దావా వేస్తే తప్ప ఈ వ్యవహారం తెగదు." వా.

దాసరికొయ్య

ఒక రకమైన చేప.

"కొరద దాసరికొయ్య కొఱ్ఱమీనులసము,చ్చంగి బేడిస జెల్ల చాఱమీను." హంస. 4.187.

దాసరిగాడు

తాబేలు.

రె. ఠ.

దాసరిపాము
ఒక రకమైన పాము.
శ. ర.

దాసరిపిట్ట
నామాల పిట్ట.
బ్రౌన్.

దాసరిబుట్ట
దాసరులు బిక్ష మెత్తుకొనుటకై ధరించు బుట్ట.
"వేసరి యే మటన్న నిలు వెల్వడఁ జాలఁడు చేత నంటి మా, దాసరి బుట్టయు న్మదుకదావళి దట్టియుఁ గాని కాన మో, కేసరిమధ్య నీప్రతిన గాల్చె." వైజ. 3.94.

దాసికత్తె
పనికత్తె, సేవకురాలు.
"దేబెలఁ గనుఁగొన్న నా బల్మిఁ జూపుచు, దాసికత్తెలఁ గన్నఁ దార నిలుచు."
మల్హా. 3.10.

దాసునితప్పులు దండముతో సరి
ఆశ్రితుని తప్పులు క్షమించ తగినవి అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.
గిర. గురు. 36.

దాస్యము నీగు
బానిసత్వమును విడిపించు.
"జనని దాస్యంబు నీఁగిన కుల శ్రేష్ఠుండు."
పారి. 2.72.

దాష్టీకము చేయు
జులుము చేయు.
"నువ్వు దాష్టీకం చేస్తా నంటే ఎవ రూరుకుంటారు? నాలుగు వాయించి పంపిస్తారు." వా.

దాహ మిచ్చు
దాహము తీరుటకై నీళ్లు మొదలయినవి యిచ్చు.
"తక్కవపడ నొకపూట కిన్ని దాహం బిచ్చువారునుం గలరే యని యనేక ప్రకారంబుల బోధించి."
సానందో. 5.13.

దిండుపడు
మూర్ఛపోవు.
బ్రౌన్.

దించి దిగవ పెట్టేవరకూ
చచ్చేవరకూ.
చనిపోయేముందు మంచం మీదనుండి దిగువ పెట్టడంపై వచ్చిన పలుకుబడి.
"వీడు దించి దిగవ పెట్టేవరకూ యింతే. ఇక మంచిదారికి వస్తా డనే ఆశ లేదు." వా.

దిందుపడు
డిందుపడు; క్రిందుపడు.
"దిందుపడ్డ లోకులకు ద్రిష్ట మిదే కాదా?" తాళ్ల. సం. 9.56.
చూ. డిందుపడు.

దింపుడుకళ్లం ఆశ
ఆఖరు ఆశ.
చూ. దింపుడుకళ్లము.

దింపుడుకళ్లము
శవాన్ని మోసుకు పోయేటప్పుడు స్మశానం ఇంకా

కొంత దూరం ఉండగా 'దింపుడుకళ్లము' అని ఒక ప్రదేశం ఉంటుంది. అక్కడ దింపి ముఖంమీది గుడ్డ తీసి చూచి తరవాత యెత్తుకొని పోతారు. ఒకవేళ యింకా ప్రాణం ఉండి కాస్త కదులుతాడేమో అని ఆశతో ఆపని చేస్తారు.

చూ. దింపుడుకళ్లం ఆశ.

## దింపులకు తెచ్చు

తిరస్కరించు.

"ధనుర్లతల వంపు దింపులకుఁ దెచ్చు కొమరు గలకనుబొమలును."

చం. రా. 3.98.

## దింపులు వోవు

వ్రేలాడు.

"అందంద వక్షోరుహములు దింపులు వోవఁ, దొడుక నిచ్చుట యెట్లు దుగ్ధ రసము." కాశీ. 4.18.

## దిక్కుమొగ మగు

1. దిగ్భ్రమ చెందు.

"దిక్కు మొగము గాఁగఁ జిక్కు భటులు." విజయ. 3.157.

2. దిక్కులు పట్టు.

"ఎక్కడి పద్మజాండ మని యేఁగిరి దిక్కుమొగంబులై సురల్." సమీర. 2.134.

## దికా్క(కో్క?)మొగ మగు

దిక్కుకు ఒకరు ముఖమై పాటిపోవు.

కాందిశీకు డగు.

"దికా్కమొగము లైరి దిగధిపతులు." పారి. 5.37.

దికా్కమొగము కాక దికో్కమొగము అనునది సరియయిన పాఠమయి యుండును.

"గబ్బిమెకములు దికా్కమొగంబులయ్యె." రాజ. విజ. 3.36.

## దిక్కు

ఆశ్రయము, ఆధారము.

"కలిగి కలఁగని మనముతోఁ గాళహస్తి, విభునిఁ దలఁచుచు దిక్కు నీవే యటంచు."

కా. మా. 1.47.

"నీది క్కెవ డున్నాడో చెప్పుకో." వా.

"దిక్కు లేనివాడు." వా.

## దిక్కు దెస

అండా దండా; అండా ఆపూ. జం.

"దిక్కుదెసయు నీవ దేవ."

పండితా. ద్వితీ. మహి. పుట. 65.

"మా కున్న దిక్కూ దెసా నీవే." వా.

## దిక్కు గానకుండు

దిక్కుతోచకుండు, దిగ్భ్రాంతి చెందు.

"దిక్కు గానక దీనతాధీనహృదయుఁ, డగుచు." కా. మా. 3.193.

## దిక్కున్నచోట చెప్పుకో

ఏం చేసుకుంటావో చేసుకో అని బెదిరింపుగా అనుమాట.

"నేను చచ్చినా యీ యిల్లు నీ కివ్వను. నీకు దిక్కున్నచోట చెప్పుకో." వా.

**దిక్కుబిళ్లలు**

ఒక రకమైన పిల్లల ఆట.

బ్రౌన్.

**దిక్కు మాలినంత**

1. అధిక మయిన, ఇది అది అని చెప్ప వీలు లేనంత.

"వాళ్లింట్లో దిక్కుమాలినంత పని." వా.

2. పనికి రానిది–విశేషణంగా.

"ఇంత దిక్కుమాలిన పని వేఱొకటి ఉండదు." వా.

"వాడు పట్టి దిక్కుమాలిన వెధవ." వా.

**దిక్కుమాలిన పీనుగు**

1. దిక్కు లేని శవము.

2. ఒక తిట్టు.

భార. అశ్వ. 1.46.

**దిక్కుమాలు**

1. రక్షణము లేని దగు.

"కాకం,బులు నఱవఁగ నిదుర నిదుర, నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడు గదే." భార. ఆశ్ర. 2.162.
భాగ. 8 స్కం. 71.

2. దిక్కు లేని దగు.

"దిక్కుమాలినదాన దిక్కయి కావరే." వీర. 2.125.

**దిక్కుల పాఱ జల్లు**

తిరస్కరించి పారవేయు, లెక్కించక పోవు.

"ఎక్కడి దుర్మదుండో తన కే నొనరించిన రత్నపూజనల్, దిక్కులఁ బాఱఁ జల్లి." కా. మా. 2.116.

**దిక్కులు చూచు**

దిగ్భ్రాంతు డగు.

"బలమతి రఘురాముపై దృష్టి నతఁడు, సొలవక దిక్కులు చూచుచు నుండె." సుగ్రీ. పు. 23.

**దిక్కులు పాఱ జూచు**

నిస్సహాయస్థితితో చూచు, నిర్వ్యాపారి యై యుండు.

"......ఆతనిం గనుఁగొని పల్కు దైన్య మధికంబుగ దిక్కులు పాఱఁ జూచుచున్." శుక. 2.276.

"ఏమీ తోచక వాడు దిక్కులు చూస్తూ నిలబడినాడు." వా.

"వాడు ఊరికే దిక్కులు చూస్తూ కూర్చున్నాడు." వా.

**దిక్కులు పిక్కటిల్లు**

దిక్కులు నిండు.

"వైనతేయుని మణిచిత్ర వేత్రకర హుంకృతి దిక్కులు పిక్కటిల్లఁ గన్." పారి. 3.22.

"సిద్ధకిన్నర దండె మొదలయిన హృద్యానవద్య వాద్యవిశేషంబులు దిక్కులు పిక్కటిల్ల నిర్ఘోషంబులు బోరుకొల్ప..." హంస. 3.29.

**దిక్కులు ముట్టు**

దిగంతములకు వినబడునట్లు.

"కొండ ల్గూలఁగ నెత్తి మొత్తుకొని దిక్కుల్ముట్టఁ గేఁ పెట్టుచున్." కా. మా. 2.147.

**దిక్కులు సూచు**

భయభ్రాంత మగు.

"వెగడందుచు దిక్కులు సూచుచున్న సారంగియ పోలె." భార. ద్రోణ. 1.17.

దిక్కెడసిన రీతి

దిక్కు లేనట్లుగ, నిరాధార ముగా.

"ఒక్కతనె గ్రుక్కు మిక్కని, దిక్కెడసినరీతి నుండి తెరువరు లెవరో..."

హంస. 4.236.

దిక్కెవరు లేరు

నిస్సహాయతను సూచించు మాట.

"నా హృదయము వెత యూహించి వారింప దిక్కెవరున్ లే రిఁక..."

కళా. 6.54.

దిఙ్మాత్రముగా

సూక్ష్మంగా.

ఏదైనా ఫలానాచోట ఇల్లు ఉన్నది అని చెప్పవలసి నప్పుడు వివరాలన్నీ చెప్పక ఆ దిక్కుగా ఉన్నదని వేలితో చూపిస్తారు. అందుపై వచ్చిన పలుకుబడి.

కాశీ. 5.187.

రూ. దిక్ప్రదర్శనంగా.

దిగంబడు

1. తగ్గు.

"దిగంబడ దాఁక లింతయున్."

పాండు. 4.177.

2. వెనుక పడు.

"మేం మందరం కలిసే బయలుదేరాం. వాడు మధ్యలో దిగబడి పోయాడు."

వా.

రూ. దిగబడు.

దిగ గారు

రక్తము స్రవించు.

"కాముని యేట్ల దిగఁ గారేటి దేహాలు, జోటిటి తమువులకే దొడ్డ దనేరు."

తాళ్ల. సం. 7.27.

దిగ గాఱు

దిగులు పడు – దిగాలు పడు, నిరుత్సాహపడు.

"...వీఁడు మగఁడైనఁ గదా, తెగు దుఃఖం బనుకొంచుం, దిగఁ గాఱుదు రెపుడు నెమ్మది న్వగ మిగులన్."

శుక. 3. 516.

దిగ జాఱు

తొలగు.

"తొగ తేనిలో కందు దిగజాఱె."

విప్ర. 2.68.

దిగజార్చు

జార్చు.

"పయ్యెద దిగజార్చు."

క్రీడా. పు. 22.

దిగ జెమట పట్టు

ఒళ్లంతా చెమటలు కారి పోవు.

సారం. 3.162.

దిగ దన్ను

వదలి వేయు.

"దించి సురతవేళ దిగఁ దన్ని విడిచిన, పగ."

కవిక. 4.190.

దిగదాటు

దిగు.

"కాంచి యుదంకుఁడు గ్రమ్మన దిగ దాఁటి, వెనుకొనునంతకుఁ గనపుట్టఁ, జొచ్చె నయ్యురగము."
భార. అశ్వ. 3. 105.

## దిగదిగ

1. మెఱయుట యందలి అనుకరణము.

"అబ్జరుచిఁ దూర్పు దిగదిగ యంచు మెఱసె." మను. 4. 60.

2. ధ్వన్యనుకరణం.

"మృగములు మెడ లెత్తి చెవులు దిగదిగ నిక్కించి దిశ లాలకించి."
నవ. 1.50.

3. శీఘ్రముగా; గబగబా.

"లేఁ, జిగురరటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్."
భీమ. 2.128.

## దిగ దుడుచు

చుట్టు తిప్పి పారవేయు. మంత్ర తంత్రాదులతో ఏదైనా నొప్పి వచ్చినప్పుడు దేనినో దిగదుడిచి వేస్తారు. అల్లే దిష్టి తీయుటకు నిమ్మకాయో ఏదో దిగ దుడుస్తారు.

"క్రమ్మన భసితంబుఁ గలయంగఁ జల్లి, ముమ్మారు దిగఁ దుడ్చి ముట్టె నంత టను." బస. 6.150.

## దిగ ద్రావు

1. హరించుకొను.

"ఇతఁ డాయుధంబు దిగఁద్రావి యచేష్టతఁ బొందు." భార. ద్రోణ. 5.305.

2. వదలు, విడిచిపెట్టు.

"భూధరరాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి." హర. 4.9.

3. గర్భస్రావము చేసుకొను.

## దిగద్రొబ్బు

క్రిందికి త్రోయు.

"రక్కసుల ఱేఁడు తన తొడలపై నుండ నీక గొబ్బున దిగద్రొబ్బి."
భాగ. 7 స్కం. 184.

## దిగద్రోచు

విడుచు.

"కలఁక యెంతయు దిగఁ ద్రోచి చెలువ మెసఁగఁ, జేర వచ్చిన ప్రియ భామ గారవించి." పారి. 2.15.

## దిగనాడు

వదలిపెట్టు.

"తగ దింతటి సర్వజ్ఞత, దిగనాడుము." నిరంకు. 3.16.

## దిగనారుక పోవు

కృశించి పోవు.

"వాడు నానాటికీ దిగనారుక పోతున్నాడు." వా.

## దిగనాశిల్లు

కృశించు.

"వీడు రోజురోజుకూ దిగనాశిల్లి పోతున్నాడు." వా.

## దిగపారు

అంతటా వ్యాపించు.

"వెల్లఁబెట్టునో పూర్ణ విధుకాంతి మొగమున, దిగపారునో పెఁడి తెలివి మేన." నిరంకు. 4.91.

**దిగబట్టు**

క్రిందికి లాగు. బ్రౌ.

**దిగబడి పోవు**

వెనుకపడి పోవు.

"ఇందాకా మాతోనే వచ్చాడు కానీ మధ్యలో ఎక్కడో దిగబడి పోయాడు." వా.

**దిగబడు**

బురదలో కూరుకొని పోవు.

"పంకము గొరిజ దిగఁబడఁ బఱవ లేవు, మన్ను లివ్వేళ రేగటి మన్నులందు." మను. 4.20.

**దిగబాటు**

మిగిలినది, శేషము.

బ్రౌ.

**దిగబాఱు**

1. క్షీణించు, తగ్గు.

"కాంతి దిగఁబాఱఁ బ్రాచిముఖంబు నందుఁ, బద్మినీ ముఖ వికసన ప్రౌఢి సడలె." కవిక. 4.63.

2. అంతటా వ్యాపించు.

"వెళ్లఁబెట్టునో పూర్ణవిధు కాంతి మొగమున, దిగఁబాఱునో పెఁడి తెలివి మేన." నిరం. 4.91.

రూ. దిగపాఱు.

**దిగబెట్టు**

1. వదలిపెట్టు.

"మా అబ్బాయిని స్కూల్లో దిగబెట్టి వస్తాను. ఉండండి." వా.

2. మిగుల్చు.

"ఒక్క పండు కూడా దిగబెట్టకుండా మా అత్త అంతా తినేసింది. ఇప్పు డేం చెయ్యనూ?" వా.

**దిగబోతలోకి వచ్చు**

వెనుకకు మరలు.

"నాలుగు డబ్బులు చేరేసరికి ఈ మధ్య మహా త్రుళ్లిపోయాడు. వ్యాపారం కాస్తా దివాలా తీసేసరికి ఆయన కా తుళ్లంతా దిగబోతలోకి వచ్చింది." వా.

**దిగమోపు**

దిగ దుడుచు.

"అరుదుగ రక్షపూస యఖిలాంగములన్ దిగమోపు చాడ్పునన్." భో. 5.150.

**దిగ మ్రింగు**

పూర్తిగా మ్రింగు.

"కడతేఱఁగ నిత్తునె యింక వారలన్, మిక్కిలి శక్తి మీఱ దిగ మ్రింగెద నంచుఁ బరిప్లవింపఁగన్." దశా. 2. అవ. 332.

**దిగవిడుచు**

వదలిపెట్టు.

"తగు సుమహైశ్వర్యోదయ, మగు గృహమును బ్రబలనిద్ర నందిన భార్యన్, దిగవిడిచి యెక్కడఁ డేని యు, జగతీశుఁడు చనె నిశీథ సమయము నందున్." భాగ. 4. స్కం. 407. హరి. పూ. 5.222.

**దిగవైచు**

1. విడుచు.

"చెప్పెడి దేమిఁక నొకచో, దెప్పర మగు నుక్కుజేను దిగవైచిన వే, నెప్పు కొని కదలకుండెడు, కప్పు తెఱంగు నను జేను గదలక నిలిచెన్." శుక. 2.11.

2. పడవేయు.
"వటము క్రింద నన్నిటి దిగవైచు వాఁడు." కేయూర. 3.70.

దిగవైచుకొను
తాల్చు, ధరించు.
"ఆమెడ ఒళ్లంతా సొత్తులు దిగ వేసుకొంది." వా.

దిగాలుపడు
దిగులు చెందు.
రూ. దిగాల్పడు.

దిగాల్పడు
చూ. దిగాలుపడు.

....దిగు
సంబంధము కల్పించుకొను.
"ను వ్యాపనిలో దిగడం నా కిష్టం లేదు." వా.
"వద్దు వద్దంటే వ్యాపారంలో దిగాడు. ఉన్న దంతా ఊడ్చుకు పోయింది." వా.

దిగుజాతి
తక్కువజాతి.
"అతి వశిత్వము దిగుజాతు లగ్రజాతి, ననుసరించుట..." ఆము. 4.277

దిగుదల
దిగువ–తగ్గుగా నున్న భాగము.
శ. ర.

దిగుమతి చేయు
ఇతర దేశములనుండి సరుకులను తెప్పించుకొను.
బ్రౌణ.

దిగు దిగు దిక్కాను నాట
ఒక రకమైన బాలక్రీడ.
పండితా. ప్రథ. పురా. పుట. 460.

దిగులుగొను
దిగులు పడు.
"దిట చెడక దిగులుగొని సట, సొట లారక వెనుక ముందుఁ జూడక..." హంస. 5.186.

దిగులుపడు
భయపడు; ఆందోళన చెందు.
"ఘోరభంగిఁ దోరణారూఢుఁడై యార్చె, గగన మగల జగము దిగులు పడఁగ." రామా. 6.201.
"డబ్బు లే దని దిగులు పడితే ఏం లాభం?" వా.

దిగులుపఱచు
దిగులు పడునట్లు చేయు.
బ్రౌణ.

దిగులుపాటు
భయము.
శ. ర.

దిగులు - యదారు
చీకు చింత. జం.
"వాడు దిగులూ యదారూ లేకుండా వాళ్ల నాన్న సంపాదన తింటూ బతుకుతు న్నాడు. ముం దున్నది ముసళ్ల పండుగ." వా.
రాయలసీమలో ప్రచురంగా వినిపించే పలుకుబడి.

దిగులు సొచ్చు
దిగులు కలుగు.

"దేవతలకు దిగులు సొచ్చె."
భార. శాంతి. 6.444.

## దిగువాటు
క్రిందిభాగము.
"పానపాన నల తెల్లమబ్బు పాంతన దిగువాటున నదె కలదో లేదో, యను మాత్రము గాఁగఁ గంటివా నృప తనయా!" సా. 1.124.

## దిగువాయిగా చూచు
తక్కువగా చూచు.
"దీను లయినవారి దిగువాయిగాఁ జూచి, పరము గనక నూతఁ బడును వేమ."
వేమన. 3. భా. 126.

## దిగువాఱు
పొరలి పారు.
"చింది పయిం దిగువాఱు."
విజయ. 1.72.

## దిగ్గనాడు
విడుచు, జార్చు.
"పయ్యెదఁ దివనీక పట్టు నింతకు మున్ను, సిగ్గు నే సంగతి దిగ్గనాడె."
కవిక. 4. 178.

## దిగ్గాఱు
కృశించు.
"బగ్గు మన మరుఁడు దిగులున, దిగ్గాఱి గిరీంద్రకన్య తేఁకువ తప్పన్."
పార్వ. 3.59.

## దిగ్గుడుకు దిగ్గుడు
చాలా తక్కువది.
"శ్రీ వేంకటేశ్వర నీసేవే ధ్రువపదము, దేవతాంతర మెల్లా దిగ్గుడుకు దిగ్గుడు."
తాళ్ల. సం. 8.201.

## దిగ్గున లేచు
ఉన్నట్లుండి లేచు.
ధ్వన్యనుకరణముగా ఏర్పడిన పలుకుబడి.
"దిగ్గున లేచి నిల్చి యువతీమకరాంక శుభావతారు." శుక. 1.293.

## దిగ్గోరు
కోయు పైరునకు ముందు పైరు. శ. ర.

## దిగ్భ్రమ
దిక్కు తోపమి.
"గడియతోఁ బెనఁగి దిగ్భ్రమఁ దత్తఱింప."
గా. హరి. ద్వితీ. పంక్తి. 1108.

## దిచ్చుమొగ మగు
అదృశ్య మగు. బ్రౌన్.

## దిటదప్పు
దిటవు తప్పు.
సుస్థితిని కోలుపోవు.
"పృథివి నింగియుఁ దిట దప్ప, దిట దప్ప సెందుఁ బ్రతిధ్వనుల్ నిండ."
వర. రా. బా. పు. 201. పంక్తి. 17.

## దిటదేఱు
ఆరితేరు, గడితేఱు.
"దిన మొకవింత గాఁగ దిటదేఱె వధూమణి కేళిచాతురిన్." సీమం. 4.4.

## దిటవరి
ధైర్యశాలి.
"తగఁ బ్రాంసుదొరలతోఁ దగవుల కేర్పడి, యే దిటవరి నిర్వహించి మించె." ఆనంద. పీఠి. 59.

దిట్టపడు
గట్టిపడు.
"పులుము కాటుక మొగంబున దిట్ట పడఁగ." అ. మ. క. 1.25 పు.

దిట్టపఱుచు
1. దృఢపరుచు.
"చందాసాహేబు న్విడిపించి యాహిరాయిత మొహదినీ ఖాను వెంట నంటిరా దిట్టపఱిచి."
ఆనంద. పీఠి. 106.

2. సమకూర్చు.
"తగిన జగడంపు సామానుల దిట్ట పఱిచిన." ఆనంద. పీఠి. 106.

దిట్టాడు
అతిశయించు.
"దేవా! కయ్యముతోడి వేడుక మదిఁ దిట్టాడ మర్త్యుండు నే, గ్రోవఁ జేతుల తీఁట వుత్తు నని కోరున్." ఉ. హరి. 5.21.

దిడ్డివాకిలి
చిన్నవాకిలి; దొడ్డివాకిలి.
రంగ. రా. యు. 303 పు.

దిడ్డి వైచు
పల్లకీలవంటివాని వాకిటి కడ్డంగా పరదా వేయు.
"పైఁడి పాలకీ, నప్పువుబోఁడి నుంచి మెఱుఁగారెడు బంగరు వ్రాఁత పచ్చడం, బొప్పగ దిడ్డి వైచికొని యుబ్బుమెయింగొనిపోయె నింటికిన్." పరమ. 2.38.
"తగు వాహనముల నంతఃపురకాంతల నిడి దిడ్లు వైపించుపెగడులును."
కళా. 8.29.

దిద్ది తీర్చు
అందముగా తీర్చు, సరిచేయు, చక్కజేయు.
"తన శృంగారవనంబులో నగరిపొంతం జక్కఁగా దిద్ది తీర్చిన పూఁదేనియ యేటి కాలువ దరిన్." పారి. 1.71.

దిద్దినయట్టు లుండు
తీర్చి దిద్దిన ట్లుండు.
"ముద్దులు గారు నెమ్మొగము మోహరసంబులు చిందుగుబ్బలుఁ, దిద్దిన యట్టు లుండుజిగిఁ దేఱెడు చెక్కులుఁ గావిమోవియున్." హంస. 3.24.

దిద్దు
నేర్చుకొను; నేర్పించు.
అక్షరములను నేర్చుకొను నపుడు దిద్దుట అలవాటు. తద్ద్వారా వచ్చిన పలుకుబడి.
"......ఇచటికి యమ్మ నివరేణ్యుఁ, డేతేర దొరఁకొని యెన్నియో నాళ్లయ్యె, నే మేమి దిద్దితి వెఱుఁగఁ జెపుమ." కళా. 2.31.
"నీ నేర్చిన ట్లెల్ల దిద్దు మనుచు, నొప్పగించితి నిమ్మహాయోగివర్య."
కళా. 2.31.

దిద్దుగడ
దిద్దుపాటు.
"మిముబోంట్లాఁడుది పల్కు దిద్దగడకుఁ మే లందురే."
అచ్చ. భా. 1.41.

దిద్దుపాటు
1. సవరించుట.
2. శిక్షించుట.
శ. ర.

దిద్దుబడి
దిద్దుపాటు.

దిద్దుబాటు
రూ. దిద్దుపాటు.

దిద్దువడు
శిక్షణము పొందు.
"దేవకులనాథ నా యొద్ద దిద్దువడిన, పొలఁతి యెన్నఁటికిని నన్నుఁ బోలఁ గలదె?" వాల్మీకి. 3.37.

దినకొత్తలు
నిత్యనూతనములు.
"దీపనము లై తేను దినకొత్తలు." తాళ్ల. సం. 11.11.

దినకోరు
రోజుకూలి.
"దినకోరనంగ వెలయు దినరోజు..." ఆం. భా. తృ. 32.
రూ. దినగోరు.

దినగోరు
ఒక మనిషికి ఒక దినమునకు వచ్చు కూలి గింజల భాగము.
"తివుటఁ జుక్కలతేని దినగోరు మెసఁగిరి, వండ్లు డుల్చిరి కల్పపాదపంబు." నైష. 7.81.
చూ. దినకోరు.

దినచర్య
ప్రతిదినము చేయు పని.

దిన చల్వాలు
రోజు కొక్కటివంతున ఉపయోగించే చలువ చేసిన బట్టలు.
"నిద్దంపు మేలిసొమ్ములు, దిద్దిన కస్తూరి బొట్టు దినచల్వాలు నై." విజ. 2.144.

దినబత్తెము
రోజుకూలి.
"ఏ,లా వచియింప నీకు మొదలన్ దినబత్తెము సే నొడంబడన్." హరిశ్చ. 4.192.

దినదినము
ప్రతిదినము.
"దినదిన మట్లు తత్పరమతిం బదివేవురు పేరఁటాండ్ర క,ర్చన లొనరించి." పారి. 5.58.

దినమత్తులు
నిత్యమత్తులు.
"దినమత్తులము మా తెలివేటిది." తాళ్ల. సం. 8.124.

దినరోజు
రోజుకూలి ; ప్రతిరోజు.
"పగటి గ్రాసంబు దప్పక యుండ దినరోజు, మాదిరి నొంటరి జోదుమూఁక." రా. వి. 5 ఆ. 13.

దినవహి
జమా ఖర్చు.
"కాల మన్ గనిక డప్పుడు తీర్చి లిఖించినట్టి యా, దినవహి లెక్క వ్రాలనఁగఁ జెల్వగఁ జుక్కలు పర్వె నత్తఱిన్." హంస. 1.142.

దినవెచ్చము
ప్రతిరోజూ అగు ఖర్చు.
"దినవెచ్చమునకు నై తనమేనఁ గల సొమ్ము, కొదుకక బచ్చింటఁ గుదువ వైచు." పాండు. 3.16.

**దినసరులు**

1. ఒక రకమైన ధాన్యము.

2. దినచర్య వ్రాసిపెట్టు పుస్తకము.

"ఒనరఁగ రాయలపేరిటి, దినసరు లా తుత్రియులకుఁ దేటపడంగన్."
కృష్ణ. 3.104.

**దినవారములు**

అంత్యక్రియలు.

**దినసంత లెక్క**

ఎక్కువగు, సమ్మర్దమగు.

"కానేవారు తినేవారు కూడి కూడి మూఁకలై, దినసంత లెక్క నిడ దేహులార రారో!"
తాళ్ల. సం. 8.170.

**దినాలు**

చూ. దివసాలు.

**దినుసు ఏర్చు**

ఉన్నవానిలో మంచివైన వానిని ఎన్నుకొను.

"తెలిమొల్ల మొగ్గలు దినుసు నేర్చి కూర్చిన, మగఁటిమి కోచ్చని పొగడవలయు."
రాజగో. 4.75.

**దినుసు మీఱు**

సాటిలేనిదగు.

"తెలుగంటిదొర ల్లెల్ల దినుసు మీఱిన లెంక, లలరు విల్దాల్పు ముద్దుల మఱంది."
అచ్చ. బాల. 6.

**దినుసు వచ్చు**

సమానమగు.

విజయ. 1.100.

**దిప్పకాయ**

శుంఠ. ఒక తిట్టు.

"దిప్పకాయవువలెఁ దిరిగి యిల్వారుసఁ, దప్పంగ నడతురా..."
ప్రభులిం. 8.66.

**దిబ్బ చూపు**

దిబ్బగా యేర్పడు.

"అసలడుగువడియె నెతి నిసుక దిబ్బ చూపె నిద్ర చవి యయ్యె."
కాశీ. 3.23.

**దిబ్బడ ఎత్తు**

చూ. దిబ్బ డెత్తు.

**దిబ్బ డెత్తు**

శీతంతో చెవులు దిమ్మపడు.

**దిబ్బతీర్థమగు**

ఒకచోట గుంటగా నీరు నిలుచు.

"కటిదఘ్నంబులుఁ బెండొడల బంటులునై యొగ నుబ్బి దిబ్బతీర్థంబులై పారలి తెర లెత్తి."
విప్ర. 2.14.

**దిబ్బడ వేయు**

శైత్యాధిక్యంచేత ముక్కు, చెవులు మూసుకొని పోవు.

"రాత్రి ఆరుబయట పడుకొన్నానా? తెల్లవారేసరికి జలుబు చేసి ముక్కు దిబ్బడ వేసింది."
వా.

చూ. దిబ్బ వేసి యుండు.

**దిబ్బలు వెట్టు**

కుప్ప వోయు.

"దిబ్బలు వెట్టుచుఁ దేలిన దిదివో, ఉబ్బు నీటిపై నొకహంస."
తాళ్ల. 1.64.

దిబ్బ వేసి యుండు

చెవులు మూసికొని పోవు.

(శైత్యంతో.)

చూ. దిబ్బడ వేయు.

దిబ్బె మెత్తు

ప్రమాణము చేయు.

ప్రమాణం చేసేటప్పుడు దీపం ముట్టి ప్రమాణం చేయడం ఇత్యాదులు ప్రసిద్ధములు. అందుపై వచ్చిన పలుకుబడి.

"దిబ్బె మెత్తఁగ వచ్చు నబ్బురపుం గల్మి, మేర మీఱినరీతి మెలఁగఁ డనుచు." పాండు. 1.62.

దిమిదిమి యని

మద్దెల మ్రోగుటలోని ధ్వన్యనుకరణము.

"దిమిదిమి యనుచు నందెల మ్రోయు బాట, లమరనారీమణు లాడుచుంద మున." రం. రా. కిష్కిం. 219 పు.

దిమ్మగొను

పొరబాటు పడు.

"తెలిఁ గెలుఁగక యపు డట్లు దిమ్మ గొంటి, తలఁపఁ దననుండి రానట్టి తప్పు గలదె." రాధికా. 3.45.

దిమ్మ తిరుగు

1. చెడ తిరుగు.

"జక్కవచా లక్కజపువేడుకల దిమ్మ. తిరుగుచు నకరువుల్ దిగిచికొనఁగ." నృసింహ. 2. ఆ.

"తేపతేపకు దిమ్మ దిరుగుఁ జుమ్మని మీఁద." శ్రవ. 3.26.

2. తల తిరుగు.

"దప్పితోడఁ గూడి నొప్పింపఁ గన్నులు, మేను దిమ్మ దిరిగి మిడికి పడుచు." వరాహ. 12.64.

దిమ్మపడు

మ్రాన్పడు.

"నదులు వేగము మాని నలి నట్టె నిలిచెం, గదల వీవక సదాగతి దిమ్మ పడియె." సిం. భాగ. 2.29.

దిమ్మగొను

బాధ నొందు.

"శ్రీకృష్ణుచేఁ గొను చిలుకపల్కులు విని, గుమ్మగుమ్మని చెవుల్ దిమ్మ గొనఁగ." రాధికా. 2.20.

దిమ్మువడు

గడియ పడు.

"దిమ్ము వడియె నన గడియ పడియె ననుట దోఁచు." ఆం. భా. తృ. 116.

దిమ్మెట్టు పడు

చెవుడు పడు.

బ్రౌన్.

దిమ్మెత్తు

జడత్వ మందు, బాధ నొందు.

"తల దిమ్మెత్తెను మోపు మోచుక్రియ డెందం బేమొ వెఱ్ఱెత్తినట్టుల కానం బడె." సా. వి. 2.101 పు.

దిరదిర తిరుగు

తిరుగుటయందలి ధ్వన్యనుకరణము.

"ధరణి దిర దిర తిరుగుచందమునఁ దోఁచె." ఉ. రా. 6.235.

చూ. దిర్దిర తిరుగు.

దిర్దిర దిరుగు

గిరగిర తిరుగు.

"గోత్రధారుణీ,ధమ్ములు వ్రయ్యు నయ్యుసుము దక్కఁగ నంబుధు లింక మూఁడులో,కమ్ములు దిర్దిరం దిరుగు..." భార. ఆది. 4.38. రామా. 4.39.

"ధరణీచక్రము దిర్దిరం దిరుగ." వీర. 3.223.

దిల్లవడు

డీలాపడు, బలహీన మగు.

"ఉల్లము జల్లన దేహము, దిల్లవడఁగ ధృతి దలంక దెప్పర మొందన్." భా. రా. అర. 2.256.

దివసంబు లెన్నుకొను

రోజులు లెక్క పెట్టుకొను. దేనికోసమో ఎదురు చూస్తున్నప్పుడు ఉపయోగించే మాట.

"ధైర్యవి,చ్యుతి దివసంబు లెన్నుకొను చుణ్ సతు లుందు రెటుంగ లేరె?" శుక. 3.147.

దివసాలు

అంత్యక్రియలు.

దివాలా తీయు

బాగా నష్టపడి ఆస్తిపాస్తులన్నీ పోగొట్టుకొను; చేసిన అప్పులు తీర్చలేక ఉన్న ఆస్తి కట్టి సరిపుచ్చుకొమ్మను. బ్రౌన్.

"జవళీవ్యాపారం చేసి దివాలా తీసిన వాడివి నువ్వొక్కడివే ఈ ఊళ్లో అగుపిస్తున్నావు." వా.

"ఆ హోటలు దివాలా తీసిం దట. అందుచేతనే రెండు రోజులుగా తెరవడం లేదు." వా.

దివిటీగా వెలుగు

ఎక్కువగా ప్రకాశించు.

చూ. మూఁడు పూవులు ఆఱుకాయలగు.

దివిటీ లేకుండ వెలుగు

అతి పటాటోపముతో ఉండు.

"పేరిలింగము తనయధికార మెట్టు, లూర సాఁగించుచున్నాఁడో యొకటి చెప్పు, వేఱ చెప్పఁగ నేలయ్య వెలుఁగు చుండె, దివిటి లేకుండ మాటాడ నెవరి తరము?" నందక. 40.

దివిదారికొమ్ము

జింకకొమ్ములు రెండు చేర్చి చేసిన ఒక రకమైన ఆయుధం. గరుడగంబము (?)

"సింగోట యనఁగను, దివిదారి కొమ్ము నాఁ దేజరిల్లు." ఆం. భా. ద్వి. 205.

చూ. దివెదారికొమ్ము.

దివిదార్కొమ్ము

రూ. దివిదారికొమ్ము.

దివియకంబము

దీపస్తంభం.

"సప్తపాతాళ నాగేంద్ర చంద్ర ముఖులు, ఫణమణిజ్యోత్స్న దివియ కంబము లగుదురు." భీమ. 3.62.

దివియకోల

దివిటీ.

"ఎ,క్కడు రథసంబుతో దివియ కోలలకై వడి భంగసంగతిన్, బొడమిన ఫేనముల్ మెఱసె." వి. పు. 7.165.

దివియలవాడు

దీపం పట్టుకునేవాడు.

"దివియలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్." సా. 3.27.

(తి)దివు దీపులాడు

వెనుకంజ వేయు.

"దివు దీపులాడక దెసలకుఁ జనక." పండితా. ప్రథ. దీక్షా. పుట. 178.

దివెకంబము

దీప స్తంభము.

"కలం,గటఁ బడిగంబుఁ గంచు దివె కంబము గల్గిన పట్టెమంచ ము, త్కట రుచి..." శుక. 4.22.
ప్రబంధ. 6.5.

దివెగూడు

దీపం పెట్టే గూడు.

"తెల్లజిల్లెడు వేరు పిల్లారి దివెగూడు, గాజుటద్దము కావుకరవటంబు." బహు. 5.129.

దివెదారికొమ్మ

దాసరులు తెచ్చే దీప స్తంభము.

దీనినే 'గరుడగంబము' అంటారు.

"దివెదారికొమ్మ దోల్తితియు జోడమ్మ." ఆము. 6.6.

చూ. దివిదారికొమ్మ.

దివెపంజులు

దివిటీలు.

"దీమసపు పారి వార దివెపంజులు చేఁబట్టి." తాళ్ల. సం. 10.166.

దివెల పండువ

దీపావళి పండుగ.

"ఓయప్ప! నీవు బావయుఁ, బాయక నాతోడ దివెలపండువ కిటు ర,మ్మా." చెన్న. 3.151.

దివ్వటీకి దీప మగు

దిగదుడుపు అగు.

దివిటీ పెద్దది, దానిముందు దీపం అత్యల్పకాంతి కలది కదా.

"జహాంగీరు, తేజముకడ దివ్వటీకి దీపంబె యగుణ్." గీర. 55.

దివ్యము

చాల మంచిది.

తెలుగువారిది అన్నిటికీ ఉపయోగిస్తారు: 'ఈవేళ భోజనం దివ్యంగా ఉంది.' 'ఆపాట దివ్యంగా ఉంది.' సంస్కృతములోని మాటే అయినా అందులో ఇంత విస్తృత మైనస్ఫోరకత లేదు.

"ఆదేవళంబులోన మ,హాదేవుని నొక్క దివ్య మగుశుభవేళన్." హంస. 1.181.

దివ్వాఋపు బ్రువ్వ

దీపం ఆర్పే ఒక రకమైన పురుగు.

"గువ్వ గ్రద్ద దివ్వాఋపుబ్రువ్వ గూబ, యిల్లు సొచ్చిన శాంతి సేయింప వలయు." భార. అను. 4.119.

దివ్వెయకంబము

దీప స్తంభం.

"అయ్యా యవుఁ గాక యంచును, దియ్యె

మెసఁగ రాజుఁ జూచి దివ్వియకంబం, బియ్యకొని...'' విక్ర. 6.40.

రూ. దివ్వెకంబము.

దివ్వెకంబము

దీప స్తంభం.

''గంట మాకులు గాని దివ్వెకంబ మింత, యెరయఁ గూర్చుండి యాపూర్ణిమేందువదన.'' శుక. 4.31.

విక్ర. 6.38.

దివ్వెకోల

దివిటీ.

''ఆలీలఁ గొఱవి దయ్యంబుల దివ్వె, కోలలవారిగాఁ గొని గస్తు దిరిగి.'' ద్వి. హరి. ఉత్త. 1667 పం.

దివ్వెచమురు

ఆముదం.

''ఆముదమ్ము దివ్వె, చమురనంగ నేరండ తైలము దలిర్చు.'' వేంక. మాన. 72.

దివ్వెనకోల

కొఱవికర్ర.

''జూంజూము దుందురు సురుడు దివ్వెన కోల, యనఁ గాష్ఠదీపికాహ్వయము లమరు.'' ఆం. భా. ద్వి. 165.

దివ్వె యెత్తు

కాపురము నిలబెట్టు.

దీపము పెట్టు.

''దివ్వెయెత్తినఫలము దేవర దింతె కదవె.'' తాళ్ల. సం. 189.

దివ్వెల పండుగ

దీపావళి పండుగ.

''ఒండొరులతోడ దివ్వెల, పండుగయిదె వచ్చె నింకఁ బదిదినములకున్.'' చెన్న. 8.115.

దివ్వెల యమాస

దీపావళి అమావాస్య.

''మాసరివారు దివ్వెల యమాసకు నల్లుర నాడుబిడ్డలన్, వాసి యెసంగఁ దోకొనుచు వచ్చుచు నుండిరి.'' చెన్న. 7.144.

దివ్వె లెత్తు

దీపములు పెట్టు.

''దినమునను సంజకడ యంచు దివ్వె లెత్తు.'' శుక. 2.561.

దివ్వెసుడి

గోడలో దీపం పెట్టడానికై అమర్చిన గూడు అని శ. ర. దీపం పెట్టేందుకని కొయ్య మొదలగువానితో చేసిన ఒక స్టాండులాంటిదని బ్రౌన్.

రూ. దీవెసుడి.

దిశలు చెవుడు పడు

అతితర మైన శబ్ద మగు.

''దిశ లెల్లఁ జెవుడు పడఁగ.'' రుక్మాం. 4.3.

దిశలు తాళములు వాయించ నేర్చు

అసాధ్యకార్యములను చేయగల జాణ లని నిరసనసూచకంగా అనుటలో ఏర్పడిన పలుకుబడి.

పండితా. ప్రథ. పురా. పుట. 359.

దిశాపట్టంబు గావించు

దిక్కులు పట్టించు.

అనగా తటిమి వేయు.

''పాశం బాఱఁగఁ దోలి యంతకు దిశా

పట్టంబు గావించి పూ,ర్వాశాధీశ్వరు వెన్నడిం జని.'' ఉ. హరి. 1.91.

దిశాపట్టముగా ఏగు

దిక్కులు పట్టి పోవు, కాందిశీకు డగు.

''తనకుఁ గా నని దయ్యం, బెదిరికి వర మిచ్చు ననుట, చదురే యతఁ డేఁగె మును దిశాపట్టముగాన్.''

ఉ. హరి. 1.97.

దిష్టికండ్లు

చెడుకండ్లు, దృష్టిదోషం తగు లునవి.

కొందరి కండ్లు చెడ్డ వనీ, వాళ్లు ఏదైనా అందంగా ఉన్నదో, బాగుగా ఉన్నదో చూస్తే దిష్టి తగులుతుం దనీ ఒక నమ్మకం.

''దానివి వట్టి దిష్టికండ్లు. అది వచ్చేసరికి పాలు పిండుతున్నాను. అంత పాలూ విరిగి పోయింది.'' వా.

దిష్టి కొట్టు

దృష్టిదోషము తగులు.

''పిల్లవానికి దిష్టికొట్టిన ట్లుందే. కాస్త ఉప్పూ చుట్టి పారవేయి.'' వా.

దిష్టి తీయు

దృష్టిదోషము తొలగుటకై మిరపకాయలు మొద లయినవి దిగదుడుచు.

''ఆవిడ పిల్లదానికి దిష్టి తీస్తున్న ట్లుంది. అటువైపు వెళ్లకు.'' వా.

దిష్టిపిడతలు

నిప్పు(?)యోజకులు.

దృష్టిదోషము తగులకుండుటకై పెట్టు పిడత అని వాచ్యార్థము ; అలాంటివారు.

మాటా. 116.

దిష్టిబొమ్మ

దృష్టిదోషం తగులకుండా పెట్టే బొమ్మ.

వికారంగా ఉంటుంది. దిష్టి పిడతవంటిదే.

దిసం తడుచు

దూషించు.

''అదిగో తల్లిఁ గడుం దిసం తడిచి యూ రాద్యంతముఁ బైపయిఁ, వెదకఁ బల్వురఁ బంచి.''

పరమ. 3.271.

నీతిసీ. 82.

దిసంతు కొట్టు

దూషించు.

''పట్టఁగ లేమి నొండొరులఁ బల్మఱుఁ జాల దిసంతు కొట్టుచున్.''

కళా. 6.106.

దిసంతులు గొట్టు

దూషించు; కేరింతలు గొట్టు.

''చెలి నేచి తని దిసంతులు గొట్టె మేనక, విడువు మాయ లటంచు నాడివె హేమ.'' మను. 3.109.

దిసమొల

దిగంబరుడు.

''రుద్రా! నీవు భద్ర దేవద్రుమాటవీ వాటియందు, దిసమొల దూఁటఁ బఱిదిండి మిండల జంగంబ వై.'' భీమ. 3.210.

దిసమొలవాడు

దిగంబరుడు. శ. ర.

**దిస్సపోవు**

వ్యర్థ మగు.

**దిస్స మొలవాడు**

దిగంబరుడు, బట్టలు లేని వాడు.

"దిస్స మొలవానిఁ బసిఁ గానఁ ద్రిప్పు వాని." పాండు. 1.213.

**దిస్సు వారగ నవ్వు**

తుస్సు మని నవ్వు, దెసలు పారగా నవ్వు.

"దిస్సువారఁగ నవ్వు తీఁగనవ్వు." క్రీడా. పు. 22.

**దీకొను**

మార్కొను.

"మనల దీకొని యున్నది యొక్క లేమ." కాశీ. 6.234.

**దీ కొలుపు**

పురికొల్పు; మార్కొన జేయు.

**దీటుకట్టు**

వ్యాపించు.

"రోదసీకుహరంబునం దీటుకట్టె." నైష. 6.29.

చూ. దీటుకొను.

**దీటుకొను**

వ్యాపించు.

"అస్త్రశస్త్రచయ శుంభద్దీప్తిజాలంబు సర్వదిశాభాగములందు దీటుకొన." దశ. కు. 2.97.

"శస్త్రాస్త్రసంచయమున నభంబు దీటుకొనునట్లు చేయ." భార. విరా. 5.34.

ఇందుకు దగ్గరగా నున్న అనేకచ్ఛాయలలో ఈ పదం ఉపయుక్త మవుతూ ఉంటుంది.

**దీటుకొలుపు**

దీటుకొన జేయు.

రూ. దీటుకొల్పు.

**దీటుపడు**

పోలు.

**దీటుపఱుచు**

పోల్చు.

**దీటు వచ్చు**

సాటి యగు.

"లచ్చి కోడలి కన్నులకు దీటువచ్చు నీ,లోత్పలశరపంక్తు లొనరఁ దాల్చి." ఉత్తరా. 4.156.

**దీనజనుల పాలిట దేవు డుండు**

దిక్కు లేనివారికి దేవుడే దిక్కు – వంటిమాట.

"ఇది కరంబుఁ జోద్య మనుచు దీన జనులపాల దేవుం, డెందును గలఁ డనుచు సారెఁ జెప్పుకొనుచు నరిగి." కళా. 6.141.

**దీనికి మ్రుచ్చు వచ్చునో**

దీనికై దొంగ వచ్చునేమో అన్నదానిపై దీన్ని దొంగిలిస్తారేమో అన్న భావార్థంలో వాడిన పలుకుబడి.

"ఒక పువ్వు నిల్చినన్ ... దీనికి మ్రుచ్చు వచ్చునో." కుమా. 6.128.

**దీని సిగ తఱగా**
ఒక తిట్టు.

**దీను మిగులు**
ఒప్పు.
"కాన నదియ శరణ్య మై దీను మిగులు." పాండు. 3.132.

**దీపం నిలుపు**
ఆపదలో ఆదుకొని కుటుం బము నిలబెట్టు.
"ఆయ నేదో సమయానికి ఆదుకొని యీ యింట్లో దీపం నిలిపాడు." వా.
చూ. దీపం పెట్టు.

**దీపం పెట్టు**
ఇల్లు నిలుపు.
"ఆ పుణ్యాత్ముడే మాయింట్లో దీపం పెట్టాడు. లేకుంటే ఏ మయి పోయి ఉండేవాళ్లమో!" వా.
చూ. దీపం నిలుపు.

**దీపకంభములు**
దీప స్తంభాలు, దీపపు చెమ్మెలు.
ఎత్తుగా దీపారాధనకై కంచు లేక కఱ్ఱతో చేసినవి.
"దీపకంభంబు లిరుదెస వెలుఁగ." పండితా. ప్రథ. దీక్షా. పుట. 199.

**దీప మార్చు**
ప్రమాణానికై—దీపం ఆర్చు.
ప్రమాణము చేయునప్పుడు దీప మార్చుట కూడా ఒక ప్రక్రియ.
"నీ విది దొంగిలించ లేదని దీప మార్చి ప్రమాణం చెయ్యి. నిన్ను వదిలేస్తాను." వా.

**దీపము కొండెక్కు**
దీపము ఆరిపోవు.

**దీపము ఘనము చేయు**
దీప మార్చు.
దీపం ఆర్పు మనడం అమంగళ మని, ఆర్పు మనుటకు బదులు పెద్ద చేయ మనీ, ఘనం చేయ మనీ అంటారు.

**దీపము పెద్ద చేయు**
దీప మార్చు.
చూ. దీపము ఘనము చేయు.

**దీప మెత్తు**
దీపము పెట్టు.
"హృదయగేహంబులో దీప మెత్తి నట్లు." ఉ. హరి. 2.144.

**దీపవృక్షము**
వృక్షాకారంలో వున్న దీప స్తంభం.
పండితా. పర్వ. 362.

**దీపారాధన చేయు**
దేవుడిదగ్గర దీపం వెలిగించు.
"దీపారాధన చేసి వస్తాను. కాస్త ఉండండి." వా.

**దీమము లొడ్డు**
పక్షి మృగాదులను వశపఱచు కొనుటకై వేటగాళ్లు పక్షి మృగాదులు, ఎఱలు, బోనులు, వలలు మొదలగు నవి పన్ను.

"పాలముల నేనుంగులు దీమంబుల పజ్జఁ దగిలి నెట్టన పట్టువడినక్రియ."
భార. శాంతి. 3.229.
"ఒక మతి దీమంబు లొడ్డి పాదులు దీర్చి." కా. మా. 3.47.
"మగల నెలయించు మరునిదీమంబు లనఁగ." రుక్మాం. 1.77.

దీమసము గైకొను

ధైర్యము వహించు.
"మఱవు మీ చింత దీమసము గైకొనుము."
వర. రా. యు. పు. 5. పం. 19.

దీముకొను

నెలవుకొను.

దీముకొల్పు

నెలకొల్పు.

దీ(డీ)లు పడు

దుర్బలత చెందు.
ఢీలా (హిం).
"కాలవశమునఁ దనుఁ దాన దీలు పడియె." పాండు. 4.17.
"వాడు ఈ మధ్య వ్యాపారంలో దెబ్బ తిని చాలా డీలా పడిపోయాడు." వా.
"అతడు ఈ మధ్య ఒక నెలరోజులుగా జ్వరంతో పడి చాలా డీలా పడి పోయాడు." వా.
రూ. డీలా పడు.

దీర్ఘనిద్ర పొందించు

చంపు.
"నిద్ర వారింపఁ బూనిన నిన్ను దీర్ఘ, నిద్రఁ బొందించి నే నీ గర్వ మడఁతు."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1991-92.

దీర్ఘనిద్ర పోవు

చనిపోవు.

దీర్ఘసూత్రుడు

అనుకొన్న పని అత్యాల స్యంగా చేసేవాడు.

దీర్ఘాలు తీయు

ఏడ్చు.
ఏవేవో సాగదీసి చెప్పు.
రామచం. 51.

దీవనబ్రాలు

శుభాక్షతలు.
వావిళ్ళ.

దీవన లిచ్చు

ఆశీర్వదించు.
"దీవన లిచ్చి రమ్మ కులదీపక..."
రుక్మాం. 4.7.

దీవియకంబము

దీప స్తంభము.

దీవెనకోల

నమస్కారము.
"వృషపురస్థలి విడియు విప్రాశ్రయ, దేవుని కిదిగో దీవెనకో లన."
హంస. 4.213.

దీవెసుడి

దీప ముంచే గూడు - స్టాండు.
"విను మేము ప్రాలుమాలినదీవె సుడి గాక కినిసిన రెండు గుగ్గిళ్ళు గాక."
విప్ర. 5.16.
చూ. దివ్వెసుడి.

దుఃఖపడు

మనఃకష్టము చెందు.

దుఃఖపఅచు
దుఃఖపెట్టు.

దుఃఖపాటు
దుఃఖస్థితి.

దుఃఖపెట్టు
కష్టపెట్టు

దుండగాయ
దుండగీడు.
బ్రౌన్.

దుండగాయతనము
దుర్మార్గం.
బ్రౌన్.

దుండుబలి
సోమరి.

దుంపకూర
కూర వండుకొనుటకు పనికి వచ్చే దుంప.

దుంప తెంచు
ఎక్కువగా కష్టపెట్టు.
"వాడు నా దుంప తెంచి వదిలి పెట్టాడు." వా.

దుంప తెగ!
ఒక తిట్టు.
"వీడి దుంప తెగ!" వా.

దుంపనాశనము చేయు
సమూలంగా నాశం చేయు.
బ్రౌన్.

దుంపశుద్ధిగ పోవు
దుంప తెగిపోవు, సర్వనాశన మగు.
"దొడ్లలో శాకముల్ దుంపశుద్ధిగఁ బోయె, దోచిరి సర్వంబు గోచి దక్క." సింహాద్రినార. 57.

దుకాణము కట్టిపెట్టు
పని ముగించు.
"ఈ వేళకి ఇంతటితో దుకాణం కట్టి పెడదామా?" వా.

దుక్కికి పద నగు
వానతో నేల నాని, సేద్య మున కను వగు.
"దుక్కికిఁ బద నైనపిదప." విజయ. 1.44.
ఇందుపైనే ఆ నేల తడిని కొలుచుటకు కూడా పదను ఉపయుక్త మవుతుంది. ఒక పదను వాన అనగా అరం గుళం లోతు నేల తడిసిన దనుట. అందుపైనే నాలుగు పదునుల వాన, అయిదు పదు నుల వాన యిత్యాదు లేర్పడి నవి. దుక్కు లనీ వీనినంటారు.

దుక్కిఎద్దు
దున్నే ఎద్దు.

దుక్కిపొలము
దున్నినభూమి.

దుక్కిపోతు
దున్నే పోతు.

దుక్కిముచ్చు
రైతు.
ఆం. ప్రా. ద్వి.

**దుక్కెద్దు**

చూ. దుక్కిటెద్దు.

**దుడదుడ**

ధ్వన్యనుకరణము.

"దుడదుడ మంచె యెక్కి..."

వీధి. 30.

**దుడిదుడి**

ధ్వన్యనుకరణము.

**దుడు కడుచు**

మునుగు.

వావిళ్ళ. ని.

**దుడుకు చేయు**

తొందర పెట్టు; తప్పు చేయు.

"దుడుకు చేసినను బుద్ధులు దెల్పు నొక వేళ..." రాధా. 2.30.

**దుడునడక**

దుర్మార్గప్రవర్తన.

ఇందు. 4.38.

**దుడ్డుగట్టి**

లావాటికట్టి.

**దుడ్డుగోల**

దుడ్డుకట్టి.

**దుడ్డువైఖరి**

దుడ్డుకట్టివలె దిట్టంగా, లావుగా.

"ఉద్దండత నది మిండనికిన్, వండిన కుడు మనఁగ దుడ్డువైఖరి మెలఁగున్."

శుక. 2.102.

**దుద్దుకంబడి**

దళమైన కంబళి.

"సన్నపుఁ జూదపు నేఁడె మంచంబు, దుద్దుకంబడిఁ బఱచి నిద్దురకుఁ దూలు."

వేంక. పంచ. 4.456.

**దుద్దుబెట్టు**

మోసగించు.

"అత్తల మామలన్ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, జిత్తుల దుద్దు బెట్టుచును జీటికి మాటికి నన్నె చేరఁగా."

దశావ. బల. 328. పు.

"...చక్క న్నను దుద్దువెట్టి యుఱు కంగఁ దలంచెదు." సారం.

రూ. దుద్దువెట్టు.

**దుద్దెక్కు**

లా వెక్కు.

"పెద్దయుఁ బ్రమదంబు భీతియు భక్తి, దుద్దెక్కి తనలోనఁ దొట్రుకొనంగ."

బస. 1.21.

దళ మెక్కు - దుద్దు = లావాటి, దట్టమైన - దుద్దు కంబడిలోని దిదే.

"ఏమిటో పొట్టమీది చర్మం దుద్దెక్కి పోయిం దంటే నమ్మ." వా.

**దున్నపోతా !**

ఒక తిట్టు.

బలిసి పని చేయకుండా ఉండే వారినీ, తెలివి తక్కువవారినీ దున్నపోతా! అంటారు.

**దున్నపోతు !**

ఒక తిట్టు.

దున్నపోతుమీద వాన కురిసి నట్లు
ఏమాత్రమూ లెక్క లేదనుట.
"అందఱు అన్నమాట లంటూ ఉంటే వాడికి దున్నపోతుమీద వాన కురిసి నట్లు కూడా లేదు." వా.

దున్న లా ఉండు
మోటుగా, లావుగా ఉండు.
"దున్నలా ఉన్నావు. తిరిప మెత్తుకొనే కర్మ మేం? పని చేసుకో కూడదూ?" వా.

దున్నవలె కష్టపడు
బాగా శ్రమించు.
"వాడు దున్నలా కష్టపడతాడు. ఒళ్లు దాచుకొనేవాడు కాదు." వా.

దున్ని ధూళి గావించు
పాడు చేయు.
"దుర్మదాధిపవరేణ్యుల భూములు దున్ని ధూళి గావింపఁడె." విజయ. 3.163.

దుప్పటి పరచు
కొంగు పఱచు.
చూ. కొంగు పఱచు.

దుప్పికి పొడ మాసినట్లు
తిట్లూ, తిమ్ములూ లెక్క లేదనుట.
"వాడికి ఎన్ని తిట్టినా దుప్పికి పొడ మాసినట్లే." వా.

దుప్పిభోజనము చేయు
చేయునది యేమీ లేదనుట.
తనది తాను కుడుస్తూ కూర్చొను.
దుప్పి ఆకలి అయి యేమీ దొరకనప్పుడు తన శిశ్నాన్నే తాను చప్పరిస్తూ కూర్చుంటుం దని ప్రతీతి. అందుపై వచ్చిన పలుకుబడి.

దుబారామనిషి
వ్యర్థమైన ఖర్చులు చేసే మనిషి.
వాడుకలో:
'వాడు ఒట్టి దుబారామనిషి. కాబట్టే అంత ఆస్తీ కర్పూరంలా హారించి పోయింది.'
దుబారానే దూబర అని కూడా కొన్ని ప్రాంతాలలో అనడం అలవాటు.

దుమదుమగా తడియు
చిత్తుగా తడియు.
ధ్వన్యనుకరణము.
"తమ పాటఁ జినుకు చినుకుల, దుమ దుమగాఁ దడిసినట్టిదువ్వాలువలతో..." కళా. 3.74.

దుమాధూళిగ
విస్తారంగా, కావలసినంతగా.
"గడుల్ చిక్కె గజాళి బొక్కె నవు డక్కానక్ దుమాధూళిగన్." సారం. 1.107.

దుమారు చేయు
దుమ్ము చేయు.
"ప్రాసాదము దుమారు చేసి." వర. రా. యు. పు. 20. పం. 12.

**దుముదారుగా**

ఒక్కుమ్మడిగా.

"హైమరథములఁ దోలి గంధాంధ భద్ర, కరులఁ గాలాడి దుముదారుగా హయాళిఁ, జేరువను నూకి..."

దశా. 2.476.

**దుముదుముగా**

ఛిన్నాభిన్నంగా.

"వనము వెఱుకుదుఱ దుముదుము గాన్." రామా. 6.199.

**దుమ్మర మాడు**

దుమ్ము చల్లుకొను.

రాధికా. 3.130.

**దుమ్మాడు**

దుమ్ము చల్లుకొను.

**దుమ్ము తూరు పెత్తి పోయు**

నిందించు.

"వాడు మూడురోజులనుంచీ నామీద దుమ్ము తూరుపెత్తి పోస్తున్నాడు."

వా.

"వాడు ఊళ్లోవాళ్ల నందరినీ దుమ్ము తూరు పెత్తుతున్నాడు." వా.

**దుమ్ము తూరు పెత్తు**

చెడదిట్టు, దూషించు.

"రట్టు గావించి మగనాలిఁ బట్ట డాసి, తొర మొత్తో యటని దుమ్ము తూరు పెత్తు." శుక. 2.63.

"వనరుహాప్త తనయ వాహినీ వానర, వరులు సహ్యమలయగిరులు గడచి, త్రోవ లంకదెసకు దుమ్ము తూర్పెత్తుచుఁ, జనిరి వెస మహేంద్రశైలము నకు." రామాభ్యు. 7.34.

చూ. తూరు పెత్తు, తూరుపాఱ బట్టు, తూర్పార బట్టు.

**దుమ్ముధూళిగా**

పిండి పిండిగా.

"కొన్ని టిహములో నదియఁ గొన్నిటి కొమ్ములు దుమ్ముధూళిగాఁ, గొన్నిటి కుంభముల్ వగుల."

భార. భీష్మ. 2.211.

**దుమ్ము రేగ కొట్టు**

విపరీతంగా కొట్టు.

"ఒంటరిగా కనుమలో చిక్కేసరికి ఎదిరి పార్టీవాళ్లు దుమ్ము రేగ కొట్టారు."

వా.

**దుమ్ములగొండి**

కొర్నవగండు.

ఒక జంతువు.

బ్రౌన్.

**దుమ్మెత్తి పోయు**

తిట్టు.

"తన కొడుకు నెవరో చెఱిచా రని ఆవిడ ఊరందరిమీదా దుమ్మెత్తి పోస్తూ ఉంది." వా.

**దుయ్య బట్టు**

దూషించు.

"నీ పని చెడిపోయిం దని వాణ్ణి దుయ్య బట్టి యేం లాభం?" వా.

**దురద పెట్టు**

నవ్వ పెట్టు.

**దురదురన చొచ్చు**

ప్రవేశించుటలోని ధ్వన్యను కరణము.

సారం. 3.35.

**దుర మెక్కు**

చెలరేగు.

దురావెట్టు
శాసించు.
"సురురా జిగి క్రొన్నెల చెన్ను దురా
గత మనునుదేంట్లను దురావెట్టు, న్నదు
రా యని ముంగురులె, న్నదురా నెతి
వేణి జీవన దు రాజసముఁ౯."
తారా. శశాం. 3.48.

దుల దుల నై (పిండి పోలె రాలు)
(పిండివలె) ప్రిదిలి రాలు.
ధ్వన్యనుకరణము.
"కాలి దులదుల నై పిండి పోలె రాలు,
నట్టి నింజెట్లు గలవు నీ కారగింప."
కా. మా. 3.68.

దులదుల వచ్చు
త్వరగా వచ్చు.
ధ్వన్యనుకరణము.
"దులదుల శౌరి వచ్చుగతిఁ దోఁచి."
రాధి. 2.107.

దులిపి వదలి పెట్టు
తిట్టు.
"అక్కడికి వచ్చేసరికి వాడు నాలుగూ
దులిపి వదలి పెట్టాడు." వా.

దులిపి వేయు
తిట్టు.
"కనిపించీ కనిపించగానే వాడు
నాలుగూ దులిపి వేశాడు." వా.

దువాళి చేయు
స్వారి చేయు, పెత్తనము చెలాయించు.
"వీఁ, పెక్కు దువాళి చేసి చలి."
క్రీడా. పు. 15.
రూ. దువాళి సేయు.

దువాళి సేయు
పైకొను, స్వారి చేయు.
"వలపు దువాళి సేయ."
సారం. 2.46.
రూ. దువాళి చేయు.

దువ్వలువ ముడుచు
బట్ట కట్టు.
"వైష్ణవి తోలుదువ్వలువ ముడిచె."
హర. 4.90.

దువ్వుకొను
మంచి మాటలతో వలలో వేసుకొను.
"ఆ పిల్ల నేమిటో వాడు మెల్లగా
దువ్వుకుంటున్నాడు. ఆ ఆస్తి కాస్తా
గుటకాయ స్వాహా చేసి గానీ వదిలే
టట్టు లేదు." వా.

దువ్వను చూచి నక్క యొడలు గాల్చికొను
పులిని చూచి నక్క వాతలు వేసికొను.
"దువ్వఁ జూచి నక్క, యొడలు
గాల్చి కొన్నవడువున మీ రింత, లావు
మాట లాడ లజ్జ గాదె."
ఉ. హరి. 4.165.
గొప్పవారిని చూచి అల్పుడు, వారి ఆకార సామ్యమును కల్పించుకొన్నంత మాత్రాన గొప్పవాడు కాలే డనుట.

దుసికలబడు
జాఱి పడు; చతికిలబడు.

దుసురులు వాఉ
అతిశయించు.

దుస్సు వోవు
తుస్సు మని పోవు.
"తుది నీవును దుస్సు వోదు త్రుళ్లు టుడుగుమీ." భార. శాంతి. 4.399.

దుమిక యీడ్చు
అధఃకరించు.
"ద్రుమిక యీడ్చినవాఁడు." కాశీ. 4.191.

దూటివుచ్చు
తిరస్కరించు.
శృ. శాకుం. 2.140.

దూదిమడుగు
భక్ష్యవిశేషము.
"అప్పడాలకొటారు లమృతఫలాదులు, వడలకుప్పలు దూదిమడుగులు." శ్రీరం. మా. 6.110.

దూబరదండి
దుబారా చేసేమనిషి.
స్త్రీపురుష వివక్షత లేకుండా దీనిని ప్రయోగిస్తారు.
"రుద్రా నీవు భద్రదేవద్రుమాటవీ వాటి యందు దిసమొల దూబఱదండి మిండ జంగంబవై." భీమ. 3.211.
హంస. 5.113.
"ఆ పిల్ల ఒట్టి దూబరదండి. గాదె లన్నీ ఖాళీ చేసేసింది." వా.
చూ. దుబారామనిషి.

దూముడి వేయు
దువ్వుముడి వేయు.
సులభముగా విడుచుటకు వీ లయినముడి. దీనికి వ్యతిరేకం గట్టిముడి.
"నేరపుతోఁడ దూముడి వేసి." పల. పు. 72.

దూయబట్టు
తిట్టు.
గిర. లోకా. 9.

దూయుముడి
దూముడి.
"బ్రహ్మాస్త్రబంధంబు పట్టుఁదోరపు దూయు, ముడియె యనాయాసమునను విడువ." రామా. 7.7.
చూ. దూముడి.

దూరనగోలలు
ఒక రకమైన పిల్లల ఆట. బ్రౌన్.

దూర మగు
మైత్రిని కోలుపోవు.
"హరుని చిత్తంబునకు దూర మైతిఁ గాదె." కా. మా. 4.166.

దూరాభారం
చాలా దూరం.
"దూరాభారంనుండి వచ్చాము. కాస్త కరుణించండి." వా.
"అంత దూరాభారం వెడుతున్నావు. కాస్త జాగ్రత్తగా ఉండు నాయనా!" వా.

దూర్వాసమహాముని
కోపిష్ఠి.
"ఆ దూర్వాసమహాముని జోలికి ఎవరు పోతారు ?" వా.

దూఱు చెప్పు
తగవు పెట్టు.
చంద్రా. 3.27.

దూఱు చేయు
తగవు పెట్టు.

"ఎవ్వరి దూఱు చేసితిమొ? యెవ్వరి మేలు సహింప మైతిమో?"
మల్హా. 1.41. పు.

దూఱుదుంకములు
ఒక పిల్లల ఆట.

దూఱువడు
నిందపడు.
భార. విరా. 2.182.

దూ ఱెక్కు
నిందపడు.
భార. ఉద్యో. 3.13.

దూలకన్ను
నవ్వాలు (దురదలు) పెట్టే కన్ను.
పండితా. ద్వితీ. మహి. పు. 108.

దూలగొను
దురద పెట్టు.

దూలపోతు
పామరుడు.
శ. ర.

దూలపోవు
దూలగొను, దురద యెత్తు.
కాశీ. 2.138.

దృష్టి తాకు
దృష్టిదోషము తగులు.
"దృష్టి దాఁకునో, యనుచును దల్ల డిల్లి..."
కళా. 7.68.

దృష్టి దీయు
దిష్టి తీయు.
రాధికా. 2.53.

దృష్టిదోషము
దిష్టి.
కొందఱు చూచినప్పుడు ఏదో కీడు కలుగు నని మన వారి కొక నమ్మకము.
"ఏనుఁగుల తలలు కొమ్ముల,తో నారబ ములకు దృష్టిదోషము వాయం,గా నెత్తుదురు."
కా. మా. 3.8.

దృష్టిపిడుత
దిష్టిపిడత.

దృష్టిబొట్టు
దిష్టిబొట్టు.
చంద్ర. 4.73.

దెప్పి పొడుచు
ఎత్తి పొడుచు.
"ఎప్పుడో ఎవరో ఏదో చేస్తే న న్నెందు కమ్మా యిప్పుడు ఊరికే దెప్పి పొడుస్తావు?"
వా.

దెబ్బకు దెబ్బ తీయు
ఎదుటివానితో సరికి సరిగా పోరాడు.
"వాడితో పెట్టుకొన్నావంటే దెబ్బకు దెబ్బ తీస్తాడు. జాగ్రత్త."
వా.

దెబ్బకు దేవేంద్రలోకము అగపడు
ఒకవిధమైన బెదిరింపు.
గట్టిగా తంతా ననుట.
"దెబ్బకు దేవేంద్రలోకం అగపడు తుంది. జాగర్త."
వా.

దెబ్బగొను
కొట్టు.

"గబ్బున నెదిరించిన నొక, దెబ్బ గొనుచు."
శివరా. 4.81.
చూ. దెబ్బ తీయు.

## దెబ్బ తిను
నష్టపడు.
"వాడు వ్యాపారంలో బాగా దెబ్బ తిన్నాడు. ఇప్పు డప్పుడే కోలుకొనే టట్టు లేదు." వా.
"ఈమధ్య అతని వ్యాపారం బాగా దెబ్బ తినింది." వా.

## దెబ్బ తీయు
శాస్తి చేయు.
"వాడు దాయాదులమీద బాగా దెబ్బ తీశాడు." వా.

## దెబ్బలాడు
కొట్లాడు.
"సరి దెబ్బలాడుచో జాంబవంతుని గ్రుద్దు, కోరెక్క లోఁగుట్లు పోర నొక్కె." సిం. నార. 33.
"వాళ్ళిద్దరూ దెబ్బలాడి మాటలు మానేశారు". వా.

## దెవసం రాత
వెధవరాత. ఒక రకం తిట్టుగా.
కొత్త. 326.

## దెసకట్టు
ఒక చోరసాధనం.
వేంక. పంచ. 3.199.

## దెసకట్టు కట్టు
దిగ్బంధనము చేయు.
"గాలి యల్లాడ నీక...దెసకట్టు గట్టంగఁ గలరు."
భర. రా. కిష్కి. పు. 455. పం. 15.

## దెస చెడు
దిక్కు మాలు, సుస్థితిని కోల్పోవు, ఇబ్బంది పడు.
"ఖగపతి దెస చెడి కలఁచునే యెఱ్ఱ."
పండితా. ద్వితీ. మహి. పు. 65.
"దెస చెడి యసురులు...సముద్రంబు సొచ్చిన." భార. ఆది. 2.25.
చూ. దెసపడు.

## దెస దిక్కు
దిక్కు, ఏడుగడ, ఆశ్రయం.
జం.
ఒకే అర్థమున్న రెండు పదాలతో ఏర్పడిన పలుకుబడి.
"నిక్కంబు దెస దిక్కు నీవ కావెట్లు?" బస. 5.129 పు.

## దెసపడు
1. దుస్థితి చెందు.
వేంక. పంచ. 3.375.
2. బాధపడు.
"ఇదిగో చీకాకై, దెసపడుచున్నారము." విష్ణు. నా. 3.186.

## ....దెస మొగ మగు
అభిముఖు డగు.
"పదపంకజములకుఁ బ్రణమిల్లి నిల్చి, యాతనిదెస మొగం బై కేలు మొగిచి."
ద్విప. జగ. 184.

## దెసలు చిల్లులు వోవ
మిక్కిలి బిగ్గరగా.
కాశీ. 4.270.

## దేబిరిగొట్టు
దేబిరించువాడు.
పనీ పాటా లేక అనుట.

"ఆ దేబిరిగొట్టు మొహం నీ కెక్కడ దొరికాడురా?" వా.

## దేవతలపుట్టము

మడిబట్ట.

"కాంగులనీరు మజ్జనం, బున కమరించి దేవతలపుట్ట మొసంగుచు బొడ్డు గిన్నెలో, నునుతురు రాగిసంకటి." శుక. 2.335.

చూ. దేవతావస్త్రాలు.

## దేవతాపులుసు

జైళ్లలో 'సి' తరగతి ఖైదీలకు పోసే పులుసు.

సత్యాగ్రహోద్యమం రోజుల్లో ఇది విరివిగా అలవాటులోనికి వచ్చింది.

## దేవతార్చన చేయు

(దేవతార్చన చేసి) భుజించు.

"నేను వర్షాశనాలనిమిత్తం ఆ ఊరు పోయినప్పుడు కరణంగారింట్లో దేవతార్చన చేశాను. అందుచేత నాకూ ఆయనకు ఎతిక." వా.

"మీ యింట్లో దేవతార్చన అయిందా?" వా.

## దేవతావస్త్రాలు

లేనివి. ఊహామాత్రములు.

## దేవరదున్నపోతు

తిని స్వేచ్ఛగా తిరిగే మనిషి. దేవప్రీతిగా విడిచే దున్నపోతు. జాతరలో దీనిని బలి యిస్తారు—నిరసనలో.

"వాడితో ఏం పని అవుతుంది? వాడు ఒట్టి దేవర దున్నపోతు." వా.

## దేవరయిల్లు

దేవునిల్లు.

ఇళ్లలో ఈశాన్యంమూలకు ఒక గది ఉంటుంది. దానిని దేవరయిల్లు లేదా దేవునిల్లు అంటారు. అట్లే ఆగ్నేయ మూలకు వంటయిల్లు ఉంటుంది.

"ఎనసి యప్పుడె దేవరయిల్లు పడుక, యిల్లు గావించె నంతఁ బూర్ణేందు వదన." శుక. 2.432.

## దేవరవారు

అధికారులను గూర్చి కొన్ని ప్రాంతాలలో ఉపయోగించే మాట. వారిని సంబోధించినప్పుడు దేవర అనడం కూడా ఉంది.

హార. 4.38.

"దేవరవారు మా అర్జీ చిత్తగించాలి." వా.

"అది కాదు దేవరా! నా చేలోకి వాడు గొట్టు జరిపినాడు." వా.

## దేవరహస్యాలు

చెప్పగూడని విషయాలు.

"ఇందులో ఏం దేవరహస్యాలున్నాయి? అంతగా దాచుకొంటున్నావు?" వా.

## దేవళ్ళపెట్టె

దేవతార్చనంపెట్టె, విగ్రహాలుంచే పెట్టె.

శుక. 3.5౦.

దేవాంతకుడు

అసాధ్యుడు..

"వాడా? దేవాంతకుడు ఆవులిస్తే పేవులు లెక్క పెడతాడు." వా.

దేవాదేవేషు చేయు

తన్ను.

ఒక సంస్కృతం చదువుకొన్న అల్లుడు వేదం చదువుకొన్న బావమరిది కాలును పదేపదే తొక్కుతూ 'క్షమధ్వం క్షమధ్వం' అనసాగె నట! — ఇక ఓర్చుకోలేక ఆ వేదం చదువుకొన్న బావమరిది 'దేవాదేవేషు శ్రయధ్వం, మంత్రామంత్రేషు శ్రయధ్వం' అన్నమంత్రం చెప్తూ, ధ్వం వచ్చినప్పుడల్లా ఒక్కొక్క గుద్దు గుద్దడం మొదలు పెట్టినాడు. అందు పై వచ్చిన పలుకుబడి.

దేవానాంప్రియులు

మూర్ఖులు.

"కోవిదుల మంచుఁ గొందఱు, దేవానాంప్రియులు దమకుఁ దెలియని..." దేవీ. పీఠి. 24.

దేవాయుధములు

శాపనార్థములు.

"పస లేదు నిల రోరి! పాతకులా రని, దేవాయుధంబులు రూవువారు." ఆము. 7.13.

చూ. సాహిత్యసమితుష.

దేవికొని వచ్చు

కడదాకా ఉన్న వస్నీ చేతితో ఊడ్చుకొని వచ్చు.

సీటెలోనో, అలాంటివానిలోనో దేవికొని తిను మొదలైన విధంగా వాడుకలోనూ ఉంది.

"పదపదార్థంబులు దేవికొని వచ్చి." బస. 5.135. పు.

"వాడు ఎసట్లో అన్నం దేవుకొని తింటున్నాడు." వా.

దేవు డిచ్చినా పూజారి వర మీడు

అసలువాడు అనుగ్రహించినా అంతకు కిందివాడు కానివ్వ డనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

తాళ్ల. సం. 8.220.

దేవుడే యెఱుగును

మనకు తెలియ దనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"దీని బంటుతనము దేవుఁడే యెఱుఁగును, లాంగు దీని కెంచ సింగ మైన." హరి. 2.73.

పట్ప్రక.

దేవుని తోడు !

దేవుని సాక్షిగా.

దేవుని సాక్షిగా !

ప్రమాణపూర్వకంగా.

"దేవుని సాక్షిగా నే నాపని చేయలేదు." వా.

చూ. దైవసాక్షిగా.
చూ. నా సాక్షిగా.

దేవురుగొట్టు
దేవుళ్లాడువాడు.
గిర. విక్ర. 11.

దేవూ నై గురూ నై అన్నట్లు
దేవుడూ లేదు గురువూ లేదు అన్నట్లుగా.
"దేవూ నై గురు నై యటన్న గతి గాదే." గిర. పు. 4.

దేశం (శాలు) పట్టి పోవు
ఊరు విడిచి వెళ్లి పోవు.
"వాడు చిన్నప్పుడే దేశాలు పట్టి పోయాడు. అంచేత ఈ ఊళ్లో వాణ్ణి ఎవరూ ఎఱుగరు." వా.

దేశంబులో పుట్టంబట్టులు మాలెనే
దేశంలో పుట్టడం పెరగడం నశించిందా?
"దేశంబులోఁ బుట్టం బట్టులు మాలెనే నగజ యా భూతేశ్వరుం గల్వఁగాన్." కుమా. 6.20.
అంటే ఇంక సృష్టి ఆగిపోయి మగవాళ్ళే లేకుండా పొయ్యారా – అతనిని వలచుటకు అనుట.

దేశంమీద పోవు
ఊరు వదలిపోవు.
"వాడు దేశంమీద పోయి చాలానాళ్లయింది. వాడి జాడ ఏమీ తెలియడం లేదు." వా.

దేశ ఒప్పందముగా
దేశాచారంగా.
కాశీయా. 310.

దేశాలివిద్యలు
దొంగవేషాలు.
"విడువు మీదేశాలివిద్య లాజ్జలకు." గౌ. హరి. ద్వితీ. పం. 876.

దేశోత్తరములు
దేశాలు.
కాశీయా. 62.

దేహ మమ్ముకొను
దాసుడగు.
"ఆపదలకు నాదేహ మమ్మికొంటి, నింటింట దాసునిగా నాపాలి దైవమా!" తాళ్ల. సం. 6.59.

దేహము నూడ్చు
మరణించు.
శరీరత్యాగము చేయు.
"దేవుని వామభాగమున దేహము నూడ్చిన." పాండు. 2.236.

దేహముపై తీపు
ప్రాణముమీంది ఆశ.
కొంచెం నిరసన సూచక మయినపట్టులనే ఈతీపు ఉపయుక్తమవుతుంది.
"ఇచ్చోఁ బాసె దేహంబుపైఁ, దీపుం జీఁకటి యింతకంటె వర మేదీ?" కా. మా. 3.123.
"వాడికి ప్రాణంమీద మహాతీపి. వాడేం పోరాడతాడు?" వా.

దేహము ముంచు
మునుగు, స్నానము చేయు.
"ముంచెన్ నారద కుండికాజలములన్ మోదమ్ముతో దేహమున్." భీమ. 2.65.

## దేహయాత్ర

1. భుజించుట, తినుట.

"అనుదినంబును దేహయాత్ర కాయితమానె, నీవారశూకాది పూవుబోణి."
హర. 4.18.

2. జీవిక.

"ఏదో పదుగురికి సంగీతపాఠాలు చెప్పుకొని దేహయాత్ర సాగిస్తున్నాను." వా.
రూ. తనుయాత్ర.

## దేహయాత్ర చాలించు

చచ్చు

## దేహయాత్ర నడుపు

భుజించు.

"కందమూల ఫలోపహారంబుల సమర్పించి, తత్ప్రసాదంబునఁ దానును దేహయాత్ర నడపి." హర. 7.112.

## దేహశుద్ధి చేయు

తన్ను.

"ఆ అయ్యవారు పనిపిల్ల నేమో అన్నాడని దాని మొగుడు వచ్చి బాగా దేహశుద్ధి చేసి పోయాడు." వా.
చూ. కాయశుద్ధి చేయు.

## దైన్యపడు

దీనస్థితి చెందు.

"అలిమాటలు విని యనుబట్టి నకటా తెగటార్చరె యంచు నామె పెద్దలఁగని పుత్రమోహమున దైన్యపడెన్."
సా. 3.80.

## దైన్యపాటు

దైన్యం.

## దైన్యపుబ్రముగ్గులు పెట్టు

దీనముగా మాటలాడు.

"దైన్యపున్, బ్రముగ్గులు పెట్ట నేల ?"
నా సా. 205.

## దైవఘటన

దైవవిధి, విధివ్రాత.

ఇది 'దైవ'పదం లేకనే కూడా వినవస్తుంది.

"......దైవంబు ఘటన యే మనవచ్చునె ?" మార్కం. 1.51.

"దైవఘటన యెవ్వారికిం దప్పుటరుదు." కళా. 8.182.

"ఘటన ఎట్లా ఉంటే అట్లా అవుతుంది." వా.

## దైవ మెద్ది యొనరించిన నది యగు

దేవుడు ఎట్లా పెడితే అట్లా అవుతుంది — అని వాడుక.

"దైవ మెద్ది యొనరించిన నది యగుఁ, గాక యనుచుఁ దలుపుకడన యుండె." కళా. 4.112.

## దైవ మెఱుగు

ఎవరికీ తెలియ దనుట.

ఇది సహజంగా వాడుకలో ఎక్కువగా వచ్చే పలుకుబడి.

"వెలయం దైవ మెఱుంగుఁ గల్ల నిజముల్ మీ రాడఁగా నేమగున్."
శుక. 4.41.

"మంచీ చెడ్డా భగవంతుడికి తెలుసు."
వా.

"పాపం పుణ్యం దైవానికి తెలుసు."
వా.

## దైవయత్నము

ఈశ్వరేచ్ఛ.

"ఏ మనవచ్చు దైవయత్నం, బని తలఁచుచు మోహావశత నవ్యగ్రమతిౕ."
శుక. 1.495.

## దొంగకు తేలు కుట్టినట్లు

చద్దూ చప్పిడీ లేకుండా.
దొంగకు తేలు కుట్టినా అరిస్తే యింటివారు లేస్తారని అఱవడు.

"మిట్టెఁ బో దొంగఁ దే ల్గుట్టిన ట్టివి డాఁచి, కొంచుఁ బోవక మెఱయించు టెట్టు."  కళా. పూ. 2.79.

చూ. దొంగను......

## దొంగకూడు

దొంగచాటు తిండి.
చాటుగా అనుభవించుట, తనది కానిదానిని అనుభవించుట.
ఉచ్ఛిష్టమున కాశించుట వ్యభిచారము కూడా కనుక ఆ అర్థంలోనూ ఉపయోగిస్తారు.

"......నిజతపోమహిమంబులు వీటిఁ బుచ్చి లజ్జాగరిమల్ దొఱంగుటలు చాలక యీతఁడు దొంగకూటికే, లాగునఁ జొచ్చె..." విప్రనా. 5.41.

## దొంగగొడ్డు

దొంగమేత మేసే పసరం.

## దొంగతో కొలువు

అపాయకరము.
ఏ నిమిష మయినా ప్రమాదము రావచ్చు ననుట.
వేంకశైశ. 36.

## దొంగను తేలు కుట్టినట్లు

"పట్టెఁ బో! దొంగఁ దేల్గుట్టిన ట్టివి డాఁచి, కొంచుఁ బోవక."
కళా. 2.85.

పాఠాంతరం.

చూ. దొంగకు...

## దొంగనేల

మోసం చేసి తీసుకున్న పొలం.

## దొంగపోటు పొడుచు

వెనుకపోటు పొడుచు.

"వాడు స్నేహితుడుగానే ఉంటూ దొంగపోటు పొడిచాడు." వా.

## దొంగబిగము

మాఱుతాళం.

## దొంగబూచి బూటకములు

బెదరింపులు.

"ఏల దో, బూచి దొంగబూచి బూటకములు." గిర. 45.

## దొంగమాట

అబద్ధం, కల్పితం.

## దొంగమేత

పశువు దొంగగా మేసేమేత.

## దొంగయిసుక

ముచ్చిసుక.

## దొంగల దోల!

ఒక తిట్టు.

"నీ ఆచారం దొంగల దోల! పొద్దున్నుంచీ తడిబట్టతోనే ఉంటేను వ్యేం బతుకుతావు రా ఈ చలికాలంలో?"
వా.

దొంగల దోలు

పాఱద్రోలు.

దొంగలపాలు చేయు అనగా రక్షణబాధ్యతను వదలు అనుటపై ఏర్పడినది. అడవుల దోలు, కొండల దోలు వంటిది.

"వాడు పెళ్లాన్నీ, పిల్లలనీ దొంగల దోలి దేశంమీద పోయినాడు." వా.

దొంగలు దోచిన కొంప

పాడుగా, శూన్యంగా, ఛిన్నాభిన్నంగా ఉండునది.

"వాళ్లింటికి పోయి చూతును గదా! అది దొంగలు దోచినకొంపలా గా ఉంది." వా.

దొంగలు దోల!

దేని నైనా నిరసిస్తూ మాట్లాడుతున్నప్పుడు 'పాడుగాను' అన్నట్లే అనుమాట.

"నీ ఆట దొంగలు దోల! అన్నానికి అయినా రండిరా." వా.

"నీ అన్యాయం దొంగలు దోల!" వా.

చూ. దొంగల దోల.

దొంగ వాకిటనె మంచము వేయు

ఎవరివల్ల భయమో వారిదగ్గరనే ఉండి ఆ బాధను తప్పించుకొను.

"ఇంచుక నాకుఁ జూడ నిషధేశునిఁ బ్రార్థనఁ జేసి పంపినన్, మంచిది దొంగవాకిటనె మంచము వేయుట కార్య మెచ్చుటన్." నలచ. 4.

దొంగసొమ్ము

దొంగిలించి తెచ్చిన సొమ్ము.

"దొంగసొమ్ములకు నై యిల్లిల్ల ప్రాల్మాలితే."

విప్ర. 5.35.

దొంగెత్తు వేయు

దొంగయుక్తి పన్ను.

"నూకాలుకు పోవాలని వస్తుం దని కడుపునొప్పి పేరు చెప్పి దొంగెత్తు వేశాడు." వా.

దొండముక్కు వడు

బాగా పండు.

కాశీ. 3. 23.

దొండి వోవు

చిల్లిపడు; మొక్కపడు.

"పోర మాయును రేల పోనికొనెద వురా, తోరంపు నీమేను దొండివోను."

బిల్హ. 2.64.

దొంతరపువ్వు

సహస్రారము.

యోగశాస్త్ర రీత్యా శరీరంలో ఉన్న వని చెప్పబడే షట్చక్రాలలో నడినెత్తిన ఉండేది సహస్రారము.

మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, సహస్రారము అని షట్చక్రములు.

"అ, ద్దొంతరపువ్వునం గలుగుతోరపుఁ గంపులు పెంపు మీఱఁగన్."

పాండు. 4.74.

**దొంతరముద్దు**
చుంబనాలలో ఒక రక మైనది.

**దొంతరలు గొను**
దొంతులుగా చేరు.
ఉత్త. రా. 4.163.

**దొంతి బెట్టిన కుండలు**
వరుసగా పేర్చినవి.
తాళ్ల. సం. 6.133.

**దొంతుల కోపని గుదియలు కలిగెను**
'వానికి ఆమాత్రం శక్తి ఉండీ చేత గాలేదు' అనుచోట ఉప యోగించే పలుకుబడి.
కుండల దొంతులను పగుల గొట్ట లేని గుదియ యున్న నుట. విపరీతమిది.
"వదరంగ దొంతుల కోపని, గుదియలు నుంగల్గె..." కళా. 6.23.

**దొంతులు గొను**
ఒకదానిపై నొకటి పేర్చినట్లు నిలబడు.
"దొంతులు గొని పడియున్న కారు మొగుళు లన." కుమా. 1.120.
"కుండలు దొంతులు పేర్చినారు." వా.

**దొంబులిగొట్టు**
భీరువు.
ఆం. భా. 221.

**దొగ్గినంబలి**
అర్థము విచార్యము.
తాళ్ల. సం. 11. 3 భా. 156.

**దొగ్గుడు కొను**
వ్యాపించు.
అచ్చ. భా. 5. 86.

**దొటదొట**
ధ్వన్యనుకరణము.
"దొటదొట రాలు మి న్నవిసి తోరపు నిప్పులవాన లొక్కటన్."
సానందో. 2. 5.

**దొడదొడ**
ధ్వన్యనుకరణము.
"దొడదొడ నోట నెత్తురు గ్రక్కకొనుచు."
రంగ. రా. యు. 375 పు.
"దొడదొడ మంచె యెక్కె"
వీథి.

**దొడిదొడి**
ధ్వన్యనుకరణము.

**దొడ్డ కొంచము లెక్కించు**
ముందు వెనుకలు చూచు.
"ఇక్కలంది దొడ్డ కొంచెము, లెక్కింపక మరునిపోవళిం బడువేళన్."
హంస. 1.101.
చిన్న పెద్ద, ఎక్కువ తక్కువ—ఇలాంటివి చాలా ఉన్నవి.

**దొడ్డపని**
ఘనకార్యం.

**దొడ్డి కట్టు అగు**
పశువులు మొదలగునవి గుంపుగా చేరు, మంద వేయు.
"అచలములపైనె దొడ్డికట్టగు మృగాళి." ఆము. 4.117.

దొడ్డికాళ్ళు

పంగటికాళ్ళు.

దొడ్డికొను

నిండు.

దొడ్డిదోవను పోవు

దొంగచాటుగా వ్యవహరించు.

"ఏదో చేసేది బహిరంగంగా చేయడం తప్పితే యిలా దొడ్డిదోవను పోవడం నాకు తెలియదు." వా.

దొడ్డిపట్టు

పశుస్థానం – గోష్ఠం.

దొడ్డి బెట్టిన వేల్పుగిడ్డి

అందుబాటులో ఉండి అన్ని కోరికలనూ తీర్చునది.

పెరటిలోనే ఉన్న కామధేనువు.

"దొడ్డిఁ బెట్టినవేల్పుగిడ్డి కాఁపు." మను. 1.66.

దొడ్డి బెట్టు

దొడ్డిని తోలు.

"మాడలవలె సతుల మరుపి ళ్లాడేవు, తోడె నిట్టె యెందఱిని దొడ్డిం బెట్టేవు." తాళ్ల. సం. 3.631.

దొడ్డివేల్పు

ఇలువేల్పు.

"గెలుపుపేరు వజీరుఁ గినిసిన కప్పుకైదువ...మా దొడ్డివేల్పు." ప్రబంధ. 160.

దొడ్డిసంభావన

సంస్థానాలలో రాజులు పండితులకు, కవులకు సంభావనలు, జాప్తాలు ఇచ్చేవారు. అంత చదువు రాని యితరులను దొడ్డిలోకి పొమ్మని, వాకిట కూర్చొని ఒకరు సంచిలో వచ్చినన్ని రూకలు ఇస్తూ ఒక్కొక్కరినే బయటికి పంపించి వేయడం అలవాటు. అందుపై ఏదో యింత, యోగ్యతను చూచి కాక యిచ్చే సంభావనకు పేరైనది.

"వీడికి యిస్తే దొడ్డి సంభావనే గా. ఆమాత్రానికే అంత మిడిసిపాటా ?"

దొడ్డు కొంచెము లేని

పెద్దా చిన్నా లేని.

"సముదగ్రతర పాప సంచార భీతుండు దొడ్డు కొంచెము లేని గొడ్డుకాఁడు." చంద్రా. 5.150.

దొడ్డుకట్టుల చీర

పెద్దకమ్ముల చీర.

కమ్ములు, కట్టులు ఇక్కడ చీరలో నేసిన గీతలు.

"అడ్డంపుముక్కర యసియాడు నడుము, దొడ్డుకట్టుల చీర తోఁగుఁ బయ్యెదయు." పండితా. దీక్షా. 45.

దొడ్డువాఱు

అధిక మగు.

శ. ర.

దొడ్డకత్తె

కొల్ల పెట్టునది.

దొడ్డకాడు
కొల్ల పెట్టువాడు.

దొడ్డగొను
కొల్లగొట్టు.
"తక్కగలయింతిగముల నాదస్యు లడరి, పట్టుకొని యేచి వీ డెల్ల బన్న పడఁగ, దొడ్డగొని."
భార. మౌస. 188.

దొడ్డ యిచ్చు
కొల్ల యిచ్చు, అంతా యిచ్చివేయు.
"శశిరవిగ్రహ జపస్నానాదికము లెల్ల, దొరల వాకిండ్లకే దొడ్డ యిచ్చి"
ఆము. 6.69.

దొడ్డలాడు
కొల్లగొట్టు.
"కరమూలంబున మించుఁబొంచు లిడి కాంతుం గ్రోలుఁ గప్పూరు ముం, గురు లర్థిం గబళించు వాతెఱ మెఱుంగుల్ దొడ్డలాడున్ ... ధాత్రీశు చూడ్కుల్ వెసన్."
కేయూ. 4. 18.

దొడ్డలు వుచ్చు
కొల్లపుచ్చు.

దొడ్డలు సేయు
అంతా యిచ్చు.
"పెద్దల నరులర్థ హితులఁ బెద్దగ నందఱఁ గూర్చి యర్థముల్, దొడ్డలు సేసె దావనిరతుం డనఁ బైకము సిక్కకుండఁగన్."
ద్వాద. 3.96.

దొడ్డవోవు
కొల్లవోవు.

దొనదొన (ముసురు)
ధ్వన్యనుకరణము.
"తనువుమీఁద ముసిరె దొనదొన నీఁగలు."
వరాహ. 9.79.

దొనయుప్పు
సామక మనే ఉప్పు.
చవుటిఉప్పు అని కొందఱు.
శ. ర.

దొప్పగ దోగు
బాగుగా మునుగు.
"ఆ, కాశనదీ ప్రవాహమునఁ గాయము దొప్పఁగఁ దోఁగి."
భీమ. 4.7.

దొప్పలు గట్టు
మడుగులు గట్టు.
"...నెత్తురు, దొరగం బ్రవహించి నిండె దొప్పలు గట్టన్."
వేం. పంచ. 1.233

దొప్పలు దొరలుగా
కావలసినంత సమృద్ధిగా.
"తొత్తులువోలె నబ్బుదురు దొప్పలు దొరలు ముక్తికామినుల్."
కాశీ. 2.49.

దొప్పుదొప్పున
ధ్వన్యనుకరణము.
"దొప్పుదొప్పున నోరుం, గేల నడచి కొను..."
ఉత్త. హరి. 4.307.

దొబ్బులు పెట్టు

దండించు, బుద్ధి చెప్పు.

"వాళ్ళ నాన్న నాలుగు దొబ్బులు పెట్టేసరికి ఇంటికి వచ్చాడు." వా.

దొమ్మ గలవాడు

ధైర్యస్థుడు.

"వాడు మాంచి దొమ్మ గలవాడు." వా.

దొమ్మపొగరు

కండకావరము.

"ఎంత బలవంతుడ వయినా అంత దొమ్మపొగరు పనికి రాదు." వా.

దొమ్మబలం

ధైర్యం.

"వాడు మంచి దొమ్మబలం ఉన్న వాడు. కాబట్టే ఎంతమంది వచ్చినా ఆపగలడు." వా.

దొమ్మరవాని డోలు

గయ్యాళిగంప.

"వానియిల్లాలు దొమ్మరవాని డోలు." హంస. 2.14.

దొమ్మరిసంసారం

తిరుగుడుసంసారం.

దొమ్మలు కొట్టుకొను

విపరీతముగా ఏడ్చు.

"ఆవిడ చెట్టంత కొడుకు పోయాడని దొమ్మలు కొట్టుకొంటూ ఉంది." వా.

దొమ్మలు పగులు

బాగా దెబ్బ తగులు.

"ఏ డేమో అందరినీ కవ్విస్తున్నాడు. దొమ్మలు పగిలితే కానీ తెలిసి రాదు." వా.

దొమ్మ లేనివాడు

పిరికివాడు.

"వా డేం పోతా డక్కడికి? వట్టి దొమ్మ లేనివాడు." వా.

దొమ్మి గూడు

గుంపు గూడు.

నీలా. 3.37.

దొమ్మి చేయు

1. దౌర్జన్యము చేయు.

"దొమ్మి చేసిన ఖరదూషణాదులను, తునిమి వైచుట."

వర. రా. యు. పు. 533. పంక్తి. 11.

2. దౌర్జన్యంగా ఒకరిమీద పడు.

"అంధక కాలకేయ మహిషాదులు దైత్యుఁడు..., దొమ్మి యొనర్చి..." హర. 6.95.

పై అర్థంలో 'దొమ్మి'మాత్రమే నామవాచకంగా కూడా వాడుకలో ఉంది.

"ఆ ఊళ్లో మొన్న దొమ్మి జరిగింది. రెండు ఖూనీలు జరిగాయి." వా.

దొమ్మియుద్ధము

సంకులసమరము.

నానా. 65.

దొమ్ములాడు

1. దొమ్మియుద్ధం చేయు.

2. పెనగులాడు.

"దోషముల్ ప్రణయము సంభ్రమము మది దొమ్ములాడ."
నరస. 3. 118.

దొరకుపడు

దొరుకు.

"ఆరెంటిన్, దొరకు పడఁ బట్టు కొని..." వేం. పంచ. 3. 133.

దొరకుసన్నాసి

కపటసన్యాసి.

నమ్మించి దొరకినది చేత పట్టుకొని పోవువాడు.

"యతి ననుచు వేషభాషల నటమ టించి, పొంచి తతి వేచి కన్నియఁ గొంచు నరిగె, దొరకుసన్నాసి యను మాట తిరము గాఁగ, నర్జునుం డద్దిరా యెంత దుర్జనుండు." విజ. 3.161.

చూ. దొరకోలు సన్నాసి.

దొరకొను

పూనుకొను.

"దొరకొన్న కర్జంబు" సింహా. 2.88.

ఇట్లే దొరకొల్పు, దొరకోలు ఇత్యాదులు.

దొరకోలు సన్నాసి

ప్రబంధ. 794.

చూ. దొరకుసన్నాసి.

దొరలక యుండు

ఉపేక్షించు.

విజ్ఞా. వ్యవ. 46.

దొర వచ్చు

నాటి యగు.

కాశి. 5.283.

దొరాదొరలు

పెద్దపెద్ద దొరలు.

"అని దొరాదొర లెన్నఁగా ఘనత కెక్కి." రాధి. పీఠి. 20.

దొరువుపట్టెడ

ఎద్దుముడ్డికి తగిలించే పట్టెడ.

బ్రౌన్.

దొలకిపడు

దొలకు, చిక్కు.

"ఎలుక నీ కిప్పు డెందుండి దొలకి పడియె." కుమా. 2.29.

దోకుడుపాలు

తప్పుగోల, త్రవ్వే పార.

దోకుడుబార

ఒక రకమైన పిల్లల ఆట.

శ. ర.

దోగాడు

పిల్లలు మోకాళ్ళతో ప్రాకు.

పార్వ. 2.17.

రూ. దోగియాడు.

దోచిపెట్టు

ఉన్న దంతా పెట్టు.

"ఆ కోడలు ఇరుగు పొరుగు అమ్మ లక్కలకు ఇల్లంతా దోచిపెట్టుతూ ఉంది. ఇంక ఆ సంసారం ఏం ముందుకు వస్తుంది?" వా.

దోటమ్ము

దోటీవలె ఉండు బాణము.

దోదుమ్మిదారి

ఆయుధవిశేషం.

దోదుముదారి

చూ. దోదుమ్మిదారి.

దోనెడొగ్గు

మోకరిల్లు.

"కరఘాతపతదబ్దఘటఁ గొమ్మకొనఁ జిమ్మ, దమి దోనెడొగ్గి చాదంతి డిగియె." వసు. 5.6.

దోపిడి యాటలు

ఒక బాలక్రీడ.

"తూరనతుంకముల్ దోపిడియాటలు." ప్రబంధ. 613.

దోపుచూరు

అరుగుల మీద జల్లు పడకుండా తాటాకులతో ముందుకు పెంచి కట్టిన చూరు.

దోపు వడు

కొల్లగొట్టబడు.

"భవదూరుసంభవ బహువైశ్యకోటికా, తురకలచే నిట్లు దోపు వడుట." సిం. నార. 48.

దోపు వోవు

కొల్లవోవు.

దోమతెర

దోమలు రాకుండా పైన కట్టే బట్టతెర.

"క్రమంబున ఘర్మశంకమై, నుప్పతిలంగ దోమతెర లుప్పర మెత్తిరి." ఆము. 5.104.

దోమాడకరణము

పడితే వదలనివాడు.

ప్రాంతీయమైన పలుకుబడి.

"అట్లు లంబాడీదయ్యమువలె విడువక దోమాడకరణమువలె నావెంట బడితి వేమి?" చింతా. 7 అం. 74 పు.

దోయిడి చేతులతో

వట్టిచేతులతో.

"...ప్రతిన లెన్నని ధర్మసంభవుని యెదుర, మనము దోయిడిచేతుల మగుడు టెట్లు?" జైమి. 2.17.

దోయిలి తీర్చు

అంజలి సేయు.

హంస. 4.213.

దోరగల్లు వడు

ఒకప్రక్కగా వంగు, పడు.

ఒక చక్రము ఒరగు. (కల్లు= బండిచక్రము.)

"తరణి చక్ర మొరగి శరధిఁ గ్రుంగ, దోరగల్లు వడియె." మను. 5.35.

చూ. దోరగలు వడు.

దోరగాయ

మాంగీ మాగని కాయ.

"కల్పవృక్షాలఁ గలదోరగాయఁ గూడఁ, గోసి యిటు తెచ్చి నిల్పిన వాని యనుచు." పార్వ. 2.120.

"కలమాగిన పండుకంటే దోరగాయే బాగుంటుంది." వా.

దోరగిల బాఱు

దోర మాగు.

దోరగిలు

ఎట్టువడు.

పళ్లు పక్వం కావడంలో ఎట్టి దనం ఉన్నది. అలా వచ్చిన మాట.

"శశిపైఁ, గినిసి కనుంగొనలు దోరగిల నిర్దయుఁ డై." వరాహ. 7.49.

దోరణపు గమ్మి

ద్వారంమీది అడ్డకమ్మి. శ. ర.

దోరణపు పట్టె

కపిలె బల్లక్రింది అడ్డపట్టె. శ. ర.

దోరపండు

కొద్దిగా మాగినపండు.

"ప్రబలంపుగాడ్పుచే రాలిన యెల మావి, దోరపం డ్లెవ్వరో యేరినారు." శుక. 1.377.

చూ. దోరగాయ.

దోరవాలు

దోరగా పండు, ఎట్టువడు.

దోసకారి

దుర్మార్గుడు.

"ఆ దోసకారి సన్యాసి దవ్వులఁ గాంచి, యోలంబునకు దారి యొదిగి యుండు." శృం. నైష. 7.130.

"కడకు నీటింక నీ వెఱుంగనివితాన, దూరెదవు నన్నుఁ జలపోరి దోసకారి." తారా. శ. 3.81.

దోసములు కట్టు

తప్పు లంట గట్టు.

"ధరణీశ్వర! యేటికి వట్టిదోసముల్, గట్టెదు నాకు నంచు నెడగాఁ జర ణంబు దరల్చుకొంచు." కళా. 7.234.

దోసిటఁబ్రాల ముద్దుగుమ్మ

పెండ్లము.

దోసిటఁబ్రా లనగా తల బ్రాలు. తలబ్రాలు పోసి పెం డ్లాడిన వనిత అన్న అర్థంలో యేర్పడిన పలుకుబడి కా వచ్చు. ఇంకను విచార్యము.

"వాని కి దోసిటఁబ్రాలముద్దు, గుమ్మ మదవతి యన నొక్కకొమ్మ గలదు." శుక. 2.503.

దోసెలు పోయు

దోసెలను చేయు.

"పాపం! ఆ ముసలామె దోసెలు పోసుకుని జీవిస్తూంది". వా.

దోహత్తనారాయణుడు

ద్విబాహునారాయణుడు.

"చాహత్తమల్లుండు దోహత్తనారా యణుండు ఖండియరాయచండబిరుద, మంత్రి." నైష. 1.32.

నారాయణు నంతటివాడు. చేతులు మాత్రమే రెండు— అనుట. ఇదొక బిరుదైనది.

దోహద మిడు

పోషణ యొసగు.

"వేడ్కలు దళుకొత్త దోహద మిడం బొలిగుబ్బలికొండగోఁగుపూఁ,గొల యల రించె." పారి. 2.70.

ఇందులో ప్రత్యేకంగా కొన్ని వృక్షాలకు కొన్ని రకాలయిన దోహదక్రియలు కవి సమయాలుగా ఉన్నవి.

**దౌడపండ్లు రాలగొట్టు**

దండించు, తన్ను.

**దౌడపండ్లు రాలగొడతాను!**

ఒక తిట్టు.

తంతాను సుమా అనుట.

**దౌద వ్వగు**

దూర మగు.

"తనయసంతానలబ్ధి దౌదవ్వ గాఁగ." శివ. 2.17.

**దౌదవ్వులన్**

దూరదూరముగా, చాలా దూరముగా.

భీమ. 2.79.

**దౌదౌవు**

దూరము.

**దౌర్భాగ్యదామోదరుడు**

నిర్భాగ్యుడు.

ఒక తిట్టు.

**ద్రావిడప్రాణాయామము**

సూటిగా చెప్పక ఏవేవో తిరుగుళ్లుగా చెప్పినప్పుడు ఉపయోగించే మాట.

ద్రావిడులు ప్రాణాయామం చేసేటప్పుడు చేతిని తలకు అటు తిప్పి ముక్కును పట్టుకొనుటపై వచ్చిన పలుకుబడి.

"ఈ ద్రావిడప్రాణాయామం అంతా ఎందుకు? వస్తావా రావా? ఒక్క మాటలో చెప్పు." వా.

**ద్రోహము తలచు**

ద్రోహము తలపెట్టు.

"నా యింటికి ద్రోహముఁ దలఁచి." ప్రభా. 5.189.

**ద్విపాదపశువు**

మూర్ఖుడు.

రెండు కాళ్ల పశువులు అనగా పాద సంఖ్యలో భేదమేగాని పశువు లేదనుట.

"వా డొక ద్విపాదపశువు." వా.

**ద్విర్ద్వాదశం**

వైరుధ్యం.

జ్యోతిశ్శాస్త్రరీత్యా వచ్చిన పలుకుబడి.

ఒక గ్రహానికి రెండవయింట గ్రహం ఉంటే దానికిది పన్నెండవయింటి దవుతుంది. అలా ఉన్న గ్రహాలు రెండింటికీ సరిపడదని జ్యోతిశ్శాస్త్రం.

"వాడికీ వీడికీ ద్విర్ద్వాదశం." వా.

**ధగధగద్ధగలు**

ప్రకాశము.

"ధవళతర దేహ ధగ ధగద్ధగలు మెఱయఁ, గదియ నేతెంచు నొక భుజంగంబు గనిరి."
దశా. 1.206.

**ధగధగ మను**
ప్రకాశించు.
"ధగధగ మనుచుఁ, గలుముల నీనెడి చూపుల." భాగ. 8.265.

**ధగిడీకె !**
ఒక తిట్టు.

**ధగిడీకొడుకు**
ఒక తిట్టు.

**ధణంధణలు**
ధ్వన్యనుకరణము.
"అందు భేరీ ధణంధణల్ క్రందు కొనియె."
ఉత్త. రా. 8.165.

**ధనం మూలుగుతున్నది**
కావలసినంత ధనం ఉన్న దనుట.
"వాళ్లింట్లో బోలెడంత ధనం మూలుగుతూ ఉంది. అనుభవించే దిక్కే లేదు." వా.

**ధనపిశాచములు**
లుబ్ధులు.
ధనము పూడ్చిపెట్టి ఉన్న చోట పిశాచములాశ్రయించి ఉండు నన్న ప్రతీతిపై యేర్పడినది.
"ధనపిశాచంబు లివి యథార్థమ్ము సుమ్ము." శుక. 3.220.

**ధనియాలజాతి**
దుర్జాతి.
చెప్పుదెబ్బలు పడితే తప్ప వినేజాతి కానిది.
ధనియాలను చల్లాలంటే ముందు చెప్పుతో నలిచి తరువాతనే చల్లుతారు. అప్పుడే అవి మొలకెత్తుతా యని నమ్మకం. అందుపై యేర్పడిన పలుకుబడి. తిట్టుగా నిందగానే ఉపయుక్తం.
"దెబ్బ పడందే వాళ్లెక్కడ మాట వింటారు? అదంతా ధనియాలజాతి."
వా.
ఒక ప్రత్యేకకులాన్ని 'ధనియాలజాతి' అనుట కూడా కొన్నిప్రాంతాల కలదు.

**ధరణి యీనిన భంగి**
అధికంగా, మందలు మందలుగా, గుంపులు గుంపులుగా.
"ధరణి యీనిన భంగిఁ దండతండములు, సరసల నరుదెంచు పరుసలఁ జూచి."
పండితా. ద్వితీ. పర్వ. పు. 288.
"అబ్బ! జనం నేల యీనినట్లుగా ఉన్నారు." వా.
చూ. నేల యీనినట్లు.

**ధర పలుకు**
హెచ్చుధర వచ్చు, గిరాకీ హెచ్చు.
కొత్త. 237.

**ధరింపగా నొకరి కీయ గలదు లే**

తినుటకు పెట్టుటకు ఉన్నది. వాడుకలో. 'వానికి తాను తినడానికీ ఒకరికి పెట్టడానికీ ఉంది' అనగా కలవా డనుట.

"ఇపుడు మీ పుణ్యమున నాకు నేమి కొదవ,యుండె నేను ధరింపఁగా నొకరి కీయఁ, గలదు లే..." శుక. 2.322.

వాడుకలో రూపం: 'తిన డానికీ పెట్టడానికీ ఉంది.'

**ధర్మకవిలె**

దాసుడు.

(కన్నడం – ధర్మకవిలె = కవిలె ఎత్తు గంగిరెద్దు) బస వన్నవలె అన్నిటికీ తల వూచుతూ చెప్పినట్లు చేయు కింకరుడు అనుటపై వచ్చిన పలుకుబడి.

శైవంలో మీ దాసుడను అనుటకు బదులు అలవాటైన మాటగా కనబడుతుంది. నిఘంటువులలోని అర్థం కుదరదు.

"మీదత్తి మీప్రాత మీ ధర్మకవిలె." బస. 4.122.

"కత లేల మీధర్మకవిలెల మేము." పండితా. ద్వితీ. మహి. పు. 175.

**ధర్మకాహాళ పట్టించు**

యుద్ధము నిలుపు సూచనగా బూకా ఊదించు.

"ధర్మకాహాళ పట్టించి పదాతిపురుష వ్యాపారంబులు సాలించి." దశ.

**ధర్మదాత**

ఈవి గలవాడు; దానపరుడు.

**ధర్మదార పట్టించు**

యుద్ధము నిలుపు సూచనగా శంఖము పూరించు.

"......రాత్రి పోరించి ప్రభాత కాలము పరిస్ఫుట మైనను ధర్మదార వట్టించుచు నున్నవాఁడవె కుటీగత కుక్కుటకంఠ నాదముల్." క్రీడా. 54 ప.

**ధర్మపన్నాలు చెప్పు**

శ్రీరంగనీతులు చెప్పు.

"వాడు వట్టి ధర్మపన్నాలు చెబుతాడు. ఆచరణ శూన్యం. అందుకనే యెవరూ వినరు." వా.

**ధర్మపిండం**

తిరిపెపు తిండి.

"వాడి కేముంది? ఎవడు ధర్మపిండం వేస్తే అక్కడ పడి ఉంటాడు." వా.

దాన్నే డి. పి. అని ఇంగ్లీషు పొడి అక్షరాలలో అనడం కూడా వైదికులలో కలదు.

**ధర్మము నాల్గు పాదముల నడచు**

ధర్మము లోపం లేకుండా వర్ధిల్లు.

ధర్మాన్ని ధేనురూపంలో మన పెద్ద లూహించు

కొన్నారు. ఆపైన అది, కృత యుగంలో నాలుగు పాదాలతో నడుస్తుం దనీ, కలి యుగానికి వచ్చేసరికి ఒంటి పాదం మీద నడుస్తుం దనీ కూడా అన్నారు. అందుపై వచ్చిన పలుకుబడి.

"ధర్మంబు నాల్గుపాదముల నడచె." రుక్మాం. 1.136.

**ధర్మరాజు**

ఉత్తముడు.

"ఆయన ధర్మరాజులాంటివాడు. ఒకరి జోలికీ సొంటికీ వచ్చేవాడు కాడు." వా.

**ధర్మశాస్త్రమా ?**

అదేం చట్టమా?–అను. ఇప్పటి మాట వంటిది. తప్పక ఆచరించి తీరాలా ? అనుట.

"వా డంటే మాత్రం అదేం ధర్మశాస్త్రమా ? మనయిష్టం మనది." వా.

**ధర్మసంకటము**

1. ధర్మనిర్ణయములో ఇబ్బంది.

"ఇప్పు డొక ధర్మసంకటం వచ్చి పడింది." వా.

2. క్లిష్టమైన పరిస్థితి.

"పామ్మంటే అన్నకొడుకును తరిమేశాడంటారు. ఉండు అంటే వీ డిల్లంతా ఊడ్చేస్తున్నాడు. ఇ దెక్కడి ధర్మసంకటం వచ్చి పడిందిరా భగవంతుడా అని ఆయన దిగులుపడి కూర్చున్నాడు." వా.

చూ. ధర్మసందేహం.

**ధర్మసందేహం**

ధర్మసంకటం.

"అన్నీ కుదిరాయి గాని వరసా కాదా అని పెద్ద ధర్మసందేహం వచ్చి పడింది." వా.

చూ. ధర్మసంకటము.

**ధర్మసత్రం**

ఉచితంగా భోజనం వసతి కల్పించేచోటు.

తద్వారా వచ్చినది – అతిథులను ఆదరించేయిల్లు.

"వాళ్లిల్లు ధర్మసత్రం. వచ్చినవా రందరికీ భోజనాలు అమరవలసిందే ?" వా.

**ధర్మసత్రపు బ్రాహ్మణుడు**

తిరిపపుతిండికై ధర్మసత్రముల వెంబడి తిరుగుబ్రాహ్మణుడు.

"అన విని తత్పదయుగళం,బునఁ బడి నీ ధర్మసత్రపుం బ్రాహ్మణునిన్." శుక. 1.450.

**ధళధళలు**

ప్రకాశం; తళతళలు.

**ధళుధళుక్కు–**

తళతళ.

"ధళుధళుక్కున నింగి దాటించెఁ బలు బోఱు, నీరాళ్ళగొందిఁ గన్నియ మెఱుంగు." పాండు. 4.21.

**ధాం ధూం చేయు**

జబర్దస్తీ చేయు. క్రొత్త. 26.

ధాతుకప్పడము

గైరికాది ధాతువులతో కప్పుట.

"గుగ్గులంబు, భావించి ధాతుకప్పడమునఁ గప్పి."

పండితా. ప్రథ. పురా. పుట. 375.

ధారగొను

దానము పుచ్చుకొను.

దానం ధారాపూర్వకంగా ఇచ్చుటపై ఏర్పడినది.

"ఇప్పు డేను దీని నీ, జనపతిచేత ధారగొని."

భాగ. 10. ఉత్త. 469.

ధారవోయించు

దానము చేయించు.

"దేవబ్రాహ్మణ భూములు, భూవరునకుఁ జెప్పి ధారవోయించె భళీ."

భీమ. 1.63.

చూ. ధారవోయు.

ధారవోయు

దాన మిచ్చు.

మంత్రపూర్వకంగా దానం చేయడంలో నీళ్లు చేతిమీదుగా వదలుట సంప్రదాయం కనక దానిద్వారా ఏర్పడిన పలుకుబడి. 'ధారాదత్తము చేయు' ఇలాంటిదే. కడకు నీళ్లు వదలుటే ఆవస్తువు తనది కా దనుటకు ప్రత్యామ్నాయమై నీళ్లు వదలుకొను అనుపలుకుబడి కూడా యేర్పడింది.

"యమనందనుఁ డర్మిలి ధారవోసెఁ దత్క్రతుఫలము." జైమి. 8.196.

"తపసులకు భక్తి నన్నంబు ధారవోసె." కాశీ. 7.186.

"ఆత్మేశున్ సురానోకహా, న్వీతుంగాఁ దగ ధారవోసి ద్విజుఁ డేయే యర్థముల్ వేఁడినన్." పారి. 5.61.

"సంపత్కూటాత్మలక్షణకన్య నలరించి, దనుజారి కెవ్వాఁడు ధారవోసె."

శుక. 1.194.

ధారాదత్తము చేయు

దానము చేయు.

"ఉన్న ఆస్తంతా వానికి ధారాదత్తం చేశావు. ముసలితనంలో ఏం చేస్తావు?" వా.

ధారాపాతంగా (కురియు)

జోరున వాన కురియు.

"పొద్దునుంచీ వాన ధారాపాతంగా కురుస్తున్నది." వా.

ధారాళంగా

పూర్తిగా, పుష్కలంగా—ఇత్యాదిచ్ఛాయలలో.

"సేరుబియ్యం ముగ్గురికి ధారాళంగా సరిపోతుంది." వా.

"మీ కేం? మూడుపూటలు ధారాళంగా తినవచ్చు." వా.

"వాడు నూరుపద్యాలు ధారాళంగా చెప్తాడు." వా.

ఇత్యాదులు.

ధాళధళ్యము

తళతళ.

ధిం ధిం ధిక్కు ధిమిక్కు
తాళధ్వని. మర్దలాదుల ధ్వనికీ అనుకరణము.

ధింధిమి
పైదాని వంటిదే.

ధిగధిగ
శ్రీరం. మా. 4.69.
చూ. ధగధగ.

ధిగద్ధిగ
వసు. 5. 3.
చూ. ధిగధిగ.

ధిగుల్లు మను (గుండె)
(గుండె) గుభే లను.
ధ్వన్యనుకరణము.
"వేగ భుజించితి నన విని, తా గుండె ధిగుల్లు మనఁగఁ దలపోసె మదిన్." చెన్న. 1.123.

ధిమిధిమి
ధ్వన్యనుకరణము.

ధిమ్మను
ధ్వన్యనుకరణము.
వి. పు. 1. 74.

ధిస్సున పడగ యెత్తు
ధ్వన్యనుకరణము.
పాము పడగ యెత్తుటలో వచ్చు ధ్వని.
"అబ్ధిపేరిటి కుండలి తాంగ భోగి, ధిస్సనం దనపడగ యెత్తెనో యనంగ." కళా. 4.202.

ధుమధుమ లాడు
కోపించు.
కొత్త. 53.

ధూపటము
దుప్పటి.
ధూమరూప మైన పటము అని ప్రకరణరీత్యా టీకాకారులూ టిప్పణి వ్రాసినవారూ చెప్పిన అర్థం. దుప్పటి సరిపోతుంది.
"పలుమఱుఁ దారకుండు సురపాల పురంబులు గాల్చుధూమపం,క్తులు పయిఁ గప్పుచున్నఁ జెనుధూపట మై పొగ సోకి కందె..." కుమా. 4.15.
ఇక్కడ ధూమం వేత్తే ఉండనే ఉన్నది మఱి!

ధూమపానము
పొగ త్రాగుట.

ధూళి గలుపు
నేలపాలు చేయు.
"ఇవి దూఱి తూనిపో నింత యేమిటి కంచు, దుర్గమారణ్యముల్ ధూళిఁ గలిపి." రామాభ్యు. 7.34.
చూ. ధూళి గలియు.

ధూళిదర్శనము
వచ్చు సూచన.
"ధూళిదర్శన మే మైన దొరకదయ్యె." నిరంకు. 2.123.
దేవుని మెరవణి జరుగుతున్నప్పుడు దేవు డక్కడ బయలుదేరినాడు అనుటకు 'ధూళి

దర్శనం అయింది' అనుట అల వాటు. దేవునిదర్శనం చేసు కోకనే 'దూరంనుండి ధూళి దర్శనం చేసుకుని వచ్చి నాము' అనుట అలవాటు. సహజంగానే ఊరేగింపు జన సమ్మర్దంగా ఉంటుంది. అది బయలుదేరునప్పుడు దూరా నికే దుమ్ము లేచి కనబడుట సహజము. సేనావాహిని బయలుదేరు విషయంలో ఈ 'ధూళిదర్శనం' సంస్కృత కావ్యాలలో అభివర్ణిత మయింది. దానిపై వచ్చిన పలుకుబడి.

## ధృతి చెడు

ధైర్యము కోలుపోవు.

"అరగయ్యంబున దివిజులు, దిరుగుడు వడి రింకమీఁద ధృతి చెడి తిరుగుం, బురుహూతుఁ డనుచు."

ఉ. హరి. 1.21.

## ధే యను

ధ్వన్యనుకరణము.

"హయము నదల్చి ధే యనుచు నాజికిఁ దోలుట యొండు దోఁచె..."

కళా. 8.64.

## ధైర్యము చేయు

ధైర్యము పూను.

"వాడు ధైర్యం చేసి ఆ పనిలో దిగాడు. లాభం వచ్చింది. ఆ మాత్రం దమ్ములు మనకు లేక పోయాయి." వా.

## ధ్వజ మెత్తు

కత్తి గట్టు.

"మీరు త్రొక్కిళ్లు పడ నేల వారి మీఁద, ధ్వజము నెత్తిరి కొందఱు వైదిక లని."   నందక. 27 పు.

## నంగనాచి

అమాయకురాలుగా పైకి కనిపిస్తూ చాలా ఉపాయ శాలి అయిన స్త్రీ. ఇది దెప్పాటలోనే ఉపయోగించే పలుకుబడి.

"...నిక్కము గాఁగను నాతఁ డేమి యుం, దెలియఁడ సాదుబిడ్డఁ డని నేరుపుమాటలఁ దేలనాడి గా,దిలిసుతు చేతఁ జక్కటులు దిద్దద వెంతటి నంగ నాచివే?"

సారం. 3.56.

"ఇరుగుపొరు గింత వినకుండ నింటి మగఁడు, తెలియకుండఁగఁ బరరతిఁ దేలి నంగ,నాచివలె నుండుఁ గాని యానాతిగుట్టు..."  హంస. 5.220.

చూ. నంగనాచి టుంగుబుఱ్ఱ.

## నంగనాచి టుంగుబుఱ్ఱ

ఎత్తిపొడుపుగా అనుమాట.

జం.

చూ. నంగనాచి; నంగనాచి వంగ ముల్లు.

## నంగనాచి వంగముల్లు

నంగనాచి.

"అదా! నంగనాచి వంగముల్లు." వా.

చూ. నంగనాచి టుంగుబుఱ్ఱ.

## నంగిరోడుతూ మాట్లాడు

నంగినంగిగా మాట్లాడు.

"వాడేమన్నాడో మన కెలా తెలుస్తుంది? నంగిరోడుతూ మాట్లాడుతూంటే." వా.

## నంచుకొను

కూరలు పచ్చళ్లు నంజుకొను. బహు. 4.50.

## నంజికొను

నంచుకొను, తిను. భార. కర్ణ. 2. 109.

## నంజిలి పడు

సంకోచించు, వెనుదీయు.

"రంజిలి తా మును మున్నుగ, నంజిలి పడ కిచ్చేనేని నయముగ వారుం, గొంజక యిత్తురు." కుచేల. 1. 108.

## నంజుకొను

నంజికొను.

## నం దంటే నంది పం దంటే పంది

అతనిదే వేదవాక్కుగా పరిగ్రహిస్తారు అనేపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆ ఊళ్లో ఆ రెడ్డిగారు ఎంత చెప్పితే అంత. నందంటే నంది. పందంటే పంది." వా.

## నందిని పందిని చేయు

మంచిని చెడుగా, చెడును మంచిగా చెప్ప గలుగు.

చూ. తిమ్మిని బమ్మిని చేయు.

## నందిపడగ

జంగములు పెట్టుకునే శిరోవేష్టన భేదం.

"మడపు లేఖయు నందిపడగయుఁ గొనుచు, బడిహారి క్రియఁ బట్టపగలె యేతెంచి." బస. 6.168.

## నంబికొండయ దండనము

సులభము.

"అష్టావధానకష్టావలంబన మల్ల, నంబికొండయ దండనంబు మాకు." నానా. 12.

## నకనక కుడుచు

కృశించు.

"గతిసంభ్రమంబునఁ గరము వడంకుచు, నకనకల్ గుడుచు నెన్నడుము సొబగు." కళా. 4.105.

రూ. నకనక లాడవు - ఇత్యాది.

## నకనక పడు

ఆకలితో బాధపడు.

"కడుపు మహోత్తుథ నకనకం బడ..." ఆటి. 6 ఆ.

"...ఎక్కడ నాహారంబు చేకూఱమింగరం బుదరం బాఁకట నకనకంబడ డిల్లపడి......" నీతిచం. పే. 57. పంక్తి. 11.

## నకనక లాడు

1. ఆకలితో బాధ చెందు.

2. కృశించి ఊగులాడు.

"నకనక లాడు నెన్నడుముపైఁ జికిలి, పికిలి పూదండ తుంపెస లాడుచుండ." ఆ. మ. క. 1.43.

## నకనకలు గుడుచు

చూ. నకనక పడు.

**నకారగుడిగాడు**

నియోగి.

నిరసనగా కొన్నివర్గాలలో అనుమాట.

**నకారప్రయోగము చేయు**

లేదను.

"వా డెప్పుడూ నకారప్రయోగం చేసి యెఱగడు." వా.

**నక్క**

మోసగాడు, జిత్తులమారి.

మన జానపదకథలలో నక్క యెక్కువ జిత్తులమారిగా కనబడుటపై వచ్చినపలుకుబడి.

"వాడా అమ్మా! నక్క. నీలాంటి వాళ్లకు చిక్కుతాడా?' వా.

ఇలాంటిదే గుంటనక్క.

**నక్కకు ద్రాక్షపండ్లు పుల్లన**

దొరకనివస్తువులు చేదు అనే వంటి పలుకుబడి.

"అవును. ఆ ఉద్యోగం ఏం బాగ లే వంటావు ఇప్పుడు. దొరక లేదు కనుక. నక్కకు ద్రాక్షపండ్లు పుల్లన." వా.

ద్రాక్షపండ్లకోసం ఎగిరెగిరి నక్క అవి అందనప్పుడు 'ఈ ద్రాక్షపండ్లు పుల్లన లే' అంటూ పాఱిపోయిన దన్న పాతకథపై యేర్పడిన పలుకుబడి.

**నక్కకొమ్ము**

ఒక వనమూలిక.

"ఒక్క యెఱుకు తేఁడు నక్క కొమ్మును నిచ్చి, గోరజంబు జున్నుఁ జాఱపప్పు...కాను కిచ్చి కరయుగంబు మొగిచి." మను. 4.14.

**నక్క గన్నవా డెల్ల వేటకాడు**

నక్కను చూచినవా డంతా వేటకాడేనా?

ఇది హేళనలో ఉపయోగిస్తారు. పులినో, ఎలుగుబంటినో చంపినవాడు వేటకాడవుతాడు కాని నక్కను చూచినంత మాత్రంతోనే అవుతాడా అని హేళన.

"వసుధ నక్కఁ గన్నవాఁ డెల్ల వేటకాఁ,డనెడువార్త నిక్క మయ్యె ననఁగ." శుక. 1.266.

రూ. నక్కను చూచినవా డెల్లా వేట కాడే.

**నక్కజిత్తులు**

కుయుక్తులు.

బ్రౌన్.

"ఈ నక్కజిత్తులు నాదగ్గఱ పనికి రావు." వా.

**నక్కటక్కులు**

మోసములు, నక్కజిత్తులు.

"నర్మగర్భోక్తులు నక్కటక్కులు వింత,నయగారముల్." పాండు. 3.43.

**నక్కతోక**

తృణవిశేషం.

ప్రబంధ. 200.

**నక్కతోక త్రొక్కి వచ్చు**

కలిసివచ్చు.

ప్రయాణంవల్ల ఫలిత మేర్పడి నప్పుడు అనుమాట.

నక్కతోక తొక్కితే అదృష్టం కలిసి వస్తుంది అని నమ్మకం.

చూ. నక్కను తొక్కి వచ్చు; నక్కను ద్రొక్కు.

**నక్కతోక పొన్న**

నేల పొన్న.

**నక్కతోక బియ్యము**

ధాన్యవిశేషం.

**నక్కదోస**

చిన్నదోస.

ఆం. భా. ద్వి. 71.

**నక్కనడుము తొక్కు**

"మన మీదిన మిక్కడికి నక్కనడుము త్రొక్కి వచ్చినారము."

ధర్మజ. 53 పు. 23 పంక్తి.

చూ. నక్కతోక త్రొక్కి వచ్చు.

**నక్కను తొక్కి వచ్చు**

అదృష్టము కలుగు.

నక్కను చూచినా, త్రొక్కినా అదృష్టము పట్టు నను నమ్మకముపై వచ్చిన పలుకు బడి.

"వా డేదో నక్కను తొక్కి వచ్చిన ట్టున్నాడు. ఎవరికీ ఎంగిలి చేయి విదిలించని శెట్టి దక్షిణ యిచ్చి పంపించాడు." వా.

**నక్కను ద్రొక్కు**

శ్రవ. 3.89.

చూ. నక్కతోక తొక్కు.

**నక్కను పగ్గాన బట్టినయట్లు**

బిగుసుకొను; నిక్కి చూచు.

పగ్గముతో పట్టినప్పుడు నక్క బిఱ్ఱ బిగిసినట్లు అనుట.

"తానున్ నిక్కుచు పెద్దవాఁడు బలెసీతం డిత్తతిన్ నక్కఁ బగ్గానం బట్టిన యట్లు బిఱ్ఱ బిగియంగా."

ఉ. హరి. 4.65.

**నక్కనోట్లో దుమ్ము కొట్టు**

చచ్చేంత పని అయి బతికి బయటపడు.

చచ్చిపోతే నక్కలు పీక్కుని తింటాయి. వాని నోట దుమ్ము కొట్టు టనగా చావక పోవుట. అందుపై వచ్చిన పలుకుబడి.

"ఇక బదక డనుకున్నాం కానీ వాడు నక్కనోట్లో దుమ్ము కొట్టాడు." వా.

రూ. నక్కనోట్లో బెడ్డ కొట్టు, నక్క వాత మన్ను కొట్టు.

**నక్కమోరు**

కుదరని కంతి.

"మందు మా కిది గండమాల మాన్పఁగలం డె, చక్కఁ జేయఁగలండె నక్క మోరు."

రామలిం. 73.

నక్కరేణు

గజనిమ్మ.

నక్కవిరిగి

ఒక చెట్టు.

నక్కవినయము

పైపైకి కనబడే అడకువ. నిజమైన వినయం కాదు, నటన అనుట.

"వాని వన్నీ నక్కవినయాలు. అవి అంతా నిజం అనుకుంటే మనం బోల్తా పడతాము." వా.

నక్కిళ్లపూజ చేయు

తన్ను.

చూ. బడితపూజ చేయు.

నక్కిళ్లు పడు

నోరు పడిపోవు, మాట రాకుండు.

"ధరణీశ రాజులా ధరణిసురులా, యెక్క డనిన వినియు నక్కిళ్లు పడి యున్న, నతనితోడ."

భార. అను. 5.345.

నక్కిళ్లు కఱచు

నోరు ముడుచుకొని పోవు.

"ఆ పలలాశి మస్తాగ్రంబు వ్రేయ, నక్కిళ్లు కఱచుక నలసి యాశిరము, వ్రక్కలై పడ."

వర. రా. యు. పు. 305. పంక్తి. 9.

నక్కిళ్లు విఱగగొట్టు

చితుక తన్ను.

నఖంపచములు

గోరు వెచ్చనివి.

"సహసా నఖంపచ స్తనదత్త పరిరంభము." వసుచరిత్ర.

"స్నానం చేసే నీళ్లు నఖంపచంగా ఉంటే మంచి దని పెద్ద లంటారు."

వా.

నఖక్షతాలు

సంభోగాదులలో ప్రియాప్రియులు భావాతిరేకాన్ని సూచిస్తూ గోళ్లతో గిల్లుకొనుటద్వారా యేర్పడిన రేకలు.

నఖశిఖపర్యంతం

ఎగాదిగా — నిలువెల్ల. కాలిగోటినుండీ తలవరకూ అనుట.

"ఆ క్రొత్తమనిషిని నఖశిఖపర్యంతం తేరిపార చూచినా నా కత డెవరో ఎంతకూ గుర్తుకు రాలేదు." వా.

"వాణ్ణి నఖశిఖపర్యంతం చీల్చి చూచినా కృతజ్ఞత అంటే యేమిటో కనిపించదు." వా.

నఖశిఖవర్ణన చేయు

సమగ్రంగా రూపవర్ణన చేయు.

"ఏయెడ నఖశిఖవర్ణన, సేయంగా నొకరివశమె శేషుఁడు రాధన్, బాయక వేణీసెపం బై, వే యేటికిఁ దెలియ లేక వ్రేలుచు నుండున్."

రాధా. 2.19.

**నగనట్రా**
సొమ్ములు. జం.
రూ. నగానట్రా.

**నగ నాణెము**
సొత్తులు. జం.
"నగనాణెములు చూచినావు గాదె కుబేర, యీ కిరీటము వెల యేమి చేయు." పార్వ. 5.92. పు.

**నగవరి**
పరిహాసకుడు.
"నగవులన విద్య పోఁడిమి, నగుబాటు గఁ జేయ నేర్చునగవరి యంతక౯, నగు మోముతోడ మెల్లన, నగుమొగముల సతులఁ జూచి నగ నేర్చె నృపా." భాగ. 10. పూ. 293.

**నగవుటీగి**
వినోదార్థం ఇచ్చినది.
"మఱపునఁ గొన్న సొమ్మఱిగొన్న లంచంబు, తగనివాఁ డిచ్చిన నగవుటీగి..." విజ్ఞా. ప్రా. 28.

**నగవు పట్టు**
నవ్వులపాలగు.
"నగవు పట్టితిని జిన్నతనంబు ప్రాపించె." రాధా. 3.48.

**నగవు లాడు**
నవ్వు.
"అప్పచు లాడుచుక౯ నగవు లాడుచు బారలు చాఁచి చాఁచి." చంద్రా. 2.6.

**నగళ్ళు**
రాచనగరు.
జమీందారీ ప్రాంతాలలో ఇటీవలిదాకా 'నగళ్ళలో విశేషా లేమిటి' అన్నట్లు వాడుక ఉండినది.
"ఆ బలదేవనాయకుని నగళ్లు, తనకు నిజాలయస్థాన మై యుండ." బస. 2.27.
"నగళ్లలో కొలువు, దొంగలలో ఒడువు." సా.

**నగా నట్ర**
నగలూ నాణ్యాలూ. జం.

**నగుబాటు అగు**
అపహాస్యపాత్ర మగు.
"యజ్ఞభవు కూఁతు రైన యహల్య మొదలు, నేర మొనరించె ననినచో నేర్చి నడువ, నొకరి తర మూనె మగవార లోర్వ వలయుఁ, గానిచో వట్టి నగుబాటు గాదె మీకు." తారా. శశాం. 4.20.

**నగుబాటు తెచ్చు**
అపహాస్యపాత్రత కల్గించు; అవమానము తెచ్చు.
"ఎవ్వరిచేత న్నగుబాటు దేక పర భావజ్ఞుండ వై తమ్ముఁడా!" ఉ. హరి. 2.96.
"కొఱగానివాఁడ నయి రామలలో, నగుఁబాటు దేను నీ కేఁ గలుగంగ." ఉ. హరి. 1.64.

**నగుబాటు వచ్చు**
పరిహాసపాత్ర మగు.
"పరువునకు లోటుతో నగుఁబాటు రాదో." నిరంకు. 2.52.

**నగు సేయు**
అపహసించు.
"వదన సుపత్ర పాతిమిర బంధతఁ గాంచినఁ జిమ్మచీఁకటిం, జదిమెడు

చందమామ నగు సేయక యుండునె?"
కాళింది. 6.77.

## నచ్చికలు బుచ్చికలు చేయు
మాటలతో బేలుపుచ్చు.
"ఇల సామ్ము కర్తలవలె నచ్చికలు బుచ్చికలు చేసి భుజియింపఁ గలరు గాక." చంద్రాం. 3.45.

## నచ్చుకాడు
నచ్చుమనిషి.
బాధకుడని శ. ర.

## నచ్చుకుప్ప
నచ్చుమనిషి.

## నచ్చుగొట్టు
చూ. నచ్చుమనిషి.

## నచ్చుపని
చిదుగుపని.
"ఇంత చిన్న గడియారం విప్పి సరి చేయడం ఒక రోజులో కాదు. ఇది చాలా నచ్చుపని." వా.

## నచ్చు పెట్టు
ఏదీ తేల్చక ఊరికే వేధించు. నసమనిషి, నచ్చుమనిషి అన్నవే వాడుకలో ప్రచురం. అలాగే నస పెడుతున్నాడంటారు — వాడుకలో.

## నచ్చుమనిషి
ఏదీ నిశ్చితంగా తేల్చుకోలేనివాడు; ఏదీ తెమల్చనివాడు.
"వాడు వట్టి నచ్చుమనిషి. వాడికి పని అప్పగిస్తే జన్మలో కాదు." వా.

## నజ్జుగ చేయు
ముద్దగా చేయు.
"త్రిలోకకంటకుండవు గాన నీయొడలు నజ్జుగఁ జేసి కరంగలాంఛనా!" మను. 3.38.

## నజ్జు చేయు
నుగ్గు సేయు.
"రథ్యసారథికేతురథికాంగనిర్దళ, నప్రౌఢిఁ దేరులు నజ్జు చేసి."
మార్కం. 8.104.

## నజ్జునజ్జు లగు
నుగ్గునుగ్గగు; ముద్దముద్దయగు.
"నిలువునఁ గత్తికోఁత లయి నిద్దపు మోములు నజ్జునజ్జులై."
కవిక. 4.181.
రూ. నజ్జుగుజ్జు లగు.

## నటన మిగులు
విలసిల్లు, ప్రకాశించు, ఒప్పు.
"అర్ధంబు కాశీపురాంగణంబునయందు, నానాప్రకారమై నటన మిగులు."
కాశీ. 2.50.

## నట్టకనడిరేయి
అర్ధరాత్రి.
"కట్టి తనమాఱుగా నీ, దిట్టగృహస్తంభమునఁ బ్రతిష్ఠించి నరుల్, మిట్టాడని యా బెడిదపు, నట్టక నడురేయి మబ్బునం జెలి చనియెన్."
వేం. పంచ. 1.259.

## నట్టకనడుము
సరిగ్గా మధ్య.

## నట్టకోతి
ఒక పిల్లల ఆట.

నట్టడవి

అరణ్యమధ్యం.

"నీపాదంబుల్, పట్టుకొనఁగ వచ్చిన మము, నట్టడవిని డించి పోవ నాయమె కృష్ణా!"

భాగ. 10. పూ. 1054.

నట్టనడుము

సరిగ్గా మధ్య.

"మలచపువేణి నట్టనడుమ౯ దెగి చేతికిఁ దున్క చిక్క..."

ఉత్త. రా. 3.123.

నట్టనడురేయి

అర్ధరాత్రి.

విప్ర. 4.65.

నట్టాడు

1. నర్తించు.

భాగ. 9.608.

2. తచ్చాడు.

వాడుక.

నట్టింట దేవళ్లు పెట్టు

దేవపూజలు చేయు.

కొన్ని కులాల యిండ్లలో నట్టింట గోడకు చేపట్టు చేసి అక్కడే పితరులకు పెట్టడం, దేవతలకు పెట్టడం చేస్తుంటారు.

"నట్టింట దేవళ్లు పెట్టెఁ బెట్టిన తిన్నెఁ, గొట్టించి వెసఁ బందిగూడు చేసె."

శుక. 3.50.

నట్టింటి పగవాడు

హితశత్రువు.

"రమకు నట్టింటి పగవాఁడు కమల వైరి."

విజయ. 3.46.

నట్టిల్లు

ఇంటినడుమ; పడసాల.

"వినుతదానంబు లొనరించి యనుఁగుఁ జెలుల, యట్ల నట్టింటఁ బగవారి నాద రించి."

ఉద్భ. 48.

"అయ్యవార్లంగారి నట్టిల్లు." సా.

నట్టుకొట్టు

సంకోచించు.

"పలికిన నాఁగా దన భీ,తిలి యిటు నటు నట్టు కొట్టు తెఱవ తెఱఁగు భూ, తలవిభుఁడు సూచి..."

కళా. 7.197.

నట్టుకొను

నెలకొను.

నట్టు చెందు

ఎండిపోవు.

"ఇట్టి బెట్టగువెట్టకు నట్టుఁ జెంది, జడలఁ జదలేఱుఁ దాలిచెఁ జంద్ర మౌళి."

ధర్మ. 2.76.

నట్టు ద్రొక్కు

నాట్య మాడు.

నట్టుపడు

అడ్డుపడు.

నట్టుపఱచు

అడ్డుపఱచు.

"నట్టడవిలోన నన్నిట్టు నట్టుపఱిచి, గొట్టు మిట్టాడ నేటికి..."

కృష్ణ. శతం. 2.74.

నట్టుపులుగు

నెమలి.

నట్టులు దున్ను

భూమిలోని నట్టూ అదీ బాగా దున్ను.

"పూని వసంతహాలికుఁడు పొంగెడు రాగరసంబుచేఁ గడుఁ, నానుజనాళి మానసపునట్టులు దున్ని మనోజకందళిం, గానఁగఁ జేసి."
చంద్ర. 9.103.

నట్టువకాడు

నటుడు.

నట్టువడు

కష్టపడు.
ఉత్త. హరి. 3.135.

నట్టువపక్కి

నెమలి.

నట్టువాడు

నటుడు.
విజ్ఞా. ప్రా. 116.

నట్టువొజ్జ

నాట్యోపాధ్యాయుడు.

"ఇన్ని తెఱంగుల శ్రమము సేయింతుఁ జతుర, తావిహీనము లైన పాత్రము లైన, నట్టువొజ్జ లైన మెలఁగుదు నగళులందు."
భారి. విరా. 1.242.

నట్టు సేయు

ప్రోది చేయు.

"వజ్రకుట్టిమశోభ వరమౌక్తికస్యంద, నచ్ఛాయకే ప్రొద్దు నట్టు సేయ."
నిరంకు. 1.45.

నట్టెండ

మండుటెండ.

"నట్టెండల్ వెసం గాయు వే, సవులన్." శృం. శాకుం. 2.112.

నట్టేట ముంచు

ఒక వ్యవహారంలో దింపి అందులో చిక్కులు ఎక్కువయినప్పుడు వదలి వేయు.

"నమ్మినరాజును నట్టేట ముంచి."
పల. పు. 111.

"వాడు వద్దో రామచంద్రా! అంటే వినకుండా దావా వేయమన్నాడు. వేశాను. ఈ మూడేళ్లలో నా ఆస్తి అంతా హరించుకు పోయింది. ఇప్పుడేమో వాడు ఇటు తిరిగి చూడడమే మాని వేశాడు. నన్నిలా నట్టేటిలో ముంచుతాడని తెలిస్తే నేను ముందే జాగర్త పడేవాణ్ణి." వా.

నట్టేఱు

నదీమధ్యము.

"నట్టేట దాశకన్యకకు నువ్విళులూరి, జాలిఁ బొందినపరాశరుపిరాలి."
శృం. నైష. 7.151.

నట్బొట్లు

బొట్టు బొట్టుగా పడేనీరు ; నీటిబొట్లు.

"నవమాలికల తేనె నట్బొట్లు పడుచోట, మాణిక్యదీపముల్ మలయుచోట." మను. 3.111.

నడకొండ

నడక గల కొండ.

సజీవపర్వతం – అంటే పర్వతమంత గొప్పగా ఉండుటే గాదు జీవంతో ఉండుట

విశేషం. ఇలాంటివి చాలా ఉన్నవి.

"నడచు నడకొండగమియును బోని గజరాజితో రాజు రథారూఢుం డై."
భార. భీష్మ. 1.130.

## నడకొలకు

నడచు సరస్సు; దిగుకొలకు.
యయా. 3.57.

## నడగొండ

చూ. నడకొండ.

## నడగొట్టు

ఆగు.

నడకను అడ్డగించు అనుటగా ఏర్పడి ఆగుటగా పరిణమించినది.

"పోక నడగొట్టి తేనియు, రాకింతుఁ జుమీ మొగంబు రాచట్టుపయిన్, శ్రీ కాళిక నిందించిన, నీ కింతట నేల పోవు నీచచరిత్రా!" భీమ. 2.153.

## నడగోట

నడచునట్టికోట.

కోటంత గొప్పదీ, అందులో నడచుట విశేషం.

"రంగదుత్తుంగతరంగసంఘాతంబు, నడగోటల తెఱంగు నడుపుచుండ."
ప్రభా. 1.64.

## నడచి యాడు

ప్రవర్తించు – ఉండు.

"ధర్మంబు కాశికాస్థానమధ్యంబున, నాల్గుపాదంబుల నడచి యాడు."
కాశీ. 2.50.

## నడజోదు

కాలిబంటు.

"అడిదంబులఁ బొడిపొడిగా నడుచు నడజోదుభటులును..."
ఉత్త. హరి. 4.229.

## నడతాడి

నడచునట్టి తాటిచెట్టు.

"పొడియును బోడియు నై యిల, నడ తాడిం బోలి..." ప్రబోధ. 3.20.

## నడతెంచు

1. వచ్చు.

"అచ్చరచిలుకలకొలుకు లపుడు, కడలి వెలువడి వచ్చుశృంగార మమరె."
దశా. 2.745.

"ఎలమి దలిర్ప వేయేణ్బూరు లింగములబండ్ల కెలించి నలి వేగమునను, నడ తెంచి చుట్టుమూరుడిగపై విడిసి."
బస. 6.162.

2. పోవు.

"దిగంతభాగములు వగుల్పఁగా నెదురుగా నడతెంచిరి వైరికోటికిన్."
హరి. ఉ. 9.164.

3. తిరుగు,

"భూరిపరాక్రమశాలి భీష్ము నక్కజముగఁ దాఁకి యద్దెస నకంపితులై నడతెంచుశల్యకుం,భజ కురురాజులచ్చెరువుపాటు భయంబును బొందఁ జేయుమీ." భార. భీష్మ. 2.33.

## నడతెగు

అలయు.

"...మందకను దూరంబుగా వచ్చితిమి నడగఁడు నడ తెగ మానిసి మట్ట చిట్టాడని యీ చిట్టడవి నెట్లు చన నేర్తు." శృం. శాకుం. 2.8.

**నడదివియ**

రాచమర్యాదగా పట్టుకొని వెళ్ళు దివిటీ.

"నడదివియలు సేసె నగరికి మాణిక్య, మకుటముల్ పూనినమనుజపతుల." భార. విరా. 5.320.

**నడదీగె**

నడకొండ వంటిదే.

రూ. నడదీవ.

**నడపందిరి**

ప్రయాణకాలమందు రాజాదుల యుపచారమునకై పరిచారకులు మోసికొనుపోవు పందిరి.

బస. 2.162.

**నడపాడు**

నడయాడు, తిరుగు.

"కలహంసకులమందగమనంబు నయమిట్టి, దని చూపుగతి నడపాడఁ దొడఁగ." కుమా. 3.32.

**నడపాడుప్రాయము**

కాళ్లు వచ్చి తిరుగు ప్రాయము.

శైశవం గడచిన బాల్యమనుట.

"నడపాడుప్రాయము నవలుతగలసె, నడర పుత్రుఁడు..." పండితా. ద్వితీ. మహి. పు. 164.

"కూర్చుండు నురమునం జన, నేర్చును విడెంబు సేయ నేర్చును భీతిం, దార్చుచుఁ దప్పటడుగు లాడఁ, గూర్చు జనని చెట్ట పట్టుకొని నడపాడున్." ద్వా. 3.49.

కుమా. 3.32.

**నడపీనుగు**

జీవచ్ఛవము. నిష్ప్రయోజకుడనుట.

"అదె వచ్చె నడపీనుఁ గనుచు నంతంత." గౌ. హరి. ద్వితీ. పం. 507.

**నడపుకొను**

జరుపుకొను, పోషించుకొను.

"అరమరలు లేక మీ యుపాధ్యాయు వలెను, నడపుకొనువార లెవ్వ రున్నారు గనక." విప్ర. 4.65.

**నడబందాలు వేయు**

పోసీకుండా అరికట్టు; బందాలు వేయు.

"అ,ద్దాలన్ మార్కొను చెక్కు లొప్ప నడబందాల్ వేయునో వేల్పుప్రో, యాలా! నీ గను గేసు లిల్లనుచు నిల్లాలంచుఁ గాంక్షింతురే?" త్రిశంకు. అం. 3. పే. 32.

**నడబావి**

దిగుడుబావి.

మెట్లు కట్టి దిగుటకు వీలుగానున్న బావి.

"లోఁతుగా నడబావిలోనఁ గట్టించి." బస. 3.64.

"విమలంబులైనకూపములు నూటికంటెఁ, బరికింప నొక నడబావి మేలు." కృ. శకుం. 3.17.

**నడమంత్రపు కల్మి**

మధ్యే వచ్చిన సంపద.

మధ్యే వచ్చిన సంపద విపరీతంగా తల తిరిగేటట్లు

చేయును అనుపట్ల ఉపయో
గించే పలుకుబడి.

"విజ్జోడీఁగడుఁగ్, క్షితి నటు గాదె
యొక్కొ కరికిన్ నడమంత్రపుఁగల్మి
కల్గినన్." విజ. 1.99.

"అహహా! నడమంతరపుఁ గల్మి కది
నిజంబు." అని. 3.100.

చూ. నడమంత్రపు సిరి.
రూ. నడు......

## నడమంత్రపు సిరి

చూ. నడమంత్రపు కల్మి.

## నడమంత్రము

మధ్యే వచ్చినది.
నిరసనలో ఉపయోగిస్తారు.

"నడమంత్రపు రాజమదంబు మీఱఁ
గన్." రాధా. 5.100.

రూ. నడుమంత్రము.

## నడమామిడి

నడచునట్టి మామిడి — నడ
కొండ వంటిదే.

"కలయఁగఁ గరములఁ జరణంబుల నుర
మున శోణితంబు బోరనఁ దొరఁగం,
దలి రెసఁగిన నడమామిడి, చెలువునఁ
బఱతెంచె భీమసేనుఁ డచటికిన్."
భార. భీష్మ. 3.223.

## నడయాడు

తిరుగు; ఉండు; కదలు.

"మకరంద ఝర సమీరంబుల నడ
యాడుచు." విప్ర. 2.64.

"వచ్చెఁ గద బెడఁద మన కిఁక, నిచ్చట
నడయాడఁ గూడ దెటకేనియు నే,
వచ్చెద రమ్మటు లైనఁగ్, విచ్చలవిడి
నడవవచ్చు వెఱవక మదిలో."
శుక. 3.502.

"నరులు నడయాడుచున్న కిన్నరపతుల్
నడవ." అచ్చ. యు. 248 పు.

## నడికట్టు

కాసె, దట్టీ.

"అరచట్ట మయి కుంకుమాంబువు నడి
కట్టు, చెంగావిమై జిగిఁ జికిలి సేయ."
రా. వి. 3.12.

## నడికట్టు త్రాడు

నడుముకు బిగించే త్రాడు.

"తద్వే, దండము నడికట్టుత్రాళ్లఁ దగ
బంధించెన్." కళా. 8.86.

## నడికలను

యుద్ధమధ్యం.
ఉ. రా. 4.281.

## నడికిరే

అర్ధరాత్రి.
భా. రా. అర. 7.322.

## నడికిరేయి

అర్ధరాత్రి.

"ఈ నడికిరేయి నొంటిమై యింత
దూర, మేమి కార్యంబు మదిఁ గోరి
యేఁగుదెంచితి." హర. 7.123.

## నడిగండి

యోని.

"తొడపల్చ నగునింతి నడిగండి కడుఁ
బెద్ద,రిక్తుని మనసు కోరికలు పెద్ద."
వేణు. శ. 20.

## నడితల

శిరోమధ్యం.
భాగ. 10. ఉ. 736.

## నడినెత్తిన కండ్లు వచ్చు

పొగ రెక్కిన దనుట.

"వాడికి కాస్త ఆస్తి చేరగానే నడి నెత్తిన కండ్లు వచ్చాయి." వా.

నడిప్రాత

బాగా పాత, కాస్త పాత.

'ఆ నడిపాతబట్ట వాడికి పార వెయ్యవే' అని వాడుక.

అడిపాత అను పాఠంకన్నా ఇదే సరి.

"కట్టిన నడిప్రాఁత కచ్చడంబులును, జింపిగోడుగులు..."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 315.

నడిప్రొద్దు

మధ్యాహ్నం.

రామా. 1.133.

నడిమికట్టు

నడుముకు కట్టుకునే కట్టు.

"కటి మండలంబునఁ గరకంచు పుట్టంబు, మడచి కట్టిన మేలి నడిమి కట్టు." హర. 2.93.

నడిమిలోకము

భూలోకం.

శృం. నైష. 3.8.

నడిరాతిరి

అర్ధరాత్రి.

నడిరేయి

అర్ధరాత్రి.

శృం. నైష. 8.79.

నడివీధి కెక్కు

అందరి యెదుటా పడు.

"వాళ్లంతా గుట్టుగా సంసారం చేసుకొనేవారు. ఆ కొత్తకోడలు వచ్చాక నడివీధి కెక్కారు." వా.

నడివీధి పెసర

తాళ్ల. సం. 11.3. భా. 125.

చూ. తెరవుపెసర.

నడివ్రేలు

నడిమివ్రేలు.

నడుం వాల్చు

విశ్రాంతి తీసుకొను.

"కాస్త నడుం వాలుద్దామంటే తీరిక లేకుండా ఉంది." వా.

నడుం విఱుగు

పని యెక్కువగా ఉన్నదనుట. శ్రమించు.

"వాడు నడుం విఱిగేటట్టు పని చేస్తాడు." వా.

"తద్దినం అంతా ముగిసేసరికి నా నడుం విరిగి పోయింది." వా.

నడుకబడు

నశించు.

ఘటికా. 2.65.

నడుకొత్తు

నిర్భయుడగు అని వావిళ్ళ. సరిగా ఉన్నట్లు లేదు. ఇంకనూ విచార్యము.

"దేవర ముఖ్యులే తెంచిరి వారిలో, నడుఁకొత్త కొంత సైన్యము వధించి..."

జైమి. 2.41.

నడుకొన

మధ్యభాగము.

"నిడు వెడంద జిహ్వ నడుకొనఁ బండులఁ, గఱచి."

భాస్క. యుద్ధ. 1004.

**నడుగడ్డ**
ద్వీపము.
వరాహ. 4.114.

**నడుగుంట**
బ్రహ్మరంధ్రము.
చంద్రా. 2.3.

**నడుచుమర్యాదలు**
పెండ్లిండ్లలో కట్నం కాక ఇతర కానుకలు, లాంఛనాలు వగైరాలు.
"వారింటి పెండ్లికి ఎంత ఖర్చయిందని! కట్న మేమో పదివేలు. నడుచు మర్యాదలకు ఒక అయిదువేలు. ఆడబిడ్డ లాంఛనాలకు రెండువేలు. ఎన్నని చెప్పను?" వా.

**నడుజాము**
అర్ధరాత్రి.
"వారక నడుజాము వచ్చి వేడినను, కోరినధనములు కొండు కొండనుచు."
గౌర. హరి. ఉ. 475 పం.

**నడుతల**
నడినెత్తి.
హరి. పూ. 9.137.
రూ. నడుదల.

**నడుదల**
నడినెత్తి.
రూ. నడుతల.

**నడుదిన్నె**
ద్వీపము.

**నడుదెస**
నడుమ.
"వెలయుఁ బెనుబైలు నిషధా, చల కూటమునందు నడుదెసన్..."
వరాహ. 10.135.

**నడునడు**
ధన్యనుకరణము.
"భండనమున, వారి హేళిచ్ఛత్ర వాహనధ్వజములు, నఱికిన నడునడు నడిఁకి వార, లభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి..."
భార. ద్రో. 2.206.

**నడునీరు**
నీటినడుమ.
"వననిధి నడుమనీటఁ గలము, మునిఁగిన బెగడందుచిత్తములు గలిగిన త,జ్జనులక్రియ నున్నసేనలు..."
భార. ద్రో. 1.26.

**నడునెత్తి**
నడుతల.

**నడుపాడు**
నడుచు.
"నడుపాడ నేర్చిన నవకంపు నునుఁదీగ, మురిపెంబుఁ బూనిన విరులయెత్తు."
కేయూ. 4.30.

**(సఖిగా) నడుపుకొను**
జరుపుకొను.
"ప్రభావతి నన్ను నత్యంత ప్రియ సఖిగా నడపుకొన్నది."
ప్రభా. 4.73.

**నడుమంతరము**
నడుమ; మధ్యకాలము.
వాడుకలో నడ...తోనే అలవాటు.
చూ. నడుమంతరము.

నడుమంత్రము

చూ. నడమంత్రము.

....నడుమ బెట్టిన పూరి గాలు

వాడికీ వీడికీ అసలు పడదు అనుట.

వాడుకలో: 'వాడికీ వీడికీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటుంది.'

అతి విరోధు లనుట.

"దనుజకులవైరి శౌరినందనులు నట్లు, రక్కసులు మనవారు వారలకు మనకుఁ, బొసఁగునే నడుమఁ బెట్టినపూరి గాలు, నేల చిత్రరేఖా! తుది నింత సణుగు." ఉ. హ. 5.159.

నడుము కట్టు (కొను)

ఏ దయినా పనికి సిద్ధపడు.

"ఏదో వాళ్ల మేనమామ నడుము కట్టు కొని నిలబడ్డాడు కనుక ఆ పెండ్లి కాస్తా సవ్యంగా జరిగి పోయింది." వా.

నడుము కొను

నడుము కట్టు.

"కడలుకొను రౌద్రమునఁ గడఁగి సమ రోత్సవము, లెడపడక యుండ నొగి నడుముకొని శక్తిం, దడబడక వేల్చి వడి నడుగు లిడు వేగమున." భా. రా. యు. 1843.

నడుము దాకు

ఎదురొ్కను.

"నల్లచీమలబారు నడుము దాఁకిన వీఁక, నున్న దీ చెలువంపుఁగన్నెయారు." విజ. 2.106.

నడుము ద్రొక్కు

నడుములు విఱుగ గొట్టు.

"పాదము ప్రాయంబు శకనంబు నడుము ద్రొక్కె, వెడలు బాల్యంబు జడిసిన నడుము ద్రొక్కె, నమ్మ ముద్దాడ నడు మీాలె నమ్మ యంచు, నెత్తి ముద్దాడెఁ జెవి చెల్మ నిలకు డించి." కస్థ. 3.65.

నడుము పట్టు

నడుము పిసుకు.

సేవించుటలో కాళ్లు పట్టుట, నడుము పట్టుట ఒక భాగము.

"నడుము పట్టెద నంచు నాథుని చిఱు దొడ, ల్పుడికినఁ జీ యని పొరలు నవల." హంస. 3.200.

"కాస్త నడుం పట్టు." వా.

నడుము పట్టుకొని నిల్చుట

బలహీనతను తెల్పు అంగ భంగిమ.

"నడుముఁ బట్టుక నిల్వఁ బడియుఁ గూర్చుండియు." కా. మా. 3.193.

నడుము పట్టుకొను

నడుము పట్టుకొను.

"ఓశమ్మ! నీకు నడు మేల పట్టు కొనెనే!" హేమా. పు. 80.

నడుము బిగించు

ఏ దయినా పనికి సిద్ధపడు — ముంగబడు.

"నలుగురూ నడుము బిగించి నిలబడితే ఈపని ఎంత ?" వా.

నడుములు నిలవడం లేదు

విపరీత మైన శ్రమ కలిగిన దనుట.

"నాలుగురోజులనుంచీ యీ పెండ్లి గొడవలో సతమత మయి పోయాను. నడుములు నిలవడం లేదు." వా.

నడుములు విఱుగు

కుప్ప కూలి పోవు, ఆశ లుడుగు.

"నడుములు విఱిగ దైన్యంబుతో మెడలు, వడి."

వర. రా. బా. పు. 79. పం. 15.

"చేతి కెదిగిన కొడుకు దేశాంతరం పోవడంతో ముసలాయన నడుములు విరిగా యనుకో." వా.

నడుము వంచి....

శ్రమ కోర్చి...

"వా డెప్పుడూ ఒళ్లు దాచుకొనేవాడు కాడు. నడుము వంచి పని చేస్తాడు." వా.

నడుము వ్రాల్చు

విశ్రాంతి తీసుకొను.

"అన్నం తిన్నాక కాస్త నడుం వాలిస్తేనే కానీ నే నేపనీ చెయ్య లేను." వా.

చూ. నడుం వాల్చు.

నడుము విఱుగ గొట్టు

ఒక తిట్టు.

"నేను చెప్పినమాట వినక పొయ్యావంటే నీ నడుం విరగ గొడతాను." వా.

నడురాతిరి

అర్ధరాత్రి.

వాసిష్ఠ. 2.177.

నడురే

అర్ధరాత్రి.

హరి. పూ. 5.118.

నడురేయి

అర్ధరాత్రి.

"నడురేయి సంధ్యలందును, నడవంగ నోడుదు రశక్తనరులు..."

భార. ఆది. 7.39.

నడులేత

నడిపాత వంటిది.

నడ్కిరేయి

నడిరేయి.

చూ. నడురేయి.

నడ్డిగుంట

నడ్డిక్రింది గుంట.

నడ్డిముక్కు

చప్పిడిముక్కు.

కళ్లదగ్గఱ అణిగిపోయిన ముక్కు.

నడ్డి విఱుగ జేయు

అతిభార మగు.

"పెఱికయే చాలు నానడ్డి విఱుగఁ జేయ."

శుక. 3.403.

నడ్డి విఱుగ దన్ను

నడ్డి విఱుగ వడ్డించు.

చావ దన్ను.

## నత్తికి నత్తు

నత్తివానిని చూచి నత్తిగా మాట్లాడు.

అనుకరించు, వెక్కిరించు.

"దా, నత్తికి నత్తునంత యధమాధ ముండే." పాండ. ప్రవా. 54.

## ననకారు

వసంతం.

శ. ర.

## ననతేనియ

తేనె.

సీలా. 1.56.

## ననసీరు

తేనె.

"ననసీట నుప్పలించెను కళావతి యోరు, జిగిమోవి బీఁటిక లెగయ కుండ." భాను. 2.74.

## నన లెత్తు

1. మొల కెత్తు.

"పడినగింజల ననలెత్తి పండె ధరణి." ఉత్త. రా. 5.318.

2. చిగుర్చు.

"గంధర్వకలకంఠకంతులు స్థాణువుల్, ననలెత్త మధురగానంబు సేయ." దశా. 2.248.

## నన లొత్తు

చిగురొత్తు, వ్యాపించు.

"నవరత్నకాంతులు నన లొత్తె." గౌ. హరి. ప్రథ. పం. 859.

"ఒక్క పిసాళి నవ్వు నన లొత్తఁగ నవ్వెడువాణి." నిరంకు. 1.8.

చూ. ననలెత్తు.

## నను గన్నతల్లి

ప్రేమను తెల్పుమాట.

"ననుఁ గన్నతల్లి! యానతకల్పవల్లి!" హేమా. పు. 2.

## నను చంపుకొన్నట్టు!

ఒక ఒట్టు.

"ను వ్వీరోజు మా యింట్లో భోంచెయ్యకుండా వెళ్లిపొయ్యావంటే నన్ను చంపుకొన్నట్టు." వా.

చూ. నను జంపినట్లే.

## నను జంపినట్లే!

ఏదైనా చేయవద్దని చెప్పుటకు నాయాన, నాతోడు, నామీద ఆన-అన్నట్లే నన్ను చంపినట్లే అనుట అలవాటు. ఈ పని చేయుట సుతరామూ నా కిష్టము లేదని భావము.

"ఇంత యాగడ మేమ,య్యో నొకో నామీఁదానే,ననుఁ జంపితి తెలుపు మన మనం బలరారఁగన్." శుక. 2.72.

చూ. నను చంపుకొన్నట్టు.

## ననుపుమిండలు

ప్రియులు.

"ఏచకోరాక్షుల కింద్రచంద్రజయంత, నలకూబరాదులు ననుపు మిండలు." కాశీ. 3.169.

## ననుపువడు

తగుల్కొను, అనురక్తమగు.

"మార్గాంతరంబులు వెదకుచుం బెక్కు దినంబులు నడుపు వడియును సెడరు గలిగిన నొండొక్కనిం గూడు కొనునది స్వభావగుణంబు." కవిక. 4.120.

## ననుబ్రాయి చూపు

అన్నం ఉడకక పోవు.

"ననుబ్రాయి చూపక, స్వాదుతర మైన చొక్కపుటోదనమ్ము."

సాంబో. 5.295.

నానబాలు పడిన దని వాడుకలో—

## ననుబ్రాయి వడు

నానబాలు పడు.

"బిరుసింత గాక నడిమికి, మురియక ననుఁబ్రాయి వడి నిముడఁబొలక యే, చెరికియును లేక మిక్కిలి, గరగర నగు నేఱుబాల గలమాన్నంబుల్."

జైమి. 5.198.

## నన్నడుము

నడుము మధ్య, నట్టునడుమ.

"నడచురవితేరు మింటి నన్నడుము చక్కి, బ్రగ్గనఁగఁ దాకె వింధ్యపర్వతముచరుల."

కాశీ. 1.132.

## నన్ను చంపకు

నన్ను వేధించ వద్దు.

"చంపకు నన్నుఁ గన్నసిమి."

పాండు. 5.224.

"నీ వెధవకబుర్లతో నన్ను చంపకు. నాకు నిద్ర ముంచుకు వస్తూంది." వా.

## నన్ను మోచి....

నా మూలమున.

"ఇది నిక్క మనుమాట, నన్ను మోచి వచ్చె నాగహార."

పాండు. 2.202.

## నన్బ్రియి

ననుబ్రాయి, ఉడకనిమెతుకు.

రూ. ననుబ్రాయి.

చూ. ననుబ్రాయి వడు.

## న భూతో న భవిష్యతి

అరుదు.

ఇంతకు ముందెన్నడూ లేదు. ఇకపై నుండబోదు అన్న వాచ్యార్థంపై ఏర్పడినది.

"ఇలాంటి గొప్ప పండితుడు ప్రపంచంలో న భూతో న భవిష్యతి." వా.

## నమలి మ్రింగుదా మని ఉండు

అతి కోపంగా ఉండు.

"ఏమిటి బాబూ! నమిలి మింగుదా మని ఉందా?" వా.

వాడుకలో నమిలి అనే విన వస్తుంది.

## నమూ దగు

రికార్డులో కెక్కు.

"ఆ పొలము లెక్కలలో నీ పేర నమూదైనదా?" వా.

## నమ్మించి గొంతుక కోయు

విశ్వాసఘాతుకు డగు.

"అనుకంప లేక బ్రాహ్మణుని నమ్మించి గొంతుక గోసి పోయినదోసకారి."

వరా. 2.186.

## నమ్మికకాపులు

తాను దాచిన వస్తువునకు

ప్రత్యామ్నాయంగా, గుర్తుగా నిచ్చునవి.

"జలరుహామిత్రుఁ డాత్మరుచి సంపదఁ జీఁకటి బందెకానికిం, గలఁగుచు వీని లోన నిడి కైకొనె నమ్మికకాఁపు లంచు." పారి. 2.60.

## నమ్మిక పుట్ట బలుకు

విశ్వాస మేర్పడునట్లు మాట్లాడు, విశ్వాస మేర్పఱచు.

"చింత సేయఁగా, వలవదు నీపయిఁ బ్ వలపువాఁ డని నమ్మిక పుట్ట గట్టిగాఁ, బలికెద నమ్మ." రాజగో. 2.12.

## నమ్మినబంటు

విశ్వాసపాత్రుడు.

"చలము సేయ నాయ మానా చాల నమ్మినబంట గాన."

హేమా. పు. 55.

## నమ్మి నాన బోసుకొను

నమ్మి చెడిపోవు.

"ఈక తోక లేని యీ కృష్ణమాటలు, పాలఁతి నమ్మి నాన బోసుకొనియెఁ, దగిలెనా తగిలెను తప్పెనా తప్పెను, నాతి వెఱ్ఱివాని చేతిరాయి." రాధి.

## నమ్మియుండిన ఫలము

నమ్ముకొని యున్నందుకు ఫలితము.

"నిను నమ్మి యుండిన ఫలం బిదె తోడన కల్గె నాకు నీ,యాన సుమీ!" పారి. 1.125.

## నయంగా....

మెత్తని మాటలతో...

"నయంగా వానిదగ్గఱ ఎలాగో ఆ నాలుగు రాళ్లూ రాల్చుకో. తర్వాత చూద్దాం." వా.

## నయనోత్సవము

కనులపండువు.

"నయనోత్సవం బావహిలం బ్రవేశించి." పారి. 3.41.

## నయానా భయానా

మెల్లగా చెప్పో, బెదిరించో–ఏదో విధంగా.

"నయానా భయానా చెప్పి చూచాను. వాడు వినేట్టు లేదు." వా.

## నరమానవుడు

మనుష్యమాత్రుడు.

"ఆ అడవిలో ఒక్క నరమానవుడు కనిపిస్తాడా?" వా.

## నరము లేని నాలుక

మాట నిలకడ లేని, సత్యవ్రతుడు కాని అనుపట్ల ఉపయోగిస్తారు.

'వాని నాలుకకు నరము లేదు' అను రీతిగా కూడా ప్రయుక్తం అవుతుంది.

## నరు మగు

నలినలి యగు.

"నసికొట్టఁ గోడెచేత నరు మాయెను శిశు వింతయు."

తాళ్ల. సం. 12.238.

## నఱకుడు వడు

ఖండిత మగు.

"నరనాథ మొదలంట నఱుకుడువడిన,
తరువున ట్లొరగినదశకంఠుఁ జూడ."
రంగ. రా. ఉ. 88 పు.

## నఱకు వడు

ఖండిత మగు.

"సాగరము పేరట శైలకులము, తెఱవు
యిచ్చుట చీఁకటి నఱకువడుట..."
ఉత్త. హరి. 2.56.

## నఱిమఱి

విలాసము.

రంగ. రా. ఉ. 300 పు.

## నఱుకాడు

సంహరించు.

"రాజుల కంబు బొఱ్ఱలు తిరిగినఁ గాద
యని మొనలో నఱుకాడవలయు."
వేణు. 57.

## నఱుకుడు వడు

చూ. నఱకుడువడు.

## నఱుకుబియ్యము పడు

నానుబా లగు.

చూ. నను బ్రాయి వడు.

## నఱుకులాడు

నఱుకుకొను.

"వా రంతా నఱుకులాడుకొని
చచ్చిరి." వా.

## నఱుక్కునగా

ధ్వన్యనుకరణము.

చంద్రా. 3.25.

## నఱుమాడు

పొడి చేయు.

"పెఱవార లధికభీతిఁ, విఱిగి చనిరి
భీష్ముఁ డేచి వరరథికుల నం,దఱుఁ జూచి
రాచకొడుకుల, నఱుమాడెడు భీముఁ
డిట్లు నడుఁకం దగునే."
భార. భీష్మ. 2.237.

## నలకా నల్లపూసా

అ దేమంత చిన్నదా?

"అ దేం నలకా నల్లపూసా? కనబడక
పోవడానికి?" వా.

## నలగుడువడు

బాధపడు.

"ఆ యిందుముఖులచేఁ బడి, రాయిడిఁ
బడి నలగుడువడి రావణుఁడు వడిన్."
ఉత్త. రా. 5.221.

## నలగుడు వెట్టు

బాధించు.

"అలయిక నిట్లు ద్రిమ్మరుచు నద్దశ
కంధరుఁ డూర్ధ్వలోకముల్, నలగుడు
వెట్ట నెంచి..." ఉత్త. రా. 5.287.

రూ. నలుగుడు....

## నలతగా ఉండు

అస్వస్థతగా నుండు.

"ఏమిటో అబ్బాయి నలతగా
ఉన్నాడు." వా.

## నలభీమపాకం

ప్రశస్తమైన వంట.

"ఈ రోజు విందుభోజనం నలభీమ
పాకంగా కుదిరింది." వా.

"వాడు వంట చేస్తే నలభీమపాకమే
అనుకో." వా.

నలుడు, భీముడు వంటలో
సుప్రసిద్ధు లనుటపై వచ్చిన
పలుకుబడి.

నలవడు

నలుగుడుపడు.

"మీరు వేగఁ జని యచ్చటి శూరుల వానితోడుతఁ, నలవడఁ జెంది..."

వీర. 4.48.

నలికండ్లపాము

నలికిట్టి, నలికిరి.

నలికిరిపాము

చూ. నలికండ్లపాము.

నలిగి నల్లే రగు

పూర్తిగా చితికి పోవు.

"వాడీమధ్య వరసగా కష్టాలతో నలిగి నల్లే రై పోయాడు." వా.

నలిగులి యగు

నుగ్గునూచ మగు; పాడగు.

"దిక్కులు, నలిగులిగా నతఁడు సింహ నాదము సేసెన్."

భార. భీష్మ. 3.117.

"కలియుగమున ధర్మంబును, నలిగులి యగు నని సుధీజనంబులవాక్యంబుల విందు..." హరి. ఉ. 9.35.

నలిగొట్టు

సన్నమైనది.

నిరసనగా అనుమాట.

గౌర. హరి. ఉత్త. 1876. పం.

నలిగొను

ఊతపదంలా కానవస్తుంది.

తగ. మానుగవలె. ఉత్సాహ పడు అని వావిళ్ళ. ని.

"వలపటిదెసను మా వరభక్తరాజి, నలి గొన సింహాసనస్థులఁ జేసి."

పండితా. వాద. 176 పు.

నలితిండి

చిటితిండి.

నలితిండికాడు

చిటుతిండి తినువాడు, సోమరి.

"సోమరి నలితిండికాడు..."

ఆంధ్ర. భా. కృ. 6.

నలి తొలి లేని

బొక్కులు లేని.

"నలితొలి లేని కందరములఁ వసియించుట." శుకసా. 16.

నలి నజ్జు చేయు

నుగ్గు చేయు.

"గజారుల హృదంతరముల్ నలినజ్జు చేసె." సారం. 1.101.

నలి నలి యగు

నలగి పోవు.

"ఇంతికిఁ, నలినలి యయ్యెఁ గాను జఘనస్థల మెల్లను నజ్జు నజ్జునై."

శుక. 1.304.

నలిపెట్టు

బాధించు.

"విటపాదుల నీవే నలిఁబెట్టుదు, విట పాళుల నీవే నలిపెట్టుదు."

తారా. శశాం. 2.118.

నలిరేగు

విజృంభించు.

"దంతావళంబులు నలిరేఁగి నీ సైన్యంబుల, బడలువడం జేసిన."

భార. భీష్మ. 2.251.

నలిసి పోవు

చచ్చు.

"ఈఁగలు వడ మూఁగు నీడేర నెం తైన, నల్లులు జనియించి నలిసిపోవు."
నీతి. సీ. 58.

నలీ నట్రా
చిన చిన్న కసవు గట్రా. జం. బస. 3.65.

నలు గిడు
నలుగు పెట్టు.
తలకు పోసుకొనునప్పుడు నలుగుపిండితో ఒంటికి పూసిన నూనెజిడ్డు తొలగునట్లు అంగమర్దనము చేయు.
"పలుమఱుఁ దలయంటి తగ న్నలుగిడి." కళా. 6.194.

నలుగు అలదు (పూయు)
నలుగుపిండితో శరీరమును మర్దనము చేయు.
"అలఁదు నలుంగు దేహమున వేణి ఱ్లార్చు." కా.మా. 4.11.
చూ. నలుగు పెట్టు.

నలుగు పెట్టు
నలుగుపిండితో ఒళ్లంతా నలుచు.
"సుగంధవాసితము లగుచూర్ణంబుల నలుఁగుఁ బెట్టె."
ప్రభా. 4.129.
రూ. నలుగు పెట్టు.

నలుగంబాలాట
ఒక పిల్లల ఆట.

నలుతూము
నాల్గు తూములు.
రూ. నల్తూము.

నలుగురిచేత కాదనిపించుకొను
చెడ్డపేరు తెచ్చుకొను.
"ఇంట్లో సామ్మల్ల నెత్తుకొని తొత్తుల పాలు జేసి, నలుగురిచేతా కాదనిపించుకో లేదా!" హేమా. పు. 84.

నలుగురితో నారాయణ
అందరూ పోయిన దారినే మనమూ పోదాము అనేపట్ల ఉపయోగించే పలుకుబడి.
"కలరా వచ్చిందని ఊరంతా వెళ్లిపోతున్నారు. మనం మాత్రం ఎందుకుండాలి? నలుగురితోబాటు నారాయణ." వా.

నలుగురి నోట(ళ్లలో) పడు
దూషణపాత్రుడగు, చెడ్డపేరు తెచ్చుకొను.
"కడు రాగతనపురాగిడి దేరి జగతి నె, ల్లెడల నల్గురినోటఁ బడక యున్న."
వెంక శే. 1.28.
"పశుపతీద్యుం డయ్యుఁ బసులఁ గాచుచు నలు,గురినోళ్లలోఁ బడ్డ గుఱుతు వోవ." శ్రీనివా.
"మన యింట్లో తిని మన యింట్లో ఉండి అనవసరంగా నలుగురి నోళ్లలో పడ్డం నా కిష్టం లేదు." వా.

నలుగురినోళ్ళలో నాను
చెడ్డపేరు తెచ్చుకొను.
"వాడా వెధవపని చేసినప్పటినుంచీ నలుగురి నోళ్లలో నానుతున్నాడు." వా.

నలుగురిలో తలెత్తుకొని తిరుగు
గౌరవముగా బ్రతుకు.

"వాడీమధ్య కాస్త నలుగురిలో తలె త్తుకొని తిరుగుతున్నాడు" వా.

వ్యతిరేకార్థంలో...

"ఆపిల్లమూలంగా వాడు నలుగురిలో తలెత్తుకొని తిరగ లేక పోతున్నాడు. అది మరీ మితి మీరి పోయింది." వా.

## నలుగురు

ఇతరులు – లోకులు.

"నలుగురిలో నిట్లాపని, పలుకఁగఁదగ దైన వెత్తిపట్టినకతనన్." శుక. 3.34.

"నలుగురిలో నగుబాట్లవుతుంది." వా.

"నలుగురూ ఏ మనుకుంటారో ?" వా.

"అతడు నలుగురిలో తిరిగేవాడు. (మర్యాదస్తుడు)." వా.

"నలుగురు నాలుగుమాట లనుకుం టారు." వా.

ఈ నలుగురు, పదుగురు, వేయి, లక్ష మొదలైనవి ఇట్టితావుల ఆ నిర్ణీతసంఖ్యను సూచించవు.

చూ. పదుగురు.

## నలుగు రుండినచోట నిలబెట్టి

పదుగురిలో పెట్టి – పెద్దమను ష్యుల ముందుంచి.

"నలుగు రుండినచోట నిలువఁగాఁ బెట్టి మాటాడఁగాఁ గంటిరా యమ్మ లార !" శుక. 4.42.

"వాణ్ణి పదిమందిలో పెట్టి అడుగు తాను." వా.

"నలుగురిముందూ పెట్టి వాడిసంగ తేదో కనుక్కొంటాను." వా.

## నలుగురూ ఉమ్మేశారు

జననిందకు పాత్ర మయ్యె ననుట.

"వాడా ఛండాలపుపని చేశా డని తెలిసి నలుగురూ ఉమ్మేశారు. దాంతో వాడికి బుద్ధి వస్తేనా ?" వా.

## నలుగురూ నాలుగుదారు లగు

ఛిన్నాభిన్నంగా వెళ్లిపోవు – ఎవరికి వారే అగు.

"ఆ కుటుంబం చితికి పోయింది. నలు గురూ నాలుగుదారు లయ్యారు." వా.

## నలుగురూ నాలుగు మాట లంటారు

ఇతరులతో మాట పడవలసి వస్తుంది అనుట.

"ఈడు వచ్చిన పిల్లను స్వేచ్ఛగా వదిలి వేసే నలుగురూ నాలుగు మాట లంటారు." వా.

## నలుగులు నలుచు

నలుగుపిండితో ఒళ్లంతా రుద్దు.

బస. 3.58.

చూ. నలుగు పెట్టుకొను.

## నలుపెక్కు

నల్లబడు.

"నలుపెక్కుం జనుముక్కులు, తెలు పెక్కుం జెక్కులు." నిరంకు. 1.83.

## నలుమడించు

నాలుగింత లగు.

"ప్రీతి నలుమడింప భీమునిఁ గవల నా, లింగనంబు సేసి..."

భార. విరా. 5.341.

## నలుమడించుకొను

నాలుగింతౌ లగు.

"అస్థి గలిగి హీన మగు జంతు వైనఁ

ద,ద్ద్విగుణవృత్తి వలయు నగుణజంతు, వునకు నలుమడించుకొనునది ... నర మాత్ర, హింస యష్టగుణ కృతిహఁ బాయు." భార. అను. 3.297.

నలువందు

నలువారు.

నలువారు

నలువందు

నలువొందు

ఒప్పు.

"నగుమొగంబులతోడ నలువొందఁ జేరి."

రంగ. రా. బాల. పు. 13. పం. 19.

నలుసాల

చతుశ్శాల.

నిరం. 1.50.

నల్ల చేయు

నల్లపఱుచు.

"నావాలంబు నల్ల సేసితి రేని."

భా. ఆది. 2.34.

నల్లపచ్చని పొడి

భంగాకు పొడి.

"నల్లపచ్చని పొడి మ్రింగి..."

గౌర. హరి. ద్వి. 1393.

నల్లపూ సగు

కంటికి కనబడుట అరుదగు.

"ఏం నాయనా! నీ దర్శనం ఈమధ్య నల్లపూ సై పోయింది." వా.

నల్లపూసలు చెవియాకు నాకు చాలు

ఐదువతనం ఉంటే చాలు. ముత్తైదువ ప్రధానంగా ధరించే వస్తువులు నల్లపూస, చెవి యాకు. పూర్వం చెవులకు తాటాకుచుట్టలు పెట్టుకొనే వారు.

"ఇదియె పదివేలు వైభవం బెల్లనాఁడు, నల్లపూసలు చెవియాకు నాకుఁ జాలు.

శుక. 2.84.

నల్లపూసాదిగా

నల్లపూస మొదలుకొని పూర్తిగా అనుట.

చాలా తక్కువ విలువ కలది నల్లపూస.

"దురా, చారాగ్రేసరుఁ డాధరా సురుఁడు కాంక్షన్ నల్లపూసాదిగా, నారామామణి సొమ్ము నాఁచికొని వేశ్యావాటి కేఁగన్ నృపా!"

నిరం. 2.106.

నల్లపొ ల్లెఱుగని

మచ్చ లేని, నిర్మల మైన.

"నల్లపొ ల్లెఱుఁగని నాకు లం బను మంచి, మడుఁగుఁజీరకుఁ జాల మైల సోఁకె" ఉ. హరి. 5.92.

నల్లప్రజ

కిరాతులు.

"కొమ్ములు మ్రోయ మంటితముకుల్ వెస బోరుకలంగఁ బార్శ్వభా,గమ్ముల నల్ల నల్లప్రజ గ్రమ్మకొనన్ వెస జాగి లంపు మొ,త్తమ్ములు ముంగల న్నడువ దర్ప మెలర్పఁగఁ జెంచుపాళెగాఁ, డ

మ్మను జేంద్రు కొల్వునకు నచ్చెరు
వందఁగ వచ్చెఁ జెచ్చెఱన్."
శుక. 1.244.
ఆము. 6.76.

నల్లమందు
అభిని.
చంద్ర. వి. 2.67.

నల్లమడుగు
మిక్కిలి లోతు గల మడుగు.
శ. ర.

నల్లముసురు (పట్టు)
ముబ్బు పట్టు.
పరమ. 4.290. పు.

నల్లమేక తప్పు చేయు
వ్యభిచరించు.
"బలభేది గౌతము భార్య నహల్యఁ
గా, మించి చేయఁడె నల్లమేక తప్పు."
ప్రబో. 1.50.

నల్లమేకను బలి యిచ్చినా
ఎంత చేసినా, ఏం చేసినా
అనుట.
'నల్ల మేకను బలి యిస్తే దేవ
తలు కోరికలు తీరుస్తా' రన్న
నమ్మకంపై యేర్పడిన పలు
కుబడి. యజ్ఞాలలో నల్ల మేకనే
ఉపయోగించుట కూడా
ఆచారం.
"వాడు నల్లమేకను బలి యిచ్చినా నీ
కో కానీ యివ్వడు." వా.

నల్లలు దీయు
1. దిగదీయు.

"గ్రహంబు వెన్కఁ గను పట్టఁగ
నల్లలు దీసి యంతటన్."
కువల. 4.217.

నల్ల వన్నీ నీళ్ళు తెల్లని వన్నీ పాలు అనుకొనునట్టి
అమాయకుడైన, కల్లా
కపటం ఎఱుగని.

నల్లవో!
బాపురే.
పండితా. ప్రథ. దీక్షా. పుట. 246.

నల్ల సేనపు గుండులు
గట్టిగా, నల్లగా ఉన్న గుండ్లు.
ఒక్క జాతి ఱాయి అని
వావిళ్ళ. సీసం కావచ్చును.
"నల్లసేనపు గుండులు నడచినట్లు, మంపు
గాని యే మెఱుంగక మలసి మలసి."
ఉ. హరి. 4.26.

వాడుకలో:
"వాడు సీసంగుండులాగా ఉన్నాడు."
వా.

నల్లిండ్లు
అగ్రహారములు.
"అనఘుఁడై యెనుబది యెనిమిది
వేవుర బ్రాహ్మణప్రవరుల బ్రహ్మ
విదుల, వెలయఁగ నల్లిండ్ల నిలిపి."
భార. సభా. 2. 121.

నల్లిండ్లు నిల్పు
బ్రాహ్మణాగ్రహారములు
నెలకొల్పు.
"పెల్చ నల్లిండ్లు నిల్పెద నన్న."
విప్ర. 3.15.

నల్లెంట

(నల్లె+వెంట) దాపుల; నాలు గంగుళాల కొంక చోట.

"నల్లెంట నొక్కొక్క నవలత గలదు."

పండితా. ద్వితీ. పర్వ. పు. 477.

చూ. వ్రేలెంట.

నల్లేరుతో నలుగు పెట్టినట్లు

హాస్యంగానే ఎత్తి పొడిచి బాధించుపట్ల ఉపయోగించే పలుకుబడి.

నల్లేరు తాకితే విపరీత మయిన దురద ఆరంభ మవుతుంది.

"వాడిమాట లన్నీ నల్లేరుతో నలుగు పెట్టినట్లుగా ఉంటుంది." వా.

నల్లేరుపై బండినడక

నిరాఘాటము.

"వాడికి పద్యాలు రాయడం అంటే నల్లేరుపై బండినడకే." వా.

నవక మెక్కు

ఒప్పు, సుందర మగు.

"అళికులంబుల కప్పు గలయంతయును బుచ్చి, నారు వోసినభంగి నవక మెక్కి." భార. విరా. 2.52.

నవనవ మను

కోమల మగు.

"నవనవ మనునెమ్మేనులు."

చమ. 3.108.

నవనవ లాడు

కోమల మగు ; కలకల లాడు. ముఖ్యంగా లేతదనమును తెలుపుపలుకుబడి.

"నాఁటికి నాఁటికి నవనవ లాడు, తను వున కొక కొంతతళు కుప్పతిల్ల."

మృ. వి. 1.8.

"వంకాయలు నవనవ లాడుతున్నాయి." వా.

"ఆ అమ్మాయి నాలుగంచులూ తీరి నవనవలాడుతూ ఉంది." వా.

నవనాడులూ క్రుంగి పోవు

నిర్విణ్ణు డగు.

"ఆదుర్వార్త వినేసరికి ఆయన నవ నాడులూ క్రుంగి పోయాయి." వా.

రూ. నవనాడులు పట్టు వదలు.

నవరత్నాలు

తొమ్మిది రకాల రత్నాల వలె విక్రమార్కుని ఆస్థానంలో నున్నా రనుకవులు. వారి పేర్లివి : ధన్వంతరి ; క్షపణకుడు, అమరసింహుడు, శంకరుడు, బేతాళభట్టు, ఘట కర్పరుడు, కాళిదాసు,వరాహ మిహిరుడు, వరరుచి.

విక్రమాదిత్యు డెవ రనీ, ఈ కవుల కాల మిదేనా అనీ చాలా వివాదా లున్నవి.

నవరాత్రులు

తొమ్మిది రోజులు చేసుకునే పండుగలు. దేవీనవరాత్రులు, శ్రీరామ నవరాత్రులు ఇత్యాదులు. రూఢిగా దేవీ నవరాత్రులకు–దసరా–పేరు.

నవశ్రాద్ధము
మరణదినం మొదలు చేసి రోజులలో చేసే శ్రాద్ధం.

నవుడు కొట్టు
చెప్పలేక నాన్చు, చప్పరించు.
"శార్ఙరవుండు, నవుడు కొట్టెను నీళ్లు నమలెఁ గశ్యపుఁడు,"
గౌ. హరి. ప్రథ. పంక్తి 121-22.

నవ్వితే నవరత్నాలు రాలు
ఆ నవ్వు అంత అపురూపమనుపట్ల ఉపయోగిస్తారు. జానపదకథలలో వినవచ్చే మాట.

నవ్వుటాలకు
హాస్యానికి.
"నావుడు నవ్వుటాలకనినం బవనాత్మజ యింత యేటికిఁన్."
భార. ఉద్యో. 3.61.
"నవ్వుటాలకంటే అంత నొచ్చుకుంటా వేమిటే మరదలా?" వా.

నవ్వు నాలుగందాలా నష్టం
అపహాస్యం మంచిది కా దనే పట్ల ఉపయోగించే సలుకుబడి.
"ఎప్పుడూ ఆ యికయికలూ పకపకలూ యేమిటే? 'నవ్వు నాలుగందాల నష్టం' అన్నారు." వా.

నవ్వుపఱచు
నగుబాట్లపాలు చేయు.
"అయుక్తద,ర్పమ్మున నిష్ఠ నవ్వుపఱుపన్ సమకట్టె నితండు విప్రవం,శమ్మునవారి నెల్ల."
భార. ఆది. 7.179.

నవ్వులకు
పరిహాసముగా మాత్రమే అను.
దురుద్దేశ మేదీ లే దనుట.
"కలలోన నైన నవ్వుల కైన నామాట, జవదాట వెఱచునో చంద్రవదన."
పారి. 1.94.
"అనుటయు నవ్వుల కనినన్, మునివర మీ మాట యిట్లమోఘం బగునో."
కళా. 1.168
"ఏదో నవ్వులకంటే అంత కోపం చేసుకుంటా వేఁ?" వా.

నవ్వుల దేలించు
వినోదపెట్టు.
"మొలకనవ్వులఁ దేలించి మోహపెట్టి." హంస. 3.102.

నవ్వులపా లగు
అపహాస్యపాత్రత చెందు.
"నీ వీ ఊళ్లో ఇంత అనాచారంగా ఉన్నావంటే నవ్వులపా లయిపోతావు." వా.
రూ. నగుబాట్ల పాలగు.
నవుబాట్ల పాలగు.

నవ్వులబండి
నవ్వేమనిషి.
శ. ర.

నవ్వుల బెట్టు
హాస్యము చేయు.

"ఇవ్విధ మెల్ల నెచ్చెలుల కేర్పడఁ జెప్పిన దిట్ట కూళ వై, నవ్వులఁ బెట్టి యందఱు వినం గడు నామునఁ ద్రుళ్ళు కొంచు..." రసిక. 4.11.

## నవ్వులబేరము

పరియాచక మాడు, పరిహాస పాత్రము.

"క్షీరవిక్రయపరాభీర నారీకోటి,తోడ నవ్వులబేర మాడువారు." శుక. 3.199.

## నవ్వులాట

పరిహాసము.

"మోదముతో సుభద్ర చెలిముద్దుల గండతలంబునందు సా, మోదని శాక కర్దమము పొందుగ నించెను నవ్వులాటకై, నీదుకపోలభాగమున నిండి తొలంకెడు తేట మిన్నయో, కా దిపు డే నొసంగు నిశికాంతులు మేలో యటన్న కైవడిన్." కాళిందీ. 5.135.

## నవ్వులు పడు

నగుబాట్లపా లగు.

"దీని దగ్గఱ నేల దీని కోడఁగ నేల, పరులచే నవ్వులు పడఁగ నేల." మొల్ల. రా. బాల. 75.

## నవ్వు వచ్చు

నవ్వు కలుగు.

"అంత నిప్పలుకులకు నాకు నవ్వు వచ్చిన నది మన్ముఖప్రతిబింబమునఁ దోఁచినన్..." కళా. 5.46.

## నవ్వు సేయు

అపహసించు; నవ్వుల పాలు సేయు.

"నాచిదేవయ గారి నవ్వు సేసితివో, ఆ చెన్నబసవన్న నవుల బుచ్చితివో." పండితా. ద్వితీ. మహి. పుట. 215.

## నసగూటి

కామోద్రేకము కల.

"పిసవెట్టి కసరెత్తి యెసరేఁగు నసఁ గూటి, పూఁబోండ్లు తమ యిండ్ల పొంత కఱుగ." హంస. 1.137.

## నసగూటితనము

కామోద్రేకము.

"నా, కూరిమి పట్టి నిట్టి నసగూఁటి తనంబున జేలు వెట్టి తా,రార." విప్ర. 4.25.

## నసగూడు

కామోద్రేకము.

"...నసగూఁటన్ జపలస్వభావ లై, నారులు రూపయౌవనమునన్ నిలుపోపక యివ్వలవ్వలన్, జారహితంబు సేయ." నా. పం. 3.23.

## నసగొంటు

కామోద్రిక్తుఁడు.

"కచ్చితం బింత యెటుఁగ దమ్మచ్చె కంటి, కంటి విఖ్యాతి నాలిఁ గైకొంటి వంచు, నచటిజాటులు నసగొంటు లతని వేఁడి, వేడిమీఁదనె దోఁచిరి వెట్టి లేఁచి." బహు. 5.108.

## నసగొట్టు

కామోద్రేకం కలవాడు, నస కలవాడు.

(పిసినిగొట్టులాంటిది.)

"నసగొట్టు బాపనయ్యా, పిసవెట్టికిఁ దగులువడి తపింపఁగ నేలా, బసవెద్దు

గదలకుండెడు, వసతికి రమ్మచటి కేను వచ్చెదఁ బొమ్మి.'' శుక. 2.479.

నసనస

ధ్వన్యనుకరణం.

పార్వ. 4.96.

నసాళానికి అంటు

బాగా తగులు.

గుండెకు తగులు వంటిది.

''ఆవకాయ నోట్లో పెట్టుకో నేసరికి కారం నసాళాని కంటింది.'' వా.

''వాణ్ణి ఒక్కొక్క మాటా నిలదీసి అడిగేసరికి వాడికి నసాళానికి అంటింది.'' వా.

నా అని

నాది అని.

''ఒక్క తెఱ, నా యని యుంచుకొన్న వెరినాయనకన్నను హీనుఁ డున్నె?'' పాణి. 5.40.

నా కర్మ

నా దురదృష్టం.

విచారసమయాల్లో ఉపయోగించే పలుకుబడి.

''ఇదంతా నా కర్మ! ఎవరి ననడమెందుకు!'' వా.

నా కర్మ ఇలా కాలింది!

నా దుర్విధి ఇది!

''నా కర్మ యిలా కాలింది. ఎవరు మాత్రం ఏం చేస్తారు?'' వా.

నాకు చూడగా

నా దృష్టిలో.

సంభాషణలో వచ్చే ఊత పదం వంటిది.

''నాకుం జూడఁగ నీతిక,ళాకలనము లల్పశౌర్యాల తెఱంగులు గాక.'' కళా. 7.248.

''అనినఁ బ్రభావతి యిఁక నే, మని తెల్పుదు నాకుఁ జూడ నగపడి యెన్...'' శుక. 2.255.

''నువ్వు ఎంత న్నా చెప్పు. నాకు చూడగా వాడు వట్టి దొంగ అని అనిపిస్తున్నది.'' వా.

''నాకు చూడగా ఇదే మంత సబబుగా తోచడం లేదు.'' వా.

''నాకు చూడగా వాడు వచ్చేటట్టు లేడు.'' వా.

''నాకు చూడగా దీనికి ఇదే అర్థం అని తోస్తుంది.'' వా.

ఇలాంటివే 'అనుకుంటున్నాను, నా అభిప్రాయం, నా నమ్మకం' ఇత్యాదులు.

నాకు బుద్ధి యేమి?

నే నిప్పు డేమి చేయవలయునో తెల్పుము.

''వైద్యుఁ డప్పుడు గడగడ వడఁకి నాకు, బుద్ధి యే మని పల్క నవ్వువ్వు బోఁడి.'' హంస. 1.252.

నాగదంష్ట్రం

చూ. ౙు.

నాగపడగల దండ

ఒక నగ.

నాగపడగలు

పాముపడగవలె ఉండు చెవి నగ అని.

ఆం. భా. ద్వి.

నాగపసాని

నాగవెలి నడిపే ముత్తైదువ.

నాగపెంజర

ఒక రకమైనపాము.

నాగబంధము

1. చిత్రకవిత్వంలో ఒకభేదం.
2. వస్త్రవిశేషము.
3. మల్లబంధములలో ఒకటి.
4. అభినయహాస్తాలలో ఒకటి.

నాగబెత్తము

మంత్రవేత్తలు పట్టుకునే బెత్తం.

"కరమున నాగబెత్తమును గాత్రము నందును బూది యొప్పఁగా, నరుదుగ జోగురా లొకతె." శశాం. 4.98.

నాగమల్లె

1. ధాన్యవిశేషం.
2. దక్షిణాంధ్ర ప్రాంతంలో చపాతికల్లి. దీనికే నాగజెముడు, నాగదారి లాంటి చాలా పేళ్లున్నవి.

నాగరికము

నాజూకైనది, సున్నితమైనది.

జానపదం. పల్లెలది మోటు, నగరాలకు చెందినది నాజూకు – అని తొలుత ఏర్పడిన మాటలు.

"నాగరికం బగునటన లిం పొనర." పండితా. ప్రథ. వాద. పుట. 705.

నాగవడిగలు

ఒక నగ (?)

"మొనపాట ముత్తె ముంచిన నాగవడిగలు, బిగు వొప్పఁ దొడిగిన బిళ్లచెప్పు, లొనర." రా. వి. 2.44.

నాగవలి నిష్ఠురము

పెండ్లిలో ఆఖరుది నాగవల్లి; నాకబలి.

అంతదాకా ఏమీ తగాదాలు లేకుండా నడిపినా అప్పుడైనా వియ్యంకులు, చుట్టాలు తగాదా పడడం తప్పదు అనుటపై యేర్పడిన పలుకుబడి.

"ఈలువు గల్గుమేనమఱఁదింతయె యాతఁడు సైనదైనదే, లోలత నింక నాగవలి లోపల నిష్ఠుర మేల పల్కెఁగన్." విజ. 3.170.

రూ. నాగవవల్లి...నాగవ్రేలిమి...

నాగవాసము

అంతఃపురజనము.

"ప్రజల్, తో నడువ నాగవాసము,తో నెదురుగ నేఁగిరి. ఆము. 4.34.

నాగవ్రేలిమి

నాగవల్లి.

నాచికొను

వశపఱచుకొను, లాగుకొను.

నిర్వ. 1.41.
పాండు. 5.131.
రామా. 6.219.

**నాచికోలు**

లాగుకొనుట, అపహరించుట.

భార. శల్య. 1.49.

**నాటుకొను**

పాదుకొను, గ్రాహ్యమగు.

"ఆ మాట మనసులో బాగా నాటుకొనేట్టు చెప్పు." వా.

**నాటుకొలుపు**

నాటుకొన జేయు.

**నాటుకొల్పు**

నాటుకొలుపు.

**నాచుబాము**

పసిరికపాము.

"నాలు కనియెడుగుహను నాచుబామొకటి గాని, అమృతపువిషము గ్రక్కుచుండు."

తాళ్ల. సం. 9.137.

**నా చెప్పు సేయు**

నే చెప్పినట్లు చేయుము – నా మాట వినుము.

కుమా. 7.40.

"ఇదో నే చెప్పినట్లు చెయ్. చూతాం తర్వాత." వా.

**నాటక మాడు**

నటించు.

మాటూ. 105.

**నాటకము**

నటన, బూటకము.

"నర్మగర్భోక్తులు నక్కటక్కులు వింత, నయగారములు బహునాటకములు." పాండు. 3.43.

"వాడికేం చేటయింది. కావలసినంత డబ్బుంది. అప్పు చేయడం అంతా నాటకం." వా.

"నా దగ్గఱ యీ నాటకా లన్నీ సాగవు." వా.

**నాటు తీఱు**

మొక్కలు మొదలగునవి బాగా వర్ధిల్లు, ఎదుగు.

"కరిశిర మాడ షణ్ముఖుడుఁ గైపున గ్రేయుడుఁ గుంభమాత్రికో, త్కరమసి ధారఁ బొల్పెసఁగెఁ దారకభంగము సూచి నవ్వుసుం, దరజయకాంత కాంతరత కాంతియొ కాదని నాఁటు దీఱె వి,స్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్."

కుమా. సం 12.182.

**నాటు దేఱు**

పుట్టు.

"ఘనవదనాలవాలమునఁ గ్రమవచస్సుధి నాఁటుదేఱె." కాళిందీ. 1.310.

**నాటు వడు**

దెబ్బ తిను.

"చిరముగ నొల్వ్య వడ్గ నరసింహుని కంఠెను బెద్దవేళ్ శిరం, బురలఁగి నాటువడ్డ జలజోద్భవు కంఠెబ బెద్ద వేళ్." కుమా. 4.76.

**నాడీవ్రణము**

నరంమీది కురుపు.

**నాడునాటికి**

నానాటికి.

కుమా. 8.7

"విని విని నాఁడునాఁటికిని వెఱ్ఱి శిరంబున కెక్కె." పాణి. 1.106.

రూ. నానాటికి.

నాడు నే డనక

ఎల్లప్పుడు.

ఆ రోజూ, ఈ రోజూ అన కుండా.

"నాఁడు నేఁడన కెల్లనాఁడు నే నాఁడు."

పండి. పర్వ. ద్వితీ. పుట. 234.

చూ. అప్పుడూ ఇప్పుడూ అనకుండా; ఎల్లనాడు నే నాడు.

నా తండ్రి యాయెనే

వాత్సల్యం, ప్రేమా సూచించే మాట.

"అనిన నా తండ్రి యాయె నే యనియె." ఆము. 7.50.

నా తరమా?

నాకు సాధ్యమా.

"తారకబ్రహ్మముగా, నిరతి న్వినుతింపఁగ నా,తరమే మిము నభినుతింప దశరథరామా!" కళా. 2.161.

నాతల్లి!

ఆదరపూర్వకమైన సంబోధనము.

"చేత వెన్ను నిమిరి నాతల్లి! నినుఁ గంటిఁ, గా యటంచు నింటికడ వసింప..." ఆము. 7.51.

నాతోడు

చూ. నా సాక్షిగా.

నాతోడు సుమ్మ

నామీద ఒట్టు.

"రంభ యప్పుడ తెలుపనె, నీకు మఱి చెప్ప రాకుంట యీ కథయును, నీకు నాతోడు సు మ్మబ్బ నీకు మనియె." కళా. 1.194.

"నీవు ఈ సంగతి ఎవరికైనా చెప్పావంటే నాతోడు సుమా." వా.

"తప్పకుండా సాయంకాలానికి వస్తాను, నాతోడు." వా.

నాతోలు తీసి చెప్పులు కుట్టిస్తాను

కొంత తక్కువవారు 'ఈ మేలు చేస్తే మీకు ఏమయినా సేవ చేస్తాను' అన్న సందర్భంలో పైవారి నుద్దేశించి అనేమాట. ఇదే 'నా చర్మంబు నీ పాదరక్షలు కావించిన' అనే రూపంలో శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు ప్రహ్లాదచరిత్రలో కనబడుతుంది.

నాథుడు

దిక్కు.

"ఆ యింటికి నాథుడు లేడు. ఎవరి దారి వారిది." వా.

"ఆ నాథుడు కాస్తా పోయేసరికి చెట్టుకొకరూ పుట్టకొకరూ అయిపోయారు." వా.

నాది నే నను

అహంకార మమకారాలకు లోంగు.

చిత్తబోధ. 68.

నాదుకొను

ధ్వని చేయు.

నాదుకొల్పు

పిల్చు, ధ్వనింప జేయు.

రంగా. 3.53.

నానగండ

సిగ్గు మాలినవాడు.

"మచ్చటులాస్త్రఘట్టన మనంబున సెంచక నానగండ యై, వచ్చినవాఁడు చూఁచితివె." పారి. 5.20.

నానబాలు

నానవేసిన బియ్యం, వడపప్పు.

నానబాలు పడు

అన్నము సరిగా ఉడకక ఉచ్చి పచ్చిగా ఉండు.

"నేను మంచినీళ్లకు వెళ్లి వచ్చేసరికి పొయ్యి ఆరిపోయి అన్నం నానబాలు పడింది." వా.

నానా ఖర్చులు

చిల్లరఖర్చులు.

"ఆ మీఁదటన్, నానా ఖర్చులు." నానా. 40.

నానా గడ్డీ కఱచు

అన్ని నీచాలకూ లోబడు.

చూ. గడ్డి కఱచు.

నానా గడ్డీ తినిపించు

నానాబాధలూ పెట్టు.

క్రొత్త. 380.

నానాటికి

రోజురోజుకు, క్రమక్రమంగా.

"ఇది, నానాఁటి కనంతకాంచనంబులు గుఱియున్." వసు. 3.12.

నానించి ఇనుపగుగ్గిళ్లు నమలు

అసాధ్యమునకై ప్రయత్నించు.

"బలిమిని ధ్యానించి మనసు బట్టి దైవము సాధించుట......నానించినుప గుగ్గిళ్ళు నమలుట." తాళ్ల. సం. 6.50.

నానుకోళ్లు

కంఠాభరణం, నాను.

నానుచుట్టు

నాను - కంఠాభరణం.

నానుడి

లోకోక్తి; జనశ్రుతి.

"వింట లేదె యింట గెలిచి రచ్చ గెల్వు మనునానుడి." సార. 2.259.

రూ. నానోడి.

నానుడుబేరం

ఏదీ తెగనీక పోవడం.

"ఈ నానుడుబేరం నాకు సరిపడదు. ఏదో తేల్చాలి." వా.

నానుడువాన

పొడిచినుకులు.

నానుపువాన

బట్టతడుపు వాన.

చిన్నవానే అయినా విడువక చినుకులు పడునప్పు డంటారు.

నా నేర్చుభంగి

నాకు తెలిసినంతవరకూ.

వినయంతో అనుమాట.

కాశీ. 5.4.

నానోడి

చూ. నానుడి.

నాపసాని

నాయకురాలు.

నాగవల్లి నడుపు పెద్ద ముత్తె
దువ.

"వెలయ వియ్యాలంది పీడుకోళ్లు గుడిచి, నరc బువుల్ ముడిచిననాప సాని." కళా. 7.83.

"అప్పుడు నాపసాని చతురశ్రిక మండలి హేమకుంభికల్, ముప్పది మాటc జుట్టు నిడి ముత్తియముల్ ఘటియించి తంతులం, దొప్పగ ......" భల్లాణ. 4.

## నా పాలం గల దేవుడు

నా యిష్టదైవము.

"నాపాలం గల దేవుc డీ కరణి జెంత సన్నివెగా నిన్నుc జే,ర్చె పెక్కండ్లు...." శుక. 3.151.

## నా పాలిటి పారిజాతము

నాపాలిటి కల్పవృక్షము.

అనగా కోరికల నన్నిటినీ తీర్చునది అనుట.

"నాపాలి పారిజాతము, గోపాలకచక్రవర్తిc గొని రా నైతిన్." ఉ. హరి. 2.30.

## నా పాలిటి భాగ్యదేవత

మనోరథములను తీర్చు దైవము.

"మహాత్మ! నిన్ను నా పాలి భాగ్య దేవతగ నమ్మి యుంటి." కళా. 3.59.

## నా బంగారయ్యా

ముద్దుగా ప్రేమగా సంబోధించు మాట.

"నా, మారుగc జూడర నా బం,గారయ్యా నీవు చల్లcగా నుండు మిcకన్," శుక. 2.71.

## నా బంటుకొడుకు

తిట్టు. కుక్కు. 32.

## నాభిలో పుట్టిన పురుగు

అంతరాంతరాలలో అంకురించిన దుర్బుద్ధి.

"అది నాభిలో పుట్టిన పురుగు. అంతటితో యింతటితో పోదు." వా.

## నామం పెట్టు

పంగనామం పెట్టు.

మోసము చేయు.

చూ. పంగనామాలు పెట్టు.

## నామకరణము

పేరు పెట్టే శిశుసంస్కారం.

"ఈ రోజు మా పాప నామకరణం. మీ రంతా రావాలి." వా.

## నామ మడచు

నిర్మూలించు, రూపు మాపు.

"...నారసమున వాని నామ మడcచె." భార. ద్రో. 4.124.

## నామ మణగు

చచ్చు.

భాస్క. రా. అర. 1.263.

## నామాలుగా

నాతో సమానంగా; నాకు బదులుగా.

"నీ మీcదc గడు ప్రేమ నిన్నుc జాల మన్నించు, నామాలు గాcడె యీ నలి నా ప్తసుతుcడు. సుగ్రీ. పు. 37.

"నామాలుగా వీణ్ణి చూసుకో." వా.

## నామాలు పెట్టు

మోసగించు, అతిక్రమించు.

నా. మా. 130.

**నామీద ఒట్టు!**

నా ఆన అనుట.

"నీవు అన్నం తినకుండా వెళ్లావంటే నా మీద ఒట్టు." వా.

"నీ విక్కడనుంచి పోయావంటే నా మీద ఒట్టు." వా.

చూ. నామీదాన.

**నామీదాన!**

నామీద ఒట్టు.

ఈ పని నీవు చేయకూడదని నిషేధిస్తూ అనుమాట.

"నా మీఁదానే, ననుఁ జంపితి తెలుపు మన మనం బలరారఁగ." శుక. 2.72.

చూ. నను చంపినట్లే.

**నాము దిన్నయట్లగు**

నాము తిన్న పశువువలె అగు.

అలాంటి పశువుకు 'ఉంగిడి' రోగం వస్తుందని ప్రతీతి.

"సన్నపుఁ దలయేరున మయి, యన్నుకొనుచు నాము దిన్నయట్లై రాఁగా, ఖిన్నుఁడనై పురి కేఁగితి."

మను. 5.22.

**నాము మేయు**

వెఱ్ఱెత్తు.

"భ్రమసియో యిలఁ గుక్కపాలు త్రాగుటనో, మఱి నాము మేసియో మతి మారినట్టి, యఱవపాఱులమాట లవనీశ! వినకు." బస. 5.

చూ. నాము దిన్నయట్లగు.

**నాములు తీయు**

బల్లి మొదలగువానిపై గీతలు గీయు.

**నాము వారగా**

నాముురోగము వచ్చినట్లు నాలుక పిడుచ గట్టగా.

ఎక్కువగా అనుట.

"నాము వారఁ గల్లలాడి నాలిక గొంత పాపము." తాళ్ల. 9.38.

**నా మెడకు చుట్టుకున్నాడు**

తనమీద పడినాడని నిరసనగా అనుమాట.

"ఎక్కడికి వెళ్లినా వదలకుండా వీడు నా మెడకు చుట్టుకొన్నాడు." వా.

**నా మోసము**

నేను పడినమోసము.

"నా మాట నమ్మి పోయిన, నా మోసముఁ జెప్ప నేల."

కా. మా. 3.163.

**నాయంతటివారు లేరని**

గర్వము తల కెక్కి, అహంభావంతో.

సమానులు లేరని అనుట.

"పతిఁ గూర్చుదాన నా, యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్." పారి. 1.80.

**నాయాన!**

చూ. నాతోడు సుమ్మీ.

**నాయాలు వెట్టు**

పంచాయతీ పెట్టు.

"పాయరాని యట్టివారు బలములు చూపితేను, నాయాలు బెట్టేవాఁడు నాథుఁడా వాఁడు."

తాళ్ల. సం. 3.581.

నాయెదాన పడినాడు

నాపాల పడినా డని నిరసనగా అనుమాట.

'నా యెదను' – వాడుకలో 'యెదాన'గా మారింది.

"నే నేదో గుట్టుగా కాలక్షేపం చేస్తూ ఉంటే వీ డొచ్చి నాయెదాన పడినాడు." వా.

నారదపుకాయ

నారదబ్బకాయ.

కాశీయా. 214.

నారచీరలు

నారతో నేసిన బట్టలు.

"రంగారు బంగారు చెంగావులు ధరించు, శృంగారవతి నారచీర లూనె." ఉత్త. రా. 6.320.

నారజెల్ల

ఒకరకం చేప.

నారపాచు

భయాదికముచే కట్టుబట్ట తొలగు అని వావిళ్ళ. ని. సరిగా కుదురుట లేదు.

"అలంతు లయ్యు కూర్మమ స్తకాదు లైన జోదు ల, బ్బలారి వెన్ను సూపి నార పాచి నాఁడ కాని నేఁ, డలంఘ్యబాణ శక్తిఁ దావకాజిలోన నంచు..." కవ. 2.126.

నారాయణ !

రామ రామ, హరిహరీ వంటిది,

"రా మైనఁ గొంత మేల్ నా,రాయణ ! మీ మనసుకంటె..." కళా. 4.120.

నారికుఱుపు

ఒక విధమైన కుఱుపు.

ఆ కుఱుపులోనుంచి దారం లాంటి క్రిమి వస్తుంది.

నారికేళపాకము

1. కావ్యశైలీభేదం, కఠిన శైలి.

2. కొరుకుడు పడనిది, దుర్గ్రాహ్య మనుట.

"...నారికేళపా,కము గద కామినీ హృదయకావ్యరసగ్రహణంబు నెచ్చెలీ!"

నారి పోయు

ఎక్కుపెట్టు.

"ఈసాయకంబు నారిం బోసి." భాగ. స్క. 10.(ఉ)1085.

నారు పోయు

మొలక పోయు.

"నారు పోయంగ వలయుచో నారు వోయు......" కళా. 4.79.

నారు పోసిన చందాన

వరుసలు వరుసలుగా.

ఎక్కువగా అనుట.

"నారు పోసినచందాన నాటి యుంద్రు." కళా. 5.184.

రూ. నారు పోసినట్లు.

నారు పోసినట్లు

దట్టముగా మొలకలు లేచి నట్లు.

"గుబ్బచన్నుల కెలంకుల నారు వోసిన,
యట్లుప్పతిలుఁ బులకాంకురములు."
కళా. 7.223.
రూ. నారు పోసిన చందాన.

## నారులు వోసినట్లు

మొలకల చాలు తీర్చినట్లు.

"పేరెలమిం దలపడిన వీరుల సారెలం
జీరి నారుల వోసినట్లు చేసియు మెండు
కొని." ఉ. హరి. 6.66.

## నారు వోయు

నాటు.

"నారు వోసితి నరణ్యములు పెక్కు."
శివ. 1.75.

## నాలాయకు

లాయకు కాని, తగని.
హిందూస్థానీ.

## నాలికచేలు

తృణవిశేషం. పశువుల రోగం.

## నాలికను ముక్కంటుకొను

ఒట్టు పెట్టుకొను.

"చూతము నీ నిజ మెల్ల సారిది నేఁ
డందులోనె, ఆ తల నాలికను
ముక్కంటు కొన రాదా."
తాళ్ల. సం. 3.142.

## నాలిగాలి

మందమారుతం.

"అని వనిత నాలిగాలిం గనలుచుఁ
బోనాడి..." వసు. 4.51.

## నాలితనము

1. నైచ్యము, అల్పత.
2. వంచన.
3. మాంద్యము.

"ఇదియ నాకు మీకు నితరేతరద్వేష,
హేతు వనుచుఁ దోఁచె నేకతన్వి,భూతి
నెరపు నేను బుంవ్యక్తులకు నాలి,తన
ముతో సమాఖ్య మనుచు బెట్టు."
రాఘవ. 2.83.

## నాలిదైవము

పాడుదైవము.

"పుణ్యనిధివి నిన్నుఁ బొందొందు
భాగ్యంబు, నాలిదైవ మేల నాకు
నిచ్చు." మల్ల. 3.128.
చూ. పాడుదైవము.

## నాలిబూతము

కుత్సితుడు, కుత్సితురాలు.

## నాలిమాటలు

కపటవచనములు.

"నాలిమాటలు నీ పట్టెనామములును."
విప్ర. 5.55.

## నాలిముచ్చు

దొంగ; కుత్సితుడు.

"తెలివి గలుగువారి కెలన నుండెడు
మీకు, నాలిముచ్చునడక నడక కాదు."
చంద్రాం. 4.59.

"నాలిముచ్చు బహు, కుచ్చితుఁ డెందు
కీవు మముఁ గోరెదు."
పాండ. ప్రవా. 50.

## నాలి యగు

నగుబాట్లగు.

"సతిమోమునకుఁ దమ్మి సరి యంటి
మా భువనంబులో మిగులంగ నాలి
యయ్యె."
చమ. 2.49.

**నాలియాడు**

బంతులాడు, చెండాడు.

"బ్రహ్మాండ మనుచిప్పఁ బ్రాణికందు
కముల, నాలి యాడుదు నొంటి బ్రేలఁ
బట్టి." ప్రభు. 3.38.

**నాలియేడ్పులు**

దొంగయేడ్పులు.

"మాట తబ్బిబ్బునం బుట్టు పొలయలు
కలం దలలు వంచి రోద లేని నాలి
యేడ్పు లేడ్చుప్రియుల ననునయింప."
మను. 3.28.

**నాలుక కఱచుకొను**

పొరబాటు వచ్చిన దని గ్రహించు.

"ఠకీ మని యేదో అన్నాడు కానీ తర
వాత నాలిక కరుచుకొన్నాడు." వా.

**నాలుకకు చేర్చు**

మాటలాడు.

"బొంకు నాలుకకుఁ జేర్పుట కాని
వావి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 235.

**నాలుకకు తెచ్చు**

పలుకు, అను.

"తిర మయి నీవు నాలుకకుఁ దెచ్చిన
మాట గదా వినం దగున్."
భార. కర్ణ. 2.11.

**నాలుక గుంజుకొను**

అయ్యో! పొరపాటు జరిగెనే అని మహా బాధపడు.

"నిన్నా మాట అన్నానే అని వాడు
నాలుక గుంజుకొంటున్నాడు." వా.
చూ. నాలుక పీకుకొను.

**నాలుక తడుపుచు**

జంకుచు.

"ఈవ పతి వై తద్ధర్మ మీ దేర్పుమీ,
యనుపల్కించుక నాలుకన్
దడుపుచుం బ్రాణార్తి దీపింప."
ప్రభా. 5.6.

**నాలుకతుద నుండు**

సర్వదా నోట నాట్యమాడు.

"నాలుకతుదనే యీతఁ డుండఁగా,
నలుగడ నెవ్వరి వెదకేము."
తాళ్ల. సం. 9.82.

**నాలుక త్రుప్పుడుల్ తీఱు**

నాలుక త్రుప్పు వదలునట్లుగా - రుచులు పుట్టగా ననుట.

వర. రా. బా. పుట. 162. పంక్తి. 11.

**నాలుక నువుగింజ నానదు**

నోట మాట దాగదు.

"నాలుక నువుగింజ నానదు నాకు."
గౌర. హరి. ద్వి. 1036.

"నాలుకపయి న్నువుగింజయు నాన
నట్టి బ్లట్టక్కరి నారదుం డతఁడు."
నిరంకు. 4.18.

"వాడి నోట్లో నువుగింజ నానదు."
వా.

చూ. నాలుకపై నువు ...

**నాలుక పిడచ కట్టుకొని పోవు**

ఎక్కువ దాహ మగు.

"ఎండలో వచ్చాను. నాలుక పిడచ
కట్టుకొని పోతూ ఉంది. కాస్త మంచి
నీళ్లు పొయ్యి తల్లీ!" వా.

**నాలుక పీకుకొని పోవు**

ఎక్కువ దాహ మగు.

"పొద్దున్నించీ నాలుక పీక్కొని పోతోంది. ఎండ ప్రొద్దున నడచి వచ్చాను. కాస్త మజ్జిగ ఉంటే యివ్వు తల్లీ!" వా.

## నాలుక పీకుకొను

ఏదో చెడు పేరో, అవమానమో కలిగినపుడు విపరీతంగా బాధపడు.

"వా డేదో అన్నా డని వీడు ఊరికే నాలుక పీక్కొంటున్నాడు." వా.

రూ. నాలుక గుంజుకొను.

## నాలుక పీక్కున్నా....

ఎంత బాధ పడినా.

"నాలుక పీక్కొన్నా వాడు మీ యింటికి రాడు." వా.

"నాలుక పీక్కొన్నా నీకు నేను దమ్మిడీ యివ్వను." వా.

## నాలుక పెఱుకుకొను

మిక్కిలిగా బాధపడు.

"గేలిఁ బడి రిపులు చూడఁగ, నాలుక వెఱికికొనుఁ జావునకుఁ దన్నికొనున్." ఉ. హరి. 4.303.

ఇచ్చట వాచ్యార్థము.

## నాలుకపై నువ్వుగింజ నానదు

రహస్యము నిలువదు.

"నాల్కపై నువ్వుగిం జైన నాననట్టి, యారివేరంపుఁదపసి." చిత్రభాను. 5.45.

రూ. నాలుక నువుగింజ ...

చూ. నోట్లో నువ్వుగింజ నానదు.

## నాలుకబెల్లము

మాటతీపి.

"వికచముఖుఁ డగుచు శాత్రవు,లకు హితు లగునట్టివారలం గని భూపా, లకు డెడ్డకత్తెరయు నా,లుకబెల్లము సైహనంబులుం గనవలయున్." భార. శాంతి. 3.258.

## నాలుకముల్లు

ప్రధానుడు.

కిఱునాలుకవంటివా డనుట.

"మునులలోపల నాలుకముల్లు విఖీగ." ఉ. హరి. 4.102.

## నాలుకముల్లు విఱుచు

మాటలాడకుండ జేయు.

చిఱునాలుక లేకున్నచో మాటలాడ లేరని మన వారి నమ్మకం

కిరునాలుకను కోసి వేస్తే మాటలాడడం అసాధ్యం.

"కాంత నీ పలుకులు గరజాణ చిలుకల, వెదకి నాలుకముల్లు విఱుచుఁ గాక." ఉత్త. హరి. 5.141.

"త్రుళ్లు చిలుకల నాల్కల ముళ్లు విఱుతు." కవిక. 3.110.

## నాలుక యాడు

పలుక గలుగు.

"నావుడు నేమియుం బలుక నాలుక యాడని పాటి యైనధా, త్రీవరకోటి యుండ." ఉ. హరి. 3.8.

నేటిరూపం : నో రాడు.

## నాలుక యెట్లాడెనో

నో రెట్లాడెను ?

'అలా ఎలా అన గలిగావు ?' అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

**నాలుక వెచ్చన**

కటుభాషణు లనుట.

"నొచ్చెనో వీరల హృదయము, లిచ్చట నామీఁద నలిగి యే మని శాపం, బిచ్చె దరో కదా నాలుక, వెచ్చన మును లనను గినుక వేగమ వచ్చుఁగ." శృం. శా. 2.26.

**నాలుక వెళ్ళబెట్టు**

నిరుత్తరు డగు, ఏమీ చెప్ప లేక పోవు.

"నేను నిలదీసి అడిగేసరికి అతడు నాలుక వెళ్ళబెట్టాడు." వా.

**నాలుకా గలగంటా ?**

మాటమీద అంత దృష్టి లేదేమి అనుపట్ల అంటారు.

"నిన్న ఒకమాట, ఈ రోజు ఒకమాట అయితే ఎట్లా? అ దేం నాలుకా గల గంటా?" వా.

చూ. నాలుకా తాటిపట్టా ?

**నాలు కాడు**

నోరాడు.

"మఱుమాట లాడఁగ నాలు కాడక యుండె." భార. స్త్రీ. 1.175.

**నాలుకా తాటిపట్టా ?**

ఎదుటివాడు అబద్ధమాడి నప్పుడు నిరసనగా అను మాట.

"నీ పిల్ల నిస్తా నని మాట యిచ్చావన్నయ్యా! ఇప్పుడు పెళ్ళాంమాట విని ఆటంకాలు చెప్పడం ఏం బాగ లేదు. అ దేం నాలుకా తాటిపట్టా అని నలుగురితో అనిపించుకోవడం నీ కేం బాగు ?" వా.

చూ. నాలుకా గలగంటా ?

**నాలుగంచులూ తీరు**

సమగ్ర మైన అంగసౌష్ఠవ మేర్పడు.

"ఆ అమ్మాయి నాలుగంచులూ తీరి నవ యౌవనంతో విలసిల్లుతున్నది." వా.

**నాలు గంటించు**

దండించు, తన్ను.

"నాలు గంటిస్తే వద్దన్నా వాడే చెబు తాడు." వా.

**నాలుగందాలా**

అన్నివిధాల.

"నవ్వు నాలుగందాలా నష్టం." సా.

"వాడు నాలుగందాలా చెడ్డాడు." వా.

**నాలుగయిదు రోజులు**

కొన్నిరోజులు.

"ఎంతో కాలం ఉండను. నాలుగైదు రోజుల్లో వచ్చేస్తాను." వా.

**నాలుగాకు లెక్కువ చదివిన**

అంతకు మించిన.

"అతనికంటే యితనే నాలుగాకు లెక్కువ చదివినవాడు. వాని మాటలు విని యితను మోసపోతా డనడం అబద్ధం." వా.

**నాలుగు ఉతుకులు ఉతుకు**

తన్ను; దండించు.

"వాడు నాలుగు ఉతుకులు ఉతికి పంపించాడు." వా.

## నాలుగు కాయలు కాయు

సంతానవతి యగు, కడుపు పండు.

"...పరస్థలముఁ ద్రొక్కియుఁ జూచిన యేని నాలు గేణ, గాయలు గాయ వచ్చెలు వగర్భము నం చెట్టువంటి పాపమో!" పంచ. వేం. 1.56 పు.

"అభము శుభము శోభనము నిం పయి కడుపున, నాల్గు కాయలు కాచుట నల్వు రలర." వ్యాఖ్యా. చాటు.

"ఏదో నువ్వొక యింటిదాని పై నీ కడుపున నాలుగుకాయలు కాస్తే చూచి పోదా మని ఉంది తల్లీ!" వా.

## నాలుగు కాలాలపాటు

చిరకాలం.

"దేవాలయం అంటే నాలుగుకాలాల పాటు ఉండ వలసింది. భద్రంగానే కట్టడం మంచిది." వా.

## నాలుగు గడియల దూరం

నాలుగు గడియలలో చేరగల దూరం.

కాశీయా. పు. 3.

## నాలుగు చెప్పు

ఆ కొన్ని చెప్పు.

"తెలిసిన నాలుగూ చెప్పు." వా.

## నాలుగు దారు లగు

చూ. నాలుగు దోవ లగు.

## నాలుగు దోవ లగు

చెడిపోవు, ఛిన్నాభిన్న మగు.

"ఆ కాపురం నాలుగు దోవ లయి పోయింది పాపం!" వా.

## నాలుగు మాట లను

తిట్టు, నిందించు.

"నలుగురూ నాలుగుమాట లంటూ వుంటే ఏమిట్రా ఇది?" వా.

## నాలుగు మెతుకులు

అల్పభోజనము.

'ఆమాత్రం భోజనానికే యేమిటి?' అనుపట్లా, 'ఏదో త్వరగా భోజనం చేసి వస్తాను' అనుపట్లా దీనిని ఉపయోగిస్తారు.

"నువ్వు తినే నాలుగు మెతుకులకూ వంట చేసుకోవాలనా నాయనా!" వా.

"ఇంటికి వెళ్లి నాలుగు మెతుకులు తిని క్షణంలో వచ్చేస్తాను." వా.

## నాలుగురాళ్లు వేస్తే ఏదో ఒక రాయి తగులక పోదు

నాలుగు విధాలుగా ప్రయత్నిస్తే యేదో ఒక ప్రయత్నం ఫలించక పోదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"వాడు ఖాళీ ఉందని తెలిసిన ఉద్యోగాని కల్లా దరఖాస్తు పారేస్తూ ఉంటాడు. నాలుగురాళ్లు వేస్తే ఏదో ఒకరాయి తగలక పోతుందా అని." వా.

## నాలుగురాళ్లు సంపాయించు

ఎంతో కొంత ధనము సంపాదించు.

"ఏదో అవసపడి నాలుగురాళ్లు సంపాయించుకొంటేకాని తరువాత ఎవరు పలకరిస్తారు?" వా.

నాలుగూ దులుపు

నాలుగు మాటలూ అను.

మాటా. 25.

నాలుగూ పెట్టి పంపు

చీకొట్టి పంపించు.

"ఆయన దగ్గరికి వెళ్లి నీ పీ మాట అన్నా వంటే నాలుగూ పెట్టి పంపిస్తాడు." వా.

నాల్కకు నరము లేదు

మాట నిలుకడ లేదు.

"అపలాపించితి నీదునాల్కకు నరం బావంతయుఁ లే దొకో."

గిర. లోకా. 19.

నాలుక వచ్చినప్పు డల్లా నాల్క అని కూడా రా వచ్చును.

నాల్క తడి లేక

నో రెండిపోయి.

"శరీర మవశంబుగా నాల్క నట తడి లేక."

వర. రా. బా. పు. 79. పం. 14.

నాల్కా తాటిపట్టా?

అసత్య మాడుపట్ల అధిక్షేపిస్తూ అనుమాట.

గుంటూ. పూర్వ. పు. 133.

చూ. నాలుకా తాటిపట్టా?

నాల్నాడు చేయు

ఋతుస్నానం చేయు.

నాలుగవ నాడు స్నానం చేస్తారు గనుక...

"కలితకీర్తిశాలి కళ్యపుఁ డొకనాఁడు, మానవతియుఁ జెఱఁగు మాసి యునల, నామతీర్థ వారి నాల్నాడు చేసిన, యతివఁ గాంచి ప్రముదితాత్ముఁ డగుచు."

వరాహ. 4.61.

నాల్నాళ్ళ జలక మాడు

ఋతుస్నానం చేయు.

ముట్టైనాక నాల్నాళ్ళ స్నానం చేయు.

"సవిత్రుఁ డుదయింప నాల్నాళ్ళ జలక మాడి, చూడ కెవ్వారిఁ బురుషునిఁ జూచి కాని."

కాశీ. 2.72.

నా వ్రాత కే మందు?

నా తలవ్రాత యిట్లా ఉంది అనుట.

"నా వ్రాఁత కే మందు?"

పల. పు. 53.

నాశపఱచు

నాశ మొనర్చు.

రామా. 6.97.

నా సాక్షిగా

ప్రమాణపూర్వకంగా అనుట.

"నా సాక్షిగా నేను ఏపాపమూ ఎఱుగను." వా.

చూ. దేవుని సాక్షిగా.

నాసికపై తర్జని యునుచు

ఆశ్చర్యసూచకముగా ముక్కుమీద వ్రేలు వేసికొను, ఆశ్చర్యపడు.

"అన విని నాసికఁ దర్జని, యునిచి కడు శిరంబు ద్రిప్పి యోహో! చిత్రం, బని..." హంస. 2.258.

చూ. ముక్కుమీద వేలు వేసికొను.

నాసిరకం

తగ్గురకం.

కొత్త. 16.

(నా) సొమ్ము తినుటకు మీ రెవ్వరు ?

సామాన్యంగా అధికారం నా దనుకొనేవారు ఇతరులను అధిక్షేపిస్తూ అనేమాట. నేటికీ వినబడుతుంది.

"నా యిల్లిది నాకాఁపుర, మీయెడ నా సొమ్ము దినుట కెవ్వరు మీ రౌ,రా యంచు..." శుక. 3.347.

నాస్తి యను

లే దను.

"నాస్తి యన నొల్ల రందునం గల విప్రుల్." విప్ర. 1.65.

నాహరీగడలు

వాద్యవిశేషము.

ఉ. హరి. 4.113.

నింగితో రాయు

ఎత్తయిన.

కాశీ. 3.103.

నింగి పడు

చీకటి పడు.

(సూర్యాదులు) అస్తమించు అని వావిళ్ళ. ని.

"సీత నట్లుపేక్షు సేసి మిన్నక యున్కి, నఖిలభూతములకు నధిపు నల్క, బట్టపగలు నింగిపడియె నా సేనార, జోంధకార మడల నపుడు కపులు." భాస్క. రా. యు. 24.

నింగి ముట్టు

ఆకాశ మంటు.

"ఆర్పుల్ నింగి ముట్టంగ." కా. మా. 2.54.

నింగులు నాకు

ఆకస మంటు.

నిండబడు

వ్యాపించు.

"నిన్నఁ బెక్కు లగుచు నెక్కుడఁ జూచిన, నడచువారు నడువఁ గడఁగు వారు, విడియువారు మఱియు వీడ్కెత్తు వారునై, నేల యీనినట్లు నిండఁ బడిరి." భాస్క. రా. యు. 284.

నిండారు

నిండయిన.

"నిండారు కల్కు పన్నీటితుంపురు లయ్యె." విప్ర. 3.40.

నిండినయిల్లు

వస్తుసంతతితో, మనుష్యులతో నిండుగా ఉన్నయిల్లు. 'నిండిన యింట్లో అలాంటి అవలక్షణపుమాట లనకు' అని వాడుక.

పండి. పురా. ప్రథమ. 4.94.

రూ. నిండినిల్లు.

నిండి నింపులు వారు.

పొంగి పొరలు.

రాధా. 4.103.

నిండినిల్లు

1. బిడ్డపాప లున్నయిల్లు, సమృద్ధ మైనయిల్లు.

వాడుకలో—ఎవరినైనా అశుభంగా మాట్లాడినప్పుడు 'నిండు యింట్లో అ వేం మాటలు రా' అంటారు.

2. జన మున్నయిల్లు.

"నిండినింటిలోన నీ కేల భీతిల్ల."

హంస. 4.237.

నిండుకడవరీతి నుండు

స్థిమితముగా, నెమ్మదిగా ఉండు.

నిండుకడవలో నీరు తొణకదు.

"నిండుకడవరీతి నుండుఁ దెపుడును గంభీరతకుఁ గలంక దేర నీక..."

కళా. 4.135.

నిండుకుండ

గభీరుడు.

"వాడు నిండుకుండ. వాటికీ వీటికీ కలత పడేరకం కాదు." వా.

నిండుకొను

1. తనివి చెందు.

"నీ లీల లివి యని నిండుకొండే నేను."

తాళ్ల. సం. 11.236.

2. ఖాళీ అగు.

"ఇంట్లో బియ్యం నిండుకున్నవి. బజారుకు వెళ్లి తేవాలి." వా.

3. వ్యాపించు.

"ప్రేతకు నాయాత శీతవిభూతి, నికరంబు నెమ్మేన నిండుకొనఁగ, రుద్రుఁ డే వేళ మెలఁగెడు రౌద్రము గను." దశా. 3.52.

4. అతిశయించు.

"గుండియ జల్లన మదిలో, నిండుకొనిన భీతి." శేష. 2. శ. ర.

నిండుకొలు వగు

సభ తీరు.

శుక. 2.43.

నిండుదొర

ధీరుడు.

"మండిపడి వీనితల గొట్టుం డటు గాని పోయి నావుడుఁ రావణుతో, నిండుదొర తదనుజుం డన, ఘుండు విభీషణుఁడు వలికెఁ గోప మడంగన్."

రామా. 6.237.

నిండుమనిషి

గర్భిణి.

కొన్ని వర్గాలలో విరివిగా ఉపయుక్త మయ్యే పలుకుబడి.

"మొన్ననే మా కోడలు నిండుమనిషి అయింది. శాస్త్ర మంచిదినం చూడండి స్వామీ! పుట్టింటికి పంపించాల."

వా.

**నిండువన్నెలు**
వస్త్రభేదము.
ప్రబంధ. 272.

**నిండువెన్నెల**
పండువెన్నెల
"ఇందుండు హారుమాళి నిం డుండు పెద్ద యై, నెత్తంబు నిండువెన్నెలలు గాయ." ఉ. హరి. 2.161

**నిండుసున్న**
పూజ్యము.
"మాయవంటి, నెలఁతుకలు ముజ్జగంబున నిండుసున్న." బుద్ధ. 1.63.
రూ. గుండుసున్న.

**నింద వచ్చు**
నింద కలుగు.
"సీ, కిట ఘుటియింతు హాత్య తను వేటికి నేఁటికి నింద వచ్చినన్." హంస. 3.240.

**నింపారు**
రూ. నినుపారు.

**నిక్కచ్చి చేయు**
బాకీకి నిర్బంధము చేయు.
"బాకీ ఈరోజే ఫైసల్ చేయాలని నిక్కచ్చి చేస్తున్నా డతను." వా.

**నిక్కపుటాలు**
ధర్మపత్ని.
విజ్ఞా. ప్రా. 107.

**నిక్కపొడుచు**
నిటారుగా నిలబడు.
"వెంట్రుకలు నిక్క పొడుచు కొన్నవి." వా.

**నిక్కము చేయు**
దృఢపఱచు.
"జక్కవలకు రవి యిఁకఁ బ్రాగ్దిక్కు ధరం బెక్కు ననుచుఁ దెలియఁ ద్రివాచన్, నిక్కము చేసినతెఱఁగున, గొక్కొక్కొరుతులఁ గోడి కూయఁ దొడంగెన్." వరాహ. 4.164.

**నిక్కల యగు**
నిజ మగు.
"అకట కల యిట్లు నిక్కల యగునె యనుచు..." మార్కం. 1.263.

**నిక్కవుడు**
నిష్కాపట్యం – కవుడు లేమి.
ఆం. భా. ప్ర. 138.

**నిక్కాక**
వేడి, ఉష్ణము.

**నిక్కి చూచు**
ఏదైనా అడ్డంగా ఉన్నప్పుడు కాళ్లెత్తి తొంగి చూచు.
పైకి తల పెట్టి చూచు.
"ముంగిట జననితో ముచ్చట లాడంగ, నిక్కి చూచితిఁ జూమా టెక్కులాడి." శుక. 3.496.
"...ఏఁగుతఱి నిక్కి కనుంగొని." పాణి. 2.15.

**నిక్కి నీల్గి**
ఆలస్యంగా, అవసర మన్న సంగతిని గుర్తించకుండా.
"వాడు నిక్కి నీల్గి వచ్చేసరికి పుణ్యకాలం కాస్తా దాటి పోతుంది" వా.

నిక్కు నీల్గు
గర్వము. జం.
"వాడికి నిక్కు నీల్గు ఎక్కువ." వా.

నిక్కుబోతు
గర్విష్ఠి.
శ. ర.

నిక్కులబండి
గర్విష్ఠి.
కుక్కు. 40.

నిక్కులాడి
మిటుకులాడి.
కాన్త సౌందర్య గర్వం గలది.
"అంత నొక్క నిక్కులాఁడి యచ్చక్కఁదనాలకుప్ప కిట్లనియె."
కాళిందీ. 6.27.

నిక్షేపంగా
హాయిగా, సుఖంగా.
"దాని కేం? నిక్షేపంగా ఉంది." వా.

నిక్షేపంలాంటి
అమూల్య మయిన, క్షేమ యిన.
"నిక్షేపంలాంటి సంబంధం తెచ్చే భారం నాది. నీ కొడుకును ఊ అనిపించేభారం నీది." వా.

నిక్షేప ముంచినయట్టి వారె తెలియ వలె గాక యొకరికి తెలియ దగునె
ఎవరు చేసినపని వారికే తెలియును. ఇతరుల కెట్లు తెలియును? అనుపట్ల దీనిని ఉపయోగిస్తారు.
'దాచినవారికి తెలుస్తుంది దాపుడు' అనుట.
"అరయ నిక్షేప ముంచినయట్టి వారె, తెలియవలెఁ గాక యొకరికిఁ దెలియఁ దగునె?"
శుక. 1.539.

నిక్షేపము గనిన దరిద్రునివలె
అత్యంత సంతోషంతో,
పెన్నిధి గన్న పేదవలె.
"అతఁడు నిక్షేపముఁ గనిన దరిద్రుని, యేపున ముద మంది దాని కిట్లని పలికెన్."
హంస. 2.46.
చూ. పెన్నిధి గన్న పేదవలె.

నిక్షేపరాయడు
పనికి మాలినవాడు.
"వాడు వట్టి నిక్షేపరాయడు. వాని మాట లెందుకు నమ్ముతావు?" వా.

నిగనిగ
కాంతి.
"చుక్కల నిగనిగ." సారం. 2.223.

నిగనిగని
తళతళ మను.
పాండు. 2.49.

నిగనిగలు గులుకు
మిసమిస లాడు.
"నిగనిగలు గులుకకొప్పును, సొగసుం జెలికనులు దాని సొమ్మై పరఁగున్."
హంస. 1.60.

నిగమగోచరులు
ఒక రక మైనబట్టలు.
"నిండువన్నెలు మంచి నిగమగోచరులు... మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు." ప్రబంధ. 272.

**నిగిడికొను**

ఎత్తగు, లావగు.

నీలుగు ఇత్యాదిఛాయలలో.

"గండంబులు గడచితి మని, గుండియలు నిగిడికొనుచుం జనిరి."

హర. 2.27.

'తడవుకొను' అని వావిళ్ళ.

ని. సరికాదనిపించును.

వాడుకలోనూ ఉన్నమాట యిది.

**నిగుడ జేయు**

పొడవగునట్లు, తద్వారా పెరుగునట్లు, వర్ధిల్లునట్లు — చేయు.

"నే వోసినయగ్ని భంగి నిగుడం జేయుఞా."

భార. ఉద్యో. 2.243.

"నిజశీతలచ్ఛాయ నిగుడఁ జేయ."

పారి. 5.52.

**నిగుడుదెంచు**

నిగుడు.

రామా. 8.207.

**నిగ్గ తీయు**

నిలదీసి అడుగు.

కొత్త. 273.

**నిగ్గుల్ దేఱు**

వన్నెలు దేఱు.

"క్రొంబసుపునిగ్గుల్ దేఱుకాపీనబంధనమున్."

విప్ర. 1.70

**నిగ్గులాడి**

సౌందర్యవతి.

కాళిందీ. 6.15.

**నిగ్గులు చల్లు**

కాంతితో వికసించు.

"మలయు చెక్కుల నవ్వుల నవ్వు మకరకుండలముల, నలర నిగులు చల్లె యాతడు." తాళ్ల. సం. 1. పు. 31.

**నిగ్గులు వాఱు**

ప్రకాశించు.

"దరహాసమనోజ్ఞచంద్రికల్, నిగులు వాఱ." జైమి. 1.110.

**నిచ్చకల్యాణము**

నిత్యకల్యాణము.

"తిరువెంకటేశు కాఁగిటఁ గూడి, లలితాంగి నిచ్చకల్యాణంబు నోమె."

తాళ్ల. సం. 12.127.

**నిచ్చకల్యాణి**

నిత్యకల్యాణముగా వర్ధిల్లునది.

"ఒట్టి నిచ్చకల్యాణి కామోద్రేకము."

తాళ్ల. సం. 10.24.

**నిచ్చచావు**

నిత్యమరణం.

"విను దుర్యోధనదుశ్శా, సనులఁ బలికి......నిచ్చచావుగ నప్పా, వని యలఁచు." భార. శల్య. 1.32.

**నిచ్చ నిచ్చలు**

సదా, ఎల్లప్పుడు, ప్రతిరోజూ.

తారా. శశాం. 47.

"నిచ్చ నిచ్చ వడ్డి నెల నెల వడ్డొడఁ, బాటువడ్డి వడ్డిపైని వడ్డి, యనఁగ నాల్గు తెఱఁగు లయ్యె."

విజ్ఞా. వ్యవ. 66.

నిచ్చెనపంజు

నిశ్రేణికగా ఉన్న దీపపంక్తి.

హంస. 3.28.

నిజమరి

సత్యశీలి.

భోజ. 6.56.

నిజము చేయు

నిరూపించు; ప్రమాణం చేయు.

"ప్రాతికూల్యం బాక పట్టునఁ జేయ ననుచు నిది నాకు నిజము చేసినది..."

ప్రభా. 4.30.

నిజము నిలకడమీద తెలుస్తుంది

అనవసరంగా ఎవరైనా అపవాదు వేసినప్పుడు అను మాట.

నిజము నిష్ఠురము

సత్య మెప్పుడూ కఠోరముగా ఉండును అనుట.

"వాక్రువ్వంగ నిజము నిష్ఠుర మెందున్."

కళా. 3.286.

ఇది వాడుకలో – 'నిజమాడితే నిష్ఠూరం.'

నిజము పట్టు

సత్య మని నమ్ము.

"ఆగమముల్ పురాణముల్, ప్రత్యయమయ్యెనే నిజము పట్టెద రింతియ కాక యేమి కి?"

కాశీ. 6.287.

నిజాలకు

వాస్తవస్థితిలో చూడగా.

"అల నిజాలకు సన్యాసివలె నతండు."

విజయ. 2.137.

నిట్టక నిలుచు

నిటారుగా నిలుచు.

"ఇలు కాలి కూల నిట్టక, నిలిచిన నిట్రాడువోలె."

రామా. 8.132.

నిట్టక నిలువున

నిట్ట నిలువున.

నిలబడినది నిలబడినట్లుగా అనుట.

"నిట్టక నిల్వునం గలఁగి నేత్రయుగంబున బాష్పపూరముల్, దొట్టఁగ..."

భోజ. 3.66.

నిట్టగ్రమ్ము

ఉప్పొంగు.

"చామల నగుమోముఁ జందురుపొడుపున, రాగాంబుధులు నిట్టగ్రమ్మ ననుట."

నృసిం. 2.50.

నిట్టతోలకు

పై కుబుకు.

"నైమిత్తకప్రళయ మైన, నింగిపై నిట్టతోలుకు మున్నీటిలోనఁ, గూలె భూతాళి."

భాగ. 8.717.

నిట్టదొట్టు

వెల్లివిరియు.

పద్మ. 9.231.

నిట్టద్రోచు

ఉప్పొంగు.

"దుగ్ధాంబునిధి నిట్టద్రోచెనో యని శేషుఁ, బాన్పుగా హరి నీటఁ బవ్వళింప."

కుమా. 8.118.

నిట్ట నిలుచు

నిటారుగా నిలబడు.

"మేదినీధర మిబ్భంగి మిన్ను ముట్ట, నిట్ట నిలుచుండి చూచె నిర్నిమిషదృష్టి."
కాశీ. 1.119.

నిట్టనిలువున తల కొట్టించుకొను
పొగరుబోతగు.
పశ్చిమాంధ్రంలో ఎక్కువ అలవాటులో ఉన్న పలుకుబడి.
"వాడు మరీ మితిమీరి పోయాడు. నిట్టనిలువున తల కొట్టించుకొంటాడు." వా.

నిట్టపాటలు
అశాశ్వతములు, క్షణభంగురములు - వ్యుత్పత్తి విచార్యము.
"పేళ్లునుఁ బెంపులు..., జలబుద్బుదంబులు శారదాభ్రములు, జలతరంగములింద్రచాపముల్ నిట్ట,పాటలు..."
పండితా. ద్వితీ. పర్వ. పు. 418.
చూ. జలబుద్బుదములు.

నిట్ట వొడుచు
పొంగు.
"ఇట్టట్టుఁ బట్టు సాలక నిట్ట వొడిచి, మున్నీరు దన్ని నిలిచిన."
భాగ. 6.221.

నిట్టరాడు
నిట్రాడు.

నిట్టలు ద్రోచు
ఉప్పొంగు.
పైకెగయు.
"నిట్టలు ద్రోచుచు సెలలు కలవోర, లెల్లను బిగి యెక్కు యేర్పడంగ."
భార. విరా. 1.245.

నిట్టలు ద్రోయు
అతిశయించు.
"ఆ రమణీలలామ హృదయంబున ... వేడుకలు నిట్టలు ద్రోసెడు వాలుఁ గన్నులక్, వారణ లేక క్రాలె జనవల్లభ సుందరుమేని చెల్వముక్."
కేయూ. 4.5.

నిట్టలు వొడుచు
చూ. నిట్టవొడుచు.

నిట్టుపవాసము
నిట్రుపవాసము, శుష్కోపవాసము.
"వారక నిట్టుపవాస మెన్నాళ్లు శి?"
పండితా. ప్రథ. వాద. పు. 601.
"నిట్టుపవాస మేన్దినము లుండంగ..."
బస. 4.135.
చూ. నిట్టుపాసము.

నిట్టుపాసము
శుష్కోపవాసము.
"నిన్నటినుండి యేము నిఱునీగియు నుంటిమి నిట్టుపాసముల్."
కాశీ. 7.179.
రూ. నిట్టుపవాసము.

నిట్టూర్పు లిచ్చు
నిట్టూర్చు.
దశా. 2.360.

నిట్రపాటు
నిలుచుట, నిక్కి నిలుచుట

నిట్రపాడు
నిక్కి నిలుచు.

నిట్రవొడుచు
నిట్టవొడుచు.

**నిట్రాడువలె నిలుచుండు**

కదలక మెదలక నిలుచుండు. నిట్రాయి, నిలువురాయి, ఏతముమ్రాను నిలుపుట కై నాటినరాయి లేక కొయ్య.

"నిట్టరాడునుబోలె నిలుచుండువాని." గౌర. హరి. ద్వి. 1674.

**నిట్రుపాసము**

నిట్టుపవాసము.

"సతతంబు నిట్రుపాసములతో నత్యుగ్ర,తపముఁ గావించుచుఁ దాన మాడ." వరాహ. 7.73. వాల్మీకి. 2.130.

చూ. నిట్టుపవాసము, నిట్టుపాసము.

**నిడుచను**

సాగు.

"వడి నాడు గఱచి వలకేల్, నిడుచన గనయమునఁ బెనఁచి నీలి బలం బే,ర్పడ..." భార. ఆది. 7.175.

**నిడుదనిదుర**

దీర్ఘనిద్ర, మరణం.

"కాకంబులు నఱవఁగ నిడుదనిదుర, నొలసి తెలుప దిక్కు మాలి యున్నాఁడు గదే." భార. ఆశ్ర. 2.162.

**నిడుపు లేక చిత్రము వ్రాయగల**

అసాధ్యకార్యము లొనర్చగల నెఱజాణ అనుట. రూపం లేకనే చిత్రం వ్రాయగలగడం అసాధ్యం కదా.

క్షమా. 8.135.

**నిడుబాట**

పెద్దబాట, రాచబాట.

"అడరి యాకసమున నిడుబాట నట్ల పొ,ఱుదము రమ్ము జలధిఁ జదల ననిన." భార. కర్ణ. 2.63.

**నిడుముసుగు**

నిండుముసుగు.

"కాళ్ళు కుప్ప వడఁగఁ గదలఁ జాలక యట్టె, నిడు ముసుం గిడి శయనించు చెలువ." దశా. 4.45.

**నిడువాలు**

పొడవైన.

**నిడువెండ్రుక**

రోమాంచము.

ఉత్త. హరి. 6.78.

**నిడువెండ్రుక వెట్టు**

పులకించు.

"విరవిరవోయి మేను నిడువెండ్రుక వెట్టుచుఁ గంప మొందె." భార. భీష్మ. 1.181.

**నిత్తె పెండ్లికొడుకు**

ఎల్లప్పుడూ పెండ్లికొడుకే.

రాధి. 3.18.

**నిత్యకల్యాణము పచ్చతోరణముగా**

అనవరతశుభసౌభాగ్యాలతో వర్ధిల్లుచూ.

"ప్రోలు మిగులఁ గనువిం దొనరించి నిత్యక,ల్యాణము పచ్చతోరణము నై జను లందఱు నుల్లసిల్లఁగాఁ." విజ. 1.83. దశా. 1.2.

నిత్యకొత్తలు

నిత్యనూతనములు.

"నీతితో ఈదేహములే నిత్యకొత్తలు."
తాళ్ల. 8.104.

నిత్యపడి

రోజూ ఏర్పాటు ప్రకారం ఇవ్వవలసినది. దినభత్యం వంటిది.

"బండారి నగరమున నిత్యపడి వేడుకొని వేగ రమ్మ." బస. 3.48.

నిదానస్తుడు

నిబ్బరమైనవాడు, తొందర పడువాడు కాడు.

"అతను చాలా నిదానస్తుడు. ఎవరో చెప్తే కోప్పడతాడా?" వా.

నిదురకు నియ్యకొను

సంగమమునకు సమ్మతించు.

"నిదురకు నియ్యకొనుచు."
సింహా. 4.236.

నిదుర క్రమ్ముకొని వచ్చు

నిదుర ముంచుకొని వచ్చు.

"కని కనుదమ్ములన్ నిదుర గ్రమ్మక రా నిలు సేరి..."
శుక. 1.326.

నిదుర తెలియు

మేలుకొను.

"సాంధ్యరాగలహరి సామి రంజితము లై, తిరిగ మింట నిదుర తెలిసినట్టి, యిందిరాధిపతికి నెత్తుకర్పూరనీ,రాజనంబు లన శరద్ఘనములు."
ఆము. 4.139.

నిదుర పుచ్చు

నిద్ర పోవునట్లు చేయు.
శుక. 1.149.

"పిల్లలను నిద్రపుచ్చి వస్తా నుండమ్మా."
వా.

నిదురపోతు

ఎప్పుడూ నిద్రించే వాడు-తద్వారా సోమరి, బద్ధకస్తుడు కూడ.
భాగ. 9.409.

నిదుర పోవు

నిద్రించు.

"కడుం ద్రిమ్మటచే శ్రమ మొందినారు గాం,బోలును బోదునా నిదుర పోయెదరే యని." కళా. 4.109.
రూ. నిదుర వోవు.

నిదురమంపు

నిద్రమబ్బు.

"నిదురమంపునం బుక్కిట నిలచి మేలు, కాంచి." పారి. 2.64.

నిదుర వోవు

నిద్రించు.

"నిదుర వోవంగ వచ్చి నా యెదుర నిల్చె." నిరంకు. 1.12.

నిద్దుర కాచు

జాగరణము చేయు, నిద్ర పోక యుండు.

"అదమరేయి దాంకం బోల మారసి మారశిలీముఖాహతిన్, నిద్దుర గాచి యున్నమగనిన్." పాండు. 3.71.

నిద్దుర గొను

నిద్రించు.

నిద్దుర పుచ్చు
నిద్ర పుచ్చు.
శుక. 2.98.

నిద్దురపోతు
శ. ర.
చూ. నిదురపోతు.

నిద్దుర పోవు
నిద్ర పోవు.
"వా,ణీవిభుఁ డిప్డు మైమఱచి నిద్దుర పోవఁగఁ జూచి..." దశా. 1.275.

నిద్రకు వచ్చు
నిద్ర పోవుదశకు వచ్చు.
"ఏమిటే! అట్లా యేడుస్తూంది. నిద్రకు వచ్చిం దేమో? ఉయ్యాల్లో వెయ్యి." వా.

నిద్ర చెందు
నిద్రించు.
"సుఖనిద్రం జెంది యున్న." రుక్మాం. 5.2.
రూ. నిద్ర జెందు.

నిద్ర జెందు
1. ప్రమత్తమగు.
2. నిద్ర పోవు.
నా. మా. 14.
రూ. నిద్ర చెందు.

నిద్ర తెలియు
మేల్కొను.
"నీరజేక్షణుఁ డవ్వేళ నిద్ర దెలిసి." ఆము. 4.144.

నిద్ర దేఱు
మేల్కొను.
"నిద్ర దేఱెడు నేత్రనీరజములు." శా. మా. 1.47.

నిద్ర పట్టదు
ఏదో ఒకపని నెఱవేరేవరకూ శాంతి కలుగదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.
"ఎట్లైనను వీనిఁ జంపవలె నప్పుడ నిద్దుర పట్టఁగా వలెన్." దేవీ. 4.515.
"అనుకున్న దేదో అయితే గానీ వానికి నిద్ర పట్టదు." వా.

నిద్రపోతు
భల్లా. 2.38 పు.
చూ. నిదురపోతు.

నిద్ర పోవు
నిద్రించు.

నిద్రమంపు
నిద్రమత్తు.
"తెలివాలు గలడాలు గలసోగకను దోయి, నింపు గుల్కెడునిద్రమంపుఁ జూచి." శుక. 1.315.
చూ. నిదురమంపు.

నిద్రమబ్బు
నిద్రమంపరము.
"పానపాన నిద్రమబ్బునఁ బ్రఫుల్ల సరోజదళాయతాక్షు మెల్లన నృప మోహతాపమున లంపటతోఁ జనె..." హంస. 5.81.
"నిద్రమబ్బులో వాడు నేలమీదనే పడుకున్నాడు." వా.

నిద్రమొగం
తెలివిగలవాడు కా డనుట.
మాటా. 99.

## నిద్ర సుఖ మెఱుగదు

నిద్ర వచ్చినప్పుడు శయ్యా సుఖం అవసరం లే దనుట.

"ఆకలి రుచి యెఱుగదు. నిద్ర సుఖ మెఱుగదు." సా.

## నిద్ర సేయు

1. నిద్రించు.

"నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము, న్నన్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్ర సేయు నీ, కన్ను మొగుడ్చునూఱటకుఁ గారణ మెయ్యది భీమసేన."

భార. విరా. 2.166.

## నిద్రాహారములు లేక

తదేకదీక్షతో.

"నిదురయుఁ గూడుఁ బోఁ జదివి నే నిటఁ గన్నది యేమి?" ఆము. 6.35.

"అతడు నిద్రాహారాలు లేకుండా పని చేస్తున్నాడు." వా.

## నిన్న కుప్ప, నే డాళ్ళు

కుప్ప వేయగనే ధాన్యం ఇంటికి వచ్చునా? కార్యానికి, ఫలితానికి మధ్య వ్యవధి ఉంటుంది. అలా ఇక్కడ కనిపించదే?—అని చెప్పుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నిన్న కుప్పయు నేఁ డాళ్లు నెలఁత తాను, కోరి నామీఁదఁ జేసెనా కారు బారు, ముక్కుపచ్చలు మానక మును పె బిరుదు, పెచ్చుక సెదిర్చి కాట్లాడ వచ్చి నటుల?" రాధి. 3.8.

## నిన్న గాక మొన్న

ఇటీవల.

"నిన్న గాక మొన్న వచ్చింది. అప్పుడే ఇంటిబీగాలు స్వాధీనం చేసుకుంది. గడుసుపిల్లే!" వా.

## నిన్న జరిగినట్టుగా

ఇటీవల జరిగినట్టుగా.

"అప్పుడే ఇరవయేళ్ళయింది నాన్న పోయి. నిన్న జరిగినట్లుగా వుంది పాప పెండ్లి, ఆ రోజు ఆయన ఆనందం." వా.

చూ. నిన్న మొన్న లాగ.

## నిన్న నేటనె

ఇటీవలనే.

పాండు. 5.233.

## నిన్న మొన్నటివాడు

చిన్నవాడు.

"నిన్న మొన్నటివాఁడవు నేఁడు చూడ, నేడ నేర్చితి వీ మాట లీవు కృష్ణ." రాధా. 1.14.

## నిన్నమొన్న లాగ

ఇటీవల జరిగినట్లు.

"వాడు పోయి రెండేండ్లయిందా? నిన్న మొన్నలాగా ఉంది." వా.

నిన్న వలె మొన్న వలె అనుట.

## నిన్నమొన్న వలె

సరికొత్తగా.

"దానానేకప మేఁగుదెంచి శివు మీఁదన్ నిన్న మొన్నంబలెన్, నానా రత్నము లుండఁ జూచి."

కా. మా. 2.120.

ఇటీవలనే (ఉంచినట్లు.)

"అది జరిగి పదేండ్లు అయినా నిన్నా మొన్నా జరిగినట్లు ఉంది." వా.
రూ. నిన్న మొన్నలాగ.

నిన్నా ? మొన్నా ?

అదేం ఇటీవలిదా ? చాలా కాలం మాట !

"నిన్నా మొన్నా ? అప్పుడే అయిదేళ్ళయింది వాని కిచ్చి. ఇంకా యిస్తాడా ఆ డబ్బు ?" వా.

ని న్నెఱుగమె ?

నీ విలాంటివాడ వని మాకు తెలుసు అన్న భావాన్ని సూచించే పలుకుబడి.

"నీవు చాలా అసాధ్యుడివి. నిన్నెఱగం గనకనా ?" వా.

నిప్పచ్చరము

శూన్యము ; దారిద్ర్యం ; దీనము.

"బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు, శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము, రూపమండూకములు పోలెఁ గొంచె మెఱిఁగి, పండితమ్మన్యులైనవైతండికులకు." భీమ. 1.13.

"ఏమి సేయుదు నెక్కడి కేఁగువాఁడ, ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళక్కి." కాశీ. 4.111; 5.302.

"మోఱకుని చందమున నీఱు తాఱ చూపు, పాండవేయుని పైఁ దార్చి బ్రాహ్మణుండు, పలికె నిప్పచ్చరం బైన భాషణముల." హర. 7.14.

"వాళ్ల యింట్లో ఏముంది ? నిప్పచ్చరం." వా.



నిప్పటి

నిప్పుమీాద కాల్చిన అట్టుగా ఆరంభ మై-ఇప్పుడు కేవలం అట్టు.

నిప్పట్టు

నిప్పటి.

ప్రబంధ. 112.

నిప్పస్తు

నిట్రుపాసము.

"ఆహా యాహారము, దొరకదు నిప్పస్తు లుండుదుమె నీ ప్రోలన్." వేం. పంచ. 1.495.

నిప్పుకు చెద లంటునా ?

అతి పవిత్ర మైనదానికి మైల యంట దనుట.

ఉ. హరి. 5.90.

నిప్పు జెద లంటునా ?

పవిత్ర మైన వానిని ఏమీ ఏవీ చేయ జాల వనుట.

"పదతలంబులు గాజువాఱవు నిప్పుఁ, జెద లంటునే" గౌ. హరి. ద్వితీ. పం. 1831-32.

"ఏయెడ భయ మెఱుఁగరు దై, తేయాధిప రక్షితులు సతీ జగతిజనుల్, మాయింట నీకు నవమతి, చేయుదురె యొరులు నిప్పుఁ జెద లంటు నటే !" ఉ. హరి. 5.90.

రూ. నిప్పుకు చెద లంటునా ?

నిప్పుతో చెలగాటము

ప్రమాదకరము.

"పోలీసువాళ్లతో తగాయిదా ఎందుకు

రా బాబూ! నిప్పుతో చెలగాటం.''
వా.

## నిప్పు త్రొక్కిన కోతివలె

ఒకచోట నిలువక ఎగిరెగిరి గంతులు వేస్తూ.

''నిలుచుచోటను నిలువక నిప్పుఁ ద్రొక్కు, కోఁతిచందానఁ జతురాఖ్యకుండు తిరుగు.'' హంస. 3.155.

## నిప్పు త్రొక్కినట్లు

ఎగిరిపడినా డనుటకు.

నిప్పు తొక్కగనే బాధతో ఎగిరిపడుట సహజం.

''నిప్పు ద్రొక్కినయట్లు నెట్టులిక్కనేల, దొప్పనఁ బడి...''
పండితా. ప్రథ. పురా. పుట. 418.

## నిప్పున చెద లంటునా?

పవిత్ర మైనదానికి కిల్బిషం తగలదు అనుపట్టున అంటారు.

''ఎప్పాట నినుఁ బొందునే తెవుల్లొప్పి?, నిప్పునఁ జెద లంటునే?''
బసవ. 3.60.

చూ. నిప్పుకు చెద లంటునా? నిప్పు జెద లంటునా?

## నిప్పులాంటి మనిషి

నిష్కళంక మైన మనిషి.

స్త్రీలవిషయంలో పాతివ్రత్య ద్యోతక మవుతుంది.

నిప్పు మనకు అతి పవిత్ర మయినది.

''ఆ యిల్లాలు నిప్పులాంటిమనిషి. ఆవిడను అన్నావంటే నీ నోటిలో పురుగులు పడతాయి.'' వా.

''అతనా? నిప్పులాంటివాడు. లంచం గించం దగ్గఱ వినపడ నిస్తాడా?'' వా.

## నిప్పులు కక్కు

క్రోధాతిరేకము చూపు.

''ఆ మాట విని వాడు నిప్పులు కక్కుతూ వచ్చాడు.'' వా.

## నిప్పులు కన్నుల నుప్పతిల్ల

కనుల నిప్పులు రాలగా.

అతి క్రోధముతో ననుట.

''...అప్పురవైరి, నిప్పులు గన్నుల నుప్పతిలంగఁ, దప్పక చూచిన.''
పండి. పర్వ. ద్వితీ. 466 పు.

## నిప్పులు వెదజల్లు

తీవ్ర మయిన.

''త్రిప్పులు వెట్టుచుఁ బొలఁగ, నిప్పులు వెదఁజల్లుబాణనికరంబులచే.''
రుక్మాం. 3.96.

## నిప్పు లొడి గట్టుకొను

చిచ్చొడి గట్టుకొను.
రామా. 6.236.

రూ. నిప్పులు ఒడిలో పోసుకొను.

## నిప్పులో ఒక కాలు, నీటిలో ఒక కాలు ఉంచుకొని....

విచక్షణ కలిగి.

''నిప్పులో నొక కాలు నీటిలో నొక కాలు నుంచికొని యొప్పుఁదప్పుల విచారించుచుఁ గన్నవారలఁబలె జనులఁ గనులఁ గప్పుకొని.''
ధర్మజ. 60 పు. 7 పం.

నిబద్ధిమనిషి

సత్యవాది, ఖండితవాది.

"పత్తినారపరెడ్డి నిబద్ధిమనిషి." పెన్నేటిపాట.

నిమితికాడు

1. నైౌతకాడు. ఆము. 2.95.

2. యుద్ధనియుక్తుడు. రామా. 8.185.

3. బాణశాలాజీవి. ఆం. భా. ద్వి. 25.

నిమిష మే డయి తోచు

కాలము కష్టము మీద గడచు.

"ఏమి సేయుదు దాఁ పెవ్వ రింకఁ దనకు ?, నిమిష మే డయి తోఁచెను నీరజాక్షు !" ఉషా. 2.56.

అతి కష్టముగా, అత్యావేదనతో.

నిమిష మొక కల్పముగ

అతి కష్టముగా, అత్యావేదనతో.

బాధలో కాలము గడచుట కష్ట మన్న అంశంపై ఆధారపడి వచ్చినపలుకుబడి.

"అంత నల యింతి విరహా, క్రాంతమతి న్నిమిష మొక్కకల్పంబుగ..." శుక. 1.403.

చూ. దిన మొక యుగముగ.
నిమిష మొక యేడుగ.
నిమిష మొక యుగముగ.

నిమిషాలమీద

అతి శీఘ్రంగా.

"వానితో ఒకమాట చెప్పావంటే నిమిషాలమీద ఆపని చేసుకొని వస్తాడు." వా.

నిమీనిమాలుగా

ఇంచుమించుగా, కాస్త తక్కువే అనుట.

చూ. ముటీముటాలుగా.

నిమురుకొను

1. క్రమ్ముకొను.

"హిమముచే నంబరం బెల్ల నిమురుకొనఁగ." శ్రీరం. 2.241.

2. తడవుకొను.

"కతిక మోవఁగ నెత్తురుల్ గ్రోలి కడుపు, నిమురుకొంచు నగ స్త్యమంత్రములు నొడివి." దశా. 2.435.

నిమ్మకాయవాటము చేయు

స్పష్టము చేయు.

"...నీ మాట నిమ్మకాయవాటము చేసెద..." నందక. 36 పు.

నిమ్మకు ఎఱువు వేసినచందమున

మఱింత ప్రోది చేసినట్లు.

"ఆ యత్న శిశిరకృత్యంబులు ఘటియించుచుండ నిమ్మ కెరువు వేసిన చందంబున నందు నంతకంతకుఁ బరితాపం బగ్గలం బై." సారంగ. 2.165.

"...నిమ్మ కెరువు వేసినవితానఁ గాక మితిమించగు." రాధి. 3.80.

చూ. నిమ్మకు నీ రెక్కినట్లు.
నిమ్మకు నీ రెత్తినట్లు.

నిమ్మకు నీ రెత్తినట్టు

నిమ్మచెట్టుకు నీరు పోసినంతా అది నవనవ లాడుతూ ఉంటుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"వాడికి ముందే గర్వం. ఆ సభలో అతణ్ణి కాస్త పొగిడేసరికి వాడికి నిమ్మకు నీ రెత్తినట్టు అయింది." వా.

గుట్టుచప్పుడుగా అనే అర్థం లోనూ వాడుకలో ఉంది.

"వాడికి ఎంత వచ్చినా ఏమి వచ్చినా నిమ్మకు నీ రెత్తినట్లుగా ఉంటాడు." వా.

రూ. నిమ్మకు నీ రెక్కినట్లు.

నిమ్మపండు నలంచినపగిది

గట్టిగా, సునాయాసంగా. నిమ్మపండును నలిపినట్లు.

"ప్రత్తి తాల్చినవడువున నిమ్మపండు నలంచినపగిది." ఉ. హరి. 3.71.

నిమ్మపండు వైచి యుఱుకు

వెంటనే పరుగెత్తు. పందెం ఆరంభం అయిన దన్నసూచనగా నిమ్మపండు వేసేవారు. ఆ పందెంలో పరుగెత్తినట్లు అనుట.

"లోపలఁ గలంగుటయు మోసపోక, పంతం బడిగిన నిమ్మపండు వైచి యుఱికితి నని సరిసరి యన్న." ఉ. హరి. 3.123.

నియోగిముష్టి

భిక్షుకై వచ్చినా దర్పము తగ్గక యాచించుట. నియోగులు నిక్కి పోవువా రన్న ఒక ప్రతీతిపై వచ్చిన పలుకుబడి.

నిరక్షరకుక్షి

చదువు లేనివాడు.

"వాడు ఒట్టి నిరక్షరకుక్షి. వాడి కెవ్వరు పిల్ల నిస్తారు?" వా.

నిరక్షరకుక్షి దామోదరచక్రవర్తి

చూ. నిరక్షరకుక్షి.

నిరక్షరకుక్షి విరుపాక్షదీక్షితులు

చదువు రానివానినిగురించి వ్యంగ్యంగా అనేమాట. దీక్షితు లని పేరే గానీ చదువు రా దనుట.

నిరాపనింద

నీలాపనింద; అసత్యమైన అపవాదు.

"పినతల్లివి పెనుపఁగ నో,పిన తల్లివి గాక వచ్చి పిలిచిన నయ్యో,గనికరము లేక వానిం, గని కరము నిరాపనింద గట్టం దగునే?" సారం. 3.51.

నిర్ధూమధామ మగు

ధ్వంస మగు.

"ధార్తరాష్ట్రులు త్రొక్కినస్థాన మెల్లఁ, దలఁచి చూడంగ నిర్ధూమ ధామ మగును." శశి (అప్ప) 4. 69.

"గ్రామముల్ నిర్ధూమధామము లాయెను, సస్యంబు లెల్ల నాశనముఁ జెందె." సింహాద్రి. నార. శ. 57.

నిర్ధూమధామము సేయు

పూర్తిగా ధ్వంస మొనర్చు.

'నిర్ధూమధామం చేశారు

'దొంగ లా ఊరిని' అన్నట్లు వాడుకలో ఉన్నది.

"ఏల మీ పాదంబు లెత్త, నేమ చాలుదు మేల యిటువంటి సభల, నేమించి నిర్ధూమధామంబు సేయ."
పండి. వాద. ప్రథమ. 512 పు.

"హోమకుండములు నిర్ధూమధామంబు, గావించి పశువుల గావు వట్టి."
వరాహ. 5.115.

[నిర్మూలధామ మన్న పాఠమునకంటె ఇదే మెఱుగు.]

**నిర్బంధించు**

బలవంతము చేయు.

"ఇమ్మెయి నిర్బంధించుచు, నమ్మద్దియ యడుగఁ..." కళా. 6.261.

**నిర్భాగ్యదామోదరుడు**

దరిద్రుడు.

"......అవక్ర విక్రమ విరాజద్రాజ దోర్దండమం, డితసామ్రాజ్యవధూటి చేరఁ జనునే నిర్భాగ్యదామోదరున్."
వైజ. 3.119.
గుంటూ. పూర్వ.

"నిద్రాదేవత యావరించెఁ గదరా నిర్భాగ్యదామోదరా!" వా.
చూ. దరిద్రదామోదరుడు.

**నిర్మితి చేయు**

నిర్మించు.

కాళిందీ. 2.7.

**నిర్మూలపఱుచు**

నాశనము చేయు.

"పూల నేసినవాని నిర్మూలపఱచి, ఱాల నేసినవాని పేరాశ మైన, లీలఁ గరుణించితివి." నిరంకు 3.42.

**నిర్వాకము**

ఉద్ధరింపు.

నిరసనంగా తద్వ్యతిరేకార్థకంగా అనుమాట.

"చేసిన నిర్వాకం చాలక ఇంకా వచ్చావా?" వా.

**నిఱు నీగు**

పూర్తిగా వదలిపెట్టు.

"నిన్నటినుండి యేము నిఱునీగియు నుంటిమి నిట్టుపాసముల్."

నిఱ్ఱన నీల్గు వంటి దేమో. నీల్గితిమి అనుట కావచ్చును. వావిళ్ళ పై అర్థం చెప్పింది కాని త్యజించు సరి కా దనిపించును.

చూ. నిఱ్ఱ నీల్గు.

**నిఱుపేద**

1. మిక్కిలి దరిద్రుడు.

2. సన్ననైన.

"నిఱుపేదయింటి కేటికిఁ, బఱతెంచు నిధానము..." శృం. నై. 4.73.

"నిఱుపేదనడుమునకు వెఱపు చూప."
కాశీ. 1.90.
చూ. నిర్పేద.

**నిఱ్ఱనీల్గు**

బిఱ్ఱవీగు; వళ్ళు విఱిచికొను. బిఱ్ఱబిగియు వంటిది.

వాడుకలో కూడా ఉన్నది.

"నీరుగాలికిఁ బసివట్టి నిఱ్ఱనీల్గి, పట్టెడల బిగిఁ బట్టిన మట్టువడక."
కా. మా. 3.75.

నిలక ఇచ్చు

కాలూనుటకు వీలు యేర్పడు—ముఖ్యంగా నీటిలో.

"ఆవంక మహావేగంగా పారుతూ ఉంటుంది. ఏమాత్రం నిలక యివ్వదు." వా.

నిలదీసి

నిర్బంధించి.

"వాణ్ణి నిలదీసి అడుగుతాను. ఎలా అన్నాడో ఆ మాట?" వా.

నిలబడు

నిలుచు.

రామా. 8.132.

చూ. నిలువదీసి.

నిలిచి....

స్థిరంగా—హెచ్చుతగ్గులు లేక. ఇది కురియు, మండు, వెలుగు, పోరాడు ఇత్యాదులతో కలిసే ఈ అర్థాన్ని స్ఫురింప జేస్తుంది.

"నెల మూఁడువానలు నిలిచి కురిసె." జైమి. 6.9.

"దీపం నిలిచి మండుతూ ఉంది." వా.

"వానలు నిలిచి కురవడం లేదు." వా.

"వాడు యుద్ధంలో నిలిచి పోరాడినాడు." వా.

"పొయ్యిలో కట్టెలు నిలిచి మండుతూ ఉంటేనే వంట త్వరగా అవుతుంది." వా.

నిలిచినకాలున నిలువక యుండు

ఒకచోట నిలువక యుండు.

"వంచకుండవు పుష్పవతులఁ గీలింతు, నిలిచినకాలున నిలువ వేఁప్రొద్దు." ద్విప. మధు. పు. 35.

నిలిచినచోట నిలువక

ఒకచోట ఉండక.

"పలుమాఱును దిశలుఁ జూచు భ్రమయుచు నుండుక్, నిలిచినచోటను నిలువదు, కలకంఠికి విరహ మెంత ఘనమో యకటా!" ఉషా. 2.35.

నిలుక డగు

స్థిర మగు.

విజయ. 1.43.

నిలుకడ దప్పు

ధైర్యము గోల్పోవు.

"దానవాధిపు నిలుకడ దప్పినట్లు, పద సరోజయుగము దూటుపడుచు నుండు." భా. రా. యు. 1864.

నిలుకడ లేని మనిషి

అస్థిరుడు.

"వానిమాట నమ్మకు. వట్టి నిలుకడ లేని మనిషి వాడు." వా.

నిలుకాల నిలువక

ఎక్కడా క్షణం నిలువక.

"తలయొడ లెఱుఁగక యూగతి, వలచి...నిలుకాల నిలుకఁ దీఱక, మెలఁగంగా." మల్హా. 3.18.

నిలుగ్రుడ్లు పడు

కనుగ్రుడ్లు ఆడక నిలిచిపోవు. అవసానదశను తెలిపే పలుకుబడి.

"వాడికి పొద్దున్నుంచీ నిలుగ్రుడ్లు పడిపోయాయి. ఇప్పుడా అప్పుడా అన్నట్టుంది." వా.

నిలుచు

1. నిలిచి పోవు; నిర్వ్యాపారుడగు; సత్తువ ఉడిగి పడియుండు.

వాడుకలో – 'పాపం! రామయ్యకు వయసయింది. పూర్తిగా నిలిచి పోయినాడు' అని రాయలసీమలో అంటారు.

"కాళిదాసికిఁ దొల్లి గన్నులరాశి, లీల నిచ్చిన కాలి లేఁడె నే యీఁడు? నటకాలఁ గన్నుము న్నక్షుపాదునకు, నెఱయ నిచ్చిన కర్త నిలిచెనే నేఁడు?"
పండితా. ద్వితీ. మహి. పు. 39.

2. ఆగు.

"అందుఁ గొన్నాళ్ళు నిలిచి."
విక్ర. 5.169.

3. ఎదిరించి నిలుచు.

"సింహచర్మంబు దొడిగినఁ జెనఁటి కుక్క, గంధగజగంధమునకును గలఁచె నిలువ."
హరి. ఉ. 6.169.

4. కలగు.

వి. పు. 6.336.

ఇత్యాదిచ్ఛాయలలో.

నిలుచుండ బెట్టు

నిలుచునట్లు చేయు.

హరి. పూ. 5.190.

నిలుచుండు

నిలుచు.

నిలుచుకొను

నిలుచు.

నిలుచున్న పాళాన

వెంటనే, నిలుచున్నట్లుగా.

కొత్త. 13.

నిలుచూఅగా

నిలువుదోపుగా.

గా. హరి. 411.

నిలుప రాని

ఆపరాని.

"నిలుపఁగ రాని మోహమున నీరజలోచనఁ జేర్చి కౌఁగిటన్."
రాజగో. 4.25.

నిలుపుమందు

వీర్యస్తంభనం చేసేమందు.

నిలుపు సేయు

ఆపు.

ద్వి. నల. 1.553.

నిలుపోప లేక

సహింపజాలక.

ఇక్కడ 'నిలుపు' ఓర్పు అన్న అర్థంలో ప్రయుక్తమైంది. నిలుచుట, నిలువరము ఓర్మికి ప్రత్యామ్నాయములు. ఓర్మి వహింపక అని భావం.

"తద్వియోగవ్యథా, వ్యసనాప్తి న్నిలుపోప లేక విరహవ్యాప్తిఁ బరంజెందుచుఁ." శుక. 1.199.

"బంటిగా నీవు, నిలుపోప లేక మన్నించి ప్రార్థించి, పిలిచిన రాకనే బిగియుదు గాన!"
వర. రా. అర. పు. 67. పం. 18.

నిలువ గూడదు

భరింప రాని దనుట.

"కాని తేచే జలములు గ్రక్కున నీ చలిచేత నిలువఁ గూడ దటన్నన్." శుక. 2.385.

నిలువ దీసి

నిర్బంధించి.

"నిలవ తీసి అడిగేసరికి వాడు తెల్ల మొహం వేశాడు." వా.

చూ. నిలదీసి.

నిలువ నాడ గలుగు

అబద్ధ మైనను సత్య మని పించునట్లు గట్టిగా చెప్ప గలుగు.

"కాంచెమా పరపురుషుం, గలయుటలు నిలువ నాడం, గలదానికిఁ జెల్లుఁ గాక కరివరగమనా!" శుక. 1.537.

నిలువ నీడగు

ఆశ్రయ మగు.

"నిలువ నీ డయ్యె నిందీవరప్రియకళా, కోటీరునకు." జైమి. 1.22.

నిలువనీరున బండినట్లు

అలా నీటిలో పుట్టుకొని వచ్చి నట్లు కావచ్చు. పాఠాంతరం.

"చెలఁగి యమ్మక్క యొక్క యొచ్చ మ్మ లేక, నిలువనీరునఁ బండిన ట్లలరి నాఁడు, వేయుఁగన్నులు వలయుఁబో వీనిఁ జూడ." సారం. 2.41.

చూ. నిలువు నూరు బండినట్లు.

నిలువ నేర్తునే?

ఉండ గలనా?

"ఒక్క నిమిష మైన నీవు దయఁ గన్గొనకుండిన నిల్వ నేర్తునే." పారి. 1.116.

నిలువ బట్టు

దాచిపెట్టు.

"దివ్యఖగేంద్ర నమ్మకు మది న్నను నీ యెడ నాకు విప్రలం, భవ్యవహారము న్నిలువఁబట్టఁగ నేమి ఫలంబు." శృం. నైష. 2.72.

నిలువబడు

నిశ్చేష్టు డగు, ఏమీ చేయ లేకపోవు.

"మూర్ఛావశుం డై నిల్వంబడి."

"వాడు పాపం! ఆమాట విని అలాగే నిలబడి పోయాడు." వా.

"వాడు జబ్బుతోనూ, డబ్బు లేకా పూర్తిగా నిలబడి పోయినాడు." వా.

నిలు విచ్చు

నిలువుదో పిచ్చు.

"ఎవ్వతె రా నిన్ను సెలయించి తన, జవ్వనము నిలువిచ్చి జట్టి గొన్నది." తాళ్ల. సం. 3.452.

నిలువుకొలువు

నిలువుజీతము.

"అలవాటు చేసికొ మ్మఖిలమరుత్తాల, కులఁ గూడికొని నిల్వుకొల్వునకును." కువల. 4.68.

నిలువుకోతలు

బాధాకరములు.

"నిలువునఁ గత్తికోఁత లయి నిదవు మోములు." కవిక. 4.181.

నిలువుగన్నులతో

ఆశ్చర్యముతో

ఆశ్చర్యమూ, సంభ్రమమూ కలుగునప్పుడు నిలుగ్రుడ్లు పడును. అనగా కనులు తిరుగక నిలిచిపోయిన వనుట.

"నిలువుఁగన్నులతో దేవ నీలకచలు..., క్రిందుమీఁ దయ్యె."
హంస. 2.141.

**నిలువుగాళ్లు పడు**

అలా స్తంభించి పోవు.

"వానికోసం నిలిచి నిలిచి నిలువుగాళ్లు పడిపోయాయి." వా.

**నిలువుజీత ముండు**

నిలబడి ఉండు.

**నిలువుటద్దము**

నిలువెత్తున ఉన్న అద్దము.
కాశీ. 3.236.

"పొద్దస్తమానం ఆవిడకు నిలువుటద్దం ముందే సరిపోతుంది." వా.

**నిలువుటీత**

నిలుచొని యీదేయీత.

**నిలువు తిత్తొలుచు**

శరీరచర్మం విడదీయు.
'నీ చర్మం వలిచేస్తాను' అని నేటి వాడుకలో వినవస్తుంది. 'నీ తిత్తొలిచేస్తా' నని కూడా అంటారు.

"పులిరక్కసునిఁ బట్టి నిలువుతిత్తొలిచి."
పండితా. ప్రథ. వాద. పుట. 618.
చూ. నీచండా లూడ గొడతాను.

**నిలువుదో పిచ్చు**

నిలువుదోపిడీ యిచ్చు.
శరీరముపై నున్నవాని నన్నిటినీ అప్పగించు.

"నిలువుదో పిచ్చువారు నై తొలఁగి రపుడు." ఆము. 7.1?.

**నిలువుదోపిడి యిచ్చు**

శరీరమునం దున్న ఆభరణాదు లన్నిటినీ యిచ్చివేయు. ఈ 'దోపిడి'ని దోపు అన్న రూపంలో కూడా అనడం కలదు.

"ఈసారి తిరుపతి వచ్చి నిలువుదోపిస్తా నని మొక్కుకున్నాను." వా.

**నిలువునకు నిలువుననె కరగు**

పూర్తిగా పరవశ మయిపోవు.
సారం. 3.162.

**నిలువున గూలు**

మొత్తముగా కూలు.

"తల్ల కెడ వైనగోపురంబులును, నిలువునఁ గూలినమేడలు."
ఉ. హరి. 1.58.

**నిలువున చీల్చు**

ఒక తిట్టు.

"ఇంకోసారి యిలా చేశా వని తెలిస్తే నిన్ను నిలువునా చీల్చి పారేస్తాను." వా.

**నిలువున నీ రగు**

నిలువెల్ల నాశన మగు — నశించు.

"నిర్ఘాతహేతి యై నిలువునీరుగ నగ్ని, దేవుండు నిర్వాణతేజుఁ డయ్యె."
పారి. 5.12.

## నిలువున నీరుగ గరగించు

కళాశాస్త్రరీత్యా వచ్చిన పలుకుబడి. సంపూర్ణ సురత సుఖము నిచ్చు అని అర్థము. సురత సుఖాంతమును సూచించు రతిజలము స్రవించుటను కళాశాస్త్రకారులు వివరించినారు. స్త్రీపురుషులు సమానేచ్ఛాబలసంపన్ను లయినప్పుడే ఏకకాలమున ఆర్ద్రులై కరగుదు రని ప్రసిద్ధి. ఎక్కువ సురత సౌఖ్యము నొసగు అని భావము.

"ఈ రేయి నన్ను నిలువున, నీరుగఁ గరఁగింపవలయు నేఁడున్నవి నీ, నేరుపు లన్నియు..."
శుక. 2.186.

నిలువున నీరయినాడు అని నిర్విణ్ణు డయినాడనే విభిన్నార్థంలో ఇది నేడు వాడుకలో ఉన్నది.

## నిలువున నొలిపించు

ఒంటిమీాద ఉన్న వన్నీ ఒలిచి పెట్టు.

"నిలువున నొలిపించె విలువంగడము వెల్ల, శరముల యాయంబుఁ బొరయ టుడిపె."
పాండు. 5.98.

## నిలువున పాతివేయు

ఒక తిట్టు.

"నువ్వు మళ్లీ యిలా చేశా వని తెలిస్తే నిన్ను నిలువునా పాతేస్తాను." వా.

## నిలువు నిలివెడు

మనిషి యెత్తు.

నిలువు అనేది మనుష్య ప్రమాణం అన్న అర్థంలో ప్రయుక్తం.

ఉదా:—నిలువుదోపు, ఏడు నిలువులలోతు, నిలువెత్తు, నిలు వెల్ల—

"నిలువు నిలివెడు సోగవగ పెన్నెరుల కివి సమకట్టుజల్లులు."
శుక. 1.222.

ప్రమాణార్థద్యోతక పదాలు ద్విరుక్తాలు కావడం కూడా ఉన్నది. కమికెడు కమికెడు.

## నిలువు నీఱగు

నశించు.

"కుటిలాత్మక నా కని కాచినాఁడవే, నినుఁ గయికొందునే నిలువు నీ ఱయి కూలుదుఁ గాక దుర్మతీ!"
భా. రా. అర. 2.76.

"అందము లైన నీ తొడల యాకృతి శోభ వహింప లేని యా, నిందకుఁ జాల మిఁ గ నిలువు నీ ఱగు టెంత యనంటి కంబముల్."
కవిక. 6.199.

వాడుకలో—ఇది నిర్విణ్ణు డగు అనే అర్థంలో ఉన్నది.

"గాంధీ చనిపోయా డనేసరికి నేను నిలువు నీరయి పోయాను." వా.

నిలువు నూరు పండినట్లు

దిట్టంగా, నేత్రపర్వంగా, సమృద్ధిగా.

"ఏమరుఁడే యితఁ డెక్కడి, పామరుఁడే నిలువు నూరు పండినరీతిం, దామరవిం దన నున్నాఁ,డో మరువపు మొలక యెట్టి యోగివరుండో !"

విప్ర. 2.78.
తాళ్ల. సం. 8.248.

"చెలఁగి యమ్మక్క యొక్క యొచ్చెమ్ము లేక, నిలువు నూరుగఁ బండిన ట్లలరినాఁడు, వేయుఁ గన్నులు వలయుఁ బో వీనిఁ జూడ."

సారం. 2.41.

పాఠాంతరం. నిలువ నీరున పండినట్లు.

నిలువు నూరు పండినరీతి

"ఏమరుఁడే యితఁ డెక్కడి, పామరుఁడే నిలువు నూరు పండినరీతిం, దామరవిం దన నున్నాఁడు."

విప్ర. 2.78.

చూ. నిలువు నూరు పండినట్లు.

నిలువుప్రతిమవలె

బొమ్మలాగా.

నిర్వ్యాపారతను సూచించు మాట.

"ఆ అమ్మాయి సాయంకాలం అయ్యే సరికి అలంకరించుకొని నిలువుప్రతిమ లాగా వాకిట నిలబడి ఉండడం తప్పితే ఇంట్లో పని ఒక్కటి చెయ్యదు. అంతా ఆ అత్తముండే చెయ్యాలి."

వా.

నిలు వెల్ల కనకంబు

ఒళ్లంతా బంగారమే అని వాడుక.

"నిలు వెల్లం గనకంబు ముద్దుపలుకు ల్నిర్యత్సుధాబిందువుల్, సాలపుంజాపులు చంద్రికారుచు లటంచు న్నమ్మి యున్నట్టులు." శుక. 1.206.

నిలుస్తాను

ఎవరినైనా సాగనంపుతున్నప్పుడు 'ఇక నేను సెలవు తీసుకొంటా' నని గృహస్థు మొదలగువా రనుమాట.

చూ. ఉంటాను.

నిలోపపకుండు

తాళలేకుండు.

"నీ, నిడువాలుం గడకంటఁ జూడు మనుచు న్నిల్పోపమిన్ బైచెలం, గాడియన్." పారి. 1.119.

నిల్వ నాడు

నొక్కి వక్కాణించు.

"అని సభలో నిల్వ నాడి...ఏను చేపట్టినవాఁడ."

వర. రా. బా. పు. 177. పం. 24.

నిల్వ నీడు

శాంతముగా నుండ నీయడు.

"మన్మథుం డేమియు నిల్వ నీఁడు." రుక్మాం. 3.165.

"నువ్వేం నన్ను నిలువ నిచ్చేటట్టుగా లేవే?" వా.

నిల్వ నోపక యుండు

ఉండ లేకుండు.

"అతి నిష్ఠుర తేజుఁ డైన యనిరుద్ధు సముద్ధతిఁ జూచి నిల్వనోపక, యతి రయమున..." ఉషా. 3.73.

నిల్వ బట్టు

చిక్కబట్టు.

"దవ్వు వచ్చితిరి చిత్తము నిల్వఁబట్టి, యివ్వేళ నగరికి నేతెండు మఱల."
వర. రా. అయో. పు. 423. పం. 15.

నిల్వుకొల్వు
చూ. నిలువుజీతము.

నిల్వుకోక
పొడవైన కోక.
"నిల్వుకోక లటు లెంతేఁ దాల్చి."
సావి. 2.50.

నిల్వుటద్దము
నిలువెత్తున నున్న అద్దము.
"తరుణి యొక్కతె నిల్వుటద్దంబుఁ జూపె."
రాధి. 1.77.
చూ. నిలువుటద్దము.

నివాళిపదములు
ఆరతిపాటలు.
ఆనాడు జానపదగేయరీతులలో ఒక నిర్దిష్టశాఖ కావచ్చును. నేటికీ స్త్రీలపాటలలో మంగళారతి పాటలు ఉన్నవి.
పండితా. ప్రథ. వాద. పుట. 513.

నివాళిపళ్ళెము
హారతిపళ్ళెము.
భాను. 4.61.

నివాళి సేయు
ఆరతిచ్చు.
"ధవళాంశుమండలమువిధి, నివాళి సేయును లతాంగి నెమ్మొగమునకున్."
శృం. నైష. 2.14.

నివుఱు గప్పిన నిప్పువలె
లోపల యెంత సత్తా సారం ఉన్నా పైకి అమాయకంగా కనిపించు.
"నివుఱు గవిసిన మెఱయునినిప్పువోలె."
భార. విరా. 4.75.
"అతడు చూడ్డానికి నివురు గప్పిన నిప్పులా ఉంటాడు. కదిపితే గానీ అతడెంత పండితుడో తెలియదు." వా.
చూ. నీరు గప్పిన నిప్పు.

నివ్వరిముల్లు
నీవారశూకము.
అచ్చ. యు. 160.

నివ్వాళిపళ్లెము
నివాళిపళ్లెము.
భల్లా. ద్వి. 127. భా. శ. ర.

నివ్వెఱపడు
ఆశ్చర్యపడు; భయభ్రాంతి కల్గు.
కాశీ. 5.268.

నివ్వెఱపఱచు
ఆశ్చర్యపెట్టు; భయపెట్టు.

నిశానీదారు
1. వ్రేలిముద్ర వేసేవాడు. చేవ్రాలు చేయ లేనివాడు.
2. రాజచిహ్నము ధరించి డప్పు వాయించువాడు.
అని. 2.29.

నిస్త్రింశభావము
క్రూరత్వము.
"మీ రట కడుఁగ నిస్త్రింశభావంబునన్."
హర. 2.97.

నీ అంతర మేమి నా అంతర మేమి ?

నేను గొప్పవాడిని, నీ వల్లు డవు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నీ అంతర మేం? నా అంతర మేం? నీవు నన్ను తప్పులు పట్టేవాడి వట్రా !" వా.

నీ ఇల్లు దొంగల దోల

నీ యిల్లు బంగారుగాను–వంటి ఉపస్కారక పదబంధం.

"ఓసి ! నీ యిల్లు దొంగల దోల. ఎంత నేర్చినావే ?" వా.

నీ కంట నా వ్రేలు, నా నోట్లో నీ వ్రేలు అన్నట్లు

అటయినా యిటయినా నీవే బాధ పడవలె నను వానిపట్ల ఉపయోగించే పలుకుబడి.

పాండవా. 12.

నీకంటె తక్కువా ?

నీకు తీసిపోను అనుట. వాగ్వాదాలలో ఉపయోగించే పలుకుబడి.

"నీ వైశిష్ట్యము తిట్టులన్ మెఱయునే నీకంటె నేఁ దక్కువే."

మను. 6.49.

"నీకంటే నే నేమి తక్కువవాణ్ణి అనుకున్నావా ?" వా.

నీ కడుపు ఉడక

ఒక తిట్టు.

నీ కడుపు కాల

ఒక తిట్టు.

నీ కడు పెల్ల కథలు

నీకు ఎన్ని కథలో తెలుసును.

".....కీరపుంగవుతో నీ, కడు పెల్లఁ గథలు గద ని, న్నడుగం బని యేమి పోదునా యని పలుకన్."

శుక. 3.633.

వాడుకలో ఇది అనేకరకాల వినబడుతుంది.

"వాడికి కడుపునిండా కథలే." వా.

"వాడికి కడుపునిండా కళ్లు. వా.

....నీకు ఏమి కావాలి

వారికీ నీకూ చుట్టరిక మేమిటి? వరుస యేమిటి అని ప్రశ్నించే టప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"ఆవిడ నీ కేం కావాలి. అత్తా లేక అక్కా." వా.

దీనికి సమాధానం—

"నా కావిడ అక్క. కానీ కూతు ర్నిచ్చింది కనక అత్తకూడా కావాలి." వా.

నీ కులకోట్లకు పుణ్యం బయ్యేడు

నీ పెద్దలకు పుణ్యా ముంటుంది. మీ కులంలో అటు ఏడు తరాలూ, ఇటు ఏడు తరాలూ తరిస్తాయి లాంటి పలుకుబడి. చాలా పుణ్యా ముంటుంది అనుట.

"వలసినపదార్థంబుఁ దెచ్చి యిచ్చెదఁ శాకం బొనర్చి పెట్టిన నీ పలకోట్లకుఁ బుణ్యం బయ్యెడు నని నుడివి..."
శుక. 3.187.

## నీచరతి

సంభోగభేదము.

శమా 9.152.

## నీ చల్లదనముననే

నీ దయవల్లనే.

"నీ చల్లదనమ్మున కాదే."
విజయ. 1.115.

## నీ చిత్తము, నా భాగ్యము

మీదయ, నా అదృష్టం.

భార మంతా నీదే అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"తాపసోత్తమ! నీదుచిత్తంబు నాదు, భాగ్య మింద్రాదిదేవతా ప్రణుతి గన్న."
హరి. 2.170.

"నీ కెటు వలసె నటు సేయ నీచిత్తము నా భాగ్యము." తాళ్ల. సం. 9.84.

## నీ చావు సిద్ధము

నీ చావు తప్పదు.

"చెప్పకుండిన నీ చావు సిద్ధ మనుచు."
హంస. 3.114.

## నీట గలియు

పాడగు.

"దేవేంద్రున కయినఁ దేఱి చూడఁగ రాని, గౌరవోన్నతి నీటఁ గలసె నన్న."
ఉ. హరి. 4.300.

## నీట నద్దుము పాల నద్దుము

నీట ముంచినా సరే, పాల ముంచినా సరే. ఆ భారం నీదే.

నిన్నే నమ్మినా మనుట. కీడు చేసినా మేలు చేసినా...అని భావార్థం.

"నిద్దంబుగా నీట నద్దుము పాల, నద్దుము మా కింక నన్యథా లేదు."

## నీట ముంచినా పాల ముంచినా

ఏమి చేసినా.

రక్షించినా భక్షించినా నీవే దిక్కనుట.

"పసుపడి నీట ముంచినను బాలను ముంచిన నీవె దిక్కు నా, కని యుచితోత్తమలం గడుఁ బ్రియం బొనరించె నతండు తేరుచుణ్."
సారం. 3.195.

"నీరణ్ ముంచుము పాల ముంచు మింక నిన్నే నమ్మినాఁడం జుమీ."
కాళ. శత. 19.

రూ. నీట నద్దుము పాల నద్దుము.

## నీటవ్రాతలు

క్షణభంగురములు, అశాశ్వతములు.

నీటిమీద వ్రాస్తే ఆ క్షణం లోనే మరీ కలిసి పోతూ ఉంటుంది ఆ వ్రాత.

పండితా. ద్వితీ. పర్వ. పు. 418.

## నీట వ్రాసినవ్రాలు

వ్యర్థము, నిలువనిది.

"నీట వ్రాసిన వ్రాలు నై సెఱియ వఱదఁ, బోవుఁ గా కేమి ?"
కా. మా. 3.111.

నీటికి త్రాటికి దూర మైన

ఎవరితో సంబంధము లేకుండా వేఱుగా ఉన్న–నిస్సంగుడయిన.

"నీరికిఁ ద్రాటికి దూర మై యున్న, వీరమాహేశ్వరాచారదీక్షితుని."

బసవ. ద్వి. 1.

చూ. నీటికి త్రాటికి జాఅని.

నీటికెంపు

కౌస్తుభము.

"శ్రీపతి పేరురంబునఁజా, మాటియు నీటికెంపు." పాండు. 1.13.

నీటిమీది వ్రాలు

నిలువనిది, అస్థిరము.

"వాడిమాట లన్నీ నీటిమీది వ్రాలు." వా.

నీటిమూట

అసంభవము, అసత్యము.

"వాడిమాట పట్టి నీటిమూట." వా.

నీటిలో చేప

సౌకర్యా లన్నీ అమరిన వనుట.

"ఆపిల్ల కేం? నీటిలో చేపలాగా హాయిగా గడుస్తుంది. ఉన్నయిల్లూ అనుకూలు డయిన మొగుడూ? ఇం కేం కావాలి?" వా.

నీటిలో వ్రాత

అశాశ్వతము.

తాళ్ల. సం. 11.3. భా. 150.

నీటివాలు

నీరుపోవు వాటము.

నీటివా లెప్పుడూ తగ్గువైపే ఉంటుంది.

"వా డిప్పుడు మంచిదశలో ఉన్నాడు. వాడి కెదురు చెప్తే నీమాట వినేవారు ఎవరు? నీటివాలు చూచి కట్ట కట్టాలి." వా.

నీటుకత్తియ

విలాసవతి.

కువల. 2.139.

నీటుకత్తె

చూ. నీటుకత్తియ.

నీటుకాడు

విలాసి.

చంద్రా. 2.136.

నీటుకొల్పు

విలాసము గొల్పు.

నీటుకోల

విలాసంగా చేత బట్టుకొను బెత్తం.

సుద. 2.127.

నీటుపడు

నీటు కల దగు.

నీటుపఱుచు

అందంగా చేయు.

నీటులాడి

విలాసవతి.

నీటు సేయు

విలాసము చేయు.

నీడ తిరుగు

పొద్దగు, బాగా ఎండ యెక్కు.

"నీడలు దిరిగియుఁ దిరుగని, జాడఁ దరుల్వాలిచె నవ్వసంతపువేళ౯." ఆము. 5.137.

నీడ దోచు

నీడ కనబడు, నిర్మలంగా ఉండు.

"నిర్మలంబైనవనధిలోఁ నీడ దోఁచు, నిందుబింబంబులను బోలి ఋషిగణంబు." హర. 4.52.

నీడ పుట్టదు

ఆశ్రయము కలుగదు.

"పన్నగాంగకుని నివాసమై యలరుకాశికిఁ బోయెదుత్రోవ నీడ పుట్టదు గద రాఁగ మించిన..." శుక. 3.434.

నీడ వెట్టు

ఆశ్రయ మిచ్చు.

"దట్టపుఁ దమకపు దావానలానకు, నిట్టూరుపులె పో నీడ వెట్టిని." తాళ్ల. సం. 12.280.

నీతలనె కట్టుకొనుము

నీ నెత్తినే వేసుకో.

నిరసనగా అనుమాట.

"ఓడి వచ్చినాఁడ సుదతి నా కేల, యుడుకు మాని నీవ యుర్వి నేలు, గుఱ్ఱములును నేనుఁగులు లేనిబయలు నీ, తలనె కట్టుకొనుము ధర్మతనయ!" భార. శల్య. 2.72.

నీతల బుట్టెనే!

నీవే ఇందుకు మూలమవా?

నీవే దీనికి ఆదిస్త్రీవా?

నీవే దీనికి ఆదిపూరుషుడవా?

"నీతలబుట్టెనే నిటలాక్షుభక్తి?" బస. 7.180.

"నీతలమీాదే పొద్దు పొడిచిందా?" వా.

మా. నీ మొగాన్నే...

నీతల్లి కడుపు చల్లగా

ఎవరినైనా ఆదరంతో ఆశీర్వదిస్తూ అనుమాట.

అతడు క్షేమంగా ఉంటేనే అతని తల్లి కడుపు చల్లగా ఉంటుంది. చిరంజీవ అనుట దాదాపు.

"మిమ్ముఁ గనినహరిపొక్కిటి, తమ్మికడుపు చల్లనై సదా మనవలయున్." కళా. 5.47.

నీదారిన నీవు పో

ఇందులో కల్పించుకో వద్దు. నీపని నీవు చూచుకో అనుట.

"నీవు నీ పోవు దెసఁ బొమ్ము నీకు మాకు, మాట లేటికి?" ఉత్త. హరి. 2.140.

నీ నుదుటనె ప్రొద్దు పొడిచెనె?

నీముఖాన్నే ప్రొద్దు పొడిచిందా?

అంటే నీదే ఆధిపత్యమా? నీ వనుకున్నట్టే అన్నీ అవుతాయా? మొదలయిన బోలెడు భావచ్ఛాయలు ఇందులో కానవస్తాయి. వాడుకలో కూడా ఉంది.

"వాడిముఖాన్నే పొద్దు పొడిచిందా? ఈ ఊళ్లో వాడిదే అన్నిటికీ?" వా.

చూ. ముఖాన్నే పొద్దు పొడుచు.

## నీపని నువ్వు చూచుకో

దీనిలో కల్పించుకోవద్దు.

నీదారిన నీవు పో.

"మేమూ మేమూ మా అవస్థేదో పడతాం. నీపని నువ్వు చూచుకో. ఇందులోకి రావద్దు." వా.

## నీ పిండి యిడమె?

నీ పిండము పెట్టమా?

నిన్ను చంపమా అనుట.

చావుకు ప్రత్యామ్నాయంగా పిండమూ శ్రాద్ధమూ మన వా రుపయోగిస్తారు. 'నీపిండం పెట్ట. నీశ్రాద్ధం పెట్ట.'

"ఒండొకఁడ వైన నిపుడ నీ పిండి యిడమె." మను. 4.90.

## నీ పొత్తంబు గట్టు

పుస్తకం కట్టిపెట్టు; చదువు చాలించు.

ఆరోజుల్లో తాటాకుపుస్తకాలూ అవీ విడిచి తిరిగీ కట్టడమే అలవాటు. నేడు పుస్తకం మూసిపెట్టు అని అలవాటు.

పండితా. ప్రథ. వాద. పు. 601.

## నీపోటును చూతము రమ్మ

నీ శౌర్యం చూతాం రా.

"నీ పోటును చూతము రమ్మ యని." కుమా. 12.20.

"ఏదీ నీ మగతనం చూతాం రా."

"పౌరుషం చూతాం రా." వా.

## నీ పోటు వచ్చె

నీవు యుద్ధము చేసినట్లే.

"అనికిఁ జాలుదేని చను చాల వేని నీ, పోటు వచ్చె నిదుర వోవఁ బొమ్మ." భాస్క. యుద్ధ. 897.

...సపర్యలు మాకు వచ్చె - లోని వచ్చా ఇదీ ఒకటే.

## నీ బుద్ధి బంగారు గాను!

నీ యిల్లు బంగారంగాను అనుటవంటిది.

"బాలుఁడా! నీ బుద్ధి బంగారుగాను, నీ చక్కఁదనమును నీ విలాసంబు." సారం. ద్వి. 1.468.

## నీ ముఖం నా మోర

అలక్ష్యంగా, ఉదాసీనంగా అనుమాట.

"నీ ముఖం నామోర - ఇదంతా అవుతుందా పోతుందా?" వా.

## నీ ముడిచిన ముడి విడువగ నేరము

నీవు వేసిన ముడి నీవే తీయవలెను కానీ మాతో కాదు అనుట.

"నీ ముడిచిన ముడి విడువఁగ, నేమెవ్వరు నేర మింక." ఉ. హరి. 5.104.

## నీ మొఖం!

అలక్ష్యంగా, ఉదాసీనంగా అనుమాట.

"నీ మొఖం. నీ కేం తెలుసు ఈ సంగతి?" వా.

నీ మొగానసే....

నీ ముఖాన్నే పొద్దు పొడిచిందా?

చూ. నీ తల బుట్టైనే...

నీ మొహాన పేడనీళ్లు చల్ల!

ఒక తిట్టు.

నీ మొహాన మజ్జిగపులుసు పొయ్య!

ఒక తిట్టు.

మజ్జిగపులుసు పొయ్యడం కూడా పేడనీళ్లు చల్లటం వంటిదే.

చూ. పేడనీళ్లు చల్లు.

నీ యిడిన చిక్కు నీవె విడిపింపుము

నీవు కల్పించిన సమస్య నీవే పరిష్కరించు.

చిక్కు వేసినవారే విడిపింపవలె ననుట. దారము చిక్కు తీయుటనుండి ఏర్పడిన పలుకుబడి.

"ఇంత యేమిటి కిపుడు నీ యిడిన చిక్కు, నీవె విడిపింపు మన శుకం బిట్టు లనియె." శుక. 1.539.

నీ యిల్లు బంగారం గాను

వాక్యోపస్కారకము.

తిట్టినట్లుగా కానవచ్చినా దీవనవలె ఉన్న యిలాంటి వాక్యాలు మనకు చాలా ఉన్నవి. ఇవి 'నీ' తోనే చేరి ఉండవలసిన అవసరం లేదు.

"నీ యిల్లు బంగారం గానూ. అదేమిటే అలా అంటావు?" వా.

నీరంగి

ఒక రకమైన అంగీ.

"క్రొత్త మడుగుం బొన్నట్టు నీరంగితో." క్రీడా. పు. 94.

నీర చిచ్చెగయింప నేర్చినతల్లి

మాయలాడి.

"నీరఁ జిచ్చెగయింప నేర్చినతల్లి." గౌ. హరి. ద్వితీ. పం. 1198.

నీ రడుచు

నీళ్లను కొట్టు.

"వారణయానలు కరముల, నీ రడిచిన రవము మురజనిస్వనముగ." పారి. 4.31.

నీర ముంచిన సొరకాయ నెగసినట్లు

పై కెగయు.

సొరబుఱ్ఱ నీటిలో ముంచితే పైకి లేస్తుంది.

"నీర ముంచిన సొరకాయ నెగసినట్లు." ఉ. హరి. 4.28.

నీరసము చేయు

చులుకన చేయు, తక్కువపఱుచు, కించపఱుచు.

పాండు. 4.210.

నీ రాగు

నీరు నించు.

“కాఁగిన మేనితోఁ గన్నదమ్ముల నీ రాఁగి, యాడిన మాట లవియె యివియు.” తాళ్ల. సం. 4.18.

**నీరాటరేవు**

స్నానాలరేవు.

శీలా. 1.76.

**నీ రాడు**

1. నీరు తొలకు.

“ఒక మాట అంటే చాలు. వాడి కళ్లలో నీ రాడుతుంది.” వా.

2. స్నానం చేయు.

“మిన్నెట నీరాడం బోయెడిబేసి తాపసులు.” నరస. 5.57.

3. నీటిబాన.

**నీరాపనిందలు**

పట్టి అపవాదులు.

“...పాపజాతికానా! కన్నులు దెరువని పాపనిపై నీరాపనిందలు గడియించి యా నిసువు గోడు పోసుకొంటి వందుల నీ కేమి గలిగనే?”

సారం. 3.217.

**నీరాళ్లగొంది**

ఈశాన్యదిక్కు అని సూ. ని. వావిళ్ల ని. ఇత్యాదులు.

ఇది యింకను విచార్యము.

ఈశ్వరుని సూచించే సూచన లేవీ లేవు ఈ పదంలో.

“తళుకు దళుకన నింగి వాటించెఁ బలుమాఱు, నీ రాళ్లగొందిఁ గన్నియ మెఱుంగు.” పాండు. 4.21.

**నీరినడుమ త్రెంప గల**

అసాధ్యకార్యములను నెఱవేర్చగలట్టి.

జాణ సుమా అని సరసనగా మాటలాడుటలో.

నీటిని కోయడం మాటలా మఱి?

**పమా. 8.135.**

**నీరిగ**

ఒక విధమైన యాగ.

**నీరుకట్టు**

మూత్రకృచ్ఛ్రము.

ఒంటికి రాకుండా ఆగిపోవు వ్యాధి.

**నీరుకట్టె**

నీటిపాము.

**నీరుకాకినెపము**

లేని నెపము, లేని నింద.

“త్రి,స్తోక ప్రౌఢిని నీరుకాకినెపముల్ జోడించి పల్మాఱియో, హాకీడు ల్దమ రిట్లు పల్కుటకు నర్హంబె.”

రంగా. 2.218.

**నీరు కారి పోవు**

దిగాలు పడి పోవు, భయపడి పోవు.

“ఒక్క మాటంటే నీరు గారి పోయ్యే వాడివి. నువ్వేం చేస్తావు?” వా.

రూ. నీళ్లు కారిపోవు.

**నీరుకాఱు**

పట్టుకునే పనిముట్టు.

**నీరుకావి (దోవతి, పంచ)**

కా వెక్కిన పంచ.

చాకలికి వేయకుండా అను దినమూ ఉతుకుతూ ఉండడం చేత కావెక్కిన దనుటు. ఆచారవంతులు ఇలాంటి పంచలనే కట్టుతారు.

దీనినే సంస్కృతీకరించి 'సలిల కాషాయవస్త్రము' అని శ్రీనాథుడు ప్రయోగించినాడు.

"కన్నె చెంగల్వ పూవన్నె మించిన నీరు, కావి దోవతికట్టు కటిఁ దలిర్ప."
వి.క్ర. 7.143.

"కటిఁ బ్రాత మునుక నీర్కావి దోవతి పంచె, భ్రూమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు." జై. భా. 7.191.

"నిద్దమైన మడుంగు నీర్కావిదోవతి, కనకమేఖలతోడఁ గటి ఘటించి."
కాశీ. 1.39.

"చెడగారునీర్కావిపింజతోడ."
మను. 3.71.
చూ. సాహిత్యసమీక్ష.

# నీరుకాసులు

పుణ్యతీర్థములలో స్నానము చేయువారికి సంకల్పము చెప్పి స్నానాలు చేయించగా వారిచ్చుడబ్బు.

"తిలలు దర్భలు పూని తీర్థసన్నిధి మంత్రములు సెప్పి నీరుకాసులు గడించి." హంస. 2.152.

# నీరుకావ్వు

శోణితహారిత వర్ణములై సంధ్యవేళ కనబడే సూర్యకిరణాలు.

వావిళ్ళ. ని.
హరి. పూ. 7.160.

# నీరుకుక్క

జలశునకం.

శ. ర.

# నీరుకుప్ప

సముద్రం.

# నీరు కుమ్మరపురువు

కుమ్మరపురుగు.

నీరుకోడి ఇత్యాదులు కూడా ఊహ్యములు.

# నీరుకొలది తామర

నీరు ఎంతవరకూ ఉంటే తామర అంతవరకూ ఉంటుంది. పిండికొద్దీ రొట్టె వంటిది.

"తమవిద్య నెవ్వరే మాత్రము గనఁ జాలుదురు వారిదండను దన్మాత్రమ ప్రకటింతురు బుధులు, తముల మహిమ నీరుకొలఁది తామర సుమ్మీ!"
కళా. 2.95.

# నీరుకొలది తామరగా

ఎదుటి శక్తిసామర్థ్యములకు తగినట్లు, ఎదిరి హృదయము నెఱిగి తదనుగుణంగా.

"మగఁడే కొలఁదిగ నడిపినఁ, దగ నట్లే నీరుకొలఁది తామర వైయే, పగిదిఁ నడచెదవో నీ, దగు నేరుపు చూతు మింక దలిరుంబోడీ!"
యయా. 4.129.

**నీరుగడకోళ్లు**

"నీరుగడకోళ్లఁ గూడి మున్నీటిఁ గవయు." భీమ. 3.22.

**నీఱు గప్పిన నిప్పు**

నీఱు = బూడిద.

"మంచు మఱుఁగుపడిన మార్తాండుఁ డునుబోలె, నీఱు గవిసి యున్న నిప్పు వోలె, వేషధారి యైనవిష్ణుండు వోలె న,వ్విరటుకొలువు సేర నరుఁడు వచ్చె." భార. విరా. 1.228.

చూ. నివురు గప్పిననిప్పువలె.

**నీరు గారు**

ఉత్సాహము లేకుండు.

తపతీ. 2.17.

**నీరుగాలి పడు**

తాపము చెందు.

భాగ. 8.26.

**నీరుగుట్టు**

జలజంతువిశేషం.

**నీరు గొను**

దప్పి గొను.

"పోరఁ బాఱఁ దాల్చి నీరు గొన్నటు ప్రతి, బలము సెల్లఁ బాయ వడఁగఁ దోలి." కుమా. 11.37.

**నీరుచల్ల**

నీరుమజ్జిగ.

ఆము. 1.81.

**నీరుచిచ్చు గొను**

నీరుచిచ్చనువ్యాధి కలుగు.

"సలిలములు దొట్టి నీరుచిచ్చు గొని." చంద్రా. 5.63.

**నీరుచిచ్చు పడు**

నశించు.

**నీరుచుఱుకు**

మూత్రము విడుచునప్పుడు మంటపెట్టే రోగము.

**నీరు దేఱు**

నీరు నిండు.

"మోము వెల్లనై, కనలుచు నీరు దేఱుతెలిగన్నుల నాతనిఁ బుల్కుపుల్కునం, గనుఁగొని." మను. 2.66.

**నీరు పట్టు**

1. శరీరములో నీరు చేరు.

"ఇవ్విధంబున మెలఁగు నయ్యింతి యొంటి, తిండికతమున నినుమడి కండ పట్టి, నీరు పోసినమేనితో నిలుప రాని, మనసుచే జారభోగ మేమఱక తిరుగు." శుక. 3.351.

"శరీరం నీరుపట్టి లావుగా కనిపిస్తుంది తప్పితే బలమా? మన్నా?" వా.

చూ. నీరు పోయు.

2. నీరు సరిపడు.

"నా కీ ఊరునీరు పట్టింది. కాస్త ఒళ్లు చేశాను." వా.

**నీరు పడదు**

ఊరి వాతావరణము సరి పడ లేదు.

"ఆ ఊరినీళ్లు నాకు పడక వెళ్ళినప్పటి నుంచీ నాకు జబ్బులు పట్టుకొన్నాయి." వా.

'సరిపడక' అని కూడా అంటారు.

నీరుపదను

ఇనుము ఉక్కు కాచి నీటిలో అద్ది పదను పెట్టుట. అందువల్ల అది గట్టిపడుతుంది.

"ఘుమఘుమాధిక రుతాకుంతితాంభో రాశి, నిజసాయకమునకు నీరుపదను." చంద్రా. 1.81.

చూ. సాహిత్యసమీక్ష.

నీరుపాప

1. పసిపాప.

పార్వ. 3.100.

2. జలజంతువులలో ఒకటి.

హంస. 4.186.

3. నీటిమనిషి.

తపతీ. 4 64.

4. నీరుపాము.

నీరుగుట్టుపురుగు, నీరుకట్టు అనీ అంటారు.

నీరుపిల్లి

జలమార్జాలము.

శ. ర.

నీరుపోత లాడు

వసంతా లాడు, నీళ్లు చల్లు కొను.

"పౌరు లుత్సవమునం, గూడి నీరుపోఁత లాడి రొప్ప." కుమా. 9.51.

నీరుపోసిన మేను

లా వెక్కిన శరీరము.

బలసూచకము కాక వట్టి లా వయినప్పుడు 'వాడి ఒళ్లు నీరు పట్టింది' అంటారు.

"ఒంటి,తిండికతమున నినుఁడి కండ పట్టి, నీరు పోసిన మేనితో నిలుప రాని, మనసుచే జారభోగ మేమఱక తిరిగా." శుక. 3.348.

చూ. నీరు పట్టు.

నీరుప్రబ్బలి ఇత్యాదిగా చాల చెట్ల పేర్ల ముందు నీరు కాన వస్తుంది. నీరుబచ్చలి, నీరు బొద్ది వగైరా.

నీరుబుగ్గ

నీళ్లూరు బుగ్గ, నీటిజెల.

"గగనము నీరుబుగ్గ కెనగా..." ఆము. 1.80.

నీరుబుగ్గవంటి

చంచల మైన.

"నీరుబుగ్గవంటిది నిచ్చకొత్త లైనది... మేను నమ్మరాదు." తాళ్ల. సం. 9.60.

నీరుమట్టము

నీరు నిండిన భూభాగము.

నీరుమానిసి

నీటిమనిషి.

సాంబో. 1.199.

నీరు ముంపు

నీరు నిండిన ప్రదేశం.

నీరు ముట్టు

మలమూత్రవిసర్జన చేయు.

"రచ్చదెరువున గృహ వా టి మచ్చు మీఁద, నీటిచేరువఁ గొఱగాదు నీరు ముట్ట, వసుధమీఁదను దళము గాఁ గసవు బఱపి, వేగ మూత్రపురీషముల్ విడువవలయు." విష్ణు. పు. 4.182.

### నీరు మోయు

నీటితో నుండు, నీట మునుగు.

సాంబో. 3.105.

2. గర్భవతి అగు.

"శైవల మల్లికా వికచ సారసనీల సరోజ చక్ర కూర్మావయ వాఢ్యనిష్కలుష మానసపద్మిని నీరు మోచినట్లు విలసిల్ల గర్భకములంబును బోలిన కల్వలో మురు, స్రావము నున్న నీరనెడి జాడను జూపక చూపుచున్నెడన్." పార్వ. 2.7.

### నీరుల్లి

ఉల్లిగడ్డ.

### నీరువంక తుంగ

నవనవలాడునది, వర్ధిల్లునది.

"వెద నీరువంకతుంగ విధ మాయె మనసు." తాళ్ళ. సం. 11.122.

### నీరువట్టు

1. ఎండిపోవు.

"పాయఁ బాతిన కూడు నీర్వట్టు మడుఁగు." పాండు. 3.22.

2. దాహము గొను.

"రాత్రి జాగరణ భర శ్రాంతులై వారు, నిద్ర వొంది యుండ నీరు వట్టి, ధారుణీశ్వరుండు తన్మంత్రకలశోద, కంబు లెల్లఁ ద్రావెఁ గడుపు నిండ."

భార. అర. 3.202.

రూ. నీర్వట్టు.

### నీరువట్టులు గట్టు

ఎండిపోవు.

"నిర్మలతోయాస్నపనం బొనర్చిన శరీరం బేటికిన్ నీరువట్టులు గట్టెన్." కా. మా. 3.96.

### నీరువత్తిగ

భక్ష్యవిశేషం.

హంస. 1.105. శ. ర.

### నీరువరి

నీవారతృణం.

### నీరువామి

సముద్రం.

రూ. నీర్వామి.

### నీరు విడిచిన చేప

అస్థానాపతితమనుట.

"వాళ్ళమ్మ ఉన్నన్నాళ్ళూ హాయిగా బతికాడు. ఆవిడ పోయి అత్తగారింటికి వచ్చి చేరేటప్పటికి నీరు విడిచిన చేపలాగా అయిపోయింది పిడిబతుకు."

వా.

### నీరు విడుచు

1. పాసిపోవు, మొత్తబడు.

"రాత్రి అన్నంలో నీళ్లు పోయకుండా పెట్టడంవల్ల అంత అన్నమూ నీరు విడిచింది." వా.

పాసి పోయినప్పుడు నీళ్లు నీళ్లయి పోవడం సహజం.

2. వదలి వేయు, తర్పణము విడుచు.

"ఈ కాంతామణి కింక నీ ర్విడుచుటే యెబ్భంగి యుక్తమ్మగున్."

పాణి. 4.5.

### నీరు వెట్టు

పొలం చెట్లు మొదలగువానికి నీరు పారించు.

పాండు. 2.59.

**నీరెండ**
కొంచెంగా ఉన్న యెండ.

**నీరెత్తు**
నీళ్లు పెట్టు - మొక్కలకో. పొలానికో.
"నీరెత్తువేళల నీరెత్తు."
కళా. 4.79.

**నీరెత్తువంగ**
నీరువంకాయ.

**నీరొట్టు**
ఒక భక్ష్యము.

**నీర్కావి**
చూ. నీరుకావి.

**నీర్గప్పిన నిప్పు**
బూడిద గప్పిన నిప్పు.
"ముసుఁగు వెట్టి నీర్, గప్పిననిప్పుచందమున రాజనిభానన నిద్ర వోవఁగన్."
నిరంకు. 2.105.
చూ. నివురు గప్పిన నిప్పు.

**నీఱగు**
భస్మమగు, నశించు.
"నీ నింద విని గౌరి నీఱైననాఁడు."
బస. 3.73.

**నీఱు గప్పిన నిప్పు**
పైకి గొప్పగా కనబడకున్నా లోపల సత్త్వమున్న అన్న చ్ఛాయలలో వాడేమాట.
"మంచు మఱుఁగు వడినమార్తాండుఁడునుబోలె, నీఱు గవిసి యున్ననిప్పువోలె, వేషధారి యైనవిష్ణుండుఁబోలెన, వ్విరటు కొలువు సేర నరుఁడు వచ్చె."
భార. విరా. 1.228.

"తేఱుగురు రిపుల నిప్పడ, మీఱుదు రనిఁ గడిఁదిమూర్ఛమెయి నిట్లున్నా, రాఱని తేజంబులతో, నీఱుపయిం గవిసి యున్ననిప్పులుఁబోలెన్."
భాస్క. యుద్ధ. 590.
చూ. నివురు గప్పిన నిప్పు.

**నీఱు చేయు**
బూడిద చేయు, ధ్వంసము చేయు.
"మనోభవు నీఱు చేసి పోయిన."
కుమా. 5.53.
"నృపతి తత్కాండనివహంబు నీఱు చేసి."
జైమి. 2.70.
"నీరాష్ట్రమును నిన్ను నీఱు గావింతు."
గౌ. హరి. ప్రథ. పం. 1320.
నీఱు=బూడిద. (తమి. కన్న.)

**నీఱు వాఱు**
వ్యాపించు, బూడిద అగు.
"అధూపవహ్ని ........ మిఱుమిట్లు గొలుపుచు మీఁది కుబ్బుచును, నీఱు వాఱుచు వెండి నిట్ట వొడుచుచును."
పండితా. ప్రథ. పురా. పుట. 397.

**నీలాటిరేవు**
స్నానఘట్టము.
"నీలాటిరేవులో కాసేపు ఉంటే ఊళ్లో సంగతు లన్నీ తెలుస్తాయి."
వా.

**నీలికండ్లు**
అందమైన కండ్లు.

**నీలితనము**
దుర్మార్గము.
చం. రా. 4.22.
మాయమేడుపు అని బ్రౌన్.

**నీలితిన్నె**
ఇంద్ర నీలాలతో కట్టిన అరుగు.

**నీలిదట్టి**
నీలికాసె, కోక. వేట సాధనము.

**నీలిమందు**
నీలిఆకులలో తీసిన రంజక ద్రవ్యము.

**నీలిమబ్బు**
ఒక వేటసాధనం.
ద్వి. నల. 3.234.

**నీలివార్త**
గాలివార్త.
వారూ వీరూ చెప్పుకొనగా వినవచ్చుమాట. జనశ్రుతి.
బట్టలు బాగా ఉతకకున్నా ఎక్కువ తెల్లగా కనబడుటకై పిండి వేసిన తరువాత నీలిలో ముంచి యెత్తుతారు. నిజానికి ఆ గుడ్డ ఎక్కువ తెల్లబడక పోయినా తెల్లబడినట్లు కానవస్తుంది. దానిపై వచ్చిన పలుకుబడి కావచ్చును. ఇందులో అది యథార్థముకా దేమో అన్న ధ్వని ఉండనే ఉన్నది.
"ఆ పిల్ల ఏదో కట్టు తప్పి ప్రవర్తిస్తున్నట్లు ఒక నీలివార్త." వా.
చూ. గాలివార్త. నీలాపనిందలు.

**నీ వంటే నీ వను**
మాటకు మాట అను.
చూ. నీ వెంత అంటే నీ వెంత అను.

**నీవా నేనా అని**
నీవు గొప్పా, నేను గొప్పా అని.
"నీవా నేనా యనినప్పు డిప్పగిది."
గీర. 16.

**నీవు పుట్టగా పుట్టినవి**
నీతోనే పుట్టినవి – నీ వెంటనే పుట్టినవి.
అనగా వానికీ అతనికీ అవినాభావసంబంధ మనుట.
"గట్టివచేతలుం బసలుఁ గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ, బుట్టినవి."
పారి. 1.127.
వాడుకలో—'సత్యం వీడితోనే పుట్టింది.' 'వీడు పుట్టి అబద్ధం పుట్టింది.'

**నీవు వాడూ ఏ మవుతారు ?**
అతనిపోలికలు నీలో ఉన్నవనుట.
పోలికలు రక్తబంధువులకే సమానముగా ఉండును. నీకును అతనికిని ఏమి చుట్టరికము కలదు అనగా నీవు వానివలె ఉన్నావు అనుట.
"చేతోజాతుఁడు నీవు నే మవుదురో శీతాంశుచూడామణిం, బ్రీతుం జేయ."
ఉ. హరి. 2.133.

ఇట్లా వచ్చినవే—వాడబ్బ వీడు. వాడెల్లి యిది. వాణ్ణి చంపి పుట్టాడు ఇత్యాదులు.

**నీ వెంత అంటే నీ వెంత అను**

మాటకు మాట అప్పగించు – ఎదిరించు.

"వాళ్లిద్దరూ నీ వెంత అంటే నీ వెంత అనుకున్నారు." వా.

చూ. నీ వంటే నీ వను.

**నీ వే మన్నను చెల్లు**

వాడుకలో 'నీ వే మన్నా చెల్లుతుంది.' నీ వే మైనా అన వచ్చు ననుట.

"నీ వే మన్ననుం జెల్లు." కాశీ. 7.165.

**నీ సిగ్గు చిదక !**

ఒక తిట్టు.

**నీ సిగ్గు చిముడ !**

ఒక తిట్టు.

**నీళు లాడు**

స్నానం చేయు.

హరి. పూ. 5.178.

రూ. నీళ్ల నాడు.

**నీళ్ల ముంపుము పాల ముంపుము**

నీవు రక్షించినా భక్షించినా సరే. భార మంతా నీదే ననుట.

"నిన్ను శరణంబు వేడెద నీళ్ల ముంపు, పాల ముంపును వేయును బల్క నేల ?" హరి. 2.170.

చూ. నీట ముంచినా పాల ముంచినా.

**నీళ్లలోని ముల్లు**

పయికి కనబడనిశత్రువు.

"అడఁగి రటు నీళ్లలోని ము ల్లైరి గాని, నేఁడు దుదిగా ధరిత్రికి నెగడు పేరు." ఉ. హరి. 4.240.

**నీళ్లాడు**

1. స్నానము చేయు.

"అతఁడు సరస్వతి నవగాహనము సేయు,చుండి యాచేరువ కోర్తు తడుపు, గట్టక నీళ్లాడఁగాఁ జూడఁ దనదు శు,క్రము నిర్గమించిన..." భార. శల్య. 2.160.

2. ప్రసవించు.

' తెలిసి చక్కన వచ్చి దేవకి నీళాడె, రహస్య్మర మ్మని భోజరాజుతోడఁ, జెప్పిన..." భాగ. 10. పూ. 148.

"......వేల్పుపెద్ద, పాలఁతి కంతట నీళ్లాడుప్రొద్దు లయ్యె." భాగ. 8.50.

**నీళ్లార్చు**

స్నానము చేయించు.

"పాపకదంబజంబాలంబుఁ గడిగెడు, పగిది నీళ్లార్చిరి పాపనికిని." కా. మా. 3.27.

**నీళ్లు కారు**

దిగజారి పోవు.

నా. మా. 73.

**నీళ్లు గట్టు**

చెట్లు మొదలయినవానికి నీళ్లు పెట్టు.

"తనివి పొందినదాఁకను నీళ్లు గట్టి." విప్ర. 2.20.

**నీళ్లు చెల్లు**

ఋణము తీరు.

"నేఁటితో వీరి కిక్కడ నీరు చెల్లె." నందక. 136 పు.

**నీళ్లు త్రాగినట్లు**

1. అతిసులభము.
2. కంఠోక్తిగా, క్షుణ్ణముగా వచ్చు ననుట.

"మనుజనాథ కడమమంత్రంబు లా బ్రహ్మ,రాక్షసునకు నీళ్లు ద్రాగినట్లు." నిరంకు. 4.72.

"వాడికి తర్కశాస్త్రం నీళ్లు త్రాగినట్లే." వా.

"వాడు భాగవత మంతా నీళ్లు త్రాగినట్లుగా వప్పగిస్తాడు." వా.

"వాడికి పురాణం చెప్పడ మంటే నీళ్లు త్రాగినట్లే." వా.

చూ. మంచినీళ్ల ప్రాయం.

**నీళ్లు నమలు**

బదులు చెప్ప లేక యూరకుండు, సంకోచించు.

"నీళ్లు నమలెఁ గళ్యపుఁడు." గౌ. హరి. ప్ర. 122.

"నీ వా పురికిని మొదలం, బోవం బని యేమి చెప్పుము యథార్థముగా, నావుడును నీళ్లు నములుచు, నావిహగము చెప్పఁ గొంక నంచయు దానిన్." ప్రభా. 4.8.

"నీవు నీళ్లు నమలితే నిండెను వేదములు." తాళ్ల. సం. 6.156.

"ఎక్కడి కెళ్లావని అడిగితే నీళ్లు నములుతా వేమిటి రా?" వా.

**నీళ్లు పెట్టు**

చూ. నీళ్లు గట్టు.

**(కళ్ల) నీళ్లు పెట్టుకొను**

దుఃఖించు.

"వాళ్ల అమ్మ పేరెత్తేసరికి వాడు కళ్లనీళ్ళు పెట్టుకుంటాడు." వా.

**నీళ్లు పోసుకొను**

గర్భిణి యగు.

కొన్ని వర్గాలలో నేటికీ ఎక్కువగా ఉపయోగించే పలుకుబడి.

"ఏం పిన్నమ్మా! నీకోడలు నీళ్లు పోసుకుందా?" వా.

**నీళ్ళు పోసే దిక్కు లేదు**

ఆప్తు లెవరూ లే రనుట.

"వాడికి ఛస్తుంటే నీళ్ళు పోసేదిక్కు కూడా లేదు." వా.

**నీళ్లు ముట్టను**

చూ. గంగ ముట్టను.

**నీళ్లు మోపించు**

నీళ్లు మోయించు; నీచ మైన నౌకరీ చేయించు.

"సురారి బలిమి ధూర్జటి, నీళ్లఁ మోపించె." కుమా. 4.25.

**నీళ్లు మోయించు**

తనకు దాసుడుగా చేయించు.

"నా, యింటి కెల్లను నీళ్లు మోయింప నేని." విప్ర. 2.84.

**నీళ్లు వదలు**

అది యింక రా దని ఆశ వదులుకొను.

"వాడి కిచ్చా మంటే యిక నీళ్లు వదులుకో వలసిందే." వా.

నీళ్లు విడుచు
ఇక రావని వదలి వేసికొను.
"అందులో మాకుఁ గలనేల లన్ని నీళ్లు, విడిచితిమి కరణాలకుం బడఁగ లేక." నందక. 48. పు.
రూ. నీరు విడుచు.

నుగ్గాడు
నుగ్గునుగ్గు చేయు, ధ్వంసం చేయు.
ఇందుకు దగ్గఱిఛాయలలో.
"బాహాసి నుగ్గాడె దుర్మదు." కమా. 12.117.

నుగ్గు చేయు
నుగ్గునూచము సేయు.

నుగ్గునూచంబు లగు
ధ్వంస మగు.
"సైన్య, సముదయం బెల్ల నుగ్గ నూచంబు లగుచు." జైమి. 2.11.

నుగ్గునూచము అగు
ధ్వంస మగు.
"పులులం ద్రుంచి కడుంములం దునిమి దుప్పుల్ నుగ్గునూచంబు లై, పొలియం జేసి..." శుక. 1.265.
నూచము వేఱుగా ప్రయుక్తము కాదు. నుగ్గుతో కలిసే 'నుగ్గునూచ మగు' 'నుగ్గునూచముగా', 'నుగ్గు నూచము చేయు' అని ప్రయుక్త మౌతుంది.

"వేదచోర పురవప్రశ్రేణికల్ నుగ్గు నూ,చము గాఁ దాఁకె." దశా. 1.277.
"కొన్నిటి కుంభముల్ పగులఁ గొన్నిటి కాళుల నుగ్గునూచ గా ... అన్నిటి భీము డుత్కటగదాహతి సేనికవేఁట లాడఁ గన్." భార. భీష్మ. 2.261.
భాగ. 10.880.
"చ,న్గుబ్బలచే రవిక నుగ్గునూచము లయ్యెన్." రాజ. విజ. 3.130.

నుగ్గులు వాఱు
పిండి పిండి యగు.
"కులగిరు లైన నుగ్గులు వాఱు." గౌ. హరి. ద్వితీ. పం. 1764.

నుగ్గులు సేయు
1. పొడి చేయు.
"మాయ నుగ్గులు సేయు మాధవుని దంచనవు:రాయివో వైరాగ్య రచన జీవులకు." తాళ్ల. సం. 5.74.
2. పిడకలు చేయు.
"ఆమె నుగ్గులు చేసుకొని అమ్ముక బ్రతుకుతూ ఉంది." వా.

నుచ్చుకోక
మేకల, గొఱ్ఱెల చన్నులకు కట్టేగుడ్డ.
బస. 3.1118. పం.

నుచ్చుప్రాత
చూ. నుచ్చుకోక.

నుడికారము
పలుకుబడి, జాతీయము.
కొన్ని విడివిడి పదాల కున్న అర్థంకంటె వాని కలయికతో

విభిన్నార్థస్ఫూర్తి కల్గించే పదబంధం.

జైమి. 1.18.
కాశీ. 2.192.
శుక. 3.390.

నుడుగులు దప్పినా నోము ఫల మిచ్చును.

ఒకటి రెండు పొరబాట్లు జరిగినా చేసిన మంచిపనికి ఎప్పుడూ ఫలం ఉండనే ఉంటుంది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

తాళ్ల. సం. 8.220.

నుడువరి

వాచాలుడు.

నుడువరితనము

వాచాలత.

నుతి కను

ప్రసిద్ధి చెందు.

"పాతివ్రత్యంబున నుతి గనియు, నిట్టి దశ నొందితి..." కళా. 4.151.

నుతి కెక్కు

ప్రసిద్ధి చెందు.

"అతఁడు నుతి కెక్కు రామసేత్వంత రాళ, కలితషోడశదానవిఖ్యాతయశుఁడు." పారి. 1.13.

నుతి నాడు

స్తుతించు.

సన్నుతి చేస్తూ మాటలాడు అనునట్లు వచ్చినది.

"నుతి నాడఁ జెందేని ప్రతిదినంబు."

భీమ. 3.178.

నుదుట పట్టము గట్టు

స్థిరీకరించి ప్రకటించు.

"అమరావతీపురీ, పతి వని నేఁడ నీ నుదుటఁ బట్టము గట్టితి."

ఉ. హరి. 2.154.

పూర్వం ఒక బంగారురేకు మీాద ఇది ఫలానా అని వ్రాసి నుదుట కట్టుట అలవాటు. అశ్వమేధాముల్లో ఇది ఆచారం కూడ. అందు పై వచ్చినపలుకుబడి.

నునుపచ్చి

అప్పుడే తెచ్చిన.

"నునుపచ్చి పుట్టతేనియచవితో."

పాండు. 1.10.

నునుపరి

మంచివాడు.

నునుపు నున్ననితనం చదునైనది. తద్వారా లక్షణయా నిర్వక్రుడు అన్న అర్థంలో ప్రయుక్తం.

"నునుపరియును బోలె నోడక నగరుచనఁ జొచ్చి." బస. 5.135.

శ. ర. బ్రౌన్లు, వానినే ఉటంకించిన వావిళ్ల 'నునుపు కలది' అన్న అర్థం చెప్పినవి—అది ఇలాంటిచోట్ల కుదరదు.

నుసుపారు

నుస్నని.

"నుసుపారుమునిమిట్టనుసురువోతె."

క్రీడా. పు. 25.

నున్నగాలి

మందమారుతం.

"నున్నగాలికి నెలలైన పువ్వుఁబోదలే పొదలే పులకింప." కావ్యా. 2.67.

నుయ్యో కొండో అను

అదా యిదా అని తటపటాయిస్తూ కూర్చుండు.

"వ్రతము సాగింపక మీరియ్యెడ చలచిత్తులరై నుయ్యో కొండో యనం జనునె భూనాథా!" రుక్మాం. 5.131.

నుయ్యో గొయ్యో చూచుకొను

తెగించు - చచ్చు.

విసుగుతో 'నే నెక్కడో పడి చస్తాను' అని ముఖ్యంగా ఆడవాళ్లు అను మాట వరుస లోనిది.

"నే నింక యేవో నుయ్యో గొయ్యో చూచుకొంటాను. ఈ యింట్లో యీ మాటలు పడుతూ యింక ఒక్క క్షణం ఉండ లేను." వా.

నురువులు గట్టు

తెట్టులు గట్టు.

"నురువులు గట్టినట్టులు గనుంగొనన న్నొప్పెఁ దదింద్రగోపముల్." ఆము. 4.100.

నుగ్గాడు

నుగ్గగు.

కుమా. సం. 11.33.

నుఱిచి యాడు

సంహారించు.

రాఘవ. 4.142.

నుఱుమాడు

పొడి చేయు, సంహారించు, ఖండించు ఇత్యాదిచ్ఛాయలలో.

నుఱుము చేయు

చూ. నుఱుమాడు.

నుఱుము సేయు

చూ. నుఱుము చేయు.

నులకమంచము

నులక అల్లిన మంచము.

వి. పు. 4.218.

నులకశయ్య

నులకమంచము.

శివరా. 3.9.

నులిగాయ

దెబ్బ తగులకుండా కట్టే తాయెతు, పూస, కాయ.

"త్రాట నులిగాయ గూడి పాదముల గట్టు." కాశీ. 4.11.

నులిగొను

చిక్కుపడు, చిక్కుకొను.

కళా. 3.83.

నులిగొల్పు

నులిపెట్టు, మెలిపెట్టు.

నులిపచ్చి

కొద్ది పచ్చి.

నులిపడు

దోపిడి పోవు.

నులిపురుగు

కడుపులో పుట్టే చిన్న పురుగు.

నులివంక

చిన్న వంక—బొంగులలో.

నులివడు

మెలిక పడు.

నులి వాడు

కొద్దిగా వాడిపోవు.

"కర్ణబిలమున నులి వాడు లాలసి యెన్న." జైమి. 7.197.

నులివాళ్లు వాడు

వసివాడు.

"నులివాళ్లు వాడి తనూలత సోల." గౌ. హరి. ద్వితీ. పం. 911.

నులివెచ్చ

గోరువెచ్చ.

"విరహులమై సోఁకి వేఁడి యా వెన్నెలఁ, బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి." పారి. 2.49.

"తెలినులి వెచ్చయోగిరము తియ్యని చారులుఁ దిమ్మనంబులున్." ఆము. 1.81.

చూ. గోరువెచ్చ.

నులివెట్టు

మెలివెట్టు.

నులివేడి

నులివెచ్చ. విక్ర. 5.219.

నువుగింజ బ్రాహ్మడు

క్షుద్ర దానాలు పట్టే బ్రాహ్మడు.

సామాన్యంగా మిగత గ్రహాలకు చెందిన ధాన్యాలను దానం చేస్తే అందరూ పడతారు. కాని శనికి సంబంధించిన నువ్వులూ, రాహుకేతువులకు సంబంధించిన ధాన్యాలూ పట్టడం కొందరే చేస్తారు. వారిని కొంత తక్కువచూపు చూస్తారు.

నారాయణదాసు భీష్మచరిత్ర.

నువ్వుగింజ వ్రేయుటకు చోటు లేదు

ఇసుక వేస్తే రాలదు.

"వారవేటులాడ వాలమ్ము లిల యిచ్చి, చనియెఁ బైకి నెగసి తునిసి పడియు, నువ్వుగింజ వ్రేయనుం జోటు లేకుండ, ముసుఁగు వడఁగ నిండె ముజ్జగములు." రామాభ్యు. 8.222.

నువ్వుపువ్వులాంటి ముక్కు

చక్కని ముక్కు.

ముక్కును నువ్వుపువ్వుతో ఉపమించడం మన ప్రబంధాలలో అలవాటు.

"నువ్వుపువ్వు నవ్వు జవ్వని నాసిక." విజ. 1.84.

నువ్వుల కండ్లను నోర బోసి కొను

అనవసరంగా అనర్థం తెచ్చుకొను.

"మర్త్యులకున్, మూరఫువారిఁ దన్నిఁ గన నువ్వుల గండ్లను నోరఁ బోసికొన్నా రము కాఁ దలంపు లలనా!"
ఉ. హరి. 5.158.

దప్పి తీర్చుకొనుటకై నువ్వులను నోటిలోనూ కండ్లలోనూ పోసికొన్నట్టు. అనగా కానిపనికై ప్రయత్నము సేయుట.

నుసిపురుగు

చెట్టు తొలిచే పురుగు.
బ్రౌన్.

నుసులుకొను

నులుముకొను.
"చంద్రరేఖయు ముఖకాంతి పడలి కనులు, నుసులుకొంచును మేల్కాంచి మసలఁ జొచ్చె."
చంద్ర. వి. 3.135.

నూగారు

రోమావళి, ఆరు.

నూగుటారు

చూ. నూగారు.

నూగుదోస

కూతురు బుడమ.

నూట నాట

నూటికీ కోటికీ.
"...దక్క ప్రశంసల నూట నాట ద, క్కనఁ గలరే నినుం దొరయు కీర్తి పరుల్."
పాణి. 1.38.

నూట వెయ్యింట నొకతె(డు)

అపురూప మనుట.
"ఎంచి చూచిన నూట వెయ్యింట నొకతె, గాక సతు లెల్లఁ జారసంగమ సుఖైక,పరత..."
శుక. 3.520.
చూ. నూటికీకోటికీ.

నూటి కొకరు

అరుదు.
"నూటి కొక రైన నచ్చుట నీడుకోరె, కాంద్రలో."
శ్రవ. 3.11.
రూ. నూటి కొకడు కోటి కొకడు. నూటికీ కోటికీ ఒకటి.

నూటి కొక్కఁడు

అరుదు.
"వైదికపుఁ జెయ్యుల మానిసి నూటి కొక్కఁడే."
పాణి. 4.133.
చూ. నూటి కొకరు.

నూత పడెదవా? పాతఱ పడెదవా? చెప్పు

ఏదో ఒకటి త్వరగా చెప్పు అని తొందర పెట్టుపట్ల ఇదే మన్యాయం అని అనుమాట. వాడుకలో-ఒళ్లో పెడతావా? దళ్లో పెడతావా? అని కూరు చుంటే ఎట్లా? అంటారు.
"జడ లల్లుచుఁ బిన్నపుడే, పడఁతులు తను నూతఁ బడెదో పాతఱఁ బడెదో, నుడువు మనుమాట నిజమై, పడె నూతను నౌర నూఱుబార లనంగన్."
సారం. 3.222.

నూతిలో బేతాళాలు పుట్టు

మంచికి పోతే చెడుగు పుట్టు. నీళ్ళకోసం నూతికి పోతే దయ్యం అందులోంచి లేచి వచ్చె ననుట.

"తవ్వుఁడు నూతిలోనె బేతాళాలు పుట్టేని." తాళ్ల. సం. 3.223.
చూ. నూతుల్ ద్రవ్వ బేతాళముల్.

నూనె అంటు

అభ్యంగనస్నానములో –
"కమ్మనూనె మైనంటి." హర. 2.89.

నూనెముడి

దువ్వుముడి, కీలుగంటు.
"ఒక్కర్తు...సుగంధ, తైలమున నింతి తల యంటి తార్చి తీర్చి, నూనెముడి సంఘటించెను నూనెముడికి." కాళిందీ. 5.91.

నూనె యంటు

తల యంటు.
అభ్యంగన స్నానాదులలో తలపై నూనె యంటుట అలవాటు.
"సంపెఁగ నూనె యంటె నొక చంద్రనిభానన కంసవైరికిన్." పారి. 2.9.
రూ. నూనె అంటు.

నూరిపోయు

బాగా బోధించు.
"పొందించు నొకవేళఁ బూవిల్తు శాస్త్రంబుఁ, జదివించు నొకవేళ శయ్యా జాతి, నూరి పోయును నొకవేళ నారజంబు, వచ్చె ననిపించు నొకవేళ బంధవిధము." రాధి. 1.
"తనయులకును మనుమలకును, దన నేసపు నూరిపోసి..." కవుత్స. 3.12.
రూ. నూటి పోయు.

నూరు నిండు

ఆయుస్సు నిండు.

2—20

నూరేళ్ళు ఆయుస్సు కదా?
"పటుకునఁ దెగ దైత్యభామల మెడ తాళ్లు, మటుమాయ దైత్యులకు మఱి నూరూ నిండెను." తాళ్ల. సం. 11.225.

నూటాఱులు

ఎక్కువమంది.
"నూటాఱు సంత లేకీభవించిన భంగి." పాంచా.
"నొచ్చిన తరువాత గిరులు నూటార్లు వడ నవ్వుచున్నె?" రామాభ్యు.
"ఆ తీర్థానికి నూటార్ల మంది పోతూ ఉంటారు." వా.

నూటి పోయు

ఊరికే బోధలు చేయు.
"తనయులకును మనుమలకును, దన నేరుపు నూటి పోసి..." కవుత్స. 3.12.
"ఆవిడ యేం నూటి పోసిందో యేమో! వాడికి మన పాలకు వే యిప్పుడు గిట్టదు." వా.
రూ. నూరిపోయు.

నూఱుకొని త్రాగు

వేధించు.
"నూఱుక త్రావు నీతఁడు కనుంగొనునంతటిలో." కా. మా. 3.205.
"ఆ అత్త కోడలిని ఊరికే నూఱుకుని తాగుతుంది." వా.

నూఱు నిండు

ఆయుర్దాయము తీరు.
"ఇంతటన్, నూఱును నిండె నిందఱకు నుగ్రహ మీశ్వరుఁ డేమి సేయునో," కా. మా. 3.205.

"బ్రహ్మకు నూఱును నిండె."
వర. రా. కిష్కి. పు. 427. పం. 16.
మన సృష్టిలో వందయేండ్లు పూర్ణాయుస్సు. దానిపై వచ్చినపలుకుబడి.
"ఈ చిన్న వయస్సులోనే నీకు నూఱేళ్లూ నిండా యని నే ననుకో లేదు రా కొడుకా! వా.
చూ. నూరు నిండు.

## నూఱు మగనిలువులు
శతపురుషప్రమాణం. నూర్గురు మనుషుల యెత్తు. 'ఏడు నిలువుల లోతు, పది నిలువుల పొడవు' వాడుకలో నేటికీ వినవచ్చేవే.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 486.

## నూలిగరసు
బట్టతల.

## నూలిపున్నమ
జంధ్యాలపున్నమ – శ్రావణ పూర్ణిమ – ఉపాకర్మ అనీ అంటారు. కొత్తయజ్ఞోపవీతాలు వేసుకునే రోజు. జందెం నూలుపోగనుట ఉన్నదే.
పండితా. ప్రథ. పురా. పుట. 361.

## నూలుకొని చెల్లు
నడచు.
"ఈ మెవ్విధి నూలుకొని చెల్లె."
భార. భీష్మ. 1.232.

## నూలు పట్టినట్లు
నూలు పట్టి గీత గీసినట్లు, తిన్నగా.

## నూలువాసిలో తప్పు
కొద్దిలో తప్పిపోవు.
చూ. తలవెంద్రుకవాసిలో తప్పు.

## నూల్కొను
అధిక మగు.
"వాలుఁగన్నుల ననుసిగ్గు నూల్కొనఁ గనుంగొన వేల." పారి. 1.117.
ఇలాగే నూల్కొల్పు, నూలుకొలుపు, నూలుకోలు ఇత్యాదులు.

## నెకబికలుగ పోట్లాడు
సంకులసమరము చేయు.
"కడు బెట్టు వడి, న్నెకబికలుగఁ బోట్లాడుచు, వికసిల్లెడు నాకడింది వీరులయందున్." కళా. 8.104.

## నెక్కొను
ఉండు.
నెలకొను ఇత్యాదిచ్ఛాయలలో ఇందులో నుండి నెక్కోలు, నెక్కొలుపు ఇత్యాదులు ఏర్పడినవి.

## నెగడ్తకు చను
పేరు కెక్కు, ప్రసిద్ధి చెందు.
శుమా. 1.102.

## నెగయుతెంచు
పైకి తెలు.

"...నీరులోననుండి నెగయుబెంచె."
భార. ఆది. 5.193.

నెగవైచు
ఎగవేయు.
కళా. 6.14

నెగులుకోలు
పీడిత మగు.
భాస్క. రా. యు. 5.80.

నెగులుపడు
పీడ నొందు.

నెగులుపఱుచు
పీడించు.

నెగులుపెట్టు
బాధించు.
భా. రా. అర. 2.303.

నెగులు మాన్పు
దుఃఖము పోగొట్టు.
"ఇన్నెగులు మాన్ప వలదా, కన్నారం గనినబంటు గలఫల మనుచున్."
కా. మా. 3.85.

నెగులు మోవ పలుకు
కీడు కలుగు నని సూచించు.
"అని వాని వరములోనన, మును ముట్టఁగఁ గొంత నెగులు మోవఁ బలికె నన్."
ఉ. హరి. 2.189.

నెగ్గుకొను
జయించు.
పార్వ. 3.44.

నెచ్చెలికత్తె
చెలికత్తె - నెచ్చెలి అని తర్వాత బాగా వాడుక.
"అని నెచ్చెలికత్తెకుఁ జెప్పె సమ్మతిన్."
కుమా. 5.131.
ఇలాంటివే నెచ్చెలికాడు, నెచ్చెలికారము, నెచ్చెలితనము ఇత్యాదులు.

నెచ్చెలువ
స్త్రీ. సుందరి.
ఉత్త. రా. 1.171.

నెటిక విఱుచు
మెటికలు విఱుచు.
ఆడవాళ్లు ఏదైనా సరిపడనప్పుడు 'అది పాడుగాను' అంటూ చేతుల మెటికెలు విరవడం అలవాటు. అందుపై వచ్చినపలుకుబడి.
"తెలిపి గని చూచినట్టిపతివ్రతలును, నిజకులాచారవృత్తిపై నెటిక విఱువ."
శుక. 3.15.

నెటికతట్లు
ఒక బాలక్రీడ.
రూ. నెటికతట్లు.

నెటికలు విఱుచు
పండి. పురా. 114. పు.
చూ. నెటిక విఱుచు.

నెటికె విఱుచు
చూ. నెటిక విఱుచు.

నెట్టపంటగ
నిష్కారణముగా, నిష్ప్రయోజనముగా.
"నెట్టపంటగ శోకింప నీకు నేమి, వచ్చె..."
దేవీ. 4.366.

**నెట్టికసీలలు**

చిన్నవారు.

నేఁడు 'బాటికె' అన్నట్లు.

"నెట్టికసీలలు మదిలోఁ, బుట్టిన హర్షమున." జైమి. 6.190.

**నెట్టుకొలుపు**

నెలకొలుపు.

"ఉల్లంబునం గల్లగుట్టు నెట్టు కొలిపి." కళా. 5.20.

**నెట్టుడుగాయ**

ఒక పిల్లలఆట.

హంస. 3.146.

**నెట్టువడగా**

రాసులు వడగా.

హెచ్చుగా ననుట.

'ఇతరమార్గము లెల్లా నెట్టువడ దోసినారు." తాళ్ల. సం. 5.318.

**నెట్టోడు**

చేష్టలు దక్కు.

"చిట్టులిక్కి మూర్ఛిల్లి బిమ్మటిఁ బొంది, నెట్టోడి లింగసన్నిహితులు దక్క." బస. 5.130. పు.

**నెత్తటిల్లు**

శ్రమ దీర్చుకొను.

"వేడుకలు మీఱ సురతాంతవేళ యందు, నెఱియఁగా బూవుఁబాన్పున నిద్రఁ జెంది, నెత్తటిల్లిరి మలయాద్రి నిలయపవన, గతుల నూర్పులు విలసిల్లఁ బతియు సతియు." భాను. 4.97.

**నెత్తపలక**

జూద మాడేపలక.

వాల్మీ. 3.84.

**నెత్త మాడు**

పాచిక లాడు.

"తానును సతియు నెత్తం బాడు తఱిని."

పండితా. ప్రథ. పురా. పుట. 368.

"నెత్త మాడుట భక్తి నీతి గాదనియో." అదే. ప్రథమ. పుట. 370.

"నెత్తం బాడిరఁ బందె మిమ్మనుచు నే నీ కౌస్తుభం బంటఁగా." రాజగో. 4.36.

చూ. పాచిక లాడు, దాయా లాడు, దాయ మాడు.

**నెత్తికాయ**

తలకాయ. బ్రౌన్.

**నెత్తికి కన్ను లెక్కు**

పొగ రెక్కు.

"కాసు వ్యయపోక నెత్తికిఁ గన్ను లెక్క, క్రొవ్వి యున్నారు వో రాచ గొఱియ విప్రుఁడు." నలచ. 2.125.

**నెత్తికి కళ్ళు వచ్చు**

పొగ రెక్కు.

"వాడికి నెత్తికి కళ్లు వచ్చాయి. మన మాట యేం వింటాడు ?" వా.

**నెత్తికి చెప్పు లడుగు**

పెద్దలను ధిక్కరించు, పొగ రెక్కి మాట్లాడు.

"వాడు నెతికి చెప్పు లడుగుతాడు. వానిదగ్గరికి పోవడం లాభం లేదు." వా.

**నెత్తికి చేతులు వచ్చు**

దిగులు కలుగు.

విచారంగా ఉన్నప్పుడు తల పై చేతు లుంచుకొనుట అలవాటు.

చూ. తలపైకి చేతులు వచ్చు.

**నెత్తికి పస రెక్కు**

పొగ రెక్కు.

"తత్కాలనం బస రెక్కు నెత్తికిన్."
పాండు. 5.101.

**నెత్తి కెక్కు**

తగని పెత్తనము చలాయించు.

కూడనివారిని గౌరవించగా యిక నీ మాట వినక నీ పైనే పెత్తనం చెలాయిస్తారు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"అలాంటివాణ్ణి దూరంగా ఉంచాలి గానీ కాస్త పలకరిస్తే నెత్తి కెక్కుతాడు." వా.

రూ. నెత్తి పై కెక్కు, నెత్తి మీది కెక్కు, నెత్తి పై కెక్కి కూర్చుండు.

**నెత్తిగాలము**

తల నడచునట్టి గడారు. అనగా నిత్యభీకరుడు, ప్రమాదకారి అనుట.

"మాయావాది నెత్తిగాలము."
పండితా. ప్రథ. వాద. పుట. 512.

మా. హృదయశల్యము.

**నెత్తిన ఎక్కించుకొను**

అతి చనవు ఇచ్చు.

నిరసనార్థంలోనే ఉపయోగిస్తారు.

"వాడు పెళ్లాన్ని నెత్తిన ఎక్కించుకున్నాడు. ఇప్పుడు అనుభవిస్తున్నాడు." వా.

**నెత్తిన గుడ్డ వేసుకొని పోవు**

దిక్కు లేక దిక్కుల పట్టి పోవు.

చూ. నెత్తిన ముసుగు వేసుకొని పోవు.

**నెత్తిన చేతు లిడు**

దిగులుపడు.

దిగులు పడినప్పుడు నెత్తిన చేతులు పెట్టుకోవడం అలవాటు. అందుపై వచ్చిన పలుకుబడి.

"హరహర! నెత్తిఁ జేతు లిడి యశ్రులు గన్నుల నొల్క..." కాశీ. 2.156.

"ఏమిరా! నెత్తిన చేతులు పెట్టుకొని కూర్చున్నావు? అంత కష్టం ఏం వచ్చింది?" వా.

**నెత్తిన చేతులు పెట్టి....**

ప్రమాణము చేసి.

"నెత్తిఁ జేతులు వెట్టి నిక్కముల్ నొడివి."

గౌ. హరి. ద్వితీ. పం. 614.

**నెత్తిన నోరు పెట్టుకొని**

పదేపదే విడవకుండా చెప్పితి ననుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"చచ్చె నీలోకమున నాత్మసాక్షి యనుచు, నెత్తి నోరిడి కొట్టుకో నిండు కన్న." పెన్నేటి.

"ఈ వెధవపని మనకు తగదురా అని నెత్తిన నోరు పెట్టుకొని చెప్పా. అయినా వాడు విన లేదు. ఇప్పుడు అనుభవిస్తున్నాడు." వా.

## నెత్తిన పెట్టుకొను

గౌరవించు. ఆదరించు.

"వాడు పండితు డంటే నెత్తిన పెట్టు కొంటాడు." వా.

"మా అమ్మ ఊరునుంచి రమ్మంటే రాదు కానీ వస్తే నెత్తిన పెట్టుకొని పూజిస్తాను." వా.

## నెత్తిన బట్ట వేసుకొని పోవు

చూ. నెత్తిన గుడ్డ వేసుకొని పోవు.

## నెత్తిన ముసుగు వేసికొని పోవు

సర్వస్వం పోగొట్టుకొని ఊరు విడిచి పోవు.

"సంసారం అంతా ఛిన్నాభిన్నం అయిపోయి వాడు నెత్తిన గుడ్డ వేసు కొని పోయాడు." వా.

## నెత్తిన వేసికొను

బాధ్యత నంతా తానే భరించు.

"ఇంటిపని నంతా ఆ కోడలే నెత్తిన వేసికొని చేస్తుంది." వా.

## (నా)నెత్తిన వేసిపోవు

బాధ్యతను అంటగట్టు.

"మా అన్నయ్య పోతూ పోతూ ఈ పిల్లల నందరినీ నా నెత్తిన వేసి పోయాడు." వా.

## నెత్తి నెత్తి కొట్టుకొను

(ఒకరి అకృత్యంవల్ల) నొప్పి పడు, బాధపడు.

"కొడుకు చెడుపోకలు పోతున్నా డని తెలిసి వాళ్లనాన్న నెత్తి నెత్తి కొట్టు కొన్నాడు." వా.

## నెత్తి నోరు బాదుకొను

విలపించు.

మనసు కష్టపెట్టుకొను.

"కొడుకు ఊరంతా అప్పులు చేశా డని తెలిసేసరికి వాళ్ల నాన్న నెత్తీ నోరూ బాదుకొన్నాడు." వా.

రూ. నెత్తి నోరు కొట్టుకొను.
.........మొత్తుకొను.

## నెత్తిపైకి కళ్లు వచ్చు

పొగరెక్కు.

"పొట్ట పొడిచిన నక్షరము గనఁబడని, వీరి కెల్లను........., నెత్తికిని వచ్చెఁ గన్నులు నేఁడు గాఁగ."

నందక. 31 పు.

## నెత్తిపై కెక్కు

తలమీాద పడు.

"నిండా నెత్తిపై కెక్కు..."

శ్రవ. 5.4.

## నెత్తిపై చేతులు పెట్టు

మోసగించు, పాడు చేయు.

"ఎంతమంది నెత్తిపై చేతులు పెట్టో వాడు ఇంత ఆస్తి సంపాదించాడు."

వా.

రూ. నెత్తిమీాద...

## నెత్తి మాయు

అభ్యంగనస్నానము చేయక

పోయినప్పుడు తల మాసిన దంటారు.

"ముంగిట నిల్చి యోపౌరుగుమద్దియ! నాపతి నెత్తి మాసె నే, నంగడి కేఁగలే నిపు డహార్ముఖ మాతనిఁ దెచ్చి యిచ్చెదన్." శుక. 2.381.

చూ. తల మాయు.

## నెత్తిమీద దేవర చేసుకొను

అనవసర ప్రాముఖ్య మిచ్చి నెత్తిన పెట్టుకొను.

"శ్రోత్రవారలఁ జేర్చికొని నెత్తిమీఁది దేవరలఁగాఁ జేర్చికొన్నచో వార లిచ్చ కాలమారివా రై తమ వచ్చిన పనులు చూచుకొందురు."

ధర్మజ. 8 పు. 5 పం.

## నెత్తిమీద నీళ్లకుండ పగులు

శోకాతిరేకము కలుగు.

ఏడుస్తూ కూర్చుండె ననుట.

"అలా ఏమన్నా అన్నా వంటే దాని నెత్తిమీద నీళ్లకుండ పగులుతుంది. నీవే వెళ్లి బతిమాలవలసి వస్తుంది." వా.

## నెత్తిమీదికి చేతులు వచ్చు

విచారపడు.

దిగులు పడినప్పుడు రెండు చేతులతో తల పట్టుకొను టపై వచ్చిన పలుకుబడి.

"పాపం! ఈ దెబ్బతో వాడికి నెత్తి మీదికి చేతులు వచ్చాయి." వా.

## నెత్తిమీది గింజ నేలమీద పడు

వివాహ మగు.

"నెత్తిమీది గింజ నేలమీద పడింది మొదలు ఆ దంపతు లెప్పుడూ కీచు లాడుకుంటూనే ఉన్నారు." వా.

## నెత్తిమీది చిచ్చు

సన్నిహిత మైన ఆపద – నిత్య బాధాకరము.

తాళ్ల. సం. 12.198.

## నెత్తి మొత్తు భస్మాసురులు

ఉపకారికే అపకారం చేయువాడు.

భస్మాసురుని కథపై ఏర్పడిన పలుకుబడి.

"ఆసమెయిక్ వరంబు గొని యూపయి దేవుని నెత్తి మొత్తు భస్మాసురు లిప్పుడుం గలరు." గీర. 21.

## నెత్తి వాచిపోవు

విసుగెత్తి పోవు, విసుగు కలుగు.

"పొద్దున్నుంచీ వీడితో మొత్తుకొని మొత్తుకొని నెత్తి వాచిపోయింది." వా.

## నెత్తి వాచునట్లు (చీవాట్లు పెట్టు)

ఎక్కువగా.

"ఆ సంగతి తెలిసి వాళ్లనాన్న నెత్తి వాచేట్లు చీవాట్లు పెట్టాడు." వా.

"నెత్తి వాచేట్లు నాలుగు తిట్టేసరికి వాడు కిక్కురు మనలేక పోయాడు."

వా.

## నెత్తి వాచేట్లు చీవాట్లు పెట్టు

గట్టిగా మందలించు.

"వాణ్ణి పిలిచి నెత్తి వాచేట్లు చీవాట్లు పెట్టాను. ఇంకైనా బుద్ధి గలిగి ఉంటాడేమో చూద్దాము." వా.

## నెత్తీ నోరూ కొట్టుకొను

మిక్కిలి బాధపడు.

"నాలుగో పెళ్లాం పుట్టినిల్లు చేరిం దనేసరికి వాడు నెత్తీ నోరూ కొట్టు కుంటూ బయలుదేరాడు." వా.

## నెత్తుట జొత్తిలు

నెత్తుటిలో తోగు.

"సురేంద్రుండు నెత్తుట జొత్తిల్లుచు మూర్ఛవోయి కరిపైఁ బూలెన్ విచే తన్యుఁడై." ఉ. హరి. 1.45.

## నెత్తుట బొట్టిడుకొను

పగ తీర్చుకొను.

"పగం దనదు నెత్తుట బొట్టిడుకొంట కాక వ్రాసనక యనఁగ మొగం బమరు." ఆము. 5.12.

## నెత్తురుకూడు

రక్తపాతం చేసి గడించిన భాగ్యము.

"...తినఁ జాలను నెత్తురుకూడు మాధవా!" పాండవో. 11.

## నెత్తురుగందు

పసిపాప.

"కటకటా యిట్టి నెత్తురుగందు నిచట, వైచి పోవంగ వలసెనే నీచగతిని." భోజ. 6.25.

## నెత్తురుగడ్డ

ఒక విధమైన కురుపు.

## నెత్తురుగళ వట్టు

రక్తం చూడగా మూర్ఛ వచ్చు.

"తెట్టువలు గట్టి యున్న క్రొన్నెత్తురులు గనుంగొని నెత్తురుగళ వట్టి..." కవల. 2.148.

## నెత్తురుగుడ్డు

పసిపాప.

చూ. నెత్తురుగందు.

## నెత్తురు గ్రక్కు

ఏదైనా పెద్దదెబ్బ తగిలి నప్పుడూ, మూర్ఛ పోనున్న ప్పుడూ, కొన్నిపట్టుల చని పోవునప్పుడూ నెత్తురు గ్రక్కుట అలవాటు. లక్షణ యా చావుదెబ్బ తిని అని అర్థము.

"నెత్తురు గ్రక్కుచు మూర్ఛా, యత్తుం డై తెలిసి." ఉ. హరి. 1.32.

"కుక్కలు వెంటఁ బడ్డ నొక కొన్ని మృగంబులు వాతె నెత్తురుల్, గ్రక్కుచు నేలఁ గూలె." ఉ. హరి. 2.120.

"వాడు ఆ దెబ్బకు నెత్తురు కక్కు కున్నాడు." వా.

## నెత్తురుపొద్దు

మధ్యాహ్నం.

మను. 4.60.

## నెత్తురుబంక

రక్తగ్రహణి, రక్తవిరేచ నాలు.

## నెత్తురుబొత్తు

ప్రాణస్నేహితుడు.

యయా. 3.115.

## నెత్తురువాలు

ఎఱ్ఱ సగు.

నెత్రుపట్టము

నెత్తురుకూడు వంటిది.

"బాసలతోఁ గడు నెత్రుపట్ట మైన పాలము." తాళ్ల. సం. 10.52.

నెప మార్చు

నిర్మూలించు.

"వీడు ప్రాణు నరిగిన వెదకి వెదకి, మనల నెప మార్చుఁ గా కేల మనఁగ నిచ్చు, నితని వధియింత మని." కాశీ.

నెపపడు

దోషి అగు; చెడ్డవా డని పించుకొను.

వేంక. పంచ. 1.514.

నెప మిడు

సాకు పెట్టుకొను.

"భూసురేంద్ర! యే,కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్క రించులా గింతియ కాక." మను 2.41.

నెప్పుకొను

నెలకొను.

మను. 4.34.

నెమరుకు వచ్చు

జ్ఞప్తికి వచ్చు.

మాటా. 108.

నెమరునకు తెచ్చుకొను

జ్ఞప్తికి తెచ్చుకొను.

"ఒక్కచోఁ దర్కోక్తిఁ ద్రొక్కుడు వడు దీవు, తెచ్చుకో నెమరున కిచ్చ వత్స!" బహులా. 1. ఆ.

నెమరు పెట్టు

నెమరు వేయు.

"పై, పెచ్చులు దీనికి స్నె మరు పెట్టుచు నందిని యుట్టు నాకుచున్." పారి. 2.96.

నెమరు వేయు

చూ. నెమరు పెట్టు.

నెమ్మలిపరుజు

కత్తిపిడి.

నెమ్మి సేయు

ఇష్టపడు.

"నిన్ను నాభికి డిగ్గంగ నెమ్మి సేయుఁ, బద్మలోచన మరిగి భూపాలుకరము." నైష. 7.172.

నెమ్ముకొను

చెమ్మగిల్లు.

నెమ్మొగము

ముఖము.

నెయ్యపుగలను

సమరము.

దశా. 1.268.

నెయ్యపుగినుక

ప్రణయకోపము.

నెయ్యి మాడు

వియ్యమందు, స్నేహము చేయు.

విష్ణు. పు. 2.209.

నెయ్యము తియ్యము

ప్రేమాదరములు. జం.

"క,న్నీరు కరంబునం దుడిచి నెయ్యముఁ దియ్యముఁ దోఁప నిట్లనున్." పారి. 1.134.

"నెనరునఁ జేర నేఁగి మది నెయ్యము
తియ్యముఁ దోఁప ని ట్లనున్."
రాజగో. 2.10.

**నెరజాణ**

నేర్పరి.

"...ఆ పలుకుపోడిమి యా నెఱ
జాణకే తగున్." రాధి. 2.58.

**నెరపద్దు**

గొప్పతనము.

"నీదె నెరపద్దు నరయఁగా నీదె
ముద్దు..." రాధి. పీఠిక. 36.

**నెరవచ్చు**

వినవచ్చు.

దశకు. 1.75.

**నెరవాడి యైన**

నిశిత మయిన.

"నెరవాడి యైనముక్కుల." రాధా.

**నెరవాదిబిరుదు**

ప్రసిద్ధుడు.

"కులములో నెరవాది బిరు దై."
రాధా. 3.46.

**నెరసాని**

నేర్పరి.

తారా. శశాం. 3.112.

**నెరసు జూపు**

కడకంటి చూపు.

"నెరసుఁజూపులతో నె నెయ్యంబు
కూర్మికి, నెర వై నతియ్యంబు నిగుడు
చుండ." విక్ర. 4.203.

**నెరసు తెగడు**

తప్పు లెన్ను.

"కన్ను జెప్పు వెట్టని తన వేయికన్నులు,
నెరవరిదమ్ముల నెరసు దెగడు."
భాస్క. రా. అర. 1.43.

**నెరసు వెట్టు**

తప్పు పెట్టు.

"నెరసువట్టితి పరాశరు లంతవాని."
శృం. శాకుం. 3.189.

**నెఱకు లాడు**

ఆయువుపట్టుల తగులు.

భార. అర. 1.314.

**నెఱకు లేయు**

మర్మభేదనము చేయు.

**నెఱజాణ**

నేర్పరి.

"అన విని మేల్నెఱజాణవు, గనఁ
జెప్పఁగ రాదె యెంతకథ యిది..."
హంస. 3.113.

చూ. నెల్లూరు నెఱజాణ.

ఇది కేవలం ఒక్క పనిలో ఆరితేరిన దనే కాక వగలాడి వలె కొంత మాయికతను కూడా సూచిస్తుంది.

**నెఱతనకాడు**

సంపూర్ణుడు.

మను. 4.7.

**నెఱవాది**

1. సత్యవ్రతుడు.

"నెఱవాది భక్తుండు."
బస. 5.129.

2. ప్రౌఢుడు, ప్రౌఢురాలు.

"తొలితొలి రుక్మిణీరమణితో నెఱ

వాదివి నెత్త మాడుమా, గెలిచెదవేని మేలు." ఉ. హరి. 3.118.

నెఱవాది యగు

సమర్థ అగు.

కొన్ని ప్రాంతాలలో, కొన్ని వర్గాలలోనే విరివిగా వాడుకలో ఉన్న పలుకుబడి.

"ఆ పిల్ల నెఱవాది అయి మూడేండ్లయింది. ఇంకా పెండ్లి చేయక పోతే ఎట్లా ?" వా.

నెఱవిద్దె

ఇంద్రజాలవిద్య.

బ్రౌన్.

నెఱవేర్చు

1. పూర్తి చేయు.

2. ఈడేర్చు.

నెఱవేఱు

1. పూర్తి అగు.

2. ఈడేరు.

నెఱి దప్పు

పాడగు.

"నిలువునఁ గూలినమేడలు, నెఱి దప్పిన వాడలు." ఉ. హరి. 1.53.

నెఱికగట్టు

కుచ్చెళ్ళుపోసి కట్టు.

"అంచవన్నియలు తోడ నంద మైన మడుంగు, నిద్దంపుఁ బుట్టంబు నెఱికగట్టి." కాశీ. 3.212.

నెఱికవట్టు

కుచ్చెళ్ళు పోయు.

అము. 6.128.

నెఱికొల్పు

తాల్చు.

నెఱిపట్టు

మంచిపట్టు

నెఱిబడు

1. కుదుటకొను.

భార. ద్రోణ. 3.160.

2. నెఱవేఱు.

భార. శాంతి. 3.28.

నెఱియలు వాఱు

బీటలు పాఱు, నెఱ్ఱెలు చీలు.

పాండు. 4.16.

నెఱెవాఱు

చూ. నెఱియలు వాఱు.

నెఱెవెట్టు

చీల్చు-పొడుచు-తొలుచు.

నెలకట్టడ

నెల కింతా అని ఇచ్చేడబ్బు.

రామా. పీఠి. 107.

నెలకట్టియ

అర్ధచంద్రబాణము.

ఉత్త. హరి. 6.50.

నెలకట్టు

1. రాతిచప్పట, కుట్టిమము.

"గాదియలు వడఁ ద్రోచి నెలకట్టు కట్టించి." బస. 6.169.

2. గచ్చు చేసిననేల.

"కనకాచలము నెలక ట్టయ్యె." కుమా. 9.3.

నెల కన్నెఱుగని

చందమామను కూడా చూడని.

ఎండ కన్నెఱుగని వారే సుకుమారులు. ఇక నెల కన్నెఱుంగని వారి సంగతి చెప్పాలా?

"ఆదిగర్భేశ్వరి వంటిన౽ గంచెదు, నెల కన్నెఱుంగవు నేని."

కుమా. 6.13.

నెలకూన

బాలచంద్రుడు.

నెలకొను

కలుగు.

"నీకు౽ జేతః ప్రీతి నెలకొనంగ."

పాండు. 2.74.

నెలకొలుపు

నెలకొన జేయు.

నెలతక్కువబిడ్డ

దుర్బలుడు.

నెలలు నిండక మునుపే పుట్టినబిడ్డలు దుర్బలులుగా ఉంటారనుటపై వచ్చినది.

నెల తప్పు

నెల మసలు, గర్భ మగు.

నెలనెలా ఋతుమతి అవుతున్న ఆవిడకు ఆ రజోదర్శనం ఒక నెల తప్పిపోయిన దనుట. అంటే గర్భం తాల్చె ననుట.

చూ. నెల మసలు.

నెలను తేగల

అసాధ్యకార్యములను నిర్వర్తించగల జాణ సుమా అను పట్ల నిరసనగా అను మాట. చంద్రుని తేవడం అసాధ్యం కదా.

కుమా. 8.135.

నెల పదినాళ్ళలోన

కొద్ది నాళ్ళలో.

"విల్లు పట్టిన నెలపదినాళ్ళలోన."

కా. మా. 3.35.

నెలపొడుపు

చంద్రోదయము.

"నెలపొడుపుల." నైష. 2.39.

నెల మసలు

గర్భము ధరించు.

ఋతుమతి ప్రతినెలా అవుతుండగా, ఒక నెల తప్పిపోయిన దనుటపై వచ్చిన పలుకుబడి.

"మగువ కంతట నెల మసలెం దోడ్తోన, తగ గర్భచిహ్నముల్ దా నంకురించె."

బస. 1.12.

"మగువ కంతన నెల మసలె గర్భంబు."

పండితా. ద్వితీ. మహి. పు. 154.

చూ. నెల తప్పు.

నెల మూడువానలు కురియు

దేశము సుభిక్షముగా నున్న దనుట.

దేశ మాతృకల మీద నే — అనగా వానమీద నే — ఆధార

పడియున్న రోజులలో నెలకు మూడువానలు కురిస్తే దేశం సుభిక్షంగా ఉంటుంది అను టపై వచ్చినపలుకుబడి.

"నెల మూఁడువానలు నిలిచి కురిసె." జైమి. 6.9.

## నెలలు నిండు

ప్రసవసమయము అగు. తొమ్మిది నెలలు పూర్తియగు

"మగువకు ఘృతకళీమంతోత్సవంబు, నెగడింపఁ దొమ్మిది నెలలు నిండు టయు." ద్విప. కల్యా. పు. 88.

## నెలవరి

నేర్పరికాడు.

"వాసుదేవ నెలవరివి మగుడ నేల." తాళ్ల. సం. 10.143.

## నెలవుకొను

నెలకొను.

## నెలవుకొలుపు

నెలకొలుపు.

"నిజపదనఖరేఖ నెలవుకొలిపి." విప్ర. 3.3.

## నెలవు పడు

నిలుచు.

## నెలవు పఱుచు

నిలుపు.

## నెలవొందు

వ్యాపించు.

సమీర. 1.67.

## నెలసంది

పిల్లలకు ఒక నెల మాటి మఱొక నెలలో పడునప్పుడు కలిగేపీడ. దీనిని తొలగించ డానికి దిష్టి తీయడం వగైరాలు చేస్తారు. ఇదొక నమ్మకం.

"పిల్లవాడికి ఇది పదకొండో నెలసందు. ఏదైనా దిష్టి తీస్తే పోతుంది." వా.

## నెవయబడు

పైకి లేచు.

## నెవ్వడ వడు

అధికముగా ఎండిపోవు, అధిక తాపము నొందు.

"వెడ బీట వాతి నెవ్వడ వడు మోవితో." కుమా. 5.70.

## నెళినెళి

నుసి నుసి.

నుగ్గు నుగ్గు.

## నే జెల్ల!

సంతాపసూచకం.

"అకట నేఁ జెల్ల నేఁ జెల్ల హా కుమార, హాతనూభవ..." హరి. పూ. 5.155.

## నేటితో తీఱు

ఇంతటితో సరి.

ఇది నేటికీ వాడుకలో ఉన్న మాట.

'వాడికీ నాకూ సంబంధం నేటితో తీరిపోయింది.' 'నా

శాధ నీకు నేటితో తీరి పోయింది.'

"......నా పాపఫలము, నేఁటితో దీఱె నోకొమ్మ! నిన్నుఁ జూడ."
హంస. 3.151.

## నేటుకొను

అతిశయించు.

## నేటు చేయు

1. దృఢపరుచు.

"వేల్పుబోటి నాభి, విస్తరిల్లె నపుడు వెడఁద బావిని బోల్చు, నేర్పుకాండ్ర మాట నేటు చేసి." రసిక. 6.100.

2. లెక్కించు.
అచ్చ. అయో. 109.

## నేతికుండపై ఎలుకవలె

రుచి మరిగి వదలనివాడు.

"అలంతులఁ బోవుతప్పె యిది యైనను నాతఁడు నేతికుండపై, నెలుక సలంబు బో విడిచి యేను భవత్పతిఁ గాచితిన్.".
నిర్వ. రా. 6.20.

## నేతిబీరకాయ

సార్థకము కానిది.

ఒక రకమైన బీరకాయను నేతి బీరకాయ అంటారు. కాని అందులో నేయి ఉండదు. నేతి అనే పదానికి ఇక్కడ ఏమాత్రం సార్థకత లేదు కదా!

"నిగమశర్మాభిధానంబు నేతిబీర, కాయ." పాండు. 3.13.
చూ. నేతిబీరాకు.

## నేతిబీరాకు

నేతిబీరకాయ.

"క్షితిలో......గావు మేఁక మెడ చన్నుల్ నేతిబీరాకులున్."
ఒంటి. శ. 26.
చూ. నేతిబీరకాయ.

## నేతిబీరాకులు

ఒంటిమిట్ట. 26.

## నేతు లుట్టగ

చవు లూరు అన్నట్లు నేతులు ఊరగా.

కలుగ నారంభించగా అని తాత్పర్యం. జల జల ఊటవలె కలిగిన దనుట కిది.

"అంగవిక్రియలు, నెకొ్కను రీతులు నేతు లుట్టంగ."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 180.

## నేను ఎవ రనుకొన్నావు ?

నేను సామాన్యుడను (రాలను) కాదని నొక్కి చెప్పటలో ఉపయోగించే పలుకుబడి.

"నను నెవ్వతెఁగా జూచితి,వని యంత ర్బాష్ప యగుచు నవనతముఖి యై."
పారి. 1.132.

"నే నెవ రనుకున్నావో ? జాగ్రత."
వా.

"ఏ మలా మాట్లాడుతున్నావు ? నే నెవ రనుకున్నా వేం ?"

ఇత్యాదులు.

నే నుండగా

'నే నుండగా నీ కేమి భయం ?' అని వాడుక.

"ఇంత వంత నీ కేల లతాంతమాత్ర మున కేఁ గలుగన్ విను."

పారి. 1.135.

నే నున్నాను

'నీ కండగా ఆసరాగా నేను ఉన్నాను. భయం లేక నిశ్చింతగా ఉండవచ్చు' అన్నపట్ల ఉపయోగిస్తారు.

"నే నున్నాను. నీ కేం ఫరవా లేదు. నువ్వు వెళ్లు." వా.

"ఏ మైనా వస్తే నే నున్నాను గా." వా.

నే నెంతదాన (వాడ)

అంత శక్తి లే దనుట.

"నీ యోగవిభవ, మింత యంతని పొగడ నే నెంతదాన."

కళా. 2.188.

నే నెవ్వడను

నాకూ దీనికీ సంబంధము లేదు అనుట.

"మాకు నొక్క స్వతంత్రమా ... నే నెవ్వఁడ ?"

వర. రా. బా. పు. 216. పం. 13.

నేరపెట్టు

దోషము మోపు.

"రెడ్డికి, గలసి యొక ముడుపు గైకొని, పిలిచిన నీ కిత్తు నేరపెట్టుదు మగనికి." వేంక. పంచ. 4.494.

నేరజోటు

తెలియనివాడు.

నేరబోలు

సాధ్య మగు.

"...భారత భారతీ సముద్రము దతియంగ నీఁదను విధాత్రున కైనను నేరఁ బోలు నే." భార. ఆది. 1.19.

నేరమి వెట్టు

తప్పు పట్టు.

"నీ విటు నూఱు నేరములు వని నేరమి వెట్టితి గాక యేను మీ, దేవత లున్నవీటి కరుదెంతునె మిండతికంబుచేతకు."

ఉ. హరి. 1.67.

నేరముకొను

తప్పు పట్టు.

బిల్హ. 3.158.

నేరము లెన్ను

తప్పులు పట్టు.

"నేరము లెన్ని మున్ను రమణీమణి రుక్మిణి యెంత వేఁడినన్."

రాజగో. 1.95.

నేర మెన్ను

తప్పు పట్టు.

"నా మీఁద నేర మెన్నక పోఁడతండు."

వర. రా. కిష్కి. పు. 496. పం. 7.

నేల కఱచుకొను

పడిపోవు.

"వాడు ఎగిసి తన్నేటప్పటికి వీడు నేల కఱచుకున్నాడు." వా.

నేల కలయు

నాశన మగు.

"నిఖిలజంతుతతులు నేలఁ గలయ."
కళా. 6.68.

### నేలకు కోలకు తెచ్చు

1. నానాబీభత్సము చేయు.

"నీ యవలోకనం బాదవ నేలకుఁ గోలకుఁ దెచ్చినట్టి వాఁ,డాయెలనాఁగ బోంట్లు తెలియ న్వినిపింతురు నాకు నెంతయున్." కళా. 7.35.

2. చంపు.

"ఆరాతిబలము నేలకుఁ గోలకుఁ దెత్తురు." భార. కర్ణ. 2.88.

### నేలకు తెచ్చు

పడగొట్టు.

"ఆవీరు నెవ్వరో కో నేలకుఁ దెచ్చిరి?" భార. ద్రోణ. 2.236.

### నేలకు నింగికి సూత్రపట్ట నేర్చు

ఆకాశానికీ భూమికీ దారము కట్టు.

అసాధ్యకార్యములను చేయ గలవా రనుటకు...

పండితా. ప్రథ. పురా. పుట. 359.

### నేలకు వ్రాలు

సాగిలిపడు.

"జాలిఁ బడి వాలి నేలకు, వ్రాలి ప్రణామంబు లెన్ని వలసినఁ జేసెన్."
కా. మా. 4.75.

### నేల కొడివడు

భూమి నంతా వ్యాపించు, నేలను మీఱిపోవు.

"దృష్టి కధికగోచరంబు, గాఁగఁ బన్ని నిలిచెఁ గాయ్యూతో దానవ,కులబలంబు నేల కొడివడంగ." కుమా. 11.80.

### నేల గలియు

నశించు.

"చేదిమాత్స్యప్రభద్రాదిబలంబులు, నిరవశేషంబుగా నేలఁ గలిసె."
భార. సౌ. 1.202.

### నేల గలుపు

ధ్వంసము చేయు.

"నిద్ర వోయెడు సుఖ మెల్ల నేలఁ గలిపి." కా. మా. 2.119.

### నేల జీరు

నేలపై జీరాడు.

"నేలఁ జీరక యుండఁ గేలఁ గుచ్చెలఁ బూను,కొని యూడిగపుసతుల్ గునిసి యాడ." శుక. 1.411.

### నేల జూచు

అవమానముతోనో, సిగ్గుతోనో తల వంచుకొను.

"మనుజావలిని జూచు మఱి నేలఁ జూచు, ధరఁ దలవం పయ్యెఁ దన కని చూచు."
పండితా. ద్వితీ. మహి. పుట. 47.

### నేలతో వీపు మోవ వైచు

వెల్లకిల పడవేయు.

"వృష్ణివీరుండు నేలతో వీపు మోవ, నతని వైచిన నవ్వీరుఁ డతనిఁ గ్రింద, వైచె." ఉ. హరి. 3.67.

### నేల నాక్కున్నాడు

క్రింద పడ్డాడు.

"వాడు డొక్కలో పొడిచేటప్పటికి నేల నాక్కున్నాడు." వా.

**నేలనానుపువాన**

కొద్దిపాటి చినుకులు.

"ఆ. ఏదో నేలనానుప్రవాన పడింది. సేద్యాని కేం పనికి వస్తుంది?" వా.

**నేల నాలుగు చెఱగులా**

దేశం అంతటా.

"ఆ స్వయంవర మహోత్సవమునకు నేల నాలుగు చెఱఁగులనుండి రాజకుమారులు విచ్చేసిరి." వా.

**నేలనుండి ఎగసి మేడమీది కేగు**

తాళ్ల. సం. 11.3. భా. 74.

**నేల పట్టు**

దిగులుతో మూలబడు.

"ఆ పిల్ల వెళ్లిపోయినప్పటినుంచీ వాళ్ల తల్లి నేల పట్టింది." వా.

**నేల పాలగు**

వ్యర్థ మగు.

"పాలన్నీ నేలపాలయ్యాయి." వా.

"పుట్టినప్పటినుంచీ నేను చేసిం దంతా నేలపాలయి పోయింది. వాడి కిప్పుడు నేను కానివాడి నయ్యాను." వా.

**నేలపాలు చేయు**

ధ్వంసం చేయు, పాడు చేయు, నిర్మూలించు.

"చక్కటితోడి కయ్యమైన, లీల మిమ్మందఱ నేలపాలు చేయనే."

భార. శల్య. 2.325.

"పరిజనముల నేలపాలు చేసి."

కమా. 2.66.

**నేల పెల్లగిల నార్చు**

గట్టిగా అఱచు.

"అప్పుడు నేల పెల్లగిల నార్చి మహోగ్రనిరీక్షణంబులన్."

కా. మా. 2.56.

**నేలపై కాళ్లు నిలువకుండు**

తొందరపడు.

మా. త్రేం. జూప.

**నేలపై కాళ్లు నిల్వవు**

చాలా ఆందోళనగా ఉన్నప్పుడు అటూ ఇటూ. ఇటూ అటూ తిరుగుటబట్టి వచ్చినది.

"నేలపై నా కాళ్లు నిలువవు రన్న, ఏల పల్కవు సెప్పవే యన్న నెడ, నడిమియో కోనయో యంగిటిముల్లొ."

బసవ. 3.59.

**నేల బెట్టి కాల రాచు**

వేధించు.

రాచి రంపాన పెట్టు వంటిది.

"అప్పడుచుల నప్పగిది నేలఁ బెట్టి కాల రాచునట్టి యా చిన్నవాండ్రు."

ధర్మజ. 46 పు. 9 పం.

చూ. కాల బెట్టి నేల రాచు.

**నేల బెట్టు**

నేల గూల్చు.

"పూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్."

భార. కర్ణ. 3.262.

**నేలమట్ట మగు**

రూపఱు.

"కూలు లంకాపురీ, ఘనసాలాదుల నేల మట్టముగ." భాస్క. యుద్ధ. 315.

నేలమట్టము చేయు

ధ్వంసము చేయు.

నేలతో సమానముగా చేయు.

"ఊర్ధ్వాండకర్పరంబొరయు వింధ్యాద్రి కూటంబులు నేల మట్టంబు సేసి." కా. మా. 1.124.

నేలమానికె

నేలమాళిగ-భూగృహము.

కాశీయా. 134.

నేలమాలె

భూగృహము.

"బహుశ్రుతుండు నేలమాలె నున్నట్టి కాలవేదిపాలికిం జనుదెంచి..."

విక్ర. 30.

నేలమిన్నులు కొల్చు

గర్వముతో ఎగాదిగా చూచు.

"రమ నేలినట్టిగురస్తు నందు రదేమొ, నేలమిన్నులు గొల్వ నేర్చు టరుదె." శుక. 3.23.

నేలమీద నడవడం లేదు

పొగ రెక్కిన దనుట.

కొత్త. 14.

నేలమీద నిలవ లేక పోవు

మిడిసిపడు.

"వాడి చేతిలో నాలుగురాళ్లు తిరిగే టప్పటికి నేలమీద నిలవ లేక పోతు న్నాడు." వా.

నేలమీద నూక ల్లేవు

ఆయుస్సు లేదు.

"వాడికి నేలమీద నూక ల్లేవు. ఎన్ని వైద్యాలు చేస్తే నేం? ఎన్ని మంత్రాలు వేస్తే నేం?" వా.

నేల యవిసి మూగినట్లు

ఎక్కువగా, నేల యీనినట్లు.

"స్త్రీలం బొందువుద మనుచును, నేల యవిసి మూఁగినట్లు నిగ్భరభంగిన్." భార. మౌస. 1.183.

చూ. నేల యీనినట్లు.

నేల యీనినచందంబున

విపరీతముగా.

"......పురోభాగంబున నేల యీనిన చందంబున వెల్లివిరిసినచాడ్పున నుసుళ్ల విధంబున..." హంస. 3.29.

రూ. నేల యీనినట్లు.

నేల యీనినట్లు

జనసమ్మర్దం ఎక్కువగా ఉన్నప్పుడు ఉపయోగించే మాట.

"ఆ తిరునాళ్లలో నేల యీనినట్లు జనం చేరారు." వా.

రూ. నేల యీనినచందంబున.

నేలయు నింగియు తాళముల్ వాయించు

అసాధ్యకార్యము చేయు.

ఏమైనా చేయగల అనుటకు.

"నేలయు నింగియుఁ దాళముల్ వాయింప... నేర్పు గలిగి..."

కుమా. 8 135.

నేలయును మిన్ను దన్ను

చాల గొప్ప దనుట.

"నేలయును మిన్ను దన్ను నీ నేర్పు కొలఁది." రుక్మాం. 1.125.

నేలలో వెడలని

నడచుట కూడా మొదలు పెట్టని.

అతిబాల్యావస్థలో ఉన్న.

"నేలలో, వెడలనితమ్ముఁగుఱ్ఱల కనిన కులాంగన...లిడఁ బ్రోవక పోవఁగ."

పాండు. 3.33.

నేల విడిచిన సాము

పునాది లేనిది.

"అసలేమి జరిగిందో తెలుసుకోకుండా వట్టి వాదులాటలతో ప్రయోజనం యేముంది? అంతా నేల విడిచిన సాము తప్పితే."

వా.

చూ. నేల విడిచి సాధన.

నేల విడిచి సాధన

"నేల విడిచి సాధన గలదే."

విప్ర. 4.51.

చూ. నేల విడిచిన సాము.

నేలవేము కూరగునా?

పనికి రాదు అనుపట్ల ఉపయోగించేమాట.

నేలవేము నమిలితే బెల్లం కూడా చప్పనయి పోతుంది. ఇది కషాయాలకు తప్పితే కూరకు పనికి రాదు,

గువ్వలచెన్న. 4.

నేల వ్రాయు

బదులు చెప్పలేక పోయినప్పుడు కాలితో నేల వ్రాయుటపై వచ్చినపలుకుబడి.

"వామదేవుఁడు నేల వ్రాసె."

గౌ. హరి. ప్రథ. పం. 123.

నైతరంగా

నయముగా, మంచిగా.

"నైతరంగా చెప్పి సాధించుకోవాలి గాని కొట్లాడి తెచ్చుకుంటే ఏం లాభం?"

వా.

నయతరము – నైతరంగా వాడుకలో సాగినది. ఇది కొన్ని ప్రాంతాలలోనే ఉన్న మాట.

నైధనతార

నాశకము.

జ్యోతిశ్శాస్త్రరీత్యా వచ్చిన పలుకుబడి. జన్మనక్షత్రం నుండీ వరుసగా జన్మ, సంపత్, విపత్, క్షేమ, ప్రత్యక్, సాధన, నైధనం, మిత్రం, పరమమిత్రం చ అని లెక్కిస్తారు. వీనిలో నైధన తార చెడ్డది.

"తుహినాంశుఁ బోలువస్తువు గల్గునే పద్మ, తతులకు నైధనతార గాక."

శ్రవ. 2.79.

నొక్కులు దిద్దు

వంకలు దిద్దు.

అంతకంటే బాగున్నదను పట్ల ఉపయోగించే పలుకుబడి.

"జాబిల్లి రేక నొక్కులు దిద్దునెన్నుదురును."

వర. రా. అర. పు. 122. పం. 13.

**నొక్కులు దీఱు**

వంకలు తీఱి చక్క నగు, వికసించు.

"కైరవదళంబుల నొక్కులు దీఱె." జైమి. 4.55.

**నొగలు విప్పి కూర్చొను**

ఇక నాచేత కాదు అను.

కాళ్లు బారచాపు.

బండి నొగలు విప్పడం బండి విప్పడమే.

**నొచ్చిననోర పలుకకుండు**

పల్లెత్తుమాట అనకుండు.

తనకు బాధ కలిగినా పల్లెత్తు మాట అన డనుట.

"అత్తమామల సేవ లాసక్తిఁ జేయు, వైరమున నేమి నొచ్చిననోరఁ బలుకఁడు." బసవ. 1.68.

**నొచ్చుకొను**

1. బాధపడు.

"వా డామాట అన్నా నని చాలా నొచ్చుకున్నాడు." వా.

2. నిందించు.

"విపరీతకాల మింతే యిపు డెవ్వరి నొచ్చుకొనఁగ నేటికి..." చం. రా. 5.68.

**నొడలదొంతి**

సంశయము.

బ్రౌ.

**నొప్పి పడు**

బాధపడు.

"హతశేషజనుల్, నొప్పిపడి పోయి నలువకుఁ, జెప్పిన...," వరాహ. 8, 72.

**నొసటివ్రాలు**

బ్రహ్మలిఖితం—కర్మ—విధి.

"నా నొసటివ్రాలు యిలా ఉంది. ఎవరి నని ఏం లాభం?" వా.

**నొసలిరేఖలు గజిబిజి చేయు**

విధివ్రాతను చెఱచు...ఆయుస్సును నశింప జేయు.

"బిజ్జలుని, నొసలిరేఖలు గజిబిజి సేసి." బస. 7.208 పు.

**నొసలు బత్తుడు, నోరు తోడేలు**

సాధువేషం, కటుభాషి.

గోముఖవ్యాఘ్రం లాంటిది.

"నిడుదపట్టె తిరుమణియు వైష్ణవము కాని, మీర లాడు మాట తీరు చూడ, ననఘ! నొసలు బత్తుఁడును నోరు తోడేల, టన్న రీతి తోఁచుచున్న దిపుడు." వైజ. 3.18.

**నోచినవారు**

అదృష్టవంతులు.

అది లభించుటకు తగిన పుణ్యము నుచేసుకొన్నవా రనుట.

"నోఁచినవారి సొమ్ము లవి నోమని వారికి వచ్చునే ధరన్." ఉ. హరి. 1.168.

**నోచి యుండు**

ఆ ఫలితమునకై తగినపుణ్యము ను చేసికొని యుండు.

"ఉవిద యెవ్వతె నోఁచి యున్నదో యీస్యమంతకరత్న మింక నొఁదల ధరింప." పారి. 1.131.

**నోట గడ్డ కొట్టు**

నోట మన్ను పోయు.

కొత్త. 372.

**నోట గడ్డి పెట్టు**

బుద్ధి చెప్పు.

కొత్త. 50.

రూ. నోట గడ్డి యిడు.

**నోట గడ్డి యిడు**

బుద్ధి చెప్పు.

"నలువురు నోట గడ్డి యిడ నవ్వులఁ బుచ్చితి నగ్గివంటి సత్కులమును బుగ్గి చేసితిని..." చింతా. 6.67.

రూ. నోట గడ్డి పెట్టు.

**నోట దుమ్ము కొట్టు**

జీవనము పడగొట్టు.

"...వారి పిల్లలనోట దుమ్ము గొట్టి, తాము కాఁ జేయుచేటే వారి దీమసంబు." నందక. 102 పు.

**నోట బగ్గి పడు**

నోట దుమ్ము పడు.

అనుభవిస్తున్న వస్తువు దూరం చేయబడినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

'వాని నోట మట్టి కొట్టినాడు' మొదలగునవి.

"కాక వెఱచిన మాట నిక్కంబ యేని, నేఁడు నీవంక శార్దూలనికరమునకుఁ, జెల్లఁబో మాంసఖండంబు చెల్ల మయ్యెఁ, బ్రాఁత పరివారముల నోట బగ్గి పడియె." శుక. 2.81.

రూ. వాని నోట మన్ను పడినది.

**నోటికాడి కూడు**

జీవనము.

నోటికడ నున్న కూడు సిద్ధాన్నము.

"వాడి నోటికాడికూడు పడగొట్టితే నీకేం వస్తుంది రాశీ?" వా.

**నోటికాడిది (కడది) తీయు**

జీవనము పడగొట్టు.

"ఒకరి నోటికాడిది తీసి నువ్వు కట్టుకొనే దే ముంది?" వా.

**నోటికి కళ్లెము వేయు**

నోరు మూయించు.

"ఒక చిన్న ఉద్యోగం యిచ్చి ఆయన వాడి నోటికి కళ్లెం వేశాడు." వా.

**నోటికి తాళం వేయు**

ఎదురు రాడకుండా చేయు.

"నాలుగు రూపాయలు చేతులో పెట్టి వాడి నోటికి తాళం వేశాడు." వా.

**నోటికి తాళం వేసుకొను**

మౌనము ధరించు.

"మన కెందుకు లెమ్మని నోటికి తాళం వేసుకొని కూర్చున్నాను గానీ చెప్పాలంటే వాడి పుట్టుపూర్వోత్తరా లన్నీ నాకు తెలుసు." వా.

**నోటికి నాటక పోవు**

తినుటకు చాలక పోవు.

"నూఱువు రైనఁ గాని తిన నోటికి నాట దటంచుఁ గూర్పఁగా." కా. మా. 3.205.

ఇది వాడుకలో కూడ ఉన్నది.

'వాడికి ఆట బెట్ట లేము' అనగా వాడు తినునంత పెట్ట లేము.

## నోటికి పోవు

జోలికి పోవు.

"వాడు నోటికి వచ్చినట్లు మాట్లాడు తాడు. వాడి నోటి కెవరు పోతారు?" వా.

## నోటికి బుద్ధి చెప్పు

జాగ్రత్తగా మాట్లాడు.

"ఎందుకుఁ బ్రేలెదు మార కింక నేనియు నోటికి బుద్ధిఁ జెప్పికొమ్ము." గిర. విగ్ర. 28.

## నోటికి వచ్చినట్లు

స్వేచ్ఛగా.

"వాడు నోటికి వచ్చినట్లు మాట్లాడు తాడు. వాడి నోటి కెవరు పోతారు?" చూ. నోరికి వచ్చినట్లు.

## నోటికీ చేతికీ పట్టించు

1. మొత్తుకొను.

"ఆ మాట వినేసరికి వాడు నోటికీ చేతికీ పట్టించాడు." వా.

2. తిను.

"పెరుగన్నం దొరికిం దని వాడు నోటికీ చేతికీ పట్టించాడు. ఇక మనతో ఏం మాట్లాడతాడూ?" వా.

## నోటికూటికి చేటు తెచ్చుకొను

తిండికి లేకుండ చేసుకొను; జీవిక పోగొట్టుకొను.

"ఇత్తెఱంగున మాటలాడి నోటికూటికిఁ జేటు దెచ్చు కొంటిఁ గదా యని డెందంబునం గుంది..." శుక. 3.364.

వాడుకలో : 'వాడు దురుసుగా మాట్లాడి నోటికూటికి చేటు తెచ్చు కొన్నాడు.' ఇక్కడ నోటి కూడు అనగా జీవనము.

## నోటి కొక మాట

ఎవరికి తోచినట్లు వారుగా.

"అతని ఆస్తి పోవడానికి కారణ మేమి అంటే నోటి కొక మాట అంటు న్నారు. ఏది నిజమో ఏది అబద్ధమో ఆ దేవుడికే తెలియాలి." వా.

## నోటికొలదుల్ పురికొల్పగ

నో రున్న దని.

వాడుకలో 'నో రున్న దని ఏదో వాగితే సరిపోయిందా? అర్థం పర్థం ఉండక్కర్లా?' అంటారు.

"చీకు లావుకం, బ్రాక్కినయట్లు నోటి కొలఁదుల్ పురి కొల్పఁగ నందులోన నొ,క్కొక్కఁడు సక్కనైనఁ గృతి యున్ గృతి యందురె..." కుమా. 1.38.

## నోటిక్రొవ్వు

నోటిపొగరు.

పొగరుగా మాటలాడుట అనుట.

"ఓహో! చాలుఁ బోకాలి పోయెదరో పోరో నోటిక్రొ వ్వేటికిన్." మను. 6.45.

## నోటిగయ్యాళి

వాక్పారుష్యం గల స్త్రీ.

"మాటనూ తెలుఁగదో నోటి గయ్యాళియో, యాచారహీనయో యలసురాలో." చెన్న. 4.39.

నోటితీట

వాక్కండూతి.

నోటిదురద. అనవసరముగా మాటలాడవలె నన్న యుబలాటము.

"త్వరితమ్మునఁ దలవాకిలిఁ, దెఱచుక బంట్రవుతు నోటితీటయుఁ దీరన్." హంస. 4.168.

చూ. నోటిదురద.

నోటిదురద

వాక్కండూతి.

"వా డేదో ఒకటి అనకుండా ఉండలేడు. నోటిదురద ఎక్కువ." వా.

రూ. నోటితీట.

నోటిపూత

ఉష్ణాధిక్యంవల్ల నోటిలో ఏర్పడు చిన్నపుండ్లు.

"నోటిపూతతో కారం నోట్లో పెట్టలేకుండా ఉన్నాను." వా.

నోటిపేద

బుద్ధిహీనుడు.

నోటిబీగాలు

మొక్కుబడిగా నోటికి బీగాలు వేసుకొనడం ఒక ఆచారం. ఆ దవడకూ యీ దవడకూ మధ్య ఒక కడ్డీ దూర్చి బిగిస్తారు.

"అనశనవ్రతము చే నతుల కార్శ్యంబుచేఁ, గనుపట్టునోటిబీగముల వారు." చంద్ర. 5.41.

నోటిమాట చాలు!

మాట మాత్రం చెప్తే చాలు.

"నీ నోటిమాట చాలు. ఊ అను. ఇప్పుడన్నీ చక్కబెట్టుకొని వస్తాను." వా.

నోటిమాట నోరనే యుండగ

వెనువెంటనే.

"తను ధరణికిఁ బొమ్మన్న ధాత నోటఁ, మాట నోటనె యుండ భూమండలంబుఁ, జేరఁ జనుదెంచె." కా. మా. 2.36.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

"నోటిమాట నోటిలో ఉండగానే మీద బడతా వేమిరా?" వా.

నోటిమాటమీద

ఏ మాత్రం వ్రాతకోతలు అవసరం లేకనే.

"అతను కేవలం నోటిమాటమీదనే వేలు తీసుకుని రాగలడు." వా.

నోటిమాటమీద నిలబడు

సత్యవ్రతుడగు.

"వా డెంతైనా నోటిమాటమీద నిలబడతాడు. ఏమీ పరవా లేదు." వా.

నోటిమాటలు కావు

చెప్పినంత సులువు కాదు అనుట.

"ఇలాంటి కావ్యం రాయాలంటే నోటిమాటలు కావు." వా.

నోటిమాట లేవు

విరోధ మేర్పడిన దనుట.

"వాడికీ వీడికీ ఈమధ్య నోటిమాట లేదు." వా.

నోటిమీద కాయ పడకుండా (వేయకుండా)

వాగుడు కాయ అనుట. వ్యవధానం లేకుండా మాట లాడు ననుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఒక నిముసము నోరం గాయ వేయ కేడ్చుచు." పరమ. 1.125.

"నోటఁ గాయ వేయక వదరుచుఁ, గలఁచెదవు లతాంగిఁ జిలుకలార!" కవిరాజ. 3.145.

"వాడు నోటిమీద కాయ పడకుండా వదురుతూ ఉంటాడు." వా.

నోటి మీద తంతాను

ఒక తిట్టు. అన్నమాట అంత చెడ్డ దనుట.

"నువ్వు ఆ మాట ఇంకొకసారి అన్నా వంటే నోటిమీద తంతాను." వా.

నోటిముత్యాలు రాలునా ?

'ఎందుకు పలకవు ? పలికితే నీ దేమయినా పోతుందా' అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

నోటిరంకు

వాగ్వ్యభిచారము. రంకాడక పోయినా నోటితో రంకుపురాణాలు చెప్పుకొని సంతృప్తిపడు.

నోటిలో కలకాయ పడు

వాడికి రావలసిన లాభం తప్పిపోయింది అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఈ ఊళ్లో ఆస్పత్రి పడింతర్వాత ఆ నాటువైద్యుడి నోట్లో కరకాయ పడింది." వా.

నోటిలో దుమ్ము కొట్టు

జీవనము పడగొట్టు. చూ. నోటిలో మన్ను కొట్టు.

నోటిలో నాలుక లేదు

మాటలాడ లే డనుట. నోరు చచ్చినవా డనుట.

"వాడు నోట్లో నాలుక లేనివాడు. ఎన్నంటే నేం? బెల్లం కొట్టినరాయిలా కూర్చుంటాడు." వా.

నోటిలో నీ రూరు

ఆశ కలుగు.

"అతిరసాలు చూస్తే వానికి నోటిలో నీ రూరుతున్నది."

"ఆపిల్లను చూస్తే వాని నోట్లో నీ రూరుతున్నది." వా.

చూ. నో రూరు.

నోటిలో పడు

దూషణకు పాత్ర మగు.

"అనవసరంగా యిందులో వేలు పెట్టి ఆ దుర్మార్గుడినోటిలో యెందుకు పడతావు ?" వా.

నోటిలో పురుగులు పడ !

ఒక తిట్టు.

"నీ నోట్లో పురుగులు పడ. ఎంత మాట అన్నావు రా ?" వా.

**నోటిలో పురుగులు పడును**

తప్పుపని చేసినప్పుడు. పాపం చేసినప్పుడూ అంటారు. 'ఒకే మీ నాన్న నంటు న్నావు. నీ నోట్లో పురుగులు పడతాయి.'

"......తప్పులు వలుకపాతకుని, క్రొవ్వెద వాని ముక్కున నోరఁ దోఁకఁ, బ్రువ్వులు దొఱఁగవే."
పండితా. ప్రథ. వాద. పు. 637.

**నోటిలో విద్దె గొట్టుకొను**

నోరు మూసుకొను.

"మన మెవరితో నైన స్వేచ్ఛగ మాట లాడఁ గూడదా! నోటిలో విద్దె గొట్టు కొని యుండ వలెనా?" సాక్షి. 51.

**నోటిలో వ్రేలు పెడితే కొరక లేడు!**

అమాయకుడు కాడు అని సూచిస్తూ హేళనగా అను మాట.

"అవును. అవును. నోటిలో వ్రేలు పెటితే కొరక లేడు నీ కొడుకు." వా.

ఇది కావ్యాలలో నోరిలో, నోరిలోపల యిత్యాది రూపా లలో కానవస్తుంది.

"... నోరిలోపలఁ, వ్రేలిడినప్పుడుం గఱవ నేరఁడు నీసుతుఁ డడ్డపాపగాఁ, డే లలితాంగి..." సారం. 3.58.

**నోటి (రి) శని**

నోటిలో శని.

నోరిశని నుండు కే నో, రోరి! యకట! మా సమీపస్థానమున మనియుం, దూ రము గాయితివే హా, మ్మోరితిని నీకుఁ దక్కునె కానిరా." ఆము. 6.82.

**నోటీ పండ్ల సందున నొక్క మాట అన్నాడా?**

"అంతగా అతనికోసమని వెడితే ఉండమని నోటీపండ్లసందున ఒక్క మాట అన్నాడా?" వా.

**నోట్లో కబళం గూట్లో దీపం**

అస్తమానం అయిందే భోజనం చేస్తా రనుట.

"పల్లెటూళ్లో ఏముందమ్మా? గూట్లో దీపం నోట్లో కబళం." వా.

**నోట్లో నీళ్ళు పోసేదిక్కు లేదు**

ఎవరూ ఆప్తులు లేని వానినుట.

"వాడికి నోట్లో నీళ్లు పోసేదిక్కు లేదు. తినకా, కుడవకా ఆ ఆస్తి నంతా ఏమి చేసుకుంటాడో ఏమో! దేవుడికే తెలుసు." వా.

**నోట్లో నువ్వుగింజ నానదు**

రహస్యము నిలువదు.

"ఆవిడనోట్లో నువ్వుగింజ నానదు. అంచేత ఆవిడతో మాట్లాడేటప్పుడు జాగ్రత్త. నోరు జారేవు!" వా.

**నోట్లో పుండు పుట్ట!**

ఒక తిట్టు.

చూ. నోట్లో పురుగులు పడ.

**నోట్లో మన్ను కొట్టు**

జీవనము పడగొట్టు.

"నా నోట్లో మన్ను కొట్టకు. నీకు పుణ్యం ఉంటుంది." వా.

నోనాడు

తిరస్కరించు.

"నిన్నె కనుఁ బో యతఁ డెవ్వరిఁ జూడఁ డంచు నో,నాడె సపత్ని నొక్కతె." పారి. 3.16.

నోము నోచు

పుణ్యము చేసికొను.

"ఎంతటి నోము నోచితివొ? యెంతటి దానము నాచరించితో?"

రాజగో. 3.18.

నోముపంట

పుణ్యఫలము.

"నందతపఃఫలంబు సుగుణంబుల పుంజము గోపకామినీ,బృందము నోము పంట."

భాగ. స్క. 10 (పూ.) 1246.

"నుడుగుల వెలంది నోచిన నోము పంట." శ్రవ. 1.6.

రూ. నోముఫలము.

నోముఫలము

పుణ్యమువల్ల కలిగిన ఫలితము.

"ఈ ప్రొద్దు సుదివసంబె నోము ఫలమొ నా, మనసులో నెంజిలి మానె ననుచు." హంస. 2.169.

చూ. నోముపంట.

నోములు పండు

పుణ్యము ఫలించు.

"మున్ను దా నోచునోములు పండె ననుచు."

వర. రా. అయో. పు. 261. పం. 19.

నోరగుమ్మలుగా

నోరార.

"ఆవల నీవల నోరగుమ్మలుగ నాడుద మీతనిఁ బాడుదము."

తాళ్ల. సం. 9.43.

నో రదుము

నోరు మూయించు.

అనగా ఏమీ అనకుండా చేయు.

"పాపపులజ్జ నో రదిమె ననాదరంబు తెఱఁ గై." ప్రభా. 3.5.

"ధూర్తుల నెల్ల నో రదిమి గదిమి."

శుక. 1.55.

"వదినెలపోరు మాన్ప నిజవల్లభు నిద్దుర పుచ్చ మామనో, రదమఁగ నత్తగారికి భయం బొనరింప..."

శుక. 2.98.

నోర బ్రేవులు చూపు

నాదగ్గర యేమీ లేదు. నీవే చూచుకొమ్మని చెప్పు.

"పేద నే నని నోరఁ బ్రేవులు చూపఁ, బోదురే ఋణముఁ దెంపునఁ గొను వారు." హరి. ద్వి. 2 భా. 201.

నోర బట్టు

పుక్కిలించు.

మ్రింగి వేయు.

"అరిమహీశబలాంబుధి నోరఁ బట్టె డున్." జైమి. 1.100.

నోరాటము ఏల?

వట్టిమాట లెందుకు?

నోరాడించుట దీనికి పూర్వ రూపము.

"వేఁటాడ వ్వచ్చుమృత్యువే తప్పదు నో, రాట మిది యేల యిచ్చట, నేఁటి కెడ యొనర్చు ననుట..." శుక. 2.79.

నో రాడనట్లు చేయు

మాట మాట్లాడుటకు వీలు లేకుండ చేయు.

"......దృఢధైర్యస్థైర్య యై వానికి, న్నోరాడింప నశక్య మా కరణిఁ గందోయిం జలం బబ్బి."
శుక. 3.144.

నో రాడు

నోరు వచ్చు.

అనగూడనిమాట అన్నప్పుడు ఉపయోగించేమాట.

"అది దిగుల్పడి యెట్లు నోరాడె నార!, పలుక నేరితి నోవెట్టి బాపనయ్య!"
శుక. 1.449.

నోరార

మనసార, సంతృప్తిగా.

"మదిరాక్షి నోరార మాటలాడు."
సారం. 2.171.

"నోరారా ఒకర్ని గౌరవంగా పిలవడం వారికి అలవాటు లేదు." వా.

నోరార్చు

వట్టి మాటలు మాటలాడు.

"గంటక నోరార్చి గల్వఁ జూచెదవా."
గా. హరి. ప్రథ. పం. 206.

నోరికి బోవు

నోటి కిం పగు.

కళ. 4.51.

నోరికి వచ్చినట్లు

స్వేచ్ఛగా.

"పాండవపక్షపాతమునఁ బల్కెదు నోరికి వచ్చినట్లు ని, న్నొం డనరామిఁ జేసి యిది యొప్పనె?"
భార. విరా. 4.68.

"నకులుఁడు సహదేవుండును, బ్రకట భుజాస్ఫురణమున నరాతిబలము నే, లకుఁ గూలకుఁ ద్రెత్తురు నో,రికి వచ్చిన యట్టు లాడితే యిబ్బంగిన్."
భార. కర్ణ. 3.88.

నోరికి వచ్చినట్లు వెప్పాన కిచ్చు

ఇష్టం వచ్చినట్లు నిందించు.

నోటికి వచ్చినట్లు తిట్టు.

"కుచ్చితురా లైన యచ్చపలలోచనం జూచి పౌరు లందఱు గచ్చుకొని గ్రచ్చపొద గదలించిన కైవడి విచ్చలవిడి నోరికి వచ్చినట్లు వెచ్చాన కిచ్చువారును..."
సారం. 3.217.

నోరిచేటు

వట్టి వాగాడంబరము.

మాటలు ఖర్చు కావడం తప్ప ప్రయోజనం లే దనుట.

"ఎక్కుడైనవీరుఁ డే నర్జునునితోడఁ, బోడుతు నోడుతు ననినఁ బోలుఁ గాక, వినుము సూతతనయ! మనబోటు లాతనిఁ, జెఱుతు మనుట నోరిచేటు గాదె."
భార. కర్ణ. 2.24.

నోరితాళము

నోరు మూయించగలవాడు.

"అధ్యాత్మవాదులకుఁ నోరితాళము."
పండితా. ప్రథ. వాద. పుట. 512.

నోరి(టి) తాళములు

నోటిబీగాలు.

"లలన యొక్కర్తు నోరితాళంబు లిచ్చె."
పాండు. 3.77.

చూ. నోటిబీగాలు.

నోరిమాట నోరనె యుండ

వెంటనే, అసి అనక ముందే.

"భగవంతుఁడ రక్షించు చూఱడిలు మన్న నన్నోరిమాట నోరన యుండ నతండు." ఆము. 7.22.

నోరిసని నుండ నేరక

శని మూడుటవల్ల.

ఏదైనా అనగూడని మాట అన్నప్పుడు 'వాడి నోటికి శని మూడి ఆమాట అన్నాడు. నెత్తికి తెచ్చుకొన్నాడు' అనడం నేటికీ కలదు.

"నోరిసని నుండకే నో, రోరి! యకట!, మా సమీప పూరనె మని యుం, దూరము వోయితివే."

ఆము. 7.18.

శని మూడి. శని ముసించి అని కూడా అనుట కలదు.

నోరుం గాదు వేయక

నోటిమీద కాయ పడకుండా, నిరంతరాయంగా.

"ఒక నిమిషము నోరం గాదు వేయ కేడ్చుచు." పరమ. 1.125.

చూ. నోటిమీద కాయ పడకుండా.

నో రుం దని వాగితే సరా!

ఎవరైనా అనవసరంగా నోటికి వచ్చినట్టు మాట్లాడు తున్నప్పుడు అనేమాట.

"నో రుం దని వాగితే సరా! దానిలో ఎంతో కొంత నిజం ఉండాలి." వా.

నోరు కట్టి

ఏమీ తినక, అస్తులు పస్తులు ఉండి.

"పాపం! ఆ తల్లి నోరుకట్టి ఆ పిల్లలను సాకుతూ ఉంది." వా.

ఇది జంటగా 'నోరుకట్టి వాయికట్టి' అని కూడా విన వస్తుంది.

చూ. నోరు కట్టి వాయి కట్టి.

నోరు కట్టి వాయి కట్టి

ఏమీ తినకుండా.

చూ. నోరు కట్టి.

నోరు కట్టువడు

మౌనము వహించు.

"గట్టిగా తిడితే వాడి నోరు కట్టువడి పోతుంది." వా.

నోరు కాచు

రహస్యము దాచు.

ఎవరితో చెప్ప నంటే అని ప్రస్తకము.

"చేరి నీ కొకమాట చెప్ప వచ్చితిని, నోరు గాచెద నన్న నుడువుదు నీకు."

గౌర. హరి. ద్వి. 1030-1031.

నోరు కాయలు కాచు

నోరు నొప్పి పెట్టు.

పిలుచుట ఇత్యాదువల్ల.

నోరు కాయు

పథ్యము చేయు.

నోరు కూరిపోవు

నోరు పడిపోవు.

"సారెకు నిన్ను వే గ్రుచ్చి గ్రుచ్చి, యేమి యడిగితి నీవు నా కేమి చెప్పి, తింతమాత్రన నోరుకూ లేమి పోయె, నకట! నిజ మాడ కి ట్టేల యంటి వీవు." పైరా. 2. 9.

## నోరు కొట్టు

జీవనము పోగొట్టు.

"ఊళ్లో వాళ్ల నోళ్లు కొట్టి వాడు సంపాదించాడు. దత్తపుత్రుడు కాస్తా దాన్ని ధ్వంసం చేశాడు." వా.

రూ. నోరు గొట్టు.

## నోరు చచ్చినవాడు

నోరు లేనివా డనుట.

"మొగుడు నోరు చచ్చినవాడు గనక సరిపోయింది కానీ ఈవిడ ఆటలు సాగేవా?" వా.

## నోరు చించుకొను

అఱచు, గోల చేయు.

"అంత నోరు చించుకొంటా వెందుకు రా? మెల్లగా చెబితే వినబడ దేమిటి?" వా.

## నోరు చిఱిగి పోవు

అఱచుటవల్ల అనుట.

"చేసేపని ఏం లేదు, కానీ నోరు మాత్రం చిఱిగి పోతుంది." వా.

## నోరు చెడ బొంకు

పచ్చి అబద్ధా లాడు.

"బొంకెడు వక్త్రము పూర్తిగాఁ జెడగ." గిర. లోకా. 13.

## నోరు చేదు మేయు

దూషణోక్తు లాడు, చెడు వాటికి పాల్పడు.

"చెల్లఁబో నోరే చేఁదు మేయఁగఁ జొచ్చె." తాళ్ల. సం. 11.2. భా. 65.

## నోరు చేయు

ఎక్కువ మాటలాడు.

"కూడ నిత్తునె మాఱుకొని మోర యెత్తిన, గడెవెడ నో రింతకంటెఁ జేయు." బహు. 2 61.

## నోరు చేసుకొను

తిట్టు-అఱచు.

"అయిం దేదో అయిపోయింది. ఊరికే నోరు చేసుకుంటే ఏం లాభం!" వా.

"నువ్వు ఇలాగే చేస్తున్నా వంటే నేను నోరు చేసుకోవలసి వస్తుంది." వా.

## నోరు తిరుగు

స్వచ్ఛముగా ఉచ్చరింప వీలగు.

"ఈ సంస్కృతం మాటలు నాకు నోరు తిరగడం లేదు." వా.

"వాడికి పద్యం నోరు తిరగడమే కష్టం. ఇంక అర్థ మే మవుతుంది.?" వా.

## నోరు తెఱచుకొని కూర్చుండు

1. ఏదో వస్తుందన్న ఆశతో నిరీక్షిస్తూ కూర్చొను.

"గుర్రపుపందాలలో ఏదో వస్తుం దని నోరు తెరుచుకొని కూర్చుంటే ఏం లాభం? ఏదో ఒకటి చెయ్యాలి గానీ."

2. ఇదే కొంత భిన్నరూపంతో ప్రాచీనసాహిత్యంలో కాన వస్తుంది.

"గతమునకును వగవ కనా, గతమునకును

నోరు దెఱచి కడుఁ గోరక దీనతఁ బొందక..." భార. శాంతి. 3.30.

3. మాటలాడు.

"శిఖలు చూపకుండ శిక్షించిహాతికి సై, నోరు దెఱవకుండ మేర వెట్టి......" నృసిం. 2.118.

నోరు తెరిచినపాపాన పోలేదు

బదులాడ లేదనుట.

"అన్ని విధాల కష్టపెడుతున్నా ఆ యిల్లాలు పాపం! నోరు తెరిచిన పాపాన పోలేదు." వా.

నోరు తెరిస్తే ఒట్టు

నోరెత్తకుండా ఉండె ననుట.

"వాడు ఇన్ని అంటూ ఉంటే నోరు తెరిస్తే ఒట్టు. బెల్లం కొట్టినరాయి లాగా ఉన్నాడు." వా.

నోరు తెరిస్తే తంతాను

ఒక తిట్టు.

"మళ్లీ నోరు తెరిచావంటే తంతాను." వా.

నోరు తెరిస్తే ముత్యాలు రాల్తాయా?

పలకకుండా ఉన్నప్పుడు ఎత్తి పొడుపుగా అనేమాట.

నోరు దెఱచి

కాచుకొని, నిరీక్షిస్తూ. అత్యాశ పడి.

"గతమునకును వగవక నా, గతమునకును నోరు దెఱచి కడుఁ గోరక." భార. శాంతి. 3.301.

చూ. నోరు తెఱచుకొని కూర్చుండు.

నోరు దొడుకు

నోరు కదుపు.

"నక్షత్రకు నోరు దొడుకుట పాపంబు." గా. హరి. ద్వితీ. పం. 1303.4.

వాడుకలో నోటికి పోవుట అన్నరీతిలో ఈ పలుకుబడి కానవస్తుంది.

"అమ్మమ్మ. అది గయ్యాళి. దాని నోటికి ఎవరు పోతారు." వా.

నోరు నిండుగా గ్రోలు

నోటినిండ - కడుపు నిండ - త్రాగు.

"కడు నొప్పెడునీరము నోరునిండఁగాఁ, గ్రోలి." కళా. 4.201.

నోరు నొక్కు

మాటలాడకుండ చేయు.

"ఎవ్వఁడిది యని పల్కిన నవ్వధూటి, నోరు నొక్కుచుఁ గౌఁగిటఁ జేరఁ దిగిచి, మగువచెవిలోన నలుకుడు మాను మేను, వాసవుఁడ నిన్నుఁ గని కూర్మి వచ్చి నాడు." జూహ్న. 4.87.

"వాడు ఆ మాట చెప్పి నా నోరు నొక్కేశాడు." వా.

నోరు నొక్కుకొను

ఆశ్చర్యంతో నోరు మూసుకొను, నోరు మూసికొను.

"ఊళ్లో అమ్మలక్కలందరూ నోరు నొక్కుకొన్నారు." వా.

"నా దేముడ్న దమ్మా! నోరు నొక్కుకొని కూర్చున్నాను. ఈ యింట్లో వంగితే తప్పు. లేస్తే తప్పు." వా.

## నోరు నోరే తెఱచు

అత్యాశను సూచించు అంగ విక్రియ.

నోరు తెఱచుకొని చూచినా డనుట నేటి వ్యవహారము.

"ఊరి గ్రెల్లఁ బిలిచి చేని యుంపారం బగు చింత మునిఁగి పలుకం డడిగెఁ, జేరె వివాహ మటన్నం, దోరం బగుకాంక్ష నోరు నోరే తెఱచున్." శుక. 2.162.

## నోరు పడ!

ఒక తిట్టు.

## నోరు పడిపోవు

1. మాటలు పడిపోవు.

"వా డేం చెప్తాడో అని బంధువు లంతా చేరేసరికే నోరు పడిపోయింది." వా.

"వాడికి నిన్నటినుంచీ నోరు పడిపోయింది. రేపో మాపో అన్నట్లుగా ఉంది." వా.

2. అఱచి అఱచి నోరు నొప్పి పెట్టు.

"అని అని నా నోరు పడిపోవలసిందే కానీ యీ పిల్లవెధవలు నా మాట వింటారా? చేస్తారా?" వా.

## నోరు పారవేసుకొను

దుబారాగా మాటలాడు.

"అనవసరంగా నోరు పారవేసుకోవడం ఎందుకు? వా డంతట వాడే దారికి వస్తాడు." వా.

## నోరు పొక్కు

నోరు పూయు, నోరు మంట లెక్కు.

పాండు. 5.198.

## నోరు మంచి దైతే ఊరు మంచిది

మంచిగా మాట్లాడడం నేర్చితే చాలు ననుట.

"ఎంత మూరమయితే నేం? నోరు మంచి దయితే ఊరు మంచిది." వా.

## నోరు మాలిన జంతువు

నోరు లేని పశువు.

మాటలు రాని దనుట. సహజంగా తన కష్టసుఖాలు చెప్పుకో లేని దనుట.

"శర్వ! యీనోరు మాలినజంతువునకు, మొదల వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు." కాశీ. 5.335.

## నోరు మూసికొని పడియుండు

ఏమీ అనకుండా ఉండిపోవు.

"మన యిల్లా? మన వాకిలా? అని వాడు నోరు మూసుకొని పడి వున్నాడు." వా.

## నోరు మూసుకో!

ఒక తిట్టు.

"ఇక నోరు మూసుకో చాలు. పెద్దగా ఏదో చెప్పొస్తున్నావు!" వా.

రూ. నోరు ముయ్.

## నోరు మూస్తే పెడతల వాపోవు

వాచాలుడు, వాగుడుకాయ.

"నోరు మూయఁ బెడతల వాపోయెడు." నృసిం. 4.37.

## నోరుమెంగ

మాటలు రానిది, నోరు లేనిది.

"తన్నట్లు పలికి క్రొంబ్బఁగ, మిన్నక చన నంత నోరుమెంగయె."
కళా. 3.251.

## నోరు మెదపు

నోరెత్తు. మాటలాడు.

"ఆవిడ అంతసేపూ నోరు మెదపకుండా నే కూచుంది." వా.

## నోరు మెదల్ప లేని

1. ఇలా అని చెప్ప లేని.

"ఇంత దానసంపన్నత యింత శుద్ధి యని బ్రహ్మయు నోరు మెదల్ప లేని."
పాండు. 3.151.

2. నోరెత్త వీలు లేని.

"బ్రహ్మయు నోరు మెదల్ప లేనియ, త్యున్నతిఁ గన్న పెన్నడలి నుతిత మై వెలిదీవి చెన్నగున్." పాండు. 3.115.

"శాస్త్రుల్లవారా పద్యానికి అర్థం చెప్పినప్పుడు కొమ్ములు తిరిగిన పండితులు కూడా నోరు మెదల్ప లేక పోయారు." వా.

"ఆయన ఆ మాట అనేసరికి నేను నోరు మెదల్ప లేక పోయాను." వా.

## నోరు రాలేదు

అనుటకు మనసొప్పు లేదు.

"వాడి అమాయకత్వం చూచి యేమన డానికీ నాకు నోరు రాలేదు." వా.

## నోరు లేని జంతువులు

అమాయకులు, పశ్వాదులు.

"నోరు లేనిజంతువులకె నొప్పి ఘనము." ఆము. 5.43.

చూ. నోరు లేనిపశువులు.

## నోరు లేనివాడు

అమాయకుడు, గడుసుతనము లేనివాడు.

"నోరు లేనివా డని వాణ్ణి అందరూ వేధిస్తున్నారు." వా.

## నోరు వాయి లేని

అమాయక మైన, నోరు లేని.

"నోరు వాయీ లేనివాణ్ణి వాణ్ణి పట్టుకొని యేమిటిరా వేళాకోళం పట్టిస్తున్నారు." వా.

"నోరూ వాయీ లేనిజంతువును అలా వేధించడం మంచిది కాదు." వా.

రూ. నోరూ వాయీ లేని.

## నోరు విప్పితే

మాటలాడితే.

"వాళ్లన్న అన్ని మాట లంటున్నా వాడు నోరు విప్పితే ఒట్టు." వా.

చూ. నోరెత్తితే.

## నోరూరగా!

అభిరుచి యేర్పడునట్లు.

"నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ!" సుమతి. శ.

## నోరూరు

తినబుద్ధి వేయు, అనుభవింప వాంఛ కలుగు, ఆశ పుట్టు. తినదగినవస్తువు కనబడినప్పుడు నోటిలో నీరూరడం సహజం. అందుపై వచ్చిన పలుకుబడి.

"సంపెంగ పొదరింటి చక్కి గోరంటఁ గాంచి, యును రంచు మగిడి నోరూరనవియు." పారి. 3.51.

"గబ్బిగుబ్బల మొదఁ గ్రమ్మి గ్రమ్మి, యున్న సకియలఁ జూచి నో రూరసాఁగె."

"ఆ మామిడిచెట్టు విరగ కాసింది. కలమాగిన పండ్లను చూస్తుంటే ఎవరికి నో రూరదు?" వా.

"వయసు వచ్చినమరదలుపిల్లను చూచేసరికి వీడికి నో రూరుతుందేది." వా.

చూ. నోటిలో నీరూరు.

## నోరూ వాయీ లేని

అమాయకు డయిన, మాట నేర్పు లేని.

"ఈ నోరూ వాయీ లేనివాణ్ణి కట్టుకొని వేగుతున్నాను." వా.

చూ. నోరు వాయి లేని.

## నో రెండు

నోరు పిడుచ గట్టు (భయాదులచే.)

"దండనమస్కృతుల్ దొనర్చి దైన్యంబున నో, రెండఁగన్." కా. మా. 4.170.

## నో రెండుకొని యుండు

దప్పి గొను.

"పేరెండ నాకకొంత నో రెండుకొనియుండు, గండభేరుండంబుఁ గదిమె నాకఁడు." శుక. 1.263.

## నో రెగయు

నోరు వచ్చు.

జగన్నా. 62.

## నో రెట్లు లాడె?

మాట లెలా వచ్చినవి? ఎలా అలా అనగలిగావు?

"ఎఱిఁగి యెఱిఁగి మాపింప నీకు నో రెట్లు లాడె." కమా. 2.29.

"ఇంత మేలు చేస్తే నన్ను ఇంత మాపించేందుకు నీకెట్లా నో రాడింది?" వా.

చూ. నో రెలా వచ్చింది.

## నో రెత్తకుండ జేయు

నిరుత్తరుని చేయు.

"వా డామాట చెప్పి నన్ను నో రెత్తకుండా చేశాడు." వా.

## నో రెత్తితే అపశబ్దాలే

అపశబ్దాల పుట్ట అనుట.

"వాడు నో రెత్తితే అన్నీ అపశబ్దాలే." వా.

ఇలాగే 'నో రెత్తితే బూతులే' యిత్యాదులు ఉన్నవి.

## నో రెత్తు

మాటలాడు.

"అత్తఱి భీష్మముఖ్యు లగు నచ్చటి వృద్ధజనంబు లెల్ల నో, రెత్తక యూరకుండిరి మహీశ్వరుచిత్త మెఱుంగ కున్కి." భార. ఉద్యో. 1.319.

"వాడు అన్ని అంటూ ఉంటే వీడు నో రెత్తితే ఒట్టు." వా.

"నో రెత్తితే తంతాను." వా.

"వా డేం చెప్పినా నో రెత్తకుండా పని చేస్తాడు." వా.

"ఇన్నిమాట లంటుంటే వాడు నో రెత్తుతా డేమో చూడు." వా.

## నో రెఱుగనియట్టి జంతువులు

మాటలాడ నేరని జంతువులు.

నోరు లేని జంతువు లని వాడుక.

"నోరెఱుంగని యట్టి జంతువులు సైతం, మంబుజానన యిచ్ఛావిహార మందు." శుక. 1.531.

నోరెలా వచ్చింది ?

ఇంతటి చెడుమాట ఎలా అనగలిగావు ?

"చూచి చూచి ఆ యిల్లాలిమీద ఈ అభాండం వేయడానికి నీకు నోరెలా వచ్చింది ?" వా.

రూ. నోరెట్లా వచ్చింది.

చూ. నోరెట్టు లాడెనో ?

నోరొత్తుకొను

నోరు మూసికొను.

"తడబినమాటకుఁ దగిన యుత్తరము, నుడువక ప్రాజ్ఞుండు నోరొత్తుకొనునె." గౌ. హరి. ప్రథ. పం. 229-30.

నౌడు కొట్టు

మిణకరించు.

రూ. నవుడు కొట్టు.

నౌబత్తునగారాలు

రాజలాంఛనాలైన వాద్యాలు.

న్యాయపతి

న్యాయాధిపతి.

న్యాయవాది

వకీలు.

న్యాయాధిపతి

మేజస్ట్రేటు, జడ్జి.

న్యాయానికి కాలం కాదు

మంచికాలం కాదు.

"ఇది న్యాయానికి కాలం కాదు." వా.

పంక్తిదూషకుడు

ఒక పంక్తిలో కూర్చుండ తగనివాడు. చెడువాడు.

పంక్తిదూషుడు

చూ. పంక్తిదూషకుడు.

పంక్తిభేదము

ఒకే పంక్తిలో కూర్చున్న వారికి ఒకరికి ఒక విధంగా మరొకరికి ఒక విధంగా వడ్డించడం. తద్ద్వారా పక్షపాతం.

చూ. పంక్తివంచన.

చూ. బంతి పక్షపాతము.

పంక్తివంచన

చూ. బంతిలో పక్షపాతము.

పంక్తులు తీరు

భోజనానికి బంతులు సాగు.

చూ. పంక్తులు సాగు.

పంక్తులు సాగు

భోజనానికి బంతులు తీరు.

పంగనామము పెట్టు

మాట వినక తిరుగబడు.

"వాడు గురువుకే పంగనామం పెట్టాడు. నువ్వూ నేనూ లెక్క యేమిటి ?" వా.

రూ. పంగనామాలు పెట్టు.

పంగించు

వెనుక చేసిన పొరబాట్ల నన్నిటినీ ఎత్తి చూపి యేడిపించు.

'అని పంగించిన వాని నప్పటికి నిష్ఠాగాపకు ల్వలిక్రై సేస్పనఁ గోపం బుడిగెంచె.'' దశమ. 10.90.

'పాటించి నిన్ను నేను పంగించే వారము.'' తాళ్ల. సం. 10.154.

పంగువుపై గంగ

తనంతట తానై వచ్చు భాగ్యము.

దయాపరత నిది సూచించును.

చూ. పంగువుపై గంగవలె.

పంగువుపై గంగవలె

కుంటివానిపై గంగ ప్రవహించినట్లు.

వాడెలాగూ గంగదగ్గిరికి పోలేడు. అదే వచ్చుట విశేషము కదా!

''సంసారముల విమోచనము నాకాంక్షించు, పంగువుపై గంగ రంగగాయి.'' కవిక. 1.91.

''...పంగువుపయినఁ గంగ యుం బోలి మీ రిట కేఁగుదెంచిన కార్యంబును...'' నలచ. 4.98.

పంచకరపాట్లు పడు

నానా అగచాట్లపాలగు. భీమ. 4.108.

''పంచకరపాట్లు వడి తన్నుఁ బెంచి వినికి, యాపదలఁ బాపి రక్షించినట్టి తల్లి.'' కాశీ. 4.18.

''పెక్కుతెఱఁగుల నీకీర్తిఁ బెంచి వినిని, పంచకరపాట్లఁ బడ్డ నేపాటి యైనఁ, బణ్యధర్మంబు మాలోనఁ బట్టువడక.'' కా. మా. 4.17.

పంచకు వచ్చు

శరణా గొచ్చు. ఆశ్రయించు.

''పంచశరుబాణసంహతిఁ, బంచత్వము నంద లేక భామిని యిట్లే ని, పంచకు వచ్చితి.''

పద్మ. 3.33.

పంచగవ్యము

దేవపూజలో ఉపయోగించే మిశ్రపదార్థము.

గోమూత్రము. గోక్షీరము, గోఘృతము, గోమయము, గోదధి ఇందులో చేరును.

''పమి పంచగవ్య మేపనికిఁ దదీయాధ, రాస్వాదనైర్మల్య మడఁప కున్న.'' శుక. 3.111.

పంచ చేరు

ఆశ్రయించు.

''ఆవిడ అక్కడా యిక్కడా తిరిగి ఆఖరుకి వాళ్ల మేనమామ పంచ చేరింది.'' వా.

పంచటరుగు

చూ. పంచతిన్నె.

పంచతన్మాత్రలు

శబ్ద స్పర్శ రూప రస గంధములు, పంచభూతముల గుణములు.

పంచతిన్నె

ఇంటిముందున్న పంచ టరుగు.

పంచత్వము పొందు

చచ్చు

కాశీ. 5.26.

పంచప్రాణాలు
ప్రాణప్రద మనుట.
"ఆ పిల్లంటే వాళ్లతల్లికి పంచ ప్రాణాలు." వా.

పంచప్రాణాలు అప్పగించు
మహాదరంతో, అతి ప్రేమతో చూచు.
"కూతు రంటే ఆవిడ పంచప్రాణాలు అప్పగిస్తుంది."
రూ. పంచప్రాణాలు విడుచు.

పంచబంగాళ మగు
చెల్లాచెదర రగు.
"వారల దర్శించువారి దుష్కృతములు, పంచబంగాళ మై పాఱు ననిన."
జైమి. 2.109.
"చట్టు(ప)పై పోక లై చనిరి గంధ ర్వులు, గరుడులు పంచబంగాళ మైరి."
పారి. 5.37.
"ఎట్టి వెట్టలుఁ దనమీఁద నెక్క లేక, పంచబంగాళ మై పోవ."
కా. మా. 2.125.

పంచభూతాలు
పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము.

పంచము పాడగు
పాడైపోవు.
"బంటుతనము దించి పంచము పాడైరి, గరుడులు యక్షులు గగనచరులు."
వరాహ. 3.59.

పంచల దోయు
పాఱద్రోలు; పాడు చేయు.
"బహుసంసారము లెల్లఁ బంచలఁ దోసినవాఁడ." తాళ్ల. సం. 9.22.

పంచల నుండు
పడిగాపులు పడియుండు.
అనుగ్రహమునకై వేచి యుండు.
"పంచల నున్నాఁడ నన్నుఁ బాలించ వయ్యా!" తాళ్ల. సం. 11.65.

పంచవింశతిలీలలు
శివుని ఇరవై అయిదు లీలలు.
పండితా. ప్రథ. వాద. పుట. 664.

పంచాగ్నిమధ్యములో....
నాలుగు వైపులా నాలుగు హోమకుండాలు త్రవ్వి, పైన సూర్యుడు అగ్నిలా మండు తుండగా తపస్సు చేయుపట్ల ఉపయోగించే పలుకుబడి.

పంచాగ్నులు
జ్ఞానాగ్ని, కాలాగ్ని, క్షుధాగ్ని, శీతాగ్ని, కోపాగ్ని. ఆత్మ, పాద, నాభి, హృదయ, నేత్రములలో నుండు నని ప్రతీతి.

పంచాళమనిషి
అస్తవ్యస్తపు అల్లరిమనిషి.

పంచి పాలిడు
కోసి పాళ్లు వేయు.
"నీ, పలలములు నీవు నోడిన, పలభుక్కులమునకుఁ బంచి పాలిడు వాఁడవే." కవిక. 2.211.

పంజులకమ్మలు
రత్నతాటంకములు.

"బంగరుఁ దళుక్కుఁ జెక్కులను బంజుల కమ్మలడాలు చిందు ద్రొక్కంగ." ఉ. రా. 3.81.

పంట పగ పట్టు

కక్ష గట్టు.

"మచ్చరమున నమ్మదనుఁడు, పచ్చని విల్లుఁ బూని పంటపగ పట్టెఁ జెలీ!" శుక. 1.487.

పంటలు పండు

అదృష్టము ఫలించు.

"...వైదికంబు, వాసి చచ్చెను కరణాలపంట పండె." నందక. పు. 39.

చూ. పంట పండు.

పంటించున ట్లగు

తడబడు.

"చూడ్కులపం బంటించున ట్లైనాని..." భాస్క. యుద్ధ. 494.

పంటిబలం కలవాడు

భోజనపుష్టి కలవాడు.

"పంటిబలం ఉంది కనక బాగా తింటాడు." వా.

పంబెడుపాలలో నొక్క చల్ల

బొట్టు చేమిరి

మంచి ఎంత ఉన్నా చెరుచుటకు కొంచెమే చాలు ననుట.

పాలు ఎన్నయినా చేమిరి ఒక్కబొట్టు చాలును గదా! తాళ్ల. సం. 10.77.

చూ. పన్నినదొంతులపై......

పండగించు

నిలబడి పోవు.

"పండగించుచుఁ గూడఁ బఱచుచు." "పండిలా. ప్రస. పురా. పుట. 229.

పండా ? కాయా ?

పోయినపని నెఱవేరినదా లేదా అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"పండో, కాయయో పోయినకార్యం బటన్న." ప్రభులింగ. 4.38.

"వివరా లన్నీ తరువాత విందాం గానీ ముందీ ఒక్కమాటా చెప్పు. పండా? కాయా?" వా.

కార్యసాఫల్యానికి పండు, విఫలతకు కాయ చిహ్నములు.

పండియు బొల్ల వోవు

చేతికి వచ్చినది నోటికి అందక పోవు.

పంట పండియు వ్యర్థ మయి పోయిన దనుట.

"కడున్ రథసంబున నాడుమాటలుం, బండియుఁ బొల్ల వోయె నని బ్రాహ్మణి లోపల నేడ్చు నేడ్పు." ఉ. హరి. 2.26.

పండి రాసు లగు

ఎక్కువగు.

"పండి రాసు లాయెఁ గీర్తిప్రతాపము లెల్ల." తాళ్ల. సం. 1.3.

పండ్లిగిల్చు

నవ్వు; వెక్కిరించు.

"తరుణులు నవ్వుచుఁ దను జూడ మేను, పరపి గుంకించుచుఁ బండ్లి గిల్చుచును." ద్విప. జగ. పు. 177.

**పండు ఒలిచి చేతి కిచ్చినట్లు**

అతి విశదముగా.

"ఆయన ఏం పాఠం చెప్పినా పండు ఒలిచి చేతికి ఇచ్చినట్లు చెపుతాడు." వా.

చూ. అరటిపండు ఒలిచి...

**పండుగ పబ్బము**

పండుగ. జం.

"పండుగ పబ్బం బెనను, గొం డని యొకకాసు నీనికూళ్ల నిప్పీ, లంకును విడలఁగఁ బోలుము, బండాటము వీని వలపు పని కా దిచటన్." భల్లాణ. ఆ. 5.

"ఒక పండువ పబ్బంబున, నొక యూరట మైనవేళ నొక్కొక్కతతి." నిరం. 2.127.

**పండుగ సేయు**

విందు చేయు.

"భక్తమండలికిఁ బండు(గ)వు సేయు." పండితా. ద్వితీ. పర్వ. పుట. 304.

చూ. పండువు సేయు.

**పండుగొలలు**

పండ్ల గెలలు.

"మానితాప్సరోవిమానమాలిక లోలిఁ, బొలియు బ్రానఁ బండుఁగొలలు గాఁగ." వమా. 11.18.

**పండుటెండ**

సంధ్యాతపము.

"పండుటెండ దయలు పల్లవద్యుతులతో, మెండుకొనఁగ." సింహా. 4.93.

**పండువంటి వయసు**

అతివృద్ధాప్య మనుట.

"పండువంటిపయసు బలుకాఁ పురము సేయు, జవలెపంబులకును జాల లేఁడు." వచే. 3.57.

**పండువంటి సంసారము**

చక్కగా నున్న కాపురము.

"అది పండువంటి సంసారాన్ని పాడు చేసుకొని ఆ వెధవతో లేచి పోయింది." వా.

**పండువులు పర్వములు**

పండుగలు-ఉగాది మొదలైనవి. పర్వములు పూర్ణిమా అమావాస్య గ్రహణాదులు. అలవాటున రెండూ కలిపి దాదాపు ఒకే అర్థంలో ఉపయోగిస్తారు. జం.

పండితా. ద్వితీ. మహి. పుట. 183.

చూ. పండుగ పబ్బము.

**పండువు సేయు**

విందు సేయు.

"భక్తమండలికిఁ బండువు సేయు." పండితా. పర్వ. ద్వితీ. 304.

"చుట్టాలొచ్చారని పండుగ చేశాము." వా.

"ఈ రోజు మాయింట్లో పండుగ చేసుకొన్నాము." వా.

పండుగనాడు వంటకాలెక్కువ చేసుకొని ఆరగించుటద్వారా వచ్చినది.

**పండువెన్నెలలు గాయు**

వెన్నెల బాగా కాయు.

పూర్ణచంద్రిక వెలయు.

"దర్పకశాస్త్రనిరూపితౌషధ, ; క్రమ

ముఁ బండువెన్నెలలు గాసె ధరా
స్థలి మోహనంబుగన్."
కా. మా. 2.136.

పండ్లు కొఱికికొను

కోపపడు.

కోపము వచ్చినప్పుడు పండ్లు కొఱుకుటపై వచ్చిన పలుకుబడి.

"కోకిలా తూఁడు పండ్లు కొఱికి
కొనియె." కాశీ. 7.31.

పండ్లు కొఱుకు

కోపపడు.

కోపాన్ని సూచిస్తూ పండ్లు కొఱుకుట పరిపాటి. దాని ద్వారా యేర్పడినపలుకుబడి.
నైష. 7.130.

"అత్తగారికిని దీర్ఘాయు విచ్చినయట్టి,
బ్రహ్మదేవునిమీఁదఁ బండ్లు కొఱుకు."
శుక. 2.505.

పండ్లు కొఱుకుకొను

కోపము వచ్చినప్పుడు చేయు చేష్ట. దానిమీద వచ్చిన పలుకుబడి.

"...బాపు తుంబురుఁడా యంచుఁ
బండ్లు గొఱుకు, కొంచు లోలోన
నుడికితి..." కళా. 2.85.

పండ్లు గీటు

పండ్లు కొఱుకు.

"అనినం బండులు గీటికొంచు హ్రాద
యం బల్లాడుబాణాసురుం,డు."
ఉ. హరి. 5.273.

పండ్లు పీచు

పండ్లు కొఱుకు.

"శే, కొంపకుఁ బొమ్మటంచు మిఱు
గుఱ్ఱ జలింపఁగఁ బండ్లు ఓట మైఁ,
గంపము పుట్ట..." హంస. 5.66.

పండ్లు పీకి బెండ్లు కట్టించు

దండించు, శిక్షించు.

కేవలం తిట్టుగా 'పండ్లు పీకి బెండ్లు కట్టిస్తాను' అన్నట్లుగా కూడా వినవస్తుంది.

"ఆ ఊళ్లోనూ యిలా ప్రవర్తించా
వంటే పండ్లు పీకి బెండ్లు కట్టిస్తాను."
వా.

రూ. పండ్లు పీకి బెండ్లు పెట్టు.

పండ్లు రాలునపుడు

ముసలితనములో.

"పండ్లు రాలునపుడు పణ్యవృద్ధ
విషంబు." నిరంకు. 2.44.

పంత మాడు

పందెము వేయు.

"నరకునిఁ జంపువాఁడ, నందఱును
జూడ నని పంత మాడుహరికి."
ఉ. హరి. 1.121.

పంతము చూడ గదే

నేను చెప్పినట్టే కాగలదు చూడు అనుట.

"...బంతము చూడఁ గదే యని
పల్కినఁ, బంతము చూడఁ గదే యను
చున్." కళా. 3.206.

పంతము చెల్లించు

ప్రతిజ్ఞ నెఱవేర్చు.

"బలభేద్యాది సురాళితోఁ బలుకు
నా పంతంబు చెల్లింప..."
హర. 2.85.

పంతము చెల్లు
పంతము తీరు.

"మిథ్యాగర్వాంధ్యావిడంబనుఁ డైనన్
వినిపింతుఁ గా కతని కీ పంతంబుఁ
జెల్లింతునే." ఉ. హరి. 3.11.

పంతము లాడు
1. పందెము వేసికొను.

"తమిఁ బూఁదీఁగెలఁ దూఁగుటుయ్యె
లలఁ బంతా లాడుచుం దూఁగు నా,
రామరంభాయుపు గబ్బి గుబ్బెతల..."
కళా. 1.149.

2. పంతములు పలుకు.

"కండ గరువంపుమాటలు గావు
సుమ్ము, చూడు సుమ్మని పంతంబు
లాడుకొనుచు." మను. 4.34.

3. సవాలు చేయు.

"పంతము లాడుచుఁ బదరి పైఁ బడ."
విజయ. 3.146.

పంపల యెత్తు
పంగలగఱ్ఱకు కట్టి తలను
పై కెత్తు.
ప్రచ్ఛిత్ తల అని పదార్థ
సూచిక – సరి కాదు.
కఱ్ఱకు చెక్క పై కెత్తు,
పంగల కఱ్ఱతో పై కెత్తు.

"ఖలుఁ డని వ్రజిచేయి విఱుగంగ
వడిఁ బడ మోఁది గెత్తి దో,ర్బలమునఁ
దాఁకి యజ్ఞుతల పంపల యెత్తిరి."
కుమా. 2.73.

"బలిఁ జెఱి వట్టి రాహుతల పంపల
యెత్తి." కుమా. 11.96.

పందిటిబాగుగా
పందిటివలె, పందిలి వేసి
నట్లుగా.
దట్టముగా అల్లుకొని అనుట.

"అంతరిక్షమున నత్యంతంబు దట్టమై,
పందిటిబాగుగాఁ బర్వునవియు .."
కళా. 6.8.

పందిని నంది చేయు
యథార్థాన్ని తలక్రిందులు
చేయు.

"వాడు పందిని నంది చేయ గలడు."
వా.

పందిని నందిని నందిని పందిని
చేయు
పై యర్థమే.

పందిపోటు
ఒక రకమైన యీటె.

"...పందిపోటు లమ్ములు, వలలు
తెరలు దీమములు సివంగులబోనుల్."
వరాహ. 4.71.

"పసిఁడి కామల నొప్పు బలుపంది
పోట్లు, వెసఁ బూని..."
నవనాథచరిత్ర. పుట. 37.

పందిరి మందిర మగునా ?
సామాన్య మైనది గొప్పది
కాదు అను పట్ల ఉపయో
గిస్తారు.
గువ్వలచెన్న. 1.

పందిరి వెట్టు
1. కప్పిపుచ్చు, పైకి అంద
ముగా కనబడునట్లు చేయు.

కంప కట్ట మొదలయిన మొగుడుదిగుడు లన్నిటినీ పీవ లల్లించి పందిరి పెట్టి నప్పుడు కప్పిపెట్టడం జరుగుతుంది.

"మాటల తేటలం బందిరి పెట్టి."
పాండు. 3.24.

2. చల్లబఱచు.

"మాటలను బందిరి పెట్టి."
విప్ర. 4.23.

పందెంబు గొను

పణముగా నొడ్డి ధనమును గెలుచుకొను.

"తప్పక శకునియంతటివాని నైన జూదంబున గెల్చి పందెంబు గొనఁగ."
శుక. 2.502. ప. క్రింద F. N.

పందెము మోచు

పందెము వేయు.

"పరఁగ నాపెమీఁద పందెము మోచె నఁట."
తాళ్ల. సం. 3.163.

పందెము సఱుచు

పందెము వేయు.
నైష. 5.79.

పంపులు పంపు

ఆజ్ఞాపించు.

"చెసల పంపులు పంపేధీరుఁడవు నీవె కా సేనమొదలాలా."
తాళ్ల. సం. 5.158.

పంపు వెట్టు

ఆజ్ఞాపించు.

"అని బలంబులఁ గర్ణనందనునిమీఁదఁ, బంపు వెట్టిన."
జైమి. 2.47.

పంపు సేయు

ఆజ్ఞాపించు.

"ఓజలోఁ నమరముఖ్యులు పంపు సేయు." గౌ. హరి. ప్రథ. పం. 49.

పంబలపాట

పంబ అను వాద్యవిశేషంతో ఒక తెగవారు పాడేపాట.

"పంబలపాటలఁ బాడు మందువో."
గుంటూ. పూ. పు. 23.
చూ. ఆసాదిపదం.

పకాపక నవ్వు

ధ్వన్యనుకరణము.

"అ,క్కన్నులకల్కి మాటకుఁ బకాపక నవ్వె విపక్వమీనముల్."
శుక. 3.230.

పక్క-కుదురు

(?)

పక్క-పుండు పెంచు

విరోధం పెంచు.

పక్క-బెమురు

పక్కలో బల్లెం లాంటిది.

"దొంగసుంకడంటే ఆ ఊరి కంతా పక్కబెమురు." వా.

పక్కలో బల్లెము

హృదయశల్యము.
నిరంతరభయహేతువు.

"ఆరెడ్డికి వీడు పక్కలో బల్లెంగా తయారయ్యాడు." వా.

పక్కు-గొన నేయు

గాటముగా నేయు.

పక్కు పుక్కువ అనే అర్థంలో ఉన్న దేమో? స్పష్టంగా లేదు. ఆలోచనీయము.

"ఆర్జవికిం గామాధికారంబు సేసి పరమేశ్వరున కెఱింగించి పక్కుకొన నేయుదు వని." కుమా. 5.29.

## పక్కున నవ్వు

నవ్వుటలోని ధ్వన్యనుకరణము.

"ఆమాట వినగానే నాకు పక్కున నవ్వు వచ్చింది."

రూ. పక్కు మని నవ్వు, ఫక్కున నవ్వు.

## పక్ష మగు

సహాయ మగు, తోడగు.

"కైరవాప్తుండు తనకుఁ బక్షంబు గాఁగ." జైమి. 1.27.

## పగగోలు

పగగొనుట, శత్రుత్వము వహించుట.

"ఇప్పుడీ, కొండుకవాని నమ్మి పగ గోలిది కార్యమె?"

కుమా. 10.164.

## పగ చాటు

1. శత్రుత్వమును వెలి బుచ్చు.

"తోడికోడలు పగ చాటి వీడ నాడు." శుక. 3.291.

2. మన మింక విరోధుల మని చెప్పు.

"అనుచుఁ బగ చాటి పోయినాఁ డర్ధ రాత్రి, సమయమున శస్త్రనిహతి మజ్జనకుఁ జంపె." మను. 6.50.

## పగటివేషగాడు

ఆడంబరంగా వేషభాషలు ధరించినవాడు.

"ఏమి మిత్రా! ఆ జరీపంచలూ అవీ! పగటివేషగాడి లాగా." వా.

## పగటు లాడు

దూషించు.

"ఉన్నతి నాలో నుండి పూర కేమాయ, నాపైఁ బన్నితే నిన్నే సొలసి పగటు లాడేను."

తాళ్ల. సం. 7.221.

## పగ నీగు

పగ సాధించుకొను.

"వీఁడె, పగ నీఁగఁ గలండు." భాస్క. యుద్ధ. 1067.

## పగ నీగుట

పగ తీర్చుట.

"నాఁటనుండియుఁ, దంత మనంబులోఁ జనదు నాపగ నీఁగద నేఁడు నీకృపన్." పారి. 2.75.

## పగలుచీకటి

నల్లనివాడు. పగలే చీకటి కల్పించునంతటి నలుపు అనుట.

"సిరి దొలంకెడి పగలు చీకటా యితఁ డేమి." తాళ్ల. సం. 1. పు. 25.

## పగలుదివిటీలు

రాచమర్యాదను తెలుపు ఆచారము.

పగ లయినా సన్యాసులూ. రాజులూ మొదలయిన గొప్పవారు వీథులలో వెదలు నప్పుడు పట్టు దివిటీలు.

"ధ్వజవాతహాలి నారవైద్యుతా గ్నులఁ గూడి, పగలు దీవెలవారు పంజు లెత్త." మను. 5.52.

చూ. పవలుపంజులు.

## పగల్వత్తి

మతాబు.

"జలిదీవిలో నున్న వెన్నుని సన్నిధిఁ, బట్టిన బలుపగల్వత్తి యనఁగ." ఉపా. 2.24.

## పగవాడికి కూడా వద్దు

భరింప రానిది అనుట.

"ఈ అగచాట్లు పగవాడికి కూడా వద్దు." వా.

"ఈ వల్లమాలిన కాపరం పగవాడికి కూడా వద్దు." వా.

చూ. అగచాట్లు.

## పగిదివోలె

వలె. ఉపమావాచకం.

కుమా. 9.64.

చూ. అట్టులవోలె.

## పగ్గంపట్టు

ఒక పగ్గముదూరము నేల.

"వాళ్లింటికీ మాయింటికీ పగ్గంపట్టు దూరం." వా.

"వాడిచేనికీ మాచేనికీ పగ్గంపట్టు బీడే అడ్డం." వా.

చూ. ఎన్ని చాళ్లపట్టు.

## పగ్గము పేను

నారతో తాడుగా పేను.

"వలెవాలు పైచిన వలిపెనాలుఖ చించి, పేనఁచి పగ్గాలుగాఁ జేసు చుండు." రాజగో. 5.45.

## పగ్గెల ప్రోవు

ప్రగల్భములు వలుకు.

"ఓరి యాగ్గి! సిగ్గు లేక యెన్ని పగ్గెల బారోవ్వు నిలు నిలువరా!" హేమా. పు. 29.

## పచారికొట్టు

పచారీ దినుసులు అమ్ము కొట్టు.

కొత్త. 259.

## పచ్చకప్పుర మగు

అపురూప మగు, వలపుల జిమ్ము.

"గాంధర్వమునఁ బెండ్లిగమ్మని నంతలనే, పచ్చకప్పుర మాయె భామ పల్కు." విజ. 3.12.

## పచ్చ గందని

పసిమి కోల్పోని, ఎండి పోని అనుట.

"పచ్చ గందనికూరలేర్పడమిఁ జూచి." నైష. 6.119.

## పచ్చగడ్డి వేస్తే భగ్గు మను

ఎవరో యిద్దరికి విపరీత మైన పగ అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"వా రిద్దరి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటుంది." వా.

## పచ్చగరిక కాలము

అశాశ్వతము, చంచలము.

"పచ్చగరికె కాలము ప్రపంచములో బ్రతుకు." తాళ్ల. సం. 10.24.

**పచ్చడికి నఱికినట్లు**

ముక్కలు ముక్కలుగా.

"అడ్డంబు చొచ్చి మచ్చరికంబునం బచ్చడికి నఱికినట్లు కొమ్ములు విఱిచియు." ఉ. హరి. 4.229.

**పచ్చడి చేయు**

నలియగొట్టు. నుఱుమాడు.

"శౌరి కరాసిధారచే,బచ్చడి చేయఁగా జముని బానసముం బురుడించుచోటికిన్." ఉ. హరి. 4.196.

"ఎచ్చట కేఁగినన్ విడుతు నే పటుబాణపరంపరాహతిన్, బచ్చడి సేయువాఁడ." రాజశే. 2.79.

**పచ్చన**

సౌభాగ్యము.

కొత్త. 240.

**పచ్చనికొంప మాపు**

కలకలలాడుతున్న సంసారాన్ని కూల్చు.

"...పచ్చనికొంప మాపఁ బాడియె పుత్రా!" పాండవ. ప్రవా. 51.

**పచ్చపందిరి**

పచ్చని ఆకులతో కట్టిన పందిరి.

శుభకార్యాలలో ఇలా కట్టడం వాడుక.

కుమా. 9.3.

**పచ్చపయికము గుఱ్ఱము చచ్చిన దాకనె**

పచ్చపైకం గుఱ్ఱం చచ్చే వరకే.

అనగా గుఱ్ఱం బతికి ఉండే వరకే దాని విలువ అనుట.

ఏనుగు చచ్చినా బతికినా వెయ్యివరహాలు. గుఱ్ఱం విలువ చచ్చేవరకే. అనగా బతికి ఉన్నంతవరకే.

"పచ్చపయికంబు గుఱ్ఱము, చచ్చిన దాఁకనె యటన్న సామెత." నిరంకు. 2.137.

**పచ్చపూసగు**

అరుదగు, కనబడని దగు, సూక్ష్మమగు.

"సొలపుఁ బయ్యెద జేఱి చూతు నన్నంతనే, పచ్చపూసాయెఁ బోపడఁతి యారు." విజ. 3.12.

చూ. నల్లపూస యగు.

**పచ్చపైకము**

రొక్కము, నగదు.

ఎఱ్ఱని ఏగాని వంటిది.

"పచ్చపైకంబు నిందులో వెచ్చపఱుప, నెన్ని చెప్పిన మాట లిం కేటి కనిన." హరి. 4.199.

"ఎల్ల ధనమును ధనగుప్తుఁ డెఱుకమాలి, పచ్చపయికంబు లేకుండ వెచ్చపఱిచె." విక్ర. 7.124.

"పచ్చపైకము గూడఁ బడినది లేదు." గౌ. హరి. ద్వితీ. పం. 153.

**పచ్చపొడుచు**

పచ్చ పోయు.

ఒకవిధ మైన పసరుతో వానితో సూదితో పొడు స్తారు. అది ఎన్నటికీ చెఱ గదు.

"పచ్చ పొడిపించుకోవడం ఈనాడు అలవాటు లేదు." వా.

**పచ్చము పాడగు**

చెల్లాచెదరగు.

"...సేన లెల్లనుం, బచ్చముపాడుగా విఱిగి పాఱ ధనంజయుఁ డడ్డగించు చున్." జైమి. 4.20.

చూ. పంచము పాడగు.

**పచ్చల కలయంపి**

ముత్యాలముగ్గువలె పచ్చల కలయంపి కూడా జానపద కథలద్వారా వచ్చినది.

**పచ్చి....**

అచ్చం.

ఈమాట చాలా వాటితో చేరి పచ్చిదొంగ, పచ్చి అబద్ధం వగైరాల రూపంలో వినవస్తుంది. అలాంటివి క్రింద కొన్ని ఇస్తున్నాము.

**పచ్చి అబద్ధం**

శుద్ధ అబద్ధం.

"వాడు చెప్పిందంతా పచ్చి అబద్ధం." వా.

**పచ్చి ఆంధ్రుడు**

ఆంధ్రేతరు లందరూ చవట లన్నంతదాకా వెళ్లే ఆంధ్రు డనుట.

నిరసనలోనే దీనిని ఉపయో గిస్తారు.

**పచ్చికసి**

విపరీత మైనకసి.

"పచ్చికసితో వాడు వారిమీదికి ఎగ బడ్డాడు. గొంతు కోసి రక్తం తాగు తాడా అనిపించింది." వా.

**పచ్చిగంగ**

కసీసం మంచినీ ళ్లయినా.

"మూడురోజుల నుంచీ వాడు పచ్చి గంగ ముట్టలేదు. నీవు పిలిస్తే తప్ప లేచేటట్లు లేదు." వా.

**పచ్చితురక**

కసాయివాడు, అతిక్రూరుడు.

"వాడు పచ్చితురక. దయాదాక్షిణ్యం వాడి కెక్కడిది?" వా.

**పచ్చితేనె**

అప్పటి మైన కాచని తేనె.

**పచ్చి దేరగ బల్కు**

బూతులు మాటలాడు.

"ఇచ్చకం బిగుసొత్తఁ బచ్చి దేరఁగఁ బల్కు, ము ద్దిడరా యని యొద్ద కరుగు." హంస. 2.104.

**పచ్చిదొంగ**

వట్టిదొంగ.

"ఆ పచ్చిదొంగను నమ్మతా వెందుకు?" వా.

**పచ్చిపలువ**

చాలా దుర్మార్గుడు.

"వాడా! పచ్చిపులవ! వాడు మర్యాదగా ప్రవర్తిస్తాడంటే ఎవరు నమ్ముతారు?" వా.

**పచ్చిబూతు**

బండబూతు.

"తుల లేని పచ్చిబూతులకు బుంగ." శ్రవ. 2.56.

**పచ్చిబోగముది**

చాలా వ్యభిచారిణి.

"ఆవిడ సంసారి అంటే ఎవ రొప్పుకుంటారు. పచ్చిబోగంది." వా.

**పచ్చిమాల**

పరమనీచుడు.

"పచ్చిమాలవు నీవు పాపాత్మ." వర. రా. బా. పు. 179. పం. 1.

**పచ్చిమాలలు**

అచ్చం మాలలు.

"మాలఁడే యీతని మాలఁ డఁ త్రాటి, మాలలు భువిఁ బచ్చిమాలలు గాక!" బస. 7.188. పుట.

**పచ్చి వడగండ్లగుళ్లు**

అశాశ్వతములు.

తాళ్ల. సం. 7.34.

**పచ్చివిషము**

చేదు – విషప్రాయము.

"వైనా ఎవరు తాగుతారు? పచ్చివిషం." వా.

"వాడు మాటల్లోనే పచ్చివిషం కక్కుతాడు." వా.

**పచ్చి వెచ్చి**

ఉచ్చిపచ్చి, అపరిపక్వమైన.

"పచ్చివెచ్చి చదువుల భ్రమయఁగ నేలా!" తాళ్ల. సం. 10.220.

**పచ్చిషోడా**

పచ్చిపులవ.

"వాడీమధ్య పచ్చిషోడా అయిపోయాడు. మునుపటివాడు కాదులోయ్." వా.

**పచ్చి సేయు**

ఆఱడి చేయు.

"హెచ్చరిక మఱచితి నింక నెల్లనన్ను, పచ్చి సేయకురా యింక పది వేలు వచ్చెను." తాళ్ల. సం. 3.47.

**పటపట పండ్లు కొఱుకు**

పండ్లు కొఱుకుటలో ధ్వన్యనుకరణము.

"పటపటఁ గపాలసంక్తులఁ బగులఁ గొఱికె." మను. 4.113.

**పటాటోపం**

డాబు, దర్పము.

"వాడి పటాటోపం చూచి మన మేదో భయపడి పోతా మని అనుకున్నాడు." వా.

"పటాటోపో భయంకరః."

**పటాటోపో భయంకరః**

వట్టి ఆడంబరమే అనుట. పంచతంత్రంలోని మేకపోతు కథపై వచ్చినపలుకుబడి. స్ఫటాటోపమే పటాటోపముగా మారిం దని కొందఱు. స్ఫట మనగా పడగ. పడగ యెత్తడం తప్పితే యేమీ చేయలేని పాము నుబట్టి వచ్చిం దని వారి భావం.

పటాపంచం బగు

పటాపంచ లగు.

"పటాపంచం బై దురితంబు లెల్లఁ జనఁగా." విజయ. 2.65.

పటాపంచ లగు

1. చెల్లాచెదరు లగు.

"పన్నగేంద్రులు పటాపంచ లైరి." పారి. 5. 37.

2 బెదరి పాఱిపోవు.

"కన్నదే గాతి గా కిన్నరుల్ సురిగిరి, పన్నగేంద్రులు పటాపంచ లైరి." పారి. 5.

పటాపంచు జేయు

ఛిన్నాభిన్నము చేయు.

ధ్వన్యనుకరణము.

"తెలిసి ముద్రాసనంబుల మేని పని గోని, పాపపూరుషుఁ బటాపంచుఁ జేసి." పాండు. 2.8.

చూ. పటాపంచలు చేయు.

పటితళించు

1. ఆపు అని సూ. ని. పటితళిసు – కన్నడం.

"ఊర కత్తిప దాయ ముగ్గడించినఁ గాని, పట్టి వేయకు మని పటిత ళించి..." ఉత్త. హరి. 3.122.

2. కొట్టు.

"బాహు వెత్తి చటిల్లనఁ బటితళించి." ఉత్త. హరి. 6.85.

పటితాళించు

చప్పట్లు గొట్టు.

"పటితాళింపుచు నవ్వె." క్రీడా. పు. 24.

పటితళించు అన కిది రూపాంత రమా? తెలియదు.

పట్టంబు గట్టు

పట్టాభిషేకము చేయు, అధి పత్య మప్పగించు.

"ఈ పురంబు నూతనంబుగ నిర్మించి నిన్నుఁ బట్టంబు గట్టినది నీకు విదితం బైనది చెప్ప నేల..." కళా. 8.185.

పట్టపగ్గాలు లేవు

వాని పిరగబాటుకు అడ్డు లే దనుట.

"ఆ చిన్న ఉద్యోగానికే వాణ్ణి పట్ట పగ్గాలు లేవు. ఇక పెద్దదే వస్తే ఇక ఎలా ఉంటాడో?" వా.

పట్టపేనుగు

రాజగజము.

అమ. పీఠి. 32.

పట్టము గట్టు

రాజ్యాభిషిక్తుని చేయు.

"లోహితాస్యుఁ, బట్టంబు గట్టింతు." గౌ. హరి. ప్రథ. పంక్తి. 2370-71.

చూ. పట్టంబు గట్టు.

పట్టవర్ధనము

నామాలు.

"అట్టె కొందఱు దురితము లన్నియు నేక మని, పట్టవర్ధనము నెతి బెట్టి చూపిరి." తాళ్ల. సం. 7.36.

పట్ట శక్యం కాదు

పట్ట పగ్గా లుండవు.

"వాడికి మూడో బహుమానం వస్తే నే పట్ట శక్యం కావడం లేదు. ఇక

మొదటి బహుమానమే వస్తే యేం కష్టో?'' వా.

**పట్టాభిషిక్తు డగు**

రా జగు.

వా. మా. 95.

**పట్టాలు తప్పు**

గతి తప్పు, స్థిరత కోలుపోవు. రైలు పట్టాలమీద నడుస్తూ ఉన్నది పక్కకు తొలగితే పట్టాలు తప్పడం అంటారు. ఈస్థితి అలాంటి దనుట. అలా యిటీవల యేర్పడిన పలుకుబడి.

''వాడి మనసు పట్టాలు తప్పింది.'' వా.

**పట్టించుకొను**

ప్రమేయము కల్పించుకొను.

''వా డెవ రే మనుకొన్నా పట్టించుకోడు.'' వా.

''ఇంట్లో ఏ ముందో ఏమి లేదో పట్టించుకోకుండా కూర్చుంటే యెలాగు?'' వా.

**పట్టి కట్టాడు**

పట్టుకొని చుట్టుకొని బాధ పెట్టు.

''పట్టింప రని వెండి పసరింప రాదు, పట్టి కట్టాడుదుర్ వడిఁ దీఁగలట్ల.''
పండితా. ప్రథ. పురా. పుట. 318.

**పట్టి చూచు**

పరీక్షించి చూచు.

సరకు నాణ్యాన్ని పరీక్షించుటలో పట్టి చూచుట పై వచ్చినపలుకుబడి.

''వా డేమాత్రం చదువుకొన్నాడో కాస్త పట్టి చూడా లని ఉంది.'' వా.

**పట్టిచ్చు**

గుట్టు మట్టు తెలియ జేయు.

''పదిలముగ నీవిధము పట్టీయకుండినను, చదువు లనునను మున్ను చదివేటి చదువు.'' తాళ్ల. 1 సం. 139 పు.

**పట్టినకాయ పండగు**

పట్టిన దెల్ల బంగార మగు వంటిది.

రామచం. 60.

**పట్టిన కేలు పట్టినట్లే యుండగా**

ఉన్న దున్నట్లే యుండగా.

''నీ చిగురుటాకుంబోఁడి మూర్ధంబు పట్టినకేల్ పట్టినయట్ల యుండ దృఢముష్టిం బూని...'' కళా. 3.152.

**పట్టినచెఱలు**

బందీలు, బంధితులు.

''రాత్రుసాధీను పట్టినచెఱ లెల్ల విడిచి.'' సమా. 12.194.

**పట్టినతావున**

ఎక్కడ బడితే అక్కడ.

''నిమ్మపండ్లు మాత్రం పట్టిన తావున దొరుకుచున్నవి.'' కాశీయా. 87.

**పట్టినది యెల్ల బంగారం ముట్టినయది ముత్యముగ**

అదృష్టకాల మనుపట్లు ఉపయోగించే పలుకుబడి.

నానా. 29.

పట్టినది విడువకుండు

గట్టి పట్టుదలతో ఉండు.

"మనసు ఱాయి సేసి కరఁగవు మఱి నీ, పట్టినది విడువ విఁక ని,న్నిట్టట్టన నేల." మను. 3.95.

"వాడు పట్టినపట్టు వదలడు." వా.

పట్టిన దెల్ల బంగార మగు

అదృష్టము కలిసి వచ్చు.

"వాడు పట్టిం దల్లా బంగారంగా ఉంది. ఇ దొకదశ." వా.

పట్టినపనులు

చేపట్టిన కార్యములు.

"పట్టిన, పనులు దీర్పఁగ నమర్పఁగ సమర్థుఁడవు."

వర. రా. కిష్కి. పు. 527. పం క్తి. 16.

పట్టి పల్లార్చు

నాశనము చేయు.

"పట్టి పల్లార్చ కేపట్టున దయఁ జిల్కు, మనసు గల్గినయట్టిమగఁడు గలిగె." హంస. 4.146.

పట్టి పాలార్చు

నాశనము చేయు.

"పట్టి పాలార్చెదరు మీరు పాండు సుతుల, నీవు భీష్ముండు నలిగిన దేవత లకు, నైన మార్కొన వచ్చునే?" భార. భీష్మ. 2.280.

"...మార్పుము కాలయాపన మమర్పక యప్పిశితాశిఁ బట్టి పా,లార్పఁగ నేల నావుడు..." భార. 6.213.

చూ. పట్టి పల్లార్చు.

పట్టి మట్టాడు

వేధించు, సాధించు.

"పలికినఁ బాపంబు పట్టి మట్టాడు." సారం. 1.918.

పట్టి మల్లలాడు

పట్టి పల్లార్చు.

"బల్లిదంబునఁ బట్టి మల్లలాడు." రాధా. 5.56.

పట్టి జూచు

పట్టిచ్చుటకై—ఒకరికి అప్ప గించుటకై చూచు.

"నన్నొల్లక పుష్పబాణునకుఁ బట్టిఁ జూచితే నిర్దయన్." కుమా. 8.176.

"వాణ్ణి పోలీసులకు పట్టి జూస్తు న్నావా." వా.

పట్టు కత్తిరించినట్లు

ఖచ్చితముగా, ఖరాకండిగా; సున్నితంగా.

"వా డేది మాట్లాడినా పట్టు కత్తిరించి నట్లు మాట్లాడతాడు. ఒక్క పొల్లు మాట ఉండదు." వా.

పట్టుకొని వ్రేలాడు

తగనివానిపై—దానిపై ఆధార పడు. కృష్ణనీ. 54.

పట్టుకొలుపు

పట్టుకొను, ఆపు.

ఒప్పించు అని టిప్పణి.

"నీ విందు యుండి...సర్వేశుఁ బట్టు గొలుపు మబల."

"అది మేనక కూఁతు ననునయంబునం బట్టుకొలుపుచుండె." కుమా. 6.14.

## పట్టుగొమ్మ

ఆధారము.

"ఘనభుజవిక్రమోన్నతుఁడు గౌరవకోటికిఁ బట్టుగొమ్మ మ, మ్మనిమెనఁ దూలపుచ్చినమహాత్ముఁడు గర్ణుఁడు..."
భార. శాంతి. 1.7.

## పట్టుగొమ్మ

ఆధారము.

చెట్టు నెక్కినప్పుడు ఏదో ఒక కొమ్మను ఆధారంగా చేసుకొని ఎక్కడంపై వచ్చిన పలుకుబడి.

"తిమ్మ ధనార్థుల పట్టుం, గొమ్మ."
హర. పీఠిక. 23.

## పట్టు పట్టు

తాను తలచినపని అయి తీరవలె నని గట్టిగా కూచోను.

"వాడు ఆపిల్లను తప్ప మరొకర్ని పెళ్లి చేసుకో నని పట్టు పట్టి కూర్చున్నాడు." వా.

## పట్టుపడు

చిక్కు.

"పవనజుఁ డటు పట్టుపడిపోవుటయును."
రంగ. రా. బాల. పు. 8. పంక్తి. 9.

## పట్టుపిడికెడు

పిడికిలితో పట్టుకొనదగు — పిడికిట నిముడు — అనగా అంత పలుచగా ఉన్న వన్నమాట.

"పట్టుపిడికెఁడు నెనయు జీనువు పట్టరవ లివె జవిడికట్టులు."
శుక. 1.222.

## పట్టు మని....

కనీసం అన్న భావ రేఖ యిందులో కానవస్తుంది.
రామచం. 25.

"ఆసభకు పట్టుమని పదిమంది రాలేదు." వా.

"పట్టు మని పదిరూపాయ లయినా లేందే పట్నానికి పోయి ఏం చేస్తాం?" వా.

## పట్టు మని పదికాలాలు

కొంతకాలం.

"పట్టు మని పదికాలాలుండేపని చేయాలి." వా.

## పట్టువడు

1. దొరకు — బందీ యగు.

"పరుల కేగతి పట్టువడియె."
జైమి. 2.41.

లక్షణయా—

అబ్బు అనే అర్థంలో వాడుకలో కనిపిస్తుంది.

'వాడికి చదువు బాగా పట్టుబడింది. వాడికి ఆవిద్య పట్టుబడ లేదు' ఇత్యాదులు.

"బ్రహ్మవిజ్ఞాన మూరక పట్టువడదు."
భీమ. 5.185.

వాడుకలో—

'వానికి చదు వేమీ పట్టుబడ లేదు.' దొరకు. 'ఆ నేరస్థుడు పట్టుబడినాడు.'

2. చిక్కు.
"ధర్మజుఁడు పట్టువడున కాఁ దలఁచి రప్పుడు." భార. ద్రో. 1.114.

పట్టు వదలు
సడలు.
పాండు. 5.238.

పట్టువఱచు
ఒప్పించు.
"అందఱఁ బట్టు వఱచి."
సమా. 6.27.

పట్టువిడుపులు
ఏ సమయంలో బిగుసుకో వలెనో, యేసమయంలో తగ్గ వలెనో తెలిసి యుండుట.
"వాడికి పట్టూ విడుపూ తెలియదు. కాబట్టే ఆ పంచాయతీ పాడయింది." వా.
"ఎంత అధికారం ఉన్నా పట్టువిడుపు లంటూ ఉండాలి! లేకపోతే అనవసరంగా చిక్కుల్లో చిక్కుకోవడం కూడా కద్దు." వా.

పట్టెడుకూడు
ఇంత అన్నం.
కొంత తక్కువ అన్న భావంలో ఉపయోగిస్తారు.
"అతఁడు పట్టెడుకూటి కర్హుండ కాని, క్షితి కెల్ల నీవ భూపతివి."
బస. 2.24.
"పట్టెడు మెతుకులు దొరికితే చాలు." వా.
చూ. గుప్పెడు మెతుకులు.

పట్టెడు మెతుకులు
గుప్పెడు మెతుకులు.
"కరువు వచ్చి జనం అంతా పట్టెడు మెతుకులు దొరక్క మలమల మాడి పోతున్నారు." వా.

పట్టెనామములు
పట్టెలుగా తీర్చిన నామములు.
"నాలిమాటలు నీ పట్టెనామములును." విప్ర. 5.55.

పడకంటి పడి ఉండు
ఎప్పుడూ పడుకొనే ఉండు.
"వాడు పాపం పడకంటి పడి ఉండడం తప్పితే ఏం చేయగలడు?" వా.

పడకలమారి యెద్దు
సోమరి.
కాడి గడితే పడుకొనే ఎద్దు సోమరి కదా! అందుపై ఏర్పడినది.
రామచం. 48.

పడ గఱచు
బాగా కఱచు.
"పాము వాణ్ణి పడ గఱచింది." వా.

పడగొట్టు
కూల్చు.
"ఇల్లు పడగొట్టి తిరిగి కట్టించాలనే ప్రయత్నంలో ఉన్నాను." వా.

పడచ్చు
పడియచ్చు.
ఏదైనా రూపును తొలిచి దానిలో బంగారం వేసి కొడితే ఆరూపు పడునట్లుగా తయారు చేసినఅచ్చు.

"వాళ్లనాన్నా వీడూ ఒకటే పడచ్చులో కొట్టినట్లుగా ఉంటారు." వా.

పడ దిట్టు

బాగా తిట్టు.

"వాణ్ణి నలుగురూ పట్టుకొని పడ దిట్టారు." వా.

పడ దిద్దు

తెగ దిద్దు.

"ఏమిటోయ్! అలా పడ దిద్ది పారేస్తున్నావు?" వా.

పడదు

సరిపడదు.

"వాడికీ వీడికీ పడదు. అనవసరంగా వాళ్లను మనయింట్లో కలపడం మంచిది కాదు." వా.

"వాళ్లిద్దరికీ ఈమధ్య పడడం లేదు. అతనిదగ్గిర్నుంచి వచ్చానని చెప్పావో ఇక అసలు మాట్లాడించడు." వా.

"వాడికీ వీడికీ పడదు. వాడివల్ల నీకు పని కావాలంటే వీడిమాట అక్కడ ఎత్తవద్దు." వా.

పడద్రోయు

పడవేయు.

"పావకు కుండముల లేదు పడఁద్రోయంగన్." రుక్మాం. 2.8.

పడనిపాటులు

పడరానిపాట్లు అని నేటి వాడుక.

కాశీ. 5.76.

"దానికోసమని నేను పడరానిపాట్లు పడ్డాను." వా.

పడ నీడ్చుకొనుచు

కింద పడవేసి యీడ్చుకొనుచూ.

"దినాంతయోధుఁ డీ,చాయఁ దదీయపత్నిఁ జెలుచం బడ నీడిచికొంచుఁ బోయెడిన్." పారి. 2.30.

పడ నూకు

పడత్రోయు.

రాయలసీమలో నేడు బాగా వాడుకలో ఉన్నది.

"తలుపులు పడ నూకి." బస. 7.192.

"గోడ పడనూకి వేరే కట్టిస్తే గానీ లాభం లేదు." వా.

పడ బడ బాఱు

నడవ లేక పడిపోవుస్థితిలో ఉండు.

"పడఁ బడఁ బాఱుచున్ వడఁకు పట్టిన తల్లిని దండ్రి." పాండు. 3.38.

పడమటిగాలి వెట్టు

వేడిగాలి గొట్టు.

వేసవికాలంలో గాలి పడమటినుండి వీస్తుంది. దక్షిణపుగాలి చల్లనిదయినట్లే పడమటగాలి వేడిది.

"పడమటిగాలి వెట్ట నొకపాలియుఁ గ్రోలమి నీరసంబులై." శుక. 3.444.

పడ మొత్తు

పడగొట్టు.

పడవాళులు

ప్రతీహారులు.

కుమా. 11.66.

పడవైచు

క్రింద పడవేయు

"ధనము పెటికలు పడవైచి తల్లడ మున." జైమి. 4.23.

పడ వ్రాయు

తెగ వ్రాయు.

"ఏమిటోయ్! అంత పడ రాసేస్తున్నావు?" వా.

పడసాల

కూటము.

ఇది అనంతపురం మొదలైన జిల్లాలలో ఎక్కువగా అలవాటులో ఉన్న పలుకుబడి.

"మధ్యాహ్నం అడవాళ్లంతా పడసాలలో కూర్చొని విస్తళ్లు కుడుతున్నారు." వా.

పడి ఉండు

కోపముతో అనుమాట.

"నోరు మూసుకొని ఊరికే పడి ఉండు." వా.

"మాట్లాడక ఒక చోట పడి ఉండమంటే ఉండవు." వా.

పడికట్టురాళ్లు

ఆయా చోట్లకు తగినట్లుగా ముందే యేర్పరుచుకొన్న మాటలు, భావాలు.

కాస్త యెత్తిపొడుపుగానే యీ మాట అంటారు. గోడ కట్టడంలో అక్కడక్కడా పడికట్టురాళ్ళను ఉపయోగిస్తారు. అందుపై యేర్పడినది.

"ఏవో అలంకారం, రసం అంటూ నాలుగు పడికట్టురాళ్లు పడవేసినంత మాత్రంచేత అది సాహిత్య విమర్శ అవుతుందా?" వా.

పడిగాపులు కాయు

ఎవరి దర్శనార్థమో వేచి కాచియుండు.

"వారింటిముందు పడిగాపులు గాయడంతోనే సరిపోయింది. వాడి దర్శనం మాత్రం కాలేదు." వా.

పడిగాపులు పడు

దర్శనార్థమై పంచలు కాయు.

"పుడమివిభు లెంద ఱెందఱో, పాడగాపులు లేక ద్వారభూముల యందున్, బడికాఁపులు పడి యుండఁగ, బడుగుల కే లబ్బుఁ గంసభంజను సేవల్." కుచే. 1.117.

పడిగొను

పరిహారము గొను.

"హరుఁడు గుంటెనవుచ్చ నట వేయు మాడ, లరుదుగాఁ బడిగొను నటె యనుదినము, నంబి." పండి. మహి. ద్వితీ. 164.

పడి చచ్చు

అత్యాదరం చూపు.

"వాడు పెళ్లాం అంటే పడి చస్తాడు." వా.

"వాడు నాటకాలంటే పడి చస్తాడు." వా.

ప్రక్కనున్న మాటనుబట్టి అర్థం మారడం కద్దు.

"మా డేండ్లుగా ఇందులో పడి ఛస్తున్నాడు." వా.

## పడి పడి
ఎక్కువగా.
"ఎందఱే బడి బడిఁ జెప్పి పంప నది పాటిగఁ బట్టక......" కాశీ. 7.44.
పడి పడి చదువు – 'వాడు పడి పడి చదువుతున్నాడు.'
'ఆమె పడి పడి యేడుస్తుండి నది.'

## పడియ గట్టు
మడుగు గట్టు.
"ఏనుంగును, బడియె సేతు రచటఁ బడియ గట్టె." కా. మా. 2.151.

## పడియచ్చులు
పోత పోయుదిమ్మలు.
"క్షితి శిరోభూషావిశేషనిర్మితికిఁ బా, ల్వాడు పడియచ్చుల ట్లడుగులు దగ." పాండు. 1.161.
చూ. పడచ్చు.

## పడి యోగిరములు
పథములోని ఓగిరము, దారిలో తినుటకై తెచ్చుకొనిన భోజనము, పాథేయము, చద్ది.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 290.

## పడి వెట్టు
పరిహారము గ్రహించు.
"పడిగొను నంబియు, ఒడి నిట్టు శివుఁడు."
పండితా. ద్వితీ. మహి. పుట. 164.

## పడిసేటిది
పడిచెట్టు.
ఒక తిట్టు.
కులీనురాలు కాదని సూచిస్తూ చెప్పి పొడిచే మాట.
ఒకరు విత్తనము వేసి మొలవేసిన చెట్టు కాదు. దానంతట అది పడి మొలిచిన చెట్టు. అనగా కులీనము కాదనుట.
వాడుకలో–పడిసేటిముండ.
"చెక్కడుపార యీయఁ బడిసేటది చక్కని కోడెకాంద్రపైఁ, బ్రక్కల వ్రాలి సోలి నగుబాటున కళ్ళక సంజ చీఁకటిన్." హంస. 5.48.

## పడిసేయు
జీవింప జేయు.
జీవనాధార మేర్పఱచు–అగు.
కుమా. 10.116.

## పడిహారి
ప్రతిహారి, సేవకుడు.
"మదపులేఖయు నంది పడగయుఁ గొనుచుఁ, బడిహారిక్రియఁ బట్టపగలె యేతెంచె." బస. 6.168.

## పడుక యిచ్చు
సంగమించు.
"అందఱికి నన్నిరూపంబు లంది పొంద, దక్షుఁ డయ్యును నొక వినోదంబు గాఁగ, నిరువురకు మువ్వురకు మఱి యేవురకును, బడుక యిచ్చుచుఁ బెనఁగె గోపాలుఁ డపుడు." దశా. చ. 8.94.

## పడుగు పేక యగు
కలగలిసి పోవు.
"పడుగుఁ బేకయు నైన దంపతులఁ జూచి, యెలనగవు నవ్వి మరుఁడు

వి ల్లెక్కడించె.'' కవిక. 4.180.
''పడుగు పేకపగిదిఁ బడిరి రిపులు.''
భాస్క. యుద్ధ. 1451.

## పడుగు పేక విరగ దన్ను

అటూ ఇటూ వాయించి పంపు; బాగా తన్ను.
''పడుగూ పేకా విరగదన్ని పంపితే సరి. వా డిక నీ జోలికి రాడు.'' వా.

## పడుగు పేక పడు

పడుగూ పేకా వలె నిలువుగా అడ్డంగా కలగలిసి పోయి పడు. (నేతలో నిలువుగా ఉన్న దారాలవరుస పడుగు, దానిలో దూర్చి అడ్డుగా నేయుదారాల వరుస పేక.)
''కడ్చెర సైపీనుఁగులు పడువుఁ బ్రేకయుఁ బడియెన్.''
కుమా. 11.127.

## పడుచుకార్యములు

పిల్ల చేష్టలు. దుడుకుపనులనుట.
''కని యశరీరి యీ పడుచుకార్యము లేటికి? వీఁడు దీని నెక్కిన నగుఁ బాటు కాదె.'' సింహా. 1.169.
వాడుకలో పిల్ల చేష్టలు అనే వినబడుతుంది.

## పడుచుకూతలు

పరస్త్రీప్రసంగములు.
పడుచువారు అలాగే మాటలాడుకొందు రనుటపై ఏర్పడినది.

''వేదశాస్త్రప్రసంగంబు వీడి కొల్పి, పడుచుఁగూఁతలఁ గూయ.''
నిరంకు. 2.83.

## పడుచుచేతలు

వ్యభిచారాదులు.
''పడుచుఁ జేఁతలు మాని పార్వతీశ్వరుఁడు'' భల్లా.

## పడుచుతో పరిహాసము

ప్రమాదకారి.
వేంకటేశ. 52.

## పడుచు నిచ్చు

పిల్ల నిచ్చు; కన్య నిచ్చి పెండ్లి చేయు.
''బాసఁ దప్పిరి యొక్క పడుచు నీరైరి.''
పండితా. ప్రథ. పురా. పుట. 293.

## పడుచెట్టులు

వేయకా పెట్టకా వాటంతట అవిగా మొలచినచెట్లు. 'పిడిచెట్టు' లనే పాఠం కుదరదు.
''ఇందుల పడుచెట్టు లిలఁ గాయ సిద్ధులు.''
పండితా. ద్వితీ. పర్వ. పుట. 240.

## పడు పడుకకు చెప్పక

అతిరహస్యంగా – ఏ ఒక్కడికీ చెప్పకుండా.
కనీసం తాను పడుకున్న పడకకు కూడా తెలియనీయకుండా.
''పడుపడుకకుఁ జెప్పక.''
పాండు. 3.49.

పడ్డదియె పాటుగ

పడింది పడినట్లుగా.

"వారిలోపలఁ బడి యందు పడ్డదియె పాటుగఁ..." కళా. 6.77.

పణత ఊడగొట్టు

బాగా తన్ను.

పణ మొడ్డు

పందె మొడ్డు.

"ఓడియు బలభద్రుఁ డుడుగక లక్ష, మాడలు పణ మొడ్డి మఱి గెల్చుట యును." ద్విప. భాగ. కల్యా. పు. 129.

పతికి పాసిన బయ లగు

అనాథ మగు.

"మన సైనికులు గీచకారి నెదుర, పతికిఁ బాసినబయ లయ్యె నతని మునుము." భార. భీష్మ. 2.82.

పతి వెట్టు

రక్షణ యిచ్చు.

"సత మై శ్రీవేంకటేశ సవతు లైనవారి, బతి వెట్ట వలెఁ గాని పచ్చి సేయ తలెనా?" తాళ్ల. సం. 3.520.

పత్తి దాల్చినవిధమున

దీపంవత్తి పట్టుకొన్నట్లు.

"తివురు విరహానలంబున దివ్వె లెత్తఁ, జిత్తజాతుండు వత్తిఁ దాల్చినవిధ మున." ఉ. హరి. 5.131

పత్రం పద్దు

పత్రాలు. ప్రామిసరీనోట్లు.

జం.

"పత్రముం బద్దును నుండఁగా." గీర. 17.

పత్రములు

డబ్బు యిచ్చి పుచ్చుకొనే సందర్భంలో వ్రాసికొన్న ఒప్పందపుకాగితాలు. ప్రామి సరీనోట్లు.

"తండ్రికి నిడ్డపత్రములు"

పాండు. 3.16.

వాడుకలో—

'నేను పత్రం వ్రాసి యిస్తాను. ఒక నూరు రూపాయ లుంటే వడ్డి కివ్వు.

పత్రము లేనిఋణము

చేబదులు.

"వెల యిచ్చి తీర్చి రప్పించ శరుండు పూట యగుపత్రము లేనిఋణంబు హాలికుల్."

కవిక. 4.97.

పథ్యము పుచ్చుకొను

జ్వరమో జబ్బో బాగుపడిన దను.

"నిన్న నే పథ్యం పుచ్చుకున్నాను. అప్పుడే ఎలా రాను?" వా.

పథ్యము పెట్టు

1. జబ్బుపడి తేరుకొన్న తర్వాత మొదటిసారి ఆహా రము పెట్టు.

"నిన్న నే మా అబ్బాయికి పథ్యం పెట్టాము. అప్పుడే బయటికేం వస్తాడు?" వా.

2. ఆయారోగాలను అనుస రించి రోగి ఫలానా ఫలానా

తినకూడదు, ఫలానా తినాలి అని నిర్దేశించు.

"వైద్యుడు అతని కేదో లోపల రోగం ఉన్న దని వంకాయలు, నువ్వులూనూనె కూడ దని పథ్యం పెట్టాడు." వా.

పదంబుల తాచు

కాళ్లతో తన్ను.

"గరుదంచలంబుల నడఁచియుఁ బదంబులం దాఁచియు."

పారి. 2.88.

పదకవాదము

పిడివాదము.

"ఇది శ్రుతిస్మృతిమూలమే కాని యొండు, పదకవాదం బని భావింపఁ జనదు." బస. 1.19.

పదట గలియు

బూడిదపాలగు, ధ్వంస మగు.

"ప్రజ్ఞావిలాసంబు పదటఁ గలసె."

శివ. 3.62.

పద నిచ్చు

తడి చేయు.

"కొనగోరఁ బద నిచ్చి కురులు దీర్చు."

క్రీడా. పు. 22.

పదను చెడు

పాకము చెడు.

"......క్రమముగఁ బదను చెడుక నిక్క మిది......"

శ్రవ. 4.64.

పదను తివిసినకస్తూరి

తడి యారిపోయిన కస్తూరి. చెడిపోయిన దనుట.

"పదను దివిసినకస్తూరి."

పాండు. 3.22.

పదను దివియు

మొనదేలు.

"పదను దివిసి రాగిజేతి పలుకక యున్నక." పాండు. 3.182.

పదను దీర్చు

తడి యారని, సారవిహీనము కాని.

"పార్వతీదేవికుచంబులం బదను దీర్పని కస్తురిముద్రగా."

హర. పీఠిక-2.

పదపదార్థములు

రకరకాలు వంటకాలు. నేటికీ రాయలసీమలో వ్యంజనాదులను పదార్థా లనడం ఉన్నది.

"పదపదార్థములు వడ్డించి."

బస. 5.144.

"ఏం పదార్థాలు చేశా రమ్మా." వా.

పదహారణాల (ఆంధ్రుడు)

పూర్తిగా.

చూ. పచ్చిఆంధ్రుడు.

పదాఱింట తరమును గాగ

అప్పటముగా.

ఇది చంద్రుని బట్టి వచ్చిన పలుకుబడి. పదహారుకళలు నిండినప్పుడు చంద్రుడు సంపూర్ణు డవుతాడు. దీని మీద వచ్చినదే పదారు వన్నె బంగారం.

"గుంపు నలపును లేకుండ గుండుపోగు, గాఁ బదారింటి తరమును గాఁగ నూలు, వడఁకరే......" శుక. 2.419.

పదింబది

మాటిమాటికి.

"నవనిధానంబుల భాండాగారంబులు నియమించి పదింబదియుఁ గా రాజ్యపరి పాలనంబు సేయుచుండెను."
శుక. 1.339.

పదికోట్లు సేయు

అమూల్య మగు

"పెట్టె నేరాజు, గొప్పసొమ్ములు పది కోట్లు సేయ." విజయ. 1.23.

పదినోళ్ల బడు

ఇతరుల దూషణలకు పాత్ర మగు, చెడ్డపేరు తెచ్చుకొను.

"పదినోళ్ల భాషింపఁబడురచ్చలకు నెక్కి." శకుం. పీ. 78.

పదిపన్నెండు రోజులు

కొన్ని రోజులు.

"పదిపన్నెండు రోజులలో వస్తాను. నువ్వేం బెంగ పెట్టుకోకు." వా.

పదిమంది నోళ్ళలో పడు

దూషణకు పాత్ర మగు

"పదిమందినోళ్లలోఁ బడనిసరస్వతి."
శ్రీనివా. 1.87.

ఇందులో శ్లేష ఉన్నది.

చూ. నలుగురినోళ్ల లో పడు.

పదియార్వన్నె పసిడి

అపరంజి బంగారు.

"పదియార్వన్నె పసిండి."
హర. 4.41.

చూ. వన్నె మీఱు.

పదియు బదియును

మాటిమాటికి.

"ఇంక దీనికిఁ గర్తవ్య మెద్ది మనకుఁ, బదియుఁ బదియును గా నీతిపదవి నరసి." కళా. 7.246.

"అని మఱియుఁ బదియుఁ బదియును, గనుఁగొని కదళికకు నాజ్ఞఁ గల్పించె ..." శుక. 3.631.

రూ. పదింబది.

పదిరికొని

పిలుచుకొని, మాటలాడు కొని.

"సఖు లొండొరువులం బదరికొని కెలంకుల కోసరించిరి."
కుమా. 5.150.

పదిలక్షలు

పదిలక్షలు ఇచ్చినంత. అంతా ఎంతో అనుగ్రహము చూపినంత అనుట.

"నా కా పాపాత్ముఁ జెప్పినజో బది, లక్షల్ లేకున్న విడుతుఁ బ్రాణము." కా. మా. 3.101.

పదిలపడు

కుదురుకొను, నెమ్మది చెందు.

"పాశుపత మంటమీఁదను బదిల పడును." భీమ. 5.157.

"బహుముఖం బైనరాజ్యంబు పదిల పడదు." కాశీ. 5.277.

పదిలపఱచు

కుదురుపఱచు.

"హేమపట్టిక ఫాలభాగంబునఁ బదిల పఱచి." జైమి. 3.120.

"తన కపటము లోనన పదిలపఱచె." జైమి. 8.91.

పదిలో పదునొకండు

1. ఇంత యెక్కువ నష్టములో ఇంక కాస్త ఎక్కువ అయితే మాత్రం ఏమి? అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

2. ఇంత మందిలో వీడూ ఒకడు.

"అలివేణీ! పదిలోపలం బదునొకం డై యుండెనో లేదొ." ఉ. రా. 4.215.

రూ. పదిలో పదకొండు.

పదివేల కాపు

పదివేల ఆస్తి గలగృహస్థు.

"కోటికి పడగ లెత్తినవానిఁ, బదివేల కాపవై బ్రదుకు మన్నట్టు."

బస. ప్రథ. పుట. 5.

పదివేలు వచ్చె

నాకు కావలసిన దంతా సంతృప్తిగా వచ్చినట్లే.

"ఇట్టిదివ్యసుఖము లే నొల్లఁ బదివేలు, వచ్చె నాకు నమరవర్గమునక, యుండ నిమ్ము వాని నో యన్న విచ్చేయు, మిష్టమైనయెడకు నిపుడ నీవు."

భార. అర. 6.139.

పదివేలు సేయు

అమూల్య మగు.

"మేలు తేజికిఁ బదివేలు సేయు."

విజ. 1.23.

పదివే లేం డ్లుండుము

దీవన.

"అ, ట్లైలమిఁక భామిని నీవు గూడి పదివేలేం డ్లుండుమీ యిద్ధరన్."

ఉషా. 3.28.

పడిహారి

ప్రతీహారి, పడిహారి రూపాంతరం.

కుమా. 10.159.

పదుగురిలో పదునొక డగు

సర్వసామాన్యు డగు; అందరితోపా టగు.

"అకటా! పదుగురిలోఁ బదు నొకఁడైతి విదేమి నాద యొనరఁగ..."

చంద్రాం. 3.135.

చూ. పదిలో పదునొకండు.

పదే పదే

మాటిమాటికీ.

మాటూ. 71.

పద్భ్యాముదరేణ

శిశ్నము; వైదికపరిభాష. 'పద్భ్యాముదరేణ శిశ్నా' అన్నమంత్రభాగంపై వచ్చిన పలుకుబడి.

"పద్భ్యాముదరేణ నీకు పాపాసానీ !"

తిరుపతి వెంకటకవుల చాటువు.

పనసపండువంటి బిడ్డ

దృఢంగా, అందంగా ఉన్న బిడ్డ.

"వచ్చే సంవత్సరానికి పనసపండువంటి బిడ్డను ఎత్తుకొని రా అమ్మా!" వా.

పనసపండ్లు దిగినట్లు

హఠాత్తుగా, ఉన్నట్లుండి, సమృద్ధిగా కనిపించు.

పనసచెట్టు పూత పూయకనే అనగా ముందు ఏసూచనా

లేకనే ఏరియ గాస్తుంది.

పండ్లు మరీ పెద్దవి కూడా కనుక, ఎక్కువగానూ కాయును గనుక, సమృద్ధి కిది ప్రత్యామ్నాయ మయింది. హఠాత్తుగా వచ్చు సమృద్ధి నిది తెల్పుతుంది.

"అతఁ డడుగకయు నొకఁడు సెప్ప కయుం మునుపుగఁ బనసపండ్లు దిగిన పరిగ." ఆము. 4.274.

## పని కగు

పనికి వచ్చు.

"పై, నడివాఁడే పని కగుఁ దన, గడివాఁ డరి యైన." ఆము. 4.266.

## పని కలుగు

పని పడు.

నోటివాడుకలో 'పని బడితే పిలవండి'. 'పని కలిగినప్పుడు ప్రతివాడూ పిలుస్తాడు.'

"పని కలిగ నేనియుును బిలువుము."
పండితా. ద్వితీ. మహి. పుట. 130.

## పనికి మాలినవాడు

వ్యర్థుడు.

"వాడు వట్టి పనికి మాలినవా డై పోయాడు." వా.

## పనికి మాలు

వ్యర్థ మగు, నిష్ప్రయోజన మగు.

"నా జన్మ మాపాటి లేక, పనికి మాలెను తల్లి పట్టున నిపుడు."
వర. రా. అయో. పు. 465. పంక్తి. 8.

"వాని పన్నీ పనికి మాలినమాటలు." వా.

## పనికి వచ్చు

అక్కఱకు వచ్చు.

"ఇచ్చట నీ మాయా, విలసనములు పనికి రావు విడువు మటన్నన్."
కా. మా. 3.171.

## పని గట్టుకొని

అదే పనిగా.

"పాండుసుతరక్షణైకతత్పరతకుఁ బని, గట్టికొని పుట్టె నని నమ్మకమ్ము నాకు."
పాండవాశ్వ. 58.

"వాడు పని గట్టుకొని వచ్చి నన్ను నాలుగుమాట లని పోయాడు." వా.

## పని గడుపుకొను

అవసరము తీర్చుకొను.
కాశీయా. 68.

## పని గలిగి

పనిమీాద.

"...బుుశ్యశృంగు ముద మారంగాఁ, బని గలిగి పిలువ వచ్చితిఁ, జనవునఁ బుత్తేర వలయుఁ జన నాపురికిన్."
భాస్క. బాల. 102.

"శాస్త్రి మీాతో పని గలిగే వచ్చాను." వా.

## పనిగొను

పని చేయు.

"నా జె మా రామాయణమును భారతము, కావించువాల్మీకికవివరవ్యాస, భావముల్ నాయందుఁ బనిగొనుఁ గాక."
వర. రా. బా. పు. 2. పంక్తి. 16.

పని చెఱుపు

నిష్ప్రయోజన మై, కాలహా రణకారి యగునట్టి.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

పనిచేటు మాటలు; పని చెఱుపు మాటలు.

"అన విని చిఱున వ్వొలయఁ, బని చెఱుపులకథలు చెప్పి పార్థివుఁ జేరం..." హంస. 4.6.

పని తీసివేతలోకి వచ్చు

పని ముగియు, తీసికట్టగు.

"వాడి పని తీసివేతలోకి వచ్చింది. ఇం కేం పరపతి ఉంటుంది?" వా.

పని తెమలు

పని తీరు.

"ఎంత చేసినా యీపని యింకా తెమల లేదు." వా.

పని పంచు

పని చేయించు.

"ఈరీతిఁ బని పంచి నడుపుకొనుచున్న వారు." ప్రభా. 2.47.

పనిపంద

సోమరిపోతు.

"సుకవాసి పనిపంద చూపుగుఱ్ఱంబు." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1494.

'తిండికి తిమ్మరాజు పనికి పోతురాజు' వంటిది.

పని పంపు

ఆజ్ఞాపించు.

"మిమ్ముఁ బని పంపెదుదాన నే?" భాస్క. అర. 2. 53

పని పట్టించు

శాస్తి చేయు.

"నీ కేమో మహా తలతిరుగుడుగా ఉంది. నీపని పట్టిస్తాను. ఉండు." వా.

....పని పట్టు

ఆట పట్టించు వంటిది.

"ప్రముఖుల మెంతమంది పని పట్టితి మక్కట!" గుంటూ. ఉత్త. 36.

పనిపాట చేయు

చాకిరీ చేయు.

"ఆడ విధాతకుం జమువులమ్మ సదా పనిపాట సేయ..." శా. మా. 2.72.

పనిపాట దీర్చు

ఇంటిపనులు నెఱవేర్చు.

"పనిపాటఁ దీర్చి సుఖమతి, పనివడ నేఁ డింటితోడుసు బాసెఁ గదా." హంస. 3.45.

పనిపాటలు

పనులు. జం.

"ఆటలాడుచు నుండు నబల యేపని పాట, లెఱుఁగదు..." వేంకటా. 5.153 పు.

"ఈ టెలా కోటలా మఱి పని, పాటలా మీ కింత యాట పాటా పోటా." కకుత్థ్స. 5.7.

"మనమున దయ పుట్టఁగ నీ, పనిపాటలు విన్నవించుఁ బ్రాణేశునకున్." రాజశే. 3.214.

రూ. పనిపాటు.

పనిపాటు

పని. జం.

పనీ పాటా లేదు వాడికి అని వాడుక. పాటు అని కూడా కొన్ని వేపుల వాడుక.

"పనిపాటు సేయ నోపక యొంటి విడిచి." బస. 3.73.

చూ. పనిపాటలు.

## పని పూని

అదేపనిగా, పనిమీద.

"పనిఁ బూని యంతంత వినయావనత వృత్తి, సప్తర్షి కాంతలు సంచరింప." పారి. 3.24.

కాశీ. 4.125.

"చేరి పనిపూని యిటకు వచ్చితి మదుక్తి, కొదవ పడకుండ నెట్లొనఁ గూడు నాకొ." శుక. 3.394.

"ననుఁ గూడితివి యిట్టె నావంటివారె కాక, పని పూని యితరులు భావింపఁ గలరా." తాళ్ల. సం. 3.120.

"వినియోగములవారు పని పూని వచ్చి యున్నారు." వర. రా. అయో. పు. 557. పంక్తి 18.

చూ. పని గట్టుకొని.

రూ. పని బూని.

## పనిమాలిన పాట

అనవసర మైనపని.

"ఆని కిన్కతోడ నిటువలెఁ, బని మాలినపాట నన్నుఁ బలికితి వటు గావున..." యయా. 3 ఆ.

## పనిముచ్చు

పనిదొంగ.

పని అంటే పాలుమాలి తప్పిం చుకు తిరుగువాడు. ఇలాం టివే బడిదొంగ, పనిదొంగ.

"ఇది యేమి సెట్టి యెఱుఁగఁడె, కద పెంచినచనువు బలిమికడఁ బనిము చ్చై, యెదురాడుచున్నవాఁ డని..." శుక. 2.209.

## పని లేదు

అవసరము లేదు.

"నీదు మనసు వచ్చినరీతిం, బని విని యెద మాటల కిఁకఁ, బని లేదు." కా. మా. 1.38.

"మీకు భీతిఁ బొందను బని లేదు." కా. మా. 1.134.

"నీ వింక ఈ ఊరికి రావలసినపని లేదు." వా.

## పని లేని

అనవసర మైన.

"కలఁక మామీఁది పని లేనికసరు దెలుప." ఆము. 5.60.

## పని లేనినవ్వులు

వెకిలి నవ్వులు.

"మోమునఁ బని లేనినవ్వుల సముజ్జ్వల చంద్రిక లామతింప నవ్వనరుహాలోచ నల్ నివము వచ్చినయందముఁ జూపి రందఱున్." శుక. 3.119.

## పని లేనిపని

నిష్ప్రయోజన మైనపని, ఊరక, అనవసర మైనపని.

"పని లేనిపని బట్టబయలు దిట్టెడు వారుఁ, బాడ నేరకయును బాడు వారు." కా. మా. 3.41.

"పని లేనిపని వీథిఁ జనుచుఁ గ్రమ్మరు నాత్మ, గృహ మంచు నెంచి యిల్లిల్లు దూఱు." శుక. 2.459.

"పని లేనిపని మిట్టిపడుమనోజపతాక, ప్రల్లదంబునఁ దన్ను వెల్లిఁ బోవ." వరాహ. 4.21.

"చింతింపఁ దగు నయ్యా చెల్లఁబో నేఁడు, పని లేనిపని నీకుఁ బగ యేటి కయ్యా. మైరా. పు. 19.

## పని లేనిపని జోలిగొను

అనవసరప్రసంగములకు చను; అనవసర మైనపనులకు దిగు.

"పని లేనిపనిజోలి గొని వాడవాడలఁ, జరియించు సారె కచ్చెరువుతోడ." హంస. 1.218.

## పనిలేని పరువులు

వ్యర్థగమనములు, అనవసర మైనవి.

"ఉడిపోని వేదన నున్నచో నుండక, పని లేనిపరువులు పాటి పాటి." కా. మా. 2.148.

## పనిలేని పాట

నిష్ప్రయోజన ప్రసంగము.

"పని లేనిపాట మా భరతుని మాట, కొనసాఁగ వచ్చి........." వర. రా. అయో. పు. 654. పంక్తి 12.

## పనిలేని మంగలి

అనవసరంగా పనికి రాని పని చేసేవానిపట్ల ఉపయోగించే పలుకుబడి.

'పనిలేని మంగలి పిల్లి తల గొఱిగినట్లు' అనుసామెతపై ఏర్పడినది.

## పనివడి

అదేపనిగా.

"కనికరముతోడ నిటువలెఁ, బనివడి నెమ్మోము సఱచి పఱచినఁ గానీ." విప్ర. 4.85.

## పని వినియెడను

ఎవ రైనా పోవునప్పుడు సెలవు తీసుకొంటూ అను మాట. నేఁడు వాడుకలో లేదు.

"నీదు మనసు వచ్చిన రీతిం, బని విని యెద మాటల కేఁకఁ, బని లేదు." కా. మా. 1.38.

## పని విను

సెలవు తీసికొను, ఇష్టాను వర్తి యగు.

"ఏను బని వినియెద న, న్నలఘుకృపఁ జూడుము." భార. అను. 1ఆ.

"...మునివర! మీ, రిచ్చోటికిఁ బడ లిక మై, విచ్చేయుట యేమి తెలుపవే పని వింటున్." రామా. 4ఆ.

## పనుగొను

పనవు, వదలు—ఒకటే రోకటి పాటలా చదువు.

"రోకటిపాటట్లు వేదములు, పనుగొన మా శివభక్తులయిండ్ల, సారమేయము లకు." బసవ. 7.183.

## పనులు గొను

సేవలు చేయించుకొను.

"కపటనటనాపరుం డైనకంసవైరిఁ, బరమముని నవ్వుటాలకుఁ బనులు గొనియె." పారి. 5.86.

## పన్నిదంబు వొడుచు

పందెం వేయు. కుమా. 11.193.

## పన్నిదము వొడుచు

పందెము వేయు.

"ఎత్తిన పూవులు ముడుచుచుఁ, బొత్తిచ్చినపన్నిదములు వోడుచుచు నత్యూ, ద్వృత్తగతి వీథిలో సుఖ, టోత్తములంగళ్ళ మెఱయుచుండుదు రెలమిన్." కుమా. 7.122.

## పన్నిదములు వోడుచు

ప్రతిజ్ఞలు సేయు, పందెం వేయు.

కుమా. 7.120.

## పన్నినదొంతులపై నొక్క-గుదియపెట్టు

ఎన్నో మంచిపనులు చెఱుచుటకు ఒక్క చెడ్డ పని చాలును అనుట

తాళ్ళ. సం. 10.77.

## పన్ని నిలుచు

సన్నద్ధమై నిలబడు.

"కాల్వురు పన్ని నిలిచిరి." కుమా 12.3.

## పన్ను కట్టు

పన్ను చెల్లించు.

"సాలుకు రెండుసార్లు ఈ యింటికి యాభైరూపాయలు పన్ను కట్టాలి." వా.

## పన్నుకొను

క్రమ్ముకొను.

"ఎన్నఁటికి జీవుఁ డిఁక నీడేరేది, పన్నుకొనేటిచింతలే బలిసీ గాని." తాళ్ల. సం. 6.188.

## పన్నులు విడుచు

గుఱ్ఱాలకు కట్టినజీను వగైరాలు విడుచు.

"వాహనంబులు డిగువారును బన్నులు విడుచువారును." కుమా. 11.30.

## పపంచు సేయు

ప్రకటించు.

"ఆ,వేళఁ బపంచు సేయ నొకవీసము గల్గదు హింస తప్పదున్." ప్రభా. 3.147.

## పప్పన్నము పెట్టు

పెండ్లివిందు చేయు.

"మాకోడలు పెద్ద దౌతూ ఉంది. పప్పన్నం ఎప్పుడు పెడతా వక్కయ్యా!" వా.

## పప్పు ఉడకదు

ఈఆట లేమీ సాగవు.

"అక్కడా యిక్కడా చేసినట్టు చేదా మని అనుకున్నా వేమో! ఆపప్పు లేమీ యిక్కడ ఉడకవు." వా.

రూ. పప్పు లుడకవు.

## పప్పు జారినట్లు జారు

జావయి పోవు, నీళ్లు గారి పోవు.

## పప్పులో కాలు వేయు

పొరబాటు చేయు.

"పరులకును బుద్ధులను జెప్ప వచ్చుఁ గాని, యాత్మ కైనప్డు పప్పులో నడుగు వేయు." శ్రవ. 5.58.

## పప్పులో నడుగు వేయు

తప్పు చేయగూడ దను కొంటూ తప్పు చేయు.

గుంటూ. ఉత్త. 109.

పయనము తూగించు

ప్రయాణానికి అన్ని యేర్పాట్లూ చేయు.

ఏ దైనా కార్యభారం విషయంలో ఈ తూగించు అనే మాట నేటికీ వినవస్తుంది.

'ఆ పని అంతా ఆ యిద్దరూ తూగించారు' 'నే నిందుకు తూగగలనా?' ఇత్యాదులు.

"పద్మనయనుఁ డతని పయనంబుఁ దూఁగింపు, మనుచు నంబితోడ నాన తిచ్చె." ఆము. 2.94.

పయికాపు

పయిరక్షణ.

"కాళ్లపైఁ, బ్రబ్బికొనం గుచోద్ధత భరంబునకుం బయికాపువోలెఁ ద,బ్బిబ్బునఁ జేతికిన్ దొరకు..." కళా. 8.146.

....పయికి వచ్చు

నింద వచ్చు.

"ప్రజలు మీ రొక్కటైన మా పయికి వచ్చు." నిరంకు. 2.129.

"ఇదిగో. నాతో కూడ ఉన్నప్పుడు ను వ్వేదైనా అన్నావంటే అది నా పైకి వస్తుంది." వా.

"వాడు ఏ పాపం ఎరగడు. వాడిపైకి వచ్చింది." వా.

ఈ పయికి 'మీాదకు' అని కూడా అవుతుంది.

పయిపెచ్చు లగు

అధిక మగు.

"సుఖలక్షణముల్ పయిపెచ్చు లయ్యె." విజయ. 1.173.

పయ్యర దూది యగు

గాలిలో దూదివలె అగు, అతివేగముగా పరుగెత్తు.

"కయ్య మన్న సం,భావన గన్న చందమునఁ బాఱుచుఁ బయ్యర దూది యై ప్రమో,దావహ మైన యీ పని." ఉ. హరి. 5.181.

పయ్యెదకొం గడ్డ మైన ప్రాణము పోవును

కొంత అంతరాయం ఏర్పడినా కొంపలు మునుగుతాయి అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"దయ్య మెఱుంగును వారల. నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్, దియ్యములును నెడసందిని, బయ్యెదకొం గడ్డ మైనఁ బ్రాణము వెడలున్." భాగ. 9.401.

పరక కెత్తుకొ మ్మన్న పాతికె కెత్తుకొను

కొంచెము సందిస్తే నెత్తికెక్క అన్న పలుకుబడి వంటిది.

పరక అనగా ఎనిమిదవవంతు. పాతిక నాలుగవవంతు. తక్కువ తీసికొను మనగా ఎక్కువ తీసికొనుట.

"మంచి తగిన గృహస్థుఁడ వెంచఁ బరక, కెత్తుకొ మ్మనఁ బాతికె కెత్తుకొంటి...." హంస. 3.158.

పరగడగా
పక్కకు తప్పుకొని.
"ప్రవహించక పరగడగా పోవలసిన దే మని." కాశీయా. 91.

పరగడుపు
అన్నము తినక ముందు.
మాటా. 71.
"పరగడుపున నే మందు తినాలి." వా.

పరపర గీకు
చెడా మడా వ్రాయు.

పరపర వ్రాయు
గబగబ వ్రాయు.
"పరపర నిటు వ్రాసినంతఁ బావనుఁ డై." గీర. 17.

పరమానందయ్య శిష్యులు
బుద్ధిహీనులు.
పరమానందయ్య శిష్యులు జానపదకథలలో ప్రసిద్ధులు.
కొత్త. 190.

పరశురామప్రీతి అగు
కాలిపోవు.
"ఆ ఊళ్లో నిన్న రాత్రి నాలుగువాములు పరశురామప్రీతి అయిపోయినవి." వా.

పరశురాము హస్తము
సర్వనాశకము.
"బ్రతుకు బాలెడు నింటఁ బరశురాము హస్తము......"
హంస. 5.109.

పరాకు మాని
అవధానముతో.
"మనవి పరాకు మాని విను మానిని పూనిక మై." హంస. 3.183.

పరాకు సేయు
తిరస్కరించు.
"కెంజిగురు,రాకఁ గని పరాకు సేయు నార పదంబుల్."
విజయ. 1.130.

పరాయివాడివలె
ఏమీ సంబంధం లేనట్లు.
"ఇంటి పెద్దకొడుకే పరాయివాడిలాగా బయట కూర్చుంటే నాకేనా యిదంతా పట్టింది?" వా.

పరికలు వెట్టు
ఉవ్విళ్లూరు.
ఇంకను ఆలోచించవలసిన పలుకుబడి.
"దొరకొని దైవముతో మాటలాడఁగ, పరికెలు వెట్టఁగఁ బాడౌనా."
తాళ్ల. సం. 4.93.

పరిగడచు
సమాన మగు.
"పరి గడవఁగఁ బాతి మరలి బోరలు దెట్టగిల." ప్రభా. 2.42.

పరిగొను
గుంపు గట్టు.
"కోటులసంఖ్య మహోగ్రకింకరుల్, పరిగొని పాపకర్ములను బట్టి."
రుక్మాం. 1.166.

పరిణమించు
మన్నించు; అనుగ్రహించు —(?)
"ధరి,త్రీనాయకుఁ బరిణమించి దేవియు నంత,ర్ధానమ్ము నొందె."
సింహా. 2.101.

**పరిణయ మగు**

పెండ్లి చేసుకొను, వివాహ మాడు.

"గిరీశుండు గిరిజం బరిణయం బయ్యె." కుమా. 9.31.

**పరిణామ మొందు**

చచ్చు.

"పదునేనుదినముల పరిణామ మొందు." పల. పుట. 50.

సామాన్యార్థం సరేసరి. ప్రచురంగా ఉన్నదే.

**పరిధాన మిచ్చు**

గౌరవించు; బహూకరించు; పోషించు ఇత్యాదిచ్ఛాయలలో.

"నన్నిటుల దూషింప,నిది యేల పరిధాన మిచ్చిరో వారు, బందుకట్టిరొ నిన్నుఁ బౌరుషాధికుని, యందుఁ జూపోపక యున్న్య లిట్లాడ, బోధించిరో." వర. రా. యు. పు. 149. పం. 7.

**పరిమారన్**

చావగా.

తర్వాత తర్వాత పరిమార్చు, చంపు అన్న క్రియగానే ఈ మాట అలవాటు.

"అష్టదిక్పాలురన్, బరిమారన్ వధియింతుమో." కుమా. 2.42.

**పరిమార్చు**

చంపు.

"తెరవాటు గొట్టి భూప్రజఁ, బరిమార్చెడు చోరవితతిఁ బతి దునిమెడిచో," రుక్మాం. 3.34.

**పరి విడుచు**

పాఱ విడుచు, పాఱువేట విడుచు.

"సంతసమై వేంకటేశ్వరుఁడు చెలి నేపు శశి, పంత ముడుగఁగఁ దమము పరి విడిచినట్లు." తాళ్ల. సం. 3.405.

**పరిసి పోవు**

పాడగు; పాసిపోవు.

"చేసినతపము, పాతకుల శపింపఁ బరిసి పోవుటను." వర. రా. అర. పు. 3. పం. 11.

**పరిహార మగు**

దోషము తొలగు.

"మీ పిల్లవాడు చెడ్డ నక్షత్రంలో పుట్టాడు. నవగ్రహశాంతి చేస్తే ఆ దోషం పరిహార మవుతుంది. వా.

**పరిహిణె**

తద్దినానికి మరుసటి రోజు.

**పరీక్షకు కట్టు**

పరీక్ష రుసుము చెల్లించు, పరీక్షకు చదువు.

"ఈసారి వాడు బి. ఏ. పరీక్షకు కట్టాడు." వా.

**పరుబోకి**

పోరంబోకి, పనికి మాలిన వాడు.

"పుట్టుమాలిన పరుబోఁకిని నన్ను దిట్టెవదే మోసి దిమ్మరి మాయ." తాళ్ల. సం. 11.3. భా. 41.

**పరుము సేయు**

చూర్ణము చేయు.

"పండినసస్యముల్ పరుము సేసి."
రుక్మాం. 3.10.

పరువిడు
పరువెత్తు.
"మహాభయంబుతోఁ బరువిడఁగా."
రుక్మాం. 3.89.

పరువు దోలు
పరువెత్తించు.
"బమ్మ లెక్కల తేజిఁ బరువు దోల."
నిరంకు. 3.36.

పరువులు వాఱు
(అత్యాశతో) ఉఱకలు వేయు.
"ఆగృహంబున నిచ్ఛావిహారమునకు, మనసు పరువులు వాఱ నేమాడ్కి నైన."
శుక. 2.173.

పరుస గూడి కొను
యాత్రాజనంలో చేరు, వరుస గట్టు.
"ఆట పెక్కు విధములఁ బరుస, గూడికొనుచు వాద్య ఘోషణం బెసఁగ."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 306.

పర్వతపదములు
అలనాడేనాడో పాడుకొనే పాటలలో ఒకరక మైనవి. శ్రీశైలం మహిమను వర్ణించే జానపద గీతములు కావచ్చును.
పండితా. ప్రథ. వాద. పుట. 513.

పర్విడు
పఱుగెత్తు.

"చెరలాడు జిఱకొట్టుఁ జెలఁగి పేరెంబు, దిరుగుఁ బర్విడు."
గౌ. హరి. ప్రథ. పం. 605.06.

పఱకపై పాతిక అన్నట్లు
అసలు ఎనిమిదోవంతు కాగా కొసరు నాలుగోవంతు అన్న వాచ్యార్థంపై, ఎక్కువగా అన్నట్లు ఉపయుక్త మవుతుంది.
"ఒక్క తేజోమయాస్త్రంబు నుర్వి విభుఁడు...బవర మయ్యెను బరకపైఁ బాతిక యన."
రామకథా. ఉత్త. పూ. భా. 4.675.

పఱచనిపాటు పఱచు
నానాకష్టాలు పెట్టు.
"పాటుపడు మని పఱచనిపాటు పఱచ."
సారం. 3.221.

పఱచుతెంపి
స్వేచ్ఛాచారిణి.
క్రీడా. పు. 69.

పఱతెంచు
వచ్చు.
"వదలక తీవ్రదాహమున వారికి నై పఱతెంచుచోట."
రుక్మాం. 2.24.

పఱతేరు
ఏతేరు, వచ్చు, ఏతెంచు, పఱతెంచు.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 548.

పఱిగల నేఱు
పరిగ యేరితే పాతర నిండుతుందా అని సామెత.

దానిలో చాలినంత ధాన్యం దొరకదు.

"పఱిగల నేఱినం గొలుచు పాఁతటికిం గలదే తలంపఁగన్."

ఉ. హరి. 4.49.

పఱిపఱి యగు

చిందరవందర యగు.

ధ్వన్యనుకరణము.

"పఱిపఱి యై యవియు మల్లెపడి చెడి పోయెన్." కా. మా. 3.152

పఱిపోవు

విరిసి పోవు.

"పఱిపోయెం దుహినంబు."

శివ. 4.29.

పఱుపులు గొను

చాపచుట్టుగా పడు.

"పడ నేసెం గపులతలలు పఱుపులు గొనఁగఁ." భాస్క. యుద్ధ. 1514.

పలక బాఱు

తెల్లవడు.

"అన్య్ల లెఱుఁగఁ గష్ట మని వెల్ల బాఱిన, పగిది యే తీగెలు పలకఁ బాఱె." శమా. 10.38.

పలపల

జలజల.

ధ్వన్యనుకరణము.

"పలపల కన్నీరు నించు."

సారం. 3.103.

పలపలగా

విరళముగా.

"పలపలగాఁ బొదువు ముదిరపటలము పగిదిన్." పాండు. 2.46.

పలపల నగు

1. తెల్లబోవు.

"పాఱులేక పలపల నై వెఱఁగుపడి వెల్ల వెల్ల నై." ఉ. హరి. 1.148.

2. తెల్లవారు.

"పలపల నయ్యెఁ దారకలు పక్షులు గూయఁ దొడంగె......"

హంస. 1.260.

పలపల వేగు

తెలతెల తెల్లవాఱు.

"వెన్నెల పడమటి దిక్కునకున్ బల, పల నై యొడ్డగిలఁగఁ బలపల వేగెన్."

జైమి. 1.136.

పలమెడు పలమెడు

పలము, పలముగా.

పిడికెడు పిడికెడు అన్నట్లు. పల మనగా మూడు తులములు. ఆ పదంనుం డైనా వచ్చి ఉండ వచ్చును.

"తనమేని కండలు గోసి, పాయక మున్ప్రాప్రిద్దఁ బలమెఁడు పలమెఁ, డాయతభక్తి సమర్పణ సేయు."

పండితా. ప్రథ. పురా. పుట. 398

పల మైన

కొంచె మైనా.

పల మనగా మూడు తులములు.

"కర్మమున హింస పల మైనఁ గాన రాదు." హర. 3.52.

పలాయనము చిత్తగించు

పాఱిపోవు.

"అంత పెద్ద స్వాములూ శిష్యురాలి

సంగతి ఊళ్లో పొక్కే సరికి పలాయనం చిత్తగించారు." వా.

రూ. పలాయనమంత్రము పఠించు.

**పలికించు**

అనిపించు—తిట్టించు.

'మీ రంతా వాడితో నన్నని పిస్తున్నారు కదూ' అని వాడుక. అదే అర్థంలో ఈ పలికించు

"పరమేశ్వరుం బలికించి విను శేమి పని యని కోపావేశంబునఁ బరాఙ్ముఖ యై నన నున్న కన్నెఱంగి." కుమా. 7.56.

**పలికి తప్పు**

ఆడి తప్పు.

"ఇక్ష్వాకువంశ మహీశు లెల్లఁ బలికి తప్పరు." భాస్క. అయో. 82

**పలికి బొంకనివాడు**

సత్యసంధుడు.

"పలికి బొంకనివాఁ డంచుఁ బలుకు దెపుడు." రాజగో. 3.11.

చూ. ఆడి తప్పనివాడు.

**పలికి బొంకు**

ఆడినమాట తప్పు.

"పలికి బొంకఁగ లేక ప్రాణముల్ విడుచు, నలఘుసత్యవ్రతుండు."

వర. రా. అయో. పు. 627. పంక్తి. 15.

**పలుక బాఱు**

1. తెల్లబాఱు.

"గ్రక్కునఁ దానును గాంతి వీని లో,పల నెలకొల్పె నాఁ బలుకఁ బాఱె నిశాంతనిశాంతదీపముల్." పారి. 2.60.

2. తళతళ లాడు.

"......తాటంకరత్నప్రభల్, పలుకం బాఱిన చెక్కుటద్దములపైఁ బై పై విలంఘింపఁగన్." కాశీ. 5. 168.

**పలు కియ్యమి**

పలుకమి, మౌనముగా నుండుట. వ్యతి. పలు కిచ్చు.

"ఈశ్వరుడు తనతోడఁ బలు కీమి." బస. 3.70.

**పలుకు చెల్లించు**

మాట విను, కోరిక తీర్చు

"నా పలుకు చెల్లించు."

వర. రా. అయో. పు. 643. పంక్తి. 25.

**పలుకు చేయు**

మాట విను, చెప్పినట్లు విను.

"వలదు మాపల్కు నీవు నీ పలుకు మేముఁ, జేసి బ్రదుకుట మే లంచుఁ జెప్పఁ బనిచి." ప్రభా. 1.76.

**పలుకుదోడు**

సహాయము.

"పనిపాట సేయఁ జే, దోడుగఁ జెంచెతల్ పలుకుదోడుగ."

కా. మా. 2.72

"మచ్చికతోఁ జేరి మాటలాడెద నైనఁ, బలుకుఁ దోడుగఁ జిల్కఁ బంప వమ్మ." రాజగో. 2.44.

"ఏదో చిన్నపిల్లవా డైతే నేం? పిల్చుక పో. ఏదో శాస్త్ర పలుకు తోడుగా ఉంటాడు." వా.

చూ. చేదోడు వాదోడు.

**పలుకు బంగార మగు**

మాటలాడుటే అపురూప మగు.

"చిలుకల కొలికిది నాతో, బలుకంగాఁ గొంత సిగ్గు వడియెడ ముంజే, చిలుకా!

సీతో నైనను, బలుకంగా రాదె పలుకు బంగా రఁటవే.'' విజ. 2.183

''బడిపంచం బడి యుండువాని పలుకే బంగార మాయెం దుదిన్.''
కలిమాయ. అం. 5.

పలుకు బంతము సెల్లు

మాట చెల్లు.

''లోకసంభావిత మైన నీ పలుకుఁ బంతము సెల్ల.'' సార. 4.11.

పలుకులు వేయు నేమిటికి ?

వేయిమాట లేల ?

ఇం కెందుకు? అన్న సందర్భంలో ఉపయోగించే పలుకుబడి

''పలుకులు వేయు నేమిటికి భాగ్యసమన్విత నేన మద్విభుం, డిలఁ గల ధన్యుఁ డంచు నెలుఁగెత్తి.''
మను. 6.75.

పలుకు వడు

ఇతరుల నోట పడు; దూషణకు పాత్ర మగు.

''పలుకు వడి నతనిఁ బాపంబులు విడుచు.'' భార. శాంతి. 5.553.

పలు కెత్తు లేకుండు

మాటాడ లేక ఉండు.

''బోఁ బుట్టిన బాష్పగద్గదికఁ బోకు మనం బలు కెత్త లేక.''
పారి. 4.73.

పలుకే బంగార మగు

మాటలు అపురూప మగు.

''ఏమమ్మా! పలుకే బంగారం అయిపోయింది.'' వా.

పలుగఱ సేయు

పంకప్రావనము చేయు.

పంక్లను కఱ్ఱతో తోముట పై వచ్చిన పలుకుబడి.

పలుగఱ - పంక్లపాళి అనుట సరి కాదు.

''పలుగఱ సేయక పసుపును నలిపించు, కొనక మొగంబు మజ్జనము లేక.''
ప్రభా. 5.

పలుగు గులాము

నీచుడు.

పలుచ చేయు

చులుకన చేయు.

ఇది వాడుకలో కూడ ఉన్నది.

పదిమందిలోనూ నువ్వు నన్ను పలుచన చేయ వచ్చునా ?

''శ్రీ విభవంబులం బలుచ సేయుముఖప్రభ లుల్లసిల్లఁగా.''
పాండు. 2.16.

''నా ప్రాణనాయకునిఁ బలుచ, జేసెద దేకపత్నీ వ్రతంబు.''
వర. రా. సుం. పు 96. పంక్తి 1.

''వాడు ఈమధ్య చిల్లరపనులు చేసి పదిమందిలోనూ పలచపడి పోయాడు.''
వా.

చూ. పలుచ పడు.

పలుచ నగు

నిస్సార మగు, తేలిక పడు.

''కళల విలాసము పలుచ నయ్యె.''
మొల్ల. బా. 43.

''నే నేల పలుచ నైతి.''
విజయ. 3.12.

పలు చేర్చు

దంతక్షతము చేయు.

"మోవిపైఁ జే యటు పాఱ్ఱదొబ్బి పలు చేర్చ నోకించుక..." కళా. 5.19.

పలుపోకల తపసి

కపటముని, వేషాలమారి.

"ఏవిధంబున నింక నీ సేల గడచి, పోవ నీఁ డీ పలుపోకలతపసి." గౌ. హరి. ప్రథ. పంక్తి. 1231-32.

పలువడలు

పలుగాకితనములు, అఱచు టలు- నోటిక్రొవ్వన.

"పలువ లౌచిలుకల పలువడ లుడిగితు." శుమా. 8.6.

పల్కమి

పలు కీయమి.

బస. 3.70.

పల్కుసన్న గావించు

పలుకకుండగనే ఏమిటి అన్నట్లు సంజ్ఞ చేయు.

"గౌతముఁ డత్రికిఁ గనుగీటె నతఁడు, శాతాత్మకునిఁ బల్కుసన్న గావించె." గౌ. హరి. ప్రథ. పంక్తి. 126.

పల్లటీలు గొను

గంతులు వేయు.

వినోదించు అని భావార్థము

"మణుల డాలు నఖరుచితోఁ బల్లటీలు గొనఁగ." విప్ర. 3.85.

పల్లటీలు దాటు

కట్టను ఊని దాని సాయంతో ఇటునుండి అటు దాటు.

"తెగ నిండఁ దిగిచి నల్దెసలకు బొట్టె, కోలలు చూపి పల్లటీల్ దాఁటువారు." కళా. 8.42.

పల్లవిపాటగా

బాగా వచ్చిన దానివలె ననుట.

పాటల కన్నిటికీ పల్లవి అని ఒకటి ఉంటుంది. అది ప్రతి చరణాంతంలోనూ పునరుక్త మవుతూ ఉంటుంది. కాబట్టే చరణాలు మరిచిపోయినా పల్లవిమాత్రం బాగా వస్తుంది.

"ధర్మార్థ కామశాస్త్ర ప్రపంచంబులు, పల్లవిపాటగాఁ బరిచయించె." విక్ర. 1.190.

పల్లియ పడుసర అనక

పల్లె, పట్నం అనకుండా.

ఎల్లచోటులా అనుట.

"గుడి గుండ మనక పల్లియ, పడుసర నా కరయుఁ జెఱచి పఱచిన శిష్యుఁ." పంచ. వేం. 1.25.

పల్లు గుట్టెడిపూరియు

పళ్ళు గుచ్చుకునేందుకు అవసర మైనపుడకతోపాటు...

బస. 3.65.

పల్లెటూరి గబ్బిలాయి

అనాగరకు డనుట.

"వాడు ఒట్టి పల్లెటూరి గబ్బిలాయి. ఈపట్టంలో బయటికి పోతే తిరిగి వచ్చేదాకా నమ్మకం లేదు." వా.

## పల్లెత్తుమాట అనదు (అనడు)

ఒక్క మాటైనా అనదు.

“అత్తగారు అన్నిమాట లంటున్నా ఆ యిల్లాలు పల్లెత్తుమాట అన లేదు.” వా.

చూ. మాడెత్తుమాట.

## పల్లె పట్ర

జం.

నగా నట్రా వంటిది.

“పల్లెపట్రలనుండి బరువు వేసుక వచ్చి, వలసలచే కంట్లముల ఘటించి.”

హంస. 5.40.

“ఎలదేఁటి రాచగుంపుల చుట్టముల కెల్లఁ, బలుకుఁ దేనియ పల్లెపట్ర లొసఁగు.” కువల. 3.96.

“ముదమునఁ బల్లెపట్రలకు మూఁటకు ముల్లె నటంచు...”

హంస. 4.82.

## పల్లేరు తుడిచి పా(బె?)డెక్కు

బాగుపడు.

చేనూ దొడ్డీ చక్కజేసు కొన్నప్పుడు అక్కడ మొలచి ఉన్న పల్లేరులూ వగైరాలను తీసి పాఱవేయడం పరిపాటి. దానిమీద వచ్చినపలుకుబడి కావచ్చు నేమో!

“అస్మదీయు, లీశ! పల్లేరు దుడిచి పా డెక్కినారు.” కాశీ. 6.155.

## పల్లేర్లు తుడిచి పా డెక్కు

నివాస మేర్పరుచుకొను.

అక్కడ ఉన్న పల్లేరుకాయలు మొదలగువానిని తొలగించి చదును చేసి గుడిసె వేసికొనుటపై యేర్పడిన పలుకుబడి.

“పద్మాపద్మాత్ములు పల్లేర్లు దుడిచి పా డెక్క, భక్తి బోధించి భూతలంబుఁ బావనంబు సేయం గలవాఁడు.” ఆము. 6.66.

## పల్లొత్తులు

దంతక్షతములు.

“జేని పల్లొత్తులు బట్టబైట నిడ నోపుచు వాతెఱ నీనె గట్టుగా.”

శుక. 1.514.

## పల్వార్పఁ బ్రాము

పండ్లు తోముకొను, దంత ధావన మొనర్చు.

“మెఱుఁ గెక్కఁ బల్వార్పఁ బ్రామి.”

పండితా. ప్రథ. పురా. పు. 298.

## పవలుపంజులు

పగటిదివిటీలు.

“చెలువా! యొనగూర్తు వహింప నీసురా, బలలు శిరోనతిం బవలుపంజులు చెంద్రికపావడఁ గర్రహిణ్.”

చంద్రికా. 2.52.

## పశువరించు

పరిమార్చు.

పశువులను వోలె పారద్రోలు కావచ్చును.

“నిశితఖడ్గాయుధాన్వితహస్తుఁ డగుచుఁ, బశువరింపుచు గొర్లపాలు సేయుచును.” బస. 6.155.

## పశ్యతోహరుడు

దొంగ.

“వనజేక్షుఁడా మనోధనపశ్యతోహరుండు.” ఆము. 1.27.

"వనజశ్రీధనపశ్యతో హారుఁడు జీవం జీవజీవంబు." హరి. 4.47.

పసందు చేయు

మెచ్చుకొను.

కొత్త. 18.

పస దప్పు

పస చెడు.

"పస దప్పి నీ వోడి పాతిన నేల, కసువు మొల్వదు నేఁడు కాన నీతోడ." ద్విప. జగ.205.

పసని పండు

కలమాగిన పండు.

పచ్చగా పండిన దని కొన్ని పండ్ల విషయంలో వాడుక. అని తర్వాత అన్నిటికీ అను వృత్త మయింది. వృద్ధు అను భావార్థంలో ఇట ఉపయుక్తం.

"పసని పండుండఁగఁ గసుఁగాయ ద్రెంచు,టసమాక్ష! నీదు మహత్త్వమే యనక."

పండితా. ప్రథ. పురా. పుట. 470.

పసపుకొమ్మైనా యివ్వని

అతిలోభి అయిన.

పసుపుకొమ్ము కూడా దానం చేయనివాడు – అది చాలా చౌకవస్తు వనుటపై ఏర్పడి నది.

"ఇసుమంత పసపుకొమ్మొసఁగఁ జాలనివైశ్యుఁ, డెనసి యంగడి జాతి డఁగఁ గలఁడె." రాజశే. 3.24.

పస బయటపడు

చూ. బండారము బయట పడు.

పసరము గొట్టినట్టు కొట్టు

చావ గొట్టు.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది. 'వాణ్ణి పసరం గొట్టి నట్టు కొట్టాడు.'

పశువును బాగా కొట్టుదు రనుటపై ఏర్పడినది.

"తనచేతి నాగబెత్తముఁ, గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై." మను. 4.850.

పసి గట్టు

సూచనగా తెలుసుకొను.

"వా డేదో మోసగా డని పసిగట్టి వీళ్లు జాగ్రత్తపడ్డారు." వా.

పసిగొను

వాసన చూచు.

"ఘ్రాణంబు, కెవ్వియుఁ బసిగొన నేవ మయ్యె." కవిక. 1.36.

పసిడిపలుకులు

సుభాషితములు.

పసిడిపాదములు తాల్చు

దేవునికి మ్రొక్కుబడిగా పసిడి (బంగారు) తో పాదాలు చేసి దేవునికి అర్పించు.

బంగారు తేళ్ళు, చేతులు, కాళ్ళు వగైరాలు ఈనాటికీ తిరుపతికొండపై మొక్కుబడి

ఉన్నప్పుడు కప్పెరలో వేస్తారు. తిరుమలలో ఇది నేటికీ బాగా వాడుకలో ఉన్నది.

"తాలుతుఁ బసిఁడి పాదములు మీ పేర, బాలు గుప్పవ తల్లి బ్రదికింపు."
పండితా. ప్రథ. పురా. పుట. 471.

పసిడిమూట

చాల విలు వయినది.

"భార్యకుఁ బతిదయ పసిఁడిమూట."
రుక్మాం. 4.87.

పసిడిబ్రాత చెఱగు

జరీ అంచు చీర.

"పసిఁడిబ్రాఁతచెఱంగు మిసిమిఁ గల్గిన దట్టిఁ, దరుణి యొక్క తమర్చె హరువు గాఁగ."
ఉషా. 3.114.

పసి పట్టు

చూ. పసి గట్టు.
రూ. పసివట్టు.

పసివట్టు

వాసన పట్టు.

వాసనను పట్టి గతిని గ్రహించు అన్నదానిపై వచ్చినది. భావార్థం ఆ జాడ యెఱుగు.

"పుట్టల కడలఁ బొదల గిరుల, సతియల బసి వట్టి తిరుగుచోట."
మను. 4.51.

"నీదుగాలికిఁ బసివట్టి నిల్ప నీల్గి."
కా. మా. 3.75.

"వాడు నా దగ్గఱ డబ్బున్నట్లు పసి పట్టి వచ్చాడు." వా.
రూ. పసిపట్టు.

పసి పడు

కామాతుర యగు.

(ఆకలి గొను)

"గొల్లపడుచా! పసిపడి తిరిగేవు బడి వాయక."
తాళ్ల. సం. 12.197.

పసుపాడు

స్నాన మాడు.

పసుపు పూసుకొని స్నానము చేయుట ద్వారా వచ్చిన పలుకుబడి.
పాండు. 2.190.

పసుపార్చు

పసుపు నీళ్ళలో కలిపి పూయు.

స్నానం – అందులో అభ్యంగనంలో నలుగుపెట్టడం, పసుపార్చడం ఉంటుంది.
బస. 3.58.

పసుపిడు

పసుపు రాసుకొను.

"ఒరసి యొత్తినమణుం గొందక మైసెని, గ్గులు దేరఁ బసుపిడి జలక మాడ."
ఆము. 1.60.

పసుపు కుంకుమ కని

చూ. పసుపు కుంకుమకు గాను.

పసుపు కుంకుమకు గాను

కూతురుకు పెళ్లిసమయంలో గాని తర్వాత గాని ఆమె కని భూమో పుట్రో ఇచ్చు.

"పసుపు కుంకుమ కని అయిదెకరాల

భూమి యిస్తే అదీ అల్లుడే పాడు చేశాడు.'' వా.

**పసుపున కొసగు**

ఆడబిడ్డకు పసుపుకుంకుమల కని కొంత భరణ మని ఇచ్చుట ఆచారము. అనగా వారి ఉపయోగార్థమై.

నేటికీ ఈ అలవాటు ఉన్నది.

''మందరద్రోణిఁ గొన్ని గ్రామములఁ గూర్చి, తనయ పసుపున కొసఁగె గంధర్వవిభుఁడు.'' మను. 5.102.

**పసుపు నిండుకొను**

వితంతు వగు.

''పాపం! ఆ పిల్ల పసుపు నిండుకొంది. ఇంకా ఇరవై అన్నా దాట లేదు.'' వా.

రూ. పసుపు కుంకుమ నిండుకొను.

**పసుల కాపించు**

పశువులను కాయునట్లు చేయు.

నీచ మైన నౌకరీ చేయించు. కుమా. 4.25.

**పస్తుండు**

ఉపవాస ముండు.

''ఎన్నేండ్ల నుండియో పస్తున్నాఁడీ యడవిలోన నొంటి మహేశుం, డిన్నె గులు మాన్ప వలదా!'' కా. మా. 3.85.

**పళ్ళు రాల్తాయి**

ఒక తిట్టు.

''ఇలాగే వాగా వంటే పళ్లు రాల్తాయి. జాగ్రత్త.'' వా.

**పళ్ళూడ గొడతాను**

ఒక తిట్టు.

''నువ్వు యీ మాట మళ్లా యింకొక సారి అన్నా వంటే చూడు. పళ్లూడ గొడతాను.'' వా.

**పళ్లెం కొట్టు**

చేటకొట్టు వంటిది.

**పళ్లెరము పెట్టు**

భోజనానికి సిద్ధపరుచు.

భోజనానికి ఎవ రైనా వచ్చి నపుడు వడ్డించితిమి భోజ నానికి లేవండి అని కాని, విస్తళ్లు వేసినారు లేవండి అని కాని అన్నట్లే పళ్లెరము పెట్టి తిమి అని కూడా అంటారు.

''సతీమణులు సిద్ధులు పళ్లెరంబు వెట్టితి మని విన్నవించిన.'' పారి. 2.17.

**పాండవబీడు**

బీటినేల.

**పాకము దప్పు**

చెడిపోవు.

''మతిఁ దలపోసి యూపలుక మానుఁడు పాకము దప్పెఁ గార్యముల్......'' భార. భీష్మ. 1.13.

**పాగి చిక్కు**

వల్ల చిక్కు.

''ఇటువేపునుంచీ నాకు దీన్ని ఎత్తా లంటే పాగి చిక్కడం లేదు. అటు వెడతాను.'' వా.

**పాచిక పాఱు**

ఎత్తులు ఫలించు.

"వాడిపాచిక పాఱింది. ఆమె వీణ్ణి యిల్లటం ఉంచుకొని పిల్లను ఇస్తానంది." వా.

**పాచిక వేయు**

పాచికలను వేయు.

గవ్వలో — చిన్న కడ్డీలో ఒకటి, రెండు ఇలా నాల్గు వేపులా చుక్కలు పొడిచి నవో-పాచికలుగా ఉపయోగిస్తారు.

వాడుకలో 'వాడు దానికి పాచిక వేశాడు' అనగా ఎక్కు పెట్టినాడు. ఇదీ పాచికలాడుటనుండి వచ్చినదే.

పండి. ప్రథ. పురా. పుట. 368.

**పాచిపని**

పొద్దుననే కస వూడ్చుట, నీళ్లు చల్లుట మొదలయిన పనులు.

కుమారీ శత. 39.

**పాటిబండల గోల**

అర్థం పర్థం లేని అల్లరి.

"తిరుపతికన్నఁ గొప్పర మెక్కుడనెడి యీ, పాటిబండలగోల దాటు టెట్లు ?" గుంటూ. ఉత్త. 73.

**పాటున పడు**

చక్కబడు.

"ఈమధ్య పని కాస్త పాటున బడింది. ఇక గబగబా సాగిపోవచ్చు." వా.

**పాటుపడు**

కష్టపడు.

"ఈ పాటు నీచేత నేఁ బడు టయ్యో, నేపాటు పడుదురో నిటమీఁద వారు."

వర. రా. అయో. పు. 498. పం. 22.

"సిద్ధించునె యాదైవనియుక్తియు మాభోం,క్లే విధమునఁ బాట్లఁ బడిన నిద్ధవివేకా !"

కళా. 1.181.

వాడుకలో— 'తనకొడుకును చదివించడానికి అతను చాలా పాటుపడ్డాడు.' 'ఎన్ని పాట్లు పడ్డా వాడికి కడుపు నిండడమే గగన మై పోయింది.'

**పాట్లమారి**

చెడునడత గలది అనుట.

"పిలిచె నిది పాట్లమారి గావలె నటంచు." హంస. 5.69.

**పాడరు**

పాడగు.

"నీదు సోదరులు......రణభూమిలోన పాడరి హతులైనపట్టున."

వర. రా. అర. పు. 119. పం. 3.

**పాడి దొఱంగు**

న్యాయము వీడు.

"పన్నిదం బిడఁ బ్రేలక మున్న బాడి పాడి దొఱంగి తెచ్చితి."

పారి. 4.16.

**పాడి దొఱగు**

న్యాయమార్గము తప్పు.

"అనుమతి నిచ్చిరో యావేల్పు లొం దేని, బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి." పారి. 1.36.

పాడినదే పాడు

చెప్పినదే తిరిగి చెప్పు.

"పాడినదే పాడరా పాచిపండ్ల దాసరీ!" వా.

"ఆ! వాని ఉపన్యాసంలో కొత్త యేముంది? పాడినదే పాడడం." వా.

పాడినపదమె పాడు

చెప్పినదే చెప్పు.

"ఎలనాగరో! నీవ సెంత చెప్పినను, బలుమాఱు పాడినపదమె పాడెదవు." సారం. ద్వి. 1.618.

పాడిపంటలు

పశుసంపద. ధాన్యసంపద. జం.

"మాన్యక్షేత్రముల్ పెక్కు చం,దాలన్ బండు నొకప్పుడుం దఱుగదింటం బాడియున్ బంటయున్." మను. 1.55.

పాడిపంతములు

న్యాయాన్యాయములు. జం.

"పాడిపంతంబు లెఱిఁగినపెద్దవు." క్రీడా. పు. 82.

పాడుకండ్లు

దిష్టికండ్లు.

"ఆవిడవి పాడుకండ్లు. పాలు పిండగా చూచిందో లేదో ఆవు ఎగ చేపింది." వా.

పాడుకాపులు

వ్యర్థనిరీక్షణలు.

"వలవనిశంకల నక్కడ నేఁ బాడుకాపు లాగతి నుంటిన్." కళా. 3.272.

పాడు గాను

ఒక తిట్టు.

'వాడి పాడు గాను - దాని పాడు గాను' అని వాడుక.

"పాడరే శివభక్తి పాడుగాను." కాళ. 4.35.

పాడు చిక్కు

పాడగు.

పాడుమొగము

కళావిహీనము.

దరిద్రసూచకము.

బొట్టు లేని మొఖాన్ని 'పాడు మొగ' మంటారు. ప్రాచీనుల దృష్టిలో అది అశుభసూచకము.

గువ్వలచెన్న. 64.

పాడువాఱు

పాడగు.

"పాడువాఱెను బురి భాగ్యంబు దొలఁగ." బస. 7.192.

పాడుసంత

'వెధవగోల' అను పట్టుల ఉపయోగించే పలుకుబడి.

సంతలో సహజంగా జన సమ్మర్దమూ, గోల ఉండడం పై వచ్చిన పలుకుబడి.

"పెద్దమనుష్యులు వచ్చి మాట్లాడుతూ ఉంటే ఏమిట్రా ఆపాడుసంత." వా.

పాడుసంతన

వెధవగోల, బాదరబందీ.

"ఏదో చదువుకొంటూ ఉంటే ఏమిట్రా ఆ పాడుసంతన." వా.
"ఎక్కడెక్కడివాళ్లూ వచ్చి యిక్కడ పడ్డారు. పాడుసంతన." వా.

## పాడూరిలో బ్రదుకు

పనికి మాలినది.

తాళ్ల. సం. 11.3. భా. 38.

## పాడూరి సంత

పల్లెటూరి సంత.

గందరగోళంగా, గజిబిజిగా, కోలాహలంగా ఉన్నది.

ఇక్కడ లక్షణయా గయ్యాళి గంప అన్నమాట.

"బేరజపు గట్టిజంత పాడూరి సంత."

శుక. 3.18.

## పా డెక్కు

నివాస మేర్పరుచుకొను.

ఈ 'పాడు' అంతముగా గల గ్రామ నామాలు మనకు చాలా ఉన్నవి.

"ఆశ్రితులు కాశికాపురి కస్మదీయు, లీశ! పల్లేర్లు దుడిచి పా డెక్కినారు."

కాశీ. 6.155.

## పాతపాట పాడు

చెప్పినదే చెప్పు.

"వాడు తిరిగీ పాతపాటే పాడుతున్నాడు." వా.

చూ. పాడినదే పాడు.

## పాతర బడు

మూలబడు.

"పంతంబుతోఁ బగ పాతరం బడియె."

వర. రా. కిష్కి. పు. 359. పంక్తి. 1.

ధాన్యాదులను దాచుటకై కట్టిన నేలమాళిగను పాతర అంటారు.

## పాతర లాడించు

ఆట పట్టించు – ఆటాడించు

"మర్చిచార సంభోగకళా, చాతురి రాత్రిందివములుఁ, బాతర లాడించి."

నిరంకు. 2.117.

## పాతర లాడు

అటూ యిటూ గంతులు వేయు.

"ప్రీతిం గోపకు లందఱు, గీతంబులు పాడఁ దరులక్రిందను నగుచున్, జేతులు ద్రిప్పుచు వెడవెడ, పాతర లాడెను యశోదపాపం డవనిన్."

భాగ. దశ.

## పాతర వేయు

పూడ్చి పెట్టు, దాచు.

"పాపనిధులు ఓలె లోపలనె పాతర వేయుట కొంత మే లగున్."

పండిత. 51.

## పాతాళగంగ

1. చాలా లోతులో ఉన్న నీరు.

"ఆ పాతాళగంగ తీసుకు వచ్చేసరికి నా ప్రాణం పోతూ ఉంది. ఇంక వేజే పని ఏం చేస్తాను రాత్రి?" వా.

2. ఒకతీర్థం.

## పాతాళప్రశ్న

అంతు తేలని ప్రశ్న.

"...మన కీ, పాతాళప్రశ్న యేమి పని యవనీశా!"

షట్చ. పు. 6.57.

పాతాళభేది

బావిలోనో చెరువులోనో ఏదయినా పడి పోయినప్పుడు దానిని తీయుటకు ఇనుము కొక్కీలు చాలా అమర్చిన ఒక పని ముట్టును ఉపయోగిస్తారు. దాని పేరే పాతాళ భేది.

"బింద పడిపోయింది. వాళ్ల యింటికి వెళ్లి పాతాళభేది తీసుకు రా!" వా.

పాతాళమునకు క్రుంగి పోవు

చాలా దిగులు పడు.

"ఉద్యోగం తీసివేస్తా రనగానే వాడు పాతాళానికి కుంగి పోయాడు." వా.

పాతాళము బట్టు

దాగుకొను, పాఱిపోవు.

"తీలగు కంతువెంబడిని తెమ్మెరలుఁ రవిదీప్తి కల్కి పాఁతాళముఁ బట్టు చుండఁ దమతావులు..."

ఆము. 2.63.

పాతికో పరకో

ఏ కొంచెమో.

పాతిక అంటే నాలుగవవంతు.

పరక అంటే ఎనిమిదోవంతు.

కుక్క. 31.

పాతి వేస్తాను

ఒక తిట్టు.

కొత్త. 65.

పాతేస్తాను

ఒక తిట్టు.

"వాడితో వీడితో మాట్లాడినట్టు మాట్లాడా వంటే పాతేస్తాను." వా.

పాదచర్య

పరిచర్య, సేవ.

పాదసేవ వంటిది.

హర. 2.55.

పాదమజ్జన మాచరించు

కాళ్ళు కడుగు.

పండితా. ప్రథ. పురా. పుట. 312.

పాదము పట్టు

కాళ్లు పట్టుకొను.

ప్రార్థించుట, ప్రాధేయ పడుట సూచించును.

"యా యంగన యతని పాద మల్లన పట్టెన్." కళా. 4.120.

పాదరేణువు తలపై నుంచుకొను

భక్తిశ్రద్ధలు కనబఱచు.

పెద్దలు భక్తులు కనిపించినప్పుడు వారి పాదధూళి తీసుకొనుట ఆచారం. ఇది బెంగాలులో ఈనాటికీ సర్వే సర్వత్రా పాటింపబడుతున్నది.

"పాదాబ్జములు సిక్కఁ బట్టి మ్రొక్కుచునుఁ, బాదరేణువుఁ దలపై నుంచుకొనుచు."

పండితా. ద్వితీ. మహి. పుట. 33.

పాదుకొను

నెలకొను.

ఏదైనా మొలక నాటునపుడు

పాదు తీసి నాటుతారు.

తద్ద్వారా వచ్చిన పలుకుబడి.
"ఎల్ల, బ్రహ్మాండకరంబులు పాదు కొనంగ." పాండు. 2.152.

## పాదుకొల్పు

లగ్నము చేయు. నాటు.
"పరమాద్భుతం బాత్మఁ బాదుకొల్పి." నైష. 5.9.
"పాదుకొల్పితి గోత్రపర్వతముల." శివ. 1.75.
చూ. పాదుకొను.

## పాదులు దీర్చు

వలలు మొదలగునవి ఒడ్డు.
"ఒకమరి దీమంబు లొడ్డి పాదులు దీర్చి." కా. మా. 3.47.

## పాదొట్రు

సాలెపురుగు అల్లినగూడు, బూసి.
"చెలఁది ము న్నల్లిన నూలు, గరి యంత నేతెంచి కాంచి కోపించి. పాయక శివుమీఁదఁ బాదొట్రు వెట్టి, పోయెడు నిది యేమి పురువొకో యనుచు." బస. 3 71.

## పానకంలో పుడక

అడ్డుకట్ట, విఘ్నకారి
"పానకంలో పుడక లాగా మాట మాటకూ అడ్డు వస్తా వేమిట్రా?" వా.

## పానకపూజ

వడపప్పు, పానకం దేవునికి నివేదించి పంచి పెట్టుతారు. దానికి పానకపూజ అని పేరు.
"వాళ్ళింట్లో శ్రీరామనవమినాడు పానక పూజ చేస్తారు." వా.

## పానకములోని పుడక

కుంచిదానిలో మధ్య వచ్చు అడ్డంకి.
"ఏ వేమిట్రా పానకంలో పుడకలాగా. పాట వింటూంటే పలకరిస్తావు?" వా.
చూ. పానకంలో పుడక.

## పానకములోని మిరియపుకారము వలె

చుఱుక్కు మనిపించినా చమత్కృతిని కూడా కల్పించును అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.
పానకంలో మిరియాలపొడి కాస్త వేయడం అలవాటు. తీయనిదానిలో ఆ కారం చవు టూరించునే కాని రుచిని చెడగొట్టదు.
"ఆ భయాను సంభ్రమముఁ జేయు నతని పాన,కంబు లోపలి మిరియంపుఁ కారమట్లు." దశావ. బల. 329.

## పాన లిన్నియు నేల?

ఇన్ని మాట లేల
"పాన లిన్నియు నేల."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 131.

## పాని పట్టి చూపు

ప్రత్యక్షముగా చూపు.
"నానాదేవతలకు నరసింహగంభ ములో, పాని పట్టి చూపినట్టి ప్రహ్లాదుఁడు." తాళ్ల. సం. 11.135.

పాపం పండు

చేసిన చెడ్డపనులకు ఫలితము దాపురించు.

"వాడి పాపం పండింది. అధికారులకు వీడి వ్యవహారం అంతా తెలిసిపోయింది. రేపో మాపో ఉద్వాసన జరుగుతుంది."
వా.

పాపటపై నడిదము పెట్టు

చంపుదు నని తలపై కత్తిని మోపు– తల రెండు ప్రక్కలుగా చేయుదు నని.

"బడుగులు మీరు చూడ హరి పాపటపై నడిదంబు వెట్టుగున్."
ఉ. హరి. 4.209

పా పద మను

పద పద మను.

"పా పద మని యిత్తురే సెలవు."
గుంటూ. పూ. పు. 41.

పాపపు దైవము

పాడు దేవుడు.

ఏ దైనా భరించరాని కష్టం కలిగినప్పుడు విసుగుతో అనే మాట. వాడుకలో— 'ఆ పాడు దేవుడు నన్నిట్లా పుట్టించాడు'
కాశీ. 5.164

పాపమునకు గా

ఆ యింత మంచిపని చేసి నందుకు అన్న భావార్థాన్ని సూచిస్తూ వేసటతో అను మాట.

"ఇమ్ము డెప్పర మైనన్, లావు గలం డంచుఁ బలికిన, పాపము చేఁ గాదె కోలుపడితిఁ గుమారున్."
ఉ. హరి. 2.33.

"నేను వాణ్ణి యింట్లో పెట్టుకొన్న పాపానికి వాడి కిపుడు నేను శత్రువయ్యాను."
వా.

పాపమున కొడి గట్టికొను

పాపకార్యము చేయుటకు పూనుకొను.

'ఎంత పాపాని కొడిగట్టితి వయ్యా' అని నేటికీ వాడుక.
పండితా. ద్వితీ. మహి. పుట. 49.

పాపము బ్రద్ద లగు

పాపము పండు.

చూ. పాపం పండు.

పాపము ముట్టికొను

పాపము చుట్టుకొను.

"న న్నాపాపము వచ్చి ముట్టికొని యెన్." భాస్క. అర. 2.110.

పాముకాటు సీర దుడిచినం బోవునె

దాచినా దాగనిదానికి దాచుటకై ప్రయత్న మెందుకు? పాము కాటు వేయగా గుడ్డతో మూసి పెట్టితే లాభం యే ముందీ? ఎలాగూ పైకి తెస్తుంది.

"రావలదే పంచిన పని, సేవకులకుఁ బాముకాటు సీరఁ దుడిచినం, బోవునె." ఉ. హరి. 4.150.

**పాముకా టెంత తుడిచినను పోదు**

పాముకాటు ప్రాణం తీస్తుంది కానీ తుడిస్తే పోతుందా? మనస్సులో నాటిన మాటకు ఉపమానంగా ఉపయోగిస్తారు.

"మది నాఁటె నిఁక వేయుమాట లేమిటికిఁ, దుడఁ బాముకా టెంత తుడిచినఁ బోదు." సారం. ద్వి. 1.994.

**పాముకాళ్లు పామే యెఱుగు**

పాముకాళ్లు పాముకే తెలుసు అని నేటిరూపం.

పాముకు కాళ్లుండవు. అయినా అది నడుస్తుంది. ఆ కాళ్ల సంగతి దానికే తెలిసి ఉండాలి అనుటపై వచ్చిన పలుకుబడి.

మోసగాళ్ల జిత్తులు మోసగాళ్లకే తెలియును ఇత్యాది సందర్భాలలో ఉపయుక్తమవుతుంది.

"......మీ రెఱుంగుదురు గాక మీ రాక్షసమాయలు, పామె ఱుంగుఁ బాముకాళ్లితరుల కెఱుంగ వచ్చునే" భాస్క. సుంద. 340.

**పాముకూన**

పామువలె నపకారి.

"బట్టువాకట్టు బవనీల పాముకూన" శుక. 3.20.

**పాముచెలిమి**

అపాయకరము.

తాళ్ల. సం. 5.122.

**పాముచెవులు**

ఎంత మెల్లగా మాటలాడినా వినగలశక్తి ఉన్న దనుట.

కాస్త సవ్వడి అయినా పాము గ్రహించి అటు మొహం తిప్పుటపై వచ్చిన పలుకుబడి.

"వాడివి పాముచెవులు. మీ రెంత మెల్లగా మాట్లాడినా, వా డెంత దూరంలో ఉన్నా యీ పాటికి గ్రహించే ఉంటాడు." వా.

**పాముజాడ పామునకు గాని పరులకు తెలియ బడదు**

దొంగను పట్టుటకు దొంగయే కావలెను లాంటి పలుకుబడి.

"పాముజాడ పామునకుం గాని పరులకుం దెలియఁబడని తెఱంగున సంగనలకుం గాని యిత్తెఱంగుఁ గనుంగొన మీకుఁ గొలఁది గాదు."

శుక. 3.236.

**పాముతో చెరలాట లాడినట్లు**

సానందో. 3.44.

చూ. నిప్పుతో చెరలాటము.

**పామునకు బదనిక చూపినట్లు**

వశీకరణౌషధిని చూపి పామును వశము చేసుకొనునట్లు.

మంత్రతంత్రశాస్త్రాలలో బదనిక వశీకరణౌషధిగా ప్రసిద్ధము. ఒక చెట్టుపై మరొక చెట్టు మొక్క పెరగగా దానిని బదనిక అంటారు.

"చిలుకకు బదనిక చూపిన, చెలువున నాపలుకు వాఁడు సేకొన కలుకం."

ఉ. రా. 2.248.

**పామునకు ఱెక్కలు వచ్చినట్లు**

అతి చలాకీగా పని చేయు.

"గాండీవం బనుపామునకు ఱెక్కలు వచ్చిన ట్లున్నయది."

భార. భీష్మ. 1.128.

**పామునోట ద్రేలిడు**

తానై అపాయము తెచ్చుకొను.

"ముచ్చు లిట్లు నా, యొంటి దలంప శేషఫణికోరల ద్రేలిడి."

ప్రభా. 5.189.

**పామునోరి కడి**

ప్రమాదము తప్పనిది, పులి నోటి కండలాంటిది.

"పామునోరికడి మీ ప్రాణపుటూరుపు గాలి." తాళ్ల. సం. 102.

**పాముపగ**

తగనికసి.

పాము పగ పడితే కఱిచే దాకా వదల దని ప్రతీతి.

"వా డేదో నవ్వుతుంటే మరిచిపోయా డనుకోకు. వాడిది పాముపగ. ఎప్పుడో కాటు వేస్తాడు." వా.

**పాములకు పాలు పోసినపగిది**

చెడ్డవారికి చేసిన సహాయముపట్ల ఉపయోగించే పలుకుబడి.

"పాములకుఁ బాలు పోసినపగిది వీటి, నెంత పెంచినఁ గనికర మింత లేక."

ఉ. పా. 2.47.

**పాములమెంగడు**

పాములవాడు.

"వచ్చెఁ బాములమెంగఁడు వదరులాఁడు." క్రీడా. పు. 71.

**పాయ దొలగు**

దారి తొలగు.

"ఆయెడ సిద్ధకింపురుషయక్షవసుప్రముఖామరావళిం, బాయఁ దొలంగు మంచు." పారి. 3.10.

**పాయబట్టు**

దారి చేయు.

"పరఁగఁ బుష్కరమార్గంబుఁ బాయఁ బట్టి." శివ. 1.97.

**పాయ యిచ్చు**

దారి యిచ్చు.

"బాలపవెల్లి యైనజలపూరంబు పాయ యిచ్చుచుఁ దెరువు విడువఁ..."

కళా. 4.95.

**పాయసముపై నెయ్యొలికినట్లు**

నష్టము కలిగిన దనుకొనగా లాభ మైన దనుటలో ఉపయుక్తం. నెయ్యి ఒలికి

పోయింది కాని అని వాడుకను పైన గమనిక మరింత రుచి.

పండి. ప్రథమ. పురా. పుట. 387.

మా. రొట్టె విఱిగి నేతిలో పడినట్లు.

## పాయుత్రోవ

తొలగుదావ వంటిది.

పాయ జేయునది.

"ని విపులప్రతాపంబు, భానుతేజము నకుఁ బాయుత్రోవ." భాస్క. యుద్ధ. 1396.

## పార జాచు

బాగుగా చాచు.

"పడిగపుం బాదాలు నాపైఁ బారఁ జాచేవు." తాళ్ల. సం. 3.4.

## పారణ సేయు

భుజించు

ఉపవాసము ముగిసిన మరునాడు చేయు భోజనము పారణ. దానిమీద ఏర్పడిన పలుకుబడి.

"భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విజ్జనంబు నై, సర్గికలీల." పారి. 3.27.

## పారము ముట్టు

కడతేరు, పూర్తియగు.

ప్రవాహంలో తీరము చేరుట పై వచ్చిన పలుకుబడి. ఉత్తీర్ణుడు కూడా ఇలాంటిదే. అపారము దీనిమీద వచ్చినదే.

"ఒక్కొక్కటే, నైనం బారము ముట్ట నింకెటులు." కా. మా. 2.77.

"దిక్చారిత్ర చారు ప్రచారంబు పారంబు, నుట్టు స్తుతింపంగ నేరంచు సెంచంగ వించు..." కళా. 1.186.

## పారుపా మైన బెగడి నిలుచు

నష్టి

ఎంతో భయంకరు డనుట.

"పారుపా మైన బెగడి నిలుచు." నారం. 2.203.

## పాఱ చిమ్ము

కత్తితో కెత్తితో చక్కి వేయు.

"ఇంతి నంతనుకా, జేరుచు నందివా పులను జమ్మి కబార్లటు పాఱఁ దట్టుచున్." కళా. 8.101.

## పాఱ నడుచు

తఱిమి వేయు.

"నను సెకాంబునఁ జేసి పాఱ నడిచెన్." భాస్క. కిష్కిం. 139.

## పాఱాడు

1. శిశువు దోగాడుటకు ముందు ఒకచేతి సాయంతో ముందుకు జరుగు.

2. తిరుగు.

"పాయక యశోదవెంటఁ బాఱాడు శిశువా." తాళ్ల. సం. 4.1.

## పాఱుతెంచు

నాటి నచ్చు. పరువున వచ్చు. కవా. 10.77.

"పద్మాక్షుండంత, నన్నాశి పాఱు తెంచిన, జన్నపుహాసులన్." జైమి. 6.124.

"ఆ సురారి....వేగము పాఱుదెంచి."
కమా. 12.57.

త్వరగా వచ్చు. పఱతెంచు. వచ్చు, పాఱుతెంచు, పరువెత్తి వచ్చు. వాడుకలో— పారి రండ్రా పోదాం.

"బారెండు నెత్తినఁ బాఱుతెం డనుచు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 289.

**పాటెడు నీళ్లకు గట్టు వేయు**

నడుస్తూన్న దానికి అడ్డు కల్పించు.

పాప మనుట.

"మీర లీ, పాపపుమాట లాడుదురె పాటెడునీళ్లకుఁ గట్టు వేతురే."
రుక్మాం. 4.24.

**పాటెడు బండ్లకు గాళ్లు సాపు**

వ్యర్థమైన ప్రయత్నము చేయు.

బండి పోతున్నప్పుడు కాళ్లు చాపితే కాళ్లు విరుగునే కాని బండి ఆగునా?

"నీ,పలుకన్నతంబు గాఁదగునె పాటెడు బండ్లకుఁ గాళ్లు సాఁపఁగా, నలవడు నన్న!"
ఉ. హరి. 2.31.

**పాల గట్టిన కన్ను**

పొర గప్పిన కన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 103.

**పాలతో తల యంటి బాస సేయు**

ప్రమాణము చేయు. పాలతో తల యంటి బాస చేయుట వంటిది. ప్రమాణాదులలో ఇటువంటివి పెక్కులు.

"పాలతోఁ దల యంటి బాస సేసినను, స్త్రీల నమ్మఁగ రాదు చిత్తంబులోన."
సారం. ద్వి. 1.343.

**పాలపండ్లనాడు**

పసితనము.

శిశువునకు మొదటగా వచ్చిన పండ్లను పాలపండ్లంటారు. అవి కొన్నాళ్లకు ఊడిపోయి యేడెనిమిదేండ్లకే రెండవ సారి పండ్లు వస్తాయి. దానిపై వచ్చిన పలుకుబడి.

"పాటించెనే వేల్పు, ప్రహ్లాదుఁ డడు పాలపండ్లనాఁడు." పాండు. 2.137.

**పాలపాప**

పసిపాప, పాలు తాగేపాప, పసిబిడ్డ.

"పాలపాప పోటు బంటుగా సేనానిఁ, జేసి." కమా. 10.167.

"బాల మిక్కిలి గోల యీ పాలపాప, చెక్కు మీటిన వస వల్చు నెలవు లందు." తపతీ. 5.26.

**పాలబుగ్గలు**

లేతబుగ్గలు, పసితనము.

"పాలబుగ్గల మించు నీల గనుట."
విజయ. 2.40.

"వాడివి ఇంకా పాలబుగ్గలు." వా.

**పాలబుద్ధులు**

పిల్ల చేష్టలు.

సింహా. నార. 35.

**పాలలో పండ్లు పిసుకు**

ఆపద తెచ్చుకొను.

పాలలో ఏ నిమ్మపండునో పిసికి రసం కలిపితే అవి విరిగి పాడయి పోతుంది.

"క్రీడు లేదన దేవకీదేవి బలఁగ మొ, ప్పినఁ బాలలోఁ బండ్లు పిసికి రమ్మ." ఉ. హరి. 5.280.

**పాలలో పడిన బల్లి విధంబున**

"బడుగయి పాలలోఁ బడిన బల్లి విధంబు." భార. ఉద్యో. 3.135.
చూ. కుడితిలో పడ్డ బల్లి.

**పాలవంటి**

నిర్మల మైన.

"అల యల్పసుఖమునకై పాలవంటి, కులము మాలగఁ జేసికొని మను చుంటి."
గౌర. హరి. ద్వి. 1 భా. 1281.

"కాఁపుకోడలు కంచంత కాఁపురంబుఁ, బాలవంటి కులంబు గాడ్పులిచి యుతికె." పాండు. 3.81.

**పాలవంటి కులము**

నిష్కళంక మైనవంశము.

"పాలవంటి కులంబు గాడ్పులిచి చనియె." పాండు. 3.80.

"అల యల్పసుఖమునకై పాలవంటి, కులము మాలగఁ జేసికొని మను చుంటి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1281-82.
చూ. పాలవంటి.

**పాలాది గంటలు**

"కటితటి నటియించు గంటల మొలనూలు, పాలాదిగంటల చాలు గాఁగ." రాధి. 1.111.

**పాలార్చు**

పోషించు.

"ఇతవై పని సేసేటి యింటిపసరమ్మునకు, హిత దీఁటఁ బాలార్చి వెన్న వెట్టవలదా?" తాళ్ల. సం. 5.237.

**....పాలింటివారు**

అధీనులు.

"పాలింపు మమ్మ నీ పాలింటివారె." వర. రా. బా. పు. 103. పంక్తి. 19.

**పాలి కిచ్చినరాసి**

కౌలు కిచ్చిన పొలములోని పంట.

తప్పక వచ్చునది అనుట.

"పండిన కర్మఫలము పాలి కిచ్చిన రాసి." తాళ్ల. సం. 8.281.

**పాలిచ్చే ఆవుకే పచ్చిగడ్డి**

లాభం ఉన్నప్పుడే గౌరవించుట కనిపించు ననుట.

బాలనీతి. 93.

**పాలు గలవాడు**

దాయాది.

"పాలు గలవాఁడు మన కొక, జాలి యిడక తానె తారసానకు వచ్చెన్." ఆము. 3.32.

**పాలు గలవారు**

నేలపై నూక ఉన్నవారు ఆయుష్షున్నవా రనుట ఇక్కడ ప్రాలు అయితే పైదే. కాకున్నా పాలు (చనుబాలు) అయినా భావార్థం ఒకటే.

## పింగళాజపము

దొంగజపము.

"కదిసి చూడ ఘోటకబ్రహ్మచర్యంబు, పింగళాజపంబు పిల్లిశీల, మజగరోపవాసములబకధ్యానంబు, నక్కవినయ మిట్టి నయము లెల్ల."
వైజ. 2.19.

## పింజపింజ గఱచుకొని....

పుంఖానుపుంఖముగా.

"పింజ పింజ, గఱచుకొని పాఱుతూపులొక్కటియ వోలెఁ, గానిపించుచుఁ దలపించె గడలపోరు." కళా. 8.130.

## పింజపింజ గాడు

ముక్కలు ముక్కలు చేయు.

"చక్కెర, యేఖాణంబుగఁ గలిగిన, కంఖాణపు దొర పింజపింజ గాడఁగ జేసెన్." విజయ. 1.127.

## ....పిండాకూడు

ఒక తిట్టు.
కొత్త. 15.

## పిండికొలది రొట్టె

ఉన్నదానిలో సరిపెట్టుకొనవలయు ననుపట్లు ఉపయోగించే పలుకుబడి.

"ఏదో ఉన్నదానిలో సరిపెట్టుకోవాలిగానీ హెచ్చులకు పోతే ఏం లాభం? ఎం తుంటే అంతే అవుతుంది. పిండి కొద్దీ రొట్టె." వా.

## పిండిగొట్టు

పిండి చేయు, పిండి యగునట్లు దంచు.

"కీచకతండులంబులం బిండిగొట్టి కొట్రఁ బోసి యుప్పుట."
కా. మా. 3.36.

## పిండి చల్లినట్లు

పిండి యారబోసినట్లు.

బియ్యము నానబోసి, బాగా కడిగి, రోటిలో దంచి చాపపై ఆరబోసిన పిండి అతి ధవళముతో వెన్నెలను పోల్చుట మన అలవాటు.

"కోటికిం బడగ లెత్తి పిండి చల్లినగతిం గాయ డాయ లజ్జించి బుజ్జవంబునం బొదరిండ్లకుం దార్చి."
మను. 3.28.

చూ. పిండి యారబోసినట్లు.

## పిండి చల్లినట్లు పండువెన్నెల గాయు

తెల్లగా.

"పిండి చల్లినట్లు పండువెన్నెలలు గా, యంగ దొడఁగెఁ జెలువ మమరనంత."
కళా. 8.16.

## పిండిపిండిగ దంచు

పొడుము చేయు, నుఱుము మాడు.
విజయ. 3.163.

చూ. పిండారబోసినట్లు.

## పిండిపిచుగా

పిండిపిండిగా.

"కొన్నిటఁ బార్శ్వముల్ నలియఁగొన్నిటి వీపులు పిండిపిచుగా."
భార. భీష్మ.

## పిండిపిచు సేయు

ఛిన్నాభిన్నము చేయు.

"బిరుదుమగల మొత్తముఁ బిండి పీఁచు, నేయు జలితంపు నేర్పు లచ్చెరువుఁ జెనుప." భార. శల్య. 1.122.

పిండి పెట్టు

మెత్తగా నలుపు.

"ఒండొకఁడ వైన నిపుడ నీ పిండి యిడమె." మను. 4.128.

'వాడి బుగ్గలు పిండి పెట్టాడు' అని వ్యవహారం.

పిండిబొమ్మ

తెల్లనిది—అంద మైనది.

"వాళ్లమ్మాయి పిండిబొమ్మలా ఉంటుంది." వా.

పిండియారతులు

బియ్యపు పిండి తడిపి చిన చిన్న ప్రమిదెల వలె చేసి. అందులో నెయ్యి వేసి వత్తి వేసి వెలిగిస్తారు. అది పళ్లెంలో పెట్టి ఆరతు లిస్తారు.

"పిండి యారతు లెట్టు."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 166.

పిండి యిడు

పిండము పెట్టు. చంపు.

"ఒండొకఁడ వైన నిపుడ నీ పిండి యిడమె, బ్రాహ్మణుఁడ బాట మా చేత బ్రదుకఁ గంటి." మను. 4.90.

పిండివంటకము

పిండివంటలు.

రకరకా లయిన పలహారములు.

నైష. 6.121.

పిండిలిపండు లగు (పిండలి పండు)

పిండిపోవు. శుష్కించు.

"తురగఖురోద్ధూతధూళి దళ మెఱసిన, వననిధి పిండలిపండు గాఁగ." భార. విరా. 3.157.

"వారిరాసులు పిండిలిపండు లయ్యె." విక్ర. 4.50.

పిండాకూడునెపి

స్వేచ్ఛగా, యేమీ పట్టించుకొనక తిరిగేవాడు. జులాసా పురుషుడు

పిండు కట్టు

గుమి కూడు, చేరు.

"పృథుజటామండలంబునఁ బిండు కట్టి." హర. 7.80.

పిందెలో పండిన పండు

వయసుకు తగిన మాటలూ, చేతలూ లేక పెద్దమాటలకూ. పెద్ద చేతలకూ పోవు పిల్లలను గూర్చి అనుమాట.

"వా డెక్కడ? పిందెలో పండిన పండు. పన్నెండేండ్లకే వాడికి కళాశాస్త్రం కావలని వచ్చింది." వా.

పింపిళ్లు కూయు

నాట్యమాడు.

"బిగి చన్నుతులు గుత్తపుంబయిఁబలోఁ బింపిళ్లు గూయంగ......"
కళా. 6.7.

బాలక్రీడావిశేషములో ఒక విధమైన ధ్వని చేయుచు బాలిక లాడుదు రని శ. ర.

"పిన్నబిడ్డ వెయ్యేడులఁ బెంపిళ్లు గూసిరి." హరి. పూ. 7 ఆ.

"మాటికి నెత్తమ్మి మఱువునఁ బెంపిళ్లు, గూయు జెగ్గురు రాచకొమ్మగములు." య.

**పికాపిక లగు**

చెల్లాచెదరు లగు.

హర. 3.10.

**పిక్క చెదరక**

వెనుదిరుగక, భయపడక.

పిక్కబలము చూపక అని అర్థము.

పిక్క గమనసూచకము.

"...ఈ మధ్యంబుఁ జొచ్చి యాస్ఫోటించి పిక్క చెదరక దిక్కులు పరిభ్రమించి..." పాండు. 3.89.

చూ. పిక్కబలము.

**పిక్కటిల్లు**

ఎక్కు వగు.

"ఉక్కుపొడి రాల రోషంబు పిక్కటిల్ల." విజయ. 3.151.

**పిక్కబలము చూపు**

పాఱిపోవు.

"పోలీసువాడి ఎర్రటోపీ కనిపించేసరికి ఆరాడీగుంపు పిక్కబలం చూపింది." వా.

**పిచ్చకుంచం**

కూలితవ్వ.

సామాలు కొలత కాక తక్కువగా ఉంటుంది కూలీలకు రైతులు పూర్వం ఇలాంటి తక్కువ కుంచాలతో ధాన్యం కొలిచేవారు. దానిపై వచ్చిన పలుకుబడి.

**పిచ్చపాటి**

1. కొలతబత్తెము.

చాలీ చాలనట్లుగా కొలిచి ఆపూటకు ఆపూటకు ఇచ్చు.

"ఇన్నినాళ్ల కివి యున్నని కూటికిఁ బిచ్చపాటి కొ,మ్మన్న మహాప్రసాదమని—" పాండు. 4.147.

ఈ 'పిచ్చ' స్వల్పము, తక్కువ, దొంగది అనే అర్థాలలో కొలతవిషయంలోనే ఉపయోగిస్తారు.

'పిచ్చముంత, పిచ్చతవ్వ.'

చూ. కొలతబత్తెము.

2. లోకాభిరామాయణం.

"అని వారివారికిఁ దోఁచిన గతిగాఁ 'బిచ్చపాటి' చెప్పికొనుచు..." గుంటూ. ఉత్త. 32.

**పిచ్చశేరు**

దొంగశేరు.

కాశీయా. 317.

**పిచ్చికగూళ్లు**

పిల్లలు తడి యిసుకలో కాళ్లు పెట్టి చిన్నచిన్నవిగా తయారు చేసుకొనే గూళ్లు. అందుపై చిన్నచిన్న ఆశలు, ఆలోచనలకు సంకేత మయినది.

"నా పిచ్చికగూళ్లు నన్ను కట్టుకోనీ." వా.

**పిచ్చిపిచ్చి చేష్టలు**

వెఱ్ఱి పనులు.

“ఈ పిచ్చిపిచ్చి చేష్ట లన్నీ నా దగ్గర పనికి రావు.” వా.

చూ. పిచ్చిపిచ్చి వేషాలు.

**పిచ్చిపిచ్చి వేషాలు**

వెఱ్ఱి వేషాలు.

చూ. పిచ్చిపిచ్చి చేష్టలు

**పిచ్చి పుల్లయ్య**

వెఱ్ఱి వెంగళప్ప.

“మొగు డేమో పిచ్చి పుల్లయ్య. కాబట్టే దీని ఆటలు సాగుతున్నాయి.” వా.

**పిచ్చితల్లి**

అమాయకురాలు.

జగ. 29.

**పిచ్చుకగుంటుమీద భాగీరథి వచ్చినట్లు**

అంతటి యోగ్యత లేనివానిపై ఎంతటి భాగ్యమో పడునట్లు.

“మీరలు ప్రసన్నత మన్నిలయంబు కన్గొనఁ, వారక నేఁడు వచ్చుట యకారణఁ బిచ్చుకగుంటుమీఁద భాగీరథి వచ్చినట్లు.” రుక్మాం. 1.158.

**పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం**

చిన్న పనికి ఇంత పెద్ద ప్రయత్న మెందుకు?

ముఖ్యంగా చిన్నవానిపై పెద్ద కోపం తగ దనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

పిచుక చిన్నది. దానిపైకి బ్రహ్మాస్త్రం తొడగాలా? చిన్నరాయి చాలదా?

చూ. పిట్ట కలిగి పాశుపతము దొడుగు.

**పిటకరాయిలా పట్టుకొను**

గట్టిగా పట్టుకొను.

**పిట్ట కలిగి పాశుపతము దొడుగు**

పిట్టను చంపడానికి పాశుపతాస్త్రం తొడుగు టెందుకు? అల్పునిపై అంత కోప మెందుకు? అనుపట్టుల ఉపయోగించేపలుకుబడి.

పిట్ట చిన్నది. రాయి చాలు. దాని కింత పెద్ద అస్త్ర మెందుకు?

కుమా. 2.60.

చూ. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం.

**పిట్టతలలు పడు**

సన్నగిల్లు.

“అందఱ యదృష్ట మిట్లు పిట్టతలలు పడినది.” సాక్షి. పు. 429.

**పిట్టపించము లగు**

పటాపంచ లగు.

“బెబ్బులితండంబు పిట్ట పించము లయ్యె, సలుగుల పాలయ్యె నెలుగు లెల్ల.” తపతీ. 4.39.

**పిట్టపిడుగు**

హఠాత్ సంఘటన.

“పిడుగు మొత్తినగతిఁ గూలు పిట్ట పిడుగు.” కవిస. 1.

"పిడుగు వైచి చంపుఁ బిట్టపిడుగు."
చంద్ర.

## పిట్టమెతుకులు

అల్పాహారి అను విషయంలో ఉపయోగిస్తారు.

"వాడేం తింటాడు? పిట్టమెతుకులు."
వా.

## పిట్టలరాయడు

ఆడపిల్లలకోసం తిరిగేవాడు, వ్యభిచారి.

ఆడపిల్లలను పిట్ట అనడం ఇటీవల వాడుకలో వినబడుతుంది. 'వాడొక కొత్త పిట్టను కొట్టుకొచ్చాడు' ఇత్యాది.

## పిడత తన్ని వేయు

చచ్చిపోవు.

## పిడతముఖం

తెలివి తేటలు లేనివాడు, మందమతి.

"ఆ పిడతముఖం వాడికి అంత మంచి పిల్లెందుకో?"
వా.

## పిడికిట నడగు

సన్నమైన.

"అరుదుగఁ బిడికిట నడఁగెడు నడుముల్, హస్తిసమానపుయానములన్."
కళా. 1.124.

## పిడికెడుగుండెలు

అధైర్యస్థుడు.

"వాడివి పిడికెడుగుండెలు. ఆడవాళ్లను చూస్తే భయం. మగవాళ్లను చూస్తే సిగ్గు."
వా.

## పిడికెడు రూకలు

కొంతడబ్బు.

చేతికి వచ్చినన్ని రూకలు.

"కోకోమ్మా యని పిడికెఁడు, రూకలొడిం జల్లి యాతురం డై మతియున్."
శుక. 2.25.

ఉదారపరులు సంచిలో చేయి పెట్టి చేతికి వచ్చినన్ని రూకలిచ్చేవారు. అదృష్టంకొద్దీ అది కాస్త ఎక్కువో తక్కువో ఉండేది. ఎంచి యిచ్చుట తక్కువగా పరిగణింపబడుతూ ఉండేది.

## పిడివాదము

మొండివాదము.

"వాడు ఒట్టి పిడివాదం మనిషి. మనం చెప్పేది అసలు వినిపించుకోడు." వా.

## పిడుగు చిట్లినభంగిన్

పిడుగు పడినట్లు.

"తిరం, బై సాత్యకియును దానిం, జేసే తన వ్రేసెఁ బిడుగు చిట్లినభంగిన్."
ఉ. హరి. 3.83.

## పిడుగు పాటిన డొంక

బాగా పాడయి పోయినది.

డొంకలో పిడుగు పడినప్పుడు అంతా కాలిపోవును.

"నాబలసూర్తి చేతఁ, బిడుగు పాటిన డొంక యై వెం పడంగు."
కళా. 5.69.

## పిడుగు పాటినడొంక యగు

పాడగు.

"...యీవు చనిన, చోటు లన్నియు
నా బలసూక్తిచేతఁ, బిడుగు పాఱిన
డొంక యై పెంపడంగు."

కళా. 6.68.

మా. పిడుగు పాఱిన డొంక.

పిడుగు వ్రేసిన తలటొప్పి యాగునే ?

టోపీ తలకు రక్షణయె కానీ అది మరీ చిన్నవానికి మాత్రమే. పిడుగే పడినప్పుడు టోపీ ఆగుతుందా ? చిన్నవాటికై యేర్పడిన ఉపాయము పెద్ద ఆపదను ఆదుకో గలదా ?

"వెఱ్ఱివార! పిడుగు వ్రేసినఁ దల
టొప్పి, యాగునే వివేక మైన వలదె."

ఉ. హరి. 4.166.

పితుశ్శతగుణం

తండ్రికంటే కొడుకు నూరు రెట్లు హెచ్చు అనుట.

శ్రీని. పీ. 100.

పిత్తోపరి యగు

పైత్యోద్రేకము కలుగు.

కాశీయా. 106.

పిదపిద

ధ్వన్యనుకరణము.

"అంత జలచల పిదపిద మనుచు నది
దా."

శకుం. 2.144.

పిదప బుద్ధులు

నీచబుద్ధులు.

మాటా. 31.

పిదపిద సగు

బురద బురద యగు.

"పెను బల్లంబుల పిదపిద నై చిక్కని
పదనుగాని మున్న వెన్నెల రొంపిం
బడి."

రాధా. 4.103.

పిదపిద యగు

చెదరి పోవు.

"చెదరక పదరక పిదపిద గాక."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 178.

పిన్నచేతి దివ్వె

దుర్వినియోగ మగుటకు వీ లున్న పనుట.

వేమన. 59.

పిన్నటినవ్వు

మందహాసము.

"పిన్నటినవ్వు నవ్వుడుచు."

కుమా. 8.101.

పిన్నతనము కూల

'కూల'తో ఏర్పడిన పదాలు చాలా ఉన్నవి.

నీ పాపం కూల, నీ వాసు గూల అన్నవి రాయలసీమలో బాగా వ్యవహారంలో ఉన్న పలుకుబళ్లు. ఈ 'కూల' కు నశించు గాక అనే అర్థం అయినా 'నీ యిల్లు బంగారం కానూ' అన్నదానిలో వలె విభిన్నార్థద్యోతక మవుతుంది. 'అయ్యో! నా చిన్నతనము పాడు గాను' అన్నధోరణిలో ఏర్పడిన పలుకుబడి.

"పెండ్లివారలఁ జూడ నా పిన్నతనము, గూల నింతటిలో వట్టి కోప మెత్తి, తలుపు బిగియించె మగఁడు."
శుక. 2.131.

**పిన్ననవ్వు**
చిఱునవ్వు.
"కని సెమ్మోమునఁ బిన్ననవ్వు దొలఁకం గంసారి నిశ్శంక." పారి. 5.36.

**పిన్నపామునకైన పెద్దదెబ్బ—(అవసరము)**
అల్పశత్రువు నైనా గట్టి దెబ్బ తీయవలయు ననుపట్ల ఉపయోగిస్తారు.
సింహా. నార. 6.
చూ. చిన్నపాము నైనా పెద్దకఱ్ఱతో కొట్టవలెను.

**పిన్నపెద్ద**
నాయకుఁడు, సభాపతి
"...కడు నాగరిక. స్ఫురణఁ దమ వంశంబున, కరయంగాఁ బిన్నపెద యై యతఁ డుండున్. హంస. 5.207.
ఇది నేటికీ రాయలసీమలో వాడుకలో ఉన్నది. 'వాడు ఆ ఊరికి పిన్నపెద్ద. రామన్న కాలువ పిన్నపెద్ద' మొదలయినవి.

**పిన్నపెద్దలు**
పెద్దవారు
"పిన్నపెద్దల మర్యాద పేరు గొనక." శ్రవ. 1.10.

**పిన్నాటలు**
చూ. పిల్లాటలు.

**పిప్పి చవి యడుగు**
దొరకని తావున వ్యర్థముగా వెదకు.
వ్యర్థ మగుట.
"పెక్కుదైవాల గొలిచి కప్పిన శ్రీవేంకటేశు కరుణ సాధించుట." తాళ్ల. సం. 6.50.

**పిప్పళ్లబస్తా**
లావాటిమనిషి.
"ఆ పిప్పళ్లబస్తాగా డేం చేస్తాడు ఈ పని?" వా.

**పిప్పిరి చేయు**
పిప్పి చేయు.
"విరోధిసేనలం, బిప్పిరి చేసెదన్ సెలవుఁ బెట్టుము నీవు గడెంగుమాజికన్." జైమి. 6.157.

**పిపీలికామార్గములు**
అశాశ్వతములు, క్షణికములు.
చీమలు ఒకదారి కడతాయి. కానీ వెనువెంటనే ఏ చిన్న అడ్డు వచ్చినా చెదరి మరొక దారి కట్టుకుంటాయి.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.
చూ. బయలిదీపములు.

**పిమ్మటి గొను**
భీతి గొను.
"ప్రాణముల్ గలఁగఁ బిమ్మటి గొని." వర. రా. అయో. పు. 531. పం. 18.

**పిమ్మటి నొందు**
కుంచించుకొని పోవు.

“కన్నునుఁ బిమ్మిటి నొంద.”
పాండు. 2.190.

## పిరిచుట్టు చుట్టుకొను

ఒక చుట్టు చుట్టుకొను.

“తనసొమ్ము లెల్ల నొక మఱుఁగున నిడి పిరిచుట్టు చుట్టుకొనినవలువతోఁ.”
కళా. 4.98.

## పిరితీయు

వెనుదీయు.

“చౌదంతి కొమ్ము...పెఱికి దానవె కొట్టి పిరితీసి కోసి.”
వర. రా. యు. పు. 253. పం. 18.

## పిరుపీకు చేయు

వెనుదీయు.

“...న ల్లెంతయును బెదరించు మఁ బిరుపీకు సేయఁ.....” కళా. 3.177.

## పిర్వీకుల బెట్టు

బాధించు, భయపెట్టు.

“అసహ్యదర్శనములం బిర్వీకులం బెట్టుదు,ర్జాతుఁ బీతదయున్.”
పాండు. 4.146.

## పిఱిందికి నడుగు వెట్టు

వెనుకడుగు వేయు.

“ఆజిఁ బిఱిందికి నడుగు వెట్టఁ డె నడచువారు.” భార. శాంతి. 3.47

## పిఱికి కండ లేని

నిర్భీకత కల.

“పిఱికికండ లేనిబిరుదుమగలు.”
ప్రభా. 2.60.

## పిఱికిపంద

పిఱికివాడు.



“వాడు వట్టి పిఱికిపంద. వా డేం పోగలడు అక్కడికి?” వా.

## పిఱికిమందు పోయు

అవీ యివీ చెప్పి భయపడునట్లు చేయు.

“వాడంతగా సత్యాగ్రహం సత్యాగ్రహం అంటున్నవాడు తీరా వచ్చేసరికి పత్తా లేకుండా పోయాడు. ఎవరేం పిఱికిమందు పోశారో?” వా.

## పిఱు తివియు

వెనుదీయు.

“భీకరముగ రణము సేయఁ బిఱుతివియక వై, భాకరసేనలు.” జైమి. 2.34.

## పిఱు తివుచు

వెనుదీయు.

“కఱచి పిఱు తివక మఱియును, వెఱవక.” భాగ. స్క. 10 (పూ.) 644.

## పిఱు దీయు

వెనుదీయు.

“మొలనూలు బిగియించి వెలఁది వెన్నెలఁ జొచ్చు, బిఱుదీయ కేటిలో నుఱుకు కరణి.” మను. 3.31.

## పిఱు సన వచ్చునే?

వెనుకకు వెళ్ళ వచ్చునా? భావార్థం. ఒకటని వెనుకకు పోగలనా? పోవచ్చునా? ‘అని మాట తప్పుతానా?— ఇస్తానని వెనక్కు తీస్తానా?’ అని నేటి వాడుక.

“వరకీర్తి మొఱటదవంకయ్యగారి, వర వుడఁ బిఱు సన వచ్చునే నాకు...”
బస. 6.166.

**పిఱు సిక్కు**

వెనుకబడు – పిఱుదన (వెనుకను) చిక్కు.

"ఇనుతో నడువక పిఱు సిక్కున." కుమా. 8.94.

**పిలపిల మని వచ్చు**

గుంపులు గుంపులుగా వచ్చు. ధ్వన్యనుకరణము.

"పిలపిల నా జయధ్వజానిఁ బెద్ద లెదురొక్కని రాక రాకఁ డో, యలికుచలార!" శుక. 1.412.

**పిలిచి పీట వైచు**

గౌరవించు.

"నిటలాక్షువలన నప్పుడు, ఘటసంభవముఖ్యమునులు గని రెంతయు ము, చ్చటఁ బిలిచి పీఁట యిడి యు, త్కట కృపతో నొసఁగు పరమగౌరవమంతన్." పాండు. 1.207.

"ఏదో మన అందరిలోనూ పెద్ద గదా అని పిలిచి పీట వేస్తే వా డింతపని చేయ వచ్చునా? అంటూ." వా.

**పిలిస్తే పలుకు**

సమృద్ధిగా నుండు.

"ఆఊళ్లో బంగారం పిలిస్తే పలుకుతుంది." వా.

"వాళ్లింట్లో పెద్దమ్మ పిలిస్తే పలుకుతుంది." వా.

**పిలుకు మార్చు**

పరిమార్చు, నశింప జేయు.

"ఉగ్రసేను మాయయ్య గీటడఁగించి, తండ్రి దేవకుఁ బిలుకు మార్చి." భాగ. స్క. 10. పూర్వ. 1161.

"శిష్టు నిను నింతఁ జేసిన, దుష్టాత్ముని బిలుకు మార్చి దురితము పిదపన్." ఆము. 3.38.

**పిలుపించు**

రప్పించు.

"...ప్రజలును నట్లున్న భంగిన వచ్చి, యధిపతిఁ బిలుపించి ... బ్రాహ్మణుం డిట్టు లనియె." పండితా. ప్రథ. దీక్షా. పుట. 121.

**పిలుపిచ్చవిద్య**

మోసము.

పిచ్చుగుంట్లు, విప్రవినోదులు చేయు గారడి, యింద్రజాలము. అందుపై వచ్చిన పలుకుబడి.

"పిలుపిచ్చవిద్యలు పీఁకవన్నియలును." పాండు. 3.43.

**పిలుపు గలుగు**

సంబంధబాంధవ్యము లుండు, రాకపోకలు సాగుచుండు. వేంకటేశ. 22.

**పిలువని పేరంటము**

అనవసరజోక్యము.

"పిలువనిపేరంట మలవుమై నిందఱు, నవ్వఁగాఁ బఱతెంచి." రుక్మాం. 5.86.

"పిలువనిపేరంటము చెప్పని ఒక్కపొద్దు." వా.

చూ. పిలువనిపేరటము.

**పిలువని పేరటము**

"ఏటికి వచ్చె నమ్మ తాఁ బిలువని పేరటంబు." విజయ. 1.78.

చూ. పిలువనిపేరంటము.

**పిల్లకాకి**

చిన్నవాడు. అనుభవము లేని వాడు.

"పిల్లకాకి యెఱుంగునే ఏలంటిదెబ్బ." గీర. 32.

"పిల్లకాకికి ఏం తెలుసు రా ఉండేలు దెబ్బ." వా.

"వాడు ఒట్టి పిల్లకాకి. వాడి కేం తెలుసు ఇందులో సాధక బాధకాలు?" వా.

**పిల్లకాల్వ**

చిన్న కాలువ.

"అడుగడుగునకుఁ జొప్పడు పిల్ల కాల్వలు." లక్ష. 2.75.

**పిల్లచెఱ కీనినకైవడి**

తామరతంపరవంటిది.

"ఇట్లు పిల్లచెఱ కీనినకైవడిఁ బుత్ర పౌత్రవర్ధనమున నొప్పెఁ." భాగ. స్క. 10. (ఉ.) 276.

**పిల్ల జెల్ల**

జంటపదం.

పాండవో. 47.

**పిల్లదురులు**

పిల్లదురుల మోత.

క్రీడా. పు. 46.

**పిల్ల నిచ్చు**

కన్య నిచ్చి పెండ్లి చేయు.

"వాని నిచ్చి పిల్ల నిచ్చినారు." వా.

**పిల్లపాప**

జంటపదం.

పాండవో. 47.

**పిల్లపిల్లతరము**

రాబోయే అనేకతరాలు.

తరతరాలు అనుట.

"అవమతిఁ బిత్రుఘ్ను లగుభూ, ధవుల వెదకి పిల్లపిల్లతరము దునిమి..." ఆము. 3.41.

"పూనినకదళీతరులఁ, రా నేలా పిల్లపిల్లతరముఁ దరముఁ." తారా. 3.32.

"అరటులు పిల్ల పిల్లతర మైనను సామ్యము పొంద నేర్చునే?"

**పిల్లపిల్లవ్యవహారం**

చిన్నతనపు చేష్ట.

'నీ దంతా పిల్లపిల్ల వ్యవహారంగా ఉంది." వా.

**పిల్లమెఱములు**

పిల్లిమొగ్గలు, లగాట్లు.

"అంతంత నిలుచుచు నార్చుచుఁ గుప్పి,గంతులు వైచుచు గతికి నిల్చుచును, నెడనెడ నార్చుచుఁ బెడబొబ్బలిడుచు, వడిఁ బిల్లమెఱముల వైచుచు." బస. 5.140.

"బెడిదంపుటరిగలు బిరబిరఁ ద్రిప్పుచు, వడిఁ బిల్లమెఱములు వైచువారు." కళా. 8.42.

దీనినే లగాట్లు వేయుట అనడం రాయలసీమలో వాడుక.

**పిల్లాటలు**

పిల్ల చేష్టలు.

"ఈ పిల్లాటలు నా దగ్గర సాగవు." వా.

**పిల్లిలా నడుస్తాడు**

మెల్లగా, శబ్దం కాకుండా. ఒట్టిదొంగ అనే సూచన కూడా యిందు లేక పోలేదు.

"వాడు పిల్లిలా నడుస్తాడు. ఎప్పు డొస్తాడో ఎప్పుడు పోతాడో తెలీదు." వా.

**పిల్లిశీలము**

కపటపు నడవడి పంచతంత్రంలోని కథపై వచ్చిన పలుకుబడి కావచ్చును. ఒక పిల్లి తాను మాంసాశనం మాని వేసితి నని తపస్సు చేసుకొంటూ ఉన్నట్లు నటిస్తుంది. ఏదో ఒక యిరవు ఎవరిది అన్న తగాదాపై వచ్చిన రెండు పక్షులను ఈపిల్లి శీలం నటిస్తూనే గబాలున నోట వేసు కొంటుంది.

"శీల మఖిలంబు నిది పిల్లి శీలమనుచు." పాండు. 3.36.

చూ. రుద్రాక్షపిల్లి.

**పిల్లిసంసారం**

చూ. పిల్లి పిల్లలను మార్చినట్లు.

**పిల్లిసమర్త**

బొత్తిగా ప్రధానము కాని దానిని ప్రధానముగా చేసి చెప్పుపట్ల ఉపయోగిస్తారు.

"దాని కేం? నాలుగు డబ్బులు ఎలాగా వచ్చాయి. పిల్లి సమర్త అయిం దంటే నాలుగు వేలు ఖర్చు పెట్టుతుంది." వా.

**పిల్లిసాపెనలు**

అసమర్థుని శాపనార్థాలు. సిప్పి యోజనము లనుట.

"పిల్లిశాపాలకు ఉట్లు తెగుతాయా?" సా.

"ఈ పిల్లిశాపాలతో ఏమి లాభం? చేత నైతే ఏదైనా చెయ్యి." వా.

**పిష్టపేషణము**

చెప్పినదే చెప్పుట. చర్వితచర్వణము లాంటిది. పిండిని మరీ విసరుట వ్యర్థము అనుటపై యేర్పడినది.

"పొద్దున్నుంచీ సాయంత్రంవరకూ పిష్ట పేషణం తప్పితే కొత్తగా చెప్పిన అంశం ఒక్కటి లేదు." వా.

**పిసరెత్తు**

అతిశయించు.

"వదలనితీవ్రవేగమున వాయువు దాఁ బిస రెత్తినన్." రుక్మాం. 4.150.

**పిసికి పిండలివండు చేయు**

పిసికి పిండివంట చేయు.

"కసి మసంగిన మారి పిసికి పిండలి వండు, చేసినచందంబున."

ఉ. హరి. 4.229.

**పిసినారి**

పిసినిగొట్టు.

చూ. పిసినిగొట్టు.

**పిసినిగొట్టు**

లోభి.

"వాడు ఒట్టి పిసినిగొట్టు. దానధర్మా లేం చేస్తాడు?" వా.

చూ. పిసినారి.

పీకమీద కత్తి

ఆసన్న మయిన అపాయము.

కొత్త. 187.

పీకమీద కూర్చొను

ఇస్తావా చస్తావా అని నిర్బంధించు.

కొత్త. 13.

పీకవన్నియలు

అస్థిర వేషభాషాదులు.

"పిలుపిచ్చవిద్యలు పీఁకవన్నియలును, జెలుచదనంబులు ప్రేలడములు."

పాండు. 3.43.

పీకి పాకాన పెట్టు

ఏడిపించు.

కొత్త. 79.

పీకుకొని తిను

వేధించు.

క్రొత్త. 33.

"వాడు నన్ను పీక్కు తింటున్నాడు."

వా.

పీకులాట

అనవసర మైన తగులాటము.

"ఆఁ. ఈ పీకులాటంతా నా కెందుకు?"

వా.

పీకుపీకాడు

పీకులాడు. గుంజె పడవడలాడు.

"క్రన్న్యాదముల్ పీఁకుపీఁ కాడుట నెంగిలి యయ్యె"

భార. స్త్రీ. 2.14.

పీచ మడచు

పొగ రడచు.

"కూకటిముడికి నై కురులు గూడని నాఁడె, బెదరక తాటక పీచ మడఁచె."

మొల్ల. రామా.

పీట పెట్టు

తిష్ఠ వేయు.

"బెండువడియును జాలి నీవు పీఁట పెట్టి, చూపులనె యేర్పుఁ బ్రజ నొక్కసూకరంబు."

మను. 4.69.

"పీఁట పెట్టినప్రాను పెల్లగిల్ల."

మను. 4.16.

పీట పెట్టుకొను

స్థావరము కల్పించుకొను.

"వెంకటగిరిమీఁదను......పీఁట పెట్టు కొన్నవాఁడు పెండ్లికొడుకు."

తాళ్ల. సం. 3.254.

పీటమీదటి పెండ్లిండ్లు ఎడయు

అంతా సిద్ధమై నాండికి పీట పై కూర్చున్నతర్వాత పెండ్లి ఆగి చెడిపోవు.

పీటమీంది పెండ్లి ఆగిపోయింది అని నేటి వాడుక.

"పీటమీఁదటి పెండ్లి ళ్లు పెక్కు లెడ సె."

శుక 2.[illegible]3.

పీఠం పెట్టు

[illegible]

"మా [illegible] పీఠం పెట్టాడు."

వా.

పీడ పోయింది

ఇందుకు మీకు వచ్చిన నష్టమేమీ లేదు. వస్తే కాస్త లాభమే వచ్చింది అను

సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

'ఒకరు — అమ్మా అమ్మా! మీ తోడికోడలి కొడుకును పోలీసులు పట్టుకొని పోయారట.

మరొకరు — పోతే పీడ పోయింది.'

ఇత్యాదులు ఎన్నైనా ఊహించుకో వచ్చు.

చూ. పీడ విఱుగడ అగు.

చూ. పీడ వదలింది.

## పీడ వదలింది

ఏ దయినా పోయినప్పుడు నష్టమేం లేదు లాభమే అన్నట్లు అనుమాట.

"పోతే పీడ వదిలింది. ఎవరిని చెదిరిస్తుంది?" వా.

## పీడ విడిచి బిగాది పట్టినట్లు

చిన్నసంకటము పోయి పెద్ద సంకటము తగులుకొన్నట్లు.

"ఏమి సేయుదుఁ గటకటా! యించు విల్తుఁ, డేచ నిలు వెళ్లి వనిఁ జేడు టెల్ల నిపుడు, గన్గొనఁగఁ బీడ విడచి బిగాది పట్టి, నట్టు లయ్యె నిం కెచ్చోటి కరుగవలయు." రసిక. 4.34.

## పీడ విఱుగడ అయింది

చూ. పీడ పోయింది.

## పీతనడక

అడ్డుగా నడుచు నడక.

సక్రమగతి కా దనుట.

## పీనుంగు పెంట జేయు

ఎక్కువమందిని చంపు.

"పావని మాగధ, సేనం బీనుంగు పెంటఁ జేసి చెలంగెన్." భార. భీష్మ. 2.214.

## పీనుంగు పోవు

పీనుగు వెళ్లు.

ఇంటిలో ఎవరో ఒకరు చని పోవు.

వాడుకలో ఇది 'పీనుగు వెళ్లు' అన్నరూపంలోనే కనబడుతుంది.

కాశీ. 7.139.

చూ. పీనుగు వెళ్లు.

## పీనుగుతోడి జాగరము

శవజాగరణము.

నిష్ప్రయోజన మనుట.

"తుద లేదు పీనుఁగుతోడి జాగరము, బోయచాంచకులు బొంకి పోయెదో లేక." గౌర. హరి. ద్వి. 2.165.

చూ. శవజాగరణము.

## పీనుగుమీద కంచము పెట్టి కుడుచు

నీచానికి పాల్పడు.

కడుపు కక్కుర్తివా డనుట.

"కడఁగి పీనుఁగుమీఁదఁ గంచంబు వెట్టి, కుడువఁగాఁ జూచు కక్కుర్తివాఁడు." హరి. ద్వి. 2. 451.

## పీనుగు వెళ్లు

చనిపోవు.

"ఈ రోజు మనవీధిలో పీనుగు వెళ్లింది. అది ఎత్తేదాకా యింక భోజనాలుండవు." వా.

చూ. పీనుగు పోవు.

**పుంఖానుపుంఖంబులు**

గుంపులు గుంపులుగా.

ఒకదానిమీద ఒకటిగా.

"రామరావణబాణపరంపరలరీతిని బుంఖానుపుంఖంబులుఁ దండోపతండంబులు లక్షోపలక్షలు."

హంస. 3.29.

**పుంఖానుపుంఖముగా**

ఒకదాని వెనుక నొకటిగా, ...ఎడతెఱపి లేక.

కుమా. 12.152.

**పుంగు డగు**

వంచితు డగు.

"పూపసంసారము నమ్మి పుంగుఁ డై యిన్నాళ్లదాఁక."

తాళ్ల. సం. 9.42.

**పుంజాలదండ పెట్టు**

మెడకు రెండుచేతులను పెన వేసుకొని వ్రేలాడు—పుంజము అనగా దండవలె చుట్టిన నూలు.

"దండుసకి మెడఁ బుంజాల దండ పెట్టు."

పాండు. 3.62.

**పుంజుకొను**

తేరుకొను.

"...పుంజికొని వెడలి నిడుద లై యుండు కఱకుగిలు నాసాకేశంబులును వీఁడు మఱల పుంజికొనినాఁడు."

కవిక. ఆ. 5.

**పుండు పుట్టు**

దుర్బుద్ధి కలుగు.

"వాడి కీమధ్య ఏదో పుండు పుట్టింది. ఏ మంచిపని చేస్తాం అన్నా అడ్డం వస్తున్నాడు."

వా.

**పుండు మాగుడు గాగ జేయు**

పుండు మాగ కొట్టు, బాగా కొట్టు.

"...భటావళిం, బుండు మాఁగుడు గాఁగ నేసిరి భూరివీరధనుర్ధరుల్."

కుమా. 11.150.

**పుండువంటి చలి**

ఎముకలు కఱచుచలి, విపరీత మైనచలి.

"...అ ప్పుండు వోలినచలికతమున, నాకులత నొంది రిలలోని లోకు లెల్ల."

పంచ.

"మిసిమింతుఁడును గాక వసియించుఁ గుత్తుక, బంటిసీరను బుండువంటి చలిని."

పాండు. 2.28.

"పుండువంటి చలినీట నుండి."

దేవీ. 6.23.

**పుక్కిటితమ్మలం బుమియు ప్రొద్దు**

ప్రాతఃకాలము.

"పుక్కిటితమ్మలం బుమియుప్రొద్దును గాదొ కదమ్మ."

ప్రభా. 5.65.

**పుక్కిట పట్టు**

ఆపోశన పట్టు.

సర్వమూ ఆకళించుకొన్నా డనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆ సుబ్బన్నావధాన్లు వేదాలూ, శాస్త్రాలూ అన్నీ పుక్కిట పట్టిన మహాపండితుడు."

వా.

## పుక్కిటిపురాణ మగు

వృథా కాలక్షేప మగు.

"గ్రక్కున శ్రీతిరువేంకటపతి గానక పుక్కిటిపురాణ మయి పోయెఁ గాలము." తాళ్ల. సం. 5.48.

## పుక్కిటిపురాణము

లోకాభిరామాయణము.

"వకుళము రాగిల్లఁగఁ బ్రస, వకులం బొసఁగెఁ ముఖాసవం బీయ నొక, రెవ ని ట్లని విని యొక, న్యక యిది పుక్కిటిపురాణ మయి తోఁచెఁ జుమీ." రామాభ్యు.

"పుక్కిటిపురాణములఁ బ్రొద్దు పుచ్చునతఁడు, చాలునె పురాణములు విప్పి చదివి చెప్ప." రామలిం.

## పుచ్చకాయకు జేవ దెచ్చు

నిస్సార మగుదానిని గొప్పగా చెప్పు.

"ప్రకటించి పుచ్చకాయకుఁ జేవఁ దెచ్చుచుఁ, గీర్తించెదవు వందిక్రియఁ జెలంగి." హరి. 1.152.

## పుచ్చపూవువంటి వెన్నెల

పండువెన్నెల.

## పుచ్చులు వో దున్ను

బుడ మార్చు, సర్వనాశన మొనర్చు.

"అలుక న్ఘోటకఘట్టికాఖురపుటీహల్యన్ ఖురాసాని పుచ్చులు వో దున్ని..." ఆము. 1.42.

## పుచ్చిన వక్కైన ఈయడు

అతిలోభి యనుట.

"......పుచ్చుచు నతనికిఁ బుచ్చిన వక్కైన, నీయక యుండు నుపాయ మొకటి." ఏలామా. 2.181.

## పుచ్చి వైచు

తీసివేయు, తొలగించు.

"నీ మనముశోకము సర్వముఁ బుచ్చి వైచెదన్." కళా. 3.82.

## పుచ్చె పూయు

పొగ రెక్కు, తల తిరుగు.

"ఆయనమాత్ర మెందుకు సమ్మతింపడు? పుచ్చె పూసినదా యేమి?" అనర్ఘ నారద. 40.

## పుటపుట నగు

ధ్వన్యనుకరణము.

"పుటపుటనై యున్న చిన్నబొజ్జ కదలఁగన్." పాండు. 2.35.

## పుట మెక్కు

వన్నె యెక్కు.

పుటము వేయబడి వన్నె తేరు.

బంగారు పుటము పెట్టుకొద్దీ అందులోని మలినమూ వెండీ మొదలయిన యితర లోహములూ తొలగిపోయి వన్నె దేరుతూ ఉంటుంది. దానిపై వచ్చిన పలుకుబడి.

"వీరాగ్రగణ్య కోటీరరత్నంబులు, పుట మెక్కి వన్నె చూపుచును మెఱయ." జైమి 4.23.

"పాలఁతుల కాఁకలే పుట మెక్కె మనసు." తాళ్ల. సం. 11.40.

## పుట మెగయు

విజృంభించు.

చెండును నేలను కొట్టగా ఎగురుటను పుట మెగయుట అంటారు.

"వడి గొని మనసిజవాయువు విసరఁగ, పొడ వగునెఱుకలు పుట మెగసె."
తాళ్ల. సం. 8.19.

ఎగిరిపడు.

"ఉదవాసక్లేశంబున నుడు కుడిచి వెలు పటికిం బుట మెగయుచు."
పాండు. 3.150.

"బంతి పుట మెగిరినట్లు వా డెగిరిపడు తున్నాడు." వా.

## పుట్టచెండులు

ఆట.

తాళ్ల. సం. 10.172.

## పుట్టని శిశువులకు పేరు పెట్టు

ఏమీ కాక ముందే సత్ఫలితము నూహించు.

"నన్నుఁ బాలియింప నెంచినాఁ డన్న మిన్న, దాశరథి దా శరధి దాఁటఁ దడవుకొనుచు ? లము పుట్టని బిడ్డల కట్టుఁ బనుచుఁ, బేర్లు వెట్టెడువార మన్నిగు వరయఁడు."
రామకథా. యుద్ధ. పూ. 4.333.

## పుట్ట లెక్క—

చెల్లా చెద రై పాఱు.

"ఆయుధంబులు వేసి హంకారములు రోసి, ప్రొక్కవారును బుట్ట లెక్క వారు." వరా. 3.37.

## పుట్టింటిరూఢి నెఱపు

పుట్టింటిసాంగ్యము జరపు.

"తదవరోధ మగపడ్డఁ బుట్టింటిరూఢి నెఱపు." ఆము. 4.267.

## పుట్టినింటి కల్పకము

ముంగిట పెన్నిధి, పెరటికల్పకము – ఇవి అందుబాటులో నుండి కోరికలు తీర్చ గల వనుటకు వాడుమాటలు.

"ఇది గదా నాపుట్టినింటి కల్పకము."
బస. 5.133.

## పుట్టినిల్లు

స్థానము.

"పరమం బది శరణం,బది పుట్టినయిల్లు సిరుల కెల్లఁ దలంపన్."
కళా. 2.124.

నివాసస్థానము, ఆటపట్టు.

"భూరిసంపదలకుఁ బుట్టినిల్లు."
పండితా. ప్రథ. పురా. పుట. 277.

"...ఇంచుల చొటిపడియ లూహింప, నిరతంబు క్షీరాంబునిధి పుట్టినిండ్లు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 241.

## పుట్టి పుణ్య మెఱుగని

ఏనాడు ఏసౌఖ్యమును అనుభవింపని.

"పుట్టి పుణ్యమెఱుంగనట్టి నెమ్మేనికిఁ, బసపునల్గు ఘటించె మిసిమి బెళుక."
హంస. 3.75.

## పుట్టి బుద్ధి యెఱుగుట మొదలు—

చిన్నతనంనుంచీ అనుట.

వాడుకలో—పుట్టి బుద్ధి యెరిగినది మొదలు, పుట్టి బుద్ధి యెరిగినప్పటినుంచీ యిత్యాది రూపాలలో కాన వస్తుంది.

"అనఘ! విను మొకటి చెప్పెద, నెన యఁగ మన పుట్టి బుద్ధి యెఱుఁగుట మొద లి, వ్వనము నివాసం బైనది, మనవారికి నింత చోటు మంచిది యగు నే?" హరివం.

"పుట్టి బుద్ధి యెఱిగినప్పటినుంచీ నేను ఈ ఊళ్లోనే ఉన్నాను." వా.

## పుట్టి మునుగు

ప్రాణంమీదికి వచ్చు, నష్ట మగు.

ఇక్కడ పుట్టి అంటే పడవ బల్లకట్టు వంటిది.

"వాడు రాకపోతే పోయాడు. ఏం పుట్టి మునిగిం దని అంత అంగలా ర్చడం?" వా.

## పుట్టుగతులు లేకుండ పోవు

చాలా పాపము చుట్టుకొను ననుట.

కొత్త. 4.31.

## పుట్టుగ్రుడ్డి

జాత్యంధుడు.

## పుట్టుపూర్వములు

చూ. పుట్టుపూర్వోత్తరాలు.

## పుట్టు పొడవు లేక

రూపనామక్రియలు లేకుండ.

"అమరులు తత్ప్రతాపానలాహతిఁ గ్రాఁగి, పోయిరి తమపుట్టు పొడవు లేక." కుమా. 11.103.

## పుట్టు బొడవు కానరాకుండ

నిశ్శేషంగా, రూపు కానరా కుండా.

"పుట్టుఁ బొడ వెందు గానకుండ." కుమా. 12.32.

## పుట్టు బొడవు లేక

పూర్తిగా, రూపు లేకుండా.

"అమరులు తత్ప్రతాపానలాహతిఁ గ్రాగి, పోయిరి తమ పుట్టుఁ బొడవు లేక." కుమా. 11.103.

రూ. పుట్టు పొడవు లేక.

## పుట్టుభోగి

జన్మతః భోగశాలి, ఆగర్భ శ్రీమంతుడు.

దీనికి వ్యతిరేకం 'పుట్టుపేద.'

"పుట్టక పుట్టినపుట్టుభోగికిని."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1855.

"పొరలు పెట్టెడు పుట్టు భోగులు మీరు." ద్విప. మధు. 5.

## పుట్టువడుగు

ఘోటకబ్రహ్మచారి.

"పట్టణమున నుండుపుట్టువడుగు." పాండు. 4.195.

## పుట్టువెఱ్ఱి

జన్మతః ఉన్మత్తుడు.

"మతిభ్రమార్తుఁడొ మదస్ఖలితాత్ముఁడొ పుట్టువెఱ్ఱియో..." కళా. 6.22.

## పుట్టెడు దిగులు

ఎక్కువ దిగులు.

"ఎదిగినపిల్లను ఎదాన వేసుకొని ఆమె పుట్టెడుదిగులుతో బాధ పడుతూ ఉంది." వా.

## పుట్టెడు దుఃఖం

ఎక్కువ దుఃఖం.

"ఉన్న ఒక్కకూతురూ విధవరా లయి

పోయిం దని ఆవిడ పుట్టెడుదుఃఖంతో మంచం పట్టింది.'' వా.

## పుట్టెడు నీరు

ఎక్కువ నీరు, పుట్టెడు—ఎక్కువ.

''కన్నంటఁ బుట్టెండు, నీరు గాఱఁగ నేడ్వ నీ కేమి వలసె ?''
బస. 3.73.

చూ. పుట్టెడు దిగులు, పుట్టెడు దుఃఖం.

## పుతము వేయు

నశింప జేయు.

ఒక తిట్టు.

''ఇలా వాగా వంటే పుతం వేస్తాను. జాగ్రత్త.'' వా.

## పుడకలు విఱుచు

పనికి విఘ్నము చేయు.

''అని చెలి పుడకలు విఱిచినఁ, గనుఁగొని యది క్రొత్తగుమ్మ కావున...''
శుక. 1.532.

చూ. పుల్లవిఱుపు మాటలు, పుల్లగుట్టు మాటలు.

## పుడికికొని పోవు

వెదకి తీసికొని పోవు, అపహరించు.

పుణుకు–వెదకు అని కన్నడం.

పుడుకు పుణుకు రాయల సీమలో ఎక్కువ వాడుక.

''రసఘుటిక, యొరు లెఱుంగక యుండ నొయ్యన పుడికి, కొని పోయి.''
పండితా. ప్రథ. పురా. పుట. 479.

''నీకోసం పుడికి పుడికీ చా లయింది.'' వా.

## పుడికి పుచ్చుకొను

దాని నంతటినీ స్వాధీనము చేసుకొను.

''...చందమామ వెలుఁగుల, కొమ రంతయుఁ బుడికి పుచ్చుకొనఁ బోలుఁ జుమీ.'' విజయ.

''ఎగుబుజంబులవాఁడు మృగ రాజ మధ్యంబు, పుడికి పుచ్చుకొను సెన్న డుము వాఁడు.'' విజయ.

## పుణ్యం పాపం

అందులోని న్యాయాన్యాయాలు.

''ఆవిడకూ మరిదికీ సంబంధం ఉం దని ఊ రంతా అనుకుంటూరు. పుణ్యం పాపం భగవంతుడి కెరుక.'' వా.

''వాడికి పుణ్యం పాపం తెలీదు. ఆ అమాయకుణ్ణి ఏ మయినా అంటే నీ నోట్లో పురుగులు పడతాయి.'' వా.

## పుణ్యాపాపములు దలపక

పుణ్యాపాపవిచక్షణ లేక.

''కార్యము లెల్లన్, బో మొత్తి పుణ్య పాపము, లేమియుఁ దలఁపక సుఖించు నెడ వారలకున్.''
కా. మా. 2.22.

## పుణ్యభూములు త్రొక్కు

పుణ్యక్షేత్రములు తిరుగు.

''తనయుండు లేమిఁ బరితాపముతోఁ, గడు పుణ్యభూము లాయత,మతిఁ ద్రొక్కు...'' హంస. 1.152.

## పుణ్యమా ? పురుషార్థమా ?

''...తీర్థంబును స్వార్థంబును...బుణ్యం బును బురుషార్థంబును నయ్యె.''
పాండు. 1.30.

"పున్నెము పూరుషార్థము బుభుక్షువు సేసినబ్రాహ్మణార్థమా!" తె. నా.
చూ. ఇహమా పరమా ?

**పుణ్యమాయిరి**

...పుణ్యం ఉంటుంది.
కొత్త. 14.

**పుణ్యము కట్టుకొను**

ఏదైనా మేలు చేసి ఆ పుణ్యమును పొందుము అని చెప్పుటలో ఉపయోగించే మాట.

"ఈ సాయం కాస్తా చేసి పుణ్యం కట్టుకో తల్లీ !" వా.

**పుణ్యమున బొమ్మ**

పుణ్యము కట్టుకొమ్ము.

"నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్ము." మను. 2.59.

"ఈ సాయం కాస్తా చేసి పుణ్యాన పో నాయనా !" వా.
చూ. పుణ్యము కట్టుకొను.

**పుణ్యము పురుషార్థము అగు**

ఇహపరసాధక మగు.

"ఇట్లు లోకోత్తరగుణోత్తరుం డగు నా ప్రధానశేఖరుండు పరమపురుష పరికరచరిత్రంబున కధీశ్వరుం డగుట తీర్థంబును స్వార్థంబును...పుణ్యంబును బురుషార్థంబును నయ్యె." పాండు. 1.30.

**పుతపుత వోవు**

పొంగు.

ధ్వన్యనుకరణము.

"అతులితభావగర్భితము లై నమృనూ ఘృలచేతఁ గేలికిం, బుతపుత వోవుచున్న నృపపుంగవుచిత్త మెఱింగి..." విక్ర. 4.221.

"పుతపుత వోవ భాగవతపూతకథారస మాతురంబుపై." భాగ. ఆ. 2.

**పుత్తడిబొమ్మ**

బంగారుబొమ్మ.

అందమైన దనుట.

"పుత్తడిబొమ్మా పూర్ణమ్మా." గురజాడ.

**పుత్రహత్య కట్టుకొను**

పుత్రుని చంపిన పాపమును కట్టుకొను.

"ఆతనిఁ జంపుకొంటి నజ్ఞానమునఁ గట్టుకొంటి పుత్రహత్య." కా. మా. 2.78.

**పుత్రి యైనను బుత్త్రకుం డైనను దాన**

కొడు కైనా కూతు రైనా అదే.

ఇది నేటికీ ఈ రూపంలో వినవస్తుంది.

"అపుత్త్రకుండ నగునాకుఁ బుత్త్రి యైనను బుత్త్రకుం డైనను దాన." ఆము. 5.157.

చూ. కొడు కైనా కూతు రైనా...

**పునర్ధార బోయు**

తిరిగి దాన మిచ్చు.

"ఊరు ముక్కు జనమేజయుడు విద్వే నగ్రహార మింతటినుండి మీ రుద్ధరించి, పొరిని బునర్ధారఁ బోయరే.." బస. 7.187.

**పుయిలోట దక్కు**

భయము తీరు.

"పురియిలోట దక్కి రాజకంఠీర వుండు." శకుం. 3.19.

**పురపుర పొక్కు**

విచారపడు.

ధ్వన్యనుకరణము.

"సఖులారా! ఏ ప్రకారంబునం బుట పాకప్రతీకాశం బైనకరుణారసంబునం బురపురం బొక్కెదరు." నైష. 1.108.

**పురమాయించు**

పురికొల్పు.

క్రొత్త. 31.

**పురము చేయు**

విడిది యేర్పఱుచు.

"చెఱలు వట్టి తెచ్చి...మణిపర్వతంబునం బురంబు చేసి కావలి వెట్టుకొని యుండె." ఉ. హరి. 1.84.

**పురశ్చరణ**

మంత్రాన్ని జపించడం.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 28.

**పురాణదంపతులు**

ఆదిదంపతులు, పార్వతీ పరమేశ్వరులు

**పురాణపురుషుడు**

ఆదిపురుషుడు.

"నీవు పురాణపురుషుఁడవు."(కృష్ణుడు) జైమి. 3.110.

**పురాణము కట్టి పెట్టు**

(నీ)మాటలు కట్టిపెట్టు.

"పంకజబాంధవాత్మభవ పల్కరు నా జెన లేనిపోనిదు, శ్శంకలు దెచ్చి పెట్టె దవు చాలుఁ బురాణము గట్టి పెట్టు." సానందో.

**పురాణము విప్పు**

పాతకథ చెప్పుటకు ప్రయత్నించు.

రామలిం. 86.

**పురికొను**

ఎక్కువగు.

తాడు పురి యెక్కించుటపై వచ్చినపలుకుబడి.

పాండు. 5.127.

**పురికొల్పు**

ప్రోత్సహించు.

"సైన్యంబులన్ బురికొల్పన్." జైమి. 5.11.

**పురుగు తొలుచు**

ఏదో ఒకటి మనసులో మెరమెర లాడు.

"వాడి తలలో ఏదో పురుగు తొలిచింది. వెళ్లి పోయాడు." వా.

**పురుడు వెడలు**

ప్రసవమగు.

పురుడు వచ్చినది అని నేటికీ కోస్తాజిల్లాలలో వ్యవహారం. రాయలసీమలో మాత్రం పురుడు అనగా జాతాశౌచము అన్న అర్థంలోనే వ్యవహారం.

"పురుడు వెడలిన వెనుక నా భూమిదేవుఁ, డా శిశువు జన్మనక్షత్ర మరసి యిన్నఁ, డైఁ..." శుక. 2.147.

పురుదాలినోరినాడు
కటుభాషి.
"ఆ పురుదాలినోరిముని కడ్డము నారయ లేదు వానికిం, గోపమె కాని శాంతి యును గూరిమి లే దెటువంటివారి తోఁ." విష్ణు.

పురులు గలడు
డబ్బు గలవాడు, భాగ్యవం తుడు, సౌందర్యవంతుడు.
"పురులు గలఁ డిచ్చు నని తన, పురు లెఱుఁగక పిల్తు మేము..."
కుమా. 8.140.

పురులు వొలియు
గౌరవం క్షీణించు. గొప్ప దనం చెడిపోవు.
"నీవలన సతుల పురులు వొలిసెఁ గాక." కుమా. 7.36.

పురు లొడ్డు
పురులు విప్పు.
"నికటద్రుమస్థితనీలకంఠంబులు, పురు లొడ్డి వానల బిరుసు మాన్ప."
కా. మా. 2.70.

పురుషామృగముల వేట
పురుషుల వేట.
"మించిన పురుషామృగముల వేటలు, అంచెల నాడేరు అతివలు భువిని."
తాళ్ల. సం. 9.6.

పురుషో హరి యను
జను లందరూ విష్ణుస్వరూపు లే అని భావించు.
"పురుషో హరి యటంచు భూరిఁ బంచి." శకుం. పీ. 86.

పుర్రు పుర్రు
బురదబురద.
గుంటూ. ఉత్త. 79.

పులకండ మొలుక బలుకు
తీయగా మాటాడు.
"పాపటపై నం,జలిఁ జేర్చి జళుకుఁ జూపులఁ, బలుకులఁ బులకండ మొలుకఁ బలికెఁ గలఁకన్."
మను. 4.70.

పులకలు జాదుకొను
పులకలు రేగు.
"పులకల్ జాదుకొనంగ నేలుకొను నేర్పుల్ సాక్షి నీ యోర్పులున్."
రాజగో. 1.108.
"పులకల్ జాదుకొనంగ శిశువున సంపూర్ణోదవాసంబునన్."
రాజగో. 5.9.

పుల వొడుచు
కన్ను తటాలున మూసి తెఱచు.
"చప్పళ్లకుఁ బుల పొడుచుచు."
భల్లా. 3.
"తడితల డిగ్గి ముంప జడతం దుద తెప్పలఁ గన్ను వీడి పు, ల్వొడుచుచు..." ఆముక్త. 4.118.

పులవరి
పుల్లరి.
పశువులు మేపుకొనుటకై చెల్లింపవలసిన పన్ను.

పులికాపు వెట్టు
దేవతార్చనలోని విగ్రహాదు లను కడుగు.

పులి అనగా అరవంలో చింత పండు. చింతపండుతో తోమే వారు కనుక పులికాపు అయి నది. ఇది పులకాపుగా కూడా వ్యవహారంలో ఉన్నది.

"కాఁ పున్న రక్కసులఁ బులి, కా పానరింపంగఁ దొడరి కదిసి చమరి..."

రామకథా.

## పులికి జీవకారుణ్యమా ?

క్రూరునికి జాలి యెక్కడి దనుట.

బాలనీతి. 45.

## పులికి పులి

పులికే పులివంటిది అనుట. ఇలాంటి మాటలే గండర గండడు, వీరాధివీరుడు, మిండలమిండడు మొదలగు నవి.

"..........భువి ఘోరమృగా, వలికిం దలఁకక యాడవిం, బులికిం బులి నగుచుఁ దిరిగి పులిపులి నైతిన్."

శుక. 2.259.

## పులి గోల వేసినట్టు

పులిని కట్టెతో కొట్టి రెచ్చ గొట్టినట్లు.

"పులి గోలవేసిన ట్టి, ట్టలపు రయంబునఁ గడంగుటయుఁ దద్వ్యక్షున్, స్థల మున..."

భార. విరా. 5.188.

"ఇ ట్లాట యొఱఁగి కృష్ణు, వెదకి తిప్పుడు పులిఁ గోల వేసినట్టు."

ఉ. హరి. 4.200.

## పులిపల్లి

పుల్లపల్లి.

"ఒరి పక్షం బైనపెరుఁ గుండఁ గక్షంబు, పులిపల్లెలో నుంచి చిలుకఁ బోవు."

శుక. 2.561.

## పులిచారు

పుల్లని చారు.

"పులిచారు వంచె నొక్కతె, పులి చాఱలచీరఁ గట్టి భోక్తల కేళా..."

బహు. 4.25.

## పులిజున్ను కో యని యమ్మ నేర్చు

అసాధ్యకార్యములను చేయ గలవా రనుటలో నిరసన సూచిస్తూ అనుమాట. పులి జున్ను తీసి అమ్మడం మఱి అంతే కదా.

పండితా. ప్రథ. పురా. పుట. 359.

"వలె నన్నఁ వెల యిచ్చికొంద్రు మఱి జిద్వక్షున్ స్థలిరత్నముల్, పులిజా న్నైనియు నమ్మఁ జూపుదురు...... వణిగ్వర్యుల్ యశోధుర్యులై."

సుద. 1.82.

## పులిజున్ను నేదుకన్ను దెమ్మనినను దెచ్చు

ఎంతటి సాహసకార్యమైనా చేయు.

"కనుఁగొని నెమ్మనం బలరఁగాఁ బులి జున్నును నేఁదుకన్ను దె, మ్మనినను దెచ్చువాఁడఁ బ్రియ మైనవి యెల్లను జెప్పఁ డంచు."

విక్ర. 1.167.

పులిజూదము

ఒక రకమైన ఆట.

"ఒడ్డు, విడుపు సెట్టుడుగాయ విండ్ల మ్ములాటలు, పులిజూదములు."
హంస. 3.146.

పులితేపులు

అజీర్ణంవల్ల వచ్చే తేపులు.

"పుఱియల నట మ్రింగి పులిత్రేపు లడర, నఱుఁగక పొరలాడి యఱచు రక్కసులు."
ద్వి. హరి. ఉ. 1636 పం.

పులి నాకి విడిచినట్లు

గొప్ప ఆపద తప్పి పోయి నట్లు.

చంపి తినవలసినపులి నాకి విడిచిన దంటే మఱి అంతే కదా!

"పాడమినభీతిచేఁ బులి నాకి విడిచెఁ, దప్పక దీనికిఁ దగినట్టి బుద్ధి."
రంగ. రామా. 156.

"పులి నాకి విడిచిన పోలికగాను, నలుకుచు నెవ్వ రే మందురో యనుచు."
సారం. ద్వి. 1.675.

"పోయె నంతియ చాలు నీ పుణ్యము నను, వేయు నేటికిఁ బులి నాకి విడిచినట్లు."
విష్ణు పు. 1.156.

పులినీరు

నెత్తురు విఱిగి గాయమునుండి కారేనీరు.

"చంద్రిర యది సెలవడి నేఁడుఁ దొరఁగెడుఁ బులినీరు గాఁగఁ దోయము పేరఁ."
చంద్రా. 5.75.

పులినోరికండ

తిరిగి మనచేత బడునది కాదు. పులినోటికి దొరికినకండను తిరిగి లాగుకొనుట సాధ్యమా? అనుటపై వచ్చినది.

"పులినోరికండ యై పోయిన మన భాను, మతిఁ గ్రమ్మతించిన యతఁడితండు."
రాజశే. 2.112.

పులినోరికండ విడిపడ్డ గతి

పులినోట్లో పడి తప్పించుకొని బయట పడినట్లు.

"ఏమి చెప్పం బులినోరికండ విడిపడ్డ గతిం దలపట్టి చూచుకొంచున్."
ప్రభా. 1.91.

పులిపాలు తెచ్చి యిచ్చు

అసాధ్యకార్యమును చేయు.
సుమతి. 82.

పులిపాలు తేగలడు

ఎంత అసాధ్యకార్య మైనా చేయగలడు. సాహసి.

పులిపిరి

శరీరంమీద మిరియపు ఆకారంతో లేచే దుర్మాంసం.

"మిడిపండ్లు చెక్కటిమీఁది పులిపిరియు."
ద్వి. హరి. ఉ. 1085.
రూ. పులిపులి.

పులిపిరికాయ

చూ. పులిపిరి.

పులిపిల్ల

పరాక్రమవంతుడు.

"వాడా అమ్మా! పులిపిల్ల. వాడి మీదికి ఎవరు పోతారు?"
వా.

**పులిపులి**

చూ. పులిపిరి.

**పులిపులికాయ**

చూ. పులిపిరి.

**పులిపులి యగు**

నలగి పోవు.

"పులిపులి యయ్యె నంగజత పాక్క సుధాధరబింబము." శుక. 1.304.

"పులి గ్రమ్మకొని పులిపులిగ నీ కెలఁ గ్రుమ్మి, యేపుతో మగటిమిఁ జూపువారు." రసి. 1.

**పులి పేద వడిన బసులవాండ్రె యెక్కుడుదురు**

బలవంతు డైనవాడు దెబ్బ తిన్నప్పుడు ఎవడు పడితే వాడే అవమానపరుస్తాడు. పులి ముసలి దై బలహీన మయినప్పుడు దానిని చూచి ముఖ్యంగా భయపడవలసిన పశువుల కాపరులే దానిపై ఎక్కి కూర్చుంటారు.

"బ్రదికి పోయిరె పులి పేదవడినఁ బసుల, వాండ్రె యెక్కుడి రనుకత వచ్చె నాకు." ఉ. హరి. 4.102.

**పులిబిడ్డ**

పరాక్రమవంతుడు.

"వాడా! అమ్మా! పులిబిడ్డ." వా.

**పులిమి పుచ్చు**

కప్పిపుచ్చు.

"నందుఁ డ దేమన్న నవ్వుచు మీ కేల, పొమ్మంచు నొకవేళ పులిమిపుచ్చు." దశా. 6.268.

**పులిమీద పుట్ర**

గోరుచుట్టుపై రోకటిపోటు వంటిది పలుకుబడి.

"ఇప్పుడే ఉద్యోగం లేక చస్తుంటే పులిమీద పుట్రలాగా నలుగురు బంధువులు వచ్చారు." వా.

**పులిమీసాలు మెలిపెట్టు**

అసాధ్యకార్యము చేయు, సాహసకృత్య మొనర్చు.

"పులి నైన మీసాలు మెలివెట్టి పెకలించు." శ్రీని. 4.55.

**పులియంబకళము**

పులిసిన అంబలి.

"పోయి చెన్నయ యింటఁ బులి యంబకళముఁ, జేయుఁ దీయక జుఱ్ఱి." బస. 3.60.

**పులియకు - పులియు**

అనవసరంగా గర్వపడకు మని చెప్పుటలో ఉపయోగించే పలుకుబడి.

"...వలపు నీతల వేగఱ, బులియకు వే సవతులు గల." ఉ. హరి. 3.115.

"వా డేదో నాలుగురాళ్లున్నా యని మహా పులుస్తున్నాడు." వా.

"వస్తేకి వస్తాను వస్తాను అని మహా పులుస్తున్నావు, రా. చూస్తాను." వా.

**పులివాతికండ**

"పులివాతికండఁ గొనుగతి, నలవునఁ బాంచాలతనయు నయ్యెడరునమం, దొలఁగించిన సాత్యకిపై, నలుక వొడమ కుండు నెట్టు లాచార్యునకున్." భార. ద్రో. 3.271.

చూ. పులినోరికండ.

పులివోవు

పులిసిపోవు, పాడగు.

"పాదల నెయ్యెడఁ బులివోవని ప్రాణ, పద మగునోగిరం బాదవ సర్పించి."

పండితా. దీక్షా. 76.

పులిసినకూడు

పాసినఅన్నము.

పాసిన వన్నీ పులిసి పోవడం అలవాటు.

పులు కడుగు

మాలిన్యము కడుగు.

"గొజ్జంగి నీట...కలకంఠిమేను పులు గడిగిన ట్లాయె." తాళ్ల. సం. 3.305.

రూ. పులు గడుగు.

పులుకాసిపురువులు

అల్పులు.

పైరులపై తిరుగు చిన్న పురుగులు. గడ్డి పురుగులు అల్పములు కాదా ?

"వరవుడుగాఁ జేసి వరుస వర్తింపఁ, బురిలోనఁ బులుకాసి పురువుల తరమె."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 459-60.

పులుకు పులుకున చూచు

రెప్ప లల్లార్చుచు చూచు.

"అని కెలని పులుకు పులుకునఁ, దనుఁ జూడం జూడఁ బట్టి తన్నెం గొట్టెన్." వేం. పంచ. 4.468.

రూ. పులుక్కు పులుక్కున చూచు.

పులు గడుగు

శుభ్రము చేయు.

పాత్రలు, విగ్రహాలు మొదలయిన వాటిని చింతపండు పులుసుతో తోమి శుభ్రం చేయడం అలవాటు. తద్ద్వారా వచ్చిన పలుకుబడి. తమి. పుళి=చింతపండు

"పులు గడుగంగఁ బడనును ముత్యము." పాండు. 3.9.

చూ. పులికాపు.

పులు గాసి పురువు

"మన్న పురుషుని చెడనాడుమగువ మీఁదఁ, బోయి పులుగాసిపురు వయి పుట్టుననుచు." శుక. 3.148.

చూ. పులుగాసి పులుఁగు.

పులుదారి నోరు

దుడుకునోరు.

"బ్రాహ్మణమాత్రుఁడె యత్రి నందనుం, డా పులుదారినోరి మునికడ్డము నారయ లేదు వానికిన్." వి. పు. 1.155.

పులుమానిసి

ప్రాభవం కోల్పోయినవాడు.

"పురమున కేతెంచె నతఁడు పులుమానిసి యై." దశ. 7.18.

పులుల మీసముల నుయ్యేల లూగు

అసాధ్యకార్యము చేయు.

"పులుల మీసముల నుయ్యేల లూఁగ నగుఁ గాని, పారిజాతులచెంతఁ జేర నగునె ?" శుక. 1.364.

పులుసర మెంచు

పాసినట్లు గుర్తించు.

"సందడించి మరునాఁటి చవులకే

కూడఁ బెట్టు, పొంది మింగిన కళ్ళ పులుసు మెంచఁడు.''

తాళ్ల. సం. 5.206.

**పులుసుకూర**

పులుసు పెట్టి వండినకూర.

**పులుసుముద్ద వేయు**

ఖైదు చేయు.

సామాన్యంగా 'సి' క్లాసు ఖైదులకు ఒకముద్ద అన్నము, ఒక గొట్టం పులుసు పొయ్యడం అలవాటు. అందుపై వచ్చిన పలుకుబడి.

''వాడికి నాలుగేళ్లు పులుసూ ముద్దా వేశారు.'' వా.

**పులుసు వంచు**

పొగరు అడగించు.

''నీపులుసు వంచేస్తాను. జాగ్రత్త.'' వా.

**పులుసు విఱుగు**

గర్వ మడగు.

''చనుగుబ్బల లావణ్యము, విని నప్పుడె వాని పులుసు విఱుగుం జుమ్మీ.''

సారం. 2.222.

**పుల్కపుల్కన గనుగొను**

తెప్ప లార్చుచు చూచు.

''నీరు దేఱు తెలిగన్నుల నాతనిఁ బుల్కపుల్కనం, గనుఁగొని మాటలం బొదవు గద్గదికం దలయూఁచి.'' మను. 2.66.

**పుల్లంటురాయి**

ఇంద్రనీలమణి.

శ. ర.

**పుల్లకట్టుగా మాటలాడు**

పుల్లవిఱుపు మాటలు మాట్లాడు.

విస్తళ్లు కట్టునప్పుడు పుల్లను పుటుక్కు పుటుక్కున విఱుచుట పై యేర్పడినపలుకుబడి.

''ఆవిడ యెప్పుడూ పుల్లకట్టుగా మాట్లాడుతూంటుంది.'' వా.

**పుల్లగూర**

పులుసు పెట్టి వండినకూర.

శ. ర.

**పుల్లనీళ్లు**

కూటినీళ్లు, తరవాణి.

**పుల్లయ్య వేమవరం (రామవరం) పోయి వచ్చినట్లు**

పని యేదో తెలుసుకోనకనే పోయి వచ్చునట్ల ఉపయోగించే పలుకుబడి.

ఇందులోని గ్రామం, ఇందులోని మనిషి పేర్లు ప్రాంతాని కా ప్రాంతంలో మారుతూ ఉంటాయి.

'ఉశేనప్ప తాడిమఱ్ఱికి పోయి వచ్చినట్లు' ఇత్యాదులు.

ఇంటియజమాని పక్కనున్న పల్లెకు పంపాలి అని రాత్రి అనుకుంటూ ఉండడం విని తెల్లవారుజామున్నే నౌకరు ఆ ఊరు వెళ్లి తిరిగి వచ్చా

డట. ఎక్కడికి వెళ్లావురా అంటె మీ రా ఊరికి పంపాలి అని అనుకున్నారు గదా. వెళ్లి వచ్చాను అన్నా డట. ఈ కథపై వచ్చిన పలుకుబడి.

**పుల్లరిమాన్యము**

పశువులు కసువు మేయుటకై ధర్మార్థము విడిచినబీడు.

"దేవరపసులకు పుల్లరి మాన్యమున్ను." సె. శా. 1.333.

**పుల్లవడు**

చప్పబడు అన్నట్లు రుచులనుబట్టి వచ్చినపలుకుబడి. పులుపు తగులగా ఎలా అవుతారో దానినిబట్టి భావం. ఇలాంటివే చప్పనగు, తియ్యనగు.

"పుల్లవడఁగ నేల పుల్లాంబుజాత, సల్లలితాస్య రా శయ్యకు నరుఁడు." పండితా. ప్రథ. పురా. పుట. 355.

దిగులుపడు.

"దీనదశకు వచ్చు తన సేనఁ జూచి యాచార్యుఁడు పుల్లవడ." పాండ. విజ. 34.

**పుల్లవిఱుగు**

సారహీన మగు.

"వారలతోఁ బలుమాఱును, బోరాటం బాడి యాడి పుల్ల విఱిగి యున్నారము." శేష. 1.113.

"ఈ యేడు మా దొడ్లో మామిడిచెట్టు పుల్ల విఱిగింది." వా.

**పుల్లవిఱుచు**

దిష్టి తీయు.

సామాన్యంగా పిల్లలు భయపడ్డా రనో, దృష్టిదోషం తగిలిం దనో అనుకున్నపుడు పిల్లలకు ఉప్పు చుట్టి వేసి దిష్టి తీస్తారు. మిరపకాయలు, నిమ్మకాయ, టెంకాయ మొదలయిన వాటిని కూడా దిగదుడిచి పార వేస్తారు. వానిలో ఎక్కువగా పొరక పుల్లలను చుట్టి వానిని విఱిచి పాఱ వేయడం అలవాటు. తద్ద్వారావచ్చిన పలుకుబడి.

"పెనుజీఁకటులు గ్రమ్మ పెల్లైట వసియించి, వెఱచెఁ గా యని పుల్ల విఱిచి విఱిచి." పాండు. 3.156.

**పుల్లాకు**

ఎంగిలి విస్తరాకు.

"చెలియా యివిప, ల్లాకులు పెంచిన కతమున, నో కడుఁ బుల్లాకుమేఁతనో వివరింపఁగ." చిత్రభా. 2.151.

**పుల్లావు**

కపిలగోవు.

"ఆ పుల్లావుశిరంబుఁ ద్రుంచి తెగదోయంచుఁగ బులిఁగ వెండియుఁగ." భాగ. 9.38.

**పుల్లవిఱుపు మాటలు**

ఎత్తిపొడుపు మాటలు.

"నీ పుల్లవిఱుపుమాటలు వింటేనే నాకు ఒళ్లు మండి పోతుంది." వా.

**పుల్లసిలు**

మనసున నొచ్చుకొను.

"తొలుత మాటలు పడి పుల్లసిలిన వాఁడు." వి. ప్ర. 4.87.

**పువ్వుం బరిమళము పోలె**

అవినాభావముగా.

"ఇవ్విధమున రుక్మిణి మదిఁ, బువ్వుం బరిమళముఁబోలెఁ బొలుపుగ నెతం, బువ్వాలు గలిగె." ఉ. హరి. 3.125

చూ. పూవుం దావియును బోలె.

**పువ్వుగట్టు**

వాసన కలిగించు.

"అభ్యంచిత కాంచన ప్రసవసౌరభ సమాగమునం బువ్వుగట్టి గంధవహుండు సవరించిన యందపుగందవాడి......" వసు. 2.11

**పువ్వుబెత్తులు**

పూలగుత్తులు.

"ఇ దెవ్వఁ డింపు నే నెత్తు వెలిపువ్వు బెత్తు కేలఁ బట్టుకొనె నంచుఁ జిడిముడి పడుచు..." శుక. 1.377.

**పువ్వులకోల సాచు**

ఆదరించు

"పగవాగు చేర్చి పారి పుచ్చక పువ్వుల కోల సాతురే" భార. సౌప్తి. 2 90.

**పువ్వుల నమ్మిన వీధినే పుల్లలమ్ము**

"పువ్వు లమ్మిన వీధినే పుల్ల లమ్మఁ, జేసితే దైవమా! యంచుఁ జింతించు." నలచ. 5.145.

చూ. పూవు లమ్మినచోటనే కట్టె లమ్ము.

**పువ్వులు చల్లినట్లు**

బాధ కలిగించు నవిగా కాక హాయిని కలిగించు నవిగా భావించు.

"అస్త్రాగ్రణి బాణపాతముల మాంసాహారవిదు ల్పాయుం, బువ్వు ల్చల్లినయట్లుగాఁ దలఁచి."

కా. మా. 2.54.

**పువ్వులు ముడుచు**

కొప్పులో పువ్వులు పెట్టుకొను.

"వెలయ విద్యా లంది వీడుకోళ్లు గుడిచి, నరఁబువుల్ ముడిచినపాపసాని." కళా. 7.85.

**పువ్వు పోయిన కన్ను**

కనుగ్రుడ్డులో తెల్లని కాయ కాచిన కన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

**పువ్వొత్తి**

దూదిని పొడవుగా వత్తివలె చేయక, కుదురున వెడల్పుగా పైన కూచిగా చేసే వత్తి. చిన్న కంచు చెమ్మాలలో వీటిని వేసి నేయి వేసి ముట్టిస్తారు.

**పుష్పములు ముడుచు**

పూవులు కొప్పులో పెట్టుకొను.

"తడి యార్చి పుష్పములు ముడిచి."

కళా. 7.65.

**పుసలాయించు**

బుజ్జగించు.
ఫుస్‌లానా (హిం)

**పుసుక్కున**

1. తుమ్ముటలోని ధ్వన్యను కరణం.
"నేను ప్రయాణ మవుతుండగా మా అబ్బాయి పుసుక్కున తుమ్మినాడు." వా.

2. తొందరపడి.
"మావాడు పుసుక్కున ఆ సంగతి వాళ్లతో చెప్పి వేశాడు." వా.

**పుస్తె గట్టు**

పెండ్లాడు.
"పుస్తె గట్టినయది మొదలు ప్రాంతఁ బోవు." రుక్మాం. 4.120.

**పుస్తెముడుపు**

1. మారుమనువు చేసుకొన్న స్త్రీ.

2. విడువరానిది. వదల్చుకొన శక్యము కానిది.
"ఈ ముసలాయన నాకు పుస్తెముడుపు. ఎక్కడికీ యిల్లు విడిచి కదలడానికి వీలు లేకుండా ఉంది." వా.

**ప్రాచినమోదు గగు**

రక్తప్లావిత మగు.
మోదుగు పూలు ఎఱ్ఱగా ఉండుటపై వచ్చినది.
"ఏచి నెత్తురు గ్రమ్మ నేపార మేను, ప్రాచినమోదుఁగు పొలుపార నతఁడు." ద్విప. కల్యా. 154.

**ప్రాచిన మోదువు తోడబుట్టువులు**

రక్తసిక్తము లై యెఱ్ఱగా నుండునవి.
మోదుగుపూవులు బహు ఎఱ్ఱగా ఉండును. రక్త సిక్తము లయిన శరీరాలను మోదుగుచెట్లతో ఉపమించుట కవిసమయము.
"పై పైఁ గ్రోచు రుధిరమునఁ దడిసిరి, ప్రాచిన మోదువుల తోడఁబుట్టువు లనఁగన్." ఉ. హరి. 3.63.

**ప్రాచి పట్టు**

మునుము పట్టు.
"మనము ప్రాఁచి పట్టి మొన వేర్చికొని పోవ." భార. భీష్మ. 3.5.

**ప్రాజనము చేయు**

ప్రాజించు
"గాంగేయుఁడు ప్రాజనము సేసెఁ గృష్ణున్." భాగ. స్క. 1.206.

**ప్రాజ యిచ్చు**

ప్రాజించు.
"వాసుదేవుఁడగ్ర, జడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁడెంతయుగ్ర, వెడఁగుదనంబునం బనిచె ..." భార. సభా. 2.9.

**ప్రాజల కెక్కు**

ప్రాజల కర్హ మగు.
"మొక్కులకుఁ దగుదుఁ బూజల, కెక్కినమంత్రార్థవిధుల కెల్లం దగుదున్." ఉ. హరి. 1.92.

**ప్రాజెకుండలు**

అయిరేని కుండలు.

"పూజెపండలు నిల్పెఁ బువ్వుఁబోఁడి యొకర్తు, శుభవితర్దికచతుష్కోణము లను..." శివరా. 2.56.

పూజె సేయు

కుండలపై చిత్రించు. లక్షణయా చిత్రించు.

"తురగఖరోద్ధూతధూళి దిక్కులఁ బ్రాకి, భుజగారి ఱెక్కలఁ బూజె సేయు." ఉ. హరి. 6.60.

పూజ్యము

శూన్యము.

లే దనుట. పూజ్య మనగా సున్న. దానిపై వచ్చిన పలుకుబడి. ఇది వాడుకలోనూ ఉన్నది. 'వాడికి చదువు పూజ్యం. వేషం మాత్రం మహా వేస్తాడు.' పాండు. 2.155.

పూటకాపవె అనక

నాకు నీవు బాధ్యుడవా అని యెదిరించక.

"పూఁటకాఁపవె నీవు పొమ్మని యనక." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1515.

పూటకు గతి లేని

ఒక పూట తిండికి కూడా లేని. రామచం. 41.

పూటకూటిల్లు

పూటకూళ్లు పెట్టేయిల్లు.

"సడలెం భానుఁడు పశ్చిమంబునకు వైశ్యా! పూటకూటింటికిన్, గుడువం బోవలె లెక్క యిచ్చి." క్రీడా. 155.

పూటకూళ్లమ్మ

పూటకూళ్లు పెట్టే వంటలక్క.

"పూటకూళ్లమ్మకుఁ బున్నె మేల." వేంక. శ. 13.

పూటకూళ్లు

డబ్బు తీసుకొని అన్ని వేళల్లోనూ పెట్టే అన్నం. శ. ర.

పూట పడు

ఒకరు ఇవ్వవలసినబాకీకి నేనిస్తా నని పూచీ పడు.

"ఖేదంబు వలదు నియమత, పోదానవఁ లితనిఁ జూపఁ బూఁట వడియెనే." భార. శాం. 6.369.

పూటపూటకు

రోజురోజుకు.

"వాని తలిదండ్రు లత్యంతవత్సలతను, బూఁటపూఁటకు గోముచేఁ బొసఁగఁగఁ బెంచి." హంస. 1.154.

పూటవాడు

పూటకాపు, పూచీ తీసుకొన్నవాడు.

"పెక్కండ్రు పూఁటవారలు, తక్కొకని మెయిపాళ్ల నరువఁ దగు నొకబాయం." విజ్ఞా. వ్యవ. 89.

పూటవెట్టు

పూచీ వహింప జేయు.

"ఎన్నిభంగుల నైనం, దెగఁ జూతుఁ

గాక విడుతునె, మగుడఁ గదే పూఁట
వెట్టి మా కిచ్చోటన్.''
నిర్వ. 10.20.

పూడిక లెత్తు
పూడ్చి పెట్టిన ధనములను పై కెత్తు.
''కల, ధనం చెల్ల పూడిక లెత్తి
చూపు గృహసురీతి.''
వర. రా. సుం. పు. 30. పం క్తి 10.

పూడుపాము
పుట్టిలో దాగిఉండే ఇరుదలల పాము.
వి. పు. 1.10.

పూతన తోడబుట్టు
''తాటకావధూటితల్లియొ? పూతన
తోడబుట్టొ?'' శుక. 3.19.
చూ. తాటకావధూటితల్లి.

పూతమాటలు
బూటకములు.
''పూఁతమాటలు గాక పోలు నే
సరి చేయఁ, గర్పూర మీతనూగంధ
మునకు.''
వరాహ. 9.101.

పూతసుద్దులు
పైపూతమాటలు.
లోపల గోడ ఎట్లున్నా పూతవల్ల తెల్లగా, నున్నగా నున్నట్లు కనబడును. పైకి అలా కనిపింప జేసే మాటలే పైపూతమాటలు. అనగా నిజస్వరూపమును తెలియనీ నివి.

''పూఁతసుద్దులు గాక పోల్పంగ
వచ్చునే, చందనం బీ మేని గందము
నకు.'' హంస. 1.210.

పూదె కట్టిన
బంగారు కరగి ముద్దగా ఏర్పడిన.
'కరువు కట్టిన' వలెనే ఇది కూడ శ్రేష్ఠతను, ఉత్తమతను సూచించును.
''కరచరణాదులు గలయోగవిద్య నాఁ,
బూదె గట్టినతత్త్వబోధ మనఁగ...''
కళా. 3.13.

....పూను
దయ్యమో దేవతో ఆవేశించు.
''పూని శిరోజముల్ కళల మోదుచుఁ
గొంకక పాశికింకరుల్ ..............
......శిర మల్లన నల్లాడుచుండ
మెండుగఁ బూనినపూనిక యడఁగి
......'' భద్రావత్య. 2.

పూనుగాడి
ఎద్దులు మొదలగు వాని మెడపై నుంచుకాడి.
''పూనుగాఁడి యంత భుజగంబు లో
నున్న, వెలఁగ్రమాని వెడఁద లోఁతట
నూపి.'' కేయూ. 4.74.

పూనూక
సన్నమైన నూక.

పూనూనె
సంపెఁగనూనె.

పూరికి గైకొనక
లక్ష్యము చేయక.

"ఆ, పోతర మేమి చెప్ప ననుఁ బూరికిఁ గైకొన కప్పరోవఘా, వ్రాతము." ప్రభా. 1.72.

**పూరిగఱచు**

ఓడు.

"చానవేనలితోడ సరి గాక యొడలిచూ, పుల దొరరతనము ల్పూరి గఱచె." నీలా. 2.20.

**పూరిపాము**

పసిరికపాము.

చూ. పూడుపాము.

**పూరి పుడకకు గొనక**

ఏమాత్రం లెక్కించక, లక్ష్యపెట్టక.

వాడుకలో:

'వాడు పూచిక పుల్లలాగా చూస్తాడు నన్ను.' 'వాడు పూచికపుల్లకు సరి కాడు' వంటివి.

"వాఁడు సిద్ధుం డిది షరరసం బనక, పోఁడిగా నొక పూరి పుడకకుఁ గొనక."

పండితా. ప్రథ. పురా. పుట. 479.

"అనుభావశక్తి బ్రహ్మాదుల నొకపూరి, పుడుకకుఁ గైకొనిపోతరీఁడు."

వరా. 2.180.

**పూరి మేయు**

ఓడిపోవు.

"లలన కనుదోయి ముందట..., హరిణంబులు పూరి మేయఁ దొణఁగెను."

నైష. 2.12.

ఓడిపోయినవారు ఏ తృణాన్నో నోటిలో పెట్టుకొనినప్పుడు అటువారు ఇం కేమీ చేయకుండా ఓటమిని అంగీకరించడం ఒకనాటి ఆచారం. ఇప్పటి యుద్ధాలలో తెల్ల బావుటా వంటిది.

చూ. పూరి గఱచు.

**పూరీ పుడకా**

పుల్లలు. జం.

బస. 3.65.

**పూర్ణానుస్వారం**

శూన్య మనుట.

"వాడికి చదువు పూర్ణానుస్వారం అని తెలియక మొదట వాడిని ఆశ్రయించాను." వా.

**పూర్ణాహుతి**

హోమ సమాప్తి యందు వేల్చు హోమద్రవ్యము.

**పూర్ణాహుతి యగు**

తనకు తానై ప్రాణము లర్పించు.

"పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్రం కోసం ఆమరణ నిరాహారదీక్ష అవలంబించి కడకు పూర్ణాహుతి అయ్యాడు." వా.

**పూర్వ మైనదయ తప్పకుము**

కొన్నాళ్లు కలిసి మెలిసి ఉన్న వారు విడిపోవునప్పుడు అను మాట.

నేటిరూపం: 'వెనకటి దయ తప్ప వద్దండి...ఉంచండి...'

**పూర్వరంగము**
కార్యానికి ముందు జరిగే తతంగం.
"దీనికి పూర్వరంగం చాలా ఉంది లే." వా.

**పూలంగి సేవ**
దేవుడికి ఒళ్లంతా పూలతో అలంకరించి చేయు సేవ.
అంగీ=చొక్కా. ఇది నేటికీ పశ్చిమాంధ్రంలో రోజూ విన పడే మాట.
"తిరుపతికొండమీద పూలంగి సేవ దర్శనం చాలా బాగుంటుంది." వా.
చూ. వజ్రాంగిజోడు.

**పూలచే రెత్తినట్లు**
పూలగుత్తి విచ్చినట్లు.
తామరతంపరగా అనుట.
"తరతరంబులఁ దామరతంప రనఁగఁ, బూలచే రెత్తినటువలె భూప్రజలకు, నుత్తరోత్తర మభివృద్ధి యొలయు చుండు, నెలమి నద్ధాత్రి దుష్యంతుఁ డేలునపుడు."
శకుం. (కృష్ణ) 1.114.

**పూల నేసినవాని గొట్టి ఱాల నేసినవాని గరుణించు**
ఉపకారిని పోనాడి అపకారిని నెత్తిన పెట్టుకొను.
"పూల నేసినవాని నిర్మూలపఱచి, ఱాల నేసినవాని హేరాళ మైన, లీలఁ గరుణించితివి." నిరంకు. 3.42.

**పూలముడుపు**
గర్భవతిగా ఉన్నప్పుడు చేసే పుష్పధారణం అనే సాంగెం.
శ. ర.

**పూలు దాలిచినచోటనె కట్టెలు మోయునట్లుగ**
చూ. పూవు లమ్మినచోట...

**పూవును దావియు బోలె**
అవినాభావముగా.
"ఈ వనజాయతాక్షులకు నిచ్చఁ బ్రియం బది గానఁ బూవునున్, దావియుఁ బోలెఁ జాలఁ బ్రమదం బొనరించిరి నాకు నెచ్చెలీ!" మను. 6.67.

**పూవునుం దొడిమయు చూపు**
పూవులను త్రుంచి తొడిమలను వేఱు చేయు.
అనగా శిరఃఖండనము చేయు.
"మురారి విరోధులఁ బట్టి పూవునుం, దొడిమయుఁ జూపకున్న నది ద్రోహము." ఉ. హరి. 4.210

**పూవు లమ్మినచోటనే కట్టె లమ్ము**
బాగా బతికినచోటనే కూటికి లేక కష్టపడు.
"పూవులు ముడిచినయంగళ్లనె, కల కల వీ డెల్ల నవ్వఁ గట్టెలు మోసెన్." పాండు. 3.21.

**పూవులలో పెట్టి....**
అత్యాదరంతో, ఇచ్చినది యిచ్చినట్టు.
"శాస్త్ర వెసులుబాటు కలగగానే నీ

డబ్బు నీకు పూవుల్లో పెట్టి తెచ్చిస్తాను.'' వా.

**పూవులలో పెట్టి పూజించు**

అత్యాదరంతో గౌరవించు.

''నువ్వు నీ కొడుకు కింట్లోనే ఉంటే పూవుల్లో పెట్టి పూజిస్తారు గా. ఎక్కడెక్కడో దేబిరించడం దేనికి?'' వా.

**పూవులు తుఱుము**

పువ్వులు వెండ్రుకలలో ముడుచు.

''జాదులు నెఱి గొప్పునం దుఱిమి త్రోవనె పోయితి మేని.'' పారి. 2.52.

**పూసకట్టు**

పూసలు పూసలుగా ఏర్పడు.

''వెన్న కాచిన నెయ్యి కనకనే బాగా పేరకొని పూసకట్టింది.'' వా.

**పూస గ్రుచ్చిన తెఱంగున**

వరుసక్రమముగా.

ఒకటి వెంబడి ఒకటిగా—దేనినీ విడిచి పెట్టకుండా.

''పూస గ్రుచ్చిన తెఱంగునన్... ప్రియునికిఁ జెప్పఁ దొడంగె.'' కాశీ. 5.175.

చూ. పూస గ్రుచ్చినట్లు.

**పూస గ్రుచ్చినరీతి**

వరుసగా.

''తెఱం గెల్లఁ బూస గ్రుచ్చినరీతిన్.'' విజయ. 2.79.

**పూసత్రాడు**

పశువుల మెడకు కట్టే కొలికి ముడి కలత్రాడు.

''పూసత్రాడు దుయ్యను లేదు పొలఁతి మెడకు.'' హరి. పూ. 5.219.

**పూసనాను**

ఒక రకమైన నగ.

''పొగడము పూసనా న్మెట్టె బవిర పడఁగ.'' వేం. పంచ. 4.416.

**పూసబొట్టు**

తాపటబొట్టు.

''రాగినగలు సదాచారరతియు దేవ, పూజ నిత్యాన్నదానంబుఁ బూస బొట్టు.'' శుక. 2.145; 406.

**పూసయెముక**

వెన్నెముక, వెన్నుపూస.

''చేవోయి కుఱుచ యై చెవులు విల్వంక యై, పూస యెమ్ముకములు బొందుకట్టె.'' కాశీ. 6.41.

**పూసలలో దారము**

అన్యోన్యముగా — కలసిమెలసి.

''కలకాల మొక్కగతిఁ బూసలలో దారంబుమాడ్కి.'' పారి. 1.93.

**పూసలలోన దారంబుక్రియ**

అన్నిటా అనుస్యూతమై కలగలిసి పోయి.

''పూరితంబై యొప్పు పూసలలోన, దారంబు క్రియఁ బురాతనభక్తవితతి, చరితలలోపల సంధిల్ల బసవ, చరిత మే వర్ణింతు.'' బస. 1.4.

**పూసలవాడు**

రత్నములను సానపట్టేవాడు. ఆం. భా. 2.289.

**పూసిగొండి**

ఇతరుల పనులను నెత్తిమీద వేసుకునేవాడు.

**పూసిగొండితనము**

తనకు లేని సంబంధం కల్పించుకొనుట.

"పూసిగొండితనానఁ బోయి యెవ్వరికైన, గొడవలు గావించుకొండె గాఁడు." వరాహ. 9.26.

**పూసి తొడి కట్టు**

వస్త్రమాల్యాభరణాదులను ధరించు.

"కృష్ణునిచేత విని పూసి తొడి కట్టి కొలు విచ్చె." భార. శాంతి. 1.346.

**పూసినతంగేడువలె**

నిండుగా – కన్నుల కింపుగా. మానిసి. 69.

**పూసుకు తిరుగు**

అతి యిష్టంతో వెన్నంటి యుండు. కొత్త. 80.

**పృథివిలో లేదు**

లోకంలో లేదు.

"ఇలాంటి వ్యవహారం పృథివిలో లేదు." వా.

**పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు**

పంచభూతాలు.

**పృష్ఠోష్ఠపర్యంతముగ తిను**

చెడ తిను.

"పరు లుబ్బి పృష్ఠోష్ఠపర్యంతముగను, చెరుఁగు వంటకము పేర్వెఁడు దిన లేదు." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 523-24. చూ. చెడ తిను.

**పృష్ఠోష్ఠపర్యంతము మెక్కు**

అతిగా తిను.

"ఒరు లుబ్బఁగఁ బృష్ఠోష్ఠపు, బరియంతము మెక్కి మెక్కి పలుకులు పలికే, ధరణీబృందారకులకుఁ, దరమే సంగ్రామవిధము ధరణీసలిలో." శశి (అప్ప) 4.

**పెంకుగట్టు**

గట్టి పడు.

"ఆ కొబ్బరికాయ యింకా పెంకు గట్ట లేదు." వా.

**పెంకెజెల్ల**

నంగనాచి.

నారాయణదాసు సావిత్రి చరిత్ర.

**పెంకెతనం**

మొండిపట్టుదల.

"వాని పెంకెతనం రోజు రోజుకూ మితిమీరి పోతోంది." వా.

**పెంకెపురుగు**

బియ్యము, చిట్టు మొదలయినవానికి పట్టే ఒక రకమైన పురుగు.

**పెంచి పిసికి**

చాకి సంతరించి.

"పంచకరపాట్లు పడి తన్నుఁ బెంచి పిసికి." కాశీ. 4.18.

**పెంచుల బేరి**

ఒక రకమైన ఆట.

"పెంచులబేరి దోపిళ్లు గాలిపటంబు,
సరిబేసి పుటచెండు చాకిమూటి."
హంస. 3.146.

**పెంటగట్టు**

పెంటకై మందగట్టు.
శ. ర.

**పెంటపట్టు**

దొడ్డి. పశువులు నిలిచి పేడ వేసేచోటు.

"పెంట్రికలు పెట్టుపెంటపట్టునకు వచ్చి..."
మను. 4.37.

**పెండారిమూక**

అల్లరిజనము.

**పెండిలిపెద్దలు**

పెండ్లి కుదుర్చువారు; నిర్వహించువారు.
హర. 4.64.

**పెండెకట్లు**

గీతలు.

విభూతి పెండెకట్లు అని వాడుక. వరిగడ్డి పెండెలు కడతారు. వానివలె ఉన్న వని వచ్చిన భావార్థం కావచ్చు.

"తెలుపారుబూది నొసలనిండ మెత్తి,
కలయఁ జేతులఁ బెండెకట్లుగాఁ బూసి
..."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 116.

**పెండెముడువులు**

ఒక రకమైన ధాన్యము.
ప్రబంధ. 112.

**పెండ్లాడు**

వివాహ మగు.

"వాడు తన మేనకోడలినే పెండ్లాడాడట!"
వా.

"నిన్నెవరు పెండ్లాడతారే? ఇంత గయ్యాళివి."
వా.

**పెండ్లికి పోవునట్లు కనబడు**

ఆనందముతో కానవచ్చు.

పెండ్లికి పోవువారు సహజంగా ఆనందంతో ఉంటారు కనుక.

"పెండ్లికిఁ బోవునట్లు గన్పట్టుచు
నున్నదాన వతిభవ్యవికాసము నుబ్బఁ
జూడ నిక్."
కళా. 4.187.

**పెండ్లికుండలు**

అయిరేనికుండలు.
శ. ర.

**పెండ్లికూతురు**

వధువు.
హర. 4.66.

**పెండ్లి కెదుగు**

పెండ్లియీడు వచ్చు.

'పెండ్లి కెదిగినపిల్ల' – 'మా పిల్ల పెండ్లి కెదిగింది' అని నేటికీ వాడుక.

"అంత నది యింతయై యంతయై
వినూత్న, పేశలాకారయై మించి
పెండ్లి కెదుగ."
శుక. 2.152.

**పెండ్లికొడుకు**

వరుడు.
హర. 4.66.

**పెండ్లిగుమ్మడి**
బూడిదగుమ్మడి.
శ. ర.

**పెండ్లిచవికె**
వివాహమండపము.

**పెండ్లి చేయు**
శాస్తి చేయు.
"వాడు ఆ ఊళ్లో యిలాగే వెధవ చేష్టలు చేసేసరికి పెళ్లి చేసి పంపించారు." వా.

**పెండ్లిదొర**
పెండ్లిపెద్ద.

**పెండ్లినడలు నడుచు**
మెల్లగా నడుచు.
వివాహంలో వధూవరులు ఊరేగునప్పుడు మెల్లగా నడవడం అలవాటు. దానిమీద వచ్చినపలుకుబడి.
"సీటు వాటిల్ల నరిగలనడఁ బెండ్లి, నడల నవ్వీధి కరిగె నప్పుడమిజేసు." శుక. 2.15.
"ఇలా పెండ్లినడకలు నడిస్తే మన మా ఊరెప్పటికి చేరుకో గలం?" వా.

**పెండ్లిపీట**
పెండ్లిలో వధూవరులు కూర్చొను పీట.

**పెండ్లిపెద్ద**
పెండ్లి పెత్తనము వహించిన వాడు.

**పెండ్లిపెద్ద లగు**
పెండ్లిక పెత్తనము వహించు.
"తోడ్కొని రండు పోయి గాంధర్వ వివాహలీలప మురమ్మున మీరలె పెండ్లిపెద్దలై." ప్రభా. 5.12.

**పెండ్లి పేరంటము**
శుభకార్యము.
"పెండ్లిపేరంటంబు పెం పొందవైతి." ప్రభులిం. 10.83.

**పెండ్లి పేరంటములు**
శుభకార్యములు. జం.
"పెండ్లి పేరంటముల్ ప్రియ మెలర్పఁగఁ జేసి." శివ. 1.7.

**పెండ్లియరుగు**
వివాహవేదిక.
"పెద్దింటిలో నుండి పెం పారఁగాఁ బెండ్లి, యరుగుమీఁదికి వచ్చి..." వీర. 3.178.

**పెండ్లి యాడు**
కలిసిపోవు. వివాహ మాడు.
వివాహము చేసుకొన్నప్పుడు ఇద్దఱు కలియుట ఉన్నది. తద్ద్వారా లక్షణయా వచ్చిన పలుకుబడి. అర్థం కలిసిపోవు.
"బీటెండ కేయెండ పెండ్లి యాడ." పాండు. 2.152.

**పెండ్లివీడియము**
నిశ్చితతాంబూలము.
"ఎంతయుఁ, గెలివిన్ దానికిఁ బెండ్లివీడియము సాఁగింపన్ మదిన్ జూచెనో." చంద్రా. 4.154.

**పెండ్లీ పెటాకులూ లేవు**

అవివాహితుని గూర్చి నిరసనగా అనుమాట.

"వాడి కేం? పెండ్లా పెటాకులా? ఎక్కడ బడితే అక్కడ తింటాడు. ఎక్కడ బడితే అక్కడ ఉంటాడు." వా.

**పెందగడియలు**

ఆయుధవిశేషములు.

స్పష్టంగా తెలీదు. చూ. పదార్థసూచిక.

ఆకాశబాణము లని సూర్యా. నిఘంటు.

"పటుగతిఁ జను గాలి పడగలతోడఁ, గడు వేగమునఁ బెందగడియ లెగసె." కుమా. 11.51.

**పెందలకడ**

పొద్దు పోక మునుపు.

"పెట్ట నోపితివా యెప్పటట్ట యుండు, పెట్ట లేకున్న విచ్చేయు పెందలకడ." వైజ. 3.103.

రూ. పెందలాడ.

**పెందలాడ**

చూ. పెందలకడ.

**పెందిరువడి**

గరుత్మంతుడు.

ఆము. 4.11.

**పెక్కిండ్ల విందు నిండుకొన్న ఆకలి**

ఎంత తిన్నా తీరని ఆకలి.

"నెట్టనఁ బెక్కిండ్ల విందు నిండుకొన్నయాఁకలి." తాళ్ల. సం. 10.24.

**పెక్కు నోళ్ళవాడు**

మాట నిలుకడ లేనివాడు.

"ఏంటి కపాలి తనయుని, కొంటెతనము వీరి మానిక కుటిలాలకన, క్కుంటుపకు నిత్తు రఁట యిటు, వంటివి పో పెక్కునోళ్ల వారల మాటల్." భోజ. 5.

**పెచ్చు పెరుగు**

ఎక్కు వగు.

"నిచ్చలోన మచ్చరంబు పెచ్చు పెరుఁగక యుండదు..." కళా. 3.264.

**పెటపెట**

ధ్వన్యనుకరణము.

"పెటపెటనఁ బండ్లు గీటుచు పెలుఁ జూపె." కవిక. 2.159.

**పెట్టకుక్క**

ఆడుకుక్క.

"ఆలలన యిల్లు వెడలెక, గోలయుఁ బలె నొక్క పెట్ట కుక్కం గొనుచున్." శుక. 2.33.

దీనికి వ్యతిరేకము పోతుకుక్క. పోతు—పెంటి.

**పెట్టనికోట**

రక్షకము.

"వినుము కౌరవకోటికిం దన విల్లు పెట్టనికోటగా." భార. స్త్రీ. 2.174.

**పెట్టబీరము**

ఆడుదాని పరాక్రమము.

కోళ్ల పందెంమీద వచ్చిన పలుకుబడి.

కోడిపుంజే పోరాడును కాని పెట్ట అసలు పోరాడ లేదు.

"ఆ కీదల కేల బోగుబడి పెద్దతికం బును జెట్టిరముస్.
ఉ. హరి. 4.160.

**పెట్టింది చట్టం**

వీడు చెప్పినట్లే సాగుతుంది. అయినా అది అంత సరి కాదని సూచిస్తూ అనేమాట.

చట్టం 'సట్టం' అన్నట్లే ప్రచు రంగా వినవస్తుంది.

"ఆ యింట్లో వాడు పెట్టింది చట్టంగా ఉంది. కా దనే పురుగు లేదు" వా.

**పెట్టితే పెండ్లి**

వాడికి యిచ్చినంతవఱకే మంచి మాట్లాడతాడు. లేనప్పుడు శపిస్తాడు అన్న సందర్భంలో ఉపయోగిస్తారు.

"ఆ. వాడి కిస్తున్నంతవరకే మనమంచి. పెట్టితే పెండ్లి లేకుంటే దివసం అనే రకం." వా.

**పెట్టినచెట్టు**

తన స్వాధీనములోనిది.

"మీ పెట్టినచెట్టినజుఁడు, మీపం పానరింపఁ గలఁడు మిత్రత నెఱయన్, నే పుచ్చినాఁడు సకల ది, శాపథము లకుఁ గపిపతులఁ జయ్యనఁ దేరన్."
భాస్క. కిష్కిం. 487.

**పెట్టినదినములు**

దానధర్మాది కార్యాల ద్వారా సంపాదించుకొన్న పుణ్యం ఉన్న రోజులు.

సుమతి. 85.

**పెట్టినదే భిక్షము**

దీనికి మూలకారణ మతడే అనుట.

"సకలకృత్యములందుఁ దాఁ బెట్టినదే భిక్ష మనుచు తేని నధిక్షేపించుచు."
ధర్మజ. 9.5.

"వ్యాకరణంలో పాణిని పెట్టినది భిక్ష." వా.

**పెట్టిన పీటన యుండు**

ఎక్కడ పెడితే అక్కడే యుండు, కదలకుండా ఉండు.

"పెద్దల కెల్లఁ బాటనయి పెట్టినపీఁటన యుండ నైతి నా, బుద్ధులు తప్పె..."
ఉ. హరి. 5.157.

**పెట్టి పుట్టు**

సుఖంగా జరుగుటకు తగిన పుణ్యం చేసుకొను.

"వాడు పెట్టి పుట్టాడు. ఏం చేయకున్నా జరిగి పోతూ ఉంది." వా.

**పెట్టి పోవు**

వదలి చను.

చనిపోవునప్పుడు వదలి పోవు.

"తగిలి నా జీవమునకు నాధార మైన, నీవు ననుఁ బెట్టి పోఁ జన్నె భావజన్మ?"

"వాడు పోతూ పోతూ నన్ను పెట్టి పోయినాడు." వా.

"అయ్యో మా ఆయన నన్ను పెట్టి వెళ్ళి పోయా డమ్మా..." వా.

**పెట్టిపోతలు**

పోషణ.

"పెట్టిపోఁతల సోఁగసాని సెట్టిసాని, యింటికడనుండి యట్టాడు బంటు వాఁడు..."
శుక. 2.208.

చూ. పెట్టుపోతలు.

**పెట్టిపోయు**

అన్నాదు లొసగి పోషించు.

"పెట్టిపోసిననాఁడె చుట్టాలచేరిక, కలిమి గల్గిననాఁడె కాంతవలపు." రామలిం. 77.

**.... పెట్టు**

సమానము.

'వాడు ఒక్కడూ. పదిమంది పెట్టు' ఇత్యాదులు.

**పెట్టుకొని యుండు**

వేశ్యను ఉంచుకొను

"మనము పోవచ్చునో దాని ఘనుఁ డెవఁడును, బెట్టుకొని యుండఁడో వాని కట్టు లేదో." పాణి. 2.75.

**పెట్టుకోక**

దాపుడుచీర.

రోజువారీ కాక ఏ పండుగకో, పబ్బానికో కట్టుకొను మంచిరకం చీర.

"దానికి కట్టుకోకలే లేవు. ఇంక పెట్టుకోకలు ఎక్కడనుంచి వస్తాయి?" వా.

**పెట్టుజెట్టు**

తాను వృద్ధికి తెచ్చినది.

"పెంచి తను పెట్టుఁజెట్టు పెఱికి వేయ రెవ్వరు, మంచివాఁడఁ గాకున్న మన్నించకుండేనా." తాళ్ల. సం. 8.70.

**పెట్టుపోతలు**

పోషణ. జం.

అన్నము పెట్టుట, నీరు పోయుటద్వారా యేర్పడినది.

"పుట్టినిల్లని పెట్టుపోఁత లాసించిన, యక్కచెల్లెండ్రెంత యడల వలయు."

"పెట్టుపోఁతల కాగ సాని పెట్టిసాని, యింటికడనుండి యక్కాడు బంటు వాఁడు." శుక. 2.208.

"వాళ్లతల్లి ఉన్నంతకాలం వాడికి పెట్టుపోతల కేమీ ఢోకా లేదు." వా.

**పెట్టుమందు**

వశీకరణార్థమై తెలియకుండా అన్నంలో కలిపి పెట్టే మందు.

"దుర్మతమున సిద్ధురాలికిఁ గ్రమంబునఁ జెప్పినఁ బెట్టుమందు నీపతి కిది పాలతో నిడుము భర్త వశుం డగు నంచుఁ బల్కఁగా." రుక్మాం. 7.237. రాజగో. ౪. 76.

**పెట్టువోతలు**

చూ. పెట్టుపోతలు.

**పెట్టెబండి**

గూడుకు బదులుగా పెట్టె అమర్చినబండి.

**పెట్టెలో సొమ్ము**

కొంగుబంగారము వంటిది.

"గా, నమ్మ మాపెట్టెలో సొమ్ము గాదె." శ్రవ. 2.80.

చూ. పెట్టెసొమ్ము.

**పెట్టెవెట్టు**

పెట్టెవలె (పాము) చుట్టుకొను.

"పీఠరూపంబునఁ బెట్టెవెట్టిన శేషు, ఫణరత్నఘృణులకుఁ బ్రాఁకు వెట్టు." పాండు. 4.250.

**పెట్టెసొమ్ము**
కొంగుబంగారమువంటిది.
"క్షత్రియజాతికిఁ బెట్టెసొమ్ము."
పాణి. 1.55.
రూ. పెట్టెలో సొమ్ము.

**పెట్టేచేయి**
దాన మిచ్చుటకు అలవాటయినచేయి.
"వాడిది ఎప్పుడూ పెట్టేచేయే." వా.

**పెట్లమారి**
దెబ్బలు తినే స్వభావం కలవాడు.
"కోరి బంతులఁ జాల గుణవంతము లటంచుఁ, బెట్లమారుల నీడు పెట్టఁ దగునె." చంద్ర (శ. ర.)

**పెట్లుగ్రోవి**
అదురువేటు గొట్టము.

**పెట్లుప్పు**
వేడిమిచే బ్రద్దలయ్యే ఒక దినుసు ఉప్పు.

**పెడకట్టె**
మూర్ఖుడు.
చూ. పెడసరకట్టె.

**పెడకట్టె మాట**
కట్టెవిఱుపు మాట, పెడసరపు మాట.

**పెడకేలు కట్టు**
చేతులు వెనుకకు విఱిచి కట్టు.
కుమా. 2.79.
నేటి వాడుకలో: 'చేతులు విఱిచి కట్టి మూల పడవేయి.'
చూ. పెడతెక్కలు కట్టు.

**పెడకోరిక**
తగనికోరిక.

**పెడచెవిని బెట్టు**
శ్రద్ధతో వినక పోవు.
"బహువిధంబులఁ బలుకు నా పలుకు లెల్లఁ, జీదక న్నిడి తన పెడచెవులఁ బెట్టి." భార. ఉద్యో. 4.76.

**పెడచేత వేయు**
ఎడమచేత కొట్టు.
"కరువలిపుత్రుండు కైకొక వానిఁ, బెడచేత వేసిన భీతిల్లి మిగుల."
మైరా. పు. 40.

**పెడతలగండడు**
పెడసరపుమనిషి.
"పెనుపాప పగవాఁడు పెడతలగండఁడై, యుండ నీ మదవృత్తి యుడుగ వేల?" రాజశే. 3.148.

**పెడతల బట్టు**
వ్యత్యస్త మగు.
"భీకరవర్తనుల సుఖము పెడతలఁ బట్టున్." నిరంకు. 2.39.
"వాడిబుద్ధి పెడతల బట్టింది. అంచేతే వాడీ పని చేశాడు." వా.

**పెడతల బడిన కన్నులు**
పీక్కుపోయిన కండ్లు.
పండి. ద్వితీ. పర్వ. పుట. 315.

**పెడదారి పట్టు**
తప్పుదారి పట్టు.

"జడదారి పెడదారిఁ జనక తివురు."
పాణి. 2.71.

పెడబాయు

ఎడబాయు, విడుచు.

"కాశికా, నగరంబున్ బెడఁబాసి."

పెడబొబ్బ లిడు

పెద్దగా అఱచు.

"నగరు తల్లడ మంద నాతులు బెదర, భీకరంబుగ నార్చి పెడబొబ్బ లిడిరి."
పల్నా. 99-100 పం.

పెడమర్లుగా బొడపెట్టు

"ఇలమీఁదఁ దల దాఁక నీ ప్రక్క నా ప్రక్కఁ, బెడమర్లుగాఁ బొడపెట్టి పెట్టి."
కా. మా. 2.148.

పెడము వెట్టు

ముఖం అవలివైపుకు త్రిప్పు.

"పుత్రుఁ బాకముఁ జేసి బోనము వెట్టినఁ, గుడువంగ నొల్లక పెడము వెట్టె."
హర. 1.14.

పెడమొగ మగు

మాఱుమొగము పెట్టు.

"ప్రేమము పేర్మి బాష్పముల్, గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొగం బయి కన్నుల నీరు గ్రుంగుచున్."
పి. శకుం. 4.84.

పెడమొగము వెట్టు

విముఖత గనఁబఱచు.

"వెండియుం జిట్టకంబులకుం బెడ మొగంబు, వెట్టుకొని పట్టఁ బట్టం బోవు ప్రాణభర్తల వెంటంబడి."
మను. 3.28.

పెడమోము వడు

మాఱుమొగము పెట్టు.

"క్రేలుచుఁ బఱతెంచుఖగురంబు నని మొనఁ, బెడచేతఁ బెడమోమువడఁగఁ జేయు."
నృసిం. 2.116.

పెడయాకుల బెట్టు

ఆకుల పాలు చెందించు, చీకాకుపఱచు.

"కూర్మి యెల్ల నేఁ, డాలము సేసి నన్నుఁ బెడయాకులఁ బెట్టె."
కుమా. 11.55.

పెడయుక్తులు

కుయుక్తులు.

గీర. 18.

పెడరేచు

ప్రోత్సహించు, విజృంభించు.

"మృత్యువు పెడరేప మే లని నన్ను... తెచ్చితివి."
వర. రా. అర. పు. 206. పం. 20.

"రేపు మాపుఁ బెడ రేచఁగా తోపు సేయఁగ రాల్."
తాళ్ల. సం. 5.153.

పెడరెక్కలు కట్టు

చేతులు వెనుకకు విఱిచి కట్టు.

"వాణ్ణి పెడరెక్కలు కట్టి నానా హింసా పెట్టారు." వా.

పెడవట్లు

పెడ = ప్రక్కన ఉన్న పట్టులు కావచ్చును. చఱియలు—కొండ గనుక.

"ఇందుల పెడవట్లు నందనోద్యాన, మందారముఖ్యసంక్రందనతరులు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 241.

పెడవాకిలి

దొడ్డివాకిలి.

"వల్లువ మెత్తికొంచుఁ బెడవాకిట వెళ్లిననాఁటనుండి.

క్రీడా. పు. 23.

పెడవాడన వైచు

వేరు పెట్టు.

"...పదిమాళ్లకుఁ గొన్నతొత్తు మ,ద్వనిత కలంచెనేని పెడవాడనె వైవనె యింత యేటికిన్." శుక. 3.137.

పెడవాడ బెట్టు

బహిష్కరించు.

"వెట్ట సంసార మిది వెంకటేశుని గొలువని, వట్టి మనుజుల పెడవాడఁ బెట్టుఁ గాక." తాళ్ల. సం. 5.119.

పెడవావి

తగనిసంబంధము.

"వెడవిలువాఁడు నన్ బరిభవించె నీఁకన్ నిను మానఁజాల నెక్కడి పెడవావు లెన్నెదవు కామిని..."

ఉ. రా. 4.214.

పెడవెట్టు

పరాఙ్ముఖ మగు.

"పెడవెట్టుకొఁడెలు పెంపెల్లఁ బొలిసి, యడవెట్టుకొనుచు నోం గ్రనుచు గ్రుక్కఁగను, వడిగట్టి వైవ."

అ. మ. క. 5.260.

పెడసరకట్టె

మూర్ఖుడు.

చూ. పెడసరపుకట్టె.

పెడసరపు కట్టె

మొండివాడు.

"వాడు ఒట్టి పెడసరపుకట్టె. వాడితో వేగడం చాలా కష్టం." వా.

పెడసరపు మనిషి

ఎవరి మాటా వినని వాడు.

"వాడు చాలా పెడసరపుమనిషి. వాని దగ్గరకు పోతే అయ్యేపని కూడా కాకుండా చేస్తాడు." వా.

పెణ్ణాస

స్త్రీవాంఛ.

"ఉణ్ణాముల జగదంబిక, నణ్ణామల విశ్వనాథు నారాధించెన్, మణ్ణాస యుఁ బొన్నాసయుఁ, బెణ్ణాసయు లేని వారి పెన్నిధు లగుటన్."

కా. మా. 3.185.

పెతరులపుడమి

శ్మశానము.

పెదగంగయుదకము

అలభ్యము.

చూ. ఏటావలి గిలిగింతలు.

పెదవికి మించిన పల్లు

మితి మీఱి పోయినమనిషి.

"వీడు పెదవికి మించినపల్లయి పోయాడు. ఇంక మనం అదుపులోకి తే లేం." వా.

పెదవి విఱుచు

నిరాశను సూచించు.

"అని యడుగుచుండ బాలిక, కనునులుముచుఁ బెదవి విఱిచి కటకట! వాపోయెను." కళా. 6.180.

పెదవులు దడుపు

భీతిని తెలుపు.

భయ మందినవాడు పెదవులు తడుపుకొంటాడు.

భయసంభ్రమాదులను తెలిపే అంగవిక్రియ.

"పెదవులు దడుపుచుఁ బదములు, గుదిగొన..." ఉ. హరి. 3.136.

"నో, రెండం బెదవులు దడుపుచు, నొం డేమియు ననక మిన్న కున్నం గరుణన్." కా. మా. 4.170.

"డిండి చాణూరముష్టికుల రప్పించి, దండడిఁ బెదవులు దడుపుచుఁ బలికె." ద్విప. మధు. పు. 16.

## పెదవులు నాకు

ఆశపడు.

## పెద వెత్తు

మాటలాడు.

నోరెత్తు లాంటిది.

"పెద వెత్తి ఫల మేది ప్రియ మాడు దాఁకను." తాళ్ల. సం. 5.262.

## పెదాలు పుక్కిట బెట్టు

మిన్నకుండు.

"పెదాలు పుక్కిటఁ బెట్టెఁ గలశాపుర హనుమంతుఁడు." తాళ్ల. సం. 10.167.

## పెద్దంబళ్ళపొద్దు

దాదాపు పన్నెండు గంటలు. రైతులూ, కూలీలూ అంబళ్లు త్రాగు సమయం తొమ్మిది గంటలు. దాని నేమో చిన్నంబళ్లప్రొద్దనీ, మిట్ట మధ్యాహ్నాన్ని పెద్దంబళ్ల ప్రొద్దనీ అంటారు.

చూ. అంబళ్లప్రొద్దు.

## పెద్ద కాదు

అదేం గొప్ప కాదు.

'ఇ దొక పెద్ద కాదు రా బాబూ' అని వాడుక.

"కర మభిలాషులై బహుముఖంబులఁ గూర్చినఁ బెద్ద గాదు..." కుమా. 8.167.

## పెద్దకాపు

గ్రామాధికారి.

## పెద్దకులము

వ్యతిరేకలక్షణచే చండాల కుల మనే అర్థంలో వాడుకలో ఉంది.

## పెద్ద కొండ సేయు

చాలా గొప్పగా చేయు.

చిన్నదానిని పెద్దదిగా భావించు.

"...కులహీను లెంగిళ్ళుఁ గూడంగఁ దేవి, బండి నిండఁగఁ బోసి పైఁ జీర గప్పి, తండుఁ జేకొని పెద్ద గొండ సేసెదరు." బసవ. 7.185.

## పెద్దగ జూచు

గౌరవించు.

"పిన్నట నాఁటనుండి నను బెద్దగఁ జూచినవంశవృద్ధులన్, మిన్నక చంపి..." జై. భా. 1.59.

## పెద్దగుమ్మడి

పెండ్లిగుమ్మడి. శ. ర.

**పెద్ద చేయు**

గౌరవించు.

"అతులమహానుభావ మని యవ్వీరిఁ దా నొక పెద్ద సేసి." పారి. 1.84.

"వాఁ డేదో అందరిలో నిన్ను పెద్ద చేసి గౌరవిస్తా నంటూ ఉంటే నువ్వింకా ఏవో పూర్వద్వేషాలు మనస్సులో పెట్టుకొని రా నని భీష్మించుకోవడం ఏ మంత సబబుగా ఉంటుం దో నీవే ఆలోచించు." వా.

**పెద్దతల**

చూ. పెద్దతలకాయ.

**పెద్దతలకాయ**

1. పెద్దవాడు.

మాటా. 53.

2. ప్రముఖుడు.

"వాళ్ల యింట్లో వాడే పెద్ద తల కాయ." వా.

"ఆ ఊళ్లో ఆయనే పెద్ద తలకాయ. ఆయన చెప్పితే ఎవరూ ఎదురు చెప్పరు." వా.

**(పిల్ల) పెద్ద దగు**

రజస్వల యగు.

"ఎదురింటివాళ్లమ్మాయి పెద్ద దయి అప్పుడే సంవత్సరం కావచ్చింది." వా.

**పెద్దనక్క**

చిఱుతపులి.

రాయలసీమలో అడవులున్న ప్రాంతాలలో ఉపయోగించే పలుకుబడి.

"పెద్దనక్క రాత్రి ఆవుదూడను ఈడ్చుకు పోయింది." వా.

**పెద్దనిద్దుర వోవు**

చనిపోవు.

**పెద్దపక్కి వాలిన గృహము**

మైల పడిన దనుట.

బొంతగద్ద వాలితే ఆయిల్లు వదలవలె నని అంటారు.

నమశ్శి. 66.

**పెద్దపిడుగు**

పిడుగువలె నాశకము.

"పెంపుడుకూఁతుం డ్ర పెద్దపిడుగు." శుక. 3.20.

**పెద్ద పిన్న యంతరువు**

పెద్ద పిన్నల తారతమ్యము.

చూ. పెద్దా చిన్నా లేదు.

**పెద్దపెద్దలు**

మహామహులు.

"పెద్ద పెద్దల మనములే బిగువు చెడఁగ." శ్రవ. 3.11.

**పెద్దపొల**

1. నరమాంసము.

"...మాటిమాటికి మానిసి కాటు మరగి తెరువులు గాచి కాచి డగ్గుతిక వడఁ దిను పెద్దపొలవలనఁ బుటపుట నై త్రుప్పు డుల్లి త్రుళ్లి." మను." 4.37.

2. గోమాంసము అని.

బ్రౌన్.

**పెద్దమనసు చేసుకొని**

ఉదారబుద్ధితో.

"పెద్దమనసు చేసుకొని ఈ కార్యం

సాగ నీయండి. అవీ యివీ మనసులో పెట్టుకో వద్దు." వా.

చూ. పెద్దమనసు చేసికొను.

## పెద్దమనసు చేసికొను

చూ. గొప్పమనసు చేసుకొను.

## పెద్దమనుష్యుడు

మర్యాదస్థుడు.

"నలుగురు పెద్దమనుష్యులను దగ్గఱ పెట్టుకొని ఈ వ్యవహారం తేల్చుకోవా లనుకుంటున్నాను." వా.

## పెద్దమాంసము

గోమాంసము.

"తినియెడిది పెద్దమాంసము, కొనియెడి యది కల్లు మనసు క్రొవ్వె ట్టుడు గున్." శివరా. 4.15.

## పెద్దమ్మ

జ్యేష్ఠాదేవి, ఈమె లక్ష్మీదేవికి అక్క అని ప్రతీతి.

"పెద్దమ్మ నాట్య మాడుత, దిద్దిమ్మని వత్సవాయి తిమ్మని యింటన్." చాటువు.

## పెద్దమ్మ యిల్లు

దారిద్ర్యనిలయము.

"పెద్దాపురముకోట పెద్దమ్మ కి ల్లౌట." శ్రవ. 1.103.

## పెద్దమ్మవారు

మశూచికము.

"ఆ ఊళ్లో పెద్దమ్మవా రుం దట. అందుకని పిల్లలను పంపడం మానేశాను." వా.

## పెద్దయింటివాడు

కులీనుడు.

"అచట నొకరెడ్డి వెలయు వాలాయముగ దగెడి, పేరు గలవాడు కులములోఁ బెద్దయింటి,వాఁడు..." శుక. 2.407.

## పెద్దయుం బ్రొద్దు

చాల సేపు.

"వేడుక నాడమఁ బెద్దయుం బ్రొద్దు ముద్దాడుశాకిని ఢాకినుల కలకలంబును." కా. మా. 2.63.

## పెద్దల జేయు

గృహస్థధర్మమునందు ప్రవేశ పెట్టు.

"పెద్దలఁ జేయఁగ వలె నీ, ముద్దుల జవరాలి నజాని ముచ్చట లెసఁగన్, బెద్దల యనుమతిచే నని, తద్దయు మదిలోనఁ బొడము తాత్పర్యమునన్." ఇందు. 6.117.

## పెద్దల జేరు

చూ. పెద్దలలో కలియు.

## పెద్దలలో కలియు

చచ్చు.

"రామిరెడ్డి పెద్దల్లో కలిసి మూడు సంవత్సరాలు కావస్తూంది." వా.

## పెద్దరోగము

కుష్ఠువ్యాధి.

శ. ర.

"వాళ్లయింట్లో యెవరికో పెద్దరోగం ఉండే దట. అందుకని ఆసంబంధం ఎంతమాత్రం పనికిరా దని అమ్మ పట్టు పడుతూంది." వా.

## పెద్దవాకిలి

దేవాలయాదులలోని ముఖ్య ద్వారము, గోపురద్వారము.

శ. ర.

పెద్దవారము

బుధవారము.

బ్రౌన్.

పెద్దవిన్నపము

చెవుడు.

పెద్దవిన్నపమువాడు

చెవిటివాడు, బధిరుడు.

శ. ర.

పెద్దవిశేషము లేదు

ఎవరైనా ఏమిటి విశేషం అని అడుగుటూ, అంటే పెద్ద విశేషం లేదు...కానీ అని ఏదో చెప్పుటా అలవాటు. అందలి ఒక పలుకుబడి. వాడుకలో నేటికీ ఉన్నది.

"నీ పోయి వచ్చినకార్యం బెఱింగింపు మనినం బెద్దయు విశేషంబు లేదయ్యు మామహేశ్వరుల తపోభంగంబు సేయు మనిన దానికి మెయికొని వచ్చితి ననిన..." కుమా. 4.60.

పెద్దవీధి

రాజవీధి.

"ఊరేగింపు పెద్దవీధిలో ఉంది. ఇంక పదినిమిషాల కల్లా మన వీధికి వస్తుంది. తయారుగా ఉండండి." వా.

పెద్ద వెట్టు

గౌరవించు.

"ప్రీతి మన్నన పెద్దవెట్టు."
భార. శాంతి. 5.393.

పెద్ద సేయు

1. గౌరవించు.

"సవినయంబుగఁ గృతాంజలు లయి మమ్మింత, పెద్ద సేయుదె నీవు పెద్దలకును, బెద్దవు..."

భార. అను. 4.410.

2. స్తుతించు.

"...వీరి కూరుముల్, వదలక పెద్ద సేసెదవు వందిగతిన్ దగ దీవిచారముల్."

మను. 6.69.

3. ఎక్కువగా చేయు.

"ఇప్పుడు దోసము పెదచేసి యా, దున్నవయాళికానిఁ గడు దొడ్డగఁ జెప్పి భయంబు నూపి."

సారంగ. 2.114.

పెద్దా చిన్నా లేదు

అంతరు వెఱిగి ప్రవర్తించ డనుట.

"వాడికి పెద్దా చిన్నా లేదు. నోటికి ఏది వస్తే అది అంటాడు." వా.

పెద్దింటమ్మ

ఒకానొక గ్రామదేవత.

శ. ర.

పెద్దిల్లు

పూజాగృహము, వివాహ గృహము.

"ఇలు శృంగారించి శైలవల్లభు పెద్దింటిలోనికిఁ దోడి తెప్పించి రంత..."

వీర. 3.163.

"తలుపుఁ బుచ్చి లంజతల్లి వేలుపుల పె, ద్దింటిలోని కతని నింపుతోడ."

పరమ. 3.262.

పెనపరి

జగడగొండి.

"వసుమతీపతి సభకున్, జెప్పఁగ

వచ్చిన పెనపరి, నప్పుడ దండించి ధనము నరుపఁగ వలయున్."
విజ్ఞా. 3.73.

## పెనుబాము

కొండచిలువ.

"ఇది పెనుబాముచందమున నెంతయు భీషణమై జనంబులం, బెదరఁగఁ జేయు." భార. విరా. 1.160.

## పెనువాములు

అధికము.

"పెనఁగిన లోభాలు పెనువాములు." తాళ్ల. సం. 11.11.

## పెనుకూళ్లమారి

ప్రతిచోటను భుజించువాడు.

"గంగాధరునకు సంగడికాఁడు గాఁడొకో, పెనుకూళ్లమారైనయనిమిష పతి." వీర. 4.4.

## పెనుజోగి

శివుడు.

"పెనుజోగి తేజంబుఁ బృథులభూతంబులు, దంత్యస్థి మరునికదంబసమితి." చి. ని.

## పెన్నాటకము సేయు

విస్తరించి చెప్పు.

"సంభవించిరి గంధర్వజాతి ననిన, గలితనం బేల పెన్నాటకంబు సేయ." భీమ. 1.88.

## పెన్నిధానము గనుగొన్న దరిద్రు బోలి

అత్యాశతో – అతి సంతృప్తితో.

"పెన్నిధిం గన్న పేదచందంబున నత్యంతసంతుష్టాంతరంగుం డై." రుక్మాం. 1.84.

చూ. పెన్నిధిం గన్న పేదచందమున.

## పెన్దిరువడి

గరుత్మంతుడు.

పెరియతిరువడి అని తమిళము.

"నిం,డెం గడు ప్రోఁత పెన్దిరువడిం గని రా ఖగరాజు మూఁపునన్." ఆము. 4.10.

## పెప్పెపె మెమ్మెమె యను

వచ్చీరాని మాటలాడు.

ఏమీ చెప్పలేక పోవు.

"నిక్క, బిన్నటినాఁ డెఱుంగుదును పెప్పెపె మెమ్మెమె యంచు నుండు పీ, వెన్నిట జాణ వైతి విపు డెవ్వని సైనను బుట్టఁ బెట్టవే." శ్రవణా. 2.87.

## పెరటిచెట్టు

అతి చనువువల్ల గౌరవం లేదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

'పెరటిచెట్టు మందుకు పనికి రాదు' అన్న సామెతపై వచ్చినపలుకుబడి.

## పెరటిచెట్టుమందు

పనికి రానిది అనుట.

అది పనికి వచ్చేదయినా దగ్గరలో ఉన్నందువల్ల చులకన యగును. దానిమీాద వచ్చిన పలుకుబడి.

"మామాటలు పెరటిచెట్టు మందగునె నృపా!" రుక్మాం. 4.20.

## పెరతేనె

పెరనుండి తీసిన తేనె.

"అట్లు కఱుకుట్లు గాల్చిన, పెట్టల నింజెట్ల మఱియుఁ బెరతేనియలం." కాళ. 3.51.

## పెరయీగ

తేనెటీగ.

"చపలత బహుజలాశయములఁ జెఱచి, పెరయీఁగ నందంద పేర్చినపగిది." ద్విప. కల్యా. పు. 142.

## పెరయీగలపగిదిని

అధికముగా.

తేనెతెట్టెలోని యీగలవలె. ఈగలు కూడా గుంపులు గుంపులుగా రావడం అలవాటు.

"అకుఁజిలుకల మొత్తంబువంతునఁ బెరయీగలపగిదిని." హంస. 3.29.

## పెర రేచు

విజృంభింప జేయు, ప్రేరేచు.

"నీవు చేయుతపమున్ జపమున్ బెర రేఁప." పాండు. 4.61.

"అంతరాత్మ తను నట్టే మరచేనా, చింతలోఁ బెరరేఁచీఁ గాకా," తాళ్ల. సం. 5.320.

## పెరవలిమానురోలు

ఎవరైనా ఉపయోగించుకొనదగినది.

పల్లెలలో వీథులలో నేటికీ నేలమట్టముగా దించిన కట్టె రోళ్లు ఉంటాయి. ముఖ్యంగా వడ్లు దంచడానికి వాటిని ఉపయోగిస్తారు. వాటిలో ఎవరు పడితే వారు దంచుకొని పోవచ్చు.

"వాని యిల్లాలు పెరవలిమానురోలు." భద్రావత్య. 1.

## పెరుగాకు

పెరుగుతోట కూర.

## పెరుగుతోట కూర

పెరుగువలె మృదువైనతోట కూర. (సూర్య. ని.)

"పెఱుకు తోఁటకూర, యనఁగఁ జను మహాబాష్పసంజ్ఞ." అం. భా 2.73.

రూ. పెఱుకుతోట కూర.

## పెరుగువడ

ఆమవడ, పెరుగులో నాన వేసినవడ.

## పెరుమాకోయిల

కాంచీపురము.

"కోయిలఁ దిరుమాలఁ బెరుమా, కోయిలఁ దిరుపతులఁ గుంభకోణాదిక..." కాశీ. 5.288.

## పెరుమాళ్లు

దేవుడు.

"మన సుకృతంపుఁ బెంపు పెరుమాళ్లై యెఱుంగు నిఁకఁ సమస్తముల్." పరమ. 2.173.

## పెఱగాయ

పనికి మాలినవాడు, అప్రయోజకుడు.

పెఱగాయసుద్దులు

పనికి మాలినమాటలు.

"అటు నిటు ప్రొద్దులు పుచ్చుచు, నట మటఁ బెఱగాయసుద్దు లాడెద వారా!" శశాం. 3.78.

పెఱత్రోవల బోవు

వ్యభిచరించు; చెడుదారులు ద్రొక్కు.

"నిను నటు గానఁ బూని మగనిం బెఱ త్రోవలఁ బోవ నీవు." శుక. 1.524.

పెఱపెఱ వారలు

వేర్వేరు వారలు.

బస. 1.5.

పెఱపోక

చెడుప్రవర్తన.

"తదీయసురూపలక్ష్మికె, వ్వరుఁ బెఱ పోకఁ బోరు మును వార్త విథం బెడ నిల్చి పాయమిన్." కళా. 7.143.

పెఱమగడు

రంకుమగడు.

"...పెఱమగలచే నంపించుక మఱలు నపుడు." చంద్రా. 5.63.

పెఱవాడు

పరాయివాడు.

"పెఱవారి సెల్లఁ దఱమితి, నఱకుదు." భార. ఉద్యో. 4.150.

పెఱసుద్ది

అపవాదము, నింద.

"పెద్దఱికము చాలదు పెఱ, సుద్దులు గల్పింతు రెందు సుజనులు గలరే." కళా. 6.152.

పెఱికసెట్టి

వర్తకుడు.

ఎద్దులు మొదలగు వానిపై మూటలు వేసికొని పోయి వ్యాపారము చేయువాడు.

"కఱకంఠుగుడి యిదె కంటి మే మనుచుఁ, బెఱికసెట్టాతనిఁ బిలిచి చూపుదును." బస. పు. పం. 2.40.

పెఱికి పేటాడు

పెల్లగించు, నుగ్గునూచము చేయు.

"ఆలంకం ద్రికూటాచలంబుతోఁ బెఱికి పేటాడం జాలుదుము." భాస్క. కిష్కిం. 762.

పెఱుకుతోటకూర

చూ. పెరుగుతోట కూర.

పెళపెళ మను

క్రొత్త దైన.

"పెళపెళ మనెడుబెబ్బులితోలు మొల గట్టి." సారం. 3.180.

పెల్లి అగు (వాడి)

శాస్తి అగు.

"వీడి పోకిళ్లన్నీ వాళ్ల నాన్న కని పెట్టాడు. ఆయన ఎదుట బడేసరికి వాడికి పెల్లి అయింది." వా.

"ఈ సంగతి మీ నాన్నకు తెలిసిం దంటే నీ పెల్లి అవుతుంది." వా.

పెల్లినడక

మెల్లని నడక.

పెండ్లిండ్లలో ఊరేగింపుజనం మెల్లగా నడుచుటపై వచ్చినపలుకుబడి.

"ఈ పెళ్ళినడకలతో మనం ఆ ఊరేమి చేరుకుంటాం? కాస్త కాలు సాగించండి." వా.

## పెళ్ళీ పెటాకులూ

జం.

పెండ్లి అనుట.

"వాడికి పెండ్లీ పెటాకులూ లేవు." వా.

## పెళ్ళ మను

విఱుగుటలోని ధ్వన్యనుకరణము.

"నిక్కి పెళ్లని కొమ్మ లుక్కున విఱుగంగ, దిగిచి దాగుణిఁ ద్రోచి పగులఁ ద్రొక్కి." హరి. పూ. 6.83

## పేగులలోని తీట

తెలియరాని బాధ.

"మణి ప్రధానుల వెట్టి మంతనా లెటువనన, రానివి పేగులలోని తీఁట..." కళా. 7.19.

## పేగులు తెంచేవి

చాలా కష్ట మైనవి.

మాటా. 20.

## పేచీకోరు

పేచీలు పెట్టువాడు, తంటాలమారి.

"వాడు వట్టి పేచీకోరు మనిషి. వాడితో ఏ వ్యవహారం పెట్టుకో వద్దు." వా.

## పేచీ పెట్టు

తగవు పెట్టు.

"అక్కడికి వెళ్లేసరికి ఆ ముసలాయన పేచీ పెట్టుకొని కూర్చొన్నాడు. తప్పించుకు వస్తా మంటే కుదిరింది కాదు." వా.

## పేటన పెట్టు

1. చిక్కు పెట్టు.

"వృథా సందడి గానిఁ బొంద మన కేలా పాతిపోవంగఁ జే,యవలెం బేటన పెట్టి యంచు." వరాహ. 11.75.

"వాడిది ఏదో పేటనపెట్టే స్వభావమే కానీ ఊరికే ఉండే స్వభావం కాదు." వా.

2. ఎత్తు పెట్టు.

"ప్రియులు ధరించుసొమ్ములకుఁ బేటన బెట్టెఁ జలింప కంతటన్." కళా. 6.86.

## పేటపయిని దొరవలె

ఒక పేటపై అధికారము కల దొరవలె.

అనగా హాయిగా, స్వతంత్రముగా, మహారాజులాగ.

"పెరిగినపొట్టతోడ నొక పేఁటపయిం దొరవోలె నెవ్వరిన్, సరకు గొనండు." ఉ. హరి. 4.46.

## పేటెత్తు

పేటు రేగు, ఎక్కు వగు, విజృంభించు, చెలరేగు.

"దీపించు పెందతఱిం,బునఁ బేటెత్తిన లజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయ." మను. 2.38.

"పేటెత్తి రిపులతో విరి,పో టగునదు పాయ మొకటి పుట్టింపఁ దగున్." కవిక. 2.44.

"పేటెత్తి నిలుకడఁ బెడఁ బాయు సిగ్గుల, నొక్కింత నులుపాఁత లూఁగఁ దారి." విప్ర. 3.87.

## పేట్రేగు

చెలరేగు, విజృంభించు.

"ఆ ఊళ్లో దొంగలు మరీ పెట్రేగి ఉన్నారు." వా.

"భయమూ, భక్తీ లేక వాడు మరీ పేట్రేగి పోతున్నారు." వా.

## పేడనీళ్లు చల్లు

అవమానించు.

పేడనీళ్లు చల్లుట అవమాన సూచకంగా, ఒక దండనగా ఉండి వచ్చినపలుకుబడి.

"ఏదో అన్న కదా అని యింతమాత్రం వస్తే నీభార్య మొగాన పేడనీళ్లు చల్లి పంపించింది నాయనా! అదన్నమాటలు ఏమని చెప్ప మంటావు?" వా.

"ఆ ఊళ్లో నీ విట్లా షోకిల్లాగా తిరిగావంటే వాళ్లు పేడనీళ్లు చల్లి పంపిస్తారు. జాగ్రత్త." వా.

## పేడెత్తు

బీటలు వాఱు, పగులు.

"ము,జ్జగముల్ తల్లడ మందె బ్రహ్మదలఁకెఁ బ్రాంతంబు పేడెత్తఁగన్." మైరా. 3.92.

## పేదకు బంగారుబిందె లబ్బు

పేదకు పెన్నిధి దొరకు.

"పేదకు బంగారుబిందె లబ్బుట గదా, చెలువకుచము లంటఁ జేర్చె నేని." ఉషా. 3.49.

## పేదకోపము పెదవులచేటు

అసమర్థుని కోపము వ్యర్థమనుట.

"పేదకోప మెందుఁ బెదవులచేటు గా, కడికి యేమి సేయ నోపు నన్ను..." కళా. 6.31.

పేదవాడు కోపపడినప్పుడు వదరుట తప్ప మరొకటి చేయ లేడనుటపై వచ్చిన పలుకుబడి.

## పేద నే నని నోర బ్రేవులు చూపు

నేను పేదవాడి నని రుజువు పరుప జూచు.

బ్రేవులు చూపుట పూర్తిగా లోని ఆంతర్యమును చూపుటకు ప్రత్యామ్నాయము.

"పేద నే నని నోరఁ బ్రేవులుఁ జూప," గౌ. హరి. ద్వితీ. పంక్తి. 201.

## పేద పెన్నిధి గన్నట్లు

అత్యాతురతతో, అత్యానందంతో.

"ఎన్నంగఁ బేద దాఁ బెన్నిధియింటఁ, గన్నట్లు ప్రాణలింగము నంటియుండె." పండితా. ప్రథ. దీక్షా. పుట. 180.

## పేదమనసువాడు

పిఱికివాడు, సంకుచితహృదయుడు.

"అఖిలజనులు నిన్, గడుఁ బేదమనసు వాఁ డని, చెడ నాడుదు రనిన మము నిసీ యను టరుదే?" భార. శాంతి. 1.117.

## పేదమాట

పిఱికిమాట.

"ఈ పేదమాట లెల్లను గోపవివశుఁ
డైననాకుఁ గొలుపవు.
భార. అను. 1.11.

## పేదమొఱ

అసమర్థుని ఆక్రందనము.
తనకు చేతకానివాడు ఇతరులకు మొఱ పెట్టుకొనుట తప్ప ఏమీ చేయ లేడు అనుటపై వచ్చినది.

"గయ్యాళి గంపం,గా వెఱచి పేద
మొఱగా,నే వారిని వారిఁ దగిలి యేల
వచింతున్." కళా. 3.234.

## పేదరాలి పెద్దమ్మ

పూర్వం పల్లెలలో బాటసారులకు డబ్బు తీసికొని అన్నం పెడుతూ, ఆశ్రయమిస్తూ ఉండిన ముసలామె. ఈ పేదరాలిపెద్దమ్మ మన జానపదకథలలో ప్రముఖ పాత్ర వహిస్తుంది.

"ఆరూఢి యశోద యనం, బేరుపడిన
పేదరాలి పెద్దమ గృహముం, జేరం
జని......" శుక. 2.23.

చూ. పేదరాశి పెద్దమ్మ-పేరాశి పెద్దమ్మ.

## పేదఱపు

దీనాలాపము.

"...తాన, యాకెఁ బలుమాఱు జేరి
పేదఱపు లఱచి, యును మనోజవికార
వర్ణనలు సలిపె..." రాఘవ. 4.6.

## పేదవడు

బలహీన మగు, దరిద్రత చెందు.

"పేదవడిన పుడమి వేలుపుంబోలె
బలియింటివాకిట నడంగి."
పాండు. 3.150.

## పేదసాదలు

పేదవారు. జం.

"మనపురి యేలు నాతని కుమారిక
సజ్జనురాలు దానిపే, రనుమతి పేద
సాదులకు నారని యన్నము పెట్టు
చుండు." భోజ. 5.267.

## పేను గ్రుక్కినపాటిగా

అతిసులభంగా.

"కన్నగాం డ్రగుచు నగళ్లు ప్రవే
శించి, యందు నెంతటివార లడ్డ మైనఁ,
జక్కడఁచుచుఁ బేను గ్రుక్కిన
పాటిగా, నిష్ట మైనయర్థ మెల్లఁ
బడసి." ప్రభా. 1.108.

## పేనీళ్లు చల్లు

అవమానించు.

"ఆస్థానమందు విద్యావంతులను గని,
మ్రొక్కకుండెడు శుద్ధ మూర్ఖజనుల,
తటుకున గ్రామప్రదక్షిణం బొనరించి,
నిల్చినచోటఁ బేన్నీళ్లు చల్లి."
వేణు. శ. 19.

చూ. పేడనీళ్లు చల్లు.

## పేరంటము వచ్చు

వివాహాది శుభకార్యములకు ముత్తైదువలు వచ్చు.

"మారారిద్రోహునింటికి, పేరంటము
వచ్చి తనుచుఁ బెలుచను గోసెక్, వైర
మున నదితిముక్కును."
శివ. సా. 309.

## పేరటాలు

ముత్తైదువ.

'అక్కలు' అనే దేవతలను కూడా పేరటాళ్లు అనే అంటారు. వారికి కొత్త చీరలూ, కొత్తకోకలూ పెట్టి వాటిని ముత్తైదువలకు ఇస్తారు.

కాశీ. 3.81.

పేరబడు

గట్టిపడు. నేయి పెరుగు పేరినట్లు...

"మొగు లెఱఁగి పేరఁబడిన విధము నన్." కుమా. 1.88.

పేరములు వాఱు

"కలరవంబుల రకంబులు పికంబులు గేరె, రమణఁ గిరములు పేరములు పాఱె." భద్రాపరిణయము. ఆ. 1.

చూ. పేరెములు వాఱు.

పేరాను

పేరు చెప్పు.

"పే,రాని సుతింత్రు కేలిసమయంబుల దంపతు లెల్ల నాతనిన్."

శ్రవ. 1.71.

పేరిడు

అంకిత మొనర్చు.

"ఆ సుతరత్నము పే రిడుము నాకు."

సారం. 1.28.

పేరిననేయి

గట్టిగా పేరి ఉన్న నేయి.

బస. 7.190.

పేఱుంగరము

పేరు చెక్కిన యుంగరము.

శ. ర.

పేరు కలుగు

ప్రసిద్ధి చెందు.

"వెండియును గైదువులు నీకు వేఱ కలుగుఁ, బేరు కలసొమ్ము లగుఁ బోర

బెండుకంటె." ఉ. హరి. 3.98

పేరు కల్ల చేయు

పేరు చెఱుచు.

'ఘన మైననా పేరు కల్ల చేయకుము.'' పల. పు. 107.

పేరుకుచ్చు

పేర్కొను.

"పేరు కుచ్చి సొలయుచుఁ బిసాళిం చేవు." తాళ్ల. సం. 12.3.

పేరుకొని వైచు (తెల్లంటిచీర వోలె)

ఎగసి పడు.

తెల్లటి చీరను గుండ్రముగా చుట్టి విసరి వేసినప్పుడు అది యిట్టే దాట్లు వేసుకొంటూ పోవునప్పటివలెనే ఎగసి పడు.

"పేరుకొని వైచు తెల్లంటు చీర వోలె." ఉ. హరి. 4.28.

పేరుకొను

పిలుచు.

"పే రొసఁగిన కీర్తి బుధులు పేరు కొనంగన్." నిరంకు. 1.92

"ము,కుందుఁడు గాండీవిఁ బేరుకొని యిట్లనియెన్." జైమి. 7.180.

చూ. పేర్కొను.

పేరు గలవారు

ప్రఖ్యాతులు.

"ఈశ్వరభక్తిపెంపున వీరశైవ పేర్గల వారు."
పండితా. ప్రభ పురా. 296.

## పేరు గాంచు

ప్రసిద్ధి చెందు.

"ధన్యాత్ముఁడై పేరుగాంచె నిలన్ నందురి బాప మంత్రిసుతుఁ డౌ శ్రీ సూర్యనారాయణుండు..."
జాహ్నవి 1.88.

## పేరు గ్రుచ్చి అను

పేరెత్తి చెప్పు.

"ఏను బోయినకార్యంబు వివరించెద నని వారల వేఱువేఱం బేరు గ్రుచ్చి యిట్లనియె."
ప్రభా. 4.31.

## పేరు గ్రుచ్చి (తెలుపు)

పేరుపేరున (చెప్పు).

"వెలుచ నేడ్చె నారడిఁ బోయిన, ప్రజలఁ బేరు గ్రుచ్చి పనవి పనవి."
భార. మా. 107.

"పేరు దెమ్మన దూతెరు పేరు గ్రుచ్చి, తాళి యడిగినఁ గసరెదు తాళుకొనక."
బహు. 2.67.

"జముని చెలియలు...పేరు గ్రుచ్చి ఋషులు తెల్పినతీర్థము లెల్లఁ..."
పాండు. 3.126.

## పేరు చెప్పిన పాఱుపా మైన నిలుచు

వాడి ప్రతాపం అంతటిది అనుట.

"అండజవరయాన! యవని నీపేరు సె, ప్పినఁ బాఱుపామైన బెగడి నిలుచు."
సారం. 2.20.

## పేరుడుగ జేయు

రూపు మాపు.

"ఓజేవి! అరులపేరుడుగఁ జేయుదునో!"
వర. రా. సుం. పు. 128. పం. 18.

## పేరును పెంపును లేక

నామరూపాలు లేకుండా.

"భిన్నకటంబులై పేరు పెంపును లేక, గంధనాగంబు లెక్కడ నడంగె."
విజ. 1.42.

## పేరు పడు

ప్రసిద్ధి కెక్కు.

"సనకసనందనాదులవలెఁ బేరుపడి నిన్నుఁ బాడు." తాళ్ల. సం. 6.24.

## పేరు పెట్టు

తప్పు పట్టు, నిందించు.

"నే నెంత బాగా చేసినా వాడు పేరులు పెడతాడు." వా.

## పేరు పెంపు

పేరు ప్రతిష్ఠ. జం.

"పేరు పెంపును లేక."
విజయ. 1.42.

## పేరుపేరన్

ప్రత్యేకప్రత్యేకముగా.
హర. 7.160.

"అక్కడ పేరుపేరునా పిలిచి సంభావనలు ఇస్తున్నారు." వా.

## పేరు బయ లెక్కు

పేరు వచ్చు.

"...పార్థులకుఁ బేరు బయ లెక్కనెటుల్ ?" పాండవో. 8.

## పేరు మాపు
రూపు మాపు.
"కపుల రాఘవుల పేరు మాపు మను."
వర. రా. యు. పు. 29. పం. 3

## పేరు మార్చి పిలువు
తా నేదో ప్రతిజ్ఞ చేసి అలా చేయక పోతే నా పేరు మార్చి పిలవండి అనుట అల వాటు.
"చేసేత రేపు నీ చేతులుఁ గాళ్లు, కఱ కఱ గ్రోవ్వాఁడి కత్తుల చేతఁ, దఱిగింప కున్న నింతటనుండి నన్నుఁ, బేరు మారిచి పిల్వవే..."
సారం. ద్వి. 1. 657.

## పేరు లేకుండ
బొత్తిగా లేకుండా.
"బిందుసరంబులోఁ గుందనపుందమ్మి, పేరు లేకుండంగఁ బెల్లగించి."
ప్రభా. 1.120.
చూ. పేరు లేకుండ జేయు.

## పేరు లేకుండ జేయు
రూపు మాపు.
"బిందుసరంబులోఁ గుందనంపుం దమ్మి, పేరు లేకుండంగఁ బెల్లగించి."
ప్రభా. 1.120.
చూ. పేరు లేకుండ.

## పేరువాఱు
పేర్కొను.
"సారె సారెకు బిరుదులఁ బేరువాఱె, చేరి వినుతింపఁ దమఁ బెంచు చెంచు దొరలు."
చంద్రా. 2.91.

## పేరు వినబడదు
అలాంటివాడు లేడు – అలాంటిది లేదు – అనుటకు అనే పలుకుబడి. వాడుకలో 'ఈ ప్రాంతంలో వరిపైరు అన్న పేరు వినిపించదు.'
"ఆనుటపనిట లింగార్చకుం డనెడు, నామంబు వినఁగ రా దేమి కర్మంబొ?"
బస. 6.155.

## పే రెక్కు
ప్రఖ్యాతి చెందు.
"జగంబులోనఁ బే, రెక్కి నదాన నంచు."
పారి. 1.66.

## పే రెత్తి చీరు
పేరుతో పిలుచు.
"పే రెత్తి చీరవు ప్రియ మెలర్ప."
రుక్మాం. 4.121.

## పే రెత్తి యమ్ము
ఫలానా ఇది అని చెప్పి అమ్ము.
అమ్మినప్పుడు దేని నమ్ము తున్నారో చెప్పడం అల వాటు.
"అడరి పే రెత్తి యిట్లని యమ్మఁ దొడఁగె."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1342.

## పేరెము తిరుగు
ఎలయించుకొని తిరుగు.
"చెరలాడు జిఱికొట్టుఁ జెలఁగి పేరం బు, దిరుగుఁ బర్విడు."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 605–606.

## పేరెము దోలు
పరువెత్తించు.

"బిరుసుగ గరుడని పేరెము దోలుచు, చెరపి నీవు గోపించినను."

తాళ్ల. సం. 11.3. భా. 26.

## పేరెము పెట్టు

పరుగెత్తు.

"ధీరుఁడై నిజఖడ్గదీప్తులు నిగుడఁ, జుట్టి పేరెము పెట్టి సుడివడ నాడిసి."

ద్వి. హరి. ఉ. 1655 పం.

## పేరెములు వాఱు

పఱుగెత్తి పోవు, పరువులు వాఱు.

"నిపాతితవరుణం బై నింగిఁ బేరెము, వాఱు వాహనహంసంబువలనను."

పారి. 5.13.

"జల్లులతోడి పెన్బల్లెంబు లెగవైచి, పట్టుచుఁ బేరెముల్ వాఱువారు."

కళా. 8.42.

## పేరెఱుక పడు

ప్రసిద్ధి చెందు.

"పేరెఱుకపడునానాదేశాధీశులకు."

భార. స్త్రీ. 2.172.

## పేరెలు వాఱు

పరుగు లిడు.

"...గజములు, గట్టి పేరెలు వాఱి తిట్టలు ద్రోచి, దట్టంబులై సముద్ధతి నేఁగుదెంచి."

పండి. పర్వ. 360 పా.

## పేరైనవాడు

ప్రఖ్యాతి చెందినవాడు.

ఆం. భా. 3.4.

## పేరొందు

ప్రసిద్ధి చెందు.

"ఏ భూసురశ్రేష్ఠుఁ డిలలోనఁ బేరొందెఁ, గాళహస్తి మహత్త్వకథ యొనర్చి."

ఇందు. 1.8.

## పేరోలగం బుండు

"ఉండు నేదేవి పేరోలగంబు."

జైమి. 1.5.

## పేర్బిందులు

స్వేదబిందువులు–చెమటు.
చెమటబొట్లు (పయిర్ = చెమటు తమిళం.)

"దండడిఁ దొరుగు పేర్బిందులతోడన, కన్నీరు తారలఁ గడలుకొనఁగ."

కుమా. 5.70.
కుమా. 9.49.

## పేలపిండి

పేలాలు విసరి చేసినపిండి.

## పేలపిండిగా

అవలీలగా.

"ఎంత కఠినగ్రంథమైనా అతనికి పేలపిండిగా కనబడుతుందంటే నమ్మి." వా.

## పేలు గ్రుక్కు

తలలోని పేలను చంపు.

## పైకము

సమూహము.

"పకపక కోతులపైకంబు నవ్వ."

వర. రా. యు. పు. 220. పం. 13.

## పైకి వచ్చు

1. మీదికి వచ్చు.

"పైకి రాకుఁడు కుకవుల్."

పాణి. 1.18.

2. వృద్ధిలోకి వచ్చు.

"ఎన్నిపాట్లు పడ్డందీ వాడు పైకి వస్తాడు?" వా.

**పైకుడుపులు**

పైతిండ్లు, చిఱుతిండ్లు.

అక్కడా ఇక్కడా తినుట.

"బ్రతు కన్నదే యిట్లు పై కడుపు లందు." బస. 3.62.

"పాలు దాగినమీఁదఁ బైకుడుపులా." తాళ్ళ. సం. 5.183.

**పైకూటమి**

పురుషాయితము.

ఆం. భా. 2.180.

**పైకొను**

పైబడు.

"కినిసి గోంద్రిలుచుఁ బైకొనుపంచ నఖముల." శకుం. 1.61.

**పైకొలుపు**

వ్యాపింప జేయు.

"ధూపధూమముల్, పై కొలుపున్ సమర్థగతిఁ బర్వెడు గుగ్గులు ధూప ధోరణిన్." పాండు. 1.108.

**పై కోత కోయు**

చీట్లాటలో చిన్న తురుపు ముక్కతో ఒకరు కోస్తే దానికంటే పెద్ద తురుపు ముక్కను వేస్తే అది పై కోత అవుతుంది. ఆ పట్టు వాడికే పోతుంది.

నారాయణదాసు అంబరీషచరిత్ర.

చూ. కోత కోయు.

**పై గొసర కుంచంబు గూల బడ్డట్లు**

కొసిరితే కుంచం కూలబడి నట్లు.

మాటెంత కావా లని అడగ్గా అసలే పోయిం దనుట.

"కోలాసతేల పై గొసరఁ గుంచంబు, గూలఁ బడ్డ ట్లగుఁ గూడ నిమ్మనిన."

**పైచీర**

ఉత్తరీయము.

"బెడిదంపుఁ గోలలు బెడఁ గొంద బహువర్ణ, చిత్రితాజినము పైచీర గాఁగ." భార. విరా. 1.211.

**పైచెఱగు**

పైటకొంగు.

"చంచలనేత్ర యిట్లు తన సంగతి కొప్పటఁ గాంచి మాని దాఁ, గొంచక పట్టెఁ బైచెఱఁగు." కళా. 3.32.

**పైచేయి**

1. అధికుడు.

"ఏ రాజు ధారుణీభారంబు వహియింపఁ, జిల్వరాయనికిఁ బైచేయి యయ్యె." శ్రీనివా. 2.41.

2. మేలుచేయి.

అధిక మనుట.

"ఈసారి అన్ని పోటీలలోనూ వాడిదే పైచేయి." వా.

"ఎంతైనా సంగీతంలో ఆడవాళ్లదే పై చేయి." వా.

"ఎంతమంది సంగీతవిద్వాంసులు వచ్చినా పాటలో వాడిదే పైచేయి." వా.

చూ. మేలుచేయి.

**పైటకొంగు కేలున నులివెట్టు**

సిగ్గు చెందుటను సూచించు చేష్ట.

"అన విని నవ్వి యవ్వికసితాంబుజ లోచన పైటకొంగు కేలున నులి వెట్టుచుం..." శుక. 2.470.

**పైడిపాళియ**

పసిడిపళ్ళెము, బంగారు శరావము.

"ఈశు నుద్వాహమున కమలేంద్ర దిగ్వి, లాసవతి పైడిపాళియఁ బోసి తెచ్చు, జాదరలా నాఁగ."

కుమా. 8.112.

**పైడి ముడుచు**

గర్భాధానము చేయు.

నిశ్చితార్థము చేయు.

శ. ర.

"ముని యేఁటనే పైడి ముడిచినపడుచు, చనుగుబ్బ గోరొత్తి చనుగబ్బివాఁడు."

ఆ. మ. క. 1.38 పా 11. పం.

**పైడి వసంత మాడు**

బంగారులో మునిగి తేలు.

"తళుకులచేతఁ దాము సతతంబును పైఁడి వసంత మాడఁగన్."

రాజగో. 4.69.

**పైత్యరోగికి పంచదార చేదు**

నీదృష్టిదోషమే కాని నేను చెప్పేది నిజం అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

ఇదే 'శైత్యం బెక్కిన నోటికి చే దగు చక్కెరపాడి' అనే రూపంలో కనబడుతుంది. ఇలా వాడుకలో వినపడదు.

సంపంగిమన్న. 95.

**పై నడుచు**

దండెత్తి పోవు.

"వరుస మాళవబర్బరధరణిపతుల, పై నడిచి భీషణం బైనభండనమున."

కళా. 8.115.

**పైన పటారము లోన లొటారము**

ఆడంబరం తప్పితే అంతస్సారం లే దనుట.

"ఆ జమీందారు దంతా పైన పటారం లోన లొటారం." వా.

"...పంకజాకరో, ద్భవ మృణాళవల్లులకుఁ బైని పటారమె కాక వారికిన్, లోన లొటార మాట మది లోకు లెఱుంగరె వేయు నేటికిన్."

తపతీ.

**పైనము సంజోకలు**

ప్రయాణసన్నాహములు.

జోక సేయుట కృషికి సిద్ధము చేయుట అన్న అర్థంలో నేటికీ వాడుకలో ఉన్నది.

'చేను జోక చేసినాడు.'

"అనిన నంగీకరించి యయ్యంబుజాక్షి, యపుడె పైనంబు సంజోక లమరఁ జేసి." శుక. 3.138.

"అందు మున్నిటి జోక సేయంగఁజాలు, చెలువు ద్రవ్వించె." యయా. 1.30.

"నీ వేవిధంబున మావిత్తము జోక సేసెదవు?"

హరిశ్చంద్రోపాఖ్యానము. 3.30.

"శ్వేతకేతుఁడు జోక సేసి తెచ్చిన పదా,ర్ధ్వెన్నె యంచహుమాయి వడిగ సెక్కి." ఉత్త. 2.178.

చూ. జోక సేయు - సిద్ధపఱచు.

## పై పంచ దులుపుకొని

చూ. బట్ట దులుపుకొని.

## పై పచారము

కపట మైనది.

"నయగారపుఁ దమిఁ గపట, ప్రియ ముల మెఱమెచ్చు బల్కు-రిం తను మిథ్యా, చయములను బైపచారపు, నయమున మునిఁ గూడి కొన్ని నాళ్లు రమింపక." విప్ర. 4.13.

చూ. పై పచారాలు.

## పై పచారాలు

పై పై మెఱుగులు.

"సుడిసి పై పచారాలే చూచి సురత సుఖాన." తాళ్ల. సం. 8.36.

చూ. పై పచారము.

## పై పట్టె అగు

వి త్తిన తరువాత వెంటనే వాన వస్తే వి త్తనా లన్నీ బయట పడిపోతాయి. దానినే 'ఆ కేసు పై పట్టె అయింది' అంటారు.

## పై పడు

కవ్వించు.

"పైపడి ప్రియుఁ గరపింపఁగ." రుక్మాం. 2.128.

## పైపాటు

విజృంభణము.

"ఘోటక రూపుఁ డై యతఁడు క్రొ వ్వెసలారెడు కావరంబు పై, పాటున డాయ." కాశీ. 4.270.

## పైపూతమాటలు

కపటప్రియభాషణములు.

చూ. పైపూతవలపు, పైపూత మెఱుగులు.

"వాడి వన్నీ పైపూతమాటలు." వా.

## పై పూత మెఱుగులు

వట్టి తళుకులు.

"ఆవిడ వన్నీ పైపూత మెఱుగులు." వా.

చూ. పై పూతవలపు, పైపూతమాటలు.

## పైపూతవలపు

కపటప్రేమ.

పైపూతపై చాలా మాట లిలా ఏర్పడతాయి. పై పూత అనగా గోడలు మొదలగు వానికి మచ్చలు, బొక్కలు కనబడకుండా పూత పూస్తారు. దాన్నే పై పూత అంటారు. అనగా ఆంతర్య మేమీ తెలియకుండా అనుట.

"తగవులుఁ దెగువలు బిగువులు, నగవులు పై పూఁత వలపు నయగారములన్." రాజగో. 3.77.

చూ. పైపూత మెఱుగులు.

## పై పెచ్చు

పైగా.

"భార్గవరాముఁడు నేఁడు నున్నఁ బై పెచ్చనిపించుకొందు మని..." లక్ష. 2.97.

పైపెచ్చులు
అధికము.
ఏదో ఒకటి కొనగా పైన బహూకృతిగా వచ్చునవి. ఇది నేటికీ వాడుకలో ఉన్నది.
'పైపెచ్చు ఇది ఒకటా?'
"లచ్చియుఁ జందమామయుఁ దలం పుల మానికముం దలంపఁ బై, పెచ్చులు."
పారి. 2.96.

పైపై నడుగు
మీద మీద అడుగు, పదే పదే అడుగు.
నిర్బంధించి అనుట.
"యవ్విబుధమానవతీమణి ప్రేమ తోడఁ బైపై నడుగన్..."
కళా. 5.53.

పై ప్రాణాలు పైనే పోవు
నిర్విణ్ణు డగు.
"అంత దూరం చచ్చీ చెడి వెళ్లానా? వాడు ఊళ్లో లేడనేసరికి పైప్రాణాలు పైనే పోయాయి."
వా.

పై మెఱుగు
సొత్తులకు వన్నె వేసి ఆర్చిన తర్వాత మెఱుగు కడ్డీతో పెట్టేమెఱుగును పైమెఱుగు అంటారు.
"కొలనెల సుధారసంబునఁ, గలవో వఁగ నొరసి కడిగి కాముడితోఁ గ్రొ, మ్మెఱుఁగుల విదల్చికొని పై, మెఱుఁ గిడున ట్లొప్పు నగజ మృదునిటల రుచుల్."
శమా. 3.69.

"సొత్తునకు పై మెఱుగు పెట్టవలసి ఉన్నది."
వా.

పైరగు
1. సాగుబడి యగు.
"అద్దె సేతకుఁ జొచ్చినపు డున్నదీవి తోఁ, బైరయాలుదీవులు పైరగావె."
కళా. 1.129.

2. పెరుగు.
"సహకారమిల దేలా, ధారములఁ జారు హిమవారి కృతసారణులఁ బైరెనచెంగలువ యోరికలలో..."
వసు. 2.22.

పైరుపచ్చలు
పైరు. జం.
"చేలఁ బోల్లును బీళ్లును జేరి చొచ్చి, పయిరు పచ్చలు మేసి..."
యయా. ఆ. 1.
"పైరుపచ్చలు లేక ప్రజలు నెమ్మదిఁ గుంద, నిల్లు ముంగిలి యను టిల గాఁగ."
సుదక్షి. 4.69.

పైలపేటా
ఒక విధమైన అంచు.
"మెలిపెట్టి చుట్టిన తెలిపరంగి ముడాసు, పైలపేటాడబ్బు పనులఁ జెలఁగు."
శుక. 2.426.

పైల పైల బడికొను
మీద మీద పడు.
"గుమిగొని పైలపైలఁ బడికొంచు భటా వళి చూడఁబోవ వెచ్చము గొనిపోవు దాదులు నిజంబు గనుంగొని..."
శుక. 2.40.

పైవచ్చు
మీదకు వచ్చు.

"ఓహో! తనమెచ్చులు తన, కాహో
పైవచ్చె ననుచు నభవుఁడు ఖీతిన్."
భాగ. 10. ఉ. 1248.

## పై వారు

ఇతరులు.

"వచ్చుట కేమి గాని పయివారలు
చూచిన." శ్రవ. 2.7.

## పై వేసికొను

"నిను వంటివానికి నిచుతమే యిట్టి,
పని లేనిదుఃఖంబు పై వేసి కొనఁగ."
వర. రా. అయో. పు. 529. పం. 19.
చూ. మీద వేసికొను.

## పై సారి

వచ్చే సంవత్సరం.

"పైసారికి ఈ చేలో పత్తి వేయా లను
కుంటాను." వా.

## పొంకపఱచు

పదుము చేయు

"భుజపరిఘుంబులఁ బొంక పఱచి."
పాండు. 1.9.

## పొంగటినెల

మార్గశిరమాసము.

## పొంగటిపండుగ

సంక్రాంతిపండుగ.
శ. ర.

## పొంగారు

పొంగు, వర్ధిల్లు.

"విశ్వంభర మిన్ను ముట్టె ననఁగాఁ
బొంగారె."
కవిక. 2.73.

"సందు సందులం దెఱపిగని పొంగార
మధురసమిళితపరాగయోగంబు."
విప్ర. 3.38.

## పొంగిన పుడిసెడు బోవు

అనవసరంగా విజృంభిస్తే నష్టమే కాని లాభము లేదనుట.

పొయ్యిమీద పెట్టిన వేవైనా పొంగినప్పుడు పుడిసెడునీళ్లు తగ్గడం తప్పితే యేమున్న దనుటపై వచ్చినది. వట్టి విజృంభణముతో నష్టమే కాని లాభము లేదను పట్టున ఉపయోగించే పలుకుబడి.

"అనుచుం బరిఘము వైచిన, దనుజాం
తకుఁ డొడిసి పట్టి తన ఘనహేతిం,
దునుకలుగ నతికి నీ పొం,గిన పుడి
సెడుఁ బోయె ననుచు గేలి యొన
ర్చెన్." ఉత్త. హరి. 4.237.

పొయిమీద పెట్టిన ఎసరు బుస్సు మని పొంగుతుంది. అది అప్పటికి విజృంభణముగా కనిపించినప్పటికీ మరొక పుడిసెడునీళ్లు తగ్గిపోవడం తప్ప వచ్చేలాభం ఏమీ లేదు.

## పొంగుడు వడు

పొంగు, అతిశయించు.

"చారుతరచైత్రసంప, త్పూరితవిభ
వముల వేడ్క పొంగుడు వడఁగా."
కావ్యా. 3.115.

## పొంగుసీళ్లు

చిట్టుడుకునీళ్లు
శ. ర.

**పొంగు లెత్తు**
ఉడికి పొంగు.
"లప్పలు పొంగు లెత్తి పొరలం దెర లించి యలంచె నంగజుం, డప్పటిమందు లెల్ల విరహాగ్నికి విందులు చేసి కోమ లిన్." కవిరా. 3.108.

**పొంగువాఱు**
విజృంభించు.
"శాబగబలసమూహంబు పొంగువాఱియు, నొంకారులం జీరియుఁ, దెఱలు చుట్టియు, విక్రమంబులు పేర్చియు." రుక్మాం. 3.84.

**పొంచి యుండు**
దాగి యుండు.
"...అమ్మడువు నఱుత నొక్క పఱపు గల పాద యీరమిం దూఱి పొంచి యుండితి." భార. శల్య. 2.46.

**పొంచు లిడు**
దాగి యుండు.
"కరమూలంబున మించుఁబొంచు లిడి కాంతుం గ్రోలఁ." కేయూ. 4.18.

**పొంతకడవ**
పొయ్యి దగ్గఱ ఉంచే నీళ్ల కుండ.
ఆం. భా. 2.246.

**పొంతకత్తె**
తార్పుడుకత్తె.

**పొంతకాడు**
తార్పుడుకాడు.

**పొంత కూటికుండ**
సముష్టిది, ఎవరికీ చెందనిది.
తాళ్ల. సం. 12.151.

**పొంతనము లరయు**
'పొంతనాలు చూడు' అని నేటి వాడుక. వధూవరుల జాతకాలను బట్టి ఒక్కొక్కరూ ఏ గణాలకు చెందిన వారో, ఏ జాతికి చెందిన వారో మొదలయినవానిని పరిశీలించి వారిద్దరికీ వివాహం తగునా తగదా అని జ్యోతిశ్శాస్త్రరీత్యా పరిశీలించుట.
"ఆతఁడును బొంతనము లెల్ల నరసి లెస్స, యున్న వని పల్కి యారేయి యొక్క లగ్న, మేర్పఱిచి..." శుక. 2.166.

**పొం దాసపాటు (చూపులు)**
సంగమసుఖము నాశించు (దృష్టులు.)
నేటికీ రాయలసీమలో 'ఆశపాటే మైనా ఉందా' అని ఆశ అనే అర్థంలోనే ఆశపాటు వాడుతారు.
'పొం దాసపాటు చూపులు సుట్టి ముట్టి, దండడి గూర్ములు దగులంబు మిపుల."
పండి. ద్వితీ. మహి. పుట. 133.

**పొందుకాడు**
స్నేహితుడు.
"జగము విందు తమ్ముముగుదపొందు, కాఁడు వేఁడివేల్పు." అచ్చ. రా. అయో. 41.

పొందుకొను

నెలకొను.

"ఆనందముతోఁ జీరపేను నరపతి శయ్యం, బొందుకొని..."

నా. పంచ. 1.312.

పొందు చేయు

సిద్ధపఱచు.

"పుట్టి వాని నొక్కరుని డాఁ బొందు చేసి." పరమ. 5.48.

పొందుపడు

సరిపడు, అనుకూలించు.

"సఖ్యం బైన నాతోడఁ బొందు పడుఁడీ."

భా. రా. యు. 200.

పొందుపఱచు

అమర్చు.

"పుత్రికారత్నంబు భూషణాన్విత ముగాఁ, బుష్పతల్పమునందుఁ బొందు పఱచి." రుక్మాం. 3.118.

పొందుబట్టులు

అను వగుచోట్లు.

"పొరుగూళ్ళకును దమ పొందుఁబట్ల కును, వారు వా రిఁక నేఁగ వడి నొక్కనాఁడు."

పండితా. మహి. 259 పొ.

"పొందుఁబట్టుల నప్పులు పొడిచి పొడిచి." పాండు. 3.18.

పొకాలిపోవు

పొగులు, దిగులు చెందు.

"తొల్లిటి శాపోద్గతి దలఁచి పొకాలి పోవుఁ గాని పికంబుల్."

రాధా. 2.177.

పొక్కటిరాళ్లకు పోట్లాడు

అల్పార్థమునకై కలహించు.

పొక్కటిరాళ్ళరీతిగా

గాఢమైత్రితో, కలసి మెలసి.

"వాళ్ళిద్దరూ పొక్కటిరాళ్ళ రీతిగా ఉన్నారు." వా.

పొక్క నీయకు

వెలికి తెలియ నీయకు అనుట.

"ఈ విషయం ఎక్కడా పొక్కనీయ వద్దు. కొంప మునుగుతుంది. జాగ్రత్త."

వా.

పొక్కిపడు

నొచ్చుకొను.

"వైశ్యనకం గనెఁ బోలు నిన్నుఁ జిత్రాంగద యన్నఁ బొక్కిపడి యా నృపనూనుఁడు పల్కె."

జైమి. 5.171.

పొక్కెత్తు

ఎండిపోవుటచే పెళ్ల లేచు.

"సారె పద్యపుఁ బలుకపైఁ జమురు పూతు, నెప్పుడును బెద్దపలక పొక్కెత్తఁ జేతు." హంస. 3.142.

పొగకన్ను

అగ్నినేత్రము, (శివుని) ఫాల నేత్రము.

"పులితోలు చిత్రంపు వలిపదుప్పటిఁ జేసి, పొగకన్ను కస్తూరిబొట్టుఁ జేసి."

భల్లా. 4. (శ. ర.)

పొగకట్టు

ఇంటికప్పు సందులో నుండి లోపలి పొగలోపల ప్రస

రించి కట్టువలె కనపడే సూర్య కిరణము.

శ. ర. బ్రౌన్.

## పొగగూడు

పొగ పోవుటకై యింటి కప్పునందు ఏర్పరచిన గొట్టము.

## పొగచుట్ట

పొగాకుచుట్ట.

శ. ర.

## పొగ చూరు

మలిన మగు, మసకబాఱు.

పొగ వ్యాపించి నల్లబడు.

"హరుని కోపాగ్నిఁ బొగచూరి మరుని చాపము." నైష. 3.101.

"ఈ సిరి నిందా, సంగతిఁ బొగ చూరెను." పాండు. 5.40.

పొగ తాకుటవల్ల వస్తువులు మలినం కావడం సహజం. ఈ సందర్భంలో ఈ పదమే ఉపయోగిస్తారు.

"గోడ లన్నీ పొగ చూరిపోయి వికారంగా ఉన్నాయి. సున్నం వేయించాలి." వా.

## పొగచెట్టు

పొగాకు మొక్క.

## పొగడదండ యొనర్చు

ఉత్తరీయమును దండవలె మెడకు వేసి లాగు.

ఇది సహజంగా అవమాన సూచకము. ఎవరైనా అప్పు లీయనప్పుడు ఇలా వేసి లాగు కొని పెద్దలయెదుటికి తీసుకు పోయేవారు.

"కవిరాజకంఠంబుఁ గౌఁగిలించెను గదా, పురవీధి నెదురెండఁ బొగడ దండ." శ్రీనాథుని చాటువు.

"చందురకావిసేలు దళంబునఁ బొగడ దండ యొనర్చె నా విటభూసురాగ్రణి..." నిరం. 3.26.

## పొగడువడు

వినుతి నొందు.

"సూకరరూపంబు భీకరంబుగఁ దాల్చి, పుండరీకాక్షుఁడు పొగడువడఁడె." నా. పంచ. 1.133.

## పొగ డొందు

ప్రసిద్ధి చెందు.

"జగతిఁ, బొగడొందు పెద్దన పోతరాజు నను."

గా. హరి. ప్ర. పంక్తి. 37.

## పొగడ్తవడు

పేరు కెక్కు.

"జంబూద్వీపంబుకంటె నెల్లదానను బొగడ్తవడి." భార. భీష్మ. 1.27.

## పొగపిడుత

చిలుముగొట్టము.

"నిక్కుపొగపిడుత గదరా, ముక్కు మొగం బెన్నఁ గోఁతి ముఖమున కెనయా..." చంద్ర. వి. 1.72.

## పొగబండి

ఆవిరిచే నడిచేబండి.

రైలుబండి.

పొగబాణము
ఒక రకమైన యుద్ధసాధనము.
"పొగబాణంబులు చిచ్చుబుడ్లు వసియార్పం." రంగా. 3.33.

పొగయోడ
స్టీమరు.

పొగరుపొడ
యౌవనమదంచేత ఏనుగు శరీరంపై యేర్పడే పొడ.

పొగరుబోతు
గర్విష్ఠి, గర్విష్ఠురాలు.
శ. ర.

పొగరు మార్చు
చంపు.
సాం. ని. మాన. 32.

పొగరు మిగులు
పొగ రెక్కు.
"యుద్ధం, బునకుఁ రా రమ్మ టనిరి పొగరు మిగులఁగ." దేవీ. 1.126.

పొగ రెక్కు
గర్వించు.
"అంకె, విడుచుఁ బొగ రెక్కి యుక్కున నడరి రెలమి." నీలా. 2.43.

పొగలు గ్రక్కు
అతివేడిగా ఉండి ఆవిరిని విరజిమ్ము.
"కాఫీ పొగలు గ్రక్కుతూ ఉంది." వా.
"అన్నం పొగలు గ్రక్కుతూ ఉంది." వా.
"పొగలు గ్రక్కే నీట్లో స్నానం చేసి వచ్చాను. చెమటతో మరొక స్నానం అయింది." వా.

పొగలు వెడలు
ఆవిరి లేచు.
"చుఱ్ఱు మని మూర్ధమునఁ దాఁకి యొఱ్ఱఁదనముఁ, బొగలు వెడలింప నాసికాపుటములందు." నైష. 6 130.

పొగలు వెడలెడుచూపు
క్రోధపూరితమైనదృష్టి.
పాండు. 5.204.

పొగ వైచు
సాంబ్రాణి మొదలయినవి పొగ వచ్చునట్లు నిప్పుల మీద వేయు.
"వేపాకు గోరంటవితులు పొగ వైచుఁ, బోరు మాన్పఁచుఁ గడుపునకుఁ బెట్టు." ఇందు. 2.15.

పొగ సూపు
దేవతాదులకు ధూపము సమర్పించు
"సరసధూపార్ధమై కాముశరములందుఁ, బురములందును బొగ సూపె భూవరుండు." నైష. 8.109.

పొగాకు
ధూమపత్త్రము.

పొచ్చపోవు
కొఱతపడు.
"అర్థ మంతయును గైకొనునంతకుఁ బొచ్చపోకచేఁ, గలపురులే దుదఁ విడిచి..." కు. సం. 8.142.

**పొచ్చెము నొచ్చెము**

జం.

"ఇచ్చెదఁ జెచ్చెరన్ వలయు నీప్సిత మొల్ల శత మేని దీన నే, పొచ్చెము నొచ్చెముం జొరదు భూసుర కేసరి నమ్ము నావుడున్." పాండు.

**పొచ్చెము లేని**

నిష్కళంక మైన.

"పొచ్చెంబు లేనిభక్తి వి,యచ్చరరిపు భేది సలిపె నాతిథ్యంబున్." పారి. 1.45.

**పొటపొట కన్నీరు చినుకు**

ధ్వన్యనుకరణము.

"అంతటిలోనన్, గనుదమ్మి గ్రమ్మి పొట పొటఁ, జినికె న్గన్నీరు శబరు చిత్తం బరయన్." కా. మా. 3.106.

చూ. పొటపొట నశ్రు లొలుకు.

**పొటపొట నశ్రు లొలుకు**

ధ్వన్యనుకరణము.

"నాకులమతి నడలెఁ గన్నులఁ బొట పొట నశ్రు లొలుక." కళా. 3.258.

చూ. పొటపొట కన్నీరు చినుకు.

**పొటాపొటాన**

మెండుగా, అతిశయముగా.

"పొటాపొటాన నశ్రు లొటుఁబోటు లై దొరంగఁగాన్." ఉ. హరిశ్చ. 2.128.

**పొటిపొటి తలపోతలు**

అల్పాలోచనలు.

"నీ, పొటిపొటి తలపోఁత లెల్లఁ బోవ నడుపు." పాండు. 5.50.

**పొటుకు పెట్టు**

చెవి నిల్లు కట్టుకొని పోరు.

నీటిపొటుకులు పదేపదే పడు టప్పై వచ్చినపలుకుబడి.

శరభాంక. 22.

"వాడు ఊరికే పొటుకు పెడుతుంటే వచ్చాను." వా.

**పొట్టకల్లి**

ఇంకా బాగా పైకి రాక లోపలే అణగి ఉబికి ఉండే వరి మున్నగువాని వెన్ను.

"పొట్టకలుకులు తిన్నవారికి ఊచ బియ్య ముండవు." సా.

రూ. పొటకల్లి.

**పొట్టకు కనిపెట్టుకొను**

తిండికోసం వెంపర లాడు.

"...ఎచ్చటనో పొట్టకు నై కనిపెట్టు కుంట." నానా. 131.

**పొట్టకు లేక**

భోజనము లేక.

"పొట్టకు లేక చిక్కెదవు పుణ్యగుణం బులరాశి కాశికై." కాశీ. 7.192.

**పొట్టకు లేదు**

తిండికి లేదు.

"వదలక మోసి చూచె నొకపట్టునఁ బొట్టకు లేక తక్కెనన్." హంస. 4.30.

**పొట్టకూటివాడు**

జీతానికి కాక పొట్టకూటికై పని చేసేవాడు. శ. ర.

**పొట్టకూడు**

జీతానికి బదులుగా పెట్టే అన్నం. శ. ర.

**పొట్టక్రొవ్వు**

కండకావరము.

"పుంఖీభవించిన పొట్టక్రొవ్వు."
నిరంకు. 4.37.

**పొట్టగు జ్జుఱుక సూదు**

పొట్టలోని ప్రేవులు బయటికి వచ్చునట్లుగా పొడుచు.

ముద్రిత ప్రతులలోని పాఠాలు భిన్నంగా అర్థరహితంగా ఉన్నవి. ఇదే సరైనపాఠ మని తోస్తుంది.

"ఉడురాజు పొట్టగు జ్జుఱుక నూఁదె."
కాశీ. 3.31.

**పొట్ట చీలిస్తే అక్షరం లేదు**

నిరక్షరకుక్షి.

"వాడికి పొట్ట చీలిస్తే అక్షరంముక్కలేదు." వా.

**పొట్ట చేత బట్టుకొని**

భుక్తికోసం వెతుక్కుంటూ

"మా ఊళ్లో ఉన్న ఆస్తి అంతా పోయేసరికి పొట్ట చేత పట్టుకొని యీ ఊరు వచ్చాను." వా.

**పొట్టపట్టెడ**

గుఱ్ఱము మొదలగువానిపై వేసెడిజీను ; టంగువాఱు.

"ఒడ్డాణమును దాల్ప నోపనిసతి పొట్ట, పట్టెడ బిగి నెటువలె సహించు."
చిత్రభా 3.109

**పొట్టపై కొట్టు**

జీవనము పడగొట్టు, కడుపు గొట్టు.

"దగ్గరివాళ్ళ పొట్టపై కొట్టడం అంత మంచిది కాదు." వా.

**పొట్ట పొడిచినను అక్షరము కనబడదు**

చదువు బొత్తిగా రాదు.

"పొట్ట పొడిచిన నక్షరము గనఁ బడని వీరి కెల్లను..." నందక. 31.

**పొట్టపొరువు**

అంతస్సారము.

గింజ పొట్ట పట్టింది అనుట లో ఉన్న పొట్టలాంటిదే ఇది. అతి సమీపస్థానము అని. సూర్యా. ని.

"దమితేంద్రియులసీమ దానలప్రేమ, విమలతముదవు దత్త్వము పొట్టపొరువు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 239.

**పొట్టపొర్వున**

పొరుగున, చాల దగ్గఱలో

"పొట్టపొర్వునఁ గల్ప భూరుహం బుండ, వట్టివృక్షమునకు వడి నేఁగు నట్లు." బస. 7.207.

**పొట్ట పోయు**

పోషించు.

ఇది సామాన్యంగా ఆత్మనేపదంగా 'వాడు కష్టపడి ఎలాగో పొట్ట పోసుకొంటున్నాడు' అని ప్రయుక్తమవుతుంది.

"మెరమెగలు పుట్టదే కాఁ,పుర మేటికి మగఁడు పొట్ట పోయక యున్నన్."
శుక. 3.278.

**పొట్ట పోసుకొను**
హీనవృత్తిచే కడుపు నిండించుకొను.
"రట్టునకుం దిట్టునకు నొడికట్టుకొని కట్టఁడిలో పొట్టల పోసికొందుర."
వరాహ. 9.123.

**పొట్టలు పిగులు**
కంకులు విడు.
"భీతిచేఁ గాదె పొట్టలు పిగులుచుండుఁ, గలమగర్భంబు లెల్లను గ్రమముతోడ."
రాజశే. 1.68.

**పొట్టవాడు**
పెద్ద బొజ్జ కలవాడు.
ఆం. భా. 2.120.

**పొట్ట సాకువాడు**
పొట్ట పోసుకొనువాడు.
ఆం. భా. 3.6.

**పొట్టింపుచీరణము**
ఒక విధమైన చిన్న యులి.
శ. ర.

**పొట్టిడుకొను**
కడుపులో పెట్టుకొను-దాచుకొను.
"బడబాగ్ని యంతయు ఘాలమధ్యమున, మృడుగణంబు బాకఁడు బొట్టిడికొనఁ డెట్టు."
పండితా. ప్రథ. పురా. పుట. 406.

**పొట్టి పోతురాజుకొలువు**
కష్టమైన కొలువు.

**పొట్టి బుడమకాయ**
పొట్టివాడు.
కోడిబుడమకాయ పెద్దది. పొట్టి బుడమకాయ చేలల్లో విస్తారంగా కాస్తూ అతి చిన్నదిగా ఉంటుంది.
మాటా. 64.

**పొట్టు పొర లగు**
బాధపడు.
"కన్నీ రుట్టిపడఁ బొట్టు పొర లగుచుండునంత."
పాండు. 3.24.

**పొట్లెంబు చెడు**
కట్టు దప్పు, చెల్లాచెదరగు.
"శ్రీరాముసేన పొట్లెంబు చెడి విచ్చి పోయిరి."
వర. రా. యు. పు. 134. పంక్తి. 21.

**పొడకట్టు**
కనబడు, గోచరించు.
"మొదలఁ బొడకట్టి పోవఁడె, యదృశ్యుఁడై యొక్కరథికుఁడు."
రామా. 8.13.

**పొడ గనిపించుకొను**
దర్శన మిచ్చు.
"కానుకల్ గొని పొడ గనిపించుకొనుడు...వానిఁ బిల్తునె మంచివాఁడని పల్కు."
వర. రా. అయో. పు. 569. పంక్తి. 19.

**పొడగను**
చూచు.
"నినుఁ బొడఁగాన వచ్చితిని."
భాస్క. యుద్ధ. 2556.

**పొడగాంచు**
చూచు, జాడ నెఱుగు.

"ఏయెడఁ బతిఁ బొడగానక, హా యని యెలుఁగెత్తి దిక్కు లద్రువఁగ నఱచున్." కుమా. 5.68.

"సరోవరంబు పొడఁగాంచి." రుక్మాం. 4.136.

**పొడ గిట్టదు**

వాసనా కూడా సరి పడదు.

"అదేం కర్మమో? వాడిపొడ వీడికి గిట్టదు. వాడు వస్తే వీడు చచ్చినా రాడు." వా.

**పొడచూపు**

కనపడు.

"హరికిఁ బొడచూప నేతెంచె హరి హయుండు." భీమ. 4.48.

**పొడతెంచు**

ఉదయించు.

"ఉడురాజు పొడతెంచుచున్నవాఁడనిన." రంగ. రా. బాల. పు. 39. పంక్తి. 22.

**పొడనీడ**

సూర్యకాంతి ఆకులు మొదలగు వాని సందులలో ప్రసరించుటవలన పొడలు పొడలుగా ఏర్పడిన నీడ.

"మిడుతగమి గవియుతఱుచునఁ, బొడనీడలు వెండతుని యప్రోవులుఁ గలయం." భా. రా. యు. 460.

**పొడపాము**

శరీరముపై మచ్చలు కల పాము.

"ఈ, పొడపాము నీవు నేఁటిది, కొడుకా! నీ కులము వంత గూరుటుడుపవే." హరి. పూ. 7.40.

**పొడపురుగు**

చూ. పొడపాము.

"వేఁటఁ బోయెడువారలు విప్రుపాటు, కలుగుచుదు పొడపుర్వున కలిగినట్లు." పి. శకుం. 1.128.

**పొడపెట్టు**

పొరలు.

"ఇలమీఁదఁ దలదాఁక నీ ప్రక్క నా ప్రక్కఁ, బెడమర్లుగాఁ బొడపెట్టి పెట్టి." కాళ. 2.147.

**పొడ పొట్ట**

అడ పొడ, జాడ.

"వరుని పొడపొట్టెఱుంగక, విరహానలశిఖలచేత వేఁగెఁడు చెలికిన్." ఉత్త. హరి. 5.174.

**పొడమాయించు**

చంపు.

"ఉ, బ్బెక్కించుచున్ బడవైచుచుఁ జించుఁ బొడమాయించున్ బిశాచావళిన్." కావ్యా. 2.103.

**పొడముతెంచు**

పుట్టు, కలుగు.

"హేమాంబురంబు, పూర్వ మగువిన్కు మది వెడ పొడముదేర." పాండు. 5.299.

**పొడయు నీడయు బోలె**

ఎడబాయక అనుట.

"పొడయు నీడయుఁ బోలె నీడ్వక మెలంగి, యబల కంటికి ఱెప్ప వై యరయ వమ్మ." విక్ర. 4.198.

**పొడయెండ గాయని**

ఎండపొడ యేమాత్రము లేని.

"పొడయెండ గాయనిపొన్నగున్నల
నీడ." హంస. 4.16.

**పొడలమెకము**

దుప్పి. శ. ర.

**పొడలు పెట్టు**

ఆయాసపడు.

"పొడలు పెట్టుచుఁ దన కడు గామ
డై యుండ." కా. మా. 3.193.

**పొడ వగు**

1. వర్ధిల్లు.

"తల్లిదండ్రులఁ బూజించి తగ
వెలింగి, మన్నపొడ వైనసే యత్త
మామ లనియు."

2. ఎసుగు.

భాస్కర. 20.

3. రూపొందు.

"ఆరజ మెల్ల నొక్క పొడ వయ్యె
ననంగను." విప్ర. 5.25.

"సంపదన్ బొడ వగునట్టి గేహినులె."
నిరంకు. 2.87.

**పొడ వడంగు**

రూపు మాయు, స్వరూప
నాశన మగు.

"సవరించు నెవ్వఁడు జఠరగోళంబునఁ,
బొడ వడంగక యుండ భూతగణము."
కళా. 5.90.

"పొరిసిన యశ్వంబులను బొరలెడి
రౌతులును, బొడ వడంగుపల్లంబులును
......" కళా. 8.129.

**పొడ వడచు**

నశింప జేయు.

"హయవేదండస్యందనపదాతితతిఁ
బొడ వడఁచెన్."
భార. భీష్మ. 1.293.

**పొడవడు**

1. అగపడు.

"అహూతు లైనమహామునీశ్వరులచేఁ,
బొడవడ దయ్యె భూభువనతలము."
పారి. 5.67.

2. బలహీన మగు.

"ప్రాఁకుల శిలలను బీనుఁగు, ప్రోకలు
గావించి రపుడు పొడవడక వడిన్."
భా. రా. యు. 534.

**పొడ వఱు**

రూపు మాయు.

"పొడవడి పొక్కితిం బొలిసి పోయితిఁ
బొమ్మని..." భాస్క. అయో. 341.

**పొడవు**

రూపు, ఆకారము.

"రతి...శిఖిపొడల నిజేశ్వరు పొడవు
గానక." కుమా. 5.59.

**పొడవు కెక్కు**

పేరు కెక్కు.

"పూని దేవేంద్రాదు లై పొడవు
కెక్కినవారు." తాళ్ల. సం. 5.236.

**పొడవు లెక్కించు**

పైకి యెత్తిపెట్టు.

"పోపో నీ వాపె నెంత పొడవు
లెక్కించినను." తాళ్ల. సం. 3.591.

**పొడవు లెక్కు**

పై కెక్కు, ఎత్తు లెక్కు.

"కొండగుహల నుండ నోడి పొడవు
లెక్కెడి ననఁగ."
భాస్క. యుద్ధ. 466.

పొడవు సూపు
ఏడసూపు, ఆకారమును చూపు. కనిపించు అనుట.
"పొడవు సూపక దాచి తీ పొదల లోన." కుమా. 5.63.

పొడవు సేకొను
మూర్తీభవించు, రూపము గొను.
"చీకటి యెల్ల నొక పొడవు సేకొని యెనొ నా, నాకాశ మడరి వచ్చె." కుమా. 2.64.

పొడవు సేయు
నిక్కించు, పైకెత్తు.
"కడఱెప్ప లూరయంగఁ గనుఁదమ్మి లరమోడ్చి, బొమదోయి యొక్కింతఁ బొడవు సేసి." నైష. 5.9.

పొడసుత్తె
చిన్నసుత్తె.
(శ. ర. బ్రౌన్.)

(వాని) పొడిచి త్రోయు
ఒక తిట్టు.
"బూచివలెఁ జూచు నను వానిఁ బొడిచి త్రోయ." శుక. 2.111.
చూ. వాని పొడు గాను; వాని జిమ్మ పడ.

పొడిచీకటి
చిఱుచీకటి.
"భూరిశ్రవుఁ డొక్కనితోఁ, బోరఁగ నేయించి తట్లు పొడిచీకటి నం, హారరహితు." భార. శల్య. 2.326.

పొడితెమ్మెర
పిల్లవాయువు.
"పొడితెమ్మెర తృణాగతిఁ దరలిం పఁగ." వేం. పంచ. 1.110.

పొడిదగ్గు
శ్లేష్మము తెగక వట్టిధ్వనితో వచ్చుదగ్గు.
"పొడిదగ్గు కంఠంబుఁ బొరివుచ్చకయ మున్న." కాశీ. 3.84.

పొడి పోసికొను
పొట్టపోసికొను.
"బొడి పోసికొనంగఁ జెప్పబుధులుం గలరే." ద్వా. 5.287.

పొడిబడుకొను
శుష్కించు, నిస్సార మగు.
"పొడిబడుకొనుచు నప్పురు డెల్లఁ గడిపి." ద్వి. పరమ. 3.150. పొ.

పొడిమాట
మామూలు చిన్నమాట.
జగ. 94.

పొడి సేయు
1. చూర్ణము చేయు.
"అంతటఁ, బొడి చేసెఁ దదస్త్ర మసురకోన్." కళ. 2.150.
2. భస్మము చేయు.
"యుగము గాల్చిన చేఁదు జగము గాల్చిన జోదు, గడి సేయఁ బొడి సేయఁ గలుగఁ డేని." రుక్మాం. 5.71.

పొడుగుచేతివాని పణ్యారము
ఉన్నతులకే దొరకు ననుట. కొన్ని పండుగలలో పణ్యారపుబండ్లని కడతారు. ఆ బండ్లలో నానబోసిన పెసర

పప్పు తీసుకొని వెళ్లి దేవాలయం చుట్టున త్రిప్పి అక్కడ చేరిన తీర్థ ప్రజకు పంచుతారు. బండి యెత్తుగా ఉంటుంది కనుక సహజంగా ఎత్తుగా ఉన్నవానికే ఆ పణ్యారం దొరుకుతుంది. అందుపై వచ్చిన పలుకుబడి.
సింహా. నార. 53.

పొడుగుమడుగు

ఆకాశగంగ.

"పొడుగుమడుఁగును గాంచినయాతుఁడు వాఁడు." చంద్రా. 1.70.

పొడుపుకథ

గూఢమైన భావము కల సమస్య.

"పిల్లలకు పొడుపుకథ లంటే చాలా యిష్టం." వా.

"మా అబ్బాయి పొడుపుకథ లంటే చాలు చెవి కోసుకొంటాడు." వా.

పొడుపుకొండ

తూర్పుకొండ.

సూర్యోదయం తూర్పుపర్వతంమీద అవుతుం దనీ, క్రుంకడం పడమటికొండమీద ననీ అనుకొనేవారు.
కాశీ. 1.125.

పొడుపువ్రేలు

చూపుడువ్రేలు.

"పంచాంగ మొకకేలఁ బొడుపువ్రేల, వెండి యుంగరమును." శుక. 2.442.

పొడుముకాయ

ముక్కుపొడి ఉంచుకొనే మారేడుబుఱ్ఱ.

పొడువగ బోయెదు

ఏదో పొడుస్తా నని పోతున్నావు. వ్యంగ్యం ఎత్తిపొడుపు. నేటికీ వాడుకలో 'ఏదో పొడుస్తా నన్నావే?' 'వా డేదో పొడుస్తా నని వెళ్ళి చెవులు ఝాడించుకొని తిరిగి వచ్చాడు.'

"ఎడపక పంచె నాతఁ డొక యేలిన వాఁ డని పూన్కికాఁడవై, పొడవఁగఁ బోయెదవు." సమా. 4.62.

పొణకుకట్ట

తేలికమైన ఒక జాతికట్ట.
శ. ర. బ్రౌ.

పొతము తప్పగ జేయు

విప్పు, విడిపో జేయు.

"శతబలి మూటను బొతము దప్పఁగఁ జేసి." భాస్క. యుద్ధ. 1272.

పొత్తము గట్టుకొని పోవు

స్వస్తి చెప్పు.

"నెతురు గ్రక్కుచు మూర్ఛ, యత్నంబై తెలిసి వరుణుఁ డనిమొన నిలువం, జిత్తంబు లేక బీరపుఁ, బొత్తము గట్టుకొని పోయెఁ బోయినపోకై."
ఉ. హరి. 1.32.

దాని నంతటినీ మడిచి చంకను పెట్టుకొని పోవు. కట్టిపెట్టి అనుట.

పూర్వం తాటాకు పుస్త
కాలు కనుక పఠనం చాలించి
నప్పుడు వాటిని ముడిచి కట్టు
కట్టడం అలవాటు. అందుపై
వచ్చిన పలుకుబడి.

**పొత్తరలు పట్టు**

స్వయంపాకము గ్రహించు.

"శిష్టు లయినపురోహితులు పొత్తరలు పట్టడం అవమానంగా పరిగణిస్తారు."
వా.

**పొత్తికడుపు**

బొడ్డుక్రింది కడుపు.

**పొత్తిగడ్డ**

పొత్తి.
శ. ర.

**పొత్తిచీర**

పట్టుచీర.

"చెలఁగి చెలఁగి పొత్తిచీరలు గట్టెడు, మాసకమ్మకు దీర్ఘ మాయు రస్తు."
క్రీడా. 214.

**పొత్తిదామర**

ముడుగుతామర.
శ. ర.

**పొత్తినూలికాయ**

పట్టుకాయ.

**పొత్తినూలిపుర్వు**

పట్టుపురుగు.

"అతఁడు పొత్తినూలిపుర్వట్లు తాన, తనకు బంధంబు గావించుకొను లతాంగి ......"
భార. అను. 5.230.

**పొత్తినూలు**

పట్టుదారము.

**పొత్తిపాగ**

పట్టుపాగ.

"పొసఁగఁ జుట్టినయట్టి పొత్తిపాగలును."
ద్వి. పరమ. 3.188. పా.

**పొత్తుకత్తె**

స్నేహితురాలు.
భాగ. 10. పూ. 770.

**పొత్తుకాడు**

స్నేహితుడు.
శ. ర.

**పొత్తు గలయు**

ఒకటిగా కూడు.

"బొత్తు గలసి నీవును నీ, తత్తబడలు రెండు గాలిచెదం బరువడితోన్."
ఉ. హరి. 3.116.

**పొత్తు గలియు**

సహభోజనము చేయు.

"పూన్చి యటు డించి తాను బొత్తు గలిసి."
పాండు. 3.87.

**పొత్తు గుడుచు**

కలిసి భుజించు.

"సత్యములు పొత్తు గుడుచు నా సన్నుతాంగి."
రాధికా. 4.11.
అని ప్రాఁ.

**పొత్తుగొను**

కలియు..

"అన్నరభోజను డతుక డుఁ బొత్తు గొని."
భాగ. 10. పూ. 479.

**పొత్తు చేయు**

స్నేహము చేయు.

"గారవమునఁ బొత్తు చేసి కపిసేన లతో." భా. రా. కిష్కిం. 37.

**పొత్తుటాలు**

వేశ్య.

సాం. ని. మాన. 13.

**పొత్తున గ్రోలు**

కలిసి ఒకపాత్రలోనే త్రాగు.

"తనుఁ గనుఁ బ్రామి యొండొకల తం బతి వేఁడొక తేఁటి బోటి పొత్తున విరిదేనె గ్రోల." పారి. 3.57.

చూ. పొత్తుల భుజించు.

**పొత్తుపడు**

అనుకూలపడు.

"ఎన్నివిధాల చూచినా వాళ్ళకాపురం పొత్తుపడ లేదు." వా.

**పొత్తుపఱుచు**

అనుకూలము చేయు.

"మీ రెలాగో ఒకలాగు ఆ వ్యవహారం పొత్తుపరిచి తీరాలి. లేకుంటే మర్యాద దక్కేట్టు లేదు." వా.

**పొత్తు పోవు**

సరిపడు, కుదురు.

"కురువింద పూఁదేనె పెరలకై తమలోనఁ, బొత్తు వోవక సారెఁ బోరుఁ గొన్ని." పాండు. 1.181.

"ఆ సరుకులు పొత్తులు పోక అట్లే పడ వేసి పెట్టినాడు." బ్రౌ.

**పొత్తుల కాపు**

ఉమ్మడిరక్షకుడు.

"నన్నింద్రియాల గట్టి వైచి పొంత జూచే విటు నాకు బొత్తుల కాపు వుగా." తాళ్ల. సం. 9.169.

**పొత్తులకూడు**

సమష్టిభోజనము.

చాపకూడులాంటిది.

తాళ్ల. సం. 11.35.

**పొత్తులది**

అందరికీ చెందినది. సమష్టి సొత్తు, అనగా వేశ్య అనుట.

"ప్రోలు దొలంగి తేమిటికిఁ బొత్తుల దానవు నీవు తొయ్యలీ!" ఉ. హరి. 1.61.

**పొత్తుల భుజించు**

ఒకచే కంచములో తిను.

"తనదు మోహపు రాణియుఁ దానుఁ గూడి, పొత్తుల భుజింపఁగా నొక్క బోనకత్తె." శుక. 3.228.

ఇద్దఱికి చెందినది, ఇద్దఱు కలిసి అన్న అర్థంలో నేటికీ వాడుకలో ఉన్నది.

"వాడిపొత్తల కూర్చోనా అన్నానికి." వా.

"మాకూ వాళ్ళకూ అది పొత్తల గోడ." వా.

**పొత్తుల భుజించు**

ఒక కంచములో తిను.

"పువ్వులఁ బోణులుఁ దాను బొత్తుల భుజియించు, మధురసుధాహారవిధిఁ దొఱంగి." కా. మా. 2.119.

**పొత్తులల్లుడు**

పెక్కుమందికి అల్లుడైన వాడు.

సామాన్యంగా వేశ్యాలంపటు డైన విటుని గూర్చి అనే మాట.

"ఇక్కడ నీకు అత్త లెవ్వ రోయి, ఊరఁ బొత్తులల్లుఁడా!" తాళ్ల. సం. 12.322.

చూ. వాడవారి మఱఁది.

## పొత్తు వచ్చు

సమాన మగు.

"పుష్పదుండుభకంబుతోఁ బొత్తు వచ్చు, పడఁతిపాలిండ్లపై నొప్పు పసిఁడి పేరు." శివ. 2.61.

## పొత్తువాడు

సమిష్టిగా ఉండువాడు.

అనేకులతో సమాన మైన సంబంధము కలవాడు.

"బొత్తుగా నాడి యోటమి పొత్తువారి, మీఁద లెక్కించి వంచన మెఱయు వారు." దశకు. 5.65.

## పొత్తు వోవక

సరిపడక.

"గురువింద పూఁదేనె పెరలకై తమ లోనఁ, బొత్తువోవక సారె పోరుఁ గొన్ని." పాండు. 1.181.

'పొత్తు కుదురు' కు వ్యతిరేక మయిన మాట.

చూ. పొత్తుల భోజనము, పొత్తుల గోడ.

## పొదకల నెత్తు

పెద్దగొంతుతో అఱచు.

"పొదకల నెత్తి యా పుత్రునిఁ జేరి, వెదకుచు నో లతాబృందములార!" నవ. 91 పా. 10 పం.

## పొద పెట్టికొను

చేర్చుకొను.

"సమస్త దానవులఁ బొదపెట్టికొని తలపూవాడ నీక యింద్ర జిత్తుఁడు జయోపేతుఁ డై." వర. రా. యు. పం. 2. పు. 324.

## పొదపెట్టు

పోగొట్టు.

"గాడ్పులు, పొదవెట్టు రజోవికార ములు దూరముగన్." పాండు. 4.221.

## పొదపొదడు

పదుడు పదుండు.

వాడు కలో పద పదండి.

పదండి పదండి.

"పొదపొదఁ డిపు డేమి పోయె మీ రా క,నుచు." పండితా. ద్వితీ. పర్వ. పుట. 289.

## పొదరిండ్లచుక్క

పునర్వసు నక్షత్రము. శ. ర.

## పొదరుకొను

గుమి కూడు.

"తమలోనఁ బొదరుకొని యుష్ట్రిము వాకిట నిల్వఁ బనిచి రహి నమ్మాఁడున్." వేం. పంచ. 1.493.

## పొదలాడు

1. అతిశయించు.

"కౌతుకంబులఁ బొదలాడఁగాఁ బ్రియుండుఁ, బ్రియయుఁ గ్రోలిరి నూతన ప్రేమరసము." హరి. ఉ. 7.183.

2. సంచలించు.

"గ్రుడ్డులఁ బొదువు నక్కవలు

దవ్కుటగాక, పొదలాడెఁ జెట్లపైఁ బులుఁగుమూఁక.''
పాండు. 4.292.

పొదలికకత్తెర
ఒకానొక మల్లబంధవిశేషము.
"సర్వబంధకత్తెర జాగెనకత్తెర పొదలికకత్తెర..." ప్రబంధ. 38.

పొదలికదండ
"అవ్వీరుండు సమదండ......పొదలికదండ......కుక్కుటపుదండ మొదలుగాఁ గల." హంస. 1.206.
చూ. పొదలికకత్తెర.

పొదలి పుచ్చు
కప్పిపుచ్చు, దాచు.
"ఆదలించి కాదు లేఁ డనుచు నీకల్ల, పొదలి పుచ్చఁగ నింకఁ బోలదు నీకు." నవ. 2.87 పా. 30 పం.

పొదలుకొను
అతిశయించు.
"ఉరగవల్లీ గాఢపరిరంభణంబులఁ, బోఁకక్రమాఁకులఁ గెంపు పొదలు కొనఁగ." కాశీ. 1.91.

పొదలు వానింట పులిజున్ను కూడ
కష్టసాధ్య మయినవి 'కూడ కల వనుటలో నుపయోగించు పలుకుబడి—సర్వే సమస్తము ఉన్న వనుట.
"పాఱువాతిన్నె లిఁకఖీఁదఁ బలుక నేల, పొదలు వానింటఁ బులిజున్ను మొదలు గాఁగ." శుక. 3.7.

పొదవెట్టు
1. సమీకరించుకొను, బలము కూడ గట్టుకొను.
"పోయిన ప్రాణంబు పొదవెట్టి తేరాదు." వేంకటేశ శతకము. 18.
"అది కారణముగ నతనికి, సదృశం బగు గుణము నీకుఁ జాలదు భువిలోఁ, బొదలని పెద్దఱికంబులు, పొదవెట్టక లేచి పొమ్ము భోజనృపాలా!" ద్వా. 2.
శ. ర. లో సూచించు, ఆరోపించు అన్న అర్థాలు ఇచ్చారు కానీ అన్ని ప్రయోగాలలోనూ అవి అతుకుట లేదు
"విద్యల యెఱుకం బొదవెట్టుట." సింహా. 2.49.
2. నటించు.
"పరబలము మీఁద సేనలఁ, బురికొల్పెడువాఁడ పోలెఁ బొదవెట్టుచు న,మ్మురవైరి తఱుముకొని చనె." జైమి. 5.54.

పొదికట్టు
1. వాకిటి ముందరి వసారా.
"ఒక వైష్ణవగృహంబునకు నెఱుంగక యేఁగి, పొదికట్టుమఱుఁగునఁ బొంచి యుండ." పరమ. 4.186.
2. మూట కట్టు.
"పురులపొదికట్టి మెఱయుచుఁ, బురులీకయ డక్కి పోయె." కుమా. 8.140.

పొది గూడు
గుంపు కూడు.

"పొదిగూడి తెక్కలఁ బొదువు కొన్న." పాండు. 1.181.

**పొదిగొను**

గుంపు కూడు.

"పదివేలకోటుల భానుతేజములు, పొది గొని లోకముల్ పొదివినయట్లు." రం. రా. అర. 162 పొ. 16 పం.

**పొది చెడు**

పాడగు.

"ఇ, ట్లద నరసి యరుగఁ దిరుగం, బొది చెడియెఁ బైరు." వేం. పంచ. 3.50.

**పొది విరియు**

పదిలము తప్పు.

పొది అమ్ములపొదిలోని పొది వంటిదై అది ప్రిదిలిపోయి నట్లుగా కట్టు తప్పి అనుట అవుతుంది.

"పొది, విరిసి మహేశ్వరు మనంబు వికలం బయ్యెన్." కుమా. 5.37.

**పొది పెట్టుకొను**

గుంపు గూడు.

"పొదిపెట్టుకొని వచ్చి పురము లోఁ జొచ్చి" వర. రా. అయో. పు. 554. పం. 13.

**పొదుగ బట్టు**

కప్పి పట్టుకొను.

"కనుపీక దాని నిరుగేలం బొదుగఁ బట్టుకొని పరమకరుణాపరవశ త్వంబున." కళా. 3.120.

**పొదుగు చేయు**

పెద్ద పొదుగు కలది యగు.

"ఆవు పొదుగు చేసింది. ఇంక పది రోజుల్లో ఈన వచ్చు ననుకుంటాను." వా.

**పొదుపు చేయు**

చక్కబరుచు.

"ఎలాగో తంటాలు పడి చితికిపోయిన సంసారాన్ని అతడు పొదుపు చేసు కున్నాడు." వా.

**పొదువ బట్టు**

పొదివి పట్టుకొను.

"అతివ మరలంగ మరలంగ నపుడు చెలులు, బలిమిఁ బొదువంగఁ బట్టి లోపలికిఁ దెచ్చి." కళా. 7.149.

**పొద్దు గ్రుంకితే ఎక్కడ పక్షి లక్కడనే**

వాడుకలో 'పొద్దు మునిగితే ఎక్కడి పిట్ట లక్కడనే' అని వినబడుతుంది.

బాగున్నపుడు అందరూ చుట్టుకొన్నా కాస్త కష్టస్థితి రాగానే ఎవరిపాటికి వారు పోతారు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

బాణాల. కాశీ. 24.

**పొద్దుబోకగా**

కాలక్షేపార్థము.

"ముద్దుగుమ్మ లమ్మగువకు పొద్దుబోకగా ముద్దుల సుద్దులు మెఱయ." హేమా. పు. 40.

**పొద్దు మునిగితే ఎక్కడి పిట్ట లక్కడనే**

చూ. పొద్దు గ్రుంకితే......

## పొద్దు వాటాలేదాక

ఎండ చల్లబడేవరకూ.

"పొద్దు వాటాలేవరకూ ఈ బావిదగ్గర బండ్లు విడిచి సద్దిమూటలు విప్పుదాం. ఈ చెట్టుకింద పండుకొని తరువాత బయిలుదేరి పోదాం." వా.

## పొనరారు

ఒప్పు.

"అనిమిషద్విరదంబు హస్తంబులోనఁ, బొనరారు వెలిదమ్మి పూమొగ్గ యనఁగ."

ద్వి. తి. సా. 1.4 పా. 16 పం.

## పొనరువడు

పొందుపడు.

శ. ర.

## పొనుంగుపడు

1. ఆరిపోవు.

లక్షణయా నిస్తేజు డగు, దుర్బల మగు మొదలయినవి యర్థములు. ఎక్కువమంది అగ్నిసంబంధముగా చల్లారు అన్న అర్థంలోనే ఈపదాన్ని ఉపయోగించినారు.

చూ. శ. ర.
పాండు. 4.111.

2. నిస్తేజ మగు.

"పొనుగుపడియె సత్యమున బ్రహ్మ తేజంబు."

భాగ. స్క. 8.628.

## పొనుగుడుపడు

క్రుంగిపోవు.

"ఎఱకలు కాని పొనుగుడుపడి మూర్ఛం బుడమిపైఁ ద్రెళ్లి."

వర. రా. కిష్కి. పు. 512. పం. 15.

## పొనుగు వోవు

క్షీణించు.

"కృతవిచారుం డగునతని చేతోవృత్తి, మననవర్జితమునఁ బొనుఁగు వోవ."

వా. రా. 3.32.

## పొనుపడగు

క్షీణించు.

"అన్య తేజముల్, పొనుపడఁగంగ నెంత యును బొందుగ నిండి వెలుంగువేడ్క తో." ధ నా. 3.29.

## పొనుపడు

నిస్తేజ మగు.

"పుత్రులు గ్రహములనుబోలెఁ బొను పడుదురు." విజ్ఞా. ఆచా. 131.

## పొనుబాటు

పొందుబాటు.

"అ, పోహంబుగ నుండుఁ గాక పొనుఁబాటగునే." కేయూ. 3.6.

## పొన్నట్టు

ఒక రకమైన తెడ్డు.

ఆం. భా. 2.244.

## పొన్నాకుపై తేనె

అస్థిర మైనది.

"పొన్నాకుపై తేనె సన్నచంద్రిక మోవి, మాధుర్య మనక వేమాఱు పొగడి."

పాండు. 3.72.

## పొన్నూరు

పొరుగూరు.

"ఉవిదయుఁ దానుఁ బొన్నూరి కేఁగు
చును." బస. 3.70.

పొయిదల

కృత్రిమశిరస్సు.
కన్నములు వేసేదొంగ లుప
యోగించే ఒక సాధనము.

"పొయిదల నీలిదిం డొలికిబూడిద
ముండులబంతి." దశకు. 5.72.

పొయ్యిలో పిల్లి లేవ లేదు

వంట చెయ్య లేదు.
పిల్లి వెచ్చగా పొయ్యిలో
పడుకోవటం అలవాటు.
దానిపై వచ్చిన పలుకుబడి.

"వాళ్లింట్లో మూడురోజులనుంచీ
పొయ్యిలో పిల్లి లేవ లేదు." వా.

పొయ్యేకాలము వచ్చు

"నీ కేం పొయ్యేకాలం వచ్చిందిరా ?"
వా.

చూ. పోగాలము వచ్చు.

పొరక తిప్పి వేయు

మర్దించు.

"ఆవిడ నేమన్నా అన్నా వంటే
పొరక తిప్పి వేస్తుంది. జాగ్రత్త" వా.

పొరకపుల్లతో దేఖీలు

యావత్తు.
ఇది రాయలసీమలో ఉప
యోగించే పలుకుబడి.

చూ. పొరకపుల్లతో సహా.

పొరకపుల్లతో సహా

యావత్తు.

"వాళ్లింట్లో పొరకపుల్లతో సహా వాళ్ల
అత్తగారింటినుంచి వచ్చినదే. వీడు
సొంతంగా కొన్నది ఒక్కటీ లేదు."
వా.

చూ. పొరకపుల్లతో దేఖీలు.

పొరకసుడి

వీపు మీద ఉన్న సుడి. ఈ
సుడి ఉంటే దెబ్బలు తింటా
రని ఒక నమ్మకం.

"వాడి కేదో పొరక సుడి ఉంది.
ఎక్కడికి పోయినా వాడికి మర్దనం
తప్పదు." వా.

పొరచూపు లేక

భేదదృష్టి చూపక.

"పోషింతురే మీరు పొరచూపు లేక
నా, యరిది చెల్లెలి వచ్చి యత్తవారు,
తోడ్కొని పోయిరే ?......
శుక. 2.520.

పొరతెరువు

తప్పుడుత్రోవ.

"చెదరి పొరదెరువులం బఱవకుండ
నరముల సందుసందులన్."
మను. 4.37.

పొరపడు

ప్రమాదపడు.
శ. ర.

పొరపాటు

ప్రమాదము.
శ. ర.

పొరపాఱు

తప్పుదారిని పోవు.

పొరపొచ్చము

కపటము.

చూ. పొరపొచ్చెము.

"బెదరుచు నంతరంగమున భీతికిఁ గండ వడంబు సుట్టి ప్రక్కఁదు పొరపొచ్చె ముఁ జెఱపు గేనము..."
కు. సం. 4.59.

పొరపోవు
నీరు త్రాగేటప్పుడు ప్రమాద వశాత్తుగా ఆనీరు తప్పు దారిని పోవు.
అప్పు డెవరో మనలను తలచుకొంటున్నా రనడం, అనుకోవడం అలవాటు.

పొరలాడు
దొరలాడు, పొరలు.
"విరహతాపమునం బొరలాడు లక్ష్మి కిన్." జైమి. 8.25.
"వసుంధరాస్థలిం, బడి పొరలాడుచుం బడెడుపాటులు చూడవు."
శేష. 1.

పొరలుదండము
నేలపై పొర్లుచూ పెట్టే దండము.

పొరలు వెట్టు
పొరలబడు.

పొర లెత్తు
పొరలు కలది యగు.
"పై నభ్రకముల్, పొర లెత్తి కదియ మూసిన, కరణి నుమాదేవిపదనఖం బులు వెలుఁగున్." కుమా. 3.44.

పొరిగొను
చంపు.
కాశీ. 3.38.
సింహా. 1.247.

పొరిచూపు
భేదదృష్టి.
"మనలో మన మిటు పొరిచూపున నుండక నిచ్చ." పాంచా. 2.53.

పొరిపుచ్చు
పాడు చేయు.
"పాడిదగ్గు కంఠంబు పొరిపుచ్చకయ మున్న." కాశీ. 3.84.

పొరిబొరి
పై పై.
"పొరిఁబొరి వల్కలంబులు దొలంగు టయుం."
వర రా. బా. పు. 31. పంక్తి. 22.

పొరిమాల్చు
పరిమార్చు, ధ్వంసము సేయు.
"పరసమయంబులఁ బొరిమాల్పఁ దాఁకు, ధర రుద్రునిటలాగ్ని తగ రేగు డెంచె." బస. 5.130.

పొరుగింటి పొరచి
పొరుగింటి పడుచు.

పొరుగిరుగువారు
ఇరుగుపొరుగువారు.
"బొరుగిరుగువారున్." హంస. 5.114.

పొరుగూరి సుఖము
వట్టిది.
శరభాంక. 17.

పొర్లబాఱు
చెదరి పోవు.
"......దానవుల్ బెదరి పొర్లంబాఱు యుద్ధాగ్రకుం,డలితం బై." చంద్రా. 1.9.

పొర్లాడు
పొరలు.
చూ. పొరలాడు.

పొర్లుకట్టు
వెల్లువ రాకుండా వేసేకట్ట.
శ. ర.

పొర్లుగింతలు పెట్టు
దొరలి పడు.
"దబ్బునం గూలి నెత్తంబుకట్టులఁ బొర్లిగింతలు వెట్ట."
ఉ. రా. 3.78.

పొర్లుదండము లిడు
పొర్లుదండాలు పెట్టు.
"నేలపై పొరలుచు దండములు పెట్టు, మఱియుఁ గటిఘుటితార్ద్రవసనఖండంబులతోఁ బొర్లుదండము లిడువారలకు..."
శుక. 2.10.
మ్రొక్కుబడు లున్నవారు పసుపు గుడ్డలు కట్టుకుని దేవాలయము చుట్టూ ప్రదక్షిణము చేయుచు నేల పై పొరలుచు దండములు పెట్టుట నేటికీ వాడుక.

పొఱడు వుచ్చు
వీపు గూనుపఱుచు.
"పొఱడు వుచ్చుచు భుజంబులు బలియుచును."
పండి. పర్వ. 371 పొ.

పొఱడు వోవు
వీపు వంకర యగు.
"పొఱడు వోయినవీఁపు పొఱడు మానుటయు."
బస. పు. 6.178 పం.

పొలకట్టు
అచ్చుకట్టు.
కాశీయా. పు. 27.

పొలతుల నమ్మకము
పట్టి దనుట.
స్త్రీలు విశ్వాసహీన లని ప్రాతవారిలో కొందఱి నమ్మకము.
శరభాంక. 17.

పొలపరి
జాడ తెలిసినవాడు.
"పొలుపున గద్దించుపొలపరు గలసి."
ద్వి. హరి. పూ. 569 పం.

పొలపవెల్లి
నిండుప్రవాహము.
"వృష్టిబాధఁ బొరయక తొలంగుచుండం, బొలపవెల్లి యైనజలపూరంబు..."
కళా. 4.95.

పొలమరి
పొలపరి.
"పొలమరులందుఁ గూఁత లిడ..."
ఆము. 3.27.
ఆం. భా. 3.49.

పొలయలుక
ప్రణయకోపం.
శమా. 8.146.
రూ. పొలయల్క.

పొలయల్క
ప్రణయకలహము.
(పొల్ల+అల్క).
కాశీ. 3.37.
రూ. పొలయలుక.

**పొలసాడు**

ఊగాడు, సంచరించు.

"ఘనవీథిఁ బొలసాడు ఖచరాంగనా పాంగ,తరళాక్షరుచులు సౌదామను లుగ." కుమా. 9.141.

"బొండు మల్లియలపైఁ బొలసాడు బొలసాడి, పుష్పంధయంబులఁ బోవఁ జోపు." విక్ర. 1.

"తల యెత్తి చూచుచుఁ బలుమాఱుఁ దనతల్లి, పిలువంగ నటునిటఁ బొలసి యాడు." భోజ. 6.

రూ. పొలసి యాడు.

**పొలికలను**

యుద్ధభూమి.

"పంటకలను బొలికల నిది, గంట నిధానంబు గంట గాదే మనకున్." భార. భీష్మ. 1.99.

**పొలికేకలు**

పెద్దకేకలు.

పొలాల చుట్టూ 'పొలో పొలో' అని అరుస్తూ తిరుగుతారు. దానినిబట్టె వచ్చిన పలుకుబడి.

**పొలిజ్వరము**

నిలుకడగా ఉండక అప్పుడప్పుడూ విడిచి విడిచి వచ్చే జ్వరం.

**పొలిపాట**

కుప్ప నూర్పుడు పాట.

**పొలిపుచ్చు**

వ్యర్థపుచ్చు

హర. 5.57.

**పొలివెట్టు**

గుడి కేర్పరిచిన స్థితి.

శ. ర.

**పొలివోవు**

1. వ్యర్థ మగు, భంగపడు.

"ఎడ సూఱగొని లేచి సుడియూ తెమ్మెరలచేఁ, బొడముపుప్పొడి పొలివోవ కుండ." కుమా. 3.108.

"పొలివోనిశౌర్యరేఖం జెలఁగుచు." భార. భీష్మ. 2.1.

"తప మంతయుఁ బొలివోవక." మను. 6.4.

"జేజేలు పొలివోయి చేయునట్టిది లేక, కిన్కలోఁ గ్రుంగి." యయా. 3.5.

"అరిగి తురగముల సూతుం, బొరిగొన విరథుఁ డయి నృపతి పొలివోవక..." భార. ద్రోణ. 4.

"పలుకు దుర్ఘట మైనబాస దద్భాష, పొలివోవకుండంగఁ బూరించు నిపుడు." పండితా. ప్రథ. దీక్షా. పుట. 243.

2. చెడిపోవు.

"కని పొలి వోవనిమగనా, లిని గూర్చెద నీకుఁ జాల వేవడిఁ బొల్తొ, లినయది..." శుక. 1.535.

"పొలివోవుఁ దపము నని యెంచి వారిపై నలిగి శపింప." వర. రా. బా. పు. 76. పంక్తి. 2.

**పొలిసి పడు**

భగ్న మగు.

"బలధుర్యులు విమతు లున్నఁ బరకార్యంబుల్, పొలిసి పడుం..." వేం. పంచ. 3.141.

**పొలిసి పోవు**
ఉడుగు.
"భోగములు కోర్కె లేమియుఁ బొలిసి పోవు." వి. పు. 6.178.

**పొలునోరు**
వంకరనోరు.
శ. ర. బ్రౌన్.

**పొలుపారు**
ఒప్పు.
"బాడుఁ దామరఁ బుట్టి పొలుపారు బిడ్డ." రుక్మాం. 1.125.

**పొలుపు మీఱు**
అందము మీఱు, అందమగు.
"పొలుపు మీఱిన నెలవంక బోమలఁ జూచి." రుక్మాం. 2.125.
"...నింద్రనీలజ్యోతి రిందిందిరశ్రేణి, విలసనంబులచేతఁ బొలుపు మీఱ..." కళా. 2.10.

**పొలుపొందు**
ఒప్పు.
"పొలుపొంద యవనికాభోగభాసురము."
గా. హరి. ప్రథ. పంక్తి. 87.88.
"భూపాలతిలకమై పొలుపొంద నేలు."
రంగ. రా. బాల. పు. 10. పంక్తి. 9.

**పొల్ల సేయు**
వ్యర్థము చేయు.
"నామాటలు పొల్లసేయ నాయమె నీకున్." పద్మ. 9.51.

**పొల్లికట్టు దంచు**
వ్యర్థప్రయత్నము చేయు. పొల్లున బియ్యము దంచు అని వాచ్యార్థము.
"ఎల్లధాన్యములు ఇంటిలో నుండఁగాను, పొల్లికట్టు దంచే మని బుద్ధి మాకేలా?" తాళ్ల. సం. 8.190.

**పొల్లు పోవు**
వ్యర్థమగు.
"వారి నరపతిత్వంబు లడవిఁ గాసిన, వెన్నెలై పొల్లుపోవు."
వర. రా. అర. పు. 118. పం. 18.
"దళితశాతకృపాణదంష్ట్రి మై నైర్ఋత, భుజభుజంగస్వామి పొల్లు వోయె."
పారి. 5.12.

**పొల్లువడు**
తగ్గు, క్షయించు.
శ. ర.

**పొల్లు వోదు**
సత్యము.
"పొల్లువో దెన్నఁడు భూమి పుట్టఁగాఁ బుట్టినది." తాళ్ల. సం. 7.256.

**పొల్లు సేయు**
వ్యర్థము చేయు.
"తన కళాచతురత్వమున కద్భుతంబందు, బుధులు భోజుని నేర్పు పొల్లుసేయ." మార్కం. పీఠి. 39.

**పొళ్లు పొళ్లుగ బొడిపించు**
నలగ తన్ను.
"ఆత్మధరణీసలికిన్, నడుము లవి పొళ్లు పొళ్లుగఁ, బొడిపింపుము దస్యుబాధ పొందక యుండన్." ఆము. 4.256.

**పొసపోరు**
పసతో పోరాడేవాడు.

"అన్యులతోడఁ, బోసపోరై బండా రువు..." శివ. సా. 431.

పొసరాకు

దగ్గుకై వాసన చూచే ఒక ఆకు అని శ. ర.

పోకంత

కొంచెము – పోక అంత అనుట. ఇలాంటివే చీమంత గోరంత ఇత్యాదులు.

"పోకంతయు భిక్ష." భీమ. 2.124.

పోకకు బుట్టెడగు

ధాన్యము అతి చౌకగా లభించు.

ఒకపోకకు పుట్టెడు ధాన్యము లభించు ననుట. ఇది సుభిక్ష సూచకము.

ఈ క్రింది ప్రయోగంలో ధారణ అనగా మారకపు విలువ. ఆరోజులలో మారకము అంతా వస్తురూపమైన దనుట సువిదితము.

"ధారణ పోకకుఁ బుట్టెఁడయ్యె." జైమి. 6.9.

పోక చెయ్యడు

పనికి మాలినవా డనుట.

పోకడ పెట్టు

పోగొట్టు.

"పాపములఁ బోకడ వెట్టు నిజార్జితం బులన్." కాశీ. 5.48.

"కలధన మెల్లఁ బోకడఁ బెట్టి సన్యాసి,యై బిచ్చ మెత్తనియగ్రజుండు." హంస. 5.120.

"ఈ మేకలో ఇల్లంతా నానా అవస్థగానూ ఉంది. రేపు సంతకన్నా తీసికెళ్లి పోకడపెట్టి రా." వా.

పోకమాను

దమ్ము చేసిన తరువాత మిట్ట పల్లములు సరిపరుచుటకై మీద పారించే మాను.

చదునుపట్టె అని శ. ర.

పోకముడి

చీరచెంగు తొలిచుట్టులో వేసుకొను ముడి–నీవి.

"...రవికె పిగలఁ బోకము డూడిపోఁ జేర్మితోడ." హంస. 3.219.

పోకల బోవు

వేషములు పోవు.

"కేకరించి కొన్నిపోకలఁ బోయి య, చ్చెడెచూపు దన్నుఁ జేరకునికి." శుక. 1.516.

"బయలు సేయు నంతకు నేయే, పోకలఁ బోయినఁ బోనిమ్ము..." కళా. 2.86.

పోకవక్క

గొంటువక్క.

"దాఁచికొన్నను బలితంపుఁ జింపుడు గాక, పిక్కిన నోక పోఁకవక్క గాక." విప్ర. 5.19.

పోకారుచు

పోగొట్టు.

"అధ్వశ్రాంతి పోకారిచెన్."
శివ. 3.22.
రూ. పోకాడ్చు.

పోకార్చు

పోగొట్టు.

"అడియాసం బోకార్చి."
గా. హరి. ప్రథ. పంక్తి. 426.
రూ. పోకారుచు.

పోకిళ్లమారి

దుర్మార్గుడు.

"పాపిష్టి బజగేడి పంచమహాపాత, కియు వ్యతీపాత పోకిళ్లమారి."
హంస. 5.113.

పోకుల బోవు

మాయలు పన్ను, పోకిళ్లు పోవు.

"దేవుఁడుం, బూఁచినపూఁపు దప్పు టకుఁ బోకులఁ బోవుచు నుండు నమ్మె యిన్."
ఉ. హరి. 1.168.

పోగాలము వచ్చు

వినాశకాలము దాపురించు. ఇది చిన్నవారిని దండించే మామూలు తిట్టుగా కూడా అలవా టయినది.

"నీ కేం పోగాలం వచ్చిందిరా? ఊ రందరితోనూ కక్ష కట్టు కొంటు న్నావు."
వా.
నీ కేం పోగాలం వచ్చిందిరా? నీ ళ్లన్నీ పార బోస్తున్నావు?
వా.
చూ. పొయ్యేకాలము.

పోగునకు దగుల్పడు

చెవిని బడు.

"ఎక్కెట్టా! ముసు వీరల, గుట్టును నీ పోఁగునకుఁ దగుల్పడినదియే, యె ట్టుండె నట్టె చెప్పుము, గట్టిగ నావుడు మరాళ కామిని నగుచున్."
ప్రభా. 5.76.

పోచి పోత అయ్యలు

కబుర్ల రాయళ్లు, పోచిపోలు కబుర్లు చెప్పుకొనువారు.

"అట్టిది నా దగు పోచిపోతయ య్యలు."
గుంటూ. ఉత్త. 67.

పోటకందులు

తెల్లని కందులు.
శ. ర.
పోటికందులు అని బ్రౌన్.

పోటకత్తి

అడివిని నరికే పెద్దకత్తి.

"తోరపుఁ బోటకత్తుల వెదుళ్లు సమ గ్రము గాఁగఁ గొట్టి..."
పరమ. 1.127.

పోటి పుట్టు

స్పర్థ ఏర్పడు.

"లోలాక్షునకు నీకు లోలోన నే మేని, పోటి పుట్టును గదా మాట మాట."
భీమ. 2.88.

పోటుం బాటు అగు

అధిక మగు.

"ఒక్క యొడ్డున బాష్పాంబుఝురం బు లుప్పతిలెఁ బోటుం బాటు గా నెంతయున్."
మను. 3.136.

పోటుకన్ను

నొప్పి పెట్టే కన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

పోటుగంబము

ఊతగా నిలిపిన స్తంభము.

"పూన్చుబలొప్పెటుఁ గంబములో నా విలసిల్లుసౌధము లవాప్త స్వర్గసంసర్గతన్."

చంద్రా. 1.12.

పోటుగూతలు

శౌర్యోక్తులు.

"ఎలమావికొన నెక్కి పెళ పెళ నార్చి కో,వెల పోటుఁగూఁతలు వట్టి నేని." రాజ. చ. 3.80.

పోటుగొంగ

వీరుడు, పోటుమానిసి.

"ఇంత భయమునఁ బొంద నీ కేల మది భు,జంగభూషణు నొక పోటుగొంగఁ జేసి." కుమా. 4.70.

పోటుగొను

పొడుచు.

"పోటుగొనం గిట్టి పట్టి పొరిఁ బ్రాణంబుల్." భా. రా. యు. 720.

పోటుదొర

వీరుడు.

"తనకు జడిసి పోటుదొరలు చెరలఁగా ......" రాఘవ. 4.202.

పోటుపాటు

ఆటుపోటు. జం. కాశీయా. 268.

పోటు పొడుచు

సముద్రము పొంగు.

ప్రవాహావిషయంలో ఆటు పోటు లని ఉపయోగిస్తారు. ఆటు అనగా తగ్గుట. పోటు పొంగుట. ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

పోటు పొడుచు అనే అర్థంలోనే 'పోటెత్తు' అని కూడా ఉపయోగిస్తారు.

"అనుదినపూర్వాహ్ణవేళలఁ బోటు, పొడిచి విచ్చిన నీటి ఘోరరవము."

కా. మా. 4.60.

పోటుబంటు

శూరుడు.

"........నీ వొక పోటుబంట వై, మిన్నక వచ్చి తేల? పులిమీసల నుయ్యాల లూఁగ వచ్చునే?"

విక్ర. 4.

పోటుబంటు జేయు

యుద్ధవీరుని చేయు.

"పనివడి తామ తనుఁ బోటుబంటుం జేసెన్." విప్ర. 2.61.

పోటుమగలు

1. వీరులు, భటులు. కుమా. 4.75.

2. శౌర్యసంపన్నులు.

"మేటు లగుపోటుమగ ల,వ్వీటన్ విహరింతురు." పాండు. 1.116.

పోటులాడు

పోట్లాడు.

"తండ్రి బిడ్డ యన్నదమ్ముఁడు నా కెత్తి, పోయి పోటులాడి పుడమి గొంద్రు." భార. భీష్మ. 1.42.

పోటొడ్డు

ఎదురు ఒడ్డు.

"పోటొడ్డి గెలిపించెఁ బూర్వగీర్వా

ణుల, నారాయణుని తోడఁ బోరి పోరి.'' ఉ. హరి. 4.220.

''ఆ నారాయణనంత పెద్దరెడ్డికి పోటాడ్డి కూర్చున్నాడు. ఏమవుతాడో ఏమో!'' వా.

**పోట్లగిత్త**

పొడిచే యెద్దు.

కలహశీలి యనుట.

మదన. శత. 23.

**పోట్లాట**

యుద్ధము. జగడము.

ఆం. భా. 2.222.

**పోట్లావు**

పొడిచేస్వభావం కల ఆవు.

శ. ర.

**పోడిమి చెడు**

అందము చెడు.

''నేఁ డేడుదినము లయ్యెన్, బోఁడిమి చెడ సాఁగి నీకు బూటకమో.''

కా. మా. 3.98.

**పోడిమి మాలు**

పౌరుషము తొలగు

''దైవతపతి కింకరక్కసులవాఁడిమి పోఁడిమి మాల్చి గెల్చి.''

ఉ. హరి. 1.177.

**పోడు గొట్టు**

అడవిలో నేలమీద వుండే తుప్పలూ మొదలయినవానిని నఱుకు.

''చేను కావించి పై రిడఁ జెట్లు గొట్టె, నసెకుమాటకుఁ బోడుగొట్టనఁగఁ జెల్లు.'' ఆం. భా. 3.106.

**పోత పోసిన విగ్రహము**

దిద్దితీర్చిన ట్లున్న దనుట.

''ఆ అమ్మాయి పోత పోసినవిగ్రహంలా ఉంటుంది.'' వా.

**పోతర మెత్తు**

గర్వించు.

''పోతరించిన కాఱెనుపోతు లచట, వచ్చి మదహస్తితోడఁ గొమ్మిచ్చు నధిప!'' చంద్రా. 2.65.

**పోతాచాకిరీ చేయు**

అయిష్టంగా చేయు.

పోత – పోషణ. అనగా ఏదో డబ్బిస్తున్నాను కనుక చేయక తప్ప దన్నట్టు చేయుటపై వచ్చిన పలుకుబడి.

''నీసొంతకాపుర మమ్మా ఇది. పోతాచాకిరీకి చేసినట్లు చేస్తే సంసారం ఏం ముందుకు వస్తుంది?'' వా.

ఇది రాయలసీమలో అనుదినం వినిపించే పలుకుబడి.

**పోతుటీగకు నిలువ రాని**

పురుషుడు చొర వీలు లేని అన్న సందర్భంలో వాడుకకు వచ్చిన పలుకుబడి.

వాడుకలో – మగపురుగు అని పోతుటీగకు ప్రత్యామ్నాయంగా పేర్కొంటారు.

''నీ నగరు పోతుటీఁగకు నిలువ రాని, దయ్యు వెల్లాటకత్తె నీ వాట యరిది.'' శుక. 1.316.

చూ. పోతుటీగకు చొర రాని.

**పోతుటీగకు బొలయ రాక**

"సెలఁతలను నమ్మరా దని నిశ్చయించి, పోతుటీఁగకు నైనను బోవ రాని, యొంటి కంబపుమేడలం దునిచె..."
హంస. 5.273.

చూ. పోతుటీగకు నైనం బోవ రాక.

**పోతుటీగకు బొలియంగ రాని**

"పొరిఁ బోతుటీఁగకుఁ బొలియంగ రాని, వరహర్మ్యమునకు నెవ్వఁడు వచ్చె నబల?" ద్విప. కల్యా. పు. 135

చూ. పోతుటీగ చొర రాని.

**పోతుటీగ కైన సుడియ రాదు**

"మా తండ్రి యాజ్ఞ చేఁ బోఁతుటీగకు నైన, సుడియంగ రాని దిచ్చోటి కెట్లు, రా వాటపడె మీకు..."
నలచ. 4.97.

చూ. పోతుటీగకు......

**పోతుటీనె గుజ్జులు**

ఒక రకమైన పిల్లల ఆట.

"ఈ నెగాజులు పోతుటీనెగుజ్జంబులు, నాల్గుగంబాలాట నట్టకోఁతి."
హంస. 3.143.

**పోతురాజు**

తిండిపోతు.

గుంటూ. ఉత్త. 106.

**పోతురాజుకు భూతశంక యెందుకు ?**

భూతాలరాజుకే భూతాల భయం ఎందు కుంటుంది ?

సదానంద. శత. 60.

**....పోతూ పెట్టి పోయాడు**

వానికి మారుగా వీనిని ఉంచి పోయా డనుట. వానిలోని ప్రఖ్యాతగుణాలకు వీడు ప్రతినిధి అనేపట్టుల ఉపయోగిస్తారు.

"హరిశ్చంద్రుడు పోతూ పోతూ వీణ్ణి పెట్టి పోయాడు." వా.

"సావిత్రి పోతూ పోతూ ఈ మహా పతివ్రతను పెట్టి పోయింది." వా.

ఇది కూడా కొంత వ్యంగ్యార్థ స్ఫోరకమే.

**పో దిద్దు**

పోగొట్టు.

"...కలంత సిగ్గు పో, దిద్దు మురారి."
రాధి. 1.125.

**పో నడుచు**

1. తఱుము గొట్టు.

"......తొంటి, యట్ల యిడుమలఁ గుడువఁ బో నడువ వలయు."
భార. విరా. 3.90.

2. విడుచు.

"అటు లేనియుఁ జెప్పెద నీ, పాటి పాటి తలపోఁత లెల్లఁ బోవ నడువుము."
పాండు. 5.50.

3. సంహరించు.

"......అజాండభాండముల్, వానను మీఁదఁ బోవ నడువన్."
ఆము. 1.4.

**పోనాడు**

1. తిరస్కరించు, విడనాడు.

"అనరానిమాటగా ననిరి పోనాడి."
వర. రా. బా. పు. 176. పంక్తి. 22.

2. విడిచి పెట్టు.
"రాజ్యంబు వోనాడి."
గా. హరి. అ. పంక్తి. 36.

పోనాడుకొను

పోగొట్టుకొను.
"రాజ్య మధముఁ డై పోనాడుకొని."
వర. రా. కిష్కి. పు. 415. పంక్తి. 4.

పోనొత్తు

విడుచు.
"ఇత్తెఱంగున నయ్యింతులు, చిత్తజు బాణముల చేత సి గ్గంతయుఁ బో, నొత్తి మునిఁ బెండ్లి యాడఁగ."
వి. పు. 5.152.

పోనోము

పోగొట్టుకొను.
"మతకరి మెకంబు చేకొన మరులు వట్టి, ధరణిఁ బోనోమినత్రిశంకుతన యకులము, వాఁ డగుట."
చం. రా. 5.57.

పోపడు

1. పోవు.
"కోపంబున రాజుకొడుకు గ్రుడ్డులు రెండుం, బోపడునట్టుగ..."
భార. శాం. 3.249.

2. సత్వహీను డగు.
"...కోపముతో నుదల్చికొని కోమలి యుగ్ర వెస వాని వ్రేయుదుగ్ర, బోపడి వాఁడు చిత్రముగ భూమితలంబునఁ ద్రెళ్లె."
భార, అర. 6.190.

పోబడి

జాడ, ఆచూకీ.
"పోయెఁ బో పోయిన ప్రోయాలి పోబడి, వెదకి పెట్టుట యేల విహిత మయ్యె."
రామా. 6.67.

(కార్యములు) పో మొత్తుట

పనులను ఎగర వేయుట.
"కార్యము లెల్లన్ పో మొత్తి..."
కా. మా. 2.22.

పోయినదియ వీధిగా

ఎటు పడితే అటు (పరువెత్తు.)
"యుగ్యంబుల పగ్గంబుల వదలించి పోయినదియ వీధిగాఁ దఱియ నుఱికిన యరదంబులకు."
ఉ. హరి. 3.27.

దారీ డొంకా తెలియకుండా పరుగెత్తా డనడానికి దగ్గరగా ఉన్న పలుకుబడి.

పోయినదే పోక

తిరిగి రాకుండా అనుట.
చూ. బీరపుఁబొత్తము గట్టుకొని పోవు.

పోయిననీళ్ళకు గట్టు వెట్టు

గతజలసేతుబంధనము.
వ్యర్థ మనుట.
"బుద్దులు తప్పె నేమిటికిఁ బోయిన నీళ్ల కుఁ గట్ట వెట్ట నీ, యద్దములోని నీడ కెటు లాసపడం బొసఁగుం దలో దరీ!"
ఉత్త. హరి. 5.157.

పోయినపోకగా

అదే పోతగా.
తిరిగి రాకుండా అనుట.
"నిలువం, జిత్తంబు లేక బీరపుఁ, బొత్తము గట్టుకొని పోయెఁ బోయిన పోకై."
ఉ. హరి. 1.32.

వాడుకలో – 'అదే పోతగా పోయినాడు.' 'వాడు పోయిం

దే పోవడం. మరి వచ్చి ఉండే బట్టు.'

పోయిన పోకగా బోవు

అదే పోత పోవు. తిరిగి రాకుండా అనుట.

"పోయినపోక లై పోయిరి సిద్ధులు." పారి. 5.37.

ఇది వాడుకలో కూడ ఉన్నది. 'వాడు అదే పోత పోయినాడు. తిరిగి మరిగి చూడ లేదు.'

పోయిన పోక లయి పోవు

అదే పోతగా పోవు.

"పోయినపోక లై పోయిరి సిద్ధులు, దిక్కు మొగము లైరి దిగధిపతులు." పారి. 5.37.

రూ. పోయినపోకగా బోవు.

పోయినసారి

గత సంవత్సరం, పోయిన దఫా.

"పోయినసారి పంట ఏమీ బాగ లేదు." వా.

"పోయినసారి ఈ ఊరికి వచ్చినప్పుడు నువ్వు ఊళ్లో లేవు." వా.

పోయి పోలేక

పోవలె నని ఉన్నా పోవుటకు శక్తి చాలక.

ఇలాంటివే చచ్చీ చావ లేక—ఉండీ ఉండ లేక.

"ఈ తెపోటులఁ బడి ప్రేవు లీఁడు లాడఁ, బోయి పోలేక దగదొట్టి పాదలు సాచ్చి." మను. 4.42.

పోయి వచ్చెదను

ఎక్కడి కైనా పోతున్నప్పుడు కేవలం పోయెదను అని చెప్పుట అశుభసూచకంగా తలచి 'పోయి వచ్చెదను,' 'పోయి వత్తును,' 'పోయి వస్తాను, వెళ్ళొస్తాను, వెళ్లి పొయ్యొస్తాను' అనుట, అలవాటు.

"దనుజాంతక ! పోయి వచ్చెదను, మఱి వశ మీ నను నావుడు." పారి. 2.27.

"వామేక్షణ లార ! పోయి వచ్చెద నింకన్." కళా. 3.218.

"ఊరికిఁ బోయి వతుపని యూరట సేయక నిర్దయాత్ముఁ డై." రాజగో. 4.12.

దీనినే 'వస్తాను' అని మాత్ర మే కూడ అంటారు.

చూ. వస్తాడు.

పోయె పోయె

సంభ్రమాశ్చర్యాదులతో ఏదైనా పోతున్నప్పుడు అను మాట. సంభ్రమాశ్చర్యాదులలో ద్విరుక్తి సహజము.

"అశ్వముఁ గొం చురువీధి నేఁగ న,ద్భుతపడి పోయెఁ బోయె హయముం గొని దానవుఁ డంచు. జైమి. 2.29.

"పాయె, పాయె. పట్టుకోండి. పట్టు కోండి." వా.

పోరాకుండు

ఇది సామాన్యంగా వచ్చుట పోవుట జంటగా ఉపయోగిం

చడం అలవాటు. 'వాళ్ళింటికి వచ్చిపోయే మనుష్యులు ఎక్కువ.' 'వారింటికీ వీరింటికీ రాకపోక లెక్కువ' యిత్యాదులు.

"పోరాకుండఁగ నేమి కాళ్లు దెగనే ఫుల్లాంబుజాతేక్షణా!"

మను. 3.138.

ఇక్కడ పోకుండా, రాకుండా అన్న రెండూ ఉన్నవి. 'బంధువు లన్న తరువాత పోకుండా రాకుండా ఉంటామా?' అని వాడుక.

పోరాట మాడు

పోట్లాడు.

"భూషామౌక్తికకాంతి దేహరుచితోఁ బోరాట మాడఁగా."

నిరంకు. 1.7.

పోరాడు

1. పోరు పెట్టు.

"నా మగనివంటి వాఁడీ, భూమిఁ లేఁ డమ్మ యేనె పోరాడుదుఁ గా, కే మాట యైన నాతోఁ, దా మును పే తెలుపు. శుక. 3.266.

2. కలహించు, పోరాడు—యుద్ధము చేయు.

"వారికి మనతోడి వైరంబుఁ బూని, పోరాడ నే ధనంబులు పొత్తు వోవు."

గౌ. హరి. ప్రశ. పం. 719–20.

పోరాని

విడువ వీలు లేని (అప్పు డనుట.)

"జనకభూవరుఁ, దోతెమ్మ పోరాని సఖుని."

వర. రా. బా. పు. 56. పం. 11.

పోరానిబందువు

దగ్గఱిచుట్టము.

"......ఈవు పో, రాని చుట్టమవు మహానుభావుఁడవు."

భార. ఉద్యో. ఆ. 3.

"భుజశౌర్యంబునఁ బెద్ద వై హితుఁడ వై పోరానిబంధుండ వై." కవత్ర్న.

పోరామి యొనర్చు

పోరు పెట్టు.

"...వలసినవి యెల్లఁ జెప్పించుటకై, వారసతు ల్బాబుజాఁగులతోఁ, బోరామి యొనర్పఁ బసులపాంగలి వచ్చెన్."

శుక. 2.563.

చూ. పోరు పెట్టు.

పోరాములు సేయు

రాకపోకలతో సంబంధము పెట్టుకొను.

"చెడిపెతోడఁ బోరాములు సేయ వలదు." కాశీ. 2.74.

పోరి కెత్తు

దండెత్తు.

"అల్పవిచారులం బోరి కెత్తెడునట్లు గాఁ దగఁ బొందె."

భార. స్త్రీ. 2.138.

పోరిత మాడు

వాదములు మొదలగు వాని యందు పెనగులాడు.

"వీరును బాండుపుత్త్రులును వేరము దక్కి పాసంగి మిన్నకై, పోరిత

మాడి యే నటుల బుద్ధులు సెప్పిన భంగియున్." భార. ఉద్యో. 4.3.

పోరి బొక్కలాడు

ఎక్కువ కష్టపెట్టు.

"వాడు తన భార్యను అయినదానికీ, కానిదానికీ పోరి బొక్కలాడు తున్నాడు." వా.

పోరుకాడించు

దోసిటిలో నీళ్లు పోసికొని తట్టు.

చిన్న పిల్లలకు స్నానం చేయించేటపుడు అట్లా చేయడం అలవాటు.

"దోయిళ్ళ జలమునం బోర్కాడించి లలిం జన్నిచ్చుచు నుయ్యాల నూఁపుచుఁ బెనుపఁ దొడఁగె." కళా. 6.194.

పోరుకొని తిను

వేధించు.

"ఎప్పైనా నన్ను గడించి పెట్టుమని పోరుక తిచ్చుందారె వోశమ్మ."

హేమా. పు. 80.

పోరు పెట్టు (పడు)

ఊరక తప్పులు పట్టుచు వేధించు.

"ఐన బతిమాలి నీవు పొమ్మన్న వెడలి, పోవ నూరక యుండు మీ పోరు చాలు." శుక. 2.376.

"ఆడబిడ్డలపోరు, అత్తపోరు పడలేక ఆత్మహత్య చేసుకొంది." వా.

"ఈ పోరు పడలేను. ఈ పోరు చాలు." వా.

చూ. అత్తపోరు.

పోరు మాన్పు

ఏదో చిన్న పనితో వారి పోరును తప్పించుకొను.

వాడుకలో - 'పప్పులు పెట్టి పోరు మాన్పినట్లు' అంటారు. మఱపించి యనుట.

"వదినెలపోరు మాన్ప నిజవల్లభు నిద్దుర పుచ్చ మామనో, రదముఁగ నత్తగారికి భయం బొనరింప..." శుక. 2.98.

పోరు వెత్తు

(పోరువ+ఎత్తు) పొర ఊడు.

ఈ పొరవ అనేది నేటికీ రాయలసీమలో వాడుకలో ఉంది. 'ముప్పోరవ దుప్పటి అయితే చలి బాగా ఆపుతుంది.' 'నాలుగు పోరవల దుప్పటి అయితే మరీ మంచిది.'

పాండు. 4.294.

పో రొడ్డు

బారులు తీరి నిలబడు-యుద్ధములో.

"ఉభయబలములు నెదిరి పో రొడ్డి కదియు, కరిఘటల యంతరాళంబు గాన నయ్యె." కవిక. 2.187.

పోలుపొందు

అందిక పొందిక. జం.

"అమ్మరో పోలుపొం దెఱుఁగ కమ్మనుజేశ్వరుఁ డాలిమాట నిక్కమ్మని కోయఁ బంచె నరగ..."

సారం. 3.94.

పోలుంబోలములు

యుక్తాయుక్తములు.

"పోలుంబోలము లింత యెన్నక..."

పాండు. 5.297.

పోలెవాడు

దుర్మార్గుడు.

"పోలెవాఁడగచాట్లపోతు దుర్మార్గుండు, పడిసేటును గరాసు పందలంజె." హంస. 5.113.

పోవ నాడు

నిందించు, దూఱు.

"మత్కృతిఁ బ్రస్తుతించినన్, గఱగఱఁ బోవ నాడినను గల్గవు నామది మోదఖేదముల్."

వేం. పంచ. 2.126.

పో విడుచు

వదలి పెట్టు.

"జీవుడు జీర్ణశరీరముఁ, బో విడిచి నవంబుఁ బొందఁ బుట్టను పేరం, దావెలయు." భార. అను. 5.126.

పోసము దాగు

తీర్థమువలె భక్తితో ఆపోశనము పట్టు.

"నెలఁత దక్కితి వని నీ వీడెపురసము, చలి వాయ నిపుడు పోసము దాగేనే."

తాళ్ల. సం. 12.90.

పౌజు తీర్చు

వ్యూహము పన్ను.

"చెఱకువిలుతుఁ డిరుగడలఁ బౌఁజు దీర్చిన శుకపికమధుకరప్రకరంబుల గతి." కళా. 7.69.

"అనుపమితస్వవాద్యనివహంబులతో సరిప్రోయుటల్ సహిం, పనియది వైపురం బెనుపపౌఁజులు దీర్చినో మచ్చరంబునన్. కళా. 1.117.

పౌజులు సేయు

సైన్యము సన్నద్ధము చేయు.

"పాళెము చుట్టు గాచుటకుఁ బార్థునిఁ బౌజులు సేయఁ బంచి."

జైమి. 3.98.

పౌరుషాలు నఱుకు

మహావీరుడ నని డంబాచారములు పలుకు.

"వాడు అది చేశాను, ఇది చేశా నని పౌరుషాలు నరుక్కొంటూ కూర్చుంటాడు. వస్తుతః చేసిం దేమీ లేదు."

వా.

ప్రకటరతి

సంభోగభేదము.

కుమా. 9.152.

ప్రక్కతాళము వేయు

చూ. తాళము వేయు.

ప్రక్కలు పొడుచు

ప్రోత్సహించు.

ఒకపనికి ప్రోత్సహించునపుడు ప్రక్కవారు చేతితో ప్రక్కలు పొడుచుట ద్వారా యేర్పడిన పలుకుబడి.

"అని యతఁడు వల్క నచట నేకాంత మగుట, మరుఁడు ప్రక్కలు పొడిచి సమ్మతముఁ జెందు."

శుక. 2.479.

ప్రక్క లెగయునట్లు రోజు

ఎక్కువగా ఆయాసపడు.

ఆ మూసపడునపుడు ప్రక్కలు ఎగురుట సహజము.

"మారపాతసంభవం బైనఘనపరిశ్రాంతి చేతఁ బ్రక్క లెగయంగ రొఁజుచు నొక్క క్షణము నిలిచి."

కళా. 4.153.

ప్రణామము ల్సేయు

నమస్కరించు.

"చేరి దండప్రణామముల్ చేసి."

నిరంకు. 3.56.

ప్రతిజ్ఞ చెల్లించు

నెఱవేర్చు.

"ప్రతిజ్ఞ చెల్లించువాఁ డై."

కాశీ. 5.275.

ప్రతిన పట్టు

ప్రతిజ్ఞ చేయు.

"పారిజాతంబు దే నిట్లు ప్రతిన పట్టి."

పారి. 2.2.

ప్రతిన వచ్చు

ప్రతిజ్ఞ తీరు.

"ప్రతిన వచ్చెఁ గదా యిదె పారిజాత, మనుచు నర్పింప నద్దేవి హర్ష మంది."

పారి. 5.49.

ప్రతిన వట్టు

ప్రతిజ్ఞ చేయు.

"పార్థుఁ డిట్లు ప్రతిన వట్టిన."

భార. ద్రోణ. 3.3.

కుమా. 9.29.

ప్రతినాయకుడు

కృతినాయకునకు ప్రతికూలు డగునాయకుడు.

ప్రతిపాలన సేయు

ప్రతిజ్ఞ సేయు.

ఇక్కడ రక్షణ సేయు, కాచు అనే అర్థాలు కుదురవు.

"పశుపతి దాఁ గర్త పలువేల్పు లెల్ల, పశువులే యని ప్రతిపాలన సేసి, జిన సమయస్థుల శిరములు దునిమి."

బస. 6.168 పు.

ప్రతిపోల్చు

సరిపోల్చు.

"బలగర్వముల మిమ్ముఁ బ్రతిపోల్పఁ జాలు, బలియుర వానరపతులఁ బెక్కండ్ర."

రం. రా. బాల. 19 పు. 2 పం.

ప్రతిబింబవాదము

జీవుడు ఈశ్వరునికి ప్రతిబింబ మని స్థాపించునట్టి వాదము. వేదాంతుల వాదములలో ఇది యొకటి.

ప్రతిభాష

ప్రత్యుత్తరము, మాఱు మాట.

ప్రతిమాటలు

జవాబులు.

"కూడదు శివదూషకుల మిమ్ము నంటఁ, జూడఁగఁ బ్రతిమాట లాడ..."

బస. 7.192.

ప్రతి యొనర్పగ రాని

"ప్రతి యొనర్పఁగ రానిసువ్రతము."

రుక్మాం. 1.90.

చూ. ప్రతి పెట్ట రాని.

**ప్రతి లేక**

మాఱు లేక.

"ప్రతి లేక రాణించుపాటలవైఖరి, జత మించె చూడ వమ్మా చెంగమ్మ." హేమా. పు. 39.

**ప్రతి వచ్చు**

సమాన మగు.

కాశీ. 5.283.

**ప్రతివదనము గావించు**

ప్రతిముఖము చేయు.

"మదిరాక్షి మోవిజిగి ప్రతి, వదనము గావించుఁ గీరవదనముతోడఁ." విజయ. 1.185.

**ప్రతి వెట్టగ రానిది**

అప్రతిమానము, అసమాన మనుట.

"వ్రతముల కన్నిటి కంటెను, బ్రతి వెట్టఁగ రాని దై." రుక్మా. 1.86.

**ప్రతిశబ్ద మీను**

ప్రతిధ్వని యిచ్చు.

"కెరలు పికశారికాకీరకేకిభృంగ, సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత, దరులు ప్రతిశబ్ద మీన." మను. 2.19.

**ప్రతిశుక్రభయము**

పురశ్శుక్రదోషము.

రామలిం. 59.

చూ. చుక్కెదురు.

**ప్రతిశ్రుతము చేయు**

ఇస్తా నని మాట యిచ్చు.

"మును ప్రతిశ్రుతము చేసిన పైఁడి రాకున్న, ముచ్చిచ్చునను వేగు వచ్చు దనుక." పాండు. 4.149.

**ప్రతి సేయు**

1. బదులుకు బదులు చేయు.

"మా కుపకార మొనర్చితి, నీకున్ బ్రతి సేయ నెల్లు నేరుతు మెనన్." మను. 6.15.

2. పోల్చు. ఉపమించు.

"రమణిఁ బ్రతి సేయ వచ్చు...యౌదార్యవిభవ, ధారి యై మించు శ్రీరంగ శౌరి కెపుడు." వసు. 1.34.

**ప్రత్తి తాల్చినవడువున**

దూదిని ఏకినట్లు.

"చమురు చల్లినమంటలకైవడిఁ, బ్రత్తి తాల్చినవడువున."

ఉ. హరి. 3.71.

**ప్రత్యంతపర్వతము**

పెద్దకొండ చేరువను ఉండు చిన్నకొండ.

**ప్రత్యాబ్దికము**

ప్రతి సంవత్సరమును చేసెడు శ్రాద్ధము.

శ. ర.

**ప్రత్యుత్థానము చేయు**

లేచి నిలుచు.

ఎవ రైనా పెద్దలు వచ్చినపుడు గౌరవసూచకముగా లేచి నిలుచుండుట ఆచారము.

**ప్రత్యుత్పన్నమతి**

ఆ సమయమునకు తగిన ఉపాయము కలవాడు.

ప్రథమ కబళే మక్షికాపాతః

ముద్ద యెత్తగానే దానిలో ఈగ పడిన దనుట.

ఆరంభంలోనే ఏదయినా అనాహూతమో, అప్రియమో జరిగినప్పుడు ఉపయోగించేపలుకుబడి.

"ప్రార్థనపద్యంలోనే అపశ్రుతులు వచ్చాయి. ప్రథమకబళే మక్షికాపాతః అన్నట్టుంది." వా.

అడుగులో హంసపాదు లాంటిదే యిది.

ప్రథమకోపం

చిఱుకోపము.

కోపపడతాడు కానీ వెంటనే చల్లబడతాడు అనుపట్ల ఉపయోగిస్తారు.

"ఆయనకు కాస్త ప్రథమకోపం. కాసేపు ఉంటే మీకే తెలుస్తుంది. ఎంత మెత్తనివాడో!" వా.

ప్రపంచము సేయు

విస్తరించు.

"ఆసుగాత్రి యాయన నింక నేమి ప్రపంచంబు సేసిన నెఱయ నెడసి పోవుట తక్క." కళా. 4.73.

ప్రబలం చేయు

దీపింప జేయు.

"నరుఁడు గని సత్వరంబుగ, వరుణాస్త్రం బేయుటయును నది తత్పరుషత వా, విరి మానెడునట్లుగఁ, బరఁగిన గురుసుతుఁడు పెద్ద ప్రబలంచేసెన్." భార. ద్రో. 5.385.

ప్రబ్బుకొను

అధిక మగు.

"పడఁతికిఁ దమకంబు ప్రబ్బుకొనియె." రాధా. 1.128.

ప్రభాతపదములు

తెల్లవారగనే పాడుపాటలు, మేలుకొలుపులు.

మేలుకొను మయ్యా అను పల్లవితో ఉంటూ ఉండే జానపదగీతాలు.

పండితా. ప్రథ. వాద. పుట. 513.

చూ. తుమ్మెదపదములు.

ప్రమథుల కవిలియ కెక్కు

ప్రమథుల జాబితాలోని కెక్కు, ప్రమథులతో సమానుడగు.

"గురుభక్తియుక్తి, గరళాంకు ప్రమథుల కవిలియ కెక్కు." పండితా. ప్రథ. పురా. పుట. 329.

ప్రయి మాలు

నిందను లక్ష్యపెట్టక పోవు.

"...ధర్మంబు గలఁచి నరునిఁ, బ్రయిమాలి యేమిటి కయినను గర్హించువానిఁగా సమకట్టు." భార. శాం. 3.399.

ప్రయి వెట్టు

నింద మోపు.

"కురువృద్ధుఁడగు బాహ్లికుని దూఱ నేఁటికి, భీష్ముని పైఁ బ్రయి వెట్టనగునె?" భార. ఉద్యో. 3.195.

ప్రయోజనము

మంచికార్యము.

"నా చేయుప్రయోజనం బంగీకరిం పుము." నైష. 2.8.

"మాయింట్లో ప్రయోజనానికి వాళ్లె వ్వరూ రాలేదు." వా.

"మా యింట్లో ఏ పెండ్లి అయినా, ఏ ప్రయోజన మైనా ఆయింటివా రందరూ రావలసిందే." వా.

ప్రయోజకుడు

కార్యము నెఱవేర్చువాడు, నేర్పరి.

"వాడు ప్రయోజకు డయితే యింక అనుకోవలసినప నే ముంది?" వా.

"మనవాడి ప్రయోజకత్వం అంతలో ఉంది. ఇతరుల నని యేం లాభం?" వా.

ప్రయ్యబడు

నింద నొందు.

"పురుషహీన యైనఁ బరమపతివ్రత, యయ్యు జగముచేతఁ బ్రయ్యఁబడదె." భార. ఆది. 6.253.

ప్రల్లద మాడు

దూషించు.

"ఎంత యున్ ద్రుళ్లనం బ్రల్లదం బాడినం బల్లెరం బెత్తి చిత్రంబుగా." పారి. 3.37.

ప్రసూతివైరాగ్యము

గర్భవతి యైనభార్య నొప్పులు పడుతున్నపుడు భర్త పొందే వైరాగ్యభావం.

ఇలాంటిదే శ్మశానవై రాగ్యం.

ప్రస్తాపన వచ్చు

సంభాషణలో ఆప్రసక్తి వచ్చు.

"ఆ ప్రస్తాపన ఏం రాలేదు. వచ్చి ఉంటే ఏ మయినా చెప్పి ఉండే వాణ్ణి." వా.

ప్రస్తావన అని కూడ.

ప్రస్తుతము

నిషేకముహూర్తము.

రాయలసీమలో నేటికీ నిషే కానికి 'ప్రస్తుత' మన్న మా టనే ఉపయోగిస్తారు.

"ప్రస్తుతం బని పదార్థములు రాజుల వేఁడి, కొని వచ్చి యమ్మిత్రంచుఁ గోమ టిండ్ల." పాండు. 4.149.

"ఆపిల్లకు ప్రస్తుతం చైత్రమాసంలో జరుగుతుం దట." వా.

ప్రస్తుతి కెక్కు

ప్రసిద్ధి చెందు.

"విహితసదాచారవిధులమీఁది, శ్రద్ధ మతి యనంగఁ బ్రస్తుతి కెక్కెను." కళా. 5.154.

"పరమపవిత్ర వాగ్గరిమఁ బ్రస్తుతి కెక్కె." రుక్మాం. 3.110.

ప్రస్థానభేరి సఱచు

ప్రయాణాన్ని సూచిస్తూ భేరి వాయించు.

"ప్రస్థానభేరి సఱవం బంచిన." కుమా. 11.2.

ప్రహరి చరించు

గస్తీ తిరుగు.

"ప్రహరి చరింతు రెప్పుడును భైరవు లర్ధనిశాగమంబులన్."
భీమ. 1.108.

ప్రహరి చుట్టు
"గంధర్వకాంతల్ సుకం,తనినాదాతిశయంబుతోఁ బ్రహరి చుట్టం గంటిఁ జిత్రంబుగాన్."
వసు. 4.68.
చూ. ప్రహరి చరించు.

ప్రహరి తిరుగు
గస్తీ తిరుగు.
కాశీ. 3.235.

ప్రాకుడుగొయ్య
ఆలంబనము.
"ఆ నలినాయతాక్షి ప్రసవాపగమంబునఁ బండబాఱుచున్, బ్రాణవిభూపలాలనము ప్రాఁకుడుఁగొయ్యగ నిల్చె."
పాండు.

ప్రాకులాడు
వ్రేలాడు, ఆశ్రయించు.
"వాణ్ణి పట్టుకొని పాకులాడడంలో లాభమేం లేదు. సొంతంగా ఏ దైనా తంటాలు పడాలి గానీ."
వా.

ప్రాకు వెట్టు
సహాయ మగు.
స్తంభమే దైనా బలంగా నిలువ లేదని అనుమానం కలిగినప్పుడు దానికి తోడుగా మఱొక కొయ్యను పోటీగా పెడతారు. దానిపై వచ్చిన పలుకుబడి.
పాండు. 4.250.

ప్రాకొను
పాచిపట్టు.
సుమతి. 10.

ప్రాచి పట్టు
నీళ్లలో ఉన్న బండలు మొదలగువానిపై ఒక రకమైన ఆకుపచ్చని పాకుడు పడుతుంది. దానినే ప్రాచి పట్టుట అంటారు.
"పాథోధిజలయుక్తఁ బ్రాఁచి పట్టినదికా, కరులు నాఁదగు మరకతపుఁ గరుల."
ఆము. 1.53.

ప్రాచిపని
ముందురోజు వాడిన పాత్రలూ మొదలయినవి శుభ్రము చేయుట.
"ప్రాఁచిపనుల్ సేయ లేచుకోడండ్రకా, నత్తలవలని భయంబుకంటె."
ఉ. రా. 5.282.

ప్రాచియలరు
చెడిపోయినది, వాడిపోయిన పూవు.
"పదను దివిసినకస్తూరి ప్రాచియలరు"
పాండు. 3.22.

ప్రాచీనవిత్తు
దుర్మార్గుడు.
"దగులు, బాజి హరాంకోరు వాజె ప్రక్కల ముచ్చు, చీవాట్లమారి ప్రాచీనవిత్తు."
హంస. 5.113.

**ప్రాజాపత్యం**
పెత్తనం.
కాశీయా. 310.

**ప్రాణం గుప్పిట్లో పెట్టుకొని**
అతిభయంతో.
"ఆకనమ దాటేవరకూ నేను నా ప్రాణం గుప్పిట్లో పెట్టుకుని నడిచాను. అక్కడ దొంగలభయం విపరీతంగా ఉంటుం దని విన్నాను." వా.

**ప్రాణం గురగూర మంటున్నాది**
వచ్చేప్రాణం పొయ్యేప్రాణంగా ఉన్న దనుట.
"వాడు ప్రాణం గురగుర మంటూండగానే బంధువు లంతా నా కేం చెప్తావు? నా కేం చెప్తావు? అని తగులుకున్నారు" వా.

**ప్రాణం పోయిన వెనక ప్రాణాయామం మొదలుపెట్టు**
దొంగలు పడిన ఆరునెలలకు కుక్కలు మొరుగుట వంటిది.
"అంతా ముంచుకొచ్చాక ఆ డాక్టరూ ఈ డాక్టరూ అంటే యేం లాభం? ప్రాణం పోయాక ప్రాణాయామం చేసినట్టుగా." వా.

**ప్రాణంబు గల్గినను బలుసాకు దిని యైన బ్రదుకంగ వచ్చు**
బతికి ఉంటే బలుసాకు తిని బ్రతకొచ్చు—అని నేటివాడుక. ఊపి రుంటే ఉప్పు అమ్ముకొని తినవచ్చు నన్న పలుకుబడి వంటిదే యిది. జీవం అనే దుంటే ఎలాగో గడప వచ్చు ననుట.
"నలి దీటుకొనఁగఁ బ్రాణంబు గల్గినను, బలుసాకు దిని యైన బ్రదుకంగ వచ్చు." బసవ. 7.198.

**ప్రాణంబు తెగిపోవు**
ప్రాణము పోవు.
"అతనిఁ దోతేకున్న సంగజాస్త్రముల, ధృతి దూలి ప్రాణంబు తెగి పోవఁ గలదు." ద్విప. భా. కల్యా. 136.

**ప్రాణంబు ప్రాణము**
అతిప్రియము, మిక్కిలి ప్రియమైనది.
"చెలఁగ............. భారవహులకుఁ, బ్రాణంబు ప్రాణ మగుట." కా. మా. 1.29.
"పలుమారు న్నిను నమ్మి యుండ నకటా! ప్రాణంబు ప్రాణంబు లై." రాజగో. 3.75.
"అని కైనన్ బతి నిన్నుఁ బాసి చనెనో ప్రాణంబు ప్రాణంబుగా, నిను మన్నింపఁడో." పారి. 2.25.
చూ. బహిః ప్రాణము.

**ప్రాణగొడ్డ మాడు**
ప్రాణాంతకమైనమాటలాడు.
"దేవదేవు నెల్లిదముగఁ జేసి యింత గాని లేవడ లేచెదు ప్రాణగొడ్డ మా, డెదు." కుమా. 4.65.

**ప్రాణగొడ్డము**
ప్రాణకంటకము.
"విను నృప రాజ్యామిషముం, గొనఁ

బలువురచేతఁ బ్రాణ గొడ్డు బై యు, న్నను.'' భార. శాంతి. 2.195.

## ప్రాణదాత

రక్షకుడు, ప్రాణముల నిచ్చి రక్షించినవాడు.

## ప్రాణపదము

ప్రాణముతో సమానము.

''ఎనయు ప్రాణపదంబుగాఁ దలఁ తీవు తీవ తలంగ మెట్టకు.''

పారి. 4.16.

చూ. బహిః ప్రాణము.

## ప్రాణము గొను

చంపు.

''అలుకఁ బ్రబలంబదానవుని ప్రాణము గొంటి కళిందనందనా, సలిలభరప్రవాహరభసంబు...'' పారి. 3. 36.

## ప్రాణము చల్లార్చుకొని పోవు

ప్రాణాలు ఆరుకొని పోవు.

## ప్రాణము ఝల్లను

ధ్వన్యనుకరణము.

గుండె ఝల్లను వంటిదే ఇది.

భయభ్రాంత మగు.

''ప్రాణము ఝల్లని తల్లడిల్లఁగా.''

కుమా. 10.15.

## ప్రాణముతో బోగలడా ?

పోలేడు.

''మత్స్యేనలక్ష, రా జొక్కండె కలంచి పోఁగలడె తాఁ బ్రాణంబుతో నంచు.'' కళా. 8.54.

''వాడు ఈ ఊరికి వచ్చి ప్రాణంతో పోతా డేమో నేనూ చూస్తాను రో.''

వా.

## ప్రాణమునకు దెచ్చుకొను

ప్రాణంమీదికి తెచ్చుకొను.

''నరపతి ప్రాణంబునకుఁ దెచ్చుకొని యె, నెఱుఁగక నినుఁ దన యిల్లాల వనుచు.''

వర. రా. అయో. పు. 533. పం. 16.

''వాడితో సహవాసం చేసి ప్రాణం మీదికే తెచ్చుకొన్నాడు.'' వా.

## ప్రాణమున నుండ దలచితేని

ప్రాణంతో ఉండ దలచు కుంటే.

''నాకసుఖ మొందు మిపుడు ప్రాణాన నుండఁ, దలఁచె దేని.''

ఉ. హరి. 4.50.

## ప్రాణము నిల్పుకొను

(అతి కష్టముతో) జీవించు.

''మన్నన గాంచి కాని యిఁక మానిని! ప్రాణము నిల్ప నేర్తునే.''

ఉషా. 2.78.

## ప్రాణము పిడికిట బట్టుకొని

ఏదో ఒక విధంగా సాహసించి, ఓపిక పట్టి.

భయముతో.

''పడఁతి! యెటు లయినఁ బ్రాణముఁ, బిడికిటఁ బట్టుకొని నేఁడు ప్రియుతో నీ వె,ప్పుడువలెఁ బలుకక యుంచుక, తడ వుండుము మాకుఁ గాను దాలిమితోడన్.'' కళా. 7. 205.

''ఆ గుమాస్తా వాళ్ల మేనేజరుతో ప్రాణం పిడికిట్లో (గుప్పెట్లో) పెట్టుకొని మాట్లాడతాడు.'' వా.

**ప్రాణము పీచు పీచు మను**

అత్యాందోళనస్థితి కలుగు.

"ఆ పాము దారి కడ్డం తొలిగేదాకా నా ప్రాణం పీచుపీచు మంటూ ఉండింది." వా.

**ప్రాణముపై వచ్చు**

మిక్కిలి అపాయ మగు, కీడు కలుగు.

'పతి విన్నఁ బ్రాణంబుపై వచ్చు ననక." పండి. దీక్షా. పా. 43.

**ప్రాణము పోవు**

మనసునకు విపరీతముగా బాధ కలుగు.

ప్రాణము పోయినంత పని యగు ననుట.

"మా తిన్నం డిపు డెందుఁ బోయె ననినన్ మా ప్రాణముల్ పోవె." కా. మా. 3.77.

"నాకు ఆనాడు ప్రాణం పోయినంత పని అయింది." వా.

"ఆరోజు నాప్రాణం పోయిం దంటే నమ్మ." వా.

ఇలాంటివే 'ప్రాణం తీసేశాడు. ప్రాణం లేచి వచ్చింది.'

**ప్రాణము ప్రాణము**

ప్రాణప్రద మైనది.

"సాధ్వి యా సీత ప్రాణము ప్రాణ మై ...ననుసరింపఁగ." వర. రా. బా. పు. 14. పం. 6.

**ప్రాణము మీద తీపు**

బ్రతుకవలె నను ఆశతో తెగించి పని చేయ లేదు.

"ప్రాణముమీఁదఁ దీపు గల ప్రాణులకున్ విరుదున్ వ్రతంబు కల్యాణ కరంబులే యనుచు." కా. మా. 2.124.

**ప్రాణముమీదికి వచ్చు**

గొంతుమీదికి వచ్చు, ఉపద్రవకారి యగు.

"ఫిడితో స్నేహం చేసినందుకు నా ప్రాణంమీదికి వచ్చిం దిప్పుడు. వాడేదో రహస్యసంఘంలో సభ్యు డట. నా కేం తెలుసు?" వా.

**ప్రాణముల కల్గు**

ప్రాణములు తీయుటకే సిద్ధపడు.

"తత్తరుణీలలామ లో, నలుగుట కాదు ప్రాణముల కల్గుట దేహవిసర్జనార్థమై." నిరంకు. 2.31.

**ప్రాణములకు తెగి**

తెగించి.

ప్రాణం పోయినా సరే అని.

"పంచబాణుఁ డిపుడు ప్రాణంబులకుఁ దెగి, నన్ను మిగుల నొంచుచున్న వాఁడు." కళా. 7.14.

**ప్రాణములకు ప్రాణ మగు**

"ప్రాణములకుఁ బ్రాణం బగు, ప్రాణసఖికిఁ జెప్పరానిపనులుం గలవే." కళా. 6.259.

**ప్రాణములు గడపు**

ప్రాణములు తియు.

"ఒకవేళ ఓఁగ వేఁటకుఁ జని యొగఁ జోపి, నానాండజముల ప్రాణములు గడపి." కా. మా. 3.47.

ప్రాణములు గూట బడు

కుదుట బడు.

"...ప్రాణములు గూటఁ బడినవెనుక లేచి, భక్ష్యములు పళ్లెరములోఁ బరామర్శించి..."

సాక్షి. పు. 185. పం.11.

ప్రాణములు తిరుగుడు వడు

ప్రాణాలు విలవిల లాడు.

ఇది అతి బాధాసూచకము.

"దురవస్థఁ బ్రాణంబులు తిరుగుడు వడఁ జొచ్చె." భాస్క. అయో. 349.

ప్రాణములు తీపు అగు

"ప్రాణము లెంత తీపొకో."

పారి. 1.88.

ప్రాణములు పట్టుకొని యుండు

ఆశతో జీవించి యుండు.

"...నేనును దద్వచనామృతాస్వాదనంబ యూఁతగాఁ బ్రాణంబులు పట్టుకొని యున్నదాన." మను. 6.58.

ప్రాణము లేగునట్ల యగు

ప్రాణము పోవునంత పని యగు.

ఇక్కడ ప్రాణం ఉత్సాహానికి దగ్గరగా ఉంటుంది. ఇలాంటిదే 'ప్రాణం లేచి వచ్చు – తలప్రాణము తోకకు వచ్చు.'

"కడుపున శూల యెత్తి వడి గాసిలి ప్రాణము లేగునట్ల యై."

హంస. 1.253.

ప్రాణము లేచి వచ్చు

చెప్పరాని ఊరట కలుగు.

"పొద్దున్నుంచీ బిక్కుబిక్కుమంటూ పడి ఉన్నాను. మీరు వచ్చేసరికి ప్రాణం లేచి వచ్చింది." వా.

ప్రాణము వచ్చినయట్లగు

ఎంతో సంతోష మగు.

"వచ్చిన మేనికిఁ బ్రాణము, వచ్చినయట్లైన మెచ్చి వసుధావిబుధుం,డు ..." శుక. 2.462.

"మీరు రాగా నాకు ప్రాణం లేచి వచ్చింది." వా.

ప్రాణ మెత్తు

ప్రాణము తీయు.

"నీవె కార్యంబులు నిలువఁ బెట్టితివి, పరఁగ వానరసేన ప్రాణ మెత్తితివి."

మైరా. పు. 38.

ప్రాణ మైన

ప్రాణ సమానుఁ డయిన, ప్రాణప్రద మయిన, అతి ప్రియుఁ డనుట.

"మన మెరియదె ప్రాణ మైనమగఁడి ట్లయినన్." పారి. 1.86.

ప్రాణవాయువు లొప్పించు

ప్రాణదానము చేయు.

"హరికిన్ విద్వేషికిన్ భక్తుఁ డై, ...క్కట ప్రాణవాయువులు వీఁ డొప్పించుచున్నాఁడు."

భాగ. స్క. 7.185.

ప్రాణసంకటము

గొప్ప ఆపద.

"పాంథులకుఁ ధరిత్రిపై, నడుగిడఁ

ప్రాణసంకటము నైన యొకానొక మందు వేసవిన్.'' వేం. పంచ. 1.465.

ప్రాణాంతిక మగు

అపాయకర మగు.

ప్రాణాచారాలు పడు

దేవునిముందు తడిబట్టలతో సాగిలబడు.

ప్రాయోపవేశము చేయు.

శ. ర.

''పరులఁ గొలిచి వచ్చి ప్రాణాచారాలు పడితే, సరుల వరా లిచ్చేవు శ్రీ వేంకటేశా!''

తాళ్ల. సం. 8.128.

ప్రాణాచార్యుడు

రాజవైద్యుడు.

ప్రాణాన గలుగు

జీవించి యుండు.

''మానక ధృతరాష్ట్రుఁడు ప్రాణానం గలుగంగ.'' భార. ఉద్యో. 3.345.

ప్రాణానికి ప్రాణం అడ్డు వేయు

చూ. ప్రాణానికి ప్రాణం యిచ్చు.

ప్రాణానికి ప్రాణం యిచ్చు

స్నేహితునికి ప్రాణ మైనా యిచ్చి తోడ్పడు.

''కోయలు ప్రాణానికి ప్రాణం యిస్తారు. అనాగరకుల్లోనే ఆ ధర్మాలన్నీ యింకా ఉన్నాయి.'' వా.

ప్రాణాలకు తెగించు

చచ్చుట కైనా సిద్ధపడు.

''ప్రాణాలకు తెగించినవాణ్ణి ఎవ రేం చేస్తారు?'' వా.

ప్రాణాహుతులు

భోజనం చేయుటకు ముందు అభికరించి అయిదు ప్రాణాలకనీ ప్రాణాయ స్వాహా... అని మొదలిడి కొద్దిగా అన్నం నోట వేసుకొనుట.

''సకల హవిశ్శేషచరుభక్షణాదు,లకును ప్రాణాహుతుల్ వలవనియట్లు.'' పండితా. ప్రథ. దీక్షా. పుట. 81.

ప్రాప్తము

నేను చేసుకొన్న సుకృతఫలమింతే అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

భాస్కర. 18.

''నా ప్రాప్త మింతే.'' వా.

''వాడి కాపిల్ల ప్రాప్తం లేదు. అందుకనే వాడిస్తా మన్నా వద్దన్నాడు.'' వా.

ప్రాప్తుడ గాను

ఆ ప్రాప్తి నాకు లేదు.

వాడుకలోనూ 'నాకు తండ్రి నని చెప్పుకొనే ప్రాప్తి లేదు' అనేరీతిగా ఉంది.

''పరమున కేను దాని నని పల్కఁగఁ బ్రాప్తుఁడఁ గాను.'' కుమా. 7.134.

ప్రాబడు

పాతపడు.

కుమార. శత. 54.

ప్రామిన్కులు

వేదములు.

పాండు. 2.152.

ప్రారబ్ధము

కర్మ.

ప్రారబ్ధము, ఆగామి, సంచితము అని కర్మ మూడు రకాలు. అందు ప్రారబ్ధం తప్పక అనుభవించి తీరవలసింది.

"నా ప్రారబ్ధం యిలా ఉంది. ఎవరిని అని మాత్రం ఏం లాభం? చెప్పు." వా.

ప్రాలు గల

మాంగల్యభాగ్యం కల.

"ప్రాల్గలరతిదేవి భాగ్యసంపదఁ గదా, ప్రసవసాయక! చచ్చి బ్రతికితీవు." నైష. 2.138.

ప్రాలు తలబ్రాలలోని ప్రాలే అయినా అది మాంగల్యసూచకమాత్రమై ఇలాంటి పలుకుబళ్లలో కానవస్తుంది.

చూ. శుకసప్తతి.

ప్రాలు గలనాడు

లోన గింజ ఉన్నప్పుడు—భాగ్య మున్నప్పుడు—శ్లేషలో రెంటికీ ఉదాహరణ క్రిందిది.

"ప్రాలు గలనాఁడు ధాన్యమువోలె సుసేవ్యుఁ డగు నరుఁడు."

కుమా. 8.168

ప్రాల్గలవాడు

భాగ్యవంతుడు.

"ప్రాల్గలవాఁడవు దక్షవాటికానాయక!" భీమ. 4.77.

ప్రాసంగుబ్రాలు

మంచి బియ్యము.

"హరునకు నిత్యంబుఁ గరికాలచోడు, నరపతి యారోగణము సెమ్మిఁ జలుప, బలకల నేతిన ప్రాసంగుఁ బ్రాలు, నలవడ మున్నాఁట యఱువదిపుట్లు ......" బస. 5.143.

ప్రిదిలపఱుచు

పోగొట్టు.

"వేలుపులవేల్ప మా మొఱ యాలకించి ......సెదలఁ బొదలెడునఘ కెల్లఁ బ్రిదిలపఱచి, సాఁకవే..."

అచ్చ. రా. బాల. 69.

ప్రియము కయికొను

ఇష్టపడు.

"న న్నెప్పుడు పొడగన్నం, గన్నులఁ గప్పుకొనుఁ బ్రియము గయికొను నామా, టన్న జవదాఁటఁ డతఁడు."

విప్ర. 4.66.

ప్రువ్వ దిట్టు

చెడ దిట్టు.

"జనులు ప్రువ్వఁగఁ దిట్ట నడి కోర్చి యార్జించెఁ, బళ్యతోహారవృత్తిఁ బసిఁడి ప్రోగు." పాండు. 3.105.

ప్రెబ్బొత్తి

పెద్ద గుంపుగా నున్నది.

"ప్రెబ్బొత్తి పెయ్యల పెద్ద యొక్కరుఁడు."

బసవ. పు. 5.131 పా. 28 పం.

ప్రేగులోపలి తీట

ప్రతి చేయ లేనిబాధ.

ఇం కెక్కడైనా తీట ఉన్నప్పుడు గీఱుకోవడం సాధ్యమవుతుంది కాని ప్రేగులోపల ఉన్నప్పుడు సాధ్యం కాదు

కదా! దానిపై వచ్చిన పలుకుబడి.

"అంత నయ్యింతి యొక్కింత యళికి యాడి, ప్రేగులోపలితీట నీ బీద ముసలి." శుక. 3.354.

ప్రేబ్రాలు

పేలాలు.

"కప్పఁ జిచ్చిడి ప్రేఁబ్రాలు కొఱకఁ దివురు." పాండు. 4.196.

ప్రేలరితనము

వాచాలత్వము, వట్టి వాగుడు కాయతనము.

కుమా. 7.45.

ప్రేలరిమాటలు

వ్యర్థపువచనములు.

"వలవని ప్రేలరిమాటల, నలిగింపకు నన్ను..." భార. ద్రో. 5.370.

ప్రేలుగొండి

వాగుడుకాయ, వాచాలుడు.

కుమా. 7.49.

ప్రేవులు వాతికి వచ్చు

దుర్గంధముతో కడుపు త్రిప్పు.

"వడిఁ జొచ్చి ప్రేవులు వాతి కేతేర, నడరుదుర్గంధంబు కణుమాత్ర మైనఁ, గింకిరిపడక."

గౌ. హరి. ద్వితీ. పం. 1579.1581.

"రామ రామ! ఆ సందులోకి వెడితే ప్రేవులు నోట్లోకి వస్తాయి" వా.

ప్రైవడు

నింద పడు.

"ప్రైవడి పోయెఁ గాక ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి యాసభన్." భార. కర్ణ. 3.224.

ప్రొద్దగు

ప్రొద్దు పోవు, ఆలస్య మగు.

"స్వగేహంబున, ట్టుగమీఁదన్ వసి యించి భార్యపయి దృష్టుల్ నిల్పి యుండంగఁ బ్రొ, ద్దగుడున్." కేయూ. 3.239.

ప్రొద్దు కలుగ

పొ ద్దుండగానే.

ఇది నేటికీ రాయలసీమలో వాడుకలో ఉన్నది.

"పొమ్మ సంజీవికొండకుఁ బ్రొద్దు గలుగ." మొల్ల. యుద్ధ. 74.

"ఒంటిగా పోతున్నావు. పొద్దు కలుగా రా నాయనా!" వా.

ప్రొద్దు క్రైవాలు

సాయంకాల మగు.

"ఇవ్విధంబున భూజను లెల్లఁ జూడఁ, బ్రొద్దు క్రైవాలుదాఁక నప్పాలఁతు లుండి." శుక. 3.93.

ప్రొద్దు గడుచు

కాలక్షేప మగు.

"అంతటఁ దన నగరుకుఁ జని, కాంతా తిలకంబు ప్రొద్దు గడువమి నెంతో." శుక. 1.504.

ప్రొద్దు గాని ప్రొద్దు

వేళ గాని వేళ.

సమయము కా దనుట.

"శేషశైలంబున కరిగి క్రమ్మఱి వచ్చువాడఁ బ్రొద్దు గానిప్రొద్దున నీయూరిం జేరి..." శుక. 3.187.

ముఖ్యముగా భోజనసమయము దాటిన దనుటను సూచించునది.

## ప్రొద్దు జరపు

కాలము గడపు.

"కటజవిపినపవననటదలకభరుండు, నగుచుఁ బ్రొద్దు జరపునవసరమున." మను. 4.13.

## ప్రొద్దుతఱి భుజించు

వేళకు భోజనము చేయు.

"విమలసాగరమార్గవిహిత మా మాహిష, దధ్యోదనము ప్రొద్దుతఱి భుజించి" హంస. 2.157.

## ప్రొద్దునెల

ప్రసవము జరుగగల మాసము.

"ప్రొద్దునెల యనంగ, వైజనన మెసఁగు." ఆం. భా. 2.109.

## ప్రొద్దుపాటు

అపరాహ్ణము.

"ప్రొద్దుపాటున బహుభక్ష్యభోజ్య లేహ్య, చోష్యపానీయములు పాకశుద్ధి గాఁగ." వరాహ. 2.130.

## ప్రొద్దు పుచ్చు

కాలము గడపు. కాలక్షేపము చేయు.

"బొమ్మ పెండిలిపాటఁ బ్రొద్దు పుచ్చు నెలుంగు." హర. 4.11. కాశీ. 5.224.

## ప్రొద్దు పొటుకున గ్రుంకు

అస్తమాన మగు. సూర్యాస్తమయమును తెలుపు పలుకుబడి.

"...సమయం, బనుచోరుఁడు రోదసీ గృహముఁ జొచ్చి భయం, బునఁ బఱవ నడఁచు దీపం, బునఁ బోల్పం బడుచుఁ బ్రొద్దు పొటుకునఁ గ్రుంకెన్." శుక. 2. 304.

"అంత ప్రొద్దు పొటుకునఁ గ్రుంకెన్." సారం. 3.168.

## ప్రొద్దు పొటుక్కున బొడుచు

ఉదయ మగు. ధ్వన్యనుకరణము.

"రెండరామడదన్, బ్రొద్దు పొటుక్కనం బొడువ భూధరకూటము నెక్కి డిగ్గుచున్." శా. మా. 4.55.

## ప్రొద్దు పొడుచు

ఉదయ మగు, సూర్యోదయ మగు.

"పుణ్యనక్షత్రమునఁ బ్రొద్దు పొడుచు నపుడు." భీమ. 6.34.

## ప్రొద్దు ప్రొద్దున

పూటపూటకు.

"పేర్మి రెట్టింప షడ్రసోపేతములుగఁ, బ్రొద్దు ప్రొద్దున భోజనస్ఫురణ లొసఁగు." శుక. 4.29.

## ప్రొద్దుపోక

కాలక్షేపము, వినోదము.

"అనఘ! సుహృద్ద్యూతం బిం, దొన రింతయు ప్రొద్దుపోకయును నగు జూదం, బునకుం బ్రియుఁడవు." భార. సభా. 2.184.

"పూని మనము గొంత ప్రొద్దువోకకు రాము, నెత్త మాడ నీవు నేర్తు వనఁగ విందు." భాగ. ఉ. 10.294.

**ప్రొద్దు పోనిచ్చు**

(వ్యర్థముగా) కాలక్షేపము చేయు.

"లేని దుడుకులఁ బెట్టుటఁ బూని కొనుచుఁ, బ్రొద్దు పోనిత్తు రెపుడును భూమిసురులు." శుక. 2.502.

**ప్రొద్దుపోని యపుడు**

ఏమీ తోచనప్పుడు.

"ప్రొద్దు పోనియపు డెల్ల రాయంచ పూని చెప్పి..." హంస. 6.363.

**ప్రొద్దు పోవు**

కాలము గడచు.

"అడియాసల నాతని రాకఁ గోరఁగాఁ, బ్రొద్దును బోయె." రాజగో. 4.6.

**ప్రొద్దు మసక బడు**

సాయంకాల మగు.

"ప్రొద్దు మసకం బడె."

జైమి. 7.193.

**ప్రొద్దులనెల చొచ్చు**

ప్రసవసమయము అగు. ప్రొద్దు లనగా ఇచట కను ప్రొద్దులు.

"ప్రొద్దులనెల చొచ్చిన న,మ్ముద్దియకు జనించి రపుడు మోహనమూర్తుల్."

కా. మా. 4.8.

"సతికిఁ బ్రొద్దులనెల సొచ్చె జడత హెచ్చె." కళా. 5.125.

**ప్రొద్దులవేళ**

ప్రసవసమయము.

"ఒకానొకనాఁడు నాపరం, గట నడయాడు నొక్క మృగకాంతకుఁ బ్రొద్దుల వేళ చాలఁ జే,రుటకతనం..."

కువల. 2.25.

**ప్రొద్దులు చొచ్చు**

కనుప్రొద్దు లగు.

"సూర్యుఁ డుదయింపఁ బ్రొద్దులు చొచ్చి యుండ." కాశీ. 1.124.

"ప్రొద్దులు చొచ్చెఁ గద్రూదేవి కిపుడని, ప్రియ మందు వేఱు గర్భిణి గుఱించి." పాండు. 5.269.

**ప్రొద్దులు పుచ్చు**

కాలము గడపు.

"శివకథావిధానంబులఁ బ్రొద్దులు పుచ్చుచు." శివరా. 1.13.

**ప్రొద్దు ప్రాలు**

సాయంత్ర మగు.

"సైంధవుండును నేలకు ప్రాలండు, ప్రొద్దునుం బెద్దయు ప్రాలె."

భార. ద్రోణ. 4.257.

**ప్రొద్దు వేవు**

తెల్లవాఱు.

వేగు, వేవులు వేకువను సూచించును. ప్రొద్దు వేవు అపూర్వమే.

"ప్రొద్దు వేవె లెం డనుచుఁ, బాతాళగంగాడఁ బాఱెడువారు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 467.

**ప్రొద్దువోక**

వృథా కాలక్షేపము.

"పూజ సేయుచు దాన ప్రొద్దువోకలను, మెలఁగుచే కాని."

వర. రా. బా. పు. 44. పం. 35.

**ప్రొద్దు వోదను**

నీ కేమి కాలక్షేపము చేయుటకు మరొక మంచిపని దొరక లేదా అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"బుధుల కీ వేఁడివఁ బ్రొద్దు వోదను నీకు." విప్ర. 3.15.

వాడుకలో: 'డిటెక్టివు నవలలు చదువుతున్నా వేమిటిరా? నీ కేమి పొద్దు పోవడం లేదా?' ఇలా వచ్చినదే పొద్దు పోనిపని.

'ఇట్లాంటి పొద్దు పోని పనులతో ఏ మవుతుంది? పనికి వచ్చేది ఏ మయినా చెయ్యి.' ఇది రాయలసీమలో ప్రచురంగా వినిపించేపలుకుబడి.

**ప్రొద్దు వోయినది**

రాత్రి యయినది.

"ప్రొద్దు వోయిన దని తలారులకు వెలిచి." నిరంకు. 2.93.

**ప్రొద్దు వోయెను**

ఆలస్య మయినది.

"పోయి రా దయ్యెఁ జెలి ప్రొద్దు వోయె ననుచు." పారి. 1.70.

**ప్రొద్దెక్కు**

1. మధ్యాహ్న మగు.

"బహిరావరణప్రదక్షిణంబ కావించి ప్రొద్దెక్కె నిజపక్కణంబునకుం బోవుచుండు." ఆము. 6.10.

"పొద్దెక్కేలోగా తిరిగి యిల్లు చేరుకోవాలి. అందు కని తెల్లవారుజామునే బయలుదేరాను." వా.

2. వేళ యతిక్రమించు.

"మిక్కిలి దూరంబు వోయి మృగశాబము ప్రొ, ద్దెక్కినదాఁక వనంబునఁ, జిక్కిన దుఃఖించు రాజు చిత్తములోనన్." వి. పు. 3.258.

**ప్రొద్దొకవన్నె నందు**

రోజు రోజుకూ ఒక వన్నె హెచ్చు.

"నిచ్చలుం జినుకం బ్రొద్దొకవన్నె నందుఁ గలమశ్రేణుల్ ఫలం బందివే." రాజగో. 4.76.

**ప్రొద్దొక సింగారముతో**

వేళ కొకవిధంగా శృంగారించుకొంటూ.

"ప్రొద్దొక సింగారముతో." విజయ. 2.144.

**ప్రొయ్యిడు**

పొయిలో పెట్టు.

"కడఁగి యనువుగఁ జేసి ప్రొయ్యిడుదుఁ గాని, కత్తి గొడ్డలి యడుగ నేఁ గట్టియలకు." భార. విరా. 1.78.

**ప్రోకలు గట్టు**

గుంపు కట్టు.

"ఇమ్మగుచెట్టులనీడ నుండఁగాఁ, బ్రోకలు గట్టి వారిఖగముల్ ..." కేయూర. 3.87.

**ప్రోకలు గొను**

గుంపులు కట్టు.

"ప్రోకలు గొని మౌక్తికనిక, రాకర
మనఁ దార లెసఁగె నంబరవీథిన్."
కు. సం. 8.98.

## ప్రోగుద్రాడు

వేటలో తెరకట్టుటకై పైన కట్టుత్రాడు.

"తెల్లనిచామర, ఖండంబులు ప్రోఁగుఁ
ద్రాళ్లఁ గట్టుదు రెలుఁగుల్."
కాళ. 3.9.

## ప్రోగుచుట్ట

వేటసాధనము.

"తలముడు లుర్లు బోనులు తెరల్
మెలుఁగీటెలు ప్రోగుచుట్టలున్."
ఇందు. 2.58.

## ప్రోచికోలుగా నిచ్చు

బక్క చిక్కిన పశువులను మేపి అనుభవించుకో నిచ్చు.

"రంగన్నకు మా మందలో రెండు
ఆవులను పోచికోలుగా ఇచ్చినాము."
వా.

## ప్రోది గావించు

దోహదము చేయు.

"తోఁటకుఁ బ్రోది సేయుచున్."
విప్ర. 2.33.

## ప్రోది గొను

పోషించు.

"అస్పృగార్ద్రిం బొనరించి ప్రోది గొన
కుద్యత్కీర్తిసస్యౌఘముల్."
నరస. 3.16.

## ప్రోదిపట్టు

నివాసస్థానము.

కుమా. 3.18.

## ప్రోది యొనర్చు

కాపాడు.

"ఎల్లవారలు వినుతింపఁ బెంపెసఁగుఁ
బ్రోది యొనర్చుచుఁ దల్లిఁ దండ్రి నెం,
దు న్వివిధానురూపతను దోహదభోజన
పూజనాదులన్." పాండు. 2.12.

## ప్రోది వెట్టు

పోషించు.

"క్రొవ్వారు కెందమ్మి కొలఁకు నఁ
బ్రొద్దునఁ, బాలసినవలపులఁ బ్రోది
వెట్టి." భాగ. 8.266.

## ప్రోది సేయు

అభివృద్ధి పఱచు.

"ప్రభలు నభోవిటంకమున భానుమరీ
చులఁ బ్రోది సేయఁ గౌస్తుభనిభ
నూత్నరత్నపరిశోభిత మై."
మను. 5.76.

## ప్రోపడు

1. రాశి యగు.

"రక్కసుతోడ రక్కసుం, బ్రోపడ
వ్రేయుచుం గపులు పోరుచు నుండఁగ
నన్నిశాచరుల్."
భా. రా. యు. 980.

2. పోషింపబడు.

## ప్రోపరి

రక్షకుడు.

"కల్లల కెల్ల నిల్కడలు గారె కనుం
గొన నేల ప్రోపరుల్."
అచ్చ. రా. అయో. 34.

## ప్రోపఱు

పుష్టి చెడు.

"వాహముల్, ప్రోపఱి పెల్లవారుచు

ప్రభూతభయార్తిఁ గలంగి రయ్యో
డన్." హరి. పూ. 4.100.

ప్రోపెట్టు

ప్రోగుగా ఉంచు.

"శిరంబులును మెట్టులు గొనం బ్రో,
పెట్టు." కు. సం. 12.953.

ప్రోయాలు

ఇల్లాలు.

"ఆనలు మోము వేల్పు ప్రో, యాలు ప్రవీణ
మామకమహాకృతినాథుఁ గృతార్థుఁ
జేయుత౯." రామా. 1.8.

ప్రో ల్గుడుపు

ప్రేరేచు. శ. ర.

ప్రో వగు

గుంపగు, గుంపు గూడు.

"కావునఁ బాండవపక్షము, భూవల్లభ
కోటి యిచటఁ బ్రో వగును."
భార. ఉద్యో 1.16.

ప్రోవనిబంటు

జీతము లేనిసేవకుడు.

"అవనిపాలుర ప్రోవనిబంటు లౌచు."
దేవీ. 9.905.

ప్రోవుకొను

గుంపు గూడు.

ప్రోవుకొల్పు

ప్రోగుగా చేయు.

"అరుదుగఁ బ్రోవుకొల్పెడుమహామల
కోమలమూర్తికావలిన్."
కవిక. 6.112.

ప్రోవు గట్టు

1. రాశి యగు.

"వేవురు విభాకరులు పదివేవురు
ప్రళయపాతకులును బ్రోవు గట్టినట్టి
పగిది౯." హరి. పూ. 4.79.

2. గుంపు కట్టు.

"భూతములును నింద్రియములు నొక్క
ప్రోవు గట్టి యున్నవీనికి."
భార. శాంతి. 6.320.

ప్రోవు దీయు

రాశినుండి తీయు.

"అంగజాస్త్రప్రో, తమ్మనఁ బ్రోవు
దీసె విటతండము గుండియ లార విచ్చఁ
గన్." వీధి. 27.

ప్రోవున నొక్కడగు

దాదాపు గుంపు గుంపు నశిం
పగా దాదాపు ఒకటి అర
మిగులు

"పొడ కడంగి ప్రోవున నొక్కండై
పో విడిచినఁ బోయినపోకై."
ఉ. హరి. 1.148.

ఫలతాంబూలాలు

చూ. దంపతి తాంబూలాలు.

ఫలానా అని చెప్పుకో దగిన

కాస్త పేరూ ఊరూ కల.

"ఫలానా అని చెప్పుకోఁ దగిన."
పాణి. 3.90.

బంకతెవులు

సస్యములకు కలిగే ఒకానొక
రోగము.

బ్రౌ౯.

బంకపురుగు

ఒక విధ మగుకీటము.

బంకమన్ను

కుండలు చేయుట కుపయోగించుమన్ను.

బంకముచ్చు

పిసినారి, లోభి.

శ. ర.

బంగనబయలు

బట్టబయలు.

శ. ర.

"గోడ తీసివేయగానే పెరడు బంగన బయలు అయి పోయింది." వా.

బంగరమువంటి మనసు

మంచి మనసు.

"బ్రతుక నేర్చిన తను వాక్కుపతి కొసంగి, బంగరము వంటి మనసు గొంటంగ నేలకో"

శుక. 1.531.

బంగరువంటి

అపురూప మైన.

"బంగరువంటి కాపురము పాడొనరించి పరాభిలాష మై......"

తె. జా.

బంగారం ఆల

బంగారంగా.

"ఆఁ. దాని కేం నాయనా! బంగారం ఆల తీసుకొని పోయి చదువు." వా.

చూ. బంగారంగా.

బంగారంగా

ఏమాత్రం ఆక్షేపం లేదనుట.

"బంగారంగా మా యింట్లో ఉండొచ్చు." వా.

"బంగారంగా ఉండు. నాకేం అభ్యంతరం లేదు." వా.

చూ. బంగారం ఆల.

బంగారం వంటివాడు

మంచివాడు.

"వాడు బంగారం లాంటివాడు. వాణ్ణేమయినా అన్నావంటే నీ నోట్లో పురుగులు పడతాయి." వా.

బంగారపుబొమ్మ

అందగత్తె.

"శృంగారరస మెసంగఁగ, బంగారపు బొమ్మవంటి బాలిక యపుడు..."

శుక. 1.491.

చూ. చక్కెరబొమ్మ.

బంగారమునకు వన్నె వెట్టినట్లు

అందమైనదానికి మరింత అందం చేకూరినట్లు.

"బంగారానకు వన్నె వెట్టిన గతిన్ బద్మాక్షి! నీ మేనిపై, సింగారంబు చెలంగ..." రాజగో. 2.43.

చూ. బంగారుకు తావి అబ్బినట్లు.

బంగారమువంటి పాయము

అమూల్యమయిన యౌవనము.

"వెంగలివి గాక నీ వో, యంగన భోగముల పంట యామని యగు నీ బంగారు వంటి పాయము." కళా. 4.71.

బంగారయ్యా

మిక్కిలి ప్రియుడు.

"నా బంగారయ్యా నీవు చల్లఁగా నుండు మిఁకన్." శుక. 2.71.

**బంగారుకాళ్ళయ్య**

అడుగు పెట్టినచో పెల్లా అభివృద్ధిని కలిగించువాడు.

చమురుకాళ్ళవాడు అనుటకు వ్యతిరేకము.

"ఏ వేళఁ మతి యే ముహూర్తమున మాయిల్ సొచ్చినాఁడో మనో,భావజ్ఞుం డయి సర్వముఁ నడుపు నా బంగారు కాళ్లయ్య జే, జే వేయేడులు రాజ్య మేలు మనుచుఁ..." వైజ. 285.

**బంగారుకుండ**

అందాలరాశి.

అందగత్తె, అమూల్య మయిన నిధి.

"బంగారుకుండ యైనకన్యకారత్న మునకు." విజయ. 3.88.

"బళిరా! తేరకుఁ దేర దక్కె నిటు నీ బంగారుకుం డంచు. పాండు. 3.67.

**బంగారుతీగ**

ఒక రక మయిన చెఱకు.

"చెఱకులో బంగారుతీగ చాలా రుచిగా ఉంటుంది." వా.

**బంగారుకొమ్ములు అమరు గాక**

ఎంత గొప్పవాఁడైతే నేమి?

"అమరుఁ గాక హిరణ్యశృంగములు దనకు." శ్రవ. 2.60.

**బంగారుగా చేయు**

సువర్ణమయముగా చేయు.

"నరేంద్రనందనుల నుద్దాడించి సప్తాంగముల్, బలుసొమ్ముల్లోని సంయమీ! యిడుపులుం బంగారుగాఁ జేసినన్." విప్ర. 3.14.

**బంగారువంటి**

1. స్వచ్ఛమైన.

"వార లెల్లను బంగారువంటి నిన్నుఁ, బాసి పలుగాకులకుఁ గొంగు పఱచు చెలుల..." శుక. 2.120.

"బంగారువంటి కోమటి, సంగీతము చేత బేరసారము లుడిగెన్." చాటువు.

"వాడా? బంగారం లాంటి మనిషి." వా.

2. అంద మయిన.

"బంగారువంటి మేనికి, సింగారము వేఱె కలదె? శీతాంశుముఖీ!." రాజగో. 2.63.

**బంగారువాన**

దానంతట అది వచ్చి పడు భాగ్యము.

"ముంగిటి కల్పభూరుహము మూల ధనంబు నివేశనంబులో, బంగరువాన చేతి కగపడ్డతలంపులమానికంబు..." అని. 1.42.

**బంగిముచ్చు**

బంగి త్రాగువాడు.

శ. ర.

**బంటు చేయు**

సేవకుని చేయు.

పాండు. 4.304.

**బంట్రౌతుతనము**

శూరత్వము.

"నీ బంట్రౌతుతనంబు స్త్రీలయెడనే ని స్నెవ్వరుఁ నవ్వరే..." ఇందు. 4.53.

**బండ కెత్తు**

మొండి కెత్తు.

"వాడు బొత్తిగా బండ కెత్తి పోయి నాడు." వా.

**బండచాకిరి**

అరవచాకిరి.

మాటా. 26.

**బండతల**

బట్టతల.

"ఎండమావులఁ బట్ట బండతలయు, క్రోఁకాలు ముడి వెట్ట."

కు. సం. 8.135.

**బండతిట్లు**

బండబూతులు.

"కండకన్నులవాని నాఁకటను బండ, తిట్ల చేతాళికల సారెఁ దిట్టువాని."

ఆము. 6.20.

**బండ బాఱు**

మొద్దు బాఱు.

"ఆనలినాయతాక్షు ప్రసవాపగమంబున బండబాఱుచున్, ప్రాణవిభూషలాల నము ప్రాఁకుడుగొయ్యగ నిల్చి..."

పాండు. 4.268.

**బండబూతులు**

బండవాళ్లు తిట్టుకొనే బూతులు.

బండుబూతులు అని.

శ. ర.

**బండరుకవిలె**

ఖజానాలెక్కల పుస్తకం.

"తక్కిన బండరులెక్కలు నూడు, మనుచు నబ్బసవఁ డత్యనురాగలీలఁ, గనుఁగొని బండరుకవిలియ సదువ..."

బస. ఆ. 5.137.

**బండబొమ్మలు**

మగవాని రొమ్మువలె చదరంగా ఉన్న రొమ్ము గల స్త్రీ విషయంలో ఉపయోగిస్తారు.

"దాని కేం అందమా? చందమా? ఆ బండబొమ్మలూ అదీ." వా.

**బండసంసారము**

పాడుసంసారము.

రామరామ శత. 11.

**బండారము బయట పడు**

గుట్టు వెల్లడి యగు.

"వాడు వస్తే నీ బండారం బయట పడుతుంది." వా.

"వీ డేదో మహాపండితు ణ్ణని విఱ్ఱవీగుతున్నాడు. కానీ సభలోకి వస్తే వీడి బండారం బయట పడుతుంది." వా.

**బండారువు**

ఖజానా.

అసలు నే డీమాట బండాలం అని వాడుకలో ఉంది.

'ఈ వ్యాపారానికి ఏమాత్రం బండాలం పెట్టావు' రాయలసీమలో వాడుక. 'వాడి బండాలం బయట పడింది' లోనూ ఇదే. లక్షణయా సత్తా, సారం అని నిలిచింది.

"తనబండారువు నూఱు వుచ్చె నొకో కందర్పుండు నేఁ డంచు..."

కుమా. 10.28.

**బండికండ్లు**

బండిచక్రములు.

"తిరిగాడు బండికండ్లపగిదిన్ భ్రమి యించుమనంబుతోడ."

పారి. 1.104.

వాడుకలో బండిచక్రాలకు మధ్య నుండుకుండలను బండి కండ్లు అంటారు.

## బండికుంపటి

ఒకచోటినుండి మఱొక చోటికి తీసికొని పోవుటకు అనువయిన ఒకరకపు కుంపటి.

"బంగల యనంగ బండికుంపటి యగు భవ." ఆం. భా. 2.241.

## బండిబాట

ఘంటాపథము.

ఆం. భా. 2.9.

## బండిబాట చేయు

చక్కనిదారి యేర్పఱచు.

"శ్రీ వేంకటేశుదాసు లై పరముతోన, బండిబాట చేసినారు ప్రపన్నులు."

తాళ్ల. సం. 5.287.

## బండిబారు

రథసైన్యము.

"అట్లపై, నిలిచినకృత్తమస్తకము నివ్వెఱఁ గొల్పఁగ బండిబారునన్."

కవి. 5.164.

## బండిమీద బోవు

తొందర పడు.

ఆగకుండా బండిమీద పోతూ నే మాట్లాడువా డనుటపై వచ్చినపలుకుబడి.

"బండి, మీఁదఁ బోవుచు నున్నాఁడు."

పాండు. 4.167.

## బండి మూల పడు

నా పని అయిపోయిన దనుట.

"అరవై యే ళ్లొచ్చాయి. నా బండి మూల బడింది. ఇంక నేను చేశే దే ముంది ? వా.

## బండుబం డగు

1. బ్రద్ద లగు.

"ఎల్లనాఁడు నిట్లానే బండుబం డై, యెందుఁ గడపల గానక...కూరవలె నాయె బదుకు."

తాళ్ల. సం. 11. 3 భా. 24.

2. పటాపంచ లగు.

"బండుబం డై యసురులు పారరో దిక్కులకు." తాళ్ల. సం. 8.164.

## బండు సేయు

1. అల్లరి చేయు.

"ఈవు వచ్చితి మే లయ్యె నిదియ చాలు, నతఁడు రాకున్నఁ గొదలేశ మైన లేదు, దాను భిక్షాకపాలంబు దాల్చి వచ్చి, బండు సేయుట కంటె రాకుండు టుఱవు." కాశీ. 7.70.

2. పాడు చేయు.

ఇక్కడి 'బండు' బండమనిపి. బండపడు, బండతనము, బండుబూతు వగైరాల లోని వంటిది.

3. బద్దు చేయు, ఆరడి చేయు.

"బండు సేసితివి నను బాపురా నను లోకానను." తాళ్ల. సం. 3.446.

చూ. బద్దు చేయు.

**బంతి కట్టుకొని**
వరుసగా నిలబెట్టి.
"...మృగంబులం బట్టుకొని బంతి కట్టుకొని, కాౘేనుగుడికి నడచు నప్పుడు." కా. మా. 3.36.

**బంతికుడుపు**
పంక్తిభోజనము.
శ. ర.

**బంతికూడు**
"బంతికూళ్లకుఁ బ్రీతిఁ బజాతెంచి తోడ తోడఁ, గలయ బంతులు సాఁగఁ గలరు గాక." చంద్రా. 3.45.

**బంతి గుడుచు**
సహపంక్తిభోజనము చేయు.
"కలన వృష్ణిసాత్యకులుఁ బంతి గుడు వంగ, యదుకులాబ్ధిచంద్రుఁ డార గించె." ఉ. హరి. 2.54.
"బహివడ ద్విజున కల్పవుఁ బాచితం బడి, పసిఁడికై తా వాని బంతిఁ గుడిచి." ఆము. 7.5.

**బంతిలో పక్షపాతము**
తగని దనుట.
ఒకే పంక్తిలో కూర్చున్న వారికి ఒక విధంగా పెట్టక పోవుట.
కుమారీ శత. 51.
చూ. పంక్తిభేదము.

**బంతి సాగించు**
వరుస తీర్చి భోజనము పెట్టు.
"బంతి సాఁగించె భుక్తిశాలాంతర మున." కాశీ. 7.184.
"మొదటిబంతి సాగుతూ ఉంది. కాసేపు ఉండండి. రెండో బంతిలో కూర్చుందురు కానీ." వా.

**బంతులు సాగు**
భోజనమునకు బంతులు దీరి కూర్చుండు.
"పరమఋషులు నృపులు వరుస బంతులు సాగన్." జై మి. 8.201.
2. పరంపరగా వ్యాపించు.
"చెక్కుపయి బంతుల్ సాఁగఁ దాటంకదీ, ప్తులు..." దశా. 2.364.

**బంతెనగుండులు**
బంతిలో భోజనానికి కూర్చున్నపుడు ఒకరిపై నొకరు విసరుకొనుకబళములు.
"ఇన్ని యుండఁగఁ బంచి యిడుట నెచ్చెలితన, మనుచు బంతెనగుండు లాడు నొకఁడు." భాగ. 10. పూ. 496.

**బందనగొను**
జిగట కలది యగు.
"ఇందీవరమరందంబుల బెందడిం బడి బందనగొను వలిమించు క్రొమ్మంచు బొదు లీఁది యీఁది." మను. 3.28.

**బందపుదాటు**
బందం వేసిన కాళ్లతో దాఁటేదాటు.
"గవని వెన్నారయ మిన్నవియ దట్టించుతో త్రిధర బందపుదాంట్లఁ దటిమి తటిమి." ఆము. 2.24.

**బందముత్రాడు**
కవ్వపుత్రాడు.

"వాసుకిఁ, బందముగాఁ ద్రాడొనర్చి హరి పాలసముద్రముఁ జిల్కుటల్."
కృ. శతం. 2.199.

బందము వేయ
బద్ధునిగా చేయు.
"నిన్నగా దట మొన్న నీరజోదరుఁడు, బన్నపర్చుచు బలి బందంబు వేసి."
పండి. వాద. పా. 216.

బందాకోరుగా జేయు
బందీగా జేయు, బంధితునిగా జేయు.
"వ్యాసనం,దనుఁడో యెంతటివాఁడు వీఁ డనఁగ బందాకోరుగాఁ జేసెదన్."
హంస. 2.38.

బందాటము
పట్టుదల.
"దొడ్డ బందాటమునఁ గోక ద్రోసికొనుచు."
కవిక. 4.95.

బందికత్తెలు
బందీగా కొనగలవారు, బంధించువారు.
కాశీ. 3.109.

బంది కట్టు
బందిపోటు చేయు.
"కన్నంబు వెట్టి తెక్కలిగొని యంకంబు, పలువురతో నాడి బంది కట్టి."
దశకు. 6.95.

బందిపోటు
దారి కొట్టి దోచుకొనుట.
శ. ర.

బందివాటు
నిర్బంధము.
"వనిత హంసమ్మను బందివాటుల మాత."
ద్వి. హరి. ఉ. 1.95 పం.

బందివెట్టు
బందిపోటు చేయు.
"దొంగలు బంది వెట్టంగ నూహించి."
బస. పు. 2.382.

బందు కట్టు
1. గడ్డు కట్టు.
"బందుకట్టు దుఃఖములఁ బాపుదు నని."
తాళ్ల. సం. 7.234.
2. మంత్రించి వశము చేసుకొను.
"నన్నిటుల దూషింప, నిది యేల పరిధాన మిచ్చిరో వారు, బందుకట్టిరొ నిన్నుఁ బౌరుపాధిపుని, యందుఁ జూపోపక యన్యు లిట్లాడ, బోధించిరో."
వర. రా. యు. పు. 149. పం. 7.

బందుకట్టుకొను
వశపఱుచుకొను.
"అడ్డెలు విడివేల్పు లమరగాం ద్రసురేంద్రు, కార్యకర్తల బందు కట్టి కొనఁగ."
కువల. 3.9.

బందుబస్తు
ఏర్పాటు. కట్టుదిట్టము.
"ఈమేను బందుబస్తేమి శాబాసు, మేలు భళీ యంచు మెచ్చి సాక్కుచును."
మృ. వి. 2.63.

బందెకత్తె
దోపుడుకత్తె.
"మదనసమ్మోహనమంత్రాధిదేవతల్, పంచశిలీముఖు బందెకత్తెలు..."
భాగ. 6.445.

బండె గొను

నిరోధించు.

"అల్క వెన్నాడి రాజశుద్ధాంత గణముఁ, దొరకల బండె గొని యెంతు మాఱు లేక." కవిక. 4.92.

బండెదొడ్డి

పశువుల చెఱ.

"చెఱపచే న్విడనాడి, బండెదొడ్డికిఁ జనుకోడె చందము." రా. వి. 3.142.

బండెపసరము

బండెలో పడినపశువు.

"ఇందు నందుఁ దిరుగుచు నెవ్వరి వాఁడవు గాక, బండెపసరమ వైతివి." తాళ్ల. సం. 11.3 భా. 86.

బండెల పడు

ఎవరి చేనిలోని కైనా పశువులు పోయినప్పుడు వానిని బండెలదొడ్డిలో తోలడం అలవాటు. యజమాని యేదో యింత సుంక మిచ్చి దానిని విడిపించుకొని రావలసి యుండును. దానిపై వచ్చినపలుకుబడి.

"బండెలఁ బడి పోయెఁ బశుగణంబు." మను. 3.129.

బండెలపోతు

నిర్బంధము చేయువాడు.

"అచ్చి నాయెనుర బ్రహ్మకుఁ బోవ రాదు, పురిలోన బండెలపో తీతఁ డనఁగ." ద్వి. హరి. ఉ. 723 పం.

బండెలమారి

1. బండెలపోతు.

"ఆ, బండెలమారి చంద్రి భగ భాగ్యము గోరక మానదండమా." చంద్ర. వి. 2.32.

2. చెడ్డవాడు.

"కూళ బండెలమారి, ముందటి పాపాలు ముద్ద ధగిడి." హంస. 5.117.

బండెలు పట్టు

నిర్బంధించు.

"బండెలు సుట్టి యీారములు వట్టి పథంబులు గొట్టి దిట్ట యై." భాగ. 6.107.

బండె వట్టు

బందీగా పట్టుకొను.

"భరత ! మీ తల్లి పతి బండెవట్టె." భాస్క. అయో. 361.

బంబోతు

ఎద్దువలె బలిసినశరీరం కలవాడు.

బలిసిన ఎద్దు అని గ్రాక్.

బకబక లాడు

వాగు.

గీర. గురు. 50.

బక్క చిక్కు

కృశించు.

"అది యటు లుండె సీతను వసంత బలాఢ్యము బక్క చిక్కి యుం, న్నది యిది మాఱురూపు వడి..." శుక. 3.397.

బక్కటిల్లు
శుష్కించు.
"ఆ యెద్దు బక్కటిల్లి పోయింది." వా.

బక్కనీళ్లు
నీరుమజ్జిగ.
కొత్త. 90.
చూ. బక్కమజ్జిగ.

బక్కమజ్జిగ
నీళ్లు ఎక్కువగా చేర్చిన మజ్జిగ.
చూ. బక్కనీళ్లు.

బగళ మగు
తొలగు.
"అవసరం బిప్పుడ యగు నంతదాఁకను, బగళ మై నిలుఁడు దిశాపాలవరులు."
నృసిం. 1.80.

బగళము చేయు
తొలగించు.
"పాయఁ దొలఁగుఁ డం చుభయ పార్శ్వములఁ బగళంబు సేయు చున్." సైష. 7.145.

బగ్గము పాడగు
మిక్కిలి పాడయి పోవు.
"చేతి క్రోవులు వైచి భీతిఁ జై వులు జారె, బగ్గము పాడై తుపాకిమూక."
రా. వి. 5.15.

బగ్గి పెట్టు
బుగ్గిలో కలుపు.
"ఏకకాపీనధారి యై యింటి కింటి. కుక్క సిగ్గును భయమును బగ్గి పెట్టి."
శివధ. 5.60.

బగి వాయు
బైసి మాలు.
"బగి వాయని దిది బదు కెల్లా."
తాళ్ల. సం. 8.28.

బగిసి
భవిష్యము.
నిరసనగా మాటలాడునప్పుడు 'వాడి బగిసికి ఇది కూడ ఒకటి తక్కువా?' అంటారు. 'బగిసి మాలు' దీనిమీద ఏర్పడినదే. బగిసియే తరు వాత బైసి అయినది.
"వీరి బగిసికి మాఱి గారవించిన వారుఁడు, కాయసిద్ధి యొసంగు నే కల్ల గాక." శుక. 3.94.

బగ్గున మండు
ధ్వన్యనుకరణము.
"అకటా!, బగ్గున మండెడు నీకును, సిగ్గించుక లేదు డొక్క జేసెఁడు గాదే." శుక. 3.277.

బచ్చెనకవిత
పైపై మెఱుగుల కవిత్వము, అంతస్సారము లేనిది.
"బచ్చెనకవితలు బాతి గావు ఎందు."
తాళ్ల. సం. 7.260.

బచ్చెన పన్ను
రంగు వేయు.
బచ్చెన పనివారు కఱ్ఱతో బొమ్మలు చేసి దానిమీద

రంగు వేయుదురు. తద్వారా వచ్చినపలుకుబడి.

"వచ్చినఁ జూచి కీరము రవారము మీఱ ముఖారుణద్యుతుల్, బచ్చెన పన్న నా నృపతి పాలికిఁ బోయెద వేమొ." శుక. 2.97.

బచ్చెనరూపు పోకులు

పై పై వేషాలు.

"నీ తెఱఁ గగాధరసాతలభంగి నీవు స్వప్నాలమునఁ బోవకుండి నినుఁ బుచ్చెద బచ్చెనరూపుపోకులన్." భార. శాంతి. 4.51.

బచ్చెనరూపులు

పై పై మెఱుగులు.
అశాశ్వతములు.

తాళ్ల. సం. 5.24.

బచ్చెన వెట్టు

సిద్ధము చేయు

"బండియుఁ బొణకయు బచ్చెనవెట్టి, బంతి నెల్లెడ నందిపడగలు గట్టి." బస. పు. 7.150పం.

బజారు కెక్కు

వీధి కెక్కు.

"ఈ పిల్లవల్ల మన సంసారం బజారు కెక్కింది." వా.

బజీతు సేయు

అవమానించు.

"బజీతు సేయంగ నగునె." ఆము. 5.51.

బటానబయలు

బట్టబయలు.

"కయ్యానకుఁ గాల్ ద్రవ్వుచు, గయ్యాళితనంబు మీఱఁగా దగ్గఱి యా, తొయ్యలి యూఁచక యూఁచక, పయ్యెదకొంగును బటానబయలుగఁ జేసెన్." సారం. 3.16.

బటాబయలు

బట్టబయలు.

"అంకురిం, చినకినుకన్ బటాబయలు సేయక నవ్వ." సారంగ. 2.113.

బటువారు

ఒప్పారు.

"చక్కఁగా బటువారు సంజెడు కుచ్చెళ్లు, చెలఁగుమట్టియలపైఁ జిందు లాడ." వీథి. 12.

బట్ట ఎగుర వేశాడు

దివాలా తీశాడు.

చూ. బట్ట విదిలించేశాడు.

బట్ట కట్టు

బట్టతల అగు.

"ప్రతిదినకేశలుంఛనపు రాయిడి నెట్టన బట్ట కట్టి..." పాండు. 2.64.

బట్టకబయలు

బహిరంగంగా, అందఱికి తెలియునట్లుగా.

"ఇట్లిపుడు, పడయునే శివుకృప బట్టక బయలు." బస. 1.22.

బట్టతడుపు వాన

కొద్ది చినుకులు.

"ఈ బట్టతడుపువానకే భయపడితే ఎట్లా?" వా.

బట్టతలయు బ్రోకాలు ముడి
వెట్ట గల
అసంభవకార్యములను చేయ
గల.
ఏమైనా చేయగలవారు అను
పట్ల ఉపయోగించే పలుకు
బడి.
"బట్టతలయు బ్రోఁకాలు ముడివెట్ట ......నేర్పు గలిగి." కుమా. 8.135.
"యీ విచిత్ర కథలవల్ల దీని కొంనర నే గతిని బట్టతలలు కాళ్లు ముళ్లు పెట్ట గలదో కాని." కళా. 6.78.
"వాడు బట్టతలలకూ మోకాళ్ళకూ ముడి వేయ గలడు." వా.

బట్టబయట నిడు
బయలుపఱుచు.
"పల్లాతులు బట్ట బైట నిడ నోపుచు వాతెఱ నీనె గట్టఁగా..." శుక. 1.514.

బట్టబయటి యాత
వ్యర్థము, అసాధ్యము.
తాళ్ల. సం. 12.75.

బట్టబయలు గావించు
బహిరంగము చేయు.
"ఈ గుట్టు బట్టబయలు గావించినం బాపంబు ప్రాపించుఁ గావున విజనాంత రంబున నుపాయంబున..." శుక. 3.236.

బట్టమేక
ఒక రకమైన పక్షి. శ. గ.

బట్టలు పెట్టు
బట్టలు కానుకగా ఇచ్చు.
"దీపావళికి అమ్మాయినీ, అల్లుడినీ పిలిచి బట్టలు పెట్టా లనుకొంటు న్నాను." వా.

బట్ట విదిలించు
దివాలా తీయు.
"వాడు నలుగు రప్పులవాళ్లూ చుట్టు కునేసరికి బట్ట విదిలించేశాడు." వా.

బట్టినగోల
ఎత్తనగోల.
"తనరు గోణ్యుద్ధారదండాఖ్య యెత్త న,గోల నా బట్టినగోల నాఁగ." ఆం. భా. 2.267.

బట్టువాడు
స్తోత్రములు చేసే బట్రాజు.
"వేఁడుబట్టువాని వినయంబు లధి కంబు." వేమన. 3.153.

బడగొండ
కొండవలె పెద్ద ఆకారము
కలిగి నీళ్ళతో కూడిన
మేఘము.
శ. ర.

బడ బడ
1. రాళ్లు మొదలగునవి
పడుటయందలి ధ్వన్యనుకర
ణము.
"పిడుగులు నుఱుములుఁ బెర్చువేగమున, బడబడ వడగండ్లు వడియె నెల్లెడల." ద్వి. హరి. పూ. 2148 పం.
2. మాటలాడుటయం దగు
ధ్వన్యనుకరణము.
"వాడు బడబడా వాగుతున్నాడు." వా.

బడబాకి

మిక్కిలి పెద్ద దైనది.

"నెఱసినకురులును నిడుదకోఱలును, బఱ పెనకడుపును బడబాకినోరు."

రం. రా. అర. 190 పు. 27 పం.

బడబాగ్ని పిడికిట నొడియు

అసాధ్యకార్యము చేయు.

బడలికలు వాయు

శ్రమ తీర్చుకొను, సేద తీర్చుకొను.

"అస్మద్గృహంబు పావనము చేసి, బడలికలు వాసి చను మన్న బ్రాహ్మణుండు."

కుమా. 247.

బడలువడు

అలసి పోవు, శ్రమ చెందు.

"గుఱ్ఱంబుల కుఱికి బడలువడ నఱిచుతి విసరిన నోరవోయిన, సురియం జెరివి యవలీలం గాలుబలంబులపైఁ బడి చక్కం, జేయుచు."

భార. భీష్మ. 2.71.

"వేదండకాండంబులు తండతండంబులై పయిం బడం బడలువడం గనుపు కొట్టినయప్పట్టున."

జైమి. 2.75.

"మడిసియే కొమ్మలు బడలువడెనో."

విప్ర. 3.67.

"బెడిదంపుఁదూపుల భీకరాసురుల, బడలువడంగ దెప్పరము చూపుటయు."

వర. రా. యు. పు. 348 పం. 3.

బడలు వాపు

చంపు.

"లాఁచి గవిఁ జొచ్చి యచ్ఛభల్లముల గముల, బడలు వాపక యున్న నీబంటఁ గాను."

వేం. పంచ. 2.194.

బడవ వడు

దాసు డగు.

బడవవాటు

దాస్యము.

బడవా

తార్పుడుకాడు—(కత్తె)

"మద్యపాయులతోడ మచ్చిక కారాదు, బడవాల గొప్పగాఁ బట్టరాదు."

వేమ. 52.

బడాపగల జూచు

పగలబడి చూచు, విఱగబడి చూచు.

"వచ్చి మదికి మెచ్చు వచ్చు నచ్చెలి బడా, పగలఁ జూచి వింత పదము వాడి."

శుక. 1.516.

బడికి వేయు

చర్మమును పదును పెట్టు.

"బడికి వేయఁగ నెండఁ బఱచిన తోళ్లు."

గౌర. హరి. ద్వి. 1572.

బడికొను

1. అనుసరించు.

"పెద్దలను బడికొని నడవడం ఎప్పుడూ మంచిది."

వా.

2. పోలు

"తండ్రిని బడికొనేకూతురు అదృష్టవంతురా లవుతుం దంటారు."

వా.

బడికొల్ది

పోలికనుబట్టి.

"తల్లి బడికొల్ది చెట్టంచు నుల్లసంబు, లాడుదురు నిన్నుఁ గూర్చి వ న్నహారహంబు."

కాశీ. 4. 96.

బడికోడి

ఒక రకమైన భక్ష్యం.

పెద్దజాతి కోడి అని

బ్రౌన్.

బడికోలు

పోలిక, సామ్యము.

"నా, చ్చెల చేఁ దైతఱ చెందుఁ దల్లి బడికోల్ చెట్టౌట యే కా మహీఙా."

ఆము. 5.132.

బడిగల్లు వడు

ఆటిబోనులో పడు.

"చింత యెఱుఁగక యేఁగుదెంచితిఁ గాఱుకకుఁ, బోవ బడిగల్లు వడియెనో పాలఁతి యనియె." కళా. 3.105.

బడితపాఠము

దెబ్బలు తిని నేర్చుకొన్న విద్య. గట్టిగా నేర్చుకొన్న విద్య అనుట.

"బడితపాఠము దొంగపదరు లన్ని యౌను."

గా. పఁరి. ద్వితీ. పం. 877.

బడితపూజ

దేహశుద్ధి.

కొత్త. 199.

బడితపూజ చేయు

తన్ను.

"మళ్లీ ఆ ఊళ్లో అడుగు పెట్టా డంటే వీడికి బడితపూజ చేసి పంపిస్తారు."

వా.

బడి త్రిప్పు

1. మరణశిక్ష విధింప బడిన వానిని ఉరికంబం మీాది కెక్కించడానికి పూర్వం పుర వీథుల్లో ఊరేగిస్తారు. అలా త్రిప్పడమే బడి త్రిప్పడం.

2. దిగ దుడుచు, దృష్టి తీయు.

"డాసి తెలిజేకమూఁకటఁ గేసరాన్న, పుంజ మప్పాడు బడి ద్రిప్పి పోసె నొకతె." చమ. 2.

బడిపనులు

చెప్పినపనులు, సేవకావృత్తి.

"పరిచర్యలును బడిపనులు సేయు చును."

పండితా. ద్వితీ. మహి. పుట 135.

బడిపిల్లని చేయు

శిష్యునిగా చేయు.

"...పుష్పకోదండునికిం, బడిపిల్లనిగాఁ జేసిరి." బుద్ధ. 2.104.

బడిపెద్ద

1. ఉపాధ్యాయులకు సహా యంగా ఉండే విద్యార్థినాయ కుడు—ఇంగ్లీషులో మానీటరు.

2. బడి యజమానుడు.

బడిబడి జుట్టు

గిరగిర తిరుగు.

"వెడలి పురంబునం గలుగువీథుల వీథుల సౌధయూథముల్, బడిబడిఁ జుట్టి యా శునకభామఁ గనుంగొని..."

శుక. 2.34.

బడిబడిని

వెంబడిని.

"బడిబడిని వెంటఁ బడువారలకుఙా, జోల ల్పాడిరి." సారం. 1.40.

బడి బడి వచ్చు

మీద మీద వెంట వెంటనే వచ్చు.

"అదె, బడి బడి వచ్చెదరు వేగ పని విను మనినన్." ఉ. హరి. 1.55.

మీద మీద మనిషిని పంపుతున్నాడు అనడం అలవాటు. 'వాడు డబ్బుకోస మని పొద్దున్నుంచీ మనిషిమీద మనిషిని పంపుతున్నాడు.' 'ఏ దైనా అత్యవసర మైనపని ఉన్నప్పుడు మనిషిమీద మనిషిని పంపడం అలవాటు.'

బడిమి పోయు

చుట్టూరా పోయు.

"పొలఁతికి కెందమ్మిరేకులు పోయుఁడు బడిమిగను." తాళ్ల. సం. 12.351.

బడియ బట్ర

చిన్న చిన్న మొద్దులు.

జం.

బడియోగిరము

కొంచెముగా పెట్టిన అన్నము.

బడివాటు

చిన్న దెబ్బ.

బడివాటుజ్వరము

కొద్దిగా తగిలినజ్వరము.

బడి వాయక

పని చేయక.

"పడతి నప్పటి నీదు పాదాలు గుద్దుమంటాను, బడివాయ కింటిలోనఁ బవ్వళించేవు." తాళ్ల. సం. 3.95.

బడివారడి

1. తలపన్ను.

ప్రతి ఒక్కరిమీదా విధించిన పన్ను.

2. రెంటికి కల ఖేదము.

బడివేటు

చూ. బడివాటు.

బడిసిపాటు

తీసికట్టు.

దిగదుడు పైనది అని సూ.ని.

"బ్రహ్మలోకంబు కాశికి బడిసిపాటు." కాశీ. 7.150.

బడిసి వైచు

దిగ దుడుచు.

"పచ్చికప్పార మందంద బడిసి వైచి." క్రీడా. పు. 98.

బడుగుదేవర

బడుగుల దేవర.

"బడుగుదేవర యర్థపతివంద్యుఁ డనుచు, జయ వెట్టుఁ డిటు గూడ సాఁ తెల్ల ననుచు." పండి. పర్వ. 291 పు.

బడెగండ్లు

పెద్ద కలుగులు.

"బడెగండ్లై నొంటిమైఁ బడిన విఘ్నేశవాహము లయ్యె హరిదంతహస్తిపతులు." పాండు. 5.128.

బడే

పెద్ద.

'బడే సాయబుజోస్యులూ!

తొలి యేకాదశి యెప్పుడు?'
అని సామెత.

బతికితిమి
మన మా ఆపద తప్పించు కొంటిమి అనే రకం మైనభావాన్ని తెలిపేపలుకుబడి.
''మనము చేసినసుకృతసంపద నతండు, వినక పోయిన బ్రతికితిమి.''
నిరం. 4.20.
''వా డా విషయం వినక పోబట్టి బతికి పోయాం. లేకపోతే యే మైనా ఉందా?''
వా.

బతికి బట్ట కట్టు
హాయిగా జీవించు.
ఇది వ్యతిరేకార్థంలోనే ఉపయోగించడం అలవాటు.
''వా డేం బతికి బట్ట కట్ట బోతా'డా యేమి?''
వా.

బతికే బావే యిల్లు
నిండిన యిల్లు.
వాడుకలో 'వాడికి బతికే వాడే బావే వాడా?'
'ఆ పిల్ల బతికే బావేదిగా కనబడ లేదు' మొదలయిన చోట్ల బతుకు బాలు జంట పదంగా కనబడుతుంది.
''బ్రతుకు బావెడు నింటఁ బరశురామ హస్తము.''
హంస. 5.109.

బదలాయించు
ఉద్యోగులను ఒకచోటనుండి మరియొకచోటికి మార్చు.
ఒకదానికి మారుగా ఇంకొకటి యిచ్చు.

బద్దపరి
పేముతో అల్లిన కేడెము.
శ. ర.

బద్దపరికి
పలుచనిబిళ్ల.
ఆం. భా. 3.32.

బద్దలవారు
వేత్రధారులు.
''హెచ్చినసంభ్రమంబున న నేకులు బద్దలవార లెక్కుడఁగ, వచ్చియు మోఁది రా కొలువువారిఁ గకాపిక లెచన న్వడిన్.''
కళా. 2.70.

బద్దుకొను
లేని పోనివి కల్పించి చెప్పు.
''సుద్దు లొక కొన్ని లేనివి బద్దు కొనుచు.''
బహు. 5.97.

బద్దులపుట్టిక
అబద్ధాలపుట్ట.
''పైనపుదట్టిఁ గట్టుకొని బద్దులపుట్టిక వెంట రా.''
రా. వి. 2.59.

బన్నపడు
అవమానము చెందు.
''తక్కఁగల యింతిగముల నాదస్యులడరి, పట్టుకొని యేఁచి వీ డెల్ల బన్న పడఁగ.''
భార. మాస. 188.

బన్నము లాడు
దూషించు, అవమానకరంగా మాటలాడు.

"విచారము లేక సురేశ్వరాసులన్, బన్నము లాడి నీకుఁ గని పక్షము వల్కెడుఁ గాక..." కుమా. 2.34.

బన్నసరము
పలురకము లయిన మణులు గుచ్చినహారము.
"దాది యటు పెట్టి పసుపాడఁ దలఁగి చనుడు, బరణి మూఁకుట నెలకొన్న బన్నసరము." పాండు. 4.231.

బన్నసరి
చూ. బన్నసరము.
"విరుల నన్నగు బన్నసరులఁ జెన్నగు మిన్న, వలుఁదగుబ్బలఁ గ్రాఁగి తోలఁగఁ జేసె." చంద్రా. 4.159.

బమిపుర్వు
తుమ్మెద.
"విరితేనె త్రావుడు మరునల్లె బమి పుర్వు." సాం. ని. తిర్య. 79.

బమ్మకట్టు
బ్రహ్మసూత్రబంధము.
"కడఁకఁ బ్రాఁతమినుకు నుడుపులు గొడగినఁ, గడిఁది మీఱ బమ్మకట్లు వీడె." అచ్చ. రా. సుం. 170.

బమ్మకైన పుట్టు రిమ్మతెగులు
ఎలాంటివారి కైనా సందు చిక్కితే దురభిప్రాయం కల గక మానదు అనుట.
"ఆ స్థానం అటువంటిది. అక్కడికి పోయినవా డంతా లంచగొండి కావల సిందే. బమ్మకైన పుట్టు రిమ్మతెగులు అన్నారు." వా.

బమ్మచారి
బ్రహ్మచారి.
"పొ మ్మనినఁ బోయి యొక చిన్న బమ్మచారి, చేత గిన్నియఁ బుత్తెంచె." వైజ. 4.89.

బమ్మరపడు
దిగ్భ్రమ చెందు.
"ఆమ్మహాధ్వని విని యామందవారు, బమ్మరపడి లేచి పరికించి చూడ." ద్వి. భాగ. 1.10 పా.

బమ్మర వోవు
"మిమ్ముఁ గోఁతులు పట్టి మెదచిన మీరు, బమ్మర వోవుచుఁ బఱతెంచి నారు." రం. రా. యు. 328 పా. 14 పం.

బమ్మరాకాసి
బ్రహ్మరాక్షసి.
"బమ్మరాకాసులభంగినిఁ జెట్టెక్కి, పదరుచు నున్నట్టిబరిప్రాణములు." రసిక. 3.174.

బమ్మెతకత్తె
భ్రమ కలిగించునది.
"రొమ్ములకుంపట్లు రోఁతప్రామిండ్లు, బమ్మెతకత్తెలు నమ్మనిబోంట్లు." పండితా. పురా. 343 పా.

బమ్మెర గొను
చూ. బమ్మెర పోవు.

బమ్మెర గొల్పు
భ్రమపెట్టు, మోసపుచ్చు.
"......మమ్మును లక్ష్యము సేయక, బమ్మెర గొల్పెద వటంచు వారలు పల్కన్." పార్వ. 4.163.

**బమ్మెర పోవు**

బిత్తర పోవు.

"జలరుహనాభుఁ డార్చి...నొంచె.... బలవదరాతియోధులను బమ్మెర పోయి కలంగి పాఱఁగన్." భాగ. స్క. 10. ఉ. 405.

**బయకాడు**

సంగీతవిద్వాంసుడు.

"బయకాఱు లొనర్చినట్టి ప్రా, వేశిక మంగళ ధ్రువలు వీనుల కింపుగఁ బాడి రంగనన్." నైష. 7.146.

**బయకారము**

సంగీతము.

"కిన్నెరమెట్ల బంతి సం,గాతపు సన్న బంతి బయకారపుఁ గన్నడగౌళ పంతుకా..." పెద్దన చాటువు.

**బయకారి**

సంగీతము పాడువాడు.

"సొగసు బయకారి జాణను జూచి దగ్గి." హంస. 5.169.

**బయట పడు**

గుప్తముగా నుండవలసినది బయటికి తెలిసి పోవు.

"వా డెంత దాచుకొన్నా ఆస్తికంటే అప్పు ఎక్కువగా ఉం దని బయటపడి పోయింది." వా.

"వాడు ఆమాట అని బయటపడి పోయినాడు." వా.

**బయట పెట్టు**

రహస్యమును బహిర్గతము చేయు.

"అట్టివి బైటఁ బెట్టఁగా, మునులకు మాకు కలదే?" నిరం. 4.34.

"స్నేహంగా ఉన్నతరవాత ఎన్నెన్నో అనుకుంటాము. అవన్నీ బయటపెట్ట వచ్చునా?" వా.

**బయటికి పొక్కు**

ఇతరులకు తెలియు.

"ఆ విషయం బయటికి పొక్క నీయకు. నీకు పుణ్య ముంటుంది." వా.

**బయల నెత్తినదివ్వె**

పరోపకారార్థ మైనది.

ఆకాశమున కెత్తినదీపము.

అనగా లోకమును ప్రకాశింప జేయునది.

"ప్రతిదేవతలు నన్ను బయల నెత్తిన దివ్వె, యఱచేతిమానిక మనుట దప్పె." ఉ. హరి. 5.92.

**బయలిదీపములు**

అశాశ్వతములు, క్షణభంగురములు – బయట దీపం పెడితే చాటు లేక గాలి కెప్పుడో గుప్పున ఆరి పోతాయి గనుక......

పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.

**బయ లీదించు**

1. నడుమంతరాన వదలి పెట్టు.

"ఉడురాజవదన నిన్నుడికించినట్టి, ఘనుఁ డల్లమవిభుండె కాని కాఁ డొరుఁడు." ప్రభులిం. 7.55.

2. వట్టియాసలు కల్పించు.

"నన్ను, నిప్పుడును బయ లీదించె దిదియకాదె." ప్రభా. 5.124.

**బయలుదామర**
మెట్టతామర.
"బయలుదామరలఁ గీడ్పఱచుపాదములు."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 805.

**బయలుదేఱు**
గృహాదులనుండి వెలువడు.
"బయలుదేఱినసుతుఁడు లోపలను రతియుఁ, గాని యన్యులు లేరైరి ఖచరపతికి." దశా. 2.51.

**బయలు ద్రొక్కు**
వెల్లడి యగు.
"ప్రబలబాహాంతర ప్రథిమఁ గాఠిన్యంబు, బయలు ద్రొక్కఁగఁ గుల పర్వతములు." కవ. 3.21.

**బయలు పందిలి వెట్టు**
అసాధ్యమునకై యుంకించు.
"బయలుపందిలి వెట్టి పరఁగఁ జిత్తము గలిగా." తాళ్ల. సం. 5.71.

**బయలుపడు**
ప్రకట మగు.
"సేసఁ, బ్రాలు చల్లిరి వేడుకల్ బయలుపడఁగ." నీలా. 3.52.

**బయలుమాటలు**
వ్యర్థాలాపములు.
"భక్తవత్సల! నిన్నుఁ బరికింపఁ దరమె, భక్తియోగము దక్క బయలుమాటలవి."
రం. రా. బాల. 17 పు. 20 పం.

**బయలు ముట్టు**
బయల్పడు.
భాస్కర. 45.

**బయలు మెఱయు**
వ్యాపించు.
"విరులు వుచ్చిన నైన వెలఁది పెన్నెఱితావిఁ, బాయని జవ్వాది బయలు మెఱయ." ఉ. హరి. 1.57.

**బయలు వన్నెనయురులు**
చుట్టూ చుట్టుకొన్న యురులు.
"చిత్తవికారములు నిగుడుచు బయలు, వన్నెనయట్టి యురులు."
తాళ్ల. సం. 6.203.

**బయలు వాకు**
వ్యర్థప్రయత్నము చేయు.
"భావించ లేరెవ్వరును బయలు వాకేరు గాని." తాళ్ల. సం. 6.200.

**బయలు వెడలించు**
నిర్గమింప జేయు.

**బయలు వోవు**
బయలుపడు.
"ఒనరంగ లోలోన నొసఁగి నిన్నొక్క, పనిఁ బంప వేఁడెద బయలు వోకుండ."
నవ. 3.142 పు. 15 పం.

**బయ లెక్కు**
ప్రకట మగు, వెల్లడి యగు.
"వెలుపల చూపులా కలిగినమీ లెల్ల, బయ లెక్కఁ గా కని బకకులంబు."
కవ. 2.78.

**బయల్పడక**
కనిపించక, చాటుగా అనుట.
"ధాత్రీవరుఁ డుండె..., నిజాకృతి బయ ల్పడకుండఁగ..." నైష. 3.93.

బయల్వాటు

పాఱిపోవు.

"పట్టు గానక బయల్వాటి రాదిత్యులు." ఉ. రా. 1.285.

బయల్వెడలు

బయలుదేరు.

"వింధ్యభూధరమును బయల్వెడలి యచట." వాల్మీ. 2.65.

బయిసి

ప్రతిష్ఠ.

నేటి వాడుకలోనూ ఉంది. 'వాడు బయిసి మాలిన వాడు–' అన్న వ్యతిరేకార్థంలోనే వాడుక.

"మాబోటి భక్తులకునికియు నులికి, నీ బయిసియ కాదె నిఖిలోపకార." బస. 5.134.

బయిసి మాలు

మర్యాద తప్పు.

"మగువలమాత్రకుం బయిసి మాలిన నేరికిఁ జెప్పికొందుము." పరమ. 4.110.

బరాబరి చేయు

1. విచ్ఛిన్నము చేయు.

"మొదలఁ గామక్రోధముల బరాబరి చేసి, సత్యవాఙ్నియమంబు సంగ్రహించి." పాండు. 2.8.

2. రాజులు మొదలయిన వారు నడచునప్పుడు కంచుకులు ముందుండి చుట్టు మూగినవారిని దారి తొలగిస్తారు. దానినే బరాబరి చేయడం అంటారు.

"మరుని ముందఱ బరాబరి సేయు కంచుకి, కలముచేతుల వెండిగుదెలనంగ." పారి. 2.39.

"శతమన్యుఁడు సందడి వో బరాబరుల్, సేయఁగ." పారి. 3.10.

"నూరెల వేత్రహస్తులు బరాబరి సేయ ......" విప్ర. 5.10.

చూ. బరాబరులు సేయు.

బరికట్టె

దరిద్రుడు.

ఆం. భా. 3.14.

బరికాడు

మావటివాడు శ. ర.

"నా,రదుఁ డార్వన్ బరికాఁడు నిర్భయతఁ జేరం జూచినం బిట్టును, న్మద కుండాలములీల." నిర్వ. 7.55.

బరికాయ

కొంకె.

ఆం. భా. 3.12.

బరిగాయపోటు

ఒక రకమైన పిల్లల ఆట.

హంస. 3.146.

బరిగాళ్లు

వట్టికాళ్లు.

"పసిఁడి సమ్మాళిగలు లేక పాద మిడఁగ, భరము పడురాజు బరిగాళ్లఁ బఱవ సాఁగె." నిరం. 4.67.

బరి గీయు

కయ్యమునకు సిద్ధపడు.

కొట్లాటలో మధ్యలో గీత

గీసి అటువా రిటు వచ్చినా. ఇటువా రటు పోయినా పోరాట మారంభించుటపై వచ్చినపలుకుబడి.

"వాడు బరి గీసి నిలబడ్డాడు." వా.

బరిగొను

చుట్టుకొను.

ఆం. భా. 3.117.

బరిగోల

ఈటెవంటి ఆయుధము.

"శాము బరిగోల." క్రీడా. పు. 22.

బరిజోగి

పాములవాడు.

"బరిజోగులు పెట్టెల నిడి, తరుణు లొలుచుకొంద్రు మణులు తల తల వారిన్." జైమి. 7.82.

బరి తప్పు

హద్దు మీఱు.

బరి అనగా గీత. కొన్ని ఆటలలో గీత గీయడం. ఆగీతను అందులోనివారు దాట గూడదన్న నియమం ఉండడం ఈ పలుకుబడికి మూలం. కొట్లాడునప్పుడు కూడా మధ్యలో గీత గీసి దాన్ని దాటి వస్తే తల పగుల గొడతాను అనడం కూడా ఉన్నది.

"బరితప్పి తప్పుచేతలఁ, బొరలక–" నిరం. 3.32.

బరి దెగు

హద్దు మీఱు.

ఆం. భా. 3.25.

"వాడు మరీ బరిదెగి వ్యవహరిస్తున్నాడు. భాగుపడే సూచన లేవీ అవుపడడం లేదు." వా.

బరిపోటు

ఒక రకమైన మల్ల బంధం.

బరి విడుచు

ఉసికొల్పు.

"భయం,కరము లగు వేటకుక్కల, బరి విడిచిన నవి వధంచె బహుమృగ తతులన్." హరిశ్చ. 2.20.

బరి వెడలు

యుద్ధానికి బయలు దేరు. తెగించి దండెత్తు.

"పడఁతులు......, విటజనంబులపై బరి వెడలునట్లు, కొలను వెడలిరి జల కేళివలనఁ దనిసి." కుమా. 9.91.

బరివోవ విడుచు

స్వేచ్ఛగా వదలు.

"బరివోవఁగ విడిచినట్టిబ్రహ్మాడు జేజే." క్రీడా. పు. 55.

బరు వనక

కష్ట మని యెంచక.

"బరు వన కింతులన్ దనకుఁ బల్వురఁ గూర్చుట భోగవాంఛ గాక." మను. 6.80.

బరువు పడు

బరు వెక్కు.

"భారంబు భరియింప బరువు పడదె పోలె." కాశీ. 1.131.

బరుసడ్డసరము

ఒక రకమైన అడ్డసరము.

బఱబఱ

ఈడ్చుటయందలి ధ్వన్యను కరణము.

"వాణ్ణి బఱబఱా యీడ్చుకొని రారా. నాలుగు దవడమీద వాయిస్తాను."

వా.

బఱిపోవు

హద్దు మీఱు.

"పఱుబోడముండరత్నము, బఱివోవఁగ విడిచినట్టిబ్రహ్మకు జేజే."

క్రీడా. 168.

బలంపీట

బల్ల.

కాశీయా. 184.

బలకొట్టు

ఆలాపనము చేయు.

శ. ర.

బలకొను

అతిశయించు.

"బలకొని మతి వానికంటెఁ బాద ద్వయమున్.

భాగ. 3.967.

బలబల వేగు

బల్లున తెల్లవాఱు.

"అంతలో, బలబల వేగ వచ్చినఁ బ్రభావతి కేళిగృహంబుఁ జేరి..."

శుక. 3.502.

బలము చేయు

అతిశయింప జేయు.

"రాగి దేరెడు చౌకారపునీలిచల్లడం, బుల డంబు చీకట్ల బలము సేయ."

సారంగ. 3.28.

బలవంతపు బ్రాహ్మణార్థం

బలవంత మాఘస్నానం వంటిది.

"బలవంతపుబ్రాహ్మణార్థవైఖరి మీకున్.

పాణి. 6.16.

బలవత్సన్న్యాసము

బలవంత మాఘస్నానం వంటిది.

"బలవత్సన్న్యాస మన్నట్లు ని,ష్ఠుర మాజవ్వనమందుఁ గాంతలకు నెట్టుల్ గూడు వైరాగ్య..." పాణి. 4.125.

బలసికొను

చుట్టుకొను.

"విక్రమాటోపంబునఁ గోట బలసికొను టయు,"

కళా. 8.73.

బలాదూరు

దిగదుడుపు, (హిం) బలాదూర్.

"తమ్మికంటి బలంబుతోఁ గంటు బలాదూ రని యెంచక." ప్రబంధ. 788.

బలిపీఠము ముట్టు

పాతాళ మంటు.

"విష్ణుపదముఁ బలిపీఠము ముట్ట నేటికిన్."

విజయ. 1.70.

బలి పెట్టు

బలి యిచ్చు.

"జమదగ్నిదురాగ్రహదుర్గకుం బలిపెట్టు విధంబున నెట్టకేలకు."

దశా. 6.85.

బలిమికాడు

బలవంతుడు.

బలిమికొను

బలాత్కరించు.

బలిమికోలు

బలాత్కారము.

"బలిమికోలున నవ్వు దళుకొత్తినను మొగం, బెల్లఁ దానైనది వెల్లఁదనము." హరి. ఉ. 7.159.

బలిమి చెడు

క్షీణించు.

"కఫ, ప్రముఖదోషయుక్తి బలిమి చెడిన." ఆము. 4.230.

బలిమి చేయు

బలాత్కరించు.

"పరకాంతలను బట్టి బలిమిఁ జేసెనా !"

వర. రా. అయో. పు. 532. పం. 6.

బలిమిజులుములు

బలాత్కారము.

"వరుకడకు బలిమిజులుములు, మెఱయఁగఁ గొని తెచ్చి..."

రాధి. 1.110.

బలిమితో పెండ్లి

బలవంత మాఘస్నానం వంటిది.

వేంకటేశ. 67.

బలిమి విందు బెట్టి పగ గొన్న చందము

మంచి చేసి ద్వేషము సంపాదించుకొనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"అద్దు ముద్దు మీఱి యాడది మగఁడంచుఁ, గూడి మాడి యాడఁ జూడఁ దలఁచి, బలిమి విందుఁ బెట్టి పగ గొన్న చందానఁ, బెండ్లి చేసి నేనె బేలనైతి." రాధి. 3 ఆ.

బలివారు

చంపు.

"మీరీ, కొండికపాపని బలివా, రుండని సెల వొసఁగఁ గింకరులు రభసమునన్" జై. భా. 8.40.

బలి వెట్టు

బలి చేయు.

"బలి వెట్టి కొలువ వారలకోరుకులొసంగు, నటు గాక నొక వెలయాలి నంపి." శుక. 2.66.

బలుపారు

అతిశయించు.

"అనిలసుతుండు పూన్కి బలుపారఁగఁ గొండొక దీర్చి"

భార. శల్య. 1.54.

బలుపు చూపు

బలియు.

"బలుపు చూపె నదేమొ యలఁతిన డుము." దశా. 7. 114.

బలు పెక్కు

అతిశయించు.

"తెలు పెక్కె దిశలు వెన్నెల, బలు పెక్కెఁ జకోరికలకుఁ బండువు లయ్యెన్." రుక్మా. 4.132.

బలువిడి గొను

అతిశయించు, అధిక మగు.

"బలువిడి గొని జాఱు బాష్పోదక ములు." కు. సం. 5.588.

బలుసాకు తిని బ్రతుకు

ఏదో ఒక విధంగా జీవించు. 'ఊపిరి ఉంటే ఉప్పమ్ముకొని తినవచ్చును' అన్నట్లే ఉన్న 'బతికి ఉంటే బలుసాకు తిని బ్రతుకవచ్చును' అన్న సామెతలోని భాగం.

"పులివాత తప్పి పోయినఁ, దలి దండ్రుల నొల్ల బంధుతతి నే నొల్లన్, హాలపాణిపుత్రి నొల్లన్, బలుసా కొకయింత మెక్కి బ్రతికెద నను చున్." శశి. (అప్ప.) 3.53.

బల్లకట్టు

వెడల్పుగా ఉండే అడుగు గల పడవ.

శ. ర. బ్రౌ.

బల్లకూర్పు

బల్లలను దగ్గఱగా చేర్చి మేకులు మొదలయిన వానిచే బిగించుట.

బల్లకోల

బల్లెము.

రూ. బల్లెకోల.

బల్లాడదట్టి

ఒక రకమైన కాసె.

శ. ర. బ్రౌ.

బల్లికట్టు

ఒక రకమైన ఆయుధము.

బల్లియు చౌక సేయు

ప్రతివాడికీ చులకన అయితి ననుపట్టున ఉపయోగించే పలుకుబడి. 'కుక్క కూడా పలకరింపదు' వర్గాలలో ఈ రీతి భావ ధోరణి కాన వస్తుంది.

"ఇల్లిల నుండ నింటం, బల్లియు నన్నుఁ జౌక సేయుపలుకులు వినరే." శుక. 2.116.

చూ. కుక్కకు కూడా అలుసయ్యాను.

బల్లెకోల

చూ. బల్లకోల.

బల్లెము దూరనిపాటి దట్టము

అతి చిక్కని దనుట.

కాశీయా. 52.

బవర మిచ్చు

యుద్ధము చేయు.

"పంత మడిగి మగుడ బవర మిచ్చుట యొప్పు." ఉ. హరి. 5.268.

బవరి చుట్టు

గుండ్రంగా తిరుగు.

"బవరి చుట్టినయట్టి భ్రమరాళికరణి" ద్వి. పరమ. 4.280.

రూ. బవిరి చుట్టు.

బవిరిగడ్డము

నరసినగడ్డము.

"బవిరిగడ్డంబు సొగసు లేర్పడఁగ దువ్వి." రాజశే. 2.113.

బవిరి చుట్టు

ప్రదక్షిణించు.

"సురగిరిచుట్టునుం బవిరి చుట్టిన వేల దినేశ !" బస. 2.139.
రూ. బవరి చుట్టు.

బవిరి తిరుగు

చుట్టు గుండ్రముగా తిరుగు.

"చెవుల తోడవులరుచులు గటముల నటనములు సూప బవిరి తిరిగి యొడియుచు." భాగ. 8.396.

బవిరి తీర్చు

వ్యాపింప జేయు.

"పైపై గుబాళించు మైపూఁత భుగ భుగల్, పల్లవాళికి బవిరి తీర్ప." ఘటికా. 2. 213.

బవిరి దిద్దు

గుండ్రముగా దిద్దు.

"ఎంత గడ్డం బైన నింతలే దొసపరి, తీరుగా బవిరి దిద్దింప వచ్చు." రా. మా. 2.110.

బసవెద్దు

గంగిరెద్దు.

స్వతంత్రుడు అన్నఅర్థంలో ఇది సాధారణంగా ప్రయుక్త మౌతుంది.

"అసమసుఖంబుగఁ గైకొను, బసవెద్దగుమగఁడు మండిపడుఁ గుసుమాంగీ!" శుక. 1.530.

బహి పెట్టు

వెలి వేయు.

"వాని దుశ్చేష్టితంబు లెఱింగి బ్రాహ్మణులు వానిని బహి పెట్టి..." శివ. 4.13.
రూ. బహివెట్టు.

బహి యొనర్చు

వెలి వేయు.

"ఆత్మజు లెఱిఁగిన నాదరింపరు మాఁచి, బంధువు లెఱిఁగిన బహి యొనర్తురు" భాగ. 10. పూ. 9.78.

బహివడు

వెలి వేయబడు.

"బహి వడ్డద్విజాన కల్పపుఁ బాచితంబిడి." అము. 6. 69.

బహి వెట్టు

వెలి వేయు.

"బహి వెట్టినతనియన్న......" భార. శాం. 1. 322.
రూ. బహిపెట్టు.

బహుచుంబకుడు

స్త్రీలోలుడు.

"మచ్చిక కలునా ? మఱి యొల్ల నీవు, పక్షపాతివి నీవు బహుచుంబకుఁడవు." ద్విప. మధు. 36.

బహిఃప్రాణము

ప్రాణతుల్యము.

ప్రాణములోననే ఉంటుంది. బయట ఉన్న ప్రాణమువంటి దనుట.

"హరి బహిఃప్రాణంబ వగుట నేఁ డెఱుఁగంగ, వచ్చె." పారి. 1.58.

బాగగు

ఒప్పు.

"వయసువాఁడును మిగుల బాగయిన వాఁడు" సారంగ. 2.9.

బాగు చేయు

చక్కబరుచు,

"ఆబియ్యాం కాస్త బాగుచేసి పెట్టు. ఇంతలో స్నానం చేసి వస్తాను." వా.

బాగుపడు

మే లొందు.

"బడుగు కిచ్చి బాగుపడును వేమ!"
వేమన. 3.136.

బాగాయె

బలే ఉంది, బాగా ఉంది.

వ్యంగ్యంగా బాగు లే దను టను సూచిస్తూ అనేమాట.

"సత్యాహిత, వ్యాహారంబులు పల్కసాఁగితివి బా గాయెం జుమీ."
నిరం. 3.44.

బాగు దెలియు

విధము తెలియు.

"మెల్లనె కళావతీసతి మేలుకాంచి, ప్రక్క వేఱొక్కమగఁ డున్న బాగుఁ దెలిసి."
శుక. 1.312.

బాగు మీఱు

అతిశయించు.

"అతిసూక్ష్మంపు వలి పెపయ్యెదల యొయ్యారంబున బాగు మీఱు చునికి."
కళా. 7.69.

"మరకతమణిసముత్కరమరీచిచ్ఛటా, పత్రసంతతిచేత బాగు మీఱ."
కళా. 2.10.

బాగులాడి

అందకత్తె.

"ఒసపరి బాగులాడి యపు డొక్కతె వచ్చి—"
సారంగ. 1.38.

బాటదార్ల పర పగు

జనసమ్మర్దము తో నిండి యుండు.

"అత్తతి బాటదార్ల పర పైనభువిం బడువారి నెంత కన్మత్తగజంబుఁ గన్నగరిమన్ ......"
శుక. 2.14.

బాటెంట

(బాట+వెంట) బాటవెంబడి. ప్రతిబాటవెంబడి.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 481.

బాడతికాడు

విటుడు.

"తగ రోవెలలు గొన బాడతికాఁడు బుజ్జగించుచు."
కు. సం. 8.136.

బాడుగోలు

వార్తాహారుడు.

మానహీనుడు అని
శ. ర.

"పెండెము బాడుగోలునకు భృత్యునకున్ మెడనూలు."
హంస. 5.136.

బాడుదల వట్టు

జీవగ్రాహముగా పట్టు.

"బాడుదలఁ నొండెఁ బట్టుము పాండు తనయ, ముఖ్యు..."
భార. కర్ణ. 2.6.
రూ. బాడుదల బట్టు.

బాడుదల బట్టు

జీవగ్రాహముగా పట్టు.

"బాడుదల బట్టుకొలమున.
కవిక. 2.118.

బాడువెట్టు

ముసుగు పెట్టు.

"ప్రసూనాస్త్ర పంచకముం దాపున బాడువెట్టినటు లెంచ న్మించు గొజ్జంగి యున్."
పార్వ. 2.114.

బాదరాయణసంబంధము

ఏదో విధంగా కలుపుకొన్న సంబంధము—అసలు సంబంధం లేక పోయినా.

'యుష్మాకం బదరీచక్ర, మస్మాకం బదరీతరుః, బాదరాయణసంబంధో, యూయం యూయం వయం వయం' అన్న సంస్కృతచాటువుపై ఏర్పడినది.

బాధల బెట్టు

కష్టపెట్టు.

"దండహస్తుండు మఱియు బాధలను బెట్టి." రుక్మాం. 5.82.

బాపనకొల

బ్రహ్మహత్య.

తాళ్ల. సం. 6.57.

బాపనగరాసు

ఒక తిట్టు.

"బ్రతికి పోతివి పోర బాపనగరాస." శుక. 2.475.

చూ. బాపనమొప్పెలు.

బాపనపోటు

అసంభవము.

బ్రాహ్మణుడు కొట్టుట, కప్పు కఱచుట కలదా!

"బాపనపోటు కప్పుకాటుం గలదే." రుక్మాం. 5.28.

బాపనపోటును కప్పకాటును గలదే

బ్రాహ్మణుడు శూరుడు కావని కప్ప కఱువ లేదని భావనతో అసంభవ మిది అను పట్ల ఉపయోగించే పలుకుబడి.

"పలుకులు వేయు నేటి కిఁక బ్రాహ్మణసూనుఁడ వీవు నీకు దోర్బలమున కేమి కారణము బాపనపోటును గప్పకాటు నుం, గలదె ధరిత్రి భట్టిమొన గట్టిగ నమ్మకు మోసపోకు నీ, కొలఁదుల రాచకార్యములు కోమటిబుద్ధులఁ దీర్పఁ దీఱు నే." విక్ర. 4.63.

బాపనమొప్పెలు

నిందార్థకం.

"తా నాడఁగా వలె నే బాపనమొప్పెలైన సరియే వా రెల్ల సాతాన్యులు నీ, వలె గోరించిరె..." శుక. 2.416.

బాపురే

భళిరే.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 246.

బారకట్టు

బారెడు పొడుగు గలకట్టు.

బారకాడి

దున్నుటకై కోడెలమీద మోపు కాడిమాను.

శ. ర. బ్రౌ.

బారపట్టె

స్తంభముమీద అడ్డంగా అమర్చిన నిడుపాటి పట్టె.

శ. ర.

బారసాఁయు

చేయి సాగునంత మేరకు నూలువడకు.

శ. ర.

బారసాల

నామకరణము, శిశువులకు చేయు ఒక సంస్కారము.

బార సాచు

చేతులు చాచు.

"బన్నసరము లలర బార సాచి కౌఁగి లించె." వీర. 1.189.

బారాది (సొమ్ములు)

"బారాదిసొమ్ము లుండఁగ, హారము నే కొనుచుఁ జనియె నందజుఁడు..." పాండు. 4.232.

చూ. వరుససొమ్ములు.

బారిగొను

హింసించు.

"చంపుదుమే కృతాంతు శిఖిచండము యూఖుల బారిగొందుమే." కాశీ. 7.34.

బారిగొఱియ

బలి యిచ్చుటకై తెచ్చిన గొఱ్ఱె.

"కటిలకపియూథములు బారిగొఱియ లగుచు." మొ. రా. యు. 1.88

బారిగొఱియ

బలిపశువు—వేట.

"క్రోధకాళికి బారిగొఱియగాఁ జేసి." గౌ. హరి. ప్రథ. పంక్తి. 292.

బారిసమరు

1. చంపు.

2. హింసించు.

"ఉపదర్పి మెడ సుల్చి యూపంబుతోఁ గట్టి, పరిచారకులఁ బట్టి బారి సమరి." కుమా. 2.66.

"సీరమునఁ బట్టి తిగుచుచు, దారుణ ముసలమునఁ బట్టి గదాయష్టిని దుర్వా రత బారిసమరు బలుఁ, బారిగడవ లేక మడిసెఁ బ్రతిభటబలముల్." హరి. ఉత్త. 8.4.

బారు చేయు

తుపాకిలో మందు వేసి కూరు.

"తుపాకులు బారు చేసి ఆ సైన్యం యుద్ధమునకు సిద్ధపడి ఉండగా శత్రు సైన్యంలో అలజడి చెలరేగింది." వా.

బారు దీరు

వరుసగా ఏర్పడు.

"పవననిశ్వాసవీచికల్ బారుదీరె." వేం. పంచ. 4.308.

బారుబూరలంకారములు

వేషాడంబరములు.

"బారుబూ రలంకారము లెట్టివో." గుంటూ. ఉత్త. 28.

బారులు గట్టు

వరుసలు తీరు.

"నెహ్రూ వచ్చాడంటే జనం వీధు లంతా బారులు గట్టి నిలబడ్డారు." వా.

బారులు తీర్చు

వరుసలు కట్టు.

దశా. 1.205.

బారువెట్టు

యుద్ధమునకు సిద్ధపరుచు.

"అని నన్నుఁ బనుప వచ్చితి, మను జేశ్వర! బారువెట్టుమా రాజుల ని,వ్వని తూర్పు బెసకు మాదొర, చనుదెంచున్." కువల. 2.104.

బారెంట (బార+వెంట)

ప్రతి బారకూ.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 480.

బారెడు హెచ్చు తగ్గు

ఉజ్జాయింపుగా.

సరిగా కా దనుట.

లక్ష. 3.32.

బాలకుల మాటలు

అశాశ్వతములు, క్షణచపలములు.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.

చూ. జలబుద్బుదములు.

బాలెంతలంజవలె

విరుద్ధము లయినపనులు ఒకే తడవ నిర్వర్తించు పట్ల ఉపయోగించే ఉపమానము. బాలెంతగా నున్నప్పుడు లంజరికము చేయుట తగదు అనుటపై యేర్పడిన పలుకుబడి.

"బాలెంతలంజగతి మా, యూళిగమును శంభుభక్తి యుక్తియు నడుపం, బోలదు మాకొలఁ వింతటఁ, జాలించితి వేసిఁ జయము స్వచ్ఛందుఁడ వై." బసవ. 6.252.

బాళిగొను

ప్రేమించు.

"ఏలలు పాడుచు రంభ నధ్వగుల్, బాళిగొనంగ శాలి వనపాలిక హాలిక బాలికామణుల్." దశా. 1.116.

బాళిగొలుపు

వెత గొలుపు.

"కుడిచి కూర్చుండినను బాళి గొలుప నేల." విప్ర. 4.77.

బాళితాకు

సొమ్మసిలు, మూర్ఛ చెందు.

సాం. ని.

బాళివట్టు

ప్రీతిక గొను.

"మది నాఁటియున్నమదన, ప్రదరంబును బెఱుక బాళివట్టినభంగిన్." కళ. 4.21.

బావి యున్నది, నే నున్నాను

నాకు శరణ మిక ఆత్మహత్య చేసుకొనుట తప్ప మరొకటి లేదు అన్న అర్థంలో ఈ పలుకుబడిని నేటికీ రాయల సీమలో వ్యవహరిస్తారు; 'బావి ఉంది నే నున్నాను.' ఇదే 'చెఱువు వుంది నే నున్నాను, గుంట ఉంది నే నున్నాను' ఇలా ఈ పలుకుబడి మారుతూ ఉంటుంది.

"కానీ బహుంతరతోయా, నూనం బై నట్టి బావి యున్నది నే ను,న్నా నంచు మిగులఁ జప్పుడు..."
శుక. 2.134.

"నాదుమే నున్నది చెంత గంగమడు గున్నది యైనటు లయ్యెడుం దుదిన్."
ఉత్త. రామా.

బావుకొను

అనుభవించు.

"న న్నిలా ఇబ్బంది పెట్టి ను వ్వేమి బావుకొంటావు ?" వా.

బావురుగడ్డము

పిల్లిగడ్డము.

బావురుగాడు

బావురుబిల్లి.

బావురుబిల్లి

గండుపిల్లి.

"పేర్మితో బావురుబిల్లుల..."
రాజశే. 2.36.

బావురు మను

వెలితిగా ఉండు, బోసి పోయిన ట్లుండు.
క్రొత్త. 228.

బావుఱు మను

శూన్యముగా నుండు.

"ఆ పెద్ద దిక్కు కాస్తా హరీ అనే సరికి యిల్లంతా బావురు మంటూ ఉంది." వా.
రూ. బావురు మను.

బాసపోసనములు

మాటల ప్రోవులు, శుష్క ప్రియభాషలు.

"బాసపోసనములు విడంబములు భ్రమలు." పాండు. 3.43.

మాటలతోనే మర్యాద ముగించుట, భాషణతోనే (పోషణము) తృప్తిపఱచుట.
పాండు. 3.43.

బాస లట బండికం డ్లట

నెఱవేర్చ లేని ప్రమాణాలు అన్న అర్థంలో నిరసనద్యోతకంగా ఉపయోగించేజంట పదం.

"...తనదు సెట్టితొత్తుల కేమో, బాస లఁట బండికం డ్లఁట, చేస న్నఁట విన్న వారు చెప్పిరి నాతోన్."
శుక. 2.113.

బాసలు బండికండ్లు

ప్రమాణములు, జం. రెండవమాట వట్టి ఊత పదంగా వచ్చుట మనకు అలవాటే.

"బాసలు బండికండ్లు మఱి ప్రాణ భయంబున లత్తు సేసినన్."
ఆము. 6.51.

బాస సేయు

ప్రమాణము సేయు.

"కా, దన్నను నీదుమోవి యధరామృత మా నిట బాస సేసెదన్."
విజ 1.97.

బాసాడు

సంభాషించు.

"ఎల్ల నృపులు గొలువ నెఱుఁగవే

బాసాడి, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స." ఆము. 1.15.

బాసికదండ

తలముందుతట్టు ఉంచిన పుష్పహారము.

శ. ర.

బాసికపట్టు

పద్మాసనము.

శ. ర.

బాసికబొమ్మ గట్టు

ఓడించు.

ఓడించుటకు సూచనగా బాసికబొమ్మ కట్టడం అలవాటు.

"మాడిపోయినం, బంతముతో దొహార మునఁ బట్టుదు బాసికబొమ్మ గట్టుదున్." ఉ. హరి. 3.117.

బాహిరపోవు

వెల్లడి యగు.

"కావున వంచన బాహిర, పోవక యుండఁగ." భార. విరా. 2.287.

బాహ్యామదాలు

ఏడు బాహ్యామదాలు.

"సంజాతతిలకాది సప్తవిధ బాహ్య మదంబులు." కుమా. 11.137.

బాహ్యారతి

చుంబనాదులతో నెఱపు సంభోగము – రతికి పూర్వాం చేసే చేతలు.

కుమా. 9.152.

బింక మెక్కు

నిక్కు.

"అల్లన యోలిఁ వెడలంగ రేకలు సముల్లాసంబునఁ బింక మెక్క..." భార. ఉద్యో. 2.110.

బింగీలు పెట్టించు

గుంజిళ్లు తీయించు.

పిల్లలను శిక్షించుటలో కుడి చెవిని ఎడమచేతితోనూ, ఎడమచెవిని కుడిచేతితోనూ పట్టుకొని చాలసార్లు లేచి కూర్చుండునట్లు చేయుట– ఇదే గుంజిళ్లు పెట్టించుట– బింగీలు పెట్టించుట.

"నన్ను బింగీలు పెట్టించునాఁడె యయ్యా, వారు నిద్రింపఁగాఁ జూచి." హంస. 3.144.

బింద మగు

భిన్న మగు, భిన్నం ఏర్పడు.

"కాల్ దెమలినంతనఁ గౌనుకు బింద మయ్యెడున్." కుమా. 8.16.

బికిరాలమారి

బిచ్చు మెత్తేస్వభావం కలవాడు.

ఆం. భా. 2.176.

బిక్క చచ్చి

ఏమీ చేయ లేక నిస్పృహతో– నిరాశతో.

"వాడు బిక్క చచ్చి కూర్చున్నాడు. వాడితో ఏమిటి పాపం!" వా.

బిక్క మొగం వేయు

తెల్లమొగము వేయు.

"వాడు నా వెనుక ఏమేమో అన్నాడని తెలిసి మొఖాన అడిగేసరికి బిక్క మొహం వేశాడు." వా.

రూ. బిక్క మొగము వేయు.

బిక్కుబిక్కు మంటూ

భయపడుతూ ఒంటరిగా.

"వీడు క్లబ్బుకు పోయి ఏ పదిగంటలకో పదకొండుగంటలకో వస్తే అంతదాకా ఆపిల్ల పాపం బిక్కుబిక్కు మంటూ ఆ లంకంత కొంపలో పడి ఉండాలంటే ఏం మాటలా ?" వా.

బిక్కుమొగము వేయు

నిరుత్తరుడగు.

"నిలవ దీసి అడిగేసరికి వాడు బిక్కు మొగం వేశాడు." వా.

రూ. బిక్క మొగం వేయు.

బిగబట్టు

చలింపకుండ జేయు.

"చలన మొందక నిజస్వాంతంబు బిగఁబట్టి, పంచేంద్రియము లడఁగించి నాఁడు." కుచేల. 1.27.

బిగాది

మోసగాడు.

వేం. పంచ. 1.763.

బిగిపట్టు

గట్టిపట్టు.

"వగవగ బిగిపట్టు పట్టఁ బోకు." రాధి. 1.113.

బిగిబద్ద

రెండు గాడికమ్ములకు నడుమ వేసే బిగువుబద్ద.

శ. ర.

బిగి యార

గాఢముగా.

నోరార వంటిది.

"పరస్పరబాహుపాశంబుల బిగియారం గౌఁగిలించుకొని." పారి. 2.53.

బిగి యెక్కు

దృఢ మగు.

"నిట్టలు ద్రోచుచు నెరవులకల మేర, లెల్లను బిగి యెక్కి యేర్పడంగ." భార. విరా. 1.245.

బిగుమానము

బెట్టుసరి.

బిగిమానము అని

బ్రౌన్.

"జగన్మండలి నెవ్వఁ డంచు బిగుమానముతోఁ బురి కేఁగె నంతటన్." దశా. 7.152.

బిగువారు

దృఢ మగు.

"దీని బిగువారెడు కౌఁగిటఁ జేరఁ గల్గినన్." శుక. 3.534.

బిగువాలు

కట్టెలమోపును కట్టేత్రాడు.

బిగువు దన్ను

బిగియు.

"వలిపెపావడ గ్రుచ్చి వెలయించు నొడ్డాణ, మెగయుబచ్చెళ్లపై బిగువుఁ దన్ను." గంధ. 147.

బిగుపు కొను

బిగు వగు.

శ. ర.

బిగ్గబట్టు

గట్టిగా పట్టు.

"ప్రియుండు పా, దమ్ముల బిగ్గఁబట్టి."
రాజశే. 3.

బిచ్చపుబుద్ధి

నీచబుద్ధి.

భద్రగిరి. 54.

బిజమాడు

వచ్చు.

"బిజమాడు దేవరు నిజకృపాదృష్టిఁ
జెన్నారు నాయిల్లు బిడారు మీకు."
కాళ. 1.35.

బిట్టక బిఱ్ఱుగా

ఆకస్మికముగా.

"కటకటా ! శాపించెఁ గాక యత్తపసి,
కాదె బిట్టకబిఱ్ఱుగాఁ బసుల్ సచ్చు."
బస. 6.250 పం.

బిట్టబిర్రు

తటాలున.

"పిడుగు మొత్తినగతిఁ గూలు బిట్ట
బిర్రు." కవిజ. సంజ్ఞా. 35.

బిట్టబిరుగుడు

తల బిరుసుతనము.

"శశి బిట్టబిరుగుడు చంపి వైతు."
కవిక. 3.110.

బిట్టుబిళ్లు

ఆకస్మికముగా.

"ఆ, తని రేఁ తెంచుట బిట్టుబిళ్లు గని
కాంతల్ విస్మయాక్రాంత లై."
భోజ. 5.77.

బిడాబడి

సత్వరముగా.

ప్రబంధ. 788.

బిడ్డతల్లి

బాలెంతరాలు.

బిడ్డకుట్లు

బిడ్డనొప్పులు.

"చెలువకు బిడ్డకుట్లు విలసిల్లఁగ భిల్ల
పురంధ్రు లంతలోన్."
కా. మా. 3.26.

బిడ్డ గలవారు

సంతానవతులు – కావున
మోసము చేయ రనుట.

"వంచన లేదు బిడ్డ గలవారు..."
కుమా. 8.137.

"అయ్యా నేను బిడ్డలు గలవాణ్ణి. ఒక
రికి కీడు చేయను." వా.

బిడ్డను గిల్లి తొట్లను ఊచు

వాడే బాధను కలిగించి వట్టి
ఓదార్పులు ఓదార్చు.

"వాణ్ణి సర్వనాశనం చేసింది వీడు.
పైగా యిప్పుడు ఏదో సానుభూతి
చెప్పడానికి వచ్చాడు. ఇదంతా బిడ్డను
గిల్లి తొట్లను ఊచేరకం." వా.

బిడ్డ పాపలు

సంతానము.

"బిడ్డపాపలఁ గని పెంచుజడ్డు లేక."
హంస. 1.214.

బిడ్డ పాప సందడి

ఇంటిలో పిల్లలు నిండుగా ఉండుట.

"ఆ హస్తిని యౌవన ము,త్సాహము నఁ బిడ్డపాపసందడి లేమిన్."

హంస. 4.78.

బిడ్డ పేరు బెట్టు

సంతానముగా భావించు. తనకు ప్రత్యామ్నాయముగా చూచు అనుట.

'కాలాభ్రగణగర్భగోళనిర్యద్భ్రమ, భిదుర నాదము బిడ్డపేరు పెట్టె."

రామాభ్యు. 7.272.

బిడ్డా? పాపా?

"బిడ్డయొ పాపయో చిదిమి పెట్టిన కైవడి నున్ననిన్నుఁ దా, సడ్డ యొన ర్పక."

శుక. 1.527.

బిత్తరపు పనులు

మన్మథక్రీడలు.

"వెన్నెల పులుగుల మొత్తంబుల బిత్త రంపుంబనులకు మెత్తఁబడి."

నీల. 3.10.

బిత్తరపుపాటు

సరసత.

"నుడువులో నారజంపు, బిత్తరపుపాటు బొమ్మలో బిగువు నెగడ, నేగుఁ నాకారివెంట నయ్యెమ్మెకాఁడు."

కువల. 5.5.

బిత్తరపోవు

భయపడు. చలించు అని

శ. ర.

బిత్తరము లాడు

వ్యాపించు.

"శరదభ్రశుభ్రనిశ్చలదేహవిస్ఫుర, ద్ధాళ ధళ్యములు బిత్తరము లాడ."

వి. పు. 3.10

బిత్త లగు

దిగంబర మగు.

"పొలఁతు లనెడుమహాభూతాలు సోఁకిన, తలమొలలు విడి బిత్తలై యున్నాడు.

తాళ్ల. సం. 9.67.

బిద్దెమువాడు

ఆటవలన జీవించు ఒక జాతి వాడు.

"బోగమువాడును దేవనాటకపు జంగా లును జంగాలు బిద్దెమువాండ్రు తెల్ల కోకబత్తులు సివసత్తులు పల్నాటి వీరులు."

హంస. 3.28.

బిబ్బిలికాయ

ఒక రకమైన నగ. దీనిని ఆడవాళ్లు కాలి మూడవ వ్రేలికి పెట్టు కొంటారు.

"తళుకుఁ బిల్లాండ్లు బిబ్బిలికాయలును మట్టి, యలు వీరముద్దెలు నందియలును."

కళా. 7.66.

బిమ్మటి గొను

పరవశత్వము నందు.

"విపులశోకజలధి మునిఁగి, పేర్చుతల్ల డమునఁ బిమ్మిటి గొనియెదుం, జిత్త మింక నేమి సేయువాఁడ."
భార. ద్రో. 2.147.

బిమ్మిటి వోవు

మూర్ఛిల్లు.

"అంగదు నాప్రజంఘుఁడుం, ఓడికిట బిట్టుగాఁ బొడవ బిమ్మిటి వోవుచుఁ దేరి." భా. రా. యు. 1192.

బియ్యం నిండుకున్నవి

బియ్యము లేవు.

"ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. రాత్రికి మీరు తెస్తే కాని పొయ్యిలో పిల్లి లేవదు." వా.

బిరుదందె

గండపెండేరము.

"నిగళము నా సురాసురవినిర్మిత మా బిరుదంచె ఘల్లనం." భీమ. 5.100.

బిరుదుగద్యలు

ఒక రకమైన బంగారు నాణెము.

"కొమ్మమ దనకు ధర్మువుగా నఖండ దీపమునకుం బెట్టినబిరుదుగద్యలు..."
ద. శా. 4.943.
చూ. బిరుదురూకలు.

బిరుదు చదురు

అతినేర్పరి.

చతుర - చదుర అయి ఉంటుంది. బిరుదు - పేరెక్కిన.

"పేరఁ గలభాషిణివి గద బిరుదు చదుర, వగుదు బళిబళి యిపుడు నీ కది ముఖస్థ, మగుచు." కళా. 1.184.
మా. బిరుదుమగడు.

బిరుదులసము

సామర్థ్యము.

"పెనఁగుతూకలముల బిరుదులసంబులఁ, జలము డింపక తీర్పఁ జాలుటయును."
భార. విరా. 1.95.

బిరుదులాడు

పరాక్రమశాలి.

"గర్వితనమున జగదీశుఁ గాలకంఠుఁ, బిలువఁ బంపక మానె నబ్బిరుదు లాఁడు." భీమ. 2.7.

బిరుదుశూరుడు

పేరు పడ్డ శూరుడు.

"బిరుదు శూరుఁడఁ గాని పిన్నను గాను." పల. పు. 61.

బిరు దెక్కు

మదించు.

"తిరిగి వెంట్రుక వడిఁ దెగి పొలుఁ బొడిచి, బిరు దెక్కి గమిఁ బాయుపెద్ద పందులును." నవ. 1.35 పొ. 4. పం.

బిరుసు క్రోవి ముట్టించిన తెఱంగు

ఒక రకమైన బాణసంచా ముట్టించినట్లు—

అది ముట్టించగానే అతి వేగంగా ఆకాశాన్ని దూసుకొని పోతుంది. అందుపై వచ్చినపలుకుబడి.

"అతని వింట వెడలునమ్ముల వేగవే,
చిత్రి యేమి చెప్పఁ జేవలసిన, ముదవు
బిరుసుఁ గ్రోవి ముట్టించిన తెఱంగుఁ,
జెఱువుకట్ట తెగినబిరుదుఁ దోఁచె."

కళా. 8.127.

**బిఱు సగు**

కాఠిన్యముతో ప్రవర్తించు.

"అత్తయు మామయు మగఁడును,
గతులబోను లయి బిఱుసు గావలె నెపు
డున్." జైమి. 3.33.

**బిఱ్ఱని కాయు**

తీవ్రముగా విజృంభించి కాయు.

ఎండకూ వెన్నెలకూ మాత్రమే దీనిని ఉపయోగిస్తారు.

"వెన్నెల బిఱ్ఱని కాసినంతలో."

పాండు. 5.212.

**బిఱ్ఱ బిగియు**

1. బిగుసుకొని యుండు. గర్వముతో ననుట.

"పేద లయ్యును గడు బిఱ్ఱబిగిసి యుండ్రు, వట్టి యభిమానములును గర్వములుఁ బట్టి, యల్లువారికి నెల్ల నీ యవగుణంబు, వెన్నతోఁ బెట్టినది యింత విసువ నేల." తెలుగుజాతీయములు.

2. నీలుగుకొని పోవు.

"వాడికి ధనుర్వాతం వచ్చి కాళ్లూ చేతులూ బిఱ్ఱబిగుసుకొని పోయాయి."

వా.

**బిఱ్ఱ బిగిసి కూర్చుండు**

నిటారుగా కూర్చుండు.

"గడ్డపాఱయు మ్రింగినగతిని బిఱ్ఱ, బిగిసి కూర్చుండుటలు లేక పెట్టి మనము, గలదె."

కళా. 7.29.

**బిఱ్ఱ బిగిసి యుండు**

గర్వముతో నీలుగుచుండు.

"పేద యయ్యును గడు బిఱ్ఱ బిగిసి యుండు." కాశి. 7.50.

"వాడు మహా బిఱ్ఱ బిగుసుకొని కూర్చున్నాడు. మాస్తే ఆ పూటకు గతి లేదు." వా.

**బిలిబిలి కాయకంబులు**

చిల్లరపనులు-నాలిపనులు.

"బిలిబిలి కాయకంబులు సేసి పడసి, యిల బాఁతినర్థంబు నిసుమంత గలదు."

బస. 5.131.

**బిలిబిలి కృతులు**

ఎక్కువగా ఛౌకబారుగా వెలువడు కావ్యాదులు.

బిల బిలా వచ్చినారు అని వాడుక.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 20.

**బిల్ల కట్టు**

నెత్తురు గడ్డ కట్టు.

**బిల్లకట్టులు**

తమలపాకు సుడెలకు క్రిందను మీదను సంతన చేసి కట్టు కట్టులు.

శ. ర.

**బిల్లగోడు**
ఒక రకమైన పిల్లల ఆట.
"తూరనతుంకాలు గీరనగింజలు, పిల్లదీ వాలంకి బిల్లగోడు."
కాళ. 3.33.

**బిల్లగోల**
పిల్లల ఆటలోని ఒక సాధనము.
"తరుణుండు వైచుమవ్వపుబిల్లగోల నాఁ, దరఁగ తూరుపుగట్టు దాఁక నిగుడ."
శుక. 3. 323.

**బిల్లగోట్లు**
ఆట.
తాళ్ల. సం. 10.172.

**బిల్లనేత**
బట్టలనేతలో ఒక భేదము.
"నిద్దంపుఁ బసిమిహురుమంజి బిల్లనేఁత పట్టు జూపట్టుపచ్చడంబును."
ప్రబంధ. 605.

**బిల్లబిద్యము**
ఒక రకమైన పిల్లల ఆట.
"చిక్కణబిల్లయు జెల్లెడము గోడుగు, బిల్లబిద్యము లక్కిబిక్కిదండ."
హంస. 3.146.

**బిల్లబీటుగ బడు**
కూలబడు.
"కిట, బి ట్టైగసి బిల్లబీటుగఁ బడియెన్."
సారం. 1.96.

**బిల్లమెట్లు**
ఒక రకమైన చెప్పులు.
"అంఘ్రియుగమున బిల్లమెట్లమరఁ దొడిగి."
ఇందు 5.8.

**బిల్లసువు**
పదిమంది బిడ్డలను కన్నతల్లి.

**బిళ్ళ చెప్పులు**
తోలుబిళ్ళల కుచ్చులమర్చిన చెప్పులు.
"బిగు వొప్పఁ దొడిగినబిళ్ల చెప్పులు."
రా. వి. 2.44.

**బిళ్ల బొట్టు**
గుండ్రముగా నుదుటిపై పెట్టు తిలకము, చుక్కబొట్టు.
"నుదుటఁ జెందిరముఁ జెన్నుగ దిద్దనొకవేళ, జెడఁగుకస్తురిఁ బెట్టు బిళ్ళబొట్టు."
ఉత్త. హరి. 4.16.
"భూతిపైఁ బెట్టిన కస్తూరి బిళ్లబొట్టు."
కా. మా. 1.30.

**బిళ్ళమీటుగా చిమ్ము**
బిళ్ళను ఎగుర వేసినట్లుగా ఎగుర వేయు.
ఆటలలో బిళ్ల మీటుట ద్వారా వచ్చినపలుకుబడి.
"వెలికిలఁ ద్రెళ్ళ బిళ్లమీఁటుగాఁ జిమ్ముచుఁ జిమ్మిన."
కళా. 3.278.

**బిస ఎక్కించు**
పురి యెక్కించు.
"వాడికి నామీద బిస యెక్కించి పంపించాడు. కానీ నేనే వాడే మనుకొంటే ఏమని కొట్లాటకు దిగ లేదు."
వా.

బిస దప్పు

బిగి గోలుపోవు.

"కరి...వింటి పట్టున కు బిస దప్పి రివ్వున పిఱిదికి నెగిరి."

వర. రా. యు. పు. 405. పంక్తి. 22.

బిసబిస వాలు

కదలు.

"బిస బిస వాలు కీలుజడ."

సారం. 1.38.

బిసినీరు

వేడినీళ్లు.

"ఎళనీరు బిసినీరు లెందు హేరాళంబు, నీరుచల్లయుఁ జెళ్లపార మిచట."

ప్రబంధ. 57.

బిసిబిసి మాటలు

జిలిబిలి పలుకులు, ప్రియ భాషణములు.

"మఱియు నెన్నియొ బిసిబిసి మాట లమరఁ, బ్రియము చెప్పియు నదరి వెచియు హితాను,వృత్తిఁ దెలిపియు నొకకొంత మెత్తఁబడఁగఁ, జేసి కే ల్వట్టి తిగిచె నా చెలువఁ గదల."

ప్రభా. 5.27.

బిసి వోవు

పట్టు వదలు.

శ. ర.

బిస్సట్లు పెట్టు

బిస్సు మని ధ్వని కలుగునట్లు విసరు.

"శైలంబు లల్లాడ సప్తమారుతములు, బెట్టుగా బిస్సట్లు వెట్టునాఁడు."

హ. వరాహ. 1.3. పా.

బిస్సాటి

బిచ్చగాడు.

"ఫీటి పెద్దతలారి బిస్సాటి కలికి."

కాశీ. 2.38.

బీగముచేయి

తాళపుచెవి.

"బీగంబుచేయిచే బీగముల్ దెఱచి."

ద్వి. పరమ. 4.319. పా.

బీగముచేయి రొండి జెక్కికొను

ఇంటిలో ధనాధిపత్యము వహించు.

దారమున కెక్కించిన తాళముచెవులను మామూలుగా స్త్రీలు రొండిని చెక్కుకొనుట అలవాటు. ఇంటి యాజమాన్యమునకు అది చిహ్నము. 'బీగాలు కోడలి చేతికే యిచ్చేశాను' అని అత్త అనడం మామూలు. దీనికే రూపాంతరం.

"మొలఁ జెక్కికొను తలుపు, చిలుకు ముద్రించి బీగముచేయి రొండిఁ జెక్కికొనుఁ గ్రొత్తవలపునఁ జిమ్మి రేఁగి."

శుక. 3.345.

బీగముద్ర

కప్పతాళము.

"పరఁగెడురస్తుకొట్టడులు భద్రముగా నొగి బీగముద్రలుఞ్, గరిమ నొనర్చి."

హంస. 1.119.

**బీగముద్రలు అయినపిదప**

బీగాలు వేసినపిదప అనుట.

"బీగముద్రలు నైనపిదపను నిదురించు, ననిరుద్ధుఁ గాన మంచ చలివ లనిరి."
ఉషా. 3.123.

**బీగము లేనిపెట్టె**

రక్షకము లేనిది.

ఇచ్చ వచ్చినట్లు అనుభవింప వీ లయినది.

"బోగపుం గొలమాట్లనే...బీగం బూడ్చినపెట్టె యై యిటు చెడెఁ."
పాళి. 4.24.

**బీజాంకురన్యాయము**

ఒకానొకన్యాయము.

**బీజాక్షరాలు**

మంత్రాదులలో హ్రాం హ్రీం లాంటి బీజాక్షరాలు కొన్ని ఉంటాయి. అవి అనంత మైన శక్తి కలిగి ఉంటా యని మంత్రశాస్త్రజ్ఞుల విశ్వాసం. కాళిదాసు నాలికమీద కాళికాదేవి బీజాక్షరాలు వ్రాసిం దట. వెంటనే శ్యామలాదండకం చెప్పాడు.

**బీజావాపనము చేయు**

విత్తనాలు చల్లు, ఆరంభము.

"ఈ ఊళ్లో నాటకసంఘానికి బీజావాపనం వేసింది ఆయనే అని చాలా మందికి తెలియదు."
వా.

**బీజుగొట్టు**

పేచీకోరు.

"తెవులుగొట్టో వయసు దీరినమేనివో, యోజ మాలినదియో బీజుగొట్టో."
చెన్న. 4.39.

**బీటగిల బాఱు**

పగులు.

"ఇంకి బీటగిలఁ బాఱనియే అన..."
క. సం. 6.794

**బీటగిలు**

బీట తీయు, పగులు.

"పంకరుహాఖ్యవాండంబు బీటగిల్ల నిశాటపుటశ్చేదనంబు లాక్రమియేటున."
భీమ. 3.211.

**బీట తీయు**

పగులు.

"ఈ యెండలకు నేల బీట తీసింది."
వా.

**బీట లగు**

పగులు.

"గండుతుమ్మెదల రొదలు చెవుల నాఁట బీట లగుడెందంబులతోడ."
నీలా. 3.10.

**బీటలు వాఱు**

పగుళ్లు వాఱు.

"వెకలి గుజాండకర్పరము బీటలు వాఱఁగ మేను వెంచి."
పారి. 3.31.

**బీటలు వోవు**

పగులు.

"భేరీధ్వనుల నింగి బీఁటలు వోకుండ."

భార. భీష్మ. 1.119.

బీట లెగయు

పగులు.

"అధరంబు బీట లెగయ వేఁడి నిట్టూర్పుగాడ్పులు నిగిడించెదవు."

నైష. 4.91.

బీటవాఱు

1. చిట్లు.

"నెఱుల్ తుద బీఁటవాఱి."

విప్ర 5.25.

2. పగులు.

"వెడ బీటవాఱి నెవ్వడవడు మోవితో."

కుమా. 5.70.

బీటాడు

బీటలు వాఱు.

"దిగంతములు బీటాడెఁ."

ఏలా. మా. 1.65.

బీటిక లెగయు

పగులు.

"నవనీట గుప్పళించెను గళావతి యోర్తు, జిగిమోవి బీటిక లెగయు కుండ."

భాను. 2.74.

బీడుకాపు

బీడులో ఉండు సేద్యగాడు.

"నగరికి పాలున్నా, బీడుకాఁపునకు నాలుగుపాళ్లున్నా."

ద. శా. 4.810.

బీడు చేయు

పాడు చేయు.

"వారిధి తనదు చిచ్చుఱకోలలచే బీడు చేసి."

వర. రా. సుం. పు. 87. పం. 12.

బీడువాఱు

నిస్సార మగు, ఎండి పోవు.

గౌర. హరి. ద్వి. 1972.

బీతు కుడుచు

భయపడు.

"వికృతము లైనమర్కటుల వేషము లక్కడ నీవు చూచి బీ,తు కుడిచి వచ్చి నోరుకొలఁదుల్ పచరించెదు."

భా. రా. యు. 323.

బీతు గొను

భయపడు.

బీతు గొల్పు

భయపెట్టు.

"వింతజనముల బీతు గొల్పుకక్కస మగురక్కసుల్."

కవిరా. 2.82.

బీదకన్ను పడు

కనులు తేలవేయు, నీరస పడు.

పాండు. 5.14.

బీద గరచినబూరె

పేదకు దొరకిన పెన్నిధి వంటిది.

తాళ్ల. సం. 11. 3. భా. 24.

బీద బలిసి బందికాడగు

దుర్బలుడు బలవంతు డై బందిపోటుదొంగ యైనట్లు. మెత్తనివాడు గడుసువా డైనట్లు.

"పేర్చి దివసక్రమంబున బీద బలిసి, బందికాఁ డైనఁ బోరువులు బ్రమసి గనునె?" మను. 3.121.

బీద బొంగరములు

చిన్న బొంగరములు.

పల. పు. 40.

బీదవాక్యములు

దీనవాక్యములు.

"బీదవాక్యమ్ములు పెదవులపైకిఁ, దే రాదు." పల. పు. 40.

బీదసాదలు

జంటపదం.

"పాలుల బీదసాదులను బందుగులం దనియించె నెంతయున్." అచ్చరా. బాల.

బీరకాయ చిక్కు

అతి చిక్కైనది.

"పెట్టినదైవ మెఱుఁగు బీరకాయలోని చిక్కు, దిట్టమూల ప్రాణుల మై తిరుగుత గాక." తాళ్ల. సం. 9.24.

బీరగాడు

పరాక్రమశాలి.

"తగరము వాఁడి చేసి వెడతాపసి నాకడు బీరగాఁడు గాఁ, బొగడెదు." సు. సం. 2.864.

బీరాజు

తుడిచి కుప్ప చేయు.

(శ. ర. చి. ని.)

బీరు పోకుండు

భయపడకుండు, భీరుత్వము పొందకుండు.

"తూలం బాఱియు బీరు వోక." కా. మా. 2.61.

2. (మాట) బీరుపోవు — వ్యర్థమగు.

"నా మాట బీరుపోయింది." వా.

బీరు పోవు

వ్యర్థమగు

"భానుబింబము గని భీతి బీరుపోవు." కవిక. 4.71.

బీరెండ

బిట్టెండ

"చూపు, బీరెండ లై కాని సిరసింప." కవిక. 4.13.

బీఱజడలు

పెద్దజడల మొత్తము.

"పేలికలుఁ గశాసములును బీఱజడలు దాఁ దాలుచు నెట్లొకో." కళా. 3.72.

బీఱనరము

పెద్దనరము.

"ఊసర వెల్లి చందమున నొక్కట బీఱనరాలు దేరఁగా." మను. 4.78.

బీఱపువ్వుల బోని టంకములు

బంగారుమాడలు, పసుపు రంగువి.

బంగారుమాడలను బీరపువ్వులతో పోల్చడం మన సాహిత్యంలో కాన వస్తుంది.

"వాని కని బీఱపువ్వులఁ బోనిటంక, సాలవాటులు నించి..." ఆము. 2,85.

బీఱువడు

1. గింగురు మను.

"ఈ రీతిఁ బులుఁగు పిలువని, పేరఁట మే తెంచి చెవులు బీఱు వడఁగ వే,సారక చెప్పఁగ."

వేం. పంచ. 1.692.

2. వ్యర్థ మగు.

"తలఁపులు సిక్కి బీఱువడి తాల్ములు పెల్లగిలంగ."

హరి. ఉ. 3.8.

బీఱువాఱు

చిక్కుపడు.

"బా గైనపాపటపై బీఱు వాఱె."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 1602.

బీఱువోవు

సత్వహీన మగు.

"బీఱువోయి రథ్యంబులు మాఱు మొగము వడిన."

భార. భీష్మ. 3.257

బీటెండ

తీక్ష్ణ మైన యెండ.

"బీటెండ రేయెండ పెండ్లి యాడ."

పాండు. 2.152.

బుంగనామము

నడుమ ఎడము లేక తీర్చిన తిరుమణి.

శ. ర.

బుక్కావాడు

గందవొడి మొద లైనవి అమ్మువాడు.

శ. ర.

బుగులుకొను

అధిక మగు.

"వలపు బుగులుకొనంగ."

పాండు. 4.64.

బుగులు పుచ్చు

బయలుపఱుచు.

"ఒజ్జలు గాసిఁ బఱిచి రటంచు, బుగులు పుత్తురో మీరు పురిలోన ననుచు." నవ. 3.151 పా. 1 పం.

బుగులు పోవు

బయలుపడు.

బుగ్గలు నులుము

బుగ్గలు పిండు.

బుగ్గలను బాధ కలుగునట్లు నలుపు.

ముఖ్యంగా చిన్నపిల్లలనూ, విద్యార్థులనూ శిక్షించుటలో చేయుపని.

"అలుకచే నుండ బుగ్గలు నులిమి తిట్టి." హంస. 3.141.

"నిజశిక్షలో బుద్ధి నిలక విస్వరములు, పలికిన బుగ్గలు నులిమి నులిమి."

కళా. 4.42.

బుగ్గి గలుపు

వ్యర్థము చేయు.

"కైదువుల్ విండ్లును గత్తళంబులుఁ దీర్చి, బూరలుఁ దుదుములు బుగ్గిఁ గలిపి." అచ్చ. రా. సుం.

బుచ్చిగాడు

చిన్నవాడు.

(శ. ర.)

బుచ్చి వాఱు

చిన్న బోవు.

శ. ర.

బుజబుజ రేకులు

ఒక ఆట.

"బుజబుజ రేకుల నాడెదు."

రాధా. 4.124.

బుజము బుజము కలుపు

కలిసి పని చేయు.

"ఎన్నిగతులఁ జూచినఁ దమ రా వెన్ను నితో బుజము బుజము గలుపుటయే మేలు."

ధర్మజ. 73.15.

బుజ యిడు

పరిత్యజించు.

ఏదైనా వ్రాసిన దానిలో వదలివేయవలసిన దాని చుట్టూ గుండ్రముగా సున్న చుట్టుట అలవాటు. అందుపై వచ్చినపలుకుబడి.

"వనజభవుఁ డవయవమ్ములు, తనరార సృజించి సావధానమతిఁ గన్గొని కానొక్కటె దబ్బఱ, యని బుజ యిడు పగిది నాభి యంగన కలరున్."

చంద్రభానుచరిత్రము.

చూ. బుజలు వైచు.

బుజలు వైచు

పరిత్యజించు.

"విశ్వంభరాభోగవివిధమూర్త్యంతర, స్ఫురితానుభావంబు బుజలు వైచి."

పాండు. 2.11.

చూ. బుజ యిడు.

బుజ వేయు

సిద్ధము చేయు.

"గోపులఁ బుణ్యము లెల్ల గోవిందున కిచ్చితిమి, పాపల స్వర్గముత్రోవ బుజ సేయరో॥"

తాళ్ల. సం. 6.145.

బుజాలు తడిమి చూచుకొను

మాటవరసకు ఎవరో ఏదో అనగా అది తననుగూర్చి అన్నట్లే భావించేవారియెడ ఉపయోగించేపలుకుబడి.

"లోకంసంగతి అంటే బుజాలు తడిమి చూచుకొంటూ వేమిరా॥"

వా.

చూ. గుమ్మడికాయలదొంగ.

బుజ్జగించు

ఉజ్జగించు, విడుచు అనే అర్థంలో ఇక్కడ ప్రయుక్తం.

"గజేశుమన నయ్య బుజ్జగించితివో, యజ్ఞదాసయ గారి నాగడించితివో."

పండితా. ద్వితీ. మహి. పుట. 214.

2. లాలన సేయు.

"కొడుకు నామె బుజ్జగిస్తున్నది." వా.

బుజ్జవము లెన్ను

అడ్డుమాటలు చెప్పు, తప్పు పట్టు.

'బుజ్జవము – బుజ్జగింపు మాటలు' అని శ. ర. రూ బుజ్జగము. కానీ ఇక్కడ 'బుజ్జవము లెన్న నేటికి' అని ఉంది కావున అడ్డంకులు బెట్టు, తప్పులు పట్టు కావచ్చును.

"చెవుడుపడంగ నల్లడలఁ జీరుచు న న్నొక వెర్రి చేసి మీ, రివి యివి యంచు బుజ్జవము లెన్నఁగ నేల."
కుమా. 6.19.

బుట్ట దాఖలు చేయు

లెక్క చేయక పోవు.

పనికి రాని కాగితాలబుట్టలో పడ వేయు.

"కన్నుఁదెర దా వచ్చినవ్రాఁతల తెఱఁ గెఱింగి బుట్టదాఖలు సేయుకు..."
గుంటూ. పూ. పు. 84.

బుట్టలో బెట్టు

మోసము చేయు, వలలో వేసుకొను.

"ఎన్నిట జాణ వైతి విపు డెవ్వని నైనను బుట్టఁ బెట్టవే."
శ్రవణా. 2.87.

బుట్టలో వేసుకొను

తన వశము చేసుకొను.

అవశము చేసుకొనుట అన్యాయము అనునప్పుడే దీనిని ఉపయోగిస్తారు.

పాములను పాటలతో పట్టుకొని బుట్టలో పెట్టుకొనుటపై వచ్చినపలుకుబడి.

"వాడు నాలుగు మంచిమాటలు చెప్పి ఆ పిల్లను ఎప్పుడు బుట్టలో వేశాడో యేమో! వాణ్ణి తప్ప మరొకణ్ణి పెళ్లి చేసుకో నని కూర్చుంది.
వా.

బుడకోడి

నీరుకోడి.

బుడిబుడి కన్నీరు

ధ్వన్యనుకరణము.

"ము త్తియంపుముంగఱ రంగునఁ గదలుకొను బుడిబుడికన్నీటం బ్రతి ఫలించి..."
మను. 3.28.

బుడిబుడినడలు

గబగబ నడచుటలు.

ధ్వన్యనుకరణము.

"అప్పుడంతి బుడిబుడినడలతో నగర రక్షకాధిక్షేపదక్షం బగుసాహసంబు సహాయంబుగా."
శుక. 3.302.

బుడిబుడియేడ్పులు

దొంగయేడ్పులు.

"అంత బుడిబుడి యేడ్పుతో నడలు దాని, బుజ్జగించి సువేషుఁ డప్పుడె.."
శుక. 2.212.
బుద్ధ. 3.151.

బుడిబుళ్లు పోవు

గుసగుసలు పోవు, రహస్యములు చెప్పుకొను.

తొట్రుపడు అని సూ. ని.

"నరు ల్బుడిబుళ్ళు వోవ."
బస. 5.130.

"బుడిబుళ్లు వోవుచు భూసురు లెల్లఁ, బుడమీఁకొలువుకుఁ బోయి."
బస. 7.180.

బుడుతకాసీలు

ఒక రకమైన వస్త్రము.

"బుడుతకాసీలు మహముదులు నిరాసీలు సరి సేయ రానిహంసావళులు లాకీలు..."
హంస. 5.356.

బుడ్డగంతులు వేయు
పిల్లిగంతులు వేయు.
కొత్త. 320.

బుధప్రకాశోదయ మగు
చీకటి గాను.
బుధు డెక్కువగా ప్రకాశిస్తే లోకం అల్లకల్లోల మై చీకటి గాను ననుట పై వచ్చిన పలుకుబడి.
"అంత నంతఃపురంబున కరిగి తేని, నీదు కొలువు బుధప్రకాశోదయంబు, మమ్ము నున్నారె యనుమాట మాత్ర కైన, నెడగలదె నీకు మాకొలు విపుడె గాక." కళా. 7.19.

బుద్ధి కాదు
సరి కాదు.
"వాని నిర్జింప కర్తవ్యకృత్యమునకుఁ, బూనఁగఁ దలఁచుట బుద్ధి గాదెందు." ద్విప. జగ. 202.

బుద్ధి కొలుపు
మనసు వచ్చు-ఇష్ట మగు.
"త,న్మణిభూషాదులు పుచ్చుకోఁ గొలుప దమ్మా! బుద్ధి." కా. మా. 4.38.

బుద్ధి చెప్పు
హితము చెప్పు.
"ఎన్నఁడు ని ట్లసమానయుద్ధపారీణుల తోడ నింక నెదిరింపకుమీ యని బుద్ధి చెప్పి..." కళా. 8.91.
కాశీ. 4. 215.

బుద్ధి నాటు
అవగిత మగు, మనసు లగ్న మగు.
"నాబుద్ధి కియ్యంశ నాటదు కనికి." పాండు. 5.229.
"మీరా కొంతిసేపు పాట చెప్పినా భావ తెలియా నా బుద్ధికి నాట లేదు." వా.

బుద్ధి పాఱు
తోచు.
"ఇప్పటిదాఁక నెప్పుడు నధికంబుగ బుద్ధి పాఱదు." కళా. 7.205.

బుద్ధి పుట్టు
మనసు కలుగు.
"చంప బుద్ధి పుట్టదు నాకుఁ." భార. భీష్మ. 3. 305.

బుద్ధి పురువు మేయు
తెలివి తెల్లవారు, బుద్ధి మాలు.
"పోవుట కలిగినఁ బుత్ర! నీకు గోలు, పోవుదునే? బుద్ధి పురు వెట్టు మేసె." గా. హరి. జ్యోతీ. పంక్తి. 1866.

బుద్ధి పెడతల పెట్టు
బుద్ధి మాలి ప్రవర్తించు.
"ఏల బేల వై నీ బుద్ధి పెడతల పెట్టి." వర. రా. సుం. పు. 83. పంక్తి 2.

బుద్ధి యాను
మనసు పడు.
"తమకుఁ గెంపుల సంపిదండలు చెల్లింతు, వానిపై నీ బుద్ధి యాన జేని." హంస. 2.37.

బుద్ధి వదలు
మఱచు.
"చని రవ్వాల నమ్మునులును, వనచరుఁడును వారి బుద్ధి వదలక మదిలో, నను

దినము కందమూలా, శన మొనరించు
చుసు నితరసంగరహితుఁ డై.''
వాల్మీకి. 2.115.

బుద్ధి విను
హితవు విను.
''నీ, పూనిక సకలము చెప్పి న,వీనా
దృతి నతని బుద్ధి విని చన వలయుఁ జూ.''
ప్రభా. 2.8.
''ఆలాగే ఆన తిచ్చిన బుద్ధి విని నడచు
కొనే వయ్యా!'' హేమా. పు. 14.

బుద్ధి సేయు
తలచు.
''మాత్స్యపురమున దైన్యపడుట, బుద్ధి
సేయకు.'' భా. అశ్వ. 1.116.

బుద్ధుల ప్రోగు
అతి తెలివి కలవాడు.
''వామనరూప మై వచ్చి యబ్బలిని,
భూమి వేఁడినయట్టి బుద్ధులప్రోగు.''
ద్విప. జగ. పు. 203.

బుద్ధులు దెల్పు
ఉపదేశించు.
''దండ నొకవేళ నీతిసంధానలీల,
బుద్ధు లన్నియుఁ దెల్పు నప్పుడమి
వేల్పు.'' శుక. 1.178.

బురదకమ్మి
కడపక్రింది కమ్మి.
(శ. ర.)

బురదకొయ్య
చూ. బురదకమ్మి. (చి. ని.)

బురదగోతను బడ్డ పోట్లావు
ఇఱుకున బడ్డ బలవంతునిపట్ల
ఉపయోగించే పలుకుబడి.
శుక్కి. 90.

బురదపాము
నీరుపాము.

బుర్ర గోక్కుంటూ
ఏపనీ తోచక.
మాటా. 62.

బుర్రముక్కు
పెద్ద రంధ్రము కలముక్కు.

బుర్ర రామకీర్తన పాడించు
తన్ను.
ఒక తిట్టు.
కొత్త. 199.

బుర్ర వేడి యెక్కించు
ఆలోచనకు కారణ మగు.
మాటా. 34.

బుఱ్ఱటకొమ్ము
చిమ్మనగ్రోవి, నీళ్లు చిమ్మే
గొట్టము.
భీమ. 5.110.

బుఱ్ఱమీసాలు
లావాటి మీసాలు.
''ఆ బుఱ్ఱమీసాల ఆసామీని చూస్తేనే
నాకు భయం.'' వా.

బువ్వకుడుపు
అన్నప్రాశనము.

బువ్వము బంతి
పెండ్లిలో బంధువు లందరూ
కలిసి కూర్చుండి విందు ఆర
గిస్తారు. దానినే బువ్వము
బంతి అంటారు.
''వంతు గలయంగ బువ్వంపు బంతి

విందు, పెట్టి రెలమిఁ జకోరంపుఁబేర టాంౘ్రుఁడు.'' పారి. 2.48.

బువ్వము పెట్టు
విందు చేయు.
''సుధారసంబుఁ దమి బువ్వము పెట్టుచు నుండఁగా.'' విప్ర. 1.48.
చూ. బువ్వముబంతి.

బుస కొట్టు
పాము బుస్సు మని ధ్వని చేయు.
''సైక లూర్పున్ బుస కొట్టుపాన్పు గల రాజీవాక్షుఁడున్.'' విప్ర. 2.51.

బుసక్రోవులు
ఒక రకమైన తుపాకులు.
''బుసక్రోవులును గసాబులు తుపాకులును''
అ. మ. క. 3.117 పా. 15 పం.

బుసపుర్వు
పాము.

బుస బుస
నీళ్లు పొంగుటలోని ధ్వన్యను కరణము.
శ. ర.

బుసబుస లాడు
బుస కొట్టు.
''పున్నాగంబుల వలగొని, పున్నాగము విఱువ ఫణులు బుసబుస లాడన్.''
కృ. శతం. 1.69.

బుస పెట్టు
బుసకొట్టు.
''విసువున బుస పెట్టును వెక్కస మగు వలరాచ సెగలఁ గ్రాఁగుచు మఱియున్.'' నీలా. 2.48.

బుసి పోవు
వికల మగు, చెడు.
ఆం. శే. 9.

బుసుకు జొన్న
ఒక రకమైన జొన్న.
ఆం. భా. 2,234.

బూచివలె చూచు
అసహ్యముతో, భయముతో వయ్యమువలె చూచు.
''మా యింటియతని, కాస పుట్టింప మెలఁగుదు నట్టు లయ్యు, బూచివలెఁ జూచు నను వానిఁ జూడిచి త్రోయ.''
శుక. 2.111.

బూజు పట్టిన
పాత బడిన.
నిరసనగా అనుమాట.
''ఇంకా ఆబూజు పట్టినసిద్ధాంతాలనే పట్టుకొని పాకులాడడం సబబు కాదు.'' వా.

బూడిద గచ్చకాయ
అందులోనే ఉన్నా తత్సం పర్కము లేనిపట్ల ఉపయో గించేపలుకుబడి.
మానస. శ. 19.

బూడిదగుమ్మడి
ఒకజాతి గుమ్మడి.
పెండ్లిగుమ్మడి.
శ. ర.

బూడిదగొట్టు
బూడిద పూసుకొన్నవాడు.
జంగ మనుశివభక్తుని విభూతి

ధారణ నాసరాగా తీసుకొని నిరసిస్తూ అనుటలో ఉపయోగించుమాట.

బస. 6.164.

**బూడిదపండు**

విభూదిపండు.

"పాడమంగ బీదకన్ను వడి బూడిద పండును బోలె బూంగు పాసెడు నొక దుష్ప్రికిం గవియ."

పాండు. 5.14.

**బూడిదపన్ను**

శ్మశానములో పీనుగులను కాల్చుటకై కట్టే సుంకము.

(శ.ర.)

**బూడిద బుస్సన్న**

మన్ను పూసుకొని యున్న వాడు, విభూతి పూసుకొన్న వాడు.

"చేడెలు పిన్నకాలమునఁ జిన్నెలు వన్నెలు లేక యెంతయున్, బూడిద బుస్సనాకృతిని బొందియు నంతట నీడు వచ్చుచో."

శ్రవ. 3.76.

"బూడిద బుస్సన్న లెవరో."

గుంటూ. పూ. పు. 43.

**బూడిదబొట్టగు**

తృణప్రాయ మగు. బుగ్గి యగు.

చెఱిగి పోవునది యగు.

"చక్రంబు పని సేయ సడి సన్న నీ పెంపు, బూడ్దబొట్టయ్యెనే భూరి కీర్తి."

మార్కం. 1.177.

**బూడిదలో వేల్మి**

వ్యర్థము, నిష్ప్రయోజనము.

చూ. బూడిదలో హోమము.

వేంకటేశ. 85.

**బూడిదలో హోమ మగు**

వ్యర్థ మగు.

"ఏడ సుజ్ఞాన మేడ తెలివి నాకు, బూడిదలో హోమమై పోయెఁ గాలము."

తాళ్ల. సం. 5.48.

**బూడ్దె గలుపు**

వ్యర్థము చేయు.

సింహా. 1.238.

**బూతపిల్లి మచ్చిక**

నమ్మ రానిది.

"మహిని బూతపిల్లి మచ్చికయును బోలె, రాచమాట నమ్మ రాక యుండు."

భల్లా. 4.

**బూతాల పొంగలి**

భూతబలి.

"బూతాల పొంగటికే పాడమిశపంట లెల్లా, కోత వేత చూచుకొని కోరు కొంటారు."

తాళ్ల. సం. 175.

**బూతుల పంచాంగం విప్పు**

బూతుమాటలకు దిగు.

"వాడికి కాస్త కోపం వస్తే ఇక బూతుల పంచాంగం విప్పుతాడు."

వా.

**బూతులు పెట్టు**

తిట్టు.

"వాడిక్కడికి వచ్చేసరికి నాలుగు బూతులు పెట్టి పంపించాను." వా.

**బూది చఱచు**

బూడిద పట్టు.

"ననలఁ బేరెసఁగుపవనములు నమేరు రజోవృష్టి బూది చఱవ."
ఆము. 4.145.

**బూదిలో హోమము**

వ్యర్థము.

"అశేషపుణ్యములు, బూదిలో హోమమై పొలియు."
వర. రా. బా. పు 81. పంక్తి 23.

**బూమాట**

హానికర మయినమాట.

"ఏ బూమాటలు వచ్చునో యనుచు ము న్నే నన్నియుఁ జెప్పితిన్."
సురా. 119.

**బూమియ లాడు**

అబద్ధా లాడు, వంచనమాట లాడు.

"ఇన్ని బూమియ లాడఁ బని లేదు పాఱుఁడవు బో మే లయ్యె."
కుమా. 8 139.

**బూమె సేయు**

మోసగించు.

"వలవదు న న్నింత బూమె సేయ."
రుక్మాం. 5.104.

**బూమేటుల బెట్టు.**

కష్టపెట్టు.

"...దిక్కున్ భూమి తారల్ దివం, బును సర్వంబు నెఱుంగ నందు నతనిన్ బూమేటులం బెట్టి యా,లిని రాజ్యంబును బాసి నొంచెదను జాలిం బెట్టి గావించెదన్." నలచ.

**బూరగాలు**

ఏనుగుకాలు.

"బూరకాళులు నీచఁబోయినచేతులుఁ, గోలమూపులు గుది గొన్నతొడలు."
ఉ. హరి. 2.122.

**బూరగొమ్ము**

కొమ్ముబూర.

"అద్భుత, స్ఫారతరార్భటిం బిరుదు సంకులఁ దారలు బూరగొమ్ములున్."
కళా. 8.118.

**బూరటకొమ్ము**

చిమ్మనగ్రోవి.

"ప్రోడతనంబునం దగిన బూఱట కొమ్ములు గాఁగఁ జల్లు పోరాడిరి."
కవిక. 2.117.

**బూరటిలు**

ఉబ్బు.

"జగదండభాండంబు బూరటిల."
కవిక. 2.148.

**బూరుగు గదియు కీరమువలె**

పనికి రానిపనికి దిగువానిపట్ల ఉపయోగించేపలుకుబడి.

**బూరుగుపండు సొంపు**

పైకి అందంగా కనిపిస్తూ పనికి రాని వానిపట్ల ఉపయోగిస్తారు.

బూరుగుపండు అందంగా ఉంటుంది గాని పగిలితే దూది తప్ప తినడానికి ఏమీ ఉండదు.

వేంకటేశ. 79.

## బెంగ గొను

వ్యథ నొందు.

"వంతఁ గలంగి బెంగ గొని వాలెము దాలిమి దూలి."

రసిక. 54.

## బెంగ పెట్టుకొను

వ్యథ నొందు.

"ఆ పిల్ల తల్లికై బెంగ పెట్టుకొని అన్నంమెతుకు ముట్టడం లేదు."

వా.

## బెంగ లిడు

కేకలు వేయు.

"బెంగ లిడంగ గంటి యిట పెంటిని గానక."

సారంగ. 2.4.

## బెండగు

చెడు.

"నాపేరు విన్నను దేవాసురవీరసైన్యముల కైనన్ గర్వముల్ బెండగున్."

భార. అశ్వ. 4.39.

## బెండపూవులగతి రాశి పోయు

దండిగా ధనము క్రుమ్మరించు.

"...మూలధనంబు, కసి బెండపూవుల గతి రాశి వోసి, పొసగు..."

గౌర. హరి. ద్వి. 887-889.

## బెండాబెడ గగు

నిస్సత్త్వ మగు.

"పంచబంగాళె మై చెల్లాచెద రై గజిబిజి యై బెండాబెడ గై కకావిక లై..."

ప్రబంధ. 788.

## బెండుకొను

బలహీన మగు.

"దట్టంపు వలపులతమి బెండుకొని సారె, సారెకు గుండియ జల్లనంగ."

నీలా. 2.83.

## బెండు చేయు

నిస్సారము చేయు.

"మండెడు పటుకాలదండంబు చేతులఁ, బిసికి వేఁడిమి యార్చి బెండు చేసి."

హరి. పూ. 4.155.

## బెండు పడు

1. తేలు.

బెండు సామాన్యముగా నీళ్లలో తేలును గనుక బెండుపడు అని ప్రయోగం. నిస్సార మగు, తేలిక యగు అనే అర్థాలలో కూడా ఇది ప్రయుక్తము. అవి కూడా బెండుమీాద వచ్చినవే.

"అఖండతరధారాపరంపరలొండొండ మెండుకొని వసుంధరామండలంబు బెండుపడఁ గురియుచుండ."

శుక. 1.277.

"దైత్యసేన భీతిఁ బఱచెఁ గొంత బెండు వడి యుండెఁ గొంత ధూమ్రాతు వెనుక కొదిగె."

భార. ఆర. 7.

2. శక్తిహీన మగు, నిస్సార మగు.

భీమ. 4.107.

కాశీ. 5.269.

## బెండుబొమ్మ

బెండుతో చేసినబొమ్మ.

"బెండుబొమ్మగతి నుండె న్నందిటం జుల్కనై." ఆము. 5.63.

**బెండుమానిసి**

పిఱికివాడు.

"బెండుమానిసులకు భీషణంబులు..." భార. కర్ణ. 2.46.

**బెండులు మునిగి గుండులు తేలు**

ఏ దయినా విపరీతము సంభవించినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

బెండ్లు తేలడం, గుండ్లు మునగడం సహజం. తద్విరుద్ధముగా జరుగుట విడ్డూరమే కదా!

"మనుజాంగనలం బట్టుట, దనుజుల కం జెల్లుఁ గాక దనుజాంగనలన్, మనుజులు పట్టుటకును దొర,కొనిశే బెండులు మునింగి గుండులు దేలెన్." ఉ. హరి. 5.218.

**బెండు వఱుచు**

తేలిక పఱుచు.

"చండవైఖరి మీఱి కొండలలోయల దూఱి, గండకంబులఁ జేరి బెండు వఱుచు." శకుం. (కృష్ణ.) 3.89.

**బెకబెక లాడు**

బెకబెక మని కూయు.

(శ. ర.)

"కప్పలు బెకబెక లాడును."

**బెకొట్టు**

వాపోవు.

(శ. ర. బ్రౌన్.)

**బెగడు గుడుచు**

భయపడు.

"కడు బెగడు గుడిచె భువనము, లుడుగక జలనిధులు గలఁగె." భాస్క. బాల. 666.

**బెగడుపడు**

భయపడు.

"నీదు సైన్యముల్, బెగడుపడున్ మదించి యతిభీమసముద్ధతి నింక నెమ్మెయిన్." భార. ద్రో. 5. 227.

**బెజ్జము గలయు**

సంకర మగు.

"ప్రాజ్ఞులు వేదశాస్త్రంబులు మఱచిరి, సకలవర్ణములు బెజ్జంబు గలసె." వరాహ. 7.31.

**బెజ్జములు పుచ్చు**

రంధ్రములు చేయు.

నేటి అలవాటు బెజ్జము వేయు.

కాశీ. 5.105.

**బెట్టగోను**

మానవుడు.

"సొంగిలి మ్రొక్కు బెట్టగోను సొంగిలి మ్రొక్కును నవ్వు నూరకే." శ్రీరం. 3.140.

**బెట్టుక్రోవి**

ఒక రకమైన వేటసాధనము.

"వలలును బెట్టుక్రోవులుఁ బెద్ద యురులును, దెరలును బోనులు దీమములును." హరిశ్చ. 2.6.

**బెట్టుసరి**

తెచ్చిపెట్టుకొన్న నిక్కు.

"ఇఁ కేటి బెట్టుసరివైఖరి బొత్తిగఁ దప్పె..." పాణి. 6.94.

**బెడగారు**

ప్రకాశించు.

పాండు. 5.184.

**బెడగుపడు**

అందగించు.

"మజ్జిపండుల వడువు గలమడమల బెడంగుపడి." ఆము. 6.98.

**బెడ గొందు**

శోభిల్లు.

"బెడఁగొందు నెచ్చోటఁ గడమ యింతయు లేక, సామగ్రి శుభవసుసంచయంబు." కాశీ. 2.28.

**బెదరుగుండె పిక్కచెదురు**

భయస్థుడు.

"ఎదిరించినను రుద్రు నదలించు చే కాని, బెదరుగుండెయుఁ బిక్కచెదురు లేదు." వేంకటే. 1.9.

**బెదరుగొడ్డు**

పిఱికివాడు.

"వీడు వట్టి బెదురుగొడ్డు - వీణ్ణి పంపి లాభం లేదు." వా.

**బెదరు తీర్చు**

ధైర్యము కొలుపు.

"ప్రథితమిథోరాగకథల మంతనముల, హృదయంబులోపలి బెదరు దీర్చి." కళా. 7.158.

**బెదరు పడు**

భయపడు.

"బెదరుపడునట్టి శరదిందువదనఁ జూచి." భాను. 3.44.

**బెదరుపోతు**

భయస్థుడు.

**బెల్లం వండిన పొయ్యి**

ఇంగువ కట్టినగుడ్డ లాంటిది.

"తొల్దొల్త బెల్లంబు వండిన దీపొయ్యనియున్ దలంచుజనులన్." శతా. 113.

**బెల్లించి వెల్లాలి సేయు**

ఉబ్బించి మోసగించు.

"పతిభక్తి సతి నరుంధతివంటి వాలంటి, నైన బెల్లించి వెల్లాలి సేయు." శుక. 2.502 క్రింద.

**బెళుకు దేఱు**

తళతళ మని ప్రకాశించు.

"పిఱుఁదుపై మొలనూలు బెళుకు దేఱ." వీథి. 9.

**బెస్తనేస్తము**

సమయమునకు పనికి రానిది.

బెస్తవానితో స్నేహము
ఎంత ఉన్నా 'కేవు' ఇవ్వ
నిదీ మరి దాటించడు.

రాధి. 4.79.

**బేజుమాలు చేయించు**

చికిలి చేయించు.

"ఎంచ ధణావసంతుఁ డతఁ డెత్తెడు కత్తుల బేజుమాలు సే, యించెనొ నాఁగ." సమీర. 1.125.

**బేడిసతిరుగుళ్లు**

ఒక రకమైన పిల్లల ఆట.

"పిప్పిళ్లు త్రొక్కుళ్లు బేడిస తిరుగుళ్లు." హంస. 5.155.

## బేడిసెకదుపుభంగిని

అధికముగా.

చేపలగుంపువలె.

"మిడుతగమిలాగున బేడిసెకదుపుభంగిని..." హంస. 3.29.

## బేతాళప్రశ్నలు

అంతు చిక్కని ప్రశ్నలు, యక్షప్రశ్నలు, చిక్కు ప్రశ్నలు.

"......నీయెడఁ మున్ను బేతాళప్రశ్నలు మాని మేఁ గొనుము బేతాళచ్ఛలోక్తిఁ రుషం." అను. 6.65.

## బేరకత్తె

బేరము చేయునది.

"సరస మెఱుంగుచంద్రముఖి సావడి దంటయు బేరకత్తెయుఁ." మొ. రా. అయో. 12.

## బేరగాడు

బేరము చేయువాడు.

## బేర మాడు

వ్యాపారము చేయు.

వాడుకలో ఇది కొంత మారి ఎక్కువధర చెప్పగా తక్కువ ధరకు అడుగుటగా అలవాటయినది.

"వీడియపుఁగప్పు లెప్పుడు వెలయరతుల, బేర మాడుచుఁ గాఁపుగుబ్బె తలజోడు." శుక. 2.332.

"ఇక్కడ ఒక్కటే ధర. బేర మాడడానికి వీలు లేదు." వా.

"సరిగా బేర మాడి తీసుకరా." వా.

## బేరము పొసగించు

బేరము కుదుర్చు.

"బేరము పొసగించి చేసి వెల కిప్పించెన్." హంస. 5.360.

## బేరసార మాడు

బేరము చేయు.

బేరసారములు. జం.

"సారభద్రవ్యములు బేరసార మాడఁ, బిలువ నంపిరి తమతమ పేటల మను." హంస. 1.112.

## బేరసారములు

వ్యాపారము. జం.

బేరమూ సారమూ అని కూడా వాడుక.

"......బంగారువంటి కోమటి, సంగీతముచేత బేరసారము లుడిగెఁ." చాటువు.

"కేవలనైపుణి విపణి న, యో! వలసిన బేరసార మొందక యెందుఁ, నీవలె నీవలఁ దిరిగిరె, కోవెల వెలయాంధ్ర నంటి కోమటిబిడ్డల్." బహులా. 5.81.

## బేల గొట్టు

మోసగించు.

"వాణ్ణి వీడు మాటలతో బేలకొట్టేశాడు."

చూ. బేలు పోవు.

## బేల పోవు

సారహీన మగు.

"బీజమాత్రంబు చిక్కక బేల పోవు, నెల్ల ధరణియు..." శ్రీరం. మా. 3,14.

**బేలుపడు**

మోసపోవు.

"నే న,మ్మాటల బేలు పడితి..." భోజరా. 6.55.

**బేలు పోవు**

మోసపడు.

"వాడు నాలుగు తియ్యటిమాటలు మాట్లాడేటప్పటికి వీడు బేలు పోయాడు." వా.

(మాటలతో) మోసపోవు.

"నేను నీ మాటలకు బేలు పోయేవాణ్ణి కాదు." వా.

"వాడు వాళ్లవదినను బేలగొట్టి ఆస్తి కాస్తా కాజేశాడు." వా.

**బేలు పెట్టు**

మాటలతో మోసపుచ్చు.

ఇది నేడు బేలుపోవు అనే రీతిగా కొన్ని జిల్లాలలో విన వస్తుంది.

"ఈ నక్కయును బేలు పెట్టె నిన్నాళ్లను." భార. శాంతి. 3.66.

"నా, కూరిమిపట్టి నిట్టి ననగూంటి తనంబున బేలుపెట్టి తో,రార." విప్ర. 4.25.

చూ. బేలు పోవు.

**బేసబెల్లి**

నంగనాచి వంటిది.

"ఆసలు...బేసబెల్లి దేహముతోఁ బెరుఁగుఁ గాక." తాళ్ల. సం. 10.61.

**బేసబెల్లితనము**

నంగనాచితనము.

"బేసబెల్లితనమున బ్రియాన నిచ్చక మాడి." తాళ్ల. సం. 7.250.

**బేహార మాడు**

వ్యాపారము చేయు.

"పూని బేహార మాడి పోవువారలను, బోసిక మీఁదఁ గాఁపులు పెట్టి..." ద్వి. పరమ. 487 పా.

**బేహోర మాడు**

రూ. బేహార మాడు.

"అర్థులకు నిచ్చి కీర్తి బేహోర మాడు." హర. పీఠి. 26.

**బైట పెట్టు**

బయలు పఱుచు.

"ఏడఁ బోయెనో కదా మేడలో మాంజిష్ఠి, పెనుఁబండువున బైటఁ బెట్టఁ జాల." కాశీ. 4.108.

**బైసికొను**

చంపు.

"ఇటు లేకలమ్ముల బైసి కొనియె, జనవిభుఁడు నూడ నొకకొన్ని జాగిలములు." చంద్రా. 2.91.

**బైసిగాడు**

గౌరవహీనుడు.

"వ్రాసి కొన్నారు బాఁపన బైసి గాండ్రు." శుక. 2.247.

**బైసి చెడు**

బగిసి మాలు.

అవమానపాత్రము లగు.

"ఘనుల, బైసి చెడిపోవుఁ దుది నీరు పాము లగును." జైమి. 7.82.

**బైర్లు క్రమ్ము**

కండ్లు తిరుగు.

"మధ్యాహ్నందాకా తిండి లేక పోయేసరికి కండ్లు బైర్లు క్రమ్మాయి."
వా.

## బొంకుల పుటికలు

అబద్ధాల పుట్టలు – దూషణము.

పుటిక లనగా గంపలు.

పండితా. ప్రథ. పురా. పుట. 343.

## బొంకుల పుట్ట

అబద్ధాలకోరు.
పుట్టలో చీమలో, పాములో విపరీతంగా ఉండడంవల్ల పుట్ట అనగానే కావలసినన్ని ముందు చెప్పినవి ఉన్న దని సూచన.

"మంకులు మాయోపాయులు, బొంకుల పుట్ట లతిపాపపుం జగజంతల్."
హంస. 1.37.
చూ. అబద్ధాలపుట్ట.

## బొంకుల బాన

అబద్ధాల పుట్ట.
"నక్కచిక్కలమారి పెక్కురూపి దూ, బరదిండి బొంకులబాన మొండి."
చెన్న. 2.25.

## బొంగు బుజాన వేసుకొని

బట్టా పాతా చుట్టి చంకలో పెట్టుకొని అనుట వంటిది.
"బొంగు బుజాన వేసికొని పొమ్మని కొందఱు పల్కినంత నే."
గీర. 51.

## బొండకొయ్య నుంచు

పూర్వపు శిక్షావిధానము లలో ఒకటి.
"వినవచ్చి దొంగ గా యని, యొనరఁగ నిట బొండకొయ్య నుంచిరి క న్వేఁగిన వెనుక..."
శుక. 3.204.

## బొంతరటి

పెద్ద పెద్ద కాయలు కాచెడి ఒకజాతి అరటి.

## బొంతరాయి

ఒక రకమైన రాయి.

## బొందితో కైలాసము

సశరీరముక్తి.
నేటికీ వాడుకలో 'ఆఁ. ఆమె బొందెతో కైలాసం పోతుంది లే' అంటారు. బొంది – శరీరము. బొందె అని వాడుక. 'బొందిలో ప్రాణ మున్నంతదాకా ఏదో చేయాలి...'
"లంజ నత్తుణమ కైలాసంబునకును, ...భువనముల్ వొగడంగ బొందుల తోన, కొనిపోవ."
పండితా. ప్రథ. పురా. పు. 367.
చూ. కాయంబుతోడ....

## బొందితో కైలాసము చేర జూచు

అసాధ్యమునకై ప్రయత్నించు.
"వ్యాససుతాదులం దలఁచి వాసికి మంగలకత్తి మ్రింగ దా,సాసల నట్టు

చాచె దదె యందనిపంటికి బొందితోన
కై, లాసముఁ జేరఁ జూచెదుచలం బది
యేమి ఫలం బటంచు నా, భూసురుఁ
డీసు వెంచి మునిపుత్రకుఁ బాసి
తొలంగి వెండియుఞ్."

పాండు. 5.230.

## బొందివేట

కౌజులు మొదలయిన పెంపుడు పక్షుల సహాయముతో ఆడువేట.

"మొదలు గాఁగ బొందివేఁటకు మీఱు, పిట్ట లెల్ల గూండ్ల బిట్టు చెలఁగ."

యయా. 1.113.

## బొక్క లాడు

1. వేధించు.

"గతి చెడ్డ చెడుగు తెక్కలి బొక్క లాడు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 2034.

"వాడు నన్ను వేయించుకొని బొక్క లాడుతున్నాడు. వీడితో నేను పడ లేను. ఎక్కడికైనా పోతాను బాబూ!" వా.

"పాపం! ఆవిడ ఆ కొత్త కోడలిని పోరి బొక్క లాడుతూంది." వా.

ఇది నామవాచకంగా అలా పోరువాడు అనే అర్థంలో కూడా ప్రయుక్తము. పై ప్రయోగము ఇందులో శ్లేష గమనింప దగును.

2. ఆతురతతో తిను.

"త,జలరుహనాభ గేహరురుశాబము సారెకు బొక్క లాడ."

ఆము. 1.75.

## బొక్కసపిల్లు

ధనాగారము.

"బొక్కసపుటిండ్లు నుగ్రాణముల నెలవులు." ఉ. రా. 8.14.

## బొక్కి పడు

శిథిల మగు.

"కోట బొ,క్కి పడంగా యవనోగ్ర సైన్యము ఫిరంగీల్ గుప్పి రొక్కుమ్మడిఞ్." రంగా. 3.72.

## బొగ్గు కఱచు

గడ్డి కఱచు అనుట వంటిది.

"వారు కట్టకడకు సిగ్గుపడి బొగ్గు కఱవక మానరు." ధర్మజ. 44.1.

## బొగ్గుపడు

నల్లని దగు.

"కనకవర్ణుండై నకైటభాసురవైరి, పొగచూరి నల్లనై బొగ్గుపడియె."

భీమ. 4.61.

## బొగ్గులు సేయు

పాడు చేయు.

"ధర్మకీర్తులఞ్, బొగ్గులు సేసి జారశశిఁ బొంది కటా! కడు పేల తెచ్చుకొంటి..." భాగ. 9.378.

## బొగ్గుల్లో రామచిలుక

నల్లనిది అని హాస్యంగా అనే మాట.

"వెతికి వెతికి యీ బొగ్గుల్లో రామ చిలుకను ఎక్కడ పట్టుకు వచ్చావురా. అచ్చం జీడిరంగు." వా.

## బొటనవ్రేలికి సున్న మగు

సంపద కలుగు.

భోజనం చేసి తాంబూలం వేసుకొనే స్థితి వచ్చిన దనుట. తాంబూలం వేసు కొనునప్పుడు తమలపాకుపై బొటనవేలితో సున్నం పూయుటపై యేర్పడినది. 'బొటనవేలికి సున్న మైనం తనే బోర్లపడే రకం' అను సామెతపై యేర్పడినపలుకు బడి.

"బొటనవేలికి సున్నం కాగానే బోర్ల పడ రాదు." వా.

**బొటనవ్రేలికి సున్నము పూసి నంతనే బోర్లపడు**

కాస్త కలగగానే తల తిరిగి పోవు.

బొటనవేలికి సున్నం పూసి కొనుటకు ఇక్కడ తాంబూలము వేసికొను దశకు వచ్చు అని అర్థం.

సారంగపాణిపదములు.

**బొట్టనగోలలు**

ఒక రకమైన పిల్లలఆట.

"చీకటిమొటికిళ్లు చిమ్మబిల్లలు నెట్లు, బొట్టనగోలలు బొమ్మరాలు." వి. పు. 1.202.

**బొట్టు గట్టు**

పెండ్లి యాడు.

ఇందులోని బొట్టు తాళిబొట్టు.

"నట్టడవిలోన నన్నిట్టు నట్టు పఱచి, బొట్టుమిట్టాడ నేఁటికిఁ బట్టభద్ర, పుట్టునకు మున్న లేమకు బొట్టు గట్టి, చెట్టపట్టుట కొకరుండు పుట్టెఁ జూవె." శకుం. (కృష్ణ.) 2.74.

**బొట్టుదారము**

మంగళసూత్రము.

శ. ర.

**బొట్టొనర్చు**

పాడు చేయు.

"తమ్ముల దోషాప్తిఁ గ్రమ్మి మానిన అట్టు, నయశాలలను బొట్టొనర్చు కొఱఁత." బిల్హ. 137.

**బొట్లరుముక్కలు**

వచ్చీ రాని యింగ్లీషు మాటలు.

కొత్త. 44.

**బొడ్డనబావి**

దిగుడుబావి, నడబావి.

క్రీడా. పు. 91.

**బొడ్డుకు మసి పూసుకు కూర్చును**

అదేపనిగా కూర్చొని యుండు.

"మా అమ్మ నీతో పోట్లాటకు బొడ్డుకు మసి పూసుకు కూర్చున్నది." వా.

కొత్త. 277.

**బొడ్డుకొంగు**

బొడ్డుదగ్గర చెక్కుకొను బట్టకొన.

"డబ్బు జాగ్రత్తగా బొడ్డుకొంగున కట్టుకొని వెళ్లు." వా.

**బొడ్డు కోయు**

పిల్లలు పుట్టినప్పుడు మాయను తొలగించుటకై బొడ్డును కోస్తారు.

“సంసారమోహపాశముఁ గోసినటు వలె, బొడ్డు గోసిరి పిన్నబిడ్డనికిని.” కా. మా. 3.27.

**బొడ్డుగంట**

మొలగంట. ఒక రకమైన నగ.

“కమలినీ నాయకుఁడు బొడ్డుగంట యయ్యె.” సీతా. వి. 2.130.

**బొడ్డుచవిక**

చుట్టుకొల్లారము నడిమి చావడి. శ. ర.

**బొడ్డుపుడక**

దూదేకులవాళ్లు ఉపయోగించే ఒక రకమైన పనిముట్టు. శ. ర. బ్రౌ.

**బొడ్డులో చెక్కుకొను**

దాచుకొను.

దీనినే 'రొండిలో చెక్కుకొను' అని కూడా అంటారు.

డబ్బును చీరలోనూ, దోవతిలోనూ నడుమున చెక్కుకొనుటపై వచ్చినపలుకుబడి.

“వాడు డబ్బంతా బొడ్డులో చెక్కుకొని కూర్చున్నాడు.” వా.

**బొడ్డులో చెయ్యి వేసి నిలవేయు**

ఏదైనా ఇచ్చి తీరవలె నని, అంతదాకా కదల కూడ దని నిర్బంధించు.

“వాడు నా బాకీ యిచ్చి తీరా లని బొడ్డులో చెయ్యి వేసి నిలవేశాడు.” వా.

**బొడ్డులో మాణిక్యము**

భాగ్యవిశేషము.

“సాధుస్తుత్యవంశంబునన్, బొడ్రత్నంబునఁ దేజరిల్లుజననంబుం బొందినన్.” వైజ. 1.63.

**బొడ్డు వంచు**

నడుము వంచు, ఓపిక కలిగియుండు.

“ముందటిభంగి గాదు కడు మూర్ఖతనంబులు పెద్ద యింటిలో, నిందతియోజయుం జెఱచు నేపనికైనను బొడ్డు వంప లే దండుకుఁ దోడు చీమచిటు కన్నను...” భోజ. 6.142.

**బొడ్డూడని**

వయసు రాని.

దీనిని వ్యంగ్యంగా 'నోటిలో వేలు పెడితే కొరక లేడు' అన్న అర్థంలో ఉపయోగిస్తారు.

“అవును. నీ కొడుకు పాపం బొడ్డూడని పసిపాప. ఏమీ ఎరగడు.” వా.

**బొత్తిగా**

పూర్తిగా.

“కలుష కందఁ దొలఁగించ కల దను

వనితకే,ల్వడిపించి బొత్తిగా సడలఁ జేసి.''

మృ. వి. 1. 17. పా. 18. పం.

బొద్దుకీటు

గోడపై బొద్దేర్పఱిచి పెట్టెడు కీటు.

శ. ర.

బొబ్బలు వోడుచు

కేకలు వేయు.

బొబ్బలు పెట్టు, గట్టిగా అఱచు.

''బొబ్బలు వోడువంగఁ బొంగి యార్వంగ.''

బస. 3.68.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 438.

పండితా. ద్వితీ. మహి. పుట. 34.

బొబ్బ వోడుచు

కేకలు వేయు.

''భయంబునం దిరిగి సురిఁగి పోవం గు మారుం డుబ్బి బొబ్బ వోడిచి యార్చి.''

హరి. ఉ. 7.211.

బొమగంటు వెట్టు

బొమముడి ముడుచు.

కోపము చెందినపుడు కను బొమ్మలను ముడి వేయుట అలవాటు.

''అవుడు గఱచికొనుచు, బొమగంటు బెట్టుచుఁ గొంద అచట.''

ఉ. హరి. 5.314.

బొమలు గొను

బొమముడి వెట్టు.

''మ్రొక్కవే మనపాలివేలు పని బుజ్జ వించియు బొమలు గొని జంకించియు.''

ఆము. 4.35.

బొమలు ముడుచు

కోపమును సూచిస్తూ కను బొమ్మలను ముడి వేయు.

''కృతిమరోష, స్ఫురణంబున బొమలు ముడుచుచున్ సతి పతితోన్.''

కళా. 5.43.

బొమ్మంచు

ఎఱ్ఱని.

''అఱమోవి మోవి చందురకావి కీవి గమ్మ బొమ్మంచుకెమ్మోవిపై చిఱు నవ్వు చెంగలింపఁగా.''

హేమా. పు. 32.

బొమ్మ గట్టగ జాలు

మించ గలుగు.

జయించినందుకు సూచనగా బొమ్మలు కట్టుట అను అల వాటుపై వచ్చినపలుకుబడి.

అవమానము చేయు అని సూ. ని.

''కట్టెన్ మంగళసూత్రమున్ శరధిశంఖ శ్రీలకున్ బొమ్మలన్, గట్టన్ జాలెడు కంఠపీఠి.''

మను. 5.88.

బొమ్మ మెట్టు

గెలుచు.

''మృగరాజునకు బొమ్మ మెట్టిన నడుము.''

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 397.

చూ. బొమ్మ కట్టు.

**బొమ్మర వోవు**

విస్తుపోవు.

"దిగ్గజంబులు బెదరెన్ భుజంగపతి బొమ్మర వోయె."

భాస్క. బాల. 705.

**బొమ్మల వెట్టు**

అవమానించు.

"అత్యంతసాయకుండు నిక్కముగా సవరించువింటికిన్, బొమ్మలం బెట్టు నట్లు కనుబొమ్మలు చూడంగ నొప్పె బాపురే."

చిత్రభా. 3.67.

**బొమ్మ వెట్టు**

తిరస్కరించు.

"మహి నాపుట్టుగులకే మతి బొమ్మ వెట్టినాండ."

తాళ్ల. సం. 9.22.

**బొల్లావు పోట్లాట**

గట్టి పోట్లాట.

కుక్క. 24.

**బోగమాట**

భోగముదాని యాట.

(శ. ర.)

**బోగుబడి పెద్దఱికము**

ఎక్కువ ధనవ్యయము చేసి పొందు పెద్దఱికము.

"ఆ బీదల కేల బోగుబడి పెద్దఱికం బును బెట్టబీరమున్."

ఉ. హరి. 4.160.

**బోగు మిగులగన్**

నిర్విశేషముగా-పూర్తిగా అనుట.

"కన్నవారు కన్నదిక్కునం బాఱి, పోయి రెల్లయతులు బోగు మిగుల."

ఉ. హరి. 4.66.

"కడు నిడుములం బడి వారిప్పుడు మునుపటి శెలవు వదలి బోగు మిగులంగన్, దొడుకులును బృంద యని యెడు, నడవికిం గాంపురము వచ్చి నిలబడి మీఱన్." నీలా. ఆ. 1.

**బోకెత్తు**

ఉబ్బుగా నుండు.

"గూనివీఁపుమీఁదఁ గోడి యై బోకెత్తి, తతివడ్డ కంకాళతండము లును." కాశీ. 3.138.

**బోడచౌరవ**

మొండిసాహసము.

"వలువకుం గూటికి నై నీచుల వేఁడన్ బోడచౌరవం జొచ్చు నతఁడు."

పాండు. 3.21.

**బోడికొల్ల**

సమృద్ధి అనుట.

"అందు రుచు లొకింత యైన నెఱుంగనికతన బోడికొల్ల గలిగె మనకు."

రుక్మాం. 3.231.

**బోడితలలకు బొండుమల్లెలు చుట్టు**

పనికి మాలినపని అనుట.

"వాడి కేం పనా పాటా? బోడి తలలకు బొండుమల్లెలు చుట్టూ కూర్చుంటాడు." వా.

**బోదకాలు**

ఏనుగుకాలు.

దీనినే బూరగాలు అని కూడా అంటారు.

బోదెకొయ్య
కడపక్రింది కమ్మి.
(శ. ర.)

బోధ చేయు
బోధించు.
(శ. ర.)

బోనకావడి
భోనపుట్టిక లుంచుకావడి.
"ఘృతపాయసాపూపాది వివిధసార భంబులం గలబోనకావడి యొకటిం గని." భోజరా. 5.339.

బోనపుట్టిక
భోజన ముంచినబుట్ట.
"అమరుల బోనపుట్టిక సహస్రమయూఖుని జోడుకోడె సం,తమసము వేరు విత్తు కుముదంబుల చక్కిలిగింత పుంశ్చలీ, సమితికిఁ జుక్కవాలు." పారి. 2.41.

బోనుపొయ్యి
ఒక రకమైన మంటిపొయ్యి. దీనిని ఎక్కడి కంటే అక్కడికి తీసుకొని పోవచ్చును.

బోయనామము
కిరాతులు నొసట పెట్టుకొనే ఒక రకమైన నామము.
"కొనముక్కుకడనుండి కొనవెండ్రుకలదాఁకఁ, బొందుగా దిద్దినబోయనామము..." చంద్రా. 2.39.

బోయబొంకులు
పచ్చి అబద్ధములు.
"సత్యభాషణము లెచ్చుటఁ గట్టిపెట్టునో, బోయబొంకులె నోరఁ బొదలుచుండు." వేం. పంచ. 1.456.

బో రనియెడు జడివాన
ధ్వన్యనుకరణము.
వాడుకలో - బోరున వాన కురుస్తున్నది. బోరు మని యేడ్చినాడు.
"అని చిలుకతేనియలు బో,రనియెడు జడివాన వెలిసినటువలెఁ బలుకన్." శుక. 2.29.

బోరు కలగు
ఎక్కువగా శబ్దించు.
ధ్వన్యనుకరణము.
"భేరీశంఖపటహఢక్కారావములపుడు......బోరు కలఁగ." జైమి. 6.126.
"కొమ్ములు మ్రోయ మంటితమకల్వెస బోరు కలంగఁ బార్శ్వభాగమ్ముల..." శుక. 1.244.

బోరుకాడించు
శిశువులకు స్నానము చేయించు.
"ఆ కాంతాలలామ, యను వొందఁగా బోరు కాడించి కూర్మి, యినుమడింపంగఁ జన్నిచ్చె." ద్వి. పరమ. 2.67 పా.

బోరుకొను
"అనివారిత మంగళవాద్య నిస్వనో, త్కరములు చాల బోరుకొనఁ గ్రక్కున నారతు లెత్తి రయ్యెడన్." చంద్రి. 6.32.
చూ. బోరు కలగు.

**బోరుగద్దలు**
బొంతగద్దలు.
కాశీయా. 288.

**బోర్డు త్రిప్పు**
దివాలా తీయు.
ఏదో కంపెనీ పేర బోర్డు కట్టడం, అది దివాలా తీయడంతో తిప్పి వేయడం పై వచ్చినపలుకుబడి – ఇటీవలిది.
"వాడిప్పటికి ఎన్ని బోర్డులు తిప్పాడో ఎన్ని బోర్డులు కట్టాడో దేవుడికి తెలుసు." వా.

**బోర్తలుపు**
తలవాకిలి.
"కృపావిభవంబు నింటి బో, ర్తలుపు దలంపు సేయుచు నురంబు గరంబు పరిస్ఫురింపఁగన్." పాండు. 2.36.

**బోల్తా కొట్టు**
మోసపోవు.
మాటా. 101.

**బోర్లపడు**
మిడిసి పడు.
"ఏం చూచుకొని అంత బోర్ల పడుతున్నాడో తెలీదు." వా.

**బోసి పుచ్చు**
బోసి యగునట్లు చేయు.
"పటుచపేటంబులఁ బండ్లు డుల్లఁగ మొత్తి, పూషారుక్ష్ వదనంబు బోసి పుచ్చె." కాశీ. 7.84.

**బోసి పోవు**
ఉండవలసినవి లేనప్పుడు కలుగుఅవస్థ.
పండ్లు పోతే నోరు బోసి పోతుంది. బొట్టు లేకపోతే మొగం కూడా – అలవాటయినవారిలో.
"పూషారుక్ష్ వదనంబు బోసి పోయిన యప్పు." భీమ. 6.44.
"కమ్మలు తీసేస్తే చెవులు బోసి బోయినవి..." వా.

**బోసేయు**
తిను.
"సిరి గల్గి తేని బోసేయుట కాక, యొరుల రంతుల వెట్ట నొప్పునే యిట్లు." అ. మ. క. 1.35 పా. 25పం.

**బోళబాటు**
మిడిసిపాటు.
"ఆ ఆస్తి వచ్చేసరికి దాని బోళపాటు ఇంతా అని చెప్పడానికి వీల్లేదు." వా.

**బోళామనిషి**
ఉబ్బిపోయే మనిషి.
కొత్త. 316.

**బౌళివట్టు**
మదించు.
"పచ్చి సెత్తురు త్రావి బౌళి వట్టుటయు, తెచ్చపాటున సంచరింపుచున్నాను." వర. రా. యు. పు. 291.16.

**బ్రంగుడుకన్ను**
గుంతకన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

బ్రతికి చెడిన
ఒకప్పుడు బాగా బతికి ప్రస్తుతం చెడిపోయిన.
అలాంటివాళ్లు ఉత్తములు గానే ఉంటా రని.
"వాడు ఎంతైనా బతికి చెడినవాడు. తిండికోసం అని నీచానికి పాల్ప డడు." వా.

బ్రతికిన బ్రతు కంతా
అతని అంత గొప్ప జీవిత విధాన మంతా,
"వాడు బతికినబతు కంతా ఆ ఒక్క కేసుతో పాడయి పోయింది." వా. శివముకుంద. 75.

బ్రతికి పోతివి
తప్పించుకొంటివి అన్న అర్థంలో ప్రయోగించేపలుకు బడి.
"గ్రామమున కెల్ల మాలిమి కాఁడ వగుట, బ్రతికిపోతివి పోర బాపనగ రాస." శుక. 2.475.

బ్రతికి పోవు
ఇబ్బందులనుండి తప్పించు కొను.
"ఇప్పుడ మిన్న పాలురు ఁ బ్రతికి పోదురు." భార. శాంతి. 1.62.

బ్రతుక తలచుకొంటే
జీవితేచ్ఛ ఉంటే అన్న మా మూలు అర్థమే అయినా ఇది కొన్ని ప్రత్యేకసందర్భా లలో ఉపయోగిస్తారు.
"నీవు బతక తలుచుకొంటే ఈ వెధవ పని చెయ్యవు." వా.
"బతక తలచు కున్నవా డెవడూ ఇలా చేయడు." వా.
"బతక తలచుకొంటే నీవు ఇకమీద మా యింట్లో అడుగు పెట్ట వద్దు." వా.
"బ్రతక దలచుకొంటే మార్గాలే లేక పోతాయా?" వా.

బ్రతు కాడు
బ్రతుకు.
"తిరుగ బ్రతు కాడ వలె నటే." రాధి. 3.31.

బ్రతుకు చూచుకొను
జీవిక వెదకికొను.
"ఏదేని బ్రతుకుఁ జూడఁగ వల యున్." సింహా. 5.152.
"ఈ పిల్ల లింక నన్ను చూస్తా రనే నమ్మకం లేదు. ఏదో ఒక బతుకు చూచుకోవాలి." వా.
"ఏదో బతుకు చూచుకుందా మని ఈ ఊరు వచ్చాను దొరా!" వా.

బ్రతుకు జీవుడా! అని
1. గొప్ప ప్రమాదము తప్పెను గదా అని ఊరట చెంది.
"బ్రతుకుజీవుడా అని నే నక్కడే ఆ పూట ఉండి మఱునాడు బయలుదేరి వచ్చాను." వా.
2. తప్పినదే చాలు రా అని.
"వాడు బ్రతుకుజీవుడా అని ఆ ఊరిలో నుండి బయట పడ్డాడు." వా.

బ్రతువు తెరువు
జీవనాధారము.

"పాండవులయట్ల రాధాసుతుండు నాదు, పలుకులకు నియ్యకొను నీవు బ్రతుకుఁదెరువు, కట్టు."
భార. కర్ణ. 3.272.

**బ్రతుకు తెరువు చూచుకొను**

జీవనాధారము వెదకుకొను.

"ఏదో బ్రతుకు తెరువు చూచుకొందా మని యింత దూరం వచ్చాను." వా.

**బ్రతుకు నీడ్చు**

కష్టము మీద జీవనము గడపు.

నా. మా. 13.

**బ్రతుకు బండ లగు**

బ్రతుకు చెడిపోవు.

"అదేదో హాయిగా ఉంటుం దని ఆ డబ్బున్నవాడికి ఇచ్చావు. వా డేమో ముండలముతాకోరు అయ్యాడు. దాని బతుకు ఇలా బండ లయింది." వా.

**బ్రతుకు భాగ్యము క్రింద బడు**

బండారము బయటపడు.

ఈ అర్థంలో యేర్పడినవే బ్రతుకు బయటపడు, బతుకు బద్ద లగు మొదలగునవి.

"బ్రతుకు భాగ్యము క్రిందఁ బడఁగ బాపనయిండ్లు, కరిగి యాఁకటికిఁ గూడడిగ ననుచు."
శుక. 2.548.

**బ్రదికి పోవు**

సుఖముగా జీవించు, ప్రమాదములోనుండి తప్పించుకొను.

"వాని బంటున కున్న యైశ్వర్య గరిమఁ, బడసినఁ గుబేరుఁ డైనను బ్రదికి పోవు." శుక. 4.14.

వాడుకలో—

'వాడి కా ఉద్యోగం దొరికితే బతికి పోతాడు.'

'వాడు నేను వచ్చేటప్పటికి లేక పోయాడు గనుక బతికి పోయాడు.'

'సమయానికి వా డెవడో ఆదుకొన్నాడు కనుక బతికి పోయాడు.'

**బ్రద్దలవారు**

వేత్రహస్తులు.

రాజాస్థానాలలో బెత్తాలను చేత పట్టుకొని బరాబరులు చేస్తూ ఉంటారు. వారే బ్రద్దలవారు.

"బ్రద్దలవారిఁ గన్గొని పురంబున నారసి సుప్రసిద్ధులౌ, పెద్దల నెల్ల నిచ్చటికిఁ బిల్వఁడు పొం డన."
చెన్న. 5.235.

**బ్రద్దలు సేయు**

పగుల గొట్టు.

"పటహమహోర్భటుల్ దిశలు బ్రద్దలు సేయ నజయ్యు డై."
ఉ. రా. 3.153.

**బ్రమరి తిరుగు**

చుట్టి తిరుగు.

"బ్రమరి తిరిగి వారిఁ బంట్రెండుదుని యలు, సేసి క్రీడికొడుకు సెలఁగి యార్చె." భార. భీష్మ. 3.97.

**బ్రమరి వాఱు**

చుట్టు తిరుగు.

"బ్రమరివారి కురునృపాలకు నరదంబు,
నందు వైచి యిట్టు లనియె నధిప!"
భార. ద్రో. 5.205.

**బ్రమపెట్టు**
మోహపెట్టు.
"అందఱను బ్రమ వెట్టుచు నవ్వ ధూటి..." హర. 6.104.

**బ్రమల బెట్టు**
భ్రమింప జేయు.
"బటువుగుబ్బలచేత బ్రమలఁ బెట్టుటె కాక." నిరంకు. 2.33.

**బ్రల్లన విఱుగు**
ఫెల్లు మని విఱుగు.
ధ్వన్యనుకరణము.
"పిడుగులు పదివేలు పెట్టి యొక్కడను, పడియెనో యన విల్లు బ్రల్లన విఱిగె." ద్విప. మధు. 9.

**బ్రహ్మకల్పము**
1. అతికష్టసాధ్యము.
2. అతి గొప్ప.
వేమన. 6.

**బ్రహ్మకళ**
చైతన్యశక్తి, బ్రహ్మవర్చస్సు.

**బ్రహ్మకాయ**
గట్టివాడు అని నిరసనగా అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.
"బ్రహ్మకాయవలె వటవట వదరుచున్నాఁడు." సాక్షి. పు. 41.
"కాసైనఁ దనసొమ్ము కర్చు సేయఁడు గాని, పరులసొమ్ము హరింప బ్రహ్మకాయ." రామలిం. 13.

**బ్రహ్మ కైనను వశమా?**
ఎవరికీ వశము కా దనుట అనే అర్థంలో ఈలాంటి పలుకుబళ్లు చాలా ఉన్నవి. 'ఈ పని చేయడం బ్రహ్మ తరం కాదు'
"అకటా! తెలియంగ బ్రహ్మ కైనను వశమా?" హంస. 2.211.

**బ్రహ్మచారి భగన్యాయము**
అజ్ఞానంచేత ఇంతే ఉంటే ఎంతో ఉం దనుకొనుట. బ్రహ్మచారి భగాన్ని గూర్చి అజ్ఞానంచేత అలాగే అనుకొంటాడు కదా! అసలు సంగతి తెలియక అభూతకల్పన చేసుకొనే వారి పట్ల ఉపయోగించేపలుకుబడి.

**బ్రహ్మచెవుడు**
చెప్ప రానంత చెవుడు.
"వాడికి బ్రహ్మచెవుడు. డప్పులు వాయించినా విన బడదు." వా.

**బ్రహ్మజ్ఞాని**
బ్రహ్మను తెలిసినవాడు.

**బ్రహ్మప్రళయ మగు**
అసాధ్య మగు, అతికష్ట మగు.
కొత్త. 238.

**బ్రహ్మబంధువు**
నీచబ్రాహ్మణుడు.

బ్రహ్మముడి

యజ్ఞోపవీతములోని పోగుల ముడిని బ్రహ్మముడి అంటారు.

పెండ్లిలో వధూవరుల కొంగు ముళ్లు కలిపి వేసినముడి అని సూ. ని.

బ్రహ్మరంధ్రము

నడునెత్తి.

శిరోరంధ్రమునకు బ్రహ్మరంధ్ర మని పేరు.

బ్రహ్మరథము పట్టు

మహాగౌరవ మొనర్చు.

"దానిచేత బ్రహ్మరథము పట్టించుకొని రాక పోతినా?"

శ్రవ 2.39.

బ్రహ్మరాత

అక్షరాలు తెలియకుండా రాసినరాత.

"ఈ బ్రహ్మరాతను చదవడానికి ఎవరికి సాధ్యం అవుతుంది?" వా.

బ్రహ్మలిపి

అర్థము కానిది.

శరభాంక. 21.

చూ. బ్రహ్మరాత.

బ్రహ్మలోకపర్యంతము (ఆలోచన యొనర్చు)

చాలదూర మాలోచించు.

"ఏలాగున గెలిపించెనో, బాళి మెయిన్ బ్రహ్మలోకపర్యంతము నే, నాలోచన యొనరించితిఁ, జాలదు నా హృదయ మిది నిజంబుగఁ దెలియన్."

శుక. 3.116.

బ్రహ్మవర్చస్సు

బ్రాహ్మణుని ముఖంలో కాన వచ్చేకళ.

బ్రహ్మవిద్య

చాల కష్ట మయినది.

"అదేం బ్రహ్మవిద్యా? నాలుగురోజులు అభ్యాసం చేస్తే అదే వస్తుంది." వా.

బ్రహ్మవ్రాత తప్పింప వచ్చునా?

విధిని మీఱరా దనుట.

"...నెంతవారికిఁ దప్పింప నెట్లు వచ్చు, బ్రహ్మ దా మున్ను వ్రాసిన వ్రాఁతఫలము."

కళా. 3.100.

బ్రహ్మహత్య కట్టు

బ్రహ్మహత్యాపాపమును అంటగట్టు—

"........సంధ్య వార్చిన ఫలము, బైదలి నీవు నొసంగదఁ, గా దనినం బ్రహ్మహత్య కట్టెదు సుమ్మీ."

శుక. 2.478.

చూ. పాపము కట్టుకొను, పుణ్యము కట్టుకొను.

బ్రాహ్మణవారు

బ్రాహ్మణులు, బ్రాహ్మలు.

వాడుకలో నేటికీ 'మీ రే యిండ్లవారు?' అని అడగడం అలవాటున్నది. కాపువారు,

కమ్మవారువలెనే బ్రాహ్మణ వారు.
పండితా. ద్వితీ. మహి. పుట. 163.

బ్రాహ్మణవ్యవసాయము
లాభసాటి కాని పని.
కష్టపడ లేని బ్రాహ్మణులు చేసే వ్యవసాయం అంతంత లోనే ఉంటుం దనుటపై వచ్చినపలుకుబడి.

బ్రాహ్మణార్థము చేయు
శ్రాద్ధాదులలో నిమంత్రణ ముండు.
"వాడు బ్రాహ్మణార్థాలు చేసి బతుకుతూ ఉంటాడు. అందుకనే రోజుకు రెండూ మూడు కూడా చేస్తా డని ఎత్తి పొడవడం కద్దు." వా.

బ్రుంగుడు వంగు డగు
వాడి వత్తలగు.
"అతిముతి చిచ్చు నాఁ బోగులు నాకట బ్రుంగుడు వంగు డై యొడల్, సురసుర స్రొక్క......"
పంచ. వేం. 4.195.

బ్రుంగుడు వడు
మఱుగుపడు.
"ఎడనెడ బ్రుంగుడువడి యున్న రాజులు, సనుదెంచి కనునవసరము వేచి." భార. శాం. 1.146.

బ్రుంగు వడు
మునుగు.
"సుతకళత్రాదిసకలవస్తువులు వగల, బ్రుంగు వడనిసుఖంబు చేయంగఁ జాల,వు." కవిక. 5.117.

బ్రుస్సుకన్ను
పుసి గట్టిన కన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

బ్రొంగ వోయిన కన్ను
లోతు పడి పోయిన కన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

బ్రొందకన్ను
లా వెక్కిన కన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

బ్రొడ్డుకన్ను
నడుమ ఉబ్బిన కన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

భంగపడు
అవమానపడు.
"మనము పూఁచి పట్టి మొన లేర్చికొని పోవఁ, బాండురాజసుతుల బలము గదిసి, గాసి చేయునదియుఁ గాక నీ ముందటఁ, బవనతనయుచేత భంగ పడితి."
భార. భీష్మ. 3.5.

భంగపాటు
అవమానము.
"ఈ నిర్భాగ్యు ని శేల చూచితిని నాకీ భంగపా టొందె నే, లా."
దశా. 6.79.

భంగపెట్టు
అవమానించు.
"ప్రజలఁ జెఱఁ బెట్టి దొంగలను భంగ పెట్టి, తఱిమి యిబ్బంగిఁ బెక్కుబాధల నలంచి."
భాగ. 10. ఉ. 810.

భంగివోలె
వలె - ఉపమావాచకం.
కుమా. 9.64.
చూ. అట్టులవోలె.

భండన మిచ్చు
కయ్య మిచ్చు, పోరునకు తలపడు ననుట.
"నీ పంత మెలర్ప నా కిపుడ భండన మిమ్ము." భాస్క. కిష్కిం. 160.

భక్తి కడలుకొను
వృద్ధి చెందు.
"ప్రణామంబులు పెక్కు సేసి సంభ్రమ, కలిత హృదయ మగుచు భక్తి గడలుకొనంగన్."
కా. మా. 2.103.

భక్తి చేయు
భక్తి కలిగి యుండు.
రూ. భక్తి సేయు.

భక్తి సేయు
భక్తి చూపు.
"నాకు నీ పెక్కుడు భక్తి సేసి."
భార. ద్రోణ. 2.332.

భగాయించు
పాఱిపోవు.
"పటాపంచలై చాంచల్యంబు నొంది పుళిందులవాఱు భగాయించి చనుటయు." రంగా. 3.126.

భగీరథయత్నం
మహాప్రయత్న మనుట.
"ఎంతో భగీరథప్రయత్నం చేస్తే కానీ ఆ ప్రాజెక్టు మనకు రాదు." వా.
సా. భగీరథప్రయత్నం.

భజన కెక్కు
స్తుతిపాత్ర మగు.
సింహా. 2.113.

భట్రాజుపొగడ్త
అతిశయోక్తులతో నిండిన పొగడ్త.
"వాడి వన్నీ భట్రాజుపొగడ్తలు. నీ యంతమనిషి లోకంలో లే డంటాడు. అవన్నీ నిజ మనుకుంటే యెట్లా?" వా.

భయంబు చూపు
భయపెట్టు.
"శాంత శాంతల యయ్యును జతుర యగుట, దీనికి భయంబు చూపినఁ గాని తనకుఁ, బోషణము లే దనుచు..."
శుక. 4.99.

భరంపడు
భారవహు డగు.
"ద్రోణితోడ భరంపడి రణ మొనర్చు."
భార. కర్ణ. 2.375.

భరతం పట్టు
ఆట ఆడించు, వేధించు.
"వా డేదో మహా మిడిసి పడుతున్నా డట. నేడో రేపో వాడి భరతం పట్టిస్తాను." వా.

భరతపుత్రుడు
నటుడు.

భరతవాక్యము
నాటకము తుదిని చెప్పబడు శ్లోకము.

భరముపడు
భార మని తలచు.

"పసిఁడిసమ్మాళిగలు లేక పాద మిడఁగ, భరము పడురాజు బరిగాళ్లఁ బలివ సాఁగ."
నిరం. 4.67.

## భవితవ్యము (త)

విధి, అదృష్టము.

"ఎవ్వఁ డేని మృతుఁ డౌ భవితవ్యత కారణంబుగా."
కాశీ. 5.48.

"నా భవితవ్యం ఇలా ఉంది. నువ్వు మాత్రం ఏం చేస్తావు?" వా.

## భస్మము సేయు

ధ్వంసము చేయు, బూడిద చేయు.

"పరబలారణ్యంబు భస్మంబు చేసెద."
జైమి. 2.48.

## భస్మస్నానము

శరీర మెల్ల బూడిద పూసుకొనుట.

## భాండప్రతిభాండము

సరుకుకు బదులుగా సరు కిచ్చి పుచ్చుకొనుట.

దీనినే తెలుగులో 'కుండ మార్పుడు' అంటారు. వస్తు వినిమయము అనుట.

## భాగపరిష్కారము

సమిష్టి కుటుంబం ఆస్తిని పంచుకొనుట.

"వాళ్ల ఆస్తి ఇంకా భాగపరిష్కారం కాలేదు." వా.

"వాడు భాగపరిష్కారానికి దావా వేశాడు." వా.

## భాగవత మాడు

ఎగురు, చిందులు త్రొక్కు.

"అతఁ డెగిరి మన శిరోభాగములఁ దాండవించుచు భాగవత మాడు చున్నాఁడు."

## భాజనగతాన్నము

సిద్ధాన్నము.

వంటయింటికుండేలు వంటిది.

"నిజ జయింతురే, యనిమిషు లైన? భాజనగతాన్నమ నే నిఁక నెందుఁ బోయెదన్." ఆము. 6.28.

## భామవేషగాడి బావమరిది

వీడిలో విశేష మేమీ లేదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

భాగ్యవంతుడి బావమరిది లాంటిది. పూర్వం ఏమో రాజశ్యాలకుడు.

"వా డెవ డంటే ఏం చెప్పను? భామ వేషగాడి బావమరిది." వా.

## భారతము

అదో పెద్దకథ అన్నట్లు ఉపయోగించే పలుకుబడి.

"ఆ వెత లెన్ని యైనఁ గల వయ్య మహాత్మ! వచింప భారతంబు."
కువల. 3.72.

"అదంతా ఒక పెద్ద భారతం లే. తర వాత చెప్తా." వా.

## భారతి సేనలు

ఒక దినుసు ధాన్యము.

"లత్తుకబొత్తులు లక్ష్మీమనోహరా,
భారతిసేసలు బాహుపురులు."
హంస. 4.128.

భారీచెయ్యి
దండిచెయ్యి.
"వాడిది చాలా భారీ చెయ్యి. చేతికి
ఎంత వస్తే అంత యిస్తాడు." వా.

భిక్షలోపల భిక్ష
బిచ్చంలో బిచ్చం.
"భిక్షులోపల భిక్ష పెట్టె శ్రీనాథాది,
కవుల కెల్లరకుఁ దిక్కైనమనీషి."
శ్రవ. 1.9.

భిక్షాం దేహి యను
యాచించు.
"...అతఁ డప్పురిలో, భిక్షాం దేహి
యటంచు న, పేక్షం బ్రతిగృహముఁ
దిరిగి భిక్షం బెత్తున్."
హంస. 3.165.

భీమబలశాలి
గొప్ప బలవంతుడు.
భీముడు మహాబలవంతు
డనుట ప్రసిద్ధము.

భుక్తపరుచుకొను
తనదిగా చేసుకొను.
మాటా 31.

భుక్తిగొను
భుజించు.
కాశీ. 2.75.

భుక్తిముక్తులొసగు
ఇహపరసంబంధాత్మక మనుట.
"కొదవ లెన్నవు భుక్తిముక్తులు
నొసంగఁ, జేయుచున్నాఁడ."
విప్ర. 5.69.

భుజములు కాయలు గాచు
బరువులు మోయుటచే భుజ
ములు గంట్లు పాఱు.
చూ. చేతులు కాయలు కాచు.

భుజము లుప్పొంగు
సంతోషించు.
"చేరినప్పటి సరసుని తీరుఁ జూచి,
భుజము లుప్పొంగి హస్తినీపుష్ప
గంధి." హంస. 4.108.

భుజములు మూఁ డగు
సంతోషముతో ఉప్పొంగి
పోవు.
"భుజములు మూఁడై భూభృద్గజ
నాథుఁడు మ్రొక్కి మ్రొక్కి కమనీ
యనుతి, స్రజముల చేఁ దత్పదపం,
కజములఁ బూజింపఁ బూనెఁ
గాంతయుఁ దానున్."
సుదక్షి. 77.

భుజాభోజనము
సంతృప్తికర మయిన
భోజనము.
పాండు. 2.111.

భుజాలు రాసుకొని తిరుగు
అతిస్నేహముగా తిరుగు.
కొత్త. 422.

భుజియించు వదన ముండంగ
గడి సేసి పెడతల గుడుపు
చందము
ప్రయోజనరహిత మైనపని

చేసినట్లు; నో రుండగా వదలి పెడతల అన్నము తినుటకు ప్రయత్నించినట్లు.
పండితా. ప్రథ. దీక్షా. పుట. 202.

భూగృహము
నేలమాళిగ.
(శ. ర.)

భూతకాపు పెట్టు
భూతములు సోకకుండ రక్షరేకు కట్టు.
"భూతకాఁపును బెట్టి విభూతి బెట్టి."
హంస. 3.122.

భూతగెనుసు
గెనుసులో ఒకరకము.
"పొసఁగు తెల్ల గెనుసు భూత గెనుసు."
హంస. 4.131.

భూప్రపంచంలో
లోకంలో.
"అంత పండితుడు ఈ భూప్రపంచంలో లే డని వాళ్ల నమ్మకం."
వా.

భూమంత అరుగులు
జానపదకథల ద్వారా వచ్చినపలుకుబడి.
"ఆకాశమంత పందిరి, భూమంత అరుగు."
వా.

భూమి గలుపు
పాడు చేయు, నేలపాలు చేయు.
"పువ్వుఁదోఁటలు తీఁగెలు భూమిఁ గలిపి."
రుక్మాం. 3.10.
చూ. నేల గలుపు.

భూమి పుండు
చెడ బుట్టినవాడు.
ఒక తిట్టు.

భూమివాటము
నేలరకం.
కాశీయా. 228.

భూయో భూయో అనుకొను
నమస్కారప్రతినమస్కారములు చేసుకొను.
భూయో భూయో నమామ్యహం అనుటపై వైదిక పరిభాషలవలనే యేర్పడిన పలుకుబడి.
"ఏదో భూయో భూయో అనుకొన్నాం తప్పితే ఆ సభలో అతనితో నే నీ విషయా లేవీ మాట్లాడ లేదు."
వా.

భూశయ్యమీద ఉన్నాడు
చనిపోవు స్థితిలో ఉన్నా డనుట.

భేరిని జోకొట్టు
సద్దు తగ్గించ బోయి మఱింత శబ్దము చేయు.
ఏ ఫలితాన్ని గూర్చి పని చేస్తున్నామో అందుకు విరుద్ధమైన ఫలితం కలగనున్నది సుమా అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.
"పట్టి మెఱుంగు పెట్టి సుడువం బని లే

దది యెల్ల భేరి జో,కొట్టుట కా కనిఁ గెలువఁ గూడునె మాటల..."
ప్రభా. 3.72.

భేషజంబు
వట్టి డంబాచారము.
"అది యెల్ల భేషజంబు."
హరి. 3.90.
"వాడి దంతా వట్టి భేషజం." వా.
భేషజం అంటే వైద్యం అని సంస్కృతంలో అర్థమైనా వైద్యుల స్వాతిశయోక్తులను బట్టి తెలుగులో ఈ భేషజం పై అర్థంలో కూడ అయింది.

భేషయిన
చక్కని, ఎట్టిలోపమూ లేని.
అది భేషయిన యిల్లు, భేషయిన ఊరు, భేషయిన మనిషి ఇత్యాదులు.
"అది భేషయినసంబంధం. నా మాట విని చేసుకో. కాదు కూడ దంటే నీ యిష్టం." వా.

భోగించు
భుజించు.
"అంగద భోగించె నా ప్రసాదంబు."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 220.

భోజనోత్తరం
భోజనానంతరం.
కాశీయా. పు. 21.

భ్రమరకీటన్యాయం
పురువులు తుమ్మెదలుగా మారినట్లు.
"భ్రమరకీటన్యాయభావన నొక్కట, రమణి వాయక తనరమణుని నాత్మఁ, దలపోయఁ దలపోయఁ దాఁ బురుషత్వ, మలరుట..."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 225.

భ్రష్టు పట్టు
పాడగు.
"ఆ అమ్మాయిని వాడు భ్రష్టు పట్టించాడు." వా.
"ఆ ఊరంతా వాడు భ్రష్టు పట్టించి పోతిపోయాడు." వా.
"వాడు భ్రష్టు పట్టి పోయాడు." వా.

మంకుఘటము
మొండిఘటము.
"మంకుఘటమ్ములఁ జెంది మిాఱుతఁ.
శ్రీనివా. శీత. 11.

మంకుపట్టు పట్టు
మొండిపట్టు పట్టు.
"వా డాపిల్లనే పెళ్లి చేసుకుంటా నని మంకుపట్టు పట్టుకొని కూర్చున్నాడు." వా.

మంగలమున బెటిలిన పేల గింజవలె
చూ. పెనంమిాది పేలగింజవలె.
"అటువలె నింతి నాజ్ఞ యిడి యామను జేసుఁడు మంగలంబునఁ, బెటిలిన పేలగింజవలె మిక్కిలి పుత్రవియోగ బాధ న,ట్టిటు పడి..." సారం.

మంగలములోని ప్రేలలభంగి
పెనంమిాది పేలగింజలవలె.
"ఊరని దాఘూతపాహతిఁ గరుల తలలు, వ్రస్సి లోపల ముత్యముల్ వరుస మెఱసి, మంగలములోని ప్రేలల

ఖంగిఁ దూలి, ప్రేలి పడఁ గాసెఁ గట్టెండ పిడువరించి.''

కమా. 6.137.

## మంగలము వంటి

కష్టతర మైన.

పొయ్యిమీది పెనము వేడి వల్ల భరింప రాని దనుటపై యేర్పడినపలుకుబడి.

''మండ జఠరాగ్నిఁ దనయులు, చండత మంగలమువంటి సంసారము నిం, కొండుగతి లేదు దినదిన, గండం చేరీతి నడపఁగాఁ దగు ననఘా!''

రాజగో. 2.19.

## మంగలసూత్రము

బొట్టుదారము.

## మంగలస్నానము

శు భ కా ర్యా వ స ర ము లందు చేసెడిస్నానము.

## మంగలాన జాజులు వేచు

లలిత మైన వానిని పాడు చేయు.

జా జి పూ ల ను పెనంమీాద వేయించుట అంతే కదా!

తాళ్ల. సం. 3.

## (పౌరుషమునకు) మంగలికత్తి మ్రింగు

గొప్పలకు పోవు.

నే నెంత గట్టి వాడనో చూడు మని మంగలికత్తి మ్రింగిన ట్లనుట.

''వ్యాసుతాదులం దలఁచి వానికి మంగలకత్తి మ్రింగె దా, సాసల నట్టు చాఁచె దదె యందనిపంటికి బొంది తోన కై,లాసముఁ జేరఁ జూచెదు...''

పాండు. 5.250.

''అనవసరంగా ఇది నెత్తిన వేసుకొని పా డయి పోయాను. పౌరుషానికి మంగలికత్తి మ్రింగితే ఏ మవుతుంది?

వా.

## మంగలిపని

క్షౌరము.

## మంగలిమాధ్యస్థ్యం

చేత కాని పంచాయతీ.

తునితగవు వంటిది.

''మంగలిమాధ్యస్థ్యబుద్ధి మనుచు మది నెంచె నొకో!'' గీర. గురు. 8.

## మంగళం పాడు

ముగించు.

''ఇక ఈ వ్యవహారానికి మంగళం పాడ వలసిందే.'' వా.

## మంగళహారతి పాడు

ముగించు.

రూ. మంగళంపాడు.

## మంగళ్లతిప్పలు రేగువడువున

ఎక్కువగా.

''దూళ్ల మ క్కెక్కి మంగళ్లతిప్పలు రేఁగు, వడువున గాలి నాడెడు సెలకలు.'' ఆను. 6.17.

## మంచపుదోడుగలఅ యగు

రోగగ్రస్తు డగు.

మంచము పట్టు.

మంచము దిగలేని స్థితిలో పడిపోవు.

"తడికంట నెపుడుఁ దఱుఁగక, కడి దఱిఁగిన వడియుఁ దఱిఁగి గాసిం బుడమిం, బడినఁ గన రాక మంచపుఁ, దొడుగఱ లై రట్టె రుజలతో నే మందుణ్." మను. 3.131.
(తెలుగుజాతీయములు)

## మంచముకింద నూయి

కనబడని ప్రమాదము.

"మఱి నా సుద్దులు యెంచఁగ నెంచఁగ మంచముకింద నూయిగుతి, నీ కథ లివి వినఁ బోతే నివే కొండలు గోటానకోట్లు." తాళ్ల. సం. 9.84.

## మంచము గల్గునాడె నీళ్ళాడుము

అన్నీ అమరినప్పుడే ఆపని నెఱవేర్చుకొనవలెను.

ప్రసవించుటకు మంచము అవసరము. అది ఉన్నప్పుడే ఆ పని చేయు మనుటపై వచ్చినది.

'దీప మున్నప్పుడే యిల్లు చక్కబెట్టుకొను' వంటిది.

'గుమ్మడికాయ దొరికినప్పుడే తద్దినం పెట్టు' అనుట కూడా యిలాంటిదే.

"నేఁడు సహాయముం గలిగె నీ కిట మంచము గల్గునాఁడె నీ, ళ్ళాడు మనంగ ముణ్ వినవె..."
నలచ. 5.107.

## మంచము పట్టు

జబ్బు పడు, దిగులుపడి లేవ లేక యుండు.

"వాడు నాలుగు నాళ్ల జ్వరంతో మంచం పట్టాడు." వా.

"కూతురు ముండ మోసినప్పటినుంచీ ఆవిడ పుట్టెడు దిగులుతో మంచం పట్టింది." వా.

## మంచ మెక్కు

జబ్బుపడు.

"ఆవిడ మంచ మెక్కి ఆరు నెల లయింది. ఒక్క మందూ పట్టడం లేదు." వా.

## మంచి అనిపించుకొను

మంచి అభిప్రాయము కలుగు నట్లు చేసికొను.

"ఎక్కడికి వెళ్ళినా నలుగురిలో మంచి అనిపించుకోవాలి గానీ తగాదాలు పెట్టుకొంటే ఏం లాభం?" వా.

## మంచికి పోతే చెడు ఎదు రగు

ఉపకారం చేయుటకు పోగా తన కపకార మగు.

"ఈ ఉళ్లో చావడి కట్టిస్తే అందరికీ బాగుంటుం దని ప్రయత్నించాను. నా ఘనతకోసం చేస్తున్నా నని ఆ పార్టీ వా ళ్లేమో స్థలంమీద కేసు పెట్టారు. తిరగ లేక ఛస్తున్నాను. మంచికి పోతే చెడు ఎదు రయింది." వా.

## మంచికుక్క

వెఱ్ఱి యెత్తని కుక్క.

పిచ్చికుక్కకు వ్యతిరేకము.
బ్రౌణ్.

## మంచిగంగులపాలు

ఆవుపాలు.

గంగగోవు పాలు.

బసవ. 3.62

"గంగిగోవు పాలు గంటెఁ డైనను చాలు." —వేమన.

## మంచి గురస్తు

బలే పెద్దమనిషివి అన్న అర్థంలో వాడినది.

"అమ్మ నేఁ జెల్ల బాఁపనయ్యా! మ తేమి, రజ్జు లాడెదు మంచి గురస్తు వగుదు." శుక. 2.414.

## మంచి చేయు

మేలు సేయు.

"వాడి కంత మంచి చేశానా? కడకు ఒక్క మంచిమాట అన్నాడా?" వా.

## మంచి చేసుకొను

ఇతరులకు తనపై ఆదరము కల్పించుకొను.

"వాడు ఎక్కడికి పోయినా నలుగుర్నీ మంచి చేసుకుని హాయిగా ఉండ గలడు." వా.

## మంచి దను

సరే నను, అంగీకరించు.

"అని సూచించిన మంచి దంచు విని యయ్యబ్జాక్షి నిం గూర్ప నా,తనికిం బాస యొసంగి."

శుక. 1.521.

"క్రీడా, నూనసుఖ మొసఁగి రమ్మన, నా నలినాక్షి యును మంచి దను మ్రొక్కి తగన్." నిరంకు. 3.57.

## మంచిదానవు గలిగితి

బలేదానివి దొరికావు.

"తలిరుఁబోఁడి మంచిదానవు గలిగి తి, ట్లరుగుదెంతు రమ్మ! యధిపుమనసు, విరస మయ్యె నేని." ప్రభా. 5.19.

## మంచినిద్ర

గాఢనిద్ర.

బ్రౌ.

## మంచినీరు కుంచాల బోయు

వట్టిమాటలతో సంతృప్తి పఱుచు, నిరుత్సాహ పఱుచు.

"మాయలం బెట్టుచు నీవు మంచినీరు కుంచాలం బోయుచు."

తాళ్ల. సం. 3.354.

## మంచినీళ్లప్రాయం

అతి సులభము.

"అష్టశతావధానాదిసత్క్రియ మంచి, నీళ్లప్రాయము కలానిపుణ! మాకు." నానా. 1.

"వాడికి కవిత్వం రాయడ మంటే మంచినీళ్లప్రాయం"

చూ. నీళ్లు త్రాగినట్లు.

## మంచినీళ్లు

పానయోగ్య మయిన తియ్యనినీళ్లు.

ఉప్పునీళ్లకు వ్యతిరేకము.

శ. ర.

## మంచినూనె

నువ్వులనూనె.

బ్రౌ.

తలంటుకొను తైలము అని

శ. ర.

నువ్వులనూనె అనుటయే సరి.

## మంచినోరను చేదు నించు

మంచి చేసి శాస్త్ర చెడు

పనితో దాని నంతటినీ పాడు చేసుకొనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"అన్న చెలియలికరణి న న్నాదరించి, మంచినోరను జే దేల నించికొంటి."
నలచ. 6.25.

మంచిపాము

త్రాచుపాము.
శ. ర. వ్రా.

మంచి బంగారము

అపరంజిబంగారు.

మంచిమనసు చేసుకొని

ఉదారబుద్ధితో.

"మీ రేదో మంచిమనసు చేసుకొని దీనికి ఒప్పుకోవాలి." వా.

మంచిమాట

అభినందనవాక్యము, ఆదర పూర్వక మయినమాట.

"పొద్దున్నుంచీ చచ్చీ చెడి ఇంత చాకిరీ చేస్తున్నాడు కదా! ఆ మహాతల్లి ఒక్క మంచిమాట అన వచ్చునా? ఊఁహు." వా.

"మనం ఏం చేసినా ఏం చేయక పోయినా కనీసం ఒక మంచిమా టంటే వాళ్లెంతో సంతోషిస్తారు." వా.

మంచిమాట చేసుకొను

భోజనము చేయు.

"మంచిమాట చేసుకొని మరీ ఊరికి వెళ్లు నాయనా!" వా.

మంచిముట్టు

శుభప్రద మయిన నూలు పోగు అని– సూ. ని.

"గవలధూపంబు సంఘటియించు వారును, మంచిము ట్టెడఁద యోజించు వారు." శివరా. 2.70.

మంచిముత్తెము

ముత్తెపు చిప్పలో సహజ ముగా పుట్టిన మంచి జాతి ముత్యము.

మంచివాడు

సద్గుణవంతుడు.

"అంత మంచివాణ్ణి నే నెక్కడా చూడ లేదు." వా.

మంచివాన

అధికవర్షము.

మంచి వెట్టు

మంచితనము చూపు.

"తనకు ననుకూల యగు నొక్క దాసి తోడ, మాలిమి యొనర్చుకొని యుంచి మంచి వెట్టి." శుక. 3.294.

మంచివేళ

అనుకూల మయిన సమ యము. వాడు వచ్చినవేళ మంచిది.

"సివము పుట్టించి యపుడు చేఁజేతఁ దీసి, కొనియెఁ బుట్టెఁడు విత్తులు పోలుచు మంచి, వేళ వచ్చితి ననుచు భావించుకొనుఁడు." శుక. 2.450.

మంచుకారు

హేమంతఋతువు.
ఆం. భా. 1.86.

మంచు కుంచముల గొలువగల
అసాధ్యపు కార్యములను నిర్వర్తించ గల కడునేర్పరి అనుటలో...
మంచును కుంచాలతో కొల వడం సాధ్యమా?
కుమా. 8.135.

మంచుకొండ
హిమవత్పర్వతము.
"మంచుంగొండ యనుంగుఁ జెండ్లికొడుకున్ మధ్యాహ్నకాలంబు సేవించుచున్." హర. 7.33.

మంచుగొను
మంచు కప్పినది యగు.
"వనజము లెల్ల మంచుగొని వాడినచో నొకపువ్వు నిల్చినన్."
కు. సం. 6.795.

మంచై పోవు
మంచువలె విరిసిపోవు.
"దీర్ఘాయుష్యంబు లభించు రోగములు మంచై పోవు..."
జాహ్నవీ. 3.59.
"పండితారాధ్యులఁ బ్రస్తుతించినను, మండెడిదావాగ్ని మంచయి పోవు."
పండితా. దీక్షా. 2 పా. 2 పం.

మంట గలియు
నశించు.
"అగ్రహారములు నామావశిష్టములయ్యె, మాన్యంబు లన్నియు మంటఁ గలిసె." రామలిం 89.

మంట గలుపు
నాశము చేయు.

"మంటలఁ గలుపుదు మన్మథు శరములు, వేగ నచ్చటి కేఁగి విభునిఁ దెత్తు." కలు. శ. 56.

మంటచమురు
మరుగుతున్న నూనె.

మంట చేసిన పులి
ఆకారం తప్ప తద్గుణం లేని పట్ల ఉపయోగిస్తారు.
మంటితో చేసిన పులికి ఆకారం తప్పితే క్రౌర్యం ఉండదు కదా!
వేమన. 68.

మంట పుట్టు
కోపము కలుగు.
"తీర్థయాత్రాపరాధీనులఁ గనుఁగొన్న, మది నెన్నఁడును లేనిమంట పుట్టు."
నిరం. 2.25.
"వాణ్ణి అక్కడ చూచేసరికి నాకు మంట పుట్టింది. చెప్ప వద్దూ." వా.

మంటమారి
కోపిష్ఠి.
"అప్పుడె మంటమారి కుసుమాస్త్రుఁడు నన్ బ్రదుకంగ నిచ్చునే."
వి. పు. 2.229.

మంటమారి తనము
కోపస్వభావము.
"మంటమారితనంబు మానికిం దగునె శ్రీ" ప్రభు. ౩. 86 పా. 11 పం.

మంట యెత్తు
బాధ కలుగు.
కాలుట మొదలగువాని వల్ల కలుగుబాధ.

"మరుగుడు నూనె చేయిమీద పడి మంట యెత్తుతూంది. డాక్టరుదగ్గర చూపించి మందు వేయించుకోవాలి." వా.

## మంటల మలచిన రూపగు

మంటలతో చేసినది అగు.

"మంటల మలఁచినరూపై, మింట నడరి చూపు చూపు గ్రింగెదఁ గడు." ఉ. హరి. 3.132.

## మంటలో మిడుత బీరము సూపు

అపాయమని తెలియక అపాయము పాలగు.

"శార్ఙ్గితోఁ, బెనఁగుట మంటలో మిడుత బీరము సూపుట గాదె దుర్మతీ!" ఉ. హరి. 3.14.

## మంటిగూండ్లు

ఒక రకమైన పిల్లల ఆట.

"గచ్చకాయలు కిఱ్ఱు గానుగ త్రిప్పుళ్లు, గుఱ్ఱ మెక్కుడు మట్టిగూండ్లు." హంస. 3.146.

## మంటితిండి

తేలు.

సాం. ని. నానా. 83.

## మంటినూనె

మట్టిలోనుండి తీయునూనె. వాడుకలో మట్టినూనె.

చూ. మట్టి తైలము.

## మంటిముక్కెర

అతి సున్నితమనుట.

ప్రతిచిన్నదానికీ నొచ్చుకొనే వారి విషయంలో ఉపయోగిస్తారు.

"దాన్నెందుకు హాస్యం చేస్తావు రా. అది మంటి ముక్కెర. ఏడుస్తూ కూర్చుంటుంది." వా.

"చీదితే పోయే మంటిముక్కెర." సా.

## మండకంచము

అంచు కట్టిన కంచమని

శ. ర.

## మండపప్పు

వేయించిన పప్పు.

"లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు, ఖండంబు చలిమిడి మండపప్పు." హర. 6.55.

## మండాడములు బండాడములు

మాటలు. జం.

"......ఇంక మండాడంబులు బండాడంబులు వృథా కొండాటంబులు మాని శౌర్యంబులు పూని యనిఁ జేసినఁ గాని పోనీయ మనువారును..." లక్ష్మీవి.

## మండాడు

ప్రార్థించు.

"దేవతాకామిను లెల్ల మండాడుటయు."

వర. రా. సుం. పు. 77. పంక్తి. 13.

## మండిగాలిడు

మండెగ వేసుకొని కూర్చుండు,

"మండిగా లిడి దంతశుండాగ్రహతిఁ జించి, జలధరాంభముఁ గరుల్ చల్లులాడ." మను. 5.44.

## మండి పడు

ఆగ్రహాపరవశు డగు.

"అన విని వజ్రి మండిపడి."
నిరంకు. 4.35.

## మండి వెట్టు

ఒంటికాలు ముడిచి మోకరిల్లు.

"ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి వీపున మండి వెట్టిన."
భార. విరా. 2.18.

## మండుకొను

మండు, కోపించు.

"చండ మైనకాలదండంబు దాల్చిన, దండధరుఁడపోలె మండికొనుచు."
భా. శా. యు. 1218.

## మండునెల

వసంతఋతువు.

"మండునెలతోడఁ దనమేనమామ యైన, నిండునెలతోడ."
ఉ. హరి. 2.198.

## మంతన మాడు

ఏకాంత మాడు.

"ఆయితపాటు లెస్స యొంచు దయితతోఁ గపోలములు సోఁకఁగ మంతన మాడె నవ్వుచున్" కళా. 7.155.

## మంతన ముండు

ఏకాంత ముండు.

"మేనకాదేవియుం దాను మంతనం బుండి." హర. 5.11.

## మంతనమున గోడ జేరు

రహస్య మాడుటకై ఒక మూల చేరు.

"అంతట నది యప్పుడె చని, మంతనమున గోడఁ జేరి మండోదరితో, నంతయును దెలిపి..." శుక. 3.273.

## మంతరకాటుక

మంత్రించిన కాటుక.

"అది పెట్టుకుంటే వశీకరణాది సిద్ధులు కలుగు నని మంత్రశాస్త్ర ప్రసిద్ధి."
బస. 5.135.
రూ. మంత్రకాటుక.

## మంతు కెక్కు

ప్రసిద్ధి చెందు.

మంతు అనగా మాట. మాటా మంతీ అనే జంట పదంలోని మంతి కూడా 'మంతు' పదవికారమే. పదిమంది చెప్పుకొను మాటలలోనికి వచ్చు అనేఅర్థంలో ఈ పలుకుబడి యేర్పడింది. వార్త కెక్కు ఇలాంటిదే.

"భువిలో, మంతున కెక్కినట్టిహనుమంతుం గొల్తు నిష్టాప్తికిన్."
దశా. 1.8.

"మంతు కెక్కినయవ్వసుమంతు ననునయించి ప్రియభాషణంబుల హితవొనర్చి." శుక. 1.180.

## మంతురసాని

మంత్రసాని.

పురుడు పోయునది.

పాండు. 4.21
రూ. మంత్రసాని.

## మంత్రకాటుక

వశీకరణాకై మంత్రించి చేసిన కాటుక.

మంత్రశాస్త్రంలో కొన్ని కాటుకలు పెట్టుకుంటే ఇష్టులు వశీకృతు లవుతా రని చెప్తారు.

"మంత్రకాటుక దగన్ ఘాలా ఖుం గూర్పింప న, గ్గిరిజాతాత్మజ వట్టి నాన మరి నింగిం బర్వె నీలాభ్రముల్." కుమా. 6.96.

## మంత్రగాడు

మంతతంత్రము లెరిగిన వాడు.

"అబ్బుర, మగుచుజ్ జగమంత్రగాని యాటయపోలెజ్." అచ్చ. రా. యు. 549.

## మంత్రతంత్రలూలామాలములు

చిన్న చిన్న చిట్కాలు.

మంత్రతంత్రాదు లైన మామూలు తతంగాలు.

"ఈ మంత్రతంత్రలూలామాలములను, నోమలదేహి! నీ కుడుగదు నొప్పి." బస. 6 ఆ. 150 పుట.

## మంత్రతంత్రాలు

మాయలూ, మందులూ.

మంత్రశాస్త్రంలో మంత్రాల వలెనే తంత్రాలూ కొన్ని ఉన్నవి. జం.

"మందులో మ్రాకులో మంత్రతంత్రములో." పండి. ప్రథమ. పురా. పుట. 389.

## మంత్రపునీళులు

మంత్రించిన నీళ్లు.

రోగనివారణకై, భూతప్రేతాదుల పీడాపరిహారార్థమై నీళ్లను మంత్రించి చల్లడం అలవాటు.

"ఇంతలో, మాడిన నేమి చేసెదవు మంత్రపునీళులు సల్ల వచ్చునే?" ఉ. హరి. 2.19.

## మంత్రపునీళ్లు చల్లు

బ్రతికించు.

మంత్రించిన నీళ్లు చల్లి బ్రతికించుట మనకథ లన్నిటా విన వస్తుంది.

"పోడిమితోడఁ గాచి ననుఁ బుణ్యునిఁ జేసినఁ గాక యింతలో, మాడిన నేమి చేసెదవు మంత్రపునీళులు చల్ల వచ్చునే?" ఉ. హరి. 2.19.

## మంత్రసాని

ప్రసవకాలమున పురుడు పోయుస్త్రీ.

రూ. మంతురసాని.

## మంత్రాంగము

మంత్రిత్వము, తంత్రము. శ. ర.

"ఏదో మంత్రాంగం చేస్తున్నట్టుంది. వాళ్లిద్దరూ ఎప్పుడూ ఒకటిగా కలిసి తిరుగుతున్నారు." వా.

## మంత్రించి పొరక తిగుచు

మంత్రము వేసి ఒక పుల్లను దిగతుడిచి పాఱ వేయు.

"దొడ్డజనంబులు మంత్రించి పొరక దిగిచిన నీరు మే పుడిగి గిరులు గ్రక్కదల వాపోవుచున్." మను. 4.37

మంద కట్టు

1. సత్తువ కలిగించుటకై ఆవులు, మేకలు మొదలగు వాని మందలను రాత్రులందు పొలములలో నిలుపు.

"మంద కట్టినందున ఊరిఅవతల పొలం ఈసాలు బాగా పండింది."
వా.

2. గొల్లలు చేసుకొను కట్టడ.
శ. ర.

మందకాడు

పశువుల మందను కావలి కాయువాడు.

"సిద్ధరాముని బంటొ చేరమమంద, కాఁడొ."
పండితా. పురా. 156 పా.

మందగుది

పశువులు కా లీడ్చుకొంటూ నడుచుకుంటినడక.

మందగొను

గుంపు కూడు,

"ఇచ్చోట మంద గొన్నవి, యిచ్చోఁ బానినవి జాడ యిదె యిదె యను చున్." భాగ. 10. పూ. 504.

మందటాడు

కలియు.

"మీఁద మీఁకే మందటాడి మీఁద మీఁరే మీలోన, ఏక మై కూడితిరి మీ రిందుకా యిది."
తాళ్ల. సం. 12.106.

మం దన్న ద్రిమ్మ కెల్ల దెచ్చు

మందుకు కావలసింది ఏ చిన్న ఆకో చాలు. దానికై ఆ చెట్టును చెట్టునే పెల్లగించుకొని వచ్చుట – చూచి రమ్మంటే కాల్చి వచ్చుట వంటిది.

"విరిం, బోనిద్రుమంబు కైకొని పలిఁ మం దన్న ద్రిమ్మ నెల్లఁ దే, నవధిం జెట్టిన." ఆము. 5.74.

మందపట్టు

గోష్ఠము.

పశువు లుండుచోటు.

"మడితోఁటి కళ్ళంబు మందప ట్టనెడి, యడియాసఁ బోకార్చి యంతటఁ బోక." ద్వి. హరి. పూ. 519.

మందపిచ్చుక

మందతో కలిసి యుండు పిచ్చుక.

మం దయి పోవు

అరు దగు.

"అందఱుఁ గా దన్న నవ్వుల మాఁట, మం దయి పోయిరే మానిశేఖరులు."
వర. రా. బా. పు. 174.6.

మందల విడుచు

ప్రాణములతో వదలి పెట్టు.

"తలఁ బెట్టి సహదేవుఁ జులుకన మర్దించి, మందల విడువఁడే మాయ లాని." భార. కర్ణ. 1.42.

మందలో కలియు

గుంపులోఁ కలియు.

"వాడు ఎన్ని తిరుగుళ్లు తిరిగినా ఎలాగో తిరిగీ మందలో కలిశాడు."

వా.

## మందాకు పసరు

ఓషధి పిండిన పసరు.

మందులకు పనికి వచ్చే ఆకులను మందాకు అనడం నేటికీ పరిపాటి. కొన్ని ఆకుల రసంతో బంగారం చేస్తారన్న ప్రతీతి రసవాదులలో కలదు.

"కోట బంగారు సేయుట కొఱకు మున్ను, బ్రహ్మ పిడిచినమందాకు పసరనంగ." ఆము. 2.8.

## మంది

జనము.

నేటికీ రాయలసీమలో వాడుకలో ఉన్నది.

గ్రాంథికంగా చాలమంది, ఎంతమంది, ఇంతమంది–ఏదో సంఖ్యతో కలిసే వాడుక.

"పాడుచు మంది చెంతల కేఁగ, కేశాంతపక్షముల నంతంత నడచుచు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 338.

"మంది యొక్క వయితే మజ్జిగ పలచన." సా.

## మందిద్రవ్యము

నృకేసరి. శత. 60.

చూ. మందిసొమ్ము.

## మందిసొమ్ము

పరద్రవ్యము.

"మందిసొమ్ము తినడానికి అందరూ మొనగాళ్లే." వా.

## మందీ మార్బలం

పరివారం.

"మందీమార్బలంతో సహా ఆమె పుట్టిల్లు చేరింది." వా.

## మందు

అరుదు.

"మతి దానఁ గలిగ నేని కూడగుట మందు." ఆము. 4.127.

"ఆ ప్రాంతంలో బియ్యం మందుకైనా దొరకదు." వా.

మందు అతికొద్దిగా ఉపయోగిస్తారు కనుక అందుపై యేర్పడినపలుకుబడి.

ఇలాంటివి 'కలికానికి లేదు' ఇత్యాదులు.

## మందుకు లేదు

బొత్తిగా లేదు.

"మందునకైన గొలుచిన్న లేక."

బస. 4.97.

"మంచితనం ఆ ఊళ్లో మందుకైనా దొరకదు." వా.

## మందు కైనా

ఏ కొంచెమైనా.

"మందునకైనను ప్రమా కనుపేరు, సెందును లేకుండ నేగుఋ."

బస. 3.65.

"ఇల్లంతా గాలిస్తే మందుకైనా ఇంగువ కనిపించ లేదు." వా.

మందు కైనా (లేకుండ)

ఏ మాత్రం (లేక పోవు), ఏ కొంచెం కూడా.

"మందున కైన భస్మత్రిపుండ్రాంగి, యెందును లేకున్న." బస. 6.154.

"ఇంట్లో బియ్యం మందు కైనా లేవు." వా.

చూ. కలికాని కైనా.

మందుపట్టడ

బాణశాల.

బాణసంచా తయారు చేయు చోటు.

ఆం. భా. 2.25.

మందు పట్టు

ఔషధం గుణ మిచ్చు.

"ఏమందూ ఆవిడకి పట్టడం లేదు. రోగం ఎలా నయ మవుతుందో ఏమో!" వా.

మందు మాకు

జం.

మందులూ మాకులూ— మందూ మాకూ అని వాడుక.

మందులుగా మూలికలూ పనికి వస్తాయి కదా! మందులువలెనే, ఏ చెట్టు ఆకో పసరో కూడా మందుగా ఉపయోగిస్తారు. ఒకే అర్థ మున్న రెండుమాటలతో ఏర్పడిన జంటపదం.

"మందులో మ్రాఁకులో మంత్రతంత్రములో."

పండితా. ప్రథ. పురా. పుట. 389.

"దీనికి మందు మాకే నే మెఱుంగ." బస. 3.74.

"ఎఱుఁగను మందుమాకేమియు." బస. 2.59.

"మందూ మాకూ లేదు - ఊరికే రోగ మెలా పోతుంది." వా.

మందులమార్లు

మందులు మాకులు పెట్టి (పురుషులను) వశం చేసుకొనే వారు-స్త్రీల విషయంలో ఉపయోగించినతిట్టు.

పండితా. ప్రథ. పురా. పుట. 343.

మందులవాండ్రు

మందు లమ్ముకొని జీవించు ఒక జాతివారు.

"మందులవాళ్ల దగ్గర కానీ దీనికి కావలసినమూలికలు దొరకవు." వా.

మందులాడి

వశ్యౌషధములు పెట్టునది.

"మందులాఁడి చెడుగు మాని సిబూతంబు, పిసిఁడి బిచ్చగాండ్ల వెన్నుగుదియ." చెన్న. 2.24.

మందులు తల కెక్కు

దుర్బోధకు చెవి యొగ్గు. వశీకరణమునకు మందులు కూడా ఉపయోగించడం, వాటిని మర్లుమందు లనడం అలవాటు.

'ఏం మందు పెట్టిందో? అట

చెప్పిం దంతా వీడికి వేద వాక్యం' అనుట అలవాటు.

"తులువ చిత్రాంగి మందులు తల కెక్క, నలి రేఁగి భూపతి నామాట వినక, దయశాలి సారంగధరుని నా సుతుని, దయ లేక చంపింపఁ దలఁచి యున్నాఁడు."

సారం. ద్వి. 2.478.

## మందెమేల మాడు

పరిహాస మాడు.

"మెం డొగ్గదవు మందెమేలముల్ మాను." గౌ. హరి. ద్వి. 893.

## మందెమేలములు

హాస్యోక్తులు, సరసములు.

"మందెమేలము లైన మాటలాడఁగ రాదు." రుక్మాం. 4.83.

## మంపుగొను

మదించు.

"మంపుగొని మే యొఱుంగక మలసి మలసి." ఉ. హరి. 4.26.

## మంపు గొలుపు

మత్తిల్ల జేయు.

శ. ర.

## మంబరము చేయు

కాల్చు.

"చేపడఁ బట్టి మంబరము చేసె దిగంబర వేష కృత్య."

ఉ. హరి. 3.153.

## మకరతోరణము

మొసలిరూపు ఏర్పడునట్లు కల్పించినతోరణము.

శ. ర.

## మకరబిబ్బీ

మకరతోరణము.

రూ. మకరబిబ్బి.

## మకరబిబ్బి

"మకరబిబ్బి గురుజాపరుంజు వెలయుఁగా మారుండు ధ్యేయం చనన్."

పార్వ. 2.114.

రూ. మకరబిబ్బీ.

## మకురు పట్టు

మొండికి వేయు.

"శిశువు మకురు బట్టి చెడిపోవును."

కాశీయా. 112.

## మక్కికి మక్కిగా

అసలుకు సరి యైననకలుగా.

"...తెన్గు సేయుచో, మక్కికి మక్కి యన్నటుల మార్చినఁ గావ్యము కావ్యమె ట్లగున్. (తె. జా.)

## మక్కుడు వట్టు

గడ్డ కట్టు.

"యరుల క్రొవ్వేఁడినెత్తురులు పలుమాఱు మక్కుడువట్టి."

వర. రా. యు. పు. 343.9.

## మక్కుడు వేయు

రహస్యముగా దాచు.

"మొగుడికి తెలియకుండా ఆమె చాలా సొమ్ము మక్కుడు వేసిం దని వినికి." వా.

## మక్కు మారుచు

పట్టి పల్లార్చు.

"నిలింపులఁ బట్టి మక్కుమారుచు దైత్యమండలి గలిగి."

వర. రా. కిష్కిం. పు. 506.20.

మక్కువకాడు

ప్రియుడు.

"చిక్కక చక్కంబోవు మక్కువ కానికై పొక్కి తమిం జిక్కి."

ప్రద్యుమ్న చరిత్ర. 3.75.

మగకఅవున పడినగతి

మగవాడే కర వైనట్లు.

"మంజువాణి మనోవ్యథ మగకఅవునఁ, బడినగతి నుండఁ దత్పురప్రాంతసీమ.

శుక. 3.543.

"ఏమి లేశ్ ? వాడికోసమే అంత పడి చస్తావు. మగవాళ్లే కర వయ్యారా యేమి ?

వా.

మగకూడు కుడుచు

పౌరుషముతో బ్రతుకు.

సింహా. 2.134.

మగచెయ్వు

సంభోగము.

"మగలతో నిదురించుమగువల మఱపించి, మగచెయ్వు లొనరింప మదిఁ దలంచు."

నీలా. 1.76.

మగడు విడిచినా మామ విడువనట్లు

అసలువాడు వదిలి పెట్టినా పైవాడు వదలనట్లు.

"మగఁడు విడిచినా మామ విడువని యట్లు, నగినా మనసు గోసినా లోకులు మానరు."

తాళ్ల. సం. 8.220.

మగ డొల్లని యాసతిని మారి యొల్లదు

మగడు ఆదరించక పోతే మారిలాంటిది కూడా ఆదరించదు. అనగా ఎవరూ ఆదరించ రనుట.

"ఎల్లెడ లోకములో మగఁ, డొల్లని యాసతిని మారి యొల్ల దనంగన్."

శుక. 2.116.

మగత్రాడు

మగ తాటిచెట్టు.

"మగత్రాడునందు సుద్భవ, మగుమోసొకటొకటి గాల్చి యజదుగ్ధములన్."

చి. ని.

మగదక్షత

మగదిక్కు.

"వాళ్లింట్లో మగదక్షత లేక నలుగురూ నాలుగుదారు లయ్యారు."

వా.

చూ. మగదిక్కు.

మగదిక్కు

మగదక్షత.

"మగదిక్కు లేనిసంసారంలో పిల్లలు ఒకరిమాట వింటారా ?"

చూ. మగదక్షత.

మగనాలు

జీవద్భర్తృక, ముత్తైదువ.

"మగనాలి సరిపోల్పఁ దగదు విధవ."

కాశీ. 2.83.

మగని గంప బెట్టి యమ్ము

గయ్యాళి యగు.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

'అది మొగుణ్ణి గంపలో పెట్టుకొని అమ్ముకొని వస్తుం' దని కూడా అంటారు.

వేమన. 8.

మగనిల్వు

చేయి పైకెత్తి నిలుచున్న పురుషుని యెత్తు.

"ఇదె నూఱుమగనిల్వు లీ యున్న బిలము."

పండితా. పర్వ. పొ. 386.

మగపంతము

పౌరుషము.

"మగపంతంబున మానసారుఁ డనిలో మా కల్గి పై నెత్తినన్."

దశకు. 2.31.

మగపంద

పిరికివాడు.

"కదలం డేమగపంద కూరుకుగతిన్ గన్మూసి."

భాగ. 9.405.

మగపసరము

ఎద్దు.

"మ్రానును మేరయును మెట్టు మగపసరంబున్."

ద్వా. 9.69.

మగపాటు

పురుషత్వము.

పాండు. 4.274.

మగపాడి

పురుషధర్మము.

"మగపాడి గా దని మది నిశ్చయించి."

రం. రా. కిష్కిం. 203. పొ. 10. పం.

మగపాలు

భర్తభాగము.

"ఈసీరజాతాక్షి మేనిలో సగపాలు, గణుతింప మగపాలు గాఁగ నున్నది."

హర. 3.25.

మగపీచము

పురుషసమూహము.

"వినుము ధృతరాష్ట్రవంశం, బున మగపీచంబు నెల్లఁ బొలియించితి..."

భార. సౌ. 2.91.

మగపురుగు

పురుషమాత్రుడు.

"ఆసభకు ఒక్క మగపురుగు రాలేదు. అంతా ఆడమళయాళం." వా.

మగపోడిమి

పురుషత్వము, మగతనము.

స్త్రీలను సంతృప్తిపఱుచు శక్తి.

"ఇతనికి మగపోడిమియే లేదా యనుచుఁ బొక్కుచు మదిలోన్."

శుక. 1.291.

మగపోల్కికూటమి

పురుషాయితము.

ఆం. భా. 2.108.

మగమాట

పౌరుషవచనము.

"మగమాటల్ మన కేల నాఁ డల హనూమంతుండు లంకాపురం..."

భా. రా. యు. 123.

మగమానికము

వజ్రము.

మగమొలక

పురుషసంతానము.

"దైతేయకామినీసం, ఘాతము మగమొలక లైనకడుపులు డిగ..."

ఉ. హరి. 3.157.

ఇది వాడుకలోనూ ఉన్నది. 'వాళ్లకు అన్ని హంగులూ ఉన్నవి. అంత ఆస్తి ఉంది. అయితే వాటిని అనుభవించ డానికి ఒక్క మొగ మొలక లేదు.'

"నాదు సంపదకు గిక్కగుచుఁ, మొల్క నీ కిఁకం బుట్టునో."

కళా. 4.75.

మగలంజ

విటుడు.

"మలయుచు మురియుచు మగలంజ పోలె." పండితా. పురా. 122.

"లలనలఁ దేర్పఁ జూచు మగలంజియలం గని..." శు. సం. 8.143.

మగలపొల్లలు

మగపోడుములు, పురుష రతులు.

"పొడవు నూడ మగల పొల్లలు నాళుల పొల్లలును నిజంబ పోలె నుండు."

శమా. 11.46.

మగల మగలు

గండరగండడు లాంటిది.

"నయనయుగళి వెలిదామరల మగల మగలై డా లెగయ..."

నాదెళ్ల.

మగలాగు

ఉపరతి.

(శ. ర.)

మగలాడు వారు

మగనాండ్రు.

నేటి వాడుకలో మగనాలు అనే ఏకవచనరూపం. ఇక్కడ మగలు గల ఆడువారు.

"మగలాడు వారికి మరిగి......"

శమా. 7.36.

మగవాడు

మొనగాడు, వీరుడు.

"తెలఁ గొప్ప రాజులఁ దెచ్చితి వేని, మగవాఁడ వన వచ్చు మహిలోన నిన్ను." మైరా. పు. 66.

మగవాని మేలు

పురుషప్రేమము.

"అప్పు డా రాజకీర మిట్లనుచుఁ బలికె, మగువ మగవాని మేలు నమ్మంగఁ దగదు." శుక. 1.344.

మగసిరి

పౌరుషము.

నా. మా. 70.

మగులుగోడ

చుట్టుగోడ, ప్రాకారము.

"మగులుగోడ మీఁద ప్రాఁకు లు చిగురుజొంపములు..." కళా. 3.66

మగ్గపుగుంత

సాలెవాడు బట్టలు నేయుట కై కూర్చుండుపల్లము.

"కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు." హంస. 2.11.

మచ్చు గట్టు

నింద తెచ్చు.

"కూరి మిఁ గొసరుచుఁ గొలిచెద ననుచు, మచ్చు గట్టెడు వీఁడు."

వర. రా. యు. పు. 75.12.

మచ్చనాలుకవాడు

నోట మాట నిలువనివాడు.

"ఆ మచ్చనాలుకవాడికెందుకు చెప్పావు? ఊరంతా దండోరా వేస్తాడు." వా.

మచ్చ మాపు

నశింప జేయు.

"నీ మచ్చ మాపుతాను, చూడు." వా.

మచ్చ మాయ

ఒక తిట్టు.

చూ. మచ్చ మాసి పోను.

మచ్చ మాసిపోను

ఒక తిట్టు.

మనిషి నశిస్తే గానీ మచ్చ మాసి పోదు. దానిపై వచ్చిన పలుకుబడి.

"నీమచ్చ మాసిపోను." వా.

మచ్చుమందు

వశ్యౌషధము.

"మచ్చుమందుల బొమ్మగా మసలవలదె?" శ్రవ. 2.97.

మచ్చుమర లేక యుండు

ఏమాత్రం చెక్కు చెదరక ఉండు.

"సిగ్గుకతమున సకియల చేర్పువాసి, చనువుఁ బరికించుఁ దొడవుల యునికి మట్టు, మచ్చు మర లేక యుండ నేమరక యోము." కళా. 7.102.

మజబాపు

భళా.

"మజ బాపు పండిత మల్లికార్జునుఁడ!"

పండితా. ప్రథ. దీక్షా. పుట. 207.

చూ. చాంగు బళా.

మజ్జన మాడు

స్నాన మాడు.

"ఒడయ చిత్తేశ నాయునికిని మజ్జనం, బాడి శివార్చన మాడ జేసి."

కా. మా. 1.35.

మటమట

కోపమూ విసుగు.

"మటమట యీతనికిఁ గల్గ మర్మమ దేమో!" పాణి. 6.48.

మటమట మాడు

ఆకలిచే నకనక లాడు.

"ఆఁకట మటమట మాఁడుచు."

భాగ. 9.241.

మటమట లాడు

మండు.

శ. ర.

మటుమాయ మగు

మాయ మగు.

"వా డున్నట్టుండి మటుమాయమై పోయాడు." వా.

మటుమాయల బండి

టక్కరి, మాయావి.

"మంకు దిమ్మరి మటుమాయలబండి."

ద్వి. పరమ. 4.298 పా.

మటుమాయలాడు

మోసగాడు.

"మటుమాయలాఁడు కంబళిపురీశంబు."

గౌ. హరి. ద్వితీ. 483.

మట్టపలక

మట్టము చూచెడిపలక.

(శ. ర.)

మట్టమధ్యాహ్నము

నడిప్రొద్దు.

నడినెత్తిమీదికి పొద్దు వచ్చిన సమయము. పగలు పన్నెండుగంటలు.

"మట్టమధ్యాహ్న మిది సుధామధుర వాణి!" పాండు. 1.136.

మట్టము సేయు

నశింప జేయు.

"స్వద్రుతుఁ డైనవాఁడు నిర్మల, మతిచే నఘరాశి నెల్ల మట్టము సేయున్." భాగ. 6.49.

మట్టాడు

చెఱచు, కలతపఱచు.

"అవి పిండు ముసరి మట్టాడునో శ్రీ"

పండితా. ప్రథ. పురా. పుట. 266.

"మలఁగుక మట్టాడు గోరాడు... మాయామృగం బిమ్మలక."

భార. అర. ఆ. 6.

మట్టి కరచు

చూ. నేల కఱచు.

మట్టితైలము

మట్టినూనె, కిరసనాయలు.

మట్టి మల్లాడు

పట్టి పల్లార్చు, చెఱచు.

ధ్వన్యనుకరణము.

"మట్టి మల్లాడిరి మదసామజంబుల, జనపదంబులు తురుష్క ప్రబలము."

సింహాద్రినార. శ.

"......అని తదీయచతురంగబలంబుల మట్టి మల్లాడి చిత్రవధవిహారంబు సలుప...." భార. కర్ణ. 2.343.

"ఎదుర కోతులఁ జుట్టు చుట్టి, మట్టి మల్లాడి పై మార్కొన్నవారి."

వర. రా. యు. పు. 262. పంక్తి. 12.

మట్టుక మీరు

మితి మీఱు.

"మదిని దురాపకోపశిఖి మట్టుక మీర." రాధి. 4.48.

మట్టుకు తెచ్చు

దారికి తెచ్చు.

"మనసు కొందుపాటు మట్టుకుఁ దెచ్చి."

వర. రా. కిష్కిం. పు. 377.22.

మట్టుకు వచ్చు

దారికి వచ్చు, మాట విను.

మట్టు మర్యాదలోని మట్టు ఇది.

"మదిఁ గ్రొవ్వినది సీత మట్టుకు రాదు."

వర. రా. అర. పు. 207. పంక్తి. 22.

మట్టు చేయు

చక్క జేయు.

"మంచిది నీ పని మట్టు చేయింతు, నని కడ లేనికామాంధకారమున."

ద్వి. శ. సా. 1.718.

మట్టు పడు

నిర్మూల మగు.

"భయద, మృగసరీసృపవితతి నిర్మింప నరుఁడు, మట్టు పడ నేసె నాయాయి మార్గణములు." జై. మి. 5.145.

మట్టు పఱుచు

నాశము చేయు, అణచు.

"కూటదానవ భద్రకుంజరంబుల మించు, మదగర్వరేఖల మట్టుపఱుప." రాజగో.1.37.

"పవనసంచార మేర్పడ మట్టుపఱిచి." గౌ. హరి. ప్రథ. పంక్తి. 1556.

మట్టుపెట్టు

చంపు.

"ప్రళయాబ్ధి మోఁకాలిబంటిగాఁ జరియించు, మధుకైటభులఁ బట్టి మట్టు వెట్టె." ఉ. రా. 2.13.

మట్టు మీఱు

మర్యాద తప్పు, హద్దు మీఱు.

"పట్టంబు గట్టుకొన్న గట్టితనంబు నూచి సహింపక మట్టు మీఱిన పాండ్యతుండీర కర్ణాట కరహాటాదులం..." రాజగో. 1.13.

"దనుజవల్లభుడు క్రోధము మట్టు మీఱి." వర. రా. యు. పు. 446. పంక్తి. 17.

మఠము వేయు

తిష్ఠ వేయు.

"వాడు మెల్లగా వాళ్లింట్లో మఠం వేశాడు." వా.

మఠము వేసుకొని కూర్చుండు

స్థిరనివాసము కల్పించుకొను.

"వా డక్కడ బాగా మఠం వేసుకొని కూర్చున్నాడు. ఇంక యెవ్వరూ వాణ్ణి అక్కడనుండి కదపడానికి వీల్లేదు." వా.

మడతనాలుక

మంద మైననాలుక.

"ఆ మడతనాలుకవాడికి పద్య మేం నోరు తిరుగుతుంది?" వా.

మడత వేసి తన్ను

బాగా తన్ను.

"వా డెక్కడో ఒంటరిగా చిక్కాడు. చిక్కగానే నలుగురూ వాడిని మడత వేసి తన్నారు." వా.

మడత్రొక్కు

తాటాకులు మొదలయిన వానిని విడదీసి దొంతిగా పేర్చు.

(శ. ర.)

మడపులేఖ

మడచిన ఉత్తరం.

పొడుగాటి లేఖగా వ్రాసి మడచి పంపడం అలవాటు.

"మడపులేఖయు నంది పడగయుఁ గొనుచుఁ, బడిహారిక్రియఁ బట్టపగతె యేతెంచె." బస. 6.168.

మడమ తిరుగని మగటిమి

శత్రువులకు వెన్ను చూపని శౌర్యము.

మడమ తిరుగుట యనగా వెనుదిరిగి పాఱి పోవుట.

"ఇంత సామగ్రి గలిగి మీ యంతలేసి, మడమ దిరుగనిమగఁటిమి మాఱు మసలు, పద్మనాయకబలముతోఁ బగతు పెనుర, మార్మొగముఁ జూప బాపురే మనల కగునె?" రంగా. 2.44.

మడమలు ద్రొక్కు

వెన్నంటి తఱుము.

"వడిఁ దనరారె నంగజననాథు గుణ క్వణనంబు దానిఁ దా, మడమలు ద్రొక్కుచున్ విశిఖమండలి వెన్కొనియెన్." కళా. 8.119.

మడ మెత్తు పరువు

మడమ కూడ నేల మోప కుండ మునిగాళ్లపై గబగబ పరుగెత్తుట.

"మడ మెత్తుపర్వుతో మంత్రాక్షతము లీయఁ, బాల్పడి భూసుర భార్య లెదుర." శుక. 1.411.

రూ. మడిమెత్తు పరువు.

మడవెట్టు

మడత పెట్టు.

"పెడమాట లన్నియుఁ బెనుమోపు గాఁగ, మడపెట్టి యా చంద్రమతి నెత్తి కెత్తి."

ద్వి. హరి. ఉ. 903 పం.

మడి కట్టుకొను

ఆచారవంతులు నిత్యకర్మలకూ, వంటకూ, భోజనాదులకు ముందు పట్టుబట్టనో, ఉతికినబట్టనో కట్టుకొను టపై వచ్చినపలుకుబడి.

"మడి కట్టుకోండి. భోజనానికి వేళయింది." వా.

"మడి కట్టుకొని వంట చేస్తే కాని మా అత్త భోంచేయదు." వా.

"ఆయన సంధ్యావందనానికి మడి కట్టుకొన్నాడు. ఇప్పుడు ఆయనతో మాట్లాడడానికి వీలు లేదు." వా.

ఇదే మడుగు కట్టుకొను అనే రూపంలో కూడా చాల చోట్ల వాడుక.

మడికట్టు

పల్లపుచేను.

(చి. ని.)

మడి కట్టుకొన్నట్లు

ఏదో మహా నీతిమంతునివలె.

కొత్త. 325.

మడికాసు

వెండి.

"ఒంటిగా మడికాసుగుంటిపైఁ గూర్చుండి, సంజకెంజాయ పెన్ జడలు దాల్చి." నరస. 2.128.

మడిగూటి వృత్తి

దేవునికి పెట్టిన నైవేద్యం తినువృత్తి.

"మా ప్రాణంబులైన, విడుతుము గాక మా మడిగూటి వృత్తి, విడుతుమే."

బస. 7.198.

మడిచేరు

ముందువైపునుండి వెనుకకు దోపుకొనుకొంగు.

"క్రొమ్ముడిసొరుగ్ మడిచేరున్, వడి జాఱున్ బైటఁట వింతవగఁ గనుపింపన్." శుక. 3.17.

మడిమంచుగ

మడి మంచము చేయు, ఛిన్నాభిన్నము చేయు, ధ్వంసము చేయు.

"అ,మనిదొర మంచురాజు మడి

మంచుగఁ గోయిల గంట ప్రోయఁగన్" మను. 6.26.

"బలదేవుఁ డుదతిఁ బరిఘంబుఁ బూని, మలయురుక్మిని మడిమంచంబు చేసె." ద్వి. భాగ. దశ. స్కం.

## మడిమెత్తు పరువు

త్వరత్వరగా పరుగెత్తు. మడమ ఆన్చుటలో కొంత ఆలస్యమగును కనుక అది కూడ లేనంత త్వరగా ననుట.

"మడి మెత్తుపరువుతో మంత్రాక్షతము లీయఁ, బొల్పడి భూసురభామ లెదుర." శుక. 3.315.

రూ. మడమెత్తు పరువు.

## మడియ బెట్టు

బాధించు, కష్టపెట్టు.

"గీ,పెట్టఁగ వచ్చుచున్ మడియఁ బెట్టుచు నెట్టుచు మూట కట్టుగా." సానందో. 2.16.

## మడివాలు

చాకలి,

మడు లనగా చలువ చేసిన బట్టలు; బట్టలను చలువ చేయువాడు అన్న అర్థంలో ఏర్పడినది.

"మడివాలు మాచిదేవయ్యా." పండితా. ప్రథ. దీక్షా. పుట. 211.

## మడిసంచి

మడుగు వస్త్రము లుంచు కొనుసంచి.

"మడిసంచి దోవతి మడతవ్రే ల్దండెంబు, ధమని కుండంబు బృందావనంబు." హంస. 2.138.

## మడిసంది

చంక.

"మడిసంది నునిచిన, తలుఁగులుఁ ద్రాళ్లును దోలఁగ వైచి." హరి. పూ. 7.13.

## మడుగుజీరయందు మసి దాకినట్లు

స్వచ్ఛమైన వస్తువునకు మచ్చ యేర్పడినట్లు.

ఉతికినవస్త్రానికి మసి తాకితే స్పష్టంగా కనబడుతుంది.

"మడుఁగుఁ జీరయందు మసి దాఁకినట్లుమీ, సత్కులమునఁ గల్మషంబు గౌరవేంద్రుకతనఁ బొందె......" భార. ఉ. 1.295.

## మడుగులు వాఱు

మడుగులుగా నేర్పడు.

"ముత్తరంగలన్, మడుఁగులు వాఱి నాభి కెడ మానక చొచ్చె నను క్రమంబునన్." కు. సం. 6.767.

## మడుపుటాకులు

చిలుకలు చుట్టిన ఆకులు.

"కొఱికిన మడుపుటాకులు మోవి కందిచ్చి, యధరాధరము పంట నంట నొక్కి." శుక. 1.303.

చూ. ఆకుమడుపులు.

## మడువుకొను

మడుగుగా నేర్పడు.

"ఆసారవర్షంబులై స్వేదములు గ్రమ్మ, మణికుట్టిమస్థలి మడువు కొనియె." కవిక. 2.126.

మడువులు గట్టు

మడువులుగా నేర్పడు.

"సెత్తురుల్, మడువులు గట్టఁ జేసి బలుమచ్చర మెచ్చఁగ నుచ్చరింపఁగన్." ఉ. రా. 4.349.

మడ్డి వెట్టు

?

"కేసరివోలె లంఘించి పట్టుచును, మాసటీఁడునువోలె మడ్డి వెట్టుచును, మహిభుజంగమువోలె మలకలంగొనుచు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 442.

మడ్డుకత్తి

మోటకత్తి.

మడ్డు వట్టు

తనయెడ అపరాధం లేదని తెలుపుటకు ఎఱ్ఱగా కాలిన యినుపగుండును పట్టుకొని ప్రమాణము చేయు.

పూర్వం ఇలాంటి ప్రమాణాలు చేయడం అలవాటు.

నేటికీ ఎఱుకలు మొదలయిన ప్రాచీనజాతులలో ఈ అలవాటు కానవస్తుంది.

"తన యుదయమె మదిఁ గోరెడు, నను విడిచె నినుండు కల్ల నాయెడ లేదం, ట నెఱుఁగఁ డని పూర్వాశాం, గన జగమున మడ్డు వట్టుగతి శశి మెఱసెన్."

సింహా. 4. 106.

"ఏఁగలలోన నాం డెఱుఁగ నీవె విభుండవు సందియంబు నా, పైఁ గలదేని చూడు మని ప్రాగ్దిశ గౌతమదారజారునిన్, దాఁ గడు నమ్మఁ జేయుటకుఁ దక్కక యెత్తెడునట్టి యెఱ్ఱగాఁ, గ్రాఁగినమడ్డుచందమెసఁగంగను పట్టె నినుండు నుష్ణతన్."

ప్రభా. ఆ. 5.

మణిగాసనము

సన్నసున్నపు పూత.

"మణిగాసనములు ప్రేమ నొనర్చి గోడల." రుక్మాం. 1.118.

మణియాసనమ్ అని తమిళము.

మణిపూస

శ్రేష్ఠుడు.

"ఆ ఊళ్లో కల్లా వాడు మణిపూసవంటి వాడు." వా.

మణియకాడు

గ్రామాధికారి.

"మరిగి తిరుగు సళాదికి మణియకాండ్ర." హంస. 2.48.

మణివకాడు

రూ. మణియకాడు.

మణుగుబువ్వలు

ఒక రకమైన భక్ష్యము.

వీనినే జంతిక లంటారు.

"మణుఁగుబువ్వలు ఫేణీ లొబ్బట్లు కడియపుటట్లు." ప్రబంధ. 112.

మణ్ణాస, పొన్నాస, పెణ్ణాస

భూమి, ధనము, స్త్రీలు — వీనిపై నున్న ఆశ. (అరవము)

ఈషణాత్రయమువలెనే ఈ మూడిటినీ కలిపి తాత్త్వి

కులు భక్తులు అలవాటు చేసినపలుకుబడి.

"మణ్ణాసయుఁ బొన్నాసయుఁ, బెణ్ణాసయు లేనివారిపెన్నిధు లగుటన్."

కా. మా. 3.185.

## మతికి లేదు

జ్ఞప్తి లేదు.

రాయలసీమలో ఒక వర్గంలో ఎక్కువగా వాడుకలో ఉన్న మాట.

"నా కా సంగతి బొత్తిగా మతికి లేదు." వా.

## మతి చొచ్చు

మనసులో చేరుకొను.

"మతి చొచ్చి నీమేను మఱపింతు వోరి." తాళ్ల. సం. 3.10.

## మతి తప్పు

మతి పోయిందా అన్న వాడుకలో వలె.

"ఉమ్మెత్త కాయలు దిన్నయదియొ, మగులు గొన్నదియొ. ముక్ మతి తప్పినదియొ."

పండితా. దీక్షా. ప్రథమ. పు. 115.

## మతి పుట్టు

బుద్ధి పుట్టు.

"...భజించు మతి పుట్టక కంపలఁ బడ్డకాకి నై."

పాండు. 2.184.

## మతి మాలు

(బుద్ధి) భ్రంశ మగు.

"మతి మాలెను తెలివి."

తాళ్ల. సం. 5.63.

## మతి స్థిమితం తప్పు

పిచ్చి యెత్తు.

"వాళ్ల సంసారం అంతా చితికి పోగానే వాడికి మతి స్థిమితం తప్పింది." వా.

"వాడి కీమధ్య మతి స్థిమితం లేక ఊరూరూ తిరుగుతున్నాడు." వా.

## మత్తా గొను

మదించు.

"కహ్లారనీరేరుహాళీ, త్పలధారాళ మరందపానమున మత్తా గొన్నతోలంబపం, క్తులసౌభాగ్యముతో."

వరాహ. 4.115.

## మత్తాయి గొను

మత్తెక్కి యుండు.

"మగువలు పవళించి మత్తాయిఁ గొనుచు, దశకంధరుం డని దండ నున్నట్టి."

వర. రా. సం. పు. 41. పంక్తి. 11.

## మత్తిగాడు.

అవివేకి.

"చిక్కఁ బో నేఁడు నాచే మత్తి కాఁడు."

ద్వి. హరిశ్చ. ఉ. 535. పం.

## మత్తైన లోబడె

?

"మత్తైన లోబడె మన విప్రసహితము."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 120.

## మదట గొను

మత్తత కలిగి యుండు.

"కుదురుచన్నుబ్బల మదటఁ గొనుచు."

సాంబో. 1.168.

మదనచేయు

మిద్దెకడ్డీ.

"పగడంపు ముక్కులఁ బచ్చ టెక్కల నిక్క, చిలుకల మదన చేతుల ఘటిల్లు." రా. వి. 4.85.

మద మెక్కు

మదించు.

"క్రమమునఁ గామము రాగము, దమ మనముల నొదవఁగా మదం బెక్కినవి, భ్రమ మొందుచు."

భార. శాంతి. 2.201.

మద మెత్తు

మదించు.

"మద మెత్తి తన్నుఁ దా మఱచి గోపాల!, సుదతు లింపున నడిమి సూరెల నిలువ." ద్విప. జగ. 165.

మదహస్తిహస్తగతపద్మిని యుం బలె

బాగుగా నలిగిపోయిన — మదపుటేనుగు తొండములో చిక్కిన తామరతీగలాగున.

"అగ్గల మైనమనోజు బాధలం, బడి మదహస్తిహస్తగతపద్మినియుం బలె." పారి. 1.101.

మదికి వచ్చు

ఇష్ట మగు.

"నీమదికి వచ్చినంత మన్నింపు మమ్మ." దేవీ. 3.64.

మది కెక్కు

మనసుకు వచ్చు, ఇష్ట మగు.

"శ్లోటుకాంద్రుడు వి, ఖ్లాత్తక మున్న రాజుమది కెక్కెడునట్లుగ దీని మిత్తి కిన్, బుత్తము." మను. 4.40.

మది చుఱ్ఱను

మనస్సు చుఱుక్కు మను. నిప్పు తగిలినప్పుడువలె అనుట.

"మాంచినయప్పు డెల్ల మది చుఱ్ఱను." జైమి. 1.89.

మది నాటి యుండు

మనసులో మెదలు.

"వాలిపంపునన వచ్చినవా రనుశంక నామదిన్, వారక నాఁటియున్న యది." భాస్క. కిష్కిం. 11.

మది మది నుండు

జాగ్రత్తతో నుండు.

"మది మది నుండి సుమాళించి మర్మ, మిది దెల్పఁగా వచ్చు నివి దెల్ప రాదు." వర. రా. బా. పు. 147.7.

మది మది యయి

మనసు పట్టు లేక.

"మది మది యయి మండి నేఁడు మల హరు వెలిఁగన్." వీర. 1.104.

మది యువ్విళ్లూరగా చేయు

మమత పుట్టించు.

"అవ్వికచాంభోరుహగంధి వాని మది యువ్విళ్లూరఁగాఁ జేయుచున్." శుక. 3.576.

మదిలో మెలగు

ఇష్టానువర్తి యగు.

"పూ.సలలో దారంబుమాడ్కి సతి మదిలోనన్, మెలఁగెడుపురుషుఁడు గలుగుట." పారి. 1.93.

## మదురుగోడ

పైకప్పు కలగోడ.

"మదురు గోడల మెఱపు వాల్మగల యొఱపు, దనర వెలుఁగొందు సాప్రోలు ధరణియందు." రసిక. 1.36.

## మద్దెలకొక్కు

మద్దెల ననుసరించి చిందులు త్రొక్కువాడు.

"మారజిక ప్రయత్నమున మద్దెల కొక్కులు ద్రొక్క నాట్యముల్." గంథ. 9.

## మద్దెలలో నెల్క మర్యాద

ఒకచోట నిలువక తిరుగు.

మద్దెలలో తగులుకొన్న ఎలుకవలె,

అది ఆ ఉన్న పరిధిలోనే అటూ ఇటూ తిరుగుచూ ఎక్కడా నిలవ లేక ఉంటుంది.

"మద్దెలలో నెల్కమర్యాద..." హంస. 1.22

## మధుపర్కము

పెరుగు, నెయ్యి, నీరు, తేనె, పంచదార అను అయిదు వస్తువుల సముదాయము.

పెండ్లిలో కన్యాదాత వరునికి మధుపర్కం యివ్వడం సంప్రదాయం.

## మనం బార

మనసార, మనస్ఫూర్తిగా.

"ఒడలెల్ల మనసకా నొగిఁ జేయవయ్యా, మృడుఁడ యంచుఁ దలంచు వడి మనం బార."

పండితా. ప్రథ. దీక్షా. పు. 186.

## మనం బిడు

మనసు పెట్టు, ప్రియపడు.

"ఆకె మీఁదట మనం బిడెనే నిడుఁగాక యంతటం, బోడిమిఁ బిల్వ బంచె." కళా. 7.210.

## మనంబులు చల్ల జేయు

ఆనందపఱుచు.

"నిర్మాల్యప్రసాదంబుగా విభూతి యొసంగి నీయంగనల సద్ధర్మంబుగా నేలి మామనంబులు చల్లఁజేయు మని యనిపిన..." శుక. 3.613.

## మనం బెరియు

బాధపడు.

"హరియు నిందిరయుఁ గడున్, సమ్మద మునఁ దుంబురుగా, నమ్మను వినుచునికి విని మనం బెరియంగన్."

కళా. 2.80.

## మన కర్మ

మన దురదృష్టం, మనవిధి.

"వ్రేట్లకు నులుకుచు విహ్వలు లగుచుఁ, ద్రట్లంటి చూచుచుఁ దమ కర్మ మనుచు..." బస. 6.164.

"ఔనుఁ. మనకర్మ యిలా ఉంటే ఆయన ఎందుకు బతుకుతాడు?" వా.

## మనకు మనలో

మనలో మనకు.

నేటి వాడుకలో మనలో మనకు అనే కాన వస్తుంది.

"అక్కసెలియండ్ర సంతాన మైన

యట్టి, మనకు మనలోన నింత దుర్మత్స రంబు.'' ప్రభా. 1.76.

''మనలో మనకు తగాదా లెందుకు ?'' వా.

## మన మరయు

మనసును పరీక్షించు.

''మన మరయం దలంచి యొక మార్గము వన్నితో నవ్వుటాలకో.'' పారి. 1.116.

## మన మారు

ఒప్పారు.

''కాలభైరవయోగికంఠకీలితము లై, మనమారునవశంఖమణు లనంగ.'' శివవిలాసము. 1.

## మనము చిక్కు

మనస్సు లగ్న మగు.

అనగా వలచు.

''ధరణీసురనందన! యింక నీపయిన్, జిక్కె మనంబు నాకు నను జిత్తజు బారికి నప్పగించెదో.'' మను. 2.51.

## మనముననే నేలమాలెలు త్రవ్వు

రహస్యాలోచనలు చేయు అని భావం.

నేలమాళిగలు బయటవారికి కనబడనీకుండా భూగర్భంలో కడతారు. అట్లే కొన్ని యెత్తుగడలను తలపోసు కొనుట యీరూపము దాల్చినది.

''దినదినముం దత్తలోదరి, మనముననే యిట్టి నేలమాలెలు ద్రవ్వున్.'' శుక. 2.508.

## మనమున మంట మండు

కోపము వచ్చు.

''మనమునం దలపోయ మంట మండును నాకున్.'' దేవీ. 2.256.

## మన మెరియు

మనస్సు నొప్పి చెందు.

''మన మెరియంగం జెప్పుటయు మానిని కోపము వేడికొంటయున్ ...'' పారి. 2.74.

## మనవి చిత్తగించు

మనవిని విను.

''మనవి చేసెద దేవర మనవి చిత్తగింప వలె.'' శ్రవ. 2.21.

## మనవి చెప్పు

విన్నవించుకొను.

''మనవి చెప్పినరీతిగ నెంచు.'' విజయ. 1.26.

## మనవి సనవులు

జంటపదం.

''మనవిసనవుల కేతెంచి మన్నెవారు.'' సారం. 1.62.

## మనవి సెప్పు

విన్నవించుకొను.

''మనవులు సెప్పక ముందఱ.'' భాగ. స్కం. 335.

## మనవులు సెప్పు

విన్నవించుకొను.

''మనవులు సెప్పినన్ విని ప్రమాదము గల్గినం గాచి.'' రుక్మాం. ౪.౬౭.

మన సగు

ప్రియము కలుగు.

"మించె నూ,ర్పులు మన సయ్యె వెల్మి డికిఁ బుట్టెను జాల నరోచకంబు."

రామా. 3.94.

మనసరి

అభిమానం కలవాడు.

"మనసరి రాకొమరుమూఁక మను మను రీతిఁ." రామా. 1.138.

మనస ఖ్యనాం ఘృత మరో చకమ్

అల్పులకు మంచివి రుచించవు. కుక్కకు నేయి రుచించదు అని వాచ్యార్థము.

ఇట్టిదే 'పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా?'

"మనస ఖ్యనాం ఘృత మరోచక మన్పలు కాచరించునో."

నిరం. 4.36.

మనసార

మనఃపూర్వకంగా.

"నిండుకొఁగిటన్, హల్లకపాణిఁ జేర్చి మనసారఁగఁ బల్కెడు కుల్కు పల్కులన్." రాజగో. 3.83.

చూ. చేతులార.

మన సిచ్చి మాటాడు

ఆదరముతో మాట్లాడు.

విజయ. 3.28.

మన సిచ్చు

ప్రేమించు.

"మన సీక మందుల మాయల మరగించి." కుమా. 8.145.

మన సిడి

మనసు పెట్టి, సావధానముగా.

"మన సిడి యూఁకించి మఱి వ్రేయ."

పండితా. ప్రథ. పురా. పుట. 284.

మనసు కక్కుఱితి

మనసు పట్టలేక చేయగూడని పని కూడా చేయవలెననుఉత్కంఠ.

"మనసు కక్కుఱితి మెల్లన లేచి చేతులఁ, గాంతుని జబ్బుగాఁ గౌఁగ లించు." మను. 3.123.

మనసు కట్టు

మనస్సును నిగ్రహించుకొను.

రామతారక. 7.

మనసు కలుక్కు మను

మనసు చివుక్కు మను.

"ఇ, త్తెఱఁగు వినం గలుక్కు మనదే మగవారి మనంబు."

సార. 3.50.

మనసు కలుగు

ఇష్టపడు.

"ఇటుల నా వైశ్యదంపతు లేపు రేఁగి, మనసు లెచ్చోటఁ గల్గిన మరులు కొల్పి." హంస. 2.244.

మనసుకు మనసు సాక్షి

నువ్వు చేసినపని నీ ఆత్మకు తెలియదా? అనుపట్ల ఉపయోగిస్తారు.

"నువ్వు నా కెంత అపకారం చేశావో నేను చెప్పక్కర్లేదు. మనసుకు

మనసు సాక్షి. నువ్వే ఒకసారి ఆలోచించు.'' వా.

మనసుకు సాక్షి మనసే

నీ మాటలోని సత్యం నీ అంతరాత్మకే తెలుసు అను పట్ల ఉపయోగించేపలుకుబడి.

సంపంగిమన్న. 78.

మనసు గాని

ఇష్టము లేని.

''మనసు గాని యట్టిపని యొనర్చు.''

భార. ఆశ్ర. 1.10.

మనసు చిముడ బెట్టు

మనసును వ్యథపెట్టు.

''చింతచే మనసు చిముడఁ బెట్టు.''

తాళ్ల. సం. 12.202.

మనసు చిల్లులు వోవు

మనసు వ్యథపడు.

''పూఁచిన యొఱపుల బొమ్మముడి జంకెనల, లోఁచకవే మనసు చిల్లులు వోయీని.''

తాళ్ల. సం. 4.8.

మనసు చివుకు మను

నొచ్చుకొను.

''ఈశ్వరుండు మెచ్చి యీకూఁతు నిచ్చుటో, యనుచు మనసు చివుక మనియె నాకు.''

రాధా. 3.8.

మనసు చెడు

మనసు పాడగు.

''మనము సెడకున్నకతన నమ్మదనుఁడతని.''

శ్రవ. 2.62.

మనసుతల్లడము

భయంకరుడు, బెదరు పుట్టించువాడు.

''వేదవాదుల మనసు తల్లడము.''

పండితా. ప్రథ. వాద. పుట. 512.

చూ. నెత్తిగాలము.

మనసునందు పెట్టుకొను

మనసులో పెట్టుకొను.

''ఈ రహస్యంబు మీ మనసునందె పెట్టుకొనఁగ వలయు.''

ప్రభా. 1.113.

మనసున బాఱు

తోచు.

''అనుచుఁ దదుత్సవలీలలు, మనసునఁ బాఱుటయు వివశమతి యై...''

కళా. 6.263.

మనసు నిలువక

మనసును ఆపుకొన జాలక.

''మనసు నిలువక తమి హెచ్చి మాఱు మగల, వెదకుచుండఁగ నప్పుడా వీధి వెంట...'' హంస. 3.136.

మనసు పట్ట లేక

నిగ్రహించుకొన జాలక, మనస్సును ఆపుకొన జాలక.

''మనసు పట్ట లేక యనిమిషకోటితో, నరిగి యతనిఁ దాఁకి యని నొనర్చి.''

హరి. ఉ. 4.204.

మనసు పెట్టి

ఏకాగ్రతతో.

''మనసు పెట్టి 'చేశా వంటే ఇదెంతే మాత్రం నీకు?'' వా.

మనసుపేద

సున్నితమైన మనసు కలది.

"చెలి మిక్కిలి మనసు పేద."
విజయ. 3.50.

మనసు పేద యగు
హృదయహీను డగు.
"పెక్కు లంపటాల మనసు పేద వైతివి."
తాళ్ల. సం. 5.67.

మనసు పేదఱిమి
మనసు పేదతనము.
"దండి వై లెమ్ము మనసు పేదఱిమి విడిచి."
భార. భీష్మ. 1.192.

మనసు మంగళము
మనసు మాత్రం లేదు, హృదయవిహీను డనుట.
"మన సంతె మంగళము మంతనాలు వలెనా?"
తాళ్ల. సం. 3.218.

మనసు మడు గగు
గుండె చెఱు వగు, బెంగపడు, దిగులు చెందు.
"అస్మదీయమహిమ, మహి మడుంగ మడుం గగుమనసు మాయ."
ఉ. హరి. 2.34.

మనసు మెత్తని దగు
లొంగి వచ్చు, లోబడు.
"......ప్రార్థింపంగా వలచి మనసు మెత్తని, దై వాని మనోభిలాష లమరం దీర్చెక."
హంస. 3.33.

మనసు ఱాయి చేసికొను
గుండె దిటవు చేసికొను.
"కట్టిఁడితనమున కిట్లాడి,గట్టి మనసు ఱాయి సేసి కరఁగవు."
మను. 3.95.

మనసులు చల్ల నగు
ప్రసన్నమనస్కత కలుగు.
"మనసులు చల్ల నై మదమత్సరములు, మనుపడ దిగనాడి మోహంబు విడిచి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 713.14.

మనసులో వర్తించు
ఇష్టానువర్తి యగు.
మనసు ఎఱిగి ప్రవర్తించు.
ఇష్టురా లగు.
"అనుకూలవతి నాదు మనసులో వర్తించు, కులకాంత మది నెంత కుందు నొక్కొ."
మను. 2.

మనసు వచ్చు
ఇష్టపడు.
"తనదు చిన్నెలపై యాసఁ దడవు సేయ, నడుగ వచ్చిన మనసు రానట్టి వారి, రట్టు గావించి....."
శుక. 2.105.
నేటికీ రాయలసీమలో 'నీ మనస్సుకు వచ్చినది కొనుక్కో' అనడం వాడుక.

మనసు విప్పి
దాపరికం లేకుండా.
"మనసు విప్పి చెప్తే ఏ దయినా చెయ్యొచ్చు. ముంగిలా కూర్చుంటే ఏం చేస్తాం?"
వా.

మనసు విఱుగు
విరక్తి పుట్టు.
"అ,వ్వనితపయి న్విఱుగదు మన, మను మానము లేదు ధనము ననువుగఁ జేరున్."
శా. మా. 4.31.

"మనసు విఱిగ నేని మఱి మందు లేదయా?" వేమన.
"వాడు నామీద ఏమేమో చెప్పి నా స్నేహితుని మనసు విరిచి వేశాడు." వా.
"వాడు చేసినచేష్టలకి నా మనసు విరిగి పోయింది." వా.

## మనసు సొచ్చు

ప్రేమాస్పదుడగు.

"చుట్టఱికంబునఁ మనసు సొచ్చినను గరఁగించి వేఁడినఁ." భార. భీష్మ. 1.159.

## మనస్సు కొల్లలాడు

మనసు దొంగలించు.

"నీదు మనసు నింత, కొల్లలాడు సకల గుణరాశి మాయమ్మ, గాక వేఱొకర్తు గలదె జగతి?" కళా. 7.33.

## మనస్సులోని బరువు

రహస్యగోపనమువల్లనైన భారము.

"వనజాక్షి యింక దాఁపం, బని యేమి మనంబులోని భర మని పలికెన్." కళా. 1.162.

## మనస్సులో పెట్టుకొను

1. రహస్యముగా ఉంచుకొను.

2. మఱచి పోకుండు.

"ఈ మాట నీ మనస్సులో నే పెట్టుకో." వా.
"వాడే మన్నా మనసులో పెట్టుకుంటాడు. జాగ్రత్తగా ఉండడం మంచిది." వా.
"జరిగిం దేదో జరిగి పోయింది. ఇవన్నీ మనసులో పెట్టుకో వద్దు." వా.

## మన సొగ్గు

1. ఇష్టపడు, అంగీకరించు.

"తడవు గా నచట, మన సొగ్గి నిలువక మఱలంగ వచ్చి." వర. రా. కిష్కిం. పు. 513.21.
"కనుఁగొని యది క్రొత్తగుమ్మ కావున మన సొగ్గి న నదియును నే నొక్కని..." శుక. 1.532.

2. మనసు వచ్చు.

"కనికర మింత లేక తిరుగఁ మన సొగ్గ నటోయి నీవు నా, విని నిజ మౌను......" హంస. 4.228.
"ఇంత నేరము సేయ నేరితి మన సొగ్గ." విప్ర. 5.46.
చూ. మనసు వచ్చు.

## మన సొత్తి చూచు

మనసును పరీక్షించు, పట్టి చూచు.

సరుకు నాణ్యాన్ని తెలుసుకొనుటలో ఒత్తి చూచుటపై వచ్చినపలుకుబడి.

"మనువంశతిలక! నీ మన సొత్తి చూడ." గో. హరి. ప్రథ. పంక్తి. 373.

## మనసొమ్ము కాదు

మనకు ప్రాప్తము లేదు అన్న సందర్భంలో ఏదైనా వస్తువును పోగొట్టుకొన్నప్పుడు అనేమాట.

"......కనికరమున రావే యెంత లేదు పోయినయపుడే, మనసొమ్ము గాదు......" శుక. 2.581.

మనస్తాపము

విరోధము, పగ.

"వాడికీ వీడికీ మనస్తాపంగా ఉంది." వా.

మనికిపట్టు

నివాసస్థానము.

"అట్టి తెలిగట్టు మన్కిపట్టైనదిట్ట." నీలా. 1.12.

మనివి చెప్పు

మనవి చేయు, విన్నవించు.

"మా తెరువు దాను రాకుండ మనివి చెప్పు, చెప్పకుండిన నీ చావు సిద్ధమనుచు." హంస. 3.115.

మనిషికట్టు

అంగబలం.

కాశీయా. 263.

మనిషి మనిషిగా లేడు

యథారీతిగా లేడు.

"ఆ అవమానం జరిగిన నాటినుండీ అతడు మనిషి మనిషిగా లేడు." వా.

మనుగాపు జేయు

రక్షించు.

"శ్రీ వేంకటేశ మనుఁగాపు జేసితివి మన్నించవయ్యా."

తాళ్ళ. సం. 10.208.

మనుగుడుపు పెండ్లికొడుకుల వలె

అత్తవారింట అల్లెము తిను పెండ్లికొడుకులవలె. బాగా తిని బలిసినవా రనుట.

"ఆ నృపాలుడు గావించు నధ్వరముల, నిజహవిర్భాగభోగసంతృప్తు లగుచు, మనుగుడుపు పెండ్లికొడుకులమాడ్కిఁ బుషిత, గాత్రు లై రింద్రుఁ డాదిగాఁ గలుగుసురలు." రామే. 5.51.

మనువు గుడుచు

మనుగుడుపులు గుడుచు.

పెండ్లి అయిన తరువాత పెండ్లికొడుకు కొంత కాలం అత్తవారింటిలో ఉండి విందు లారగించుటకు 'మనుగుడుపులు' అన్నమాటే నేడు వాడుకలో నిలిచినది. పై క్రియారూపం లేదు.

"మనువుఁ గుడువంగ నున్నప్డు మదన వైరి." హర. 5.5.

చూ. మనుగుడుపులు.

మనుష్యులు పోయినా మాట నిలుస్తుంది

మాట తప్పరాదనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

'తనువులు చెల్లును మాటలు నిలుచును' అని నారాయణ దాసు గజేంద్రమోక్షంలో.

మనేదారు

సామంతుడు, అధికారి.

"హెచ్చుమాటల కేమి యింక నొక్కటి మనే, దారులు దారినఁ దార సిలిన." రా. వి. 5.42.

## మన్నన చేయు

ఆదరించు, గౌరవించు.

"విన లే నిట్టివి మానుడు, నను మన్నన చేసి యనుచు నాతుక ద్రొక్కెన్." కళా. 1.61.

## మన్ననమానిసి

గౌరవార్హుడు.

'మన్ననమానిసి వై నీ, వున్నం గడు మేల కాక యొప్పమి గలదే." భార. విరా. 1.128.

## మన్ననారు

శ్రీవిల్లిపుత్తూరులోని దేవుడు.

ఆము. 2.87.

## మన్నమనువు

బ్రతికినబ్రతుకు.

"మన్నమనువు దిమ్మరితనమే." తాళ్ల. 1.19.

## మన్నాస

జీవితాశ (మను+ఆస)

"దివిజుల చెలులు వేగ, విడువు మొం డేని మన్నాస విడువు మొండె." కుమా. 10.142.

## మన్ని గొను

1. చంపు.

"ఘోరనం దారకు మన్ని గొన్నవి,ఖ్యాత మహాప్రతాపునకు." కా. మా. 3.208.

"కన్నుండం గంటిపాపం, గొన్నట్లు మొఱంగి బాలుం గొని పోవుటకై, యన్నను బంధుయుతమ్ముగ, మన్ని గొనకయున్న నేంటిమాటలు మనసున్." ఉత్త. ఆ. 5.

2. పాడు చేయు.

ఉసురు తీయులాంటి పలుకు బడి.

"ఉనిచి నీ కిడం గోరి నేం డొక్క పథికు, మన్నిగొంటి నటంచుం బ్రేమం బు నిగుడ." శుక. 3.208.

"మనంగ నాబుద్ధి వినక నా మన్ని గొంటివి." రామా. కిష్కిం. 3.

"కడిందిమృత్యువు పుష్పగంధి యై చనుదెంచి, ఏ మన్ని గొనియె నే నృపత నూజ." భోజ. ఆ. 6.

## మన్నిల్లు

నేలమాళిగ.

"మన్నింట నేమి కతమున, నున్నది యొ త్తేంగింపు మింత యును దెలి యంగన్." దశ. 8.83.

## మన్ను గొట్టుకొని పోవు

నాశన మగు.

పండిత. 41.

"ఇలా చేశా వంటే నువ్వు మన్ను కొట్టుకొని పోతావు జాగ్రత్త." వా.

## మన్ను నాక్కున్నాడు

చూ. నేల నాక్కున్నాడు.

## మన్నెదొర

ప్రభువు.

"ముదిపాలదిండి చేటు తమ మూంకల కొండలపాటు వేల్పుమ, న్నె దొరల గెల్చునీటుం గని." ఉ రా. 4.306.

## మన్నెముల్లు

మేకల కాలిగిట్టలలో గుచ్చు కొన్నముల్లును తీసేపెద్ద సూది.

**మన్నెరాజు**
సామంతరాజు.
చూ. మన్నెవాడు.

**మన్నెవాడు**
సామంతరాజు.
చూ. మన్నెరాజు.

**మన్మథబాణాలు**
ఒకరకం వడ్లు.
కాశీయా. 223.

**మన్మథవేధదీక్ష**
కన్నెరికము.
"బిడ్డకుఁ మన్మథవేధదీక్ష."
క్రీడా. పు. 63.

**మన్వెట్టు**
(మన్ను+పెట్టు) భూదానము చేయు.
"ఇమ్మహాదురితమున్ మన్వెట్టియున్ ...తప్పింప లే నైతి."
పాండు. 5.41.

**మబ్బుకొను**
మత్తిల్లు.
"మబ్బుకొను వయసు గుబ్బల నిబ్బరం బుగ నివుడుతివుటలఁ."
పారి. 2.52.

**మబ్బు గ్రక్కు**
స్పృహ తప్పు, మబ్బు వచ్చి పడిపోవు.
"పయోదనినదంబునఁ జొక్కుచు మబ్బు గ్రక్కుచుఁ."
పాండు. 4.48.

**మబ్బు చేయు**
తగ్గించు, ఆర్పు.
"మడివాలు కాగడా మబ్బు చేసి నాడు."
వా.

**మబ్బు దట్టిచ్చు**
"నెయ్యా మలరార మబ్బు దట్టియ్యకున్న."
రాధి. 3.130.

**మబ్బులో చేసిన సద్దకుడుము**
అంగసౌష్ఠవవిహీనురాలూ, అనాకారి.
సద్దపిండితో చేసేకుడుములు అసలే ఎగుడు దిగుడుగా ఉంటుంది. ఇక దాన్ని మబ్బులో – చీకటిలో చేస్తే మరీ ఎగుడు దిగుడుగా ఉంటుంది. దానిపై వచ్చిన పలుకుబడి.
"అదేమి పిల్లమ్మా! మబ్బులో చేసిన సద్దకుడుములాగ ఉంటుంది."
వా.

**మబ్బు వొడుచు**
మగత కలిగించు.
"మద మబ్బు బలు గబ్బు మయి బెబ్బులిని నుబ్బు, వడి గొబ్బునను మబ్బు వొడిచె నొకఁడు."
రా. వి. 3.64.

**మబ్బులోని నీళ్లు నమ్మి దొంతి నీళ్లు తెగ గొట్టినట్లు**
ఎప్పుడో ఏదో వచ్చు నన్న ఆశతో ఉన్నది చెఱచుకొన్నట్లు.

"పనివడి మబ్బులోపలి నీళ్లు నమ్మి, దానినీళ్లు దెగఁ గొట్టుదురె వెఱ్ఱులైన." సారం. ద్వి. 1.597.

మభ్యపెట్టు
మోసము చేయు.
"ఆ మాట యీ మాట చెప్పి మభ్యపెట్టి మామయ్యే నన్నీవ్యాపారంలో దించింది. ఇప్పుడే మంచే నష్టం వచ్చిం దని తన కేమీ ప్రమేయం లేదంటాడు." వా.

మమ్మ ఏమఱకు
మమ్మలిని మరిచిపో వద్దు.
మరిచిపో వద్దు అనేరూపంలో ఇది నేటికీ అలవాటులో ఉంది.
"మనోరూప! యేమఱకు మమ్మ." కాశీ. 2.6.
"అత్తవారింటికి పోయినతర్వాత మమ్మలిని మరిచిపో వద్దు తల్లీ!" వా.

మమ్మ మే మెఱుగము
మై మఱచి ఉంటి మనుట.
"మీరు వచ్చుపర్యంతేను మమ్మ మే మెఱుఁగము." విజయ. 1.180.

మయల వోయి మణం గగు
చెడు మంచి దగు.
తాళ్ల. సం. 3.585.

మయిలకన్ను
ఎఱ్ఱవడి పోయిన కన్ను, జేగిన కన్ను.
పండితా. ద్వితీ. మహి. పుట. 108.

మయిలక్రోవి
పిల్లనగ్రోవి.

"మధురగానని నాదముల్ మయిలక్రోళ్లు, వెలయఁ బూరించునాదముల్ గలయఁ బరఁగ."
భాస్క. బాల. 708.

మరగాలు
పెట్టుడుకాలు.
కృత్రిమపాదము.
"మరగాల నడచుచు మట్టగా లగుచు, నొరుగాల నడచుచు ధర గంతు గొనుచు." పండితా. పర్వ. 372 పా.

మరగొమ్మ
గుఱ్ఱము మీద ఆనుకొనుటకై యెత్తుగా ఏర్పఱిచిన భాగము.
"కటివిభాగము నెక్కఁ రాఁ గలరె యబల, వెనుక మరగొమ్మ నూఁతగాఁ గొనుచు ననియె." కళా. 3.62.

మరచుట్టు
మరచీల.
ఆము. 5.124.

మరమేకు
తిరుగుడుచీల, స్క్రూ.
శ. ర. బ్రౌ.

మరుచిలుకు లొత్తు
దంతక్షతములు చేయు.
"నీయధరమందు కొట్టగొన మరుచిలుక లొత్తినది."
తాళ్ల. సం. 12.158.

మరునిల్లు
ఆడుగుఱి.
శ. ర.

**మరుపిచ్చి**

కామోద్రేకము.

"ఈ, దిక్కున నున్నశూద్రసుదతిఁ మరుపిచ్చి రమించినాఁడ."

వేం. పంచ. 4.510.

**మరుపోరు**

సురతము.

**మరులు గొను**

మోహము నందు.

'వయసై అరులు మరులు పట్టినది' అన్న పలుకుబడి లోనే ఈ అర్థంలో ఈ మాట వినబడుతుంది లోకంలో.

"ఉమ్మెత్తకాయలు దిన్నయదియొ, మరులు గొన్నదియొ మఱి మతి దప్పి నదియొ."

పండితా. దీక్షా. ప్రథమ. పుట. 115.

నేటికీ వాడుకలో 'ఎనభయ్యేళ్ళొచ్చాయా? ఆయనకు అర్లు మర్లు పట్టింది' అంటారు. ఉమ్మెత్తకాయ తింటే వెఱ్ఱెత్తుతుం దని ప్రతీతి.

"సొలపువలపును దిలకించుమాడ్కిఁ జూచు, నాటుఁజూపున మరులు కొనంగఁ జూచు." కవిరా. 2.13.

**మరు లెత్తు**

మరులు కలుగు.

"విరహాగ్నిశిఖఁ గ్రాఁగు వెలవెల నగుచు, మరు లెత్తినట్లు పల్మరు చిన్నఁబోవు." ద్విప. కల్యా. పు. 67.

**మరుసుద్ది లేకుండ**

ఇంకొక జోలి లేకుండ.

ఇంకొక విషయముపై మనసు పెట్టకుండ, మాఱుమాట లేకుండ.

"సాధ్వసాద్భుతకరంబు లగుచు మరుసుద్ది లేకుండ నెగయ మీఁటి..."

కళా. 4.110.

**మర్కటముష్టి**

వదలనిది, విడి వడనిది.

కోతి పట్టుకుంటే యిక వదల దని ప్రతీతి.

"ఇట నెన్ని చెప్పినను మర్కటముష్టి విధంబె కాని క్రౌర్యస్థితి నెప్పటి పూన్కి వదలఁ డే మనఁ, గటకట! నలుఁ డింక నేమి గా నున్నాఁడో."

నలచ. 4.264.

**మర్మము సోక నాడు**

నర్మగర్భంగా మాట్లాడు.

"తిన్నఁగ నర్థముల్ తెలుపుతీరున మర్మము సోఁకఁ బాడి క్రేఁ, గన్నుల నవ్వునట్టి..." రాజగో. 2.21.

**మర్మమేలముగా**

వినోదముగా.

"మర్మమేలంబున నొడయనంబి య న్వాఁడు భయం బింత లేక వెడపను ల్వంపఁగ." బస. 4.115.

**మఱగొను**

విమూఢ మగు.

మఱపు చెందినస్థితి కలది యగు.

"సభ్యు లందఱుఁ, మది మఱఁగొన్న యట్టియెడ మానినికిఁ దనుఁ దాన కాచికో, లాదవినదానఁ జేసి."
భా:ర. ఉద్యో. 1.348.

**మఱవ పాఱు**
చెఱువు నిండి ఒక వేపు ఎక్కువైన నీరు పారు.

**మఱు గిడు**
దాచు.
"కొంత మఱుఁ గిడక కలిగిన, యంతయు నిక్కముగఁ జెప్పఁ దమటయు వారల్."  కళా. 6.160.

**మఱుగు చెందు**
శరణు చొచ్చు.
"...సాపరాధుఁ డై, సేవకుఁ డా త్రినామఱుఁగు చెందినచో మదనుజ్ఞ మీఁద సం, భావితుఁ జేసి....."
శుక. 2.248.
చూ. మఱుగు చొచ్చు.

**మఱుగు జేరు**
శరణు చొచ్చు.
"వెఱచి నీమమఱుఁగుఁ జేరితి."
విజయ. 1.158.

**మఱుగు జొచ్చు**
శరణు జొచ్చు.
భయపడి ఒకరివెనుక చేరి దాగుట ద్వారా వచ్చిన పలుకుబడి. మఱుగు–చాటు అని అర్థం.
"స్వరునిష్ఠురాఘాత సంక్షోభమున కల్కి, మైనాకుఁ డెవ్వాని మఱుఁగుఁ జొచ్చె."  శుక.1.194.
గౌర. హరి. ద్వి. 2460.

**మఱుగుజ్జు**
గూనివాడు.

**(పెద్దల) మఱుగున మెలగువారు**
సమష్టి కుటుంబంలోని కోడండ్లు— అత్తచాటు కోడండ్లు.
"పెద్దల మఱుఁగున మెలంగుకురంగనయన లరుగుదెఱం దగినమదిరామందిరంబని .."  శుక. 3.115.

**మఱుగుదొడ్డి**
మలవిసర్జనము చేయు చోటు.
శ. ర.

**మఱుగుపడు**
చాటగు, దాగు.
"అవి యచ్చోటన పాఱంజల్లి తన పల్లెకుం బోయి మఱుఁగుపడి యుండె."  కాశీ. 5.70.

**మఱుగు పెట్టు**
దాచు.
"మఱుఁగుపెట్టక చెప్పుమా నీవ నిట్టి, నెగులింతయును నేమి నెపమున వచ్చె."  ద్వి. హరిశ్చ. ఉ. 2103 పం.

**మఱుగుపెరడు**
చూ. మఱుగుదొడ్డి.

**మఱుమాట**
బదులుమాట.
ఆం. భా. 1.114.

**మఱువెట్టు**
మఱుగు పెట్టు.
ఆం. భా. 3.115.

**మఱుసంజ**

సాయంసంధ్య.

"ఒకదివిఁ దొలుసంజ యున్నేమమునఁ బొందు, నుదయించు మఱుసంజ యొండుదివి." కాశీ. 1.129.

మలుసంజ అని శ. ర. పాఠము.

**మఱ్ఱిమాని పంట**

మఱ్ఱిచెట్టు ఎంత పెద్దదో మఱ్ఱికాయ అంత చిన్నది. అందుపై వచ్చినపలుకుబడి.

"మలయుచుఁ దమలోని మఱ్ఱిమాని పంట..., యిరవై శ్రీ వెంకటేశ్వరు." తాళ్ల. సం. 11.47.

**మఱ్ఱెత**

మూర్ఖురాలు.

"మఱ్ఱెతవోలె మాపడుచు మార్మసలక..." హైజ. 4.12.

**మలకతూము**

పదికుంచముల పరిమాణము కల కొలత.

(శ. ర.)

**మలకపుట్టి**

ఇన్నూఱు కుంచముల పరిమాణము కల కొలత.

**మలకమెఱుపు**

ధనురాకారము కల మెఱుపు.

**మలకల మాటలు**

శుష్కప్రియాలు.

"మలకలమాట లిందు బహుమానము లిచ్చుట." రాధ. 4.72.

**మలగుటొఱగు**

ఱుంక్రడని దిండు.

"సెరయఁ గుంకుమపువ్వు నించిన మలఁగు, టొరగుపై నొయ్యార మొలయంగ నొరగి."

ద్వి. పరమ. 3. పు. 193.

**మలమల మఱగు**

సలసల క్రాగు, వ్యథపడు.

"మదిలోన మలమల మఱుగుచున్నాను." ద్విప. జగ. 160.

ఇట్టివే 'మలమల మాడు' ఇత్యాదులు.

**మలసి మట్లాడు**

విజృంభించు.

"అని పల్కి యంతంత యతిశయంబైన, మనసిజానలము పై మలసి మట్లాడ." ద్విప. కల్యా. 138.

**మలసి యాడు**

వీచు.

"మారుతంబులు నామీఁద మలసి యాడ." ఉ. హరి. 2.173.

**మలికితవడు**

సందేహించు.

"అన్యాపదేశముల, మనసుఁ గొర్లఁగ నాడ మలికితవడుచు."

ప్రభులిం. 3.32.

**మల్ల చఱచు**

జబ్బ చఱచు.

"మల్ల చఱచికొనుచు మహి పాద ఘట్టనఁ, దల్లడిలఁగఁ జేసి." కా. మా. 4.190.

మల్ల చఱచుకొను

జబ్బ చఱచు.

కుస్తీలకు పోయేవాళ్లు జబ్బలనూ, తొడలనూ చఱచుకోవడం అలవాటు.

"మల్ల చఱచుకొనుచుఁ బటుసమర దోహలి యై." జైమి. 6.135.

మల్లడి గొను

1. విజృంభించు.

"బల్లిదుం డయి మల్లడి గొని మార్కొనుమగలు లేక." భార. భీష్మ. 3.248.

2. కలత చెందు, సంఘర్షణ పడు.

పాండు. 4.293.

3. ఎక్కువై మరల బడు. రాయలసీమలో 'నలుగురు మనుషులకు ఆ యెద్దు మల్ల బడింది' అంటారు. అందుకు దగ్గఱగా ఉందిది. పద టిప్పణిలో పెనగు అని అర్థమిచ్చారు. అది కుదరదు.

"జగము లెల్ల నిమ్మ సొలక మల్లడి, గొనియె గుహుబలంబు కొలఁది మిగిలి." కుమా. 11.12.

"మనమున రోషాద్భుతములు మల్లడి గొన." జైమి. 2.42.

మల్లడి సేయు

పరితాపము కలిగించు.

"దుశ్శీలుఁడు మన్మథుండు తన చిత్తము మల్లడి సేయ బోంట్లతో." గంధ. 116.

మల్లామడి యగు

పాడగు.

"మతి చెడి మల్లామడి యై యేపు చెగియవురుసవు రై." ఉ. హరి. 1.148.

మల్లు పెనంగు

మల్లయుద్ధము చేయు.

"ఉదగ్రపరాక్రమంబులన్, మల్లు పెనంగునంత మురమర్దను ముష్టిహతాఖిలాంగుఁ డై." వి. పు. 6.268.

మల్లెపడు

కలుపు మొక్కలు ఎక్కువగా పెరుగు.

సహజంగా అలాంటప్పుడు పైరు నశిస్తుంది.

ఒకరకమైన కంపమొక్కలను నాగమల్లె అని దక్షిణ ప్రాంతాలలో అంటారు. దానినే రాయలసీమలో చపాతీ, పాపచ్చి కళ్లి అని అంటారు.

"పటిపటి యై యవియు మల్లెపడి చెడి పోయెన్." కా. మా. 3.152.

మల్లె వట్టిన చేనిక్రమము

మల్లె పట్టిన చేనువలె.

మల్లె ఒక రకమైన తెగులు.

ఆమల్లె పట్టిన చేను సర్వనాశన మై పోతుంది.

"ప్రజ మారి మసఁగినట్లు, తీఱెఁ గతిపయదినముల దేశ మెల్ల, మల్లె వట్టిన చేనిక్రమంబు గాఁగ." మను. 5.26.

మవ్వ మారు

సుకుమార మగు.

"మధుసమాకలిత మై మవ్వ మారిన మారు, నవలత నా మేను నవక మెక్క." కు. సం. 3.317.

మవ్వ మెక్కు

కోమల మగు.

"వేసవి వడగాలి నోసిన లేఁదీఁగ, క్రొక్కారు గని మవ్వ మెక్కునట్లు." కు. సం. 7.197.

మసకంబున బెనంగు పాముల పగిది

పచ్చికసితో—

"యదువీరుండు తోడన యెత్తికొన్న నిసువుర గదలును మసకంబునం బెనంగుపాములపగిదిం." ఉ. హరి. 3.64.

చూ. మసకపు పాముకాటు.

మసకతిత్తి

1. సుతి పట్టు తోలుతిత్తి.

2. పన్నీరు మొద లయిన వానిని నింపెడితోలుతిత్తి.

మసకపు బాము కాటుగతి

సంభోగిస్తున్న పాము యొక్క కాటు వలె.

సామాన్యంగా సంభోగసమయంలో చెనకితే ఏ జంతు వైనా కోపఘూర్ణితం కావడం సహజం.

"మసకపుఁబాముకాటుగతి మత్సర మన్విస మగ్గలింపఁగన్." పారి. 1.110

మసకొను

సంభోగేచ్ఛ గొను.

"ప్రాణనాయికతోడఁ బర్యంకసీమల, మసకొని పెనఁగుసంభ్రమము విడిచి." కాళ. ఆ. 2.

దాశ. 7.

మసకొల్పు

వశపఱుచుకొను.

"చల్లని బెల్లి మాటలపసఁ మస కొల్పుచు నెల్లవారలన్." కవిక. ఆ. 3.

మసమసకని చీకట్లు

కనుచీకటి.

క్రీడా. పు. 89.

మస రిడు

పొగ రెక్కు.

"మస రిడి మత్స్యమాంస మనుమానము లేక భవద్గృహంబునన్." చెన్న. 4.343.

మసరు కవియు

పొగ రెక్కు.

"మహిషుఁ డెప్పుడు మదమున మసరు కవిసి, కలఁచు చున్నాఁడు త్రిభువన కమలవనము." మార్కం. 6.67.

మసలుకొను

వెనుదీయు.

"సిగమీఁది విరవాది చేర్చుక్కపసఁ గాంచి, మఱి వసంతుఁడు కొంత మసలు కొనఁగ." పాంచా. 4.15.

మసి చేయు

కాల్చి వేయు.

"మా డెములు ప్రేల్చె నొడ్డాది మసి యొనర్చె." మను. పీఠిక. 37.

మసిపాతలో మాణిక్యము

తగిన పరిసర పరిస్థితి లేకున్నా అది మాణిక్యమే. హీనమైనచోట అర్హమైన వస్తు వున్నప్పుడు – అంటారు.

"మసికప్పడమునఁ గప్పఁ బడియు, నివిడి వెలుంగు మాణిక్యంబునట్లు."

పండితా. ప్రథ. పురా. పుట. 391.

చూ. బొగ్గుల్లో రామచిలుక.

మసిపాతలో మానిక మట్లు

"...శుచితా, నిత్యంబుగఁ దత్తను సాంగత్యము మసిపాఁత మానికంబై యొదుగఁ౯." ఆము. 6.5.

చూ. మసిపాతలో మాణిక్యము.

మసిబుడ్డి

సిరాబుడ్డి.

శ. ర.

మసి ముట్టు

వ్యర్థమగు.

"ఇంతింత పౌరుషము లొంగ్కింతయు మసి ముట్టకుండ నిటు సేయఁగ."

హరి. పూ. 8.117.

మసి మోచు

మాయు.

"వారిలో, మొగఁ దగువాని కింత మసి మోవక త్రుంగుట యెట్లు సైన్యముల్." జై. భా. 2.48.

మసి వోవు

వ్యర్థమగు.

"మొగఁ దగువాని కింత మసి వోవక త్రుంగుట యెట్లు సైన్యముల్." (తె. జా.)

మసు మసుక కన్ను

మసక మసకగా కనిపించే కన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

మహా చెడ్డ

ఎక్కువ.

మహా చెడ్డకోపం, మహా చెడ్డ చిరాకు ఇత్యాదులు.

"వాడికి మహా చెడ్డకోపం. వాడి దరి దాపులకు పోవడానికే భయ మేస్తుంది." వా.

చూ. మా చెడ్డ.

మహాదర్శనం బుండు

కొలువు తీరి యుండు.

"పరమేశ్వరుండు మహాదర్శనం బుండె నంత." కుమా. 8.2.

మహానటుడు

శివుడు.

"నటనోద్భటుఁడైనమహానటుని జటాజూట మురలిన దొరఁగుమురుత్కటక నది." పాండు. 1.138.

మహాప్రసాద మను

ప్రభువులో, గురువులో ఏదైనా యిచ్చినపుడు ఏదైనా చేయమని చెప్పినపుడు ఎదుటివాడు చెప్పు మాట.

"కర్పూరతాంబూలంబు వెట్టినం బట్టి మహాప్రసాదం బని మోదంబున." మను. పీఠిక. 17.

మహాప్రసాదము

చిత్తము.

ఎవ రైనా పెద్దవారు ఏ దైనా చెప్పినప్పుడు ఇతరులు అనుమాట.

'పాదోదకం చ నిర్మాల్యం, నైవేద్యం చ విశేషతః, మహాప్రసాద ఇత్యుక్త్వా, గ్రాహ్యాం విష్ణోః ప్రయత్నతః' అని శాస్త్రం.

హార. 2.55.
కాశీ. 2.31.

మహాప్రస్థానం

లోకాంతరయాత్ర.

మహా మహా వారు

గొప్ప గొప్ప వారు.

"ఈ విషయంలో మహా మహా వాళ్లే దిక్కు తోచనిస్థితిలో పడుతుంటే మనసంగతి లెక్కేమిటి?" వా.

మా అమ్మతోడు

చూ. మా అమ్మసాక్షిగా.

మా అమ్మ సాక్షిగా

ఒక ఒట్టు.

"మా అమ్మసాక్షిగా నా కా సంగతి తెలీదు." వా.

చూ. మా అమ్మతోడు.

మాకు ఎవ్వ రున్నారు?

దిక్కు లే రనుట.

"ఈ కొద్దివాక్కేల నిహపరంబులకు, మా కెవ్వ రున్నారు? మధుకైటభారి!" ద్విప. కల్యా. 106.

మాకు గా

మాకోస మని అయినా.

"ఇంచుక తడ వుండుము మాకుఁ గాను దాలిమితోడన్." కళా. 7.212.

"మాకు గా నైనా నువ్వు ఆ పెళ్లికి తప్పక రావాలి." వా.

మాకు గుడుము మీకు వ్రక్క

మాకు మాత్రం అంతా కావాలి – మీరు ఈ కాస్త తీసుకోనండి అనుట పక్షపాతము కదా! అందుపై యేర్పడి 'ఇది న్యాయమా?' అనురీతిని ఉపయోగించే పలుకుబడి.

"ఎదిరిం దమయట్టుల కా, మదిఁ దలంచినఁ బొసఁగుఁ గాక మాకుం గుడుమిం, డిదె మీరు వ్రక్కఁ గొనుఁడని, చదు రడిచిన మనసు పొందు చక్కం బడునే?"

భార. ఉద్యో. 1.312.

మాకు పని కాదు

మా కిక్కడ పని లేదు.

"వనిత భాగ్యంబు దేవర చిత్తము మాకుం బని గాదు నీ పాదంబు లాన."

తాళ్ల. సం. 3.23.

మాకు మీకును గారణం బేమేని గలదె?

మీకూ మాకూ మధ్య ఏమైనా వ్యవహార మున్నదా? సంబంధ బాంధవ్యా లున్నవా? ఏమీ లే దనుట.

"పోదురు గాక మీ పోయెడిత్రోవ, మాదిక్కరయ నేల మాకును మీకుఁ, గారణం బేమేనిఁ గలదె?"

పండితా. మహి. ద్వితీ. పుట. 163.

మాకు వచ్చెను

మాకు లభించినట్లే భావించె దము అనుటలో వచ్చు పలుకుబడి – నీ విచ్చినట్లే. ఇవ్వ నక్కఱ లేదు అనుటలో.

"నీ యీగి వేయును మాకు వచ్చె—"
పండితా. ప్రథ. పురా. పుట. 362.
"...మాకు వచ్చె" మను.

మాగాయ

మామిడికాయలతో తయారు చేసెడి ఒక రకం ఊర గాయ.

మాగుడు వడు

మాగునట్లు చేయు, మలిన మగు.

"తన శౌర్యదీప్తిచే నినబింబ మన యంబుఁ, బగ లెల్ల మాఁగుడు వడఁగఁ జేసె." మొల్ల. బాల. 19.

మాగుడు వాఱు

మాయు, మలిన మగు.

"ఉడురాజమండలంబు మాగుడువాఱి కానిపించె." ప్రభా. 5.57.

మాగు వడు

పరిణతి చెందు.

"సురుచిరకిరణవిస్ఫురణంబు డింది యెం,తయు మాఁగు వడినమార్తాండు పగిది." మార్కం. 1.169.

మాగువాఱు

పరిపక్వ మగు.

ప్రస్తుతప్రయోగంలో చంద్ర మండలము మాగు వాఱిన దన తెల్లవారిన సమయ మప్పటి దనుట.

"మాఁగువాఱినచంద్రమండలంబునుబోలె, వదనారవిందంబు వన్నె దఱుగ."
ఉ. హరి. 1.178.

మాచకమ్మ

వయసు చెల్లినా సమర్త కానిది.

కాశీ. 3.171.

"మాచకమ్మ సమర్త మఖ అయితే నేమి పుబ్బ అయితే నేమి ?" సా.

మా చెడ్డ

చాల, ఎక్కువ.

చూ. మహా చెడ్డ.

మాట

ఏదైనా పనిబడి పిలిచే టప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"అబ్బాయీ ! మాట. ఇలా రా."
వా.

మాట అమ్మై తాకు

బాధ కలిగించు.

మాట సూటిగా బాణమువలె తాకు.

"అనిన, నామాట తనకు నమ్మై తాకటయును."
ద్విప. కల్యా. పు. 125.

మాట కడుగు దాటు

మాట మీఱు.

"తరుణి నా మాట కడు గడ దాటి వెఱతు, వతివ నా మానసముఁ జిఁ

బాయక వసింతు, వింతి నా కన్న
పెన్నిధు లెన్ని చూడ, లలన నా
పూజ్యసామ్రాజ్యలక్ష్మి వీవు.''
హరి. 4.61.

## మాటకారి

చక్కగా మాటలాడ గల శక్తి కలవాడు.

''తగవరి మాటకారి నయధన్య పదార్థ
ముపట్ల మిక్కిలిన్, దెగువరి.''
నిరం. 2.34.

## మాటకు

మాటవరుసకు.

''ఒకమాటకు నంటివో లేక
తథ్యమో ?''
నిరం. 4.55.

## మాటకు మాటగా

మాట మీద మాట గా, సంభాషణవశాత్తూ.

''అగుచున్ మాటకు మాటగా వరుస
తో హంసీకులోత్తంస మా,తనికిన్.''
ప్రభా. 4.72.

## మాటకు బొంకు కలుగు

చెప్పినమాట అబద్ధ మగు.

''గౌరిమాటకు బొంకు గలుగ
దనుము.''
ప్రభా. 1.128.

## మాట కుఱుచ సేయు

మాట కించపఱుచు.

''ఇచ్చెద నొకవర మనినను, జెచ్చెర
నామాట కుఱుచ సేసెను సభ నీ,
పొచ్చెము వాయుటకొఱకై, యిచ్చెద
బ్రహ్మాస్త్ర మైన నీతని కనుచున్.''
విక్ర. 2.35.

## మాట కెదురు లేదు

చెప్పినమాట చెల్లి తీర వలసిందే. అంతటి పలుకుబడి కల దనుట.

''ఆ ఊళ్లో ఆయన మాట కెదురు లేదు.
ఎంతవాళ్లైనా ఆయ నంటే గడగడ
లాడి పోతారు.''
వా.

## మాట గడచు

మాట మీఱు.

''నా మాట గడుచుట న్యాయంబు
గాదు.''
పల. పు. 39.

## మాట గుత్తుక దగులు

గొంతులోనే మాట మిగిలి పోవు - అనగా మాటలాడ లేక పోవు అనుట.

''పదములు, గుదిగొనఁ దత్తఱపుమాట
గుత్తుక దగులన్.''
ఉ. హరి. 3.136.

## మాట గైకొను

మాట విను.

''పతిభక్తికతంబునఁ దల్లి మాట
యొకింతయుఁ దాను గైకొనక—''
కళా. 4.96.

## మాట చెడు

మాట పోవు.

''మాట చెడి ముదిసి ముప్పున.''
రాధా. 3.49.

## మాట చెల్లించు

మాటప్రకారము నడచు.

''నెలకొన్నభయము, మానఁ జేయుము
తండ్రిమాట చెల్లించి.''
వర. రా. అయో. పు. 326. పంక్తి. 15.

మాట జారు

పొరబాటుగా నోటినుండి మాట వెలువడు.

చెప్ప కూడని మాట చెప్ప డంతో ఇబ్బంది వచ్చినప్పుడు ఉపయోగించే పలుకుబడి.

"మాట జారిం తరువాత యే మనుకొని యేం లాభం?" వా.

మాట తప్పదు

నే నన్నట్టే అయి తీరుతుంది.

"తప్పనె నాదుమాట యది ధాత లభించినవ్రాఁత సుండు..." కళా. 5.221.

మాట తీఱు

మాట నెఱవేరు.

"శ్రోతుల మాట తీఱె నమ్మనువె." వర. రా. యు పుట. 285. పంక్తి. 17.

మాట తీసి వేయు

తిరస్కరించు.

కొత్త. 321.

మాట తెచ్చుకొను

ఒకరినిందకు పాత్ర మగు.

"ఆవిడ యిరవై యేళ్లు కాపరం చేసినా ఒకరితో మాట తెచ్చుకొని యెరగదు." వా.

మాట దక్కదు

మాట నిలువదు.

"వస్తా నని రాక పోయావా యింక మాటే దక్కదు." వా.

మాటనిజము

నిజాయితీ, సత్యవాక్కు.

మాట తప్పనివాడు అనే అర్థంలో అలవాటై ఆ గుణాన్ని మాటనిజ మని వ్యవహరిస్తారు.

"మే లైనసరకు లాతని, కాలున దిగు మాటనిజము గలవాఁ డగుటన్." శుక. 1.176.

మాటనిజము గలవాడు

నిజాయితీపరుడు.

"గోవ మొదలుగాఁ బాదలెడు ద్వీ, పాళిఁ గల సరకు లాతని, కాలున దిగు మాటనిజము గలవాఁ డగుటన్." శుక. 3.8.

మాట నిలుపుకొను

తాను చెప్పినట్లు చేయ గలుగు.

"అను వగుమగవాఁ డీ మాటకు నోడఁ బడఁ డక్కామినియెడ మాట నిల్వఁగా లే నైతిన్." శుక. 4.10.

మాటనిల్కడ

మాటమీఁద నిలిచి యుండుట, సత్యవ్రతము.

"మాటనిల్కడ." కాశీ. 2.105.

"అతడు చాలా మాటనిలకడ ఉన్న మనిషి. చెప్పిన మాట ప్రకారం నడుస్తాడు." వా.

మాట పట్టింపు

"వాళ్ల మామతో ఏదో మాట పట్టింపులు వచ్చి వాడు భార్యను వదిలి వేశాడు." వా.

మాటపట్టు

మాటపట్టింపు, పట్టుదల.

"బలహీనికిఁ జిత్తమునం, గలఁగం బడి
మాటపట్టు గలరా జయ్యెన్."
వేం. పంచ. 1.523.

**మాట పడిపోవు**

మాటలాడేశక్తి లేక పోవు.

నోట మాట రాక పోవు.

"వాడికి పొద్దున్నే మాటలు పడి
పోయా యట. ఇంక పోయి చూస్తే
మాత్రం ఏం లాభం?" వా.

**మాట పడు**

దూషణ పొందు.

ఒకరిచే తప్పు పట్టించుకొను.

"నక్కీరునిచే, నే మాట పడ్డదుఃఖము,
క్షామవ్యథ కొలఁది గాదు సద్భక్త
నిధీ!" కా. మా. 3.163.

"ఒకరిచేత మాటపడ్డం నా కిష్టం
లేదు." వా.

**మాట పుట్టు**

చెడ్డపేరు వచ్చు.

"ఇచ్చకు వచ్చినట్లు రమియింపు మొకా
నొక మాట పుట్టినన్, నెచ్చెలి లేదు
బంతి యనునేర్పున..."
శుక. 2.97.

చూ. మాట వచ్చు, మాట పడు మొద
లయినవి.

**మాటపొందు**

మాటపొందిక.

"ఒకనాఁ డూర్వశి మాటపొందు
నరసం దూషించి నాకాధినాయ
కునిం దాపసముఖ్యు లథర్వము చేయం
బూని రావించుచో—"
ఉ. హరి. 1.90.

**మాట పొఱపొచ్చెము**

మాట పొరపాటు; హెచ్చు
తక్కువగా మాటలాడు,
న్యూనపఱుచు.

"వాఁడిమిం, బోయిన చోట మాట
పొఱపొచ్చెము పైపని రోసగాఁడు
గా..." శుక. 3.150.

వాడుకలో- 'ఆయనమ్మా!
చండశాసనుడు—మాట
పొరపాటొస్తే ఊరుకోడు—
అంటారు.

**మాట పోవు**

చెప్పినది అబద్ధమగు.

"వాళ్లకీరోజు ఇస్తానని చెప్పాను.
ఇవ్వకపోతే మాట పోతుంది." వా.

**మాట మాట**

వివాదం.

మాటమీద మాట వచ్చి
ఏర్పడినది.

"లోలార్కునకు నీకు లోలోన
నేమేని, పోటి పుట్టదు గదా మాట
మాట." భీమ. 2.88.

**మాట మాట జగడంబులు సూపు**

మాటకు మాటకు వాగ్వా
దము చేయు.

"ఒండొరుమీఁది చాడిమాటల మఱి
మాట మాట జగడంబులు చూపి
యతండు పోయినన్. శుక. 2.337.

**మాట మాట వెంబడి**

మాటమీద మాటగా.

"విను మిపు డది సంస్కృతి పద,విని
జెందెను మాట మాట వెంబడి."
ప్రభా. 2.100.

మాటమాత్రన
ఒక్క క్షణములో.
"ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె,
వినుకొండ మాటమాత్రన హరించె."
పారి. 1.23.

మాటమాత్రమున
ఒక్క మాటలో.
ఒంటిమిట్ట. 64.

మాటమాత్రమునకు
అవలీలగా, చులాగ్గా.
"తోయజాతుండు బాహాచతుష్టయ
మున, మాటమాత్రకె మోయఁడే మంద
రాద్రి." హర. 6.48.

మాట మిగులు
హెచ్చు తక్కువగా మా
ట్లాడు.
"మీరూ మీరూ ఎప్పుడైనా మొహాలు
చూసుకోవలసినవాళ్లు. అనవసరంగా
మాట మిగిలితే ఏం బా వుంటుంది?"
వా.

మాటమీద నిలబడు
చెప్పిన మాట ప్రకారం
నడుచుకొను.
చూ. నోటిమాటమీద నిలబడు.

మాట మోచు
నింద పాలగు.
"అప్పు డపాలైనశుభ్రాబ్జంబు రుచి
యెంత, మాట మోచినహంసు తేట
యెంత?" శర. 1.67.

మాటమోపరి
ఇక్కడి మాట లక్కడా,
అక్కడి మాట లిక్కడా
చెప్పువాడు.
చంద్రా. 4.53.

మాట యిచ్చు
వాగ్దాన మిచ్చు.
"కనుఁగొన్నంతనె యాదరించి తను
లంకారాజ్యపట్టాభిషి, క్తునిఁ గావిం
పఁగ మాట యిచ్చి కృపఁ గాకుత్
స్థుండు మన్నింపఁగా,"
రామా. 7.201.
"ఆయన తప్పకుండా వస్తా నని మాట
యిచ్చాడు మఱి." వా.

మాటల గడవ నాడ నేర్తునె?
మాటల్లో నిన్ను జయించ
గలనా?
"నీవు రాజవు మాటల నిన్నుఁ గడవ,
నాడ నేర్తునె? విన్నప మవధరింపు?"
ఉ. హర. 1.76.
"దానిని మాటల్లో జయించడం
సాధ్యం కాదు." వా.
మాటల్లో నిన్ను దాటి పో గలమా?
వా.

మాటలచే బయలు పందిలి పెట్టు
వట్టి మాటలతో భ్రమ
గొలుపు.
"బచ్చెనమాటలను బయలు పందిలి
యిడుచు౯." ప్రబంధరా. 725.

మాటలతో కడుపు నిండు
ఎవ రైనా శుష్కప్రియాలు
పలికినప్పుడు అనేమాట.

"నువ్వు ఎంత సేపూ ఎన్ని మంచి మాటలు చెప్తే యేం? మాటలతో కడుపు నిండుతుందా?" వా.
"వాడిదగ్గరికి పోతే మాటలతో కడుపు నిండ వలసిందే." వా.
"వాడు ఎంత మధురంగా మాట్లాడతాడని. ఆమాటలు వింటేనే కడుపు నిండుతుంది." వా.

మాటలతో పందిరి గప్పు

"మనసు కలంగ నేటి కని మాటలఁ బందిలి గప్పుచుండఁగా, నసుమతి నుంటిఁ గాక యటులైన నిసుం గడు పంగ నిత్తునే." హరిశ్చ. (వీర.)

చూ. మాటల పందిరి వెట్టు.

మాటల దీరునా ?

ఇది వట్టి మాటలతో తీరదు.

"మాటలఁ దీరునా యువతిమన్మథ! మన్మథతాపవేదనల్." రాజగో. 1.110.

"ఇదేం మాటలతో అయ్యేపనా?" వా.
"ఇదేం మాటలతో (అయ్యే) తీరేపనే అనుకున్నారా?" వా.
"ఈ దుఃఖం మాటలతో తీరేది కాదు." వా.

మాటల పందిలి పెట్టు

వట్టిమాటలతో సరి చేయు.

"పని లేనిమాటల పందిలి పెట్టి, జుణిగి పోయెద నని చూడకు..." ప్రభులిం. 8.64.

మాటల పచ్చళ్లు

రుచికరమైనమాటలు.

శివముకుంద. 43.

మాటల బీట వెట్టు

మాటలతో కొంతకాలము గడచునట్లు చేయు.

'వాడు దారిలో మాటలు పెట్టుకొన్నాడు. ఇంతసేపయింది' – అనడం వ్యవహారం. పీట వెట్టుట అనగా తిష్ఠ వేయుట.

"ఏతదరసమాయాతం బగు నొక్క పురాణవృత్తాంతంబు గల దంచు మాటలఁ బీఁట వెట్టి యా సెట్టిపట్టితో......" శుక. 2.238.

మాటలబెల్లాలు

తీయనిమాటలు.

తాళ్ల. సం. 3.583.

మాటల మంచి

తియ్యని మాటలు పలుకుతూ చెరుపు చేయునది.

"మాటల మంచులు మందులమార్లు." పండితా. పురా. 116. పా.

మాటలమారి

వదరుబోతు.

ఆం. భా. 3.11.

మాటలముచ్చులు

మాటలాడే ముచ్చులు.

ఒక తిట్టు.

పండితా. ప్రథ. పురా. పుట. 343.

మాటలవర్షము కురిపించు

ఎక్కువగా మాటలాడు.

"వాడు వచ్చిందే తడవుగా ఊపి రాడకుండా మాటలవర్షం కురిపించాడు." వా.

మాటలా ?

అంత సులభమైన పని కా దనుట.

"ఆ ఆఫీసురుదగ్గర పని చేయడ మంటే మాటలా ?" వా.

మాటలు కరువగు

ఉదాసీనత యెక్కువయిన దనుట.

"ఏం నాయనా! మాటలే కరువై పోయాయి. అంతలోనే అంత దూరం వాళ్ల మయి పోయామా ?" వా.

మాటలు కోటలు దాటును

వాగాడంబరమే ననుట.

"మాటలు కోటలు దాటినా కాలు కడప దాటదు." సా.

మాటలు గట్టిపెట్టు

మాటలు చాలించు.

"పెక్కుమాటలు గట్టిపెట్టి సత్యంబు దక్క." గౌ. హరి. ద్వితీ. పం క్తి. 1459.

మాటలు నూతిపోయు

మాటలు నేర్పు.

శ్లేషద్వారా మాటలను నూతి కలుపు అన్న అర్థం ఒకటి, మాటలు నూతిపోయు అన్న నుడికారమూ కలిసి ఉన్నవి.

"శ్రోత్రలు గావె యీ మనువు కుండల మాటలు నూతి పోసిరో, యతి యటంచు." కా. మా. 3.44.

మాటలు పడు

దూషణకు గురి యగు.

"తొలుత మాటలు పడి పుల్లసిలిన వాఁడు." విప్ర. 4.87.

"వాళ్ళ యింట్లో ఉన్నన్ని నాళ్లూ ఒక్కొక్కడితో నేను ఎన్ని మాటలు పడ్డానో ఆ దైవానికి తెలుసు." వా.

మాటలు బండమీద పోవును

డంబాచారములు పలుకు ననుట.

"వాడిమాటలు చూస్తే బండమీద పోతాయి. క్రియ మాత్రం శూన్యం." వా.

మాటలు మిగులు

దూషణోక్తు లాడు.

"నిన్నుఁ గూడ నేమేమో మాటలు మిగులుచున్నాడు." బాల. 179.

హెచ్చు తక్కువగా మాట్లాడు.

"అనవసరంగా మాటలు మిగిలావంటే మర్యాద దక్కదు." వా.

రూ. మాట మిగులు.

మాటలు ముదురు

క్రమంగా మాటలు పెరిగి తగాదా కలుగు.

"మాటలు ముదర నీయ వద్దు. మనం మనం రేపు మొగాలు చూచుకోవలసిన వాళ్లం." వా.

మాటలు వేయు నేటికి

"మాటలువేయు నేటికి రమావిభుఁ డందుఁ బదాలు వేలపై, నూటెన మంద్రుఁ భార్యలు దనుం బరిపూర్ణ రతోత్సవంబులన్, గాటము గాఁ దనర్చు కుతుకంబులఁ గొల్వ..." కళా. 1.126.

మాటలు లేవు

విరోధము.

ఒకరితో ఒకరు మాటలాడు కొన రనుట.

"చాలా కాలం నుండీ వాళ్లిద్దరికీ మాటలు లేవు." వా.

మాటలో

రెప్పపాటుకాలములో.

"తొవలునూడు, తత్తడుల కని మాటలో దచ్చి కడలఁ, బఱచి క్రమ్మఱు నచటి బాబాతుటుములు." నీలా. 1.34.

"ఇక్కడే కూర్చుని ఉండు. మాటలో వస్తాను." వా.

మాట వచ్చు

చెడ్డపేరు వచ్చు.

"అతండు విన్నా నా కింతయు మాట వచ్చు నని..." వి.ప్ర. 5.43.

మాటవరుసకు

ప్రస్తావవశంగా, మనః పూర్వకంగా కాక.

"ఏదో మాటవరసకు అలా అంటే అదే పట్టుకొని కూర్చుంటా వేమిట్రా?" వా.

"మాటవరసకి ఏదో పిలిచాడు గానీ మన మేం రావా లని ఉందా వాడికి?" వా.

చూ. మాటకు.

మాటవాసి

1. మాటనేర్పు.

2. పలుకుబడి.

"సుదతి! మాటవాసెల్ల నీ సామ్మొ డొఁ గదవే." హేహా. పు. 54.

"వాడు చాలా మాటవాసి కల వాడు." వా.

"ఈలువు మాటవాసియుం జుట్టతికంబుఁ బుణ్యాయును." వి.ప్ర. 3.13.

మాట వీడుపాటులు

తడబాటు మాటలు.

ఒకటి మాట్లాడుతూ తటాలున మరొకటి మాట్లాడ్డం లాంటిది.

"కలవరింతలును మాట, వీడుపాటులుఁ జెలులకు వెఱఁ గొనర్ప." కళా. 6.215.

మాటవెట్టు

మాటలాడు.

"మాటవెట్టుదుఁ గన్నచో మానసీయ, వాక్య యని వీడుకొనియె నవ్యాస వుండు." భార. శాం. 4.387.

మాట వెడలునె?

నోటనుండి మాట వెలువడునా?

ఇది భయసంభ్రమాదులతో నిర్వచను డనుటను తెలుపు పలుకుపడి.

వాడుకలో—మాట పెగల లేదు, నోరు రాలేదు. నోరు కదల్చ లేక పోయినాడు.

"విను మిచ్చటఁ బ్రేల వచ్చు వెసఁ దానిఁ గనుం, గొనునంత మాట వెడలునె, నినుఁబోటికి నే నెఱుంగనే నీ బలముల్." శుక. 2.290.

నోరెత్త లేక పోయినాడు.

నోట మాట రాలేదు అను రీతిగా కనబడుతుంది.

మాటసందులు వట్టు

మాటపొరపాట్లను అవకాశముగా తీసికొను

"మాట సందులు వట్టి మన సాత్తి చూడ."

గౌ. హరి. ప్రథ. పం క్తి 1307.

మాటసామెతకు

చూ. మాటకు.

మాటా పలుకూ

ఒక్క చెడుమాట వినపడదు.

జం.

వాడుకలో—

మాటా పలుకూ లేదు ఇదెప్పుడూ ఇలా వ్యతిరేకార్థంలోనే వినవస్తుంది.

"తలపోయ నూరిలోపల నొక్క మాట, పలు కెన్నడును వినఁబడదు."

బస. 7.182.

"వాడిదగ్గఱకూ వెళ్ళి ఏం లాభం? ఒక మాటా పలుకా?"

వా.

ఇక్కడ ఏమీ అనడు అని అర్థం.

మాటిడు

మాటలాడు, సమాధానము చెప్పు.

"పూనిన నోటమి తప్పదు, దీనికి మాటిడక యున్నదియె నయ మనుచున్."

నిరంకు. 3.15.

మాటినంగ

1. కాముకురాలు.

'మాదునంగై' అని తమిళము.

"భోగదానవ్రతంబులు పూని యెపుడు, మకరకేతను నర్చించు మాఁటినంగ."

కాశీ. 3.171.

2. అమాయకురాలు, అంత నేర్పరి కానిది.

"మాటాడ నేరని మాఁటినంగవు నీవు."

కాశీ. 3.62.

మాటిమాటికి

సారెసారెకు.

కుమా. 12.141.

మాటు పెట్టు

దాచు.

"ఏ మయి యీమాట మాటు పెట్టక గొబ్బునం జెప్ప నేర కున్నవారము."

ప్రభా. 3.71.

మాటు మడగు

నిశ్శబ్దమగు.

రాత్రి అందరూ అన్నాలు తిని పడుకొన్న తరవాత 'ఊరు మాటు మడిగింది' అంటారు.

బాగా చీకటి పడింది, పొద్దు పోయింది అను భావార్థాలలో ఇది ఉపయోగించుట అలవాటు.

"చిటు కనక మాఁటు మడఁగిన, పుట
భేదనవిధి నరసి పొలఁతుక తలవా,కిట
కడ నో విట కంటికి, విటకంటికి
తలుపు తీయవే యని పలుకఁగ."
విప్రనా. 4.57.

## మాటు సేయు
కప్పు.
"నిజరంధ్రములకు మాటు సేయఁ బర
రంధ్రములు గని చిక్కు వఱుప."
భార. శాంతి. 2.369.

## మాట్లాడించే దిక్కు
మంచీ చెడ్డా కనుక్కునే
దిక్కు.
"నాలుగు రోజులు జబ్బుతో పడు
కుంటే వాణ్ణి మాట్లాడించే దిక్కు
లేదు."

## మాట్లాడించేవారు
యోగక్షేమములు విచా
రించేవారు.
"ఆ ఊళ్లో మనమలను మాట్లాడించే
వాళ్లు ఎవరున్నారు? ఇక్కడే
ఉండడం మంచిది." వా.

## మాడపట్టు
బ్రహ్మరంధ్రము.
"వానికి మాడపట్టున పెద్ద దెబ్బ తగి
లింది." వా.

## మాడయినా మక్కయినా
అడుగూ బొడుగూ అనుట.
కుక్కు. 18.

## మాడువిల్లు
మేడదాబా.
శ. సం. 7,945.

## మాడెత్తు మాట
ఒక్కమాట అయినా.
"ఆడఁడు మయూరరేఖను, గాడం
బాఱండు బాణగతి మన మెరియఁగ,
బ్రోడగుపెద్దయ యన్నయ, మాడకు
మాడెత్త యతనిమాటలు జగతిఁ."
విక్ర. 1.21.
"క్రోధ మొందిన నైనఁ గొడుకు
దుర్గుణ మెంచి, యొత్త మాడెత్తు
మాటాడ వెఱచు." శుక. 3.480.

ఈ మాటలు ఒక్కమాట
బదు లనదు అన్నఅర్థంలోనే
కాని అంటుంది అన్నట్లు కాన
రావు.
చూ. పల్లెత్తుమాట; చిన్నమెత్తుమాట.

## మాడ్కి వోలె
విధముగా, వలె.
ఇలా రెండు ఉపమానవాచ
కాల నుపయోగించడం నన్నె
చోడునిలో విరివిగా కాన
వస్తుంది.
"చెందొవమాడ్కివోలె."
కుమా. 5.38.

## మా తలనె పుట్టినవి
వాటికి మూలం మేమే
అనుట.
"మన్మథ వేదాంత మార్గోపదేశమ్ము,
లనఁగ మాతలనె పుట్టినవి గావె."
శ్రవ. 2.80.

## మా తెరువుకు రాకుండ
మా జోలికి రాకుండ.
దారికి అడ్డము రాకుండ

అనుట. జోలికీ శొంటికీ అన్నట్లే జోలికీ తెరువుకు అని కూడా అంటారు.

"మా తెరువు దాను రాకుండ మనివి చెప్పు." హంస. 3.115.

"నాజోలికి వాడు వచ్చాడంటే నేను ఊరుకోను. నాజోలికీ తెరువుకూ రావద్దని చెప్పు." వా.

మాత్రసంచి

గోనెవలె కోలగా కుట్టిన సంచి, అసిమి.

బాటసారులు దీనిని ఉపయోగిస్తారు.

"మాత్రసంచి తలాడగా మార్గవేది." ఆము. 2.74.

మాదిగకొయ్య

తిట్టులో కొయ్య చేరుతుంది. మాదిగ వెధవ అన్నట్లు.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 131.

మాదిగమంచ మగు

భిన్నాభిన్న మగు. మురికి మురికిగా నుండు.

"...కీర్తనము కీర్తనముగ నుండదగ నేయింత మాదిగమంచ మగు నప్పుడు శ్లోకము కీర్తనము గాదగ నెంత గాడిద గత్తర యగునో..." సాక్షి.

మాదిగవాడు కోయ

పశువులను రైతులు తిట్టు తిట్టు.

"లంపుల మారిదాన! నిను లాచుక మాదిగవాండ్రు గోయ..." హంస. 5.66.

మాదిగసంత

కళ్మల మైనది.

"జరిగినది గాదె మాదిగసంతవోలె." వ్యస. నాట. 14.

మాది భారము

ఆ బాధ్యత అంతా మాది.

"ఆ తిరుకాళహస్తిపతిం జూపన్ మాది భారంబు." కా. మా. 4.53.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది. 'నీకు ఉద్యోగం ఇప్పించే భారం నాది. నా వెంట రా.'

"ఉన్న సంగతంతా మీతో చెప్పాను. ముంచుతారో తేల్చుతారో మీదే భారం." వా.

మాదిరి సేయు

పోల్చు.

"మాదిరి సేయ వచ్చు జననాథు మొగంబును జంద్రబింబముణ్" విజ. 1.68.

మానం కడిగి వేయు

మానము తీయు.

"ఆ ఊరికి వెడితే వీడిమానం కడిగి వేస్తారు." వా.

మానంబిళ్ళ

ఆడపిల్లలకు మొలత్రాడుకు కట్టే బిళ్ల.

మాన జిక్కిన గోల

తాళ్ల. సం. 11. 3. భా. 125.

మానము ఊడి పుచ్చుకొను

మానము పోగొట్టుకొను.

"మునుపటి పతివ్రతలు...దుర్జనులు... ఆసపడిన, మాన ముడి పుచ్చుకొని రసే మచ్చకంటి."

హంస. 1.127.

మానము కొల్లలాడు

సంగమించు.

"మానిని! యీతఁడు వో నా, మాన ధనముఁ గొల్ల లాడి మక్కువ మీఱం,గా."

ఉషా. 2.72.

మానము గొను

అవమానపఱుచు.

"నిను మానము గొనుహీనుని, నను మానము మాని." సారంగ. 2.236.

మానము పోవు

అవమానపడు.

"నీ కొడుకు చేసినచేతలకు నలుగురి లోనూ నా మానం పోయింది." వా.

మాన మేయూరికి బోయె

సిగ్గు లేదా అనుపట్ల ఉప యోగించేపలుకుబడి.

"కూరఁడ వంద్రుడు నిక్క మడువు సొచ్చుట శౌర్యము చొప్పె మాన మే, యూరికిఁ బోయె......"

భార. శల్య. 2.55.

మానసపుత్రులు

అనుసరించువారు.

అచ్చం అలా ఉండా లనే వారు.

మాటా. 26.

మానసము గలుగు

ఇష్ట మగు.

"మానసము గలుగుచున్నది."

భాగ. స్క. 1.334.

....మానానికి....

దాని కది.

"నిరుడు మానానికి నిరు డిలా గే అన లా." క్రొత్త. 36.

మానికదారి

భోగముది.

"ధనము లార్జించుమానికదారులిండ్లఁ, జేరునరులకు నిడుములు చెప్పఁ దరమె?"

శ. ర.

మానిసి మత్రట

మనిషీ, మత్రట. జం.

"మానిసి మత్రట చిట్టాడని యీ చిట్ట డవి సెట్లు చన నేర్తు." శృం. శా.

మానిసి మానిసి దిను కఱవు

దారుణ మైనకరువు.

తినుట కేమీ దొరకక మను ష్యులనే మనుష్యులు తినుట. అనగా అది పరాకాష్ఠ చెందిన దనుట.

"మానిసి మానిసిఁ దినుకఱ, వైనం దరియింప లేక."

కా. మా. 3.156.

మాన్య మమ్ముకొను

దివాలా తీయు.

మడిమాన్యా లమ్మి వేసి కొను.

"చంద్రముఖిఁ గూడి మాన్య మమ్ము కొన లేదా." శ్రవ. 2.60.

మాపు చేయు

పోగొట్టు.

"తెలుపు మాపు చేసి దిట్టతనంబునఁ, దెలుపు భస్మముగను దేటపఱుచు."
వేమ. 3.148.

మాపో రేపో
త్వరలో.
"మాపో రేపో యొనర్పఁ బడుట యసంభావ్యంబు." గిర. గురు. 33.

మామాటయే మాటగా
మా మాటే తనమాటగా.
అంత ఆత్మీయతతో అనుట.
"మా భోగంబులె యాత్మభోగనులుగా మా మాటయే మాటగా..."
కళా. 3.224.

మామిడిక్రింద సోమరి
మామిడిచెట్టుకింద పడుకొని లేచి రాలినపండ్లను ఏరుకునే పాటి శ్రమ కూడా లేకుండా నోటిలో పండు పడినప్పుడు తిందమనుకొను వాడు.
అతి సోమరి అనుట. ఇలాంటిదే రేగుక్రింద సోమరి.
"మామిడిక్రింది సోమరి మేదకుండు."
గౌర. హరి. ద్వి. 1495.

మామూళ్లు
లంచములు.
కొత్త. 15.

మాయ కన్నుల గ్రమ్ము
మోసపోవు.
"మాయ కన్నులఁ గ్రమ్మఁ గ్రమ్మఱితి నేను." ఉ. హరి. 2.34.

మా యక్కడ
మా యింట.
"మా, యక్కడ మీరు నీ ముసలియవ్వయు." హర. 2.48.

మాయగ దట్టు
వదలి వేయు.
"త్రపాభిమానముల్, మాయఁగ దట్టి." శివ. 3.91.

మాయ చేయు
మోసగించు.
"వా డేదో మాయ చేసి దాన్ని బుట్టలో వేసుకున్నాడు." వా.

మాయ దగులు
మాయలో పడు.
"మఱచెనో కాక రుక్మిణి మాయఁ దగిలి." పారి. 1.95.

మాయదారి
మోసగాడు.
"వచ్చుటయుఁ గాఁ ఫలందనుఁడు వారిజనాభుఁడె మాయదారియై, యిచ్చటి కేఁగుదెంచె..."
వరాహ. 9.44.

మాయపోతు
మాయలమారి.

మాయ పోవు
మోసపోవు.
"ఈ యవస్థలఁ బొరయమి మాయపోక." భార. శాంతి. 4.125.

మాయ బాఱు
మాసిపోవుట కొన్నిచో ఘటించు.
"పలపల నుడుగణము మాయఁ బాఱెను పత్తుల్...." హంస. 1.138.

**మాయము చేయు**

అదృశ్యము చేయు.

"వాడు శేరుబియ్యం పెడితే మాయం చేస్తాడు." వా.

**మాయలమారి**

మోసగాడు, మోసకత్తె.

"ఆ మాయలమారి మావాణ్ణి వలలో వేసుకొంది." వా

**మాయలాడి**

మోసగత్తె.

**మాయలు పన్ను**

మోసములు చేయు.

"మంగలి మాయ లేవియుం, బన్నఁడు." కా. మా. 1.55.

**మాయలేడి యగు**

దుఃఖకారక మగు.

రామాయణములోని మాయలేడిపై యేర్పడిన పలుకుబడి.

"మా పాలిటికి నీవు మాయలేడివైతి." క్రీడా. పుట. 13.

**మాయ సాగు**

మాయ చేయు

"సుద్దులం, గదిసి మాయ సాఁగి రనంగ వలదు." రా. వి. 5.41.

**మారటమారుడు**

రెండవ మన్మథుడు. మన్మథుని వంటివాడు అనుట.

"సౌకుమార్య రేఖల మారటమారుఁడైన." హంస. 4.46.

**మారణమంత్రము**

చేతబడి మంత్రము.

వినాశక మనుట.

"భామల కట్టిచో సవతి నామము మారణమంత్ర మౌఁ జుమీ." ప్రభా.

**మారాముళ్లు**

చిక్కులు.

"ఓ రామచిలుక! మా కీ, మారాముళ్లెట్లు తెలియు మగవారమె ?" శుక. 2.30.

దారం చిక్కు పడినప్పుడు ముళ్లు పడుతుంది. ఆ ముళ్లు కూడ ఒక పద్ధతిలో కాక మారుముళ్లు పడతాయి. చిక్కులు అన్న మాటవలెనే యిది కూడా దారం చిక్కు పడుట మీద వచ్చిన పలుకుబడి — (మారు+ముడి.)

**మారి పిల్లాడించు**

బాధ పెట్టు.

"మారిపిల్లాడించెనే మారుదల్లి." తాళ్ల. సం. 12.48.

**మారి మసగినభంగిన్**

మహామ్మారి వచ్చి ఊడ్చుకొని పోయినట్లు.

"మిగుల బిరుసగుశరముల్, జడిగొలిపి తద్బలంబుల, మడియింపఁగఁ జూచ్చె మారి మసఁగినభంగిన్." జైమి. 5.56.

**మారి మసలినట్లు**

మారి వ్యాపించినట్లు.

"మరకటంబుల మారి మసలినయట్లు, చరమక మ్రింగుచు."
వర. రా. యు. పు. 276. పం క్తి. 11.

మారీపత్తున

ఒకని పరపతిని పురస్కరించు కొని తద్వారా అనుట.
'మారుపొత్తు' అను పదము నుండి యేర్పడిన పలుకుబడి కావచ్చును.

"ఆ రంగయ్య మారీపత్తున ఆయన దగ్గర డబ్బు తీసుకొని వచ్చాను."
వా.

మారుతల్లి

సవతితల్లి.

"మారిపి ల్లాడించెనే మారుదల్లి."
తాళ్ల. సం. 12.48.
రూ. మారుదల్లి.

మారుబేరము

ఒకటి ఒకరు ఇవ్వగా మరొ కరు మరొకటి యిచ్చి చేయు బేరము.

రాధి. 2.113.

మారుబేరము చేయు

ఒకచోట కొని మరొకచోట లాభానికి అమ్ము.

"మారుబేరానికి తెచ్చుకొని అమ్మే వాళ్లం. మాకే నాలుగు రూపాయలు పడితే మీకు నాలుగు రూపాయలకే ఎలా యిస్తాం? చెప్పండి." వా.

మారు మలయు

ఎదురించు.

"మనుజులలో మారు మలసి నాతోడ, మొన సేయ నున్నారె మూఁడు లోకముల."
వర. రా. అయో. పు. 352. పం క్తి. 23.

మారుమూల పదములు

ప్రచురంగా కనిపించని శబ్దాలు.

"మారుమూల పదముల గుప్పిన ముచ్చ టగునే?" శ్రవ. 1.12.

మారుమొగము వెట్టు

అయిష్టతను సూచించు.

"మొగము మాడక మారు మొగము వెట్టుచ మన్న, నతనిఁ గ్రమ్మఱఁ జూడ నాస యగును." రాజగో. 3.69.

మారుమోమిడు

మొగము త్రిప్పుకొను.
అయిష్టతను సూచించు.

"వారు మా, ర్మోమిడి చూడకున్కఁ దనమో మొకకొంత మలంచి తెల్పు చుకా." కళా. 6.125.

మారు వడ్డించు

రెండవసారి పెట్టు.

"మారు వడ్డించుకోకుండానే భోంచేసి పోయాడాయన." వా.

మారొడ్డు

ఎదురొడ్డు.

కవిక. 2.148.

మార్పడ బేర్కొను

మగడో, భార్యో ఎదుట ఉండగా తమ మనసులోని ప్రియుని పేరనో, ప్రియురాలి పేరనో పిలుచు.

మన సెల్లా ఒకరిపై ఉన్న పుడు తటాలున వారిపేరే నోట వచ్చుట సహజము.

దీనినే సంస్కృతాలంకారికులు గోత్రస్ఖాలిత్యం అని అంటారు.

"వాని మార్పడఁ జేరొక్కనిమాన వతియు." నైష. 1.62.

**మార్పడు**

ఎదుర్కొను.

"బలహీనుమాడ్కి మార్పడ లేఁడ." భాగ. స్క. 3.7.

**మార్పలుకు**

ఎదిరించి మాటలాడు.

"పలికిన నేమి యన్నియును బల్కనగున్ మనరాజునొద్ద మా, ర్పలికెడు వార లేరు..."
భార. ఉద్యో. 4.418.

**మార్పెట్టు**

ఎదుర్కొను.

"మదనాగంబులు చేతు లెత్తి పఱవన్ మార్పెట్ట కాపన్నులై, యెదురం గాల్కొని..." శు. సం. 11.605.

**మార్బలము**

శత్రుసైన్యము.

భార. ద్రో. 2.136.

**మార్మగడు**

రంకుమగడు, విటుడు.

"మగనిఁ గన్మొఱంగి మార్మగలను గూడు." హంస. 2.24.

**మార్మలగు**

వెనుకకు మరలు.

"కదియక మార్మలంగెదవు సుమ్ము." నీలా. 3.94.

**మార్మలయు**

ప్రతిఘటించు.

"తన నిర్మలతేజము సూర్యుతోడ మా,ర్మలయంగా."
నిరంకు. 1.30.
భార. ద్రో. 4.191.

**మార్మసలు**

తప్పుత్రోవల మెలగు, అపమార్గమున చరించు.

"మత్తిత వోలె మా పడుచు మార్మసలన్ జలికింపఁ బూని." జైమి. 4.12.

**మార్మెడలు వడు**

మాఱుమెడ వైచు, మెడ వాల్చు అనుట.

"అవి గొంతు క్రొన్నెత్తురులె క్రోలి విడిచి చన మార్మెడలు వడి మళక వనదంశమ్ములు మూఁగ."
మను. 4.37.

**మార్మొగమగు**

మొగ మావలి వైపునకు త్రిప్పుకొను.

"అరుదుగఁ దెచ్చుకోలు పొలయల్కనొకప్పుడు మార్మొగంబు గాఁ, బొరలిన..." కళా. 7.193.

**మార్మొగమిడు**

విముఖత్వమును పొందు.

"పరుసను మార్మొగం బిడమి భక్తునిఁ బ్రోవ సటల్ ఘటింపమిన్."
వసు. 5.45.

రూ. మార్మొగము పెట్టు

మార్మోన
వ్యతిరేకత.

మార్మోరయు
ప్రతిధ్వనించు.

మార్మోముల్ వడు
వెనుదిరిగి పాఱిపోవు.
"మార్మోముల్ వడులేటిమూఁక లన." పాండు. 3.131.

మార్మ్రోయు
ప్రతిధ్వనించు.
"జవనాశ్వద్విరదాదిఘోషముల దిక్చక్రంబు మార్మ్రోయ భూ, ధవులెల్లన్." ఉ. రా. 5.265.

మార్వడు
మార్కొను.
"పవమానతనయు మార్వడ లేక." వర. రా. యు. పు. 209. పంక్తి. 1.

మాఱాకు హత్తించు
ప్రోది చేయు.
"బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి." భాగ. స్క. 8.65.

మాఱా కెత్తు
"మనమున నునుసిగ్గు దేఱి మాఱాకెత్తన్." వేం. పంచ. 4.399.
చూ. మాఱాకు హత్తించు.

మాఱాడు
ఎదురాడు.
"కలలోనైనను నీదు మాటలకు నేఁగాదంచు మాఱాడుటల్." రాజగో. 1.99.

మాఱి మ్రింగు
తెగటార్చు.
"ఇంతవాఁ, డెవ్వఁడో వాని పై రెఱఁగి యిప్పుడ చెప్పుము మాఱి మ్రింగ దగన్." భాస్క. అర. 158.

మాఱుగడ
వినిమయము.
ఆం. భా. 2.267.

మాఱుగాలు
కృత్రిమపాదము.
"మాఱుగా లిచ్చె నొక సుధామధురవాణి." పాండు. 3.77.

మాఱునీళ్లు
స్త్రీలు ఋతుస్నాన మయిన మఱునాడు చేయుస్నానము.
శ. ర.

మాఱు చేయు
ప్రతి చేయు.
"నిజ మయ్యె నేఁ డటంచు, మగువ నవ్వుచుఁ జేతన మాఱు సేసె." కళా. 3.41.

(పూట) మాఱుపూట
ఒకరు ఇవ్వవలసిన అప్పునకు మరొకరు పూచీ ఉండుట పూట. వారికి బదులు మరొక రుండుట మారుపూట.
"అవశ్యము గలుట కేను బూఁట నా,కు నవల మాఱుపూఁట యవిశంకిత లీలఁ దనర్చు..." కళా. 6.284.

మాఱుబేరగాడు
మారుబేరము చేయువాఁడు.

మాఱు మండు

ప్రతిగా మండు.

"మాణిక్యదీపంబులు మార్తాండమండలమునకు మాఱు మండుచు..."
కళా. 2.150.

మాఱుమనువు

ద్వితీయవివాహము.

"శచి మాఱుమనువు రచ్చలఁ బెట్టి యెందఱే, నింద్రుల మనువార లేఁగి రహహ."
హంస. 1.190.

మాఱు మలయు

ఎదురు తిరుగు.

"మాఱు మలయున త్తమామలతో... బంధకీవధూటి."
జైమి. 3.29.

మాఱుమాట పలుకు

ఎదిరించి మాటలాడు.

"పతిమాటకు మాఱుమాట పలుకట."
రుక్మాం. 4.27.

మాఱుమాట సంధించు

బదులు మాట్లాడు, జవాబిచ్చు.

"దేవేంద్రాంగనామంజుభా, షలతోడం దగుమాఱుమాట లెలమిన్ సంధించుఁ జిల్కల్."
కుమా. 3.17.

మాఱుమొగ మిడు

అయిష్టతను కనబఱచు.

"దారాదరణ, వ్యవహృతికి మాఱుమొగ మిడి."
పాండు. 5.203.

మాఱుమొగము జూపు

పాఱిపోవు.

ఇట్టిదే మాఱుమొగము పెట్టు, మాఱుమొగము వడు, మాఱుమొగము సేయు మొదలయిన పలుకుబళ్లు.

"పద్మనాయకబలముతోఁ బగతు లెదుర, మాఱ్మొగముఁ జూప బాపురే మనల కగునె?"
రంగా. 2.44.

మాఱుమొగము వడు

వెను దిరుగు.

"బీఱువోయి రథ్యంబులు మాఱుమొగము వడిన."
భార. భీష్మ. 3.257.

మాఱురూపు వడు

వేరొక రూపము పొందు.

"బక్క చిక్కియు,న్నది యిది మాఱురూపు వడి యద్దిర యిద్దురవస్థ యే క్రియన్."
శుక. 3.400.

మాఱు లేక

ఎదురు లేక.

"దిక్కున మాఱు లేక బలదేవుఁ డనం బలుపేరు దాల్చుచున్."
శుక. 2.356.

"మా ఱెందు లేక నిరతముఁ, గాఱియ వెట్టంగ బెగడి."
రుక్మాం. 3.4.
కాశీ. 7.95.

మాఱు సెలగు

ప్రతిధ్వనించు.

"దిక్కులు మాఱు సెలంగ నేడ్చుచున్."
భాస్క. అర. 175.

మాఱుసేత

ప్రతిక్రియ.

"మన మిపు డా బాఁ, పని మాఱు సేఁత యిది యొక, పనియే..."
కేయూర. 4.165.

**మాఱు సేయు**

ప్రతిఘటించు.

"మగుద నవ్వుచుఁ జేఁతకు మాఱు సేసె."
కళా. 3.37.

**మాఱొడ్డు**

ప్రతిఘటించు.

"ఉద్దండరీతి మాఱొడ్డి నిలిచె."
హర. 3.44.

**మాలకు మాంసం మాదిగకు చర్మం దొరక్కుండా ఊరికే చంపడం కాక మాంసం, తోలూ కూడా దొరకనట్లు అనుట.**

"మాలకు మాంసంబు మఱి గొడ్డారికిని, దోలును గాకుండ."
బసవ 4.90.

**మాలకూడు**

నీచాన్నము, సాంకర్యము.

'ఈ రైళ్లు వచ్చినాక మాల కూళ్లు తినేకాలం వచ్చింది' అని పూర్వాచారపరాయణులు అంటారు.

**మాలకొంప**

పాడు ఊరు.

నిరసనలో అనుమాట.

"ఇంత పచనస్థలం బైన నీయ రిట్టి, మాలకొంపకు వచ్చితి మాఱు లేక, గంజి వోయుదురే? యిందుఁ గలుగువారు."
శుక. 3.182.

**మాలలకు మంచాలు బాపలకు పీటలు**

అయోగ్యులను గౌరవించుట, యోగ్యులను గౌరవించక పోవుట జరగినప్పుడు ఉపయోగించేపలుకుబడి.

కులభేదాలు మరీ ముమ్మరంగా ఉన్న కాలంలో వచ్చిన పలుకుబడి.

తల్లకిందుల వ్యవహారం అనుట.

"......పుష్పాస్త్రి! మాలలకును మంచంబులు బా, పలకును బీఁట లను మాట బళి! నిజ మయ్యెఁ."
చంద్రా. 5.91.

**మాలల గలుపు**

భ్రష్ట మొనర్చు.

"మాలలఁ గల్పె భువిజను లెఱుఁగ, నన నేల యీ యగ్రహార మంతయును."
పండితా. దీక్షా. ప్రథమ. పు. 115.

**మాలల పాలగు**

భ్రష్ట మగు.

"బనుగొన మాలల పాలయ్యె నిట్లు, దానును."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 115.

**మాలవాడలో బాపనిల్లు**

అసంగతము, అసంభవము.
వేంకటేశ. 72.

**మాలిమి యొనర్చుకొను**

మచ్చిక చేసికొను.

వాడుకలో—'వాడికి తల్లి మాళెం (మాలిమి) యెక్కువ.'

"తనకు ననుకూల మగు నొక్క దాసి తోడ, మాలిమి యొనర్చుకొని యుంచి మంచి వెట్టి." శుక. 3.294.

**మాలు గలియు**

కలిసి పోవు, అందులో ఒక టగు.

"మాయపుటాసల మాలు గలసె మది, యేయెడ కు ద్ధానో యెఱఁగ మిఁక." తాళ్ల. సం. 10.187.

**మాలుగుబోతు**

సోమరి.

"కూలికి వచ్చి యీాడ వరి గోయుచుఁ గూరుకు చెంద వచ్చెనే, మాలుఁగుఁ బోతు..." చెన్న. 3.417.

**మాలె గట్టు**

వరుసగా నిలుచు.

ద్వా. 8.27.

**మాలోకంలో ఉండు**

అయోమయావస్థలో ఉండు.

కొత్త. 49.

**మావారు**

మగడు, భర్త.

"మావారు ఊళ్లో లేరు. ఇంక నాలుగు రోజులకు గానీ రారు." వా.

**మాసిక వైచి కుట్టు**

చినిగి పోయినచోట వేఱే కత్తిరింపుగుడ్డ వేసి కుట్టు.

"మాసిక వైచి కుట్టిన రుమాలును జాలని దట్టిబట్టయుఁ గా." శుక. 2.362.

**మాసికల మూట**

ఒక తిట్టు.

కుక్క. 40.

**మాసినది మణు గగు**

కశ్మలమే మంచిదిగా తోచు. మాసినబట్టయే నిర్మలవస్త్ర మైన దనుట.

"మాసినదే మణు గాయెను మాకు నేది జన్మము." తాళ్ల. సం. 8.86.

**మాసిపోవు**

ఉపయోగములో లేక మఱుగు పడు, మఱచి పోవు.

"మాసినచదువులు మఱలఁ జదువు." పాండు. 3.46.

**మింగ లేక కక్క లేక**

ఏమీ చేయ లేక, ధర్మ సంకటములో పడి.

"పొ మ్మంటే అన్నకొడుకును తరిమేశా డంటారు. ఉండ మంటే వీడిల్లంతా ఊడ్చేస్తున్నాడు. ఇదెక్కడి ధర్మసంకటం వచ్చి పడింది రా అని ఆయన మింగ లేక కక్క లేక అవస్థ పడుతున్నాడు." వా.

**మించ నాడు**

అధిక్షేపించు, తూల నాడు. ధిక్కరించి పలుకు.

"లోకాపవాదంబుకొఱకు మించ నాడితిని." వర. రా. యు. పు. 493. పంక్తి. 23.

"మే లెఱుఁగక నిన్ను మించ నాడితి?" వర. రా. అయో. పు. 277. పంక్తి. 24.

"మించ నాడుట గాదు."
వర. రా. కిష్కి. పు. 402. పం క్తి. 17.

మించుమలె
సుమారు ?

మింటికి నేలకు సూత్రపట్టు
అసాధ్యకార్యము చేయు.
"క్రాలిచి మింటికి నేలకును సూత్ర పట్టంగ, నే నేర్తు."
విప్ర. 4.28.
చూ. నేలకు నింగికి సూత్రపట్టు.

మింటికి మంటికి దారము పన్ను
అసాధ్యకార్యము చేయు.
"చిలుకపలుకులు పలుకు మన్నచో తాలచేలకు గుంటకలు తోలిన పోలిక మింటికి మంటికి దారము పన్నుచు నెక్కి డెక్కిడివో పుక్కిటిపురాణము లేకరువు పెట్టుటలో మీది పెట్టిన పేరు." ధర్మజ. 45. పు. పం. 11.

మింటి పొడ వగు
ఉన్నత మగు.
"మింటిపొడ వైనట్టి మించుఁగిరీటం బదె." తాళ్ల. సం. 5.75.

మిండగాడు
విటుడు.
"ఓమునిసార్వభౌమ! సరసోక్తుల బాఁపని మిండగానితో, నే మని నింద సేసె." నిరం. 4.36.

మిండప్రాయము
యౌవనము.
"మిండప్రాయంబున మీఁదికి నెగయ."
ద్వి. భాగ. 4.2009. ప్రా.

మిండముండ
మిండల మిడత.
క్రీడా. పు. 69.

మిండటీకంబు చేత
వ్యభిచారము.
"నీ, దేవత లున్నవీటి కరుదెంతు నె మిండటీకంబుచేతకై."
ఉ. హరి. 1.61.

మిండలకోరి
వ్యభిచారిణి.
శ. ర. ప్రా.

మిండవడ్డి
చక్రవడ్డి.
ప్రతిసంవత్సరం అయినవడ్డీని కూడా అసలులో చేర్చి మరీ వడ్డీ కట్టేపద్ధతి.
"మిండవడ్డికి నోర్చి మృత్యురూపము లైన, సాహులచే ఋణగ్రాహి యగుచు." పాండు. 3.16.

మిందన్ను
చూ. మిన్ను దన్ను.

మిట్టకండ్లు
బయటికి పొడుచుకొని వచ్చినకండ్లు.

మిట్టకును చెట్టుకును గాకుండ చేయు
అటూ యిటూ కాకుండా చెడగొట్టు.
"కట్టుము రతిసౌఖ్యములకుఁ, బట్టము గాకున్న ననిచి వేయుము నన్నున్,

మిట్టకుఁ జెట్టుకుఁ గా దను, నట్టివిధము
సేయ వలవ దవనీనాథా!''
రుక్మాం. 5.108.

## మిట్టపంట కలుగు

పెన్నిధి దొరకు, సులభంగా అధికలాభము దొరకు.

''కొలు వేల యిల్లాండ్రు కొడుకు లేల శ్రీ, కలిగె రామునకు నిక్కడ మిట్ట పంట.''
వర. రా. అయో. పు. 593. పం క్తి. 11.

## మిట్టపండ్లు

ఎత్తైన పండ్లు.

## మిట్టపెత్తనములు చేయు

అనవసరప్రసంగములతో రచ్చకట్టలమీద కాలము గడపు.

''కట్టుగుంటలకుఁ బను లంటఁగట్టి మిట్ట గిడసలవలె మిట్టిపడు మిమ్ము మిట్ట పెత్తనములకు విడిచి పెట్టుట యిది మా తప్పే?'' ధర్మజ. 47.15.

## మిట్టమిఱ్ఱు

ఎత్తైన ప్రదేశము.

''మేటికాల్వల మిట్టమిఱ్ఱుగాఁ ద్రవ్వి.''
ద్వి. హరిశ్చ. పూ. 495. పం.

## మిట్టమీది మీను

నేలమీద బడినచేప, స్థాన బలం లేనివాడు.

''వా డీ ఊళ్లో మిట్టమీది మీనుగా పడి ఉన్నాడు. మునుపటి దర్జా యిప్పుడు లేదు.'' వా.

## మిట్టాడంగ నరుండు లేని

నరమానవుడు లేని, మనుష్య సంచారము లేని.

''మిట్టాడంగ నరుండు లేనియడవిన్ మీనాక్షి దీనాకృతిన్.''
మను. 4.68.

## మిట్టి పడు

ఎగిరి పడు, మిడిసిపడు.

''మనికట్టులకు దిగిఁ మఱి మిట్టి పడియె.''
పండితా. ప్రథ. పురా. పుట. 284.

''అక్క! యిది యేమి చోద్యమో యనుచు మిట్టిపడి కళావిక యై యొండుకడకుఁ జేరె.'' శుక. 1.312.

''మిట్టి పడి యిట్టి ట్టై గుట్టు చెడె.''
రాధా. 2.207.

''నాలుగు డబ్బు లున్న వని వాడు మరీ మిట్టిపడుతున్నాడు.'' వా.
మా. మిడిసి పడు—మిడిసిపాటు.

## మిట్టిపాటు

మిట్టిపడుట, మిడిసిపాటు.

''నీ మిట్టిపాటును నీ రాజసంబు.''
ద్వి. హరిశ్చ. పూ. 1230. పం.

## మిట్టి మిట్టి పడు

మిడిసి పడు, ఎగిరి యెగిరి పడు.

''తెగి పడియు నంకుశంబులు విడువక మిట్టిమిట్టిపడు బాహువులు.''
భార. ద్రో. 1.377.

## మిట్టి మీ నై యదల్చు

చేపవలె ఎగిరి పడు.

అయిష్టతను సూచించుచేష్ట.
"పెండ్లి యనుమాటఁ జేర్కొన్నఁ జెనిమి టనిన, మిట్టి మీ నై యదల్చు నమ్మానయన!" శుక. 1.415.

మిడతంభట్లు శకునం (జోస్యం)
కాకతాళీయంగా సరిపడే జోస్యం.
ఒక పాతకథపై వచ్చిన పలుకుబడి.
"మిడతంభొట్లు శకున మనువడువున." గీర. 24.

మిడిగ్రుడ్లవాడు
మిట్టగ్రుడ్లు కలవాడు.
ఆం. భా. 2.21.

మిడిగ్రుడ్లు వెడలు
గ్రుడ్లు బయటికి వచ్చు.
"నిటలంబు ప్రేయఁ బెన్నెత్తురు దొలఁగి, వెడవెడ మిడిగ్రుడ్లు వెడలి రోఁజుచును." ద్విప. కల్యా. 130.

మిడిదల యిచ్చు
దేవతకు శిరసు అర్పించు, బలి చేయు.
"ఈ మెఱుఁగుగండకత్తెర,చే మిడిదల యిచ్చుసాహసికుఁడు......"
కళా. 3 119.
"ఈ మెఱుఁగుగండకత్తెర,చే మిడిదల యిచ్చుసాహసికుఁడు......"
కళా. 6.44.

మిడినాగు
మిణ్ణాగు.
ఎగిరి యెగిరి పడు ఒక రకమైన పాము.

మిడిపండ్లు
"బొక్కిరొమ్మును నూఁదబొడ్డును మిడిపండ్లు." భల్లా. 4. (శ. ర.)
చూ. మిట్టపండ్లు.

మిడిబద్ద
వేటలో ఉపయోగించు ఒక పనిముట్టు.
రామే. మా. 5.79.

మిడిబోను
మృగములను పట్టెడిబోను.
"మిడిబోనులఁ గాలుచ్చుల."
యయా. 2.19.

మిడిమిడిజ్ఞానము
స్వల్పమైనజ్ఞానము.
అంతగా పాండిత్యము లేదనుట.
"సాహిత్యంలో వాడికి మిడిమిడి జ్ఞానమే కాని యే మంత చెప్పుకో దగినపాండిత్యం లేదు." వా.

మిడిమీసములు
కోరమీసములు.
సింహా. 6.41.

మిడిమేళం
మిడిసిపడువాడు.
"వాడు వట్టి మిడిమేళం. వాడు ఎవరి మాట వింటాడు?" వా.
"మిడిమేలపుదొరను గొల్చి మిడుకుటకంటెన్." సుమతి శతకము.

మిడిసి పడు
ఎగసి పడు, గర్వించు.
"వాడి కేదో నాలుగక్షరాలు వచ్చునని మహా మిడిసిపడుతున్నాడు." వా.

మిడిసిపాటు

గర్వముచే కలుగుత్రుళ్లు.

"ఈ చిగిరింతైశ్వర్యానికే యింత మిడిసిపాటా ళ్లి?" వా.

మిడుకు మాలు

చచ్చు.

"తురగచతుష్కంబు, మిడుకు మాలఁగ నేసి మిన్ను ముట్ట." ఉ. హరి. 3.53.

మిడుతగమి లాగున

అధికముగా.

మిడుతలదండు పైరుమీద పడినట్లు.

ఉసుళ్లవలెనే మిడుతలు కూడా వస్తే గుంపులు గుంపులుగా వస్తవి.

ఇది నేటికీ వాడుకలో ఉన్న పలుకుబడి — 'మిడతలదండు లాగా వచ్చారు.'

"ఉసుళ్లవిధంబున మిడుతగమి లాగున....." హంస. 3.29.

చూ. మిడుతల దండులాగా.

మిడుతలదండు లాగా

ఎక్కువగా, గుంపుగా.

మిడత లెప్పుడూ అసంఖ్యాకంగా రావడం, పైరు పంటలను సర్వనాశనం చేయడంపై వచ్చినపలుకుబడి.

"శత్రుసైన్యం మిడతల దండులాగా ఊరుమీద పడి సర్వనాశనం చేసింది." వా.

చూ. మిడుతల గమిలాగున.

మిడుమిడ మిడుకు

మిటకరించు.

"నిత్యమార్కండేయు నిర్జించి కన్న, మృత్యువుక్రియ మిడుమిడ మిడుఁకుచును."

పండితా. ద్వితీ. మహి. పుట. 15.

మిణుగురు మెఱుపు

కనిపించుటే కాని అందులో ఏమీ ఉండ దనుపట్ల ఉపయోగిస్తారు.

వెంకటేశ. 79.

మితి చేయు

కొలుచు.

ఇంత అని వర్ణించి చెప్పు.

"మీ మాహాత్మ్యము మే మింతిం తని మితి చేయఁగ మది నెంతటివారము." కా. మా. 2.153.

మితి పెట్టు

గడవు పెట్టు.

"మత్పునర్దర్శనంబునకై మితి పెట్టిన దినంబు నేఁడ." ప్రభా. 4.22.

మితి లేని

అపరిమిత మయిన.

"మెఱుఁగంచుకమ్మలు నిరసించు మితి లేని, వెల నొప్పుమణుల కమ్మలు ధరించి." శుక. 1.237.

మితి వెట్ట రాని

అపరిమిత మైన

"మీఁద నెట్టకేలకు మితి వెట్ట రాని జయమంగళంబు లగు నని యంతరంగంబున నిశ్చయించి." మను. 4.65.

మిన మిన మను

తళతళ మని ప్రకాశించు.

"అని యెత్తుకొని చంక నలమి ముద్దాడి, మినమిన మనుచెక్కు నీఁటి యాఁబోఁటి."

అ. మ. క. 1.40. పా. 19. పం.

మిన మిన లాడు

మినమిన మని ప్రకాశించు.

(శ.ర.)

మినుకుచు నుండు

మిడుకుచుండు.

"రాజు వృద్ధభావముచేత మినుకుచు నున్నాఁడు."

భాస్క. అయో. 199.

మి న్నంది కొండ దాకు

ఉప్పొంగు.

"కలదు లే దన నసియాడుకౌనుతీరుఁ, దళుకు మొగమున కెగయుగుబ్బల బెడంగుఁ, జూచి యాతని నిడువాలుఁ జూపు లపుడు, నిండువేడుక మి న్నంది కొండఁ దాఁకె."

(తె. జా.)

మి న్నందు

సంతోషించు.

"మిన్నంది వేగఁ గఱుకొని."

పారి. 1.77.

మినుక్కు మినుక్కు మను

తళ తళ మను.

"సంజఁ గెంపారు సన్నంపుఁ జంద్ర రేఖ, యంచు నొక్కింత మిను మినుక్కు మనుచుఁ దోఁచు."

కళా. 7.131.

మిన్ను తలపై బడినను

ఎంత కష్టము కలిగినా,

"ప్రుక్కెనె బాహాగర్వము, దక్కెనె నా కొడుకు మిన్ను దలపైఁ బడినన్."

భార. ద్రో. 2.245.

మిన్ను దన్ను

1. సంతోషముతో ఉప్పొంగు.

"నాగకులంబులు నిద్ర వోయె నిర్జరులును మిన్ను దన్నిరి."

కా. మా. 2.62.

2. మిక్కిలి యెత్తగు.

"మిం దన్ని నే, ఘననీలాంగుఁడు గాంచె."

ఆము. 4.105.

"మెలఁతలు మిన్ను దన్ను తెలిమేడలఁ గ్రీడలు సల్పుచుండి."

రామా. 1.135.

చూ. మిం దన్ను.

మిన్ను మన్ను నెఱుంగక

ఒడలు తెలియక.

కిందూ మీదూ తెలియక.

(తె. జా.)

మిన్ను ముట్టు

సంతోషముతో నుప్పొంగు.

"తన భాగధేయమహిమం, బున మిన్నులు ముట్టి వచ్చుపుణ్యు నతనిన్."

వసు. 2.109.

మిన్ను మోచు

ఆకాశము నంటు.

మిక్కిలి యెత్తైన అనుట.

"మిన్ను మోచి యున్న తెల్లదీవియందు దీపించు వైకుంఠపురము..."

పాండు. 3.153.

మిన్నుల పొడవులు

అత్యున్నతములు.

"మించినకోరిక లివి మిన్నుల పాడ వులు." తాళ్ల. సం. 9.249.

## మిన్నుల బారు

దుముకు, అతివేగముగా పోవు.

"చించుక మిన్నులఁ బారేచింకలను బండి గట్టి." తాళ్ల. సం. 5.119.

## మిన్నుల మోచు

ఆకాశ మంటు.

"తూరుపునం బొడిచెఁ జందురుఁడు మిన్నుల మోవ, పాఱు తెంచె విరహుల బందికాఁడు." తాళ్ల. సం. 4.16.

## మిన్నులు వడ్డ చోటు

అతి దూరప్రదేశము.

"కృత్యములఁ బాపి దైవంబ! కినుక నిట్లు, పాఱ వైచితె మిన్నులు పడ్డ చోట." మను. 2.17.

## మిన్నులు ముట్టు

సంతోషించు.

"మిన్నులు ముట్టి వెన్నెలలు మేపుచుఁ బిల్లలఁ దాము నాడఁగన్." కా. మా. 4.93.

## మిన్నులు రాయు

ఆకాశము నంటు.

"ప్రస్తుతరవంబులు మిన్నులు రాయుచుండు." జైమి. 1.57.

చూ. మిన్ను ముట్టు.

## మిన్ను లొరయు

ఆకాశ మంటు.

"శారభ్యపరిభూతవట్పదపజ్క్తి నా, వహోమధూమము మిన్ను లొరయుచుండఁ!" రాజగో. 5.5.

## మిన్ను విఱిగి పై బడినట్లు

ఏదో మునిగి పోయినట్లనుట.

"భ్రమ గొనినట్లు మిన్నువిఱిగి పైఁ బడినట్లు గ్రహంబు సోఁకిన, ట్లమిత ధనంబు గోల్పడినయట్లు......" తారా.

చూ. మిన్ను విఱిగి మీద కూలినట్లు.

## మిన్ను విఱిగి మీద కూలినట్లు

"ఇట్లు వెడలి యమ్మహీనాథుఁ డరుగంగ, నపుడు పౌరజనము లంత తెలఁగు, నెఱేఁగి మీఁద మిన్ను విఱిగి కూలినయట్టి,కరణి గుండె లవిసి కళవళించి." మార్క. ౦. 1.219.

చూ. మిన్ను విఱిగి పై బడినట్లు.

## మిన్ను విఱిగి మీద బడినట్లు

బ్రహ్మాండ మైన అనాహూతం జరిగినట్లు.

"మెయి మూసికొని గ్రహగణంబులం జెన్నగు మిన్ను విఱిగి పయిం బడిన వడువున బెడంగు వడఁ గలయం." మను. 3.9.

"మిన్ను విఱిగి మీద పడినా అతడు తొణకడు. బెణకడు." వా.

## మిన్ను వ్రీలగ నార్చు

ఆకాశము పగులునట్లు అఱచు, అనగా గట్టిగా అఱచు.

"చదిపి పతాకము సారథి, విదారణము చేసి మిన్ను వ్రీలఁగ నార్చెన్." ఉ. హరి. 4.246.

## మిన్ను వ్రేయు

బయ లప్పళించు

"త్రిలోకరాజ్యవిస్ఫురణము నాకుఁ
దక్కె నని పొంగి దశాస్యుఁడు మిన్ను
ద్రేయుచుం."
నిర్వ. 6.145.

మి న్నెక్కు
ఆకాశమునంటు.
"పెక్కడలం బోరఁ బెరుఁగు పెను
చివ్వలు మి, న్నెక్కె కలహాళి
కన్నుల."
రామా. 8.3.

మిన్నేరు
గంగానది.
భీష్మ. 2.91.

మిరియాలపేరు
ఒక రకమైన నగ.

మిఱుమిట్టులు గొల్పు
కన్నులు జిగేలు మను.
"మిక్కిలి తేరి చూడ మిఱుమిట్టులు
గొల్పు." విజయ. 3.14.

మిఱుమిట్లు వోవు
అతి ప్రకాశ కిరణ సంప
ర్కంతో కనులు మూసి
తెఱచుకొను.
నేడు ఏదైనా 'కనులు మిఱు
మిట్లు గొల్పుతున్న' వని
అనుటే అలవాటు.
ఈ అర్థంలో 'కనులు
మూతలు పడుతున్న'
వన్నట్లు అనుటే వాడుక.
"కన్నులు మిఱుమిట్లు వోవంగ."
కళా. 1.86.

మిలమిల మెదలు
మెదలు.
ధ్వన్యనుకరణము.
"సంజనితము లై ప్రువ్వులు గలగొన
మిలమిల మెదలు నందు."
భార. మౌస. 1.21.

మిలమిల లాడు
తళతళ మని ప్రకాశించు.
"మిలమల లాడుచుం దవిలి మింట
వెలింగెడురిక్క లన్నియుం."
అచ్చ. రా. సుం. 22.

మిసమిస మను
మిసమిస ప్రకాశించు.
"మిసమిస మనుమిట్టనొసలివాఁడు."
వరాహ. 2.45.

మీగడ కట్టు
పాలు క్రాగి పైన తఱకలు
గట్టు.
"వరలి మీఁగడ కట్టి వడియుచంద్రి
కలును." రాధా. 4.97.

మీ గొప్ప మీకే ఉండనీ
వాదంలో 'మీరు గొప్ప
వారైతే కావచ్చు. మా
కేమి ?' అనుట వాడుక.
"మీక యుండెడుఁ గాక మీ మహ
త్త్వంబు, మా కేమి ?"
పండితా. ప్రథ. పురా. పుట. 433.

మీ చదివినయాకుననె తాను
జదివినది
'మీ మాత్రం తెలివి తనకూ
ఉన్నది లే' అనుపట్ల ఉప
యోగించే పలుకుబడి.

"ఇది యెంత పేర్చెదరు మీ, చదివిన యాపనసె తాను జదివినయది మా, సుదతియు మొదల ఫలించెన్, దద భీష్టము పెద్దపిన్నతనముల వరుసన్." ప్రభా. 5.74.

మీ చిత్తం మా భాగ్యం

మీ దయ మా అదృష్టం. 'మేము చెప్పేది చెప్పాము. చేసేది చేశాము. ఇకమీఁద మీ ఇష్టం' అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"పైని మీ చిత్తమును మాదు భాగ్యమును న,రేంద్ర!" నానా. 4.

మీఁద చూచు

గర్వించు.

"సిరిపెంపునఁ గడు నొప్పెడు, సురనాయక! యిపుడు మీఁదఁ జూచెదు." భార. శాం. 4.435.

....మీఁద దెచ్చుకొను

...పైన వేసుకొను, బాధ్యత వహించు.

"ఒక్కని చావు, తనమీఁదఁ దెచ్చుకోఁ దలఁచునె యొకఁడు." వర. రా. బా. పు. 186. పంక్తి. 4.

మీఁద బెట్టుకొను

(తన) పైన వేసికొను.

"వ్యాజ్య మొకవేళఁ బోయిన వాని సాక్షి, మీఁదఁ సెప మిడి గెల్చిన మీఁదఁ బెట్టు,కొని నటింతురు..." శతా. 151.

మీఁద మీఁద

వెంట వెంటనే.

"మీఁద మీఁద సుఖనిమిత్తంబు లొదవుచో, నడుమఁ జెందు నిజజనంబు ప్రీడ." కళా. 5.32.

మీఁద మీఁదనె ప్రాణంబు మిడుకుచుండ

పై ప్రాణాలు పైనే పోతూ ఉండగా.

"వ్రాలె నతఁడు, మీఁద మీఁదనె ప్రాణంబు మిడుకుచుండ." ఉ. హరి. 1.46.

మీఁద వచ్చు

దండెత్తు.

"తన మీఁద వచ్చిన ఘను లైనదొరలను, నూటిపై నొక్కని గీటడంచి." రంగా. 1.112.

మీఁదికార్య మెవ్వ డెఱుంగున్

'మనచేత నైనది చేస్తాము. తరువాతిది దైవాధీనము' అనుపట్టుల ఉపయోగించే పలుకుబడి.

"తుది నిల్లు చూఱవిడిచిన, నిదియేమో మీఁదికార్య మెవ్వఁ డెఱుంగున్." శుక. 3.85.

చూ. ఆపైన దేవు డున్నాడు

మీఁదికి మీఁద జీవములు వోవు

పై ప్రాణాలు పైనే పోవు.

"మహా, శాయులఁ దద్గణాధిపులఁ గాంచుచు మీఁదికి మీఁద జీవముల్, వోయిరి." కు. సం. 2.201.

మీఁదికి వచ్చు

జోలికి వచ్చు.

"తెలుఁగుమీఁదికి నంతగ రాదు వా రొగిఁ." గుంటూ. పూ. పు. 4.

మీది ప్రాణములు మీదనె పోవు

పై ప్రాణాలు పైనే పోవు.

చింతా.

(తె. జా.)

చూ. పై ప్రాణములు పైనే పోవు

మీదు కట్టు

ఎప్పటికో ఎవరికోసమో ప్రత్యేకించు.

"మేము ఈసారి ఆవు ఈనగానే మీదు కట్టాము. దేవుడి కిచ్చేవరకూ ఇంకెవరికీ పాలు పోయము."

చూ. మీఁదుగడ కట్టు.
ముడుపు కట్టు.

మీదుగడ కట్టు

మీఁదు కట్టు.

ఎప్పటికో, ఎవరికోసమో ఉంచు.

దేవతలకు మొక్కుకొన్నప్పుడు పాలో, డబ్బో మీఁదు కట్టడం అలవాటు. ఆ దేవతకే అవి నిర్ణీతసమయంలో సమర్పించాలి. అందుపై వచ్చిన పలుకుబడి.

"మీఁదుగడ కట్టనే లంచు మించు బోఁడి." పాండు. 4.167.

చూ. మీఁదు కట్టు.

మీదుగా

గుండా.

"అందుండి ప్రభాసతీర్థంబు మీఁదుగా జని." కాశీ. 3.111.

"ఆ పల్లెమీదుగా పోయి ఉత్తరం ఒక మైలు వెళ్ళితే ఆ ఊరు చేరుకో వచ్చు." వా.

మీదు తలంచు

జరుగనున్నదానినిగూర్చి ముందే ఆలోచించు, దూరదృష్టితో మెలగు.

"మేడ్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపవు గాక." ఉ. హరి. 4.198.

మీదు పరికింపక

జరుగనున్న దానిని గూర్చి ఆలోచింపక, దూరదృష్టి లేక.

"నెఱపెఁ బో ప్రభువు మన్నించినాఁడని మీఁదు, పరికింప కీ సొమ్ము పట్టు కెట్లు?" కళా. 2.85.

మీదు పోవు

రూ. మీఁదు వోవు.

మీదు మిక్కిలి

పైగా.

మీదు లెత్తు

మీఁదు కట్టు.

"శుద్ధవేళ సుఖప్రసూతి గావలె నంచు, నిలువేల్పులకు మీఁదు లెత్త రమ్మ." కువల. 2.26.

చూ. మీఁదు కట్టు.

మీదు వోవు

మీఁదు పెట్టు.

"వేలుపులకు, మీఁదు వోకున్నఁ గడపని." కాశీ. 7.139.

చూ. మీఁదు కట్టు.

**మీదు చూచు**

జవాబు చెప్ప లేక పోవు.

బదులు చెప్ప లేక ఆకాశం పై చూచుటపై వచ్చిన పలుకుబడి.

"మరీచి సోమరి యై మీఁదు చూచుచు నుండె."

గా. హరి. ప్రథ. పంక్తి. 124.

"ఎనిమిదీ నాలుగూ ఎంతా అని అడిగితే మీదికి చూస్తూ కూర్చుంటా వేమిటి రా?" వా.

**మీ దెత్తు**

మీదు కట్టు.

"పాటించి నీ భావము పట్ట వశమా? మేటి నా మనసు నీకు మీ దెత్తుటింతే." తాళ్ల. సం. 7.29.

**మీ దెఱుగక**

జరుగ నున్నది కానక.

"విని దనుజుఁడు మీఁ దెఱుఁగక, చనియె జితేంద్రియుల కేటి సంతతి యనుచున్." ఉ. హరి. 2.189.

**మీనమేషములు లెక్క పెట్టు**

అనుమానించు.

"వరబలం బిది నీ ప్రజ్ఞ పనికి రాదు, లెక్కిఁకను మీనమేషముల్ లెక్క యిడక, జూఁకు తురకలఁ గొట్టఁగాఁ జుక్కయెదురె?"

సింహాద్రినార. శ. 23.

**మీన్ మ్రింగిన గ్రుక్కన్ వారిధికిం గొఱతయె**

'ఈ మాత్రంతో వచ్చేనష్టమేమిటి?' అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

'చేప త్రాగిననీరుతో సముద్రానికి కొఱత యేర్పడుతుందా?' అని వాచ్యార్థము.

"మీన్ మ్రింగిన...కొదయె విష్ణుకీర్తన కనినన్." ఆము. 6.64.

**మీ పుణ్యమున**

మీ దయవలన.

"ఇపుడు మీ పుణ్యమున నాకు నేమి కొదవ." శుక. 2.522.

"మీ పుణ్యాన నాకీ ఉద్యోగం దొరికింది." వా.

"ఆయన పుణ్యాన నే నీ మాత్రం ఉన్నాను —" వా.

**మీ పెట్టిన చెట్టు**

మీ వల్లనే వృద్ధికి వచ్చిన వాడు.

మీరు ప్రేమింపదగిన వాడనుట.

"మీ పెట్టినచెట్టినజూఁడు."

భాస్క. కిష్కిం. 489.

**మీ పెట్టుచెట్టు**

మీరు వేసినచెట్టే.

మీరు పోషించినవాడే కదా అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"నాపట్టి నన్ను రాజ్యముఁ, జూపట్టఁగ నిల్పినారు సుగ్రీవుఁ డయో, మీ పెట్టు చెట్టు గాఁడా, చేపట్టినవెనుకఁ గినుక సేయఁగ నగునే!"

రామాభ్యు. 6.43.

**మీఱ లనినంతయు చెల్లు**

మీ రేమన్నా ఒప్పుకో వలసిందే.

"మీఱ లనునంతయుఁ జెల్లును." కళా. 3.191.

"నే నేమో వాడు మంచివా డని చెప్పాను. మీ రేమో కా దంటారు. కడకు వాడు దుర్మార్గు డని బుజువు చేసుకొన్నాడు! ఇంక మీ రేమన్నా చెల్లుతుంది." వా.

"మీ రేమో అధికారులు. నే నేమో ఆశ్రితుణ్ణి. మీ రేమన్నా చెల్లుతుంది." వా.

**మీఱు బెట్టు**

గర్వింప జేయు.

"మీసుతుని మట్టు వెట్టక మీఱుఁ బెట్టి." సానందో. 5.16.

**మీసం గొఱిగించు**

అవమానించు.

"ఎవ డన్నా ఎదిరించి మాట్లాడాడా వాడిమీసం గొఱిగించి పంపుతాను." వా.

**మీసం గొఱిగించుకుంటాను**

ఒట్టు.

ఒక రకమైన ప్రతిజ్ఞ.

'వాడు మూడు నాళ్లల్లో దివాలా తీయక పోతే నేను మీసం గొఱిగించు కుంటాను." వా.

"మూడురోజుల్లో నీరోగం నయం కాకపోతే నేను నా మీసం గొఱిగించు కొంటాను. ఈ మందు వేసి చూడు." వా.

**మీసం త్రిప్పు**

పౌరుషము ప్రదర్శించు.

"ఊళ్లోకి కాస్త బలవంతుడు వస్తే చాలు, మా వస్తాదు మీసం తిప్పు తాడు." వా.

**మీసంబుపై కేలు వైచు**

పౌరుషసూచక మగుచేష్ట.

"దాని సొగ సాత్మలో మెచ్చి తలఁ గదల్చి, కేరి మీసంబుపై ముదుకేలు వైచి." హంస. 2.240.

**మీసంబులు వడివెట్టు**

మీసాలు త్రిప్పు.

"ప్రాసంబులు చేపట్టుచు మీసంబులు వడి వెట్టుచు కరవాలమ్ములు పెఱుకుచు." హేమా. పు. 29.

**మీసం మీద చెయ్యి వేసి**

ఎవ డడ్డు వస్తాడో చూస్తాం? అన్నట్లు అనేమాట.

"మీసంమీద చెయ్యి వేసి యీ దారి మూసేస్తాను. ఎవ డడ్డు వస్తాడో రానీ." వా.

**మీసం మెలి వేయు**

పౌరుషసూచకముగా అనుట.

"వాణ్ణి చూచేటప్పటికి వీడు మీసం మెలి వేస్తాడు." వా.

**మీసకట్టు**

మీసపుతీరు.

"వాడి మీసకట్టు అందంగా ఉంటుంది." వా.

**మీస ముంటే రా**

మొగతన ముంటే రా.

కొట్లాటలలో అనేమాట.

"మీసం ఉంటే బయటికి రారా." వా.

ఇదే 'మూతిమీద మీసం ఉంటే, మొహాన మీసం ఉంటే' ఇత్యాదిరూపాలలో కూడా కనబడుతుంది.

మీసము నులుచు
మీసము నులివేయు.
మీసము త్రిప్పు.
"కోరమీసము నుల్చి గుద్దెల్లఁ జేసి."
గౌర. హరి. ద్వి. 1394.

మీసముమీది కేలు
మీసముమీది చేయి.
వయసు, పౌరుషము, ప్రాభవము సూచించేచేష్ట.
"లకుచకుచాలలామ శుభలక్షణలక్షిత కౌతుకప్రదా,యక మగుజాదుగోరుదర హాసము మీసముమీఁది కేలు."
శుక. 2.378.
"వాడిచేయి మీసముమీదికి పోయింది." వా.
"మీసంమీద చేయి వేసి యీపని చేస్తాను." వా.

మీసములు దీటు
పౌరుషసూచకముగా పురుషులు మీసముమీద చేయి వైచుట, మీసములు దువ్వుట అలవాటు.
"మించినవేడ్క రక్కసులు మీసలు దీఁటుచు..." కా. మా. 2.26.

మీసలు వడిపెట్టు
మీసములు త్రిప్పు.
"నీ మీసలు నా చేరువ వడిపెట్టెదవు." సింహా. 7.28.

మీసాలపై తేనియలు
అస్థిరములు.
"......చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్."
మను. ఆ. 2.

మీసాలపై నిమ్మకాయలు నిలుపు
మీసాలు పెద్దవనుట. వానినే 'పుస్తీమీసా' లంటారు.
పూర్వం బోయదొరలు మీసాలపై నిమ్మకాయలు నిలిపేవారట.

మీసాలపోతు
మీసాల సంరంభం తప్పితే చేవ సున్న అనుట.
"వాడు ఒట్టి మీసాలపోతు. కఱ్ఱ చూస్తే పది ఆమడలు పరిగెత్తిపోతాడు." నా.

మీసాలు దువ్వు
పౌరుషము ప్రకటించు.
"చేకత్తు లెగఁ జిమ్ముచు చెలఁగి మీసాలు దువ్వుచు, కేకలు వేసి నవ్వుచు మూకలు గూడి."
హేమా. పు. 12.

ముంగతనము
మూగతనము, బండతనము.
'మూక' శబ్దభవము ముంగ కావచ్చును.
"మును ముట్ట నది యేల ముంగతనంబు."
పండితా. ప్రథ. పురా. పుట. 394.

ముంగాము చీర

స్త్రీలు కట్టుకొనెడి ఒక రక మైన నారచీర.

(శ. ర.)

ముంగాములరారి రం గగు

ముంచేతికడియ మగు.

"పగిలి రాకాని దేహంబు మెంగపు ముత్య, మయ్యె ముంగాముల రారి రం గై మురారి," మను. 6.115.

ముంగిట పెన్నిధి

అందుబాటులో ఉన్న నిధి, అనగా చాల పనికి వచ్చు వా డనుట.

బస. 7.207.

చూ. పెరటి కల్పకము.

ముంగిట వేయు

బయట పాఱవేయు.

"చిత్త మెల్ల దక్కఁ గొనె సిగ్గులు ముంగిట వేసి, వత్తివలె దేహ మెల్ల వాడఁ బాఱెను."

తాళ్ల. సం. 3.28.

ముంగిటి కల్పభూరుహము

"ముంగిటి కల్పభూరుహము మూల ధనంబు నివేశనంబులో, బంగరు వాన..." అనిరుద్ధ.

చూ. ముంగిటి కల్పకము.

ముంగిటి నిధానము

"ముంగిటినిధాన మమ్మలముద్దు దమ్మ, లన్న యీతనిఁ గనదేని కన్నతల్లి, కడుపు మసి గాదె దయ్యము కరుణ లేదె." ఉ. హ. 5.278.

చూ. ముంగిటి పెన్నిధి.

ముంగిటి పారిజాతము

అందుబాటులో ఉండి కోరి కలు దీర్చువాడు.

"భక్తజనముల ముంగిటి పారిజాతము."

కా. మా. 1.51.

ముంగిటి ముత్య మగు

కలకల లాడు, ప్రకాశించు.

"తల్లి ప్రేమఁ గరము దనరారె ముంగిటి, ముత్య మగుచుఁ గ్రొత్తక్రొత్త సిరుల."

కళా. 6.197.

ముంగిటిముత్యము

గృహాలంకారము.

"ముద్దు గారే యశోద ముంగిటి ముత్యము." తాళ్ల. సం. 9.288.

ముంగిటి సేవధి

ముంగిటిపెన్నిధి వంటిది.

"ముంగిటిసేవధి శ్రీరంగశాయి."

కవిక. పీఠిక. 91.

ముంగి లా (గున)

మూతి ముడుచుకొని.

"మనసు విప్పి చెప్తే ఏ దయినా చెయ్యొచ్చు. ముంగి లా కూర్చుంటే, ఏం చేస్తాం?" వా.

ముంగిలి వారణాశి

వాని జీవితపరిధి చాల సంకు చిత మనుట.

కాశ. శత. 81.

ముంగి లెఱుగనిముద్దరాలు

ఇలు వెడలనియిల్లాలు.

"బలవదసహ్యాసింహశరభప్రముఖోగ్రవ నాంతభూమి ని, మ్మల నిపుడంప

పోయెదమె ముంగి లెఱుంగని ముద్ద రాల నా, వలఁ బని యేమి......"
విక్ర. 7.108.

## ముంగై మురారి

అందుబాటులోనిది.

"ముంగిటి నిధానము."
తాళ్ల. సం. 5.75.

## ముంగొంగున చిచ్చు ముడిచికొను

"......నీవారు నీవును ముంగొంగునఁ జిచ్చు ముడిచికొన నపేక్షించినా రెవ్వాఁడు విహితమార్గమ్ము విడిచి వర్తించు నమ్మూఢుండు తన యత్నంబు లెల్ల విఫలంబులై పోవం జెడిపోవు."
భాస్క. యుద్ధ. 885.
చూ. చిచ్చొడిగట్టు.

## ముంగొంగుపసిడి

అందుబాటులో నున్న అమూల్యవస్తువు.

"పరమార్థలాభతత్పరుఁ డైనవానికి, ముంగొంగుఁబసిఁడి శ్రీరంగశాయి."
కవిక. 1.91.

"భక్తకోటికి ముంగొంగుపసిఁడి యగుచు."
విప్రనా. 1.9.

"భక్తజనులకు ముంగొంగుపసిఁడి గాఁడే."
జైమి. 1.116.
చూ. కొంగుబంగారము.

## ముంగోపము

ఓర్పు లేక తటాలున వచ్చు కోపము.

"ముంగముఁ బొడువ లేని ముంగోప మిఁక నెప్పు, డలఁక చొచ్చె నేనిఁ బులక నగుదుము."
ఊ. రా. 3.7.

## ముంగోపి

ముక్కోపి.

ప్రతి చిన్న విషయానికీ కోప పడుస్వభావం కలవాడు.

"దుర్జనావళిఁ గన్న భర్జించు ముంగోపి."
చంద్రా. 5.150.

## ముంచుకొని వచ్చు

1. అంచు గట్టుకొని వచ్చు, గొంతుమీదికి వచ్చు.

"అంతా ముంచుకొని వచ్చాక యిప్పుడు వాళ్ల కాళ్లూ వీళ్ల కాళ్లూ పట్టుకొంటే యేం లాభం?"
వా.

2. మీద పడు.

"వాడికి ఒకటిమీద ఒకటిగా కష్టాలు ముంచుకొని వచ్చినవి."
వా.

'అతడికి గంటలమీద శీతం ముంచుకొని వచ్చింది."
వా.

"వాడికి మృత్యువే ముంచుకొని రాక పోతే సరిగ్గా ఆవేళకే ఆ చెట్టుమీదికి ఎందుకు పోతాడు. ఆచెట్టు ఎందుకు విరిగి పడుతుంది?"
వా.

## ముంచుకొను

అధిక మగు, ఎక్కువగా వ్యాపించు.

"మూఁడు మూర్తులపైన ముంచుకొను నీవలపు."
తాళ్ల. సం. 9.110.

"ముంచుకొను సంపెఁగల సౌరభంబు నకు."
పాండు. 4.16.
చూ. ముంచుకొని వచ్చు.

## ముంజి గట్టు

ఉపనయనము చేసుకొను.

ఉపనయనంలోని భాగంగా మొలతాడు కట్టుట కలదు.

"ముఖ్యవ్రతనూత్నదీప్తి ముంజి గట్టెడు నాఁడె, కవులఁ బ్రోచుటకుఁ గంకణము గట్టె." పాండు. 1.41.

## ముంజీతము

పనికి ముందుగానే వచ్చు జీతము

తాళ్ల. సం. 9.219.

## ముంజెకొండ్రు

సన్యాసులు.

"ముంజెకొండ్రను జేసి మురిపెపు డంప." పల. పు. 70.

## ముంజెపద నగు

తాటిముంజవలె నుండు.

"ముంజెపద నైనశంబర, భంజను గేహములు..." క్రీడా. పు. 67.

## ముంజేతి కంకణంబున కద్ద మేల?

స్పష్టమైన విషయ మిది అనుట.

ముంజేత నున్న కంకణం స్పష్టంగా కాన వస్తుంది. ఇక దాన్ని చూచుకొనుటకు అద్దం ఎందుకు?

అతి స్పష్టమైన సంగతికి మఱొక సాక్ష్య మెందు కనుట.

"ముంజేతికంకణంబున కద్ద మేల, భంజింపఁ బడుజినప్రతిమయ సాక్షి, యిల ప్రసిద్ధము నేఁడు నెఱుఁగుదు గాదె." బసవ. 6.163.

పండితా. ప్రథ. వాద. పుట. 620.

## ముంజేతిదర్పణము

అరచేతి మాణిక్యమువంటిది.

"ఉపనిషదర్థబోధోత్పత్తికళ నీకు, ధన్యాత్మ! ముంజేతి దర్పణంబు." రాధా. 1.54.

## ముంజేయి యాడిన మోచేయి యాడును

సహాయ మనునది పరస్పరాశ్రయ మనుటపై యేర్పడిన పలుకుబడి.

"రంజిలి తా మును మున్నుగ, నంజలి పడ వచ్చె నేని నయముగ వారల్, గొంజక యిత్తురు క్రమ్మఱ, ముంజేయియు నాడె నేని మోచే యాడున్." కచే. 1.108.

## ముంటి గంటి దెలియు

వివరములు తెలియు.

"ఎవ్వ రెటు సేయదురో యెట్లు లెఱుఁగ వచ్చు, కర్కటిక గాదు గద ముంటి గంటిఁ దెలియ." పంచ. వేం. 1.37.

## ముంటిమొన నిల్చినట్టు లుండు

అతికష్టముమీాద ఉండు.

'ముండ్లమీాద ఉన్నట్లు' అని నేటి వాడుక.

"ముంటిమొన నిల్చినటు లే, ముంటిమి నినుఁ బాసినట్టి మొదలు లీవలఁ బలన్." ప్రబంధరా. 727.

"ఆ వెధవ ఉన్నంతసేపూ నాకు ముండ్లమీద ఉన్నట్లుగా ఉండినది." వా.

ముండదైవము

పాడుదైవము – చేత గాని దైవము.

వేసటతో 'ఆపాడుదేవుడు' అన్నట్లు ఉపయోగించే పలుకుబడి.

ముండాదేవుడు అని వాడుక.

"ముగురం గూర్చిన ముండదైవము నకున్ మ్రొక్కించు జేజే యనున్." (తె. జా.)

"ముగురిం గూర్చినముండదైవము నకున్ మోమోట లేదో." భీమ. 3.6.

చూ. ముండాదేవుడు.

ముండబ్రతుకు

అదనబ్రతుకు.

"ముండబతుకు బతకడంకంటే ఉన్న మూడునాళ్లూ ముగసిరితో బతకడం మంచిది." వా.

ముండమోపి

విధవ.

ఒక తిట్టు.

"వాపోవుదురె ముండమోపులపగిది." పండితా. దీక్షా. 82 పా.

ముండ మోయు

వైధవ్యమును పొందు.

"రంగమ్మ ముండ మోసి అప్పుడే నాలుగునెలలు కావచ్చిందా?" వా.

ముండలమారి

వ్యభిచారి.

(శ. ర.)

ముండల ముతాకోరు

పచ్చి వ్యభిచారి.

శ్రవణా. 4.53.

"ఆ ముండలముతాకోరు కిస్తే మీ బతుకు బండలై పోతుంది." వా.

ముండాదేవుడు

పాడుదేవుడు.

"ఆముండాదేవుడు కన్ను తెరిచి ఎప్పుడు చూస్తాడో ఈ జీవం ఎప్పుడు పోతుందో?" వా.

చూ. ముండదైవము.

ముండ్లపై కూర్చున్నట్లు

అశాంతిగా.

"వాడున్నంతసేపూ వీడు ముండ్లపై కూర్చున్నట్లుగా కూర్చున్నాడు. వీళ్లిద్దరికీ ఈమధ్య పడడం లేదు లే." వా

ముండ్లు గండ్లు అనక

రాయీ రప్ప గమనించక.

"...పవన,తనయుం డరిగెం బవలు సని నట్లు చీఁకటి, యనక ముండ్లు గండ్లు ననక తెరలి." భార. అర. 6.161.

ముంతనీళ్లనే మునుగుబతుకు

అతి సంకుచిత మైనజీవితము.

"ముంతనీళ్లనే మునిగేబ్రదుకు." తాళ్ల. సం. 1. పు. 151

ముంతపాటున కైన

త్రాగుట కైన.

నిరం. 2.123.

ముంతపొగ పెట్టు

ఎవరైనా తప్పు చేసినప్పుడు శిక్షగా పల్లెలలో పూర్వ కాలం ఎక్కువగానూ, నేటికీ క్వాచిత్కంగానూ ముంత పొగ వేస్తారు.

ఒక గదిలో ఆ అపరాధిని బంధించి ఒక ముంతలో నిప్పులు వేసి దానిలో మిరప కాయలు వేసి అక్కడ పెడ తారు. ఆ ఘాటుకు వాడిదిమ్మ తిరిగి పోతుంది. ఇలా చేయని చోట్ల కూడా పిల్లలను బెది రిస్తూ మామూలుగా అంటారు. 'అల్లరి చేశా వంటే ముంతపొగ వేస్తాను. ముంతపొగ పెడతాను' అని.

"పతిపత్ని నని మేనఁ బసుపు పూసి కొనంగ, సొగసులా యని ముంతపొగ ఘటించు." శుక. 2.115.

ముంతల బోసినట్లు

కుంభవృష్టిగా, ఎక్కువగా అనుట.

"కనుగ్రంతల ముంతలఁ బోసినట్లు బోరనఁ గడు బాష్పపూరములు గ్రమ్మఁగ." పాండు. 3.91.

చూ. కుండపోతగా.

ముంతవాటు

తాగుడు.

ముంతలో వైచి దాచుట అని

సూ. ని.

"మోసపోయితి దీని ముంతవాటున కైనఁ, జేకూర్ప లేనైతి రూకసుట్ర." నిరం. 2.123.

ముందటి శిరం బుండ మోకాలి కిని సేస వెట్టంగ క్రియ గొనినట్లు

వ్యర్థమైన పని.

తల ఉండగా మోకాలికి తల బ్రాలు పోసి నట్లు.

పండితా. ప్రథ. దీక్షా. 202. పుట.

ముందటేడు

గతవత్సరమునకు పూర్వవత్స రము.

"నిరుడు ముందటేఁడు నిన్న మొన్న." వేమన. 1.169.

ముందడుగు వేయు

ఉవ్విళ్లూరు.

"పితృహితంబుగ నా మహాక్రతు వుపక్రమింప నాడెందంబు ముందడుగు వేయుచున్నది." ధర్మజ. 25.2.

ముందర నుండుట ముసళ్ల పండుగు

తాళ్ల. సం. 3.528.

చూ. ముంద రుంది ముసళ్లపండగ.

ముందర వెనుక లగు

తలక్రిందు లగు.

"వలచి తిరువేంకటేశ్వరునిం బొందిన వరుని, తలఁపు లన్నియును ముందర వెనుక లాయె." తాళ్ల. సం. 4.49.

ముందరి చెవులకంటె వెనుక వచ్చు కొమ్ములు వాడి యగు

క్రొత్త స్నేహితులో, చుట్టాలో ముఖ్యులై పాతవారిని మఱచి పోయినప్పుడో, ఉపేక్షించి నప్పుడో ఉపయోగించేపలుకుబడి.

తాళ్ళ. సం. 3.585.

ముందల కట్టులు కట్టి

కాళ్ళూ చేతులూ ఒకచోటికి వచ్చునట్లు మనిషినికట్టి.

కుమా. 2.79.

ముందల చీర

తలపాగా.

"మోహనబాణపాతమున ముందల జీర లెఱుంగ కున్న..."

భార. విరా. 5.278.

ముందలపట్లకు తొడగు

కొట్లాటకు దిగు.

"ఇద్దఱు సతుల్ వాక్యోపవాక్యంబులన్, గాకే ముందలపట్లకుం దొడఁగి రాకల్యాణ వేదిస్థలిన్."

పాంచా. 4.24.

ముందల వట్టు

తల ముందుభాగము పట్టుకొను.

"ముందల వట్టినట్లు తన ముఖ్యతరాస్త్రము గొన్న దేవకీ, నందనుఁ జూచి సాధ్వసము నానయుఁ గ్రమ్మ..."

పారి. 5.88.

ముందుకు వచ్చు

1. అభివృద్ధిలోకి వచ్చు.

"వాళ్లు ఆవ్యాపారంలోనే ముందుకు వచ్చారు."

వా.

2. అన్నపానాదులకు వీలు కలుగు.

"పనీ పాటా లేకుండా కూర్చుంటే ఎట్లా ముందుకు వస్తుంది!"

వా.

3. గర్భిణి యగు.

"ఆముండ అక్కడా యిక్కడా యేం యేడ్చిందో యేమో ముందుకు వచ్చి మొత్తుకుంటూ ఉంది."

వా.

ముందుచూపు

దూరదృష్టి.

నా. మా. 37.

ముందు పడు

ముం దగు.

"ఏ పనికీ వాడు ముందు పడతాడు."

వా.

ముంపు గొను

గుంపు కూడు.

"ముంపుగొని విరుల వానల, జొంపంబులు గురియ" భాగ. 8.510.

ముకుగంబము

ముక్కుదూలము.

చూ. ముక్కుదూలము.

ముకుగొయ్య

శిక్షాసాధనము, శత్రువు.

"పంకజంబుల ముకుగొయ్య యచ్యుతుని ముద్దుమొఱంది వెలింగె."

సింహా. 4.115.

చూ. ముక్కుగొయ్య.

ముకుచాయ౽

ముక్కునకు తిన్నగా.

"మూఁడవ యామంబున నొక్క నాడు ముకుచాయ౽ దివ్వెటీ గ్లాల్చి రా." వేం. పంచ. 1.115.

ముకుద్రాట గాలు గ్రుచ్చు

అదే పనిగా తగాదాకు పిలుచు.

"అప్పు డాడ రాదె యిప్పుడు ముకుఁ ద్రాటఁ, గాలు గ్రువ్వ నేల కమల నాభ!" భార. ఉ. 3.220.

"లేదు చిక్కులు వెట్ట లే దని చెప్పఁ, గా దని ముకుఁద్రాటఁ గాలు దుయ్యకుము." హరి. ద్వి. భా. 1482.

ముకుపుటా లదరు

కోపముతో.

కోపము వచ్చినప్పుడు కలుగు ఆంగిక చేష్ట.

ముక్కంటి కంటిసెగలో చణక ములు వేచుకొను

నిప్పుతో చెలగాట మాడుట వంటిది.

శివుని ఫాలనేత్రం భస్మం చేస్తుంది. అలాంటి దాని సెగలో సెనగలు వేయించు కోవడం అంతే కదా.

"ముక్కంటి వెలుంగుకంటఁ జణకం బులు వేచుకొనంగఁ బూనరే." ప్రభా. 5.189.

ముక్కద్దాలు

సులోచనాలు.

చూ. కంటిఅద్దాలు.

ముక్క పోవు

కుంఠిత మగు.

"తక్కక పరస్త్రీలఁ దలఁచి మనసు బుద్ధి ముక్క పోయి మాకు." తాళ్ల. సం. 6.61.

ముక్కర మాను

పుల్లిరుసు తిరుగుచట్రము.

శ. ర. బ్రౌన్.

ముక్కఅయు గమ్మలను దాల్చి మురియ జూడ జాలమి

పచ్చగా ఉండగా చూడ లేక అన్న అర్థంలో ఉపయోగించినమాట.

"ముక్కఅయుఁ గమ్మలను దాల్చి మురియుచున్నఁ, జూడఁ జాలక యిట్లాడినాఁడ వేమొ." శుక. 1.449.

ముక్క అయు గమ్మలను దాల్చి మురియు

తాత్పర్యార్థం – పచ్చగా ఉండు.

"ముక్కఅయుఁ గమ్మలను దాల్చి మురియునన్నుఁ, జూడఁ జాలక యిమ్మాటలాడె దేమొ." శుక. 3.296.

ముక్కాలి పీట

మూడు కాళ్లమర్చిన యెత్తైన బల్ల.

"ముద్దులు గుల్క చందనపుముక్కాలి పీఁట వసించెఁ దమ్మిపూ, ముద్దియ." విజ. 3.72.

ముక్కాక యగు

మిక్కిలి కష్టమగు.

"అందఱితోఁ బోవు నటు గాదు వీని, ముందఱ నెదిరింప ముక్కాఁక యగును."

వర. రా. యు. పు. 311. పంక్తి. 16.

ముక్కాకల దేఱు

గడిదేరు, అతి సమర్థుడగు.

"ధీరుఁడు తన ముక్కాఁకల, దేఱిన దళవాయి యొక్కఁ డతిసిరబలుఁడై." శుక. 1.257.

ముక్కాకల నాఱి తేఱు

గడిదేరు, ఆఱితేఱు.

"ముక్కాఁకల నాఱి తేఱిన మహాశూరుల్." జైమి. 1.87.

చూ. ముక్కాకల తీఱు.

ముక్కారు బండు

సంవత్సరమునకు మూడు పంటలు పండు – సమృద్ధిగా అని భావం.

"గాదెలఁ గొలుచు ముక్కారుఁ బండెడుమళ్లు, నత్తోపు నడబావు లంత దొడ్డి." శుక. 2.145.

ముక్కాలిపీట

"గొడుగుఁబావలు గందవొడిపెట్టె నునుసాన, గడియార మంచ ముక్కాలి పీఁట." వైజ. 3.74.

చూ. ముక్కాలిపీట.

ముక్కిడి

ముక్కు సరిగా పని చేయని.

"ముక్కిడితొత్తుప ముత్తెంపున తేలశి?" రామలింగశతకము.

"ఆముక్కిడివెధవ మాటాడితే ఏమాటా స్పష్టంగా తెలియదు." వా.

ముక్కుకు ముందు మూరెడు కోపం

అతి కోపిష్ఠి అనుట.

"వాడికి ముక్కుకు ముందు మూరెడు కోపం. వాడిజోలి కెవరు పోతారు?" వా.

ముక్కుకు సూటిగా పోవు

న్యాయబద్ధముగా నడుచు.

"వా డెప్పుడూ ముక్కుకు సూటిగానే పోతాడు. ఈ వంకరటింకర దారు లన్నీ వా డెరగడు." వా.

ముక్కుగొట్టము

చూ. ముక్కుపుల్ల.

ముక్కుగొయ్య

నాశకుడు.

"టక్కరి యొకమింద్ర ముక్కుఁ గొయ్య." అచ్చ. రా. యు. 204.

రూ. ముకుగొయ్య.

ముక్కుగోలు

ముక్కుజెఱమ.

"భర్గుం డీవేళ ననుగ్రహించె నని ముక్కుం గోళ్లలో నెక్కి యుద్దండ క్రీడఁ దదీయకుంభకుహరస్థానంబులన్ ద్రిమ్మఁ జన్." కాశీ. 2.146.

ముక్కుజెఱమ

నాసాపుటము.

"క్రక్కున ముక్కుం జెఱమ లదర నదరి పడిం జనుదేర..."

రాజ. చ. 2.74.

ముక్కుకోట మూవురు

సరిగా ముగ్గురు.

"ముక్కుకోట మూవు రిక్కడ కు
ముక్కలు లై యనుదెంచి రంమఁ జే,
రుక్కున..." ఉ. హరి. 6.37.

ముక్కు డుస్సినపసరము

ముక్కు త్రాడు వదలిన పశువు.

అనగా స్వేచ్ఛగా వదలినది అనుట.

"వసుధేశ ! ముక్కు డుస్సిన, పసరము
క్రియ." పంచతంత్రము. 3.224.

ముక్కు డుస్సిన పసరము క్రియ

ముక్కుత్రాడు వదలి పోయిన పసరమువలె-యథేచ్ఛముగా-నోటికి వచ్చినట్లు అనుట.

ఏ అడ్డూ ఆటంకం లేక స్వేచ్ఛగా అనుట.

"వసుధేశ! ముక్కు డుస్సిన, పసరము
క్రియఁ గెరలి తిట్టెఁ బక్కన ఋషి వా,
రుసురు మని వెడలి పోయిరి, ముసలి
గవా పుట్టినిల్లు ముఖ్యోష్ణతకున్." మను. 6.47.

ముక్కుతీరు

చక్కనిముక్కు.

"ఆవిడ ముక్కుతీరే కొడుక్కూ
వచ్చింది." వా.

ముక్కుతూ మూలుగుతూ

అయిష్టంతో, బాధతోనే.

"ఆవిడ ముక్కుతూ మూలుగుతూ నే
ఈ యింటిపని అంతా చేసుకొంటూ
ఉంటుంది." వా.

ముక్కు తెగబారెడు చేయు

కోపించు.

"పాతకి నైతి ముక్కు తెగ బారెడు
చేసితి నిక్క మచ్యుతా!
పాండవాశ్వ. 42.

ముక్కుతో నేడ్చు

నసుగు.

"అంత యిష్టం లేకపోతే మానెయ్యి.
ముక్కుతో ఏడుస్తూ ఎందుకు
చేస్తావు?" వా.

ముక్కు దఱుగు

శిక్షించు.

పూర్వకాలంలో ముక్కూ, చెవులూ కోయడం ఒక శిక్ష.

"కయ్యాలక్రచ్చ లై కడఁగి యీ
వచ్చు, దయ్యాల ముక్కులు దఱిగి
ఖండింతు." గౌర. హరి. ప్ర. 1981-82.

ముక్కుదాకా తిను

అతిగా తిను.

"నే నిప్పుడే ముక్కుదాకా తిని
వచ్చాను. మంచినీళ్లకు కూడా స్థలం
లేదు." వా.

ముక్కుదూలము

ముక్కులోని ప్రధాన మైన యెముక.

"వాడు కాలు జాఱి కింద పడ్డాడు.
ముక్కుదూలం పగిలింది." వా.

**ముక్కునకుం జక్కటిమీదిదె యాకాశ మను**

తనదే సరి యను.

"వాఁడు కూపస్థమండూకంబుం బోలెం దన ముక్కునకుం జక్కటిమీఁదిదె యాకాశంబు తనగొందియ లోకం బని యెంచి..."

నీతిచం. పు. 55. పం. 13.

**ముక్కున గవ్వ గుట్టి యీడ్చు**

అవమానించి లాగుకొని వచ్చు.

గవ్వలు గట్టడం అవమాన సూచకం.

"ముక్కున గవ్వ గుట్టి నిను ముందుగ నీడిచి తెమ్మటంచు మా, రక్కసి ఱేఁడు పంపె వినరా దివిజర్షభ..."

దశావ. వామ.పు. 166.

**ముక్కున గోప ముండు**

అతికోపిష్ఠి అనుట.

"ఉడుగక ముక్కున నుండుఁ గోపంబు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 566.

"ముక్కుననే యుండుఁ గదా మునీశ్వరులకుం గోపంబు." విప్ర. 4.71.

రూ. ముక్కున నుండు కోపము.

**ముక్కున నీ రెత్తు**

ఒక రకమైన శిక్ష.

శిక్షార్థము ముక్కులో నీళ్లు పోస్తారు.

"ఓరీ! కోమటి ముక్కున, నీ రెత్తుఁడు మేము కినియ నేరక యున్నన్."

కేయూర. 3.201.

**ముక్కున నుండు కోపము**

శీఘ్రముగా కోపము వచ్చు ననుట.

"జడలు గట్టుట వృథా శాంతి యాతనికి, నుడుగక ముక్కున నుండుఁ గోపంబు." ద్వి. హరిశ్చ. పూ. 6.94.

**ముక్కున నూర్పు గల్గ**

1. ముక్కున ఊపిరి ఉండగా. అరకొరగా ప్రాణం ఉన్నప్పటికీ అనుట.

"మీ ముక్కున నూర్పు గల్గ మన మోహార మీ దురవస్థఁ బొందునే."

భార. భీష్మ. 2.119.

2. ముక్కులో ఊపిరి ఉండే దాకా.

"ఎక్కడి దుఃఖశాంతి గడ యీఁదుట యెమ్మెయిఁ గల్గ నేర్చు మీ, ముక్కున నూర్పు గల్గ నొకమూర్ఖునిచేఁ బడితిన్ సభాస్థలిన్." భార. విరా. 2.226.

**ముక్కున ప్రాణ ముండు**

అవసానదశలో నుండు.

"ముక్కున నున్నది ముందటఁ బ్రాణము, ఎక్కడ నమ్మెదిఁక బ్రదుకు."

తాళ్ల. సం. 10.131.

**ముక్కునబంటి**

మించినవాడు.

చాలినవా డనుట.

"......నరేశ్వర! లంకలో పలన్, లేఁ డితఁ డెప్పుడున్ సమర లీలల ముక్కునబంటి వజ్రికిన్."

భాస్క. యుద్ధ.

ముక్కునబంటిగ

ముక్కు దాకా.

అంటే పూర్తిగా అందులో మునిగి పోవునట్లుగా – తలకు మించి అని భావార్థం.

"మురహరపద్మజానులకు ముక్కున బంటిగఁ బోరు లోఁ ఖీ, కరు."

కుమా. 12.197.

ముక్కున వయ్యంగ దిను

బాగా తిను.

'ముక్కులో వచ్చునట్లుగా' అని కూడా వాడుకలో విన వస్తుంది.

"వెక్కసాన రేపల్లె వెన్న లెల్లా మాపుదాకా, ముక్కున వయ్యంగ దిన్న ముద్దులాఁడు." తాళ్ల. సం. 4.142.

ముక్కునా నోటా

ఎక్కువగా.

"వాడు ముక్కునా నోటా తింటాడు."

వా.

ముక్కుపచ్చ లారని

వయసు రాని.

"ముక్కుపచ్చలార కెక్కు చకోరంపు, నిసువు మెసవు కరము నిశిత మనుచు."

చంద్రాం. 5.86.

ముక్కు పచ్చలు మానక మునుపె

చిన్నతనమునందే.

"ముక్కుపచ్చలు మానక మునుపె బిరుదు, పెచ్చుకు నెదిర్చి కొట్లాడ వచ్చి నటుల."

(తె. జా.)

చూ. ముక్కుపచ్చ లారని.

ముక్కుపచ్చలు మానని

పసితనము వీడని.

"ముక్కుపచ్చలు మానక మునుపె."

రాధి. 3.8.

చూ. ముక్కుపచ్చ లారని.

ముక్కు పట్టని ముత్యము

పెదవికి మించిన పల్లులాంటి పలుకుబడి.

చింతా.

(తె. జా.)

ముక్కు పట్టుకొని కూర్చుండు

ప్రాణాయామము చేయుచు కూర్చొను, జపము చేయు. ప్రాణాయామము చేయుటలో ముక్కును వ్రేళ్లతో మూసికొనుటద్వారా వచ్చినది.

"......పొలుఁడు ప్రాతః,కాలమునఁ దతటాకము, కూలంబున ముక్కు పట్టుకొని కూర్చుండుణ్."

శుక. 2.464.

"హుతభుక్సన్నిధి ముక్కు పట్టుకొని కూర్చున్నట్టి యీ యింద్రజి, ద్దితిజుం బోరికిఁ జీరి చంపి మరలెణ్, దేవేంద్రుఁ డుప్పొంగఁగణ్."

రామాభ్యు.

చూ. ముక్కు మూసికొని కూర్చుండు.

ముక్కు పట్టుకొను

1. జపము చేయు.

"పొద్దున్నుంచీ మధ్యాహ్నందాకా మీరు ముక్కు పట్టుకొని కూర్చుంటే ఇంట్లో పనెవరు చూస్తారండీ."

వా.

2. నిర్బంధించు.
"వాడు ఇస్తావా ఛస్తావా అని ముక్కు పట్టుకొని కూర్చున్నాడు. ఇంత హఠాత్తుగా ఎక్కడినుండి తెచ్చి యివ్వను?" వా.

ముక్కుపుడక
ముక్కులో పెట్టుకొనుఆభరణము.
చూ. ముక్కుపుల్ల.

ముక్కుపుల్ల
చూ. ముక్కుపుడక.

ముక్కుపై కత్తి
గుండెగాలమువంటి పదము. భయంకరుడు, పని పట్టించ గలవాడు – అనుట.
ఇటువంటి పదావళి మనకు చాలా ఉన్నది.
"వాదసమయుల ముక్కుపై కత్తి."
పండితా. ప్రథ. వాద. పుట 511.
చూ. వీపుగోల మెంద.

ముక్కుపై వ్రేలిడు
ఆశ్చర్యపడు.
"వ్రేలిడి ముక్కుపై వెఱగందివుంది."
పల. పు. 112.

ముక్కుపై వ్రేలు చెక్కు
"అక్కడి విశేషములు వీనుల కెక్కినంత నయెంతటివారును ముక్కులపై వ్రేలు చెక్కక మానరు."
ధర్మజ. 51.11.
చూ. ముక్కుపై వ్రేలు వేసికొను.

ముక్కుపొడి
నశ్యం.
దక్షిణాదిలో నశ్యమును 'ముక్కుపొడి' అని వాడుతారు.

ముక్కుపోగు
ముక్కుకమ్మి, నత్తు.
(శ. ర.)

ముక్కు బద్ద లగు
దుర్వాసనవల్ల.
"ఆ సందులో వెళ్లాలంటే ముక్కు బద్దలవుతుంది." వా.

ముక్కు బెదురు
ఏదో దెబ్బ తగిలినప్పుడు ముక్కులో రక్తము వచ్చు.
"వాడికి ముక్కు బెదిరింది. కాస్త పిడక నలిపి వాసన చూపించు. ఆరక్తం ఆగి పోతుంది." వా.

ముక్కుమీద కొట్టి చేయించుకొను
బలవంతంగా ఆపని నిర్వర్తించుకొను.
"వా డెక్కడికి వెళ్లినా ముక్కుమీద కొట్టి పని చేయించుకొని వస్తాడు." వా.

ముక్కుమీద కోపం
కోపిష్ఠి అనుట.
"వాడి కెప్పుడూ ముక్కుమీద కోపం." వా.

ముక్కుమీద గుద్ది....
చూ. ముక్కుమీద కొట్టి...

ముక్కుమీద వేలు వేసుకొను
ఆశ్చర్యపడు.

ముక్కుముల్లు
బాధ కలిగించువాడు.

"ఎక్కడు మదమున నెల్ల లోకులకు, ముక్కుము లెత్తి యున్నమూర్ఖు రావణుని."

రం. రా. ఉ. 148. పా. 19. పం.

ముక్కు మూసికొని

దుర్వాసనను భరించ లేక అనుట.

"ఆ సందులో ముక్కు మూసికొని తప్ప వెళ్ల లేము." వా.

ముక్కు మొగం చదర మగు

బాగా దెబ్బ తగులు ననుట.

"అంత పై కెక్కావు. కింద పడ్డావంటే ముక్కు మొహం చదర మవుతుంది." వా.

ముక్కు మొగం బా గున్నది

అంద మైన దనుట.

"ఆ పిల్ల ముక్కు మొహం బాగున్నది." వా.

ముక్కు మొగంబు చూడక

పరిచయము లేక.

భీమ. 3.8.
విజయ. 3.30.

ముక్కు మొగము ఏడ

వాడికి మొగ మెక్కడి ది? అనుట.

"ముండగోష్ఠికి ముక్కు మొగ మేడఁ దనకు." హరి. 2 భా. 1056.

రూ. ముక్కు మొగ మేడ.

ముక్కు మొగము చూచు

ఆదరించు.

"ముక్కు మొగంబు చూడ కొక మోసపుమాటకు విశ్వాసాయకం, దెక్కడి కైనఁ బొమ్మనుచు నెఱ్ఱని చూపుల..." భీమే. 5.6.

ముక్కు మొగ మేడ

ముఖ మెక్కడి దనుట.

అంత యోగ్యత యెక్కడిది? అనుట.

"ముండగోష్ఠికి ముక్కు మొగ మేడ తనకు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి 1056.

రూ. ముక్కు మొగము ఏడ?

ముక్కులు పగిలిపోతున్నవి

దుర్వాసనవల్ల అనుట.

"పక్కింట్లో ఏమి చేస్తున్నారో ఏమో కానీ ముక్కులు పగిలి పోతున్నవి." వా.

ముక్కులు మూసుకొని కూర్చుండు

చూ. ముక్కు మూసుకొని కూర్చుండు.

ముక్కులు మూసుకొని పోవు

జలుబు మొదలగు వాని వలన...

"ఆరాత్రి పల్లెకు పోయి వచ్చాను. శీతం తగిలి ముక్కులు మూసుకొని పోయాయి." వా.

ముక్కులోనికి చాలదు

అత్యల్ప మనుట.

"ఇదంతా వాడి కేపాటిది? ముక్కులోకి చాలదు." వా.

నోటిలోని కసరే చాల దనుట.

ముక్కులో పెట్టుకున్నా వాసన లేదు

బొత్తిగా వాసన లేని వస్తువుట.

"కస్తూరి అని వాళ్లమ్ముతున్నారు గానీ అది ముక్కులో పెట్టుకున్నా వాసన లేదు." వా.

ముక్కులో పొగలు వచ్చు

కారమైనవస్తువులు తిన్నప్పుడు ఆఘూటు నసాళానికంటు అనుట.

సహజంగా ఎక్కువ కారం తిన్నప్పుడు ముక్కులో నీళ్లు రావడం మనం చూస్తూనే ఉన్నాం కదా!

"ఒఱ్ఱదనము, పొగలు వెడలింప నాసికాపుటములందు."

నైష. 6.121.

ముక్కులో వెంట్రుక పీకినట్టు

మనసు చివుక్కుమనునట్లు.

ముక్కులో వెండ్రుక పీకితే మహాబాధగా ఉంటుందికదా!

"వాడేం మాట్లాడినా ముక్కులో వెండ్రుక పీకినట్టు మాట్లాడుతాడు." వా.

ముక్కు విఱుచు

ఈసడించు.

"......బాంధవులు ముక్కు విఱువం బుత్రులు వేసరం గళత్రంబులు వేసరింప............"

కవిక. 5.110. (తె. జా.)

ముక్కుస

మూడుకుంచములు.

"ముత్యాలపాడి మాకు ముక్కుస ఫలయు." భక. పు. 2.433 పం.

ముక్కు సొట్ట పోయినదా?

నీకు వచ్చినమహానష్ట మేమి? అనుట.

"బావ ఒకమాట అంటే మాత్రం ఏమి లేవే? నీ కేం ముక్కు సొట్ట పోయిందా?" వా.

ముక్కూ చెవులూ కోసి

అవమానపఱచి అనేఅర్థంలో తిట్టుగా ఉపయోగిస్తారు. శూర్పణఖకథద్వారా వచ్చిన పలుకుబడి.

"అది యిలాగే ప్రవర్తిస్తూంటే ముక్కూ చెవులూ కోసి పంపించవలసి వస్తుంది." వా.

ముక్కూ మొగం ఎరుగను

ముఖపరిచయం లేదనుట.

ఇందులో కొంత నిరసన ఉన్నది.

"వాడెవడో? వాడి ముక్కూ మొహం నే నెరగను. వాడి దాక్షిణ్యం నా కేమిటి?" వా.

ముక్కూ మొహం తెలియదు

అమాయకుడు, అజ్ఞాని.

"వాడికి ముక్కూ మొహం తెలియదు. వాడితో ఏం మాట్లాడి ఏం లాభం?" వా.

ముక్కూరి వగచు

ఏడ్చు.

ఏడ్చినప్పుడు ముక్కు ఊరుట సహజము.

"...వలవని వెఱపు గట్టికొని ముక్కూరి వగచుచున్నావు."

భాగ. ఉద్యో. 2.222. (తె. జా.)

ముక్కోటి యేకాదశి
ఒకపర్వం.
మార్గశిర శుద్ధ ఏకాదశి.

ముక్కోపము
మాటకు ముందు వచ్చు కోపము.
(శ. ర.)

ముక్కోపి
మాటకు ముందు కోపపడు స్వభావము కలవాడు.
"మా నాన్న ముక్కోపి అని నీకు తెలిసే ఉంది గదా. ఆయనతో ఆ మాట యెందు కన్నావు రా ?" వా.

ముక్తాయింపు
ముగింపు.
(శ. ర.)

....ముఖం
నిరసనగా అనుమాట.
"వాడి ముఖం. వాడి కేం తెలుసు ?"
ఇలాగే నీ ముఖం, దాని ముఖం.

....ముఖం ఎట్లా చూస్తాను ?
ఏదైనా తనకు గొప్ప అవమానం జరిగినప్పుడు తన సన్నిహితులకు ముఖము చూపలేక పోవుట సహజము. దానిపై వచ్చిన పలుకుబడి.
"ఇన్ని జరిగినతర్వాత నీ ముఖం నేను ఎట్లా చూడ గలను ?" వా.

ముఖం చాటు చేసుకొను
మొగము తప్పించు.
"నేను కనబడితే అడుగుతా నని వాడు ముఖం చాటు చేసుకొని తిరుగు తున్నాడు." వా.

(నా) ముఖం చూచి....
నా దాక్షిణ్యం వలన అనుట.
"నా ముఖం చూచి అయినా వాడికి నీ వీ మేలు చేశా వంటే..." వా.
"నీ ముఖం చూచి కానీ వాడే వచ్చి ఉంటే నాలుగు తిట్టి పంపించి ఉండే వాణ్ణి." వా.

ముఖం చెల్లు
సంకోచము లేక పోవు.
ఇది సామాన్యంగా వ్యతిరేకార్థంలోనూ, వ్యతిరేకార్థానికి దగ్గరగానూ ప్రయుక్త మవుతూ ఉంటుంది.
"ఆరోజు వా డామాట అన్నప్పటి నుంచీ అక్కడికి పోవా లంటే నాకు ముఖం చెల్లడం లేదు." వా.
"ఆ రోజు జన్నిమాట లన్నాము. తిరిగీ అక్కడికి పోవడానికి ముఖం చెల్లు తుందా ?" వా.

ముఖంమీద కొట్టు
ఛీకొట్టు.
"నీ వక్కడ పోయి యీ మాట అన్నా వంటే ముఖంమీద కొట్టి పంపిస్తాడు." వా.

ముఖం ముడుచుకొని
అసంతృప్తిగా.
"తన కేమీ యివ్వ లే దని ఆవిడ పెండ్లింటిలోనే ముఖం ముడుచుకొని కూర్చుంది." వా.

ముఖం మొత్తు

విసు గెత్తు.

"తీపు తిని తిని మొహం మొత్తి పోయింది." వా.

ముఖం లేదు

సంకోచించు ననుట.

"వాడు వెనక యేమేమో అన్నాట్ట. ఆ సంగతి నాకు తెలిసిం దని వాడికి తెలుసు. అందుకే నాముందు పడ్డా నికి వాడికి ముఖం లేదు." వా.

ముఖం వాచినట్లు

బాగా.

తిట్టుటలోనే ఉపయోగిస్తారు.

"వాణ్ణి ముఖం వాచేటట్లు చీవాట్లు పెట్టి పంపించాను." వా.

చూ. నెత్తి వాచునట్లు.

ముఖం వెల వెల బోవు

మొగము తెల్లబడు.

"ఆమాట వినేసరికి వాడి మొఖం వెల వెల పోయింది." వా.

ముఖకవళికలు

ముఖంలోని భావ రేఖలు.

"వాడు చేసినవి ఒకొ్కక్కటీ చెప్పే కొద్దీ వాడిముఖకవళికలు మా రుతూ వచ్చాయి." వా.

"వాడి ముఖకవళికలు గమనిస్తే వా డింతపని చేసి ఉంటా డని తోచదు." వా.

ముఖతః

స్వయంగా చెప్పగా.

"వాడి ముఖతః వింటే గానీ యీ మాట నేను నమ్మను." వా.

ముఖదాక్షిణ్యం

మొగమాటం.

"వాడికి ముఖదాక్షిణ్యం ఎక్కువ. ఎదురుగా ఏదీ కాదన లేడు." వా.

ముఖప్రక్షాళనము చేయు

మొగము కడుగుకొను.

ముఖప్రీతిగా

కేవలం ఎదుటివారిని సంతోష పెట్టుటకు – ఇచ్చకముగా.

"ముఖప్రీతిగా మాట్లాడడం నాకు చేత కాదు. ఉన్న దున్నట్టుగా అనడమే నా అలవాటు." వా.

ముఖప్రీతికి, ముఖప్రీతికోసం అనేరూపాలలో కూడ యిది కనిపిస్తుంది.

ముఖప్రీతిమాటలు

హృదయపూర్వకంగా కాక ఎదుటివారిని సంతోషపెట్టు టకై అనుమాటలు.

"ఈ ముఖప్రీతి మాటల కేం లే. అసలు జరిగినసంగ తేమిటో చెప్పు." వా.

ముఖ మంత చేసుకొను

సంతోషించు.

"దాని దే ముంది? పాపం! అమాయకు రాలు. ఒక రవికగుడ్డ యిస్తే ముఖ మంత చేసుకుంటుంది." వా.

ముఖ మింత చేసుకొను

చిన్న బుచ్చుకొను.

"వాడి లేచిపోయిన చెల్లెలి విషయం ప్రస్తావించేసరికి వాడు ముఖ మింత చేసుకుని కూర్చున్నాడు." వా.

చూ. మొగ మింత చేసుకొను.

ముఖ ముబ్బింది

కొన్ని వ్యాధులలో కనబడు దుర్లక్షణం.

"నిన్నటినుంచీ వాడి మొహం ఉబ్బింది. నాకు అనుమానం వేస్తూ ఉంది." వా.

ముఖము వేల వేయు

దిగాలు పడు.

"ఇంటినుంచి డబ్బు రాక పోయేసరికి ఆ విద్యార్థి మొహం వేల వేసుకొని కూర్చున్నాడు." వా.

ముఖలక్షణం

అదృష్టం.

"వాడి ముఖలక్షణం మంచిది. ఎక్కడికి వెళ్లినా కాదనిపించుకోకుండా పని నెఱవేర్చుకుంటాడు." వా.

ముఖవర్చస్సు

ముఖంలోని తేజస్సు.

"వాడిది మంచి ముఖవర్చస్సు." వా.

ముఖవికాసం

ముఖవర్చస్సు.

"వాడు మంచి ముఖవికాసం కలవాడు." వా.

ముఖవీణ

ఒక రకమైన వాద్యము.

"మీఁట సురతానులు కామాక్షులు ముఖవీణెలు పిల్లఁగ్రోవులు దండెలు ఢక్కీలు చంద్రవలయంబులు." ప్రబంధ. 605.

ముఖశుద్ధి

ముఖమును కడుగుట.

ముఖస్థము

కంఠపాఠము.

"ఎల్ల పురాణవాసనలు వావిరి నీ ముఖస్థములు." రుక్మాం. 1.55.

"వాడికి ఆ పుస్తక మంతా ముఖస్థంగా వచ్చు." వా.

ముఖాగ్ని

దావాగ్ని, కార్చిచ్చు.

ముఖాన ఉమ్మి వేయు

అవమానించు, నీచముగా చూచు.

క్రొత్త. 28.

ముఖాముఖి

ప్రత్యక్షముగా, ఎదురుగా.

"విన ముఖాముఖి చెల్లు." కవిక. 4.146.

"ముఖాముఖి కలుసుకుంటే కానీ యిది తేలదు." వా.

ముఖాముఖి నిల్చు

ఎదురు బదురుగా నిల్చు.

"ననుఁ జేరుకొని పిల్చి నా ముఖాముఖి నిల్చి, జననాథ! పోరాడి చంప లేవైతి." సుగ్రీ. పు. 30.

ముఖాసా

తీరువ లేనిభూమి, మాన్యము.

హిందీలో మొఖాసా.

"పుడమియు మన్నెకజీర్ణకు, నడుచు ముఖాసాలు గాక నగరి ధరిత్రిక్." ఉ. హరిశ్చ. 1.66.

ముగబడు

పూనుకొను.

"ఆ ఊళ్లో దేవాలయం కట్టించాలంటే ఒక్కరూ మొగబడి రావడం లేదు."
వా.

ముఖమున పడు, మొగమున పడు – ముందు నిలుచు.

**ముగ్గు పెట్టిన పిండి**
అస్థిరము.
వేంకటేశ. 71.

**ముచ్చటకావుగా**
నెచ్చెలిగా, అతి ప్రియముగా.
"ముచ్చటకాఁపుగాఁ దమ వినోదపు నెచ్చెలిగా ననుఁ గడుఁ, మచ్చికఁ జూతురు."
ప్రభా. 4.19.

**ముచ్చట దీర్చు**
1. కోరిక తీర్చు.
"ముదమునఁ జతురుఁడు నిచ్చ దాని ముచ్చటఁ దీర్చుఁ."
హంస. 3.167.

2. ప్రియము నెఱవేర్చు.
"వసుమతీతనయ, ముచ్చట దీర్ప రాముని పంపు పూని, యేతెంచెనో!"
వర. రా. సుం. పు. 145. పంక్తి 16.

**ముచ్చట పడు**
వేడుక పొందు, ప్రియపడు.
"ఇచ్చట నేనున్న నెల్ల పౌరులును, ముచ్చటపడి దినంబును వత్తురనియు."
రం. రా. అర. 145. పొ. 3. పం.

**ముచ్చటలు మునుగు**
ఇష్టపడు, ముచ్చట పడు.
"హవ్యముల్ భుజియింప నలవి గాకొరు లగ్ని, సప్తజిహ్వాలను ముచ్చటలు మునుఁగ."
విప్ర. 1.63.

**ముచ్చటలు సెప్పు**
కబుర్లు చెప్పు.
"విష్ణుండు గావ వచ్చు ననుచుఁ దా ముచ్చటలు సెప్పు సతులకు."
భాగ. స్క. 1.282.

**ముచ్చు టాడు**
ముచ్చట గూర్చు.
"మోవిపై విడెపు కెంపు ముచ్చటాడంగ."
తాళ్ల. సం. 3.400.

**ముచ్చు ముడిగి పడు**
పూర్తిగా పాడగు, అడగిపడు.
"పులకలు మైదీఁగఁ బొలయు నొక్కొకమాటు, ముచ్చిరి యప్పుడ ముచ్చు ముడుఁగు."
కమా. 5.70.

**ముచ్చు ముడుగు**
1. నశించు.
"మోహపత్తు మువారి మొగముల పగిది నం, భోరుహవ్రాతంబు ముచ్చు ముడిఁగె."
ప్రబోధ. 4.49.

2. ముడుచుకొని పోవు.
"ముచ్చు ముడింగి వ్రాలె వెడ మూర్ఛ తనుఁ బొదువఁ రక్తంబుపైఁ."
జైమి. 3.112.

**ముచ్చికకొడి**
ఏదైనా పని ముగింపుకు వచ్చే కాలము.
"వాళ్లింట్లో పెండ్లి ముచ్చికకొడికి వచ్చినట్లే వచ్చి యే కారణంచేతనో ఆగి పోయింది."
వా.

**ముచ్చిచ్చునను వేగు**
ఆందోళన చెందు.
నిప్పులపై నున్నట్లు అనుట.

"మను ప్రతిశ్రుతము చేసిన పైఁడి రాకున్న, ముచ్చిచ్చునను పేరు వచ్చు ననుక." పాండు. 4.149.

**ముచ్చిబంగారు**

కాకి బంగారు.

"ముచ్చిబంగారమున కాదిమూర్తి యైన." పాణి. 4.16.

రూ. ముచ్చెబంగారు.

**ముచ్చి మూడుమాటలలో**

మూడు ముక్కలలో చెప్పు అన్నట్లు ఉపయోగించేపలుకుబడి.

సంగ్రహముగా ననుట.

"నీ చాటుభారత మంతయు వినుటకు నాకుఁ దెఱపి లేదు గాని ముచ్చి మూడుమాటలతోఁ జెప్పఁ గలిగితివా, చెప్పుము." చింతా. 7.68.

**ముచ్చుట్లు సుట్టు**

మూడుసార్లు ప్రదక్షిణము చేయు.

"లింగంబు ముచ్చుట్ల సుట్టి." పండితా. ప్రథ. దీక్షా. పుట. 175.

**ముచ్చెతో కొడతాను !**

ఒక తిట్టు.

కోపంతో ఎదుటివారిని తిట్టుటలో ఉపయోగించేపలుకుబడి.

"ఇంకొకమాట మాట్లాడా వంటే ముచ్చెతో కొడతాను. జాగ్రత్త." వా.

**ముచ్చెబంగారు**

రూ. ముచ్చిబంగారు.

**ముచ్చెమటలు పట్టు**

అతిగా చెమట పట్టు, భయపడు.

"ముచ్చెమటలు పట్టి చావునకు సిద్ధమయ్యేదవో లేదో." సాక్షి. 33. పు.

చూ. ముచ్చెమటలు పోయు.

**ముచ్చెమటలు పోయు**

చూ. ముచ్చెమటలు పట్టు.

**ముచ్చెలకాల చమరు**

తిరస్కరించు. నీచముగా చూచు.

ముచ్చెలు వేసుకొన్న కాళ్లతో నలిచి వేయు.

ఇప్పటికీ తిట్లలో 'చెప్పుకాలితో కొట్టుట, చెప్పుకాలితో రాయుట' విన వస్తుంది.

"సపరిష్కృతవియజ్ఝరవాలుకాలింగ, సమితి ముచ్చెలకాళ్లఁ జమరి." ఆము. 1.41.

**ముచ్చెవాటు**

చెప్పుదెబ్బ.

"పుక్కిటివిడె మీయఁ బోయి తిలోత్తమా, వనజలోచన ముచ్చెవాట్లు పడియె." కవల. 1.39.

**ముచ్చెవాడు**

మాదిగవాడు.

**ముటీముటాలుగా**

ఇంచుమించుగా, కాస్త తక్కువే అనుట.

"ముప్పావు బియ్యం వేస్తే ముగ్గురికీ ముటీముటాలుగా సరిపోతుంది." వా.

ముట్ట గొల్చు
బాగుగా సేవించు.
తుదిదాకా పూజించు, కొలుచు.
"శివదేవు ముట్టఁ గొల్వఁగ." భార. అను. 5.393.
"ముట్టఁ గొల్చినఫలం బిట్టుండ వలదె." బస. 5.131.

ముట్ట జెప్పు
చెందునట్లు చేయు.
"ఏదో పేరు చెప్పి వాడికి పదిరూపాయలు ముట్ట జెపితే సరిపోతుంది." వా.

ముట్ట నాడు
మర్మము నాటునట్లు మాటలాడు.
"ఏ ఫలంబు గట్టుకొంటి వని ముట్ట నాడినం గ్రీడి యోడకుం డని వారి నూఱడించి." జై. భా. 7.175.

ముట్ట ముడుగు
పూర్తిగా క్షీణించు.
"నీతి మట్టువడియె నిర్మలజ్ఞానంబు, ముట్టముడిఁగె బోధ మూరిఁ బోయె." భాగ. 6.135.

ముట్ట ముదలించు
తల వంచు.
పూర్తిగా ఆజ్ఞాబద్ధుడ వని సూచించు.
పూర్వకోశాలలో ఈ పద బంధం లేదు. 'ముదలించు'కు ఎదుర్కొను, అడుగు అని ఇచ్చారు. అవి యిక్కడ సరిపడవు.
"ప్రార్థించుచు నడుగుల కెఱఁగుచును ముట్ట ముదలించుచును." పండితా. ప్రథ. పురా. పుట. 442.

ముట్టికాళ్ళవాడు
ఒండొంటిని తాకు మోకాళ్లు కలవాడు.

ముట్టిన కందునో
అతి సుకుమార మనుట.
"రోమాంకురస్థానముల్, పరఁగన్ ముట్టినఁ గందునో యన." కళా 7.111

ముట్టిన మాత్రాన మునిగించు
క్షణములో నాశనము చేయు ననుట.
నేడీ 'మునిగించు' ముంచుగా వినిపిస్తుంది.
"ముదమునఁ ద్రిదశారి మురియుచున్నాఁడు, ముట్టినమాత్రాన మునిఁగించు నతని." మైరా. పు. 21.

ముట్టిపాటు
పిడికిలిదెబ్బ.
"ఒకయా టొక ముట్టిపాటు నొందక తండు." కవి. 2.104.

ముట్టుకోలు
ముట్టడి.

ముట్టుకోలు గొను
ముట్టడించు.

ముట్టునీళ్లు
ఋతుస్నానము.
బహిష్ఠ యైన నాలుగవరోజు చేసెడిస్నానము.

**ముట్టు పడు**

కలత పుట్టు.

**ముట్టు పాటగు**

సంకటము కలుగు.

"మిగులంగ ముట్టుపా టగుటఁ జేసి కలంక, నేరికి నెఱిఁగింప నెఱుఁగ కిట్లు." కళా. 8.163.

**ముట్టెమోపు**

ఏదైనా పని ముగింపుకు వచ్చే కాలము.

"వాడు ఇన్నిరోజులుగా ఊరుకుని యిప్పుడు ముట్టెమోపున నాచేత కాదంటున్నాడు." వా.

**ముడికాళ్లవాడు**

చూ. ముట్టికాళ్లవాడు.

**ముడి కొను**

వెండ్రుకలు ముడి వేయు.

"అలకలు ముడికొని." పాండు. 3.31.

**ముడిగిబ్బ**

ముసలి యెద్దు.

ఆబోతు అని

శ. ర.

**ముడి దిన్ననక్క**

మలినము తిన్ననక్క.

చివరవఱకు విడువక బాధించు వాడని భావార్థము.

"గడుసు తుంటరి జోగి గ్రక్కిన ముడుసు, ముడి దిన్ననక్క ముమ్మొకటు పిసాళి."

గా. వారి. ద్వితీ. పం. 649-50.

**ముడి పడు**

పరిష్కారమగు.

తమిళంలో 'ముడివు' అనగా ముగియు.

"ఇది తెగదు, ముడి పడదు. దీన్ని కట్టుకొని ఏం చేస్తాం?" వా.

**ముడిబట్ట**

అంచులు లేనివస్త్రము.

శ. ర. బ్రౌన్.

**ముడియవిడుపులు**

దొంగలు.

'మూట' ధనం అన్నఅర్థంలో ఉన్నది. మూట కిక్కడ 'ముడియ' వాడినారు. ముడిని విడిపించువారు. ఇక్కడ స్త్రీల విషయంలో ఉపయోగించిననింద.

పండితా. ప్రథ. పురా. పుట. 343.

**ముడియ వేయు**

ముద్ర వేయు.

ధారాళముగా చెప్ప వచ్చు ననుట.

"మౌనముద్రయె కాని మాటాడు వేడుక, కడు నని ముఖకాంతి ముడియ వేయ."

కవిక. ఆ. 3.

**ముడియ వైచు**

వస్త్రమును ముడి వేసి ప్రమాణము చేయు.

"ఎల్లసమయములను నీకుండు వేల్పని, ముడియ వైవ వచ్చువనువుపోలె"

ను. సం. 8.64.

**ముడి పడు**

1. ముప్పిరి గొను.

"నడవ నొయ్యారంబు ముడి వడంగ."
శా. మా. 4.121.

2. సుడులు తిరుగు.
"శోకాగ్ని ధూమసమితి, ముడివడి వదనరంధ్రముల వెడలె."
కుమా. 2.42.

## ముడి వేయు

సంబంధము కలుపు.
"దానికీ దీనికీ ముడి వేస్తే ఏం లాభం? దీని సంగతేమిటో వేఱుగా చెప్పు."
వా.

## ముడుగు పడు

చచ్చు.
"మోహముఖదుష్టవర్గంబు ముడుఁగు పడియె" ప్రబోధ. 5.59.

## ముడుగుళ్లు పోవు

అవస్థ పడు.
"సఖులు ముడిగుళ్లఁ బోయెడుసరణిఁ జూచి." విప్ర. 4.16.

## ముడుపు కట్టు

ఏ దేవునికో మొక్కుకొని డబ్బును ఒక పసుపుగుడ్డలో కట్టి దేవుని దగ్గర ఉంచుతారు. రోగి ఆలాంటివాళ్ల విషయంలో అయితే వాడి చేతికే కట్టుతారు. ఆ డబ్బునే మరింత చేరుస్తూ వచ్చి మొక్కుబడి తీర్చేటప్పుడు ఆ దేవునికి చెల్లిస్తారు. ఇది కేవలం మొక్కుబడి అన్న అర్థంలో కూడా తరువాత అలవాటయింది.

"మా వాడికి నయమయితే తిరుపతికి వచ్చి సేవించుకొంటాము అని వెంకటేశ్వరస్వామికి ఈ రోజే ముడుపు కట్టాము."
వా.

## ముడ్డిక్రిందికి నీళ్లు తెచ్చు

ఆశ్రయమిచ్చినవానికే ఊనము తెచ్చు.
"వాడు నన్నాశ్రయించుకొనే బతుకుతూ నా ముడ్డికిందికే నీళ్లు తేవాలని ప్రయత్నిస్తున్నాడు."
వా.

## ముడ్డితో తుడిచి వేయు

లెక్క పెట్టక పోవు.
"వాడెన్నన్నా ఎన్ని చేసినా ముడ్డికి తుడుచుకొని పోతాడు."
వా.

## ముడ్డిపూస

వెన్నెముకక్రింది చివరి పూస.
(శ. ర.)

## ముడ్డిమీద తంతే మూతిపండ్లు రాలు

కార్యకారణసంబంధం లేకుండా మాట్లాడినప్పుడు ఉపయోగించే పలుకుబడి.
"దానికీ దీనికీ ఏమి సంబంధం రా? నువ్వు చెప్పేదంతా ముడ్డిమీద తంతే మూతిపండ్లు రాలేటట్లు ఉంది."
వా.

## ముడ్డి మూతి నులుచు

బుగ్గలు నులుము, చెవులు పిండు లాంటిది.
"భవసంగత నటంచుఁ దల దువ్వి ముడిచిన, మురువులా యని ముడ్డి మూతి నులుచు."
కుశ. 2.115.

ముడ్డి యరుగునట్లు కూర్చుండు
పనీ పాటా లేకుండా ఒకే
చోట కూర్చుండు.

"వాడికి ఎట్లా పొద్దు పోతుందో యేమో? ముడ్డి అరిగేటట్లు ఆ అరుగు మీద కూర్చుంటాడు. ఇటు పుల్ల అటు వేస్తే ఒట్టు."
వా.

ముణుగుపడు
తగ్గు.

ముణుగు పఱచు
తగ్గించు.

ముత్తవ
ప్రపితామహి.
నాయనమ్మకు తల్లి.
వాడుకలో అమ్మమ్మ
తల్లికి కూడ ఈ పలుకుబడి
ఉన్నది.

ముత్తాటిపండు తిను
చిరకాలము జీవించు.
ఒక తాటిచెట్టున పండిన
విత్తనమును నాటగా మరొక
తాటిచెట్టు పుట్టి, అది
పండగా దాని విత్తుతో
పుట్టినచెట్టుపంటిని తినుట.
అనగా మూడుతరాల తాటి
చెట్లను చూచిన దనుట.

"భర్తతోఁ గూడ ముత్తాటిపండు దినియె." పాండు. 4.267.

ముత్తాత
తాతకు తండ్రి.

ముత్తికగా
మూడుముఖాలుగా.

"మట్టడి చేసిరి ముత్తిక గాఁగ."
వర. రా. యు. పు. 147. పంక్తి. 10.

ముత్తిక వేయు
ముగించు.

"దానవావళి నెందుఁ దల చూప నీక, ముత్తిక వేయక మునుపు."
వర. రా. యు.

ముత్తునియ లగు
మూడుముక్క లగు.
కుమా. 11.193.

ముత్యపుసరులు పోహణించిన విధము
హెచ్చుతక్కువలు లేకుండ –
పొందికగా – అమర్చినట్లు
లీల, విధము – వీటి పర్యాయ
పదాలన్నీ ఈ అర్థంలో ఉప
యోగిస్తారు.

"పొసఁగ ముత్తెపుసరు లొప్పహణించిన లీలఁ, దమలోన దొరయుశబ్దములఁ గూర్చి..." కళా. 1.188.
ముత్యాలను కూర్చునపుడు
వాటిపరిమాణాదులను పరిశీ
లించి హెచ్చుతక్కువలు
లేకుండ సమానమైన
వాటినే కూర్చుట అలవాటు.
దానిపై వచ్చినపలుకుబడి.

ముత్యాలపందిరి
పాతకథలలో కూడా విరివిగా
వినవచ్చేపలుకుబడి.

పచ్చలపందిరి కూడా ఇలాంటిదే.

పండితా. ప్రథ. పురా. పుట. 290.

**ముత్యాల ముగ్గులు**

పచ్చలకలయంపి వంటిది.

జానపదకథలద్వారా వచ్చిన పలుకుబడి.

**ముత్యాలమ్మ**

ఒకానొక గ్రామదేవత.

(శ. ర.)

**ముదల పెట్టు**

ఆజ్ఞాపించు.

ముదల–ఆజ్ఞ.

"కరుణ నంతమాత్రపు టూడిగంబు నాకు, ముదల పెట్టుఁ డటంచుఁ గేల్మొగిచి మిగుల, వినయ మొప్పఁగ నాయింతి వేఁడుకొనియె." కళా. 1.192.

"ముదల పెట్టక వీసమును వ్యయింపఁగ రాదు." రుక్మాం. 4.83.

**ముదిగారము**

గారాబము.

"ఆబిడ్డ చాలా ముదిగారంగా పెరిగాడు. అందుచేతే ఎవరిమాటా వినక మొండిగా తయా రయ్యాడు" వా.

**ముదిగొరగలు**

జంగములు.

శివభక్తులలో గొఱగయ్యలని కొందరున్నారు. ఈశ్వరుని కూడా ముదిగొరగ అంటారు – నిరసించునప్పుడు.

బస. 6.165.

**ముదిజంత**

ముసలిగయ్యాళి.

"పలికి యప్పటి దాని భయచేష్ట భావించి, యిమ్ముది జంత చే నిది యొకింత." కళా. 3.127.

**ముదితొక్కు**

ముసలి.

"ఏ ముదితొక్కు వచియించుమాటల పయిఁ." పాండవ. రాజ. 10.

**ముది మది దప్పు**

వృద్ధాప్యంవల్ల అర్లు మర్లు కలుగు.

వృద్ధాప్యంలో మన స్తిమితం తప్పు ననుటపై వచ్చిన పలుకుబడి.

"ముది మదిఁ దప్పి తోటు మునిముఖ్య! భవత్తనయుఁ గృహంబునం, బదిలము చేసి వచ్చి..." ఆము. 7.49.

**ముదిలంజ వలపు**

నిష్ప్రయోజన మనుట.

శివముకుంద. 33.

**ముదివాడు**

వృద్ధుడు.

ఆం. భా. 2.119.

**ముదిసి ముప్పు కాలము**

వృద్ధాప్యము.

"......జనని! ముదిసి ముప్పు కాలం బున సుతశోకసాగరం బెబ్భంగి నీఁదఁ గలదానవు." నైష. 1.108.

**ముదిసి ముప్పున**

ముసలిముప్పున.

"ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు, దగవు గాదని రాఁడయ్యెఁ దాతవేల్పు." నైష. 4.129.

"మాట చెడి ముదిసి ముప్పున." రాధా. 3.49.

చూ. ముసలి ముప్పున.

## ముదిసి ముప్పున బడు

ముసలితనంలో కష్టాల పాలగు.

"ఆయన పూర్వం బాగా బతికినవాడే. ఇప్పుడు ముదిసి ముప్పున బడి అవస్థ పడుతున్నాడు." వా.

## ముద్దకవ్వము

త్రాని బిళ్ల తగిలించిన కవ్వము.

శ. ర.

## ముద్దకూడు

మాధుకరాన్నము.

"హీనవృత్తిని బిచ్చ మెత్తి గోడలు దాఁటి, ముద్దకూళ్లకుఁ బోయి మొత్తులఁ బడి" వేము. 41.

## ముద్దకొలిమి

ఊయి యినుముగా కరగించెడికొలిమి.

## ముద్దగండము

విశాఖప్రాంతంలో ఇది యీ రూపంలో విన వస్తుంది.

చూ. కడిగండము.

## ముద్ద గుడుచు

1. భుజించు.

"హరినీలములఁ జేసి యింధధారములఁ జేసి, మొలకతేటులఁ జేసి ముద్ద గుడిచి." కవిక. 3.47.

2. ముద్దులాడు, సమానమగు.

"ఎలనాఁగ నీకురు లింద్రనీలములతో, మొకరితుమ్మెదలతో ముద్ద గుడుచు." రుక్మాం. 3.159.

ముద్దు గులుకు అను ముద్రిత పాఠము సరి కాదు.

## ముద్ద యెత్తు

తిను.

"వాడు ముద్ద యెత్తి మూడు రోజు లయింది." వా.

## ముద్దాడు

ముద్దు పెట్టుకొను.

"ముద్దాడ వలదె యీ మోహనాంగుని మోము, గండచక్కెరమోవి గల ఫలంబు." విజ. వి. 1.71.

## ముద్దుగా

అందముగా.

"ఆ అబ్బాయి చాలా ముద్దుగా ఉంటాడు" వా.

## ముద్దు గునియు

ముద్దులు గుడుచు.

"ఆడుతా పాడుతా నీతో నట్టె ముద్దు గునుసుతా." తాళ్ల. సం. 9.101.

## ముద్దుగుమ్మ

స్త్రీ.

రూ. ముద్దులగుమ్మ.

## ముద్దు గురియు

ముద్దు లొలుకు.

"సారంగధరుఁడు ముద్దు గురియుం బో." సారం. 1.50.

ముద్దు చేయు
మురిపెము పడు, ఆదరముతో వాత్సల్యముతో చూచు.
"చిలుతవాంద్ర, కొదమ పలుకులు ముద్దు సేయుదురు గాదె."
విప్ర. 1.12.
"మీరు మరీ మీ పిల్లలను ముద్దు చేస్తున్నారు." వా.

ముద్దు పెట్టుకొను
చుంబనము చేయు.

ముద్దు ముచ్చటలు
జం.
ఆశలు, ముచ్చటలు.
కల. 24.
"ఏ ముద్దూ ముచ్చటూ తీరకుండానే ఆవిడ విధవరా లయింది." వా.
"ఆ ముసలివాణ్ణి కట్టుకుంటే ఏం ముద్దు ముచ్చటలు తీరుతాయి?" వా.

ముద్దుమొగం
అందమైనముఖం.
"ఆ అమ్మాయి ముద్దుమొహం చూస్తే నే ముచ్చ టేస్తుంది." వా.

ముద్దుల గుమ్మ
అందగత్తె.
"పొగడత గాంచినట్టి గుణభూషణ ముద్దులగుమ్మ." నిరంకు. 2.35.
రూ. ముద్దుగుమ్మ.

ముద్దు లాడు
1. ముచ్చట లాడు, ఏవో ముచ్చటలు చెప్పుకొను. 'ఏమిటో ఆ ముచ్చట కాస్త చెప్పండి' అని నేటి వాడుక.
"ముద్దు లాడక పొందు మందట నను చు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 290.
2. ముద్దు లొలుకు బాలుడు.
"ఎవ్వరివాఁ డీ ముద్దులాఁడు."
జైమి. 8.38.

ముద్దులు గారు
ముచ్చ టయిన.
"ముద్దులు గారునెమ్మొగము మోహరసంబును జిందుగుబ్బలుల్."
హంస. ౪.24.

ముద్దులు గునియు
ముచ్చట లాడు.
"ముద్దులు గునియువారు ముచ్చట లాడేటివారు."
తాళ్ల. సం. 3.443.

ముద్దులు గులుకు
ముచ్చ టయిన.
"తమకుం, బల్కులు నేర్పఁగ ముద్దులు, గుల్కెడుపల్కులను మేలుకొలిపెడుఁ గృష్ణా!" పారి. 2.58.

ముద్దులు చిలుకు
ముద్దు లొలుకు.
"చిన్నిబాలుండు ముద్దులు చిలుక చుండె." విజయ. 2.40.

ముద్దులు నటించు
ముద్దు గూర్చు.
"తరుణాంగుళీఘాతతంత్రీస్వనంబుతో, జిలిబిలిపాట ముద్దులు నటింప."
మను. 2.27.

ముద్దులు మూట గట్టు
ముచ్చటగా ఉండు, ముద్దు వచ్చు.

"ముద్దుల మాట గట్టుతనపట్టి నట్టే యొత్తికొని."
ధర్మజ. 36.6.

ముద్దు వెట్టు
చుంబనము చేయు.
"కళ లంటి ముద్దు వెట్టుక, వెలసినతమి మోవి నొక్కి ..." హంస. 5.174.

ముద్ర పుచ్చు
నైవేద్యం అర్పించు.
"సరససంస్తుతిపూర్వకముగ, ముద్ర పుచ్చుడు." బస. 7.199.

ముద్రాయంత్రము
అచ్చుయంత్రము.

ముద్రారోహణము సేయు
నిశ్చితార్థ మొనర్చుకొను.
ఆమెను చేసుకుంటా మని మాట యిచ్చు.
సంప్రదాయం ఏమిటో స్పష్టంగా తెలియదు.
"పార్వతి ముద్రారోహణంబు సేసి నగపతిచేత నమస్కృతులై వీడ్కొని."
కుమా. 7.139.

మునికోల
కొరడా.
"సత్యసేనుఁ డు, కృష్ణ నిగిడింపఁ జేతి మునికోలయుఁ బగ్గములున్ మహీతలం,బున..." భార. కర్ణ. 1.169.

మునిగి పోవు
నష్ట మగు.
"వాడు రాక పోతే యేం మునిగి పోయింది లే."
"వా డివ్వక పోతే మునిగి పొయ్యే దేమీ లేదు." వా.

మునిగొంగు
ముంగొంగు.

మునిచీకటి
పొద్దు గూకిన వెంటనే వ్యాపించు పలుచనిచీకటి.

మునిచెఱగు
ముంగొంగు.
"చేరి రవ్వేళఁ దమ మునిచెఱఁగు లందు." శుక. 3.117.

మునిపంట నొత్తు
దంతక్షత మొనర్చు.
"పల్లవపాణి యొత్తె మునిపంట నిజేశ్వరుమోవి నయ్యెడన్."
కళా. 7.169.

మునిపల్లు
ముందుభాగమునం దుండు పల్లు.
"తద్గణాధిపుల్, బలువిడిఁ బట్టి పూషు మునిపండులు డుల్లఁగ వ్రేసి రీసునన్."
శి. సం. 2.212.

మునిమనుమడు
మనుమని కొడుకు.

మునిమనుమరాలు
మనుమని కూతురు.

మునిమాపు
ప్రదోషకాలము, సంజ.

మునిమీసము
అప్పుడే మొలుచుచున్న

మీ సము, నూ నూ గు మీసము.

మునిమునిచీకటి

ముంజీకటి.

"మునిముని చీకటి న్నడువ ముంగిట వాకిట నైన నొంటి పా,టున నడ యాడు..." దశా. 3.223.

మునిముచ్చు

దొంగ.

"మునిముచ్చులార! మీ చే, సినపని యటు గట్టిపెట్టి." ప్రభా. 5.80.

మునిమ్రుచ్చు

రూ. మునిముచ్చు.

మునుకొను

1. మునుగు.

2. సన్నద్ధమగు, పూను.

"నిద్దపు నిట్టచూపునన్, మునుకొని చొక్క." పాండు. 2.9.

(మును=ముందు)+కొను - గ్రహించు-ముందుకు పడు అనుట.

"మునుకొని దండప్రణామములు చేసి." నిరంకు. 3.41.

మునుకోల

మునికోల, కొరడా,

మును మాడి

వరుస బెట్టి.

చేలు కోసుకొనేప్పుడు ఒకొక్కరు ఒకొక్క వరుస కోస్తూ పోతారు. దానిని 'మునుం' అంటారు

"మును మాడి యాజినమునుల మోదు చును." బస. 6.163.

మును మార

పూర్తిగా.

ఒకొక్క వీధి విడువ కుండా. ...చేనికోతలో మును ము పట్టుటకూ దీనికీ ఉన్న సం బంధం స్పష్టమే.

"పిండుగా మునుమారఁ బిలువంగఁ బనిచి."

పండితా. ప్రథ. వాద. పుట. 508.

చూ. మునుము.

మును మిడి

వరుస బెట్టి.

ఒకొక్క వరుసను మొదట పెట్టి.

"మూఁడు లోకంబుల మునుమిడి మీరు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 113.

"మునుమిడి పుష్కరముల పెఱికి వైచె." కుమా. 1.94.

చూ. మునుము పట్టు.

పైరును కోయునప్పుడు ఒకొక్కరు వరుసగా నిలుచుం టారు. ఒకొక్కటి ముం దున్న భాగం ఒక మునుము. అలా అందఱూ వరుసగా కోసుకుంటూ పోతారు. తద్వారా వచ్చినపలుకుబడి. 'మునుం పట్టండి' అని వాడుక. పైరు కోతలో ఒకొకరు ఒకొకవరుస నిలిచి

కోయునట్లు - మునుం పట్టు కొని.

"ఆసురముగ నాశ్వికుల న రాసులు మునుమిడి... వ్రేసిరి."

కుమా. 11.146.

చూ. మునుమూర.

## మునుము

ఆస్తి, ధనధాన్యాదులు.

"తనయింటఁ గలుగు, ధనధాన్యములు జీవితము మొదలైన,మును మంతయును దెచ్చి ముందటఁ బెట్టు."

పండితా. ప్రథ. పురా. పుట. 491.

"వాడు మునుం పట్టి కోస్తున్నాడు."

వా.

## మును ముందుకు

బాగా ముందుకు, భవిష్యత్కాలానికి.

"మునుముందుకు ఏమైనా పనికి వస్తుందేమో మాస్తాము."

వా.

## మును ముట్టనె చెప్పు

మును ముందుగనే చెప్పు.

"మునినాథ! నీవు మును ముట్టనె చెప్పినఁ జాలు మఱి కడంగడు నాపై."

ఉ. హరి. 5.185.

## మును వెనుక తెలియక

బాగోగులు తెలియక.

ఒక పని చేయడంవల్ల కలిగే లాభనష్టాలను, బాగోగులను తెలియక అని భావం.

"మును వెనుక తెలియక త్రత్తఱి, వన మండలిఁ దిరుగునతని వరవీరభటుల్."

శుక. 1.270.

## మున్కలు వెట్టు

మునుగు.

"శమంతపంచక,మ్మునఁ బితృతర్పణేచ్ఛలన మున్కలు వెట్టుభవద్భుజాయుగం,బున కిదె వందనంబు."

మను. 6.112.

## మున్నమర్చు

ముందు పెట్టు-అగుడు వెట్టు. అందఱిముందూ ఆయన గూర్చి దూషించు.

"మునిడి చౌఁడయగారి మున్నమర్చితివా."

పండితా. ద్వితీ. మహి. పుట. 214.

## మున్నాడి

ముందుగా.

(అరవము.)

"నే మున్నాడి యీ భోజనం,దన కర్పించినజాడయుం జెలియ చెంతం బొంచి."

శారి. 1.103.

"పూని నీ వెంతయుఁ బ్రోడయుఁ బోలె, నాకేశుతోడ మున్నాడి పల్కితివి."

ద్వి. హరిశ్చ. పూ. 311. పం.

## మున్నొరగు

ఒరగుదిండు.

ఇది మామూలు దిండువలె కాక గుండ్రముగా పొడవుగా తయారు చేసి రత్నకంబళిపై గోడవారగా వేసి ఉంటారు. వాటికి ఆనుకొని కూర్చొనుట, వానిని అటూ యిటూ

త్రిప్పి చేతి నానించుకొనుట అలవాటు.

"మున్మ్రొరగు మున్ దాఁ జేసి యుల్లా సి య్యె." పాండు. 3.160.

ముస్మృట్ట

పూర్తిగా.

"ము,న్మృట్ట నతండు విక్రమము నూ ల్కొన నాజికిఁ జేరకుండ."

భాస్క. కిష్కిం. 96.

ముప్ప తిప్పలు పెట్టి మూడు చెఱువుల నీళ్లు తాగించు

నానాకష్టముల పాలు చేయు.

ముప్పది తిప్పలు పెట్టి మూడు చెరువులలో ముంచు

"ఇటు ముప్పది తిప్పలు పెట్టి మఱియు మూఁడు చెఱువులలో మమ్ము ముంచ కుండ." నందక. పు. 43.

చూ. ముప్పా తిప్పలు పెట్టి మూడు చెఱువుల నీరు త్రాగించు.

ముప్పిరి గొను

అధిక మగు.

మూడును కలిసి బలపడు, దారము బలముగా లే నప్పుడు మూడు పోరవలను పేనగా ,అది బాగా గట్టి పడుతుంది. తద్వారా వచ్చిన పలుకుబడి.

"మదముఁ గోపముఁ దెంపు ముప్పిరి గొనఁగ."

పండితా. ప్రథ. పురా. పుట. 284.

"క్రోధవహ్నియు మనమున ముప్పిరి గొనఁగ." భార. ద్రోణ. 3.24.

"భయ భక్తి తాత్పర్యంబులు మనం, బున ముప్పిరి గొన."

హర. 2.136.

ముప్పున కందు

చూ. ముప్పున కగు.

ముప్పున కగు

కష్టకాలంలో పనికి వచ్చు.

"తప్పుఁ జూడఁ దగునె ముప్పున కయ్యెద, వనుచు నాదికాలముననె నమ్మి." రామాభ్యు. 7.119.

చూ. ముప్పున కందు.

ముప్పు మూడు

కీడు కలుగు.

"పుణ్యము సేఁత యైనఁ జెడి పోయిన ముప్పులు మూడ కుండునే ?

దేవీ. 3.235.

ముప్పురి గొల్పు

మూడు పురులతో త్రాడు పేను.

"...దివ్యాంబరములు, పేని ముప్పురి గొల్పి పేరిన నేతి,లో నించి."

బస. 7.190.

ముప్పేట్లు వెట్టు

మూడుచుట్లు తిరుగు.

"మోహాంధకారంబులో, మునిఁ గాఁ దజ్జల మెల్లఁ దల్లడపడన్ ముప్పేట్లు వెట్టన్ వడిన్."

ఉ. హరి. 4.298.

ముప్పేట లాడు

సంతోషముచేత ఉప్పొంగు.

"అభీష్టప్రాప్తిరూపప్రీతిసముచ్ఛ యాం

బున భు ముప్పేట లాడుచు నొక్క సుముహూర్తదినంబున."

వృ. వి. 3.19.

## ముప్పోకల బోవు

మూడు మార్గముల లోను తిరుగు.

"పూని ముప్పోకలఁ బోవ నేరు."

భాగ. స్క. 8.552.

## ముబ్బాములం బడు

ముప్పాతిప్పల బడు.

"మును బృందారక...ముఖుల్ ముబ్బాములం బడ్డవా, రని నాచే నని యుండు దోరి! కుటిలవ్యాపార..."

భాస్క. యుద్ధ. 822.

## ముమ్మడించు

మూడుపొరలతో కూర్చు.

"ముమ్మడించినట్టి పెద్ద మొగపుల మొలనూలు, ఇమ్మైన పిఱుఁదుమీఁద నింత భార మేటికి."

తాళ్ల. సం. 12.237.

## ముమ్మడి నలుమడి వాసి

మూడింతలు నాలుగింత లెక్కువ.

"విమర్శవంతులు దెలియఁగ, రతి సొబగు కంటెను బ్రభావతి పస ముమ్మడి నలుమడి వాసి మరాళీ!" ప్రభా. 3.118.

## ముమ్మాఱు

మూడుసారులు.

"కరములు ముమ్మాఱుగా దునిమింప."

పండితా. ద్వితీ. మహి. పుట. 21.

## ముమ్మోటు

అతి మోటువాడు.

"గడుసు తుంటరి జోగి గ్రక్కున ముడుసు, ముడి దిన్ననక్క ముమ్మోటు పిసాళి."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 649-50.

## ముయ్యంచు చంచలము

త్రివర్గముల పై అపేక్ష, మోక్షాపేక్ష కాదనుట.

"నా నేరమికే అట్టే యేమని వగతు, ముయ్యంచు చంచలాన మోసపోతిని గాక." తాళ్ల. సం. 8.39.

## ముయ్యాక మూయు

మూయ లేక మూయ లేక మూయు.

బలవంతముగా అనుట.

"ముయ్యాక మూసిన రెప్ప మూయుచుఁ దెరచుఁ గాని, నెయ్యమునఁ జూడ నేర దేమి సేతమే."

తాళ్ల. సం. 12.45.

## ముయ్యో డగు

యువకు డగు, యౌవనవంతు డగు.

"గోమునఁ బెరుఁగుచు ముయ్యో, డై మెలఁగుచు గర్భవైష్ణవాగ్రేసరు లౌ."

పాండు. 4.261.

## ముయ్యేల గుట్ట

సేనావారము చేరుస్థలము.

మూడు దారులు కలియు చోటు అని

సూ. ని.

"ఉడుపతిబారికిఁ జెలిచి యూఱట యౌ నని పేరుటామనిఁ, ముడివడు

కంతుసేనలకు ముయ్యేలగు ట్టయినట్టి యిందు రా, నడఁగు నె...

మను. 3.34.

## ముయ్యేడు

ఇరవై ఒకటి. (3×7=21)

"...కాళిదాసియు శివుచేతఁ, గొన్న యా ముయ్యేడుగన్నులలోన."

పండితా. ద్వితీ. మహి. పుట. 109.

## ముర ముర మను

బుసకొట్టు.

"మునినాథుఁ డదలించి ముర ముర మనుచు."

గౌ. హరి. ప్రథ. పం. 1455.

## మురికొను

ఖండించు.

"గరుడునిఁ దలఁపుము పగతుని, మురికొని కీర్తియును విజయముం గొను మనుడుణ్."

ఉ. రా. 6.10.

## మురిసి పడు

విచ్చి పోవు.

"ముత్తియంబుల పేరులు మురిసి పడఁగ."

హర. 3.92.

## ముఱికటించు

మూర్ఖము చేయు.

"మునుమడి ప్రోయుచు ముఱికటించుచును."

పండితా. ప్రథ. పురా. పుట. 299.

## ముఱుత్రోవ

చెడువాసన కొట్టుదారి.

"పదహతి ప్రస్సి వలచు, వరుగు దఱి చగుముఱుత్రోవ నరిగి యెదుట."

ఆము. 6.17.

## ముజ్జట లాడు

వసంతా లాడు.

రూపాంతరం ముజ్జాట లాడు.

"జయజయధ్వనులు సెలఁగ బొంకి ముజ్జట లాడిరి." కుమా. 10.104.

"పురజను లరిమైఁ జెలఁగి భోరన ముజ్జట లాడి రెల్లెడన్."

కుమా. 9.52.

"వరచందనపంకంబునఁ, దిరముగ ముజ్జాట లాడి." కుమా. 9.60.

## ముఱుపాలు వదిలించు

పొగరు అడచు.

"వాడి ముఱుపాలు వదిలిస్తాను. ఏమను కొన్నాడో!" వా.

## ముఱుబాల మంకు

చిన్నతనపు మొండితనము.

"ముఱుబాలమంకే కాని ముందు గాన దైవమా!" తాళ్ల. సం. 8.37.

## ములకకాయ కెత్తుగల్లు గొనగ నేల ?

అల్పునిపై అంత ప్రయత్న మెందుకు ?

చిన్నదాని కంత పెద్దపని ఎందుకు? అన్న ట్లుపయోగించేపలుకుబడి.

నేల ములక్కాయ కోయుటకు ఎత్తైనరాతిపై ఎక్కడ మెందుకు? అని వాచ్యార్థము.

కుమా. 2.60.

చూ. పిచ్చుకపై బ్రహ్మాస్త్రం.

**ములాసాపాగ**

ఒక రకమైన తలపాగా.

"బిగి ములాసాపాగఁ బెనఁచి హారము తల్లి, శేషాహిఁ జుట్టిన శివుఁ డనంగ." సుద. 3.164.

**ములుకోల**

మునికోల.

పశువులు మొదలగు వానిని తోలుట కుపయోగించుసాధనము.

రూ. మునికోల.

**ములుగంప**

ముండ్లకంప.

**ములుగత్తి**

ముల్లు తీసికొనుట కుపయోగించెడిచిన్నకత్తి.

**ముల్లడచు**

ముండ్లకంప పైన పేర్చు. ధాన్యాదులను రాశి పోసి దొంగ లెత్తుకొని పోకుండ నుండుటకై పైన ముండ్ల కంప కప్పుతారు—దానిని తీస్తే ధాన్యరాశి కదిలి దొంగతనం బయట పడుతుంది అన్నఉద్దేశంతో.

"మూసి ముల్లడఁచి గుమ్ములకొల్చుపై మెత్తు, లూడ్వఁడు పస్తైన నుండుఁ గాని." పాండు. 4.149.

**ముల్లు గుట్ట దెఱపి యెల్లెడ లేక**

బొత్తిగా సందు లేక. 'సూది మోపుటకు సందు లేక' అనుటవంటిది.

"ముల్లు గుట్టఁ దెఱపి యెల్లెడ లేక, యెల్లచోఁ దాన యై యిట్లున్నవాఁడు." బస. 6.160.

**ముల్లు దీసి కొఱ్ఱు మొత్తినట్లు**

"చెలుల మొఱంగి యిచ్చటికిఁ జేరుట యెల్లఁ దలంచి చూడఁగా, ముల్లు వెడలించి కొఱ్ఱు బిగ మొత్తిన చందము దోఁచె నియ్యెడన్." (తె. జా.)

చూ. ముల్లుపుచ్చి కొఱ్ఱడచినచందము.

**ముల్లు దీసి కొఱ్ఱు మొత్తు**

తాళ్ల. సం. 11.3 భా. 74.

చూ. ముల్లు దీసి కొఱ్ఱడచు.

**ముల్లు పుచ్చి కొఱ్ఱడచు**

తక్కువ బాధను తొలగించుటకై పోయి మరింత యెక్కువబాధను కల్పించుకొన్నట్లు అన్నపట్టున ఉపయోగిస్తారు.

ముల్లు చిన్నది కొఱ్ఱు పెద్దది.

"పొందుగఁ జెప్పితి ముల్లు పుచ్చి కొఱ్ఱడఁచినచంద మయ్యెఁ గమలానన యీ విరహానలంబునన్." ఉ. హరి. 5.103.

**ముల్లు పుచ్చి పద రడచినట్లు**

ఒక కీడును తొలగించుకొనబోయి మఱింత పెద్దబాధ కలిగించుకొన్నప్పుడు అను మాట.

"ముల్లు పుచ్చి పెద్దపద రడ్చిన ట్లయ్యె." బస. 183.

చూ. ముల్లు పుచ్చి కొఱ్ఱడచినట్లు.

**ముల్లు ముంట బుచ్చు**

చెడుగును చెడుగుతోనే సాధించు.

"అనవుడు నింతి యీయెడఁ బ్రయాస పడం బని యేమి యంచు వే, గన ములు ముంటఁ బుచ్చుటయ కార్యము గాఁ దలపోసి..." విక్ర.

**ముల్లు పుచ్చి కొఱ్ఱడచిన చందము**

తక్కువైనఆపదను తప్పించుకొనుటకై మఱింత గొప్ప ఆపదను నెత్తిన వేసికొనునట్లు.

"అడుగునె తాపవహ్ని మన మై హరి ణేక్షణ! ముల్లు పుచ్చి కొఱ్ఱడఁచిన చంద మయ్యెఁ బద మాయెలదోఁటఁ జరింప కింటికిఁ." మను. 3.34.

**ముల్లు సూపు**

మనసు బ్రొుగ్గు.

"మునుల తాలిమి కెవ్వఁడు ముల్లు సూపు."

భాగ. స్క. 10. (ఉ) 11.

**ముళ్లకంపలో చిక్కుకొను**

చిక్కులలో పడు.

కొత్త. 113.

**ముళ్లపేరు**

స్త్రీలు మెడయందు ధరించే ఒక రకమైన నగ.

"బిగువుఁ బయ్యెదలోనఁ బిక్క టిల్లుచుఁ జాలఁ, బ్రముల్లుచున్నల నొప్పు ముళ్లపేరు." కళా. 4.103.

**ముళ్లమాటలు**

తంపులు, చిక్కుమాటలు. ఒకరి కొకరికి తగాదాలు పెట్టుమాటలు.

"పలుదెఱఁగు ముళ్లమాటలఁ, గల హమె కల్యాణ మని జగంబులవెంటన్, మెలఁగెడుమానికి..." పారి. 1.85.

**ముళ్లమారి**

తగవులు పెట్టువాడు.

"ఇళ్లకమ్ములు దెచ్చుముళ్లమారి."

శ్రీరం. మా. 5.34.

**ముళ్లు పెట్టు**

చిక్కులలో తగులొక్కన జేయు.

"ముఖచంద్రగురుచులచే ముళ్లు పెట్టుటె కాక, సంతరించిన దొక్క వింత నవ్వు." నిరం. 2.33.

**ముళ్లు వేయు**

ఒకదానితో నొకటి అను బంధము చేయు.

"శేషవాసుకిముఖ్యమహానాగంబుల ముళ్లు వేసి చుట్టినం గాని."

వరాహ. 12.43.

**మువ్వంకమురువు**

త్రిభంగిమలోని అందము, నాట్యములోని ఒక నిలబడు తీరు.

"మువ్వంకమురువుతో మురళి యొక్కొకవేళ, మ్రోయించు భువనైకమోహనముగ." పాండు 4.134.

మువ్వంకమేనితో

త్రిభంగిమగా, ముడుచుకొని ఉనుట.

"పవ్వళించే వీడ వచ్చి పాయ నీయల వెల్ల, మువ్వంకమేనితోడ ముచ్చట దీఅ." తాళ్ల. సం. పు. 62.

మువ్వంటుదినము

బిడ్డ పుట్టిన మూడవరోజు. అంటుదిన మనగా ఆశౌచము.

జాతాశౌచము, మృతాశౌచము కూడా కావచ్చును.

"మువ్వంటుదిన మయ్యె! ముద్దులపట్టి, నెవ్వఁడో కొనిపోయె నింటిలోనుండ." ద్విప. కల్యా. 88.

మువ్వంటులనాడు

చిన్నతనంలో.

"చంట విషంబు మెత్తుకొని చంపుదునర్భకు నంచు వచ్చి మువ్వంటులనాఁడు పూతన యవారణ నెత్తికొనంగఁ జన్నుఁబాల్, గొంటయుఁ బ్రాణముల్ దిగిచి కోటను నొక్కటి గాఁగ నీతఁడా, గొంటు నిశాచరిన్ వసుధఁ గూల్చుట వింటిమి గాదె యేర్పడన్." (తె. జా.)

మువ్వకోడె

కాడికీ, గంతకూ కొత్తగా అలవాటు చేయబడేయెద్దు. (శ.ర.)

మువ్వదోనె

అడుగున ఒకటే పలక గల దోనె. (శ.ర.)

మువ్వన్నెవిల్లు

ఇంద్రధనుస్సు. పాండు. 4.235.

ముప్వెట్టిగొను

వెట్టిచాకిరీ చేయించుకొను, దాసులనుగా చేసుకొను.

"క్రొవ్వడఁగించుచుఁ గుటిలదర్పకుల, ముప్వెట్టిగొనుచుండె మును మహోద్ధతిని." పండితా. ద్వితీ. మహి. పు. 119.

ముస ముస మను

ముసరుకొను.

"ముసముస మని చుట్టు కొసవెంట్రుకలు పట్టి." కవిక. 4.166.

ముసలము పుట్టు

అపాయము కలుగు.

యాదవముసలం పుట్టిన కథపై యేర్పడినపలుకుబడి.

"వాళ్ల కుటుంబంలో యేదో ముసలం పుట్టింది. ఇంక ఎవరికి వారు అయి పోవలసిందే." వా.

ముసలినక్క

వృద్ధజంబుకము.

కుయుక్తులు పన్నే ముసలివాళ్లవిషయంలో ఉపయోగించేపలుకుబడి.

ముసలి ముప్పున

ముదిసి ముప్పున, వృద్ధాప్యంలో.

"ముసలి ముప్పున తొలుసుమర్త." వా.

**ముసలివగ్గు**

మిక్కిలి ముసలిది.

నిరసనద్యోతకమైనపలుకుబడి.

"సిద్ధుఁ డాత్మలో ననయంబు వేగరింపుచు నోసి చెల్లి! యిమ్ముసలి వగ్గు..." కళా. 13.27.

**ముసాకట్ల వెధవ**

అప్రయోజకుడు.

ఒక తిట్టు.

**ముసానమ్మ**

ఏమీ తెలియన ట్లుండునది.

అమాయకురాలు.

"మోసపోక ముసానమ్మ ముద్దరాలు, దారె సరిసప్తు లేక పాతాళమునకుఁ, దానుఁ గోడుకులు నొకకొంత తడసెనేనిఁ, గుతిలపఱుపరె నృపుబంట్లు గుదెలవారు." కాశీ. 5.289.

**ముసిడిపండు వన్నె**

పయోముఖ విషకుంభము వంటిది.

పయికి వన్నెగా ఉన్నా ముసిడిపండు విషప్రాయము. నమశ్శి. 52.

**ముసి ముట్టు**

బాధపడు.

"ఇట్లు బహుభంగులఁ దన కావించు కల్మషంబుల ముసిముట్టుక మెఱయునా జగజెట్టిచందంబు విని." నృసిం. 5.4.

**ముసిముసి నవ్వులు**

చిఱునవ్వులు. హార. 5.58.

**ముసు గిడు**

ముసుగు పెట్టుకొను.

"ఆ సత్రాజిత్తనయ ముసుం గిడి యుండఁగ." పారి. 1.107.

**ముసుగు దన్ను**

1. ఆచ్ఛాదించు.

"కడ లేనివిద్యంబుఁ గప్పుచందురకావి, మోవిపల్లొత్తుల ముసుఁగు దన్ని." పాండు. 3.10.

మనిషి ముసుగు తన్ని పడుకొన్నప్పుడు కప్పుకోవడం అనే అంటాము కదా! ముసుగు దన్నుట కప్పుకొనుటకు ప్రత్యామ్నాయంగా యిక్కడ వచ్చింది. ఇలా వచ్చినదే మేలి ముసుగు.

2. ముసుగు పెట్టుకొను.

"శుభ్రభాగముల్ బిగియ ముసుంగు దన్ని, యొసఁగుపెరమేను లన నొప్పు." కళా. 7.148.

"వాఁడు ముసుగు తన్ని పడుకున్నాడు. వా.

**ముసుగు వడు**

కప్పు పడు.

"వెసఁ బెక్కుమ్ములు మనపై, ముసుఁగువడం బఱపి యతఁడు మురభంజన!" భార. కర్ణ. 2.294.

**ముసుగు వాఱు**

వ్యాపించు.

"చరణాబ్జనఖకాంతిచంద్రికల్ నత

భూష, ముకుటాగ్రమణులపై ముసుఁగు వాఱ." కవిరా. 1.101.

ముసుగు వెట్టుకొని పరుండు
అసంతృప్తిసూచకమైన చేష్ట.
"ముసుఁగు వెట్టుచు నొక్క మద్దియ పవళించు." కా. మా. 2.18.

ముసుగు వేయు
కప్పు.
"హురుమంజి ముత్యాల యొరగుపాఁగ మెఱుంగు, నొసలి బిత్తరి బొట్టు ముసుఁగు వేయ." సారంగ. 1.79.

ముసురు కురియు
జడిపట్టి వాన కురియు.
"చూచి యచ్చోటి మహిమకుఁ జోద్యపడుచు, ముమ్మరంబుగఁ బూఁదేనె ముసురు గురియ." నిరం. 4.6.

ముసురుకొను
కవియు.
"ముసురుకొను జరభరంబున, నసురుసురై యున్నమమ్ము నడకించితి..." మనుచ. 4.84.

ముసురు గవియు
"అక్కడిబలము ముసురు, గవిసి యెపుడుఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వ." భార. ఉద్యో. 2.226.
చూ. ముసురుకొను.

ముసురుతేనె
ఒక రకమైన తేనె.

ముసురు పట్టు
జడిపట్టు.
"మొన్న ముసురు పట్టిన పట్టడం ఇంకా తెరపి కాలేదు." వా.

ముసురుమూతి
కోపంతో ధుమధుమ లాడు ముఖము.

ముష్టిగ్రాహ్యములు
అందుబాటులోనివి.
"మనోభీష్టార్థఫలము లన్నియు, ముష్టిగ్రాహ్యంబు లగుచు ముందట నిల్చెన్." రాజగో. 5.63.

ముష్టియుద్ధము
గుద్దులాట.

ముష్టి యెత్తుకొను
బిచ్చ మెత్తు.
"మణిమాలతోఁ గూడి ముష్టి యెత్తుకొనఁగ లేదా." శ్రవ. 2.60.

ముష్టి వెట్టు
బిచ్చము వేయు (గింజలు).
"ఇంట సెవ్వారయిన భిక్ష మిడిన ముష్టి, వెట్టినఁ గరాళి తేజియొప్పిదము దోఁప..." శుక. 3.346.

ముష్టీ ముష్టీ
పిడికిళ్లతో పోడుచుకొంటూ.
కాశీ. 5.144.

ముహూర్తము పెట్టు
ఏదైనా శుభకార్యానికి శుభగ్రహసంగతిని విచారించి సమయము నేర్పాటు చేయు.
పల. పు. 3.
"చైత్రమాసంలో మా పిల్లకు ముహూర్తం పెట్టుకోవాలని అనుకొంటున్నాము." వా.

రాయలసీమలో—కొన్ని వర్గాలలో పెండ్లిముందు నాటికి 'ముహూర్తం' అంటారు.

మూకలు గట్టు

గుంపులు గట్టు.

"దుష్టసత్త్వముల్, ధారణ సేపు రేఁగి బెడిదంబుగ మూఁకలు గట్టి గ్రామముల్, మారి మసంగిన ట్లయి సమస్తముఁ జూర్ణము చేసినప్పుడు."

రుక్మాం. 3.79.

మూకలు గొను

గుంపు గూడు.

"మూఁగ వేఁగిస మొదలుగఁ బెక్కుతెఱంగుల ప్రాఁకులు మూఁకలు గొని." పి. శకుం. 2.14.

మూకవిప్పు

తొలగించునది.

మూఁక (సైన్యము, గుంపు) విరియ జేయునది, చెల్లాచెదరు చేయునది.

"శాత్రవదుర్గర్వ సంస్తంభనౌషధి, మొనయుచింతాశ్రేణి మూఁకవిప్పు."

మను. 4.108.

మూక విప్పుట చెల్లాచెదరగుట కూడా.

"చొఁఅని బిలంబులుఖ్ వెడలఁ జూడ నిక్రంతలుఁ గాలు రాపడం, దిరుగనిత్రోవలుఖ్ విడియఁ దీర్పనిగొందులు నాలు బిడ్డ లే,కరయనిరేలుఁ జీమ చిటుకన్నను విప్పని మూకలుం బయిం, జిరుఁగనిచీరలుం గలవె చేరిన యీ సురకోటి కచ్యుతా!"

ఉ. హరి. 1.131.

మూక సేయు

మూఁగు.

"మొగిలు మొత్త మటంచు మూఁక సేయక యుండఁ, గీలుగంటునఁ జేర్పు మేలిముసుఁగు."

రాజగో. 2.14.

మూగచెవిటి ముచ్చట

ఎవరికీ బోధపడనిది

"మూఁగ చెవిటివారి ముచ్చటగును."

మొల్ల రామాయణము.

మూగతీట

శరీర మెల్ల దట్టముగా వ్యాపించినతీట.

(శ. ర.)

మూగ బడు

గుంపు గూడు.

"మూఁగఁబడి హంసములు దొలఁగ"

నిరంకు. 4.93.

మూగబాఱు

మూఁగు.

"ఇంద్రాదిదిక్పాలకుల్, మూఁగం బాఱి భవత్పదాబ్జములకున్ మ్రొక్కంగ లే కున్నచో."

ఉ. హరి. 4.92.

మూగయల్కు

అలిగి మాటా పలుకూ లేకుండా కూర్చొనుట.

"తెలియనిమూఁగయల్క కడతేఱుట లెన్నటి కింక దైవమా!"

రాజగో. 2.75.

మూచ్చొడ్డానికి లేదు

బొత్తిగా లేదు.

"వాడిలో దయ అనేది మూచ్చాద్దా మంటే దొరకదు." వా.

మూటకట్టుగా

మూట కట్టినట్లు, గట్టిగా.

"జముదూతలు గుక్కలు, గఅపింతురు మూటకట్టు గట్టి మహేశా!" శివ. సా. 289.

మూటకట్టులు గట్టు

కాళ్లు చేతులు బంధించి మూటవలె కట్టు.

"బలిమిమై మూట కట్టు కట్టి తెచ్చెద, ముఖ్యులఁ బోలె నీ ముందటికిని." జైమి. 2.23.

మూట గట్టుకొని పోవు

'ఏది శాశ్వతము? నీ వెంట వచ్చునా?' అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఇందఱి కొంపలు తీశావు. నువ్వేం మూట గట్టుకొని పోతావు?" వా

మూట గట్టుకొను

కూడబెట్టుకొను.

"పాపంబు దక్కఁ దా మూట గట్టుకొనున దేదియు లేదు." ధర్మజ. 32.20.

మూటముల్లె

జం.

"ముదమునఁ బల్లెపట్టులకు మూటకు ముల్లె కటంచు నాథుఁ డిం, పొదవఁగ నేఁగ..." హంస. 4.82.

మూటలు చూచి పీటలు వేయు

ఉన్నడబ్బును చూచి సత్కరించు.

"వాళ్లంతా మూటలు చూచి పీటలు వేసేరకం. యోగ్యతా గీగ్యతా అక్కడేం పనికి రాదు." వా.

మూటలు ముడియలు

మూటా ముల్లె.

ఒకే అర్థ మున్నమాటలను చేర్చుట జాతీయాలలో ఉన్నదే. హద్దూ పద్దూ, అడ్డీ ఆగీ ఇత్యాది.

"మూటలు ముడియలు వీపు, లను గట్టుకొనుచు." పండితా. ద్వితీ. పర్వ. పుట. 361.

చూ. మూటా ముల్లె.

మూటాయిటి దూది

అశాశ్వతము.

పత్తికాయ పగిలిన వెంటనే గాలి కెగిరి పోతుంది. అందు పై యేర్పడినది.

"ఊతఁనీరు చెలఁది నేఁత మూటాయిటి, దూది యెండపసుపు దొడ్డి యక్క, రంబు వేను." ఆము. 6.62.

మూటికి దెగించు

అన్నిటికీ తెగించు.

చూ. మూటికి ముడి వేయు.

(తె. జా.)

మూటికి ముడి వేయు

అన్నిటికీ తెగించు.

"మీరు కన్ను మిన్ను గానకున్న వారు. మిమ్ము ననఁ బని యే మున్నది? మూటికి ముడి వేసినవారికి ని గ్గమి రొ గ్గమి?" ధర్మజ. 44.18.

**మూటికీ ముమ్మాటికీ**

తప్పకుండా అనుట.

"ఈ సారి ఎన్నికలలో వాడు ఓడి పోయేది ఖాయం - మూటికీ ముమ్మాటికీ." వా.

**మూటిలెక్క పచరించు**

ముడుచుకొను.

మూడు అను సంఖ్య ఆకారమువలె అనుట.

"ముజ్జగంబులు పచరింప మూఁటిలెక్క." పాండు. 4.5.

చూ. మూడంకె వేయు.

**మూడంకె వేయు**

ముడుచుకొని పరుండు.

"వాడు తొమ్మిదయేసరికల్లా మూడంకె వేస్తాడు." వా.

**మూఢమంచు**

దట్టముగా అలముకొన్న మంచు.

లోకమును మూఢముగా చేయజాలినది అనుట.

"అర్జునుఁడు గవియించిన యంపమూఢ, మంచు దళముగఁ గప్పిన మార్గణాంశు." భార. విరా. 5.169.

**మూఢవహస్తము**

చాదస్తము.

"ఉన్న దున్నట్లు చెప్పఁడీ యోటు మాని, నీళ్లు నమలంగఁ బోలదు నృపుని సభను, వైదికము చేసితిర యేని బాగు గాదు, తలఁచి మూఁఢవహస్తంబు దాఁచి రండి," సందశ. పు. 10.

**మూడి చొచ్చి వాత వెడలువాడు**

కపటి, మోసకాడు.

ముడ్డిలో దూరి నోట్టిలో వెడలి వచ్చువాడు.

"మూడి చొచ్చి వాత వెళ్ళెవాఁడె యెవ్వాఁడు నంచు..." కళా. 2.85.

**మూడి చొచ్చి వాత వెళ్లునట్టి**

కొంత నిరసనగా అతి ఉపాయశాలి అనునట్లు ఉపయోగించేపలుకుబడి.

ఇలాంటిదే 'పొయిలో పెడితే పొంతలో వెళ్లి వచ్చు.'

"లేఁడు తగవరి యెందును మూడి చొచ్చి, వాఁత వెళ్లెడు వాఁడె యెవ్వాఁడు నంచుఁ, బాసి తుంబురుఁడా యంచుఁ బండ్లు గొఱుకు, కొంచు లోలోన నుడికితిఁ గొంతతడవు.

కళా. 2.79.

**మూడుకాళ్ల ముదుక**

అతి వృద్ధు.

"ఎట్లుగాఁ, గడఁగితి మూఁడుకాళ్ల ముదుకన్ వరియింప లతాంగి."

జైమి. 4.46.

చూ. మూడుకాళ్ల ముసలి.

**మూడుకాళ్ల ముసలి**

అతి వృద్ధు.

"తల్లి మదేకపుత్రక పెద్ద కన్నులు, గాన దిప్పుడు మూఁడుకాళ్ల ముసలి."

నైష 1.108

వృద్ధాప్యమున కట్టె నూనుకొని నడచుటపై వచ్చిన పలుకుబడి.

**మూాడు చెరువుల నీళ్ళు తాగి స్తాడు**

నానా తిప్పలూ పెడతాడు. ఊరికి ఒక చెఱువు ఉంటుంది. కనుక ఊరూరా తిప్పుతా డని అర్థం.

"వాడు ముప్పు తిప్పల బెట్టి మూాడు చెఱువుల నీళ్లు తాగిస్తాడు." వా.

**మూాడు పూవులూ ఆరు కాయలూ గా**

అతి సమృద్ధముగా అనుట.

"వాడి వ్యాపారం మూాడు పూవులూ ఆరుకాయలుగా ఉంది." వా.

**మూాడు మాటల కాఱు తప్పులు**

అడుగడుగునా తప్పులు వచ్చు ననుట.

'తప్పొప్పు లెఱుగని అమాయకులము' అనుపట్ల ఈ ప్రయోగాలు కాన వస్తవి.

"అబలలము మూాఁడు మాటల కాఱు తప్పు, లమ్మ నేఁ జెల్లఁగాఁ బరిహాస కంబు, చేసె దీ విట్టి పనులు మాచేత నౌనె, చాలు నగ రాకు పొమ్ము నిశాచరేంద్ర!

దశా. కూర్మా. పు. 82.

**మూాడుమాటల కాఱుతప్పులు తెలిసినవాడు**

మిక్కిలి ప్రతిభాశాలి యనుట.

మూాడు మాటలకే ఆఱు తప్పులు పట్టుటకు అసాధారణ ప్రతిభ అవసరము కదా!

"మూాఁడు మాట లాఱు తప్పు లేము మీా కౌనరఁ బల్కఁ గలమె..."

కళా. 5.219.

**మూాడు మాటలతో ముడి వెట్టు**

సంగ్రహంగా ముగించు.

"కట్టెఁ గొట్టెఁ దెచ్చె నన్నటుల మూాఁడుమాటలతో ముడి పెట్టి తెల్పు వాఁడను." ధర్మజ. 34.11.

**మూాడు ముక్కలలో**

సంగ్రహముగా.

"ఊరికే సాగ దీయక మూాడుముక్కలలో ఫలితార్థ మేదో చెప్పు." వా.

**మూాడుముళ్లు పడు**

వివాహ మగు.

మంగళసూత్రం కట్టేటప్పుడు మూాడుసార్లు ముడి వేయడం పై వచ్చినపలుకుబడి.

"ఆ మూాడుముళ్లూ పడ్డా యంటే ఆతరవాత మన మే మన్నా సరిపోతుంది. అంతదాకా కాస్త ఓపిక పట్టండి." వా.

చూ. మూాడుముళ్లూ పడితే.

**మూాడుముళ్లూ పడితే**

వివాహ మయితే.

"ఈ పిల్లకు కాస్తా మూాడుముళ్లూ పడితే నాబాధ్యత తీరుతుంది. నే కాస్త స్వేచ్ఛగా ఉండొచ్చు." వా.

చూ. మూాడుముళ్లు పడు.

మూడు మూసి ఆరు అతికినా

ఎన్ని అతుకులు వేసినా అనుట.

"మూడు మూసి ఆరు అతికినా దాని సంగతి ఊరంతా తెలిసి పోయింది." వా.

మూడు మెచ్చులు మెచ్చు

బాగా మెచ్చుకొను.

"చెలియలిని నిట్లు మూఁడు మెచ్చులను మెచ్చె." విప్ర. 4.12.

మూడులోకములకు ముల్లు

త్రైలోక కంటకుడు.

"మూఁడులోకములకు ముల్లైన యట్టి, వాఁడు మగధభూమి వల్లభు ఁ డట్టె." ద్విప. జగ. 210

మూడూ మూడులోకాలు

విచిత్ర మైనవా రనుట.

"ఆ కమిటీలో ముగ్గురు సభ్యులున్నారు. కాని మూడూ మూడు లోకాలే." వా.

మూడే మాటలు

ఎంతో లే దనుట.

అతి సంగ్రహముగా నున్నది.

"అన శుక మిట్లనుఁ గుతుకం, బునఁ గథ కొదవ యన నెంత మూఁడే మాటల్, విని పొమ్మ." శుక. 2.207.

మూడోకంటికి తెలియకుండా

ఎవరికీ తెలియకుండా, — అతి రహస్యంగా.

"నీ పని మూడోకంటికి తెలియకుండా నెఱవేర్చుక రావాలి." వా.

మూడోకన్ను తెఱచు

కోపగించు.

"వాడు మూడో కన్ను తెరిచా డంటే నువ్వూ నేనూ గాలికి పోతాం." వా.

మూడో చెవిలో పడకుండా

ఎవరికీ తెలియకుండా, అతి రహస్యంగా.

"నీ విషయం మూడో చెవిలో పడకుండా జాగ్రత్త పడాలి." వా.

మూడో వాడికి తెలీదు

అతి రహస్యము అనుట.

"వా డేం చేసినా మూడోవాడికి తెలీదు." వా.

మూణ్ణాలుగు రోజులు

కొద్ది రోజులు.

"ఎన్నో నా ళ్లుండను. మూణ్ణాలుగు రోజులలో వచ్చేస్తాను." వా.

మూతపొడుపు

ఒక రకమైన పిల్లల ఆట.

"దాయాలు సొగటాలు దాఁటాయి చదరంగ, మును జోడురాళ్లును మూఁత పొడుపు." హంస. 3.146.

మూతబల్ల

వాచూరుపట్టె.

(శ. ర.)

మూతి గిరుపు

అసంతృప్తిసూచకము.

తాళ్ల. సం. 6.156.

మూతినాకుడు కుక్క

ఇచ్చకాలాడువాడు.

"వాడు పట్టి మూతినాకుడు కుక్క." వా.

మూతినాకుడు మాటలు

(మూతులు నాకే మాటలు) ఇచ్చకాలు.

"ఈ మూతులు నాకే మాటలు నా దగ్గర మాట్లాడ వద్దు." వా.

మూతి నాకే రకం

ఇచ్చకాల మారి.

చూ. మూతినాకుడు కుక్క.

మూతి ముడుచుకొను

అయిష్టముతో మూతి బిగించుకొను.

మాటా. 59.

చూ. ముఖం ముడుచుకొను.

మూతి విచ్చు

వికసించు.

"మూతి విచ్చిన మోదుగు మొగ్గఁ దగిలి." పాండు. 1.183.

మూతి విఱుచు

అసంతృప్తినీ, అయిష్టతనూ కనబఱచు.

"వాళ్ళు ఆడపడుచు వచ్చేసరికి ఈవిడ మూతి విఱిచి లోపలికి వెళ్లి పోయింది." వా.

మూతులు కట్టుకొను

ఎవరికీ చెప్పక నోరు మూసుకొని యుండు.

"మూతులు గట్టివై చుకొనఁ బోలదె." పాణి. 1.4.

మూతులు నాకు

ఎవరి దగ్గరో చేరి పని గడపుకొనుటకై వారన్నదాని కల్లా తాళం వేస్తూ అవీ యివీ చెప్తూ నీచంగా వారి యిష్టాన్ని సంపాదించుకొనుటకై ప్రవర్తించు. శుష్కప్రియము లాడు

మూతులు నాకే కుక్క ప్రవర్తనను బట్టి ఈ పలుకుబడి వచ్చి ఉంటుంది. 'మూతులు నాకే కుక్క' అని కూడా ఇలాంటి వారిని అంటారు. కుక్కను చేర దీస్తే అది మూతులు నాకడం సహజమే కదా!

"మూ, తులు నాకఁ బెఱవితంతువులఁ దగిలి."

పాండు 4.196

"వాడి కెప్పుడూ వాళ్ళ వాళ్ళ మూతులు నాకడమే పని." వా.

"చీరవెలిగా నవ్వేవు సిగ్గు విడిచేవు, మోర విడుపు చేసుక మూతులు నాకేవు."

తాళ్ళ. సం.4.126.

మూతులు నాకే రకం

ఇచ్చకాలమారి.

చూ. మూతినాకుడు కుక్క.

మూన దిరుగు

వరిమొక్క నేలలో వేళ్లు పారి బాగా నాటుకొను.

"చెరువుకింది పొలం అప్పుడే మూన దిరిగింది." వా.

**మూన్నాళ్ళ పట్టపగలు**

అల్పకాలభోగము.

"మూన్నాళ్ళ పట్టపగటి సిరికే పట్టపగ్గములు లేవు."

ధర్మజ. 43 పు. 21 పం.

చూ. మూన్నాళ్ల ముచ్చట.

**మూన్నాళ్ళ ముచ్చట**

అల్పకాలభోగము.

"మంత్రిపదవి వచ్చినతరవాత ఆయన మరీ మిడిసి పడుతున్నాడు. ఇదంతా మూన్నాళ్ళ ముచ్చట అని ఆయనకు తెలిసినట్టు లేదు." వా.

**మూపున గండ లిచ్చు**

మ్రొక్కుబడిగా దేవునికి గండదీపాల నెత్తు.

'మూపుమీది కండలు కోసి యిచ్చు' అని పాండురంగ మాహాత్మ్యవివరణలో వుంది. కానీ అది కా దనిపిస్తూంది.

"ఘనముగా మూపున గండ లిచ్చెదను, దనయుం మన్నరె పురాతనులార! యనక"

పండితా. ప్రథ. పురా. పుట. 471.

"కాంత యొక్కర్తు మూఁపునఁ గండ లిచ్చె, మాలుగా లిచ్చె నొక సుధా మధురవాణి...శక్తిజాతిరన్."

పాండు. 3.77.

**మూపున గట్టిన చద్ది**

కొంగుపసిడి వంటిది.

"ఏపున నాస విడిచి యేరుపడి వుంటేను, మూపున గట్టిన చద్ది మాపించును." తాళ్ళ. సం. 7.6.

**మూపులు మూ డగు**

1. ఉప్పొంగు.

"అని మూఁపులు మూఁడై లా, లన రథకారునకు సంబళముఁ గంబళి మిచ్చి." వేం. పంచ. 3.130 పు.

2. భుజము లుప్పొంగు.

ఇట పౌరుషాతిరేకము చేసనుట.

"మూపులు మూఁ డగున్ రిపుచ మూపులఁ గన్నపు డక్కిరీటికిన్."

విజయ. 3.169.

చూ. మూడు బుజము లగు.

**మూయని వాకిలి మూసినట్లుగ**

అతి వేగముగా.

దూసుకొని, బల మంతా ఉపయోగించి అనుట.

"దు, మ్ము లెగయఁ గాటి చొచ్చెఁ బురి మూయనివాకిలి మూసినట్లుగన్."

(తె.జా)

**మూర కొక్కండును జేన కొక్కండును గా**

దగ్గర దగ్గరగా.

"మోలఁగు మడ్డించి దోఁచి మూర కొక్కండును జేన కొక్కండును గా." ఆము. 4.35.

"కాశీలో శివలింగాలు మూర కొకటీ, జాన కొకటి కన్పిస్తాయి." వా.

**మూరి చూడు**

మూగి చూడు.

"విటవర్గము నల్గడ వచ్చి ప్రీతితోఁ, గనుఁగొని మూరి చూడ నెడ గానక."

శుమా. 8.112.

**మూరి బుచ్చు**
విజృంభింప జేయు.
"కోరికలు మూరిఁ బుచ్చెఁ జకోరచయము." సింహా. 4.114.

**మూరి వోవు**
విజృంభించు.
"బహుసంపద పెంపున మూరివోయి." శివ. 1.92.
"నన్ను సేవించి మనుజుండు నాప్రసాదమున ధనము ధాన్యమును గలిమూరిబోవు." మార్కం. ఆ. 6.

**మూరుకొను**
మూచూచు.
"మోర మోర మోది మూరుకొనియె." కాశీ. 4.271.
రూ. మూర్కొను.

**మూరెంట**
ప్రతి మూరకూ, మూర పొడవు నేల కాగానే.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 480.

**మూర్ఛ తేఱు**
తెలివి నొందు.
"...రుక్కింత తడవునకు మూర్ఛ తేఱి కనువిచ్చిన...." కళా. 6.114.

**మూర్ఛ పుచ్చు**
మూర్ఛ పడునట్లు చేయు.
"నీ తనయుని మూర్ఛపుచ్చె నిష్ఠురవృత్తిన్." భార. భీష్మ. 3.343.
"పలుకయు వాలును బాణాష్టకమునఁ, దృణమాత్రమునఁ ద్రుంచి ధృతి మూర్ఛపుచ్చి." ద్విప. కల్యా. పు. 83.

**మూర్త మాడు**
విశ్రమించు.
"నాథ మీపాదార్చనము సేయ నడలింగ, మూర్తి చేసితె వచ్చి మూర్త మాడి." కాశీ. 1.35.

**మూర్ధాభిషేకము**
పట్టాభిషేకము.

**మూలకు జొనుపు**
పనికి మాలినవానిగా చేయు.
"రాత్రించరకరాళకరవాలకాళిమంబులు మూలకుం జొనుప." వసు. 6.9.

**మూల కొత్తు**
అవమానించు.
"శ్రమజలాభివ్యక్తసహజసాంకవమదా, మోదంబు చిలుకల మూల కొత్త." వసు. 3.132.

**మూలదుంప**
మూలకందము,
ప్రధానము.
కొన్ని మొక్కలకు వేరునకు దుంప ఉంటుంది. అదున్నంత వఱకూ చెట్టు కొట్టి వేసినా తిరిగీ మొలకెత్తుతుంది.
"ముక్తి కంతకు నది గదా మూల దుంప." భీమ. 5.157
"చీకటి మూలదుంపకున్." విజయ. 2.108

**మూల ద్రోచు**
పరిత్యజించు, విడనాడు.

"మోహముఖు లైనజ్ఞాతుల మూలఁ ద్రోచి." పాండు. 4.208.

మూల బట్టు

మూల పడు.

పనికి రాక పోవు.

"ము ద్దది యెల్లను మూలఁ బట్టె."
గుంటూ. ఉత్త. 26.

మూల బడవైచు

ఉపయోగము లేదని ఒక మూలలో పడవేయు.

"రతిరాజు బాణసంతతి మూలఁ బడ వైచి, చాపంపుఁ గడపటఁ జప్పఁ జేసె." చిత్రభా. 3.103.

మూల బడు

చెడు, నశించు.

"నా, ముక్కున వచ్చె నీ చెలిమి మూలఁ బడుఁగా విడు మిల్లు సేరదఁగా."
వేం. పంచ. 1.262.

మూలబలము

ప్రధానమైనసైన్యము.

"అబలలు సోపిన నాకాశమునఁ బొఱు, నలిశుకములు మూలబలము గాఁగ."
శు. సం. 4.431.

మూలమట్టము

గోడమూలలను సమకోణములుగా చేయుటకు తాపీ పనివాడు ఉపయోగించెడి ఒకరకమైన పనిముట్టు.

మూల ముట్టుగ

1. మొదటివఱకు అనుట.

మూలముట్టుగఁ దెల్పె నమ్మని వరుండు, ప్రార్థితుం డయి నాకు నప్ప రమవిద్య" మను. 3.139.

ఇక్కడ తొలినుంచి తుది వరకు అని అర్థం.

2. ఊచముట్టుగ, సమూలముగా.

పూర్తిగా అనుట.

"మూలముట్టుగను నుమ్ములనంబును బొంది, మహీధరంబులు రూపు మాలి యుండ." శివ. 1.51.

"ముగుదతనం బెల్ల మూలముట్టుగ నిటు వెల్లగించుకొంటి."
కవిక. 3.101.

"వాడివంశం మూలముట్టుగా నాశన మై పోయింది." వా.

మూల మూలల నడంచు

అక్కడ ఇక్కడ దాచిపెట్టు.

"దధిపయోముఖరసద్రవ్యంబు లెల్ల దొం, తుల సందు మూలమూలల నడంచు." శుక. 3.345.

మూలరతి

సంభోగములో భేదము.
కుమా. 9.152.

మూలవసము

నగరములోనికి అమ్మకమునకై వచ్చు సరకులపై విధించుసుంకము.
కొండవీటి శా. 1142.శక.

మూలవిరాట్టు

మూలకారణము.

"అల్లరికి మూలవిరాట్లని లో నెఱుంగుమీ." గీర. 63.

**మూలుగుచుండు**

కావలసినంత యెక్కువగా ఉన్న దనుట.

నేటికీ వాడుకలో — 'వాళ్ళ యింట్లో బంగారూ, వెండీ మూలుగుతూ ఉంది. వాళ్ళకేం కొదవ?' అంటారు

పాండు 4.211

"బజారులో ధనం మూలుగుతున్నా ప్రజల కేమీ సౌకర్యం కలగడం లేదు." వా.

**మూవంకల**

అన్ని విధాల.

"మూవంకల మముఁ గాచె మొక్కితి మాతనికి."

తాళ్ల. సం. 10.47.

**మూసికొను**

చుట్టుకొను.

"పెఱవట్టుల వీపు లుదగ్రవృత్తిమై, మూసికొనంగ వత్తు."

భార. విరా. 5.250.

**మూసిన కన్ను తెరవ లేదు**

స్పృహ లేక పడి ఉన్నా డనుట.

"వాడికి విపరీతంగా జ్వరం వచ్చింది. మూడు రోజులనుంచీ మూసినకన్ను తెరవ లేదు." వా.

**మూసినముత్తెము వలె**

ఏమీ తెలియనట్టు.

అమాయకురాలు అన్న అర్థంలో ఈ పలుకుబడిని ప్రయోగిస్తారు.

ముత్యం వెలుగులో ఉంచినప్పుడే అది మిలమిల లాడి ముత్య మనిపించుకొంటుంది. మూసి పెట్టినముత్యం ముత్య మనే అనిపించక తెల్లగా ముద్దవలె ఉంటుంది. దానిని బట్టి యేర్పడినపలుకుబడి కావచ్చు.

"అప్పు డుద్వృత్తిఁ జారబాఱి మూసిన ముత్తెమువలెఁ దలుపు మూసి మొక్కల మిడియెన్."

శుక. 2.136.

చూ. మూసినముత్తెం పాసినపగడం.

**మూసినముఱికి**

అప్రయోజకుడు.

"మూసినముఱికి నిర్మోహి స్వామి ద్రోహి, దుష్టు రోఁతలమారి దోసకారి."

హంస. 5.113.

**మూసి పెట్టితే పాసి పోతుంది**

ఏదైనా దాచిపెట్టిన దాని వల్ల నష్టమే అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"నీ వేమో కొడుకు పోకిరిచేష్ట లన్నిటినీ నాన్నకు తెలియకుండా దాచి పెట్టుతున్నావు. మూసి పెట్టితే పాసి పోతుంది." వా.

**మూసి పెట్టు**

ఏదయినా సంగతిని రహస్యముగా నుంచు.

"నువ్వెంత మూసి పెట్టితే మాత్రం నీ కోడలి సంగతి దాగుతుందా అమ్మా!"
వా.

మూసి ముల్లడచు
ధాన్యాదులను గాదులలో వేసి మూత వేసి జాగ్రత్త పఱచు.
'మెత్తు వేయుట' అని దీనిని రాయలసీమలో అంటారు.
"మూసి ముల్లడిచి గుమ్మల కొల్వుపై మెత్తు, లూడ్వఁడు పస్తైన నుండుఁ గాని."
పాండు. 4.149.
చూ. ముల్లడచు.

మృత్తికాస్నానము
పారిశుద్ధ్యముకొఱకై మన్ను పట్టించి చేయుస్నానము.
"మృత్తికాస్నాన మేమిటికిఁ దదీయదే, హాస్పృష్టి కలుషాల నడఁపకున్న."
శుక. 3.111.

మృదురతి
సంభోగములో భేదము.
కుమా. 9.152.

మెండాడు
సంచరించు.
"విటులకై మెండాడు వీథుల జంతల, పెనుగాటు కలకప్పు బెరసెఁ గాక."
కవిక. 4 90.

మెండుకొని యుండు
అతిశయించు, విజృంభించు, ఎదిరించి నిలుచు.
"సంగరముఁ జేయ మెండుకొని యున్నవారు."
జైమి. 2.64.

"నికుంభుఁ డంతఁ, జండ మైనకాల దండంబుఁ దాల్చిన, దండధరుఁడ పోలె మెండుకొనుచు.
రా. యు.
"తన, దండను వేదండయాన తరి తీపువగల్, మెండుకొన నుండ."
శశాం. ఆ. 2.

మెండుకొను
అతిశయించు.
"పుడమి నెల్లెడల నిండి మెండుకొని."
విప్ర. 2.14.

మెండు మీఱు
అతిశయించు.
"మెండు మీఱినపగటి పేరెండ దాఁకి."
ఆము. 2.56.

మెండు వెట్టు
పెన వేయు.
"గట్టిపండు వెదురు,తండములఁ గొమ్మ పంగల మెండు వెట్టి."
చంద్రా. 2.61.

మెండొగ్గు
తిరుగబడు, ఎదిరించి నిలుచు.
"మెండొగ్గదవు మందమేలముల్ మాను."
గౌ. హరి. ద్వితీ. పం. 893.

మెండొడ్డు
ఎదిరించు.
ఒకరి మాట వినక తానే సర్వముగా మెలగు.
ఇది రాయలసీమలో నేటికీ వాడుకలో నున్నదే. 'వాడు (వయసు వచ్చిన కుర్రవాడు) మెండొడ్డుకొని తిరుగు

తున్నాడు. ఇం కెవ రిమాట
వింటాడు.'

"ఇలు నించికొనుట మొదలుగc, జల
మున మెం డొడ్డి మిగులc జండించు."
శుక. 3.344.

"ఆయుర్వేవల్లభుండు నవ్వల గడచి,
గడుసుc దనంబున దనకు మెం డొడ్డిన
యొడ్డినిపై బలంబుల విడియించె."
కళా. 8.75.

"మించి మెండొడ్డ సాcగ నమ్మిత్ర
కులము." దశా. 2.51.

మెండోడు

పాటి తప్పు.

"దండనీతిక్రియల్ దానధర్మములు,
మెండోడి చెడిపోవు మింతురు
రిపులు."
రం. రా. అయో. 128. పా. 22. పం.

మెకమెక పడు

1. మొత్త పడు.

"అమ్మె లాత్మకు ప్రేcక్కై మన్నించిన,
మెకమెక పడి తిట్ల పలుకుమీ తగ
రేపుణ."
భార. శాంతి. 3.392.

2. సంకోచపడు.

"అకట! గురుస్థాన మని నిన్నుc జూడ,
మెకమెక పడుదు మందె మేలముల్
తగునె?" ద్విప. జగ. పు. 182.

మెకమెక పాటు

పచ్చికసి. పరువులు వాఱు
మనఃస్థితి.

"సురల్ దివికిన్ బగ దీఱునట్లుగా,
మెకమెకపాటుతోడ నిను ద్రుంగక
పో రెపుడున్." మను. 3.38.

మెచ్చించు

మెప్పించు.

"ఉద్భటుcడు గవిత్వము మెఱయc
గుమార సంభవమ్ము నలంకారము
గూఢవస్తుమయకావ్యముగా హరులీల
చెప్పి హరు మెచ్చించెన్."
కుమా. 1.21.

మెచ్చి తల యూచు

మెచ్చుటలో తల యూచు
టను బట్టి వచ్చినపలుకుబడి.

"తనమదిc గడు మెచ్చి తల యూcచు
చును నిట్టి, పడcతులు గల రో కో
పుడమి ననుచు." కళా. 8.175.

మెచ్చి మేకతోలు కప్పు

నిరసనగా 'నీ కతడు చేసిన
బహూకార మేమి?' అన్నట్లు
ఉపయోగించేపలుకుబడి.

"మెచ్చి మేకతో లెత్తcగిననాc
డెవండు తన కెమ్మెయిc గప్పc
గలాcడు." గిర. 20.

"ఆ వెధవదగ్గర నీ పాండిత్యం అంతా
వెలగ బెట్టడం దేనికి? నీ కేం మెచ్చి
మేకతోలు కప్పుతాడా?"
చింతా. పు. 439.

మెచ్చుకొను

శ్లాఘించు.

"మతిని మెచ్చుకొనుచు మాను లనిరి."
దశా. 1.171.

మెచ్చు గొల్పు

మెప్పించు.

"చిందుల్ ద్రొక్కుచు నిండి యెంతేటి
రసశ్రీ మెచ్చు గొల్పంగ నా, నందా
భోధి." వాల్మీకి. 1.12.

మెచ్చు వచ్చు

స్తుతిపాత్ర మగు.

"మెచ్చు వచ్చు కడానిబంగరు మేలి మంచుమిఁదటఁ." ఇందు. 3.91.

మెచ్చు వడు

మెప్పు పొందు.

"సుజనుల కెల్ల మెచ్చువడఁ జూపి వరంబు లొసంగి..."

వేం. మా. 5.158.

మెచ్చు పుట్టు

మెచ్చుదల కలుగు.

"పొగడు టనఁగ మెచ్చు పుట్ట దిందు"
ప్రభా. 1.106.

మెచ్చు సేయు

మెప్పుదల కలుగ జేయు.

మెప్పు పడయుటకు తగినట్లు ప్రవర్తించు.

"నీకును మెచ్చు సేయఁ గలను."

విప్ర 3.19.

చూ. మెచ్చులు సేయు.

మెచ్చొదవగా

తృప్తిగా.

"మే లగునన్నపానములు మెచ్చొదవంగ భుజించు చుండఁగన్."

భాస్క. బాల. 122.

మెచ్చొనర్చు

మెప్పు కలిగించు.

"...దనకుఁ గరము మెచ్చొనర్పఁ బరమనిరూఢి నా,దరముతోడి భక్తి గరిమఁ దనరి." కళా. 2.145.

మెటిక విఱుచు

ఆడవాళ్లు తిట్టూ, శాపనలు పెడుతూ చేతివేళ్లు విరుస్తారు. దానిమీద వచ్చిన పలుకుబడి.

"చంద్రసూర్యుల ప్రకాశము మాయఁ జేయని, కటిక చీఁకటిమీఁద మెటిక విఱుచు."

శుక. 2 505.

మెట్టపంట

జల మక్కఱ లేకయే పండు పంట.

మను. 1.18.

మెట్టాడు

మెదలాడు, సంచరించు.

ప్రభా. 1.107.

మెట్టిన యిల్లు

అత్తవారిల్లు.

"ఆ విభునిదేవి శ్రీ వెంగళాంబ పుట్టి, నిల్లు మెట్టినయిల్లు వర్ధిల్లఁ జేసె."

వసు. 1.63.

మెట్టుప్రాలు

తలబ్రాలు.

మను. 5.79.

మెట్టులు గొను

మెట్లవలె యేర్పడు.

కు. సం.12.953.

మెట్ట బడిన మీను

ఒడ్డున బడినచేప – గిలగిలలాడుతుంది.

"అధిపుఁ బాసినపుడ యలదుర వలవదె, మెలుఁత మెట్టఁ బడినమీనువోలె."

కుమా. 8.162.

మెడకాయ

మెడ.

మెడకాయపైన తలకాయ నిలవడం లేదు

తల తిరుగుడుగా ఉన్నాడు.

"వాడి కా ముదనష్టపు ఆస్తి కలిసి నప్పటినుంచీ మెడకాయపైన తలకాయ నిలవడం లేదు." వా.

మెడ గట్టు

అంట గట్టు.

"మిక్కిలి సంసారము మెడఁ గట్టితివి."

తాళ్ల. సం. 8.20.

మెడ గట్టుకొను

ప్రకటించుకొను.

"వారు నీదారి మెడ గట్టుకోరు గాని." రాధి. 4.80.

మెడ గోసి పోవు

వంచించి పోవు.

వాడుకలో -- 'వాడు గొంతులు కోసేరకం' అని.

"చక్కఁదనాలకుర ! మెడఁ గోసి పోఁ గలవు." గౌర. హరి. ద్వి. 881.

చూ. గొంతులు కోయు.

మెడ చుట్టుకొను

వదలి వేయ వీలు లేని దగు. బంధమగు.

'మెడను జుట్టుకొన్న పాము కరవక తీరదు' అన్నదానిపై మెడను చుట్టుకొన్న తరు వాత ఇక వదలదు అని మిగిలి యీ పలుకుబడి యేర్పడినట్లు కాన వస్తుంది.

"గోచికట్టున కటుకంటి గొడవ గడవ, రాక మెడఁ జుట్టుకొనిరియె."

పాండు. 5.238.

"మేరతోఁ బంచేంద్రియములు మెడ చుట్టక పోవు" తాళ్ల. సం. 9.206.

"మా తమ్ముడు పోయిన నాటినుంచీ ఈ గొడవంతా నా మెడ చుట్టు కుంది." వా.

"ఆ మహాయిల్లాలిని ఏ మైనా అన్నా వంటే ఆ పాపం నీ మెడ చుట్టు కొంటుంది." వా.

మెడ జుట్టెడి పాము

అనుక్షణం ప్రమాదకారి అయి గుండెబెదరు కల్గించు ననుట.

ఇలాంటి పలుకుబడులు మనకు చాలా ఉన్నవి.

"శూన్యవాదుల మెడఁ జుట్టెడి పాము."

పండితా. ప్ర. వాద. పుట. 511.

చూ. ముక్కుపై కత్తి.

మెడ తిరగకుండా

మెడ నిండుగా.

కొత్త. 14.

మెడ దన్ను

మెడనిండా ఉండు.

"మెడ దన్ను పునుకల నిడుపేరు లొండొంటిఁ, బొరిఁబొరిఁ దాఁకి బొణొబ్బొణుగు రవఁగ." హర. 5.16.

మెడ పట్టి త్రోయు

బయటికి గెంటు.

గెంటునప్పుడు మెడ మీద చేయి వేస్తారు కనుక.

"మాయలాఁడివి గదే యని మెడ వట్టి, పాయఁ ద్రోయుటయు..."
కళా. 3.246.

చూ. అర్ధచంద్రప్రయోగము.

## మెడపంపులు తోము

తన్ను.

"వాణ్ణి మెడపంపులు తోమి వదలి పెట్టారు." వా.

## మెడ వెట్టు పొగడ దండ పూనుదును

శిక్షకు తల ఒగ్గుదు ననుట.

"నీ మొలనూలునఁ గట్టు వడుదుఁ, బూనుదును నీవు మెడ బెట్టు పొగడ దండ." ప్రభా. 5.120.

## మెడ మలచు

వెనుకకు తిరుగు.

"మెడ మలఁచి పడఁతి యప్పుడు, కడకంటి విలోకనమునఁ గాంతుని యునికిన్." కళా. 7.147.

## మెడమీద కూర్చుండు

ఇప్పుడే కావలె నని బలవంత పెట్టు.

చూ. గొంతుమీద కూర్చుండు.

## మెడమీదికి వచ్చు

ప్రమాదస్థితికి తెచ్చు.

"వా డన్నమాటే యిప్పుడు వాడి మెడమీదికి వచ్చింది."

చూ. గొంతుమీదికి వచ్చు.

## మెడల పాగలు వేయు

మెడకు బందాలు వేయు.

"కావు మని మెడలఁ బాగలు వేయు."
తాళ్ల. సం. 7.11.

## మెడలు తిరగడం లేదు

పొగ రెక్కిన దనుట.

"వాడి కీమధ్య మెడలు తిరగడం లేదు." వా.

## మెడలు వడు

తల వేల వేయు.

"నడుములు విఱిగి దైన్యంబుతో మెడలు వడి."
వర. రా. బా. పు. 79. పంక్తి. 15.

## మెడలు విరుచుకొను

తనతలకు మించినపనికి పూనుకొని దెబ్బ తిను.

"ఉన్న నాలుగురాళ్లూ ఏదో గొప్ప అనుకొని పత్తి వ్యాపారంలో దిగి మెడలు విరుచుకున్నాడు. అది వేల మీద జరిగేవ్యాపారం ఆయె. ఇట్లా వాళ్లు ఏం తట్టుకుంటారు?" వా.

## మెడలు విఱుచు

బలాత్కారముగా ఒక పని చేయించు.

"నలుగురూ మెడలు విఱిచి వాడితో పత్రం రాయించుకున్నారు." వా.

## మెత్తకన్ను

పైరు కోసినతరువాత నిలిచి యుండుచొప్పదంటు.
రా. వి. 2.65.

## మెత్తనిగుండె

మెత్తని మనస్సు, మృదుహృదయము.

"వాడిది చాలా మెత్తనిగుండె. ఎవ

రైనా బాధ పడుతూ ఉంటే చూడ లేదు.'' వా.

## మెత్త జేయు

మృదుత్వము కల్పించు.

రసార్ద్రము కావించు.

''కాయునంతలో, పలన కరంగి పొంగు పసిబాలుర చిత్తము మెత్తఁ జేయఁ గన్.'' పాండు. 5.212.

## మెత్త బడు

లోబడు, ఎదిరించ లేక పోవు.

''కైకేయి ప్రేరేపఁగా మెత్తఁబడిన, నీకు నిట్టియవస్థ నేఁడు వాటిల్లె.'' వర. రా. అయో. పు. 340. పం క్తి. 20.

## మెత్త మెత్తగా వచ్చు

మెల్ల మెల్లగా వచ్చు.

''మాటిమాటికిఁ బొడము మూర్ఛల నలసి సొగయుచు మెత్త మెత్తగా వచ్చి...'' హంస. 1.192.

## మెత్తినగోడ

లోపల ఎముక లుంచి పెట్టిన గోడ.

(శ. ర,)

## మెత్తు లూడ్చు(మెత్తులు తీయు)

గాదెలలో ధాన్యం పోసి పైన పేడతో మెత్తుట అలవాటు. దానిని తీయుట అనగా లక్షణయా దాని లోని ధాన్యమును బయటికి తీయుట.

వాడుకలో — మెత్తు తీయు అనేదే రాయలసీమలో ఎక్కువగా వినబడుతుంది.

''మూసి ము ల్లడిచి గుమ్మలకొల్పుపై మెత్తు, లూడ్వఁడు పస్తైన నుండుఁ గాని.'' పాండు. 4.149.

''ఎంత కరు వొచ్చినా, ఎంత కాటకం వచ్చినా వాడు మెత్తు తీస్తే ఒట్టు.'' వా.

## మెదడు వట్టు

క్రొవ్వెక్కు.

వరాహ. 8.75.

## మెదలాడు

కదలు, సంచరించు.

కృష్ణ. 4.42.

## మెయికోలు

అంగీకారము.

భా.ర. భీష్మ. 1.31.

## మెయిమెయి

పదింబది.

''మెర మెర గల దనక మనము మెయి మెయి వినమే.'' రాధా. 4.13.

## మెరమెర పాటు

సంకోచము.

''మెరమెర పాటేల మీకుఁ జిత్తములు.''

గౌ. హరి. ప్రథ. పం క్తి. 1416.

## మెరమెర లాడు

బాధ నొందు.

## మెఱుగారు

మిక్కిలి ప్రకాశించు.

''శోభా,కరముగ మెఱుఁగారు పసిఁడి కంబము లనఁగా.'' కు. సం. 3.291.

మెఱు గిచ్చు
తళతళ లాడు.
"కాస్త తోమేటప్పటికి ఆపాత్ర బాగా మెఱు గిచ్చింది." వా.

మెఱుగుకడ్డీ
మెఱుగు పెట్టే (సొత్తులు మొదలయిన వానికి) కడ్డీ.

మెఱుగుడు నూనె
ఒక రకమైన నూనె.
దీనిని పెట్టెలు మొదలగు వానికి మెఱుగు తెచ్చుటకై పూస్తారు.
(శ. ర.)

మెఱుగు వేయు
1. మెఱుగు పెట్టు.
2. నెయ్యి నూనె మొదలగు వానితో తడి చేయు.
"మెఱుఁగు వెయ్యక కాని మృదువుగా దన్నంబు."
కోదండరామశతకము.
"సొత్తంతా తయారయింది. మెఱుగు వేయడమే తరవాయి" వా.

మెఱుగుతీగ
కంఠాభరణము.
"నెతి నొడ్డాణము గళమునఁ, దిరముగ ధరియించి మెఱుఁగుఁదీగఁ గడుఁగా, మురగతి నడుమున నిడి."
రాజశేఖరవిలాసము. 2.156.

మెఱుగుదీవెలు
క్షణభంగురములు, అశాశ్వతములు.

మెఱపుఁదీగెలవంటి వనుటకు మెఱపుఁదీవె లనుట.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.
చూ. జలబుద్బుదములు.

మెఱుగు పెట్టు
సొత్తులు మొదలయిన వానిని తళతళ లాడ జేయు.
"ఈ సొతులు కాస్త మెఱుగు పెట్టిస్తే కొత్తవి ఉన్నట్టే ఉంటాయి." వా.

మెఱుగుపోటు
సడింపులు చేసిన బియ్యాన్నే మరీ ఒక పోటు వేయడం.
ముడిబియ్యాన్ని ఒకసారి దంచడం తొలిపోటు. ఆ సడింపులను మరొకసారి దంచడం మెఱుగుపోటు వేయడం.
"కాస్త మెఱుగుపోటు వేసి ఎసట్లో పోస్తే అన్నం మల్లెపూవుల్లా తయారవుతుంది." వా.
"బియ్యం ఇంకా కొంచె ముతకగానే ఉన్నాయి. ఒకసారి మెఱుగుపోటు వేస్తే గాని ఎసట్లో వేయడానికి బాగుండవు." వా.
చూ. జకుక్కలు వాఱ దంచు.

మెఱుగురాయి
మెఱుగు పెట్టే రాయి.

మెఱుగు రిక్కలు
పగడములు.
దేశీయ తెలుగులు లేక ఒరంగల్లు గ్లాసరీలో నున్న దని బ్రౌను.

మామిడి వెంకన్న ఆంధ్ర దీపిక కది అనుబంధ మట! అతడే రచించినది కూడ కావచ్చును.

మెఱు గెక్కు

కాంతి అతిశయించు.

"తొలఁగ హిమంబు చంద్రుఁడు మెఱుఁ గెక్క, వెలిఁగె."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 329.

"పసిమిన్ మెఱుఁ గెక్కునవిల్లు."

రుక్మాం. 3.180.

మెలపాడు

నర్తించు.

"రంభాదిహరిణనేత్రలు మెల పాడిరి, పాడిరి కిన్నరాబ్జాతముఖులు."

హం. వి. 2.114.

మెలపారు

మెత్త నగు.

"తలిరాకుకంటెను మెలపారు నడుగులు."

కు. సం. 6.670.

మెలమెల్ల

మెల్లగా.

"గుబ్బల మెలమెల్ల గ్రుమ్మ వమ్మ.

రాధి. 1.108.

మెలరారు

సంచరించు.

"ఎలమెడు జలజాతింబులు, మెలరారెడుజలచరములు,"

కుమా. 10.26.

మెలికలు తిరుగు

అతిబాధతో వంకరలు పోవు.

"వాడు ఆ శూలతో మెలికలు తిరిగి పోతున్నాడు పాపం!" వా.

మెలిగొను

చిక్కుపడు.

దశా. 5.81.

మెల్లకన్ను

కొంచెము వంకరైనచూపు.

మేక కొఱికిన చెట్టు

ముక్కలు చెక్క లయినది.

"వాళ్ల సంసారం ఈ చుట్టాలమూలంగానే మేకలు కొఱికిన చెట్టులాగా తయారైంది." వా.

మేకదాట్లు వేయు

మాటా. 44.

చూ. కప్పదాట్లు వేయు.

మేకపోతు గాంభీర్యం

శుష్కగాంభీర్యం.

మేకపోతు చూడటానికి మహా గంభీరంగా ఉంటుంది. చేవ మాత్రం తక్కువ.

"వాని దంతా వట్టి మేకపోతు గాంభీర్యం. దాన్ని చూసి మోసపోకు." వా.

మేకపోతుల కొట్లాట

పైకి తీవ్రంగా కనిపించినా అలాంటిది కానిది.

ఆలుమొగల కొట్లాట మేకపోతుల కొట్లాట అని అంటారు.

మేకపోతులు వెనక్కు వెనక్కు వెళ్లి మహా తీవ్రంగా ముందుకు వస్తాయి. తలలు తాకించడం మట్టుకు

మహా సున్నితంగా ఉంటుంది.

మేకమెడ చన్నులు

నిష్ప్రయోజనము లనుట. దీన్నే అజాగళ స్తనం అని సంస్కృతంలో అంటారు.

మేకయఱపు గూయించు

భయ మంద జేయు.

"అదలించి నిను మేఁకయఱపుఁ గూయింప."

గా. హరి. ద్వితీ. పం క్తి. 1264.

మేకవన్నె పులి

గోముఖవ్యాఘ్రము వంటిది.

"తెలియ నిది మేకవన్నియ పులి యటంచు." రాధి. 3.19.

మేకులు చెక్కు

తప్పు పట్టు.

"మీర లుపాయశూన్యు లటు మేకులు చెక్కుచు." గీర. 102.

మేటిల్లు

అతిశయించు,

"శ్రీ మేటిల్లంగ మంచి చీరలు వలయుఁ గా." హరి. పూ. 6.13.

మేడమీది పరువు

చాలకాల ముండనిది. క్షణికము.

"ఈ మేడమీది పరువు లెన్నాళ్లు? వా.

మేడికాయబోనము

మేడిపండు వంటిది. సంతృప్తి నివ్వనిది, సారహీనము.

మేడికాయలు పైకి అందంగా కనిపించినా లోపల పురుగు లుండును కాబట్టి అవి తినుటకు పనికి రావు కదా!

"రాగంబు నొడిచి ముక్తి, శ్రీ గౌరవముల కపేక్ష సేయుమనుజులకుఁ గా, నాగేంద్రయాన యైహిక, భోగం బిది మేడికాయబోనము సుమ్మీ." విప్రనా. 2.80.

"మేడిపండు చూడ మేలిమై యుండును, పొట్ట విచ్చి చూడఁ బురుగు లుండు." వేమన.

మేడిపంటబోన మగు

పైకి అందంగా కానవచ్చినా తినుటకు వీలు లేక పోవు.

"మెఱసి చెప్పఁగ బోతె మేడిపంట బోన మౌను, యెర వేల సత మౌను యెదుట నింతే కాక." తాళ్ల. సం. 3.193.

రూ. మేడికాయబోనము.

మేడిపండు మేలిమి

పైకి మాత్రం బాగా కనబడుతూ లోపల తద్విరుద్ధంగా ఉన్నవానిపట్ల ఉపయోగించేపలుకుబడి. వేమన. 29.

మేత నడచు

ఆహారము కలుగు, తిండి దొరకు.

"అటు చనక మేఁత నడచునే హంస
ములను." ప్రభా. 1.120.

మేత మేయు

లంచము తిను.

నా. మా. 28.

మేధావిబొట్టు

హోమాదులు చేసి ఆ భస్మంతో 'మేధావీ భూయాసమ్' ఇత్యాదిగా మంత్రం చెబుతూ నుదుట పెట్టుకొనుబొట్టు.

"శూకటి, జుట్టుతో మేధావిబొట్టు
తోడ." వీర. 2.258.

మేనమామపోలిక

మేనమామ చాలు.

తల్లిదండ్రుల గుణాలవలెనే మేనమామ గుణాలు కూడా సంక్రమించు నని మన కో నమ్మకం.

మేనమామ గుణాలు వచ్చిన వనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"కటకట! వియోగలోకంబు కటకట
పడ, ననలశరముల నేఁచకు మనిన
నీవు, మానుదువె నీగుణంబు లౌనౌను
మేన, మామపోలిక యిది గద మా
కుమార!" సారం. 2.175.

"పో, మహి నది మేనమామపోలిక
యగుటన్." పాణి. 2.126.

మేనటికము లాడు

పరిహాస మాడు.

"గిరీశగళమూల హాలాహాల కాల
కాంతితో, మేనటికంబు లాడు తన
మేటి త్రిశూలముఁ బూని యుదతిన్."
మను. 4.96.

మేనత్త మేనమామ బిడ్డల కున్నవరుస మేనటికము. వారు ఒకరితో ఒకరు సరసా లాడుటు, హాస్యా లాడుకొనుట సహజము. దానిపై వచ్చిన పలుకుబడి.

మేను గను

రూపొందు.

"గర్వంబు మేనులు గన్నట్టు."
విజయ. 1.42.

మేను చెమర్చక

ఏమీ శ్రమ పడకుండా.

"ఏ నిన్నిపాట్లఁ బడి యీ, గాన
మహిమఁ గంటి నీవుఁ గలభాషి
ణియున్, మేను సెమర్పక యుండం,
బూనితి రిది యప్రయాసమున హరి
కరుణన్." కళా. 2.96.

చూ. చెమ్మ చెమర్పక.

మేను దొఱగు

చచ్చు.

"కఠినదండమున మాగధుఁడు మేను
దొఱంగ." రుక్మాం. 3.77.

మేను నిడుపెండ్రుక పెట్టు

గగుర్పాటు కలుగు.

"విశాలభుజాంతరమున్ బగిల్చినన్,
విరవిర వోయి మేను నిడుపెండ్రుక
పెట్టఁగ."
భాగ. స్క. 10. (ఉ) 872.

మేను పూను

జన్మ మెత్తు.

మేను పొంగు

ఉప్పొంగు.

"పత్త్రావళీ, ఘనకటాంతరవీదులఁ నిలిచి వీఁకన్ మేను పొంగంగ."

ఉ. హరి. 1.150.

మేను మఱచు

పరవశ మగు.

"భ్రమానుపడి యుండ నేటికి మేను మఱచి, యేల మాజాలి మాన్పవే యెఱుక పఱచి." కా. మా. 3.76.

మే నెల్ల గన్నులు గావించి

అత్యాసక్తితో.

"ఒక్కొక్కలతాతన్వి చెలంగి పొంగుమది కాంక్షల్ దీర మే నెల్లఁ గన్నులు గావించి కుమారుజవ్వనము చెన్నుఁ జూచుచందంబునఁ."

మను. 5.7.

మే నోసరించు

శరీరము విడుచు—చనిపోవు.

"పంచముఖు వీట మే నోసరించె నేని."

పాండు. 1.101.

మేపాడు

తిను.

"పొలమున మేపాడి కపిం, జల మత్తఱి మఱలి వచ్చి శశము నివాసస్థలిఁ గనుఁ గొని." వేం. పంచ. 3.108.

మేతాడు అని శ. ర. పాఠము.

మేయించి బొంకు

సత్య మనిపించునట్లుగా అబద్ధ మాడు.

మెయ్ (తమి)—సత్యము.

"పాయక రతి సల్పు కాఁపుపడఁతుక యెటులఁ, మేయించి బొంకవలెఁ జెపు, మా యని." హంస. 4.164.

మే యెఱుంగక (పోవు)

ఒడలు తెలియక పోవు.

"మంపు గొని మే యెఱుంగక మలసి మలసి." ఉ. హరి. 4.26.

మే యొల్పు

చర్మము.

"ముక్కు సెన్నె మొకము, మేయొల్పు జఘనంబుమీఁద రాణింప."

వర. రా. కిష్కి. పు. 483. పంక్తి. 6.

మేరకంబము

సరిహద్దు తెలుపుటకై నిలిపిన స్తంభము.

మేర కాదు

సరి కాదు.

"ఈరీతి పోరాడ మేర గాదు మీకు."

హేమా. పు. 34.

మేరకు మేర

సరికి సరి.

"మెలఁతరో మేరకు మేర యనును."

రాధి. 2.113.

మేర తప్పక

నియమము తప్పక.

"మేరలు దప్పకుండఁ జెలిమే డకు నీరజనాభుఁ డేగి యా, చేరువఁ బొంచి యుండ..." రాజగో. 1.95.

మేర దప్పు

హద్దు మీఱు, న్యాయము వీడు.

"వగచి యొక్కొక్క సెపమున వారు మేర, దప్పి యితనిపైఁ జేసిరి దండయాత్ర." కళా. 8.159.

"అప్పతియ కడు మేర దప్పిన, గతి కలకాంతలకు వేఱు గలదే." పారి. 1.96.

## మేర మీఱు

హద్దు మీఱు.

"రమణీలోకము సెల్ల సేఁపుచును మేరల్ మీఱి వర్తిల్లఁగా." రాజగో. 3.78

## మేర వెట్టు

కట్టడ చేయు.

"నోరు దెఱవకుండ మేర వెట్టి." నృసిం. 2.118.

## మేల్ తలచు

కృతజ్ఞు డగు.

"ఇలఁ గలపాపసంఘముల కెందును నిష్కృతి గల్గుఁ గాని మేల్, దలఁపని పాపకర్మునిఁ గృతఘ్నుతకున్ ..." రాజగో. 5.22.

## మేలగొను

"నునువెడంద యురంబునను జీని సరి పెనల్, మిన్నజన్నిదముతో మేల గొనఁగ." దశా. 1.27.

చూ. మేల మాడు.

## మేల మాడు

పరిహాసము చేయు.

"అల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లేఁతనవ్వు సంధిల్లఁ గిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయు." మను. పీఠిక. 2.

## మేలము లాడు

హాస్యము లాడు.

"ఇంక నెమ్మెలు పచరింప రా దనుచు మేలము లాడెదుసత్యబోట్ల సన్నల సెసకొల్పుచున్." పారి. 5.81.

## మేలిపూస

ప్రధాన మయినది.

దండలలో మేలిపూసను మేరుపూస అని కూడా అంటూరు. అది పతకంవలె ప్రధానంగా కడతారు.

"విద్యార్థుల్లో కల్లా వాడు మేలి పూసగా ఉన్నాడు." వా

## మేలిల్లు

శ్రేష్ఠ మగు.

"ఎలమెదు జలజాతంబులు, మెలరారెడుజలచరములు మేలిల్లెడు నిక్కొలనుండ." కుమా. 10.26.

"అని వర్ణింపందగినవర్ణనలకుం జాలి మేలిల్లుచు." కుమా. 10.28.

## మేలుకట్టు

చాందినీ.

చాందినీ – పైన తెల్లటి బట్టతో కట్టునది.

"సరోవరలక్ష్మికిఁ, గట్టినవెంబట్టు మేలుకట్టుంబోలెన్." కుమా. 10.21.

"కలువడంబులు మేల్కట్లు గట్టువారు ......" కళా. 7.58.

"ఎగసిన పుప్పొడి...... మేలుకట్టనంగ." భాస్క. యుద్ధ. 1649.

క్రియ.

చాందినీని యేర్పరుచు.

"తెల్లని రజము శోభిల్లు సంగ్రామ రంగమునకుఁ దగుమేలు కట్టునట్లు."
భార. భీష్మ. 1.242.

## మేలుక ట్లైత్తు

చాందినీలు కట్టు.

"కడు నొప్పఁగా మేలుక ట్లైత్తినట్లు, లురగణంబులతోడ నున్న దిన భము."
రంగ. రా. బాల. 39 పు. 21 పం.

## మేలుకాంచు

నిద్రనుండి మేలుకొను.

"నిద్దుర మేలుకాంచి."
నిరంకు. 2.111.

## మేలుకుప్ప

శ్రేయస్సమూహము.

"విశ్వేశ్వర! మేలుకుప్ప నిను నెవ్వఁడు గోరి భజించు."
భాగ. స్క. 10. (పూ.) 127.

## మేలుకొను

నిదురనుండి లేచు.

"మలుసటినాఁటి వేకువ నమాత్యుఁడు మేల్కని."
జైమి. 8.93

## మేలు గలవాడు

ప్రేమికుడు.

"దుందుడుకుచే ధరామర, కందర్పుం డతఁడు మేలు గలవాఁ డగుటన్."
శుక. 1.446.

## మేలుచేయి

పై చేయి, అధిక మనుట.

"అని తల నీవు పాండుతనయావలి కెప్పుడు మేలుచేయి నా, తనయులకుం బరాక్రమము తక్కువయుం బ్రకటింప వింతుః"
భార. భీష్మ. 2.

"భుజంగమస్వామికి మేలుచేయి."
సైష. 1.28.

ఇది వాడుకలో మేలుచేయి, పై చేయి అన్న రెండు రూపాలలోనూ ఉన్నది.

"ఈ ఊళ్లో ఉన్న సేద్యగాళ్ల కల్లా వాడు మేలుచేయి." వా.

చూ. పై చేయి.

## మేలు పడు

ఇష్ట పడు, వలచు.

"మేలు గలపట్ల కాంతలు మేలు పడరె?"
రాజగో. 1.64.

"గద్దదరవంబు జనియింపఁ గన్నె దాన, మేలు పడినాను జాణ నన్నేలు కొనర."
హంస. 5.172.

## మేలుబంతి

శ్రేష్ఠము.

"భట్టి నీకు హితుఁడు పరమవిశ్వాసియు, భట్టి బుద్ధి మేలుబంతి నీకు."
విక్ర. 3.135.

## మేలుముసుగు

అవకుంఠనము.

ముత్తైదువలు తలమీదికి వేసికొనుముసుగు.

"సలిలాబ్జపాణి యచ్ఛపుమేలుముసుఁగు నా, ఫేనపంక్తులు దరి నాని యొసఁగ."
శుక. 3.320.

## మేలు మేలు

సెబాసు.

"ముదిత మేలు మేలు కొదవ లేదండు..."
కళా. 2.35.

చూ. భళిభళి ఇత్యాదులు.

మేలురాక

స్వాగతము.

"సంప్రీత జనలోక, రాక వచ్చె మేలు రాక యగుచు."
భాగ. 10. పుట. 963.

మేలు వడు

ప్రేమించు.

"అమ్మనోహర యిట్లు గుణార్ణవునకు, మేలువడి యున్న నొక్క నాఁ డేలి నాతఁ, డనుప..." శుక. 2.560.

మేలువాడు

ప్రియుడు.

"వాలుగంటికి మిక్కిలి మేలువాఁడు."
నిరంకు. 2.28.

మే లెంచు

శుభము కోరు.

"ప్రేమ నీ మే లెంచెనే నీ కిమ్మని, భామ! యీ ముద్రికఁ బాలించెనె."
హేమా. పు. 54.

మే లేర్చు

మంచివి యెన్నుకొను.

ఉత్తమ మయినవానిని ఏరు.

"గగనస్రవంతిలోఁ గల సువర్ణాబ్జంబు, లందు మే లేర్చి తా నపహరించి."
ప్రభా. 1.120.

"నా లోక విభు సతుల్ మే లేర్చి యిచ్చిన, వీణె యే మర్యెఁ..."
కళా. 3.145.

మేల్కాను

మేలుకొను.

"లేచి యింతకు మున్నె మేల్కాని."
నిరంకు. 1.75.

మేల్కొనని త్రేనుపు

మరణము.

"దేవుని వెక్క మేల్కొనని త్రేనుపు గైకొన." పాండు. 2.236.

మేళగాడు

మేళము వాయించువాడు.

(శ. ర.)

మై కొను

అంగీకరించు, ఇష్టపడు.

"నాకుం దగినకెలసంబుఁ గంటి దీని కింతకు మైకొంటి." కుమా. 4.54.

"అయ్యుమామహేశ్వరుల తపోభంగంబు సేయు మనిన దానికి మెయి కొని వచ్చితి." కుమా. 4.60.

రూ. మెయికొను.

మైకోలు

అంగీకారము.

"ఆలేఖర్షభునాజ్ఞ సేయఁ దగదే యజ్ఞాక్షి మైకోలు మై." నైష. 3.125.

మై నీరగు

పరవశ మగు.

"వాని వగ లెంచి మైనీరు గాని యపుడె." రాధి. 2.114.

మైపూత

కలపము.

"చెమట చిత్తడి మైపూఁత దెమలి చనిన." విక్ర. 4.226.

మైపూత పసుపు

ఛాయపసుపు.

మై మయి బోవు

సులభముగా పోవు.

"దేవత లైన నా కదిరి ధీరత మై మయిఁ బోవ నేర్తురే."
ఉ. హరి. 2.98.

మై మఱచి యుండు
ఒడలు పరవశ మై యుండు.
"మఱియు నచ్చోట విహరించుతఱిని మంద, గంధవహా ప్తి మై మఱచి యుండు." శుక. 1.394.

మైమఱువు
కవచము.
"భల్లములఁ గట్టి మైమఱు వెల్లఁ జించి." భార. భీష్మ. 2.54.

మైమెయి బోవు
అవలీలగా పోగలుగు.
"వహ్నిఁ బడి కాలక మైమెయిఁ బోవ నేర్తురే." కుమా. 12.57.

మైల పడు
మాలిన్యమును పొందు.
మడికి వ్యతిరేకం మైల.
శై. భా. 6.28.

మైల వాయు
దిగులు తీరు, మచ్చ తొలగి పోవు.
"అతని యిల్లాలి......నపహరించినను, మన మైల వాసి నెమ్మది నుండ వచ్చు."
వర. రా. అర. పు. 129. పంక్తి. 10.

మైలసంత
మద్యమాంసాదులు కూడా అమ్మేసంత.
"మైలసంతలో, సుపరభే తని ఘోషించె." క్రీడా. పు. 24.

మైలసంతలో గంతులు
స్వేచ్ఛాప్రవర్తనలు.
"పంతము లేల నాయెదుట బారులు తీఱఁడు మైలసంతలో, గంతులు సాగ వంతయును గానఁగ నయ్యెడు..."
ప్రబంధరా.

మొండాటలు
మొండితనం.
కాశీయా. 156.

మొండికట్టె
మూర్ఖుడు,
"మొండికట్టె గులాము ముప్పె గోవు".
హంస. 5.113.

మొండి కెత్తు
మొండి వేయు.
"వాడు ఎంత కొట్టినా మొండి కెత్తి కదల నంటున్నాడు." వా.

మొండిచెయ్యి చూపు
లే దను.
"వా డిన్నిరోజులూ ఇస్తా నని ఆశ పెట్టి ఆఖరికి మొండిచెయ్యి చూపాడు." వా.

మొండిచేయి చూపు
చూ. మొండిచేయి చూపు.

మొండిచే వేల్పు గల
మొండిచేతితో హోమము చేయగల.
అసాధ్యకార్యములను నెఱ వేర్చుజాణ అని నిరసనగా అనుటలో....
కుమా. 8.185.

మొండివాడు

మూర్ఖుడు.

చూ. మొండికట్టె.

మొక మింత చేసికొను

చిన్నబుచ్చుకొను.

"చిత్రాంగి మొక మింత చేసికొనును."

సారం. 2.171.

మొకమున వ్రేలు

ముఖమునందు వ్రేలాడు.

ఎవ రైనా అతి సన్నిహితులు ఎదుట లేనప్పుడు మొగంలో వ్రేలాడుతున్నా రనుట అల వాటు.

అంటే వా రెప్పుడూ తలపు నకు వచ్చుచున్నా రనుట.

"విధి రత్నపుబొమ్మల నాఁచికొన్న నా, మొకమున వ్రేలుచున్నయవి మువ్వుర మూర్తులు నంచు నార్తుఁ డై."

ఉ. హరి. 2.6.

మొకమొకములు చూచుకొను

చూ. మొగమొగాలు చూచుకొను.

మొక మెరుక

ముఖపరిచయము.

"మొక మెఱుక గలదు కదవే, మక రాంకుని యనుఁగు మేనమామ మఱి నీకున్."

విజయ. 2.199.

మొక్క చెడు

ఆశాభంగము నొందు.

"జక్కవజవరాలు మొక్క సెడి యిక్కడక్కడం దిరిగె."

ప్రద్యుమ్న. 3.75.

మొక్కపాటు

పరాభవము.

విప్ర. 4.88.

మొక్కపుచ్చు

భంగపఱచు.

భా. రా. సుం. 28.

మొక్కపోవు

పరాభవము నొందు.

"మొక్కలంబున నొంటి మొక్క పోక".

వాల్మీ. 3.86.

మొక్క మొలచి పోవు

మొలిచి పోవు.

"ఒక్కసారి అక్కడికీ లిక్కడికి వేసినచో మొక్క మొలిచి పోరు గాని రండి." వా.

చూ. మొలిచి పోవు.

మొక్కవడు

మొక్క పోవు.

భాస్కర. 26.

మొక్కి మొక్కించుకొను

మర్యాద యిచ్చి పుచ్చు కొను.

"సొం,పు దనర మున్ను మ్రొక్కి గద మ్రొక్క గొనన్ వలయున్ జగం బునన్."

శుక. 3.381.

మొక్కుబడి

దేవతాప్రార్థన.

మొక్కుబడి చెల్లించు

దేవునికి తాను మొక్కు కొన్నవిధముగా నెఱవేర్చు.

## ....మొగం

చూ......ముఖం.

## (వాని) మొగం చూడను

వానితో ఏ మాత్రం సంబంధం పెట్టుకోనను అనుట.
'ఇంక వాడి మొహం చూస్తానా ?' '...మొహం చూడను?' 'వాడు చేసినపనికి యింక వాడి మొహం చూడ దలచుకో లేదు.' ఇత్యాదిరూపాలలో కాన వస్తుంది.

## మొగం నల్లగా చేసుకొను

కించపడు.

"వాళ్లనాన్న గర్జించేటప్పటికి వీడు మొహం నల్లగా చేసుకొని కూర్చున్నాడు." వా.

## మొగంబు వ్రేసినటులు

మొగాన కొట్టినట్టు.

"చు, అనుచు మొగంబు వ్రేసినటు లాతన యూర్పుల నింకి యింకి పో, యిన." ఆము. 5.62.

## మొగంబుల బయ్యెద లొత్తు

ఏడ్చు.
ఏడ్చునప్పుడు ముఖానికి పైటను అడ్డం పెట్టు కోవడం ఆడవారికి అలవాటు.

"నీ చెలియ నని విడిపించుకొని కన్నీరు దొరుగుమొగంబులఁ బయ్యెద లొత్తుకొని యేడ్చుసుదతుల." ఉ. హరి. 1.53.

## మొగం మాడి పోవు

అవమానభాజను డగు.

"వాడు చేసిన పన్ని నాలుగు విదిలించే సరికి మొగం మాడి పోయింది." వా.

## మొగంమీదనే అను

చూ. మొగానసే అను.

## మొగం వాచు

ఆశపడి అనుట.

"వాడు అన్నంకోసం మొహం వాచినట్టుగా ఉన్నాడు." వా.

## మొగకట్టు

1. కూడు.
2. ప్రధాన మగు.

"మఱియును మొగ కట్టద సేన." భార. భీష్మ. 2.113.

"కంకణనిక్వణంబు మొగ కట్టఁగ." నైష. 6.102.

మొగ—మొన.
'వీధిమొగలో ఉంది ఆయిల్లు' అనడం నేటికీ వాడుక.

## మొగ కొల్పు

ఉసి కొల్పు, పురికొల్పు.

"అ,క్కురుపతిఁ దమ్ముప్రోవు మొగ కొల్పఁగఁ జాలన నాకు భీష్ముఁడున్." భార. అశ్వ. 3.31.

## మొగచాటు

1. ముఖపటము, ముసుగు.

"మదు కగుభీమేశ్వరునకు మొగచాటైయుండదు సానిపెండ్లి..." భీమ. 1.112.

2. అసహ్యము. వేం. శత. 16.

మొగతనము

పౌరుషము.

"మొగతన మిది యౌనె మూర్ఖత
చెలు వొంద, వానరసేనపై వచ్చి."
సైరా. పు. 66.

మొగ తప్పు

మొగము ఆవలివైపునకు
త్రిప్పు.

"తండ్రి చావున,ప్పుడు మొగ తప్పి
యొండుకడఁ బోరుచు నుండెనొ."
భార. ద్రో. 1.92.

మొగ తిరుగు

వైతొలగు, ప్రక్కకు తిరుగు.

"వెగడు పడునట్లు మొగ తిరిగి యా
ద్రుపదనందనుండు."
భార. ద్రోణ. 4.102.

"గుహలమీదఁ గొలిపినఁ బైఁ బెట్టు కది
మొగ తిరుగుడు." కుమా. 10.66

"వీధి మొగ తిరిగినాడో లేదో కన
బడింది వారిల్లు." వా.

మొగ దగువాడు

మొనగాడు.

ప్రముఖు డనుట. అగ్రణి
అన్నప్పుడున్నూ ఇంతే. ఆ
అగ్రమే యిక్కడ మొగ.

"వారిలో, మొగ దగువాని కింత మని
మోవక త్రుంగుట యెట్లు సైన్య
ముల్." జైమి. 2.43.

మొగ దప్పు

సేన చెదరి పోవు.

"మొగ దప్పం ద్రిప్ప దర్పంబునన్."
భాస్క. అర. 2.130.

"కాండములు, నిగిడించి కపులు మన్ని
గొనఁ జూచి, మొగ దప్పి యెవ్వరు
మొన సేయకున్న."
వర. రా. యు. పు. 211. పం క్తి. 19.

మొగదల

ముందరి భాగము.

"ఇట్లు రౌద్రంబుగాఁ బఱతెంచునతని
మొగదల నిలువ వెఱచి."
పద్మ. 9.183.

మొగదిక్కు

చూ. మగదిక్కు.

మొగపడు

ముందుకు వచ్చు.

"మును దార మొగపడి మానుగఁ గుశ
లంబు లడిగి..."
భాస్క. కిష్కిం. 683.

మొగ మగు

అభిముఖ మగు.

"మొదలు వంచకునకు మొగము గాక."
నీతి. 49.

మొగమాటం

దాక్షిణ్యాం.

"నా మొగమాటంవల్ల వాడి కా
ఉద్యోగం యిచ్చాడు." వా.
చూ. మొగ మోటం.

మొగమాట పెట్టు

చనవును పురస్కరించుకొని
బలవంతపెట్టు.

"వాడు మరీ మొగమాట పెట్టాడు.
కా దన లేక వాళ్లింటికి పోవలసి
వచ్చింది." వా.

మొగమాడువు

గోపురము.

కా. ప. మ. 2.5.

## మొగమిచ్చుమాటలు

ముఖప్రీతిసంభాషణలు.

"ఈ నయగారపుం బ్రియము లీపస లీ మొగమిచ్చుమాటలు."

పారి. 1.125.

## మొగ మిచ్చు

సుముఖత నొందు.

"చలిఁ బడి యున్న పేరలుక శయ్యాపయి న్మొగ మీనికాంతలు."

కవిక. 6.18.

## మొగము కడుగు

అవమానించు.

"వా డింటికి వెడితే మొగం కడిగి పంపిస్తాడు."

వా.

## మొగము గంటు పెట్టుకొను

అసంతృప్తినీ, కోపాన్నీ తెలియపరుస్తూ మొగము చిట్లించు.

"...అని యాడి మొగంబు గంటు పెట్టుకొని యున్న సురనదీనందను దిక్కు మొగం బై."

భార. ఉద్యో. ఆ.4.

"....అయ్యూర్వశి.....శపించి దిగ్గన లేచి, మొగంబు గంటు పెట్టుకొని యింటికిం బోయె."

పార. 7.134.

## మొగము చూపు

కనిపించు, వచ్చు.

"వాడు ఇటువైపు మొహం చూపి చాలారోజు లయింది."

వా.

"కాస్త మొహం చూపి వెళ్లు." వా.

## మొగము చెల్లమి

ఏదైనా తాను తప్పు చేసినప్పుడు తనవారిని చూచుటకు సంకోచించుట.

"మొగము చెల్లమి రాక మొగిదల పంచె."

పల. పు. 63.

"వాడు నావెనక నన్ను చాలా నిందించా డని తెలిసింది. అది నాకు అందిందని వారికి తెలిసినట్టుంది. అందుచేత మొగం చెల్లక ఇటీవల మా యింటి వైపే రావడం లేదు."

వా.

"అయ నేదో అడిగాడు. కొన్ని ఇబ్బందులవల్ల ఆ చిన్న సహాయం కూడా చేయలేక పోయాను. ఇప్పుడు వాళ్లింటికి వెళ్లాలంటే నాకు మొగం చెల్లటం లేదు."

వా.

"నువ్వు ఇలాంటిపని చేసి తిరిగి పైగా నా యెదుటికి రావడానికి నీ కెట్లా మొహం చెల్లింది?"

వా.

## మొగముట్టు

గుఱ్ఱం మూతికి కట్టు అలంకారము.

"మురువైన చక్కని మొగముట్టు సవరించి."

సారంగ. 1.81.

## మొగము తప్పించు

సమయానికి కనబడకుండా పోవు.

"వాణ్ణి నమ్ముకొని యేమీ చేయ లేము. సమయం వచ్చేసరికి వాడు మొహం తప్పిస్తాడు."

వా.

## మొగము తప్పించుకొని

"వాడు మొగం తప్పించుకొని తిరుగుతున్నాడు. నాకళ్ల బడవలసి వస్తుందేమో అని వాడిభయం."

వా.

చూ. మొగము చాటు చేసుకొని.

మొగమున గంటు వెట్టు

అసమ్మతిని సూచించు.

సరిపడనప్పుడు బొమముడి వేయడం, మొగము చిట్లించడం అలవాటు. దానిపై వచ్చినపలుకుబడి.

"గామి డన రాదు మొగమున గంటు వెట్టు." శుక. 3.21.

మొగమున గట్టు

నిరంతరము జ్ఞాపకమునకు వచ్చు.

కనిపించు.

తాళ్ల. సం. 8.216.

మొగమున బడు

ఎదుట పడు, ఎదురించు.

"యోధకోటి నా, మొగమునఁ బడ్డ నెల్లదరి మ్రుట్టెదనో యటు సూచుచుండుమీ." భార. భీష్మ. 2.17.

మొగమున వ్రేలు

ఎదుటనే కనబడు.

దూరాన నున్నవారు మనః ఫలకంలో ఎల్ల వేళలా కనబడుదు రన్నసందర్భంలో నేటికీ వాడుక.

"శేలుం బగలును మొగమున, వ్రేలుచు బలి వాయ కున్న." కుమా. 5.171.

"నా కొడుకు ఊరెళ్లి ఆరునెల లయింది. వాని రూపం ముఖాన వ్రేలుతూ వుంది." వా.

మొగము బిగించుకొను

మూతి బిగించుకొను.

"నాగరకవిలోకనంబునం జెలరేఁగి మొగంబులు బిగించికొని..." ఆము. 4.35.

మొగము మటమట లాడించు

మొగము చిట్లించు.

"మొగము మటమట లాడింపఁ దగదు." శ్రీని. 3.73.

మొగము ముడుచు

మొగము చిన్న బుచ్చుకొను.

"తన సహోదరు నభ్యుదయమునకు మొగంబు ముడుచుపద్మినుల పొందొదవె నేని." బహులా. 1.46.

మొగము వాచిపోవు

చూ. మొగము వాచు.

మొగము వాడు

ముఖము కళ తప్పి యుండు.

"ఎండలో తిరగడం వల్ల వాడి మొహం వాడి పోయింది." వా.

"మగ దేమో అన్నా డని ఆ అమ్మాయి మొహం వాడి పోయింది." వా.

మొగము సెదరు

వైమనస్యము ఏర్పడు.

"మొగము సెదరంగఁ బలుకుట, జగతీసురవధముతోడ సరి యని రార్యుల్." హరి. పూ. 8.89.

మొగ మెత్త నేర్చు

తల యెత్తుకొని తిరుగగలుగు.

ఇది మామూలుగా తద్వ్యతిరేకార్థంలో — 'వాడు మొగ మెత్త లేకున్నాడు.'

అనే విన వస్తుంది. అవమానం వల్ల అనుట.

"నగుబాటు వట్రిల్లె నాతులలోన, మొగ మెత్త నేర్తునే?" బసవ. 5.125.

## మొగ మెత్త నోడు

అవమానంతో ముఖం ఎత్తుకొన లేక పోవు.

అవమానసూచకమైన చేష్టపై వచ్చినపలుకుబడి.

"మొగ మెత్త నోడి...ఆశానవాబ్జంబులు." కుమా. 10.48.

## మొగమెఱుక

ముఖపరిచయము.

"ఆయననుగురించి నాకు చాలా తెలుసు గానీ మొగమెఱుక మాత్రం లేదు." వా.

## మొగ మెఱుగు

ముఖపరిచయము కలిగియుండు.

"వాడి మొహం నే నెఱుగను. వాడెవరో నాకు తెలీదు." వా.

## (వాని)మొగమే చూడ లేదు

ఏమాత్రమూ ఎరుగ ననుట.

"వాని మొహమే నేను చూడ లేదు. నన్నుగురించి వాడు ఏమేమో చెప్పాడట." వా.

## మొగమొగంబులు చూచు

"భోగి యెంగిలి రోఁత నని సొగతుండు, మొగమొగంబులు చూడ సిద గురువరుఁడు." ప్రబోధ. 3.53.

చూ. మొకమొకములు చూచుకొను.

## మొగమొగంబులు చూచు కొన గలుగు

ఒకరి యెదుట నొకరుండే అవకాశం కలుగు.

వాడుకలో — 'నీవు అక్కడెక్కడో పోవడం నా కిష్టం లేదు. తిన్నా తినక పోయినా ఒకరిమొగం ఒకరు చూచు కొంటూ ఉంటే చాలు' అంటారు.

"గ్రక్కున నక్కట మొగ మొగంబులు చూచికొనంగఁ గల్గెఁ గా." శుక. 2.83.

చూ. ఒకరిమొగ మొకరు చూచుకొను.

## మొగ మొప్పు

ముఖము వచ్చు.

"బెగడుచున్నదాన మొగ మొప్పకున్నది." భాస్క. యుద్ధ. 156.

"అంత స్నేహంగా ఉంటూ వచ్చాడు. ఇప్పుడు వాణ్ణి ఎదుట తిట్టా లంటే మొహం ఒప్పడం లేదు." వా.

## మొగమోట

దాక్షిణ్యము.

"ఓరి! దురాత్మ! నీకు మొగమోట యొకింతయు లేదు." విష్ణు. 1.143.

చూ. మొగమోటమి.

## మొగమోట పెట్టు

దాక్షిణ్యము నుపయోగించుకొని బలవంతము చేయు.

"వృథా మొగమోట పెట్టి." కేవి. 2.168.

**మొగమోటమి**

దాక్షిణ్యము.

"ఇత్తఱి ఘనులైన నీదుతలిదండ్రుల పై మొగమోటమిం మహా, త్తర మగుతప్పు గాచితివి..."

తారాశశాం. 4.210.

రూ. మొగమోట.

**మొగ మోడు**

మొగమోట పడు.

సంకోచించు—దాక్షిణ్యము వలన.

"దొరల కిచ్చకముగా వలని మొగమోడి ప్రియవాక్యములు పల్కువారు."

వర. రా. అర. 130.8.

"ముంగిటికే తెంచి మొగమోడ నగునె?" అభిమన్య ద్విపద.

**మొగలి వాకిలి**

1. తలవాకిలి.

2. హజారము.

"దక్షవాటికయందుఁ దరుణేందు మౌళికి, మొగలివాకిట ధామమును రచించె." భీమ. 1.74.

"అర్వనజాక్షునిన్ మొగలి వాకిటి కీడిచి తెచ్చి..." భల్లా. 5. (శ. ర.)

**మొగవడంబులు**

ముఖపటములు.

"గజంబుల మొగవడంబు లెత్తించి."

కుమా. 11.37.

**మొగవాడ**

1. ఎద్దులపై కప్పిన కంబడి.

"పట్టుఁడా యెడ్లను బలుపులు దెగఁగ, గొట్టుఁడా చని కూడ ముట్టుఁ డింకేల, చింపుడు మొగవాడ త్రెంపుడు పడగ, లుంపుఁడు బండి వోకుండఁ జూతండు."

బస. 7.186.

మొగవడము ఏనుగులపై కప్పు రత్నకంబళ మని కోశకారులు ఇచ్చి వున్నారు. ఆ ప్రయోగ మిది.

"జలధారలు మదధారలు, జలదంబులు మొగవడములు చండానిలవి,హ్వాల గహ్వరరవములు గర్జలు గా గిరు లమరె సమదసామజసమతన్."

హరి. ఆ. 6.

2. ముఖద్వారం.

"శంకరదాసి యచ్చటి కేఁగుదెంచి, యంకకాఁడునుబోలె హరభక్తు లలర, నతిముతి మొగవాడ దెఱచి వీక్షింప."

బసవ. 4.98.

**మొగవాసి**

పౌరుషము.

"వలపులరేని తండ్రి మొగవాసికి వాసిగ దృష్టి దీసినన్."

రాధి. 2.53.

**మొగవీణ**

చూ. ముఖవీణ.

(శ. ర.)

**మొగసరి**

"హరినీలముల మొగసరి యనంగ."

భాను. 3.17.

చూ. మొగముట్టు.

**మొగసాల**

తలవాకిటి చావడి.

"మొనసి యా రావణు మొగసాల గాచి."

రం. రా. యు. 303. పా. 28. పం.

మొగసిరి

సౌందర్యము.

"మురవైరి కిటువంటి మొగసిరి గలదొ."

ద్వి. పరమ. 3.167 పా. 14. పం.

మొగాననే అడుగు

"వాడు చేసిన వన్నీ మొగాన్నే అడిగే సరికి వీడు నోరు తెఱవ లేక పోయాడు." వా.

చూ. మొగాననే అను.

మొగాననే అను

ఎదురుగానే తిట్టు.

"వాడు ఏ దన్నా మొగాననే అంటాడు." వా.

(వాని) మొగాననే తెల్లవారిందా

చూ. నీ మొగాననే పొద్దు పొడిచిందా?

(నీ) మొగాననే పొద్దు పొడిచిందా?

నీవే దీనికి కర్తవా అనుట.

"వాడు కాక పోతే యింకెవరూ లేరా? వాడి మొహానననే పొద్దు పొడిచిందా యేం?" వా.

మొగుడబాఱు

ముకుళించు.

"మొగుడఁబాఱినయరవిందములను బాసి, గములు గములుగ మత్తభృంగములు గూడి." భీమ. ౨.28.

మొగ్గతొడుగు

మొగ్గలు కల దగు.

ఆరంభ మగు అన్న భావార్థంలో దీన్ని ఉపయోగిస్తారు.

"ఆవిడ ఆశలు మొగ్గ తొడగడం, యింతలో యీ విపత్తు రావడం హఠాత్తుగా జరిగి పోయింది." వా.

మొగ్గ వాలువిధమున

మొగ్గ వాలినట్లుగా, మొగ్గ వేసినట్లుగా.

"కటకట! వాపో,యెను మొగ్గ వాలు చందం,బున నడు మెగ నెత్తికొనుచుఁ బొత్తులమీఁదన్." కళా. 6.181.

దొమ్మరాటలలో మొగ్గ వేయడం, పల్లటీలు కొట్టడం ఉన్నవి. వెనుకకు వ్రాలి అర్ధ చంద్రాకారంగా కాళ్లతో సమానంగా తలను నేల మోపుట మొగ్గ వేయుట.

మొత్తముమీద

అన్ని విషయములు ఆలోచించి చూడఁగా.

"మొత్తంమీద ఆ సంబంధం మంచి దనే తోస్తుంది." వా.

మొత్తానికి

ఆఖరుకు, ఎంత శ్రమ పడినా.

"మొత్తానికి వాడు పెండ్లికి రానే రాడన్న మాట." వా.

మొత్తి మోదర లాడు

పట్టి పల్లార్చు.

"విటువుకంఠాసుల నుఱికి చివ్వంగుల, మొత్తి మోదర లాడు మత్తకరుల."

శృంగా. శా. 2.22.

మొత్తు లాడు

జగడ మాడు.

"ఆతనిపై నృపతిం గజాది నిర్ణయముల మొత్తు లాడుదురు." ఆము. 4.131.

మొత్తు వడు

దెబ్బ తిను.

"ఇట్లు మొత్తువడి యమకింకరులు."

శివరా. 4.60.

మొదటికి మోస మగు

మూలచ్ఛేది యనుట.

భాస్కర. 6.

చూ. అసలుకు మోస మగు.

మొదటికే మోసము వచ్చు

అసలుకే విఘాతము వాటిల్లు.

వడ్డీవ్యాపారంద్వారా వచ్చిన పలుకుబడి.

వడ్డి వస్తుం దన్న ఆశతో అప్పివ్వగా అసలే (మూలము) రాక పోయిన దనుట.

చూ. మొదలు చెడ్డ బేరము.

మొదటిచెయ్యి

మేలుచేయి.

మదన. శత. 29.

మొదటి పేరు

ప్రముఖస్థానము.

"ముఖ్యహరిభక్తవరులలో మొదటి పేరు." రాధా. 1.54.

మొద లంట

సమూలముగా.

పూర్తిగా అనుట.

"ఆస లన్నియు మొద లంటఁ గోసి యున్న." పాండు. 5.238.

మొదలంట గోయు

మొదటిదాక కోయు.

"...వాఁడిఖడ్గముచేతం, దడఁబడ మొద లంటంగా, జడఁ గోసి యతండు వేగఁ జనియె లతాంగీ! శుక. 2.223.

చూ. ఊచముట్టుగ కోయు, కూకటి వేళ్లతో పెకలించు మొ.

మొదలారి

అరవశూద్రులలో ఒక తెగ వాడు.

(శ. ర.)

మొదలార్చు

సమూలముగా నశింప జేయు.

రుక్మాం. 3.30.

మొద లాఱు

సమూలముగా నశించు.

ద్వా. 9.10.

మొదలిదివాణము

ప్రధానఆస్థానము.

పుట్టినిల్లు మొదలయినపలుకు బళ్ల వంటిది.

"చదువుల పుట్టినిండ్లు శమసంపద యిక్కలు పుణ్యలక్ష్మికిన్, మొదలి దివాణముల్..." పాండు. 1.107.

మొదలి పేరు

అగ్రగణ్యుడు, అగ్రగణ్యు రాలు.

"సుదతుల కీచాము మొదలిపేరు."

కేయూర. 1.36.

మొదలు చూచి చెట్టెలుగు వారు

ఆవులిస్తే ప్రేగులు లెక్క

పెట్టు వారివలె చూచే ఆ చెట్టేదో తెలుసుకో గల వారు. అదే చెట్టో తెలుసుకొనుటకు ఆకులు త్రుంచవలెనా?

"మొలగదవె మాకు వ్రేళ్లతో మొదలు చూచి, చెట్టెఱుఁగువారి కాకులు సిదుమ నేలకో?"

ఉ. వారి. 4.95.

మొదలు తుద లేని

ఆద్యంతములు లేని, అనంతమైన.

"అదియుఁ గాక మొదలు తుద లేని సుకృతదు, షిక్క్రియలు భోగమునఁ దరింప రామి." కళా. 8.245.

మొదలు పెట్టు

ప్రారంభించు.

"ఆపాతం మొదలు పెట్టి అప్పుడే రెండువారాలు కావచ్చింది." వా.

మొదలు ముట్టగ

పూర్తిగా.

"మొదలు ముట్టఁగఁ బోయి మోట నైబడలి."

గా. వారి. ద్వితీ. పంక్తి. 1250.

మొదలూ, కొనా లేదు

"ఈ వ్యవహారం ఏమిటో కానీ మొదలూ కొనా లేకుండా ఉంది." వా.

చూ. తలా తోకా లేదు.

మొద లూడగ గూలు

మొద లంట గూలు.

"ఘనాఘనకల్పిత మైనటిక్కయుఁ, బొఱలుచు నోరుగాలి మొద లూడగఁ గూలెడుమ్రానికైవడిన్."

పారి. 5.31.

మొద లూడు

నిర్మూల మగు.

"ఉల్లము చల్ల నయ్యె మొద లూడె మనోరథముల్." కవిక. 6.211.

మొద లెత్తు

సమూలంగా నశించు.

నైష. 6.7.

మొదల్ చెడు

చచ్చు.

ఆం. భా. 2.225.

మొద్దుమొగం

చేత కానివాడు, తెలివి లేనివాడు.

"వాడొట్టి మొద్దుమొహం. ఎందులో పెట్టినా యింతే." వా.

మొద్దు రాచ్చిప్ప

మొద్దుమనిషి.

క్రీడా. 297.

మొద్దు వోవు

వాడి పోగొట్టుకొను.

భీమ. 4.107.

మొన కట్టు

కలిసి వచ్చు.

"తక్కటిరాజులుం గౌరవులు నీకు మొనకట్ట రని చెప్పె."

భార. కర్ణ. 3.127.

మొన కెక్కు

హెచ్చు.

"మనసు గరఁగించు సిగ్గులు, మొన
కక్కనికోపములును".
గంధ. 1.38.

## మొనగాడు

సమర్థుడు.

"ఎట్టి మొనగాండ్రు లేనియు, గట్టిగ
నాయెదుట...".
అచ్చ. రా. బాల. 202.

సేనకు మొదట నుండువాడు అన్న అర్థంలో యేర్పడి యీ భావార్థంలో స్థిరపడిన పలుకుబడి.

## మొన చూపు

కనుపించు.

"ముగురు వేల్పుల దండ మొన చూప
రాదా."
తాళ్ల. సం. 7.181.

## మొన చేయు

ఎదిరించు.

"మూఁడు లోకంబుల మొన చేసి
యెదురు, వాఁడు గల్గునె."
వర. రా. అర. పు. 230. పం. 22.

## మొన జూపు

ముల్లు చూపు, సమాన మగు.

"మునుపు తామరలకు మొనఁ జూపు
తెలికన్నులు." నిరంకు. 2.10.

## మొనదేఱు

వాడి కలది యగు.

"సాన మొన దేఱిన యనంగశర
మనంగ"
రా. వి. 3.130.

## మొనపడు

కప్పబడు.

"మొనపడె గగనంబు మొయిలు
మూఁగినమాడ్కిన్"
ఉ. హరి. 1.148.

## మొన లిడు

మొలకెత్తు.

"మొన లిడు నొండొకముస్రుఁ జెలువు."
కళా. 6.196.

## మొన లెత్తు

మొలక లెత్తు.

నరస. 1.175.

## మొన లేర్పరించు

వ్యూహములు పన్ను.

"దైవసైన్యంబు లీరీతిఁ దరతరంబ,
వెడలి మొన లేర్పరించి యుద్వేల
వృత్తి." పారి. 5.2

## మొనల్పడు

మొన లేర్పడు.

## మొన్న జరిగినట్టుగా

ఇటీవలే జరిగినట్లు.

చూ. నిన్న మొన్న లాగ.

## మొన్నన కాదె

ఇటీవలనే కదా.

వాడుకలో — మొన మొన్న కదా వాడు పుట్టాడు — వంటివి చాల అలవాటు.

పండితా ప్రథ. పురా. పుట. 323.

## మొన్న పుట్టి నిన్న కండ్లు తెఱచినాడు

చిన్నవా డనుట.

"వాడు మొన్న పుట్టి నిన్న కండ్లు తెరిచాడు. అప్పుడే కళ్లు నెత్తి కొచ్చాయి." వా.

## ముప్పె....

మూర్ఖుడు.

తిట్టుగానే వినబడుతుంది.

సంపంగిమన్న. 98.

"ముప్పె వెధవ, ముప్పె ముండా కొడుకు." వా.

## మొరపెట్టు

మొఱ్రో అని ప్రాధేయపడు.

"పెల్లుగ శంఖంబు మొఱ్ఱ పెట్టుచు నుండగ." రాధి. 1.154.

## మొరవంకకడియము

వంకీ, రెట్ట కడియము.

"కరమూలమున వెండి మొరవంకకడియంబు." క్రీడా. పు. 31.

## మొఱ్రో ! అన లేదు !

అన లేదు బాబూ అనుట.

మొఱ్రో మే మన లేద సత్య మను నమ్మొర్రగ వినగ రాదెకో" గీర. 27.

## మొఱ యిడు

మొఱపెట్టు.

"ఏ యెడఁ బతిఁ బొడగానక, కూయిడు మొఱ యిడు."

శు. సం. 5.547.

## మొఱవ వోవు

మొక్క పోవు.

"మునిమి నింద్రియశక్తి మొఱవ పోవుండంగ." కాశీ. 6.83

వాడుకలో 'మొరిసి పోవు' ఇదే అర్థంలో నేడు నిలిచి ఉంది. 'అ అంపం మొరిసి పోయింది.'

"ఆ గిన్నె అంచు మొరిసి పోయింది." వా.

## మొఱ వెట్టు

విన్నవించుకొను.

"సకలజనులు మొఱ వెట్టిరి." శివ. 3.16.

## మొఱ వైచు

మొఱపెట్టు.

"గీ, ర్వాణులఁ బోకుఁ డంచు మొఱ వైచె నొకో యన మ్రోసె నంత." పారి. 4.63.

## మొఱిగేకుక్క కఱవదు

వాచాలుడు అంత అపాయకారి కా డనుట.

"అతను దురుసుగా మాట్లాడా డని యేమీ భయపడ వద్దు, మొఱిగేకుక్క యెప్పుడూ కఱవ దని నీకు తెలియదా యేమిటి?" వా.

## మొట్టిపోవు

లోపము కలది యగు.

"ఆ కుండ మొట్టి పోయింది." వా.

## మొట్టో యను

కొట్టుకొను.

"ఓడి తేనియుఁ బట్టి మొట్టో యనంగ." ఆము. 4.60.

## మొలకచందురుడు

బాలచంద్రుడు.

"మొలకచందురుఁ దాల్పుముద్దరాలు." భీమ. 1.4.

## మొలకట్టు

మొలతాడు.

"బంగరు మొలకట్టు రంగు మీఱంగ."
దశా. 2.184.

## మొలకత్తి

మొలను చెక్కుకొనుకత్తి
శశాం. 5.14.

## మొలకనవ్వు

చిఱునవ్వు.
"అని పలికిన మొలకనగవు మొగంబున నిగురొత్తుతల్లిం జూచి సుగాత్రి యిట్లనియె." కళా. 4.140.
హర. 5.40.

## మొలక లెత్తు

అంకురించు.
"తలఁచుకొనుచుఁ దెలివి మొలక లెత్త." పాండు. 4.207.

## మొలతెంచు

మొల కెత్తు.
"తరణికూటమున మే యొరలి పద్మిని మేన, మొలతెంచుమధుమదమొలఁక కండ." కుమా. 3.108.

## మొలత్రా డని గట్టినట్టివారు

మొగవా రన్నవారు.
అంటే ప్రతీ మొగవారూ అని అర్థం. మగవాళ్లు మాత్రమే మొలతాడు కట్టుకోవడం, ఆడవాళ్లు కట్టుకోకపోవడం మనకు అలవాటు. దానిమీద వచ్చినపలుకుబడి.
వాడుకలో — 'మొలతాడంటూ కట్టినవాడల్లా' — 'గోచీ పెట్టినవాడల్లా' — ఇత్యాదిగా ప్రయుక్త మవుతుంది.
"ఉ. న్మత్తగజంబుఁ గన్నగరిమన్ మొలత్రా డని గట్టినట్టివా, రెవరి ......" శుక. 2.14.

## మొలత్రాసు

ముల్లు గల త్రాసు.
హంస. 2.181.

## మొలనూలు

వడ్డాణం, మొలత్రాడు.
అయితే ఇది – బంగారంతో చేసిన మొలత్రాడు – ఒక ఆభరణ విశేషమే కాని మామూలు దారం కాదు. స్త్రీలే వేసుకుంటారు. వడ్డాణం రేకుతో బిఱ్ఱుగా చేస్తే, ఇది జాఱుతూ ఉంటుంది.
"జలధిమహీసతి మొలనూలుగాఁ జుట్టి, పాలించెఁ గలిఁ గరికాలచోడు." కుమా. 1.52.

## మొలనూలున గట్టువడు

సులభంగా వశమగు.
మొలతాడుతో కట్టి వేసినా చాలు ననుట.
"మఱి నాకుఁ బెనఁగఁ జోటు గలదె నీ మొలనూలునఁ గట్టువడుదు." ప్రభా. 5.120.

## మొలపూస

మొలత్రాటియందు కట్టెడిపూస.
సింహా. 2.180.

మొల లిచ్చు

మొలక లెత్తు.

"పులక లాండ్రొరుల మేనులు నూచ్చి పోయి దగ్గర మొల లిచ్చునకరణి గాక." కుమా. 9.149.

మొలలో చేయి వేసి నిలవేయు

చూ. బొడ్డులో చేయి వేసి నిలవేయు.

మొలవ బెట్టు

నాటు.

మొలవేయు

నాటు.

మొలిచి పోవు (మొలక పోవు)

'తడిసినంత మాత్రంతోనే ఏమీా కాదు లే' అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

తడిస్తే గింజలు మొలకెత్తి నట్లు నీవు మొలకెత్త వనుట.

"ఇంతలోగా యేమీా మొలిచి పోవులే. ఈమాత్రం చినుకులకే భయపడితే ఎట్లా? అక్కడికెళ్లి యీాపని చేసుకొని రా." వా.

మొసలికి పడిశము

అసంభవము.

వేంకటేశ. 74.

మొహ మింత చేసుకొను

చిన్నబుచ్చుకొను.

"వీడు నూటిపోటిమాట లనేసరికి వాడు మొహ మింత చేసుకొన్నాడు."

మోకాలిమరవ

మెట్లు మరీ యెత్తుగా ఉన్న తావు.

తిరుపతికొండ, శ్రీశైలం ఇత్యాదులలో కాన వస్తుంది. ఒక్కొక్క మెట్టు మోకాలి యెత్తు ఉన్న దనుట.

"ఈ మోకాలిమరవ దాటడమే కష్టం. తరువాత సులువుగా యెక్క వచ్చు." వా.

మోకాలిలో మెడనరము పట్టు

విచారము నటించు.

ఆ విచారము కలుగుటకు తగినంత కారణము లేదు అనుపట్ల ఉపయోగించే పలుకుబడి. మెడనరము పట్టుకుంటే తల తిరుగదు కాని మోకాలు నీల్గుకొని పోదు కదా!

"సవతిబిడ్డలకు చదువు రాక పోయెనే యని యీా మెకు మోకాలిలో మెడనరము పట్టినది కాబోలు."

(తె. జా.)

మోకాళ్ల మఱవ

చూ. మోకాలి మరవ.

మోకాళ్ల దొ్రులు పోగొట్టుకునేవయసు

యౌవనము.

మోకాళ్లను బట్ట తలలును ముడి వెట్ట నేర్చు

అసాధ్యకార్యములను చేయ గలవా డనుటలో నిరసన

భావద్యోతకంగా ఉపయో
గించేమాట.
పండితా. ప్రథ. పురా. పుట. 359.
చూ. నేలకు నిగికి....

మోచేతికింద నీళ్లు త్రాగు
ఒకరికింద బతుకు.
కొంత నిరసనార్థంలోనే యిది
ఉపయుక్త మవుతుంది.
ఒకరు చెంబుతో నీళ్లు
పోస్తుండగా, నోటిదగ్గర
రెండు చేతులూ పెట్టుకొని
అందులోనుండీ వాడి మో
చేతులగుండా పడేనీళ్లను
తాగే మరొకడు వీ డనుట.
"వాడి మోచేతికింద నీళ్లు తాగి నేను
బతుకుతున్నాను." వా.
చూ. మోచేతికింద గంజి తాగు.

మోచేతి మడుపుటిల్లు
మోచేతిమడుపువలె కట్టిన
కట్టడము.
రెండిండ్లు కలిపి కట్టిన
కట్టడము అని శ. ర.

మోచేయి చూపు
లేదను.
"నీవు కొండంత ఆశతో పోతే వాడు
మోచేయి చూపించాడు." వా.

మోట బొల్లెద్దుకు ముకుదాడు
కట్టు
సాహసకార్యము నిర్వ
ర్తించు.
కుప్ప. 27.

మోటలు గట్టు
కాలువలు గట్టు.
మోటలు గట్టి తోలగా నీరు
వచ్చిన ట్లనుట.
"ముని వీణియ మీటె రసము మోటలు
గట్టన్." లక్ష్. 1.35.

మోటు వడు
మొద్దుబారు, చెడిపోవు.
వరాహ. 1.95.

మోటు సరసము
అనాగరకహాస్యము.

మోడి సేయు
అనాదరము చూపు.
"అవ్వలన మోడి, సేయ కెంతయు
సంతుష్టి సేయ వలయు."
హరి. ఉ. 10.316.

మోడునకు సిగ్గు - (కలదా ?)
అసంభవము.
మొండికి సిగ్గేమిటి? అన్న
రూపంలో విశాఖ ప్రాం
తంలో విన వస్తుంది.
మోడు నగ్నానికి దగ్గరది.
దానికి సిగ్గేమిటి? అనుట.
వేంకటేశ. 72.

మోడుబ్రతుకు
శుష్కజీవితము.
జగ. 137.

మోడ్పుకెంగేలు
నమస్కారము.
"మోడ్పుకెంగేలు కరుణాసము ద్రు
నకును." యక్షాం. 1.123.

మోతాదు మించు
మితి మీఱు.

మోతుబరి
ధనవంతుడు.
కొత్త. 13.

మోద కట్టు
మోదుచేత నెత్తురు గడ్డకట్టు.

మోదు లాడు
దెబ్బలాడు.
"తొడలను వీపులున్ దలలు నొవ్వఁ గడింగి మోఁదు లాడుచున్."
అచ్చ. రా. యు. 194.

మోపాది వచ్చు
అపాయము కలుగు.
(చి. ని. (బ్రౌన్. శ. ర.)

మోపు గట్టు
కుప్పలు వేయు.
గడ్డి గాదం మోపు కట్టుటపై వచ్చినది.
"మోపులు గట్టేవు ఇంతి మునుకొన్న సిగ్గుల." తాళ్ల. సం. 6.158.

మోపెట్టు
ఎక్కుపెట్టు.
"దుర్భరం బైనహరుచాపంబు నవలీల మోపెట్టి విఱిచిన...."
భాస్క. బాల. 707.

మోము చెవి జేర్చు
రహస్యసంభాషణలో...
"యింక న్వినుం డదిఁ, జెప్పెద నంచు మోము చెవిం జేరిచి యేమియొ చెప్పె....."
కళా. 4.51.
చూ. చెవులో చెప్పు.

మోము జూడక
అలక్ష్యముగా.
"సొమ్ము లన్నియు మోముఁ జూడక యొలిచి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1428.
"వాడు జేబులో చెయ్యి పెట్టి ఎంత వస్తే అంత దాని మొహం కూడా చూడకుండా ఇచ్చి వేస్తూ ఉంటాడు."
వా.

మోము ద్రిప్పులు
మూతివిఱుపులు.
ముఖ్యంగా ఆడవాళ్లు అసంతృప్తిని తెలుపుటకూ, లేదా వెక్కిరించుటకూ ముఖం తిప్పడం, మూతి విఱువడం మామూలు.
"మోముద్రిప్పులు బామముడి బొమ్మ తాటింపు, రాని జంకెన కావరంపుఁ బొగరు." శుక. 3.349.

మోమున వెన్నెల గాయు
ముఖవికాసము కలుగు.
"దంతమరీచులం దఱిమిల్లునవ్వు, వింతయై మోమున వెన్నెల గాయ."
ద్విప. కల్యా. 124.

మోము ముడుచుకొను
కోపగించు.
"మీఁదఁ జల్లక మాన మిట్టి మీ నై పడ్డ, ముందు నింతకు మోము ముడుచుకొనిన." బహు. 2.61.

మోము వెలుక పాఱు
మొగము వెలవెల పోవు.
"తనమోము వెలుక పాఱం, జనియె న్నిదురింపఁ గేళిసదనంబునకున్."
శుక. 2.94.

చూ. వెలవెల బాఱు, వెలవెల పోవు, తెల్లబోవు, తెలతెల పోవు.

మో మెత్తు చేయు

కోపించు.

కోపము వచ్చినపుడు మొగ మెత్తుబడును గదా!

"క్రొమ్ముక్కైన నొకలేమ మో మెత్తఁగాఁ జేయు." కా. మా. 2.18.

మో మోటమి

ముఖదాక్షిణ్యము.

"నీ మోమోటలు మాని నీరజముఖీ! నిక్కం బెఱింగింపవే." పారి. 1.83.

మోయని మోపు

భరింపరానంత భారము.

"ఆయము రెంటికి నన్నపానములు, మోయనిమోపిది ములుగఁగ నెట్లా." తాళ్ల. సం. 6.167.

మోరకొట్టు

చంపకాయ.

"కసిగుంపులు తిట్లు మోరకొట్టులు జారుం, డసమసుఖంబుగఁ గైకొను." శుక. 1.441.

రూ. మోరికొట్టు.

మోరతోపున

వెనక ముందులు చూచు కొనక, గుడ్డిగా.

"ఇట్టే మోరతోపున నిన్నాళ్లు మోస పోతిగా." తాళ్ల. సం. 1. పు. 75.

మోరత్రోపున

సులువుగా.

"వినుము హరిశ్చంద్రవిభుఁడు వసిష్ఠ, మునిమాట చెల్లింప మోరత్రోపునను." హరిశ్చ. ఉ. భా. 1756. పు. 257.

మోరికొట్టులు

చపేటముల వంటివి.

"కొసరువగమాట లలుకలుఁ, గుసి గుంపులు తిట్లు మోరికొట్టులు జారుం, డసమసుఖంబుగఁ గైకొను." శుక. 1.530.

రూ. మోరకొట్టు.

మోరు మోరులు వోవు

ముక్క వోవునట్లు చేయు.

ఏదైనా రాచిప్పలాంటిది ముక్క పోతే 'మొర్రె పోయిం'దని నేటికీ వాడుక.

"తలను.....మోరు మోరులు వోవఁ గొట్టంగ." పండితా. ప్రథ. పురా. పు. 302.

మోవ నాడు

మనసుకు తగులునట్లుగా మాట్లాడు.

తాక నాడు.

"గోవిందుఁడవైన నీ కొయ్యతనాలకుఁ గడు, మోవ నాడ వెఱతుము మొక్కేము నీకు." తాళ్ల. సం. 4.37.

"తనమీఁదఁ దెగి సొలపు మాటల, మోవ నాడ లేక యింత మొక్కితిఁ గాని." తాళ్ల. సం. 12.241.

మోవి జెఱ గిడి నవ్వు

అస్పష్టముగా, చాటుగానవ్వు.

"అనుచుఁ బరిభాషఁ బోలెఁ దమ్మాస దొరల, నాడ మోవిఁ జెఱం గిడి యూఁగు నవ్వు." ఆము. 2.21.

మోవి తీపాను

అధరపానము చేయు, ముద్దు గొను.

"గొంత వకిఁ గన్గొని చొక్కుచు నంత మోవి తీ, పొనె..." కళా. 5.32.

మోవి విరుచు

పెదవి విఱుచు.

రాధి. 4.18.

చూ. పెదవి విరుచు.

మోవులు నంజుకొను

అధరామృత మాను,

ముద్దులు గొను.

"మధువు గ్రోలుచు మోవులు నంజు కొంచు..." కళా. 6.128.

మోసకారి

వంచకుడు.

మోసము చేయువాడు.

మోసపుచ్చు

వంచించు.

పండితా. ద్వితీ. మహి. పుట. 214.

"వాడు నన్ను మోస పుచ్చినాడు." వా.

మోసపోవు

వంచితు డగు.

"కన్నులం గానక మోసపోయితి." రుక్మాం 4.115.

మోసము తెచ్చు

ఊనము తెచ్చు.

ఇందులోని మోసము వంచన కాదు. 'మొదలికే మోసము వచ్చు' మొదలయిన వానిలోని మోసము వంటి దిది.

"కాలం,బు న్నరులకు వయసుఁ బుచ్చి మోసముఁ దెచ్చుఁగా." ఆము. 2.79.

మోసము వచ్చు

ప్రతిఘాతము కలుగు,

ఊనము వచ్చు.

"మోసము వచ్చుట యరుదే, యీసునఁ దద్దర్వభావ లిచటి సృగాలా, గ్రేసరులు సైతురే..." శుక. 3.368.

"ఖరదూషణాది రాక్షసుల మర్దించ, శరచాపములకు మోసము వచ్చె నేమొకో?"

వర. రా. సుం. పు. 88. పంక్తి. 11.

చూ. మొదటికే మోసము వచ్చు.

మోసు లెత్తు

అంకురించు.

"మ్రాఁకులు మోసు లెత్త." దేవి. 4.123.

మౌన మర్ధాంగీకారం

ఎవరైనా అంగీకారం వాచ్యంగా తెలుపక పోయి నప్పుడు వారిని ఒప్పిస్తూ అనే మాట.

మ్రందకన్ను

ఒక విధమైన నేత్రరోగ గ్రస్తమైన నేత్రం.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

మ్రంది పోవు

చెడు.

"మంత్ర మాప్తపరంపర మ్రంది పోవ." నా. పంచ. 3.44.

మ్రక్కుబడు

మ్రగ్గి పోవు, స్రుక్కి పోవు.

"ఉరగులు స్రుక్కి మ్రక్కఁ బడిరి." కుమా. 12.155.

**మ్రాగన్ను పడి**

అర్ధనిమీలితనేత్రముగా.

"మ్రాఁ గన్ను పడి వెడఁ దూఁగు మేనున." కవిక. 4.163.

**మ్రాగుడు వడు**

మత్తవడు.

"...కంటనీరు మలంగ నీక, మగ్నత నూపక మాగుడు వడక." పండితా. ప్రథ. దీక్షా. పుట. 179.

**మ్రాదల కన్ను**

వాలిపోయినకన్ను.

పండితా. ద్వితీ. మహి. పుట. 108.

**మ్రానిచొప్పికలు**

కఱ్ఱబొమ్మలు.

"తరుణులు చిల్క బొమ్మలును దంతపు బొమ్మలు మేలిగాజు బ, న్నరులును మ్రానిచొప్పికలు నల్లడ నోలిన పేర్చి ......" శుమా. 3.36.

**మ్రానిమ్రానికి**

ప్రతి మ్రానికి.

శుమా. 6.130.

**మ్రానుదేఱు**

మ్రాన్పడు.

"మందిరాభ్యంతరము సొచ్చె మ్రాను దేఱి." విక్ర. 4.219.

**మ్రాను పట్టు**

ఆకులు రాలి చెట్లు మోడు లగు.

ఆము. 5.107.

**మ్రానుపడు**

నిశ్చేష్టుఁ డగు.

మ్రానివలె చేష్టలు దక్కి యుండు అని భావం.

"మ్రానుపడి మేను బహుతరగ్లానిఁ బొందె." శుక. 1.279.

**మ్రానుపాటు**

నిశ్చేష్టాభావము, చేష్టలు దక్కు.

"అలికులవేణి యొక్కతె మురారిఁ గనుంగొని మ్రానుపాటు మై, నెలకొన నున్నచో." పారి. 3.17

**మ్రాను పెట్టు**

స్తంభింప జేయు.

"సంగీతవిశేషంబుల, భృంగీగణ మొప్ప మ్రాను పెట్టెడిమాడ్కిన్." భాగ. 9.32.

**మ్రాను మట్ట**

జం.

"ఒక్క కొరడు గొట్ట యొక మ్రాను మట్ట, యొక్క బడియు బట్ట యొక కట్టె గిట్టె, మందునకైనను మ్రాఁకను పేరు, నెందును లేకుండ నేఁగాడు నంత." బసవ. ద్వి. ఆ. 3. బస. 3.65.

**మ్రాను వడు**

స్తంభాకృతి దాల్చు-సంభ్రమాశ్చర్యాదులతో నిర్విణ్ణుఁడుగా నిశ్చేష్టుఁడుగా నిలుచు.

"మేను మ్రాను వడియె" శుమా. 9.49.

**మ్రాను సెందు**

నిశ్చేష్టుఁ డగు.

"తదనంతరంబ యప్పటి, విదురశవము
మ్రాను సెంది వికృతిరహిత మై."
భార. ఆశ్రమ. 2.62.

**మ్రాలు దెంచు**
సోలు.
"తావిఁ గై వ్రాలిన తమ్మితేనలభంగి,
వాలారుఁజూపులు మ్రాలుదేర."
విక్ర. 7.102.

**మ్రింగనగొండి**
తిండిపోతు.
"వీఁక లోకములు సేవించిన పండ్ల,
ప్రాక మా కన్నదే ప్రళయాగ్నిరుద్ర,
మ్రింగనగొండి వై మ్రింగితి బసవ,
లింగనమారుఁ బాలితశివాచారు".
పండితా. ద్వితీ. మహి. పుట. 217-18.

**మ్రింగుడు పడు**
మింగబడినది అగు.
"మ్రింగుడువడె బకునిచేత మీఁ
దెఱిఁగి నృపా!" భాగ. 10. పూ. 446.

**మ్రుగ్గుకట్టు**
ముగ్గుపిండితో నేలమీఁద
గీచినగీఱ.
"ముంగిట గోమయంబున గోముఖము
దీర్చి కడలు నాల్గుగ మ్రుగ్గుకట్టు వెట్టి."
కాశీ. 7.141.

**మ్రుగ్గు పెట్టు,**
రంగవల్లులు తీర్చు,
"...యొక్క వేదిక, న్మత్తైపు మ్రుగ్గు
వెట్టి నొక ముద్దియ..." కళా. 7.58.

**మ్రుగ్గులు తీర్చు**
ముగ్గులు పెట్టు.
"నిలయము చక్కఁగా నలికి నిచ్చలు
మ్రుగ్గులు దీర్చు నింటికిన్."
రుక్మాం 4.107.

**మ్రుచ్చిలి పోవు**
దొంగిలించు.
"సీత, నీ కొఱకు మ్రుచ్చిలిపోయి
సగము రాతిరి వేళ."
వర. రా. సుం. పు, 85. 7. పం.

**మ్రుచ్చుగోర**
పెద్దదొంగ.

**మ్రుచ్చుజూపులు**
దొంగచూపులు.
"ముంగాళ్లఁ జాఁగి పై మ్రుచ్చుఁ
జూపులు వర్వ." ఆము. 6.18.

**మ్రుచ్చుప్రొద్దు**
అర్ధరాత్రి.
(శ. ర.)

**మ్రొక్క బోయిన గుడి మీద బడినట్లు**
మంచికి పోతే చెడు కలిగి
నట్లు.
"కడు భక్తి మ్రొక్కఁ జనుచో, గుడి
మీఁదం బడినయట్లు కువలయపతికిన్,
బడిబడి దానము లియ్యఁగఁ, జొరఁ
బడఁ గౌశికుని చేత దొసగులు తగిలెన్."
హరి. 4.90.

**మ్రొక్క వోయిన దేవర యెదు రైనట్లు**
ఆడ బోయిన తీర్థ మెదు రై
నట్లు.
"ఈవేళ మ్రొక్కఁ బోయిన, దేవర
యెదు రయ్యె బుద్ధదేవర మనకుం,
గావలసినవర మియ్యఁగఁ, దా వచ్చిన
వాఁడు రండు తామరసాక్షుల్."
దశావ. బౌద్ధ. 347.

**మ్రొక్కుల గుట్ట**
పూజనీయుడు.
"మూఁడు మూర్తుల నిట్టి మ్రొక్కుల గుట్ట."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 2103.

**మ్రొక్కులు చెల్లించు**
మ్రొక్కుబడులు తీర్చు.
"కోరి మ్రొక్కులు చెల్లించుకొనఁ జను గాఁగ, నాతఁ డేఁటేటఁ దిరుపతి కరిగి వచ్చు." శుక. 2.549.

**మ్రొక్కు వేయు**
నమస్కారము చేయు.

**మ్రొగ్గ వేయు**
మ్రొగ్గునల్లు చేయు.
"పరసేన యెంత గల దంతయు నొక్కట మ్రొగ్గ సేసి."
కుమా. 12.169.

**మ్రోడు వడు**
మొండి దగు.
"పఱపి రథికులను సూతుల, నఱికిన మ్రోడుపడి యుండె నానా రథముల్". భార. భీష్మ. 2.39.

**యంత్రము వేయించు**
రక్షరేకు కట్టు.
"పిల్లవాడు మరీ చిక్కి పోతున్నాడు. ఏ దయినా యంత్రం వేయించండి."
వా.
చూ. రక్షరేకు.

**యంబన్న చేయు హాస్యము**
తెలివి లేనివాడు చేసే వేళా కోళము.
శివ. 22.

**యంబ్రహ్మ**
ఒక తిట్టు.
చేతకానివాడు, తెలివి మాలినవాడు.

**యక్షప్రశ్నలు**
అంతు చిక్కని ప్రశ్నలు.
భారతంలోని కథపై వచ్చిన పలుకుబడి.
"నీ యక్షప్రశ్నల కెవడు సమాధానం చెబుతాడు." వా.

**యజ్ఞం చేసినంత పని**
కష్టసాధ్యము.
"ఈ పిల్లలతో చదివించడం అంటే యజ్ఞం చేసినంత పని." వా.

**యథాతథముగా**
ఉన్న దున్నట్లుగా.

**యథాయథ లగు**
చెల్లాచెద రగు.
"దగలు దొట్టి యథాయథ లగుచు విఱిగి." మను. 4.103

**యద్వాతద్వంగా**
అస్తవ్యస్తంగా.
"వాడిదగ్గరకు వెళ్లి లాభం లేదు. ఏ మన్నా యద్వాతద్వంగా జవాబిస్తాడు." వా.

**యద్వా తద్వా లాడు**
అస్తవ్యస్తముగా మాటలాడు.
క్రిందిప్రయోగంలో యద్వా తద్వము లాడు అని ఉన్నది.
సంపంగిమన్న. 54.

**యద్వాతద్వాలు**

అస్తవ్యస్తపు మాటలు.

"బృహస్పతి సంభావనరూకలు నీవు అపలాపించుకొని యెషువలె యద్వాతద్వాలు చెప్పుచున్నాడ వోయి!" క్షేమా. పు. 83.

**యమచిక్కు**

గట్టి చిక్కు.

కొత్త. 187.

**యమయాతన పడు**

నానాబాధా పడు.

"ఆ యిల్లాలు పాపం ఆ యింట్లో యమయాతన పడుతూ ఉంది. అత్త తగయ్యాళి. మామ పరమకోపిష్టి. మగ డేమో వెయ్యిండ్లపూజారి." వా.

**యములాళ్లు**

యమభటులు.

పట్టుకొంటే వదలని రకం అనుట.

కొత్త. 13.

**యాగీ పెట్టు**

అల్లరి పెట్టు.

"వాడు పదిరోజులనుంచీ యాగీ పెట్టేస్తున్నాడు." వా.

**యాత్రసంచి**

ఒక విధమగు చిన్న గోనె.

దీనినే అసిమిసంచి అంటారు.

(శ.ర.)

**యాదవకులములో ముసలము పుట్టు**

సర్వవినాశమునకు కారణ మేర్పడు.

"పసుగు రొక్కొడు గూడు పట్లనే పుట్టెనే, కులము కట్టడికే ముసల మొకండు." వ్యాఖ్యా. చాటు.

**యాదృచ్ఛికముగా**

దైవవశాత్తుగా. తెలవని తలంపుగా.

**యాయవార మెత్తుకొను**

బిచ్చ మెత్తుకొను.

యాయవారం బ్రహ్మచారులు చేసుకునే భిక్ష.

యాయూవరం అన్నదాని భ్రష్టరూపమే యిది.

"పాపం ఆ కుఱ్ఱాడు యాయవారా లెత్తుకొని చదువుకొంటున్నాడు." వా.

**యావత్తు**

అంతా, పూర్తిగా.

బస. 3.64.

**యుక్తిపరుడు**

ఉపాయశాలి.

**యుక్తిప్రత్యుక్తులు**

జంటపదం.

ఉపాయములు.

**యుగంధరప్రజ్ఞ**

అసాధారణ ప్రతిభ.

**యుగంధరుడే!**

చాలా సమర్థుడు.

"వాడా! యుగంధరుడే! వాణ్ణి గురించి ఏలాంటి భయమూ అక్కఱ లేదు." వా.

**యుగచర్య సుద్దులు**

పాతకాలపు సంగతులు.

దినమూ జరిగేదానిని దిన
చర్య అన్నట్లే యుగానికొక
సారి జరిగే దన్న అర్థంలో
యుగచర్య అంటారు.
"మూడవవి యెల్ల యుగచర్య సుద్దు
లయ్యె". హంస 1.190.

**యుగము గ్రుంగిన యట్లు**
ప్రళయము వచ్చినట్లు.
'ఊరూ ఉగము ఏకము చేసి
నాడు, గొప్ప అల్లరిపెట్టి
నాడు' అని అర్థం.
అట్లాంటివే 'ఊరూ వాడా
ఒక టైంది.' 'ఊరు నాడు
ఉడికి పోయింది' మొదలయిన
పదాలు. ఈ ఉగము ఊరుకు
తోడుపదంగా వస్తున్నట్లు
గోచరిస్తుంది.
"...... మొన్నఁ గన్న యపుడె.
యుగము గ్రుంగినయట్టైన నోల్లఁ
బోయి". శుక. 3.149.

**యేషాగాథాలు**
అసత్యవ్యస్తపు మాటలు.
"ధారబోనితి రూకలున్న నీవు
గ్రహించుకొని యిషుకలె యేషా
గాథాలు ఆడేది లెస్సువోయి!"
హేమా. పు. 83.

**యోగక్షేమ మడుగు**
కుశలప్రశ్న చేయు.
"అనుచు బాంధవాదిజనుల యోగ
క్షేమ, మడుగ భద్రమఖిల మనియె
నతఁడు."
హంస. 5.345.

**యోగనిద్ర**
యుగాంతమున విష్ణుదేవుని
నిద్ర.

**యోగపట్టము**
యజ్ఞోపవీతమువలె యోగి
ధరించెడి సూత్రము.

**యోగపట్టె**
"పండువెన్నెల యోగపట్టె పొందుగ
వైచి, ప్రొద్దు నిద్దపు మేన బూదిఁ
బూసి." సారంగ. 3.181.
చూ. యోగపట్టము.

**యోగాసనములు**
ఆసనములు.

**యోధానయోధుడు**
వీరుడు, గొప్పవాడు, సమ
ర్థుడు.
"అంతిమంది యోధాన యోధులు
పోయీ పని కాలే దన్నమాట."
వా.

**రంకులగొంట్లు**
వ్యభిచారులు.
ఇది దూషణలో ఉప
యోగించే ఒకతిట్టు.
పండితా. ప్రథ. పురా. పుట. 343.

**రంగభూమి**
రంగస్థలము.

**రంగ మెక్కు**
ప్రసిద్ధి కెక్కు.
"ఆవిషయం రంగ మెక్కడంవల్ల అత
ని కెక్కడా ఉప్పు కూడా పుట్ట
లేదు." వా.

**రం గలరు**

ఒప్పు.

**రంగవల్లి**

ముగ్గు.

**రంగశాల**

నాటకశాల.

**రంగస్థలము**

నాట్యము చేయుచోటు.

**రంగుగ నోలిన రాటనము**

రంగుల రాట్నము, రంకుల రాట్నము.

"రంగుగ నోలిన రాటనమున గుండల బోలెన్." కుమా. 11.171.

**రంగు పొంగారు**

మెఱుగులు దేఱు.

"గేహాంతంబుల దీపపంక్తులు చెలంగగా రంగు పొంగారఁగన్." హంస. 2.3.

**రంగు మార్చు**

తను చెప్పుసిద్ధాంతాలను తానే మార్చి చెప్పు.

పార్టీలు మార్చు.

నా. మా. 27.

**రంటదెప్పరపురచన**

అతుకుల కూర్పు.

"రంటదెప్పరపురచన మా బతుకు, జంటల శ్రీపతి శరణమె నిజము." తాళ్ల. సం. 10.184.

**రండాగర్భం**

చెప్పుకో వీలు లేనిది.

"రండాగర్భ మగుట గా,దని యటు నిటు సనఁ దోఁపక." శాంతి. 6.48.

**రంతు సేయు**

అల్లరి చేయు.

"ఆతిథ్యము గొని హరి తన, చేతోగతి నోలయ రంతు సేయనివిద్య, ద్యోతితంబుఁ జూచి..." ఆము. 3.4.

**రంధ్రాన్వేషి**

తప్పులు వెదకువాడు.

"వాడు మహా రంధ్రాన్వేషి. ఎప్పుడూ పరాయివాళ్ల తప్పులు వెతుకుతుండడం తప్పితే వాడికి వేరే పని లేదు." వా.

**రంపపు సంసారము**

కటకటగా నడచు సంసారము.

తాళ్ల. సం. 5.122.

**రంపెల గొట్టు**

మహాదారుణమైన కార్యములు చేయువాడు.

"రంపెలగొట్టు గాక బలు రాయిడి కత్తియ గాక యెప్పుడున్." ధనాభి. 2.60.

**రంభలాంటి పిల్ల**

చాలా అందగత్తె.

"ఆ అమ్మాయి కేం? రంభ లాంటి పిల్ల. ఎవడో ఒకడు వచ్చి లక్షణంగా చేసుకుని పోతాడు." వా.

**రక్షరేకు**

పీడానివారణార్థం రాగి రేకుపై ఏదో యంత్రం వ్రాసి తాయెత్తులో వేసి బిగించి చేతికో మెడకో నడుముకో కట్టునది.

రఘురాము తమ్ముని సిలిచి కొనుచు

అలో లక్ష్మణా! అంటూ.

"లెస్స తెరువాటు గొట్టితి లె మ్మ టంచు, గ్రుడ్ల గొలఁగిగఁ గన్నీరుఁ గ్రుక్కికొనుచుఁ, దగినమాటకు నో రేది దానియిల్లు, వెడలె రఘురాము తమ్ముని౯ బిలిచికొనుచు."

శుక. 3.131.

బాణాల. కాశీ. 99.

చూ. అలో లక్ష్మణా అను.

రచ్చ కీడ్చు

వీధి కీడ్చు, కలహమున కీడ్చు.

ఇచ్చట రచ్చ రచ్చపట్టు లోనిది కూడ. తగాదా పడినవా ళ్లందరూ రచ్చ బండకు వెళ్లి పరిష్కరించు కొనేఅలవాటుపై వచ్చినది.

"నేను నా మానాన నోరు మూసుకొని ఉన్నా వాడు నన్ను ఊరికే రెచ్చ గొట్టి రచ్చ కీడుస్తున్నాడు. అంచేత నేను మీ సాయం కోరక తప్పింది కాదు." వా.

రచ్చకొట్టము

రచ్చచావడి.

"దేవగృహముకడ వీధిని, గోవాటము నందు రచ్చకొట్టముపొంతన్."

భార. అను. 4 98.

రచ్చగోను

గుంపు కూడు.

"అచ్చెరువడి వియచ్చరులు వచ్చి రచ్చగొని యాడ."

రామా 5.188.

రచ్చ చేయు

కలహించు, గోల చేయు.

వాడుకలో — దక్షిణసీమాంతంలో ఇది ఎక్కువగా వాడుతారు. 'ఏమిట్రా — అంత రచ్చ చేస్తున్నావు?' 'ఆ యింట్లో పొద్దస్తమానం రచ్చతోనే సరి పోతుంది.'

రచ్చపట్టు

రచ్చతిన్నె.

పల్లెల్లో ఒక చెట్టూ, దాని చుట్టూ అరుగూ ఉంటుంది. అక్కడ రైతు లందరూ చేరడం మాట్లాడుకోవడం అలవాటు. లక్షణయా చేరు చోటు అని అర్థం.

"కనకనగసీమఁ గల్పవృక్షముల నీడఁ, బచ్చరా చట్టు గమి రచ్చపట్టు మాకు." మను. 2.43.

రచ్చబండ

పది మంది కూర్చుండెడి బండ.

రచ్చమ్రాను

పల్లెలలో రైతులు కూడు స్థలమున పెంచిన చెట్టు.

"ఉన్నతం బైనరచ్చమ్రా నొఱఁగి కడఁ సె." ఉ. హరి. 5.37.

రచ్చ యొనర్చు

కలహించు, సంఘర్షణ పడు.

"పచ్చికచాయయుం జిలుతపాయము
గల్గు వెలుంగు నిచ్చలో, రచ్చ యొనర్ప
నందలిపరాకునం దేలుచు..."
పాండు 4.49.
చూ. రచ్చ చేయు.

## రజ్జు లాడు

అపసవ్యము లగు మాట
లాడు.

"అమ్మ నేఁ జెల్ల బాపనయ్యా! మ
తేమి, రజ్జు లాడెదు మంచి గురస్తు
వగుదు." శుక్ర. 2.474.

## రట్టుకత్తె

సాహసికురాలు.

"అలిగి యెంతటి రాజునాంధ్ర నైనను
బట్టి, పుట్టుపాపలఁ జేయురట్టుకత్తె."
క్రీడా. 129.

## రట్టు గావించు

రచ్చ కెక్కించు, గోల చేయు,
అగుడు పెట్టు.

"అడుగ వచ్చిన మనసు రానట్టివారి,
రట్టు గావించి మగనాలిఁ బట్ట డాసి,
తొర! శుక. 2. 105.

"సంసారం గుట్టు వ్యాధి రట్టు." సా.
చూ. రట్టూ రావిడీ.

## రట్టు వడు

ఇతరుల దూరుకు పాల్పడు.

"వారిజానన! రట్టు పడ్డార మిచట."
శివ. 3.132.

## రత్నకంబళము

ఒక దినుసు కంబళి.

## రత్నము వంటివాడు

మంచివాడు, శ్రేష్ఠుడు.

## రథము పన్ను

రథము సన్నద్ధము చేయు.

"పన్నుము నా కొక్క చిన్న తేరు."
పాండు. 5.125.

## రబ్బరు బొమ్మ

అంద మైనది.

ఇటీవల వచ్చినపలుకుబడి.

"అలితకు మొన్న పుట్టినపిల్ల రబ్బరు
బొమ్మలా ఉంటుంది." వా.

## రమణ కెక్కు

శోభిల్లు.

"రామానుజత్వంబు రమణ కెక్క."
వసు. 1.13.

## రమారమిగా

సుమారు.

## రవరవ

(మనస్తాపము ?) త్వరగా.

"రవరవఁ జనుదెంచిరి భా, గవతసుధా
రసముఁ గ్రోలఁ గడు లోలుపు లై,
తివిరుతమిఁ బరువు లిడుచుఁ ద్రి, భువ
నాకసు లెల్ల హర్షపుణ్యాటవికిన్."
భాగ. ఆ. 2.

## రవరవలు నెఱపు

మనస్తాపము కలిగించు.

"రవరవలు నెఱపు." విజయ. 1.150.

## రవరవలు పొడము

మనస్తాపములు కలుగు.

"అవలఁ బచరింపఁగా రవరవ ల్వొడ
మెన్మది వారి కెంతయుఁ."
పారి. 1.42.

రవ్వ మీఱు
నర్మగర్భ మైన.
"రవ్వ మీఱుసరసోక్తులు"
పాండు. 3.66

రవ్వ యొనరించు
రచ్చ చేయు.
"రవ్వ యొనరింప వల దంచు రమణిఁ
దోడు, కొనుచు గుట్టునఁ దన
గృహంబునకుఁ జనియె."
శుక. 1.543.
చూ. రచ్చ రాయిడి, రవ్వ రట్టు.

రవ్వ రట్టు
జం.
"రబ్బస మెల్ల నేమిటికి రవ్వయు
రట్టును నీకు ?
గిర. 23.

రవ్వలమారి
కలహశీలి.
మదన. శత. 70.

రసకర్పూరము
కర్పూరరసము.

రసగుండ్లు
గాజుగోళాలు.
కాశీయా. 251.

రసచెక్కలు
కాచు కలిపినవక్కలు.
కాశీయా. 336.

రసదాడి
ఒక జాతి అరటిచెట్టు.

రసాయనసాస్త్రము
కెమిస్ట్రీ.

రస్తు మీఱు
దీని మూలం రస్ద్. అనగా
సైన్యమునకు రోజువారీ
యిచ్చేబత్తెము.
కాని ఆ తర్వాత అది
తెలుగులోనికి విలువైనది,
ప్రకాశవంత మైనది అన్న
అర్థంలో వచ్చింది.
పుష్టికర మైనఆహారం తింటే
మిసమిస లాడడం సామాన్యం
గనుక వచ్చి ఉంటుంది.
"అలరు మెం దైననిండుప్రాయంబు
కలిమి, రస్తు మీఱుచు నాతని గేస
రాలు."
శుక. 2.100.

రాక చిక్కు
రాక నిలిచి పోవు.
"విభుండు నిన్నిరో, ధానుపమాన సౌఖ్య
విభవాప్తి మెయిఁ వెస రాక
చిక్కనఁ."
శుక. 1.417.

రాకాసిబుద్ధులు
పాడుబుద్ధులు.
నా. మా. 120.

రాకొట్టు
రారా పోరా అని యేక
వచనాంతముగా పిలుచు.
"రణము సేయువేళ రాకొట్టి పిలుచుట,
పాడి యిదియ మిగుల భజన కెక్కు."
ద్వా. 7.65.

రాగి దేఱు
ఎఱు పెక్కు.
"పదను దివిసి రాగి దేఱి పలుకక
యున్నే ?"
పాండు. 3.182.

రాగుంజు పోగుంజు లాట

ఇటువారు ఇటు వచ్చునట్లూ, అటువారు అటు పోవునట్లూ తాటిని గుంజుతూ ఆడే ఆట. Tug of war అని నేటికీ ఈ ఆట వాడుకలో ఉన్నది.

పండితా. ప్రథ. పురా. పుట. 460.

రా గుండియ

కఠినుడు.

'వాడిది రాతిగుండె అనడం' అలవాటు.

కాశీ. 5.300.

రాచకురుపు

ప్రాణాంతకముగా వీపు పై లేచు పెద్దవ్రణము.

(శ. ర.)

రాచపాడి

రాజధర్మము.

రాచపుండు

రాజవ్రణము.

చూ. రాచకురుపు.

రాచబాట

రాజమార్గము.

నా. మా. 18.

రాచ వెట్టి

రాజులకు చేసేచాకిరి.

రాచకొలువు, వెట్టిచాకిరిలో నిదే ఈ వెట్టి.

"మా పుదాఁకా రాచ వెట్టి మాన వచ్చునో." తాళ్ల. సం. 10.248.

"పిట్టక్కకై రాచ వెట్టికిఁ బోయి, యెట్టకేలకు నింత పిట్టారగించి."

బస. 3.59.

రాచి రంపమున పెట్టు

పీడించు, బాధించు.

"ఆవిడ కోడలిని రాచి రంపాన పెడు తుం దని విన్నాను." వా.

రాచి రంపాన బెట్టు

మిక్కిలి కష్టపెట్టు.

"వాడు తన భార్యను రాచి రంపాన పెడుతున్నాడు." వా.

రూ. రాచి రంపమున పెట్టు.

రాజధాని

ప్రధాననగరము.

"హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ రాజ ధాని." వా.

రాజ బెట్టు

1. రాజుకొనునట్లు చేయు,

2. అభివృద్ధి పఱచు.

"ధార్తరాష్ట్రమానసములఁ బగ రాజఁ బెట్టి." భార. కర్ణ. 3.124.

"పొయి రాజ బెట్టు." వా.

రాజాన

రాజుమీాద ఒట్టు.

"పోవద్దు రాజాన పోయితి వేని"

పల. పు. 112.

రాజాన్నము

ఆంధ్ర దేశంలో పండు ఒక ఒక రకమైన ధాన్యము.

రాజనాలు అని వ్యవహారం.

రాజాబహాదరు

ఒక బిరుదు.

రాజుచేతి నిమ్మపండు
రాజాదరణపాత్రుడు.
"ప్రబలి రాజులచే నిమ్మపండు నైతి".
పాండవాశ్వ. 65.

రాజుబంటు వాసి
రాజుకూ సేవకుడికీ ఉన్నంత అంతరం.
హస్తిమశకాంతరం వంటిది.
"ఈయన నాయన నెన్నఁగఁ, బ్రాయంబున రాజుబంటువాసి దలంపఁగా".'
రాధి. 3.141.

రాజు వలచినది దేవులు
రాజు మెచ్చినది రంభ వంటిది.
"ఆగమున రాజు వలసినది దేవులు... లోకములోపల నిది నానుడిమాట."
తాళ్ల. సం. 7.64.

రాజువేషమువాని రంగు
తెల్లవారేవరకే అనుట. నాటకం అయి పోగానే రంగు కడిగి వేస్తారు గనక.
మున్నాళ్లముచ్చట వంటిది.
రామచం. 44.

రాజో! రెడ్డో!
ఎవడయితే నేమి అనుపట్ల ఉపయోగించేపలుకుబడి.
గీర. గురు. 20.

రా జౌనో, రడ్డి యౌనో
ఏమి కానున్నదో అనుట.
"నిను( గలయ భర్త కోపగాఁ డనఁగ నేల, కోల భుజమున నిడి దున్నఁ దోలువాఁడు, అక్వ యన నేల? రాజౌనో రడ్డి యౌనో, నాఁటి కిపు డేమి రారాదె, యేటి కలప."
సారం. 2.114.

రాటుపోటులు
రాపిడి. జం,
"...ఆ రాటుపోటుల కాగి నిక్కి..."
శ్రీని. 5.14.

రాణివాసము
అంతఃపురము.
"రాణివాసంపు సతులు పార్శ్వములఁ గొలువ." ఉ. రా. 3.186.

రాతికొడుకు
కప్ప.
రాతి కడుపులో కప్ప లుంటా యని మన వాళ్ళ నమ్మకం. అందుపై వచ్చిన పేరు.
"రాతికొడుకైనయిల్వలా రాతిచట్టు." పాండు. 5.314.

రాతిగొట్టుబాట
వట్టి రాళ్లూ గుండ్లూ ఉన్న దారి.
కాశీయా. పు. 2.

రాతిపారు
అడుగున రాయి కలనేల.
కాశీయా. 53.

రాతిమీద వంపు తెలియదు
బాగున్నప్పుడు లోటుపాట్లు బయట పడవు.

రాతియుప్పు
సముద్రములో పుట్టుఉప్పు.
శ. ర.

రాతివీరుడు
వీరుని విగ్రహము.
పల్లెలలో వీరులను దేవతల వలె విగ్రహాలు చేసి పూజించడం అలవాటు. ఆ విగ్రహాలను వీరు లంటారు.
"రాతివీరునికి భీరము ఇంచుకా లేదు." తాళ్ల. సం. 7.260.

రాత్రి పవ ళ్లనక
ఎల్లప్పుడు.
"యాత్రావసలఁ దిరిగితి, రాత్రి పవ ళ్లనక వినుము రాకేందుముఖీ!"
హంస. 3.148.

రానార గొన గల
ఱాతిలో నార తీయ గల. అసాధ్య కార్యములను నెఱ వేర్చుజాణ అను నిరస నార్థంలో.
కమా. 8.135.

రానార యొలువ నేర్చు
అసాధ్యకార్యములను చేయ గలవా రనుటకు నిరసన సూచిస్తూ అనే మాట. రాతిలో నార తీయ గల్గుట మాటలా?
పండితా. ప్రథ. పురా. పుట. 359.

రాపాడు
రాయు.

"తల కెక్కువలపునఁ దగులు శూర్ప ణఖ ముక్కును జెవుల్ రాపాడుకొనిన చోటు." సారంగ. 1.109.

రాప్రతిమ చక్కిలిగింతలు
వ్యర్థప్రయత్నము.
"...యీ దృఢ, స్వాంతునిఁ జూచి రాప్రతిమ చక్కిలిగింతలు వోలెఁ గంటిరే, యెంతయు రిత్త వోయె మన యిద్దఱ చేష్టలు నన్ను నవ్వుచుళా."
పరమయో.

రాబట్టుకొను
ఇచ్చినదానిని మరల వచ్చు నట్లు చేసికొను.
"ఒకటికి రెండుగా నొగి వడ్డి రాఁ బట్టి." రామ. 366.

రామందాడిగా
అసంఖ్యాకంగా.
"ఆ తిరణాళ్లకు జనం రామందాడిగా వచ్చారు." వా.
వానరసైన్యం లంకమీదికి దండెత్తి పోవడంద్వారా వచ్చిన పలుకుబడి.

రామబాణం
తప్పి పోని, చురుకైన, నిశిత మైన.
"వాడు రామబాణంలాంటి వాడు."
వా.
"ఆవిడజోలికి ఎవరు పోతారు? రామ బాణంలా పైకి వస్తుంది." వా.

రామరాజ్యం
సుభిక్షముగా ఉన్న రాజ్యం. ఆనందప్రదము, హాయి కూర్చునది.

"మచ్చరము లేకున్నా మనసే రామ రాజ్యము. తాళ్ల సం. 7.128.
"కృష్ణదేవరాయలు ఉన్నన్నాళ్లూ ఆంధ్రదేశం రామరాజ్యంలా వెలిగి పోయింది." వా.

రామ రామ అని రాజ్య మేలు తావా?

'నీ వేం కట్టుకొని పోతావు?' అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"ఆ పేదవాళ్ల కొంపా పొలం కాస్తా కాజేశావు. నువ్వు మాత్రం ఏం రామ రామ అని రాజ్యం ఏల పోతావా?" వా.

రాయంచబోదల నెలయించు

వెన్నంటుతుండగా తప్పు దారులు పట్టించుటకై అటు నిటు తిరుగు.

"కలికి రాయంచబోదల సెల్ల నెల యించి, నడిపింప రే లోకో పడఁతు లిపుడు." పారి. 1.106.

రాయి గుద్దు

బల్ల గుద్దు.

"నీవు బుద్ధి మాలినవాఁడవు గావున రాయి గుద్ది బూటకములు పాటించితివి." ధర్మజ.

రాయి గొట్టిన గొడ్డలి

మొండివాడు, కఠినుడు.

"ఘుటికసిద్ధుఁడు రాయిఁ గొట్టిన గొడ్డ, లిటమటకాఁడు మహామా యలాఁడు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 647-48.

రాయిడి చేయు

వేధించు.

"ఊరకే రాయిడి చేసి."
రుక్మాం. 5.111.

రాయి, రప్ప

జం.

"ఇది రాయి రప్ప పల్లం, బిది మిట్టిది మాకు మట్ట యిది పా మిది గా, మిది యని వివరింపఁగ బెట్టిద మై యొప్పెసఁగు నక్కటికిచీఁకటిలోన్."
పంచ. వేం. 4.169.

రారాని యెడ

రా కూడని చోటు.

"చుట్టతిక మెంత గలిగిన, రట్టున రారానియెడకు రా వారలపై."
హంస. 5.328.

"రారానిచోట్లకు పోతే పోరానిమా టలు వస్తాయి." వా.

రారాపు

రాయిడి.

"రామా అట్లనె కాని మందా, రారా పేల యే మాయె." రాధి. 3.6.

రారా పొనర్చు

గిల్లి కజ్జా పెట్టుకొను.

"తళుకుఁజూపులకు విద్యాంసు లైనను నిజ, రాముతోడ రారా పొనర్పు."
శుక. 3.15.

రా ల్గరగించు

రాళ్లను కూడా కరిగింప

గల – అనగా అతి మనోహర
మనుట.
"రహిఁ బుట్ట జంత్రగాత్రముల తాల్
గరఁగించు, విమలగాంధర్వంబు విద్య
మాకు." మను. 2.43.

రాలుగాయ
పోకిరీ.
కొత్త. 55.

రాలువాఱు
జాలువాఱు, స్రవించు.
"రసములు దళుకొత్తి రాలువాఱ." కుమా. 1.36.

రాలెడు వడపిందె
రాలి పోవునది, త్వరలో
నశించునది.
గాలికి రాలినపిందెలను వడ
పిందె లంటారు.
"రాలెడు వడపిందె నీదురాజ్యం బనఁ
గనె." కవిక. 6.42.

రావణాసురుని కాష్ఠం
ఎడ తెగనిది.
రావణాసురుడికాష్ఠం ఎప్పటికీ
మండుతూనే ఉంటుం దన్న
ప్రతీతిపై వచ్చినపలుకుబడి.
"ఆ యింటికీ యీ యింటికీ పగ
రావణాసురుడికాష్ఠంలా మండుతూనే
ఉంది." వా.

రావి జూడు బ్రహ్మరాకాసిచూడు
ఎంత ఆకర్షక మయినా
అందుతో . చేరి యున్న
ప్రమాదమును గూడా గమ
నించు అనుట.
తాళ్ల. సం. 3.585.
"రావిచెట్టు బాగానే ఉంది. కింద
పడుకుందా మంటే దానిమీద బ్రహ్మ
రాక్షసి ఉంది." వా.

రావిమాని పూవులు
లేనివి.
కుందేటికొమ్ము వంటిది.
తాళ్ల. సం. 7.34.

రావిరేక
ఒక నగ.
"అరమోమందలి రావిరేక తుల
కింపఁగ." సారం. 1.50.

రాశి కెక్కు
గణన కెక్కు.
"ఎవ్వని చరిత, మియ్యాకోలై వాసి
కెక్కు లోకముల." 
పండితా. ప్రథ. పురా. పుట. 385.
చూ. వాసి కెక్కు.

రాసి కెక్కు
ప్రసిద్ధి కెక్కు.
"రాసి కెక్కనట్టి యాచారాలు
సేసేవు. తాళ్ల. సం. 3.630.

రాసి పెట్టి ఉండు
విధినిర్ధారిత మై ఉండు.
"ఇందులోని వ్రాత బ్రహ్మవ్రాత."
కొత్త. 341.

రాహువెట్టు
అడ్డగించు.
"ఎలని పయివారి దంతిఘటల మద
ముల రాహు వెట్టుటయు."
భార. భీష్మ. 1.141.

రాళ్లు తిని రాళ్లరిగించుకొను
ఏమి తిన్నా అరిగించుకో గల ఆరోగ్యము కలవా డనుట.
"నీ కేమిరా? రాళ్లు తిని రాళ్లరిగించు కొనే వయసు. అంతలోనే చాలంటా వేమిటి?" వా.

రింగులు వాఱు
పింజలు జాఱు.
"తెలి మించు మడుఁగు రింగులు వార." విప్ర. 2.79.

రిత్తకు రిత్త
వ్యర్థముగా.
"రిత్తకు రిత్త చనియెఁ గాలంబు." వర. రా. బా. పు. 40. పంక్తి. 25.

రిత్త చను
వ్యర్థ మగు.
"...నీ మార్గ మహాపుణ్య మెట్టిది యో ఫలం,బునకు రా కది రిత్త చను నె యనియుఁ..." కళా. 2.6.

రిత్తచేయి చూపు
లే దను.
సుమతి. 70.

రిత్త జంకించు
ఊరికే బెదిరించు.
"కత్తు లంకించు వారును రిత్త జంకించు వారును." పారి. 4.67.

రిత్తసడి
వట్టి అపవాదు, తప్పు చేయ కనే చేసి నాడన్న అపనింద, చెడ్డపేరు.
"కృపయాశఃఖండనం, బయ్యె నను రిత్త సడి వచ్చె నవనిలో నాకు." పండితా. ద్వితీ. మహి. పుట. 49.

రిత్తసావు సచ్చు
వ్యర్థంగా చనిపోవు.
"గాంగేయకుంభసంభవుల ంతటి మానుసులు నిట్లు రిత్తసావు సత్తురే యని." భార. కర్ణ. 2.17.

రిమ్మ పట్టించు
వెఱ్ఱెత్తించు.
"రావణుమాట, రిమ్మ పట్టింప మారీచుఁ డి ట్లనియె."
వర. రా. అర. పు. 130. పంక్తి. 6.

రిమ్మ వొడము
బుద్ధి పుట్టు.
"దండహస్తి మనోజాంకు దండ వెట్టె, నమ్మహీదేవు నెమ్మది రిమ్మ వొడమె." శుక. 2.454.
"బమ్మ కైనఁ బుట్టు రిమ్మతెగులు." సా.

రివ్వు రివ్వున
ధ్వన్యనుకరణము.
అతివేగమును సూచించు టలో దీని నుపయోగిస్తారు.
"గగనంబున కెగయు కాకోదరానీకం బులవీక, రివ్వు రివ్వున నెగిరి చను నాకసపుఁ జువ్వలు మింట నెఱయ." హంస. 3.29.

రీతి పాతీ లేదు
నీతీ నియమమూ లేదు.
"వాడు చేసేపనికి ఒక రీతీ పాతీ లేదు." వా.

రుద్రభూమి

స్మశానం.

"అడిదంబుతోడు గా నా రుద్ర భూమిఁ, గడు నప్రమత్తుఁడై కాఁ పుండె నంత."

గా. వారి. ద్వితీ. పంక్తి. 1685-86.

రుద్రాక్షపిల్లి

కపటవర్తనుడు.

పిల్లి రుద్రాక్ష కట్టుకొని అహింసావ్రతం ఆచరిస్తున్నట్టు నటించి పిట్టలను కొట్టివేసిన కథపై వచ్చిన పలుకుబడి.

"ఈ రుద్రాక్షపిల్లిగాడెక్కడ దొరికాడు. చూస్తే సన్యాసే కానీ అంతా దొంగవేషాలే." వా.

రూక రుద్ర

డబ్బు. జం.

"జోకఁ బదియైదు లీకన్నఁ గోకయొకటి, కాక యుండిన నొకమేక లేక పోయె, రూక రుద్రైన నీవలెఁ గాక కట్టి, రాకలకుఁ బిల్చినా గణికాకులంబు." బహులా. 5.87.

నిరం. 2.123.

రూఢికి నెక్కు

ప్రసిద్ధి కెక్కు.

సింహా. 2.117.

రూ. రూఢి కెక్కు.

రూఢి కెక్కు

ప్రసిద్ధి కెక్కు, పేరు కెక్కు.

"రూఢి కెక్కెనగజములు పెక్కువేలు." భార. ద్రోణ. 2.199.

"సత్కులంబందును సరసత జన్మించి, రూపరేఖలచేత రూఢి కెక్కె."

ఉషా. 1.43.

రూపఱు

నశించు.

"ఘోటరథేభవీరభటకోటులు రూపఱి పోవ." జైమి. 2.40.

రూపు చెడు

నశించు.

"మంచయ్యును మడిమం చయ్యును, రూపు చెడి తిరుగుడు వడి."

ఉ. హరి. 1.148.

రూపు మాలు

నశించు.

"మహిధరంబులు రూపు మాలి యుండ." శివ. 1.51.

రూపు రేఖ

రూపు రేఖలు అని వాడుక. వాడుకలో 'వాని రూపు రేఖలు' అంటారు. వంపులూ సొంపులూ వంటి మాట. తర్వాత సమస్తంగా ఆకార విశేషాదు లన్నిటికీ సూచక మయినది.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 174.

రూపేదు

రూపు మాయు, స్వరూప నాశన మగు.

"వారిధుల్ రూపేదుఁగా."

పాండు. 5.253.

రెంటికీ చెడు

ఇహపరాలకు దూరు డగు.

"వాణ్ణి నూషిస్తే నీ కేం వస్తుంది రా. రెంటికీ చెడ్డం తప్పితే." వా.

రెం డడుగులు చను

కొంతదూరము పోవు.

"కనుంగొనుచుఁ రెం డడుఁగులు నట చనుచుఁ." విప్ర. 2.67.

రెండ రామడ

ఒకటి రెండు ఆమడలలో. వాడుకలో 'ఒకటీ అర తప్పు లుండవచ్చు. చూచీ చూడక సర్దుకోండి' అనుపట్లనూ అట్లే ఒకటి రెండు అనే అర్థంలో కూడా 'రెండోరు పేసి' అంటారు. అంటే ఒకటి రెండు మాట లనుట.

"రెండరామడఁ, బ్రొద్దు పొటుకక్క నం బొడువ." కాళ. మా. 4.55.

రెండవచెవికి తెలీకుండా

అతి రహస్యంగా.

"ఈ వ్యవహారం అంతా రెండో చెవికి తెలీకుండా జరిగి పోవాలి." వా.

రెండవ దేవేంద్రుడు

అపర దేవేంద్రుడు. దేవేంద్రు డంతటివా డనుట. ఇంద్రుడు వైభవాతిరేకమునకు ప్రసిద్ధుడు.

"రెండవకేవేంద్రునిబోలె నపూర్వ వైభవంబున నున్న యొక రాజును..." కళా. 5.2.

చూ. దేవేంద్రపదవి.

రెండాడు

అబద్ధ మాడు, వ్యతిరేక ముగా పలుకు.

"నా కైకో లిదె, రెం డాడఁగ నా, నాలుక మీ కుల ము వా రి నాలుక లటులే ?" సింహా. 5.198.

"రాముఁడును రెండాడు నాపనికి." వర. రా. అయో. పు. 328. పంక్తి. 2.

రెండుకన్నులు చాలవు

అత్యంతిదర్శనీయము, మనోహరము అనుటకు. నేటికీ వాడుకలో ఉంది– 'ఆ అలంకారాలు చూడ్డానికి రెండు కండ్లు చాలవమ్మా.'

"లోలమతి రెండు కన్నులు, చాలవు శివుఁ జూడ." కుమా. 8.54.

రూ. రెండు కళ్లు చాలవు.

రెండుకళ్లు చాలవు

అతి దర్శనీయ మనుట.

"లోలమతి రెండుకన్నులు, చాలవు శివుఁ జూడ." కుమా. ఆ. 8.

"ఆ పూలంగిసేవలో వెంకటేశ్వర స్వామిని చూడ్డానికి రెండుకండ్లు చాలవంటే నమ్మ." వా.

రెండుగా బాణెడు నీరు ప్రేయజాలు

అసాధ్యకార్యములను చేయు

గలవా రనుటలో నిరసన సూచిస్తూ అనేమాట.
నీటిని రెండుగా చీల్చడం అసాధ్యం కదా !
పండితా. ప్రథ. పురా. పుట. 359.

రెండుచేతులా
ధారాళముగా.
"వాడు రెండు చేతులా ఖర్చు పెట్టాడు." వా.

రెండు తాంబూలాలు
గౌరవప్రదంగా యిచ్చే తాంబూలద్వయం.
గౌరవసూచకంగా పురోహితుడికి రెండు తాంబూలాలివ్వడం అలవాటు.
"నాకు రెండు తాంబూలాలు రావాలి ఒకటే యిచ్చా వేమిటి ?" వా.

రెండు దలచు
అన్యథా తలచు.
"తలిదండ్రులకు రెండు దలఁచు సతఁడు, ......పోవుగతికి నవశ్యంబు పోదు ననుచు." జైమి. 1.86.

రెండునాల్కలు
ఒక మాటమీద నిలబడ డనుట.
"ఈ రెండు నాలుకల వ్యవహారం నాకు సరి పోదు. మాటంటే మాటే." వా.

రెండు నెఱిగిన
విచక్షణ కల, వివేకము కల.
"అకట ! నితాంతలోభమున నావలఁ బ్రాటిలుకీడు గానఁ జా, లక ధృత రాష్ట్రసూనులు కులక్షయ మయ్యెడు దాని కోర్చి పో, రికిఁ దగి వచ్చి రక్కట చ రెండు నెఱింగెడు నీవు నేను దీ, నికిఁ జొరనేల వీరి నిటు నిర్దయఁ జంపిన నేమి యయ్యెడున్." భార.

రెండు నొక టగు
ఏకీభావ మందు.
"రెండు నొకటి కానిరచన ప్రియము లేటికి." తాళ్ల. స. 3.55.

రెండు మూడు రోజులలో
త్వరలో.
"రెండు మూడు రోజులలో వస్తాను." వా.

రెండు రెం డొకో
రెండు రెండే.
అన్నీ రెండు రెండుగా ఉండు ననుట సందర్భం. జత జతగా.
"హరునకు రెండు రెండొకో గజాజినమున్ దహనాంబకంబు." కుమా. 8.26.

రెండు సందిళ్లు పట్టి
రెండు రెక్కలూ పట్టి. బలవంతంగా అనుట.
"అప్పు డొకబోటి నృపువి పాదాంతికమున, రెండు సందిళ్లు పట్టి కూర్చుండఁ జెప్పి." కళా. 7.149.

రెండొకటిగ గను
నిస్సందేహముగా. నిర్ద్వంద్వముగా. అగునా, కాదా అను అనుమానము లేక ఒకే అభిప్రాయం కలిగిన దని

సూచించుటద్వారా యేర్ప
డినపలుకుబడి. రెండు విభిన్న
తను సూచించు ననుటకు—

"రెండొకటిగఁ గంటిఁ గదా
దండించుట నీతి యాఁ గదా
యని..." శుక. 1.209.

"పతియెడ రెండు లేక కులభామలు
తా రతిఁ డెట్టిఁ దైన స్వస్మతిఁ జరి
యించు టొప్పు."
భాస్కర. అరణ్య.

## రెక్క ముక్కాడ నీయక

చేయి కదల్చ నీయక.

"ఇల రెక్క ముక్కాడ నీయకుండిన
మోము, దెల్లఁగాఁ జనెఁ బక్షివల్ల
భుండు." దశావ. నర. పు. 138.

## రెక్కల కష్టం

కాయకష్టం.

కొత్త. 150.

## రెక్కలు వచ్చు

స్వయంగా బ్రతక గల
వయసు వచ్చు.

"ఏదో యీ పిల్లలకు రెక్కలు వచ్చే
దాకా పోషించవలసినభారం మనది.
ఆ తరవాత వాళ్లసంగతి వాళ్లే చూచు
కుంటారు." వా.

## రెట్ట బట్టి యీతల బడ వైచు

లాగి పాఱవేయు.

"బలిమిఁ దదీయు లప్పుడు సభాముని
ముఖ్యుల రెట్టఁ బట్టి యీతలఁ బడ
వైచుచుఁ." ప్రభా. 82.

## రెట్ట వడగొట్టు

చావ గొట్టు.

"పెనుదవ్వు దగదాటఁ జని రెట్టవడఁ
గొట్టె, నుడువీధి బెళగువ్వ నొక్క
యణుజు." మను. 4.58.

## రెడ్డివారి దున్నపోతు

తాను చేయక ఒకరిని చేయ
నీక.

తాను అనుభవించక ఒక
రిని అనుభవించ నీక ఆటం
కంగా పరిణమించిన వారి
విషయంలో ఉపయోగిస్తారు.
ఆ రెడ్డివారి దున్నపోతు
ఎనుము లన్నిటికీ ఆధిపత్యం
వహించి తా ననుభవించక
ఎదుటిదానిని అనుభవించ
నీక అడ్డుగా ఉంటుం
దనుటపై వచ్చినపలుకుబడి.
రెడ్డోరి దున్నపోతు తా
నెక్కదు, ఒకరి నెక్కనీదు
అని సామెతగా రాయల
సీమలో అంటారు.

## రెడ్డొచ్చె మొద లాడు

కొంత జరిగిన తరవాత తిరిగి
చెప్పవలసి వచ్చినపుడు అనే
మాట.

పూర్వం గ్రామాల్లో బొమ్మ
లాట ఆడేవాళ్లు. ఒక్కొక్క
రెడ్డి నెమ్మదిగా వస్తూ
ఉంటే 'రెడ్డొచ్చాడు, మళ్ళీ
మొదలు పెట్టి' మనేవా ళ్లట.
అందుపై వచ్చినపలుకుబడి.

ఇదే రాయలసీమలో 'రెడ్డొచ్చె మొదలెత్తు' అనే రూపంలో కనబడుతుంది.

## రెడ్డొచ్చె మొద లెత్తు

చూ. రెడ్డొచ్చె మొద లాడు.

## రెప్పలు విచ్చి చూడకుండు

కన్నులు తెఱచి చూడకుండు.

కన్నెత్తి చూడకుండు అనుట.

"వైభవోన్నతుల్, రెప్పలు విచ్చి చూడక చలింపని యట్టి పరాకుచేతఁ దా, నెప్పటియట్ల యుండె." కళా. 4.109.

## రేక అగు

గీసుకొని పోయి రక్తము చిందు, గాయపడు.

"ముల్లు గీసుకొని చేతిమీద రేక ఆయింది." వా.

## రేక మోయు

గీసుకొని పోయి నెత్తురు చిట్లు.

"కన్నె నగుమోముతోడం, బున్నమ చందురుని సాటి పోలుప వచ్చున్, వెన్నుదుటితోడ మూర్కొని, మున్నందఱుఁ జూడ రేక మోవక యున్నన్." విజ. ఆ. 1.

## రేక మోవక గెల్చు

గాయపడక విజయ మందు.

"రేక మోవక గెల్చుట నీకె చెల్లు." విజయ. 1.40.

## రేక వాఱు

గాయపడు.

"రేక వాఱక యెచ్చరింపుచున్నాడు, కైకొక నా దివ్యకాండముల్ వీఁడు." వర. రా. యు. పు. 216. పంక్తి. 13.

## రేకు మడగ గొట్టు

పొగ రడగించు.

"ఒక గభస్తి నిరంకుశోద్వృత్తిఁ గదిసియు, న్మదకు మునిని రేకు మడఁగఁ గొట్టె." బహులా. 3.46.

చూ. రేకు మడచు.

## రేకు మడచు

పొగ రడగించు.

"......బుభుప్రభునందనుఁ డెంత? వాని తండ్రే దురమం దడర్చినను రేకు మడంతుము మాట లేటికిన్." విజ. 3.165.

## రేగుచెట్టు భాగవతము

తనకు తెలియకున్నా తెలిసి నట్లు నటించే సందర్భంలో ఉపయోగించేపలుకుబడి.

ఇది ఒక కథపై వచ్చిన పలుకుబడి.

ఒక గుడ్డివాడు భాగవతం చూడ్డానికి వెళ్లాడు. ఏద యినా హాస్యఘట్టం వచ్చి నప్పుడు తన్ను గిర మని పక్కవానికి చెప్పి వాడు గిరి నప్పు డల్లా నవ్వ సాగాడు. కడకు భాగవతం అయి పోయి పక్కవాడేమో లేచి పోయాడు. మధ్యలో వీడికి కాస్త కూర్కు పట్టి లేచాడు. పక్క నున్న రేణకంప గీసు

కున్నప్పు డల్లా పక్కవాడే గీరుతున్నా డనుకొని నవ్వడం మొదలు పెట్టాడు. తరువాత దారిని పొయ్యేవా రెవరో బయలు నాటకం ఎప్పుడో అయి పోయిం దని నవ్వే వరకూ వీడికి తెలియ లేదు.

"సంగీతం కచ్చేరిలో వీడు తల ఊపడం తప్పితే వీడికి తెలిసింది ఏమీ లేదు. ఇదంతా రేగుచెట్టు భాగవతం లే."

వా.

## రేగులు తంగేళ్లుగ ద్రొక్కికొనుచు

ముళ్ల డొంకలను కూడా లెక్క చేయక ప్రాణాలకు తెగించి.

రేగు చెట్లకు ముండ్లు విపరీతంగా వుంటాయి. అవి వంకరగా కూడా ఉండుటవల్ల తగులుకుంటే వదలదు. అలాంటి కంపను తంగెడు చెట్లను తొక్కినంత సునాయాసంగా దాటెనా రనుట. అనగా వారు ఏమిటెనీ లక్ష్య పెట్టక పోతున్నారు.

"గాడపతి సేనయుఁ దానుం దలగి పాతె రేఁగులు, దంగేళ్లుగఁ ద్రొక్కికొనుచుఁ దద్దయు భీతిన్."

కళా. 8 74.

## రే చీకటి

రాత్రిళ్లలో చూపు తక్కువగుట.

"నాకు కాస్త రేచీకటి ఉంది. పొద్దు మునక్క ముందే ఊరు చేరుకోవాలి."

వా.

## రేజీకటి రాఘవయ్య

రేజీకటి కలవాడు.

## రేతల

అపపాఠ మేమో!

సందర్భాన్ని బట్టీ, తలపైనా జొమ్ము పైనా డెందము తల - హృదయం వేపు అని అర్థం కావచ్చును.

"రేతల డెందము తల సం, ప్రీతిగ హిమ వారిధార వెట్టుచు." కుమా. 5.159.

## రే పగలు సేయ గల

అసంభవములను సంభవములు సేయ గల దని - నిరసనగా అనుటలో ఏర్పడిన మాట. రేయిని పగలు సేయ గల దంటే ఇక యెంత జాణో?

పండితా. ప్రథ. పురా. పుట. 359.

## రేపట మర్నాట

ఒకటి రెండు రోజులలో, త్వరలో

"ఏపున నోనర్చినాఁ డిఁక, రేపట మర్నాట నీకు ప్రేమ ఘటిల్లున్."

హంస. 5.193.

## రే పాడి

కాశీ. 2.83.

## రేయెండ

వెన్నెల.

(రేయి+ఎండ)

"బీరెండ రేయెండ పెండ్లి యాడ."
పాండు. 2.152.

## రేలు బవళ్లు

ఎల్లప్పుడు, అహోరాత్రములు.

"వారు రేలుఁ బవళ్లు దుర్వారఘోర, కోపమునఁ బల్కెడు దురాపశాపముల......" శుక. 3.524.

## రేవగటి వేళకు మానిసి

పౌరుషవంతుడు, నిర్భీకుడు. పగలు బీరాలు పలకడం కాక ఎప్పుడైనా భయరహితుడుగా ఉండువాడనుట.

"వీఁడును మున్ను రేవగటి వేళకు మానిసి యౌటఁ బొందిలో, వాఁడిమిఁ గొంతకాల మిల వ్రాలుట."
ఆము. 6.21

## రేవుగుఱ్ఱము

గాడిద.

చాకిరేవులో నుండు గుఱ్ఱము వంటిది కనుక రేవుగుఱ్ఱము.

"మైలల మోపు వీఁపున నమర్చిన రేవు గుఱ్ఱాని నెక్కి వయ్యాళిఁ బోవువాఁడు. శుక. 3.102.

## రొంపికంభము

అస్థిరము.
తాళ్ల. సం. 11.122.

## రొక్కా రొక్కములు

రొక్కములు, చిల్లర డబ్బులు. చిల్లరమాటలు. జం.

"కన్నులల్లార్చి రొక్కా రొక్కములు మాళ్ల, వరుసగా గడియించువారిఁ జూచి."
విప్ర. 4.16.

## రొక్కా రొక్కములు దిట్టు

నోటికి వచ్చినట్లు తిట్టు.

"గాలిం బోవక సన్న దప్పటయు రొక్కారొక్కముల్ దిట్టి శార్దూలక్రోడమృగాదులన్."
శా. మా. 3.58.

## రొచ్చు చేయు

కల్మషభూయిష్ఠము చేయు. తడితడిగా బురద బురదగా ఉన్నదానిని నేటికీ రొచ్చు అంటారు.

"ఈ టింకి మన వార లిందఱు వచ్చి రొచ్చు చేసిరి గాన రుచియించియుండ దిచ్చోట."
వర. రా. అయో. పు. 677. పంక్తి. 23.

## రొట్టె విఱిగి నేతిలో పడినట్లు

నష్ట మనుకొనగా లాభమే జరిగిన దనుట.

రొట్టె విఱిగి పోయిం దనుకొనగా అది నేతిలో పడినది.

చూ. పాయసముపై నె య్యొలికినట్లు.

## రొడ్డపెట్టుగ వ్రేయు

ఎడమ చేతి వాటముగా కొట్టు.

"తన వామకరము పై కత్తి రొడ్డ పెట్టుగ వ్రేయు."
వర రా. సుం. పు. 19. పంక్తి. 18.

నేటికీ రాయలసీమలో ఎడమ చేతిని 'రొడ్డచేయి, లొడ్డ చేయి' అని అంటారు.

**రొప్పికొని పోవు**

తోలుకొని పోవు.

రొప్పు రోజు ఉన్నది. తోలు నప్పుడు అదిలిస్తారు కదా! అట్లా ధ్వన్యనుకరణంగా వచ్చినపలుకుబడి.

"గోధనంబుల రొప్పికొని పోవ."

పండితా. ప్రథ. పురా. పుట. 493.

**రొప్పు**

గోకు, గొణుగు, పోరు, ఊరికే తప్పులు పట్టు.

"అబ్బ! వాళ్లత్త పొద్దస్తమానం రొప్పుతూ ఉంటుంది." వా.

"ఇంతగా రొప్పుతూ ఉంటే నే నిక్కడ ఉండ లేను." వా.

**రొమ్ముల కుంపట్లు**

బాధాకరులు.

రొమ్ముమీద కుంపటి వంటి వారు.

పండితా. ప్రథ. పురా. పుట. 343.

చూ. రొమ్ము కుంపటి..

**రొమ్ముగూటము**

ప్రక్కలో బల్లెము.

భయంకరుడు, పని పట్టగల వాడు—అని భావం. ఇలాంటి పలుకుబడులు మనకు చాలా ఉన్నవి.

"అద్వైతవాదుల రొమ్ముగూటము."

పండితా. ప్రథ. వాద. పుట. 511.

చూ. హృదయశల్యము.

**రొమ్ము త్రొక్కి నిల్చు**

జయించు.

"జక్కవ కవ రొమ్ము త్రొక్కి నిల్చిన..." విజయ. 2.106.

**రొమ్మురా ల్పడుగు**

దిగులు తొలగు.

"అందఱి రొమ్ము రా ల్పడిగ,"

రాధి. 3.62.

**రొము రొమ్ము బాదుకొను**

గట్టిగా ఏడ్చు.

"ఆవిడ రొమ్ము రొమ్ము బాదుకొంటూ యేడ్చింది. వా.

**రొమ్ము విరుచుకొను**

గర్వించు.

మాటా. 33.

"వాడు ఈ మధ్య మహా రొమ్ము విరుచుకొని తిరుగుతున్నాడు. ఏం చూసో అంత పొగరు?" వా.

**రొష్టు పెట్టు**

అల్లరి పెట్టు.

కొత్త. 374.

**రోకట చిగురులు గోయ నేర్చు**

అసంభవములనే సంభవింప జేయగల నెఱజాణ అను టలో నిరసన సూచిస్తూ అనేమాట.

పండితా. ప్రథ. పురా. పుట. 359.

రూ. రోకట జిగుళ్లు కోయు.

**రోకట జిగుళ్లు కోయు**

అసాధ్యమైనపనికి దొరకొను.

"మొకాలు ముడి వెట్ట రోఁకటఁ జిగుళులు, గోయఁ జత్రాతిప్పైఁ

గ్రుంక నిడుపు, లేక చిత్రము వ్రాయ..." కుమా. 8.135.

**రోకటి పాట**

దంచునప్పుడు పాడు పాట. ఒకే వరుసలో సాగుతూ ఉంటుంది గనుక అట్లా ఒకే అర్థం పర్థం లేని వల్లెవేత.

"రోకటిపాటట్ల వేదములు పను గొన..." బస. 7.183.

"ఏమిట్రా ? ఒకే రోకటి పాటలా ఉంది కవిత్వం ?" వా.

చూ. రోకలిపాట.

**రోకలి పాట**

అర్థవిచారం లేక ఊరకే పాడునది.

"అని పల్కఁ గల్లిదేవుఁడు, విని పల్కుచు విప్రులార! వినుఁ డాగమముల్, ఘనభక్తులిండ్లఁ గుక్కల, కను రోఁకలిపాటయట్లు కుంభిని కనుచున్." బసవపు. 7.45.

**రోకలి యెక్క వెట్టినట్లు**

అసాధ్య మయినపనికి పూను కొనినట్లు.

రోకలిని వంచి ఎక్క పెట్టుట సాధ్యము కాదు కదా !

"వల దనిన మాన నేరవు, కలి! రోకలి యెక్క వెట్టఁగాఁ దివిరెదు న, ట్లల నలుని వమ్ము పఱుపం, దలఁచెద నీ బుద్ధి నీకుఁ దగునె తలంపన్." నలచ. 4.260.

**రోగాల పుట్ట**

ఎప్పుడూ వ్యాధిగ్రస్తుడు.

చూ. రోసాల పుట్ట.

**రోజుచు**

ఆయాస పడుతూ.

'రొప్పు కుంటూ రోజు కుంటూ వెళ్ళాను' అని వాడుకలో జంట పదంగా విన వస్తోంది.

"దుర్భగోరగము రోఁజుచుఁ బొంగుచు మ్రోఁగుచు." బస. 6.161.

**రోమము రోమమున**

ప్రతిచోటా, నిలు వెల్లా.

"రోమము రోమముఁ దప్పకుండ నాఁటినక్రియ." కుమా. 5.168.

**రోమహర్షములు పాదుకొను**

పులకరించు.

"రోమహర్షముల్ బడిబడి మేనఁ బాదు కొన." పారి. 3.5.

**రోయిడు**

వేశ్యకు సంభోగపు సుంకముగా డబ్బిచ్చు.

"లతాంగులఁ జూచి మెచ్చుచు రోయిడువారు." కుమా. 8.133.

"వీరభద్రుని యాత్ర వేడుకలు వోవ, హారముల్ రోయిడి యరిగె మా బిడ్డ." పండితా. ప్రథ. పురా. 360.

"పదకంబు రోయిడి పడఁతి దివ్వెలకు, మదనారికిని దీపమాలిక లెత్తె." (అదే—పుట. 361.)

రోవెల
వేశ్య కిచ్చుకట్నము.
"రోవెలయుం బంపిన." సింహా. 4.237.

రోస మెత్తు
కోపము వహించు.
"ఓసి ! గయాళికాన ! నను నుగ్గు నెఱుంగవె రోస మెత్తినం, దోస మెఱుంగ..." శుక. 2.373.

రోసాల పుట్ట
ఒక తిట్టు.
రోషముల కునికిపట్టు.
పుట్టలో చీమలో పాములో అనేకం ఉంటాయి. కనుక వచ్చినపలుకుబడి.
"చలము సాధించు దిట్ట రోసాల పుట్ట." శుక. 3.15.
నిరసనలోనే ఈ 'పుట్ట' ఉపయుక్త మవుతుంది.
చూ. రోగాల పుట్ట, అబద్ధాలపుట్ట.

రోళ్ల రోకళ్ల బాడు
పదిమంది నోట బడు.
"ముల్లోకంబుల జనములు, రోళ్లన్ రోకళ్లఁ బాడ రోయక మఱియున్, వెల్లివిరి గాఁగఁ దిరిగిన, గళ్లకు నయగారి మెలఁతుకం గొనిపోయెన్." వరాహ. 722.
రూ. రోళ్లా రోకళ్లం బాడు.

రోళ్ల వెంటనే పొళ్లు
అవినాభావ సంబంధము తెలుపుపట్ల ఉపయోగించు పలుకుబడి.



ప్రాలు–ధాన్యము.
అదే వాడుకలో పాళ్లయి ఉంటుంది.
సంపంగిమన్న. 100.

అంకాడు
వ్యభిచరించు.
"వేయేల ప్రేవాడ వెన్న ముచ్చిలుచుఁ, బోయి అంకాడఁదే పొలతుల కాడ." బస. 6.176. పు.
"అంకాడ నేర్చినమ్మ బొంకాడ నేర్వదా ?" సా.

అంకె లిడు
"పూని మదించి అంకె లిడుపోటరి గిబ్బల తేని నెక్కి యీ, కానుఁడు వచ్చె." పారి. 4.85.
చూ. అంకె వేయు.

అంకె వేయు (ఎద్దు)
ఎద్దు అంకె వేయు.

ఊాతి కిడునట్టి గిలిగింతలు
వ్యర్థములు.
ఊాతి బొమ్మకు చక్కిలిగింత పెట్టితే ప్రయోజనం ఉండదు కదా!
"ఆసఁ బొందఁ, డిహ ము నం దుచ్ఛ సౌఖ్యాప్తి కింత యైన, ఊాతి కిడునట్టి గిలిగింత లై తనర్చుఁ, గాని." హంస. 3.203.

ఊాతిత్తి వట్టు
తిత్తితో ఊదు.
కొలిమిని తిత్తితో ఊది మంట లెగయునట్లు చేస్తారు.

తద్వారా వచ్చినది. ఱాతి తిత్తి మరింత గట్టిది.

"కఱకంఠు చిచ్చుఱ కంటి మంటలును, పఱ పగుఱాతితిత్తి వట్టినయట్లు." పండితా. ద్వితీ. పర్వ. పుట. 524.

**ఱాతిప్రతిమకు చక్కిలిగింత**

వ్యర్థము. ఱాతిబొమ్మకు ఎన్ని సార్లు చక్కిలిగింతలు పెట్టినా అది నవ్వ లేదు కదా!

"...నెన్ని మార్లు చూడు మన్నఁ జూతుఁ బడఁతి కలదె ఱాతిపతిమకుఁ జక్కిలి,గింత నాదు ధృతికి గొంటు లేదు." కళా. 3.50.

చూ. ఱాతి కిడునట్టి గిలిగింతలు.

**ఱాయి గ్రుద్ది చెప్పు**

బల్ల గుద్ది చెప్పు.

"దీనికి దానికి సుద్దియ లే దని మేము ఱాయి గ్రుద్ది చెప్పఁ గలము" ధర్మజ. పు. 104. పం. 10.

**ఱా యైన కొంత మేలు**

మిక్కిలి కఠిను డనుట.

"ఱా యైనఁ గొంత మేల్ నా,రాయణ మీ మనసుకంటె..." కళా. 4.120.

**ఱాల రువ్వు**

రాళ్లతో కొట్టు.

"డిండిమంబుల కుబ్బ గండాల్పదాన మే,ఱులుగఁ దద్వహు ఱాల ఱువ్వి ఱువ్వి." ఆము. 2.24.

**ఱాలు ఓంటూ మలిగం డ్లేరు**

కంబళిలో వెంట్రుక లేరు వంటిది.

తాళ్ల. 10.135.

**ఱిం గని మ్రోయు**

మ్రోగుటలో అగు ధ్వన్యను కరణము.

"వె,సం గో యని యార్వఁ బత్రు సంహాతి గాడ్పుల్, ఱిం గని మ్రోయ." మను. 4.59.

**ఱింగులు వాఱగా**

కుచ్చెళ్లు వచ్చునట్లుగా.

"నునుఁబట్టుజేలఁ గటి ఱింగులు వాఱఁగఁ గట్టి." హర. 3.69.

**ఱిచ్చపడు**

ఆశ్చర్యపడు.

"ఱిచ్చపడి యంతలో ధృతి, దెచ్చుక." నిరంకు. 2.122.

**(ఏగతిఁ బోదు) ఱిత్తచేతుల తోడన్**

వట్టి చేతులతో పోవు. ఏమీ ఉపదగా తీసుకొన లేక పోయినప్పుడూ, పని ముగించుకొనక పోవలసి వచ్చినప్పుడూ ఈ పలుకు బడిని ఉపయోగిస్తారు. వాడుకలో — 'పిల్లలున్న యింటికి వట్టి చేతులతో ఎలా పోను?' 'ఇంట్లో ఎంతో ఆశ పెట్టి వచ్చాను. వట్టి చేతులతో ఎలా తిరిగి పొయ్యేది?'

"పెనువాన యింతట న్వాలి,సిన నేగతిఁ బోదు ఱిత్తచేతులతోడన్."

శుక. 3.251.

**ఱెక్క ముక్కాడ నీయక**

"చలపట్టినా వైరిజనపాలకుల ఱెక్క, ముక్కాడ నీయక యుక్కడంచు." కవల. 1.59.

చూ. రెక్క ముక్కాడ నీయక.

**ఱెప్పల జిప్పిలు**

కంటి రెప్పలనిండా నీరు ఉబుకు.

"కన్నీరు దొ, డ్డోడన్ ఱెప్పలఁ జిప్పిలంగఁ బునరుక్తుల్ గాఁగఁ బ్రార్థించుచున్." శా. మా. 1.133.

**ఱెక్కలు గట్టుకొని వచ్చి**

అతివేగముగా.

ఏమాత్రం ఆలస్యం లేకుండ అనుట.

"ఒక్క మాట యెవరిచేతనైనా కబురు పంపించావంటే ఱెక్కలు గట్టుకొని వచ్చి నీముందు వాలుతాను." వా.

**ఱెక్కలు దువ్వుట**

పక్షుల విషయంలో ఆదరమును కనిపించుతీరు.

"ఱెక్కలు దువ్వి నీమొద నెఱింగి మెఱుంగుకడాని గిన్నెలోఁ, జక్కఁగ మేపి." రాజగో. 4.16.

దీనిమీదనే వచ్చిన పలుకుబడులు.

'వానిని దువ్వి ఎలాగో పని గడుపుకొన్నాడు.' 'ప్రతి రోజూ వాడింటికి వెళ్ళి దువ్వుతున్నాడు. మఱి—ఎందుకో ఎక్కపెట్టి ఉంటాడు.'

**ఱెక్కలు గలపామువలె**

అతివేగముతో.

పామే చెలాకీ గలది. ఇక ఱెక్కలు గల దన్నప్పుడు అతివేగవంత మనుట కదా!

"......అట్లు సేసినం గినిసి గురుండు ఱెక్కలు గలపెనుఁబాముకైవడి సాత్యకిపైఁ గవియుటయు." భార. ద్రో. 3.128.

**ఱేకు మడచు**

"తా,మరవిరి మొగ్గగుత్తిఁ బలుమాఱును ఱేకు మడంచు నెంతయున్."

"కోకనదదృగీలలామ కోటికాసమీరమా, ఱేకు మడఁచ నిమ్ము కలువఱేని బాస మీర మా." పాంచా. ఆ 3.

చూ. రేకు మడచు.

**ఱొమ్మప్పళించు**

ఱొమ్ము తాటించు.

"తిగిచిన నడుగులు దెమలక ఱొమ్మప్పళించి యవ్వలికిఁ జండించి దాఁటి." ఆము. 6.22.

**ఱొమ్ముకుంపటి**

తీవ్ర బాధాకరము.

"కలకల లాడుతూ ఉండ వలసిన కూతురు మూల కూర్చుంది. ఈ ఱొమ్ము కుంపటిని నే నెన్నాళ్లు భరించను." వా.

**ఱొమ్మున జేయిడి నిద్రపోవు**

నిర్భీతిగా, నిశ్చింతగా నిద్రించు.

"ఊఱడినట్లు ఱొమ్మునం జేయిడి నిద్ర వోయిరి." కుమా. 11.53.

"వినుతధనుర్విద్యావిదు, ఘనుఁ గర్ణసహాయుఁ బడసి కౌరవవిభుఁ డర్జునువలని భయము సెడి ఱొ, మ్మునఁ జేయిడి నిద్ర వోయె ముదితాత్ముండై." భార. అర. 6.62.

చూ. ఆద మఱచి నిద్రించు.

**ఱొమ్ముపడిశం**
ఱొమ్ములో శ్లేష్మము చేరి వచ్చువ్యాధి.

**ఱొమ్ము మెట్టు**
రొమ్ముపై కూర్చొను.
రాధి. 3.63.

**ఱొమ్మురాళ్ళు దిగు**
భారము తీరి పోవు, దిగులు తొలగి పోవు.
"అందఱి ఱొమ్మురాళ్లు డిగ నందఱి నెమ్మది నెమ్మ దయ్యె."
తె. జా.

**ఱోకట చివుళులు గోయ గల**
అసాధ్యకార్యము లొనర్చ గల.
ఏ మైనా చేయ గలజాణ అనుటకు...
కుమా. 8.135.

**లంకిణీ తనూజాత**
"శూర్పణఖ మేనగోడలా చూడ లంకి,ణీతనూజయొ యనఁగ వన్నెయకు నెక్కె." శుక. 2.19.
చూ. శూర్పణఖ మేనగోడలు.

**లంకె నుండు**
లగ్నమై యుండు.
"ఓడఁ గట్టినమూలం బై లంకె నుండఁ జేసితి." శా. మా. 3.80.

**లంకెమానిసి**
బానిస, బందీ.
"...తమి నమ్మదవతి మన్మథుని లంకె మానిసి యయ్యెఁ." శుక. 2.433.

**లంకె వాటని**
సంబంధము కల దని.
"తన పాదములకును దమ తలలకు లంకె, వా టని దుర్గాధిపతులు పలుక."
సారం. 1.4.

**లంఖిణి**
గయ్యాళి.
"ఆవిడ లంఖిణిలా పైన బడుతుంది. ఆవిడజోలికి ఎవరు పోతారు?" వా.

**లంచపంచములు**
లంచములు. జం.
"దొర కాపు లై కార్యసరణిఁ దెల్పెడి కవీ, శ్వరులకు లంచ పంచంబు లొసఁగి." కువల. 4.61.

**లంచ మిచ్చు**
"నిశితనఖరాంకకలనలు నేఁడు లంచ, మిత్తు నతనికి దేవి నై యేను మీఁకు." రాధా. 4.213.

**లంచములు మేయు**
లంచాలు తిను.
రామచం. 43.
రూ. లంచాలు తిను.

**లంజికావాటికలు**
బోగమిండ్లు, వేశ్యావాటికలు.
కుమా. 8.171.

**లంపట పడు**
శ్రమపడు, హైరాన పడు.
"మును పాకనికి నుండఁగఁ జా, లని యబ్బో నిరువు రొదిఁగి లంపటపడు చే,మని చెప్ప నైన నాయనఁ, గని చో టిచ్చిరి కృపాధికత నమ్ము నులున్." పర. ఆ. 1.

లంపులమారి

ఒక తిట్టు.

దొంగదారి ద్రొక్కి రంపులు దెచ్చునది.

"లంపుల మారిదాన! నిను లాచుక మాదిగవాఁడు కోయ."

హంస. 5.66.

లక్కఁగేదె బేరములు

పనికి రాని వ్యాపారము.

"ఎందుల కీ లక్కఁగేదె బేరములు."

చింతా. 3.32. పు.

లక్ష చెప్పు

పెక్కు దృష్టాంతములు చూపు.

"నువ్వు లక్ష చెప్పు. వాడు వినిపించు కొంటేనా ?"

వా.

లక్ష చేయు

పెక్కులు చేయు.

"బాసలు బండికండ్లు మతి ప్రాణ భయంబున లక్ష సేసినన్. ఆము.6.51.

లక్షణంగా

చక్కఁగా, సులభంగా, తప్ప కుండా.

'ఆపిల్ల కేం? లక్షణంగా ఉంటుంది.' వాడు లక్షణంగా ఒప్పుకుంటాడు. 'ఒప్పుకోక ఏం చేస్తాడు.' వ్యంగ్యంలో కూడా దీన్ని ఉపయోగిస్తారు.

"బలే లక్షణంగా ఉంది నీమాట"

వా.

లక్షణ మైన

మంచి.

సలక్షణ మైన అనుట.

"అది లక్షణ మయినసంబంధం. నేను చెప్పినమాట విని వెంటనే ఒప్పుకో."

వా.

"అంత లక్షణ మయినపిల్ల ఈ జిల్లాలో ఇంకో చోట దొరకదు."

వా.

లక్షలకు నమ్మ జాలు

అమూల్య మయిన.

విజయ. 1.69.

లక్ష సేయు

అమూల్య మగు.

"అందలం బెక్కె నేరాజు లక్ష సేయ."

విజయ. 1.23.

లక్షాంతరాలు

లక్షలాదిగా.

కాశీయా. 184.

లక్షావధి ప్రజలు

లక్షలాది ప్రజలు.

కాశీయా. 157.

లక్షోపలక్షలు

విపరీతముగా.

"తండోపతండంబులు లక్షోపలక్షలు శాఖోపశాఖలు—"

హంస. 3.29.

లక్ష్మీకటాక్షము కల

సంపద కల.

మదన. 82.

లక్ష్మీదేవి పలుక

లక్ష్మీప్రసాదం.

"......బొజ్జయ్య సెట్టియే యీ సభ నంతయు లక్ష్మీదేవి పలుక - ఆతనికిఁ దామర హెచ్చినకొలఁది మా సిరి తగ్గి పోయెను." సాక్షి. 429

**లక్ష్మీపుత్రుడు**

సంపన్నుడు.

"వాడి కేమి! లక్ష్మీపుత్రుడు. కాలి మీద కాలు వేసుకొన్నా జరిగి పోతుంది." వా.

**లక్ష్య పెట్టు**

లెక్క పెట్టు.

"మమ్ము లక్ష్య పెట్టదో." నిరంకు. 4.108.

**లగా లగీ అను**

దేని కైనా సిద్ధపడు.

కొత్త. 316.

**లగ్గ పట్టు**

ముట్టడించు.

"లగ్గపట్టు తివిచె." విజయ. 1.58.

**లగ్నం పెట్టు**

ముహూర్తము పెట్టు.

చూ. ముహూర్తము పెట్టు.

**లజ్జకండ**

పిఱికితనము.

"లజ్జకండ, యొడలఁ గల దేనిఁ బలు మాట లుడిగి నడపు." ఉత్త. హరి. 3.98.

చూ. పిఱికికండ

**లజ్జ గొను**

మానము తీయు.

"లాతాలఁ గొని మోఁదిలజ్జ గొంద్రు." హర. 5.10.

**లజ్జబండతనము**

సిగ్గు మాలినతనము.

సిగ్గు లేకుండా బండబారి పోయి అనుట.

"మగిడి మాడక, పట్టణమున కేఁగ లజ్జ బండతనమునన్." ఉ. హరి. 1.36.

**లజ్జ వోవు**

సిగ్గుపడు.

"మదీయగాండీవము లజ్జ, వోయెఁ గొని పోయె భూసురపుత్త్రి జనుఁడు." ఉ. హరి. 2.28.

**లట్టాభట్టీయములు**

కోతలు.

"నీ లట్టాభట్టీయము లేల నేకరవు పెట్టెదవు." ధర్మజ. 62.19.

**లయనుదారి**

బాట.

కాశీయా. 325.

**లలాటశూన్యము చూపు**

ఏ మతమునకూ చెందక పోవు.

"కొంద ఱేమియుఁ లేను కొట్ట గొన లలాటశూన్యము చూపిరి." తాళ్ల. సం. 7.36.

**లవలవ కదలు**

ధ్వన్యనుకరణము.

"లవలవఁ జన్నదోయి కదలన్." క్రీడా. పు. 69.

**లాకు జారి**

పన్ను లేనిది.

కాశీయా. 229.

లాగము గొను
మొగ్గ వేయు.
"పడుబంతి కయివడి, నెగసి లాగము గొని యేపు మిగిలి."
భాస్క. యుద్ధ. 1507.

లాడి గావించు
అప్పగించు, అచ్చు వేసి వదలు.
"దీని వత్సయుతముగ నిచ్చెనీవాట మునకు, లాడి గావింతు నంతఁ దొలంగు దూలు." పాండు. 5.243.

లాతపు గోల
సన్యాసులు చేత బట్టు దండము.
"చికిలి లాతపుఁగోలఁ జేతఁ బట్టి"
సారం 3.180.

లాభం లేదు
ఈ విషయంలో యింకేమి చేసీ ప్రయోజనం లేదు.
"వీణ్ణి యింక చదివించి లాభం లేదు" వా.
"అందేం లాభం లేదు." వా.

లా వెక్కించు
ప్రోత్సహించు, పురి యెక్కించు.
"మేడలు పడ ద్వారియుండు డా యుండు లెం, డే చూ జెవ్వఁడు గొన్న నిత్తు నని లా వెక్కించె సంరంభి యై."
ఉ. హరి. 3.32.

లాహిరి పట్టు
మైకము క్రమ్ము.
కాశీ. 2.138.

లింగకట్టు మాత్ర
కుప్పెకట్టు.
కాశీయా. 122.

లింగభోగము
లింగపూజ.
పండితా. ప్రథ. దీక్షా. పుట. 200.

లింగార్చనము చెల్లించు
లింగపూజ చేయు, భుజించు.
"లింగార్చనంబుఁ జెల్లింప ననిచి."
హర. 5.41.

లింగావసరము
లింగపూజ—తద్వారా తద నంతరక్రియ యైనభోజనము.
"ఇరువుర లింగావసరము సేయించి, సరసోచితక్రియాసంతుష్టిఁ జేసి .."
బస. 5.132.
"అమ్మమ్మ మా లింగ మా కొన్న వాఁడు, క్రమ్మన వడ్డింప రమ్మ లె మ్మనుచు, సరసర లింగావసరము చెల్లించి."
బసవ. 5.133.

లింగావసరము చెల్లించు
లింగపూజ చేయు.
"ఆ కర్మ,సంహారు లింగావసరము చెల్లించి."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 119.

లింగు లిటుకులు
హెచ్చులు.
"సింగరాయ యితని సితుపబొతుకు లన్ని, గొట్టుఁ బోయి కొంగు గోసి వచ్చి, తటుకు నితని లింగులిటుకులు చూతమా, తెలియ సంగు లెల్లఁ దేత మిపుడు."
వేంకటే. 3.162.

లివ చూపు

లంఘునలాఘువము ప్రదర్శించు.

లగువు బిగువు కలవాడు లివ కలవాడు.

వాడుకలో—'వాడు మాంచి లివ ఉన్న మనిషి. ఎనిమిదడుగుల ఎత్తున్న ముళ్ల కంచెను అలాగ్గా దాటాడు.'

"కడుఘాక మీాటంగ మడమలు తాటించు,చును ముందటికి లివ చూపి చూపి." కళ. 3.86.

లివలివ కదలు

ధ్వన్యనుకరణము.

"కదురుప ట్టెడలి లివలివం గదలురదన పంక్తులును."

కవిక. 5.110.

లూటి పుచ్చు

కొల్ల యిచ్చు.

నృకేసరి. శత. 29.

లూటి సేయు

దోపిడి చేయు.

నేటికీ యీ మాట రాయలసీమలో విన వస్తుంది.

"రమణఁ గంసాది సురలు లూటి సేయఁ గాఁగా."

తాళ్ల. సం. 6.160.

లూలామాలపు మాటలు

టాలాటోలీ మాటలు, మాయమాటలు.

"లూలామాలపుమాటలు, చాలు ననిన నలిగి తననిజం బగురూపం, బీలోనఁ దెలుప వలె నని, నీలగ్రీవుండు నిటలనేత్రముఁ జూపెన్."

కా. మా. 3.170.

(తెలుఁగుజాతీయములు)

లెక్కకు మిక్కిలి

అసంఖ్యాకము.

"లెక్కకు మిక్కిలి సేన పొడుగా."

భార. ద్రోణ. 3.210.

లెక్కకు మిగిలిన

అసంఖ్యాక మయిన.

లెక్కించుటకు సాధ్యము కాని అన్న రీతిగా వచ్చే పలుకుబడులు మనకు చాలా ఉన్నవి.

"లెక్కకున్, మిగిలిన సేన నొక్కఁడహమించి వధించుట." వా.

రూ. లెక్కకు మిక్కిలి.

లెక్క సేయక

గణింపక, కాతరు చెయ్యక.

అ దెప్పుడూ వ్యతిరేకార్థంలో విన వస్తుంది. లెక్క సేయడు అని తప్పితే లెక్క చేస్తాడు అన్నట్టు విన రాదు.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 123.

లెస్సలా

క్షేమమా?

"నీ బాహాభృతక్షితిఁ బ్రజలకు లెస్సలా?" మను. 5.4.

లేక లేక

చాలా కాలానికి.

"వాళ్లకు లేక లేక యీమధ్యే ఒక కొడుకు పుట్టాడు." వా.

## లేక లేక కలిగిన

చాలా రోజుల దాకా సంతానం లేక ఉండి పుట్టిన.

"ఆయనకు పదేండ్ల దాకా పిల్లలేరు. లేక లేక కలిగినకొడుకు గనక వీడంటే ఆయనకు ప్రాణం."

రూ. లేక లేక పుట్టిన.

## లేక లేక పుట్టిన

చాలా రోజుల దాకా సంతానం లేక ఉండి పుట్టిన.

"ఈ అమ్మాయి లేక లేక పుట్టినపిల్ల కనక మంచివరుడికోసం దేశ మంతా గాలిస్తున్నాడు వాళ్ల నాన్న." వా.

రూ. లేక లేక కలిగిన.

## లేకి పరకలు

కోత లయినతర్వాత చేలో రాలి పడినగింజలు.

రామలిం. 60.

## లేఖలు నడుపు

అక్కడి జాబు లిక్కడికి, ఇక్కడి జాబు లక్కడికి పంపించు.

"నా వెంట రమ్మ ఱెక్కలలో దాచుకొని యెక్క డెక్కడి లేఖ లెక్కడికి నడుపుచున్న దానవు."

ప్రభా. 3.142.

## లేచి పోవు

పరపురుషుని తగులు కొని మరొక ఊరికి పాఱిపోవు.

"వాళ్లమ్మాయి వాళ్ల నౌకరుతో లేచి పోయిం దట గా!" వా.

## లేచి వచ్చు

పరపురుషునితో తగులు కొని వానితో మరొక ఊరికి పాఱిపోవు.

"ఆవిడ వాడితో లేచి వచ్చిం దటగా! కట్టుకొన్న భర్తకంటే మహా ఘనంగా కనబడుతుంది గానీ!" వా.

చూ. లేచి పోవు.

## లేటమొగము వడు

దైన్యపడు.

"కర్ణకృపముఖ్యు లేటికిఁ గలఁగి లేట, మొగము వడి రేల."

భార. ద్రోణ. 5.326.

## లేడికాళ్లు

మంచి వేగవంత మయినవి.

"వాడివి లేడికాళ్లు. ఒక్క నిమిషంలో అక్కడికి పోయి వస్తాడు." వా.

## లేత యగు

సున్నిత మగు.

"లీలఁ బన్నిటికిని లేఁతా చలి చెమట." తాళ్ల. సం. 4.7.

## లేత సొరకాయలు నఱకు

కోతలు కోయు.

"మీరు లేత సొరకాయలు నఱకువారు గావున మగతన మనునది మీయూరఁ జేరఁ బిలువఁ గాన రాదు."

ధర్మజ. 65.13.

## లేదు కుంచమును తూము

బొత్తిగా లేదు.

ఏ కొంచెము కూడా లేదనుట.

"లేదు కంచమును దూము."
రుక్మాం. 2.30.

## లేదు పొమ్మను

తిరస్కరించు.

"పురుషుల ధైర్యంబు లేదు పొమ్మని పింపన్." నిరంకు. 2.29.

## లేదు బంతి

సమానము లేదు.

ఒరవడి దిద్దుకొనుటలో చక్కని అక్షరాలతో పైన ఉపాధ్యాయుడు వ్రాసి యిచ్చుపంక్తిని మేలుబంతి అనీ, ఒజ్జబంతి అనీ అంటారు. అటువంటిది ఒకటి లేనట్లుగా—అంటే నీవే ఆదర్శప్రాయముగా—అని భావం.

"ఒకానొక మాట పుట్టినన్, నెచ్చెలి లేదు బంతి యనునేర్పున దిద్దుకొనంగఁ జాలినన్." శుక. 2.97.

## లేని పోని

కాని పోని.

'ఆ వూళ్లో పాపం! ఆమెమీద లేనిపోనినిందలు మోపినారు." వా.

## లేనిపోని వాదులు

గిల్లికజ్జాలు.

"నెలవునఁ జండరశ్మిని గనిష్ఠకుటుంబిని లేని పోనివాదుల జగడించుచు వ్రేడలఁ దోలిన..."
హంస. 3.173.

## లేనివాడు

పేదవాడు, దరిద్రుడు.
కాశి. 3.47.

"న్యాయం అన్నతరువాత ఉన్నవాడికీ, లేనివాడికీ సమానంగానే వర్తించాలి."
వా.

## లేపుకొని పోవు

రాయలసీమలో ఈ రూపం లోనే కనబడుతుంది.

చూ. లేవ దీసుకొని పోవు.

## లేవడ లేచు

భ్రష్టు పట్టు, చెడి పోవు.
నేటికీ రాయలసీమలో ఈ అర్థంలో ఉంది. వీకి దీర్ఘం అలవాటులో వచ్చింది కావచ్చు. 'వాడు లేవిడీ లేచి పోయినాడు.' 'వాణ్ణి అందఱూ లేవిడీ పట్టించినారు.'

"త్రిదశులు విల్చి పంపు డొకతేజముగాఁ గొని దేవదేవు నెల్లిదముగఁ జేసి యింతగొని లేవడ లేచెదు."
కుమా. 4.65.

## లేవ దీసుకొని పోవు

పరస్త్రీని కామసంబంధంతో మరొక చోటికి తెలియకుండా తీసుకొని పోయి కాపురము పెట్టు.

"వాడు ఆవిడను లేవ దీసుకొని పోయాడట గా. ఊరంతా అదే గొడవ."

చూ. లేపుకొని పోవు.

## లొటలొట

శూన్యము, వట్టిది.
ధ్వన్యనుకరణము.

"తోట తోట పుర్వులు దొరఁగఁగ, లొటలొట మనుకొంచు నిండ్లలోనికిఁ జన..." భల్లా. ఆ. 2.

## లొటలొటకాడు

వాగుడుకాయ.

"కటిలుఁ డుపకారి జూదరి, లొట లొటకాఁ డాగడీఁడు.
ప్రబంధరా. 644.

## లొటిపిట శూల రోకండ్ల గాని చక్క గాదు

ఇది సామాన్యంగా తీరేది కా దనుట.

శూల-కడుపునొప్పి.

"మంచిమాటల నరుగఁ డీమాల్యుఁ బోతు, కఠినతరవాక్యముల చేతిఁ గాని చక్క, గాదు లొటిపిట శూల రోకండ్లఁ గాని."
నిరంకు. 2.133.

## లొట్టలు వేయు

గుటకలు మింగు.

"వాడు వట్టి శుంఠ. ఇరుగు పొరుగు అమ్మాయిలను చూచి లొట్టలు వేస్తూ ఉంటాడు." వా.

## లొట్టాబట్టీయములు

"లోకువపందలయొద్ద లొట్టాబట్టీయ మనుకొంటి వేమి?"
సాక్షి. పు. 88.
చూ. లట్టాబట్టీయములు.

## లొడలొడ వాగు

అర్థరహితముగా మాట లాడు.

"ఎందుకు రా? అట్లా లొడలొడ వాగుతావు?" వా.

## లోకంలో లేని

అరుదైన, విడ్డూరమైన.

దీనిని నిరసనగా ఎత్తి పొడుస్తూ అనునప్పుడే ఉప యోగిస్తారు.

"లోకంబులో లేని లొటతాటకత్తె."
గౌర. హరి. ద్వి. 1901.

"అ దెక్క డమ్మా? లోకంలో లేని మనిషి, దానితో ఏ మన్నా కష్టమే?
వా.

"ఇ దెక్క డమ్మా; లోకంలో లేని ప్రేమ." వా.

## లోకపు పూతలు మేత లగు

లోకములోని రహస్యవర్తన ములను దాచి పెట్టు లే బ్రదుకు తెరువు అగు.

"పల్లవాళిగతి లోకపు పూఁతలు మేత లీయ నే, కడమయు లేక..."
శుక. 2.24.

ఈ పూతయే వాడుకలో పూసికొని వచ్చుట.

ఎవని నైనా నిందించినప్పుడు మరొకరు వానిని సమ ర్థించగా అంటారు 'నీ వేం మహా పూసుక వస్తున్నావే?'

## లోకముతోడి పాటిగా తలచు

మామూలుగా, లోకరీతిగా భావించు.

"అలవి యెఱుంగ నేరక మహాత్ముని లోకముతోడి పాటిగాఁ దలఁచితి."
భార. భీష్మ. 2.6.

## లోకాభిరామం శ్రీరామం

లోకాభిరామాయణం.

"ఆఁ. పెద్ద విశేషా లేమీ లేవు. ఏదో లోకాభిరామం శ్రీరామం మాట్లాడుతూ కూర్చున్నాము." వా.

## లోకాభిరామవార్తలు

లోకాభిరామాయణము.

"కేలుదమ్మి కిఁ గపుర బాగాలుఁ బండు,టాకుమడుపులు నొసఁగి లోకాభిరామ, వార్త లాకర్ణించి నొడివి యప్పార్థివేంద్రుఁ, బలు తెఱంగుల నల రించి పలికె నపుడు."

శుక. 1.5.

## లోకాభిరామాయణం

అవీ యివీ – ప్రత్యేకించి ఒక విషయం కా దనుట.

"భోజనా లయాక కాస్సేపు లోకాభిరామాయణం మాట్లాడుతూ కూర్చున్నాము." వా.

## లోకుల యిండ్లు

ఇతరుల ఇండ్లు.

లోకు లనగా జనం, ఇతరులు. 'లోకులు కాకులు' అని సామెత. 'లోకుల కతను చాలా బాకీపడినాడు' అని రాయలసీమలో వాడుక.

"కొలచిరి గాక లోకుల యిండ్లు బంట్లై."

పండితా. ద్వితీ. మహి. పుట. 187.

## లోగన్ను

అంతర్దృష్టి.

"ముక్కంటి లోఁగంటం గనుంగొనుచు." కాశీ. 2.44.

## లోగిట జేర్చు

అందుబాటులోనికి వచ్చు నట్లు చేయు.

"నీ లోఁగిటఁ జేర్పనే యుభయలోక సుఖంబులు నన్నుఁ బొందినన్."

ఉ. హరి. 1.64.

## లోగొను

వశము చేసుకొను.

"బాడబనూర్తి లోఁగొన్న పగిది నుండు." పాండు. 3.102.

## లోచనోత్సవము

కన్నుల పండువు.

"లోచనోత్సవముగా లోలత నిలిచె."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 592.

## లోతు పాతు

గుట్టు. జం.

"తనలోఁతుపాఁతు సైతము గాన రాఁ గూర్మి, గలసిన మొగమోటకాని వదలి." రామా. 1.32.

## లోన లొటారము

అంతస్సారము లేనిది – లేని వాడు.

'పైన పటారం లోన లొటారం' అని కలిపి కూడా ఈ పలుకుబడి వ్యవహారంలో ఉన్నది. లోపల శక్తి లేక పోయినా పైకి గొప్పగా కని పించే పట్టుల ప్రయుక్త మవుతుంది.

"...తద్భుజపటిష్ఠత లోన లొటార మింతె నీ, వతనికిఁ గొంకనే లని..."

శుక. 3.161.

"లోన లొటలొట పైన పటపట."
సా.

ఇక్కడ 'లొటలొట' శూన్యమైన వాని ధ్వన్యనుకరణ శబ్దంగా ఏర్పడింది. 'పటపట' దీనికి వ్యతిరేకంగా గట్టిది అన్న అర్థంలో ఏర్పడ్డది.

## లోను సేయు

వశవర్తిని చేయు.

"భవదుదారమహోజ్జకు లోను సేసి."
భార. శాం. 1.215.

## ....లోనే పుట్టి పెరుగు

ఆ విషయంలో అతనికి సంపూర్ణంగా జ్ఞానం కలదు అనుపట్ల ఉపయోగిస్తారు.

"వేద వేదాంగాదివిద్యలలోనన, పుట్టి పెరిఁగినట్టి గట్టి యోగ్యుఁడు."
వరాహ. 9.43.

"వాడు సంగీతంలో పుట్టి పెరిగాడు."
వా.

## లో పడు

వశ మగు.

"మాయతోడ లోపడ."
భార. భీష్మ. 3.105.

## లోప మగు

పోవు, తొలగు.

"మీ జగదద్భుతమూర్తిఁ గంటి నా, పాపము లోప మయ్యె."
నిరంకు. 3.43.

## లోబడు

వశ మగు, లొలూచీ పడు.

"అతఁ డొకరికి లోఁబడఁడు."
జైమి. 3.95.

"వా డెవరికీ లోబడేవాడు కాడు."
వా.

"వా డెంతకైనా లోబడతాడు."
వా.

## లోలోన ఉడుకు

మనస్సులోనే ఉక్రోశము చెందు.

"...బండ్లు గొలుసు,కొంచు లోలోన నుడికితిఁ గొంత తడవు."
కళా. 2.85.

## లోవంక కత్తులు

పైకి కనిపించనివి.

"మృత్యుదంష్ట్ర లనంగ మీ మైనలో వంక కత్తులు..." సారం. 3.28.

## వంక పెట్టు

తప్పు పట్టు.

కొత్త. 338.

## వంకపొరక చాటు

దొంగచాటు వ్యవహారము. రాయలసీమ పల్లెలలో ఊరి ముందరే వంక, దానిచుట్టూ డొంక ఉంటూ ఉంటుంది. అలాంటి చాటున్నచోట్లనే తఱుచు వ్యభిచారం జరుగుతూంటుంది. దానిపై వచ్చిన పలుకుబడి.

అలాంటి చాటు మాటు వ్యవహారం కూడా మాని వేశా డని క్రింది ప్రయోగానికి సమన్వయం.

'వంకలో పెరిగిన గడ్డిగాదము చాటు' అని వాచ్యార్థము.

"...విప్రతనయుండు, సడి కోరిచి వంకపొరకచాటున మాసెన్."
పాండు. 3.14.

## వంకర కొంకర మాటలు

వక్రభాషణములు.

"...ఈ బ్రహ్మచారి శంకరుని గుఱించి యింకను వంకర కొంకర మాటలాడ నుంకించుచున్నవాఁడు."
హరవి. 4.33.

## వంకలు డొంకలు

జం.

"వనముల వంకల డొంకలఁ, గనుఁగొనుచున్ వచ్చి వచ్చి కని యచ్చోటన్."
హంస. 5.65.

## వంకలు తీర్చు

సరి దిద్దు.

"శరాసనంబులన్, వాదుకుఁ బట్టి కన్బొమలపై ఖరి వంకలు దీరుచున్."
విజయ. 1.134.
చూ. వంకలు దిద్దు.

## వంకలు దిద్దు

సరి దిద్దు, తప్పు లెన్ను.

"యీ సాధ్వివర్తన కిటటు వంకలు, దిద్దఁ జూడకుము." కళా. 4.143.
చూ. వంకలు తీర్చు.

## వంకలు నొక్కు

వంకలు దీర్చు, చక్కగా చేయు.

ఏ దైనా పాత్ర నొక్కులు పడినప్పుడు ఆ వంకలు సరి చేయుటపై వచ్చిన పలుకుబడి.

"పే, రుక్కున నేరు నిక్కి చన నొక్కఁడు వంకలు నొక్క శక్తుఁడే?"
పాండు. 5.218.
చూ. వంకలు దిద్దు.

## వంగుండి వంకాయ తిన్నా డనియు, కూర్చుండి గుమ్మడికాయ తిన్నా డనియు నెపము వేయు

అన్నిటికీ తప్పులు పట్టు.
అయినదానికీ కానిదానికీ అనుట.

"ఇప్పటికాలములో మన వల్లమాలిన నిరక్షరకుక్షి బ్రాహ్మణులు తమ సాటి బ్రాహ్మణునితో నైనను నతఁ డేదో వంగుండి వంకాయ తిన్నాఁ డనియు కూర్చుండి గుమ్మడికాయ తిన్నాఁ డనియు నెప మాపాదనఁ జేసి కలిసి భోజనము చేయ నొల్లక అత్తెసర్లు కావలయు నని యఘోరింతురు కదా!"
తెలుఁగు జాతీయములు.

## వంచినతల యెత్తకుండా

తదేకదృష్టితో—నిర్విరామంగా.

"వాడు వంచినతల యెత్తకుండా తన పని తాను చేసుకొని పోతాడు."
వా.

## వంచిన నడుం ఎత్తకుండా

నిర్విరామంగా.

"వంచిననడుం ఎత్తకుండా పొద్దున్నుంచీ పని చేస్తుంటే ఇంకా ఒకటి కాలేదు, ఒకటి పోలేదు." వా.

**వంటయింటి కుందేలు**

చేతికి చిక్కినది.

అడవిలో ఉంటేనే కుందేలును వదిలి పెట్టరు. వంటయింటికే వస్తే యింక అది తప్పించుకొని పోజాల దనుట.

చేతిలో చిక్కినవా డని భావార్థము.

"దనుజవల్లభుఁ డల్క వహించి యెవ్వఁడో, శైలమునన్ గుణస్వనము సల్పెను బాపురె వంట యింటఁ గుం,దేలిది చొచ్చె రక్తములు తీవ్రతఁ గ్రోలఁగఁ గల్గె." రుక్మాం. 5.20.

**వంట వార్పు**

జం.

"పని వంటవార్పుల బాధ లించుక లేక, తీరిక మంచిసంసార మొదవె." హంస. 4.146.

**వండ దరిగినకూర**

ముక్కలు ముక్కలుగా నుండునది.

తాళ్ల. సం. 11.3 భా. 24.

**వండ దఱిగినరీతి**

ముక్కలు ముక్కలుగా.

"పరఁగ నత్తలకునుఁ బడుచుకోడండ్లు, వండఁ దఱిగినరీతి వడి నుండె రణము." మైరా. పు. 70.

**వండలిపిండుగా కలగు**

మిక్కిలిగా కలగి పోవు.

'కంధుల్ వండలిపిండుగాఁ గలఁగె." వీర. ౪.౮౯.

**వండ వండ నట్లుగా**

పక పక మని.

అర్థ మింకను విచార్యము.

"వండ వండ నట్లుగా వారిఁ జూచి నవ్వేవు, యెండ లెల్లా నీడ లాయె నింక నేటి మాటలు." తాళ్ల. సం. 3.557.

**వండినకుడుము**

సిద్ధాన్నము.

అనగా కుడుము వండి పెట్టిన తరువాత తినుట ఒక్కటే తరువాయి.

"ఉ,దండత నది మిండనికిఁ, వండిన కుడు మనఁగ దుడ్డువైఖరి మెలగుఁ." శుక. 2.102.

చూ.మబ్బులో చేసిన సద్దికుడుము లాగ.

చూ. సిద్ధాన్నము.

**వండుకొని వార్చుకొని**

వండి వార్చి, వంట చేసికొని.

జం.

"యిలలోని జనములవలె వండుకొని వార్చు, కొని గణికాదత్త మనుభ వింప..." కళా. 6.146.

**వంతపాట పాడు**

అన్నిటికీ తల ఊచు.

పూర్వం నాటకాలలో ఒకడు పాడడం, ఆ చరణా న్నెత్తు కొని వెనుక నున్నవా రందరూ పాడడం అలవాటు.

అందుపై వచ్చినపలుకుబడి.

"ఆ మేనేజరు ఏమి చెప్పినా ఈ హెడ్డుగుమాస్తా వంతపాట పాడడం తప్ప చేసేపని మరొకటి లేదు." వా.

వంతుకు వచ్చు

పోటీకి వచ్చు.

"అహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగు చున్, వంతుకు వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్ల దటంచు మానినీ!" పారి. 1.80.

వంతు గలియు

పొత్తు కలియు.

"శాలముసాముల నందఱఁ గూడఁ జెట్టి, వంతు గలయంగ బువ్వంపు బంతి విందు,పెట్టిరి." పారి. 2.49.

వంతు పెట్టు

వంతు తెచ్చు, పోటీ పెట్టు.

"శ్రీ వేంకటేశ్వరుండు చేరి నిన్ను గూడితేను, వావిరి నాపెకు నేల వంతు పెట్టే వే?" తాళ్ల. సం. 635.

వందలకు వందలు

అధికసంఖ్యాకంగా.

"వందలకు వందలు దాసదాసీ జనంబుతోడ." నానా. 78.

వకావక లగు

వ్రక్క లగు, ముక్క చెక్క లగు.

"పగిలి గుండియ వకావకలు గాఁగ." రాధ. 2.20.

"కావక రాజు చిత్తము వకావక లై తెగఁ జూచునట్టు." సారం. 2.143.

"ఆ చిత్రఘనుఁడు,......కిను కడలి దిగుల్, గాని మనసు వకావక లై, చనఁ జెడితి..." హంస. 3.46.

వక్క సేయని

పోక సేయని.

గవ్వ చేయని.

"వక్క సేయని లేకివాఁ డని నన్ను, వెక్క సేయక కరాళించె నీ రాజు." హరి. ద్వి. 2. భా. 1471.

"వక్క సేవని లేకివాఁడవు నీవు.' గా. హరి. ద్వితీ. పంక్తి. 1416.

పూర్వం చిన్న నాణేలుగా గవ్వలవలెనే వక్కలను కూడా వాడేవారు. దానిపై వచ్చినపలుకుబడి.

చూ. గొంటువక్క చేయని.

వక్కాకున కిచ్చు

ఆదరమునో అభిమానమునో తెలుపుతూ సామాన్యులకు కొంచెం పై వా రిచ్చుకానుక. సామాన్యంగా పేదవా రందరూ తాంబూలం వేసుకుంటారు. అలాంటివారికినాముగా నేటికీ యే కాసీయో, అర్ధణాయో వక్కాకుల కని యివ్వడం అలవాటు.

"నీ కీవఱ కెన్నఁడు వ,క్కాకున కీ లేదు నిర్దయామతి నేలా." శుక. 2.25.

వక్కాకు లిచ్చు

విడెము లిచ్చు.

"వేల్మి వేల్చినచేత వెస నీవు వక్కాకు, లిచ్చినఁ గాదషే యిందువదన!" శుక. 2.477.

వక్కాకు వేసుకొను

తాంబూలము వేసుకొను.

## వక్కాకు సంచి

అడపము.

చూ. అడపది.

## వగ దెగు

పరిష్కార మగు, ముగించు.

"ఆ వ్యవహారం యింకా వగ దెగ లేదు." వా.

"నీ అలంకారం యింకా వగ దెగ లేదా?" వా.

"పొద్దున్నుంచీ చేస్తున్నా యీ పని వగ దెగ లేదు." వా.

## వగ దెంచు

పంచాయతీ చెప్పు, తీర్పు చెప్పు.

"అచ్చటి జనములు సౌమిత్రియ కనికి చన దని వగ దెంచిన దానిఁ దోడుకొని పోయె." శుక. 2.41.

"పరుఁ డిపు దేవభూటి జెఱపట్టిన వాని వధించి సాధ్వి యీ, తరుణి యటంచుఁ జేకొనుట ధర్మవుగా వగదెంచె రాఘ వేశ్వరుఁడు." ఉత్త. రామా. ఆ. 6.

చూ. వగ దెగు.

నేటికీ యిది రాయలసీమలో వాడుకలో ఉన్న పలుకుబడి.

"పెద్దలు వచ్చినారు. మాతగాదా వగ దెంచి పోండి." వా.

"ఆ వ్యవహారం వగ దెగ లేదు." వా.

ఇందు మీదనే సంబంధము తెగి పోవు, తెగ తెంపులు అగు.

"వాడికీ నాకూ ఋణం వగ తెగి పోయింది." వా.

"నీకూ మాకూ వగ తెంపులు అయి పోయింది." వా.

"ఆ వ్యవహారం వగ దెంచి రారా. ఆ తరువాత చూద్దాం." వా.

## వగపు సోకు

దిగులు కలుగు.

"శ్రీ చరణంబు లింక, సోఁక వనుచు వగపు సోఁకె నయ్యె." భాగ. స్క. 1.405.

## వగలమారి వంకాయ

వగలాడి.

'వగలమారి వంకాయ సెగ లేకనే ఉడికిం దట' అన్న సామెతలోని భాగం.

నారాయణదాసు రుక్మిణీకల్యాణము.

## వగ లేదు

అరువు తెలియదు.

"ఒక పని చేయడానికి వగ లేదు. నోరు మాత్రం చిఱిగి పోతుంది." వా.

## వగ లొలుకు

అందము లొలుకు.

"వగ లొలుకుధాగధగ్యపు, జిగి గుల్కెడు నుబ్బుగబ్బి సిబ్బెపు గుబ్బల్, నిగనిగలు గులుకు..." హంస. 1.60.

## వగా తెగా తెలియదు

కార్యనిర్వహణపద్ధతి తెలి యదు. జం.

"వాడికి వగా తెగా తెలీదు. వాడికి అప్పగిస్తే ఏ పనీ కాదు."

## వగ్గు వడు

పరిపక్వ మగు, మాగి పోవు.

"వగ్గువడి తరంగితాయమానం బైన. కవిక. 5.110.

**వచ్చితి వచ్చితి నని**

ఇదో వస్తున్నా నని.

"వాన వచ్చితి వచ్చితి నని భయపెట్ట సాగెను." కాశీయా. 97.

**వచ్చినత్రోవ పట్టు**

మరలి పోవు.

ఏ దైనా పని కానప్పుడు వచ్చినరీతిగానే వెళ్లి పోవు అనేఅర్థంలో ఉపయోగించే పలుకుబడి.

"విరియంగ ఖడ్గపాశముల వ్రేసిన వచ్చినత్రోవ పట్టి రాత్రరమున మాణి భద్రసహితంబుగ వచ్చినవారు పౌరులున్." ఉ. హ. 1.40.

"వా డేమాత్రం సహాయం చేయ నన్నాడు. వచ్చినదారి నే పోవలసి వచ్చింది." వా.

**వచ్చినది రాబట్టుకొను**

అనవసర మైనఆశలకు పోక ఎంత వస్తే అంత లాగుకొను.

"వచ్చినది రాబట్టు కోవడం తెలివి కానీ అంత రావాలి యింత రావాలి అని అసలే రాబట్టుకోక పోవడం ఏమి తెలివి ?" వా.

**వచ్చిన పోయిన వారు**

వచ్చే పొయ్యేవారు అని వాడుక.

"వచ్చిన పోయినవారిచే నీదు, సచ్చరిత్రము విని...." బస. 1.22.

"వచ్చే పోయేవారు వాడు మంచివా డని చెప్తూ వచ్చారు." వా.

చూ. వచ్చే పోయేవారు.

**వచ్చుబడి**

రాబడి.

కాశీయా. 54.

**వచ్చే పోయే వారు**

వస్తూ పోతూ ఉండే వారు.

అతిథి అభ్యాగతులు.

"వచ్చిన పోయినవారిచే నీదు, సచ్చరిత్రము విని." బస. 1.22.

చూ. వచ్చిన పోయిన వారు

**వచ్చేసారి**

వచ్చేసంవత్సరం, వచ్చేదఫా.

"వచ్చేసారి అయినా సకాలంలో వానలు కురుస్తాయో లేదో చూడాలి." వా.

"ఈ సారి దీనితో సంతృప్తి పడు నాయనా! వచ్చేసారికి చూద్దాం లే." వా.

**వజ్రకవచము**

రక్షకము.

".....సకలరాజతంత్రసర్వాంగరక్షకు, భట్టినీతి వజ్రపంజరంబు." విక్ర. 3.135.

"మేరువు తృణ మగు నవ్విభు, కారుణ్యము గాదె వజ్రకవచము మనకున్." జైమి. 7.86.

**వజ్రపంజరముగా**

విడిపించుకొొన వీలు లేనిది గా.

"మింటికి నెగయించి మిన్ను ముట్టించి, వజ్రపంజరముగా వడిఁ జుట్టు ముట్టి." మైరా. పు. 18.

**వజ్రకుంఠ**

శుద్ధ వెధవ.

"ఓరి ! వజ్రకుంఠ ! నాల్గుతరాల నుం

డిన్ని నే తగు వైనవాఁడ నుండఁగా నిన్నటి నుడుపఁడవు.''
హేమా. పు. 83.

## వజ్రాంగి జోడు

వజ్రకవచము.

అంగీ—చొక్కా.

ఇది నేటికీ పశ్చిమాంధ్రంలో రోజూ వినపడేమాట.

''మేనికి వంచినముద్ర లవే వజ్రాంగి-జోడు.'' తాళ్ల. సం. 9.104.

''హత్తె నీ మేన వజ్రాంగిజోడు.''
పాండు. 1.145.

''నీ కృప నాకు వజ్రాంగిజోడు.''
జైమి. 2.52.

## వట్టి కొడిమెలు కట్టు

అనవసరముగా బాధ్యులను చేయు, లేనినింద మోపు.

''మదికివలసినయట్ల చేయుదురు గాని, వట్టి కొడిమెలు నాకును గట్టఁ జనదు.'' కళా. 5.62.

''...ఎవ్వ రీ, కొడిమెలు గట్టి పెండ్లికొడుకుం గడియారము మోవఁ జేసిరం, చదుగ...'' జైమి. పీఠి. 2.

''పాసెం, బడిగినవారే పేదలె, కొడిమెలు గట్టఁబడి యతనిఁ గొని పని యేలా?'' ఆము. 5.58.

## వట్టి గాంభీర్యము

మేకపోతుగాంభీర్యము.

''వట్టిగాంభీర్య మొక్కఁడు వెట్టుకొనియె.'' ఆము. 5.7.

## వట్టి గొడ్డు తాకట్టు

వ్యర్థము. నిష్ప్రయోజనము.

వట్టి పోయినపశువును తాకట్టు పెట్టుకుంటే ఏమీ లాభముండదు. పా లివ్వదు కనుక.

''పుట్టునొ యంటిమే నితనిపోడిమి గంటిమ వట్టి గొడ్డు తా, కట్టితఁ డెంత యున్న నిఁక గాఁతియ పెట్టుట వెళ్లఁ గొట్టినన్.'' కళా. 4.74.

## వట్టి చేతులతో....

అక్కడున్న వారికోసం ఏమిటినీ తీసుకుని పోకుండా.

''పిల్లలను చూడడానికి పోతూ వట్టి చేతులతో పోవడం ఎట్లా అని ఆలోచిస్తున్నాను.'' వా.

## వట్టి తానములు

శుష్కస్నానములు.

''వట్టితానాలు దర్భలు పుట్టెఁ డుప్పు...'' కళా. 7.29.

## వట్టి నూతికి వర గట్టు

నిష్ప్రయోజన మైన పని చేయు.

మదన. శత. 6.

## వట్టి పగ్గెలు ప్రేలు

ప్రగల్భము లాడు, డప్పాలు కొట్టు.

''వట్టిపగ్గెలు ప్రేలు నవ్వారజరత.''
శుక. 3.23.

## వట్టి పిడికిలి గొండలే ల్లెట్టు పండు?

ప్రయత్నం లేకనే ఫలిత మెట్లు కలుగు ననుట.

''వట్టి పిడికిలిఁ గొండలే ల్లెట్టు పండు.''
దశ్మాం. 5.129.

వట్టి పోవు

ఎండి పోవు.

"ఏన చని వట్టి పోయిన, కానలఁ గార్చిచ్చు కాల్చుకైవడి." భాస్క. యుద్ధ. 763.

వట్టి ప్రయాసము

వృథా ప్రయాస.

"అన్యమహత్త్వం, బెట్టిదియు నేల జనులకు, వట్టి ప్రయాసంబు కాని ఫలము దలంపన్." కళా. 8.164.

వట్టిమాకు లిగురించు వలపు మాటలు

మోడులను గూడా చిగిరింప జేయ గల ప్రేమసల్లాపాలు. శుష్కహృదయాలను ద్రవింప జేయ గల వనుట.

"వట్టిమాకు లిగురించు వలపుమాటల విభు, జట్టిగొని పురమున సతమైతి వమ్మ." తాళ్ల. సం. 3.658.

వట్టి మొగమోట

వ్యర్థ ముఖదాక్షిణ్యము. దాక్షిణ్యము చూప కూడని చోట చూపుట.

"వట్టి మొగమోట చాలించి గట్టిగాఁగ, నదర వైచుచుఁ..." కళా. 3.188.

వట్టి రాకపోకలు

నిష్ప్రయోజనంగా రావడం, పోవడం.

"వట్టి రాకపోక లొనర్చె వాని సతియు." కళా. 4.64.

వట్ర పడు

తక్కువ పడు.

"దూరపాత విస్ఫురణఁ గరంబు వట్ర పడు." భావ. కర్ణ. 1.231.

వట్ర పెట్టు

తక్కువ పఱుచు.

వట్రిల్లు

1. కలుగు, ఒప్పు.

"వనిత పుత్రులు నాకు వట్రిల్లి రేని, నంచి పే రిడుదాన."

పండితా. ద్వితీ. మహి. పుట. 154.

2. ప్రవర్తిలు, తిరుగు.

"ఆకృ జము వట్రిల్ల."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 249.

"నగుబాటు వట్రిల్లె నాతులలోన" భాగ. 5 స్కం. పారి. ఉత్త. ఆ. 6.

"వెడందసోగ లై వట్రిలు కన్నుదోయి." విజ. ఆ. 12.

వడక పెండ్లికొడుకు

బ్రహ్మచారి, వడుగు చేసుకునేవాడు.

పాండవ. ప్రవా. 74.

వడకాడు

కంపించు.

"మహోద్ధతపాదఘట్టన, న్నట ని ట నై ధరిత్రి వడఁ కాడ." భాగ. స్క. 10. (ఉ) 915.

రూ. వడఁకాడు.

వడగండ్ల గుండ్లు గట్ట గల్గు

వడగండ్లు క్షణంలో కరగి పోయేవి. వానిని గొంతునకు బంగారుగుండ్లవలె కట్టుకో గల దంటే అసంభవములను

సంభవ మొనర్చె అతి
జాణ అని నిరసనగా అను
మాట.
పండితా. ప్రథ. పురా. పుట. 359.

**వడగాలి**
ఎండవేడిమితో వెచ్చనైన
గాలి, వేడిగాడ్పు.
శమా. 7.63.

**వడ దాకు**
ఎండదెబ్బ తగులు.
"మధ్యందినాతపోష్మహతిఁ గందె
వడ దాకె." మను. 2.47.

**వడ దేఱు**
1. వడ గొను— వాడి పోవు.
వడ+తేరు.
"చేరెఁడు కన్నుదోయి వడ దేఱెడు
ముద్దుమొగంబు." పాండు. 3.65.
2. తాపము తీరు, ఉష్ణోప
శమన మగు.
"ఆమరధేనుదధిప్రయుక్తపా, థేయము
లారగించి వడ దేఱఁగ." పారి. 2.90.

**వడ పడు**
సంబంధపడు.
"నడుమ రెంటికిని నామేను, వడఁ బడె
యెందలి వాఁడనో నేను."
తాళ్ల. సం. 9.53.

**వడపిందెలు**
కొంచెం ఉప్పు కలిపిన
నీళ్లలో ఊర వేసిన లేత
మామిడి పిందెలు. వీనిని
మజ్జిగఅన్నంలో నంజుకొని
తినడం చిత్తూరు జిల్లాలో
విపరీతంగా నేటికీ అలవాటు.

**వడముడిగా జొచ్చి వాత వెళ్లు**
అతినేర్పరు లగు, మాయావు
లగు.
"వెడమతు లైన యీ విప్రుల జాడ,
వడముడి గాఁ జొచ్చి వాత వెళ్లుదురు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 433-34.
ఇలాంటి పలుకుబడులే
'ముక్కులో దూరి నోటిలో
వచ్చు' 'పొయిలో పెడితే
పొంతలో వచ్చు'—ఇత్యా
దులు.

**వడవడకలు ఉడుగు**
భయము తీరు, భయరహితు
లగు.
"నప్పడంతులు వడవడక లుడుగుచుఁ
గులుకుటెలుంగులతోఁ బలుకం దొడం
న..." కళా. 6.114.౨

**వడవడ వడకులు కుడుచు**
మిక్కిలి వడకు.
"దడఁబడుచు వడవడ వడంకులు
గుడుచు, నడుముల దడఁబాటు వలన
సడలఁ బాఱునీవులు తావులం
జిక్కన్." కళా. 6.225.

**వడ వెట్టు**
వడ పోయు.
పణ్యారము=పణ్యాము=వడ
పప్పు.
పప్పు నానబోసి వడ

పుటికలో వేసి నీళ్లు పోవు నట్లు చేయు.
"వడ వెట్టు వో యర్ఘ్యపణ్యముల్ గూడ."
పండితా. ప్రథ. పురా. పుట. 453.

వడి బెట్టి తీయు
బలవంతముగా తీసికొను.
"తతి తీపు పుట్టించి తక్క చేకా సెల్ల, వడివెట్టి రాఁ దీయు వారిఁ జూచి." విక్ర. 4.16.

వడి వెట్టు
1. చెప్పినపని చేయు, సేవకా వృత్తి చేయు.
"ఒడియనంబికి మున్ను వడివెట్టు శివుడు, వడి వెట్టు గిన్నర బ్రహ్మయ్యకిపుడు..." బస. 5.131. పు.
2. వస్త్రకాళితము పట్టు.
"కప్పురంబు దూలిఁగాఁ జేసి వడి వెట్టు." శుమా. 5.139.

వడి సెడు
బల ముడుగు.
"తదాశుగ వేగము సైప కందఱున్, వడి సెడి యొక్క దిక్క నకు వచ్చుచు." భాస్క. యుద్ధ. 533.

వడ్డించిన విస్తరి
సిద్ధాన్నం.
"వడ్డించినవిస్తరి మీజీవితం." వా.
చూ. సిద్ధాన్నం.

వడ్డించు
వ్యంగ్యంగా దెబ్బలు కొట్టు, తిట్టు.
మొత్తముమీద దండించు అనే అర్థంలో ఉపయోగిస్తారు.
"కాఁడేని చేతిగోఁకటి, వాదులు వారించి లెస్స వడ్డించినపో." విప్ర. 4.60.
"నాలుగు వడ్డిస్తే వాడే దారికి వస్తాడు." వా.
"ఇంటికి పిలిచి నాలుగు వడ్డించి పంపించు." వా.

వడ్డికి బాఱు
ఎక్కు వగు.
"కనుఁగొని వసరుచు రాధా, వన జేక్షణ పలికె వలపు వడ్డికిఁ బాఱెన్." రాధి. ఆ. 3.

వడ్డి కొసగు
సామాన్యంగా తమ దగ్గర ఎక్కువగా డబ్బున్నవారే వడ్డి కిస్తారు కనుక అది యెక్కువగా కలవా డనుట.
"అచటి భృంగముల కసిత, దీధితులు వడ్డి కొసఁగుచు దేవపూజ, విరులు చిది మెడికపటభూసురునిఁ గనియె." మను. 3.88.

వడ్డి పాఱు
వడ్డీ యెక్కు వగు,
"ప్రబలంబుగా వడ్డి పాఱక మున్న." గౌ. హరి. ద్వితీ. పంక్తి. 633.

వడ్డి వారు
అధిక మగు.
"జడ్డు మానవుఁడు చదువఁ జదువ నాస, వడ్డి వారు గాక వదలీనా." తాళ్ల. సం. 11. భా. 369.

**వడ్లగింజలో బియ్యపుగింజ**

సర్వసామాన్యమయిన విషయం. విశేషమేమీ లేదు.

"వాడు అపరాత్రివేళ వచ్చి నన్ను నిద్ర లేపాడు. ఇంతకూ సంగతేమయ్యా ? అంటే వడ్లగింజలో బియ్యపుగింజ." వా.

"ఆ, ఏముంది ? వడ్లగింజలోది బియ్యపు గింజ." వా.

**వడ్లతోడ తట్ట యెండినట్లు**

ఆనుషంగికముగా బాధపడు.

మానిని. 11.

చూ. వడ్లతో దాగలి యెండినట్లు.

**వడ్లను బెరుగు బిసుకు చందము**

పెరుగులో అన్నం కలుస్తుంది గానీ వడ్లు కలియవు.

అందికా పొందికా లేనివాని కలయిక నిది తెలియజేస్తుంది.

"వడ్లును బెరుగుఁ, బిసుకు చందపు బిలిబిలికృతుల్ కృతులె."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 20.

"పెనచి వడ్లును బెరుగును బిసికినట్లు, కెలను నవ్వంగ బిలిబిలి కృతులు సెప్పి." సక. నీతి. 26.

వాసిష్ఠ రామాయణం 2.132.

"పెరుగును వడ్లును కలిపిన, కరణిని వర్ణాశ్రమములు కర్తరిఁ గలియున్." 

జైమి. 8.120.

**వణకుప్రాయము**

ముసలితనము.

"అమ్మకు కులుకుప్రాయం, అయ్యకు వణుకుప్రాయం." సా.

**వత్తాసి**

సహాయకుడు, ప్రోత్సాహకుడు.

"వాడికి వీడు వత్తాసి. వాడి లోపాలు వీణ్ణి అడిగితే చెబుతాడా ?" వా.

రూ. వత్తువాసి.

**వత్తికి నూనెకు గొలదిగా**

అతి కష్టముమీద జరుగుబాటు సాగుచున్న దను సందర్భమున నుపయోగించు పలుకుబడి.

"వత్తికి నూనెకుఁ గొలఁదిగా వడఁజనె దివసములు."

తాళ్ల. సం. 5.118.

**వత్తిలోపలి నూనె**

అస్థిరము.

తాళ్ళ. సం. 11.3 భా. 116.

**వత్తువాసి**

చూ. వత్తాసి.

**వదటి పాలగు**

వ్యర్థమగు, నేల పాలగు.

వదఱు=వరద.

"బాగలు గీసలు వదటి పాలౌఁగ."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 242.

**వదనంబు వఱువట్లు వట్టు**

నోరు పిడచ కట్టుకొని పోవు, ఎండి పోవు.

"వదనంబు వఱువట్లు వట్టి మై దప్పి." ద్విప. జగ. పు. 166.

వదరుపల్కులు

వాగుడుమాటలు, అనవసర ప్రసంగాలు.

"వదరు పల్కులు గాక తుది సాటి వచ్చునే, కిన్నెరకాయ లీచన్ను గవకు."
హంస. 1.210.

వదరుబోడి

వదరుబోతు.

క్రీడా. పు. 69.

వద్దంటే ముక్కు కోసుకున్నాడట

అసలా పని కూడదనగా మఱింత చెఱుపు చేసుకున్నాడు అనుపట్టుల అనే మాట. ఇదే గ్రాంథిక రూపంలో—

"వల దని వారింపఁ జలమున ముక్కు, వాలి యిచ్చుకున్నట్లు..."
బసవ. 4.94.

వనంబున గూర దిను

ఆకూ అలమూ తిను.

"ఇంక నెన్నాళ్లు ఉండెడి, గొంతి వనంబునఁ గూర దినుచు."
భార. ఆశ్ర. 2.15.

వనములు వెట్టు

వనములు నాటించు.

"వనములు వెట్టినధన్యులు."
రుక్మాం. 2.104.

చూ. వనములు వేయు.

వనములు వేయు

వనములు నాటించు.

వన్నియ పెట్టు

మెఱుగు పెట్టు.

పాండు. 4.204.

వన్నెల వెట్టు

వన్నె పెట్టు – రంగు వేయు.

"అధరారుణోజ్జ్వలరుచి గప్పె, నన్నిటికి వన్నువు వెట్టుమాడ్కి."
కుమా. 9.11.

వన్ను వూన్చు

వన్నె వేయు– రంగు వేయు.

"కెమ్మోవి వన్ను వూన్చి."
కుమా. 9.10.

వన్ను వెక్కించు

వన్నె వెట్టు–రంగు నెక్కువ చేయు.

"అనేకవర్ణంబుల కాత్మీయాంగప్రభ వన్ను వెక్కించుచు."
కుమా. 9.23.

వన్నె కలుగు

ప్రసిద్ధి కలుగు.

"వంశమునకు మిగుల వన్నె కలుగ."
రాధా. 1.31.

వన్నె తక్కువ యగు

యోగ్యత తగ్గి పోవు.

బంగారమును వన్నెలను బట్టి దాని తరములను నిర్ణయిస్తారు.

అన్నిటిలో శ్రేష్ఠమైనది పదహారో వన్నె బంగారము. తద్వారా వచ్చినపలుకుబడి.

"కులములో వన్నె తక్కువ

యయ్యెనే గాధి, పట్టికి మేనక చుట్టఱికము."
మను. 2.73.

**వన్నె తెచ్చు**

ప్రతిష్ఠ తెచ్చు.

"వన్నె తెచ్చితి వౌర వంశ మంతకును." పల. పు. 102.

**వన్నె దఱుగు**

గౌరవము చెడు.

"పతి గనుఁగొన్నచోఁ బ్రాణహాని యొనర్చు, వాఁడవా రెఱిఁగిన వన్నె దఱుగు." హంస. 1.125.

**వన్నె దెచ్చు**

రంగు మీఱ జేయు, వాసి కెక్క జేయు.

"కొమ్మకు వన్నె దెచ్చునే."
విప్ర. 2.41.

**వన్నెలు చిన్నెలు**

జం.

"ఇన్ని చిన్నె వన్నె లున్న కన్నియ మిన్న, నాదుపీట రతియ నాఁగ నలరి, యున్న దన్నసన్న యొక్కింత యీ దన్క, నెఱుఁగ నైతి వట్టి మొఱటి నైతి." భద్రావత్య. ఆ. 3.

**వన్నె వాసి**

జం.

ప్రకాశమూ, దాని విలువా కీర్తి ప్రతిష్ఠలూ కూడా లక్షణయా సూచించుపలుకుబడి.

"ఆ, వన్నెయు వాసియుం దఱిఁగి వారు ననుం దల లెత్తి చూడఁగా."
పారి. 1.88.

"వాడిముఖం వన్నెవాసి తరిగి ఉన్నది." వా.

"ఆ చెడ్డపనితో అతని పేరు వన్నె వాసి చెడింది." వా.

**వమ్మగు**

వ్యర్థ మగు.

"ఇవ్విధంబున గాండివమ్ము లావు వమ్మయినం గ్రమ్మనుమ్మలికంబున."
ఉ. హరి. 2.29.

**వయసు చెల్లు**

వయసు మీఱు.

"ఆయన వయసు చెల్లినవాడు. ఆయనతో నేమిటి?" వా.

**వయసు బుచ్చు**

వయసు చెల్లునట్లు చేయు, వృద్ధాప్యము తెచ్చు.

"ఉన్నట్లె యుండి కాలం,బు న్నరులకు వయసుఁ బుచ్చి మోసముఁ దెచ్చున్."
ఆము. 2.79.

**వయసులో చిన్నైనా వివేకంలో పెద్ద**

విచక్షణ గల చిన్నవారిని గూర్చి అనుమాట.

"ధవళాక్షి! వయసునఁ జిన్నవు గాని వివేకగుణమునన్ మిక్కిలి పెద్దవు."
కళా. 4.139.

వాడుకలో — 'వాడు వయస్సులో చిన్నవాడైనా తెలివిలో పెద్దవాడు.'

చూ. వయోవృద్ధుడు, జ్ఞానవృద్ధుడు.

**వరదలో గలుపు**

గంగలో కలుపు, పాడు చేయు.

"వచ్చినకార్యంబు వరదలోఁ గలిపి."
పల. పు. 112.

## వరిముక్కు ముల్లంత

కొంచెము.

ఆంధ్రనాయక. 29.

## వరిముల్లు వాసి

కొంచెము.

"......మతి కొంచ అల్ల మాట తెల్లము కాని యించుక పరికించుచో నీ యదియ దానియెడ వరిముల్లు వాసి ముల్లు చూపునది యని మా యభిప్రాయ మనిరి..."
ధర్మజ. పు. 87. పం.8.

## వరుగుతో దాగర యెండుట

వరుగుతోబాటు వరుగు వేసిన పాత్ర కూడా ఎండ వలసి వచ్చినట్లు—అనగా ఆనుషంగికముగా బాధ చెందవలయు ననుట.

"అనుభవింపక పోవు నే యక్కటకట!, వరుగుతో దాఁగరయు నెండ వలసి నట్లు."
ఉ. హరి. 4.54.

## వరువట్లు వట్టిన

ఎండి పోయిన.

"వలవంత వరువట్లు వట్టిన నాలుక, తల ముద్దుమాటలు మెలఁగి యాడ."
కుమా. 5.155.

## వరువట్లు వట్టు

ఎండి పోవు.

కాశి. 2.141.

"బావులుఁ జెఱువులుఁ బద్మాకరములు, వావిరి నూతులు వరువట్లు వట్టె, వనములు ఫలపుష్పవాటిక ల్గమరె."
బసవ. 6.192.

## వరువు బనులు

సేవకుడు సేయు పనులు, పరిచర్యలు.

"తగిన వరువుఁబనులు చేయుచుండుఁ బార్వతి యునికికి వరద యిచ్చగింప వలయు..."
కుమా. 3.102.

## వరుస అగు

వివాహానికి అర్హమైనచుట్టరికము ఉన్న దనుట.

'ఈపిల్ల వాడికి వరస అవుతుంది.'

'వీడు ఆ అమ్మాయికి వరస కాదు.'

దీనిమీాద వచ్చిన జంట పదమే 'వావి వరుస.'

## వరుసతో మాటాడు

అక్క, బావ, మామ అని ఏదో చుట్టరికము కలుపుతూ పలకరించు.

బంధుత్వం లేకున్నా, కనీసం ఒక కులం కూడా కాకపోయినా వరుసలు కలపడం నేటికీ కాన వస్తున్నదే.

"వరుసతో మాటాడ వచ్చు విప్రుల మోల, రాకపోకల నొయారంబు నెఱపు."
శుక. 2.172.

చూ. వరుస అగు.

## వరుసలు పెట్టుకొను

వంతులు వేసికొను.

"పరమేష్ఠి నాలుమోములు, వరుసలు వెట్టుకొనుఁ జెప్ప వఱమే కూర్మిన్."
కా. మా. 2.19.

## వర్ణన కెక్కు

వాసి కెక్కు.

"వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ..."
కుమా. 1.36.

## వర్షాకాలపు చదువు

బాగా సాగని చదువు.

వర్షాకాలంలో చదువు సాగుట కష్టము కదా!
సాక్షి. పు. 385.

చూ. వానాకాలపు చదువు.

## వఱతి పాల్వేయు

గంగలో కలుపు – అని వాడుక.

వఱతి = వరద = ప్రవాహం.

'ఏటిలో వేయు' అని కూడా పలుకుబడి ఉన్నది.

"వైధవ్యవర్తనల్ వఱతి పాల్సేసి."
పండితా. ప్రథ. దీక్షా. పు. 115.

## వఱద బోవు

ఏటిలో వేసినట్లగు – వ్యర్థమగు. పాడయి పోవు.

"నెఱయ వరదఁ బోవుఁ గా కేమి నెత్తురు పుట్ట నేల?"
కా. మా. 3.111.

## వఱదలు గట్టు

ప్రవహించు.

"అశ్రుపూరముల్ వరదలు గట్ట నేడ్చెదవు."
నిరంకు 4.51.

## వఱు గొను

ప్రవాహ. మగు, ధార గట్టు.

"కుండ గూల్చినభంగి, వారక వర్షంబు వఱుగొని కురియ."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 146.

## వఱువట్లు వట్టు

ఎండి పోవు.

"వఱలుచు నధరముల్ వఱువట్లు వట్ట"
పండితా. ద్వితీ. మహి. పుట. 134.

రూ. వరువట్లు వట్టు.

## వఱ్ఱోడు

ప్రవాహము, వాగు.

"శిల లెల్లఁ గరఁగి పెరిగి, తెఱలి పఱతెంచు వఱ్ఱోడిఁ దేలిపాఱు, నుడుగణే శుండు వెండి పేరోడవోలె"
కుమా. 3.10.

## వలగొను

ప్రదక్షిణము చేయు.

"వలగొని ముమ్మారు భక్తితో మ్రొక్కి." పల. పు. 115.
"మ్రొక్కి వలగొని" జైమి. 3.120.
"వనజాసనసూతి మ్రొక్కి వలగొని హరు వీడ్కొని." పాండు. 5.322.
"వ్రతదానమంటప, స్థలమున నర్చితం బగువదాన్యమహీరుహ సార్వభౌమమున్, వలగొని వచ్చి."
పారి. 5.373.

## వలని నాటకములు

అనవసరమైన, ఎక్కువైన నటనలు.

"నా మొగమోటకై వలనినాటకముల్ నటియించి." పారి. 1.89.

ఒల్లని–అధిక మనే అర్థంలో వాడుకలోనూ ఉన్నది.

'వాడికి వాడి పెళ్లాంమీద ఒల్లమాలిన ప్రేమ.'

వలను దప్పక
నీతి తప్పక.
"నీతికళలందుఁ దుదముట్ట నేర్పు గలిగి, వలను దప్పక వర్తించువాఁడు."
భాస్క. యుద్ధ. 410.

వలపక్షము
పక్షపాతము.

వలపలి కన్ను
కుడికన్ను.
బస. 3.72.
చూ. వలకన్ను, వలచేయి.

వలపార
ప్రేమపూర్వకముగా.
కనులార, మనసార, చేతులార వలెనే.
"వలపారఁ దన మనోవాక్కాయకర్మ, ములఁ బ్రాణదేహార్థముల నివేదించి..."
బస. 6.151.
"వలపారఁ దన మనోవల్లభు శివునిఁ, దలఁపంగఁ దలఁపంగ"
పండితా. ప్రథ. దీక్షా. పుట. 226.

వలపు నీ తల వేగు
వలపు నీ తలలోనే పుట్టెనదా?
అనగా నీవే దానికి ఆధారమా? అనుట.
'నీ తలమీదనే పొద్దు పొడిచిందా?' అని వాడుక.
"కలిగ నొక జాంబవతి వెన్నెల వడఁబడె నేల వలపు నీ తల వేగన్."
ఉ. హరి. 3.115.
చూ. బస. పురా.

వలపుల కిసమసలు
విరహావేదనలు.
"వలపుల కిసమస లని తెలిసి."
విజయ. 3.37.

వలపులు గుల్కు
అందముగా నుండు.
"వలపులు గుల్కు నీ వనితల మెడలు."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1001.

వలపు వెఱ్ఱి
ప్రేమోన్మాదము.
"వలపువెఱ్ఱికిఁ జిక్కి యవ్వనజగంధి."
శుక. 2.562.

వలరసము
ప్రేమరసము.
"మరుఁ డేయఁ గోయిలలు గూయ మదాలులు మ్రోయ రాగులన్, వలరస మందఁ బ్రోషితులు వంద...వచ్చె నత్యలఘువసంతము." కుమా. 6.132.
"తరుణి వలరసంబు దఱిమి పైఁబడ నున్న, నెఱ నెఱింగి కూడ నేల కేల, బేల నైతి." కుమా. 6.160.
"ఉవిద మానసమున నుప్పొంగి వలరసం, బొక్కపెట్ట తఱిమి..."
కుమా. 5.127.

వలల బెట్టు
వంచించి వశము చేసికొను.
"వాలుఁగన్నులచేత వలలఁ బెట్టుటె కాక."
నిరంకు. 2.33.

వలవంతతనము
మరులు గొనుట, అతి మోహము.
వలవంత మన్మథవ్యథ అన్న అర్థంలో అలవాటు. దానిపై

తనము చేరుట విశిష్టంగా కాన వస్తుంది.

"ఇంత, వలవంతతన మాఁడువారికిఁ దగునె." కుమా. 6.21.

## వల వచ్చు

ప్రదక్షిణము చేయు.

"వల వచ్చి యామావ్యవహుని లోఁ జొచ్చి."
వర. రా. యు. పు. 487. పంక్తి. 15.

## వలవని హాహాలు

లేనిపోని ఆర్భాటములు.

"ఓహో! భూవర! వలవని, హాహాలివి." సింహా. 2.62.

## వల వేయు

చూ. ఉచ్చులు పన్ను.

## వల వైచు

పట్టుకొను.

"పాశము మీఁద వైవ దానన వల వైచి వాని...యష్టితోడన...కట్టె."
భాస్క. యుద్ధ. 1486.

## వలస పోవు

దేశము వదలి పోవు.

"వలసలు పోవువారుఁ దగువస్తువులప్పన పంపువారుఁ గే,వలవినయంబుతోఁ గొలుచువారును నైరి." కళా. 8.45.

## వలస వంగుడు నెఱుగక

కష్టసష్టము లెఱుగక.

"అయ్యో మును మట్టు పెట్టినదాదిగాఁగ, వలస వంగుడు లెఱుఁగక బలిసి గవ్వ,కాసు వ్యయపోక..." నలచ. 2.125.

## వలసి వ్రాల్లములు

అయిష్ట మనుట.

"వద్దు పోరా నీవ నింత వలసి వ్రాల్లములు." తాళ్ల. సం. 12.1.

## వలిగ్రాము

చలిదయ్యము.

"వలిగ్రాము పట్టినట్ల నలుఁడు మైమఱచి పడి యున్న." కుమా. 10.17.

## వల్లంబు బోనాడువైశ్యుని రేవ

ఒకచోట నిలువక (తిరుగు.)

ధనపుసంచిని పోగొట్టుకొన్న కోమటివలె.

వైశ్యునికి ప్రధాన మైనది ధనపుసంచి కనుక అది పోగొట్టుకొన్నప్పుడు అతడు అటు ఇటు తిరుగుతాడు.

"వల్లంబు పోనాడువైశ్యునిరేవను." హంస. 1.220.

## వల్లెడ వైచు

ముసుగు వేసుకొను.

"వలిపెపుదుప్పటిచెఱఁగు వల్లెడ వైచి యదూద్వహుండు దా." రాజగో. 3.4.

## వల్లె యను

అంగీకరించు, సరే నను.
కుమా. 10.125.

## వల్లెవాటు వైచు

ఉత్తరీయముగా వేసికొను.

"జాతి కట్టిన యట్టి సరిగె దుప్పటికొంగు, వామాంసమున వల్లెవాటు వైచి." రాజగో. 2.57.

## వల్గనధావనలంఘనంబులు

అశ్వగతిలోని విశేషాలు.

తిరుగుట, పారుట, ఎగురుట.
శమా. 11.70.

వశము కాదు

సాధ్యము కాదు.

"కలికి నెన్నడు మెన్న ఖచరుల కొజ్జ
యై, వఱలెడు వానికి వశము గాదు."
శుక. 2.7.

వసంత మాడు

వసంతము చల్లుకొను.

వసంతాలు చల్లుకొంటూ
క్రీడించు.

లక్షణయా ఒకరిపై ఒకరు
చల్లుకొనుట.

"పద్మాక్షములు కప్రపుధూళి వసంత
మాడఁగన్" కళా. 6.228

"కీ లెత్తుచో బాహుమూలజాతప్రభా,
చకచకల్ పైఁడి వసంత మాడ."
హంస. 2.22.

వసతిగా

సౌకర్యముగా.

"ఆ యిల్లు చాలా వసతిగా ఉంది.
వా.

"ఆ ఊరు చాలా వసతిగా ఉంటుది."
వా.

వసది

జైనులగుడి, వసతి.
బస. 6.165.

వస పోవు

స్వాధీన మగు, వశ మగు.

"వడిగాలి వడి నిల్వ వసపోక బలితంపు,
సధిపెణ ల్దనియ వేసరక నిగుడు."
శుక. 1.257.

వస పోసిన పిట్ట

వాగుడుకాయ.

"వాడు వస పోసిన పిట్టలాగా వాగు
తున్నాడు." వా.

వసి వాడు (ముద్దు మొగము)

మిక్కిలి వాడు.

"అలంక్రియా, వాసము గాని మేను వసి
వాడినముద్దుమొగంబుఁ గాంచి..."
శుక. 1.214.
చూ. వసివా ళ్వాడు.

వస్తాను

పోతాను.

ఎక్కడికైనా పోతున్నప్పుడు
'పోతా' ననటం అశుభసూచ
కంగా తలచి 'పోయి వస్తా'
ననుటలో మిగిలినమాట.

వహి కెక్కు

వాసి కెక్కు.

"వనజభవుప్రాఁతలు చక్రాంకితాలే,
వహి కెక్కుముద్రలు."
తాళ్ల. సం. 9.126.

వళకాడు

వణకు.

"వావాత నింద్రియాలు వళకాడినా."
తాళ్ల. సం. 9.128.
చూ. వడకాడు.

వళుకు సేయు

లగ్నము చేయు.

"వట్టి భక్తి నీ మీఁద వళుకు సేసి
నిన్నుఁ, బట్టి తెచ్చి మతిలోనఁ బెట్టు
కొంటిమి." . తాళ్ల. సం. 8.49.

వాంఛ యిడు

కోరు.

"వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు"7
భాగ. స్క. 7.11

వాకట్టు

వాగ్బంధనము.

బ్రహ్మ, వాక ట్టొనరించి తన్ముఖ నివాసిని యొసతి మమ్ముఁ గావుతన్."
సింహా. 1.4.

వాకట్టుమంత్రము

వాగ్బంధనము చేయ గల మంత్రము.

"తనబుద్ధి బొంక నేరనిపంకజాక్షికి, ధవునివాకట్టుమంత్రంబు గాఁగ."
శుక. 1.518.
చూ. కనుకట్టు విద్య.

వాకట్టు మందులు

వ్యతిరేకంగా మాటలాడ నీయకుండా పెట్టేమందులు. ఇళ్లే మరులు గొల్పుట కూడా మందులు పెట్టడం, వానిని మరులుమందు అనడం అల వాటు. వీనినే సంస్కృతంలో వశీకరణౌషధాలు అంటారు.

"పులుల వాకట్టు మందులు పాము బదనిక, ల్వాదుగు చేపుడు మంత్ర ములును గోడె..." శుక. 2.546

వాకట్టువేరు

పాములను వశపఱచుకొను మూలిక.

వేంక శేళ. 56.

వాకాటులు

వాగ్వాదములు.

కొట్లాటలోని కాటు, వాయి లోని వా కలిసి ఏర్పడిన పలుకుబడి.

"నాకౌకః ప్రత్యనీక నాయకమునులున్, వాకాటులకుం జొచ్చిరి."
భీమ. 4.183.

వాకిట వుండు

ముట్టగు.

ముట్టయినప్పుడు బయట ఉండుటపై వచ్చిన పలుకు బడి.

"మా ఆవిడ వాకిట ఉంది. చేయి కాల్చు కోక తప్ప లేదు." వా.

వాక్రువ్వ బొగడగ వశము కాదు

చెప్ప శక్యం కాదు.

పండితా. ప్రథ. పురా. పుట. 330.

వాకొను

చెప్పు.

"కౌశికుఁడు, వసుధ మించిన కథ వాకొంటి నీకు."
వర. రా. బా. పు. 196. పంక్తి. 9.

వాకోవాక్యములు

మాటలు పెంచుకొనుటలు, మాట మీద మాట అనుటలు.

"వాకోవాక్యమ్ముల వెడ, వాకాట్లుం బల్యజంబు వలవదు సేయఁగ."
శివ. 4.70.

**వాగె బట్టు**

కళ్లెము పట్టు.

"హయము క్రేళ్లుఱుకునో యని రెండు గడలందు, వాగెఁ బట్టిరి మత్స్యవత్స పతులు." కళా. 7.72

**వాగ్ఝరి**

వాక్ప్రవాహము.

ప్రవాహమువలె మిక్కిలి ఉరవడిగా వచ్చు మాటల ధోరణి.

**వాగ్ధాటి**

వేగముగా మాటలాడు నేర్పు.

"ఆయనకు మంచి వాగ్ధాటి ఉంది. ఎంతవాళ్లైనా దానికి ముగ్ధులయి తీరవలసిందే." వా.

**వాచఱచు**

1. ఆక్రోశించు

"కావు మంచు వాచఱచినవాని"

భాగ. స్క. 1.155.

2. నోరు కొట్టుకొను.

'నెత్తీ నోరూ కొట్టుకుంటూ,' అని వాడుక. దుఃఖంలో తల, నోరు, రొమ్ము కొట్టుకొంటారు.

"హా చెడితిని గదే యయ్యో నే ననుచు, వాచఱచుచు వచ్చి."

పండితా. ప్రథ. పురా. పుట. 418.

**వాచవికందువలు**

రుచికరములు.

"అందందు వాచవికందువ లగుగుండె, కాయ లన్నియు నూరుఁగాయలుగను."

సింహా. 1.159.

**వాచవి యగు**

రుచి యగు.

"వాచవి యైనగడ్డిఁ దిని."

భాగ. స్క. 1.420.

**వాచామగోచరుడు**

భగవంతుడు.

అనిర్వర్ణనీయము.

"వాచామగోచరుఁ డని నీపాదంబులకు వందన మొనరించితిఁ బార్థసారథి కరుణాపయోనిధీ!" దీక్షితకృతి.

**వాచి పోవు**

వేకారు, అత్యాశ పడు.

"వాళ్లు అన్నంనీళ్లకే వాచి పోయి ఉన్నారు." వా.

**వాజకూత**

వెధవకూత.

గీర. లోకా. 24.

**వాజమ్మ**

అమాయకుడు, చవట.

నా. మా. 73.

**వాటము**

వీలు.

"దోఁచుకో, నిక్కడ వాట మంచు మది నెంచఁగ" కా. మా. 4.66

లక్షణయా అనుకూలముగా నున్నది అనేఅర్థాలలో పలు రకాలుగా దీనిని ఉపయోగిస్తారు.

"ఇది చాలా వాటంగా ఉంది." వా.

"మగడు ఊరికి వెళ్లాడు. ఆమెకు తిరగడానికి బాగా వాటం దొరికింది." వా.

"ఇలా రా. ఆవైపున నిల్చుంటే నీకు చేతివాటం చిక్కదు." వా.

"ఈవగలు బాగా వాటంగా వున్నాయి. వా.

## వాటుగాలు

ఈడ్పుకాలు.

ఒక కాలు పొడవు తక్కువ కాగా నడచునప్పుడు కాలు ఈడ్చి నడుస్తారు. అలాంటి కాలిని 'వాటుగాలు' అంటారు.

"నరవెంద్రుఁ డు కన రాదు నాఁ డెల్ల జగడించు, వాటుగా లన రాదు చేటుఁ దెచ్చు." శుక. 3.21.

గౌర. హరి. ద్వి. 1087.

## వాడకోడికి ఆదివారమా?

దానికి వేళా పాళా లేదు.

వాడకోడి అంటే యెవరికీ చెందనిది.

వేంకశేశ. 74.

## వాడని వనము

నిత్యనూతనముగా నుండునది.

"ఈడనే... నీ మహిమ వాడనివనములవలెఁ జిగిరించీని."

తాళ్ల. సం. 8.224.

## వాడవారి మఱది

స్త్రీలంపటుడు.

వాడవదినె లాంటిది.

"ఎవ్వరోయి! వదినెలు నీకు వాడవారి మఱఁది." తాళ్ల. సం. 12.322.

చూ. వాడవదినె.

## వాడికై కలుగు

ఉపయోగములో ఉండు.

మూల బడ వేయుటకు వ్యతిరేక మైనపదం. ఏదైనా ఉపయోగించక పోతే మాసిపోవడం, వాడుకలో ఉంటే బాగుండడం సహజం.

"ఈత విడిచిన మేదిఁగ యింత నయము, గలిగి యున్నది వాడికై గలిగనేని, నెంత నవక మై యుండునో."

కుమా. 7.7.

## వాడి దంతా సట్టం

అత నేదో 'ఇలా చేయాలి, అలా చేయాలి' అని నీతులు చెబుతాడు. అనవసర మైన నియమాలూ, నిర్బంధాలూ పెడతాడు అనేఅర్థంలో ఉపయోగించేపలుకుబడి.

"వాడి దంతా సట్టం లే - లేస్తే శాస్త్రం, కూర్చుంటే శాస్త్రం. వాడిష్టప్రకారం జరగా లంటే, మహారాజు లయితే తప్ప సాధ్యం కాదు. వా.

ఇందులోని 'సట్టం' చట్టమే.

## వాడి మిగులు

1. పరాక్రమ మతిశయించు.

"వాఁ డింతవాఁ డయ్యె వాఁడి మిగిలి." హర. 3.18.

2. పరాక్రమవంతు డగు.

"తత్ప్రియసఖుండు చండబాహుం డనువాఁడు వాఁడి మిగిలి యాగ్యయంగపతితోడఁ దలపడియె."

కళా. 8.129.

వాడి వత్తలగు

పూర్తిగా వాడి పోవు.

ఎండినవరుగులను 'వత్తల్' అని అరవంలో అంటారు.

"ఎన్ని భవంబులన్ గలుగు నిత్తుశరాసనసాయకవ్యథా, ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూఁది" మను. 2.57

'ఎండి వరుగై' అన్నపలుకుబడి మనకూ వున్నది.

వాడుక చెడు

అప్రతిష్ఠపాలగు.

గువ్వలచెన్న. 64.

వాడు దేరు

1. వాడు

"వాడుం దేరినపువ్వుమాలికలతో." శకుం. 3.61.

2. తేరుకొను.

"సీటను దేమ యొక్కఁ పసి నిల్చి యొకించుక వాడు దేఱి యప్పాటున దేరు వాఱి ధృతి పాటన మొప్పనతం డొనర్చన, ప్పాటునఁ జెన్ను మీఱి." విప్ర. 2.23.

వాడు దేర్చు

సేద దేర్చు,

"వదనగవ్వారముల వాడు దేర్చ." భాగ. స్క. 8.43.

వాడో నేనో

వాడైనా సరే నేనైనా సరే.

"వివేకింప వాఁడొ నే, నా నొకజాడఁ బోయెదము లే దా జీవ మిం తేటికిన్." శా. మా. 2.128.

"తప్పేదో జరిగింది. వాడైతే నేం? నేనైతే నేం? ఏదో తీర్మానానికి రావాలి." వా.

వాత క్రొవ్వులుక గుడుచు

బాగా తిను, చెడ తిను.

"ఉడుగక వాతఁ గ్రొవ్వులుకంగఁ గుడిచి."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 557.

నోటిలోనుండి తిన్న క్రొవ్వు బయటికి వచ్చునట్లు అని వాచ్యార్థము.

వాతన పొక్కు లెన్ను

మేలు చేసినవానినే తప్పులు పట్టు.

"పొసఁగు నావాతన పొక్కు లెన్నితివి." గౌ. హరి. ద్వితీ. పంక్తి.889.

'తిన్న యింటి వాసాలు లెక్క పెట్టు' వంటిది.

వా తప్పక

మాట తప్పక.

"మధుమథనుఁడు వాతప్పక యవ్వీరవర్మ తల పాదమునన్ గుప్పనఁ దన్నిన." జైమి. 8.27.

వాతప్పు

మాటతప్పు.

"నుడితప్పు వాతప్పు నుసలక సత్య, మెడలింపఁ గనిపెట్టు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 193.

వాతిపాతిక

శవము నోట పెట్టుకాసు.

అది కాటికాపరికి చెందుతుంది.

"వల నొప్ప నొకమాడ వాతిపాతి కయు."
గౌర. హరి. ద్వితీ. పంక్తి. 1612.

వాద మిప్పించు
వాదము జరుగునట్లు ఏర్పాటు చేయించు.
"వారికి మాకును వాద మిప్పింపు."
పండితా. ప్రథ. వాద. పుట. 505.

వాదాడు
కలహించు.
"పోవ జూచినఁ దిట్టి పోదు రి దేల వా, దాడఁ జాల మటంచు నాస గొలిపి." శుక. 4.7.

వాదుకు బట్టు
కలహమున కీడ్చు.
"శరాసనంబులన్,వాదుకుఁ బట్టి కన్బొమలవై ఖరి వంకలు తీరుచున్." విజయ. 1.134.

వాదు పూను
వివాదపడు.
"మదీయోల్లస, ద్దానప్రౌఢిని వాదుఁ బూని గెలుతుఁ గర్వోన్నతుం దుంబురున్." కళా. 2.66.

వా దొనర్చు
కలహించు.
"అతఁడు తనసతు లిద్దఱు నహరహంబు, వా దొనర్చుట సైఁపక వలపుఁ గులుకు." హంస. 3.129.
చూ. వాదు సేయు, వాదు లాడు.

వాద్యముల్ కూర్చు
వాద్యములను వాయించు. 'శ్రుతి సేయు' అంటే చక్కగా అతుకుతుంది.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 305.

వానకాఱులు
వర్ష ధారలు.
"అచ్చపురమున, రాలు లన నెల్లదెస వానకాఱు లమరె." కుమా. 6.97.

వానకొట్టు
వర్ష ధాటి.
"అప్పు డవ్వానకొట్టున నలికి యలికి." హంస. 5.63.

వానవంగుళ్లు
వాన, వంగడి. జం.
"వర్షరుపునయందు వానవంగుళ్లలోఁ, బ్రాణేశుఁ డెపుడు కన్పట్టు చుండ." దేవీ. 9.497.

వాన వఱ్ఱులు
క్షణభంగురములు, అనిత్యములు.
వాన వచ్చినప్పుడు పారే వాగులు.
వఱ్ఱు=వంక–వఱద–ప్రంత...
అలాంటి వఱదనీరు వెంటనే తగ్గి పోతుంది. నిలువదు.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.

వాని అన్న
అంతకు మించినవాడు అనుట.
ఏహ్యార్థంలోనే అలవాటు.
"ఆ అంగడివాడు మోసం చేశాడు కదా అని వీడిదగ్గిరికి పోతే వీడు వాడి అన్న." వా.

వాని తలనే పుట్టినదా ?
అదంతా అతనిదేనా ఏమిటి? వాని నెత్తినే పొద్దు పొడిచిందా? అన్నట్లు.

"ధరఁ బుట్టెనే భక్తి సిరియాలు తలనెక్?" బసవ. ఆ. 4.

## వాపోవు

విలపించు.

"కూయిడు మొర యిడుఁ బలుమఱు, వాయుడుపక చీరు నేడ్చు వడి వాపో వున్." కుమా. 5.68.

## వాయపు రజ్జులు

వట్టి మాటలు, మాయ మాటలు.

"వాయపురజ్జు లేల మునివల్లభ! వృద్ధుఁడ నొండెఁ గావు..." మార్కం. 4.217.

## వాయి విడిచి యేడ్చు

గొంతెత్తి యేడ్చు.

గట్టిగా అనుట.

"వాయి విడిచి యేడ్చుచు.".

పండితా. ద్వితీ. మహి. పుట. 163.

## వాయుడుపక చీఱు

నోరు మూత పడకుండా పిలుచు, ఆపకుండా పిలుచు.

"కూయిడు మొర యిడుఁ బలుమఱు, వాయుడుపక చీరు..." కుమా. 5.68.

## వాయువు బట్ట నేర్చు

గాలిని పట్టుకో గల్గు.

అసంభవములను సంభవము లొనర్చు నేర్పు గలవా రని నిరసనసూచకంగా అను టలో ఉపయుక్త మయ్యే పలుకుబడి.

పండితా. ప్రథ. పురా. పుట. 359.

## వాయోడక

ఏమాత్రమూ నోరు తగ్గించు కొనక.

"ఔ,రా యంచు నత్తవగి నెల, వాయో డక కసరుఁ బోరు వారలతోడన్." శుక. 3.347.

## వార పట్టు

కొలుచు.

"వార్ధు లొకృమ్మడి వార పట్ట." జైమి. 5.3.

## వారపత్తు భూమి

పన్ను కట్ట వలసినభూమి.

కాశీయా. 229.

## వారబియ్య మెత్తు

భిక్షాటనము చేయు.

"వారబియ్య మెత్తి యెత్తి వడ దాఁకి. తాళ్ల. సం. 6.70.

## వారవట్టు

1. కుండకు చేతి నానించి ధారగా కింద పడుతుండగా పొడవుగా పోయు.

2. దేవతా విగ్రహాదులకు ముందు భక్తిసూచకంగా ధారగా నీళ్లు వదలు.

"గొల్లవారి కడవల,పా లెల్ల వంచుకొని దోసిట వార వట్టువాడు. తాళ్ల. సం. 4.43.

## వారవారము

ప్రతి వారము.

"వారవార,మును దప్పకుండ...భవునిఁ బూజింపుచు."

పండితా. ద్వితీ. మహి. పుట. 115.

వార్ధక మొత్తు

వృద్ధాప్యము వచ్చు.

"వార్ధకం బొత్తినది లావు వయసు నాకు." జైమి. 2.64

వార్మణి

కౌస్తుభము.

"వార్మణిధారి." పాండు 5.25.

వార్చి యుండు

వేచి యుండు.

ఏ కర్మాచరణకైనా తొలుతగా 'అప ఉపస్పృశ్య' అని నీరు స్పృశించడం, ఆచమించడం విధాయకం. దానిపై వచ్చినపలుకుబడి.

వార్చి తమ చేతిపనికై ఎదురు చూచుచుండె ననురీతిగా ఏర్పడినది.

"పతి వ్రతంబు నణఁప వార్చి యుండె." పాండు. 5.241.

వారు వీ రనక

ప్రతివారు.

ఒకరిని వదలి పెట్టకుండ అందరూ అనుట.

ఇది వాడుకలో కూడ ఉన్నది. 'ఆ ఉత్సవంలో ఆ ఊరి వా రందరూ వారూ వీ రనక పాల్గొన్నారు.

"అందును వారు వీ రనక యందఱు ధర్మధురీణు లైనవా, రందఱు శుద్ధ భాగవతు లందఱు..." కళా. 1.127.

"తూణీరములఁ ద్రుంచి దొరల గీ టణఁచి, వారు వీ రన కెల్లవారి కాయముల." ద్విప. కల్యా. పు. 79.

వార్చు

1. ఉత్తరాపోశనము చేయు. భోజనానికి ముందు ఆపోశనం తీసుకొని భోజనం ఉపక్రమించినట్లే భోజనానంతరం ఆపోశనం తీసుకొను.

దానిని ఉత్తరాపోశన మనుట ఆచారము.

"భుజించి యతండు వార్చి" పాండు. 3.28.

2. హస్తప్రక్షాళనము చేయు.

వాఱ దెఱచు

కొలదిగా తెఱచు.

'వార వాకిలి వేసినారు' అని వాడుక.

'వారాక లేసినారు' అని రాయలసీమలో నేటికీ చాలా వాడుక.

"తలుపులు వాఱ దెఱచుడు."

పండితా. ప్రథ. పురా. పుట. 380.

వాలహీనవానరుడు

తోక లేని కోతి.

నేటిరూప మిది. అనగా కోతి చేష్టలు చేయువాడు. తోక ఒక్కటే లేదు కాని కోతి వంటివా డనుట.

గౌర. హరి. ద్వి. 998.

వాలుగన్నులు

అందమైన కండ్లు.

వాలుగా ఉన్న వనుట.

వావాత

నోరార.

చేసేత వంటిది.

"వావాత శ్రీ వెంకటాద్రి వరము లిచ్చేగనక, ఏవల దాతలలో నితఁడే దొడ్డు." తాళ్ల. సం. 9.122.

వా విడిచి

నోరార, దాచుకొనక.

"వెలిచితి వేని వావిడిచి నాతోడ, నెఱిఁగింపు."

వర. రా. బా. పు. 231. పంక్తి. 6.

"వా,విడిచి పొగడె దిట్లు వందివిధమున నతనిఁ." భార. కర్ణ. 2.99.

వా విడిచి యేడ్చు

బిగ్గరగా ఏడ్చు.

"ఇంత వావిడిచి యేడ్వ." జైమి. 7 53.

చూ. గొం తెత్తి.

వావి వరుస

జం.

"...వేశ్యాజనంబునకు వావి వరుస యెక్కడిది?" క్రీడాభి. 1.252.

చూ. వావివరుసలు లేమి.

వావివరుసలు లేమి

జం.

వివాహాదులకు తగిన బంధుత్వాదులను మనవారు నిర్ణయించారు. వానినే వరుస అంటారు. మేనత్తకొడుకుకు మేనమామ కూతురు వరుస. పిన్నమ్మకూతురు వరుస కాదు. ఈ నిషేధము నతిక్రమించి స్వేచ్ఛాసంచారులయినవారిని 'వావివరుసలు లేనివా' రంటారు.

"వనితలకు సరతసకల్మి వావి వరుస, లేమియును లేమి వారల కెలుకపలుప." కా. మా. 4.14.

"ఆ పిల్ల వరుస కాదమ్మా మావాడికి చేసుకోడానికి." వా.

"ఆ పిల్లవాడు మీకు వరసే గా. అడిగి చూడకూడదూ?" వా.

"వాడి కేమి వావా వరుసా? ఎంత చుట్టమయితే నేమి? ఆ పిల్ల వాడికి పిన్నమ్మవరస అవుతుంది. అయినా చేసుకున్నారు." వా.

వావిషము చినుకు

అనరాని మాట లను, అప్రియము లాడు.

"ఇట్టు లేల వావిషము చినుకుచు వంశనాశని వైతి." వర. రా. అయో. 293.18.

వాసన కట్టు

1. తలనొప్పికి ఉపశమనగా బట్ట తలకు కట్టుకొను.

"వాసెనకట్టు గట్టి నిడువాలిక కస్తురి పట్టు వెట్టి లో, గాసిలి చీకటింటికడఁ గంకటిపై..." పారి. ఆ. 1.

2. ఏదైనా వస్తువుల వాసన పోకుండా కుండలు, బిందెలు

మొదలగువాని మూతులకు బట్ట కట్టి పురి పెట్టు.

వాసికి మంగలకత్తి మ్రింగు

గొప్పకోసమని తనహానికే పాల్పడు.

వాడుకలోని రూపం 'పౌరుషానికి మంగలకత్తి మ్రింగు'. మంగలకత్తులు మింగితే పేగులు తెగిపోతా యని తెలిసి 'చూడు. నా తడాఖా' అన్నట్టు వానిని మ్రింగడం అంతే కదా!

"వ్యాససుతాదులం దలఁచి వాసికి మంగలకత్తి మ్రింగదు?"
పాండు. 5.230.

వాసి చెడు

న్యూనత యేర్పడు, గౌరవము చెడు.

"మఱఁదులు గాంచిన గఱకతి సెంతురు, వదిసె లెఱింగిన వాసి చెడును."
హంస. 1.125.

వాసి జెలగు

ఒప్పు, ప్రకాశించు.

"ఈవల నల రుక్మిణీరమణి వాసిఁ జెలంగఁగ సత్యభామయున్."
పారి. 1.42.

వాసి వట్టము లేక

హెచ్చు తక్కువలు లేక.

ఏ లోపమును లేక అనుట.

"వీరమాహేశ్వరాచారంబు వదలక, యేడువాడల వార మేము గలసి,వర్తిల్లుదుము వాసివట్ట మేమియు లేక..."
హరవి. 2.139.

వాసీ వంతూ

వన్నె. వాసి. జం.

"చేసినట్టే చేసుఁ గాక చింత మాకేలా, వాసీ వంతూ నాతనిదే వట్టిజాలి యేలా!"
తాళ్ల. సం. 8.91.

వాసులకు బెనగు

నే నెక్కువ నే నెక్కువ అని వాదించుకొను.

లక్షణయా వాసి అనగా ఎక్కువ అనుట – మేలిరకము. వన్నెలాంటిదే వాసి.

"ఆ సమయంబునఁ జీఁకటి, మాసిన తన ముదుకచీర మైకల నిగ్గుల్, వాసులకుఁ బెనఁగఁగా..."
శుక. 4.9.

వాసెనలు సుట్టు

వాసెనకట్టు కట్టు.

వాసన పోకుండా గుడ్డతో బిందెలకూ కడవలు బానలు వంటి వానికీ మూతులను బిగించు.

"పాదోదకములు గుంభములఁ, బట్టసభాసలిఁ బెట్టి వాసెనలు, సుట్టి."
పండితా. ప్రథ. పురా. పుట. 443.

వాళ్ల యిల్లు తొక్కి ఏడేళ్లు అయింది

'నా యింటికడప తొక్కితే వాడి పస ఎలాంటిదో తెలుస్తుంది.'

"ఇంక నీయింటిగడప తొక్కితే ఒట్టు."
వా.

## వాళ్ల వాళ్ల భాగ్యం

ఎవరి అదృష్టం వారిది.

"అదియు వారలు వారలు చేయు భాగ్యముంజేసి." నానా. 25.

## వింజం బా కిడినట్లు

అవధానంతో.

"...తన పలుకు లాస్థానం బెల్ల సావధానం,బగుచు వింజ మాఁ కిడినట్లు వినుచుండ నన్నశేంద్రచంద్రునకు నిట్లని చెప్పం దొడంగె" కళా. 5.9.

"లేకయ యన్యవిచారము, వే కొని తద్వశగచిత్తవృత్తియ వింజం, బాఁకిడినట్లు సభాస్థా, నీకము కనుఁగొనఁగఁ బోరి సెగడిరి వారల్." శ్రీవిద్యా. ఆ. 2.

## వింతలు సేయు

ఆశ్చర్యము కలిగించు, విచిత్రమగు.

"ఊర్వశీ! కవకవ నవ్వరే త్రిదశకాంతలు వింతలు సేయునాపనిన్." ఉ. హరి. 1.80.

"అంతటఁ బారిజాత కుసుమాగత నూతనదివ్యవాసనల్, వింతలు సేయఁ దావి యిది విస్మయ మంచు." పారి. 1.110.

## వింత లేని యావులింత గలదా?

కారణము లేని కార్యముండునా?

"మేలు దెలిసికొంటి వాళీశిరోమణి! వింత లేనియావులింత గలదె?, చెలియ! తెలియ వినుము చిత్తదౌర్బల్యంబు, దీఁటఁ గలతెఱంగుఁ దేటపఱుతు." శకుం. 2.87.

## వింతవిందు లగు

విచిత్రబంధువు లగు.

ఇది కూడా ఉపమావాచకమే.

"జడగొప్పలోను నిచ్చపు సజ్జికములైన, విరవాదులకు వింత విందు లగుచు." ఉ. హరి. 1.151.

## విం దిచ్చు

విందు సేయు, పండుగ భోజనం పెట్టు.

"సిద్ధులకు నానందించి, విం దిచ్చి." కుమా. 9.128.

## విందు పెట్టు

పండుగ చేయు.

"వంతు గలయంగ బువ్వంపు బంతి విందు, పెట్టి రెలమిఁ జకోరపుఁ బేరటాండ్రు." పారి. 2.49.

చూ. పండుగ చేయు.

## విందులు విందులు

చిన్నపిల్లలను ఎత్తుకొనుటకై రమ్మని పిలుచునపుడు అనేమాటగా కాన వస్తుంది.

"విందులు విందు లంచుఁ దను వేడుక నెత్తుకొనంగ..." కళా. 6.201

## విందు వచ్చు

అతిథియై వచ్చు.

"ఇందుధరుండు మన మందిరమునకు విందు వచ్చినాఁడు." హర. 1.19.

## విందు సేయు

ఆహుతి చేయు, ఆహారముగా నిడు.

"పృథివీతనయుం దనయుగ్రచక్ర, వి
క్రాంతికి విందు సేసె."
ఉ. హరి. 1.176.

## వింధ్య మా కిడినట్లు

అవధానంతో, హెచ్చరికతో.

"అరణిసంగ్రహ మొనరించి యజుని
పట్టి, పెద్దకొలు వుండె ముత్యాలగద్దె
యెక్కి, చుట్టు బలిసి కూర్చుండిరి
సురలు మునులు, వింధ్య మాఁ కిడిన
ట్లుండె విశ్వసభయు." కాశీ. 7.55.
చూ. వింజ మా కిడినట్లు.

## వికల్పము చేయు

పని చెఱుచు, విరుద్ధముగా
చేయు.

"అక్కట! పదివేల కమ్మక వికల్పము
చేసితివి." సింహా. 1.262.

## వికారంబు పుట్టు

వ్యతీకారము కలుగు, వ్యతి
రేకముగా జరుగు.
హర. 4.50.

## వికార పెట్టు

కడుపులో త్రిప్పు – పైత్యో
ద్రేకము వగైరాల వల్ల.
ఇదే 'కడుపులో వికారంగా
ఉంది' అని కూడా వాడ
తారు.
పైత్యవికారం అన్న
వైద్యుల మాటనుబట్టి వచ్చి
నది కా వచ్చును.

"పరగడుపున ఎండలోకి పోయి పని
చేశాను. ఏదో కడుపులో వికార
పెట్టుతూ ఉంది." వా.

## వికావిక నగవులు

ధ్వన్యనుకరణము.

"పొగరు వికావిక నగవులు బెళకించు
కనుసన్న నేర్పులు కలికికతలు.
హంస. 5.27.

## విక్రమంబులు పేర్చు

పరాక్రమము చూపు.

"శాబరబలసమూహంబు పొంగు
వాటియు నొండొరులం జీరియుఁ
దెఱలు చుట్టియు విక్రమంబులు
పేర్చియు." రుక్మాం. 3.84.

## విక్రయం బార్చు

అమ్ము, విక్రయించు.

"అనయంబు నతులఘోరాటవి కేఁగి,
ఘనతరంబుగ మోచి కట్టెలు దెచ్చి,
యంగడి విక్రయం బార్చి..."
బస. 5.132.

## విగ్రహపుష్టి

ఒడ్డూ పొడుగూ అయిన
ఆకారం. దీన్ని నిరసనలోనే
ఉపయోగిస్తారు.

"విగ్రహపుష్టే కాని వాడికి పొట్ట
పొడిస్తే అక్షరం లేదు." వా.
"విగ్రహపుష్టి నైవేద్యనష్టి" వా.
చూ. ఆకారపుష్టి.

## విచారణ చేయు

చర్చించు.

"కోర్టులో ఆ కేసు విచారణ జరుగుతూ
ఉంది." వా.
"కోర్టులో ఆ కేసు విచారణ
చేస్తున్నారు." వా.

## విచారము చేయు

సమాలోచించు.

"విశ్వనాథుం డొకనాఁడు శైలసుత తోడ విచారము చేసె."
కాశీ. 5.14.

"విచారము చేసినకొద్దీ ప్రపంచం నశ్వరం బ్రహ్మసత్య మని తేలు తుంది." వా.

చూ. విచారణ చేయు.

## విచారించు

1. కుశల మడుగు.

2. వాకబు చేయు.

ఇది పై రెండు అర్థాలలో రాయలసీమలో ఎక్కువగా ఉపయోగిస్తారు.

"ఆవూరికి పోతున్నావు. మా అక్కా వాళ్లూ ఎలా ఉన్నారో కాస్త విచారించి రా." వా.

"నా కాపుస్తకం కావాలి. మీ ఊళ్లో దొరుకుతుం దేమో విచారించి వెంటనే రాయి." వా.

## విచారించే నాథుడు

న్యాయం జరిగేట్టు చూచే వాడు.

"నట్టనడి ఊళ్లో ఆ యింటివాళ్లు దిబ్బ వేస్తే ఈ ఊళ్లో ఏమీ అని విచారించే నాథుడు లేడు. వా.

## విచ్చన విడి

విచ్చల విడిగా.

"జలజాయతాక్షి విచ్చనవిడిని దను మఱచి." తాళ్ల. సం. 4.29.

## విచ్చలవిడిగా

యథేచ్ఛముగా.

హర. 5.57.

"వాడు ఊరంతా విచ్చలవిడిగా తిరుగుతున్నాడు." వా.

"పిల్లల నింత విచ్చలవిడిగా వదిలేస్తే ఎందుకు పని కొస్తారు?" వా.

## విచ్చి పాఱు

విఱిగి పాఱు.

"ప్రళయకాలవరాహాంబుపగిది హెచ్చు, వచ్చి నిలిచెను బ్రజ లెల్ల విచ్చి పాఱ." వా.

## విచ్చిల్లు

వికసించు, విచ్చుకొను.

"చిలివిలి వోవు మచ్చికలు విచ్చిల్ల."
పండితా. ద్వితీ. మహి. పుట. 133.

## విచ్చుమొగ్గగు

గుంపు చెదరు.

"క్రమ బ్బాకయింతయు విప్ప విచ్చు మొగ్గయి మఱి పాసి పోదురు."
ఆము. 4.131.

## విజయం చేయు

వచ్చు.

గొప్పవారి రాకలోనే ఉపయోగం దీనికి. వెక్కి రింతలో మాత్రమే ఇతరుల యెడ ఉపయుక్త మవుతుంది.

"దేవా! లగ్నం బాసన్నం బయ్యె విజయం చేయుఁ డనిన."
కుమా. 9.27.

"నరి సల్పెఁగ విజయం చేసినాఁడ."
పండితా. ప్రథ. పురా. పుట. 468.

"రాజుగారు విజయం చేసినారు." వా.

వాడుకలో—

'మహారాజు విజయం చేసి నారు.' రాజులతో పాటు

ఈమాట వాడుకలో మరుగు పడుతున్నట్లున్నది.

చూ. వేంచేయు.

విజ్జు విజ్జున దన్ను

చిటుక తన్ను.

తన్నుటలోని ధ్వన్యనుకరణము.

"విజ్జు విజ్జునఁ దన్నుంగ విడువ కెలమిఁ, గఱకుటంఘ్రుల నిఱికించి గజ్జె గదల." మను. 4.58.

విజ్జోడు పడు

జతలు మారు.

"స్త్రీ పురుషత్వంబులు మారలే మితడుఁ బాటుననో విజ్జోడు పడఁ గల్పించి..." కళా. 5.46.

విజ్ఞానపత్రిక

విన్నపము, అర్జీ.

"...వినయపూర్వకంబుగా విత్తాధిపతికి విజ్ఞానపత్రిక లిఖియించి" మను. 5.55.

విటతాటంబులు

"మొగ్గరంబులు నుగ్గునూచంబు గాన తికి విటతాటంబు లైన ఖేదంబులును." జైమి. 5.20.

చూ. విటతాటనము లగు.

విటతాటనముగా

ఛిన్నాభిన్నముగా.

"విటతాటనములు గా విఱిగి చక్రములతో." జైమి. 2.78.

విటతాట మగు

ఛిన్నాభిన్న మగు.

"తరువు లెల్లెడ విటతాటంబులై కూలె, గ్రహతారకావళి కాంతి మాసె." భాగ. స్కం. 3.

విటతాట మాడు

చెడగొట్టు, పాడు చేయు.

"వెస జైనప్రతిమల విటతాట మాడి." బస. 6.151.

విటతాట మార్చు

పరిమార్చు, చెల్లాచెదరు చేయు.

"విద్వేషవాదుల విటతాట మార్చి." బస. 6.168.

విడగ నాడు

తూల నాడు.

"అప్పటి కప్పటికిన్ విడఁగ నాడుదు రాడిన నేమి." రుక్మా. 1.21.

"అనుచు విడఁగ నాడి యాప్రాద్ద తనపుట్టి, నింటి కరుగు." రుక్మాం. 4.133.

విడ దన్ను

విడ నాడు, విడునట్లు తన్ను.

"దుర్వాసనలఁ బెట్టు దోసఁగులు విడఁ దన్ని." పాండు. 2.85.

విడాకు లిచ్చు

భార్యాభర్తలు తెగదెంపులు చేసుకొను.

మాటా. 86.

విడికచ్చతో నుండు

గోచీ పెట్టుకొనకుండు.

ఇది వైదికదృష్టిలో అనాచారసూచకము.

"విడికచ్చతో నుండు విడువకెపుడు." కాశీ. 6.46.

విడిచిన

(మగని) వదలి పెట్టిన.

'అది విడిచిన ముండ. దానితో ఎవరు మాట్లాడు తారు?'

ఇది తిట్టుగా మాటి కేవలము గయ్యాళి, దుష్టురాలు, అనుఅర్థాలలో ఉపయుక్త మవుతూ ఉంటుంది.

చూ. విడిచి వేసిన.

విడిచి వేసిన

మగని వదలి పెట్టిన.

"అంత విడిచి వేసినదానితో ఎవరు మాట్లాడుతారు? అది నోటికి వచ్చినట్లు వాగుతుంది." వా.

ఇది కూడా 'విడిచిన' వలెనే తిట్టుగా మాటినది.

చూ. విడిచిన.

విడిపట్టు

విడిది.

"అమరవిభుండు సేరి వినయానతుఁ డై విడిపట్టు వైజయం, తమునను జితగింపుమన." పారి. 3.40.

విడిమట్టు

విడిది సేయుస్థలము.

స్థాన మనుట.

"చిత్తనైర్మల్యసంస్థితికిని విడిమట్టు." విప్ర. 1.84.

విడిసి యుండు

విడిది చేసి యుండు.

"విరజ యనుసింధు వెచ్చోట విడిసి యుండు." పాండు. 2.227.

(వెంద్రుకలు) విడుచు

విప్పు.

"తమ్మని, కంతఃబంధంబు విడిచి." పాండు. 3.29.

(సతుల) విడుచు

త్యజించు, సంబంధము త్రెంచుకొను.

వాడుకలో మిగతవానివలె కాక భార్యలవిషయంలో ప్రత్యేకార్థంతో ఉపయుక్త మవుతూ ఉంటుంది. ఈ ప్రయోగంలో కూడా ఇంతే.

"విడువ వచ్చునె సతు లెంత వెఱులైన." జైమి. 4.90.

ఇక్కడ 'విడుచు' పూర్తిగా పరిత్యజించుట, సంబంధము త్రెంచుకొనుట.

వాడుకలో 'వాడు భార్యను విడిచి పెట్టినాడు.'

'మగడు విడిచినముండ, మబ్బు విడిచినయెండ' 'విడిచినముండ వీధికి పెద్ద'—లో 'విడుచు'కు మగణ్ణి విడుచు అనే అర్థం.

చూ. విడిచి వేసిన, విడిచిన.

విడువని వేలము

తగనిది, అంతు లేనిది.

"పౌరాణికులు చేరి పచరించు కుహ్కవా, చాలత విడువని వేల మెపుడు." కళా. 7.19.

"విడువని వేల మై కురియుచు వెన్నెల చిచ్చున కేమి సేయుదుఁ." కవిక. 4.146.

**విడువ ముడువ గలుగు**

సంపన్ను డగు.

ఖర్చు పెట్టుటకు, కూడ బెట్టుటకు ఉన్నవా డనుట.

"పరదేశం బెఱఁగక తగు, గరగరికఁ
విడువ ముడువఁ గలిగి నడుచుఁ జే,
దఱికమును పాటిలి తిరియం, దిరిగిన నను
బోటి కమరునే యింతైనన్."

పంచ. వేం. పు. 292.

**విడె మిచ్చు**

తాంబూల మిచ్చు.

ఏ దైనా పనికి ఒకరిని నియోగించు నప్పుడూ, ఒక యేర్పాటు చేసుకొన్న ప్పుడూ తాంబూలా లిచ్చుకోవడం పరిపాటి. తాంబూల మిచ్చుట ఆ కార్య ము చేయు మని కోరుటను, పుచ్చుకొనుట ఆ పనిని నేను చేసెద నని ఒప్పుకొనుటనూ సూచిస్తుంది.

"అనిన మన సిచ్చి మదిలోన హర్ష
మెచ్చి, మంత్రసానికి విడె మిచ్చి
మమతతోడ." హంస. 2.45.

చూ. తాంబూలము గైకొను.

**విడెము సేయు**

తాంబూలము వేసికొను.

"...రుమాలు గట్టి దుప్పటి వలె
వాటుగ వైచి విడెము సేయుచు, సొగ
సుట్టివడంగ వతదు సొంపు జనిం
పఁ." హంస. 5.141.

**వితవితగ**

వృథాగా.

"వారితో నది యో యన్నలార!
కంటి, రా వితవితగ న న్నింత ఋట్టు
సేసి..." శుక. 2.138.

**వి త్తడగగా**

దుంపనాశన మగునట్లుగా.

"సీ, వేడిమి నూపి యూథపుల వి త్తడఁ
గన్ దును మాడి."

భాస్క. యుద్ధ. 734.

**విత్తుమీదటి పొల్లు**

అస్థిరము.

తాళ్ల. సం. 11.3 భా. 116.

**విత్తుమొదలు**

మూలకందము.

"అవిద్య యనుమహాతరువు ను, త్పత్తి
కీద్వయంబు విత్తుమొదలు."

ఆము. 3.66.

**విత్తు లల్కు**

వి త్తనాలు చల్లు.

"విత్తు లల్కకయ చేను పండించె."

బస. 7.205.

**విదిక్కు పడు**

దిగ్భ్రాంతు డగు.

"విదిక్కు పడుచు." సింహా. 4.70.

**విదిలించి పార వేయు**

ఝాడించి పార వేయు.

కొత్త. 117.

**విద్దె లాడు**

దంభోక్తు లాడు.

ప్రగల్భము లాడు, స్వోత్కర్ష చెప్పుకొను.

"విద్దె లాడుచు నున్నద్విజులతో."
బస. 7.184.

"విద్దె లాడక యూరు వెడలుండీ."
బస. 7.185.

"అద్దిరా భళనని యతఁగొడెతనము, విద్దె లాడుట గాక? విందుమే తొల్లి, విపరీత మిందఱు వినఁ బలికింతుఁ, ద్రిపురారినను నెల్ల..." బస. 5.127.

విధము చెడు

తప్పుదారి పట్టు.
కొత్త. 101.

విధి విరామము లేక

నిర్విరామంగా.

"విధివిరామము లేక వేశ్యకాంతలఁ గూడు, శ్రీనాథకవి కేమి చేటు మూడె." శ్రవ. 2.37.

వినని కనని

అరుదైన.

"మహాత్ములారా! మీరు వినని కనని కార్యంబులు ముల్లోకంబుల నెవ్వియు లేవు." హంస. 1.49.

వినబాటు

విన్నబాటు, విచారము, దిగులు.
భీమ. 4,99.

వినికికి మిగులు

శ్రవణేంద్రియాతీతమైన, అగోచరమైన.

ఎప్పుడూ వినని అని భావార్థం.

"వినికికి మిగిలినవేషంబువాండ్రు."
బస. 6.161.

వినికి గలవాడు

పెద్దలవద్దఱ మంచీ చెడ్డా విన్నవాడు.

"మిక్కిలి వినుకలు గలవాఁడవు."
భాగ. స్క. 1.112.

వినికి సేయు

వినిపించు.

"నేఁడు కృష్ణాజి కవితల నేర్పు మెఱసి, వినికి సేయుట యెల్ల మీ ఘనతఁ గాదె" రాజగో. 1.30.

విని చెవుడును కని గ్రుడ్డియు

చెవు లుండి వినని వాడు, కన్ను లుండి చూడనివాడు. అధికారగర్వితు డనుట.

"తనవారి నెఱుఁగ రెవ్వరి, నెనయరు వాక్యములు కడు విహీనస్వరముల్, విని చెవుడును గని గ్రుడ్డియు, జననాథుల కెల్ల నివియు సహజ గుణంబుల్." కుచే. 2.28.

వినినంత వట్టు

వినిన దంతయు-పూర్తిగా.

"బహుసంపదారిఫలము, దాను వినినంతవట్టొకింతయును విడక."
కళా. 4.176.

వినినట్లు చెప్పు

యథారీతిగా చెప్పు.

"...దాను జారుని, వలనన్ వినినట్ల చెప్పి వాసవుఁ డంతన్."
కళా. 2.178.

వినియు వినములుగా జేసుకొను

వినీ విననట్లు పోవు.

"అవల నివలను గుసగుసల్ సవసవలుఁగ,
వినియు వినములుగాఁ జేసికొనుచు."
రాధా. పు. 1.9.

విని వినని....చందంబున

నేటి వాడుకరూపం 'వినీ విన
నట్లు.'

ఏ దైనా చెప్పుతున్నప్పుడు
ఇష్టం లేక తాను పరధ్యా
నంగా ఉన్నట్లు నటించే
పట్టుల ఉపయోగించేపలుకు
బడి.

"విని విననివాని చందం,బున గీటునఁ
బుచ్చి." జైమి. 8.39.

"నే నింతగా చెపుతూ వుంటే వాడు
వినీ విననట్లు ఊరుకున్నాడు."

వినీ వినన ట్లుండు

తనకు పట్లన ట్లుండు.

"పెద్దవాళ్లు పిల్లవాళ్ల మాటలు వినీ
విననట్లు ఉంటేనే గౌరవం."
వా.

వినీ వినమిని

వినీ వినక ముందే, విన్నదే
తడవుగా.

"నియమితదుందుభిధ్వని వినీవినమిం
బురిలోని సైనికుల్."
జైమి. 4.116.

వినుకలి బేటము

వినగా కలిగిన ప్రేమ, విను
కలి.

"ప్రీతిని వినుకలి బేటంబు గొని
యున్న, కెలఁదుల బేటంబు వృథయ
కాఁగ." కుమా. 5.74.

వినుతికి నెక్కు

పేరు కెక్కు.

"వినుతికి నెక్కు సద్గతియు నీదయఁ
జేకుఱఁ జేయు."
భార. భీష్మ. 3.267.

వినుతి కెక్కు

ప్రసిద్ధి చెందు.

"వనిత లారామములు గల్గి వినుతి
కెక్కు, భూమిరత్నంబు నైషధపుర
వరంబు." హంస. 1.24.

వినుతి సేయు

పొగడు.

"అని వినుతి సేయుజననీజనకుల."
నిరంకు. 4.131.

విన్న బోవు

విన్నబాటు నొందు,
దైన్యము చెందు.

"వేదములు నాగమంబులు విన్నఁ
బోయె" కాశీ. 6.86.

విన్న వినుకులు

చెప్పుడుమాటలు.

"విన్నవినుకులకు వెఱచేనా."
తాళ్ల. 1.19.

విన్నావో వినవో

'విన్నావో లేదో కాని' అని
నేటి రూపము.

'నీవు వినే ఉండాలి' అన్న
ధ్వనితో ఈమాట అనడం
అలవాటు. ఇలాంటివే
'తెలుసో, తెలీదో' 'చూచా
వో లేదో' ఇత్యాదులు.

"విన్నావో వినవో నీతి సమున్నతు
లడిగించుకొనఁగ నొప్ప నివి ధరన్
...అన్నారు." నిరం. 3.25.
"విన్నావో లేదో కాని నీ మిత్రుడు
ఈ ఊళ్లో చాలా చాలా చేశా డట."
వా.

## విన్న మన్నను నొకటిగా

విపరీతముగా అనుట. భూమ్యాకాశము లొక్క టగునట్లుగా.

"విన్న మన్నను నొకటిగా వృష్టి
బలసె. ఆము. 4.91.

## విప్పి చెప్పు

వివరించు.

"చెచ్చెరఁ గల విప్పి చెప్పెద."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 770.

వాడుకలో—'విడమర్చి చెప్పు' అన్నట్లే విన వస్తుంది.

## విప్పు వారు

విడబారు.

"కలలమై విప్పు వారుచుఁ గరుడు
గట్టి." శకుం. 2.144.

## విప్రవృశ్చికము

బాపనతేలు, కుటిలు డనుట.

"వీఁ డొక్క తెరబొమ్మ విప్రవృశ్చి
కము." గౌర. హరి. ద్వి. 930.
చూ. బాపనతేలు.

## విభాగము తీఱక

వంతు పోక.

"తమవిభాగముల్ దీఱక."
సింహా. 9.94.

## విభూతి గైకొను

భోజనానికి ఆహ్వానం అంగీకరించు.

"వీరమాహేశ్వరతిలక!, ప్రీతి యెలర్ప
విభూతి గైకొనుము."
బస. 7.203.

భోజనానికి పిల్చునప్పుడు మిగతవారు అక్షింత లిచ్చినట్లే శైవులు విభూతి యిచ్చి పిలుస్తారు. అది తీసుకొనుట వచ్చుట కంగీకరించుట.

## విభూతి పెట్టు

భూతపిశాచాదులు సోకకుండాను వానిబాధ తొలగునట్లుగాను మంత్రించిన విభూతిని నుదుట పెట్టు.

నేటికీ వాడుకలో – 'విభూతి మంత్రించి యిచ్చాడు.' 'మంత్రించిన విభూతి పెట్టుకో రా' 'ఆయనదగ్గిరికి పోతే విభూతి పెడతాడు.'— అంటారు.

"భూతకాపును బెట్టి విభూతి పెట్టి."
హంస. 3.122.

## విభూతి యొసగు

భోజనమునకు చెప్పు.

భోజనానికి పిలుచునప్పుడు ఇతరులు అక్షింతలు పెట్టి పిలుచునట్లే శైవులు విభూతి నిచ్చి పిలిచేవారు. అందుపై వచ్చినపలుకుబడి.

"కాడుకుమాంసముతోడి, భోజనంబు నకు విభూతి యొసఁగి."
హర. పీఠిక. 14.

వియ్య మందు
సంబంధ మేర్పఱుచు కొను,
బాంధవ్య మేర్పఱుచుకొను.
"విచికిలామోదంబు వియ్య మంద."
కాశీ. 191.

వాడుకలో—'పేదవాళ్లతో వియ్యమందడం వాళ్ళ నాన్నకు ఇష్టం లేదు.'

విరగడ చేయు
తొలగించు.

విరగడ యగు
తొలగు.
"దాంతో ఆ పీడ విరగడ అయింది."
వా.
ఇది సామాన్యంగా 'పీడ'తో కలిసే విన వస్తుంది.
కొత్త. 121.

విరలి గొను
విరహాతురుడు అగు.
కుమా. 5.45.

విరవిర వోవు
జలదరించు.
"విశాలభుజాంతరమున్ బగిల్చినన్, విరవిగ వోయి మేను నిడు వెంద్రుక వెట్టఁగ."
భాగ. స్క. 10. (ఉ) 872.

విరస మెత్తు
వైరస్యం చెందు, విసుగు చెందు.

"వింధ్యాద్రితో సురల్ విరస మెత్తిరి గాక, గ్రహచక్ర మది యింత గడచి యున్నె?"
కుమా. 3.3.

విరాకుల విత్తుగ
తామరతంపరగా.
ఎలా యేర్పడినదో విచారింప వలసి ఉన్నది.
"అలవడ వేదమార్గము విరాకుల విత్తుగ సజ్జనాళి వి,చ్చలవిడిఁ జెంతలం దిరుగు జాడఁ దెచ్చితి మెల్లచోట్ల."
ప్రబోధ. 2.45.

విరిపోటు
పైకి మృదువుగా నున్నా ఘాటయినది.
"పేటెత్తి రిపులతో విరి, పోటగు నదుపాయ మొకటి పుట్టింపఁ దగున్"
కవిక. 2.44.

విరిపోటు సేయు
విఱుపులు కల్పించు, అనగా మనసు విఱుచు.
"పిడి పోవఁగఁ బల్కి విరిపోటు సేసి."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 2347.

విరియ కాచు
సమృద్ధిగా కాచు.
"ఆ చెట్టు విరగ కాచింది." వా.

విరియ పూచు
సమృద్ధిగా పూచు.
"విచ్చుమల్లెకు కాస్త నీళ్లు పోస్తే చాలు. అది విరగ పూస్తుంది." వా.

విరియ బారు
విరియు.
కవిక. 2.60.

## విరులు గిల్లు

పూవులు కోయు.

"కొమ్మ వేగిర మేటికే కొనగోర గోరటవిరులు గిల్లుము." పారి. 4.16.

## విరులు సవరించు

పూవులు ముడుచు.

"మైం, గలప మలంది క్రొమ్ముడిని గమ్మవిరుల్ సవరించి యుత్తమా,మల కును నాత్మభర్తకు నమస్కృతి సేసి." పారి. 5.56.

## విఱిగిన వేలికి సున్నం పెట్టడు

పిసినిగొట్టు అనుట.

"వాడు విఱిగినవేలికి సున్నం పెట్టే వాడు కాదు. నీకు విరాళం ఇయ్యొ చ్చాడా?" వా.

## విఱిగి పఱచు (పాఱు)

విఱుచుకొని పోవు.

"విఱిగి పఱచుసైన్యంబుల వెఱ పెల్లను దీర్చి." కా. మా. 2.45.

ఇది రెండు మూడు రకాలుగా ఉపయోగిస్తారు. విఱుచుకొని పడిపోయారు. విఱగ బడి చూస్తున్నారు. విఱగ బడి నవ్వారు. విఱుచుకొని పడినాడు.

## విఱిగి పాఱు

విచ్చుకొని పాఱి పోవు.

"అంత నొక పంట్రకోలచే నహితు కరిని, విరిగి పాఱఁగఁ బొడిచి పో విడువ మగుడ." కళా. 8.90.

"పచ్చము పాడుగా విఱిగి పాఱె." జైమి. 4.20.

## విఱిగి పోవు

ఓడి పోవు, చెదరి పోవు.

"నీసేన విఱిగి పోవఁగ." భాస్క. అయో. 374.

## విఱిచి కట్టు

రెక్కలు విఱిచి కట్టు. మనిషిని కట్టి వేసేటప్పుడు చేతులు రెండూ వెనుకకు విఱిచి కట్టి వేయడం అలవాటు దీనినే 'రెక్కలు విఱిచి కట్టడం' అంటారు.

"పెనిమిటి గలదాన నని కాటుక ధరింప, వేడుకలా యంచు విఱిచి కట్టు." శుక. 2.115.

## విఱుగ ద్రోచు

పడ గొట్టు.

"చెఱుకులును నారికేడములు విఱుగఁ ద్రోచి." రుక్మాం. 3.10.

## విఱుచుకొని పడు

మీాద పడు.

కొత్త. 115.

## విఱ్ఱవీగి పండు

విపరీతముగా పండు.

"వానలు సరవితో వర్షించె సస్యముల్, వేళ్లఁ గొల్చుగ విఱ్ఱ వీఁగి పండె." మను. 6.121.

## విఱ్ఱవీగు

పొగరుతో గర్వించు.

"భక్తుల మనుచు, విరసంబు లాడుచు విఱ్ఱ వీఁగదరు." పండితా. ప్రథ. పురా. పుట. 328.

"డబ్బుం దని వాడు మహా విఱ్ఱవీగు తున్నాడు." వా.

విలుకాడు

సేనలో ధనుర్ధారులు, విల్లం బులు పట్టేవారు, ధాను ష్కులు.

కుమా. 11.40.

విలుమంది

విలుకాండ్రు.

"వేలు వేలు యేర్చి విలుమందిఁ బనిచి తాఁ, దడుకుపెండె మలుక వొడమ వెడలి." ఆము. 3.27.

విల్లును వెలగకాయయు బూను

అతకని రెంటిని ఒకే తడవ పూనడం సాధ్యము కా దను పట్ల ఉపయోగించేపలుకు బడి.

విల్లును పట్టుకొన్న వాడు వెలగకాయను కూడా పట్టు కోవడం సాధ్యం కాదు కదా!

"వల్లభ రతితంత్రము శ్రీ, వల్లభు చింత నము సలుప వాంఛించెడి నీ, యుల్లంబు నందుఁ గంటిని, విల్లు వెలఁగకాయఁ బూన వెఱ వై యున్నే?"

రుక్మాం. 4.54.

విల్లు పట్టువారు

విలుకాండ్రు.

"విల్లు పట్టెడువా రెల్ల వెరవు గలచి."

భార. ద్రోణ. 1.84.

వివర పడు

తెలియు.

"కువలయప్రియవృత్తి వివర పడక."

నిరంకు. 1.43.

వివరము తెలిసినవాడు

చూ. వివరి.

వివరి

వివరము తెలిసిన వాడు.

విజ్ఞు డనుట.

వివరము తెలిసివా డనుటే నేటి వాడుక. 'వివరము తెలి సినవాడికి చెప్పినా అందమూ చందమూ.'

"వివరికి వివరించినకృతి."

సింహా. 1.19.

చూ. వివరము తెలిసినవాడు.

వివాహ మాడు

పెండ్లి చేసికొను.

విశేషములు

జరిగిన సంగతులు.

"ప్రతి దివసంబు వాని నగరంబునఁ బుట్టువిశేషముల్ భవ, న్మతి పస నన్నియుం దెలిసి. ప్రభా. 1.115.

విశ్వజిద్యాగము

కష్టతర మైన పని.

"ఈ కాలంలో పెండ్లి అంటే విశ్వ జిద్యాగం చేసినంత పని." వా.

విశ్వామిత్ర సృష్టి

కృత్రిమసృష్టి.

విదేశీయము లయినవాటి నన్నిటినీ మనవారు విశ్వా మిత్రసృష్టి అనడం అల వాటు.

పచ్చిమిరప, టెంకాయ, ఇత్యాదులు.

విశ్వామిత్రుడు

కోపిష్ఠి.

విసనకఱ్ఱ వన్నె

అస్థిరము.

వెంకటేశ. 71.

విసపాల విత్తు

విషప్రాయుడు.

"వెదకి యీ విసపాల విత్తు నే మందు."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 2036.

ఒక విధమైన విత్తనము. దాని మీద వచ్చిన పలుకుబడి.

విస మగు

అయిష్ట మగు, కష్ట మగు.

"నీయాన రణకేళి సెలుపంగ లేదు, వేయి చేతులు మోవ విస మయ్యె నాకు."

ద్విప. కల్యా. 132.

విసవిస

విసు మని.

గాలి వీచుటలోని ధ్వన్యనుకరణము.

"విసవిసఁ బవనుఁడు జవమున, విసరిన విడి పాఱు జలదవిసరముభంగిన్."

రాజశే. 1.92.

విసిమాలు

విసుగెత్తి పోవు.

విశ్రాంతిని మాలు అని కావచ్చును.

"విసికి విసిమాలి వేసరి."

భీష్మ. 2.101.

విసివి వేసరు

ఒకే అర్థం గల రెండు పదాలూ నొక్కి చెప్పడంలో ఏర్పడినపలుకుబడి. చాలా విసుగు చెందు అని అర్థం.

"...పెనుదుఃఖముగాఁ, బోరాడ విసివి వేసరి, శూరుఁడు స్త్రీహత్యఁ జేయఁ జూడనికతనన్." శుక. 2.243.

విసుమాన మగు

ఆశ్చర్య మగు.

'విస్మయమాన' అనుటకు తద్భవము కావచ్చును.

"విసుమానములు గాఁగ వసతోడఁ బెనవెట్టి, నెట్టెంబుగాఁ ద్రేవుఁ జుట్టి నాఁడు." సుసు. 4.73.

విసుమానము

ఆశ్చర్యము.

'విస్మయమాన' ఇలా మారి ఉండ వచ్చును.

"వివరించి చూడంగ విసుమానములు గాక." కాశీ. 2.105.

విస్సన్న చెప్పినదే వేదం

ఆయన మాట వేదవాక్యంగా పరిపాలింప బడు ననుట.

విశ్వపతిశాస్త్రిగారు మహా పండితుడనీ, ఆయన ద్వారానే యీ పలుకుబడి ప్రవర్తిల్లిన దనీ అంటారు.

విష మెక్కు

విషము శరీరములో వ్యాపించు.

"విష మెక్కఁ దలకు మెసఁగిన."
రుక్మాం. 5.58.

విషాద మార్చు

దుఃఖము తీర్చు.
నిరం. 4.55.

వీటిప్రోగు

వ్యర్థుడు.

దండుగ మారి వాడు.

"వీట విహరించుచుండు నవ్వీటి ప్రోగు." పాండు. 3.13

వీటి బుచ్చు

వ్యర్థము చేయు.

"నాఁటి యలహంసజన్మంబు వీటిఁ బుచ్చి, మగుడ మానుషవేషసంభవుఁడ నైన." శుక. 1.398.

"ధనధాన్యాదులు వీటిఁ బుచ్చి."
జైమి. 2.107.

"ఫల మందువేళ, యవి వీటిఁ బుచ్చిన యట్టు లిన్నాళ్లు."
వర. రా. అయో. పు. 638. పంక్తి. 3.
శివ. 2.102.

వీటి బోవు

వ్యర్థ మగు, పాడగు.

"శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ!" భాగ. స్క. 1.423.

వీడబారు

వీడి పోవు.

"వీడంబారిన నలితో... శుక. 3.61.

వీడు ఎంతవాడు?

'మహా మహా వాళ్లే పోతుండగా వీని దొక లెక్కా?' అనే అర్థంలో ఈ మాటను తరుచూ ఉపయోగిస్తారు.

వీడుకు వీడు

సరికి సరి, దెబ్బకు దెబ్బ వంటిది.

"నేను జెక్కిలి నొక్కఁ దాను జెక్కిలి నొక్క, విరిబోణి వీడుకు వీడె యనును." రాధి. 2.113.

వీడుకొలుపు

పోయి రమ్మని పంపించు.
శుమా. 10.104.
రూ. వీడుకొల్పు.

వీడుకొల్పు

సాగ నంపు.

"విపులసంపద లిచ్చి వీడుకొల్పు టయు."
రంగ. రా. బాల. పు. 8. పంక్తి. 20.

వీడుకోళ్లు గుడుచు

విందు భోజనములు భుజించు.

"వెలయ వియ్యా లంది వీడు కోళ్లు గుడిచి, నరఁ బువుల్ ముడిచిన నాపసాని." కళా. 7.85.

వీడుపట్టు

నివాసస్థలము.
శుమా. 3.18.

వీడుపాటు

వెసులుబాటు.

"నెల వో నెలం బురుషుఁ డై మా సాంతం బైన గాఁ,మిని యై యాగతి వీడుపాటమర భూమిం దాన రక్షించు."

భాగ. స్క. 9.30.

## వీడు వా డనక

ప్రతివానిని.

"అదియుఁ గ్రొవ్వున వీఁడు వాఁ డనక చొచ్చె."

హంస. 4.200.

"దానికి వీడూ వాడూ అని లేదు. అందరినీ అంటుంది." వా.

"అక్కడికి వీడూ వాడూ అనకుండా పోతారు." వా.

చూ. ఎవడు పట్టితే వాడు.

## వీడు విడియు

విడిది చేయు.

"అతులితోత్సాహమున వేట లాడి యాడి, కడఁగి యచ్చోటనే వీడు విడిసెఁ గాన." శుక. 1.476.

## వీడెత్తి చను

దండెత్తి పోవు, విడిది చేయు.

"రాజు వీడెత్తి చనినఁ దారక భటాలి." పారి. 2.66.

## వీడ్కొను

సెలవు తీసుకొను.

కుమా. 10.116.

"మునినాథుచే ధర్మతనయుండు వీడ్కొని" జైమి. 1.105.

## వీణె మేళగించు

ఏదో ఒక నిర్దిష్టమైన రాగానికి అనుకూలంగా శ్రుతి పట్టు.

"...నపుడు పాట కాయితముగ, వీణె మేళగించి వెలుపలి మోసల, నునిచి లోని కరిగి యున్నవాఁడు"

కళా. 2.89.

## వీణె సవరించు

శ్రుతి చేయు.

"మహతీసమాహ్వయమహనీయ మీ వీణె, మానక నిత్యంబుఁ బూని యేను, గచ్ఛపి యనుపేరఁ గరము శోభిలు వీణె, సవరించి జగదంబ శారదయును." కళా. 2.63.

## వీథి కెక్కు

రచ్చ కెక్కు.

"ఈ కొడుకు పుట్టి మాసంసారాన్ని వీధి కెక్కించాడు." వా.

## వీథు లేగు

మెరవణి పోవు, ఊరేగు.

"బంగారుగరుడుని పై నీవు వీథు లేఁగ."

తాళ్ల. సం. 11.70.

## వీనితోడిది యేమి

వీడితో ఏమిటి?

ఉదాసీనతను సూచించు పలుకుబడి.

"...దత్ప్రియవధూటి వీనితోడిది యేమి విడిచి పెట్టుటయు."

కళా. 3.177.

వాడుకలో–'వాడితో ఏమిటి? వెధవ. పోనిద్దూ.

## వీను మిగులు

ప్రసిద్ధి చెందు.

"...కలశతీర్థ మేనుబారల నిడుపున వీను మిగిలి." పాండు. 2.144.

వాడుకలో—'ఆయనది వీను మిగిలిన పాండిత్యము.'

### వీనుల జేర్చి విను

సావధానముగా విను.

"కోరిక లపు డీ, డేర్చినవిధంబు వీనులఁ, జేర్చి వినఁగ వినయగరిమఁ జెప్పఁగ వారుఁ." కా. మా. 1.150.

### వీనుల పండువు

కర్ణపర్వము.

పల. పుట. 3.

### వీనుల బెట్టు

శ్రద్ధతో విను.

"సంస్కృతశబ్ద మూఁదఁ జెప్పిన నవి దర్భముం డ్లనుచుఁ బెట్టరు వీనుల." సింహా. 1.32.

### వీను లలర

చెవుల కిం పగునట్లు.

"భవదీయకథ విన్న, వింతు భక్తజనుల వీను లలర." కా. మా. 4.2.

### వీనులు చల్ల నగు

మంచిమాట వినుటవలన సంతోషించు.

"తల్లికి వీను లెంతయుఁ జల్ల నాయెఁ గా, నాయగాథప్రయాణంబు విన్న." శుక. 1.474.

చూ. కనులు చల్ల నగు.

### వీపు గాన రా డాగు

అటు తిరుగుకొన్నంత మాత్రంతోనే ఎవరూ తన్ను చూడ లే దని భావించు.

దాపరికం అనుకున్నా అది దాపరికం కా దనుట.

"పట్టఁబట్టఁగా, నేఁగుచుఁ గోరు నీ బలిమి నీప్సితసిద్ధిగ వీఁపు గాన రా, డాఁగుట దీని పేరు." ప్రభా. 5.17.

### వీపుగోల

వీపున కానించిన కోల.

ఎప్పుడైనా దెబ్బ తీయ గలది. భయంకరుడు, పని పట్టగలవాడు అనే అర్థంలో ఇలాంటి పలుకుబడులు మనకు చాలా ఉన్నవి.

"అర్హత సమయముల వీఁపుగోల."
పండితా. ప్రథ. వాద. పుట. 511.

చూ. ముక్కుపై కత్తి.

### వీపుచర్మ మొలిపించెదను

ఒక తిట్టు.

"ప్రకట మగుసంగరంబున, నొకతుణ మున వీపుచర్మ మొలిపించెద..." తారా. 4.178.

### వీపు చిట్ల గొడుతాను

ఒక తిట్టు.

"ఇలాగే మరోసారి చేశా వంటే వీపు చిట్ల గొడతాను." వా.

### వీపుల్ చిట్లి పో గొట్టు

చితుక గొట్టు.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

'వీపు చిట్ల గొట్టినారు.'

"మీ, మోము లిందురు గాక యిం కనుచు వీఁపుల్ చిట్లి పోఁ గొట్టుచుఁ." శుక. 3. ఆ. 274. ప.

### వీపు చూపు

పాఱిపోవు.

"నలుగురూ కలబడేసరికి వాడు వీపు చూపి పారి పోయాడు." వా.

"వాడు యుద్ధంలో ఎన్నడూ వీపు చూపి యెఱుగడు." వా.

## వీపు జఱచు

ధైర్యము చెప్పు.

ఇది వాడుకలో నున్నది.

"తలవరి గడగడ వడఁకినఁ, గలఁగకు మని వీపు చఱచి ఘనురా లతనిన్".

హంస. 3.91.

చూ. వీపు తట్టు.

## వీపు జూపు

ఓడి పాఱు.

"అచ్చరణము లంది క్రిందుపడె సమ్మతి నెప్పుడు వీఁపుఁ జూపుచున్."

రాధి. 2.46.

## వీపుతీట విడిపించు

వీపు చిట్లగొట్టు.

గౌర. హరి. ద్వి. 1067.

## వీపు దట్టు

భయము లేదని చెప్పుటలో వీపుపై తట్టు.

ధైర్యము కలిగించు.

"సా, యంసమయాదిఁ గేకివలె నారట మందుచు వీఁపు దట్టు మో, పుంసవరా! యటంచు..." హంస. 2.122.

## వీపు మన్ను దుల్పు

సేవ చేయు.

"అమ్మా! రంకుమగండు వీఁపుమను దా నావంతయుం దుల్పఁడే."

పాణి. 2.21

## వీపులు పగల గొడతాను

ఒక తిట్టు.

"ఇందుకు భగ్నంగా నడిచావంటే నీ వీపులు పగుల గొడతాను." వా.

## వీపు విమానం మోత మోగుతుంది

ఇటీవల యేర్పడినపలుకుబడి. విమానం పోవునప్పటి ధ్వని మీాద యేర్పడింది.

దెబ్బలు తగులు ననుట.

"నీవు అక్కడ అదీ యిదీ అన్నావంటే వీపు విమానంమోత మోగుతుంది జాగర్త." వా.

## వీపు విఱిగి పడు

కూలబడు.

"అనుయోధవరుల మాటలు, విని రఘువీరుండు వీఁపు విఱిగి పడియెఁ గ్రమ్మినమూర్ఛ భరతు నంతిక,మునఁ బరశుచ్ఛిన్న సాలభూజముఁ బోలెన్."

జైమి. 6.199.

"చంద్రహాసునకు విషయఁ బెండ్లి సేయునవ్విధముగా నెఱింగి వీఁపు విఱిగె." జైమి. 8.87.

## వీపు వ్రీలగ గొట్టు

వీపు చితుక తన్ను.

"కీలు సంకెలఁ గేలఁ గీలించి వీఁపు, వ్రీలంగఁ గొట్టుగు."

గౌర. హరి. ద్వి. 884.885.

## వీపువెనుక మానిసి లేక

సహాయము లేక, వెనుక బలం లేక.

"కడు నోటమితో హతశేషసైన్యముల్, గ్రక్కున విచ్చె వీఁపువెనుకన్ మఱు మానిసి లేక..." కళా. 8.65

**వీరతాంబూలం**

వీడు డొక పనిని చేసెద నని ప్రతిజ్ఞ గైకొని తత్సంకేతంగా తాంబూలము తీసుకొనును. అదే వీరతాంబూలం.

బస. 6.208.

**వీరభద్ర పళ్లెర మిడు**

ఒక శైవాచారము. శివపూజావిధానంలో వీరభద్రుడు వైష్ణవంలో విష్వక్సేనుని వంటివాడు.

"భౌమవారపు వీరభద్ర పళ్లెర మిడు, గృహదైవతంబు లిట్టింప లింక."

ఆము. 4.43.

**వీరమద్దెలలు**

వీరత్వం సూచించే రణభేరి వంటి మద్దెలలు.

"కలయ విడిదిలో వీరమద్దెలలు నులిసె."

కుమా. 11.51.

**వీరు వా రన వలదు**

వాడూ వీడూ అని చూడ వద్దు.

"దీని వేవేగ నాచేఁ బ్రతిగ్రహించి, యడఁపు మాదైత్యు వీరు వా రనఁగ వలవదు." మను. 4.93.

"వీడూ వాడూ అని చూడ వద్దు. ఎవ డొచ్చినా సరే లేదు పొమ్మని చెప్పు." వా.

**వీలు చాలు**

సమయము. జం.

"నావంటి తెలివితక్కువ దైతే వీలు చాలు నెఱుఁగక రద్దికి రవ్వకు నెక్కును." నాచెళ్ల.

"ఒక వీలూ చాలూ లేకుండా మాట్లాడితే ఏం లాభం?" వా.

**వీసము తప్పు లేదు**

ఏమాత్రమూ తప్పు లేదు.

"వీసము తప్పు లేదు నెరి వేసలికిం జిరుదేటి దండ్లకున్." కవిక. 3.28.

**వీసర వోవు**

వ్యర్థ మగు.

"అయ్యతివ నెమ్మేని, సంపంగి తావి వీసర వోవ నీక, ముంపుము నామేన." వర. రా. యు. పు. 17. పంక్తి. 25.

"విధిమార్గ మొక్కింత వీసర వోకుండ." హర. 4.56.

**వీసానికై ఎట్టి దోసాన కైన చే సాచికొను**

కొంచెం లాభంకోసం నీచానికి పాల్పడు.

"వీసానికై యెట్టిదోసాన కైనఁ, జే సాఁచికొనుకర్మజీవులతోడ."

బస. 7.19.

'దమ్మిడీకి గడ్డి తింటారు' వగైరా నేటివాడుక.

**వుంబళ్లు వూళ్లు నిచ్చు**

మాన్యము ఇచ్చు, కాపాడు.

"పంచిన భూకాంతపతిఁ బాయక సేవించరో, వుంబళ్లు వూళ్లు నిచ్చేవున్నతుఁడు నతఁడే." తాళ్ల. సం. 10.238.

**వృత్తి సొచ్చు**

జీవించు.

వృత్తులు జీవనాధార మగు ఈనాములు అయిన ట్లే లక్షణయా వృత్తి సొచ్చుట జీవించుట కావచ్చును.

"భీషణవేషము చూచి నేలపై౯, గా లిడి నిలుతే యనికిఁ గ్రమ్మఱ వత్తురె వృత్తి సొత్తురే." కుమా. 10.149.

రూ. వృత్తి. సొత్తురే?

వృత్తి సొత్తురే?

జీవింతురా?

"అనికిఁ గ్రమ్మఱ వత్తురె వృత్తి సొత్తురే?" కుమా. 10.149.

వృత్తులు

ఇనాము భూములు.

"గుడ్డవృత్తులు వృత్తులు గొలుచు గుత్త, చేలు." పాండు. 3.16.

జీవితం జరుగుటకై ఇచ్చే భూమిూ పుట్రూ.

"వృత్తులు భూములుఁ గన్నె దాన ములు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 346.

వృధ చనుట

వ్యర్థ మగుట.

"వీనిలోపలఁ గొన్ని గావింపఁ గనిన, వృథ చనవు చేర్చుఁ గ్రమమున విష్ణు పదము." కళా. 2.114.

"యది వృథ, చనునే యైనను లతాంగి శంకింపకు..." కళా. 3.277.

వృధ చేయకుండు

వ్యర్థము చేయకుండు.

"కృష్ణానుగ్రహంబున గలిగిన యీ యనన్యసాధారణ సంగీతచాతుర్యంబు వృథ సేయక..." కళా. 2.115.

వృద్ధజంబుకం

నిరసనగా ముసలివాళ్ల పట్ల ఉపయోగించేపలుకుబడి.

"ఉన్నాడు గా వృద్ధజంబుకం. వాడి వల్లే ఆ కొంప నాశనం అయింది." వా.

వృద్ధనారీ పతివ్రతా

ఉడిగిపోయిన తర్వాత అందరూ పతివ్రతలే.

అంటే చేయ వీలు లేనప్పుడు అందరూ నీతులు మాట్లాడ తారు అనుట.

మాటా. 71.

వెంట నంటు

తఱుముకొని పోవు.

శుక. 1.268.

"ఎక్కడనుండి నేఁ డిటు వెంట నంటి, తెక్కలి దైవంబు త్రొక్కెను."

గా. హరి. ద్వితీ. పంక్తి. 1853.

చూ. వెన్నంటు.

వెంట బడు

1. వెంటాడు.

"మేరువు కవ్వల మెలఁగాద మన్నను, భానుచంద్రులు వెంటఁ బడుదు రెపుడు." రాజగో. 1.66.

2. ఏదో ఒకటి చేయ మని బలవంతం చేస్తూ వెంట తిరుగుపట్ల దీన్ని వాడుకలో ఉపయోగిస్తారు.

"ఏదైనా ఉద్యోగం చూచి పెట్ట మని వాడు నెలరోజులుగా నావెంట బడు తున్నాడు," వా.

3. కాముకత్వంతో వెంట తిరుగు.

"వాడు నాలుగురోజుల నుంచీ దాని వెంట బడ్డాడు. రేపు ఎవరి వెంట బడతాడో తెలియదు" వా.

"వాళ్ళ నాన్న వట్టి పిసినిగొట్టు. వాడి వెంట బడితే నీ కేం లాభం?"

4. తన పని తీర్చమని ప్రాధేయ పడు.

ముఖ్యంగా అటువానికి ఆ పని చేయటం ఇష్టం లేనప్పుడు, వీడు ఆ పని చేయమని నిర్బంధిస్తున్నప్పుడు మాత్రమే ఇది ఉపయుక్త మవుతుంది.

"మతి వండి పెట్టుకొమ్మలు లేరె మా వెంటఁ, బడుదు రటంచును బాయఁ బలికె."

శుక. 4.7.

'వాడు ఉద్యోగం ఇప్పించమని నా వెంట బడ్డాడు' అని వాడుకలో దీనిని ఉపయోగిస్తారు.

## వెంట రాలేని పాపము

"సురకార్యవిఘ్నమో యనుభయమున వెంట, రాలేనిపాప మివ్వేతలు దెచ్చె."

కళా. 3.268.

## వెంట వెంట నేయిదు

వెంబడి వెంబడి పడు.

"గమనించుతఱి మందగమనశ్రేంగా రాప్తి, నంటు వాయక వెంట వెంట నేయిదు."

శుక. 1.391.

## వెంటాడు

వెన్నాడు.

"విశదదోషంబులు వెంటాడి చెఱచు."

వర. రా. బా. పు. 181. పంక్తి. 15.

## వెంటిక పట్టుక పోయి వెస గొండ నాకు

తాడు సాయముతో కొండ నెక్కు.

సులు వనుట.

"వెంటఁ గర్మమార్గమ్మున విష్ణుని సాధించుట." తాళ్ల. సం. 6.50.

## వెంటి గొనగా నులుచు

పురి పెట్టు.

"వెంటిఁ గొనఁగా నులిచి మింటి కెగయఁజ్జ వయిచి."

భాస్క. యుద్ధ. 1426.

## వెంట్రుక వాసి

చాల తక్కువ.

వెంట్రుకంత అనుట.

"వెంట్రుకవాసిలో తప్పి పోయింది. లేకుంటే ఆ రాయితో తల పగిలి పోవలసిందే." వా.

"వాడికీ వీడికీ వెంద్రుకవాసి కూడా భేదం లేదు." వా.

## వెంద్రుక పట్టు

అతి నిశిత మైన.

"మరుఁడు వెంద్రుక పట్టెడుతూపు లేర్చె." సారం. 2.169.

ఈప్రయోగంలో శ్లేష కూడా ఉన్నది.

**వెండ్రుకముక్కతో సమానము**

లెక్క లేదనుట.

"వాడికి నామాటంటే వెండ్రుక ముక్కతో సమానం." వా.

**వెండ్రుక యంత**

అత్యల్పము.

"నేను లేనిచో, వెండ్రుక యంత మోసమును వేచి దురంబున కెత్తి వచ్చునా, పౌండ్రుఁడు." ఉ. హరి. 2.100

**వెండ్రు కిడను సందు లేకుండ**

ఏ మాత్రమూ వ్యవధానం లేకుండ.

"వెడఁదయొడలును జన్నులు వెండ్రు కిడను, సందు లేకుండ బలియుట...." హంస. 3.133.

**వెంపర లాడు**

తఱిమి కొట్టు.

"శరపరంపర వెంపర లాడె నయ్యెడఁజ." విజయ 3.150.

**వెకిలినవ్వు**

వెఱ్ఱిబాగుల నవ్వు.

"ఏమిట్రా ? అర్థం పర్థం లేని ఆ వెకిలి నవ్వులు." వా.

**వెక్కసా లాడు**

ఎకసక్కెము లాడు.

"చక్కని విభుని సారెకుఁ జెలులు, వెక్కసా లాడక విడరో." తాళ్ల. సం. 12.185.

**వెక్కి వెక్కి యేడ్చు**

ఎక్కిళ్లు వచ్చునట్లు ఏడ్చు — అధికముగా. ధ్వన్యనుకరణము.

"పొమ్మన్న వినక వేములు వెక్కి వెక్కి, యేడ్తు." హంస. 3.142.

**వెగటు తోచు**

విసుగెత్తించు.

"వీణావిరావంబు వెగటు దోఁచిన యప్డు." నిరంకు. 2.34.

**వెగడు పడు**

భయపడు.

"తలారులు, వెగడు పడఁగ, బాణముల నేసి." కాశీ. 4.124.

**వెగడుపఱుచు**

భయపఱుచు.

"విశిఖనవకంబు నాఁటించి వెగడు పఱిచి." భార. భీష్మ. 1.272.

**వెచ్చ నూర్చు**

వేడి నిట్టూర్పులు పుచ్చు.

"పరమజి కెలఁకులఁ బంజరకరమ్ము, వెచ్చరించినఁ జూచి వెచ్చ నూర్చు."

**వెచ్చ జెప్పు**

అమ్ము, విక్రయించు.

"వేంకటవిభుండ!నీవు వెచ్చఁ జెప్పఁగా, ఉంకువగా నాకు నచ్చె నుదుట నీచేతలు." తాళ్ల. సం. 3.477.

**వెచ్చ పెట్టు**

ఖర్చు పెట్టు.

"ఒప్పగు బ్రహ్మపట్టము నొకరికి వెచ్చ పెట్టి." తాళ్ల. సం. 6.18

**వెచ్చ పోవు**

అమ్ముడు పోవు.

"ఆలిని బిడ్డలన్ విడిచి యాఁకటి చిచ్చున వెచ్చ పోవువారు." కా. మా. 3.153.

## వెచ్చసచ్చములు
ఖర్చు వెచ్చములు.

జం.

"చేసేత విశ్వసించినవారి వెచ్చసచ్చ ములఁ గీడ్పఱచువై జాతి తొండ."
పంచ. వేం.

## వెట్ట సంసారము
కటకటగా నడుచు సంసారము.

"వెట్ట సంసార మిది వెంకటేశుని గొలువని, వట్టిమనుజుల పెడవాడఁ బెట్టుఁ గాక." తాళ్ల. సం. 5.119.

## వెట్టికి పట్టు
వెట్టిపని చేయించు.

"ఏరాజు రాజుల నెల్ల జయించి ము, న్వెట్టికిఁ బట్టె దోర్విక్రమముల."
మార్కం. పీఠిక. 35.

## వెట్టికి బట్టు
నౌకరుగా పెట్టుకొను, పని చేయించుకొను.

"తద్గజేంద్రమున్, వెలిచినవాఁడు దేవతల వెట్టికిఁ బట్టినవాఁడు."
ఉ. హరి. 5.89.

## వెట్టిగాడు
ప్రతిఫలం యివ్వక యే అనుభవించువాడు.

"రట్టడి వెంకటరమణుఁడ గలసితి, వెట్టిగాఁడ యింక విడు విడు చెఱగూ." తాళ్ల. సం. 4.92.

## వెట్టి పంపు
చెప్పి పంపు.

"తెలియఁ డని వెట్టి పంపిన వారలో." సారం. 2.263.

## వెట్టివానికి వేద మెందుకు?
నిరర్థక మనుట.

ఆ కాలపు వర్ణాశ్రమధర్మాలను బట్టి వచ్చినపలుకుబడి.
నరసింహ. శత. 63.

## వెట్టి సేయు
చాకిరి చేయు.

"వేయి వేలై వేగుదాఁకా వెట్టి సేసి యలసితి." తాళ్ల. సం. 5.237.

## వెట్టుక్రోవులు
చిమ్మనగ్రోవులు.

"అలిగి విరహులపైఁ బన్ని నట్టి వెట్టు, క్రోవులం దిడ్డ నీలంపుగుం డ్లనంగ."
రాధా. 4.181.

## వెడగు వఱచు
నిర్వీర్యుని చేయు.

'బి ట్టులిక్క, పడి యద్భుతంబు వెడగు పఱుప"
పండితా. ప్రథ. దీక్షా. పుట. 191.

## వెడగు వర్చు
తిరస్కరించు.

"వెడు నాగయగారి వెడగు వర్చితివో."
పండితా. ద్వితీ. మహి. పుట. 214.

## వెడగొడ్డు పులి నాకి విడిచినట్లు
బతికి బయట పడిన ట్లనుట.

గొడ్డును పులి తినాలి కాని నాకి వదిలి వేయడం అంటే అదృష్టమే కదా!

"వెడగొడ్డు పులి నాకి విడిచిన ట్లైన."
గౌర. హరి. ద్వి. 973.

వెడమాయములు చేయు

మాయమంత్ర మొనర్చు, మాయ చేయు, మంత్ర మొనర్చు.

"వెడమాయములు సేసి వెడలిన వాఁడొ."

పండితా. ప్రథ. పురా. పుట. 380.

వెడయాటలు

వెకలి ఆటలు; ఆనందంతో ఎటు బడితే అటు ఆడుట ఇట ప్రస్తావితము.

"వెడయాట లాడెడువారు."

పండితా. ద్వితీ. పర్వ. పు. 434.

వెడల ద్రోయు

పోగొట్టు.

"విని మరుత్క్రాంత శాపంబు వెడలఁ ద్రోయ." నిరంకు. 4.78.

వెడల నడచు

బయటికి గెంటు.

"వెడల నడిచినఁ బ్రతిరాజవీర మనెడి, పురమునం దున్న పితృగేహమునకుఁ బోవఁ, దలఁచి యయ్యింతి..."

శుక. 2.244.

పాండు. 5.206.

వెడల నాడు

ఇతరులకు చెప్పు.

"వెడల నాడినదుర్వివేక మీ మాట."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1034.

వెడల నొత్తు

వదలి వేయు.

"వాహినిలో నొక మందసంబునం, దునిచి నయంబునన్ వెడల నొత్తుట నీతి యటంచుఁ దెల్పినన్."

శుక. 1.460.

వెడవాకాట్లు

అనవసర వాగ్వాదాలు.

"వెడవాకాట్లం బల్పజంబు వలవదు సేయక"

శివ. 4.70.

వెడ వెడ(జారు)

దూజారు.

"వెడవెడ జారి వెన్నునం దూలువేనలి యును. రాధా. 2.52.

వెడ్రవంతలు

వెడద+ స్రవంతలు.

పెద్దపెద్ద ప్రవాహాలు.

వఱుత, స్రవంత, వాగు ఒకటే.

"ఇందుల వెడ్రవంతలు ... భాగీరథీ ముఖ్యనదులు."

పండితా. ద్వితీ. పర్వ. పుట. 241.

వెడ్డంగ మాడు

ఆనందంతో నాట్య మాడు.

వీరశైవులు చేసే ఒకానొక నృత్యవిశేషం కా వచ్చును.

ఆనందాతిరేకంతో ఎగురుట లోనే ప్రస్తావితం. వీరాంగం వంటిది కావచ్చును.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 434.

వెడ్డు వెట్టు

వంచించు, మోసగించు.

"నీకుఁ జాలి లోనైతి, వెడ్డు వెట్టిన నిన్ను విడిచి పోఁజాల."

వర. రా. అర. పు. 247. పంక్తి. 8.

**వెడ్లు బుడ్లు బెట్టు**

సందర్భాన్ని బట్టి ఏడ్చుచు చేయు అంగవిక్రియ కావచ్చును. స్పష్టంగా తెలియదు. బుజ్జగించినట్లే ఒక లాలనా కావచ్చును.

"ధారుణిఁ బడి బయల్దన్నుచు నేడ్చుఁ, గోర దిక్కును జూచు మోరారిఁ జూచు, బుజ్జగించును వెడ్లు బుడ్లును బెట్టు, నిర్జివిక్రియఁ బడు నివ్వెఱ గందు." బసవ. 3.62.

**వెదకి చూచిన లేడు**

అపురూపము.

"...కోరనట్టి, మానవాగ్రణి వసుమతీ స్థానములను, వెదకి చూచిన లేఁడు పో విద్రుమోష్ఠి!" హంస. 4.145.

ఇది వాడుకలో కూడ ఉన్నది.

'అంత మంచివాడు వెతికినా దొరకడు.'

**వెద పెట్టు**

1. విత్తు.
2. ఎరువులు మొదలగు వానితో సారవంతము చేయు.

"చేనఁ బండినవిత్తు చేనికె ఫలకాంతుఁ జేర్మిఁ గ్రమ్మఱ వెద వెట్టునట్లు" కుమా. 1.48.

"వెస ముల్కవిత్తులు వెద వెట్టినట్లు." బస. 7.207.

"వెద వెట్టి పైరు గావించు." విజయ. 1.44.

**వెద్ది చేయు**

వెఱ్ఱిని చేయు కావచ్చును. వ్యుత్పత్తి తెలియదు. పదాల జాబితాలోనికే ఎక్క లేదు–యూని. ప్రతిలో.

"చెవుడు పడంగ నల్గడలఁ జీరుచు నన్నొక వెద్ది చేసి మీ, రివి యవి యంచు." కుమా.6.18.

వాడుకలో—

'ఊరికే నన్ను చుట్టుకొని వెఱ్ఱిదాన్ని చేసి ఏమేమో అంటున్నారేమిటి?'

ఈ పలుకుబడికి దగ్గఱదే అనిపిస్తుంది.

**వెధవవేషాలు**

పిచ్చిచేష్టలు.

కొత్త. 64.

**వెనకటికి**

పూర్వం.

"వెనకటికి ఎవరో కథ చెప్పేవారు లే." వా.

**వెనకా ముందూ చూడక**

లాభనష్టములను పరిగణించక.

"ఎలెక్షనులో అతడు వెనకా ముందూ చూడక డబ్బు వెద జల్లాడు." వా.

"అతనికి గనక కోపం వస్తే వెనకా ముందూ చూడడు. ఏమంటే అది అనేస్తాడు." వా.

**వెనుకగు**

సహాయము వచ్చు.

"వనచరసైన్యంబుఁ గూల్చి వచ్చెదను సంక్రందనముఖ్యులు వెనుకైనను."

భాస్క. యుద్ధ. 10.69.

**వెనుక గొఱ్ఱు ముందఱ నూయి**

ఎటైనా ఇబ్బందే అను పట్టున.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 486.

చూ. ముందు గొయ్యి వెనుక నుయ్యి.

**వెనుక జూడడు**

ఏదో నష్టం వస్తుందని వెనుదీయడు.

"ప్రాణానకు వెన్కఁ జూతు ననీ."

దేవీ. 3.450.

చూ. వెనుక తీయు.

**వెనుకడుగు లిడు**

వెనుకంజ వేయు.

"వెనుకడుగు లిడుచు నవ్వలఁ, దన పొరుగింటను విభుండు దాఁగినచో..."

హంస. 4.116.

**వెనుకగ్గు వేయు**

వెనుకంజ వేయు, భయపడు.

"వెనుకగ్గు వేయక విక్రమాధికత"

పల. పు. 118.

**వెనుకపోటు పొడుచు**

మోసగించి, దెబ్బ తీయు.

"వాడు చాలా నమ్మకస్థు డని అనుకొన్నాను. ఇలా వెనుకపోటు పొడుస్తాడనుకో లేదు. మగతనం ఉంటే ఎదుట బడి పోరాడాలి గానీ ఈ వెధవపని యేమిటి ?"

వా.

చూ. వెన్నుపోటు.

**వెనుక మర్లు**

వెనుకటి స్నేహము.

"మలయసమీరముల్ వెనుకమర్లన నుల్కిపడం బయిం బడఁగా.

సారం. 2.155.

**వెనుక ముం దగు**

సంకోచించు.

"మునుకొని మునుకొనక వెనుక ముం దైకుందుఁగా."

శకుం. 2.111.

**వెనుక ముందఱ చేయు**

పాచికలు తాళించు.

"వెడలిన సారెలు వెనుక ముందఱ చేసి, యెత్తినసారె పోనీక యార్చి."

ఉ. హరి. 3.122.

**వెనుక ముందర లేరు**

వెనకా ముందూ ఎవరూ లేరు.

దగ్గరిచుట్టా లెవరూ లేరనుట. వాడుకలో—'వాడికి వెనకా ముందూ ఎవరూ లేరు.' 'వాడికి వెనకా? ముందా? ఎవరున్నారు.?'

"వెనుక ముందర లేరు సెనరైన చుట్టాలు, లేవడి యెంతేని జీవనంబు."

నైష. 1.108

**వెనుక ముందును దలంపక**

ముందు వెనుకలు ఆలోచింపక.

'ఒక పని చేయడంవల్ల కలిగే బాగోగులను ఆలోచింపక' అనే అర్థంలో ఈ పలుకుబడి ప్రయుక్తమౌతుంది. ఏదైనా మంచిపని చేసే

టప్పుడు కష్టనష్టాలను గణిం చక పోవడం మంచి గుణమై, అలాంటి సందర్భాలలో ఇది మంచి అర్థంలో కూడా ఉపయుక్తమౌతుంది. ఉదా: 'దానం ఇవ్వడంలో అతడు ముందు వెనుకలు ఆలోచింపడు.'

"దొరలచెంగట వెనుక ముందును దలంప, కార్యుఁడు వచింపఁ దగునె యే కార్యమైన." శుక. 1.184.

**వెనుక ముందులు గాన కుండు**

ఏమి చేయవలెనో తోచకుండు.

"యేను వెనుక ముందు గానక కలవరపడి యున్నదాన..." కళా. 6.55.

**వెనుక ముందెంచు**

వెనకా ముందూ ఆలోచించు.

"వెనుక ముందు లెంచ బోతె వేడుక నీ గుణములు." తాళ్ల. సం. 3.218.

**వెనుక వేసికొని వచ్చు**

వత్తాసి వచ్చు, సమర్థించు.

"తమి మందేహులతోడఁ బోరి యినుఁ డంతన్ వీఁగి తన్ జేరన, స్తమహీభృన్మణి వెన్క వేసికొని మిత్రప్రేమ రక్తప్రవాహముగాఁ బోరె ననంగఁ జిక్కి యల దైత్యశ్రేణి కాన్పింపకుం, డ మొగుల్ మాయలు వన్నె నాఁ దనరెఁ జూడన్ సంజకెంజీఁకటుల్."

**వెనుక వేసుకొను**

వత్తాసి వచ్చు.

"గారవాన నన్ను వెనుక వేసుకొన్న ఫలము." తాళ్ల. సం. 8.89.

**వెనుకొని చను**

వెన్నంటి పోవు.

"ఇత్తోయజాక్షి మానసౌకంబు వెనుకొని చనియె." నైష. 2.46.

**వెనుకొను**

వెన్నంటు.

"వెలువడి చనుజీవి వెనుకొని ప్రాణముల్, సనుచుండు." భాగ. స్క. 2.269.

**వెనుదెంచు**

చనుదెంచుకు వ్యతిరేకార్థం.

వెనుకకు వచ్చు.

"దిగ్గజేంద్రంబు వెనుదెంచె." కుమా. 10.75.

**వెనుపోటు**

"తేటి కయ్యది వెనుపోటు గాక." శ్రవ. 2.79.

చూ. వెన్నుపోటు పొడుచు.

**వెనుబడు**

వెనుక పడు.

పండితా. ప్రథ. దీక్షా. పుట. 178.

**వెనుబలమగు**

సహాయమగు.

"వేమరు భోగింపఁ జేసి వెనుబలమైనది." తాళ్ల. సం. 8.288.

**వెనువెనుకకు**

వెనుకకు వెనుకకు.

మును ముందుకు వంటిది.

"పెట్టి వెను వెనుకకటు చని, యట్టిటు భయచపలచేష్టులై యరుగుచు..." కళా. 6.160.

వెనుక వెనుకకు. ముందుకు ముందుకు అన్నది ముందు ముందుకు అయినట్లే ఇదీనీ. మునుముందుకు అని కూడా వాడుక.

బస. 4.93.

## వెన్నకు పండ్లు వచ్చు

తాళ్ల. సం. 11.3. భా. 6.

చూ. అరచేతికి పండ్లు వచ్చు.

## వెన్నకు బండ్లు వచ్చినట్లు

అల్పుడు బలవంతు డయ్యే ననుపట్ల ఉపయోగించే పలుకుబడి.

"అన విని శుక మి ట్లనియెను, వనితా! యే మందు వాని వగలో త్రుళ్లో, ఖణుకో తెలివో గలివో, విను వెన్నకుఁ బండ్లు వచ్చు విత మాయెఁగదా!

రాధి. 5. ఆ.

## వెన్న గలుగ నెయ్యి వెదకు

సాధనము చేతిలోనే ఉండగా మరొకచోట వెంపరలాడు.

"వెన్న గలుగ నెయ్యి వెదకు వేదులు గలఁడే." రుక్మాం. 5.70.

## వెన్నతోడ బెట్టు

పుట్టుకతో వచ్చు.

"నవవిల్తు శాస్త్రంపు మినుకు లావరించు, పని వెన్నతోడఁ బెట్టినది మాకు." మను. 2.43.

చూ. వెన్నతో బెట్టినవిద్య.

## వెన్నతో నిడు

పుట్టుకతో వచ్చు.

"సన్నుతం బగునట్టి సత్యవ్రతంబు, వెన్నతో నిడిన దా విభునకు మున్నె."

గా. హరి. ప్రథ. పంక్తి. 259,260.

చూ. వెన్నతో బెట్టినవిద్య.

## వెన్నతో బెట్టిన

చిన్నతనంనుంచీ అలవడిన. లక్షణయా సహజసిద్ధమైన.

"ఎందు లేని పలు పోకల మాయలు నీకు వెన్నతోఁ, బెట్టినవి." పారి. 1.127.

## వెన్నతో బెట్టిన విద్య

పుట్టుకతో వచ్చినది. 'సంగీతం వాడికి వెన్నతో బెట్టినవిద్య' ఇత్యాదులు.

## వెన్నపూస(వంటి) మనసు

మెత్తని మనసు.

"వెన్నపూసా మనసు కన్నతల్లీ ప్రేమ, పండంటి మోముపై బ్రహ్మతేజస్సు."

బసవరాజు.

"వాడిది వెన్నపూసలాంటి మనసు."

వా.

## వెన్నప్పము

వెన్న పూసి చేసిన అప్పము.

"కు, మారుఁడు వెన్నప్పమువలె మల యుచు నుండెన్." వీలా.మా. 2.135.

## వెన్నవలె గరగు

వెన్నవలె కరగి పోవు. అంత సులభముగా కరగిపోవుదు రనుట.

'కను వేదురునన్ బయిగాలి సోఁకినన్, వెన్నవలెన్ గరంగు నలి వేణులఁ గౌఁగిటఁ జేర్చుభాగ్యముల్'

మను. 2.57.

**వెన్నాస**
ఆధారము.
వీపు నానించుట కాధార మయినవాడు అన్న భావంతో ఏర్పడిన పలుకుబడి.
"అనల్పితశౌర్యాబ్ధికిఁ గ్రేవ రాహుతు లకు న్వెన్నాస యై..."
శుక. 1.349.

**వెన్నాసగా నిల్చు**
సహాయ మగు.
"పన్నగాశన! నీవు వెన్నాసగా నిల్చి, యట వచ్చి నహితుల నడఁచ వలయు." ఉషా. 4.48.

**వెన్నిచ్చు**
యుద్ధమున ఎదిరించ లేక వెను తిరిగి పాఱిపోవు.
లక్షణయా ఓడిపోవు.
"ఎదురం గాల్కొని నిల్వ నుక్కణఁగి వె న్నీఁ గాల్వురు..."
కుమా. 11.35.
లొంగి పోవు, పరాజిత మగు.
పోరులో ఓడిపోయినప్పుడే కదా వీపు చూపి పారిపోవు నది. తద్వారా వచ్చిన పలుకుబడి.
"విషయేంద్రియములకు వెన్నిని బాస."
బస. 2.28.

**వెన్ను చఱచు**
తఱిమి వేయు.
"కఱకుచీఁకటి వెన్ను సఱచువాఁడు."
కాశీ. 3.284.

**వెన్ను దన్ని**
వెనువెంటనే.
"చిన్ని వెన్నెలకందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ, బొడమినచెలువ తోఁబుట్టు మాకు." మను. 2.43.

**వెన్ను పగులు**
నడుము విఱుగు.
"అన్న సోదరులకును వెన్ను పగిలె."
వ్యస. నాట. 33.

**వెన్నుపోటు**
హితవంచన.
యుద్ధంలో ఎదుట వాడితో పోరాడుతుండగా తన వెనుక నున్నవాడే పొడుచుటన్నపై వచ్చినపలుకుబడి.
"మా తమ్ముడు ఆ షావుకారు పక్షమై. వెన్నుపోటు పొడవకుండా ఉంటే యీ వ్యవహారంలో తప్పకుండా నెగ్గి ఉందును." వా.

**వెన్నుబామునకు కబు రందు**
చుఱుకు తగులు.
"నీకు వెన్నుబామునకు కబు రంద కున్నది." ధర్మజ. 46.16.

**వెన్నులో పొడుచు**
వెన్నుపోటు పొడుచు.
"వా డిలా వెన్నులో పొడుస్తా డని నే ననుకో లేదు. నావాడు గదా అని నమ్మితే యింత పని చేశాడు." వా.
చూ. వెన్నుపోటు.

**వెన్ను నూచు**
ఓడించు.
"కిన్నెరుల వెన్ను నూచి."
పార. 3.9.

వెన్నెముక పోట్లు

నడుము నొప్పి.

"జ్వరం ఎంత ఉంటే నేమి కానీ వెన్నెముక పోట్లు భరించ లేకుండా ఉన్నాను." వా.

వెన్నెముక బలం లేదు

నైతికశక్తి లేదనుట.

**'Moral Back bone'** అన్న ఇంగ్లీషు పలుకుబడిపై తెలుగు లోనికి వచ్చినది.

"ఇన్నాళ్లూ ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోశాడు. వా శ్లేదో కమిటీలో వేసే సరికి ప్లేటు ఫిరాయించాడు. ఒట్టి వెన్నెముక బలం లేనిమనిషి." వా.

వెన్నెముకలో పాములు చెలరేగాడు

కామోద్రేకము, భావ వివశత కలిగిన దనుట.

ఇటీవల యేర్పడినపలుకుబడి.

"ఆ అమ్మాయి చెయ్యి తగిలేసరికి వీడికి వెన్నెముకలో పాములు చెలరేగాడి నట్లయింది." వా.

వెన్నెముక విఱిగింది

స్థైర్యము సడలి పోయిన దనుట.

శరీరంలో వెన్నెముక అతి ప్రధాన మయినది.

"చేతి కదిగినకొడుకు పోయేసరికి వాడికి వెన్నెముక విరిగి పోయింది." వా.

వెన్నెల కోలు

నమస్కారము.

"విష్ణుపురంబున విలసిల్లుమహా,విష్ణుస్వామికి వెన్నెలకో లని." హంస. 4.213.

వెన్నెల గాయు

ఎండ, వెన్నెల వీని విషయం లోనే కాయు అనేమాట చేరి విన వస్తుంది. వ్యాపించు, ఫలించు, విరియు అనేఅర్థాలలో ఉపయుక్త మవుతుంది.

"మోముపున్నమచందమామ వెన్నెల గాయుట." కా. మా. 2.10.

వెన్నెల పదములు

జానపదగేయములలో అల నాడివి ఒక విశిష్టశాఖ అయి వుండును.

పండితా. ప్రథ. వాద. పుట. 513.

వెన్నెల పలక బాఱు

తెల్లవడి పోవు, తెల్ల వోవు.

"మోము వెన్నెల పలకఁ బాఱ." కుమా. 5.70.

వెన్నెల ప్రోవుగా చేయ గల్గు

వెన్నెలను కుప్ప వోయ గల దమ్మా అది-అన్నట్లు నిరసనలో అసాధ్యకార్యములను సాధించ గల అతి చమత్కారి అనుటలో ఉపయోగించేమాట,

పండితా ప్రథ. పురా. పుట. 359.

వెన్నెల మిటమిట కాయు
ధ్వన్యనుకరణము.
"వెన్నెల, మిటమిటఁ గాయంగ మేను మిగుల సెటికె యదే." కళా. 6.268.

వెన్నెలవడ
విరహము.
వెన్నెలను ఎండగా భావించు వారు విరహులు కనుక.
"కలిగె నొక జాంబవతి వె, న్నెలవడఁ బడె దేల." ఉ. హరి. 3.115.

వెన్క వేసుకొను
సహాయముగా వచ్చు, వత్తాసి వచ్చు.
"అ, స్తమహీభృన్మణి వెన్క వేసికొని మిత్రప్రేమ." సారం. 2.160.

వెయినోళ్ల బొగడు
నోరార పొగడు.
"కోరికలకంటె సాహస్రగుణితఫలముఁ, జూరసి యవ్విభు వెయినోళ్లఁ బొగడు వారు." విక్ర. 5.124.

వెయిపాళ్ల పాలు
వెయ్యోవంతు, సహస్రాంశం.
"...పలకోటి యొక్క పుష్పంబునఁ బూన్చు, ఫలమున వెయిపాళ్ల పాలికి సెయిదవు..."
పండితా. ప్రథ. దీక్షా. పుట. 51.

వెయ్యార్లు
ఎక్కువధనము.
"అయ్యా! మీతండ్రి గడింప లేదు గద వెయ్యార్లెన్నడుం జాలు మీ, మోము ల్దిందురు గాక..." శుక. 3.274.

వెయ్యాఱులు
అసంఖ్యాకులు.
"వెయ్యారులలో సరి లే రయ్యా." విజయ. 1.103.

వెయ్యిండ్ల పూజారి
ఇల్లిల్లూ తిరిగేవాడు.
"వాడు వెయ్యిళ్ల పూజారి. ఎప్పు డెక్కడ ఉంటాడో ఆ దేవుడికే తెలుసు." వా.

వెయ్యేళ్ల వర్ధిల్లు
ఏదైనా సంతోషవార్త చెప్పినప్పుడూ, మనసుకు సంతోష పెట్టినప్పుడూ అనే మాట. ఇట్లాంటిదే 'నూఱేండ్లు వర్ధిల్లు.'
"ఆ కొమ్మ యమ్మాడ్కిఁ దె,ల్పిన బంటుం గని యూరుజాబ్జముఖి మే ల్వేయేండ్లు వర్ధిల్లు చ,క్కని నా నాథుఁడు వచ్చె..." శుక. 2.227.

వెరజి వెంపఱ లాడు
"విలయంబు నొందించు విపినంబు పందుల, వెరజి వెంపఱ లాడు హరిణము లను." శృం. శా. 2.22.
చూ. వెరజి వెంపఱలు వెట్టు, తఱిమి కొట్టు.

వెరజి వెంపఱలు వెట్టు
మట్టి మల్లాడు.
"...కలంచి కలగుండు సేసి మట్టి మల్లాడి వెరఁజి వెంపఱలు వెట్టి..." తెలుగు జాతీయములు.

వెరవు పడు
పీలగు.

"కప్పి పుచ్చ వెరవు పడకుండు నట్లుగా." హర. 5.57.

## వెరవేకి

భయజ్వరము.

భయము కలిగినప్పుడు జ్వరము రావడం కలదు. దానినే 'జడుపుజ్వరం' అని కూడా అంటారు.

"...నా పేరు తెలియ, విన్న మిత్రికి నైన వెరవేకి వచ్చు."
గౌర. హరి. పుట. 117.

"తల్లడంబునఁ ద్రయోదశవిధజ్వరు నకు, విన్నమాత్రనె వెరవేకి దాఁకె."
జైమి. భార. 8.13.

"కయ్యంబునఁ బాఱఁ బాఱ గాయంబు చేసి వెఱవేకి గొల్పిన."
అము. 6.86.

"నా, కీ వెరవేకి మాన్పఁ గమలేక్షణ యబ్బితి వీవు వెజ్జవై."
హరి. ఉత్త. ఆ. 7.

## వెరసుమాట

పిండితార్థము.

వెరసి- అన్నిటినీ కలిపి. అన్నపదంపై వచ్చినమాట. లెక్కలలో వాడుపదము.

"యిన్నియుం జెప్ప నేల వెరసుమాట యొకటి కల దని యిట్లనియె."
కళా. 5.85.

## వెర్రి నాగన్న

చవట, అమాయకుడు.
జగ. 19.

## వెర్రి బాగులది

అమాయకురాలు.
క్షేత్ర. 35.

## వెర్రి మొర్రిగా

పిచ్చి పిచ్చిగా.
గిర. 18.

## వెఱ గందు

భయపడు.
పాండు. 3.91.

## వెఱచఱచు

భయపడు.

"మన బలంబు దెరలి మరల వెఱచఱచి కనుకనిం బఱచిన."
భార. భీష్మ. 2.91.

## వెఱపింప బోయి వెఱచు

భయపెట్ట బోయి తానే భయపడు.

"వెఱపింపఁ బోయి వెఱచిన, తెఱఁగునఁ దా వేఁడుకొనఁ బతి స్వైనుకొనియెన్."
ప్రభా. 5.142.

## వెఱ పెక్కు

భయపడు.

"వెఱపించిన నే వెఱ పెక్కువాఁడనే." భార. కర్ణ. 2.38.

## వెఱబొమ్మ

దృష్టిబొమ్మ

భయపడుటకై చేలల్లోనూ, అందమైన యిండ్లమీదా దిష్టిబొమ్మలు పెడతారు.

"భిల్లగజేంద్రుల్ వెఱబొమ్మలం దవిఁద చేలం జేయుదుర్ గావునన్."
కా. మా. 3.7.

## వెఱబొమ్మ గట్టు

దిష్టిబొమ్మ కట్టు.

వెఱపింపగా కట్టిన బొమ్మ—వెఱబొమ్మ.

"ప్రేవులు చుట్టి పట్టి దిగం బడక వెఱ బొమ్మలం గట్టినట్లు వ్రేలియుండు."
ఉ. హరి. 4.229.

## వెఱవు చేయు

ఏర్పాటు చేయు.
హర. 5.41.

## వెఱ్ఱి గొలుపు

ప్రేమాతిశేకము కలిగించు.

"కొమ్మ! ఈతఁడె పిల్లగ్రో వూఁది వ్రేత, గొమ్మలఁ గడు వెఱ్ఱి గొలిపిన వాఁడు."
ద్విప. మధు. 4.

## వెఱ్ఱిజనులు

మూర్ఖులు.

"వి త్తమదమ త్తచిత్తు లై వెఱ్ఱిజనులు."
శివ. 2.96.

## వెఱ్ఱి తీరె రోకలి తలకు చుట్టుమన్నట్లు

తాను చెప్పుమాట తప్పని తానే తెలుపుకొనుపట్ల ఉపయోగించేపలుకుబడి.

వెఱ్ఱి కుదిరిన దని అంటూనే రోకలి తలకు చుట్టు మనుటతో తన వెఱ్ఱిని తానే ఋజువు చేసుకుంటున్నట్టే కదా!

## వెఱ్ఱి దీరె రోకలి దల జుట్టుమను

తా నను మాటలలోనే అను చున్న దానికి విరుద్ధ మైన భావము వ్యక్త మగుట.

వెఱ్ఱి తీరినది అని చెప్తూ వెఱ్ఱి తీర లే దని సూచించే—రోకలిని తల చుట్టు—మని అన్నట్టు.
కళా. 2.108.

## వెఱ్ఱి దెలిసి వేదురు నవ్వు

వెఱ్ఱి తొలగినా వెఱ్ఱినవ్వు నవ్వు.

"వెఱ్ఱి దెలిసి మఱియు వేదురు నవ్వేము." తాళ్ల. సం. 8.177.

## వెఱ్ఱినవ్వు

వెకిలి నవ్వు, ఎక్కువగా నవ్వు.

"కుసుకుపాలిండ్లపైఁ గొంగు జాఱఁగఁ గొప్పు, వీడ నూరక నవ్వు వెఱ్ఱినవ్వు!"
పాండు. 3.62.

## వెఱ్ఱినీరు

సారావలెనే మత్తు కలిగించునట్టి, వెల తక్కువై నట్టి ఆసవము.

"వెఱ్ఱినీ రానుకతమున వెడలునట్టి, చొక్కుఁ బోఁదట్టి యొకకన్ను వెక్కఁబెట్టి."
శుక. 3.32

## వెఱ్ఱి పట్టు

పిచ్చి పట్టు.

"ఓరి! వీనికి వెఱ్ఱి బట్టె నేమో."
హేమా. 13.

## వెఱ్ఱి పడుచ

పిచ్చిపిల్లా

లాలనగా అనుమాట.

"కుసుమాస్త్రుని యుద్ధతి యోఁప లేక
వె, ఱ్ఱి పడుచ! యెంత మాన్చిన నెఱిం
గెడుదానవు గావు......"
కళా. 4.101.

వెఱ్ఱిమాలోకం
వెఱ్ఱిబాగులది.

వెఱ్ఱివాడు
అమాయకుడు.
కాశీ. 4.93
"వాడు వట్టి అమాయకుడు." వా.

వెఱ్ఱివాని చేతిరాయి
అది యెవరి కైనా తగల
వచ్చును.
"నాతి వెఱ్ఱివాని చేతి రాయి."
రాధి. 3.23.

వెఱ్ఱివేషాలు వేయు
అడ్డదిడ్డంగా ప్రవర్తించు.
"ఇలా వెఱ్ఱివేషాలు వేశా వంటే నాద
గ్గఱ పనికి రాదు. సవ్యంగా ఉంటే
ఉండు. లేక పోతే వేఱే రూము
తీసుకో." వా.

వెల కఱవు సేయు
అమూల్య మగు.
"వెల కఱవు సేయు వెలచేలములు."
సారం. 2.198.

వెల కిప్పించు
అమ్మించు.
"బేరము పొసగించి చేసి వెల
కిప్పించె." హంస. 5.359.

వెలకు దీయు
కొను.
"వివిధపరిమళవస్తువుల్ వెలకుఁ దీసి."
హంస. 5.352.

దక్షిణాదిలో 'తీయు' అను
మాటను 'కొను' అనే
అర్థంలో విరివిగా ఉపయో
గిస్తారు. 'చీర ఎంతకు తీ_స్తిరి.'
'మొన్న నే ఒక యిల్లు
తీ_స్తిమి.'

వెలకు మార్చు
అమ్ము.
"వారసీ,మంతిని కీయనో వెలకు మార్చ
నో యేటికిఁ గొంచుఁ బోయెద,త్యంతర
యాన...."
హంస. 3.233.

వెలగకా యంత బంగార
ముండదా ?
తనున్నట్లే అందరూ సుఖంగా
ఉన్నారని యెంచి మాట్లాడే
వారి విషయంలో అనేమాట.
కృష్ణదేవరాయల దగ్గర ఒక
మంగలి ఉండేవా డట. వాడు
కష్టపడి వెలగకాయంత
బంగారం సంపాదించుకొన్నా
డట. అప్పటినుంచీ 'ఎవరు
మాట్లాడించినా ఎవరి దగ్గ
రైనా వెలగకాయంత
బంగారం ఉండదా? అనే
వాడు. ఈ కథపై వచ్చిన
పలుకుబడి.
"నీ కేం నీ కేం అంటావు? అందరూ
నీలాగే ఉన్నా రనా? వెలగకా
యంత బంగారం ఉండదా? అన్నా
డట వెనుకటికి ఒకడు." వా.

వెలగ బెట్టు

నిరసనగా 'ఏమి ఉద్ధరించాడు?' అన్నట్లుగా ఉపయోగించే పలుకుబడి.

అనవసర ప్రదర్శనపట్ల నిరసనగా ఉపయోగిస్తారు.

రామచం. 94.

"ఆ ఊళ్లో పోయి వీడు వెలగ బెట్టే దేమిటి ?" వా.

"పాండిత్యం వెలగ బెట్ట బోయి పల్టీ కొట్టాడు." వా.

"అంతమంది పండితులదగ్గర వీడు పాండిత్యం వెలగ బెట్ట బోయి నవ్వుల పా లయ్యాడు." వా.

వెలది వెన్నెల

తెల్లని వెన్నెల.

"ఆత ప్తంబు లగునెలవులం దొరఁగి పరఁగు వెలఁదివెన్నెలల నీరువట్టు వెన్నెల పిట్టలును పొట్టలు నిండ నాస్వాదించె...." పాండు. 4.16.

వెలయాలి కూరిమి

డబ్బిచ్చువఱకే ఉంటుంది.

వేశ్యానురాగము నమ్మరానిది.

రాధి. 4.79.

వెలరు పోవు

వెలవెల పోవు.

లక్షణ యా పాడగు, చెడి పోవు.

"వృక్షవాటంబులు వెలరు పోయె." కాశీ. 5.267.

వెల లేని

అమూల్య మయిన.

"వినయముతో నుండు నదే వెల లేని గుణము."

తాళ్ల. సం. 3.168.

వెల లేని సొమ్ము

అమూల్యము.

"వెడవిలుఁ గన్నమ్మ! వెల లేని సొమ్మ !"

హేమా. పు. 2.

వెల వెట్టు

కొను.

ధర పెట్టి కొను.

"నేఁడు శ్రవణానందంబుగాఁ బల్కుటన్, సూనాస్త్రున్ వెల వెట్ట కేలితి సుఖార్ణోరాశిలోఁ గ్రుంకితిన్."

మను. 3.108.

వెలవెల పాఱు

తెల్లపోవు.

"బ్రథముండు వెలవెలం బాఱుచు నూరకుండె."

కళా. 3.283.

వెలవెల బాఱు

తెల్లపడు.

"వెలవెలఁ బాఱెఁ దూర్పుదెస."

రుక్మాం. 3.187.

వెలవెల బోవు

"వెలఁదిరో మేడపై వెలవెల బోయి."

పల. పు. 49.

వెలా తెలా పోయాడు

చూ. వెల వెల పోవు.

వెలార్చు

వెలువరించు.

"వెలార్చి తేని వె,ల్పటన నున్నలోకముల భస్మము సేయు."

భీమ. 4.68.

వెలికి దార్చు

బయటికి లాగు.

"కందర్పహుతాశను స్వెలికిఁ దార్చు సఖుండును బోలె."

పారి. 1.112.

వెలి గ్రాయు

క్రక్కు, వమనము చేయు.

"అమ్మణుల నెల్ల, నంబుదంబులు వెలి గ్రాసె నలుగ కనఁగ."

పాండు. 4.23.

వెలిచవుల కరుగు

వ్యభిచరించు.

తన భర్తను కాక యితరులను మరుగు.

"తవులుకోర్కులచే వెలిచవుల కరుగ, నందుఁ గానక కుందు నయ్యిందువదన."

శుక. 2.505.

వెలితి అగు

ఇతరుల దృష్టిలో చులకన అగు.

"ఇలా చేస్తే మనం నలుగురిలోనూ వెలితి అయి పోతాము." వా.

వెలితి బెట్టు

కొంతుకు కల్పించు.

"వెలి ద్రాక్షసిగ్గుచే వెలితిఁ బెట్టుట కాక."

నిరంకు. 2.33.

వెలితి వడు

లోపభాజన మగు.

"ఆమాట అని వాడు నలుగురిలోనూ వెలితి పడ్డాడు." వా.

వెలి పుచ్చు

బయటికి తీయు.

"ఏను బాణంబు వెలి పుచ్చినపు డెల్ల చనుఁ బ్రాణములు."

వర. రా. అయో. 499. పంక్తి. 18.

వెలి పెట్టు

వెలి వేయు, బహిష్కరించు.

"వెలి పెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి, దాశకన్యాకేళి తప్పుఁ జేసి."

మను. ఆ. 2.

వెలి లోపు లేదు

వెలుపల బయట అన్నది లేదు.

పాపపుణ్య విచక్షణ, యుక్తాయుక్తవివేచనం వగైరాలు లేవు అని లక్షణార్థం.

"సురగరుడోరగవిద్యాధరపురవరసతులతోడ దనుజేశ్వరు కిం, కరులు రమింతురు దోషా,చరులకు వెలి లోపు గలదె చతురాననుఁడా!"

కుమా. 4.18.

వెలి వడు

బయలు దేరు.

"వేలంబె పైన మై వెలివడుఁ డన్న."

వర. రా. యు. పు. 833. పం. 14.

వెత్తి యగు

తక్కువ యగు.

"తామసవృత్తి లేదు సతతంబును నుగ్రుఁడు కాడు పౌరుషం, బేమియు వెత్తి గాదు."

పారి. 1.9.

వెలుగని మంగలము జూచి శునకము బెదరినట్లు

అనవసరముగా భయపడు.

"మదిలోన వెలుఁగని మంగలముఁ జూచి, పెనుపొంద ఘనకంబు బెదరిన యట్లు."
మైరా. పు. 25.

## వెలుగుచే న్మేసిన గాచువార లెందు కలరు

'కంచెయే చేను మేసిన కలదె దిక్కు' వంటిది.
రక్షకులే భక్షకులు కాగా కాపాడుది క్కెవరు?

"భండనంబు గలుగఁజేసె నింక వెలుగు చే న్మేసినఁ గాచువార లెందుఁ గలరె జగతి." ఉ. హరి. 5.42.

చూ. వెలుగు చేను మేసిన నెద్ది కాపు.

## వెలుగు చేను మేసిన నెద్ది కాపు

'కంచెయే చేను మేసిన గలదె దిక్కు'
రక్షకమే భక్షక మైనచో గతి యేమి? అనుట.

"ఇల వెలుఁగు చేను మేసిన, మలయానిల! యెద్ది కాఁపు మదిఁ జింతింపన్." ప్రభా. 4.158.

## వెలువడ ద్రోపించు

బయటికి త్రోయు.

"కోపించి సురల వెలువడఁ ద్రోపించె సురారి." కుమా. 4.25.

## వెలువెలుక బాఱు

తెల్లబడు.

"వెలువెలుకఁ బాఱె దేహము." రుక్మాం 1.141.

## వెల్లబాటు

తెల్లదనము.

"పగడంబునకు వెల్లబాటు చేకురుఁ గాక." బాల. 47.

## వెల్ల విరి యగు

వ్యాపించు.

"వెల్లవి రాయను మాయ వెనకా ముందు." తాళ్ల. సం. 7.256.

## వెల్లాటకత్తియ

భోగముది.

"ఎందు వె, ల్లాటకత్తియ కిచ్చి నట్టి సొమ్ము." విప్ర. 5.79.

## వెల్లి గలిపిన చింతపండు

వ్యర్థము.
కొంచెము నీళ్లలో చింతపండు కలిపితే పులుసెక్కుతుంది. అదే ప్రవాహంలో కలిపితే వ్యర్థమే అవుతుంది కాని పులుసెక్కదు కదా!

"మాటి మాటికిఁ జేసినమందు లెల్లఁ, జెల్లెఁ బో వెల్లిఁ గలిపినచింతపండు." రా. మా. 3.111.

## వెల్లి గొను

క్రమ్మి వేయు, వ్యాపించు, ప్రవహించు.
వెల్లువవలె — ముంచి వేసె ననుట.

"వెల్లిఁ గొనె నిఖిలదిక్కుల, నల్లని చీఁకటి." భీమ. 2.34.

"ఇట్లమ్మహానది...వెల్లు వెల్లి గొని." భాగ. స్క. 9.230.

"శృంగారవారిధి యై, కువలయముక వెల్లి గొనియె ననఁగ." కుమా. 9.22.

## వెల్లి గొలుపు

విస్తరింప జేయు.

"ఇల్లిదె శ్రీవెంకటేశ్వరు నామము, వెల్లి గొలిపె నీ విష్ణుకథ."

తాళ్ల. సం. 9.66.

## వెల్లి గొల్పు

వెల్లువ పాఱించు.

"విలోకనప్రభా, వీచికలన్ దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్."

మను. 2.29.

## వెల్లి పొడుచు

ప్రవహించు, పొంగు.

"వెడఁదకన్నుల కాంతి వెల్లి వొడువ"

పాండు. 4.64.

## వెల్లి బోవు

వరద పాలగు, వ్యర్థ మగు.

"పార్వతీపతిచేతఁ బడసినదివ్యాస్త్ర, భూరిసంపద వెల్లి బోయె నన్న"

ఉ. హరి. 4.300.

## వెల్లివాఱు

అతిశయించు.

"ముఖసరస్సున లావణ్యము వెల్లి వాఱఁగ్రేవల, నమరించిన పిల్లకాలుఁవ లంగన వీనుల్"

కళా. 7.128.

## వెల్లి విరియు

ప్రవహించు.

వి.ప్ర. 2.14

## వెల్లి విరిసిన

ప్రవాహము ఏరు నిండి పొరలి పాఱినట్లుగా అని భావము.

"నేల యీనినచందంబున వెల్లి విరిసినచాడ్పున నుసుల్లవిధంబున..."

హంస. 3.29.

## వెల్లి వొడుచు

ప్రవహించు, పొంగు.

"అడుగులేఁజిగురాకు లంటినచో నెల్ల, వివిధతీర్థ్రవేణి వెల్లి వొడువ."

పాండు. 2.152.

రూ. వెల్లి పొడుచు.

## వెల్లువలు గట్టు

ప్రవహించు.

"పెనువెల్లువలు గట్టి యతివిషమమానినీ మానప్రతీరంబు లురలం ద్రోయుచు."

పారి. 2.53.

## వెల్వడు

బయటికి వచ్చు.

"వెల్వడి రంగన లా సరోజినిన్."

రుక్మాం. 3.206.

## వెల్వెలన బారు

వెలవెల పోవు.

"పలుకుల కల్కి వెల్వెలన బార."

రాధి. పీఠిక. 36.

## వెళ్ల బెట్టు

వ్యాపించు.

"వెళ్లఁ బెట్టునో పూర్ణవిధుకాంతి మొగమున, దిగపారునో పైఁడి తెలివి మేన."

నిరంకు. 4.91.

## వెస లిచ్చు

చేయూత యిచ్చు, సాయ పడు.

"తాఁ జెడ్డవాఁడు, వెనకయ్య చేతికి వెస లిచ్చె ననుమాట, నిజముగా."

ఉ. హరి. 4.50.

## వేంచేయు

ఊరేగు.

"ఉరగరిపువాహనమున నొకొక్క

వేళ, వేడ్క వేంచేసి మెఱయుఁ దిర్వేఘులందు."
పాండు. 4.144.
"పెరుమాళ్లు అంగరంగవైభవంగా వేంచేస్తున్నాడు." వా.
"పెరుమాళ్ళను ఇప్పుడే వేంచేపు చేశారు. ఊరేగింపునకై బయలు దేర దీశారు. వా.

## వేకి వెచ్చ యగు

జ్వరము వచ్చు.
"వేకి వెచ్చ యైన వెచ్చని మందులఁ, గాచె మానునట్లు."
కా. మా. 3.114.

## వేటకాడు మెత్తపడితే లేడి మూడుకాళ్ల మీద నడుస్తుంది

రౌతు మెత్తనైతే గుఱ్ఱం మూడుకాళ్ల మీద నడుస్తుంది అనుట వంటిది.
సింహా. నార. 9.

## వేటకాని యిల్లు వెఱవక కుందేలు సొచ్చినట్లు

ప్రమాద మున్న చోటికే వచ్చుటను సూచిస్తూ అను మాట.
కుమా. 12.87.
చూ. వంటిల్లు చొచ్చిన కుందేలు.

## వేట చెఱకు పండువు

'బలి యిచ్చు' జాతర.
'వేట యిచ్చు' అని గ్రామ దేవతకు బలి యిచ్చుట నంటారు.
"ఆహా! యూహలు చేసిరె, సూహక ముల నట్టి పగర గొఱియలుగా ను, గ్రాహవచండిక యగుమ, ద్వాహాసికి వేఁటచెఱకుపండు వొనరుప్."
నలచ. 2.126.

## వేట లాడు

వేటాడు.
"వేఁట, లాడ నేటికిఁ బోయె నవని విభుఁడు." రుక్మాం. 1.56.

## వేటాఱుగా వ్రేయునట్టి

ఒక దెబ్బతో ఆఱుతుండ్లుగా నఱుకునట్టి.
బాహుబలసంపన్ను డనుట.
"కట్టల్క వేటాఱుగా వడి వ్రేయు."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 385.

## వేట్లాడు

కొట్టుకొను.
"వెన్నలు దాఁకఁగ వేట్లాడుచును, సన్నపుఁబడుచుల సంగడిని."
తాళ్ల. సం. 1.150.

## వేటేడు తునుకలుగ వేయు

"వేటేడు తునుకలుగ వేయఁ గల సాదులును." శృం. శా. 3.77.
చూ. వేటాఱు తునియలు చేయు.

## వేడ్కలు కొన లొత్తు

కోరికలు ననలు వేయు.
అనగా ఎక్కువగు.
"అని సన్నుతించి వేడ్కలు, గొన లొత్తఁగ బ్రహ్మచారికుంజరుఁడు..."
హంస. 1.169.

## వేడి పలుకులు

కోపపు మాటలు.

"ఏ మంచుఁ బల్కితి వీ వేఁడి పలుకులు."
వర. రా. అయో. పు. 302.పం. 18.

## వేడిమాట
కష్టము కలిగించుమాట.
"మదిరాక్షి యీ వేఁడిమాట నా చెవులఁ, గదియించి."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 217.

## వేడిమి సూపు
పరాక్రమము చూపు.
"ఒండొరులకు వేఁడిమి సూపి యేపునం జెనంగు నెడ."
భార. ద్రోణ. 4.116.

## వేడి విడువని కూడు
ఆరగించుట కను వయినది.
తాళ్ల. సం. 11.3. భా. 116.

## వేడి వెల్లగా జేయు
నశింప జేయు, పొగ రణచు.
"మల్లె మొగ్గల వెవ మదనుని వేడి, వెల్లగాఁ జేసితిఁ దెల్లంబు గాదె."
బస. 6.157.

## వేడి వెస లట్లు వేసరు
మిక్కిలిగా వేసట పడు, విసుగు చెందు.
"అంతఁ దలిదండ్రు లయగార లది మొదలుగ, వేఁడి వెసలట్లు వేసరి విడువ నేను."
హంస. 3.145.
దీని వ్యుత్పత్తి విచార్యము. వేడి వెసల—మట్టి చట్టి వంటి దానిని వెసల అంటారు. కాలుతున్న చట్టిని పట్టు కొనుటకు సాధ్యపడక వదలి వేసినట్లుగా నని భావార్థము కావచ్చు నేమో!

## వేడుకం జేసి
కోరికవలన.
"భీమనాథేశ్వరు దర్శించు వేడుకం జేసి." భీమ. 3.124.

## వేడుకలా కత్తె
విలాసిని.
"అమరవరుల నడుగ నా వేడుకల కత్తె." భాగ. స్క. 9.380.

## వేడుకలు చూపు
సంతోషము గొలుపు.
"వేడుకలు చూపు శశికాంత వేదు లందు." రుక్మాం. 4.70

## వేడుక సలుపు
క్రీడించు, విహరించు.
"పొం దొంద నీయిందుముఖులతోఁ గూడి, వేడుక సలిపెద వేని."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1272.73.

## వేడెము వెట్టు
చక్రభ్రమణము చేయు.
"వినువీధి నట్టింట వేడెంబు వెట్టి."
వర. రా. సుం. 13.24.

## వేణ్ణీళ్లార్చు
వేణ్ణీళ్లు పోయు, స్నానము చేయించు.
"అలఁదు నలుంగు దేహమున వేణ్ణీ ళ్లార్చు." కా. మా. 4.11.

## వేత్రహస్తులు
చోపుదారులు, బెత్తాలవారు.
హర. 4.94.

వేద వట్టు

వేదప్రవచనము చేయు.

"వేదవట్టి యింక నేమి వెదకేరు చదివేరు, వేదాంతవేద్యుఁ డైనవిష్ణు నెఱుఁగరా." తాళ్ల. సం. 9.246.

వేదసంత

వేదాధ్యయనము.

"వేదసంతల కాలమ్ము వెళ్లఁ బుత్తు." శ్రవ. 1.65.

చూ. సంత చెప్పు.

వేదు రెత్తు

వెఱ్ఱి యెత్తు.

"మొగంబులు బిగించికొని వేదు రెత్తిన గతి నరిది యెత్త" ఆము. 4.35.

వేనవేలు

అనేకం, అనేకులు.

"అవి యాది గాఁగ బ్రహ్మాండపురాణ, వివిధసూక్తుల వేనవే ల్విధంబులను, గఱకంఠు పాదోదకము విస్తరించు," పండితా. ప్రథ దీక్షా. పుట. 49.

"వేనవేలు నివాళులు విస్తరించు." కాశీ. 1.48.

వేన వేల్విధులు

అనేకవిధులు, ఎన్నో రీతులు.

పండితా. ప్రథ. పురా. పుట. 293.

వేపకాయంత వెఱ్ఱి

ఎంతో కొంత చాదస్తం ఉండు ననుపట్ల ఉపయోగిస్తారు.

"పైదిప దన్న తర్వాత వేపకాయంత వెఱ్ఱి ఉండక పోదు." వా.

వేపుకు తిను

వేధించు.

చూ. వేయించి బొక్క లాడు.

వేపుకొని తిను

వేధించు.

"ఆ అత్త కోడలిని వేపుకని తింటూ ఉంది." వా.

వేబోక

ఉషఃకాలము.

హర. 7.30.

వే యన నేల?

ఇం తెందుకు?

"విని నిజ మూను నీ పలుకు వే యన నేల వివాహహీనుఁడన్." హంస. 4.228.

వేయించి బొక్క లాడు

వేధించు, సాధించు.

"ఆ అత్త కోడలిని ఎప్పుడూ వేయించుకొని బొక్క లాడుతుంది. ఆ పిల్ల కాబట్టి సరి పోయింది. ఇం కెవ రైనా అయ్యుంటే ఏ మై ఉం దేదో?" వా.

వేయిండ్ల పూజారి

కొంపలు తిరుగువాడు.

కొంచెం నిరసనగా అను మాట.

"వేయిండ్ల పూజారియా? వాఁడా మీకు ఘనుండు." గిర. 5.

రూ. వెయ్యిళ్ల పూజారి.

వేయికనుల జూచు

ఆసక్తితో చూచు.

రాధా. 1.146.

వేయి గంటాలకు కవిత చెప్పు

సహస్రావధానము చేయు.

వేయిమంది లేఖకులకు వేయి

పద్యాలు తడబడకుండా చెప్పు.

"కవితఁ జెప్పఁగ నేర్చుఁ గరవు దీరఁగ వేయి, గంటాల కైన నిష్కంటకము గ." శ్రవ. 1.74.

వేయినోళ్ల బొగడు

అధికముగా పొగడు.

రాధా. 1.146.

వేయినోళ్ల మెచ్చు

ఎక్కువగా మెచ్చు.

"వీటిరహి మెచ్చ వలయుఁ బో వేయు నోళ్ల." విజయ. 1.82.

వేయి పలుకు లేటికి?

" పలుకులు వేయు నేటికి?"

హర. 2.68.

వేయిమాట లెందుకు?

"వేయు నేటికి శీఘ్రంబ విభుని పొందు, సంఘటింపఁగఁ గల లేని జలజవదన, యాస నొక్కింత ప్రాణంబు లాప వచ్చు." కళా. 6.272.

వేయి వరాల విలువ

అమూల్యము.

ఇక్కడ వేయికి అధిక మని అర్థం.

"తెలిసి వేయివరాల విలువలు దీర్చితిమి యీ రుద్రవీణలు." శుక. 1.222.

వేయి వెట్టినటులు

మఱింత ప్రోది చేసినట్లు.

"మతి వేయి వెట్టినటు లొప్పె."

విజయ. 3.89.

వేయు నులుకత్రాళ్ల ప్రో కగునా?

పనికి రాని వెన్ని చేరితే మాత్రం బల మైన ప్రయోజనకర మైన వగునా? అను టలో ఉపయోగించినపలుకుబడి.

"...వేయు నులుకత్రాళ్లు గూడి యొక ప్రో కగునె."

పండితా. ప్రథ. వాద. పుట. 521.

వేయును వచ్చె

అవన్నీ మాకు వచ్చినట్లే భావిస్తాము.

"నీ యీగి వేయును వచ్చె పోయెదము."

పండితా. ద్వితీ. మహి. పుట. 169.

చూ. మాకు వచ్చె.

వేయు నేటికి?

"...నిట్టి మహామహు లాత్మసేవకున్, హృదయామునందు నియ్యకొను టెవ్వరి కున్నది వేయు నేటికిం, బ్రదికితి సేవ సేయుము." కళా. 2.27.

వే యేల?

ఇం తెందుకు? ఇం తేల? ఇన్నెందుకు? – చాలా సంగతులు చెప్పి కడపట 'ఇం తెందుకు?' అని ఒకమాటలో చెప్పినట్లే – వే యేల అనే ఉపయోగం.

పండితా. ప్రథ. పురా. పుట. 422.

వేర్విత్తు

నాశకము, వేరుపురుగు.

"బలవదంతర్విరోధులకును వేర్విత్తు."

విప్ర. 1.84.

వేరుపురుగు

ఆశ్రయనాశకము.

"భూపకీటమ! వేరుపురుగ వై తీవు."
గా. హరి. ప్రథ. పంక్తి. 1128.
చూ. వేరువిత్తు.

## వేరు (లు) వారు

నెలకొను, పాదుకొను.

"ఏవేళ మదిని, విడువనిదుఃఖంబు వేరులు వార."
వర. రా. అయో. పు. 493. పంక్తి. 18.

## వేరువాఱు

"నీటను దేమ యెక్కి ససి నిల్చి యొకించుక వాడు దేఱె య, ప్పాటున వేరువాఱె ధృతి పాటన మొప్ప నతం డొనర్చ న,ప్పాటునఁ జెన్ను మీఱె."
విప్ర 2.23.
చూ. వేరు తన్ను.

## వేరువిత్తు

నశింప జేయునది.

వేరుపురుగు వంటిది.

"మనపాలి వేరువి త్తని యెఱుంగుదు."
కాశీ. 6.294.

"అమరుల బోనపుట్టిక సహస్రమ యూఖుని బోడుకోడె సం, తమసము వేరువిత్తు కుముదంబుల చక్కిలిగింత పుంశ్చలీ, సమితికిఁ జూక్కవాలు."
పారి. 2.41.

ఈ విత్తునకు పురుగు అన్న అర్థం కావచ్చు నని అని పిస్తున్నది.

"ఎలుఁగులకు వేరువిత్తు దుష్పులకుగండ, మేదులకు మిత్తి లేళ్లకు నెదురు చుక్క."
శుక. 2.283.

## వేరు వెల్లంకి

జం.

"ఆరంగ నడవుల యాపలు నలము, వేరు వెల్లంకియు మారసంహరుని,యొడ లిరోగము మాన్ప నోపునో యింక."
బసవ. ఆ. 3.

## వేలంబు లడుగు

వెల యెంత-ఇక్కడ ఒక రాత్రి కెం తివ్వా లని అడుగుట. మిండ జంగాలు భోగం వాళ్ళను...

"వేలంబు లడుగుచు వెనుక నేఁగుటలు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 319.

## వేలం వెఱ్ఱి

అతి పిచ్చి, అత్యాసక్తి.

ఇదీ జంట పదం కావచ్చు. వేల మన్నా వెఱ్ఱి అన్నా అత్యాసక్తి గొనుట వల్ల కలిగిన ఉత్కంఠ కావచ్చును.

'దాని వేల గొని పై బడ జేసెద' అని కుమారసంభవంలో ఉంది.

"వేలంవెఱ్ఱిగా జనం ఆయోగి దగ్గఱకు పోతున్నారు."
వా.
చూ. వేల గొను.

## వేల గొను

1. ప్రేమించు, వెఱ్ఱిగా ప్రేమించు.

"ఎవ్వరిం, గనుఁగొని మెచ్చకన్న వర కన్యక గల్గిన దానిఁ జెప్ప నీ, పనిచిన వాని వేలగొని పైఁ బడఁ జేసెద."
కుమా. 4.43.

'వేలంవెట్టి'లోని వేలం ఇదే నేమో!

2. పని సేయు, అఱవంలో 'వేలై' పని.

"దేవేంద్రుఁ డెత్తుమే నీ వేలగొని యుండ." కమా. 6.17.

చూ. వేలంవెట్టి.

వేలము పాట

ఏ వయినా వస్తువులను ఇంత ధర అని ఆరంభించి కొనే వాళ్లు ఆధరను పెంచుతూ పోగా ఆఖరు ధర యిస్తా నన్నవానికి యిచ్చి వేయుట.

వేలము పాడు

ఏ వయినా వస్తువులను వేలము పాటకు పెట్టు.

వేలమోడిగా

వేలాదిగా.

కాశీయా. 157.

వేలాంతరాలు

వేలాదిగా.

కాశీయా. 184.

వేలు కోసుకుంటే సున్నం పెట్టడు

పరమలోభి అనుట.

"వాడు వేలు కోసుకుంటే సున్నం పెట్టేవాడు కాదు. విరాళాలకోసం వాడిదగ్గిరికి పోతే ఏం లాభం? వా.

వేలు చూపితే చేయి మింగు

అతి సూక్ష్మగ్రాహి అనుట.

"వాడా అమ్మా! వేలు చూపిస్తే చెయ్యి అంతా మింగేస్తాడు." వా.

వేలు పెట్టు

కల్పించుకొను.

"వాడు ప్రతీ విషయంలోనూ వేలు పెడుతూ ఉంటాడు. కాబట్టే వాడి దగ్గర పని చేయడం కష్టం." వా.

వేలు మడుచు

లెక్క పెట్టు.

"అలిగి యేఁ దెగి వచ్చినపు డెదుర్కొనఁగ, మఖవాదులును వేలు మడుపుమా..."

వర. రా. యు. పు. 45. పంక్తి. 3.

వేలు వెట్టు

చోటు చేసికొను.

"ఇంతలోనే వేలు వెట్టి యిమ్మైకొని వలపు." తాళ్ల. సం. 12.3.

వేలెడంత లేడు

చాలా చిన్నవాడు అనుట.

"వాడు చూడబోతే వేలెడంత లేడు. ఏదో మహాయోధుడులాగా మాట్లాడు తాడు." వా.

వే ల్పెక్కు

పూనకము కలుగు.

"తొడింబడఁ గొంతసేపు వే, ల్పెక్కిన భంగి." భాస్క. అయో. 147.

వేళ కానివేళ

అసమయము.

"వేళ కానివేళ వచ్చావు నాయనా! ఇప్పు డేం ఉంటుంది. అంట్లు కూడా బయట పారేశాము." వా.

వేళ పాళ

సమయము. జం.

"దళపతు లనఁగా నందఱు, దళపతులా కారు పోటుదారియును బలా, బలము లును వేళపాళలు, దెలియం గలవాఁడు దొరికితే వాసి యనఁగ."

పార్శ్వ. 2.26.

## వేళాకోళము పట్టించు

పరిహాసపాత్రము చేయు.

"ఆ పత్రాణ్ణి అందరూ కలిసి వేళాకోళం పట్టించేసరికి వాడానాటినుండి మా యింటికే రావడం మానేశాడు."

వా.

## వేళావిశేషం

కాలమహాత్యం.

జ్యోతిశ్శాస్త్రరీత్యా వచ్చిన పలుకుబడి.

"వాడు వెళ్లిన వేళావిశేష మేమో కాని నాలుగునెలల్లో ఊరును ఒక మొగవ తిప్పాడు."

వా.

## వేళ్ల కొల్చుగా

కంకిలోనే కాక వేరువరకూ ధాన్యము పండినట్లుగా — అనగా విపరీతముగా పండె ననుట.

"వానలు సరవితో వర్షించె సస్యముల్, వేళ్లఁ గొల్చుగ విఱ్ఱవీఁగి పండె."

మను. 6.121.

## వేళ్ల గొల్చుగ బండు

విపరీతముగా పంట పండు.

వేరుల దాకా ధాన్యం (కొల్చు) పండు ననుట.

"వానలు సరవితో వర్షించె సస్యముల్, వేళ్ల గొల్చుగ విఱ్ఱవీఁగి పండె."

మను. 6.121.

## వేళ్లు వారు

పాదుకొను.

"వెలఁదికి మమతలు వేళ్లు వారె."

రాధా. 1.128.

## వేవురు

అనేకులు.

పదుగురిలో అన్నట్లు.

"వేవురిముందర నాడుకొందు."

పాండు. 3.39.

"బాలకులు వేవురిలో సిరియాళుఁ డొప్పె."

హర. 2.72.

## వేసదారి గాయకపు సుద్దులు

కల్లబొల్లి మాటలు.

సారం. 3.203.

## వేసాల బెట్టు

ఆట ఆడించు.

"వెచ్చపుఁగౌఁగిట నన్ను వేసాలం బట్టేవు."

తాళ్ల. సం. 3.4.

## వేసాల బోవు

వట్టి నటనలు చేయు.

వాడుకలో '—' వాడు వట్టి వేషాలు పోతున్నాడు.'

నాటకాలలో వేషాలు వేయడంపై వచ్చిన పలుకుబడి.

"వేసాలఁ బోవ రమ్మా."

హర. 7.133.

## వేసాల వెల్లి

వేషాలమారి.

పద్మ. 40.

## వేసాలు వేయు

వాడుకలో – 'వేషాలు పోకు' అంటారు. 'నాదగ్గఱ యీ వేషాలు సాగవు.'

"ఓసి లేవే మల్లి వేసాలు సేయకు, మగవార లెఱుఁగనిమర్మ మెద్దిః?" శుక. 2.423.

## వేసే ఆకులకూ తీసే ఆకులకూ తెలిపి లేదు

అనేకులు వాళ్లింట్లో భోం చేస్తారు అనుట.

ఇక్కడ ఆకులు విస్తరాకులు.

"వాళ్ళిల్లు ఒక ధర్మసత్రం అనుకో. వేసే ఆకులకూ తీసే ఆకులకూ తెలిపి ఉండదు." వా.

## వైకుంఠ ఏకాదశి

ముక్కోటి ఏకాదశి.

## వైదికచాదస్తం

వైదికుల ఛాందసము.

వైదికులు లౌక్య మెఱుగ రనుటపై యేర్పడినది.

"మా వైదికచాదస్తం, బీ విధమున వ్రాయఁ జేసె నిపుడు నృపాలా!" నానా. 8.

## వైదికము చేయు

చాదస్తముగా ప్రవర్తించు.

"వైదికము చేసితిర యేని బాగు గాదు, తలఁచి మూఁడవహస్తంబు దాఁచి రండి." నందక. పు. 10.

## వైద్య మిచ్చు

వైద్యము చేయు.

"తా మూర్ఛిల్లినవాఁడు వీఁడె విష వైద్యం బిచ్చి రక్షింపరే." దశకు. 5.93.

## వైర మెత్తు

విరోధము పూను.

"ఒక దువ్వు వైర మెత్తి కలవ వచ్చిన." భార. శాంతి. 3.92.

## వొళ్లు బలిసింది

పొగ రెక్కింది.

"వాడిదగ్గర నాలుగు డబ్బులు చేరే సరికి వాడికి ఒళ్లు బలిసింది." వా.

## వ్యంగ్య మగు

హేయ మగు.

ఇది చాలా అరుదుగా యీ అర్థంలో వినిపిస్తుంది. భాస్కర. 57.

## వ్యక్తిగా (విను)

స్పష్టముగా, విశదముగా.

"వ్యక్తిగా విను పెద్దభక్తులు పెద్ద భక్త లంచును మనబసవయ్య......" బస. 7.180.

## వ్యాపకం

వ్యాసంగము.

"ఏదో ఒక వ్యాపకం లేక పోతే పొద్దు పోవడం ఎలాగుః?" వా.

## వ్యాపకుడు

వ్యవహర్త.

నలుగురిలో తిరగ నేర్చిన వాడు.

"వాడు బహు వ్యాపకుడు. ఏ ఊరు వెళ్లినా నాలుగు రోజుల్లో ప్రాముఖ్యం సంపాదించు కొంటాడు." వా.

## వ్రక్కలు వాఱు

ముక్కలు ముక్క లగు.

"భ్రూణఘ్ను, వ్రతుఁ జెఱఁ బడఁ ద్రోయ లేదు వ్రక్కలు వాఱన్." రుక్మాం. 2.35.

## వ్రక్కలు సేయు

ముక్కలు చేయు.

"యదుసింహుఁడు బాణపరంపరాహతిన్, వ్రక్కలు సేయఁ గాఁ ఉరుధిరంబునఁ దోఁగుచు......" పారి. 5.10.

## వ్రచ్చి వందఱ లాడు

కొట్టి కోరాడు, చించి చెండాడు వంటిది.

చీల్చి ముక్కలు ముక్కలు చేసి పారవేయు అనుట.

"అచ్చుగా నార్చుచు హరుఁ డిభ దైత్యు, వ్రచ్చినగతి వ్రచ్చి వందఱ లాడు." బస. 4.90.

"వనశునకంబులు వ్రచ్చి వందఱ లాడి......" కా.మా. 2.63.

## వ్రచ్చి వేటాడు

వ్రచ్చి వందర లాడు.

"మాతృనఖంబుల వ్రచ్చి వ్రచ్చి వేఁటాడఁగ రక్కసుండు." దేవీ. 5.441.

## వ్రతము చెడ్డ సౌఖ్య మైనను వలయు గలుగ

'వ్రతం చెడ్డా సుఖం దక్కాలి.'

'కులం చెడ్డా సుఖం దక్కాలి.'

నియమభంగం అయినప్పటికీ కనీసం అందువల్ల హాయైనా కలగాలి అన్న సత్యాన్ని తెలిపే పలుకుబడి.

"ఇంక నొక్కటి వినుము పూర్ణేందు వదన!, వ్రతము చెడ సౌఖ్య మైనను వలయుఁ గలుగ." మను. 3.103.

## వ్రతము వట్టు

నోము పట్టు.

"నీ వీ, యనుచిత మగువ్రతము వట్టి తది గాక." భార. కర్ణ. 3.75.

## వ్రాతఫలము

విధిఫలితము.

"కంటగింతురు నన్నంటెఁ గమల జాతు, వ్రాఁతఫల మేమియో కాని వనజగంధి!" హంస. 3.150.

ఇది నేటికీ వాడుకలో నున్నది. 'దాని వ్రాతఫలం అట్లా ఉంది. ఏమి చేస్తాము?'

## వ్రేటాఱుతునియలుగా వ్రేయు

అతి బలిష్ఠుడనుట.

ఒక దెబ్బతో ఆఱు తునకలుగా చేయ గల.

"కలన వే టాఱు తునియలు గాఁగ వ్రేయు, బిరుదురౌతుల వార్తలు బెండు పడఁగ." కళా. 8.60.

## వ్రేట్లాడు

వ్రేటు, పోటు, కొట్టు, పోట్లాడు—లపై యుద్ధము, కలహము అనే అర్థాలలో పలుకుబడు లేర్పడినవి.

"గండు మిగిలి వ్రేట్లాడుచు"
జైమి. 2.13.

## వ్రేటు తప్పుటయు జోహా రను పగిది

చావు తప్పుట కూడా గొప్ప లాభమే అన్నట్టు.

"ఒగి వ్రేటు తప్పుటయును జోహా రనెడుపగిది."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 2766.

## వ్రేటు లాడు

కొట్టు.

"తామరల వ్రేటు లాడుచోఁ దరుణు లెత్తు, కరరుహాంకితబాహువల్లరులు వొలిచె." పారి. 4.33.

## వ్రేటు వడ్డ యురగాంగన

దెబ్బ తిన్న పాము.

పాము దెబ్బ తిన్నప్పుడు మహా రౌద్రాకారంతో పడగ యెత్తి బుస కొట్టుతుంది.

"అన విని వ్రేటు వడ్డ యురగాంగన యుం బలె నేయి వోయ భగ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి."
పారి. 1.82.
చూ. తోక త్రొక్కిన త్రాచు.

## వ్రేలంట

వ్రేలి పొడవు పొడవుననూ. అంగుళ మంగుళమునకు అనుట (వేలు+వెంట.)

"వ్రే లెంట కొక్కొక్క వృక్షంబు గలదు."
పండితా. ద్వితీ. పర్వ. పుట. 480.

## వ్రేల చూపించుకొన కుండు

ఒకరు లోపము లెన్నుటకు వీలు లేనట్లు ప్రవర్తించు.

"యెన్నండు నెచ్చోట నెవారిచే వ్రేలఁ, జూపించు కొనక ప్రస్తుతికి నెక్కి." కళా. 3.240.

## వ్రేలి గొని చూపు

తప్పు పట్టు.

"సురగణ మైన వ్రేలిఁ గొని చూపఁగఁ జాలరు." భార. ద్రోణ. 1.113.
చూ. వే లెత్తి చూపు.

## వ్రేలిమిడి

చిటిక, త్రుటి అని శ. ర. అదే టిప్పణిలోనూ. కానీ ఎలాగో తెలియడం లేదు.

"భావజాస్త్రాభిహతి మహాదేవుఁ డొక్క, వ్రేలిమిడిఁ బెంపు సెడ గడు విరలిఁ గానియె."
కుమా. 5.45.

"లోకదుర్జయుఁ డగు నీకీచకునిని వ్రేల్మిడి రూపు మాపిన కడిమి సొంపు." భార. విరా. ఆ. 3.

రూ. వ్రేల్మిడి.

వ్రేలు మడచి చెప్పు

ఎన్ను.

వివరించి ఒక్కొక్కటిగా చెప్పు.

ఏ దైనా చెప్పునప్పుడు ఒకటీ, రెండూ అని వ్రేలు మడచుటపై వచ్చిన పలుకుబడి.

"ఆవెర, యీవెర వని వ్రేలు మడచి యేర్పడఁ జెపుమా!"

ఆము. 3.44.

వ్రేలు మడిచి చెప్పు

క్రమంగా, ఒక్కొక్కటిగా నిర్దేశించి చెప్పు.

"ఈ వేళ బలియు నతనిం, బో విడిచితి పొమ్ము వాఁడు పోయిన రాజ్యం, బేవిధిఁ గ్రమ్మఱు నావెర, యీవెర వని వ్రేలు మడచి యేర్పడఁ జెపుమా!"

ఆము. 3.44.

రూ. వ్రేలు మడచి చెప్పు.

వ్రేల్మెటికలు దీయు

ఎదుటివారి వ్రేళ్లను లాగి మెటికలు విఱుగునట్లు చేయుట.

"వ్రేల్మెటికలు దీయ వెస నెత్తి హస్తంబు, కుచములపై వ్రేసికొనినఁ దిట్టు." హంస. 3.200.

వ్రేళ్లమీద లెక్కించవచ్చు

అతి స్వల్ప మనుట.

"ఆ ఊళ్లో పండితులను వ్రేళ్లమీద లెక్కించ వచ్చును" వా.

వ్రేళ్లసందున జాఱెడివారు

అమాయకులు, అల్పులు.

"...చా, లాలును వ్రేళ్ల సందులను జాఱెడువారలు లే రి కెవ్వరుఁ...."

సారం.

వ్రేళ్లు గఱచు

గడ్డి కఱచు.

జితోస్మి అను.

"సాహసంబులు మాని సంత్రాసములు పూని, పఱచువారును వ్రేళ్లు గఱచు వారు."

వరా. 3.47.

వ్రేళ్లు వారు

వ్రేళ్లు దన్ను.

గట్టిగా యేర్పడు.

"జనులలోఁ దఱచుగ భూతము లున్న వనునభిప్రాయము వ్రేళ్లు పారి యున్నది."

సాక్షి. పు. 224.

వ్రేళ్లెన్ను

నక్షత్రాదులను జ్యోతిష్కులు వ్రేళ్లపైనే లెక్క వేయుట అలవాటు.

"తిథివారాదినిరీక్షు చేసి వ్రేళ్లెన్ని నిరూపించెన్."

కళా. 7.48.

శంకరపదములు

జానపద గేయములలో ఒక నిర్దిష్టశాఖగా అలనాడుండి

యుండ వచ్చును. శంకర స్తోత్రము వీనిలోని వస్తువు కావచ్చును.

పండితా. ప్రథ. వాద. పుట. 513.

శంకాతంకములు

అడ్డంకులు, సంకోచములు.

శంకా+ఆతంకము.

'జంకు కొంకులు లేకుండ' అన్నది దీనికి దగ్గఱి తెలుగు మాట.

"శంకాతంకము మాని మానియు సహర్షస్వాంతుండై చంద్రమో, లంకారున్." కా. మా. 1.121.

శంఖంలో పోస్తే గాని తీర్థం కాదు

విలువ లేనిదానికి కూడా ఆశ్రయాన్ని బట్టి, స్థానమును బట్టి విలువ కలుగుతుంది. మామూలు నీళ్లే శంఖంలో పోసే టప్పటికి తీర్థ మయినట్లు అనుట.

శంఖ మొత్తు

శంఖ మూదు.

"అప్పుడు గోవిందుం డఖిలసైనికులు, నుప్పొంగ నిజశంఖ మొత్తె నొత్తుటయు." ద్విప. మధు. పు. 49.

శఠగోపం పెట్టు

చేసిన గొప్పమే లేమిటి? అనుపట్ల ఉపయోగించే పలుకుబడి.

వైష్ణవాలయాల్లో శఠకోపం అనే విష్ణుపాదాంకిత మైన కిరీటం లాంటి దానిని తల తాకించుట పై వచ్చిన పలుకుబడి. శఠగోపమును తల తాకించుట గొప్పగా భావిస్తారు.

"వాడు నాకు పెట్టిన శఠగోపమేమిటి? ఏదో నన్నుద్ధరించా డన్నట్లు మాట్లాడుతున్నావు." వా.

శతమానం భవతి అగు

తిట్లకు పాత్ర మగు.

"వాడికి అక్కడికి వెళ్లేసరికి శతమానం భవతి అయింది." వా.

శనిగ్రహము

నాశకారి.

"నిఖిలధనసంతతులకు శనిగ్రహంబు." శ్రవ. 2.56.

శని చుట్టుకొను

శని పట్టు.

"సంవత్సరంనుంచీ వాడి కేదో శని చుట్టుకొంది. ఏది చేసినా వాడికి కలిసి రావడం లేదు." వా.

శని పట్టు

దురదృష్టపు రోజులు వచ్చు. శని బాధాకర మయినగ్రహ మన్న నమ్మకంపై వచ్చిన పలుకుబడి.

"సంవత్సరంనుంచీ వాళ్లింటి కేదో శని పట్టింది. వరసగా జబ్బులే."

చూ. శని చుట్టుకొను.

శని ముసించు

దురదృష్టము నెట్టుకొని వచ్చు.

"వాడికి శని ముసించి ఆమాట అని నెత్తికి తెచ్చుకున్నాడు." వా.

**శని మూడు**

దురదృష్టము నెట్టుకొని వచ్చు.

"వాడికేమో శని మూడింది. ఆ విధంగా ప్రవర్తిస్తున్నాడు." వా.

**శని వదిలింది**

చూ. పీడ వదిలింది.

**శనివారపు జడి**

విడువని వాన.

"చెవులు చిందఱ వోవఁ జెలఁగు కవీంద్రుల, పో రంటిమా శనివారపు జడి...." కళా. 7.19.

**శని విఱగడ అయింది**

చూ. శని వదిలింది.

**శయ్యకు తార్చు**

పడకమీదికి చేర్చు

"చలువలు గుక్కుఁ గ్రొవ్విరుల శయ్యకు నొయ్యకఁ దార్చి." రాజగో. 4.25.

రూ. శయ్యకు దార్చు.

**శయ్యకు దార్చు**

సంగమాపేక్షతో పడుక మీదికి చేర్చు.

"...ఆత్మనాయకున్, శయ్యకుఁ దార్చి దివ్వె లిరుచక్కి వెలుంగ ముసుంగు వెట్టి నే..." హంస. 3.177.

రూ. శయ్యకు తార్చు.

**శరణంబు వేడు**

"సాధ్వసంబున జనుల్ శరణంబు వేఁడిన, నభయదానం బిచ్చునట్టివారు." రుక్మాం. 2.89.

చూ. శరణు వేడు.

**శర ణన్న కాచు**

మఱుగు జొచ్చినవానిని అభయ మిచ్చి రక్షించు.

"శర ణన్నఁ గావనిదురాత్ములు." రుక్మాం. 2.9.

**శరణార్థి యను**

శైవులు పరస్పరం చూచుకొను నప్పుడు అనుకొను మాట. వైష్ణవులు దాసు డన్నట్లు.

"శరణార్థి యనినఁ జెం పఱుగునే కొంత." పండితా. ప్రథ. పురా. పుట. 300

**శరణార్థి సేయు**

శరణు శరణు అను.

"శరణార్థి సేయుచు జయ వెట్టుఁ డనుచు..." బస. 6.167.

**శరీరయాత్ర**

భోజనము.

"పుష్పఫలపత్రజలమాత్రముల శరీరయాత్ర గడపుచు." వసు. 3.128.

చూ. దేహయాత్ర, తనుయాత్ర.

**శల్యసారథ్యము**

హితవంచన.

శల్యుడు కర్ణునికి సారథిగా ఉండి నిరుత్సాహవాక్యాలతో అతని ఓటమికే కారణ మయ్యె నను భారతకథపై యేర్పడినపలుకుబడి.

**శశవిషాణము**

లేనిది.

"శశవిషాణము దీర్ఘమై సంభవించె, వికసితం బయ్యె గగనారవింద మపుడు."

కవిక. శృం. శా. 1.11-పే.

**శశోప్చిటిగ్రాంధ్రుడు**

వెధవలు.

"వట్టి శశోప్చిటిగాంధ్రుడతో వాద మేలళ?" గుంటూ. ఉత్త. 96.

**శషభిషలు**

ధూం ధాం అనుటలు.

"శషభిష లంతగా సలుపఁ జాలవు నీవు." పాండవాశ్వ. 54.

**శాంతి సేయు**

యుద్ధము నివారించు.

"నీకమ్మనిపా లతని కొడుకుల కొసంగి శాంతి సేయుట మేలు."

భార. భీష్మ. 1.12.

**శాఖాచంక్రమణం**

ఒక విషయంనుండీ యింకొక విషయానికి పోవడం.

ఒక కొమ్మమీదినుండి ఇంకో కొమ్మమీదికి కోతివలె ఎగురుటపై వచ్చినపలుకుబడి.

"వాడి ఉపన్యాసం అంతా వట్టి శాఖాచంక్రమణం. ఏదో మొదలు పెట్టి ఎక్కడో తేలుతాడు." వా.

**శాఖోపశాఖలు**

విపరీతముగా.

"లక్షోపలక్షలు శాఖోపశాఖలుఁ గోటానకోటులు..."

హంస. 3.29.

**శాపించు**

శాపాలు పెట్టు.

సాపెనలపై సాపించు అని నేటి వాడుక.

"పాపిష్ఠు లగునట్టిపాపులఁ జూచి, శాపించుచును."

బస. 7.193.

"ఆయమ్మ పొద్దున్నుంచీ సాపిస్తూనే ఉంది." వా.

**శారదాభ్రములు**

అశాశ్వతములు.

శరత్కాలంలో మబ్బులు తెలు పన్నట్లే తేలికగా నీరు లేని వై ఉండు నని కవి సమయం.

పండితా. ద్వితీ. పర్వ. పుట. 418.

చూ. జలబుద్బుదములు.

**శాస్తి చేయు**

ప్రతీకారము చేయు.

"ఈ,వింత ఘటించినట్టి యలివేణుల నోరికి శాస్తి సేసి య,త్యంతయశంబు నిల్పితి కదా!"

శుక. 4.54.

"వా డేమేమో అన్నాడు. వాడికి తగిన శాస్తి చేశాను." వా.

చూ. శాస్తి అగు.

**శాస్త్రమా?**

అదే కావలె నన్న నిర్బంధమా? కా దనుట.

వాడుకలో —'వాడే రావాలని శాస్త్రమా? రాకపోతే పెండ్లి ఆగుతుందా?'

"పల్లెత్తి యెలుకలఁ బట్ట, బిల్లి శాస్త్రమె మంటిపిల్లియే చాలు."
గౌ. హరి. ద్వి. 145.152.

శిఖరప్రతిష్ఠగా
భూషణప్రాయముగా.
శిఖరము నిలిపిన ట్లనుట. గోపురాదులు నిర్మించి దానిపైన శిఖరంగా ఏ సువర్ణకలశాన్నో పెట్టడం అలవాటు.
"సత్పాత్రదానప్రశస్తికి శిఖరప్ర, తిష్ఠ గా వినయంబు తేజరిల్లు."
విప్ర. 1.45.

శిరఃకంపము సేయు
తల యూచు, మెచ్చుకొను.
"ఇట్లు గనుపట్టు నా పట్టణంపు సొంపు నకు శిరఃకంపంబు సేయునిలింపవల్లభు పెంపు పరికించి... ప్రభా. 1.55.
"కవు లందఱును శిరఃకంపంబు సేయ."
గౌ. హరి. ప్రా. పంక్తి. 32.

శిర సంటి
ప్రమాణము చేసి, ప్రమాణ పూర్వకముగా.
"శ్రీకంఠు శిర సంటి చెప్పెద నీకు."
పల. పు. 107.

శిర సార్చు
తల వెండ్రుక లారునట్లు చేయు.
"శిర సార్చె నొక్క లేఁజిగురుఁ బోఁడి."
పారి. 2.12.

శిరసావహించు
తల దాల్చు.
"ఎత్తే శిరసా వహింతు రనియు."
విజయ. 1.26.

శిర సుండగ మోకాలను పేసలు వెట్టు
అర్థ మయినది ఒకటి ఉండగా అనర్థమైన మరొకదానికై పోవు.
తలప్రాలు పోయ వలసినది శిరస్సుపై. వాటిని మోకాటి మీద పోయడం మీద వచ్చినపలుకుబడి.
"శిర సుండఁగ మో, కాలను పేసలు వెట్టుట, బేలుఁదనము గాక మీకుఁ బెద్దఱికంబే?"
ఉ. హరి. 196.
తాళ్ల. సం. 8.175.

శిరసు మూర్కొను
పెద్దలు చిన్నవారిని కలుసుకొన్నపుడు ఆదరపూర్వకముగా చేయుచేష్ట.
తలను మూర్కొనుట, ఒడలు తడవుట అలవాటు.
"మే నిమిరి శిరసు మూర్కొని, దానవ పరిపంథి !"
పారి. 3.26.

శిరసు విడిచిన వెండ్రుక
గౌరవహాని చెందు ననుట.
నమశ్శి. 96.

శిరామరక్ష
"ఆవులపాలతో జలక మార్చును దాఁదొడ నుంచి యేమి చూ,చే వని నవ్వుచుఁ బయిటచేఁ దడి యొత్తి

శిరామరక్షుతో, లావుగఁ జుక్కబొట్టు నొసలఁ ఘటియించి కదించు నుయ్యేలన్." (తె. జా.)

శిలాక్షరము

తిరుగు లేనిది. శాశ్వత మైనది. అతిక్రమింప రానిది.

"ఆనతి యిచ్చెనా యది శిలాక్షర మెవ్వని నేని మెచ్చెనా, వానిఁ గృతార్థుఁ జేయు." విజ. పీఠి. 54.

శిలాశాశ్వతంగా

స్థిరంగా.

పశ్చిమాంధ్రంలో ఎక్కువగా వాడుకలో ఉన్న పలుకుబడి.

"నీ వీ దేవాలయం కట్టినా వంటే నీ పేరు శిలాశాశ్వతంగా ఉండి పోతుంది." వా.

"అందరి నోళ్లూ కొట్టి సంపా యిస్తున్నాడు. వీ డేం శిలాశాశ్వతంగా ఉంటాడా?" వా.

శిలాశాసనము

రాతి మీద చెక్కించిన శాసనం.

రాగిరేకు మీద చెక్కించిన దానిని తామ్రశాసనం అంటారు.

శివద్విజురాలు

శివభక్తిపరురాలైన బ్రాహ్మణి.

పండితా. ద్వితీ. మహి. పుట. 121.

శివ మాడు

పూనకము వచ్చి ఊగు.

"తెమ్మగా శివ మాడి తా దేవరె నట్టు." తాళ్ల. సం. 6.37.

శివము పూను

పూనకము వచ్చు.

చూ. శివము లెత్తు.

శివము లెత్తు

ఆవేశము పూను.

"శివము లెత్తునట్లు చేతులు తీట వో." కవిక. 2.169.

శివరాత్రిగా

శివరాత్రి నాటివలె నిద్రాహారములు లేకుండ.

"రాత్రి శివరాత్రిగా జాగరమ్ముఁ జేసె." శా. మా. 2.119.

శివరాత్రి యగు

నిద్ర లేక పోవు.

"రమణిరో! నినుఁ బాసినప్పుడె రాతిరే శివరాతి రాయెను." సుగ్రీ. పు. 11.

శివ శివ

"చెవులార విన మున్న సేసినప్రతిన, శివ శివ! తప్పనే."

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 2812-13.

శివ సత్తులు

శివ శక్తులు.

శైవులలో ఒక తెగ. శివ భక్తురాండ్రు.

"పేరులు విడిచి సంకపేరులు మెడ వేసుక, సారెకుఁ గొందఱు శివసత్తులైరి." తాళ్ల. సం. 7.12.

శివార్చనము చేయు

భుజించు.

"మా, యక్కడ మీరు నీ ముసలి యక్వయు నేడు శివార్చనంబు సమ్యక్కృతిఁ జేసి..." హరి. 2.48.

చూ. దేవతార్చన చేయు.

శిశ్నోదరపరాయణుడు
కామభోగలాలసుడు.
"సంసారబద్ధుం డగుచు దుష్పురుష సంగమంబున శిశ్నోదరపరాయణుం డై." భాగ. స్క. 3.1005.

శిష్టానధ్యాయం
ఎవ రైనా పెద్దలు గురుకులాలకు వచ్చినప్పుడు మామూలు అనధ్యాయం కాక పోయినా వారి గౌరవార్థ మై పిల్లలకు సెల విచ్చురోజు.

శీతకట్టు
చలికాలము.

శీతకన్ను వేయు
అనాదరము చేయు.
'చీదకన్ను' అన్న పదమే భ్రష్ట మై శీతకన్ను అని వికారం పొందింది.
"రెడ్డిగారీ మధ్య మామీద శీతకన్ను వేశారు. కారణం ఎంత గింజుకున్నా బోధ పడడం లేదు." వా.

శుకానువాదం
చిలుకపలుకులు.
ప్రభా. నాట. 41.

శుద్ధ బుద్ధావతారం
చవట.
"వాడు వట్టి శుద్ధ బుద్ధావతారం. వాడితో ఏ మవుతుందని?" వా.

శుద్ధ ముగ్ధావతారం
వట్టి అమాయకురాలు.
"శుద్ధముగ్ధావతార మీ సుందరాంగి." శుకన్య. 17.

శునకమునకు సూడిద
వ్యర్థము.
శుక్ర. 88.

శునీ మన్వేతి శ్వా
మగకుక్క యెప్పుడూ ఆడకుక్క ననుసరించే ఉంటుంది అని వాక్యార్థం.
ఆడదాని ననుసరించి మగవా డుంటాడు అనుట.

శుభస్య శీఘ్రం
మంచిపని త్వరగా చేయవలె ననుట.
అత్త. 2.62.

శుష్కప్రియాలు శూన్యహస్తాలు
ముఖప్రీతిమాట లాడేవాడి విషయంలో ఉపయోగించే పలుకుబడి.
"మీమామ మాటలు ఎందుకు నమ్ముతావురా. ఆయన వన్నీ శుష్కప్రియాలూ, శూన్యహస్తాలూ." వా.

శూన్యంపు గొల్ల
తెలివి మాలినవాడు.
"సరి విటుల్ నవ్వంగఁ జక్క నాయిల్లు, చౌర సిగ్గుగా దెటు శూన్యంపు గొల్ల." బస. 5.125.

శూన్యగేహమున కెత్తినదీపిక
వ్యర్థ మనుట.
ఎవరూ లేనియింటిలో దీప మెందుకు?

"మృతి లేని నాదు చెల్వింతయు శూన్య గేహమున కత్తినదీపిక యయ్యె నక్కటా!" మను. 3.8.

## శూర్పణఖ మేనగోడలు

గయ్యాళి.

"శూర్పణఖ మేనగోడలా చూడ లంకి,ణీతనూజయొ." శుక. 3.19.

చూ. పూతన తోడబుట్టు.

## శూలకుట్టు

కడుపుకుట్టు, కడుపునొప్పి.

"మును శూల కుట్టెత్తి మూల్గుచు నేలఁ, బడి పొరలుచుఁ బ్రాణపరితాప మందు." బస. 6.150.

"అనుపమదివ్యపంచాక్షరీమంత్ర, మున భసిత మలంది మొల దిగఁ దుడువ, శూలకు ట్టుడుగుడుఁ జోద్యంబు నంది." బస. 6.150.

## శూలపృథువణిజ్న్యాయము

దెబ్బకు దయ్య మైనా వెఱచును అనుట వంటిది.

లావాటి కోమటి కూడా శూలం చూపితే లేచి పాటి పోవు ననుట.

"లాలన నారత్నులగమి, నేలి తెలిసి ముచ్చు నాజ్ఞ యిడ కతఁడు చెరం, బో లాఁతి నిడె నయశ మెం, తే లేవదె శూలపృథువణిజ్న్యాయమునన్." ఆము. 4.239.

## శృంగగ్రాహికగా

సూచనగా, దిక్ప్రదర్శకంగా.

"శృంగగ్రాహికఁ జెప్ప వేటె తెరవుల్ సిద్ధింపమింజేసి చి, త్రాంగశ్రీనిధి నవ్యభూమణిని స్థూలారుంధతీన్యాయమా,ర్గాంగీకారమునన్ వచించితిని..." ప్రభా.

## శృంగభంగ మగు

అవమాన మగు.

గిర. 69.

## శృంగములు లేని మొదవు

సులభు డనుట.

కొమ్ము లుంటే కనీసం భయపడే అవకాశ మైనా ఉంటుంది. అది కూడా లే దనుట.

"బిదికికొనఁగ, శృంగములు లేని మొదవు శ్రీరంగశాయి." కవిక. పీఠిక. 91.

## శృంగారకట్ట

చీపురుకట్ట.

కాశీయా. 68.

## శెలవుల నవ్వు

సెలవి వార నవ్వు.

"నను పై శెలవులనే నవ్విన ట్లాయె." తాళ్ల. సం. 3.198.

## శ్రీ ధాన్యకటకముగా

ధాన్యసమృద్ధితో.

"శ్రీధాన్యకటక మై చెన్నొందు దేశంబు." రుక్మాం. 1.136.

## శ్రీరంగనీతులు

శుష్కనీతులు.

"గ్రంథములయందుఁ దాము శ్రీరంగనీతు, లెన్నియో చెప్పుదురు గాని యెంచి చూడ, వారకాంతలఁ దడవని వారు లేరు, కవులసంగతి నే నెఱుంగనిది కాదు." శ్రవ. 2.37.

"చెప్పేవి శ్రీరంగనీతులు దూరేవి దొమ్మరి గుడిసెలు" సా.

శ్రీరామ చుట్టు

రద్దు చేయు, కొట్టి వేయు.

క్రొత్త. 23.

శ్రీరామరక్ష

రక్షకము.

"ఖలదురాలాపమార్గణవజ్రకవచంబు, రణమహీస్థలికి శ్రీరామరక్ష."

మను. 4.108

శ్రీరాము సేన

గుంపు.

కోతు లెప్పుడూ గుంపులు గుంపులుగా ఉండుటపై యేర్పడినపలుకుబడి.

"ఎల్లెడఁ జూచిన ధరణీ, వల్లభ! సీరాము సేన వాలు మెకంబుల్."

మను. 4.16.

శ్రేణులు గట్టు

వరుసలు తీరు, బారులు తీరు.

"శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెన్ బక్షు లుష్ణాంశుపా, షాణ వ్రాతము కోష్ణ మయ్యె." మను. 3.12.

షడంగములు

శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము.

ఇవి వేదాంగములు.

షడ్గుణాలు

సంధి, విగ్రహం, యానం, ఆసనం, సంశ్రయణం, ద్వైధీభావం. రాజనీతిలో...

శమా. 10.183.

షష్ఠాష్టకం

విరోధము, సరి పడదు.

జ్యోతిశ్శాస్త్రాన్ని పట్టి వచ్చినపలుకుబడి.

జాతకచక్రంలో ఒక గ్రహానికి యింకో గ్రహం ఎనిమిదింట ఉంటే దానికీ గ్రహం ఆరింట ఉంటుంది. అలా వున్న గ్రహాలకు పరస్పర వైరుధ్యం చెబుతారు.

"వాడికీ వీడికీ ఎప్పుడూ షష్ఠాష్టకం. ఒక క్షణం పడదు." వా.

షాకోత్వ మిస్తే

షోదా అనుట.

"వాడు ఒట్టి షాకోత్వ మిస్తే..."

వా.

షికార్లు కొట్టు

ఊరు తిరుగు.

ఇది యిటీవల యేర్పడిన పలుకుబడి.

"వా డెప్పుడూ తిని షికార్లు కొట్టుతుంటాడు."

షోడశోపచారములు

పదహారు రకములైన ఉపచారములు—దైవ పూజలో.

ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము,

గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, నమస్కారము, ప్రదక్షిణము.

పండితా. ప్రథ. పురా. పుట. 356.

**సంకలితరోగాలు**

అంటురోగాలు.

కాశీయా. 373.

**సంకిళ్ళవాండ్లు**

ఖైదీలు.

కాశీయా. 219.

**సంకె దీర**

నిస్సంశయముగా.

"సంకె దీరఁ గావ వయ్య సర్వేశ్వరా!"
తాళ్ల. సం. 8.127.

**సంగడము లగు**

సమాన మగు.

"బిగువుఁజన్నులమీఁదఁ బెనుపడం బైన చెం,గలువ క్రొవ్విరుల సంగడము లగుచు." ఉ. హరి. 1.151.

**సంగతి గావించు**

సమాగమము కల్పించు.

"దేవకార్యంబుగా మహాదేవితోడ, మీకు సంగతి గావించి మెచ్చు వడయ, వచ్చెఁ గాకంగభవుఁడు."

కుమా. 9.42.

**సంగ్రహించు**

దొంగిలించు.

"వాడు నాలుగురోజు లున్నట్లే యుండి దొరికిన నాలుగు పుస్తకాలు సంగ్రహించుకొని పోయినాడు."

వా.

**సంగ్రామము చెల్లు**

యుద్ధము జరగు.

"అప్పుడు,త్కటసంగ్రామము సెల్లె నిద్దఱకు." ఉ. హరి. 1.45.

**సంచి మూల్యము**

సంచి మొదలు.

"సంచిమూల్యము నిచ్చి సడి కోర్చి తైత్రివర్ణి, కుల జంటఁ దిరుఁగనికోమటీఁడు."

హంస. 5.120.

"అచటి మేటికిరాటు లలకాధిపతులైన, మును సంచి మొద లిచ్చి మనుప దత్తులు." మను. 1.50.

"నిధు లెల్లఁ గొని సంచి మొదలు చేసి." పాండు. 1.111.

**సంచి మొదలు**

పెట్టుబడి.

పూర్వం ధనం సంచులలో పోసుకొనుట అలవాటు కనుక మొదట ఏవ్యాపారానికైనా పెట్టే పెట్టుబడిని మొదటి సంచి అనుకొని సంచిమొదలు అనే వ్యవహారం వచ్చినది. అసలు – ఇదే అర్థంలోనే వ్యవహారంలో ఉన్నది.

"ఆత్మైత్ర, కాయత్తధనంబు సంచిమొదలై యత్యార్జనం బొందఁగా, శ్రేయఃకీర్తులు సంఘటిల్ల."

శుక. 1.174.

**సంజవర్ణన పదములు**

ప్రొద్దుటిపూట పాడుకునే మేల్కొల్పులు (ప్రభాత పద

పదములు)వలెనే ఇవి సాయం సంకీర్తనలు.
ఆనా డిపీ ఒక విశిష్టజానపద గేయశాఖ కావచ్చును.
పండితా. ప్రథ. వాద. పుట. 513.

సంతగొట్టి
బిక్కిరి బిక్కిరి చూపులు చూస్తూ 'యి దంతా యేమి టన్న' ట్లున్నమనిషి విష యంలో ఉపయోగించే పలుకుబడి.

సంతతోద్ధార మగు
సంతతధారగా కురియు.
కాశీయా. 76.

సంతన కట్టు
1. సిద్ధ మగు.
"ఇత్తరుణితో ననికి సంతన కట్టితి నేని..." దేవీ. 5.220.
2. ఉద్యుక్తు డగు.
"దుర్వ్యథ, సంతన కట్టఁగ విధాత చాలం డయ్యెన్." శివ. 1.57.
"సంతనకట్టి యుత్సాహసమేతుఁ డై." భార. ఆది. ఆ. 2.
"వానరుల్, కాలకల్పులు పేర్చి సంతన కట్టి రాహవకేళికిన్."
భార. అర. ఆ. 7.
"సంతన కట్టి పుచ్చుకొని చయ్యన నేఁగిరి నిర్విశంకతన్." భీమ. 4.96.

సంతన చేయు
సరిపఱుచు.

సంతపడు
ఆయత్తపడు.

"ప్రుచ్చు పెక్కటిఁ బట్టి మునుఁ బ్రాడు కట్టించి, గంతగొనెను దాని సంత పఱిచి." పంచ. నా. ఆ. 1.

సంతపఱచు
కట్టుబాటులోనికి దెచ్చు.
"వినయపుదైన్యము విడువనికర్మము, చన దది నీ విటు సంతపఱచక."
తాళ్ల. సం. 11.3. భా. 167.

సంత పెట్టు
సమాధాన పఱుచు.
"అని పలుకంగ నా సభికు లప్పు డెఱింగి యితండు పెట్టి నీ, యిను మొసఁగుం గుమారకుని నిమ్మని వారల సంత పెట్టినన్." పంచ. నా. ఆ. 1.

సంతవలపుబేరము
అస్థిరము.
తాళ్ల. సం. 12.145.

సందట్లో సడేమియా
చూ. సందట్లో సమారాధన.

సందట్లో సమారాధన
ఏదో గందరగోళంలో చేతికి దొరికినది స్వాహా చేయుట.
"ఆ పెళ్లి హడావుడిలో వాళ్లంతా పడి ఉంటే ఆ కాసులదండ కాస్తా ఎవడో సందట్లో సమారాధన చేశాడు." వా.

సందడి కయ్యము
సంకులసమరము.
"సందడికయ్యంబు నూలుకొనిన."
భార. భీష్మ. 1.267.

## సం దదికి ఆడు

అసత్యమును సత్యముగా నిరూపించుటకు తగినట్లు అబద్ధమాడు.

వాడుకలో దీనినే 'గోడ పెట్టినట్టు అబద్ధాలాడడం' అంటారు.

'మగవాడు అబద్ధమాడితే దడి పెట్టునట్లు, ఆడది అబద్ధమాడితే గోడ పెట్టినట్లు ఉంటుంది' అని నానుడి.

"వచ్చినదియుఁ దాన, యగుచుఁ దోఁప సం దదికి యెట్లాడ నేర్చె, మగువ గాదు ర యిది పెనుడగర గాని."
కళా. 3.197.

## సందికంతల త్రోవ

ఘంటాపథము కానిది.

తాళ్ల. సం. 11. 3 భా. 70.

## సందిలి వట్టి యాడు

సందిటితో కాళ్ళను కౌగిలించుకొని యాడు.

"పైఁ బడుచు నుబ్బుచుఁ గేరుచుఁ జెంగలించుచు, స్సందిలి వట్టి యాడుచును నాట్యము లాడుచు..."
కళా. 6.201.

## సందు

అవకాశము, వ్యవధి, విశ్రాంతి.

"మనసు పరువులు వాఱ నేమాడ్కి నైన, సందు గానక యిస్సుపపంజరము లోని:.."
శుక. 2.173.

వ్యవహారంలో ఈ విధంగా కొన వస్తుంది.

"సందు దొరికితే చాలు. పైన బడా లని చూస్తున్నాడు." వా.

"సందు దొరక లేదు. తప్పు పట్టా లని చూచాడు కానీ." వా.

"సందు లేకుండా పని." వా.

## సందు కానకుండు

అవకాశము లేకుండు,

"తన ప్రౌఢి సందు గాననిసుందరికి గోడ, చివ్వనదాఁట నిశ్రేణి గాఁగ."
శుక. 1.518.

## సందు గొందులు

జం.

"అందు లందుల సందు గొందు లరసి."
విప్ర. 5.6.

## సందు చేసుకొను

అవకాశము కల్పించుకొను.

"అది మది సందు చేసికొని యంగజుఁ డైక్షవచాపటంక్రియా...."
రాధా. 3.142.

## సందు దొరకు

అవకాశము దొరకు.

"సరసుమీఁది మమతను నిచ్చల్, మదనునికేళికఁ బిల్చును, దుదఁ దన గృహమునకు సందు దొరికిన యెడలన్."
హంస. 4.105.

ఇది నేటికీ వాడుకలో ఉన్నది.

'వాడు సందు దొరికితే చాలు. వెళ్లి పోతాడు.'

సందు లేకుండు

అన్నిచోట్లా వ్యాపించియుండు.

వ్యవధానం లేకుండా అనుట.

"సందు లేకున్నట్టిశంభుండు శివుఁడు." బస. 6.159.

సందు సుడి దొంతులు దొబ్బు

సందు చేసుకొని దొంగకుక్కవలె ప్రవర్తించు.

"పంతపు జీవుఁడు భ్రమసి సందు సుడి, దొంతులు దొబ్బుచు దూరీఁ గాకా." తాళ్ల. సం. 5.320.

సందు సుడిమాయలు

1. సందు చూచుకొని మోసము చేయుటలు.

"అనునయ మొప్ప మాన్పుగతి నాత్మ ముఖంబు ముఖంబుఁ జేర్చి చుం,బన మొనరించె సందు సుడిమాయలు గామగవారి కృత్యముల్." మను. 3.82.

2. సమయానుకూలమైన నటనలు.

సందు సూచు

అవకాశమునకు వేచియుండు.

"ఇరువురును సందు సూడక, వెర వెడలినయాగ్రహములు." భార. శల్య. 1.180.

సందెడు దొమ్మలు

భయస్థు డనుట.

"వాడు రాత్రిలో ఏం పోతాడు? వాడికి సందెడు దొమ్మలు." వా.

సందెడు మాటలు

దిక్కు లేనన్ని మాటలు.

శివముకుంద. 87.

సంధ్య వారుచు

సంధ్యావందనము చేయు.

సంధ్యావందనంలో అర్ఘ్య ప్రదానం ప్రధానమైన భాగం కనుక తద్వారా వచ్చినపలుకుబడి.

కాశీ. 7.7.

రూ. సంధ్య వార్చు.

సంధ్య వార్చు

సంధ్యావందనము చేయు.

అర్ఘ్య ప్రదానము చేయునపుడు నీళ్లు వదులుట ద్వారా వచ్చినపలుకుబడి.

వార్చు అని ప్రత్యేకముగా కూడా ఇది ప్రయుక్త మవుతుంది.

"వేదము చదివినఫలమున్, వాదించిన ఫలము సంధ్య వార్చినఫలమున్." శుక. 2.478.

చూ. వార్చు.

సంపెగపువ్వు తావికి దగిలిన మిండతుమ్మెద విధంబున

కూడనిదానికై ఆశించునట్లు.

"సంపెగపువ్వు తావికిం, దగిలిన మిండతుమ్మెద విధంబున." కా. మా. 4.29.

సంపెగ తుమ్మెదకు శత్రు వని కవిసమయము.

సంబవు లిడు

సేవకావృత్తి సేయు.

పాదరక్షలు పట్టుకొని వచ్చు వాడు కాగా (సంబవు లిడి యుండ) అని చెప్పుట.

"శశిఁ దెత్తుమే నీకు సంబవు లిడి యుండ." కుమా. 6.17.

సం(శం)బళి సం(శం)బళి

పూర్వకాలంలో అస్పృశ్యులు సవర్ణుల ప్రాంతాలలోకి వచ్చునప్పుడు 'సంబళి సంబళి' అని అరిచేవారు. అనగా 'అస్పృశ్యులు వస్తున్నారు. మీరు తొలగి పొండి' అని అర్థం. 'సంబళి' అనగా మాల వాడు.

"సంబళి సంబళీ యశుకు సందడికిం దల మంచుఁ బల్కుచున్." శివ. 3.40.

"జడియుచు శంబళి శంబళి యనుచు, దళముగా మెఱసేటి తనమేని కష్టు." ద్విప. హరి. 2.1384.

"మాటిమాటికి మోసముల్ దీటు కొనుచుఁ, జనుచు సంబళి సంబళి యనుచుఁ బంక, జాప్తకులపుంగవుఁడు వచ్చుసంగడికిని." హరిశ్చం. 4.237.

"అచ్చుగాఁ జనుదెంచి యగ్రహారంబు, చొచ్చి యల్లంత భూసురుల రాఁ జూచి, చంగుచు శంబలి శంబలి యనుచు, వంగుచుఁ దొలఁగుచు వాడవాడలను." పండితా. 1.2170.

సంబెర మిచ్చు

సానుభూతి చూపు.

"సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి, కమలినవసంతు నెదుట దుఃఖార్త యగుచు." హర. 3.92.

సంబెరము చూపు

సానుభూతి చూపు.

"రతితోడ సంబెరము చూపువిధంబునఁ బొల్చె భూజముల్." కుమా. 5.83.

సంసార తలగుండు గండడు

సంసార లంపటం లేనివాడు.

ఆ తాపత్రయం తొల గించుకొన్నవాడు.

"తద్జ్ఞుఁడు సంసారతలగుండు గండఁ, డజ్ఞానజనదూరుఁ డపగతభయుఁడు." బస. 5.137.

సకల నియోగంబు

అన్ని వృత్తులవారు.

గ్రామాలలో డెబ్బైరెండు నియోగాల వారుంటారు.

"అంత వానయు వెల్వ నఖిలభక్తులును, సకలనియోగంబుఁ జక్కనఁ బోయి." పండితా. ప్రథ. దీక్షా. పుట. 148.

"సకలనియోగంబు జయ వెట్ట." బసవ. 6.169.

సకృదావృత్తి

ఎప్పుడో ఒకసారి.

"ఈశ్వరుడు ఇంత రోగమును సకృదావృత్తిలో పురుషులకు యిచ్చే పాటి దేహధర్మముతో." కాశీయా. 293.

సగం పాలెనేత సగం మాల నేత
అస్తవ్యస్తంగా ఎగుడు దిగుడుగా ఉన్నవాని విషయంలో ఉపయోగించేపలుకుబడి.
పాలెనేత చక్కనిది, మాల నేత మోటుది అన్న భావంతో ఏర్పడినపలుకుబడి.

సగ మగు
కృశించు, సగపాలగు.
"ఈయఁగా నేరుతు విలఁ గోరినవరాలు, నగరాజసుకుమారి సగము గాఁగ." రాధ. పీఠి. 36.

సగము చచ్చి
చాలా శ్రమించి.
"సగము చచ్చి యంతయుఁ జచ్చి జగతిఁ గాన." పాణి. 3.21.
"అనవసరంగా యీ పనిలోకి దిగాను. సగం చచ్చి బయట పడ్డాను." వా.

సగము చచ్చి సగము చావక
వచ్చే పోయే ప్రాణాలతో అన్నట్టు.
"ఏదో సగం చచ్చీ చావకా కాలక్షేపం చేస్తున్నాము." వా.
"చిచ్చున వెడవెడ వెచ్చుచు, సగము చచ్చియు నిబ్బంగి సగము సావకయు." బసవ. 7.187.

సగ మెఱుక
సరి పడనిది.
"తాంబూలానికి నాకు సగ మెఱుక." చింతా.

సగ్గిస మగ్గిసలు
పికాపికలు. జం.
"నగ్గులకాళ్లు శంకలకుఁ గన్కని యొగులఁ బుట్టు నక్కకున్, సగ్గిస మగ్గిసల్ నిలుపుసైరణకున్ గన నీని యొత్తికోళ్." కవిక. 3.229.

సగ్గుడు ముగ్గు డగు
సతమతమగు.
"చంచలపు విషయాల సగ్గుడు ముగ్గుడు గాక." తాళ్ల. సం. 11.3 భా. 164.

సఖ్యము సాప్తపదీనము
ఏడు అడుగులు కూడా నడిచినా, ఏడు మాటలు మాట్లాడినా స్నేహము ఏర్పడును.
"సఖ్యంబు రెంచును సాప్తపదీనంబు, గాఁగ." ప్రభా. 3.89.

సజ్జపట్టు
శయ్యావ్యసలం, పడక.
"అన నతిరమణీయ మగుసజ్జపట్టు గని మిండ......అదియును నాతి లింగార్చన సేయుసదనంబుగా...తలఁచి." బస. 3.512.

సటల బెట్టు
బాధ పెట్టు.
"సంతకూటపు బ్రదుకు సటలఁ బెట్టెని." తాళ్ల. సం. 9.193.

సడలు వారు
సడలు.
విజయ. 1.43.

సడి కొడి గట్ట లేని
చెడ్డపేరునకు భయపడునట్టి.

"సడి కొడి గట్ట లేనికనుచాటు మెలం కువ తీగబోండ్లకుఁ, గడుపులు దించ."
శుక. 2,24.

**సడిగొట్టు**
సణుగు.

"కూడు గూరకు సడిగొట్టక యడిగి."
గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1934.

**సడి చను**
ప్రసిద్ధి కెక్కు.

"సౌందర్యసంపద సడి సన్న దానవు."
హర. 4.23.

**సడ్డ యొనర్చు**
లెక్క చేయు.

"నిన్నుఁ దా, సడ్డ యొనర్ప కవ్వలఁ జిశాచమువంటిగ రాసుఁ గూడె."
శుక. 1.527.

**సడ్డ సేయు**
చెడుపు చేయు.

"చక్కరవంటి నా మోవి సడ్డ సేసె."
తాళ్ళ. సం. 3.169.

**సతం చేసిన**
ఎన్నో చెడ్డపనులు చేసిన.

"అది సతం చేసినమనిషి. దాంతో ఎవరు మాట్లాడతారుశి?"
వా.

**సతగొట్టు**
చితక గొట్టు.
సతపోరు లాంటిది.

"సత గొట్టి వైచిన సరకుగాఁ గొనక."
వర. రా. యు. పు. 253. పంక్తి. 15.

**సతపోరు**
పెక్కు విధములుగా ప్రయత్నించు.

"సత పోరి వాణ్ణి యిక్కడికి తీసుకొని వచ్చేటప్పటికి నిన్ను బట్టు నన్ను బట్టు అయింది."
వా.

**సతి వెట్టి**
వెట్టి చాకిరీ అనగా ఊరకే పని చేయించుకొనుట ఉన్నది. అట్లే సతి వెట్టి అనగా డబ్బూ దసకం లేకుండా ఊరకే స్త్రీని పొందుట.

"ఎన్నఁడు వెట్టంగ నున్నాఁడ విట్లు, నన్న యే నాటను సతి వెట్టి గలదె?"
పండితా. ప్రథ. పురా. పుట. 361.

**సత్తకన్ను పొంత కన్ను ఎఱుగు**
ఏది వట్టిదో ఏది గట్టిదో తెలియు.

"పోరి చూచి సత్తకన్నుఁ బొంతకన్ను, నింగితాకారముల నెఱుంగు దీవు, గావ లుండ వై యహంకారవృత్తి, నీకుఁ దల్లి..."
కుమార. 4.558.
రూ. సత్తకన్ను పొత్త....

**సత్త కన్ను పొత్త కన్ను నెఱుగు**
సత్తా సారం తెలియు,
సత్త కన్నో లొత్త కన్నో తెలుసుకో గలుగు.

"పోరి చూచి సత్తకన్నుఁ బొత్తకన్ను, నింగితాకారముల్ నెఱుఁగు దీవు..."
కుమా. 5.79.
రూ. సంతకన్ను పొంత......

సత్యకాలం
కృతయుగం.
మాటా. 25.

సత్యకాలపువాడు
అమాయకుడు.
కొత్త. 428.

సత్యసంధుడు
అబద్ధ మాడనివాడు.
"వాడు చాలా సత్యసంధుడు."
నిరం. 4.81.

సదమద మగు
క్రిందు మీదు పడు.
అందులో పూర్తిగా మునిగి పోవు.
"సదమద మై కడంగి రతి సల్పుట తెల్లమి గా నెఱింగియున్."
మను. 6.69.
"వాడు అప్పులతోనూ, ఇంట్లో యిబ్బందులతోనూ సతమత మవుతున్నాడు."
వా.

సదా కాలం
ఎల్లప్పుడు.
కాశీయా. 26.

సదావృత్తి యిచ్చు
సాహిత్య మిచ్చు.
స్వయంపాకానికి తగినభోజన సామగ్రి యిచ్చు.
కాశీయా. పు. 2.

సదా సత్రా
కసవూ - గట్రా. జం.
బసవ. 3.65.

సన్నక సన్నగా
మెల్ల మెల్లగా.
"తిన్నని జిలిబిలి పలుకులఁ, గన్నియ డెందంబు మిగులఁ గరఁగింపుచు నీ, వున్నయెడఁ జే నచటికి, సన్నక సన్నఁ రయంబ చనుదెంతుఁ జుమీ."
కవిక. 3.18.

సన్నకు సన్నగా
రహస్యముగా.
"ననుపుపల్లవుని సన్నకు సన్న రప్పించి."
క్రీడా. పు. 87.

సన్న దెలుపు
సైగ చేయు.
"ముచ్చటలు దెల్పు రతికేళి కిచ్చరించు, సన్న దెలిపి విలాసప్రసన్నవదన."
శుక. 1.391.

సన్న పని
చిన్నపని.
"సన్నపుంగార్య మెు"
సింహా. 2.107.

సన్నల జాయల జతురు లాడు
సూటిగా పోటిగా సరసా లాడు.
"సానురాగంబుల శౌరిఁ బాడుచును, సన్నలఁ జాయలఁ జతురు లాడుచును."
ద్విప. జగ. పు. 166.

సన్నల జాయల బలుకు
సూటిగా పోటిగా మాట లాడు.
"వారు ననుం దల లెత్తి చూడఁగా, సన్నల జాయలం బలుక సైఁతునె"
పారి. 1.88.

సన్నవార నగు

చిన్నగా నవ్వు.

"సన్నవార నగుచు."

శశం. 3.13

సన్న సున్నంబుగా తన్నుకొను

నలగ తన్నుకొను.

వాడు కలోనూ – 'నీ యెముకలు సున్నంచేసేస్తాను' అంటారు.

"...సన్నసున్నంబుగాఁ దన్నికొని యును." ఉత్త. హరి. 4.29.

సన్న సున్నము సేయు

పాలగాఱ వేసినట్లు తెల్లగా చేయు.

సున్నమును బాగుగా వస్త్రకాళితం పట్టి ఆ సన్నటి పొడితో సుధా లేపనం చేస్తారు. దీనినే పాలుగాఱ అనీ చంద్రిక అనీ అంటారు.

"అచ్చ వెలుపుగ నిపుడు బ్రహ్మాండ మండ,పంబు వెన్నెల సన్న సున్నంబు సేసె." మను. 5.38.

సన్నాహభేరి వ్రేయించు

యుద్ధప్రస్థానభేరి కొట్టించు.

"అరిగి పురంబులో వీరు లంతవట్టు, నెఱుఁగ సన్నాహభేరి వ్రేయించుఁ బిదప." ఉ. హరి. 5.285.

సన్నిధి యగు

ప్రత్యక్ష మగు.

"విరూపాక్షుండు... నయి సన్నిధి యగుటయు." శివ. 1.107.

సన్నిధి సేయు

ప్రత్యక్ష మగు.

"కృష్ణద్వైపాయనుండు సన్నిధి చేసి యతని వారించి సంజయుం జంపుట యనుచితంబు ముందల విడువు మని యాన తిచ్చిన." భార. శల్య. 2.8.

సన్న్యాసుల తెరబొమ్మ

సన్న్యాసుల పాలిటికి వట్టి బొమ్మ వంటిది.

అంటే భిక్షమూ గిక్షమూ పెట్టని దనుట.

"దాసర్ల మిత్తి సన్న్యాసుల తెరబొమ్మ." శుక. 3.20.

సప్తమీవిభక్తి

ఉభయభ్రష్టుడు.

అందు, ఇందు, న సప్తమీ విభక్తి.

దానిపై యేర్పడి అందున ఇందున (న) లేనివాడు అని తేలినది. ఎందుకూ ఎక్కని వాడు అనుట.

చూ. తెలుగు జాతీయములు.

సప్తవ్యసనాలు

స్త్రీ, పానం, ద్యూతం, వేట, దొంగతనం, దండం, దూషణ.

కుమా. 10.184.

సప్త సముద్రాలు

లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, జల సముద్రాలు.

కుమా. 10.185.

**సప్తాంగాలు**
స్వామి, అమాత్యుడు, మిత్రుడు. కోశము, రాష్ట్రము, దుర్గము, బలము– (రాజ్యాంగవిషయంలో.)
కుమా. 10.185.

**సప్తోపాయాలు**
మంత్రము, ఔషధము, ఇంద్రజాలము, సామము, దానము, భేదము, దండము.
కుమా. 10.185.

**సభలో లేచి చెప్ప దగిన**
నిస్సంకోచంగా పదిమందిలో ప్రశంసింప దగిన.
"ఏ కళంకు, లేనివాఁ డీతఁ డని సభ లేచి చెప్పఁ, దగిన." కల. 65.

**సమకట్టు**
1. చీరకట్టు.
చీర కట్టులో సమానముగా నుండునట్లు (కచ్చ వోయక గావచ్చు) కట్టుపద్ధతి.
"భువి నిట్టి భక్తురాలవు గచ్చడంబు, ధవళాక్షి మతి యేల తాల్ప వీ వనిన, లింగవంతులు గాని లెంగులదృష్టి, భంగిగా నాపయిఁ బాఱక యుండ, గట్టితి సర్వాంగకచ్చడం బనుచు, గట్టినసమకట్టు కాంత సూపుడును."
బసవ. 3.52.

2. ప్రయత్నించు.
"చెల్లింపఁగ సమకట్టినాఁ డిదె."
వీర. 1.101.

**సమకొల్పు**
యత్నించు.
"సాహసకృత్యములు మాన్ప సమ కొల్పుటకై." కాశీ. 4.89.

**సమము వచ్చు**
సాటి వచ్చు.
విజయ. 1.100.

**సమయము తెలుపు**
అవసరము తెలుపు.
"జలజాక్షి! యీ వేళ సంపఁగిమన్నారు, సమయ మేమి? దెలుపవే."
హేమా. పు. 47.

**సమరతి**
సంభోగములో భేదము.
కుమా. 9.152.

**సమర మిచ్చు**
యుద్ధమునకు తలపడు.
"తన వింటికొప్పునఁ బొడుచుచుఁ గ్రూరసింహనాదుఁ డై సమరంబు నా కిమ్ము." ఉ. హరి. 1.18.

**సముఖా అను**
కంచుకులూ వారూ రాజులు వచ్చినప్పుడు 'సముఖా' అంటారు. అనగా రాజు సన్నిధిలో (సమ్ముఖము) ఉన్నారు అని యితరులకు తెలియ జేయుట.
"కంచుకి సంచయంబు సముఖా యన గద్దియ డిగ్గె డిగ్గినన్." పారి. 2.6.

**సముద్ర బల్లలు**
ఒక రకమైన ఆట.
తాళ్ల. సం. 10.172.

సముద్రము కడచి ఓడలో నినుము దెచ్చు కొండను త్రవ్వి ఎలుకను పట్టుట వంటిది.
శ్రమకు తగని అల్పఫలమును పొందుపట్ల ఉపయోగించే పలుకుబడి.
తాళ్ల. సం. 9.285.

సముద్రమునకు ఏతము వేయు
అసాధ్యకార్యమునకై వ్యర్థ ప్రయత్నము చేయు.
ఎంత యేతం వేస్తే మాత్రం సముద్రంలో నీళ్లు ఇంకు తాయా? అనుటపై వచ్చిన పలుకుబడి.
"ప్రపంచంలోని అవినీతిని నిర్మూలించా లని పూనుకోవడం సముద్రానికి ఏతం వేయడమే." వా. రూ. సము ..యేత మెత్తు.

సయిదోడు
1. సమానము.
2. స్నేహితుడు.
"...తదీయవిశాలనేత్రముల్, తొలకరి క్రొమ్మెఱుంగు సయిదోడులు."
క్రీడా. పు. 78.
"కలువల సైదోడు."

సరకు సప్పట
సరకు. జం.
"అప్పు నెపమున నూఱాఱు లడిగి పుచ్చుకొని నయంబునఁ దీర్పక పోక పోక, సరకు సప్పట సరి చెప్పి యరగ బాచు, చెడగరపు డొక్క యోగోరి సెట్టికుక్క!" పంచ. వేం. 1.74.

సరకు సేయమి
లక్ష్యపెట్టమి.
'సరకు సేయు' అనేరీతిగా ఇది కనబడదు.
"సైన్యమున్ సరకు సేయఁడు."
జైమి. 2.46.

సరస మాడు
సామ్యమును దెలుపుమాట.
సరస మాడడం సమానుల తోనే అనుదానిపై వచ్చినది.
నైష. 1.37.

సర్వం తోటకూర
ఏదైనా సులభమే, అన్నీ ఒకటే.
"కుంతకు సర్వము తోటకూర సంగతిఁ గనుపట్టు."
గుంటూ. పూ. పు. 23.

సర్వ దుంబాలా చేయు
పన్నులు లేకుండా చేయు.
కాశీయా. పు. 23.

సర్వమంగళము
బొత్తిగా లేదు, శూన్యము.
సర్వమంగళం=క్షౌరం అన్న రీతిగా వచ్చినది కావచ్చును.
"పానవిభూతియు సర్వమంగళంబు." భీమ. 2.133.
"కైదువు సున్న పూజ్యములు కంకట ఖేటశిరస్స్థలత్రముల్, లే దరదంబు తత్తడి హుళక్కి సహాయము సర్వమంగళం, బీదనుజుండు చిక్కె భయ మేటికి లుబ్ధకులార!..." మను.

**సర్వ మధ్యస్థముగా**

పరస్పరం వాడుకొనునదిగా.

కాశీయా. 241.

**సర్వసామాన్యము**

అందఱికీ తెలియునది, అంతటా కానవచ్చునది.

"సంస్కృత భూయిష్ఠ రచన, మానుగా సర్వసామాన్యంబు గామి."

పండితా. ప్రథ. దీక్షా. పుట. 18.

"కాకి నల్లగా ఉండుట సర్వసామాన్యము." వా.

**సరాసరి చేయు**

చదును చేయు.

"ధరణి యంతయు సరాసరిఁ జేయఁగా వలె." శ్రీనివా. 2.38.

**సరికట్లం బెనంగు**

సమానముగా పెనగు.

"సంఫుల్లహల్లకభల్లమల్లయుద్ధమహోద్ధత సన్నద్ధబుద్ధిని సరికట్లం బెనంగి...." హంస. 3.162.

**సరికట్ల బెనగు**

సమ ఉద్దీగా రతిక్రీడ సలుపు. సమరతి యొనర్చు.

"ఒకనాఁటి రేయిఁ బ్రచండకుసుమకాండభండనమున సరికట్లఁ బెనఁగి." శుక. 2.69.

**....సరి కదా**

అదే కాక, అంతే కాక.

"వాడు రాలేదు సరి కదా ఒక ఉత్తరం ముక్క అయినా రాలేదు." వా.

**సరికి సరి**

మాటకుమాట అప్పగించగల.

"వాడికి సరికి సరిగా నిలబడ గలవాడు మనలో లేడు. ఇంక ఏ మనుకొని ఏం ప్రయోజనం?" వా.

"ఆవిడ నాలుగుమాట లనేసరికి ఈవిడ లంకించుకొని సరికి సరి వడ్డించి వదిలి పెట్టింది." వా.

**సరి కొత్త**

అభినవము.

"ఈ అంచు చీర సరికొత్తగా బజారు లోకి వచ్చి ఉంది." వా.

**సరి గడచు**

కడచి పోవు, ముగియు.

"అక్కుమారునకు శైశవంబు సరి గడచుటయు." శివ. 2.83.

**సరిగద్దె నుండు**

అర్ధాసనాసీను డగు.

ఇది అత్యంతగౌరవాదర సూచకము.

"సాజమై నిన్నుఁ గొలిచి సరిగద్దె నుందునా." తాళ్ల. సం. 6.139.

**సరి గుంజులాట**

ఒక బాలక్రీడ.

పండితా. ప్రథ. పురా. పుట. 460.

**సరి గెల్పు లందు**

సమానముగా విజయము చెందు.

"హాయిగాఁ జేసి సరిగెల్పు లందిరపుడు." రాధి. 1.145.

**సరి చేసికొని వచ్చు**

చక్క జేసికొని వచ్చు.

వాడుకలో—'నువ్వు వెళ్లి ఆ పని ఎలాగైనా సరి చేసుకుని రా.

సరి చేసికొను

వశము చేసికొను.

వాడుకలో — 'వాడు ఆపిల్లను సరి చేసుకొన్నాడు. అనగా దానిని తన ప్రియురాలినిగా చేసికొన్నా డనుట.

సరి దాకు

సరి పడు.

"...నిందు నీ యెఱింగినయర్థం బెల్ల సరి దాఁకెనే కదా." కళా. 2.60.

"మును చెప్పినట్టికతలుం, దలపోయ యథార్థము ల్మగంబున సరి దాఁకె నా కనిన." కళా. 2.168.

"ఇవ్వీణియ పలుకులు సమగ్రంబులు గావనియును సామనంబునకు సరి దాఁకియున్నయది." కళా. 7.205.

సరి పెట్టుకొను

ఉన్నదానితో సంతృప్తి పడు.

"ఒకటి ఉన్నా లేక పోయినా సరి పెట్టుకొని పోవాలి." వా.

సరిపొత్తు కలియు

సమాన మగు.

"జలరాశి నదులలో సరిపొత్తు గలియు, కలయిక విబుధసంగతి చేర్చువాఁడు." వర. రా. బా. పు. 12. పంక్తి. 20.

(ఇప్పని నాకు) సరి పోదు

సరి పడదు, ఇష్టము లేదు.

"ఇ, ప్పని నాకుఁ సరి పోదు మీకు రుచి యింపం జాలు నిప్పట్టునన్." శుక. 3.391.

వాడుకలో—'వాడికీ నాకూ సరి పోదు.' ఇక్కడ స్నేహము చెడిన దనుట.

సరి పోవు

తీరి పోవు.

"అఘంబులున్ మఱు, ద్ఘాతఘనాఘనావలులతో సరియై సరిపోయె నన్నియున్." పాండు 5.84.

సరి బేసి జంట జరపు

చిక్కు ప్రశ్నలు వేయు.

"గరిమ శ్రీ వెంకటేశ కరుణించితివి నన్ను, సరిబేసి జంట జరపకు మికను." తాళ్ల. సం. 10.203.

చూ. సరిబేసు లాడు.

సరిబేసు లాడుకొను

సరిబేసులాట ఆడుకొను.

వక్కలను గానీ, అలాంటి వాటితో గానీ ఆడే ఆట. ఒడిలో వాటిని పోసుకొని చేతిలో కొన్నిటిని పట్టుకొని ఎదుటివారి యెదుట ఆ పిడికిలి నుంచి 'సరా? బేసా?' అనిఅడుగుతారు. వాళ్లు ఏదో ఒకటి చెప్పగా పిడికిలి తీసి వానిని యెంచి వారు చెప్పినదే అయితే వారికే యిచ్చివేస్తారు. సరి కాక పోతే వారు పిడికిట్లో ఉన్నన్ని ఎదురు ఇవ్వాలి. సరి అంటే సరిసంఖ్య. బేసి బేసిసంఖ్య.

"చలి వాపి ఆమె నిడ సరిబేసు లాడుకొంటా, కలసితి విటు నన్ను కాఁదా మఱి." తాళ్ల. సం 3.620.

## సరి వచ్చు

సాటి యగు, సమాన మగు.

"అవనివరుల యాగంబులకు సరి వచ్చు." భార. అశ్వ.4.179.

కాశీ. 5.283.

## సరివారు

సమానులు, బంధుమిత్రులు.

"సరివారలలో చౌక చేసి, ఉదరపోషకుల పొందుగునఁ జేరి,తొలి నేఁ జేసిన" త్యాగరాజ కీర్తన.

"ఈ విధంగానే ప్రవర్తించావంటే సరివారిలో తలెత్తుకొని తిరగ లేము. తెలుసుకో." వా.

## సరిసదగా

సతమత మగునట్లు.

"సవనాశ్వము ఛే యని కక్కసంబులన్, సరిసద గాఁగ వ్రేసియును." జైమి. 4.77.

## సరి సప్పుడు

"మోసపోక ముసానమ్మ ముద్దరాలు, దారె సరి సద్దు లేక పాతాళమునకుఁ, దానుఁ గోడుకులు నొకకొంత తడిసె నేనిఁ, గుతిలపఱుపరె నృపు బంట్లు గుడెలవారు." కాశీ. 5.289.

చూ. సడిసప్పుడు.

## సరి సాటి

సమానము. జం.

"ఈడుజోడును సరిసాటి యెందు లేక." హంస. 4.190.

## సరి సేయు

సాటి జేయు.

"ఇతరపురములు సరి సేయ నెట్లు వచ్చు." కా. మా. 3.134.

## సరెసరు

చూ. అత్తెసరు.

## సలి చప్పుడు

"సలిసప్పుడు లేకమ్మెయిఁ, దొలఁగిన సైన్యంబు లెల్లఁ దొడిఁ దొడి నూరం, గలయఁబడి కోటదిక్కులఁ, బలుకక గుజగుజలు వోయెఁ బౌరులు బెగడన్." ఉ. హరి. 3.31.

చూ. సడి చప్పుడు.

## సలిలకాషాయవస్త్రము

నీరుకావిదోవతి.

"నిర్నాభిబిలముగా నెతి వీఁగుబొజపై, సలిలకాషాయవస్త్రము ధరించి." కాశీ. 7.186.

## సవడికాడు

యుద్ధంలో ఒక విధమైన ఆయుధధారి.

సవడి అన్న ఆ యుధం ఎలాంటిదో తెలియదు.

కుమా. 11.40.

చూ. విలుకాడు.

## సవతితల్లి ప్రేమ

పక్షపాతముతో చూపునిరాదరణ.

సవతితల్లికి ప్రేమ తక్కువ అనుటపై యేర్పడినది.

"సంస్కృతపండితులకు తెలుగంటే సవతితల్లి ప్రేమ." వా.

## సవతి పోరు

తగనిపగ.

"ఏమిటే! మీ రిద్దరూ ఎక్కడ చేరినా గిచుకొంటూ ఉంటారు. మీది చూడ

పోతే సవతిపోరుగా ఉండే.'' వా.
చూ. సవతి మత్సరం.

సవతి మత్సరం
సవతి పోరు.
చూ. సవతి పోరు.

సవతు వచ్చు
సాటి వచ్చు.
''చక్రవర్తులతోడ సవతు వచ్చు.''
జైమి. 1.34.

సవసవగా
సన్నసన్నగా.
''ఈవార్తలు సవసవగా, నే విని ప్రాణే శ్వరీ! యిదే ననుకొంటిఁ.''
శుక. 1.397.

సవసవలుగా విను
చూచాయగా విను, కర్ణాకర్ణికగా.
''ఈరీతి నుండు నంతట, వారల యంద ములు సవసవలుగా విని య, య్యూరెల్ల గుజగుజలఁ బో...''
శుక. 3.497.
ఈ 'సవ' శ్రవణమునకు దగ్గఱగా నున్నది.

సవారి చేయు
అధికారము చేయు.
కొత్త. 13.

సవాలు చేయు
ఛాలెంజి చేయు.
ఈ అర్థంలో యిది యిటీవల యేర్పడినపలుకుబడి.
వేలంపాటలో ఒక్కొక్కరూ ఎక్కిస్తూ పోవడాన్నే సవాలు చేయడం అని పూర్వాం అల వాటు.
''తనతో ఎవరైనా కుస్తీ చేసి గెలిస్తే వాడిని పెళ్లి చేసుకొంటా నని సవాలు చేస్తూ ఒక ఆడవస్తాదు ఆ మధ్య పత్రికల్లో ప్రకటించింది.'' వా.

ససేమిరా
బొత్తిగా, ఏమాత్రమూ.
''ఎంత చెప్పినా వాడు ససేమిరా చేయ నన్నాడు.'' వా.

సహపాద (సపాద) లక్ష
అత్యధిక మనుట, సవాలక్ష.
''సహపాద లక్షధనము.''
సింహా. 2.12.
''సపాదలక్ష లసురామరపంక్తి.''
సింహా. 2.17.
రూ. సవాలక్ష.

సహస్రగుణముగా
వేయింతలుగా.
''చంచరీకచం, ద్రాఘ్యుపమానశోభకు సహస్రగుణంబుగ హెచ్చఁ గేశవ,క్త్రాద్యఖిలాంగలక్ష్మి మది కందిన యంతయునుఁ నయించి.''
ప్రభా. 2.109.

సహోరా
శూన్యము.
మాటా. 70.

సహి చేయు
సంతకము పెట్టు.
కాశీయా. 321.

సాంబ్రాణివత్తి
ఊదువత్తి.

**సాకిరి వెట్టు**

సాక్ష్యము పలుకు.

"ఏకత మై వున్నచోట ఏ మన్నా నమరు గాక, సాకిరి వెట్టేటిచోట సాధించ నేలె."

తాళ్ల. సం. 3.578.

**సాకు పెట్టి**

దీనిమీఁదా దాని మీఁదా పెట్టి అన్యాపదేశముగా.

కుమార. శత. 5.

**సాగ దీసి మూర వేయు**

1. అలసి పోవు దాక పని చేయించు.

"రామరామ! ఆ యింట్లో ఎవరు పని చేస్తా రమ్మా? ఆ యిల్లాలు అర్ధరాత్రి దాకా సాగ దీసి మూర వేస్తుంది."

వా.

2. అనవసరంగా పెంచి చెప్తున్నావు అనుపట్ల కూడా ఈ పలుకుబడి వినిపించడం కద్దు.

"ఏమిట్రా! గంటనుంచీ సాగ దీసి మూరేస్తున్నావు. అ దేమిటో తేల్చి చెప్పు."

వా.

**సాగ నంపు**

వీడ్కో లిచ్చు.

"ఆవటూ త్తముఁ డటు సాగ నంపి చనిన."

విప్ర. 4.87.

**సాగ బడి మ్రొక్కు**

సాష్టాంగపడు.

"కా దటందువు గద దాని కాళ్ల మీఁద, సాగఁ బడి మ్రొక్కి యిల్లాలిఁ జక్కఁ జూడ."

శుక. 1.526.

**సాటవ పెట్టి తిట్టు**

పిల్లి మీఁద ఎలుక మీఁద పెట్టి సూటిపోటిమాట లను. ఆడవాళ్లు సరిపడనప్పుడు సాటవ పెట్టి తిట్టడం అలవాటు.

"ఈ వెధవపిల్లి చచ్చినా కదలదు."

వా.

"ఎన్నిసార్లు కొడితే నేం? ఈ కుక్కకు ఈ దొంగబుద్ధి వదులుతుందా?" వా.

**సాటికి బేటికి**

సాటికి. జం.

"దేవికి వేడుక యవు నని, దేవరయును వరము లొసఁగ దేవర గనుచున్, దేవియు సాటికి బేటికి, దీవింపఁగ దైత్య శిశువు తేజము నొందెన్."

ఉ. రా. 1.265.

**సాటి వచ్చు**

సమాన మగు.

"నీతపంబునకుఁ బోల్పఁగ నెందును సాటి వచ్చునే?" విప్ర. 2.95.

**సాతాని సామవేదం**

శక్తిహీనుని విద్యాప్రదర్శనం.

సాతానివాడికి సామవేదం చెప్పడం ఏం వచ్చు? అనుటపై యేర్పడినపలుకుబడి. గొల్లని సాహిత్య విద్య లాంటిది.

**సాతు వడు**

బిడారు కొల్లపోవు.

"మ, తాక్రాంతసహోదరుండును నొకం డరుదెంచుచు సాతు వడ్డవ్రు, త్రాంత మెఱింగి..." ఆము. 7.20.

## సాత్కరించు

దాన మిచ్చు.

"సకలధాత్రి బ్రాహ్మణులకు సాత్కరించె." భార. శాంతి. 1.243.

## సాదుగామిడి

పైకి సాధువుగా కనిపిస్తూ దుర్మార్గుడైనవాడు.

చూ. సాదుపలవ.

## సాదు పలవ

చూ. సాదుగామిడి.

## సాదు పిసాళి

సాదు గామిడి.

సాధువుగా కనిపించినా దుర్మార్గు డనుట.

సారం. 3.56.

## సాదుబిడ్డ

మంచివాడు, సాధువు.

సారం. 3.55.

## సాదు రేగిన తలపొలమున గాని నిలువదు

ఉత్తమునికి కోపం వస్తే అంతా యింతతో ఆగదు. సాధువైన ఆవు గానీ ఎద్దు గానీ సామాన్యంగా రేగదు. దానికి కోపమే వస్తే ఎవరు పట్టినా ఎంత పట్టినా పొలిమేరవరకూ పోయి కాని ఆగదు అన్నదానిపై వచ్చిన పలుకుబడి.

"మన్మథావేశ విలసనమహిమ సెఱపు, తపసిఁ గని సాదు రేఁగినఁ దలపొలాన, నిలువ దనుమాట నిజ మయ్యె నేఁ డటంచు."

కళా. 3.41.

## సానక్రింది దీపము

మానినీ. 40.

## సానక్రింది వన్నె

నలుపు.

గంధపుసాన మీది వైపు గంధం తీసి తీసి బాగా అరిగి తెల్లవడి నున్నగా ఉంటుంది. క్రిందివైపు గరుకులుగా నల్లగా ఉంటుంది.

"సానక్రింది వన్నె దానివన్నె." శ్రవ. 1.87.

## సాన పట్టు

రాచు, సానమీద వేసి అరుగునట్లు రుద్దు.

"నేరశేటి యాసల్ దెచ్చి నీరజాప్త్రు, సానఁ బట్టిన రాపాడి చల్లి మెదిపి, పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు."

మను. 2.36.

రూ. సాన బట్టు.

## సాన బట్టు

పదు నెక్కించు, పదును పెట్టు.

కత్తులు మొదలగువానిని పదు నెక్కించుటకై సాన పట్టింతురు.

"సానఁ బట్టిన మకరాంకు శస్త్ర మనఁగ." పారి. 1.78.
"వేల్పుఁ దొయ్యాలి నును సాన బట్టిన యనంగుని మోహనబాణమో యనన్." మను. 6.24.
రూ. సాన పట్టు.

## సాబాలు
సగము.
కాశీ. 5.197.

## సామిలాతు
సహాయకుడు.
షా మిలాతు చేరిక.
కాశీయా. 41.

## సాము రెండయినా
ఎంత చిక్కి పోయినా, ఎన్ని కష్టాలు పడినా.
"సాము రెండైన మచ్చరకించు శేకాని, గరువంపు పిఱికిమ చ్చెఱుఁగ లేదు." వేంకశే. 1.9.

## సాయరు చావడి
కస్టము హౌసు.
విదేశాలనుంచి వచ్చేవస్తువులకు పన్ను వసూలు చేయు తావు.
కాశీయా. 140.

## సారి వెడలు
సన్నద్ధమై వెడలు.
"సామి నా విన్నపము విని సారి వెడలి, యొక్క మలచెంత గదెతడ వున్నఁజాలు." శుక. 1.247.

## సారె యొడ్డు
పాచిక వేయు.

"ఆ కపటనాటక సూత్రధారుం డంకించుకొని యుల్లసంబున సారె యొడ్డి తొమ్మిది దాయంబుల కిచ్చిన." ఉ. హరి. 3.123.

## సాలీని పోగు
దుర్బలము, బలహీనము.
వెంకటేశ. 40.

## సాలె పద్దు
నమ్మరానిది.
సాలెవాని లెక్క ఏడు మూళ్లంటే ఆరున్నర మూరే ఉంటుంది. దానిపై వచ్చిన పలుకుబడి.
రాధి. 4.79.

## సాళులు పెట్టు
జతపఱచు, ఆ వరుసలో చేర్చు.
'సాలు' దున్నుటలో ఏర్పడు సాలు.
"హరికమలాసనామ, రేశ్వరాదులం డెచ్చిసర్వేశుతోడ, నెన్ని సాళులు పెట్టఁగా నెన్నె దీవు." కుమా. 6.27.

## సాళెముల్ సూపు
రాగభంగులను చూపించు.
సాళగతాళగతు లనీ సాళగ (నాట) రాగ మనీ ఇందులోనే ప్రయోగము లున్నవి.
పండితా. ద్వితీ. పర్వ. పుట. 305.

## సావి వోవు
సాటి యగు.
"దైవికము మా స్వతంత్రములోఁ

గూడె, సావి వో చెన్నఁడు సంసారము.'' తాళ్ల. సం. 8.105.

**సాసముఖా!**

'చాంగు బళా' లాంటిది.

తాళ్ల. సం. 7.237.

**సాష్టాంగ పడు**

సాష్టాంగనమస్కారం చేయు. నేలపై ఎనిమిది అంగములూ తాకునట్లు సాగిలపడు.

చూ. సాష్టాంగ మెఱఁగు.

**సాష్టాంగ మెఱఁగు**

సాష్టాంగముగా నమస్కరించు.

''ఆ వసిష్ఠున కర్థి సాష్టాంగ మెఱఁగి.''

జైమి. 6.4.

**సాహిత్య మిచ్చు**

స్వయంపాక మిచ్చు.

చూ. సదావృత్తి యిచ్చు.

**సాహోనినాద మిడు**

సెబాసని పలుకు, ప్రోత్సాహ పఱచు.

''నవలాదోర్యుగ్మలతాలంకష, స్తనవిస్ఫూరికి సందిదండల ధళల్ సాహోని నాదం బిడన్.'' మను. 5.84.

**సాహో యని హెచ్చరించు**

ప్రోత్సహించుటలో అను మాటపై వచ్చినపలుకుబడి.

''రాచకొమరుల్ సన్నద్ధులై వెంట రా, సాహో యంచును హెచ్చరించ విభుఁడుత్సాహంబు సంధిల్లఁగన్.''

రాజగో. 5.27.

**సాహో యను**

యుద్ధాదులకు పోవునప్పుడు చేయు ధ్వనివిశేషము. ధ్వన్యనుకరణము.

''బాహాబాహిఁ బెనంగను, సాహో యని కంతుపాదుళహ రహిఁ గేరన్.''

హంస. 1.29.

**సింగడు బూరడు నగు**

ఉబ్బి పోవు.

''చెప్పిన నంతరంగమున సింగఁడు బూరఁడునై ప్రియంబు సొం, పుప్పతిలంగఁ బల్కె...''

పంచ. వేం. 4.147.

**సింగమును బేరాడు**

తలకు మించినపనికి దిగు.

బాలనీతి. 55.

**సింగారము చిందు**

ముద్దు లొలుకు.

సారం. 3.38.

**సింగినాదము లూదు**

కొమ్ము లూదు.

''వాదించ వెఱచి సింగి నాదా లూఁదు కొంటాను, సోదించే రంటా కొందఱు జోగు లైరి.''

తాళ్ల. సం. 7.12.

**సింహనాద మిచ్చు**

సింహనాదము చేయు.

**సింహనాదము చేయు**

యుద్ధాదులలో కోపోద్రేకాలతో గర్జించు. సింహంవలె గర్జించుట గనుక సింహనాద మైనది. సింహం

మనకు పరాక్రమ ప్రతీకం కదా!

"సంహారరుద్రుని చాడ్పునఁ గోప, రంహాస్ఫురణ మయిన సింహనాదంబు, పూరించి." బస. 4.92.

## సింహస్వప్నం

(ఆ పేరు చేస్తే) హడలు. ఏనుగునకు సింహం కలలో కాన వస్తే ఇక మరణించ వలసిందే నట. తద్వారా వచ్చినపలుకుబడి.

వాడు కలోనూ ఉన్నది. 'వాడికి నా పేరంటే సింహస్వప్నం.'

## సింహావలోకనం

గత పరిశీలనం, పునరాలోచన.

సింహం ఎగిరి వెను దిరిగి మెడ మాత్రం త్రిప్పి చూచినట్లుగా చూచుట. లక్షణయా వెనుక చెప్పిన దానిని ఒకమారు నెమరు వేసుకొనుట – ఉపసంహారం లాంటి దయినది.

## సింహాసన మిడు

సింహాసనము నధిష్ఠింప జేయు.

"అపుడు రుక్మిణి కనుసన్న నబ్జముఖులు, రత్నసింహాసనంబు నారదున కిడిరి." పారి. 1.46.

## సికపట్లాడు

పోట్లాడు.

"ఒకనాఁ డన్న మొకింత తక్కువయితే నోర్వంగ లే కమ్మతో, సికపట్లాడుచుఁ బెద్దకూఁత లిడ గాసింబెట్టి..." సానందో. 3.32.

## సిగకోతల మారి

కలహకారి.

"మగలకు మగువల కెదలోఁ, బగలొదవఁగఁ జేసి రేలుఁ బగలును దగఁ బెట్టె, జగడంబులు గల్పించిన, సిగకోతలమారి వీఁడు శిష్టవిచారా!" సానందో. 2.30.

## సిగపట్ల గోత్రం

వాళ్ళిద్దరికీ సరి పడదు అన్న అర్థంలో ఉపయోగిస్తారు.

"వాళ్ళిద్దరిదీ సిగపట్లగోత్రం." వా.

## సిగపట్లు

చూ. జుట్టుపట్లు.

## సిగ పువ్వులు చుట్టు

శిరోభూషణ మగు.

"అభయం బనునది సిగపువ్వులు జుట్టె." ధర్మజ. 97.9.

## సిగబంటిగా

పూర్తిగా, బాగా, సమృద్ధిగా.

"భుజియించెఁ బ్రజ భుజాభోజనంబులు సిగ,బంటిగాఁ దోలు దోల్లవంటకములు." పాండు. 44.4.

## సిగలు విప్పు

తలవెండ్రుకలు విప్పు,

"చెప్పాటట్టలు శోధించి సిగలు విప్పి." ఆము. 7.14.

**సిగ వోయిన పోని మ్మని**

ఏ మయినా సరే అని.

కడకు తల పోయినా సరే అని.

"మాటి మాటికి నకటా !, సిగ వోయినఁ బోని మ్మని, తగులుదు రుపనాథు లాసుధాకరవదనన్." శుక. 3.274.

**సిగ్గు చెడు**

నగుపాట్ల పా లగు, అవమానము చెందు.

"నిండినసభ, సిగ్గు చెడితి నున్నకథలు చెప్ప నేల?" కా. మా. 3.160.

**సిగ్గు చూర బోవు**

మానము పోవు.

"సుడిసి చెలి సిగ్గెల్ల చూరఁ బోఁ గలదో." తాళ్ల. సం. 12.248.

**సిగ్గు తీయు**

మానము తీయు.

"వాణ్ణి వెంట తీసుకొని పోతే మన సిగ్గు తీసేస్తాడు. ఒట్టి వెకిలివెధవ." వా.

**సిగ్గు దేర్చు**

సిగ్గును తేటపడునట్లు చేయు.

"అవ్వామలోచన యతనిఁ జూచి, చిఱుతనగవులతెప్పల సిగ్గు దేర్చె." ఉ. హరి. 1.76.

**సిగ్గు పఱుచు**

అవమానించు.

"గురుకుచంబులతళుక్కులు మేల్మి బంగారు, నిగ్గుల నొక యింత సిగ్గు పఱుప." రుక్మాం. 2.144.

**సిగ్గుపాటు లగు**

నగుబాటు లగు.

"గట్టిగ నీమగఁ డెఱిఁగిన, య ట్టయి నను సిగ్గుపాటు లౌఁ గదె చెలియా!" హంస. 2.127.

**సిగ్గు పోవు**

మానము పోవు.

"చెప్పకుంటే సిగ్గు పోతుంది." వా.

**సిగ్గు లమ్ముకొను**

మాన మమ్ముకొను.

"ఇట్టు నట్టు ముట్ట రాని హేయ మైన తోలుదోలు, కట్టి కట్టి సిగ్గు లమ్ముకొన్నవారము." తాళ్ల. సం. 11.2. భా. 19.

**సిగ్గులు చెఱచు**

మానభంగము చేయు.

"ఎంతైన జవరాండ్ర సిగ్గులు చెరచ రాదు." తాళ్ల. సం. 3.150.

**సిడంబు దించినవాడు**

ధ్వజమును తీసి వేసినవాడు.

"సిడంబు డించినవానిని...దల చీర వీడినవానిని." భార. భీష్మ. 3.303.

**సితగుడు**

మొండి, బండవాడు.

పిల్లలను ముద్దుగా 'ఏం మొండి వా డమ్మా' అంటుంటారు.

"ఏ యెడ వంచింప రేయును బవలు, జేయి దిగం డిట్టి సితగుండు గలఁడె?" బసవ. 3.60.

**సితుకు బొతుకులు**

జంటపదం.

"సింగరాయ! యితని సితుకు బొతుకు లన్ని, గొట్టఁ బోయి కొంగు గోసి

కిచ్చి, తటుకు నితని లింగు లిటుకులు సూతమా, తెలియ సంగు లెల్లఁ దీత మిపుడు.'' వేంక పే. 3.161.

## సిద్ధ మైన అన్నం

సిద్ధాన్నము.

''సిద్ధ మయినట్టి యన్నంబు చేతి కంది. నట్టి పరిపక్వఫలమును.''

శ్రవ. 2.42

చూ. సిద్ధాన్నము.

## సిబ్బితి పఱచు

సిగ్గు పఱచు.

కాశీ. 2.79.

## సిబ్బుద్ధి వదల బలుకు

విసుగెత్తించు నట్లు, కోపము వచ్చునట్లు మాట్లాడు కావచ్చును. పదాల జాబితాలో అర్థం యివ్వ లేదు – యూని. ప్రతిలో. కోశాల కెక్కనివాని లోనిదే ఈ పదమూ.

''తను సిబ్బుద్ధి వదలఁ బలుకు చున్న వారి నందఱం గటాక్షించి.''

కుమా. 6.18:

## సిరి సింగనవత్తి

ఒక రకమైన పిల్లల ఆట.

తాళ్ల. సం. 10.172.

## సిరి సింగన వత్తి జేయు

ఆటలాడు.

''సురఖగము లిచ్చుటికి భా, సురగతి వచ్చినను నుఱక చూడక యిపు డీ, కర ణిని దఱమితి రయ్యో, సిరిసింగనవత్తిఁ జేయఁ జెల్లునె మీకున్.''

నలచ. 3.142.

## సిలు గందు

కష్టపడు.

''చింతతోడఁ బొరలుచు సిలు గంద నేల?'' తాళ్ల. సం. 3.40.

## సిలుగు చింత లేక యుండు

దిగులూ, విచారమూ లేకుండు.

చీకూ చింతా లేకుండు.

''చెడఁ దలంచిరి నా కేమి సిలుగు చింత, లేని యివ్విటి కొరు లింత పూని రేని.'' ఉ. హరి. 5.280.

## సిలుగుల పెట్టు

కష్టపెట్టు.

''ఆ పసిఁడిగిన్నె యెవ్వరి, చే పడియె నొ వీరి నేల సిలుగులఁ బెట్టం, జూపో పరు గా.'' విక్ర. 5.28.

## సివ మాడు

దయ్యము పట్టి యాడు.

''గడప కడ్డము గాఁగఁ బడి సివ మాడుము, కొదవకార్యము చూచి కొనఁగ వచ్చు. శుక. 2.350.

చూ. శివ మెత్తు.

## సీత పుట్టి లంక చెఱచిన చందాన

'సీత పుట్టె లంక చెడె' అని సామెత.

దానిమీద ఏర్పడినపలుకు బడి.

''సీత పుట్టి లంక చెఱచినచందానఁ, బుట్టఁ దగనిముద్దుపట్టి యైన.''

శుక. 1.459.

చూ. సీత పుట్టి లంక చెఱచినట్లు.

## సీరాము సేన

వానరసైన్యం.

అసంఖ్యాక మనుట.

"మబ్బు దేరెడుపొలమం, డెల్లెడఁ జూచిన ధరణీ, వల్లభ! సీరాముసేన వాలుమెకంబుల్." మను. 4.16.

## సీలామాలపు చింత

అనవసరమైన దిగులు.

కాశీ. శత. 9.

## సీవరించు

చీత్కరించు, బుస గొట్టు, ఫూంకరించు.

"మదకరుల్ సీవరించు సెలుగు, నవ ఘనారవ మని." కుమా. 3.6.

## సుంకు రాల్చు

వేధించు, నలచి వేయు.

"సురవైరులను బట్టి సుంకు రాల్చి తిని." వర. రా. సుం. 167.20.

జొన్నలు, సజ్జలు మొదలయిన ధాన్యాల కంకుల గింజలపై నుండు దానిని 'సుంకు' అంటారు. ఆ కంకులను నులిమి గింజలు రాల్చుటను సుంకు రాల్చడం అంటారు.

## సుంకులు చల్లు

పెండ్లిండ్లు మొదలయిన వాటిలో తలంట్లప్పుడు ధాన్యాన్ని పాటలతో దంచి ఒక చేటలో పోసి దానిమీద ఒక చేట బోర్లించి ఆ సందులోనుండీ తలంటు కొన్నవారి తలలపై పడునట్లు చెఱుగు.

ఇది ఒక ఆచారము.

"మన యిళామాధవులకు శోభన మటంచుఁ, జల్లఁగాఁ బాడి సుంకులు చల్లి రపుడు." ఇళాదేవీయము.

## సుఖము మరగు

సుఖమునకు అలవాటు పడు.

"సురతకేళుల నలరింప సుఖము మరిగి." హంస. 5.176.

"సుఖం మరగిన దాసప్ప పదం మరిచి పోయాడు." సా.

## సుఖరోగము

స్త్రీ వ్యాధి.

## సుగ్రీవాజ్ఞ

తిరుగు లేనిది.

"ఆ ఊళ్లో ఆ రెడ్డిగారి మాట సుగ్రీవాజ్ఞగా చెల్లుతుంది." వా.

## సుడి గొను

క్రిందు మీదు లగు.

"కౌసల్య శోకవారాశిలో సుడి గొను చుండ."

వర. రా. అయో. పు. 301. పం క్తి.19.

## సుడివడు

చిక్కుకొను, బాధపడు.

"సుడివడ్డ చామలఁ జుట్టు ముట్టి." జైమి. 1.45

"శివుని నుదుటికంటి చిచ్చుచే సుడి వడి." వీర. 2.113.

"వైశంపాయనుఁ డెంతయున్ సుడి వడెన్." భీమ. 2.99.

"కాలాగ్ని చేత, సుడివడు మునితనూ జానవ నే వగతు."

గౌ. హరి. ప్రథ. పంక్తి. 2172.

"చెఱువు కట్టించిన సెట్టి ధర్మం బెల్ల, సుడివడ కుండంగ నడపు తల్లి"

సింహా. 3.228.

"లేమ గళమున పద్దిగా లేక యోడి, సుడిపడుచు లోన బిగి చెడి యడుగు పట్టి, దరము దర మూని మొఱ సేయ దాని కిపుడు, దర మనెడు పేరు విడు వక తరలి యుండె." రసిక. 2.92.

ఇందులో శ్లేష ఉన్నది.

**సుతరామూ**

బొత్తిగా.

కొత్త. 92.

**సుదకు వచ్చు**

స్మృతికి వచ్చు.

జ్ఞాపకమునకు వచ్చు.

"సొగటాలపైఁ గోర్కి సుదకు వచ్చిన యంత, వింతమాటల గారవింప నేర్చు." నిరం. 2.34.

**సుద్దులు కల్పించు**

అపదూరు కల్పించు.

"పెద్దతికము చాలదు పెఱ, సుద్దులు గల్పింతు రెందు సుజనులు గలరే?"

కళా. 6.153.

**సుద్దులు చెప్పు**

డంబాలు పలుకు.

"ఆ పాముపదికి చేరు చూతాం. దూరానినుండి సుద్దులు చెప్పేవు."

హేమా. పు. 18.

**సున్నంలోకి ఎముక లేకుండ చితుక గొట్టు**

ఒక తిట్టు.

**సున్నకు సున్న హాళ్లికి హాళ్లి**

దానికి దానికి సరి పోయిన దనుట.

"ఆ వచ్చేదానికీ వాడు చేసేఖర్చుకూ సరిపోతూ ఉంది. సున్నకు సున్నా హాళ్లికి హాళ్లి." వా.

పూర్వం తెలుగు లెక్కల్లో ఇప్పటివలె రూపాయలు అణాలు పైసలు కాక రూపాయ, పాతిక, వీసం, కానులు అనురీతిగా వేసి ఒక స్థానానికి ఒక స్థానానికి మధ్య హాళ్లిలు పెట్టేవారు. హాళ్లి గురుతు.

**సున్న చుట్టు**

నామము పెట్టు.

త్యజించు ననుట.

"...కులాచారములకు, సున్న చుట్టెడి మేటిసంపన్ను లెక్కొ్కి?"

గుంటూ. ఉత్త. 65.

**సున్న చేయు**

వమ్ము చేయు.

"మా సొల్ల సున్న చేసి."

విప్ర. 4.15.

**సున్న బెట్టు**

మోసగించు, సున్న చుట్టు.

"సారిది నిందతి కనుగట్టి సున్నఁ బెట్టి." రాధి. 4.81.

**సున్న సున్న గలియు**

దానికి దానికి సరిపోవు.

లెక్కలు వేయు నప్పుడు 'సున్న కేమి సున్న' అనుట

పై వచ్చినపలుకుబడి.

శేషము మిగలనప్పుడే కదా సున్న వచ్చును.

"పన్ను లన్నియు సున్న సున్నం గలిసె నని యప్పులఁ దేలిచి యొప్ప గింతురు." ధర్మజ.

**సుబ్బు సుబ్బుల**

కుతూహలముతో.

"సుబ్బ సుబ్బుల దూరఁ జూతు రొక్కొ." శకుం. 3.43.

**సుయ్యా మనిపించి చుక్కల్లో పెట్టు.**

వేధించు.

కొత్త. 120.

**సురకాని యంత**

కాసంత.

"పాప మైనఁ బుణ్యం బైనన్, సుర కానియంత చేసిన." పాండు. 4.136.

**సురగజ్జెలు**

మ్రోయుచున్న గజ్జలు. ఎద్దులకు కట్టెపట్టెడ కున్న గజ్జలు కావచ్చును.

"కులపర్వతంబులు బలసి తద్దయు రమ్య, మగుసురగజ్జెల పగిది గాఁగ." కుమా. 8.22.

**సురసుర స్రుక్కు**

బాధపడు.

పొరపొర పొక్కు వంటిది.

ధ్వన్యనుకరణము.

"మనుజుల్. సురసుర స్రుక్కిరి కొందఱు." కా. మా. 3.155.

"......దీనతఁ, సురసుర స్రుక్కి యుస్సు రనుచుం దనవర్తన మెల్లఁ దెల్పినఁ." శుక. 1.482.

**సురాళించు**

దిగ దుడుచు.

"కడమ పూదండ లెల్ల నొక్కటిగఁ బట్టి, బాల కపుడు సురాళించి పాఱ వైచె." కళా. 7.68.

దృష్టిదోషము తొలగుటకై చాలా రకా లయినవానిని– ఉప్పు, మిరపకాయలు, పొరక పుల్లలు ఇత్యాదులు దిష్టి తీసి దిగ దుడిచి పాఱ వేయుట అలవాటు.

**సురిగి పోవు**

తగ్గి పోవు.

కాశీ. 3.86.

**సుళ్లగ స్రుక్కు**

స్రుక్కి పోవు.

"ఎదు,ర్పడ మఱి పొర్చు లై చురచురం దుద సుళ్లగ స్రుక్కెనో యనఁ." అము. 5.123.

**సుస్తీ చేయు**

జబ్బు చేయు.

మాటా. 48.

**సూక్ష్మంలో మోక్షం**

కొద్దిలో నసుట.

మాటా. 51.

**సూటిమాటలు**

ఎత్తిపొడుపులు.

పండితా. ప్రథ. పురా. పుట. 362.

చూ. సూటిపోటి మాటలు.

## సూటి సేయు

గుఱి చేయు.

"పొంచి మరుండు నన్ను సురపొన్నల కోరికి సూటి సేయఁగా."

రాజగో 3.10.

## సూడిద సేయు

కానుక యిచ్చు.

"...సూడిద సేసితి నార!"

విజయ. 1.53.

## సూడు పట్టు

పగ పట్టు.

"తండ్రికి సూడు పట్టక వృథాస్థితి నుండితిన్."

భాస్క. యుద్ధ. 1243.

తండ్రి పగను తీర్చుటకై నేను పూనుకొనక పోతి ననుట యీ ప్రయోగంలోని భావం.

"సారిది నీ వేల వచ్చి సూడు పట్టె విపుడు." తాళ్ల. సం. 3.163.

## సూత్రధారి

1. అనాహూత మునకు కారణ మయినవాడు.

నిరసనార్థద్యోతకంగా అనుపట్ల ఉపయోగించేపలుకుబడికి క్రిందిది ఉదాహరణ.

"నాకుఁ బోవదు గాక నా సూత్రధారి, కొడుకు నెక్కడ దాఁగ గుఱుతుగా నంపి"

గౌ. హరి. ద్వితీ. పంక్తి. 1896-97.

2. మూలకారణుఁడు.

"దీని కంతా సూత్రధారి ఎవరు ?"

వా.

## సూదికి రెండు మొన లుండునా?

దేని కైనా ఒకడే అధిపతి అనుపట్ల ఉపయుక్త మయినది.

"వినుము రాజ! సూదికి రెండు మొనలు గలవె, యింకఁ దడసిన నిన్ను సహింప నవని." మార్కం. 1.166.

## సూది మెడ, బాన కడుపు

వికారంగా ఉన్న మనిషిని గురించి ఉపయోగించే మాట.

## సూదిమొన మోపునంత నేల

చాలా కొద్ది నేల.

"సూదిమొన మోపినంత నేల కూడా తమ్ముడికి యివ్వ నన్నాడు." వా.

## సూదివెంట దార మగు

వెనువెంట వచ్చునది యగు. గోవు వెంట దగులుకోడె వంటిది.

"సుదతి వెంటనె వచ్చె సూదివెంట దార మై." తాళ్ల. సం. 3.139.

## సూరెలు వాఱు

ప్రక్కకు ఒదుగుకొని నిలుచు, ప్రక్కకు ఒత్తిగిలు.

"విటవర్గము నల్గడ వచ్చి ప్రీతితోఁ, గనుఁగొని మూరి చూడ నెడ గానక సూరెలు వాఱుచుండెమో, హాని యొను బోలె నొక్క శరదిందుని భానన నిల్చి ముంగిటన్."

కుమా. 8.124.

సెకలు చల్లు
మంటలు చల్లు.
"చల్లనిమేనిపై సెకలు చల్లఁగ నేగతిఁ దాళ నేర్తునే ?"
రాజగో. 3.9.

సెజ్జ తీర్చు
పడక సిద్ధము చేయు.
"కర్పూరవేదిక గావించి చల్లని, చెంగల్వరేకుల సెజ్జ దీర్చి..."
కళా. 6.252.

సెజ్జపై పైడి
చేతి కందుబాటులో నున్న ధనము.
నానా. 68.

సెజ్జ మేను సేర్చు
పరుండు.
"సెజ్జయందు మేను సేర్చి యర్జున భార్య, చింతఁ బలుకకుండి.
భార. ద్రోణ. 2.340.

సెట్టిం గని పొడిచినట్లు
అతి సులువుగా.
మన కావ్యాలలో సెట్టిని భయస్థుడుగా పేర్కొనడం పరిపాటి. అలాంటివానిని పొడవటం అతి సులువే కదా!
"తిట్టిన మెట్టినకైవడి, సెట్టిం గని పొడిచినట్లు చేకూడ మతిన్."
శుక. 1.528.

సెనగలు తిని చేయి కడుగుకొన్నట్లు
బాగా తుడిచి వేసినట్లు. నిశ్శేషముగా అనుట.

"ఈ పని అంతా సెనగలు తిని చేయి కడుగుకొన్నట్లుగా ముగించేశాను."
వా.
"మా చెల్లెలు పోయిం తర్వాత మాకూ వాళ్లకూ సంబంధం యేముంది ? సెనగలు తిని చేతులు కడుగుకొన్నట్లయింది."
వా.
అసలు సెనగలు తింటే నే చేతికి ఏ అంటూ సొంటూ ఉండదు. ఇక చెయ్యి కూడా కడుగుకుంటే చెప్ప వలసింది యేముంది ?

సె(బ చెంచడము
ఒక తిట్టు.
వట్టి కిరాతకుడు అనుట వంటిది.
సెబ్బర చెడు అన్నఅర్థంలో నేటికీ దక్షిణాంధ్రంలో వాడుకలో ఉన్నది. 'మంచి సెబ్బర.'
పాండు. 4.196.
"మంచీ సెబ్బరా అయితే మనవాళ్ళనే వాళ్లు ఉంటే కదా రావడానికీ పోవడానికీ."
వా.

సె(బ సెంబడపుచేత
పాడుపని.
"కొడుకులకుఁ గాని సె(బసెంబడపుఁ జేఁత."
ఏలామా. 2.17.

సెరవు సేయక
జాగు సేయక (స్పష్టంగా లేదు.)

"సెరవు సేయు కది విజ్ఞుల చెలులు వేగ,
విడువు మెుండేని మన్నాస విడువు
మెుండె." కుమా. 10.139.
అదే. 9.147.

## సెలకట్టె
సెలకోల.
"అర్కనందను సెలకట్టె యంపకోల."
క్రీడా. పు. 71.

## సెలకోల
చిన్నకట్టకు పేనిన త్రాడూ దాని మొనకు చర్మపువారూ కలిగిన ఎద్దులను తోలే సాధనము.
రాయలసీమలో నేటికీ ఇదే పేరు. గుర్రాలకు ఉపయోగించే కొరడా వంటిది.
"పోగని తావుల సెలకోలఁ దాఁక
మొత్తి." హంస. 4.35.

## సెలగో యనిపించు
జితోస్మి యనిపించు.
"అలగోలు జగడ మపుడే,యల గోపతి
మెచ్చి పొగడ నరిసైనికులన్, సెల
గోలల వడిఁ గూల్చుచు, సెలగో యని
పించ లేనిచెయ్యే యిదియున్."
నలచ. 2.131.

## సెలవి వాఱ నవ్వు
నోరు తెఱచి నవ్వు.
"చనుఁగవయు నడుము వడఁకఁగ,
వనిత సెలవి వాఱ నవ్వి వానికి
ననియెన్." మను. 2.40.

## (కన్నులు మూసికొంటె) సెలవు
"జనవర! తపమునకుం జొచ్చినఁ
గన్నులు మూసికొంటె సెల వింతియ
కాక." ఆము. 3.40.

## సెలవు దీర్చు
మాట నిలుపుకొను.
"చెఱనుండి యైనను సెలవు దీర్చె
దము."
గౌ. హరి. ప్రథ. పంక్తి. 1494.

## సెలవు బెట్టు
ఆజ్ఞాపించు, అనుమతించు.
"విరోధిసేనలం, బిప్పిరి చేసెదన్
సెలవుఁ బెట్టుము నీవు గడంగు మాజి
కిన్." జైమి. 6.157.

## సేద దేర్చు
శ్రమ తీర్చు.
"కనకకమలదళపుటానీయమానంబు
లగు నభ్రగంగాపానీయంబుల సేద
దేర్చి ఫలకగర్భంబులకుం దాల్చి."
పారి. 5.13.

## సేద దేఱు
మూర్ఛనుండి తేఱుకొను,
శ్రమ తీర్చుకొను.
"అట్లు సేద దేఱి యరవిందనయ
నుండు." ఉ. హరి. 1.155.

## సేనగ
ఎక్కువగా.
నేటి వాడుకలో కొన్ని ప్రాంతాలలో 'శానా' అనే విన వస్తుంది.
'శానా మంచి, శానా మాట్లాడతావే.'
భాస్క. 107.

## సేవలు గొను
ఉపచారముల నందుకొను.
"సేవలు గొనె నద చెలఁగి కురలచే."
తాళ్ల. సం. 9.218.

## సేసకొప్పు

నడినెత్తిపై ముడుచుకొప్పు.

"ఒప్పు మీఱిన నును సేస కొప్పువాని."

పాండు. 3.164.

## సేస లలికినభంగిన్

అక్షతలు చల్లినట్లు. అలుకు—చల్లు అనే అర్థంలో చాలమంది కవులు వాడినారు. ముఖ్యంగా పూర్వులు.

"ముత్యముల సేస లలికినభంగిన్."

కుమా. 6.108.

"సేస లలికిరి విబుధుల్."

కుమా. 6.149.

## సేస వెట్టు

తలబ్రాలు పోయు.

"చెట్టుపైఁ బూవులు రాల చెలి శేస వెట్టె." తాళ్ల. సం. 3.191.

## సైదోడు

మిత్రుఁడు.

భీమ. 1.31.

## సొంటికొమ్ము

బాధ కలిగించునది. మామూలుగా సొంటికొమ్మును చాది కంటిలో పెట్టుకోవడం అలవాటు. అది మహా బాధ కలిగిస్తుంది. తద్వారా వచ్చిన పలుకబడి.

"జోగి జంగాలకు సొంటికొమ్ము."

శుక. 3.20.

## సొంపు మీఱు

అతిశయించు, అందమగు.

"......నకలంకనవ్యమౌక్తికచాకచక్య ప్రసూనసంపద చేత సొంపు మీఱి..."

కళా. 2.10.

## సొంపుల టెంకి

సౌందర్యరాశి.

టెంకి—స్థానము.

"వరల సొంపుల టెంకి జవాదివంకి, జాతిరతిలీల నా రాజదూతి హేల."

హంస. 1.81.

## సొగటులు పోవు

సోలి పోవు.

"సొగటులను బోయి కసిగా, టులు గా భుజియించె."

విజయ. 3.4.

## సొటసొటలు వోవు

సొగయు.

"జాతియంచలు సొటసొటలు వోకున్న వాఁ?"

విజయ. 3.62.

## సొటసొట వడియు

జొటజొట కారు.

"నిటలమ్ము లవిసి నెత్తురు, సొటసొట వడియంగ..."

క్రీడా. పు. 74.

## సొట్టు లెంచు

సొడ్డులు పెట్టు.

"సోదించ నేటికి సొట్టు లెంచ నేటికే."

తాళ్ల. సం. 5.322.

సొట్లు శోధించు

పరిశీలనగా చూచు.

"వెంట నరుదెంచు తన మచ్చెకంటి తీరు, సొట్లు శోధించి క్రీఁగంటఁ జూచి కొనుచు." శుక. 2.15.

సొడసొడలు వోవు

సొడిగి పోవు, సోలి పడు. వాడుకలో నేటికీ 'సొఱుగు వచ్చి పడి పోయినాడు' అంటారు.

"చే నుల్చి...త్రోవ సొడసొడ ల్వోవుచు సోలుచు."

పండితా. ద్వితీ. మహి. పుట. 126.

సొడ్డు వెట్టు

వెడ్డు వెట్టు.

పేరు పెట్టు, తప్పు పెట్టు.

'సొడ్డు' నేటికీ వాడుకలో ఉన్నది. వెడ్డు లేదు.

పండితా. ద్వితీ. మహి. పుట. 214.

సొదపనులు

చిల్లరపనులు.

"గారలు సొదపనుల్ గావించి."

వర. రా. బా. పు. 55. పంక్తి. 52

సొమ్మలు వోవు

సొమ్మసిలు.

"తల్లడంబున నే సొమ్మలు వోవు."

కుమా. 5.153.

సొమ్ము చేసుకొను

ధనము గడించు.

"వాడీ మధ్య వ్యాపారం చేసి బాగా సొమ్ము చేసుకున్నాడు." వా.

నగదు రూపములో మార్చుకొను.

"ధర ఉన్నప్పుడే బంగారము అమ్మి సొమ్ము చేసుకోవడం మంచిది." వా.

సొమ్ము(గా) జేసికొను

తనదిగా చేసికొను.

"అంగడి వేంకటపతి నలమి పట్టుక నీవు, చెంగలించి సొమ్ముగాఁగఁ జేసి కొంటి వేటికి." తాళ్ల. సం. 4.30.

సొమ్ము తిను

ఇతరుల డబ్బుపై జీవించు.

"దేవరకు నిట్టి యక్కుఱఁ దీర్పఁ గాక, యెన్నటికి మేము నీ సొమ్ము దిన్న వారము..." పరమయో. 5.11.

సొరపోత పోయు

నిండా పోయు.

"సరిగ రూప్యంబులే సొరపోత పోసిన, ట్రంకులో మిగిలె నుర్లాకు చీటి."

వ్యస. నాట. 33.

సోకుడు

దయ్యము.

"నీ వేమొ కొల యొనర్చితి, వీవగ నది సోకు డగుచు నేచఁ దొడంగెన్."

శుక. 1.324.

సో కోర్చు

బాధలకోర్చు, డీకొని నిలుచు.

"ఆకలి దప్పియు నలయికల్ లేక, సోఁ కోర్చి దిక్కుల..."

వర. రా. బా. పు. 107. పం. 1.

"ఈ, శునకశ్రేణి వధింతు నేఁ డని మొనన్ సోఁ కోర్చి వర్తించినన్."

భాగ. స్క. 3.655.

**సోకోర్వమి**

సంభాషణాదులు పెట్టుకొనుటకు ఇష్టము లేమి.

"వాని సోఁకోర్వమి యెఱింగి..." పాండు. 3.24.

**సోడు ముట్టు**

1. నసాళ మంటు.

"పొలసిన గబ్బు కంపులు సోడు ముట్టెడు." జైమి. 3.74.

"వింతగా నొకవేళ వివిధభూరుహపుష్ప, సురభిగంధంబుల సోడు ముట్టు." పారి. 5.52.

2. బ్రహ్మరంధ్రం తాకు.

"ముల్లోకముల సోడు ముట్టెడి నవపుష్ప, దామంబు లది పుష్పదంతపురము." హంస. 7.148.

"కమ్మ వాతెఱవాసన గలిసి కలయ, సోడు ముట్టుచు నూర్పులు సుడియుచుండు." హంస. 8.9.

**సోదెకు పోతే రంకు బయట పడినట్లు**

తనకు తానై హాని కల్పించుకొన్నప్పుడు అనేమాట.

"దానితో మాటలు పెట్టుకొని అన్నీ అనిపించుకున్నావు. సోదెకు పోతే రంకు బయట పడినట్లు." వా.

**సోదెకు పోతే సుద్దులకు తక్కువా ?**

జోస్యమే అడిగి వప్పుడు వారేదో ఒకటి చెప్పకుండా ఎలా పోతారు ? అనుటపై ఏర్పడినపలుకుబడి.

"వైద్యుడికి చెయ్యి చూపిస్తే ఏమీ లే దంటాడా? సోదెకు పోతే సుద్దులకు తక్కువా?" వా.

**సోదె గొను**

సోదె చెప్పించుకొను.

"వనిత! యిటు వచ్చి నీవు నీవలయు సోదె, గొనుము త ప్పున్న మఱి నాకుఁ జెనఁగఁ జోటు, కలదె." ప్రభా. 5.120.

**సోదెలో కైనా రాక పోవు**

ఆసంగతి తలపెట్టేవాడే లే దనుట.

సోదెలో చనిపోయిన తరాల వాళ్ల పేళ్లు చెప్పడం ఆచారం. దానిపై వచ్చినపలుకుబడి.

"వా డున్నాళ్లూ అంత మిడిసి పడ్డాడా? చచ్చి మూన్నాళ్లయిందో లేదో వాడిపేరు సోదెలో కైనా రావడం లేదు."

**సోపి పుచ్చు**

పార ద్రోలు.

"చక్రవిహగంబు సొచ్చినఁ జోపి పుచ్చు." హంస. 7.91.

**సోపులాడు**

ఊగులాడు.

"అన్నువ కొంఁదీగలు సోపులాడ." హంస. 9.144.

**సోమపు మొకములు పెట్టుకొను**

కృత్రిమముఖములు తాల్చు. అనగా నిజరూపు దాచిపెట్టుకొను.

"మొకములను సోమపు మొకములు పెట్టుకొని, అకటా! కొందరు రిపులాట వారైరి." తాళ్ల. సం. 7.12.

**సోమరి గాలి**

మలయమారుతము.

"వీచె సోమరిగాలి విరహులు చెదర." గౌ. హరి. ప్రథ. పంక్తి. 340.

**సోమసూర్యవీధు లగు**

వేఱుపడి విడి పోవు.

ఒకదానితో నొకటి సంబంధము లేక వేఱుగా పడిపోవు.

"వడి నారెంటికి నడుమన, వెడలెన్ మతి సోమసూర్యవీధులు గాఁగన్." కా. మా. 2.42.

**సోల వెల్తిగ చూచు**

తక్కువగా చూచు.

"ఏ నేమి నిన్ను, సోల వెల్తిగ మున్ను సూచితి నయ్యా." బస. 4.104.

**సోలి వ్రాలు**

అలసి వ్రాలి పోవు.

"అన్నుకొని సోలి వ్రాలు." రాధా. 4.103.

**సౌఖ్యముల దేలు**

సౌఖ్యము ననుభవించు.

"గంధగజరూపముననున నక్కన్యఁ దెచ్చి, కవసి నరకాసురుండు సౌఖ్యములఁ దేలె." ఉ. హరి. 1.82.

**స్తనశల్యపరీక్ష**

లేనిదానికోసమై చేయు వ్యర్థకృషి.

"స్తనశల్యపరీక్షకుఁ బోయిన ఫలముం గలదె శి?" పాణి. 1.11.

**స్త్రీ ధనము**

స్త్రీలపై నున్న సొత్తు.

దానిని మరొకరు తీసుకొనుట అధర్మము.

"అక్కటా! స్త్రీధనం బది పాడిగాదు." ద్విప. కల్యా. పు. 104.

**స్థానబలము**

కేవలం ఉన్నచోటునుబట్టి వచ్చే బలము.

సహజబలము కా దనుట.

వేమన. 15.

**స్థానమువారు**

దేవస్థానము వారు - దేవాలయమునకు చెందినవారు.

"స్థానమువారు వారి నొక జాడఁ జలింపక యుండఁ జేయుచున్." కా. మా. 4.130.

**స్థితిమంతుడు**

ఉన్నవాడు.

పాండు. 4.196.

స్థితి—ఆస్తి.

"వాడికి బాగా భూస్థితి వుంది."

వా.

**స్థూలారుంధతీన్యాయముగా**

దిక్ప్రదర్శనంగా, కొండగుర్తుగా.

అరుంధతీ నక్షత్రం మరీ చిన్నది. అది కంటికి కనబడడం కష్టం. అందుకని ప్రక్క నున్న యేదో నక్షత్రం చూపి 'దాని పక్కగా ఉంది

చూడూ' అంటారు. దాన్ని బట్టి యేర్పడిన పలుకుబడి. పెళ్ళిళ్లలో పురోహితుడు 'అరుంధతీదర్శనం అయిందా?' అంటే వధూవరులు అయిందని అంటారు. అది కనబడ్డం మాత్రం జరగదు. ఇందుపై వచ్చిన దైనా కావచ్చును.

"శృంగగ్రాహికఁ జెప్ప వేఱ తెరువుల్ సిద్ధింపమిం జేసి చిత్రాంగ శ్రీనిధి నవ్వధూమణిని సూక్ష్మారుంధతీ న్యాయమార్గాంగీకారమునన్ వచించితిని జంద్రాద్యోపమల్ సూచనా, భంగుల్ గాని యదస్వహస్రగుణసౌభాగ్యంబు లాయంగముల్." ప్రభా.

## స్నపన మార్చు

స్నానము చేయించు.

"దరహాసామృతమున నా, స్మరహరుమును స్నపన మార్చి" కుమా. 8.50.

## స్ఫురద్రూపి

రూపసి.

"వాడు మాంచి ఆజానుబాహుడూ, స్ఫురద్రూపీ. ఇట్టే ఆకర్షిస్తాడు." వా.

## స్రుక్కి సురిగి పోవు

అలసి పోవు.

"వాడు ఆ యెండలో స్రుక్కి సురిగి పోయి వచ్చాడు." వా.

## స్వకుచమర్దనం

ఆత్మస్తుతి.

అందులో హాయి లేదని కూడా ధ్వని.

"వాడి దంతా స్వకుచమర్దనం. ఆ రో జంతా తన గొప్ప తప్ప మరొక సంగతి ఎత్తితే ఒట్టు." వా.

## స్వయంగా

తానుగా.

"వాడు స్వయంగా వచ్చి యీ మాట చెప్పి పోయినాడు." వా.

"నేను స్వయంగా కష్టపడి సంపాదించిందే యీ యిల్లూ వాకిలీ అంతా." వా.

## స్వయంపాక మిచ్చు

చూ. సదావృత్తి యిచ్చు.

## స్వర్గంనుండి దిగి వచ్చినట్లు

మానవాతీతునివలె.

"ఏదో స్వర్గంనుంచి దిగి వచ్చినట్లు మాట్లాడుతున్నావే?" వా.

## స్వర్గమునకు నిచ్చెనలు వేయు

ఉన్నతలక్ష్యానికై ప్రయత్నించు.

"స్వర్గానికి నిచ్చెన వేస్తాం." శ్రీ శ్రీ.

## స్వర్ణదినము

పర్వదినము వంటిది.

'గోల్డన్ డే' అన్న యింగ్లీషు పలుకుబడి ద్వారా వచ్చి నిలిచినది. జగ. 21.

## స్వస్తి చెప్పు

మూల బెట్టు.

'వాడు పెండ్లి కాగానే చదువుకు స్వస్తి చెప్పాడు.'

'స్వస్తి ప్రజాభ్యః' అన్న శ్లోకం పురాణాదులు ముగించినప్పుడుఆఖరున చెప్పాటపై యేర్పడినపలుకుబడి.

## స్వస్తి యను

దీవించు.

"స్వస్తి యన నొల్ల రప్పారి, వాస్తవ్య ద్విజులు వస్తువాంఛలు."

విప్ర. 1.65.

చూ. స్వస్తి చెప్పు.

## స్వస్థ పడు

స్తిమిత పడు.

"ఇపుడు నిక్క మెఱింగి స్వస్థపడుఁ గాక." గీర. 46.

## స్వహస్తములు

చేవ్రాలు, సంతకం, దస్కతు.

"మీ స్వహస్తములు లేకున్న, నిలఁ గాఁడు మా భృత్యుఁ డితఁడు..."

పండితా. ద్వితీ. మహి. పుట. 129.

## స్వాగతం బడుగు

'మీరు క్షేమముగా వచ్చితిరా?' అని కుశలప్రశ్న చేయు.

"ఇట్లాసంగిన వినయంబున లేచి కైకొని, స్వాగతం బడిగిన సంతోషించి మనోరంజనార్థంబు."

శుక. 1.49.

## స్వాతిబకంబుల వీక

విపరీతముగా.

స్వాతి కార్తిలో కొంగలు విపరీతంగా ఉండడంపై వచ్చిన పలుకుబడి.

"పెరయిూఁగల పగిదిని స్వాతిబకంబుల వీఁకను గంగాతరంగంబుల కైవడి."

హంస. 3.29.

## స్వామికార్యం స్వకార్యం

ఒక దానితో రెండు ప్రయోజనములు చేకూరు ననుపట్ల ఉపయోగించేపలుకుబడి.

"ఈఊళ్లో స్కూలు పెట్టించామంటే మనవాడికి ఉద్యోగమూ దొరుకుతుంది. ఊళ్లో పిల్లలకు చదువు సౌకర్యమూ యేర్పడుతుంది. స్వామికార్యం స్వకార్యం అన్నారు." వా.

## ....స్వామికి చెయ్యి జాచు

దేవుని తగిలి ప్రమాణము చేయుట అలవాటు. దానిపై వచ్చినపలుకుబడి.

"సర్వసంపదల్, భామిని! నీ వశంబ యని పార్థివముఖ్యుఁడు చంద్రశేఖర, స్వామికిఁ జెయ్యిఁ జాఁచి మగువన్ ముద మొందఁగఁ జేసె." రుక్మాం. 3.167.

...పై చెయ్యి పెట్టి అను రూపమే విరివిగా కానవస్తుంది.

## స్వారి వెడలు

వాహ్యాళి వెడలు.

గుఱ్ఱం మీద స్వారి

చేయుచు వాహ్వాళి పోవు టపై వచ్చిన పలుకుబడి— అంత వేగముగా అనుట.

"...సకియ మనసు, జారసంభోగ కేళికి స్వారి వెడలె."

హంస. 3.133.

## స్వాహా చేయు

కాజేయు, అపహరించు.

"వాడు ఆసంస్థ తాలూకు సొమ్ము నంతా స్వాహా చేశాడని ప్రతీతి" వా.

## హంగామా చేయు

గోల చేయు, అల్లరి చేయు.

"ముసలాయన చేత వీలునామా రాయించుకున్నాడని తెలిసి వీడు నానా హంగామా చేస్తున్నాడు." వా.

## హంగుదారు

ప్రోత్సాహకుడు.

నిరసనగా ఉపయోగించే పలుకుబడి.

భోగంమేళాలలో పై పాట గాళ్లను హంగుదారు లంటారు.

"ఆ రెడ్డి నైనా నమ్మ వచ్చు గాని అతడి చుట్టూ చేరినహంగుదారులను నమ్మడానికి వీలు లేదు. వాళ్లు ఎంతప నైనా చేయించ గలరు." వా.

## హఠము చేయు

మంకుపట్టు పట్టు.

"ఈ పిల్లవాడు ఈమధ్య బడికి పో నని హఠం చేస్తున్నాడు." వా.

## హఠాత్తుగా

ఉన్నట్లుండి.

"మానక హఠాత్తు హయోత్తమ మెక్కఁ దెక్కి."

నిరం. 4.63.

"మేము అనుకోను కూడా లేదు. వాడు నిన్న హఠాత్తుగా వచ్చాడు."

వా.

## హతాహతము చేయు

నిర్మూలించు, చంపు.

"ప్రతిపక్షులను హతాహతము చేసి."

జైమి. 1.45.

## హనుమంతుని ముందఱ కుప్పి గంతులు

తాతకు దగ్గులు నేర్పించుట వంటిది.

"నీ, మద మణఁగింతుఁ బోర హనుమంతుని ముందఱఁ గుప్పిగంతులే."

రుక్మాం. 5.52.

రూ. హనుమంతు నెదుట...

## హనుమంతునెదుట కుప్పి గంతులు

తాతకు దగ్గులు నేర్పుట వంటిది.

గొప్పవారి యెదుట అల్పుని యోగ్యతాప్రదర్శనము.

హనుమంతుడు సముద్రాన్నే లంఘించిన వాడు. వాడి యెదుట కుప్పి గంతులు వేస్తే ఏం లాభం?

రూ: హనుమంతుని ముందర...

## హారిపదము ముట్టు

చచ్చు.

"హారిపదము ముట్టె ననుట మహాద్భుతంబు." బుద్ధ. 1.56.

## హారీ అను

చనిపోవు.

"ఆ ముసలిది కాస్తా హారీ అంటే వీడి సంగతి తెలుస్తుంది. నీళ్లు పోసేది కూడా ఉండదు." వా.

## హారీ అను (కొను)

"వాడు హారీ అంటే చాలు. ఆ ఆస్తి అంతా వీడికే దక్కుతుంది." వా.
"ఆవిడ కాస్తా హారీ అనుకుంటే వీడి సంగతి తెలుస్తుంది. మాట్లాడించే దిక్కు కూడా ఉండదు." వా.

## హారీ యనక హారా అనక

మౌనము వహించి.

"హారీ యనక హారా యన కూరకున్న." సారం. 2.238.

## హారుని కవిలియ

శివహస్తన్యస్త కపాలం. భిక్షాపాత్రం (కన్న) కవళిగ= కపాలము.

"ఆయతైశ్వర్యంబు నతులప్రతాపము, ...హారుని కవిలియఁ దుడిపించి." పండితా. ద్వితీ. మహి. పుట. 190.

## హాల్లకల్లోల మగు

గందరగోళ పడు.

"కలగుండు వడి హాల్లకల్లోల మై చాలఁ, గలఁగె వాహినులు." జైమి. 2.33.

"పల్లెల మనుజులఁ బట్టి చెండాడ, హాల్లకల్లోల మై యఖిలభూజనము, లడరి కూయుచు వచ్చి." గౌ. హరి. ప్రథ. పంక్తి. 405.406.407.

చూ. అల్లకల్లోలము.

## హాల్లకల్లోలము

"కలగుండువడి హాల్లకల్లోల మై చాలఁ, గలఁగె వాహినులు భంగములతోడ." జైమి. 2.33.

చూ. అల్లకల్లోలము.

## హావుణు పఱచు

అమర్చు.

"అపరంజి మొలత్రాడు హావుణు పఱచి." నిరంకు. 2.74.

## హస్తతాళంబు లొనరించు

చప్పటలు గొట్టు.

"కమలినీజృంభికలన దిక్కాంత లెల్ల, హస్తతాళంబు లొనరించి రనఁగఁ జెలఁగె." పారి. 2.67.

చూ. కరతాళధ్వనులు.

## హస్తమస్తకసంయోగము చేయు

1. తల నిమురు—ఆదరవాత్సల్యాదులతో.

"ఏల యేడ్చెదు మానవే చాలు ననుచు, హస్తమస్తకసంయోగ మాచరించి." కా. మా. 1.51.

2. నమస్కారము చేయు, తలపై చేయి నిడు.

పెద్దవారు చిన్నవారిని కలుసుకొన్నప్పుడు తల మూర్కొనుట, తల తడవుట అలవాటు.

జైమి. 8.116.

హస్తముల కుసిరికకాయలు

కరతలామలకములు.

సులభములు అనుట.

కాశీ. 6.125.

హస్తము ల్పిసికి కొనుచు

చేతులు నలుపుకొంటూ—గొప్పవారి యెదుట భయాన్నీ సంభ్రమాన్నీ తెలుపుతూ.

"ఇం, చుక శంకింపక హస్తముల్ పిసికి కొంచుం గించిదానమ్రమస్తక యై."
శుక. 3.192.

హస్తవాసి

చేయివాసి.

"అతని హస్తవాసి ఎలాంటి దంటే కింద పెట్టినరోగిని కూడా బతికించ గలడు." వా.

హస్తాంతరముగా

మారుగా.

కాశీయా. 311.

హస్తిమశకాంతరము

విపరీతమైన భేదం. చాలా తేడా.

దోమకూ ఏనుగకూ ఉన్నంత తేడా

"మరుహరునకు నీకు హస్తిమశకాంతరము." కుమా. 6.9.

"వాళ్లి ద్దరికీ వీడికీ ఎక్కడకి హస్తిమశకాంతరం." వా.

చూ. అజగజాంతరము.

హాజర్ భాషీగా

ప్రత్యక్షంగా.

కాశీయా. 218.

హిట్లర్ మీసాలు

'ఫ్రెంచికట్టు' మీసాలు.

ముక్కునకు దిగువ కొద్దిగా ఉండునట్లు కత్తిరించుకొన్న మీసాలు.

హుటాహుటి

త్వరత్వరగా.

ధ్వన్యనుకరణము.

"భువి నంత దవ్వు నేమును, తవతవ లే కరుగుదుము హుటాహుటి నడలన్."
మను. 1.76.

హుటాహుటి నడలు

వేగముతో కూడిననడకలు.

"సాధనంబులు నలవరించు కొని హుటాహుటి నడలతోఁ బిఱుఁగు లెల్లఁ, గదిసి నడిచిరి యమ్మహీకాంతునకుత."
శుక. 1.254.

హుప్పుని యూదు

ధ్వన్యనుకరణము.

దీపము మొదలయిన వాటి విషయంలో ఉపయోగిస్తారు.

"హుప్పని యూఁగునంతలో."
గుంటూ. ఉత్త. 26.

హుమ్మరంచు
ధ్వన్యనుకరణము.
హొడుచుట, క్రుమ్ముట మొదలగువానిలో.

"హుమ్మరంచు నురంబు గ్రుమ్మదాన. శకుం. 2.227.

హుళిక్కి
అబద్ధము. లేనిది.
ఇది వాడుకలో 'ఉళక్కాచి' అని రాయలసీమలో వినబడుతుంది.

"..ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళిక్కి." కాశీ. 4.111.
"ఊరికే ఉళాక్కాచికి అన్నాను. ఏమీ అనుకోకు." వా.

హూనం హూనం అగు
చితికి పోవు. అలసి పోవు.
కొత్త. 53.

హృదయము జల్లను
ధ్వన్యనుకరణము.
"అనుటయు మాట లేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై."
మను. 2.66.

హృదయశల్యము
గుండెలో బల్లెం.
భయంకరుడు, పని పట్టగలవాడు అనుట.

ఇలాంటి పలుకుబడులు మనకు చాలా ఉన్నవి.
"ఏకాత్మవాదుల హృదయశల్యము."
పండితా. ప్రథ. వాద. పుట. 511.
చూ. తలగుండు.

హెచ్చు కుందు మాట
హెచ్చు తక్కువ మాట.
నోటికి వచ్చినట్లు మాటలాడుమాట లనుట.

"ఏల పదరెదు నీకును హెచ్చు కుందు, మాటలకు నెంత........"
విప్రనా. 5.57.

హెచ్చుకుందు లను
దూషించు.
"ఏమీ నడుగ నొల్ల హెచ్చుకుందులన నొల్ల, కామించి నీ విచ్చితివి కైవల్యపదము."
తాళ్ళ. సం. 5.228.

హెచ్చుకుందు లేకుండు
హెచ్చుతక్కువలు లేకుండు.
ఎల్లప్పుడు ఒకటిగా నుండు ననుట.

"హెచ్చుఁగుం దేమియును లేక యీశ్వరుండు, హరిహయసుతుండు మల్లసంగర మొనర్ప."
కా. మా. 4.191.

హెచ్చుగుందాడు
అవమానించు.
హెచ్చు తక్కువగా మాటలాడు అన్నరూపంలో ఈ

మాట కొన్ని ప్రాంతాలలో నేటికీ ఉన్నది.

"అచ్చరల హెచ్చు గుంబాడి" హర. 3.9.

'నువ్వు నే నడిగిందానికి ఒప్పుకొన్నా ఒప్పుకోక పోయినా సరే కాని హెచ్చు తక్కువగా మాట్లాడితే మాత్రం నేను సహించను.' వా.

రూ. హెచ్చు తక్కువగా మాట్లాడు.

## హేమాహేమీలు

1. వీరులు.

అతిరథమహారథు లనుట.

2. సమర్థులు, మొనగాళ్లు.

"మాహాత్మ్యంబులు తేజముల్ విభవ సంపత్తుల్ వినుర్కింపఁగా, నోహో! భేదము లేదు నిండుసభలో నొక్కింత మాత్రంబు హే, మాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాతు లీసాము లేలా హీనాధికభావముల్ తడవ రా దంచుఁ వితాకుండ నై." వరాహ.

## హేళన చేయు

అపహాస్యము చేయు.

"పెళ్లికొడుకు అందంగా లే డని ముత్తైదువ లందరూ హేళన చేస్తు న్నారు." వా.

## హైరాన పడు

బాధ పడు, శ్రమపడు.

కొత్త. 44.

'నానా' అనే పదంతో కలిసే యిది సాధారణంగా వ్యవహృత మవుతుంది.

"వాడు నానా హైరానపడి కడకు ఎలాగో యిల్లు చేరుకొన్నాడు." వా.



Printed at the Freedom Press, 134, T H. Road, Madras-21.